انسان | ఇన్సాన్ [అ.పు] మానవుడు-మానిసి.

انسانیت | ఇన్సానియ్యత్ [అ.స్త్రీ] మానవత్వము-సభ్యత-యోగ్యత-జ్ఞానము-దాక్షిణ్యము-నాగరికత-దయ.

انسب | అన్సబ్ [అ] మిగులయోగ్యమైన.

انسٹھ | ఉనసఠ్ [హి] ఏబదితొమ్మిది.

انسداد | ఇన్సిదాద్ [అ.పు] నిరోధము-ఆపుదల-అడ్డు-ఆటంకము.

انشاء | ఇన్షా [అ.స్త్రీ] కల్పన-రచన-శైలి-శయ్య-పాకము-సాహిత్యవిద్య, కావ్యపద్ధతి.

انشا پرداز |–పర్దాజ్ [పా] సాహిత్యపరుడు-రచనాసమర్థుడు-పండితుడు.

انشا پردازی |–పర్దాజీ [పా]. సాహిత్యపాండిత్యము- రచనాసామర్థ్యము- భాషాపాండిత్యము.

انشا اللہ–انشا اللہ تعالے |–అల్లా, అల్లాహుతఆలా [అ] దైవానుగ్రహముండిన, దైవసంకల్పముండిన.

انشراح | ఇన్షిరాహ్ [అ] విశదమగుట-స్పష్టమగుట.

انصاف | ఇన్సాఫ్ [అ.పు] న్యాయము-క్రమము-యదార్థము-సరియైనతీర్పు.

انصرام | ఇన్సిరామ్ [అ.పు] నిర్వాహకము, నెరవేర్పు-కడతేర్పు-చేయుట-ముగించుట-తీర్చుట.

انضباط | ఇన్జిబాత్ [అ.పు] బంధనము, కట్టు-దిట్టము-నిరోధము-సంయమము-నియమము-క్రమము-చట్టము-వయినము-రీతి-విధి.

انضباط اوقات |–ఇన్జిబాతెఅవుకాత్ [అ] కాలపట్టికము.

انظار | అన్జార్ [అ.పు] దృష్టులు- చూపులు.[ఏ.వ نظر]

انعام | ఇన్ఆమ్ [అ.పు] అనుగ్రహము- బహుమానము- కట్నము- దానము- ప్రతిఫలము, ప్రతిక్రియ.

انعکاس | ఇన్ఇకాస్ [అ.పు] క్రిందలమీదు-విరుద్ధము-విపరీతము-ఛాయ-ప్రతిబింబము.

انفاس | అన్ఫాస్ [అ.పు] ఊపిరులు.[ఏ.వ نفس]

انفراغ | ఇన్ఫిరాగ్ [అ.పు] విరామము-విడుదల-విశ్రాంతి-నిశ్చింత.

انفصال | ఇన్ఫిసాల్ [అ.పు] విభాగము, వేరుచేయుట-పరిష్కారము-తీరుమానము, తీర్పు.

انفعال | ఇన్ఫిఆల్ [అ.పు] సిగ్గుపాటు, అవమానము- బిడియము- కళవళము-చిన్నతనము.

انفکاک | ఇన్ఫికాక్ [అ.పు] వదలించుట, తెంచుట-విమోచనము-విడుదల.

انفکاک رہن |–ఎ-రహ్న [అ] కుదువవిడిపించుట.

انقباض | ఇన్కిబాజ్ [అ.పు] సంకోచము, పట్టు- విరోధము- మలబంధము- బంధము ఆపుదల.

انقسام | ఇన్కిసామ్ [అ.పు] విభాగము-పంచుట-భాగించుట.

انقضا | ఇన్కిజా [అ.పు] అతిక్రమణము-దాటిపోవుట-కడచిపోవుట-ముగిసిపోవుట.

انقطاع | ఇన్కితా [అ.పు] తెంపు-కోత-వియోగము-విభాగము.

انقلاب | ఇన్కిలాబ్ [అ.పు] క్రిందుమీదు-తారుమారు-మార్పు-క్రిందల-వ్యత్యాసము: విపర్యయము-వ్యత్యయము.

انک | అంక్ [హి.పు] చూడు. آنک

انکار | ఇన్కార్ [అ.పు] నిరాకరణము-కాదనుట-అనంగీకారము-ఆక్షేపము.

انکانا | అంకానా [హి] మతింపువేయుట-చూడు. انکنا

**انکر** అన్కర్ [అ] అతిగర్హ్యమైన-అసహ్యకరమైన.

**انکڑی-انکڑا-انکڑ** అంకడ్-డా-డీ [హి. స్త్రీ] ములికి-కొక్కెము-కొండి, దోటికఱ్ఱకుండుకంకరచిల్లలేక చీల-గాలము.

**انکس** అంకుస్ [హి. స్త్రీ] అంకుశము.

**انکسار-ری** ఇన్కిసార్-రీ [అ. పు] భంగము-భంజనము-విధేయత-అణకువ-వినయము-దైన్యము-దీనత్వము.

**انکساف** ఇన్కిసాఫ్ [అ. స్త్రీ] సూర్యగ్రహణము.

**انکشاف** ఇన్కిషాఫ్ [అ. పు] తెరచుట-వెల్లడిచేయుట-తెలియపరుచుట.

**انکنا** అంక్నా [హి] పరీక్షింపబడుట-మదింపు వేయబడుట-ధరయగుట-తూనిక పడుట, కొలవబడుట.

**انگار-انگارہ** అంగార్-ర [హి. పు] అంగారము-నిప్పులు-ఎఱ్ఱగా కాలినబొగ్గు లేక పిడక-నివురుకప్పిననిప్పు-నిప్పుకణిక.

**انگبین** అంగ్బీన్ [పా. పు] తేనె.

**انگرکھا** అంగర్ఖా [హి. పు] అంగరేకు-నిలువుటంగీ.

**انگریز** అంగ్రేజ్ [ఉ. పు] ఆంగ్లేయుడు.

**انگریزی** అంగ్రేజీ [ఉ. స్త్రీ] ఆంగ్లేయభాష.

**انگڑ کھنگڑ** అంగడ్ ఖంగడ్ [హి. పు] ప్రాతవస్తువులు-చిల్లరవస్తువులు-పనికిమాలిన వస్తువులు.

**انگڑانا** అంగ్డానా [హి] ఒడలువిరుచుట, ఆవలించుట-ఊసులాడుట.

**انگڑائی** అంగ్డాయీ [హి. స్త్రీ] ఒళ్లువిరుపు, ఆవలింత.

**انگشت** అంగుష్త్ [పా. స్త్రీ] వ్రేలు-అంగుళము. **انگشت نما** -నుమా [పా] నిందితుడు-ఆడిపడ్డవాడు. **انگشت نر** -ఎనర్ [పా] పెద్దనవ్రేలు-బొటనవ్రేలు.

**انگشت شہادت** -ఎ-షహాదత్ [పా] చూపుడువ్రేలు. **انگشت بدندان ہونا** -బదందాఁహోనా [పా] వ్రేలుకొరుకుకొనుట-పశ్చాత్తాపపడుట-అనుతాపపడుట, ఆశ్చర్యపడుట.

**انگشتانہ** అంగుష్తాన [పా. పు] అంగుళిత్రాణము-కుట్టుపనివాండ్రును వేటకాండ్రును వ్రేలికి తొడుగుకొను తొడుపు-తొడుగు.

**انگشتری** అంగుష్త్రీ [పా. పు] అంగుళీయకము-ఉంగరము.

**انگل** ఉంగుల్ [హి. పు] అంగుళము-వ్రేలు, వ్రేలెడు-వ్రేలికణుపు.

**انگلانا** ఉంగ్లానా [హి] ఆక్షేపించుట-విసికించుట-రేపుట-అగచాట్లపెట్టుట.

**انگلی** ఉంగ్లీ [హి. స్త్రీ] అంగుళము వ్రేలు. **انگلی کرنا** -కర్నా చూడు **انگلانا**

**انگن-انگنائی** అంగన్-నాయీ [హి. పు] అంగణము-ప్రాంగణము-ఆవరణము-విడిచోటు.

**انگنا-انگنت-انگنتی** అగ్‌గినా-గినత్-గింతీ [హి] అగణితమైన-లెక్కలేని.

**انگنا مہینہ** -మహీన [ఉ] గర్భము యొక్క ఎనిమిదవనెల.

**انگوٹھا** అంగూఠా [హి. పు] అంగుష్ఠము, బొటనవ్రేలు, **انگوٹھا دکھانا** -దిఖానా [హి] వామహస్తముజూపుట.

**انگوٹھی** అంగూఠీ [హి. స్త్రీ] ఉంగరము.

**انگوچھا** అంగోఛా [హి. పు] చిన్నపంచ,

తుండుగుడ్డ-అంగవస్త్రము.

**انگور** । అంగూర్ [పా.పు] ద్రాక్ష-పండు మానుపక్కు-లేకచెక్కు.

**انگو** । అంగూ [పా.పు] ఇంగువ.

**انگیا** । అంగియా(హి.స్త్రీ)ఱవికె,చోలము, ఱంగిక,అంగియ.

**انگیٹھی** । అంగేఠీ(హి.స్త్రీ) అగ్నిష్టము, కుంపటి.

**انّا** । అన్నా (హి.స్త్రీ) చూడు. **انّا**

**انناس** । అనన్నాస్ (పా.పు) మొగలిపనస (పండు)

**انّی** । అన్నీ (హి.స్త్రీ) దాది.

**انوار** । అన్వార్ (అ.పు) ప్రకాశము,కాంతి. (ఏ.వ **نور**)

**انواع** । అన్వాఅ(అ.స్త్రీ)విధములు, తెగలు, వివిధములు. (ఏ.వ **نوع**)

**انوٹ** । అన్‌వట్ (హి.స్త్రీ) కాలిబొటనవ్రేలిగజ్జెలమట్టె,కులుకు,హొయలు,ఒయారము.

**انوتھا** । అనోతా (హి) అనుచ్ఛిష్టము,ఎంగిలికాని,క్రొత్తది.

**انور** । అన్వర్ (అ) అతిప్రకాశమానమైన.

**انوکھا** । అనోఖా (హి)అపూర్వమైన,అసాధారణమైన,అరుదైన,ప్రత్యేకమైన,వేఱయిన.

**انول** । అవల్ (హి) మాయి. (ప్రసవకాలమందుపడునది).

**انہار** । అన్హార్ (అ.స్త్రీ) ఏరులు, కాలువలు. (ఏ.వ **نہر**)

**انہتر** । ఉన్‌హత్తర్ (హి) అరువదితొమ్మిది.

**انہدام** । ఇన్‌హిదామ్ (అ పు) పడగొట్టుట, పాడుచేయుట,నాశము.

**انہزام** । ఇన్హిజామ్ (అ) ఓడిపోవుట,పారిపోవుట.

**انہماک** । ఇన్హిమాక్ (అ) తత్పరత, ఒకదానియందుతగిలియుండుట.

**انی** । అనీ(హి.స్త్రీ) మొన,కొన,సాళి,ముల్లు.

**انیس** । ఉన్నీస్ (హి) పందొమ్మిది.

**انیس** । అనీస్ (అ.పు) చెలికాడు, సంగాతగాడు.

**انیلاپن** । అనీలాపన్ (హి.పు) జేలతనము, అమాయికము.

**او** । ఓ (హి) ఓ,ఓరి,ఓసి,ఓయి.

**اواخر** । అవాఖిర్ (అ)అంతము,తుద (ఏ-వ **آخر**)

**اوائل** । అవాయిల్ (అ.పు) ఆది,ప్రారంభము,మొదలు. **اوائل عمر** । —ఎ-ఉమ్ర్ (అ) బాల్యము,చిన్నతనము.

**اوباش** । అవ్‌బాష్(పా.పు)పోకిరి,ధూర్తు, ద్రిమ్మరి, రండువాడు,తుచ్ఛుడు,దుర్మార్గుడు.

**اوباشی** । అవ్‌బాషీ(పా.స్త్రీ)దుర్మార్గము. ముండలమారితనము,పోకిరితనము.

**اوپ** ఊప్ (హి) ప్రకాశము, మెఱుపు, కాంతి, మెఱుగు, అందము.

**اوپچی** । ఉప్‌చీ(హి.పు)కట్టాయితుడు, కంచుకితుడు,శస్త్రాస్త్రములు ధరించినవాడు.

**اوپر** ఊపర్ (హి) మీద;పైన, బయట,అవతల,వెలుపల,పైభాగము, మీదు,ఎక్కువ.

**اوپر تلے** ।—తలే(హి) ఒకదానిపైనొకటి దొంతిగా, పయిపయిన,నిరంతరముగా.

**اوپری** । ఊపరీ (హి)పై, మీది, వెలుపలి, బయటి,పరాయి,ఇతరుడు,పరదేశి.

**اوت** ఊత్ (హి.పు) శుంఠుడు,మూఢుడు, బ్రహ్మచారి, అనపత్యుడు, అపవిత్రము,అమంగళము. (లాభము.

**اوت** । ఓత్ (హి.స్త్రీ) ఆధిక్యత, ఫలము,

**اوتاد** । ఔతాద్(అ)మహమ్మదీయులధర్మాధికారులు,మహమ్మదీయబుషి చతుష్టయము.

اوتار | ఔతార్ (సం.పు) అవతారము.

اوٹ | ఓట్ (హి.స్త్రీ) అడ్డము, తెర, చాటు, నీడ, శరణము, ఆశ్రయము, ముఖవస్త్రము, ముసుగు, మాటు, ముసుగు.

اوٹ ہونا | —హోనా (హి) దాగుట, మఱుగుపడుట. اوٹپٹانگ | —పటాంగ్ (హి) నిరర్థకము, వ్యర్థము, అందిపొందనిది.

اوٹن | ఔటన్ (హి) ఉడుకు, తెరలుట.

اوٹنا | ఔట్నా (హి) ఉడుకుట, కాగుట, తెరలుట.

اوٹنا | ఓట్నా (హి) రక్షించుట, అడ్డపడుట, కాపాడుట, ఏకుట, ప్రత్తిలో విత్తులుతీయుట, ఒడిపట్టుట, పట్టుకొనుట. (కుపిల్లు.

اوٹنی | ఓట్నీ (హి.స్త్రీ) పింజనము, దూదే

اوج | అవుజ్ (అ.పు) ఔన్నత్యము, ఎత్తు, శిఖరము, వృద్ధి, ఉచ్చ, గౌరవము, అంతస్తు, మర్యాద, పెత్తనము.

اوجڑ | ఊజడ్ (హి) పాడు, అధ్వానము, బీడు, నిర్జనమైనది, నాశము.

اوجڑنا | ఊజడ్నా (హి) పాడగుట, నాశమగుట, చెడుట. (గించుట.

اوجنا | ఓజ్నా (హి) పడపోయుట, ఓడి

اوجھا | ఓఝా (హి) ఒజ్జ, ఉపాధ్యాయుడు, జోస్యుడు, మంత్రగాడు, జాణ.

اوجھ ا—اوجھڑی | ఓఝడీ-ఓఝ (హి.స్త్రీ) పశువుపొట్ట, కడుపు, పేగులు.

اوجھل | ఓఝల్ (హి.స్త్రీ) మాటు, اوٹ

اوچھا | ఓఛా (హి) అల్పమైన, నీచమైన, స్వల్పమైన, పనికిమాలిన, తెలివిమాలిన, తుచ్ఛమైన, పట్టి, బీద, లోతులేని.

اود ا—اودبلاو | ఊద్-బిలావ్ (హి.పు) జంగుపిల్లి, మార్జాలము, (నీటిపిల్లియనికొందరు)

اودا | ఊదా (హి) ధూమ్రవర్ణము, పొగవన్నె.

اور | ఓర్ (హి.స్త్రీ) ఓఱ-మేర-అంచు-కొన, ప్రక్క-దిక్కు-మొదలు-ఆది-పక్షము-పక్షపాతము-సంఘము.

اورچھور | —ఛోర్ (హి.పు) ఆద్యంతము-తుదమొదలు.

اور | ఔర్ (హి) మరియు-ఇంక-రెండవ, ఇతరము-పరాయి-క్రొత్తది-ఇనుమడి-మిక్కిలి-ఉపరి; అల్లరి-యు-ను.

اوراد | ఔరాద్ (అ.పు) ఆవృత్తులు-జపములు. (ఏ.వ ورد)

اوراق | అవురాక్ (అ.పు) ఆకులు-పత్రములు రేకులు. (ఏ.వ ورق)

اورس چورس | ఔరస్‌చౌరస్ (హి) చుట్టు-నలుపదగమైన-చదునైన-చతురమైన.

اورما | ఓర్మా (హి.పు) దిబ్బికుట్టు-అంచు మడచికుట్టినకుట్టు.

اورنگ | ఔరంగ్ (పా.పు) సింహాసనము, గద్దె-బుద్ధి-తెలివి-పుష్పవిశేషము.

اورنگ‌زیبی | —జేబీ (పా) ఒకవిధమైన రాచపుండు.

اوری | ఓరీ (హి.స్త్రీ) ఇంటిచూరు.

اورے دھورے | ఓరేధోరే (హి) ఇరుగుపొరుగు-చుట్టుప్రక్కలు-ఇటునటు.

اوڑھنا | ఓఢ్నా (హి) కప్పుకొనుట-వేసికొనుట, దుప్పటి-పచ్చడము-అంగవస్త్రము.

اوڑھنی | ఓఢ్నీ (హి.స్త్రీ) ఒల్లియ-ఒల్లె-ఉత్తరీయము.

اوزار | ఔజార్ (అ.పు) ఆయుధములు-పనిముట్లు-పాపములు-దోషములు-అపరాధములు (ఏ-వ وزر).

اوزان | ఔజాన్ (అ.పు) ఎత్తులు, బాటులు, (ఏ-వ وزن)

اوس | ఓస్ (హి.స్త్రీ) హిమము-మంచు.

اوس پڑنا | ఓస్ పడ్నా (హి) మంచు కురియుట, సిగ్గుపడుట- ధరలేక వెలతగ్గుట- తేరుకొనుట.

اوس | ఉస్ (హి) చూడు اُس

اوسان | ఔసాన్ (హి.పు) ప్రజ్ఞ-తెలివి-ధైర్యము.ఇంద్రియజ్ఞానము.

اوسان خطا ہونا۔ اُڑ جانا | ఔసాన్ ఖతాహోనా-ఉడ్ జానా (హి) భ్రమపడుట-దిగ్భ్రమచెందుట-నిర్వీర్యపడుట-తొట్రుపడుట.

اوسان میں آنا | ఔసానే ఆనా (హి) స్మృతివచ్చుట- తెలివివచ్చుట-పుట్టుట.

اوسر | ఔసర్ (సం.పు) అవసరము-కాలము.

اوسر | ఓసర్ (హి.స్త్రీ) పెయ్య-ఆవుపెయ్య.

اوسر | ఊసర్ (హి.స్త్రీ) ఊషరము-పాడునేల-పండనినేల-చవిటినేల.

اوسرا | ఓసారా (హి.పు) ఆవృత్తి-తేప-తడవ-సారి,వంతు,పాలుపితుకువేళ.

اوسط | ఔసత్ (అ.స్త్రీ) మధ్యస్థమైన-నడిమి, మధ్యమము,సగటు-ఉరమర,సామాన్యమైన.

اوصاف | ఔసాఫ్ (అ.పు) గుణములు, నేర్పు,అలవాటు, స్వభావము,వర్ణనము,లక్షణములు,గుణితులు (ఏ-వ وصف)

اوقات | ఔకాత్ (అ.స్త్రీ) కాలములు, సమయములు, వేళలు. స్థితిగతులు, జీవనము,ఆయము;అధికారము-సామర్థ్యము (ఏ.వ وقت)

اوقات بسری | -బస్రీ (పా) కాలయాపనము-ఉపజీవనము జరుగుబాటు.

اوک | ఓక్ (హి.స్త్రీ) డోకు-ఓకర-పుడిసిలితో నీళ్లుత్రాగుట.

اوک | ఊక్ (హి) తప్పు-పొరపాటు.

اوکے چوکے | ఓకేచూకే (హి) అప్పుడప్పుడు-కదాచిత్-మరచితప్పుల.

اوکھا | ఓఖా (హి) అస్పష్టము-దూషితము.

اوکھد | ఔఖద్ (హి.స్త్రీ) ఔషధము.

اوکھلی | ఓఖ్లీ (హి.స్త్రీ) రోలు,ఉలూఖలము.

اوکھنا | ఓఖ్నా [హి] ఓకరించుట, వాంతిజేయుట.

اوگرا | ఓగ్రా [హి] రుచిహీనమైన,చప్పని.

اوگن | ఔగున్ [హి.పు] అవగుణము-దోషము.

اوگھٹ۔گھڑ | ఔఘట్-డ్ [హి] అవఘళము.దుర్ఘటమైన, పోరాని, మిట్టపల్లమైన, ఎగుడుదిగుడైన.

اول | అవ్వల్ [అ] ప్రథమము-మొదటి-ఆరంభము-శ్రేష్ఠమైన.

اول منزل پہنچانا | -మంజిల్ పహుంచానా [హి] ప్రేతసంస్కారము చేయుట.

اول | ఓల్ [హి.పు] ప్రతి-మారు-సెల్లు-అప్పగింత, కుదవ-తాకట్టు-తెగ-అడ్డము-పూట-పూచీ.

اولا | ఓలా (హి.పు) వడగల్లు- వానరాయి-కలకండనేసినలడ్డు- اولا جانا | -జానా (హి) వల్లాగుట.

اولا | ఓలా [హి.పు] చాటు-తెర-ఓలము.

اولاد | ఔలాద్ [అ.స్త్రీ] సంతానము,వంశము, [ఏ-వ ولد]

اولاد اناث | -ఎ-ఉనాస్ [అ] స్త్రీ సంతానము- اولاد ذکور | -ఎ-జకూర్ (అ.పు) పుం సంతానము.

اولتی | ఓల్తీ [హి.స్త్రీ] ముంజూరు-చూరు.

اولفول | ఔల్ ఫౌల్ [ఉ.పు] దుర్భాషలు-పరుషములు-ఉచ్చనీచములు.

اولما | ఓల్మా [ఉ.పు] పచ్చిచేసివండిన మాంసము.

**اولو** | ఔలూ[హి]అసాధారణమైన-క్రొత్త

**اولوهيت** | ఉలూహియ్యత్ [అ.స్త్రీ] ఆధిక్యత-శ్రేష్ఠత.

**اولياء** | ఔలియా [అ.పు] మహాత్ములు-రక్షకులు-సహవాసులు-ఋషులు-మునులు-భక్తులు-(ఏ-వ ولی)

**اولياء الله** -యె-అల్లా [అ] భగవద్భక్తులు, భాగవతులు.

**اولياے دولت** -యె-దౌలత్ [అ] ప్రభువులు-దొరలు-గొప్పఉద్యోగస్థులు. [కులు.

**اولين** అవ్వలీన్ [అ] మొదటివారు-పూర్వి

**اون** ఊన్ [హి.స్త్రీ] ఉన్ని-బొచ్చు.

**اوناماسی** ఓనామాసీ(హి.స్త్రీ) ఓనమాలు ఆరంభము.

**اونٹ** | ఊంట్ (హి.పు) ఉష్ట్రము-ఒంటె

**اونٹ گاو** |..గావ్ (హి.పు] ఉష్ట్రగవము, ముక్కున్నె లొట్టె- గిరాఫీయను ఆఫ్రికామృగము

**اونٹ کٹارا** -కటారా [హి] ఒకముండ్లచెట్టు.

**اونٹانا** | ఔటానా[హి] తెరలించుట-ఉడికించుట-సలసలగ జేయుట.

**اونٹنا** | ఔటనా(హి) తెరలుట-మరగుట, కాగుట-ఉడుకుట.

**اونٹنی** | ఊంట్నీ [హి-స్త్రీ] ఆడుఒంటె.

**اونٹھ** | ఓంఠ్ [హి.పు] ఓష్ఠము-పెదవి.

**اونچ** | ఊంచ్ (హి) ఎత్తైన-పొడుగైన-ఉత్తమమైన-

**اونچ نیچ** |—నీచ్ (హి) ఉచ్చనీచములు, ఎచ్చుతగ్గులు.

**اونچا** | ఊంచా (హి) ఉచ్చమైన-ఎత్తైన-పొడుగైన-పెద్దధ్వనిగల బిగ్గరగా

**اونچا سننا** |-సున్నా (హి) వినరాక పోవుట-చెవుడుగలిగియుండుట.

**اونچائی** | ఊంచాయీ(హి.స్త్రీ) ఎత్తు, పొడుగు-ఔన్నత్యము.

**اوندها** | ఔంధా (హి) బోరల-క్రిందల-తలక్రిందైన-శుంఠుడు

**اوندهی پیشانی کهوپری** | ఔంధీ-పేషానీ-ఖోప్రీ(ఉ) శుంఠ- తెలివిమాలినవాడు.

**اوندهانا** | ఔంధానా (హి) బోరగించుట తలక్రిందుచేయుట-ఒడగించుట-ఒలుకపోయుట.

**اونگھ** | **اونگھائی** | ఊంఘ్-ఊంఘాయీ(హి.స్త్రీ) తూగు-కూరుకుపాటు-నిద్ర-కూరుకు.

**اونگھنا** | ఊంఘ్నా(హి)తూగుట- కూరుకు పాట్లుపడుట-నిద్రించుట.

**اونهیں** | ఊంహీం (హి) అట్లే-అదేరీతిగా.

**اونی** | ఊనీ (హి) ఉన్నిలేక బొచ్చుతో నేసిన-రాంకవము.

**اوهام** | ఔహామ్ (అ) భ్రమలు-ఊహలు-తలంపులు (ఏ-వ-وهم).

**اوهو** | ఓహో (హి) ఓహో-ఆహా.

**اوهی-اوئی** | ఊహీ-ఊయీ (హి) ఈ! ఔరా!!.

**اه** | ఒహ్ (పా) ఓహో!!

**اهانت** | ఇహానత్(అ.స్త్రీ) తిరస్కారము, ధిక్కారము-స్పర్ధ-పగ.

**اهتدا** | ఇహ్తిదా(అ.పు) మార్గదర్శనము, త్రోవజూపుట.

**اهتزاز** | ఇహ్తిజాజ్ (అ.పు) గాలివీచుట-చలనము-కదలిక.

**اهتمام** | ఇహ్తిమామ్ (అ.పు) నిర్వాహకము, సవరణ- ఏర్పాటు- కట్టుదిట్టము- విచారణ, జాగ్రత-సదిలము.

**اهل** | అహ్లె(అ.పు) జనులు-ప్రజలు లోకులు, కుటుంబికులు- పిల్లమేక- భార్యపిల్లలు- కుటుంబము- భాగ్య- సహవాసి- యజమాని-

ایراد ఈరాద్ (అ.పు) ఆక్షేపము.

ایران ఈరాన్ (పా.పు) పారసీక దేశము.

ایرانی ఈరానీ (పా) పారసీకుడు.

ایرکھا ఈర్ఖా (హి.స్త్రీ) ఈర్ష్యము.

ایڑ ఏడ్ (హి.పు) గుఱ్ఱమును పొడిచిత్రో లుటకై ఆశ్వికునిమడిమలకుండుత్రోత్రము, ఆశ్వికులపార్ష్ణిత్రములకుండు బరిముల్లు.

ایڑی ఏడీ(హి.స్త్రీ)మడిమ,పాదమూలము.

ایڑیاں رگڑنا ఏడియాఀరగడ్నా (హి) మడిమలు నేలరాయుట,విలవిలలాడుట,ప్రబలప్రయత్నముచేయుట.

ایزد ఏజిద్ (పా.పు) ఈశ్వరుడు.

ایسا అయిసా (హి) ఇట్టి,ఇటువంటి,ఈలాటి,ఇట్లు,ఇంత,ఈకొలది.

ایسی تیسی کرنا ఐసీతైసీ కర్నా (హి) ఉచ్చనీచములాడుట, బూతులు జోకుట.

ایشان ఈషాన్ (సం.పు) ఈశానుడు, ఈశాన్యము (దిక్కు.) (దేవుడు.

ایشور ఈష్వర్ (సం.పు) ఈశ్వరుడు,

ایشیا ఏష్యా (ఇం)ఆసియాఖండము.

ایصال ఈసాల్(అ) ప్రేమణము-పంపుట. ముట్టజెప్పుట-రాబట్టుట.

ایضاً ఐజన్ (అ)పూర్వోక్తము-యథాపూర్వము-అదే-పునః-మరల-పైది.

ایفا ఈఫా (అ.స్త్రీ) నిర్వాహకము-నెరవేర్పు-తీర్పు-చెల్లుబడి-సిద్ధి-అనువర్తనము.

ایک ఏక్(హి)ఏకము-ఒకటి-ఒక.

ایک نہ سننا-ماننا —నసున్నా-మాన్నా (హి) బొత్తిగానంగీకరింపకపోవుట-

ایک آدھ —ఆధ్ (హి) ఒకటియరకొందరు ایک نہ ایک —నయేక్(హి) ఏదోఒకటి-ఒకానొకరు.

ایک دم-مشت —దమ్-ముష్త్(హి)తత్క్షణము, ఒక్కసారిగా, అకస్మాత్తుగా, అఠాత్తుగా. (టుము-సమ్మె.

ایکا ఏకా(హి.పు)ఐక్యము-ఐకమత్యము,కూ

ایکادسی ఏకాదసి(హి.స్త్రీ)ఏకాదశి

ایکایکی ఏకాయకీ(హి)చూడు ایکدم

ایکٹھا ఏకట్ఠా (హి) చూడు اکٹھا

ایکلا ఏక్లా (హి) చూడు اکیلا

ایکھ ఈఖ్ (హి.స్త్రీ) ఇక్షువు,చెఱుకు.

ایل ఏల్ (అ.పు) కొండగొఱ్ఱె,కణితి (మృగము.)

ایلچی ఏల్చీ (తు.పు) ప్రతినిధి,రాయబారి,రాజదూత,పరార్థవాది,వార్తికుడు.

ایلو ఏలో (హి) ఇదిగో,ఆశ్చర్యార్థకము.

ایلوا ఏల్వా (హి.పు) అగరుగంధపు చెట్టు, ముసాంబ్రపు చెట్టు, కలబందనార.

ایما ఈమా (అ.స్త్రీ) సూచన,సంజ్ఞ,సైగ, ఇంగితము,ఆజ్ఞ,అప్పణము.

ایمان ఈమాన్ (అ.పు) క్షేమము,ధర్మము, మతము,విశ్వాసము,నమ్మకము,అభిప్రాయము, యథార్థము,న్యాయము, నీతి,పరమార్థము ایمان دار —దార్ (హి) న్యాయస్థుడు, నమ్మకస్థుడు, సత్యవాది, నీతిమంతుడు ایمان داری —దారీ (హి) యథార్థత, ధర్మప్రవర్తన, సత్యవర్తనము, నీతిపరత్వము.

ایمن ఐమన్ (అ) అభయము,శరణము.

ایمہ అయిమ (అ.పు) ధర్మమాన్యము- మాన్యము.

ایمہ అయిమ్మ (అ) మతాచార్యులు, (ఏ-వ. امام )

این ఈఀ (పా) ఈ. ఇది-దీని.

اینٹ ఈఀట్ (హి.స్త్రీ) ఇటుక,ఇష్టిక.

اینٹ سے اینٹ بجانا —సేఈఀట్

బజానా (హి.స్త్రీ) పాడుబడుట,అధ్వా నమగుట,నాశనమగుట.

**اینٹھ** ఐంఠ్ (హి.స్త్రీ) నీలుగు, పెన,వడి, ఒగువు,గర్వము,త్రుళ్లు,తలబిరుసు,పొగరు

**اینٹھن** ఐంఠన్ (హి స్త్రీ) పెన,వడి, మలి,కడుపునొప్పి,శూల.

**اینٹھنا** ఐంఠ్నా (హి) నీలుగుట,బిగియు ట, పెనబడుట, మెలికపడుట,గర్వించుట, త్రుళ్లుట, పెనవేయుట,వడివేయుట,బిగి-యించుట, మోసముచేయుట,ఒడియుట.

**اینچاتانی** ఐంచాతానీ (అ) పీకులాట, గుంజులాట,జగడము,పోట్లాట, ఇల్లిగ్గులు, ఇగ్గాముగ్గి,ఇగ్గులాట.

**اینچنا** ఐంచ్నా(ఈంచ్నా)(హి)ఇగ్గుట, గుంజుట,లాగుట,బిగించుట, అప్పగించు-కొనుట,ఉత్తరవాదియగుట.

**ایندھن** ఈంధన్ (హి.పు) ఇంధనము, వంటచెరకు,కట్టెలు.

**اینڈنا** ఐండ్నా (హి) నీలుగుట,బిగియు ట,తూగిపడుట,పొర్లాడుట,సోమరిగా నుండుట.

**اینڈوا—اینڈھوی** ఐండ్వా,ఐండ్వీ (హి.స్త్రీ) చుట్టకుదురు,తలచుట్ట (బరువు లుమోయువారు నెత్తిపపెట్టుకొనునది.)

**اینڈی بینڈی** ఐండీ బైండీ(హి.స్త్రీ) ఉచ్చనీచములు,వంకరటింకర, మోటు, పనికిమాలిన,తుచ్ఛమైన.

**آئینہ** అయీన(పా.పు)దర్పణము,అద్దము.

**آئینہ دکھانا** —దిఖానా (హి) గుణ దోషములు తెలుపుట.

**آئینہ باطن** —బాతిన్ (పా) నిర్మల హృదయులు.

**ایوان** అయివాన్ (అ.పు) హర్మ్యము, రాజగృహము, నగరు,ఆస్థానము,కూటము, సభామంటపము.

## ( آ )

**آ** ఆ (అ.పు) ఇదిఉరుదు వర్ణమాలలోని మొదటి యక్షరముయొక్క దీర్ఘ రూపము, ఆకారము.

**آ** ఆ(హి)రా, పావురములనుబిలుచుట యంద గుధ్వన్యనుకరణము, రాగాలాపమునకును సుతికలుపుటకును నుపయోగింపబడుస్వ రము.

**آب** ఆబ్ (పా.పు)ఉదకము,నీళ్లు(స్త్రీ)కాంతి, మెఱుగు, వజ్రము మొదలగు వానికాంతి లేక నీరు; మర్యాద,గౌరవము, ప్రఖ్యాతి; కత్తి మొదలగువాని పదను

**آب آب ہونا** ఆబ్ హోనా (ఉ) దిగ జెమటలుబోయుట; సిగ్గుపడుట; మిక్కిలి చిన్నబోవుట **آب اترنا** ఉతర్నా (ఉ) నీరుదిగుట;పదును చెడుట; కాంతితగ్గు ట;మానభంగమగుట-**آب احمر** ఎ-అహమర్ (పా.పు) కెంపుసముద్రము.

**آب باران** ఎ-బారాం(పా.పు)వాననీరు.

**آب بازی** బాజీ(పా.స్త్రీ) జలక్రీడ, ఈదులాట-**آب بستہ** ఎ-బస్త(పా.పు) నిలచియున్ననీరు,పాఱనినీరు, మడుగునీరు; గాజు,అద్దము;మంచుగడ్డ-**آب بقا** ఎ-బకా(పా.పు)అమృతము **آب پاشی** —పాషీ (పా.స్త్రీ) నీళ్లుచల్లుట,పొలమునకునీరుక ట్టుట,ఒకరాజ్యాంగము, రాజ్యాంగములో నియొకశాఖ,జలసేచనశాఖ.

**آب تاب** —తాబ్ (పా.స్త్రీ) ప్రకాశము, కాంతి,వైభవము-**آب جاری** —ఎ-జారీ (పా.పు) పాఱెడునీరు, కాలువ, వాగు.

آب جو آ-ఎ-జూ (పా.పు) ఏటి నీరు, కాలువ-ఏఱు-آب جوش آ-ఎ-జోష్ (పా.పు)కషాయము,మాంసరసము, యూషము-آب چشم آ-ఎ-చష్మ్(పా.పు) కన్నీరు-آب چڑھانا آ-చఢానా (పా.) పదును పెట్టుట, మెఱుగు బెట్టుట-

آب حرام آ-ఎ-హరామ్(పా.పు)సారాయి; కపటపుకన్నీరు-آب حیات آ-ఎ-హయాత్ (పా.పు)అమృతము-آب حیوان آ-ఎ-హైవాన్(పా.పు)అమృతము-آب خانہ آ-ఖాన (పా.పు) నీళ్లయిల్లు,జలాగారము; మఱుగుదొడ్డి-آب خضر آ-ఎ-ఖిజర్ (పా.పు) అమృతము-آب خورہ آ-ఖోర (పా.పు) పానపాత్రము-స్థాలి,పంచపాత్రము-

آب دار آ-దార్(పా)నీళ్లవాడు;పదును గల, మెఱుంగుగల, కాంతిగల-

آب دار خانہ آ-దార్ ఖాన (పా.పు) చలిపందిరి, చలివేందర,(ప్రప, తాగుటకు మంచినీళ్లు ఇచ్చుచోటు-آب دست آ-దస్త్ (పా.పు)శౌచము,ప్రక్షాలనము, శౌచమునకైననీరు-آب دست لینا-کرنا آ-లేనా కర్నా (ఉ) మలవిసర్జనానంతరము ప్రక్షాలనముచేసికొనుటకు నీరు آب دندان آ-ఎ-దందాం(పా.పు)ఒకవిధమైనదాడిమపండు آب دہان آ-ఎ-దహాన్ (పా.పు) ఉమ్మి చొల్లు-آب دیدہ آ-దీద.(పా)కన్నీరుగల,ఏడ్చుచున్న,వ్యసనపడు, అశ్రుపూరితనేత్రములుగల آب دیدہ ہونا آ-దీద హోనా(ఉ)కంటతడిపెట్టుకొనుట, ఏడ్చుట-آبرو آ-అబ్రూ (పా.స్త్రీ) ముఖవర్చస్సు,ముఖకాంతి,మర్యాద, మానము; ప్రఖ్యాతి,ఘనత آبرو اتارنا-لینا آ-ఉతార్నా-లేనా (ఉ) మానభంగము చేయుట, అవమానపర్చుట,సిగ్గుపేయుట.

آبرو پر پانی پھیرنا آ-పర్ పానీ ఫేర్నా(ఉ)మర్యాదమంటగలుపుట, మూడు آبرو اتارنا అను పదము.

آبروریزی آ-రేజీ(పా.స్త్రీ)మానభంగము-آب رواں آ-ఎ-రవాం(పా.పు) పారెడునీరు,ప్రవాహజలము;దుకూలము,రవసెల్లా-آب زر آ-ఎ-జర్ (పా.పు) బంగారు నీరు-آب زلال آ-ఎ-జులాల్(పా.పు) నిర్మలోదకము.

آبشار آ-షార్(పా.పు)నిర్ఝరము, సెలయేరు, జలపాతము-آب شور آ-ఎ-షోర్(పా.పు) సముద్రోదకము,ఉప్పునీరు.

آب شورہ آ-ఎ-షోర(పా.పు) పెట్లుప్పు పానీయము, శీతలపానీయము, తీపునుప్పులు సునుకలిపిచేసిన చల్లనిపానకము.

آب عشرت آ-ఎ-ఇష్రత్(పా.పు) సారాయి

آبکار آ-కార్(పా.పు)శౌండికుడు, సారాయివండువాడు,గౌండ్లవాడు,సారాయిలేక కల్లుఅమ్మువాడు. آبکاری آ-కారీ(పా.స్త్రీ) మద్యవిక్రయము.కల్లంగడి,సారాయి మొదలగువానిని చేయుట,అమ్ముటయును;ఒకరాజ్యాంగము,మద్యవిక్రయశాఖ.

آبکش آ-కష్(పా.పు)నీళ్లుచేదువాడు.

آب کوثر آ-ఎ-కౌసర్ (పా.పు)అమృతము

آب گوشت آ-ఎ-గోష్త్ (పా.పు)మాంసరసము. آبگیر آ-గీర్(పా.పు) జలాశయము, మడుగు;సాలెవానికుంచియ,కుంచె.

آبگینہ ఆ-గీన(పా.పు) అద్దము,గాజు; పా నపాత్రము; వజ్రము. آبنائے-ఆబ్ నాయ్ (పా.స్త్రీ) జలసంధి. آبنقرہ-ఆ-బ్-ను క్ర (పా.పు)పాదరసము,వెండి నీరు.

آب و تاب ఆ-బ-తాబ్(పా.స్త్రీ)ప్రకాశము,వైభవము. آب ودانہ ఆ-బ-దాన,

آب وخور ఆ-బ-ఖుర్(పా.పు)అన్నోదకము. آب وگل ఆ-బ-గిల్ (పా.స్త్రీ) స్వభావము,ప్రకృతి. آب و ہوا ఆ-బ-హవా (పా.స్త్రీ) నీరును గాలియు,శీతోష్ణస్థితి.

آبا ఆబా(అ పు)తండ్రులు పెద్దలు. (ఏ.వ آب)

آبا و اجداد ఆబా-వ అజ్దాద్ (అ.పు)తండ్రి తాతలు,పెద్దలు,వంశపరంపర, పూర్వులు.

آباد ఆబాద్(పా)పరిపూర్ణమైన,నిండియున్న,జనాకీర్ణమైన,జనులువసించెడు,మనుష్యులువాడుకొను,జనావాసము,దున్నెడు, సేద్యమైయున్న,సాగుబడిలోనున్న, సేద్యముచేయు-కల్యాణయుక్తమైన,వృద్ధిగల,జనపదము;ఇదినగరములేక పురము అనుఅర్థమునపట్టణములనామములయంతమందువచ్చును.

آبادانی ఆబాదానీ(పా.స్త్రీ) జనావాసము -జననివాసము,జనపదము,వసతి,నివాసము, సేద్యము, సేద్యమగుభూమి,అభివృద్ధి,సమృద్ధి, కల్యాణము,విభవము,ఉల్లాసము,సంతోషము.

آبادی ఆబాదీ(పా.స్త్రీ)ఊరు,ఊరినేల, జనపదము, వసతి,జనులునివసించుచోటు, జనవాసము,సాగుబడి భూమి, జనసంఖ్య, వృద్ధి,కల్యాణము,సంతోషము,సౌఖ్యము.

آبان ఆబాన్ (పా.పు)పారసీకులసౌరమాన వర్షమండలియొక్క నేలపేరు, ఇదిదక్కనులో పన్నెండవనెలయగుచున్నది.

آبائی ఆబాయీ (అ)పైతృకము, తండ్రి సంబంధమైన,పూర్వులనుండివచ్చిన.

آبرو ఆబ్రూ(పా.స్త్రీ)చూడు آب క్రింద సమాసపదములు. [తోట.

آبسال ఆబ్ సాల్ (పా.పు)ద్రాక్షతోట,

آبسنگی-آبستنی ఆబిస్తగీ-ఆబిస్తనీ (పా.స్త్రీ) గర్భము, చూలు.

آبستہ ఆబిస్త (పా)గర్భముగల, చూలుగల, కడుపులోనున్న శిశువు.

آبگیر ఆబ్ గీర్ } (పా.పు) చూడు آب
آبگینہ ఆబ్ గీన } క్రింద సమసపదములు.

آبلہ ఆబిల (పా.పు) బొబ్బ,పొక్కు.

آبلہ فرنگ ఆ-ఫరంగ్(పా పు)సీమపోటకము.

آبنوس ఆబ్నూస్(పా.పు)నల్లచేవమాను (తిందుకము),తునికిచేవ.

آبنوس کاکندہ ఆ-కాకుంద (పు) నల్లచేవ మొద్దు,మిక్కిలినల్లవాడునుకురూపియు నగుస్థూలకాయుడు.

آبنائے ఆబ్ నయ్ (పా.పు) గుడుగుడియొక్క నిలువుగొట్టము లేక నాళము, (దీని పయి چلم పెట్టుదురు.)

آبی ఆబీ (పా) నీటి సం॥,నీటి,నీరుకట్టిన, తడిగానున్న,తడి. [మీరు.

آپ ఆప్ (హి) తాను,తారు,తమరు,తాము,

آپ روپ ఆ-రూప్(హి)అద్వితీయము,సాటిలేని.

آپ بیتی ఆ-బీతీ(హి.స్త్రీ)తనవృత్తాంతము,చరిత్రము,వృత్తాంతము, [పరుడు

آپ کاج ఆ-కాజ్ (హి) స్వప్రయోజన

آپ ہی آپ } ఆప్ హీ ఆప్-సే ఆప్
آپ سے آپ } (హి) తనంతటతాను,

స్వయముగా,నిష్కారణముగా.

آپ سے باہر ہونا ఆప్-సేబాహర్ హోనా (హి)కోపము చేగాని సంతోషము చేగాని మైమరచుట, పరవశుడగుట,వివశుడగుట.

آپا-آپّا ఆపా-ఆప (హి.స్త్రీ)అప్ప,అక్క.

آپا ఆపా(హి.పు)స్మృతి, ఆత్మ,ఇంద్రియజ్ఞానము-తాను,సత్వము, తెలివి. آپا دھاپی -ధాపీ(హి.స్త్రీ)స్వప్రయోజనపరత్వము, ఎవరిపని వారుచూచుకొనుట. آپی-آپی

ఆపే(హి.స్త్రీ)ఏవరికివారు, ప్రత్యేకము-స్వతంత్రము,స్వాతంత్ర్యము. آپے سے باہر ہو -ఆపేసే బాహర్ హోనా (హి) చూడు آپ سے باہر ہونا అను పదము.

آپس ఆపస్(హి-స్త్రీ)అన్యోన్యము, పరస్పరము,బంధుత్వము;పోటి,సాటి.

آپس داری -దారీ (ఉ.స్త్రీ) బంధుత్వము-బాంధవము. آپس میں -మేఁ(హి) అన్యోన్యము,ఒకరికొకరు-తమలోతాము.

آتا ఆతా (హి.పు) సీతాఫలము, ఋణము, అప్పు,దండుగ.

آتش ఆతిష్(పా.స్త్రీ)అగ్ని, నిప్పు,వేడిమి, క్రోధము آتش باز ఆ-బాజ్ (పా.పు) బాణసంచు (చేయు)వాడు.

آتش بازی ఆ-బాజీ (పా.స్త్రీ) బాణసంచు, తుపాకిమందుతో చేసిన బిరుసులు మొ॥, బాణవిద్దెలు;బాణసంచుకాల్చుట.

آتش پارہ ఆ-పారహ్(పా.పు) చూడు. آتش کا پرکالہ అను పదము.

آتش پرست ఆ-పరస్త్(పా.పు). అగ్ని పూజచేయువారు,పారసీకులు.

آتش خانہ ఆ-ఖానహ్(పా.పు) నిప్పుగూడు, అగ్నిగృహము; పారసీకులపూజాగృహము.

آتش دان ఆ-దాన్ (పా.పు) కుంపటి.

آتش فشاں ఆ-ఫిషాఁ(పా.పు)అగ్ని పర్వతము,జ్వాలాముఖి.

آتش کا پرکالہ ఆ-కాపర్‌కాల (పా.పు) అగ్నికణము, నిప్పురవ: మేధావి,జాణ; జగడాలమారి;రూపసి:కోపనుడు.

آتش گیر ఆ-గీర్(పా.పు)నిప్పుకాలు.

آتشک ఆతిషక్ (పా.స్త్రీ) ఒక మేహరోగము.

آتشکیا ఆతిషకియా (పా.పు) మేహరోగి, (آتشک రోగముగలవాడు).

آتشی ఆతిషీ(పా) నిప్పు సంబంధమైన,

آتشی شیشی ఆ- షీషీ (పా.స్త్రీ) భూతద్దము,అగ్ని దర్పణము,రవికాంతము.

آتما ఆత్మా(సం.స్త్రీ) ఆత్మ,జీవుడు.

آتو-آتون ఆతూ(ఉ)ఆతూఁ(పా.స్త్రీ) ఉపాధ్యాయి,పంతులమ్మ,ఉపాధ్యాయ.

آٹا ఆటా(హి.పు)పిండి,పిష్టము

آٹا گیلا ہونا ఆ-గీలాహోనా (హి)పిండి పలచనగుట,పనిచెడుట, చిక్కులోపడుట.

آٹھ ఆఠ్(హి)ఎనిమిది-

آٹھ آٹھ آنسو رونا ఆ- ఆఠ్ ఆఁసూ రోనా(హి) కన్నీరుమున్నీరుగా నేడ్చుట, శోకించుట,ముక్కలిపేడ్చుట.

آثار ఆసార్ [అ.పు] చిహ్నములు,జాడలు, లక్షణములు; వైఖరి, గుణములు; గోడపెడలుపు,(ఏవ-اثر). (ఏ-వ اثم)

آثام ఆసామ్(అ.పు)పాపములు,దోషములు,

آثم ఆసిమ్(అ)పాపి-నేరస్థుడు.

آج ఆజ్[హి]నేడు,ఈనాడు آجکل ఆజ్

కల్ [హి] ఈకాలములో, ఇంతలో, ఇటీవల, త్వరలో.

آچا ఆచా [పా.పు] తండ్రి, తాత, చిరకాలపు సేవకుడు లేక సేవకురాలు.

آچار ఆచార్ [పా.పు] ఊరగాయ, ఊరవేసిన పచ్చడికాయ, మాగాయ.

آخته ఆఖ్ త [పా] పిడికొట్టిన, కచ్చిచేసిన, వట్టలుగొట్టిన జంతువు.

آخر ఆఖిర్ [అ.పు] అంత్యము, అంతము, తుద, కడ, సమాప్తి, అవసానము, పర్యవసానము.

آخرالامر-آخرکار —ఆఖిరుల్ అమర్, (అ) —ఆ-కార్ [పా] ఎట్టకేలకు, ఎట్టకేని, సారాంశము, పర్యవసానము, ఫలితార్థము.

آخرشب —ఆ—షబ్ [పా] తెల్లవారుజాము.

آخرت ఆఖిరత్ [అ.స్త్రీ] పరము, పరలోకము, అంతము.

آخرش ఆఖిరష్ [పా] తదంతము, అంతము, ఎట్టకేలకు, తుదకు, పర్యవసానము, సారాంశము. ఫలితార్థము.

آخری ఆఖ్రీ [అ] కడపటి, తుది. అంత్యము.

آخری چہار شنبہ —ఆ—చహార్ షంబ [పా] సఫర్ నెలలోని కడపటిబుధవారము, హజరతు మహమ్మదు గారు జబ్బుపడి ఆరోగ్యమునొందినతరువాత విహారమునకు బయలుదేరిన దినము. దీనిని మహమ్మదీయులు పండుగదినముగా నెంచుదురు. ఈనాడు పచ్చికబయళ్లకు విహారముగా వెళ్లుటవిధిగా నెంతురు.

آخور ఆఖోర్ [పా. స్త్రీ] పసులకట్టుమట్టు, పెంటు, చెత్త, పనికిమాలినవి.

آخون-آخوند ఆఖూన్-ఆఖూంద్ (పా.పు) ఉపాధ్యాయుడు, పంతులు.

آد ఆద్ [హి] ఆది, మొదలు.

آداب ఆదాబ్ [అ.పు] మర్యాదలు, నాగరికత, సభ్యత, భయభక్తులు, వందనము, నమస్కారము, వర్తనము, వట్టములు, నియమలు, పద్ధతులు, నీతులు, తీరు, పద్ధతి.

آداب و القاب —ఆ-ఒ-అల్ కాబ్ [అ] జాబుకట్టులు, వక్కాణలు, జాబులయందు మొదట వ్రాయుపద్ధతి, నామబిరుదంబులు.

آدم ఆదమ్ [అ.పు] ఆదిపురుషుడు, మనువు-మనుజుడు, మనుష్యుడు. آدم خور —ఆ—ఖోర్ [పా] మానవాదనుడు, నరమాంసముదినువాడు.

آدمی ఆద్మీ [పా.పు] మానవుడు, మనుష్యుడు.

آدمیت ఆద్మియ్యత్ [అ.స్త్రీ] మానుషత్వము, మానవస్వభావము, మర్యాద, నాగరికత, సభ్యత.

آدھ ఆధ్ [హి] అర, సగము [వృత్త్యంతము మాత్రము] మాడు آ سమాసములును

آدھ موا —ఆ—మువా [హి] సగముచచ్చిన, చిన్నబోయిన, వాడిన. آدھ منا —ఆ—మనా [హి] అరమనసుగల, కొంకకొంకులాడు.

آدھا ఆధా (హి) అర, అర్ధ, సగము.

آدھا سیسی —ఆధాసీసీ (హి.స్త్రీ) ఒంటితలనొప్పి, ([illegible]

آدھار ఆధార్ (హి.పు) జీవనాధారము, ఆ[illegible]

آدھوں آدھ ఆధూంఆధ్ (హి) సట్టసగము, చెరిసగము.

آدھین ఆధీన్ (హి) స్వాధీనము, అధీనము.

آدینہ ఆదీన(హి.పు) శుక్రవారము.

آذر ఆజర్ (హి.పు) పార్సీకుల సౌరమాసము నతొమ్మిదవనెల పేరు, ఇదివక్కాణుల మొదటినెలగానున్నది; అగ్ని, నిప్పు.

آر ఆర్ (హి.స్త్రీ) తోదన, ములుగోల, తోలుకుట్టుఆరె, ముల్లు, ములికి, పుంజుముక్కు ఆరెకాళ్లు; బిడియము, సిగ్గు.

آرا ఆరా(హి.పు) అంపము,క్రకచము. (గామ.

آراکش —కష్ (ఉ.పు) అంపకోత

آراستگی ఆరాస్తగీ(పా.స్త్రీ) అలంకార ము,శృంగారింపు,సవరణ,ఏర్పాటు,వైనము, క్రమము,తీర్చుట,దిద్దుట,అమర్చుట.

آراستہ ఆరాస్త(పా) అలంకృతము, శృంగా రించిన,తీర్చిన,దిద్దిన,అమర్చిన.

اراضی ఆరాజీ (అ.స్త్రీ) భూములు,పొల ములు.(ఏ-వ ارض)

آرام ఆరామ్ (పా.పు) విశ్రాంతి,నెమ్మది, నిమ్మళము,సౌఖ్యము,ఆరోగ్యము,స్వస్థత, నిధి. آرام طلب ఆ—తలబ్ (పా) సౌఖ్య ప్రియుడు, సోమరి,ఆలసుడు.

آرامگاہ ఆ—గాహ్ (పా) శయనగృహము, పడకటిల్లు آرام والی —వాలీ(హి.స్త్రీ) భార్య. آرامدان ఆ—దాన్ (పా.పు) కూ చిత్రాకారముగల తాంబూలపేటిక.

آرامی ఆరామీ(పా.పు) సౌఖ్యప్రియు డు,సోమరి.

آرائی ఆరాయీ(పా.స్త్రీ) సింగారింపు, అలంకారము,కైసేత,అలంకరణము.

آرایش ఆరాయిష్ (పా.స్త్రీ) అలంకరణ ము,కైసేత,అలంకారము,సింగారింపు.

آرپار ఆర్‌పార్ (హి) ఈప్రక్కనుండిఆప్ర క్కకు,ఇటునుండిఅటుకు, ఒకవైపునుండి మఱియొకవైపునకు దూరిపోవునట్లు, దాటి పోవునట్లు, దాటి-దూరి

آرتا ఆర్తా [సం.పు] మంగళహారతి.

آرتی ఆర్తీ [హి.స్త్రీ] మంగళహారతి.

آرد ఆరద్ (పా.పు) పిష్టము,పిండి.

آرزو ఆర్జూ(పా.స్త్రీ) అపేక్ష, ఆశ, అభిలాష. آرزوبرانا ఆ—బరానా (ఉ) కోర్కె-ఈడేరుట-آرزومند ఆ—మంద్ (పా) అభిలాషి,కోరువాడు.

آرسی ఆర్సీ (హి.స్త్రీ) అద్దము,ఉంగర ములో వేసియుండు చిన్న అద్దము.

آرندہ ఆరింద (పా.పు)వాహకుడు, తెచ్చు వాడు,బంటు. (చూడు آرا

آرا-آرہ ఆర-ఆరా (హి.పు) అంపము

آری ఆరీ (ఉ.స్త్రీ) చేతిఅంపము, చిన్న అంపము,మాలవాని ఒక పనిముట్టు.

آریا-آریہ ఆర్యా (సం.పు) ఆర్యుడు,సం స్కృతభాష, శ్లోక భేదము.

آڑ ఆడ్ (హి.స్త్రీ) అడ్డు,ఆటంకము,అడ్డము —చాటు,రక్షణము,కాపు.

آڑا ఆడా (హి.పు) అడ్డముగానున్న, వంక రైన,ఏటవాలైన.

آڑاگوڑی ఆడాగోడీ (హి.స్త్రీ) ఒకరి కాళ్లలో కాలు ఇఱికించి పడద్రోయుట.

آڑی ఆడీ (హి.స్త్రీ)అడ్డము, సహాయము, ఆటయందు ఒకతట్టువారిలో పెద్ద గాక మిగిలినవాడు. (సహాయపడుట.

آڑے آنا ఆడే ఆనా (హి) అడ్డపడుట,

آڑے ہاتھوں لینا ఆడే హాథోఁ లేనా (హి) చివాట్లు పెట్టుట,ఉన్ననీచము లా గుట,తలవంపులుచేయుట.

آزاد ఆజాద్ (పా) స్వతంత్రమైన, స్వేచ్ఛ గల,అడ్డము అదపు లేని, మొగమోటము లేని,పోకిరి,సిగ్గిడి,సిగ్గుమాలిన, మానావమా నములులేని,సన్యాసి,విరాగి.

آزادانہ ఆజాదాన (పా) స్వేచ్ఛాపూ ర్వకమైన,నిర్దాక్షిణ్యమైన, మొగమోటము

**آسن** ఆసన్ (హి.పు) ఆసనము, చిత్రాసనము. పీఠము.

**آسنی** ఆసనీ (హి.స్త్రీ) ఆసనము, చిత్రాసనము.

**آسودگی** ఆసూదగీ (పా.స్త్రీ) స్వస్థత, సుఖము, భోగము, భాగ్యముసంపన్నత.

**آسودہ** ఆసూద (పా) స్వస్థతగల, సౌఖ్యముగల, భోగభాగ్యములుగల, మంచిస్థితిలోనున్న. **آسودگانِ خاک** ఆసూదగానెఖాక్ (పా.పు) చచ్చినవారు, సమాధిస్థులు. (ఊాయి.

**آسیا** ఆసియా (పా.స్త్రీ) తిఱుగలి, విసురు

**آسیانہ** ఆసియాన (పా.పు) కత్తులుపగును పెట్టుసానఱాయి.

**آسیب** ఆసేబ్ (పా.పు) సంకటము, గ్రహబాధ. **آسیب زدہ** ఆసేబ్ జద (పా) గ్రహబాధగల, దయ్యముపట్టినవాడు.

**آسیب سر پر کھیلنا** ఆసేబ్ సర్ పర్ ఖేల్నా (ఉ) గ్రహమువూనుట-భూతాదుల చేతఆవేశమువచ్చుట.

**آسیبی** ఆసేబీ (పా.పు) గ్రహబాధగల వాడు.

**آسیرباد** ఆసీర్బాద్ (హి.పు) ఆశీర్వాదము.

**آش** ఆష్ (హి.స్త్రీ) గంజి, పలచనియాహారము, చోష్యము. **آش پکانا** ఆష్‌పకానా (ఉ) ఆలోచనజేయుట, కుట్రపన్నుట, మెత్తగాకొట్టుట.

**آشام** ఆషామ్ (పా) పలచనిగంజి, పానము.

**آشتی** ఆష్తీ (పా.స్త్రీ) అనుకూల్యము, సమాధానము, స్నేహము, ప్రేమ, సఖ్యత, చెలిమి.

**آشفتگی** ఆషుఫ్తగీ (పా.స్త్రీ) విభ్రమము, కలవరము, వ్యాకులత, మోహము, పిచ్చి, ఉన్మాదము, మనోవ్యాకులము, దుఃఖము, మనోవైకల్యము గిమ్మరిసేనను, చాంచల్యము.

**آشفتہ** ఆషుఫ్త (హి) మోహితుడైన, మనోవ్యాకులతగల, మనోవైకల్యముగల, కలవరపడిన, భ్రమజెందిన, పిచ్చి.

**آشکار-آشکارا** ఆష్‌కార్ — ఆష్‌కారా (పా) ప్రత్యక్షమైన, విస్పష్టమైన, తెలిసిన, ప్రచురమైన, వెల్లడియైన, బయలైన.

**آشنا** ఆష్నా (పా.పు) స్నేహితుడు, చెలికాడు, మిత్రము, సహవాసి, ప్రియుడు, మిండడు, ముఖపరిచయముగల, ఎఱిగిన, మచ్చికపడిన, మాలిమియైన, (స్త్రీ) ప్రియురాలు, లంజె.

**حرف آشنا** హర్ఫ్ ఆష్నా (పా) ఆరంభకుడు, అక్షరాభ్యాసకుడు.

**صورت آشنا** సూరత్ ఆష్నా (పా) ముఖపరిచయస్థుడు.

**آشنائی** ఆష్నాయీ (పా.స్త్రీ) స్నేహము, పరిచయము, సహవాసము, రంకుసంబంధము, మోహము.

**آشوب** ఆషోబ్ (పా.పు) గొల్లు, కల్లోలము, అల్లరి, కలత, వ్యాకులము, కష్టము, దురదృష్టము, చిక్కు, అగచాట్లు, జగడము, నింద; మోసగాడు, టక్కరి; కండ్లఎరుపు, కండ్లకలక, కండ్లనొప్పి.

**آشیاں-آشیانہ** ఆషియాఁ — ఆషియాన (పా.పు) పక్షిగూడు, ఇంటికప్పు.

**آصف** ఆసిఫ్ (ఇబ్-పు) హజరత్ సులేమాన్ యొక్క మంత్రిపేరు, ప్రజ్ఞావంతుడగు మంత్రి, (బిరుదనామము)

**آصف جاہ** ఆసిఫ్ — జాహ్ (పా.పు) మొగలాయి చక్రవర్తులనాటిప్రభువులకును మంత్రులకును బిరుదనామము, ఇప్పటికిని, హైద్రాబాదు నిజాముప్రభువుగారికి, పరంపరాగతమైనబిరుదనామముగానున్నది.

**آصفیہ** ఆసిఫియ్య (అ.స్త్రీ) ఆసిఫ్ సంII,

నిజాం ప్రభుత్వగారికిసంII سلطنت آصفیہ.
సల్తనత్ ఆసిఫియ (అ.స్త్రీ.) నిజాము రాజ్యము (ప్రభుత్వము), హైదరాబాదురాజ్యము (దక్కను).

آغا ఆగా (తు.పు) స్వామి, యజమాని, నాయకుడు. కాబూలు వారి గౌరవనామము.

آغا مینا ఆగామైనా (ఉ) మాటలు నేర్చిన గోరువంక. (చిరునామ.

آغاز ఆగాజ్ (పా.పు) ప్రారంభము, శీర్షిక,

آغشتہ ఆగిష్త (పా.) తడిసిన, నానిన, అస్వచ్ఛమైన, కలపడము గల. (కౌగిలి.

آغوش ఆగోష్ (పా.స్త్రీ) ఆలింగనము,

آفات ఆఫాత్ (అ.స్త్రీ) ఆపదలు,

آفات سماوی-آسمانی —ఎ-సమావీ, ఆస్మానీ (అ) అధిదైవిక తాపములు, దైవికముగా వచ్చు కష్టములు.

آفات عرضی ఆఫాతెఅర్జీ (అ) అధిభౌతిక తాపములు. (ఏ-వ-آفت)

آفاق ఆఫాక్ [అ-పు] దిఙ్మండలము, లోకాలోకము, ప్రపంచము, సంసారము (ఏ-వ-افق).

آفت ఆఫత్ (అ.స్త్రీ) ఆపద, విపత్తు, బాధ-పీడ, కష్టము, దుఃఖము, జగడము, ప్రళయము, సంకటము, దుర్మార్గుడు, అల్లరి.

آفت جان ఆఫతెజాన్ (పా) ప్రాణకంటకము, ప్రాణసంకటము.

آفت رسیدہ-زدہ-کا مارا ఆఫత్ రసీద-జద-కామారా (పా) ఆపన్నుడు, దౌర్భాగ్యుడు, కష్టములోనున్నవాడు.

آفتاب ఆఫ్తాబ్ (అ.పు) సూర్యుడు, ఎండ. آفتاب ڈھلنا ఆఫ్తాబ్-ఢల్నా (ఉ) ప్రొద్దువాలుట, آفتاب گیر آفتاب—గీర్ (పా) ఎండచాటు, గొడుగు.

آفتابہ ఆఫ్తాబ (పా.పు) కొమ్ముచెంబు, మూతగలచెంబు.

آفریدگار ఆఫరీద్గార్ (పా.పు) సృష్టికర్త —పుట్టించినవాడు.

آفرین ఆఫ్రీన్ (పా.స్త్రీ) ప్రశంస, పొగడుట, ప్రశంసనార్థకము, భళి, బాగు, మేలు.

آفرینش ఆఫ్రీనిష్ (పా.స్త్రీ) సృష్టి, పుట్టించుట, ప్రపంచము (అధికారి.

آقا ఆకా (పా.పు) యజమాని, స్వామి, పెద్ద,

آک ఆక్ (హి.పు) అర్కవృక్షము, జిల్లేడు.

آکاس ఆకాస్ (హి.పు) ఆకాశము,

آکاس دیا آکاس—దియా (హి) ఆకాశదీపము

آکاس بیل آکاس—బేల్ (హి) ఒకబదనిక.

آگ ఆగ్ (హి.స్త్రీ) నిప్పు, జ్వాల, మంట, ఉష్ణము, తీక్ష్ణము, తాపము, ఉద్రేకము, కోపము, ఆకలి, ప్రేమ, మోహము, వైరము, మత్సరము, అసూయ, కాంతి, ప్రకాశము,

آگ برسنا آگ—బరస్నా (హి) నిప్పులు గురియుట, మిక్కిలి తీక్ష్ణమైన ఎండగాయుట, ధరలుమిక్కిలి ప్రియమగుట,

آگ بگولا-کا پتلا آگ —బగోలా, కాపుత్లా (హి) నిప్పుతునక, తీక్ష్ణస్వభావముగలవాడు

آگ بوت آگ—బోట్ (హి) పొగయోడ.

آگا ఆగా (హి.పు) ముందు, ఎదుటిభాగము, ఎదురు, ముఖము, సముఖము, ముంగిలి, అంగణము, భవిష్యత్తు, రాబోవుపది, అంగీయొక్క-ముందు భాగము, ఫలము, ఫలితము,

آگا پیچھا آگا—పీఛా (హి.పు) ముందు వెనుకలు వెనుకముందు, సందేహము, సంకోచము,

آگا بھاری ہونا آگا (హి) కడుపుతో నుండుట.

آگاہ ఆగాహ్ (పా) ఎరిగిన, తెలిసిన, జాగ్రతగల, పండితుడు, తెలిసినవాడు آگاہ کرنا —కర్నా (క్రి) తెలియజేయుట, జాగ్రత పఱచుట, సూచించుట.

آگاہی ఆగాహీ (పా.స్త్రీ) ఎఱుక, పరిచయము, జాగ్రత్త, వర్తమానము, జ్ఞానము.

آگے ఆగే (హి) ముందర, ఎదుట, సమక్షము ముందు, ఇక-ముందు, పూర్వము.

آگیا ఆగ్యా (హి.స్త్రీ) ఆజ్ఞ, శాసనము.

آل ఆల్ (హి.స్త్రీ) ఇంటిపేరు, ఉపనామము, వంశము, గోత్రము, ఉల్లిగడ్డ లేకఆకు

آل ఆల్ (అ.స్త్రీ) సంతానము, కుటుంబము, వంశము, గోత్రము, آل واولاد آل—ఒ-ఔలాద్ (అ.స్త్రీ) సంతానము, వంశము వారు.

آل ఆల్ (తు) ఎఱ్ఱని, రక్తవర్ణముగల.

آلتمغا ఆల్‌తమ్‌గా (పా.పు) రాజశాసనము, రాజముద్రిక, దానశాసనము, శాశ్వతాగ్రహారము.

آلا ఆలా (హి) తడిదైన, చెమ్మగల, పచ్చి, పచ్చిగల, వీపుపు గూడు, పుండు, తెగనికథ, آلا بالا آلا—బాలా (హి.పు) ఛలము, కుయుక్తి, మోసము, సోమరితనము, కాలయాపనము, ఇదిగో అదిగో అని జరపుట.

آلاپ ఆలాప్ (హి.పు) సంభాషణ, ప్రసంగము, రాగాలాపనము.

آلاگانا ఆలాగానా (హి) వంశమునువర్ణించుట, స్తోత్రము, తనగోడుచెప్పికొనుట.

آلات ఆలాత్ (అ.పు) ఆయుధములు, పనిముట్లు, ఉపకరణములు (ఏ-వ آلہ)

آلاراسی ఆలారాసీ (హి) నిర్లక్ష్యముగల, అజాగరూకుడు, సోమరి.

آلام ఆలామ్ (అ) దుఃఖములు, కష్టములు, (ఏ-వ اَلَم.)

آلان ఆలాన్ (హి.స్త్రీ) ఏనుగనుగట్టివేయు గొలుసు. చూడు الان

آلائش ఆలాయిష్ (పా.స్త్రీ) మైల, మురికి, మష్టు, చెత్త, అపవిత్రము-ప్రేవులు.

آلت ఆలత్ (అ.పు) పనిముట్టు, శిశ్నము

آلتی پالتی ఆల్తీపాల్తీ (హి) పద్మాసనము, చకిలముకిలము. (టకు వేయుపిండి.

آلن ఆలన్ (హి) పులుసు మొ॥ చిక్కబడు

آلنگ ఆలంగ్ (హి.స్త్రీ) అగడ్తలు-కోట పట్టువారు అగడ్తలుత్రవ్వివేసిన అడ్డకట్ట.

آلو ఆలూ (హి.పు) ఉర్లగడ్డ, బంగాళాదుంప.

آلوبخارا ఆలూబొఖారా—బొఖారా (దేశమునుండివచ్చు) రేగుపండ్లవంటిగు

آلودگی ఆలూద్గీ (పా.స్త్రీ) అపవిత్రత, అపరిశుద్ధత, అమేధ్యత, మురికి, చిక్కు, పాపము -పూయబడుట.

آلوده ఆలూద (పా) ఆక్రాంతమైన, లిప్తమైన, అపవిత్రమైన, మురికిదైన, మలినమైన, పూయబడిన, చిక్కులోబడిన, పాపముగల. [ధము.

آلہ ఆల(అ.పు) పనిముట్టు, ఉపకరణము, ఆయు

آلہ تناسل ఆలె-తనాసుల్ (అ) జననేంద్రియము, శిశ్నము. (తడిగల.

آلی ఆలీ (హి.స్త్రీ) పడుచు, చెలికత్తె; పచ్చి,

آم ఆమ్ (హి.పు) మామిడిపండు, ఆమ్రము.

آمادگی ఆమాద్గీ (పా.స్త్రీ) ఆయత్తత, ఉద్యుక్తత, ఇచ్ఛ, ఇష్టము, అంగీకారము, సిద్ధముగానుండుట, ఉన్ముఖత.

آماده ఆమాద (పా) సిద్ధమైన, ఉద్యుక్తమైన, సన్నిద్ధమైన, ఉన్ముఖము.

آماس ఆమాస్ (పా.పు) ఉబ్బు, వాపు.

آمد ఆమద్ (పా.స్త్రీ) ఆగమనము, రాక, ఆదాయము, రాబడి, లాభము, ప్రాప్తి, ముట్టు

కు నెల. آمد و رفت — آمد و شد — ఆమద్-ఒ-రఫ్త్-ఒషుద్ (పా) రాకపోకలు.

آمد و خرچ ఆమద్-ఒ-ఖర్చ్ (పా) ఆదాయ వ్యయములు, آمد آمد ఆమద్ (పా) ఆగమనము, ఆగమనవార్త, నిరీక్షణము.

آمدنی ఆమ్‌దనీ (పా.స్త్రీ) ఆదాయము, ప్రాప్తి, లాభము, వచ్చుబడి, రాక, దిగుమతి

آمرز ఆముర్‌జ్ (పా.పు) క్షమాపణ, మన్నించుట.

آمرزش ఆముర్‌జిష్ (పా.స్త్రీ) క్షమాపణ అనుగ్రహము, మన్నింపు.

آملہ ఆమ్లా (హి.పు) ఉసిరికకాయ.

آمنا سامنا ఆమ్నాసామ్నా (హి.పు) ముఖాముఖి, ఎట్టఎదురు, ప్రత్యక్షము, భేటి, ఎదురెదురు.

آموختہ ఆమోఖ్‌త (పా) చదివిన, విద్యావంతుడైన, పండితుడైన, ప్రాతపాఠము.

آمیختہ ఆమెఖ్‌త (పా) మిశ్రితము, కలపిన.

آمیزش ఆమేజిష్ (పా.స్త్రీ) మిశ్రణము కలుపుట, సంకరము.

آمین ఆమీన్ (అ) తథాస్తు, అట్లేయగుగాక.

آن ఆన్ (హి.స్త్రీ) ఆనతి, ఆజ్ఞ, శాసనము, ఆన, ఒట్టు.

آن ఆన్ (పా.స్త్రీ) కాలము, వేళ, క్షణము, آن کی آن میں ఆన్ కిఆన్ మే, (ఉ) తత్క్షణమే, వెంటనే.

آن ఆన్ (పా. స్త్రీ) బిడియము, సిగ్గు, హాయలు, కులుకు, వైఖరి, తీవి, రీతి, తెరగు, అందము, రూపు, రేఖ, విలాసము, చందము; నీటు, గర్వము, గౌరవము; నిషేధము.

آن بان ఆన్—బాన్ [ఉ] వైఖరులు, తీవి, ఆడంబరము; వైభవము.

آن مان ఆన్-మాన్ [ఉ] ఆదరసత్కారము, మర్యాదమన్ననలు.

آنا ఆనా (హి) వచ్చుట, ఆగమనము, ప్రాప్తమగుట, సాధ్యమగుట, సంభవించుట, రాక, జ్ఞప్తియగుట, పాఠమగుట, పట్టుట, ఇముడుట, పొసగుట, జరగుట, అగుట, [పు] అణా-వీసము, పదునారవపాలు

آناً فاناً ఆనన్‌ఫానన్ (అ) అప్పటికప్పుడే, తక్షణమే, ఆకస్మికముగా, అకాత్తుగా

آناکانی ఆనాకానీ [హి.స్త్రీ] ఉపేక్ష, అలక్ష్యము.

آنت ఆంత్ (హి.స్త్రీ) అంత్రము, ప్రేవు.

آنت-آنٹ ఆంత్,ట్ (హి.స్త్రీ) గ్రంథి, ముడి, మడత, ముడత, వైరము, కుట్ర; ఒగ, పరీక్ష; అసూయ, ఒగకాటు.

آنچ ఆంచ్ (హి.స్త్రీ) నిప్పు, జ్వాల, ప్రకాశము, ఉద్రేకము, ఔత్సుక్యము, కామము.

آندھی ఆంధీ (హి.స్త్రీ) జడిగాడ్పు, గాలిదుమారము, సుడిగాలి, గాలివాన.

آنڈ ఆండ్ (హి.పు) అండము, గుడ్డు, వృషణము, బీజము.

آنڈو ఆండూ (హి.పు) పిడికొట్టనిది, కోడె, ఆబోతు, అండవృద్ధిగలవాడు.

آنسو ఆంసూ (హి.పు) అశ్రువులు, కన్నీరు

آنسو پونچھنا آنسو— పోంఛ్నా (హి) కన్నీరుతుడుచుట, ధైర్యముచెప్పుట.

آنک ఆంక్ (హి.పు) అంకము, అంకె, అక్షరము, సంఖ్య, లెక్క, సద్దు, చిహ్నము, గురుతు అంచన, ఉజ్జ.

آنکس ఆంకుస్ (హి.పు) అంకుశము.

آنکنا ఆంక్నా (హి) చూడు, انکنا

آنکو ఆంకూ (హి.స్త్రీ) అంచనవేయువాడు, మతించువాడు.

**آنکھ** అంఖ్ (హి.స్త్రీ) అక్షి, కన్ను, దృష్టి, చూపు, వివేకము, జ్ఞానము, తెలివి, తారతమ్య జ్ఞానము, **آنکھ آنا** — ఆనా (హి) కండ్లు కలంగుట, కండ్లువచ్చుట.

**آنکھ اٹکنا-الجھنا** — అటకా్న, ఉలఝ్నా (హి) కన్ను భ్రమయుట, మోహించుట, కన్ను చెదరుట,

**آنکھ اونچی نہ ہونا** — ఊంచీనహోనా (హి) సిగ్గుచే తేరిచూడకుండుట, తలవంచుకొనియుండుట, **آنکھ بنوانا** — బన్వానా (హి) కంటిపొరలు తీయించుట, నేత్రచికిత్స చేయించుట, **آنکھ پھرنا** ఫిర్నా (హి) విసుకుట, రోయుట,

**آنکھ چرانا** — చురానా (హి) సిగ్గుపడుట, బిడియపడుట, తప్పించుకొనుట, చూడక పోవుట, **آنکھ دکھانا** — దిఖానా (హి) ఉరిమిచూచుట, గద్దించుట, కనుసైగ చేయుట, **آنکھ سے گرنا-اترنا** — సే గిర్నా — ఉతర్నా (హి) అనుగ్రహము తప్పుట, మర్యాదచెడుట,

**آنکھ کی پتلی-کا تارا** — కీపుత్లీ-కాతారా [హి] కంటిపాప, మిగుల ప్రియమైనది; **آنکھوں پر بٹھانا** — అంఖోం పర్ బిఠానా [హి] కండ్లకద్దుకొనుట, కండ్లగప్పుకొనుట, ప్రేమించుట, ఆదరించుట, గౌరవించుట. (అవయవము.

**آنگ** ఆంగ్ [హి.పు] అంగము, దేహము, కీలు.

**آنگا** ఆంగా [హి.పు] అంగకము, అంగరేకు, అంగీ, చొక్కాయి. చూడు **انگرکھا**

**آنند** ఆనంద్ (స.పు) ఆనందము.

**آنو** ఆంవ్ [హి.స్త్రీ] ఆమము.

**آنولا-آنولہ** ఆంవ్లా [హి.పు] ఆమలకము.

**آنہ** ఆన [హి.పు] అణా, వీసము.

**آوا** ఆవా [హి.పు] కుమ్మరఆవము.

**آواجانی-ئی** ఆవాజానీ-యీ [హి.స్త్రీ] నిరర్థకమైన రాకపోకలు.

**آوارجہ** ఆవార్జా [పా.పు] దినచర్యలెక్క, దినచర్య, దినచర్యపుస్తకము.

**آوارگی** ఆవార్‌గీ (పా.స్త్రీ) దిమ్మరితనము, పనికిమాలినతనము, పోకిరితనము.

**آوارہ** ఆవార (పా) దిమ్మరియైన, పనికిమాలిన, దుర్మార్గుడైన, పోకిరియైన.

**آواز** ఆవాజ్ (పా.స్త్రీ) ధ్వని, చప్పుడు, ఎలుగు, అల్లరి, స్వరము

**آواز بھاری ہونا-بیٹھنا-بھرانا** — భారీహోనా-బైఠ్నా-భర్రానా (హి) గొంతు రాయుట, బొంగురుపోవుట, కమ్ముకొనుట.

**آواز دینا** — దేనా (హి) పిలుచుట, కేకవేయుట, మ్రోయుట, చప్పుడగుట.

**آوازہ** ఆవాజ (పా.పు) అల్లరి, చప్పుడు, వదంతి, వార్త; పేరు, ప్రఖ్యాతి; దెప్పు, నింద, దూఱు, **آوازہ کسنا** — కస్నా (ఉ) నిందమోపుట, దెప్పుట. ఎత్తిపొడుచుట, దూఱుచుట. **آوازہ توازہ** — తవాజ (ఉ) దెప్పులు, ఎత్తిపొడుపులు.

**آواگون** ఆవాగవన్ (హి.పు) గమనాగమనము, జన్మపరంపర, సంసారచక్రము. పునర్జన్మము.

**آوائی** ఆవాయీ (హి.స్త్రీ) ఆగమనవార్త, వార్త, రాక, వచ్చుట, వదంతి, కింవదంతి.

**آو بھگت** ఆవ్‌భగత్ (హి.స్త్రీ) మర్యాదమన్ననలు, ఆదరసత్కారములు.

**آوردہ** ఆవుర్ద (పా) ఆనీతము, తెచ్చినది.

**آویز کرنا | آویزاں کرنا** ఆవేజ్ కర్నా, ఆవేజాఁకర్నా (ఉ) వ్రేలాడ్చుట, వ్రేలాడకట్టుట, తగిలించుట.

**آویزہ** ఆవేజ(పా.పు) ఆందోళనము, లోలకము, లోలకము, ఒకకర్ణభూషణము, వ్రేలునది.

**آہ** ఆహ్ (పా.స్త్రీ) దీర్ఘనిశ్వాసము. నిట్టూర్పు, ఆహా! అయ్యో!!.

**آہ کرنا-مارنا-بھرنا** ఆ—కర్నా-మార్నా-భర్నా (ఉ) నిట్టూర్పు విడుచుట, వేదనపడుట. **آہ پڑنا** ఆ—పడ్నా (ఉ) ఉసురుకొట్టుట. **آہ و بکا-زاری-فغاں** ఆ—ఒబుకా-జారీ-ఫొగాఁ (పా.స్త్రీ) అతిశోకము, కుయ్యో మొఱ్ఱో యనియేడ్చుట, లబలబలు, ఏడ్పులార్పులు.

**آہا** ఆహా (హి) ఆహా!

**آہٹ** ఆహట్ (హి.స్త్రీ) ధ్వని, చప్పుడు.

**آہرا** ఆహరా(హి.పు) పిడుకలుగాని కట్టెలుగాని పేర్చికాల్చుట, దాలి, సెగడి.

**آہرن** ఆహరన్ (హి.పు) పట్టెడ, దాకలి.

**آہستگی** ఆహిస్తగీ(పా.స్త్రీ) శాంతత, నెమ్మది, నిమ్మళము, మెల్లన, సావకాశము.

**آہستہ** ఆహిస్త(పా) నెమ్మదిగాల, నిమ్మళమైన, తిన్నగా, సావకాశముగా.

**آہک** ఆహక్ (పా.పు) సున్నము, గార.

**آہک پاشی** ఆ—పాషీ(పా.స్త్రీ) సున్నము వేయుట, వెల్లవేయుట.

**آہن** ఆహన్ (పా.పు) అయస్సు, ఇనుము.

**آہن ربا** ఆ—రుబా (పా) అయస్కాంతము, సూదంటురాయి. **آہنگر** ఆ—ఆహన్ గర్ (పా) కమ్మరివాడు.

**آہنگ** ఆహంగ్ (పా.పు) అభిప్రాయము, అర్థము, సారాంశము, రీతి, తెఱగు, సుతి, ధ్వని, స్వరమేళనము. (చేసిన.

**آہنی** ఆహనీ (పా) ఇనుప, ఇనుముతో

**آہو** ఆహూ [పా.పు] లేడి, జింక, దోషము, తప్పు, లోపము, **آہو چشم** ఆ—చష్మ్ [పా] మృగాక్షి, లేడికన్నులుగలది.

**آیا** ఆయా [పా] అథవా, బహుశః

**آیا** ఆయా (హి.స్త్రీ) దాసి, పనికత్తె, దాది.

**آیات** ఆయాత్ [అ స్త్రీ] బహు ఏ.వ **آیت**.

**آیا گیا** ఆయాగయా (హి.పు) వచ్చినవాడు, పోయినవాడు, అగదేశిపరదేశి, అతిథి అభ్యాగతి, పరిష్కారము, తీరుమానము.

**آیت** ఆయత్ (అ.స్త్రీ) సగ్న్యచిహ్నము, కుండలి, పూర్ణవిరామము, అనువాకము, ఋక్కు.

**آئے دن** ఆయేదిన్ (హి) ప్రతిదినము, సర్వదా, తేపతేపకు, మాటిమాటికి.

**آئین** ఆయీన్ (పా.పు) శాస్త్రము, శాసనము, స్మృతి, చట్టము, సాంప్రదాయము.

**آئینتی پائینتی** ఆయెంతీపాయెంతీ (హి) తలాడ కాళ్ళగడలు, ఇటునటు—చుట్టుప్రక్కలు.

**آئندہ** ఆయింద (పా) భవిష్యత్తు, రాబోవునది, ఇంక, ఇకమీద, ముందు.

**آئینہ-آئنہ** ఆయిన-ఆయీన (హి.పు) అద్దము, దర్పణము.

## ( ب )

**ب** బె (అ.స్త్రీ) ఇది ఉరుదూ వర్ణమాలలో రెండవయక్షరము. హిందీభాషలో ఇరువది మూడవది, అబ్జదు వర్ణసాంఖ్యము నరెండు అనుసంఖ్యాకసంజ్ఞ.

بـ బ(పా)అరబ్బీ,పారసీకపదములలోసహార్థ్యకయుపసర్గము. ఇది సహా,అందు, కూడ, తో,వలన,కొఱకు,కై,చేత,కు,కి,అనునర్థములనిచ్చును. بجاے బ-జాయ్ (పా)స్థానే, మాఱుగా.

با బా(పా)సహార్థబోధకయుపసర్గము, సహా కూడ,యుక్తము, కలసి మొ॥ అర్థములనిచ్చును. باثر బా-అసర్ (పా)గుణకారియైన,సార్థకమైన,మర్యాదగల, పలుకుబడిగల. باایمان బా-ఈమాన్(పా)దైవభక్తిగల, ధర్మనిష్ఠగల,విశ్వాసముగల,నీతిపరుడు,న్యాయవంతుడు. باآنکہ బా-ఆంకె(పా) అయినను, అయినప్పటికిని. باتدبیر బా-తద్బీర్ (పా) సమీక్ష్యకారియైన, వివేకియైన, ఉపాయశాలియైన, ఆలోచన పరుడైన, యుక్తిమంతుడైన. باحیا బా-హయా (పా) సిగ్గుగల, బిడియముగల, మానముగల.

باخبر బా-ఖబర్(పా) తెలిసిన, ఎఱుకగల, జ్ఞానముగల. باضابطہ قاعدہ బా-జాబిత-కాయిద(పా)సక్రమమైన,సశాస్త్రమైన. بامزا బా-మజా(పా)రుచిగల. باوجود బా-వజూద్ (పా)ఉన్నప్పటికిని, అయినప్పటికిని, అయినను. باوصف బా-వస్ఫ్ (పా) గుణయుక్తమైన, అయినప్పటికిని. باوضع బా-వజఅ(పా)పొంకమైన, అందమైన, నాగరికము,అందగాడు. باوفا బా-వఫా (పా) కృతజ్ఞతగల, విశ్వాసముగల.

باب బాబ్(అ.పు)ద్వారము, కవాటము, అధ్యాయము,భాగము,హంశము, విషయము-ఆస్థానము, తెరగు,రీతి, విధము, మార్గము, పరికరణము.

بابا బాబా(హి.పు) తండ్రి, తాత, స్వామి, అయ్యా,బైరాగి(ఇం)అబ్బాయి.

بابت బాబత్(అ.స్త్రీ) విషయము, హంశము,కారణము,కొఱకు.కై-కూలి, వేతనము,ప్రతిఫలము,లెక్క.

بابر బాబర్(హి.స్త్రీ) ఎంటిపేనుటకు ఉపయోగించెడుఒకవిధమైనగడ్డి.

بابل బాబల్(హి.పు)తండ్రి.

بابن బాబన్ (ఇం)నూలుగోటు,పట్టె,(సిపాయిల భుజాలపైవేయునది).

بابو బాబూ(హి.పు) వం॰ దేశస్థులగౌరవనామము, స్వామి, దొర, అయ్యా, పంతులు, అబ్బాయి.

بابونہ బాబూన(పా.పు)లతావిశేషము.

باپ బాప్(హి.పు)తండ్రి-పెద్దలు).

باپ دادا బాప్-దాదా (హి) తండ్రితాతలు.

باپ رے బాప్-రే (హి) బాపురే,అబ్బబ్బా!

باپ مارے کا بیر బాప్-మారేకాబైర్ (హి) తండ్రితాతలనాటివైరము.దీర్ఘకలహము.

باپھ బాఫ్(హి.స్త్రీ)ఆవిరి,పొగ.

بات బాత్ (హి.స్త్రీ) శబ్దము, మాట, వాక్కు,వచనము,సామితె,సంభాషణ,ప్రసంగము,ప్రస్తావము. వదంతి.వార్త,వర్తమానము.వైనము,దోషము, అపరాధము, నింద, విషయము,హంశము, నేర్పు,ప్రవీణత, విశేషము, అభిప్రాయము, ఉపాయము-సమయము-గుట్టు,రహస్యముఫలము-ఆక్షేపము-తప్పు,కారణము, వాంఛ, ఇచ్ఛ, వాగ్దానము,అధికారము,మర్యాద,గౌరవము-ఆలోచన,బుద్ధి,గుణము,టొంపు,నెపము,రీతి, తెరగు, వైఖరి, మార్గము,స్థితి,గతి, ఇంగితము, మూలము, సంబంధము, సారాంశము.

بات اٹھانا బాత్-ఉఠానా (హి) మాటసహించుట. بات بات میں బాత్-బాత్మేఁ (హి) మాటమాటకు- ప్రతివిషయమునకు ముందు. بات بدلنا پلٹنا బాత్-బదల్నా-

పలట్నా (హి) ఆడితప్పుట-మాటతప్పుట.

**بات بنانا-گھڑنا** -బాత్ బనానా- ఘడ్నా (హి) మాటలుపుట్టించుట, లేకకల్పించుట. అబద్ధము చెప్పుట-నెపములు కల్పించుట.

**بات پانا** -బాత్-పానా (హి) మూలముకనుగొనుట, ఆకళింపుచేసికొనుట.

**بات پھوٹنا** -బాత్-ఫూట్నా (హి) గుట్టుబయలుపడుట, మాట పొక్కుట.

**بات ٹالنا** -బాత్-టాల్నా (హి) మాటదాటించుట, ఉపేక్షచేయుట, ఆలస్యము చేయుట.

**بات چیت** -బాత్-చీత్ (హి) మాట ముచ్చటలు, ప్రసంగము.

**بات دینی آنا** -బాత్-దేనీఆనా (హి) ఉత్తరవాదియగుట, పూచిపడుట, మాటయిచ్చియుండుట.

**بات رکھنا** -బాత్-రఖ్నా (హి) మాటనిలుపుట, మాటరక్షించుట.

**بات کرنا** -బాత్-కర్నా (హి) మాటలాడుట.

**بات کرسی نشین ہونا** -బాత్-కుర్సీనిషీఁహోనా (హి) మాటపొసగియుండుట.

**بات نہ پوچھنا** -బాత్-నపూఛ్నా (హి) లక్ష్యపెట్టకపోవుట.

**باتوں میں آنا** —బాతోఁమేఁఆనా (హి) మాటలకులోబడుట, మాటలచేమోసపోవుట.

**باتوں میں لگانا** —బాతూఁమేఁలగానా (హి) మాటలు పెట్టుట.

**باتیں پھینکنا-چھانٹنا** -బాతేఁఫేఁక్నా-ఛాఁట్నా (హి) చెప్పుట, ఎత్తిపొడుచుట.

**باتیں پکڑانا-سنانا** -బాతేఁపక్డానా, సునానా (హి) మాటలు పెట్టుట. చీవాట్లు పెట్టుట.

**باتونی-نیا** బాతూనీ-నియా (హి.పు) మాటలమారి, వదురుబోతు.

**باتی** బాతీ (హి.స్త్రీ) వత్తి, దీపపువత్తి, దశ.

**باٹ** బాట్ (హి.పు) ఎత్తు, తూనికరాయి (స్త్రీ) బాట, త్రోవ.

**باٹی** బాటీ (హి.స్త్రీ) నిప్పులమీదకాల్చిన (రొట్టెబిళ్లలు.

**باج** బాజ్ (పా.పు) కప్పము, పన్ను, సుంకము.

**باجدار** -బాజ్-దార్ (పా) సుంకరి, పన్నురాబట్టువాడు.

**باجگزار** — బాజ్ గుజార్ (పా) అరికాపు, పన్నుచెల్లించువాడు, లోబడిన.

**باجا-باجہ** బాజా (హి.పు) వాద్యము, మేళము.

**باجا گاجا** -బాజా-గాజా (హి.పు) గీతవాద్యాదులు, సంతోషసామగ్రి.

**باجرا** బాజ్రా (హి.పు) సజ్జలు (ధాన్యము).

**باجنا** బాజ్నా (హి) మోగుట, మ్రోగుట, వాయించుట, ప్రచురమగుట.

**باجنتری** బాజంత్రీ (హి.స్త్రీ) భజంత్రీలు, మేళము, మేళగాండ్రు; మహమ్మదీయుల పరిపాలనలో భజంత్రీలవద్దతీసికొనుచుండెడి పన్ను. (మ్మాయి.

**باجی** బాజీ (తు.స్త్రీ) అప్ప, అక్క, అ

**باچھ** బాఛ్ (హి.స్త్రీ) సెలవి, పెదవిమూల.

**باچھیں کھلنا** బాఛేఁఖిల్నా (హి) నవ్వువచ్చుట, నవ్వుట, సంతసించుట, పకపకనవ్వుట, సంతోషము.

**باخہ** బాఖా (పా.పు) తాబేలు.

**باد** బాద్ (పా.స్త్రీ) వాయువు. గాలి.

**بادپا-پاے-رفتار-پیما** —బాద్-పా-పాయ్-రఫ్తార్-పైమా (పా) వాయువేగముగలది, మిక్కిలి వేగముగా పోవునది గుఱ్ఱము మొ॥

**بادصبا** —ఎ-సబా (పా.స్త్రీ) మందమారుతము, తెమ్మెర.

**بادمخالف** —ఎ-ముఖాలిఫ్ (పా.స్త్రీ) ఎదురుగాలి, ప్రతికూలవాయువు.

**بادموافق** —ఎ-మువాఫిక్ (పా.స్త్రీ) తోడుగాలి, అనుకూలవాయువు.

**باد** బాద్(హి.పు)వాదము,సుంకము,పన్ను.

**بادام** బాదామ్(పా పు)బాదాముకాయ.

**بادامہ** బాదామ(పా.పు) ఒకవిధమైనపట్టు బట్ట,పట్టుపురుగులేకకాయ,పీలికలబొంత.

**بادامی** బాదామీ(పా)బాదాము కాయవన్నె లేకయాకారముగల-బాదామువంటి.

**بادبان** బాద్‌బాన్(పా.పు)ఓడచాప, గాలిచాప, తెరచాప.

**بادپا** బాద్‌పా (పా పు) పందెపుగుఱ్ఱము, వడిగలగుఱ్ఱము.

**بادخایہ** బాద్‌ఖాయ (పా.పు) అంత్ర (వృద్ధి,బుడ్డ.

**بادخورہ** బాద్‌ఖోర (పా.పు) గుఱ్ఱము నకు వెంట్రుకలు రాలిపోవనొక వ్యాధి.

**بادریشہ** బాద్‌రేష (పా.పు) గిరక, గిలక, (గుడారముయొక్క నిట్రాతిపై యమరియుండునది.)

**بادریہ** బాద్‌రియ (పా.పు) ఇంటికప్పులో నుండుగవాక్షము. (భువు.

**بادشاہ** బాద్‌షాహ్ (పా.పు) రాజు,ప్ర

**بادشاہت** బాద్‌షాహత్ (పా.స్త్రీ) రాజ్యము,ప్రభుత్వము.

**بادشاہی** బాద్‌షాహీ (పా.స్త్రీ) రాజసం॥, రాజార్హమైన,రాజ్యము, దొరతనము, ప్రభుత్వము.

**بادکش** బాద్‌కష్ (పా.పు) విసనకఱ్ఱ.

**بادل** బాదల్ (హి.పు) మేఘము, మొగులు.

**بادل پھٹنا** బాదల్—ఫట్నా (హి) మబ్బు విచ్చుట,నిర్మలాకాశమగుట.

**بادل چھانا** బాదల్—ఛానా (హి) మబ్బు గ్రమ్ముట, **بادل گرجنا** బాదల్—గరజ్‌నా (హి) మేఘగర్జనము,ఉరుముట.

**بادلہ** బాద్‌లా (హి.పు) జరీపట్టుబట్ట,జరీతీగెలు,సరిగనూలు.

**بادنجان** బాదింజాన్ (అ.పు) వంకాయలు

**بادنما** బాద్‌నుమా (పా.పు) వాయుదిశాదర్శక యంత్రము,వాయుదర్శకము.

**بادہ** బాద (పా.పు) సారాయి మద్యము.

**بادہ نوش-خوار-پرست** — నోష్-ఖార్-పరస్త్ (పా) త్రాగుబోతు, **بادہ کش** బాద-కష్ (పా) సారాయివండు వాడు,ఆసవకారుడు,సారాయిత్రాగువాడు.

**باڈھا** బాఢా (హి.పు) ఆధిక్యము, హెచ్చు,పెచ్చు.

**بادہوائی** బాద్‌హవాయీ (పా.స్త్రీ) నిరర్థకము,నిష్ఫలము,తుచ్ఛము-వ్యర్థము.

**بادی** బాదీ (పా) వాతముగల, చల్లని,

**بادی بدن** బాదీ—బదన్ (పా) వాతశరీరముగలవారు,ఊరినదేహముగల.

**بادی** బాదీ (అ.పు) ఆరంభకుడు,

**بادی النظر** బాదీ—యున్నజర్ (అ) ప్రథమదృష్టికి, మొదటచూచినతోడనే.

**بادیہ** బాదియ (అ.పు) ఎడారి,అడవి.

**بادیہ** బాదియ(పా.పు)గిన్నె,కోర(పెద్దది.)

**بار** బార్ (పా.పు) భారము, బరువు,తడవ, తేప;ఫలము,పంట,వారము, అవృత్తి; గర్భము;భూమి;ఆజ్ఞ, సెలవు;సదస్సు,సభ,ఆస్థానము;దర్శనము, ద్వారము;

**بار بار-بارہا** బార్-హా(పా) పలుమారు, తేపతేప,తరుచుగా. **باربردار** —బర్దార్ (పా) భారవాహకుడు,బరువులుమోయు జంతువు మొ॥ **باربرداری** —బర్దారీ(పా) మోతకూలిలేకబాడుగ, బరువులుమోయు బండ్లు, మొ॥, భారవాహము, బరువులు దించుట. **بارخاطر** —ఎ,ఖాతిర్ (పా)

అలంకటు, కేసును. باردار —బార్‌దార్ (పా) గర్భవతియైన, చూలాలు, ఫలవంతమగు, పండియున్న. باردانہ —బార్‌దాన (పా.పు) సామగ్రులు, మేత, ఘాసము; సంచి, పాత్రలు.

بارکش కష్ (పా.పు) మోతబండి.

باروَر —వర్ (పా) ఫలవంతమైన, కాచిన.

بار బార్ (హి.పు వేళ, సమయము, ఆలస్యము, కస్యః; వాకము, నీరు, పసువు, పడవ, తేప, ఆటంకము, అభ్యంతరము; కేశము, వెంట్రుక

بارلگانا —లగానా (ఉ) ఆలస్యము చేయుట.

بارا బారా (హి) పన్నెండు. చూడు بارہ

بارا బారా (హి.పు) మోటుపాటు, నీరుకట్టుట, మోటకొట్టుట. باراجوری —జోరీ (హి) బలవంతము, కీటులాట.

بارات బారాత్ (హి.స్త్రీ) చూడు برات

باران బారాన్ (పా.పు) వర్షము. వాన.

بارانی బారానీ (పా.స్త్రీ) దేవమాతృక, వర్షమువలన పండెడుభూమి, మైనపుబట్ట, వానచొక్కాయ.

باراہ బారాహ్ (హి.పు) వరాహము, పంది.

بارد బారిద్ (అ) శీతము, చల్లని.

باردانہ బార్‌దాన (పా) చూడు بار క్రింద.

بارش బారిష్ (పా.స్త్రీ) వర్షము, వాన.

بارگ బారగ్ (ఇం.పు) సేనానివాసము, దండు వాడ.

بارگاہ బార్‌గాహ్ (పా.స్త్రీ) ఆస్థానము, ధర్మాసనము, దివాణము, కొలువుకూటము.

بارگیر బార్గీర్ (పా.పు) మోతపశువు, స్వంత గుఱ్ఱములేని కౌతు [సవారు]; గుఱ్ఱపువాడు.

بارنا బార్నా (హి) వెలిగించుట, దీపము ముట్టించుట.

بارندہ బారింద (పా) కురిసెడు.

بارنِش బార్నిష్ [ఇం.స్త్రీ] లక్క-తైలము-మెఱుగుతైలము.

بارود-ت బారూద్-త్ [పా.స్త్రీ] తుపాకిమందు. بارودخانہ —ఖాన (ఉ) తుపాకిమందుకొట్టు. (వ-తేప.

بارہ బార [పా.పు] సమయము-హంశము-తడ

بارہ బార [హి] పంద్రెండు. بارہ باٹ —బాట్ (హి) మూడారు తెరువులు-చెల్లాచెదరు-అధ్వానము- పాడు- కలత- కలవరము.

بارہ پتھر پار کرنا —పత్థర్ పార్ కర్నా (హి) పొలిమేరదాటకొట్టుట- ఊరువెడల గొట్టుట. بارہ دری —దరీ (హి) ద్వాదశద్వారము-ఆరామగృహము-తోటయింటిని ఖిల్లు-చలువచొప్పరము. بارہ کھڑی —ఖడీ (హి) గుణితము. بارہ ماسا —మాసా (హి) జావళిపదము-వలపుపాట- ఇదిసంవత్సరముపొడవునను ఆయా మాసములందలి వలపునువృద్ధిజేయుసమయములు వర్ణింపబడియుండు శృంగారపదము. بارہ وفات —వఫాత్ (ఉ) హజరత్ పైగంబరుగారు అవసానకాలమున జబ్బుపడియుండిన పన్నెండు దినములు,

بارہ سنگا బారసింగా (హి.పు) దుప్పి.

بارے బారే (పా) ఒకసారి, అకస్మాత్తుగా, ఎట్టకేలకు, ఎట్టకేని, తుదకు, సారాంశము.

باری బారీ (అ.పు) ఈశ్వరుడు, దేవుడు, باری تعالیٰ —తఆలా (అ.పు) పరమేశ్వరుడు.

باری బారీ (హి.స్త్రీ) తోట, ఇల్లు, తడవ, వంతు, క్రమము, మార్పు: గవాక్షము,

باری دار —దార్ (హి) వంతువాడు, ప్రహరవాడు- باری کاٹ —కాతప్

(హి.పు) వరుసజ్వరము.

**باریاب** బార్యాబ్ (పా) అనుజ్ఞపొందిన వాడు, ప్రవేశముపొందినవాడు, అనుగృహీతుడు, కృతార్థుడు, సభలోచేర్చుకొనబడిన వాడు.

**باریک** బారీక్ (పా) సన్నని, సూక్ష్మమైన, సున్నితమైన, చురుకుగల, కష్టతరమైన, సూక్ష్మబుద్ధిగల, **باریک بین**—బీన్ (పా) సూక్ష్మబుద్ధిగలవాడు: జాణ, సూక్ష్మదర్శి, **باریک میان** — మియాన్ (పా) అణుమధ్య, సన్ననినడుముగలది.

**باریکہ** బారీక (ఉ.పు) తూలిక-కూర్చిక.

**باریکی** బారీకీ (పా.స్త్రీ) సూక్ష్మత్వము-సన్నదనము-యుక్తి-సూక్ష్మము.

**باڑ-باڑھ** బాడ్-ఢ్ (హి.స్త్రీ) శస్త్రధార-అంచు; కంచె-అలవ-చెట్లబారు-బండ్లబారు, తుపాకుల బారు-ఒడ్డు-వరద- ఉప్పొంగు-ఉద్రేకము. **باڑ دلوانا۔رکھنا**—దిల్వానా-రఖ్నా (హి) పదును పెట్టుట.

**باڑا** బాడా (హి.పు) ఆవరణము-అలవ-ప్రాకారము-శ్మశానవాటిక-బలి, బిచ్చము-పాలము-ఊరిముందరిచేను-రంగము.

**باڑی** బాడీ (హి.స్త్రీ) వాడ-ఆరామము-తోట-ఆవరణము-నివాసము-పత్తిచెట్టు.

**باڑیا** బాడియా (హి.పు) కత్తులుపదునుపెట్టువాడు-సానబట్టువాడు. (شاہین

**باز** బాజ్ (పా.పు) డేగ (ఆడది); మగది

**باز** బాజ్ (పా) మరల- వెండియు- తిరుగ; చేయువాడు- చేయగలవాడు- ప్రవీణుడు-(వృత్తియందు). **باز آنا۔رہنا** — ఆనా-రహ్నా (ఉ) వర్జించుట-త్యాగము చేయుట-వెనుకతీయుట, వదులుకొనుట-**باز پرس** -పుర్స్ (పా.పు) ఉత్తరవాదిగా జేయుట-పరీక్ష-విమర్శనము-విచారణ **باز رکھنا** -రఖ్నా (ఉ) ఆటంకపరచుట- తప్పించుట-అడ్డపడుట-కాపాడుట-నిలుపుట.

**بازگشت**-గష్త్ (పా.స్త్రీ) తిరుగుదల-మళ్లుదల-తిరిగియివ్వబడుట. **بازیافت**-యాఫ్త్ (పా) మరలతీసికొనుట- మరల పొందుట-మళ్లుదల-తిరుగుదల. **بازنامہ**-నామ (పా.పు) విడుపుకాకితము. **بازخواہ**-ఖాహ్ (పా.పు) పరీక్షకుడు-విచారణకర్త.

**بازار** బాజార్ (పా.పు) పచారము-అంగడి వీధి-అంగడి. **بازار مند ہونا** —మంద్ హోనా (ఉ) వ్యాపారము బాగుగా సాగకుండుట. **بازار خرچ**-ఖర్చ్ (పా) దిన వెచ్చము. **بازار گرم ہونا** - గరమ్ హోనా (ఉ) వ్యాపారము బాగుగా సాగుట, **بازار ناپنا**-నాప్నా (ఉ) వీధులు తిరుగుట. (కేషు-సాధారణమైన.

**بازارو** బాజారూ (ఉ) అంగడిలో దొర

**بازاری** బాజారీ (పా.పు) అంగడి సం॥—సామాన్యమైన-వీధులలో తిరుగుచుండెడు-దిప్పకాయదైన. (స్త్రీ) లంజె.

**بازرگان** బాజుర్గాన్ (పా పు) వర్తకుడు వ్యాపారి. (కము-వ్యాపారము.

**بازرگانی** బాజుర్గానీ (పా స్త్రీ) వర్త

**بازو** బాజూ (పా.పు) దండ-భుజము-ప్రక్క-ఈడు- జోడు-సహవాసి-మంచపుపట్టె-రెక్క-పక్షము, **بازوبند** — బంద్ (పా.పు) భుజబందు-బాహుభూషణము-కేయూరము, సందిదండ, సందిటిదండ, **بازودینا**—దేనా (ఉ) సహాయముచే

యుటు-చేయుూత్రయిచ్చుట.

**بازی** బాజీ (పా. స్త్రీ) ఆట-పందెము-ఒడ్డు; మోసము-వంచన. **بازی پانا**—బాజీ పానా (ఉ) గెలుచుట. **بازی دینا** — బాజీ దేనా (ఉ) గెలుచుట, మోసముచేయుట. ఓడించుట.

**بازی کھانا**—బాజీ ఖానా (ఉ) ఓడుట-మోసపోవుట. **بازی لگانا** — బాజీ లగానా (ఉ) పందెము వేయుట-ఒడ్డుట.

**بازی لیجانا**—బాజీ లేజానా (ఉ) గెలుచుట-మించుట-మీరుట.

**بازیچہ** బాజీచ (పా. పు) ఆట-పందెము-బొమ్మలాట-బొమ్మ-వినోదము.

**بازیگاہ** బాజీగాహ్ (పా. స్త్రీ) ఆటపట్టు-రంగము.

**بازیگر** బాజీగర్ (పా. పు) పందెగాడు-దొమ్మరిగాడు-గారడిగాడు-మంత్రగాడు-కట్టుబోతు-ఆటగాడు.

**بازیگرن-نی** బాజీగరణ-నీ (పా. స్త్రీ) మాంత్రికురాలు. (వాసన-గంధము.

**باس** బాస్ [హి. పు] వాసము-ఉనికిపట్టు;

**باسٹھ** బాసఠ్ [హి] అరువదిరెండు.

**باسلیق** బాసలీక్ [యు. స్త్రీ] చేతిలోని పెద్దనరము.

**باسمتی** బాస్మతీ [హి. పు] వాసనబియ్యము.

**باسن** బాసన్ [హి. పు] భాండము-పాత్రము.

**باسنا** బాస్నా [హి] వాసనకలుగజేయుట; ఇచ్ఛ-కోరిక-వాసన.

**باسی** బాసీ [హి] వద్ది-చద్ది-వాడిన-ఉపయోగించిన; వాసనగల; వసించువాడు-వాసి.

**باسی عید** —బాసీ ఈద్ [ఉ. పు] కనుపపండుగ-పండుగమరునాడు. **باسی منہ**—బాసీ ముహ్ [హి. పు] పాచినోరు.

**باشاباش** బాషాబాష్ [పా. పు] దేగ-బైరిపిట్ట.

**باشندہ** బాషింద [పా. పు] నివాసి-ఉండువాడు-నివసించువాడు.

**باصرہ** బాసిర (అ. పు) దృష్టి-చూపు.

**باطل** బాతిల్ [అ] వ్యర్థము-తుచ్ఛము-అసత్యము-అబద్ధము-పనికిమాలినది.

**باطن** బాతిన్ [అ. పు] అంతరంగము-అంతస్సు-హృదయము-మనస్సు-రహస్యము.

**باعث** బాఇస్ [అ. పు] కారణము-మూలము. హేతువు.

**باغ** బాగ్ [పా. పు] తోట-వనము-తోపు.

**باغ باڑی**—బాగ్ బాడీ [ఉ] పుష్పవాటిక.

**باغ باغ ہونا**—బాగ్ బాగ్ హోనా [ఉ] ఉబ్బితబ్బిబ్బులగుట-మిక్కిలిఆనందించుట.

**باغبان**—బాగ్ బాన్ [పా. పు] తోటవాడు-మాలకరి-తోటకాపు-మాలీ.

**باغبانی**—బాగ్ బానీ [పా. స్త్రీ] తోటపని-తోటవేయుట-ఉద్యానకృషి.

**باغ سبز دکھانا**—బాగ్ సబ్జ్ దిఖానా (ఉ) మోసముచేయుట-టక్కు చేయుట.

**باغی** బాగీ [అ. పు] తిరుగబడినవాడు-ద్రోహి.

**باغچہ-باغیچہ** బాగ్చ-బాగీచ [పా. పు] ఉద్యానము-చిన్నతోట.

**بافتہ** బాఫ్త [పా. పు] నేసిన-ఒకవిధమైనపట్టుబట్ట. (వాడు.

**بافندہ** బాఫింద [పా. పు] నేతగాడు. సాలె

**باقر** బాకిర్ [అ] విద్యావంతుడు-పండితుడు-సంపన్నుడు; వ్యాఘ్రము.

**باقرخانی** బాకర్‌ఖానీ [తు.స్త్రీ] పా
లుచక్కెరకలిపిచేసినరొట్టెబిళ్లలు.

**باقلا** బాకిలా[పా]చూడు **لوبیا**

**باقی** బాకీ[అ.స్త్రీ]శేషము-మిగులుసొచ్చ
ము-చెల్లవలసినది. అప్పు, మిగిలిన-నిలువ-
శాశ్వతమైన-ఉన్న. **باقیدار**-బా-దార్(పా)
అధమర్ణుడు-అప్పుగొన్నవాడు.

**باقی دارد**-బాకీ-దారద్ [పా] సశేషము-
ఇంకాఉన్నది.

**باک** బాక్(పా.పు)భయము,శంక.

**باکره** బాకిర(అ.స్త్రీ)కన్య,కన్నె.

**باگ** బాగ్ (హి.స్త్రీ) కళ్లెపువారు,కళ్లెము,
వాగెలు. **باگ اٹھانا-لینا**-బాగ్-ఉఠానా
-లేనా (హి) గుఱ్ఱమునుపరుగెత్తించుట.

**باگ ڈور**-బాగ్-డోర్ (హి) కళ్లెపుత్రాడు,
(గుఱ్ఱపువాడు కళ్లెమునకుకట్టిపట్టుకొనిపో
వునది.) **باگ مڑنا**-బాగ్-ముడ్నా (హి)మర
లుట,అమ్మవారు(స్ఫోటకము) ముఖముత్రి
ప్పుట, స్ఫోటకముతగ్గుట. **باگ موڑنا**
-మోడ్నా (హి)గుఱ్ఱమునుత్రిప్పుట,మరలిం
చుట,ముఖముత్రిప్పుట.

**باگا** బాగా(హి.పు)కట్నపుఉడుపులు.

**باگھ** బాఘ్(హి.పు)వ్యాఘ్రము,పులి.

**باگھی** బాఘీ (హి.స్త్రీ) గజ్జలలోలేచు
బిళ్ల, గజ్జబిళ్ల.

**بال** బాల్ (హి.పు) బాలుడు, పిల్లవాడు.
**بال بچے**-బాల్-బచ్చే(హి.పు) ఆలుబిడ్డలు,కు
టుంబము, పిల్లలు. (బీట.

**بال** బాల్ (హి.స్త్రీ) వెన్ను,కంకి; పగులు,

**بال** బాల్ (హి.పు) కేశము, వెండ్రుకలు.
**بال اترنا**-బాల్-ఉతర్నా (హి) వెండ్రుకలు
రాలిపోవుట, వెండ్రుకలుతీయబడుట.
**بال بال**-బాల్-బాల్(హి) ఆపాదమస్తకము.
అంతయు. **بال برابر**-బాల్-బరాబర్(హి)లేశ
మైనను. **بال بنانا**-బాల్-బనానా(హి)తలము
డుచుకొనుట,జడవేసికొనుట,క్షౌరముచేయిం
చుకొనుట. **بال پکنا**-బాల్-పక్నా (హి)తల
నరియుట, వెండ్రుకలుతెల్లబడుట.
**بال توڑ**-బాల్-తోడ్(హి.పు)వెండ్రుకతెగిన
పుండు. **بال خورا**-బాల్-ఖోరా(హి) పశువు
లవెండ్రుకలురాలురోగము.
**بال کھڑے ہونا**-బాల్-ఖడేహోనా(హి)
నగురుపొడుచుట.
**بال کی کھال کھینچنا**-బాల్-కీఖాల్‌ఖీం
చ్నా (హి)స్తనశల్యపరీక్షచేయుట, మిక్కి
లిశోధించుట,మిగులసూక్ష్మదృష్టితోజూ
చుట. **بال لینا**-బాల్-లేనా(హి) గొరుగుట,
క్షౌరమునాడుమంగలకత్తితీసికొనుట.

**بال** బాల్(పా.పు)పక్షము,రెక్క.

**بال** బిల్ (అ) సహార్థకమైనయుపసర్గము.
**بالاتفاق**-బిలిత్తిఫాక్(అ) ఐకమత్యము
తో,ఏకాభిప్రాయముతో,కలసి, అకస్మా
త్తుగా. **بالاجمال**-బా-ఇజ్మాల్(అ)మొత్త
ముమీద, సగటుగా, సంగ్రహముగా.
**بالارادہ**-బిల్-ఇరాద(అ)మనఃపూర్వకముగా,
కావలెనని. **بالتخصیص**-బిత్తఖ్సీస్
(అ)ముఖ్యముగా,ప్రత్యేకముగా, నిర్దిష్టము
గా. **بالتصریح**-బిత్తస్రీహ్(అ) విశదము
గా, స్పష్టముగా, విభజనగా, వైనముగా.
**بالتفصیل**-బిత్తఫ్సీల్ (అ) వయినము
గా, విభజనగా, వేర్వేరుగా, వివరముగా.
**بالجبر**-బా-జబ్ర్(అ) బలాత్కారముగా.
**بالجملہ**-బా-జుమ్లా (అ) మొత్తముమీద.
**بالذات**-బిజ్-జాత్ (అ) స్వత, వస్తుతః

రాంకవము. (త్స్యవిశేషము.
بانب బాంబ్ (హి.స్త్రీ) పాపమీను-(మ
بانبی బాంబీ (హి.స్త్రీ) పాముబొక్క-
బిలము.
بانٹ-ٹا బాంట్-టా (హి.పు) విభాగ
ము-పాలు-పంపకము-ఎత్తు- తూనికరాయి.
بانٹ چونٹ-బాంట్-చోంట్ (హి) విభాగ
ము, పంపకము. (పంచుట.
بانٹنا బాంట్నా (హి) విభాగించుట-
بانجر-بنجر బాంజర్-బంజర్ (హి.పు)
బీడునేల-సాదునేల-పండనిభూమి- తువ్వ
నేల, చౌటనేల.
بانجھ బాంఝ (హి) పండని-గొడ్డు-కనని.
بانچنا బాంచ్నా (హి) చదువుట. (ము.
باندھ బాంధ్ (హి.పు) కట్టి-కట్టు-నిర్బంధ
باندھنا బాంధ్నా (హి) కట్టుట-పన్నుట
కట్టవేయుట.
باندھنو బాంధ్నూ (హి.పు) అపవాదము-
నింద-ఉపాయము-ఊహ-కల్పన-రంగుకైన
కట్లు. (బానిస.
باندی బాందీ (హి.స్త్రీ) దాసి-పనికత్తె-
باندا బాండా (హి.పు) మొండితోకగల-
తోకతెగినపాము- గూని-కుంటి-వంకరకా
ళ్లవాడు.
بانڈی బాండీ (హి.స్త్రీ) దుడ్డుకఱ్ఱ-కఱ్ఱ.
بانس బాంస్ (హి.పు) వెదురు-పదియడు
గులకోల. بانس پرچڑھانا—బాంస్-పర్
చఢానా (హి) అల్లరిజేయుట-సిగ్గుదీయు
ట-అవమానపరచుట-స్తోత్రముజేయుట.
بانسا బాంసా (హి.పు) ముక్కు-దూలము-
వెన్నెముక-వెదురుగడ.
بانسری-بانسلی బాంస్రీ-బాంస్లీ
(హి.స్త్రీ) వేణువు-పిల్లనగ్రోవి.
بانسی బాంసీ (హి) చిట్టివెదురు-పాషాణ
భేదము-ఒకవిధమైన పచ్చనిరాయి.

بانک బాంక్ (హి.పు) వంక-వంపు-ధనుస్సు
-చింతఉట్టి; వంకీలు-అందెలు; బండిచీల.
بانک బాంక్ (హి.పు) కరవాలి- ఛురిక-వంక
రకడియము-వంకి.
بانکا బాంకా (హి.పు) వంకరదైన-నీటు
గల-పోకిరిదైన-సొగసుగాడు-నీటుకాడు.
بانکپن బాంక్పన్ (హి.పు) వంక-నీటు;
సొగసు-పోకిరితనము-పొంకము
بانکیا బాంకియా (హి.పు) వాద్యభేదము-
(బూరకొమ్ము.)
بانگ బాంగ్ (పా.స్త్రీ) అఱపు- కేక-పిలుపు
నమాజు ఘోషము-కోడికూత.
بانگا బాంగా (హి.పు) పత్తిచెట్టు-పత్తికాయ.
بانگر బాంగర్ (హి పు) మిట్టనేల-నీళ్లపాటు
కనేపండునది. (కుంటువాడైన.
بانگرو బాంగ్రూ (హి) బుద్ధిమాలిన, మోటు,
بانگی బాంగీ (హి.స్త్రీ) మాదిరి, నుచ్చు, మో
స్తరు, కేకవేయువాడు.
بانو బానూ (పా.స్త్రీ) యజమానురాలు.
بانوے బాన్వే (హి) తొంబదిరెండు.
بانہہ-بانہ బాంహ్ (హి.స్త్రీ) బాహువు,
చేయి, రక్షకుడు, తోడు, సహాయకారి, ఉత్త
రవాది-పూటపడువాడు.
بانی బానీ (అ.పు) శిల్పి, కర్త, కారకుడు, కార
ణము, మూలము, రచనకర్త, రచయిత, కట్టు
వాడు-చేయువాడు.
بانی బానీ (హి.స్త్రీ) వాణి, వాక్కు-వచన
ము, భాష, ఉపన్యాసము.
باو బావ్ (హి.స్త్రీ) వాయువు, గాలి, వా
తము, వాతపైత్యము, పొగరు.
باو بتاس —బతాస్ (హి) గ్రహబాధ.
باو بڑنگ—బిడంగ్ (హి) వాయువిళంగ
ములు. باو بھڑکنا—భడక్నా (హి) పి
చ్చిఎత్తుట, పేలుట, వదరుట.
باو بھک-جھک—భక్, ఝుక్ (హి)
పదరుబోతు, నీటిబుగ్గలు, باو سول—సూల్

(హి.పు) వాతశూల, పరిణామశూల.
بادگولہ బాదు-గోల(హి) కడుపుబ్బు, అజీర్ణ వాయువు.
باوا బావా(హి.పు) తాత, తండ్రి, బైరాగి, మహాత్ముడు, గురువు. باوا آدم బావా-ఆదమ్ (ఉ) మూలపురుషుడు-సాంప్రదాయము.
باوٹا బావ్టా(హి) టెక్కెము, ధ్వజము; ఈ శ్వరోగము, తిమ్మిరిరోగము.
باور బావర్ (పా.పు) విశ్వాసము, నమ్మకము,నమ్మతగిన,నిజమైన.
باورچی బావర్చీ(పా.పు) పాచకుడు, వంటవాడు. باورچی خانہ బావర్చీ-ఖాన(పా) వంటయిల్లు,మహానసము.
باولا బావ్లా(హి.పు)పిచ్చి, వెఱ్ఱి,వెడ్డి.
باولی బావ్లీ(హి.స్త్రీ) దిగుడుబావి; పిచ్చిది;టక్కు,మోసము.
باون బావన్(హి)ఏబదిరెండు.
باہ బాహ్(అ.స్త్రీ) మొగతనము.(హి.పు) సంబంధము-సంభోగేచ్ఛ.
باھا బాహా(హి.పు)జలదారి,తూము.
باھر బాహర్(హి)బయట, వెలుపల, పరదేశము,పరాయి. باہر کرنا బాహర్-కర్నా(హి) వెడలగొట్టుట,తీసివేయుట. (ప్రసిద్ధమైన.
باھر బాహిర్(అ) శ్రేష్ఠతరమైన, ఘనమైన,
باہم బాహమ్(పా)కూడి,కలసి,చేరి.
باہن బాహన్ (హి.పు) వాహనము,పదనుచేసిన పాలము, సిద్ధముచేసినపాలము.
باہنا బాహ్నా(హి)దున్నుట, పడవేయుట. వెనుతగులుట, తెలుచుట,విత్తుట, దువ్వుకొనుట, చొరగొట్టుట.
بائی బాయీ(హి.స్త్రీ)అమ్మ,అమ్మగారు; వాయువు,వాతము. (ధ్వని.
بایاں బాయాఁ(హి)ఎడమ, వాపలి, శకా-
بائد شاید బాయద్ షాయద్(పా)తగినట్టు, కావలసినట్టు,యథాయోగ్యము. (డువాడు.
بایع బాయెఉ (అ.పు) విక్రయించువాడు,అమ్మె
بائیس బాయీస్(హి)అరువదిరెండు.
بائیسی బాయీసీ(హి.స్త్రీ) ఇరువదిరెండు వేలసేనలేక సేనాధిపత్యము.
بباد బిబాద్(హి.స్త్రీ)వివాదము,జగడము.
بباہ బిబాహ్(హి.పు) వివాహము-పెండ్లి.
ببر బబ్ర్(అ.పు)సింహము,బెబ్బులి.
ببرا బబ్రా (ఉ) నల్లమచ్చలుగలనీలవర్ణపు పావురము.
ببری బబ్రీ(ఉ.స్త్రీ)ముంగురులు,కత్తిరించిన (గుజ్జుపు) వెండ్రుకలు. (చెట్టు.
ببول బబూల్ (హి.పు)బర్బూరము, తుమ్మ
ببولا బబూలా(హి పు)సుడిగాలి.
ببی బబ్బీ(హి.స్త్రీ)ముద్దు,చుంబనము.
بیبس-سی బబేస్-సీ(హి.స్త్రీ) మొలల వ్యాధి-మూలవ్యాధి. (వాడు.
بیبسیا బబేసియా(హి.పు) మూలవ్యాధిగల
بپتسما బప్తిస్మా(ఇం.పు)క్రైస్తవమతస్వీకారస్నానము,క్రైస్తవాభిషేకము. (నుట.
بپھارا బఫారా(హి.పు) ఆవిరిపాగవేసికొ
بپھرنا బిఫర్నా(హి)చెదరుట, తిరుగబడుట.హఠముచేయుట, పోకిరితనముచేయుట.
بت బిత్ (హి.పు)విత్తము,ధనము,శక్తి, తాహ్ణ్యము,ఆకారము.
بت బుత్ (పా.పు)విగ్రహము,ప్రియురాలు, పాచికలాడుపలక. بت پرست బుత్-పరస్త్(పా)విగ్రహారాధకుడు. بت تراش బుత్-తరాష్(పా) విగ్రహములు చెక్కువాడు.
بتخانہ / بتکدا బుత్-ఖాన —కదా (పా) విగ్రహాలయము.
بتا బిత్తా(హి.పు) జేన-జేనెడు. (ఛలము.
بتا బుత్తా(హి. పు) మోసము,టక్కు, నెపము,

بتاس బతాస్(హి.స్త్రీ)వాయువు, గాలి.

بتاشا-بتاسا బతాసా-బతాషా (హి.పు) బుగ్గ, నీటిబుగ్గ; చక్కెరబుగ్గలు, (బత్తీసాలు)

بتانا బతానా(హి)చూపుట, నేర్పుట, తెలియపరచుట, చెప్పుట.(పు) గాజుకోలత్తైనకడియము.

بتر బత్తర్ (పా)దుష్టము,దుస్టతరము(بدتر)

بترا బుతారి(హి)మొండి,పదునులేని.

بترانا బిత్రానా(హి)ఎన్నుట, తప్పులుపట్టుట, కాదనుట, నిరాకరించుట.

بتکڑ-بتنگڑ బతక్కడ్-బతంగడ్ (హి.పు) గోరంతలుకొండంతలుచేయుట.

بتلانا బత్లానా(హి)చూడు بتانا (క్రియ)

بتوری బతౌరీ(హి.స్త్రీ) ఉబ్బరము,గడ్డ.

بتولی బతోలీ(హి.స్త్రీ)హాస్యము.

بتھارنا బిథార్నా(హి) చెదరగొట్టించుట, చల్లించుట.

بتی బత్తీ(హి.స్త్రీ)వత్తి,తిరి,మైనపువత్తి,అగరు కడ్డీ, తలగుడ్డయొక్క ఒకచుట్టు.

بتیا బతియా(హి.పు) పచ్చికాయ, లేతది; గంజివంకాయ.

بتیس బత్తీస్(హి)ముప్పదిరెండు.

بتیس دھار -బత్తీస్-ధార్ (హి) తల్లిపాలు, చనుబాలు.

بتیسی బత్తీసీ(హి.స్త్రీ)దంతపంక్తి,పలువరుస. بتیسی دکھانا-బత్తీసీ-దిఖానా (హి) పండ్లిగిలించుట. بتیسی بجنا-బత్తీసీ-బజ్నా (హి)చలిచేతవణుకుపుట్టుట.

بتیسیا బత్తీసియా (హి.పు) బాలింతకాయము

بٹ బట్ (హి.స్త్రీ) చర్మపుముడుతలు, వరుసలు,ముడతలు, మెలికలు(పు) కాలిబాట, డొంక,ఏత్తులు,(బాట్లు),బొడిపెఒకకాశ్మగజాతి,భాగము, పాలు, بٹ مار-బట్-మార్ (హి) తెరవాటుగాడు, త్రోవలు కొట్టు దొంగ.

بٹا-بٹہ బట్టా(హి.పు)పెచ్చు, మార్కము, వట్టము,తుట్టి,ఛేదము,దోషము,కళంకము; ఉండ;సన్నికంటిరాయి,పాత్రము; పేటిక, డబ్బి,గుండ్రనిఅద్దము,చిన్నచెంబు.

بٹا باز-بٹے باز బట్టా (హి) బాజ్ (ఉ.పు) మోసగాడు,టక్కరి, గారడివాడు,విప్రవినోది. (చెదరగొట్టుట.

بٹانا బటానా (హి)విభాగించుట,పంచుట,

بٹاؤ బటావ్ (హి.పు) బాటసారి, తెరవాటుగాడు,దొంగ.

بٹائی బటాయీ(హి.స్త్రీ)పాలుపంపకము, పంటకారు; పేనినకూలి.

بٹلوئی బట్లోయీ (హి.స్త్రీ) గిన్నె,బోగణి,బట్లోయి.

بٹنا బట్నా (హి) పేనుట,వడిపెట్టుట,రాబట్టుకొనుట,విభాగమగుట, పెరగుట.

بٹنا బుట్నా (హి.పు) చూడు. ابٹن

بٹنی బుట్నీ (హి.స్త్రీ) కుచాగ్రము, చనుమొన.

بٹوا బటుఆ (హి.పు) తిత్తి,చిన్నసంచి,బొక్కసము, రూకలబొంకణము, బొక్కణము,బట్లోయి;గిన్నె. (బట్టువాసు.

بٹوار బట్వార్ (హి.పు) సుంకరి,పన్నులరా

بٹوارا-ڑا బట్వారా-డా (హి.పు) పాళ్లు పంచుట,పంపకము.

بٹوانا బట్వానా (హి) పాళ్లుపంచించుట. పేనించుట, వేరుచేయించుట.

بٹورا బటోరా (హి.పు) పిడుకలకుచ్చె, పిడుకలగూడు. (జవురుట.

بٹورنا బటోర్నా (హి) ప్రోగుచేయుట,

بٹوئیا బట్వయ్యా (హి.పు) బాటసారి,

**بٹھانا-بٹھلانా** బిఠానా-బిఠ్లానా (హి) కూర్చుండబెట్టుట, పొందించుట, స్థాపించుట, కూలగొట్టుట.

**بٹئے-بٹیا** బటై-బటయ్యా (హి.పు) పేనువాడు, పట్టు పేనువాడు, సరిగపనివాడు.

**بٹیا** బిటియా (హి.స్త్రీ) కూతురు, బిడ్డ,

**بٹیاں** బటియాం (హి) గబ్బిగుబ్బలు. (పిట్ట.

**بٹیر** బటేర్ (హి.స్త్రీ) బుజ్జపిట్ట, పూరేడు

**بجا** బజా (పా) యోగ్యమైన, అర్హమైన, సరియైన, ఒప్పిదమైన, స్వస్థమైన,

**بجا آوری**—ఆవరీ (ఉ) నెరవేర్పు-ఆజ్ఞానువర్తనము. **بجالانا**-లానా (ఉ) నెరవేర్చుట, చేయుట, జరుపుట. (వాడు.

**بجار** బిజార్ (హి.పు) ఆబోతు, మదించిన

**بجانا** బజానా (హి) వాయించుట, మ్రోయించుట, మోదుట. (స్థానే.

**بجائے** బజాయ్ (పా) మారుగా, ప్రతినిధిగా

**بجبجانا** బిజ్‌బిజానా (హి) బురబురలాడుట, లసలసలాడుట.

**بجر** బజ్ర్ (హి.పు) వజ్రము, పిడుగు, గట్టిది, భారమైన, సోమరి.

**بجرا** బజ్రా (ఇం.పు) గుంటుపడవ.

**بجری** బజ్రీ (హి.స్త్రీ) రాతిగులక, చిన్నవడగండ్లు.

**بجز** బజుజ్ (పా) వినాగా, కాక, తప్ప.

**بجلی** బిజ్లీ (హి.స్త్రీ) పిడుగు, మెరుపు, విద్యుత్తు; ఒకవిధమైన బావులీలు.

**بجنا** బజ్నా (హి) మ్రోగుట, వాగుట.

**بجنا** బుజ్నా (హి.పు) ముట్టుపేలిక.

**بجنسہ** బజిన్సిహి (అ) వస్తుతః, అదే; అట్లే సరిగా, ఉన్నదున్నట్లు,

**بجوانا** బజ్వానా (హి) వాయింపించుట, వాయించునట్లు చేయుట, మ్రోయించుట.

**بجوڑنا** బిజోడ్నా (హి) మోదుట, కొట్టుట. (బాటు.

**بجوگ** బిజోగ్ (హి.పు) వియోగము, ఎడ

**بجھانا** బుఝానా (హి) చల్లార్చుట, తృప్తి జేయుట, నిరుత్సాహునిగా చేయుట, నాన్చుట: బోధించుట, నేర్పుట, తెలియజేయుట, ఆటలో చీట్లుకలుపుట, అయస్కారము చేయుట, ఉక్కు జేయుట, లోహములగాల్చి నీటిలో ముంచుట.

**بجھکنا** బిఝుక్నా (హి) భయపడుట, బెదరుట, బుగులుపడుట.

**بجھنا** బుఝ్నా (హి) చల్లారుట, నానుట మందమగుట.

**بجھول** బుఝవ్వల్ (హి.స్త్రీ) విడుపుకథ

**بجیا** బిజ్యా (హి.పు) భంగు, గంజాయి.

**بچ** బచ్ (హి.స్త్రీ) వసకొమ్ము.

**بچاجانا** బచాజానా (హి) మన్నించుట, వదలివేయుట, తప్పించుట.

**بچار** బిచార్ (హి.స్త్రీ) విచారము.

**بچارنا** బిచార్నా (హి) విచారించుట, ఆలోచించుట. (యుడు, గతిలేని.

**بچارہ** బిచార (పా) దిక్కుమాలిన, నిరుపా

**بچاکچا** బచాకుచా (హి.పు) శేషము, మిగులు

**بچالی** బిచాలీ (హి.స్త్రీ) గడ్డి, కసవు, పూరి.

**بچانا** బచానా (హి) కాపాడుట, రక్షించుట, తొలగించుట, తప్పించుట, దాచుట, విడుచుట, మిగుల్చుట.

**بچاؤ** బచావ్ (హి.పు) సంరక్షణము, శరణము. కాపుదల, మోక్షము, నెపము.

**بچپن** బచ్పన్ [ఉ.పు] పసితనము, పిల్లతనము.

**بچت** బచత్ [హి.స్త్రీ] మిగులు, శేషము.

بچکانا బచ్కానా[హి]బోగముపిల్లవాడు, పిల్లలకుతగినది.

بچکنا బిచక్నా[హి]భయపడుట, బెదరుట,నిరాశజెందుట.బెణకుట, వెనుదీయుట.

بچکنی బచ్కన్నీ[హి.స్త్రీ] ఒకకర్ణభూషణము,గూబబావిలి.

بچگانہ బచ్చగాన [పా] బాల్యపు,పిల్లలకు యోగ్యమైన,పనికిమాలిన.

بچگی బచ్చగీ [పా.స్త్రీ] శైశవము ,పిల్లతనము.

بچلا-بچل బిచల్-లా[హి] నడి,నడిమి, మధ్యస్థము,సామాన్యము.

بچلنا బిచల్నా[హి]చలించుట,తప్పుట,

بچن బచన్[హి.పు] వచనము, వాగ్దానము, సగినము,పోచిల్లు,ప్రార్థన.

بچنا బచ్నా[హి]తప్పించుకొనుట,తప్పుట. తొలగుట, మిగులుట,నిలుచుట, తెప్పరిలుట.

بچناگ బచ్నాగ్[హి.స్త్రీ]వసనాభి[విషభేదము].

بچوانی-بچولیا బచ్వానీ-బచోలియా [హి పు]మధ్యవర్తి, పంచాయతీదారుడు, కార్యదర్శి.

بچھورنا బిచూర్నా(హి)నుగ్గుచేయుట, నలుచుట.

بچھونگڑ బిచూంగడ్(హి)పిల్లకాయ,పిల్లపు.

بچہ బచ్చ (పా.పు) పిల్లవాడు, పిల్ల.

بچہ دان బచ్చ-దాన్ (పా.పు)గర్భాశయము.

بچھانا బిఛానా(హి)పఱచుట,చాపుట, విస్తరించుట.

بچھڑا-بچھڑا బఛ్‌రా-డా(హి.పు) వత్సము,దూడ, లేగ.

بچھڑانا బిఛ్‌డానా[హి] వేరుచేయుట.

بچھڑنا బిఛడ్నా(హి) వేరగుట.

بچھلنا బిఛల్నా(హి)వేరగుట, బెణకుట, తొలగుట, జారుట.

بچھنا బిఛ్నా(హి)విస్తృతమగుట, పరుపుగానగుట,పఱువబడుట.

بچھناگ బఛ్నాగ్ (హి.పు)వసనాభి.

بچھو బిచ్చూ[హి.పు] తేలు,వృశ్చికము.

بچھوا బిఛుఆ(హి.పు)కటారు,చిన్నకత్తి, ఆడంగులకాలివ్రేలిపిల్లాణి.

بچھوانا బిఛ్వానా(హి) పఱపించుట, పఱచునట్లుచేయుట.

بچھونا బిఛోనా(హి.పు)పఱుపు,పఱుపుబట్టలు,శయ్య,పానుపు, సెజ్జ.

بچھیا బఛియా(హి.స్త్రీ)ఆవుపెయ్య.

بچھیرا-ڑا బఛేరా-డా(హి.పు) గుఱ్ఱపుపిల్ల (మగది).

بچی బచ్చీ(హి.స్త్రీ)బాలిక,పిల్ల;పిల్లగడ్డము.

بچے బచ్చే(హి) పిల్లలు. بال بچے-کچے-కచ్చే (హి)ఆలుబిడ్డలు,కుటుంబము.

بچے بھرانا -భరానా(హి) పక్షులుపిల్లలకునోటిలోమేతపెట్టిపెంచుట.

بحار బహార్ (అ పు)సముద్రములు(ఏ-వ بحر)

بحال బహాల్ (పా)యథాపూర్వము,మారని, ఎప్పటివలె,నిమ్మళము,ఆరోగ్యము, స్థిరము, స్వస్థము,వర్థిలుచున్న.

بحالی బహాలీ(పా.స్త్రీ)యథాస్థితి, మగల నియమింపబడుట,నిర్దోషిత్వము, వృద్ధి,విడుదల,విముక్తి.

بحث బహ్స్(అ.స్త్రీ)తర్కము, వాదము, సంభాషణ,సంబంధము.

بحثا-بحثی బహ్సాబహ్సీ(ఉ.స్త్రీ)వాదవివాదము,వితండవాదము,తర్కము.

بحثنا -బహస్నా(ఉ)వాదించుట.

بحر బహ్ర్(అ.పు)సముద్రము, వృత్తము,ఛందస్సు,ఛందము.

بحران బొహ్రాన్(అ.పు)జ్వరోద్రేకము.

بحری బహ్రీ (అ) సముద్రీయము, సముద్ర సం॥ بحری لڑائی -లడాయీ (ఉ)

సముద్రయుద్ధము, నౌకాయుద్ధము.

**بحیرہ** బుహైర (అ.పు) సాగరము, చిన్న సముద్రము.

**بخار** బుఖార్ (అ.పు) ఆవిరి, పొగ, ఉద్రేకము, ఆవేశము, తీక్ష్ణము, జ్వరము, కోపము, పగ, స్పర్థ. **بخار نکالنا** — బుఖార్ నికాల్నా (ఉ) పగతీర్చుకొనుట.

**بخارات** బుఖారాత్ [అ.పు] ఆవిరులు, చూడు [ఏ-వ **بخار**]

**بخاری** బుఖారీ (ఉ.స్త్రీ) పొగగూడు (గలవంటయిల్లు); ఉగ్రాణము, గోడలోని సామానుకొట్టు.

**بخت** బఖ్త్ [పా.పు] అదృష్టము, కర్మము, (జయము, భాగ్యము.

**بختاور-بختیار** — బఖ్తావర్-యార్ (పా) అదృష్టవంతుడు, భాగ్యశాలి.

**بخت سیاہ-بخت سیرہ** — సియాహ్-సీర (ఉ) దౌర్భాగ్యము.

**بختوں جلی** — బఖ్తూంజలీ (ఉ) నిర్భాగ్యురాలు, సంతానములేనిది, విధవ, ముండరాలు.

**بخرا** బఖ్రా (పా.పు) భాగము, పాలు, బత్తె (ము, సామగ్రి.

**بخشانا** బఖ్షానా (ఉ) క్షమింపజేయుట. అనుగ్రహింపజేయుట, ఇప్పించుట, తరింపజేయుట.

**بخشش** బఖ్షిష్ (పా.స్త్రీ) దానము, బహుమానము, అనుగ్రహము, క్షమించుట,

**بخشش نامہ** — బఖ్షిష్‌నామ (పా) దానపత్రము.

**بخشنا** బఖ్ష్నా (ఉ) అనుగ్రహించుట, క్షమించుట, బహుమానములేక దానము ఇచ్చుట. (**بخشانا**

**بخشوانا** బఖ్ష్వానా (ఉ) చూడు.

**بخشی** బఖ్షీ (పా.పు) జీతములిప్పించువాడు, సేనాధిపతి, దళవాయి,

**بخشی خانہ** — బఖ్షీఖాన (పా) జీతముల చావడి. (తనము.

**بخل** బుఖ్ల్ (అ.పు) లోభము, పిసినారి

**بخوبی** బఖూబీ (పా) బాగా, చక్కగా

**بخود** బఖుద్ (పా) స్వంతముగా, తనంతట

**بخور** బుఖూర్ (అ.పు) సుగంధము.

**بخیر** బఖైర్ (పా) సురక్షితముగా, క్షేమముగా.

**بخیل** బఖీల్ (అ.పు) కృపణుడు, పిసినాసి.

**بخیلی** బఖీలీ (ఉ.స్త్రీ) లుబ్ధత, పిసినారితనము.

**بخیہ** బఖియ (పా.పు) గట్టికుట్టు, కూడబెట్టినధనము, ఆయము, స్థితి, **بخیہ ادھیڑنا** — ఉధేడ్నా (ఉ) గుట్టుబయలుపరచుట.

**بد** బద్ (హి.స్త్రీ) గజ్జబిళ్లలు, గడ్డలరోగము

**بد** బద్ (పా) దూషితము, దుష్ట, చెడు.

**بد اخلاق** — బద్అఖ్లాక్ (పా) అనాగరికుడైన, మర్యాదలు తెలియని, దుర్వర్తనగల, మోటు, **بد اسلوب** — బద్-అస్లూబ్ (పా) వికారమైన, మోటు. **بد اصل** — బద్ అస్ల్ (పా) అల్పుడు, నీచుడు, **بد اعمالی** — బద్-అఉమాలీ (పా) దుర్వర్తనము, అవినీతి,

**بد افعال** — బద్అఫ్అల్ (పా) దుష్కార్యములు, **بد انتظامی-عملی** — బద్ఇంతిజామీ, అమలీ (పా) అవ్యవస్థ, అరాజకము, అక్రమము, **بد اندیش-باطن** — బద్అందేష్-బాతిన్ (పా) ద్రోహచింతగల, **بد بخت-نصیب** — బద్-బఖ్త్-నసీబ్ (పా) నిర్భాగ్యుడైన, దురదృష్టవంతుడైన

**بدبو**—బద్‌బూ (పా) దుర్గంధము. **بدتر**—బద్‌తర్ (పా) మిక్కిలిచెడు, అతిదుష్టము, **بدجانور**—బద్‌జాన్వర్ (పా) సూకరము, పంది, **بدحال**—బద్‌హాల్ (పా) దుస్థితిలోనున్న,రిక్తుడైన, **بدحواس**—బద్‌హవాస్ (ఉ) చిత్తభ్రమగల,కలవరపడిన, **بدخط**—బద్‌ఖత్ (పా) వ్రాతకుదురనివాడు.

**بددماغ**—బద్‌దమాగ్ (పా) గర్వపోతు, **بدرکاب**—బద్‌రికాబ్ (పా)పోకిరి (గుఱ్ఱము) **بدزبان**—బద్‌జబాన్ (పా) తిట్టుబోతు, **بدساعت**—బద్‌సాఅత్ (పా) దుర్ముహూర్తము, **بدشکل-صورت**—బద్‌షిక్ల్-సూరత్ (పా) వికారమైన, కురూపియైన. **بدشگون**—బద్‌షగూన్ (ఉ) దుశ్శకునము. **بدظن**—బద్‌జన్ (పా) అనుమానముగల. **بددعا**—బద్‌దుఆ (పా) శాపము. **بدعہد**—బద్‌అహ్ద్ (పా) విశ్వాసభంగము,ద్రోహము. **بدفعلی**—బద్‌ఫైలీ (పా)రంకుతనము. **بدکار-کردار**—బద్‌కార్-కిర్‌దార్ (పా) దురాత్ముడు, అపకారి. **بدگمانی**—బద్‌గుమానీ(పా)స్పర్థ,అనుమానము. **بدگو**—బద్‌గో[పా]పరువవాది, చాడీగొట్టు. **بدلگام**—బద్‌లగామ్(పా)పోకిరిగుఱ్ఱము, పోకిరివాడు, **بدمزاج**—బద్‌మిజాజ్ [పా]కోపిష్టి, దుస్స్వభావముగల. **بدمزگی**—బద్‌మజ్గీ [పా] రుచిహీనత,అసమాధానము. **بدمزہ**—బద్‌మజ [పా] చప్పని,రుచిహీనమైన.

**بدمست**—బద్‌మస్త్(పా) దుర్మదాంధుడు, తప్పత్రాగి మైమరచినవాడు.

**بدمعاش**—బద్‌మఆష్[పా] దుర్వృత్తిగల, దురాత్ముడు,పలువ,కూళ **بدنامی**—బద్‌నామీ(పా)అపవాదము,నింద.

**بدنما-نمود**—బద్‌నుమా-నమూద్ [పా] వికారము;అనాకారము,అరోగ్యము, అవలక్షణము,కూడని,తగని. **بدنیت**—బద్‌నియ్యత్(పా) అవినీతి. **بدوضع**—బద్‌వజఅ (పా) వికారమైన. **بدہضمی**—బద్‌హజ్మీ (పా) అజీర్ణము.

**بدا** బిదా (హి.స్త్రీ) ఎడబాటు, సెలవు, వీడ్కోలు,అంపకాలు.

**بدا** బదా(హి.పు)విధి,దైవము.

**بدایت** బదాయత్ (అ.స్త్రీ) ఆరంభము, నవీనత,నూతనము.

**بدایع** బదాయిఅ(అ.పు)అద్భుతములు, అపూర్వమైనవి,గరవులు (ఏవ-**بدیع**).

**بدر** బద్ర్ (అ.పు) పూర్ణచంద్రుడు, పూర్ణమాసి.

**بدر** బదర్ (పా)బయట-వెలుపల.

**بدرو** బదర్రౌ(పా.స్త్రీ)జలదారి, కాలువ, తూము.

**بدرقہ** బద్‌రక(పా.పు)అనుపానము, మందుతో గూడ జేర్పబడునది, తోడిబాటసారి, త్రోవచూపువాడు,అనుచరుడు,బంటు, సహాయము,ఉపాయము,పరిహారము.

**بدری** బద్రీ(హి.స్త్రీ)సంచి,కరతిత్తి.

**بدری** బిద్రీ(హి) పంచలోహముపై వెండిచెక్కడపుపనిచేసినది

**بدستور** బదస్తూర్ (పా)యథాప్రకారము, మునుపటివలెసాంప్రదాయానుసారము, యథాపూర్వము.

**بدعت** బిద్అత్ (అ.స్త్రీ)మార్పు, నూతనాచారము,నవీనకల్పన, మతభేదము-భిన్నాభిప్రాయము,క్రౌర్యము.

**بدکانا** బిద్కానా(హి)బెదరించుట, పురిగొల్పుట,పరుగెత్తించుట(గుఱ్ఱమును).

**بدکنا** బిదక్నా(హి) బెదరుట,ఉలికిపడుట.

**بدل** బదల్ (అ.పు)పరివర్తనము, మార్పు, మారుప్రతి, తరుగు,ప్రతిఫలము.

**بدل** బదిల్(పా)మనఃపూర్వకముగా.

**بدلا** బద్లా (అ.పు) మాఱు,ప్రతి, ప్రతీకారము,ప్రతిఫలము,అపరాధము,దండన,శిక్ష, వేతనము,కూలి.

**بدلائی** బద్లాయి (ఉ.స్త్రీ) మార్పు—పువట్టిము,తఱుగు,మార్పు—ము,వట్టము.

**بدلنا** బదల్నా (ఉ) మార్చుట. (بدلائی)

**بدلوائی** బదల్వాయీ (ఉ.స్త్రీ) చూడు

**بدل** బద్ల (ఉ.పు) చూడు, بدلا

**بدلی** బద్లీ (ఉ.స్త్రీ) మార్పు,ప్రత్యామ్నాయము, మాఱు; మేఘశకలము, కొద్దిపాటి మబ్బు.

**بدن** బదన్ (అ.పు) దేహము, శరీరము, **بدن پھولجانا** బదన్ —ఫూల్ జానా (ఉ) ఒడలు పేలుట, **بدن ٹوٹنا** బదన్ —టూట్నా (ఉ) ఒడలునొప్పులుపట్టుట, **بدن چرانا** బదన్ —చురానా (ఉ) దేహమున్న గిలుట,ఒడలుదాచికొనుట, పనికి వెనుకదీయుట.

**بدنا** బద్నా (హి) ఒడ్డుట,పందెము పెట్టుట, మాటయిచ్చుట,నిర్ణయించుట.

**بدو** బద్దూ (ఉ) నిందితము,దూషితము, ఒక తెగ అరబ్బులు,మోటువాడు.

**بدولت** బదౌలత్ (పా) అనుగ్రహము వలన,ప్రసాదముగా,మూలమున, వలన, కారణముచేత. (ఇంకా.

**بدون** బిదూం (పా) వినాగా, కాక,తప్ప,

**بدھ** బిధ్ (హి.స్త్రీ) విధి,దైవము,కలియుట, కూటము,యోగము.

**بدھائی۔وا** బధాయీ—వా (హి.స్త్రీ) కట్నములు,మంగళహారతి, పెండ్లిపాటలు.

**بدھنا۔نی** బధ్నా-నీ (హి. పు. స్త్రీ) కొమ్ముముంత,పిడత. **بدھنا بوریا** —బధ్నా బోరియా (హి) చెరవముంత,ఆస్తి,చరాస్తి

**بدھوا** బిధవా (హి.స్త్రీ) విధవ.

**بدھی** బుద్ధీ (హి పు) బుద్ధి,జ్ఞానము.

**بدھی** బద్ధీ (హి.స్త్రీ) హారము,వాత,తోలువారు,మంగలవానిచిమ్మటు.

**بدھیا** బధియా (హి.స్త్రీ) ఎద్దు,పిడికొట్టినపశువు, నపుంసకుడు, పేడి.

**بدی** బదీ (హి.స్త్రీ) కృష్ణపక్షము.

**بدی** బదీ (పా.స్త్రీ) చెడుగు,కీడు, దౌర్భాగ్యము,దూషణ,చాడి.

**بدیا** బిద్యా (హి.స్త్రీ) విద్య,శాస్త్రము.

**بدیس** బిదేస్ (హి.పు) విదేశము,పరదేశము.

**بدیع** బదీఉ (అ) అపూర్వమైన,క్రొత్త.

**بدیہہ** బదీహ్ (అ.పు) స్వతస్సిద్ధము, స్పష్టము,సద్యస్ఫూర్తి, సమయోచితము, తాత్కాలికము,అచింతితము. (తితము.

**بدیہی** బదీహీ (అ) స్వతస్సిద్ధమైనది. అచిం

**بڈھا** బుఢ్ఢా (హి) ముసలి,వృద్ధు.

**بذاتہ** బిజాతిహీ (అ) స్వతః, స్వాంతముగా

**بذل** బజ్ల్ (అ.పు) బహుమానము,వ్యయము

**بذلہ** బజ్ల (అ.పు) అపహాస్యము, ఎగతాళి సరసపుమాట.

**بر** బర్ర్ (అ.పు) మెట్టభూమి, ఎడారి,భూభాగము. **برا عظم** —బర్రె-ఎ,అజమ్ (అ.పు) భూఖండము,

**بر** బర్ (హి.పు) వరము, వరుడు, పెనిమిటి, పెండ్లికొడుకు, (స్త్రీ) కందిరీగ.

**بر** బర్ (పా.స్త్రీ) స్తనము, రొమ్ము, హృదయము,ఫలము,కౌగిలి, వెడల్పు

**بر** బర్ (పా) మీద,పైన,అందు, వెలుపల **برآنا** —బర్ ఆనా [ఉ] పైకివచ్చుట, సిద్ధించుట,నెరవేరుట, తీరుట, **برخلاف** —బర్ఖిలాఫ్ [పా] విరుద్ధముగా, **برمارنا۔ہانکنا** —మార్నా-హాంక్నా [ఉ] దంబములు, కొట్టుట, **برمحل۔موقع۔وقت** —బర్మహాల్-మౌకఉ-వక్త్ [పా] సమయోచితముగా,సందర్భానుసారముగా.

**برا** బురా [హి] చెడ్డ, చెడు, దూషితము.
**برا بھلا**—భలా [హి] మంచిచెడ్డలు,ఉచ్చనీచములు. **برا ماننا**— మాన్నా [హి] కోపపడుట, చెడుగాదలచుట.తప్పుగా నెంచుట.

**برابر** బరాబర్ [పా] సమానమైన,సరియైన, స్పష్టమైన, చదునైన,తగిన,అర్హమైన, ఎడతెగక,క్రమమైన,సరిగా, సాటిగా, సమానముగా. (నముగా.
**برابر برابر**—బరాబర్ [పా] సరిసమా

**برابری** బరాబరీ[పా.స్త్రీ]సమానత,సామ్యము,పోటి, స్పర్థ. **برابری کرنا**—కర్నా [ఉ]సరితూగుట,స్పర్థించుట.

**برات** బరాత్ [పా.స్త్రీ]బరాతము, సెలవు, చీటి,అధికారపత్రిక, [అ]వివాహ సనము.

**براق** బురాక్ (అ.పు) పైగంబరుగారు స్వర్గమునకుఎక్కి పోయినఅశ్వతరము.

**برآمد** బరామద్ (పా.స్త్రీ) బైటవచ్చుట, ఉత్పత్తి,ఆదాయము, ఏటివాక,వంగు పేరుటచే తేలినభూమి. **برآمد ہونا**—హోనా (ఉ) బయటవచ్చుట, దొరకుట, బయలుపడుట.

**برآمده** బరామ్దా (పా.పు) పంచసాళి,వసారా,కూటము,దొరకినసొమ్ము. (గలది.

**بران** బుర్రాన్ (పా) నిశితము, మిక్కిలివాడి

**برانداز** బరందాజ్ (పా) పాడుచేయు, అతివ్యయముచేయు,దూబరదిండి; తెర, కప్పు.

**براورد** బరావుర్ద్(పా.స్త్రీ) బరాతము, లెక్క,అంచన,మతింపు, వేతనపత్రము, వేతనపట్టిక.

**براہمن** బ్రాహ్మన్ (హి.పు) బ్రాహ్మణుడు.

**برائی** బురాయీ (హి.స్త్రీ)చెడుగు, కీడు, దూషణ,దుర్మార్గము.

**برائے** బరాయ్(పా)కొరకు,కై. (పనికిమాలిన.
**برائے نام**—నామ్ (పా) నామకార్థము,

**برباد** బర్బాద్(పా) అధ్వానము, పాడైన, బీడైన,వ్యర్థమైన,నాశమైన.

**بربادی** బర్బాదీ (పా.స్త్రీ)నాశము,పాడు.

**بربط** బర్బత్ (పా.స్త్రీ)ఒకవిధమైనవీణ.

**برپا** బర్పా(పా)నిలిచిన-స్థాపితమైన, ఉపస్థితమైన. **برپا ہونا**—హోనా(ఉ) నిలుచుట, సంభవించుట, కలుగుట, ఆరంభమగుట.

**برت** బరత్ (హి.పు)వ్రతము. (సహాయము.

**برتا** బిర్తా(హి.పు)శక్తి-సామర్థ్యము-బలము,

**برتانا** బర్తానా (హి)భాగించుట,పంచుట.

**برتاو** బర్తావ్ (హి.పు) వర్తనము-నడవడిక, వాడుక,అభ్యాసము.

**برتر** బర్తర్(పా)ఉత్తమము, మేలుతరము.

**برتری** బర్తరీ(పా.స్త్రీ)ఔన్నత్యము, శ్రేష్ఠత,ఆధిక్యత.

**برتن** బర్తన్(హి.పు) భాండము, బాసన, పాత్రము. (గించుట.

**برتنا** బరత్నా (హి) వాడుట, ఉపయో

**برج** బుర్జ్ (అ.పు) వర్తులగృహము, గుండ్రనియిల్లు,అట్టము,కొప్పరము, గోపురము, కలశము,గుమ్మటము,కోటకొమ్ము, మేషాదిరాసులలోనొకటి.

**برج** బిర్జ్(హి.పు) వ్రజము,బృందావనప్రాంతదేశము, గోకులము. **برج بھاشا**—భాషా (హి.స్త్రీ) వ్రజభాష, గోకులబృందావనప్రాంతదేశపుభాష.

**برجستہ** బర్జస్త(పా) సమయస్ఫూర్తి, సమయోచితము,యోగ్యము.

**برجنا** బర్జ్నా (హి) వర్జించుట, నిషేధించుట.

**برجی** బుర్జీ(ఉ.స్త్రీ)చిన్న గోపురము, కలశము.చూడు برج

**برچھا-برچھی** బర్ఛా-బర్ఛీ(హి.పు)అత్తలము,కుంతము; బల్లెము,ఈటె.

**برچھا دار** —బర్ఛా దార్(హి)ఈటెకాడు,బల్లెపుబంటు.

**برچھک** బిర్ఛక్(హి.పు)తేలు,వృశ్చికరాశి.

**برچھیت** బర్ఛయిత్(హి.పు)ఈటెకాడు.

**برحق** బర్హక్(పా) యథార్థము,నిజము, న్యాయము.

**برخاست** బర్ఖాస్త్(పా.స్త్రీ) లేచుట, ఆపుదల,నిలుపుదల, తీసివేయుట, ఎత్తివేయుట. **برخاست کرنا** —బర్ఖాస్త్ కర్నా (ఉ) నిలిపివేయుట,తీసివేయుట, ఎత్తివేయుట.

**برخاستگی** బర్ఖాస్తగీ(పా.స్త్రీ) ఆపుదల-తీసివేయుట.

**برخوردار** బర్ఖుర్దార్(పా.పు) వర్ధిల్లువాడు,చిరంజీవి-పుత్రుడు,కొడుకు.

**برخورداری** బర్ఖుర్దారీ(పా.) సంతాన భాగ్యము,కొడుకులు.

**برد** బుర్ద్(పా.స్త్రీ)పైవరుమానము, లాభము, లంచము, రాజుఒకడే మిగిలిన చదరంగపు ఆట.

**بردار** బర్దార్(పా.పు)ధరుడు,ధారుడు, ధరము,వాహకుడు,మోయువాడు,ధరించువాడు, ధారి(దారి). (వహనము_వాహము.

**برداری** బర్దారీ(పా.స్త్రీ) ధరణము, మోత,

**برداشت** బర్దాష్త్(పా.స్త్రీ) సహనము, ఓర్పు,ఉద్వేగవ్యాపారము.

**برداشتہ** బర్దాష్త[పా]ఎత్తిన,నిలిపిన,తీసివేసిన. **برداشتہ خاطر ہونا** —బర్దాష్త ఖాతిర్ హోనా(ఉ) విముఖుడగుట, నిరాశజెందుట,అధైర్యపడుట, కలవరపడుట, మనసు విరుగుట.

**بردبار** బుర్ద్‌బార్ (పా) బరువుమోసెడు, సహనముగల,గంభీరుడగు,ఓర్పుగల.

**بردباری** బుర్ద్‌బారీ (పా.స్త్రీ)సహనము, ఓర్పు,గాంభీర్యము,నెమ్మతి.

**بردہ** బర్ద[పా.పు]బానిస,దాసుడు.

**بردہ فروشی** —బర్దఫరోషీ[పా] బానిస వ్యాపారము.

**برزخ** బర్‌జఖ్[అ.పు]అడ్డము, అవకాశము, అంతరము,మరణమునకును పుణ్యాపాపనిర్ణయదినమునకు మధ్యనుండు కాలము, మధ్యకాలము, మధ్యస్థలము, వ్యవధి, విరుద్ధవస్తువులనడుమనుండునది,(భ్రమ, మహమ్మదీయుల స్వర్గనరకముల నడిమిగోడ.

**برزن** బర్‌జన్[పా.పు]సందు, వీధి, ఎడారి, బయలు,వాడ,నగరు.

**برس** బరస్[హి.పు] వర్షము, సంవత్సరము. **برس گانٹھ** —బరస్ గాంఠ్ [హి.పు] వర్ధంతి, పుట్టినదినపుటుత్సవము, ఏటేట వేయుతోరపుముడి,

**برات** బరాత్[హి,స్త్రీ]పెండ్లికొడుకు,ఊరేగింపు,పెండ్లి[కొడుకువైపు]వారు,గుంపు.

**براتی** బరాతీ[హి.పు] పెండ్లివారు,పెండ్లికొమరునివెంటవచ్చినవారు.

**براجمان** బిరాజ్మాన్[హి] విరాజమానుడు, విజయముచేసిన, అలంకరించిన, వచ్చిన,కూర్చున్న.

**برادر** బిరాదర్ [పా పు] భ్రాతృ-సోదరుడు,తోబుట్టువు. **برادر اخیافی** —బిరాదర్ అఖ్‌యాఫీ[పా]మారుతండ్రికొడుకు.

**برادر علاتی** —బిరాదర్ అల్లాతీ [పా] సవతితల్లికొడుకు. **برادر حقیقی-عینی** —

హా కీ కీ—అయానీ [పా] సోదరుడు, సొంతసోదరుడు. برادر رضائی —బిరాదర్ రజాయీ [పా]తననుపెంచినదాదికొడుకు

برادر زاده —బిరాదర్‌జాద] పా]భ్రాతృజుడు, సోదరునికొడుకు.

**برادری** బిరాదరీ [పా.స్త్రీ] దాయాద్యము, బాంధవ్యము,కులము,వంశము.

**برادہ** బురాద (పా.పు) నుగ్గు,నుసి,పొడి, కోసినలేక చెక్కినపొడి.

**براز** బరాజ్ [అ.పు] మలము,పురీషము.

**براق** బర్రాక్ [అ] ధగధగితము, ధవళము, వడిగల,చురుకుగల. (దినము.

برسویں بن —బర్‌సవేఁదిన్ (హి)ఏడాదికొక

**برسات** బర్సాత్ (హి.స్త్రీ)వాన,వర్షకాలము.

**برساتی** బర్సాతీ (హి.స్త్రీ)వానచొక్కాయ, మేలుమిద్దె, పశురోగభేదము.

**برسانا** బర్సానా(హి)కురిపించుట,పొట్టుచెరుగుట, వేలుచేయుట, చేటతోతాలుచుట,తూలుపారపోయుట.

**برساؤ** బర్సావ్ (హి) కురిసెడు,వర్షించెడు.

**برسنا** బరస్నా(హి)కురియుట,వర్షించుట.

**برسی** బర్సీ(హి.స్త్రీ)ఆబ్దికము,తద్దినము.

**برص** బర్‌స్ (అ.పు)కుష్ఠరోగము, తెల్లకుష్ఠు.

**برطرف** బర్తరఫ్(పా)ప్రక్కకు,తీసివేసిన -ఆపివేసిన. برطرف کرنا —బర్తరఫ్‌కర్నా (ఉ) తీసివేయుట,త్రోసివేయుట.

**برطرفی** బర్తరఫీ(పా.స్త్రీ) తీసివేత,ఆపుదల,త్రోసివేత,త్రోపుడు.

**برعکس** బర్‌అక్స్(పా)విరుద్ధము,విపర్యయము,వ్యత్యయము.

**برف** బర్‌ఫ్(పా.స్త్రీ)మంచుగడ్డ. (సం॥

**برفانی** బర్‌ఫానీ(పా) హైమము, మంచు

**برفی** బర్‌ఫీ (పా.స్త్రీ) భక్ష్యభేదము, మంచు సం॥

**برق** బర్‌క్(అ.స్త్రీ)విద్యుత్తు, పిడుగు.

برق دم —బర్క్‌దమ్(ఉ)సంసిద్ధము, ప్రకాశమానము,తీక్ష్ణము. برق انداز —బర్క్‌అందాజ్ (పా) తుపాకిబంటు.

**برقرار** బర్‌కరార్ (పా)స్వస్థము,యథాస్థితము, స్థిరము, నిలిచియున్న, ఉన్నది ఉన్నట్టు. (వస్త్రము,ముసుగు.

**برقع** బుర్‌కఅ(అ.పు)తిరస్కరిణి, ముఖ

**برکات** బర్‌కాత్ (అ.స్త్రీ) లాభములు చూడు (ఏక [برکت]

**برکت** బర్‌కత్ (అ.స్త్రీ) శుభము, భాగ్యము,సమృద్ధి,లాభము,ప్రసాదము.

**برکنا** బురక్నా(హి)చల్లుట, చిలకరించుట.

**برگ** బర్గ్(పా.పు)ఆకు,వంటసామగ్రి, సంభారము,ఆయుధము, రొట్టె, రాగము, వస్త్రము, మేళము, ఒకవాద్యము, పర్ణము, రేకు.

**برگزیده** బర్గుజీద(పా)వరిష్ఠము, ప్రియమైన,ఏరిన,వరించిన,ఏర్పరచిన, శ్రేష్ఠమైన.

**برگشتگی** బర్గష్తగీ(పా.స్త్రీ) తిరుగబడుట, మళ్లబడుట,తిరుగుదల, తిరుగుడు, తిరుగుబాటు-మార్పు,పరివర్తనము,విప్లవము.

**برگشته** బర్గష్త(పా)మారిన,తిరిగిన, మరలిన, తిరుగబడిన,మళ్లబడిన,పరివర్తితము.

**برلانا** బర్లానా (ఉ) నెరవేర్చుట, సిద్ధింపజేయుట.

**برما** బర్మా(హి.పు)పిడిసాన,ఆస్ఫోటని.

**برمانا** బర్మానా (హి) పిడిసానబట్టుట, చిల్లులువేయుట. (రొదుట.

**برملا** బర్మలా(పా) బహిరంగముగా,అందరి

**برن** బరన్ (హి.పు) వర్ణము,వన్నె.

برنا బర్నా (పా.పు) తరుణుడు, యువకుడు,

برنج బిరింజ్ (పా.పు) బియ్యము, ఇత్తడి.

برنج کابلی —బిరంజ్ కాబులీ (పా.పు) వాయుపిడంగములు. (చీల.

برنجی బిరంజీ (పా) ఇత్తడిపాత్ర, చిన్న

برنن బర్నన్ (హి.పు) వర్ణనము.

بروا బిర్వా (హి.పు) చెట్టు, పిల్లవాడు.

بروت బరూత్ (పా.స్త్రీ) మీసములు, బుగ్గమీసములు.

بروٹ బర్వట్ (హి.పు) ప్లీహము

برودت బురూదత్ (అ.స్త్రీ) శీతలము, చల్లదనము.

بروج బురూజ్ (అ) చూడు (ఏ-వ (برج

برومند బరోమంద్ (పా) అదృష్టవంతుడు భాగ్యముగల.

برہ బర్రా (పా.పు) మేకపిల్ల, గొర్రెపిల్ల.

برہان బుర్హాన్ (అ.పు) తర్కము, వాదము, దృష్టాంతము, సిద్ధాంతము. (స్వతి.

برہسپت బృహస్పత్ (సం.పు) బృహ

برہم బ్రహ్మ (సం.పు) బ్రహ్మ, బ్రహ్మము.

برہم బర్హమ్ (పా) క్రిందమైన, తారుమారైన, కలతజెందిన, అసమాధానపడిన, కుపితుడు, కోపపడిన.

برہمن బ్రహ్మన్ (సం.పు) బ్రాహ్మణుడు

برہمی బర్హమీ (పా.స్త్రీ) క్రిందుమీదు, తారుమారు, గందరగోళము, అవ్యవస్థ, అరాజకము, కలవరము, అసమాధానము. (త్రైల.

برہنگی బరహ్నగీ (పా.స్త్రీ) నగ్నత, బి

برہنہ బరహ్నా (పా) నగ్నమైన, బిత్తలమైన, برہنہ پا —బరహ్నాపా (పా) వట్టికాళ్లు.

برہی روتی బర్హీరోటీ (హి.స్త్రీ) ఏదైనఒక వస్తువును పూర్ణముగాపెట్టిచేసిన రొట్టె, పూర్ణపుబూరె.

بری బరీ (హి.స్త్రీ) కాల్చియార్చినసున్నము.

بری బరీ (హి.స్త్రీ) పెండ్లిసారె, పెండ్లికూతురికిపంపుకట్నము.

بری బరీ (అ) విడుదలపొందిన, నిర్దోషియైన, స్వేచ్ఛగల, విముక్తుడు, بری الزمہ —బరియుజ్జిమ్మ (అ) ఉత్తరవాదరహితుడు,

بری బఱ్ఱీ (అ) భూసం॥, మెట్ట, అడవి, బయలు

بری బరై (హి.పు) తమలపాకులవాడు.

بری బురీ (హి) చెడు, దూషితము, దుష్టము.

بریاں బిర్యా(పా) వేయించిన, వండిన.

بریانی బిర్యానీ (పా.స్త్రీ) వేయించినమాంసము వేసివండిన పక్వాన్నము.

بریت బరియ్యత్ (అ.స్త్రీ) విమోచనము, విడుదల, నిర్దోషిత్వము.

بریٹھا బరేఠా (హి.పు) చాకలివాడు, రజకుడు.

بریٹھن బరేఠన్ (హి.స్త్రీ) చాకలిది.

بریدہ బురీద (పా) ఛేదితము, కోసిన.

بریں బరీ(పా) ఉత్తమము, ఉన్నతము, అధికము, గొప్ప, ఘనమైన, వరీయము.

بڑ బడ్ (హి.పు) వటవృక్షము, మఱ్ఱిచెట్టు,

بڑ బడ్ (హి) పెద్ద. بڑبولا —బడ్‌బోలా (హి) ఎచ్చులమారి. بڑپیٹو —బడ్‌పేటూ (హి) తుండిలుడు, తిండిపోతు. بڑکنا —బడ్‌కన్నా (హి) దీర్ఘకర్ణము, నిడుపుచెవులుగలవాడు.

بڑا బడా (హి.పు) పెద్ద, దొడ్డ, గొప్ప, ఘనమైన, గౌరవముగల, ముఖ్యమైన, నిడుపైన, లావైన, పొడుగైన, ఎత్తైన. بڑا ابا —బడాఅబ్బా (హి) పెద్దబ్బ, పెత్తండ్రి. بڑا بول —బడాబోల్ (హి) గర్వోక్తి, ఎచ్చులమారి, ఎచ్చులు. بڑاپا —బడాపా (హి) పెత్తనము, ముదిమి. بڑا دن —బడాదిన్ (హి) క్రీస్తుజయంతి, క్రీస్తుపుట్టినదినము.

بڑا راستہ پکڑنا — రాస్తపకడ్నా (ఉ) చచ్చుట, పెద్దనిద్దురపోవుట. بڑا روگ — రోగ్ (హి) రాజయక్ష్మ. بڑا گھر — ఘర్ (హి) చెరసాల, పరలోకము.

بڑا బడా(హి.పు) వడ, గారె.

بڑادن బడాదన్(హి.స్త్రీ) పెద్దదాసి.

بڑانا బడానా (హి) జరపుట, నెట్టుట, ద్రోబ్బుట, గ్రుచ్చుట, కూరుట, ఎక్కించుట, చొప్పించుట, కలవరించుట.

بڑّانا బడ్డానా(హి) వదరుట, పలవరించుట.

بِڑانا బిడానా(హి) కలవరపడుట.

بڑائی బడాయీ(హి.స్త్రీ) గొప్పపరిమాణము, గొప్పతనము, పెద్దరికము, ఆధిక్యత, గురుత్వము, గౌరవము, మర్యాద, ఎచ్చులు, డంబము, పెత్తనము, ప్రగల్భము, జంభాలు.

بڑبڑ బడ్‌బడ్(హి) విప్రలాపము, ప్రేలుట, పలవరింపు, వదరుడు, కలవరింత.

بڑبڑانا బడ్‌బడానా(హి) గొణగుట, గునియుట, పలవరించుట, వదరించుట.

بڑبڑیا బడ్‌బడియా (హి.పు) వదరుబోతు ఎచ్చులమారి. (వము

بڑپنا బడ్‌పనా (హి.పు) పెత్తనము, గౌర

بڑکا బుడ్కా(హి) బుక్క, బుక్కడుపట్టు.

بڑکی బుడ్కీ (హి.స్త్రీ) మునక, మునుక, బుడుక. (వృద్ధురాలు·

بڑما బడామ్మ (హి.స్త్రీ) పెద్దమ్మ, అవ్వ,

بڑنا బఢ్నా(హి) ప్రవేశించుట, దూరుట.

بڑنگا బడంగా(హి.పు) మూలము.

بڑھاپا బుఢాపా (హి.పు) వృద్ధాప్యము, ముసలితనము. (కాలవిందు.

بڑھار బఢార్ (హి.పు) అంపకాలు, అంప

بڑھانا బఢానా (హి) అధికముజేయుట, సాగదీయుట, ఎక్కువచేయుట, పెద్దగాచేయుట, పొడిగించుట, చాపుట, జరుపుట, ఎత్తుట, ప్రోత్సాహపెట్టుట, ఎక్కించుట, పొగడుట, చల్లార్చుట, తీసివేయుట, నిలుపుట, మీరించుట, నెట్టుట, ఆపుట, వృద్ధిజేయుట, పెంచుట. (విస్తారత, పెంపు.

بڑھاو బఢావ్ (హి.పు) విలంబనము, వృద్ధి

بڑھاوا బఢావా (హి.పు) ఆధిక్యము, ముఖస్తోత్రము, ప్రేరేపణము, ఎక్కులు, ఎక్కించుట, మోసము.

بڑھتی బఢ్తీ (హి.స్త్రీ) వృద్ధి, పెంపు, సంపత్తు, పెచ్చు, హెచ్చు, ఆధిక్యము, వృద్ధిలోనున్న, పెంపుగల.

بڑھنا బఢ్నా (హి) ఎక్కువగుట, పెరుగుట, వృద్ధియగుట, విస్తరిలుట, హెచ్చుట, వర్ధిలుట, ఎత్తగుట, అధికమగుట, ముందుకుజరుగుట, మీరుట, మించుట, చెల్లారుట, మాయబడుట.

بڑھنت బఢంత్ (హి.స్త్రీ) వృద్ధి.

بڑھوتر ـ تری బఢోతర్-తరీ(హి) పెచ్చు, హెచ్చు, వడ్డి, ఆదాయము, లాభము, ఆధిక్యము.

بڑھئی బఢై (హి.పు) వడ్రంగి, వడ్లవాడు.

بڑھیا బఢియా (హి) ఉత్తమమైన, మేలుతరమైన.

بڑھیا బుఢియా (హి.స్త్రీ) వృద్ధురాలు.

بڑھیا کا کانا — కాకానా (హి) ఒకవిధమైనతినుబండము, తురిమిన గుమ్మడికాయతో చేసినది, కజ్జాయము.

بڑھیل బుఢియల్ (హి.స్త్రీ) ముసలిది.

بڑی బడీ (హి.స్త్రీ) వడియము.

بڑی بی బడీబీ (హి.స్త్రీ) పెద్దమ్మ, అవ్వ-ముసలమ్మ.

بڑے میاں బడేమియాఁ (హి.పు) తాతయ్య, ముసలయ్య, పెద్దయ్య.

بز బుజ్ (పా.పు) మేకపోతు. بزدلا —బజ్‌దిల్-లా (పా) పిరికిపంద. بزدلی —బజ్‌దిలీ (పా) పిరికితనము. بزاخفش —బజ్‌-ఎ-అఖ్‌ఫష్ (పా) బుద్ధిహీనుడు, జడుడు.

بزغاله —బజ్‌గాల (పా) మేకపిల్ల, అడవి మేక.

بز బజ్‌జ్ (అ.పు) నారబట్ట-బట్ట.

بزاز బజ్‌జాజ్ (అ.పు) బట్టలవర్తకుడు.

بزازا బజ్‌జాజా (అ.పు) బట్టల యంగడి.

بزازی బజ్‌జాజీ (అ.స్త్రీ) బట్టలవర్తకము

بزرگ బుజుర్గ్ (పా) గొప్ప-పెద్ద-దొడ్డ-ప్రభువు-స్వామి-మహాత్ముడు-పూర్వికుడు పూజ్యుడు. بزرگ منش —బజుర్గ్‌మనిష్ (పా) పెద్దమనిషి.

بزرگوار —బజుర్గ్‌వార్ (పా) పూర్వికుడు, మహాత్ముడు, పూజ్యుడు. بزرگواری —బజుర్గ్‌వారీ (పా.స్త్రీ). పూజ్యత, మాన్యత, గొప్పతనము.

بزرگی బుజుర్గీ (పా.స్త్రీ) పెద్దతనము, గౌరవము,

بزله బుజ్‌ల (అ.పు) పరిహాసము.

بزم బజ్మ్ (పా.స్త్రీ) చదురు, సదస్సు, సభ, సమాజము, విందు. بزمگاه —బజ్మ్‌గాహ్ (పా) విలాసస్థానము, రంగము, చదురుపట్టు, సభాస్థలము. (లవంతముగా.

بزور బజోర్ (పా) బలాత్కారముగా, బ

بس బస్ (పా) చాలు, చాలినంత-పుష్కలము, అధికము, చాలు. بس کرنا —బస్‌కర్నా—చాలించుట, నిలుపుట. (ధికారము.

بس బస్ (హి.పు) వశము, శక్తి, సామర్థ్యము, అ

بس బిస్ (హి.పు) విషము.

بس کی گانٹھ —బిస్‌కీగాంఠ్ (హి) విషపాల విత్తు, అతిదుర్మార్గుడు.

بسا బసా (పా) అనేకము, చాల, సేన. (తలుచు

بسا اوقات —బసా-అవ్‌కాత్ (పా) పలుమారు,

بسا బసా (హి) పరిమళముగల, వాసితము.

بسات బసాత్ (హి.స్త్రీ) విస్తృతము, పఱుపు, వైశాల్యము, విరివి, అర్హత, సామర్థ్యము, అధికారము, సంచయము, మూలము, ఆస్తి, బండారము. (సమేళ్లవాడు.

بساتی బిసాతీ (హి.పు) చిల్లరవర్తకుడు, పూ

بسار బిసార్ (హి.స్త్రీ) నాగుబు, విత్తుకాలము నధాన్యము అప్పుగానిచ్చి పంటకాలమున ఇమ్మడిముమ్మడిగాదీసికొను పద్ధతి.

بسارنا బిసార్నా (హి) విస్మృతిజెందుట, మరచుట. తప్పుట, పొరపడుట,

بساط బిసాత్ (అ.స్త్రీ) విస్తృతి, విరివి, వైశాల్యము, పఱుపు, చాపు, సాగటాపాళి, చదరంగపుపలక, చూడు. بسات

بساطی బిసాతీ (అ పు) చూడు. بساتی

بسانا బసానా (హి) నివాసముచేయుట, ఊరుగట్టించుట. స్థాపించుట-కట్టించుట, పరిమళము పట్టించుట, నాశితముజేయుట, వాసనగట్టుట.

بساندا బిసాంద్-దా (హి) దుర్వాసనగల, కంపుగొట్టెడు.

بست బస్త్ (హి.స్త్రీ) వస్తువు, సామాను.

بست బిస్త్ (పా) ఇరువది, వింశతి.

بستار బిస్తార్ (హి.పు) విస్తారము.

بستان బుస్తాన్ (పా.పు) పూలతోట, పూదోట.

بستر బస్తర్ (హి.పు) వస్త్రము.

بستر బిస్తర్ (హి.పు) పఱుపు, పక్కచుట్టు.

بسترا బిస్త్రా (హి.పు) పక్కచుట్ట, పఱుపు, గోసాయిలమఠము.

بستگی బస్తగీ (పా.స్త్రీ) కట్టు, పట్టు, సంకో

చము, ముడుచుకొనుట, పేరుట.

**بستنی** బస్తనీ(పా.స్త్రీ)గవిసెన,సంచి.

**بستہ** బస్త(పా)బద్ధము,కట్టిన, పేరిన,(పు) కట్ట-మూట,మల్లె,మూటగుడ్డ,గోనె,సంచి,తుండు గుడ్డ. (నివాసము.

**بستی** బస్తీ (హి.స్త్రీ) ఊరు, జనపదము,

**بسر** బసర్ (ఉ) పూర్తియయిన, చాలిన.

**بسر آنا** బసర్-ఆనా(ఉ) ముగియుట, తుదముట్టుట,నెరవేరుట, సరిపోవుట, సరితూగుట, చాలుట-జరుగుట. **بسر کرنا** బసర్-కర్నా (హి) ముగించుట,నెరవేర్చుట,జరపుట, తీర్చుట-సరిపుచ్చుట. **بسر ہونا** బసర్-హోనా(ఉ) నెరవేరుట,కడతేరుట,జరగుట,సరిపోవుట.

**بسرام** బిస్రామ్ (హి.పు) విశ్రామము, విశ్రాంతి,ఆగుట. (జేయుట.

**بسرانا** బిస్రానా(హి)మరపించుట, టక్కు-

**بسرنا** బిసర్నా(హి)మరచుట, పొరపడుట.

**بسروچشم** బసరొచష్మ్(పా) కండ్లనద్దుకొని,సంతోషముతో,సగౌరవముగా.

**بسط** బస్త్(అ.పు)విస్తరము, విపులము, స్పష్టము,విశదము.

**بسمل** బిస్మిల్ (అ) "బిస్మిల్లా" యనుచు ఛేదించినపసువు, దేవుని పేరుమీదవధించినది.

**بسمل گاہ** బిస్మిల్-గాహ్ (పా) బలిస్థానము. బలిపీఠము.

**بسم اللہ** బిస్మిల్లాహ్ (అ) హరిఃఓం; దేవుని పేరుమీద; ఆరంభము-మొదలు.

**بسم اللہ کرنا** బిస్మిల్లా-కర్నా (ఉ) ఆరంభించుట-అక్షరాభ్యాసముచేయుట-భక్షణకై పశువులనరకుట. **بسم اللہ کا گنبد** బిస్మిల్లా-కా గుంబద్ (ఉ) శరణము-రక్షణస్థానము-ఆరంభదశ.

**بسنا** బస్నా (హి) నివాసముజేయుట-ఉండుట; పరిమళముగలదియగుట- సువాసనపట్టుట.

**بسنا** బిస్నా (హి) వినిమయునియంగడి-మార్కెపుఅంగడి-చిల్లరమార్పుఅంగడి-రొక్కసాల-రొక్కపుసంచి-బొక్కసము.

**بسنت** బసంత్(హి.స్త్రీ)వసంతఋతువు, రాగభేదము-స్ఫోటకము-వసంతము.

**بسنتی** బసంతీ (హి)పచ్చని-పచ్చదనము-స్ఫోటకము-అమ్మవారు. (గము-విశ్వ.

**بسوا** బిస్వా (హి.పు) బీగములో ౨౦-వ భా

**بسواس** బిస్వాస్ (హి.పు) విశ్వాసము-నమ్మకము. (ట్టుట-అంగలార్చుట.

**بسورنا** బిసూర్నా (హి) ఏడుపుముఖముపె

**بسولا** బసూలా (హి.పు) బాడిస-బాడిసువు. (అచ్చు.

**بسولی** బసూలీ (హి.స్త్రీ)ఇటుకలుకోయు

**بسوہ** బిస్వ (హి.పు) చూడు. **بسوا**

**بسے** బసే (పా) చూడు. **بسا**

**بسیار** బిస్యార్ (పా) పుష్కలము-అధికము-చాల-సేన.

**بسیٹھ** బసీఠ్[హి.పు]రాయబారి,సందేశహరుడు,మధ్యవర్తి,గ్రామకార్యదర్శి,చాడీగొట్టు.

**بسیرا** బసేరా(హి.పు) నిశావాసము, రేయియునికి,సాయంకాలము,ఒకరాత్రియుండుట,కపోతపాలిక.

**بسیط** బసీత్ (అ)పఱచిన, విశాలమైన-విస్తృతము,తన్మాత్రము,అమిశ్రితము,వ్యస్తము.

**بسیکھ** బిసేఖ్ (హి.పు) విశేషము,స్వభావము.

**بشارت** బషారత్(అ.స్త్రీ) శుభవార్త,ఈశ్వరప్రేరితము,దైవికజ్ఞానము-దివ్యవాణి,దివ్యజ్ఞానము.

**بشاش** బష్షాష్(అ)సంతోషముగల,ఆనందించిన,ఉల్లాసముగల,ఉత్సాహముగల.

**بشاشت** బషాషత్(అ.స్త్రీ) ఉల్లాసము,

ఆనందము,ఉత్సాహము

بشدت బషిద్దత్ (పా) అతిశయముగా, విశేషముగా, లెస్సగా,కఠినముగా.

بشر బషర్ (అ.పు) మానవుడు,మానిసి.

بشرطیکہ బషర్తేకె(పా) అయినట్టయితే, అయితే,అయినయెడల. (వైఖరి.

بشرہ బశ్రహ (అ.పు)ముఖము-ముఖాకృతి,ముఖ

بشریت బషరియ్యత్ (అ.స్త్రీ) మానుషత్వము,మానుషస్వభావము.

بشن-بشنو బిషన్-బిష్ణూ(హి.పు)విష్ణువు.

بشیر బషీర్ (అ.పు)సువార్త తెచ్చువాడు.

بصارت బసారత్ [అ స్త్రీ]దృష్టి,చూపు.

بصر బసర్ (అ.పు)కన్ను,దృష్టి, తెలివి,జ్ఞానము

بصیر బసీర్ (అ.పు)ద్రష్ట,చూచువాడు,జ్ఞాని, అనుభవశాలి.

بصیرت బసీరత్ (అ.స్త్రీ) దృష్టి,నైపుణ్యము-పరిజ్ఞానము,తెలివి, జాగ్రత,అంతర్ దృష్టి.

بضاعت బజాఅత్ (అ.స్త్రీ) మూలధనము,బండారము-సంచయము.

بط బత్ [అ.స్త్రీ]బాతు,బాతువు.

بطخ బత్తఖ్ [ఉ.స్త్రీ]చిన్న బాతు.

بطل బతెల్ [అ] నిష్ప్రయోజనము, వృథాయైన,పనికిమాలిన,మిథ్యయైన.

بطلان బుత్లాన్ [అ.స్త్రీ] మిథ్య,అబద్ధము, నిష్ప్రయోజనము, తుచ్ఛము.

بطن బత్న్ [అ.పు]కుక్షి, కడుపు, గర్భము, అంతరంగము.

بطنا بعد بطن బత్నన్ బఅద్ బత్నిన్ [అ] వంశపారంపర్యముగా.

بطون బతూన్ [అ.పు]అంతరంగములు, లోభాగములు. [ఏ-వ بطن ] (త, వెనుక.

بعد బఒద్ [అ]అనంతరము,తదుపరి, తరువా

بعد బుఒద్ [అ]దూరము,అంతరము.

بعض-بعضے బఒజ్-బఒజే[అ] కొందరు, కొన్ని,పరిపరి,పలు,అనేకము ప్రత్యేకము.

بعید బఈద్ (అ)దూరమైన,దవ్వైన,ప్రత్యేకమైన,పరాయి,అప్రస్తుతము,

بعید العقل బఈదుల్ అకల్ [అ]అసంగతము-అసంభావితము-అవజ్ఞము.

بعینہٖ బిఐనిహి [అ]అట్లే-తద్వతు-ఉన్నది ఉన్నట్లు-సాంగోపాంగముగా.

بغارا బుగారా(పా.పు) బొబ్బ,బొరియ, చినుగు,తూటు, గాయము.

بغاوت బగావత్ (అ.స్త్రీ) భండనము, దొమ్మి,తిరుగుబాటు.

بغبغا బగ్ బగా[ఉ.పు] మెడ క్రిందిముడుతలు;పావురము ఒంటె మొ॥ని మదించి యరచుధ్వన్యనుకరణము.

بغدرہ బుగ్ ద(పా.పు)మాంసమును గరు-చేయుకటికవానికత్తి,సుడ్డుకత్తి.

بغچہ బుగ్ చ(పా.పు)చూడు بقچہ

بغدی బుగ్ దీ(పా.పు) మేలుజాతి ఒంటె.

بغض బుగ్ జ్ [అ.పు]పగ, స్పర్ధ, వైరము, అసహ్యత.

بغل బగల్ (అ.స్త్రీ) చంక, ఆలింగనము, కౌగిలి,ప్రక్క,చంకపీలిక.

بغل جانا-ہو جانا - జానా-హోజానా(ఉ)తొలుగుట,తొలగిపోవుచుట.

بغل کا دشمن - కాదుష్మన్ (ఉ) తను కూలదతొప్పు. بغل گیر ہونا -గీర్ హోనా(ఉ)కౌగలించుట. بغلیں بجانا-బగ్ లేంబజానా(ఉ)చంకలుకొట్టుట, సంతసించుట,పరిహసించుట, వెక్కిరించుట.

بغلیں جھانکنا-బగ్ లేం ఝాంక్నా (ఉ) సిగ్గుపడుట,భంగపడుట, నిరుత్తరుడ

గుటు, కలవరపడుటు. بلبلیانا بگلبلیانا — బగ్‌లే లేనా(ఉ) చంకగొరుగుటు. (చుటు.

**بگلانا** బగ్లానా(ఉ) తొలగుటు, త్రోవవిడు

**بغیا** బగ్యా(ఉ.స్త్రీ) చూడుము. باغیچہ

**بغیر** బగయిర్(అ) వినాగా, విడిచి, లేక, కాక, తప్ప.

**بغا** బఘా[పా.స్త్రీ] ఒకవిధమైనతలచుండు.

**بقا** బకా(అ.స్త్రీ) శాశ్వతత్వము, స్థిరత, అవినాశత్వము, ఉనికి, నిలకడ.

**بقال** బక్కాల్(అ.పు) పర్తకుడు; కోమటి.

**بقایا** బకాయా(అ.పు) శేషములు, మిగులు, ఋణశేషము, చెల్లవలసినది. (ఏ-వ بقیہ

**بقچہ** బుక్చ(తు.పు) బట్టలమూట, బొక్కిస్వవచ్చడము.

**بقچی** బుక్చీ(ఉ.స్త్రీ) చిన్నమూట.

**بقول** బకోల్(అ) వచనానుసారముగా.

**بقیہ** బకియ(అ.పు) మిగులు, శేషము.

**بک** బక్(హి.స్త్రీ) వదరుడు, పేలుడు.

**بکّا** బుక్కా(హి.పు) పిడికిలి, పిడికెడు, వాసరోగము, గంధపొడి, పిష్ఠాతకము, పటవాసకము.

**بکاؤ** బికావ్(హి.పు) అమ్మకము, విక్రయము, అమ్మెడు. అమ్మకపు.

**بکاول** బకావల్(పా.పు) వంటవాడు, వంటయింటి సెత్తనదారుడు.

**بکبکانا** బక్బకానా(హి) వదరుట, పేలుట.

**بکتر** బక్తర్(పా.పు) లోహకవచము. (ధారి

**بکتری** బక్తరీ(పా.స్త్రీ) కవచము, కవచ

**بکٹ** బికట్(హి) వికటము, దుష్కరము, కష్టతరము, సంకటము.

**بکٹّا** బుకట్టా(హి.పు) బొక్కపట్టు, బుక్కగా పట్టుట, పండ్లపట్టు, నోటిపట్టు.

**بکٹّا بھرنا** బకట్టా భర్నా(హి) నోటబట్టిపీకుట, బుక్కగాబట్టిపీకుట, పండ్లబట్టిపీకుట.

**بکر** బిక్ర్(అ.స్త్రీ) కన్నెరికము, కన్యాత్వము.

**بکرا** బక్రా(హి.పు) మేకపోతు.

**بکری** బక్రీ(హి.స్త్రీ) ఆడమేక, మేక.

**بکری** బిక్రీ(హి.స్త్రీ) అమ్మకము.

**بکسنا** బికస్నా(హి) వికసించుట, పూయుట, సంతసించుట. (కొక్కెము, కొలికి.

**بکسوا** బక్సుఆ(హి.పు) కొక్కెపుకడియము,

**بکّل-بکلا** బక్కల్-బక్లా(హి.పు) తాటి-తోలు, చెక్కు, పొట్టు.

**بکم** బుక్మ్(అ) మూగ, మాటాడలేని.

**بکنا** బక్నా(హి) వదరుట, పేలుట.

**بکنا** బిక్నా(హి) అమ్ముడుపోవుట. (నున్ని.

**بکنی** బుక్నీ(హి.స్త్రీ) పొడి, చూర్ణము,

**بکواد-بکواس** బక్వాద్-స్(హి.స్త్రీ) వదరుడు, పేలుడు.

**بکوادی-بکواسی** బక్వాదీ-సీ(హి.పు) వదరుపోతు, ముఖరుడు.

**بکوانا** బిక్వానా(హి) అమ్మించుట.

**بکوٹنا** బకోట్నా(హి) బరుకుట, గిల్లుట, గీరుట, గీకుట.

**بکھ** బిఖ్(హి.పు) విషము.

**بکھاننا** బఖాన్నా(హి) వర్ణించుట, ప్రశంసించుట, దూషించుట, వ్యాఖ్యానము చేయుట. (న చక్కెర.

**بکھر** బఖర్(హి) చక్కెరపాకు, కరగవండి

**بکھرنا** బిఖర్నా(హి) వికీర్ణమగుట, చెదరుట, చెల్లాచెదరగుట, వికలమగుట, తల్లక్రిందగుట, కలవరపడుట.

**بکھل** బఖ్ఖల్(హి) గృహసమూహము, శ్రేణి, వాడ, ఆవరణము. (కుట్టుట.

**بکھیانا** బఖియానా(హి) కుట్టుట, గట్టిగా

**بکھیرنا** బఖేర్నా (హి) చెదరగొట్టుట, వెదచల్లుట.

**بکھیڑا** బఖేడా (హి.పు) చిక్కు, సుడిగారము, సంకటము, కష్టము, ఆయాసము, క్లేశము, దుఃఖము, వ్యసనము, ఆటంకము, అంతరాయము, వివాదము, జగడము, సందిగ్ధము, గజిబిజి, గంద్రగోళము, కలవరము, అయోమయము, సన్నాహము, పరికరములు, పరివారము, సామగ్రి, వస్తుసామగ్రి, తతంగము, తగులాటము, చెత్త, చెదారము, వెంట, కసవు, వ్యాసంగము, అల్లరి, అల్లకల్లోలము, కలత.

**بکھیڑا چکانا**—చుకానా [హి] చిక్కు వదలించుట, సంకటముతొలగించుట.

**بکھیڑا مچانا**—మచానా [హి] గంద్రగోళముజేయుట, అల్లకల్లోలముచేయుట, కల్లోలముపుట్టించుట.

**بکھیڑیا** బఖేడియా [హి] జగడాలమారి, చిక్కులమారి, కలహకారి, సంకటములు కలుగ జేయువాడు.

**بکی** బక్కీ [హి.పు] వదరుబోతు.

**بگاڑ** బిగాడ్ [హి.పు] చెఱుపు, నష్టము, వికారము, ఉల్లంఘనము, భంగము, తప్పుట, చెడుగు, విరోధము, స్పర్ధ, కీడు, కలహము.

**بگاڑ پر آنا**—పర్ ఆనా [హి] జగడమునకుసిద్ధమగుట. **بگاڑ کرنا**—కర్నా [హి] విరోధముకలుగజేసికొనుట, స్నేహభంగముజేసికొనుట.

**بگاڑنا** బిగాడ్నా [హి] చెఱుచుట, చెడగొట్టుట, పాడుచేయుట.

**بگاڑو** బిగాడూ [హి.పు] చెడగొట్టువాడు, పాడుచేయువాడు, నాశకుడు.

**بگانا** బిగానా / **بیگانہ** బేగానా } [పా] అపరిచితుడు, అన్యుడు, పరదేశి, పరుడు, ఇతరుడు, పరాయివాడు.

**بگدانا** బగ్దానా (హి) మరల్చుట, క్రమ్మరించుట, తిరుగరప్పించుట, తప్పుతోవకుద్రిప్పుట. చెఱుచుట. (త్రోవతప్పుట.

**بگدنا** బగ్దనా [హి] మఱలుట, తిరిగివచ్చుట.

**بگڑنا** బిగడ్నా [హి] చెడుట, పాడగుట, నాశమగుట, వికారమగుట, భంగమగుట, తప్పుట, స్పర్ధించుట, విరోధమగుట, కలహించుట, తిరుగబడుట, ఆగ్రహపడుట, కోపపడుట, కోపగించుకొనుట.

**بگلا** బగ్లా (హి.పు) కొంగ, సారసము.

**بگلا بھگت**—భగత్ [హి] బకధ్యానపరుడు, కపటసన్యాసి, మోసగాడు, ధూర్తుడు.

**بگولا** బగూలా [హి.పు] సుడిగాలి.

**بگھار** బఘార్ [హి.పు] పోపు, తిరుగబోత, పొగుచుట, సాతాళింపు, తాలింపు.

**بگھارنا** బఘార్నా [హి] పొగుచుట, పోపువేయుట, సాతాళించుట, తిరుగబోతచేయుట.

**بگھی** బఘీ [హి.స్త్రీ] జోడీగ.

**بگھی-بگی** బఘీ-బగ్గీ [హి.స్త్రీ] చిన్నగూడుబండి, గూడుగల చిన్నబండి, గుఱ్ఱపుబండి, కచ్చడము.

**بل** బల్ (హి.పు) మెలి, మెలిక, వెన్నవంపు, వంకర, తిరుగుడు, చుట్టు, శృంగము. భేదము, చిక్కు, వైపు, తట్టు, ప్రక్క, స్పర్ధ, అసమాధానము, తప్పు, పొరపాటు, బలి, నైవేద్యము, బలము, శక్తి, సామర్థ్యము, సహాయము. **بل بل جانا**—బల్ జానా (హి) బలియగుట, సమర్పణమగుట, అర్పితమగుట. **بلدار**—దార్ (హి) మెలికలుగలదిన, వంగిపోయిన, వెనవడిన, మెలుచుకొనిన-వడిబడిన. **بلدان**—దాన్ (హి) బలిదానము, నైవేద్యము. **بلدینا**—దేనా (హి)

మెలిబెట్టుట, వడిపెట్టుట, పేనుట.

بل کھانا —బల్ ఖానా.(హి) వడిబడుట, మెలిబడుట, పెనబడుట. (కలుగు.

**بل** బిల్ (హి.పు) బిలను,రంధ్రము, బొరియ,

**بل** బిల్ (ఇం.పు) బిల్లు,వెలపట్టి, బరాతము, లెక్క-చీటి.

**بلا** బల్లా (హి.పు) గడ,దండము, పొడుగాటి కఱ్ఱ,వాసము,పలక, బిళ్లకఱ్ఱ, (చెండుగాని చిఱ్ఱగాని కొట్టుకొయ్య.)

**بلا** బిల్లా (హి.పు) గండుపిల్లి, మొగపిల్లి;బిళ్ల, గుఱ్ఱదనితునక.

**بلا** బలా (అ.స్త్రీ) పీడ,బాధ,కష్టము,సంకటము,ఆపద,విపత్తు,తాపము, దుఃఖము,కీడు -అనిష్టము;అధికము,అపరిమితము,అతిజాగ్రత, గట్టిదనము. بلا کش —బలాకష్(హి)దుఃఖితుడు, ఆపన్నుడు, కష్టములోనున్న వాడు, ఆర్తుడు. تمہاری بلا سے తుమ్హారీ-సే (హి) నీకేదపోయె,బాధలేదు.

**بلا** బిలా (అ)వినా,లేకుండ,రహితము,లేనిది. بلا تردد —తరద్దుద్ (పా) నిస్సందేహముగా, విచారములేకుండ, శ్రమలేకుండ. بلا توقف —తవక్కుఫ్ (పా) విరామములేకుండ,శీఘ్రముగా. بلا شک —బలాషక్ (పా) నిస్సంశయముగా. بلا نصیب —బలానసీబ్ (హి) దౌర్భాగ్యుడు. بلا وجہ —బలావజహ (పా) వినా కారణము, కారణములేకుండ,నిష్కారణముగా.

**بلاپ** బిలాప్ (హి.పు) విలాపము-ఏడ్పు.

**بلاد** బిలాద్ (అ.పు) దేశములు-పట్టణములు -నగరములు. (ఏ-వ بلد)

**بلاؤ-بلاو** బిలాఓ-బిలావ్ (హి.పు) గండుపిల్లి-మొగపిల్లి. (ముగాతినువాడు.

**بلاع** బల్లాఉ (అ.పు) తిండిపోతు-అత్యధిక

**بلاغت** బలాగత్ (అ.స్త్రీ) వాక్చాతుర్యము-సమయోచితభాషణము-వక్తృత్వము-యుక్తవయస్సు-ప్రాప్తి-చేరుట.

**بلاق** బులాక్ (తు.పు) ముక్కు-దూలము-ముక్కు-ఎముక-నాసామణి- ముక్కు-క్రింద తగిలించుకొను భూషణము.

**بلانا** బులానా(హి.) పిలుచుట, ఆహ్వానించుట,చప్పుడుచేయుట(గుడుగుడి). (నము.

**بلاوا** బులావా (హి.పు) పిలుపు, ఆహ్వా

**بلاہٹ** బులాహట్ (హి) పిలుపు, ఆహ్వానము,ఆజ్ఞ. (ముషీటు,కోరాము.

**بلائی** బిలాయీ(హి.స్త్రీ) ఆడపిల్లి; తుఱు

**بلائیں لینا** బలాయేం లేనా (హి). పీడలూడ్చుట, పీడాపరిహారము జేయుట.

**بلبل** బుల్‌బుల్ (పా.స్త్రీ)పికిలిపిట్ట.

**بلبلا** బుల్‌బులా (హి.పు)నీటిబుగ్గ.

**بلبلانا** బల్‌బలానా(హి)బుసబుసపొంగుట, పులిసిపొంగుట,ఊద్రేకించుట, కామముచే నుద్రేకించిఱఱచుట (ఒంటె మేక మొ॥).

**بلبلانا** బిల్‌బిలానా(హి)విలవిలలాడుట,విలవిలకొట్టుకొనుట; బాధపడుట, తహాతహపడుట,దుఃఖించుట,ఏడ్చుట, వెక్కి-వెక్కి-ఏడ్చుట. (కురుపు.

**بلتوڑ** బల్‌తోడ్(హి.పు) మొటిమ, చిన్న

**بلٹنا** బిలట్నా(హి)చెడుట,పాడగుట, నష్టమగుట,పోవుట,అగుపడకుండ మాయమగుట, మాసిపోవుట. (ము,దేశము,ప్రాంతము.

**بلدہ-بلد** బలద్-బల్దా(అ.పు)పట్టణము,నగర

**بلسان** బల్సాన్(అ.పు)తైలవిశేషము.

**بلشت** బలిష్త్(పా.పు) జేనెడు, జేన.

**بلغم** బల్‌గమ్(అ.పు)కఫము;శ్లేష్మము,కళ్లె-గట్టిపడినయుమ్మి.

**بلغمی** బల్‌గమీ(అ)శ్లేష్మ ప్రకృతిగల, మందస్వభావముగల,వాతప్రకృతిగల,శ్లేష్మ

కారకము, శ్లేష్మముకలిగించెడు, స్థూలకాయముగల,బలిసిన.

**بلکنا** బిలక్నా (హి) విలపించుట, వెక్కి-వెక్కి-యేడ్చుట,పురపురలాడుట,మిక్కిలి ఆతురపడుట.

**بلکہ** బల్కె-బల్కి-(పా) ఇంతేకాదు,మరేమన,ఇంకను,ఇంతకన్న,ఇంతియును,ఉపరి అధికము, వేఱుంతరము, ఇంతకంటె మేలు, మిన్నగా.

**بلّا** బిల్లా (హి) దేవానాంప్రియుడు, తెలివి మాలినవాడు,జేల,మూర్ఖుడు.

**بلّم** బల్లమ్ (హి.పు) ఈటె, బల్లెము,కుంతము. **بلّم دار**—దార్ (హి) కుంతధారి, ఈటెబంటు,ఈటెపోటరి.

**بلم-بلما** బలమ్-బల్మా(హి.పు) ప్రియుడు, మనోనాయకుడు.

**بلمانا** బిల్మానా(హి) విలంబింపజేయుట, ఆలస్యము కలుగజేయుట, జాగుచేయించుట, నిలుపుట, ఆపుట, ఆశ కొలుపుట.

**بلمب-بھ** బిలంబ్-భ్ (హి.పు)విలంబనము, ఆలస్యము,జాగు.

**بلمبنا** బిలంబ్నా(హి)ఆలస్యముచేయుట, విలంబించుట, జాగుచేయుట.

**بلمٹیر** బలంటేర్(ఇం,) ఇచ్ఛికుడు,జీతము బత్తెములేక తానైపనిలోచేరినవాడు.

**بلنا** బల్నా (హి) మండుట,ప్రజ్వలించుట తపించుట.

**بلند** బులంద్(పా)ఉన్నతము,ఎత్తైనది, పొడుగైన,ఘనమైన,గంభీరమైన, పెద్ద,బిగ్గరైన (ధ్వని.) **بلند پایہ**—పాయ (పా) ఉన్నతపదవి,ఉచ్ఛస్థితి, గొప్పఎత్తు. **بلند حوصلہ**—హౌస్లా (హి) ఉన్నతాశయుడు, గొప్పతలంపులుగలవాడు, గొప్పబుద్ధిగలవాడు. **بلند مرتبہ**—మర్తబ(హి)గొప్పపదవి,గొప్పఅధికారము. **بلند ہمتی**—హిమ్మతీ (హి)సాహసము,ఔదార్యము,గొప్పబుద్ధి.

**بلندی** బులందీ (పా.స్త్రీ) ఔన్నత్యము, ఎత్తు,ఘనత,ఉచ్చము,పొడుగు,గొప్పతనము.

**بلنی** బిల్నీ (హి.స్త్రీ)కంటిరెప్పలయందగు రోగము,కంటికురుపు.

**بلوا** బల్వా (హి.పు) కలత,దొమ్మి,తిరుగుబాటు,కలహము,జగడము.

**بلوانا** బుల్వానా (హి) పిలిపించుట,ఆహ్వానమంపుట,చెప్పియంపుట, పిలువనంపుట, పిలువబంచుట,రప్పించుట.

**بلوٹا** బిలోటా (హి.పు)పిల్లికూన,చిన్నపిల్లి.

**بلور** బిల్లౌర్(పా.పు) గాజు,స్ఫటికము, గాజుఱాయి. (గీయుట,గీకుట.

**بلورنا** బిలూర్నా (హి) గోళ్లగీకుట,గోళ్ల

**بلوری-رین** బిల్లౌరి-రీన(పా) గాజుతో చేసిన,స్ఫటికముతోచేసిన.

**بلوط** బలూత్ (అ.పు) సిందూరవృక్షము.

**بلوغ** బులూగ్ (అ.పు) } చేరుట,
**بلوغت** బులూగత్ (అ.స్త్రీ) } ప్రాప్తి, యుక్తవయస్సు (వచ్చుట), యౌవనము, వివాహయోగ్యత.

**بلوکنا** బిలోక్నా (హి) విలోకించుట, చూచుట. (బుగ్గ.

**بلولا** బలూలా (హి.పు) బుద్బుదము,నీటి

**بلونا** బిలోనా (హి)చిలుకుట,మథించుట.

**بلونی** బిలోనీ (హి.స్త్రీ) మంథనితరిగడవ,చిలికెడుకుండ.

**بلہاری** బలిహార్-రీ (హి.స్త్రీ) బలి, నైవేద్యము. **بلہاری جانا**—జానా (హి) బలియగుట,బలియివ్వబడుట.

**بلہرا** బిలహ్రా (హి.పు) తమలపాకులబుట్ట.

**بلہری** బిలహ్రీ (హి.స్త్రీ) నూనెగరిటె, తమలపాకులబుట్ట.

**بلّی** బల్లీ (హి.స్త్రీ) గడ,దండము,వాసము, కఱ్ఱ; పడవనడపుగడ, ఊత, పోటి, ఆను.

**بلّی مارنا** బల్లీ—మార్నా (హి) గడవేయుట (పడవనడుపుటకు.) (గడే.

**بلّی** బిల్లీ (హి.స్త్రీ) ఆడపిల్లి;తలుపుగడియ,

**بلے** బలే (పా) మంచిది,సరి, బాగు, మేలు, ఔను.

**بلائیں لینا)**

**بلیالینا** బలైయాలేనా (హి) మాడు

**بلّیات** బలైయాత్ (అ.స్త్రీ)ఆపదలు, సంకటములు.(ఏ.వ.بلا)

**بلیغ** బలీగ్ (అ)వాగ్మి,వక్త, ధారాళముగా మాట్లాడువాడు, సమయోచితముగమాట్లాడువాడు,వాక్చాతుర్యముగలవాడు.

**بلبندا** బలేండా(హి.పు) సుడిగాలి,ఇంటి నడికొప్పుదూలము.

**بم** బమ్(హి.స్త్రీ) ఓమ్,ఓంకారము, శైవులన మస్కారపదము; కూబరము, బండినొగ, నొగకఱ్ఱ,వమథువు,జలసూత్రము, చెలిమ, మడుగు,బుగ్గ,ఊట,నీరూరుచోటు;అల్లరి, గోడు,గోల. **بم مچانا** బమ్—మచానా (హి) గోలపెట్టుట,అల్లరిచేయుట.

**بمان** బిమాన్(హి.పు)విమానము, ఆకాశయానము.

**بمب** బింబ్ (హి.పు) సూర్యాదులబింబము, మండలము,ప్రతిబింబము,నీడ.

**بمبو** బంబూ (ఇం.పు)వెదురుబొంగు; బెత్తము;నల్లమందు(పొగతాగు)గొట్టము.

**بمجرد** బముజర్రద్ (పా) తక్షణమే,వెంటనే,తోడనే.

**بمقتضائے** బముక్తజాయే (పా) అవసరమునుబట్టి,ఆవశ్యకతనుబట్టి, కారణమువలన, హేతువుచేత, కారణమున, హేతువున.

**بمکنا** బమక్నా(హి)వాయుట,ఉబ్బుట.

**بمنزلہ** బమన్‌జిల (పా) పదవిగల, సమానమైన,ప్రత్యామ్నాయము,సమానము,సరిపోవునది-స్థితిగతులుసరిసమానమైన.

**بموجب** బమూజిబ్(పా) కారణమువలన, హేతువుచేత, అనుసారము, అనుసరించి, ప్రకారము.

**بن** బన్ (హి.పు) వనము, అరణ్యము,అడవి.

**بن باس** బన్—బాస్ (హి)వనవాసము.

**بن کٹی** బన్—కటీ (హి) అడవికొట్టిన కూలి. **بن کر** బన్—కర్ (హి) వనకరము, అడవిపన్నులు,పుల్లరి మొ॥ **بن مال** బన్—మాల్ (హి)వనమాల, తోమాల,పూలుఆకులు చేర్చికట్టిననిలువుదండ.

**بن** బిన్ (అ.పు)కొడుకు, పుత్రుడు.

**بن** బిన్ (హి) వినా, లేకుండ, విడిచి.

**بن آئی مرنا** బిన్ — ఆయీమర్నా (హి) అకాలమరణము నొందుట, ఆకస్మికముగా చచ్చుట. **بن جانے** బిన్.జానే(హి) తెలియక,అజ్ఞానముచేత.

**بن مارے توبہ کرنا** బిన్—మారే తౌబ కర్నా (హి)కొట్టకముందేయేడ్చుట.

**بن** బున్ (అ.పు)కాఫీవిత్తులు.

**بن** బున్ (పా.స్త్రీ)మూలభిత్తి,పునాది, హస్తిభారము,అడుగు,మూలము,వేళ్ళు,అంతము.

**بنا** బన్నా(హి.పు)చేయబడుట, సిద్ధమగుట,నిర్వహిల్లుట,అగుట,సృష్టింపబడుట, కట్టబడుట,వండబడుట, రచితమగుట, అలంకృతమగుట, తీర్చబడుట, దిద్దబడుట, సరిప

దాటు,అనుకూలించుట, లోపరాటు,వశమగు
ట. بن پڑنا బన్-పడ్నా(హి)కలిసివచ్చుట,
అనుకూలపడుట, నెఱవేరుట. بنا ٹھنا -బనా
ఠనా (హి) అలంకృతముగా, తీర్చితీర్చి,
చక్కగాసింగారించుకొని, తీర్చుకొని,దిద్దు
కొని. (పెండ్లిపాట.
بنّا బన్నా(హి.పు) పెండ్లికొడుకు,ప్రియుడు
بنا బనా (హి) భూతము,కృతము,అయినది,
ముగిసినది,చేసినది,కృత్రిమము, కల్పితము.
بنا بنایا -బనాబనాయా (హి) చేసిసిద్ధము
గానున్న,స్వసిద్ధముగానున్న. بنا چنا -బనా
చునా (హి) అనుచితీర్చినది, ఏర్పరచియు
న్న, సవరింపబడియున్న, చక్కచేయబడి
యున్న. بنا رھنا۔بنے رھنا -బనారహ్నా-
బనేరహ్నా(హి)స్థిరముగానుండుట, నిలకడ
గానుండుట, అభివృద్ధినొందుట, చిరకాల
ముండుట. (ను జేయుట.
بنّا బిన్నా(హి పు)ప్రసరించుట, ఏరుట-స్వచ్ఛ
بنا బినా (అ.స్త్రీ) మూలభిత్తి,పునాది,మూ
లము,ఉద్దేశము.
بنّا బున్నా(హి) నేయుట,అల్లుట,నేసుట.
بنا بر బినాబర్ (పా) హేతువుచేత,కారణ
మున,మూలమున.
بنا بریں బినాబరీం (హి) ఈకారణముచేత,
ఈహేతువువలన,ఈమూలమున,ఇందుచేత
-ఇందుకొరకు, ఇందువలన.
بنات బనాత్ (హి.స్త్రీ) ఉన్నిబట్ట,రాంక
వము,కంబళి.
بنات బనాత్(అ.స్త్రీ) కుమార్తెలు, బిడ్డలు,
بنت النعش -ఉన్నఒష్ (అ) సప్త
ఋషులను నక్షత్రములు.(ఏ-వ بنت)
بنادر బనాదర్ (అ.పు) రేవుపట్టణములు,
(ఏ-వ بندر)

بناس బినాస్(హి.పు)వినాశము.
بناسپتی బనాస్పతి (హి.స్త్రీ) వనస్పతి,
చెట్టు చేమ,ఆకుఅలము. (చెవికొనక
بناگوش బనాగోష్ (పా.పు.) చెవితమ్మె,
بنانا బనానా(హి) చేయుట, సిద్ధపరచుట,
కట్టుట,ఒనర్చుట, అమర్చుట; సమాధాన
పరుచుట,అలంకరించుట,చక్కచేయుట;
వెక్కిరించుట;కల్పించుట,బాగుచేయుట.
بن آنا-پڑنا బన్ఆనా-పడ్నా (హి)కలిసివ
చ్చుట, అనుకూలమగుట, సంధిదొరకుట,
వృద్ధికలుగుట, నెరవేరుట,జయముగలుగుట.
بناؤ బనావ్(హి.పు)చేత, సింగారము,అలంక
రింపు;అనుకూలత,సమాధానము, స్నేహము,
సిద్ధత,చేతబడి. (మోసము,చేతబడి.
بناوٹ బనావట్ (హి స్త్రీ)చేత.కల్పన,రచన
بُناوٹ బునావట్(హి.స్త్రీ) నేత, నేతబడి.
بنت బింత్(హి.స్త్రీ)కూతురు, (గాయి.
بنت النعب -బనాతున్నఒబ్ (అ) సా
بنتی బింతీ(హి.స్త్రీ)వినంతి,కుసూపణ.
بنٹوانا బంట్వానా(హి)పంచుట, పాలుపె
ట్టుట,పంచుపెట్లుజేయుట.
بنج బనిజ్(హి.పు) వాణిజ్యము, వర్తకము,
బేపారము,వ్యాపారము.
بنجارا బంజారా (హి.పు) ధాన్యవర్తకుడు,
లంబాడి,బలిజ.
بنجاری బంజారి (హి.స్త్రీ) లంబాడిది,
బలిజది,లంబాడిగుగారము.
بنجر బంజర్ (హి.స్త్రీ) బీడు, పాడునేల,
నిస్సారమైనభూమి.
بند బంద్(పా.స్త్రీ)బంధము,కట్టు;దారము,
బొందె, బందు; దారము,పట్టి;కట్టు;త్రాడు,
బందె, ఆపుదల ;పీలిక; ఆటంకము; చెర,
నిర్బంధము; పట్టీ; కీలు;పద్యము, పాదము,
వరుస, క్రమము.

**بند** బంద్ (హి) మూయబడిన, నిలుపబడిన, ఆపబడిన, ఆటంకపరుపబడిన, తాళము వేయబడిన, ఊరకున్న, నిలిచియున్న.

**بندا** బుందా (హి.పు) చెవిపోగు, లోలకు.

**بندر** బందర్ (పా.పు) రేవుపట్టనము, నౌకాశయము, ఓడరేవు. **بندرگاہ** బందర్-గాహ్ సముద్రతీరవ్యాపారస్థానము, రేవుపట్టణము.

**بندر** బందర్ (హి.పు) వానరము, కోతి, **بندر کا گھاو** బందర్-కా ఘావ్ (హి) కోతిపుండు -ఎప్పటికిని కుదురనిది.

**بندریا-بندری** బందరీ-రియా (హి.స్త్రీ) ఆడకోతి, కుక్కగడ్డి.

**بندش** బందిష్ (పా.స్త్రీ) బంధనము, కట్టు, కట్టడము, కల్పన, రచన, కుట్ర, ఆరోపము, ముడి, పీఠిక, అభిప్రాయము, కావ్యనైపుణ్యము, ఫణితి, గుంఫనము. (బిందువు,

**بندکی** బుంద్‌కీ (హి.స్త్రీ) చిన్నచుక్క-లేక

**بندگان** బందగాన్ (పా) సేవకలు, బానిసలు **بندگان عالی** బందగాన్-ఎ-ఆలి (పా) ఏలినవారు

**بندگی** బందగీ (పా.స్త్రీ) దాస్యము, కొలువు, భక్తి, వినయము, వందనము, నమస్కారము.

**بندوا** బందుఆ (పా.పు) బద్ధుడు, బానిస, చెరలోనున్నవాడు.

**بندوبست** బంద్-ఒ-బస్త్ (పా.పు) కట్టుబట్టము, ఏర్పాటు, పట్టము, పద్ధతి, తీరుమానము; క్షేత్రమానశాఖ.

**بندوز** బందోజ్ (హి.స్త్రీ) బానిస-దాసి

**بندوق** బందూక్ (తు.స్త్రీ) తుపాకి-ఆగ్నేయాస్త్రము. (బంటు.

**بندوقچی** బందూక్‌చీ (తు.పు) తుపాకి

**بندہ** బంద (పా.పు) బానిస, బంటు-

**بندہ پرور-بندہ نواز** బంద-నవాజ్-పర్వర్ (పా) దాసపోషకుడు-ఏలినవారు.

**بندھانی** బంధానీ (హి.పు) భారవాహకుడు-మోతకూలివాడు.

**بندھائی** బంధాయీ (హి.స్త్రీ) కట్టుట-కట్టుకూలి; పెచ్చు, మార్కము-వట్టము.

**بندھن** బంధన్ (హి.పు) బంధనము-కట్టు-ఆటంకము. (టు-కుట్టుపనివానిసంచి.

**بندھنا** బంధ్‌నా (హి) కట్టుబడుట-చిక్కు.

**بندھنا** బింధ్నా (హి) చిల్లిపడుట.

**بندھنوار** బంధన్వార్ (హి) తోరణము.

**بندھو** బంధూ (హి.పు) బంధువు.

**بندھوا** బంధుఆ (హి.పు) బద్ధుడు, చెరలోనున్నవాడు; బంధువు-చుట్టము.

**بندھوانا** బంధ్వానా (హి) కట్టించుట-కట్టివేయించుట-ముడివేయించుట.

**بندھیج** బంధేజ్ (హి.పు) మితవ్యయము-పిసినారితనము; మితము; వర్జనము; నిషేధము; స్థిగత-నిలకడ; వాడుక-అలవాటు-సాంప్రదాయము.

**بندی** బందీ (హి.స్త్రీ) బంధనము-కట్టడము-బానిస-దాసి (పా) బద్ధుడు-చెఱలోనున్నవాడు **بندی خانہ** బందీ-ఖాన (పా) చెఱసాల-కారాగృహము. (చుక్క-తిలకము.

**بندی** బిందీ (హి.స్త్రీ) బిందువు-సున్న-

**بنڈا** బిండా (హి.పు) కట్ట-చిన్న మోపు.

**بنڈی** బండీ (హి.స్త్రీ) చేతులులేనిచొక్కాయి.

**بنڈیری** బండేరీ (హి.స్త్రీ) ఇంటినడికప్పు

**بنڈا** బండా (హి) పెండ్లికొడుకు-మగడు.

**بنڈی** బండీ (హి.స్త్రీ) పెండ్లికూతురు-పెండ్లాము.

**بنس** బన్స [హి.పు] వంశము-కులము-వెదురు; **بنس لوچن** బన్స-లోచన్ (హి) వంశలోచనము-తవాక్షీరము.

**بنسی** బన్సీ (హి.స్త్రీ) మురళి, పిల్లనగ్రోవి.

**بنفشہ** బనఫ్ష (పా) ఊదాజావన్నె (పుష్పము)

**بنک** బంక్ (ఇం.పు) కోశీ,రొక్కపుసాలు.

**بنگ** బంగ్ (పా.స్త్రీ) గంజాయి.

**بنگا** బంగా (హి.పు) వెదురుబొంగు;బడితకఱ్ఱ

**بنگالی** బంగాలీ (హి.పు) వంగదేశస్థుడు.

**بنگڑی** బంగడీ (హి.స్త్రీ) గాజు,కంకణ ము;వంకరగల,వెలికలుగల.

**بنگلا** బంగ్లా (హి.పు) వంగదేశస్థులభాష, పూరియిల్లు,ఒకవిధమైనతమలపాకు.

**بنگی** బింగీ (హి.స్త్రీ) మోతబొంగరము.

**بنّو** బన్నూ (హి.స్త్రీ) పెండ్లికూతురు,ము ద్దుగుమ్మ,పెండ్లాము.

**بنواری** బన్వారీ(హి.పు) గోపాలకృష్ణుడు.

**بنوانا** బన్వానా (హి) చేయించుట,కట్టించుట,బాగుచేయించుట.

**بنوانا** బున్వానా (హి) అల్లించుట,నేయించుట.

**بنوائی** బన్వాయీ(హి.స్త్రీ) చేతకూలి, (చెసినకూలి.

**بنوائی** బున్వాయీ (హి.స్త్రీ) నేతకూలి.

**بنوٹ** బినోట్ (హి.స్త్రీ) బడితెసాము, కఱ్ఱసాము.

**بنولا** బినౌలా (హి.పు) పత్తివిత్తనము.

**بنوّیا** బన్వయ్యా (హి.పు) కారకుడు, చెయువాడు.

**بنی** బనీ(హి.స్త్రీ) పెండ్లికూతురు,అనుకూల ము, కోమటిది

**بنی** బనీ (అ.పు) కొడుకులు, సంతానము, (ఏ-వ ابن) **بنی آدم**—ఆదమ్ (అ) మానవులు.

**بنیا** బనియా (హి.పు) కోమటి,వర్తకుడు.

**بنیاد** బునియాద్ (పా.స్త్రీ)హస్తిభారము, మూలము-ఆరంభము.

**بنیاین** బనియాయన్ (హి.స్త్రీ)కోమటిది.

**بنیٹی** బనేటి(హి.స్త్రీ) రెండు ప్రక్కలను ముట్టించి రెండు జ్వాలావలయము లేర్ప డునట్లు త్రిప్పుదివిటి, **بنیلا** బనేల(హి) జాంగలము, అడవి సం॥

**بنینی** బనియనీ(హి.స్త్రీ)కోమటిది.

**بو** బూ (పా.స్త్రీ) వాసన,గంధము,

**بوباس**—బాస్ (పా)గంధము,పోబడి, జాడ,గుణము,స్వభావము,నైజము, డౌలు, రీతి, బడికోలు, వాడుక.

**بوا** బుఆ (హి.స్త్రీ)అక్కయ్య, మేనత్త,తం డ్రితోబుట్టువు. (మూలవ్యాధి.

**بواسیر** బవాసీర్ (అ.స్త్రీ) మొలలవ్యాధి,

**بوالعجب** బుల్ అజబ్ (అ) అద్భుత మైన,ఆశ్చర్యకరమైన,వింత,వినోదము,మూ ర్ఖుడు,వినోదగాడు. (ప్రియుడు,ఆశగొట్టు.

**بوالہوس** బుల్ హవస్ (అ)కామి,విషయ

**بوآنا** బుఆనా (హి) విత్తించుట,విత్తనము చల్లించుట. (-కాళ్లచెమలుపగులుట.

**بوائی** బివాయీ (హి.స్త్రీ)పగుళ్లరోగము

**بوائی** బొఆయీ (హి.స్త్రీ) విత్తుడు-విత్తె డుకాలము. (వాడు.

**بوبک** బూబక్ (తు.పు) అస్థాపిస్థపుముసలి

**بوبو** బూబూ(హి.స్త్రీ)అక్క,అమ్మగారు.

**بوتا** బూతా(హి.పు)శక్తి;బలము,సామర్థ్యము.

**بوتام** బోతామ్ (ఇం.పు) బత్తాసు-గుండి.

**بوتل** బోతల్ (ఇం.పు) బుడ్డి-సీసా-గాజు కుప్పె.

**بوتہ** బూతహ్ (పా.పు) మట్టిమూస; గర్భ ము-పిండము-ఒంటెపిల్ల-పేదమూతివాడు.

**بوت** బూట్ (హి.స్త్రీ) పచ్చిసెనగకాయ- మట్టిపాత్ర-కుండ.

**بوٹا** బూటా (హి.పు) చెట్టు-మొలక-పూల చెట్టు-బట్టలమీదవేసినపూలు-మొ॥ **بوٹا قد** —కద్ (అ) పొట్టి-కురుచదైన.

**بوٹا** బోటా (హి.పు) మాంసఖండము-దూలము; మొద్దు. (కలు.

**بوٹی** బూటీ (హి.స్త్రీ) ఓషధులు-మూలి

**بوٹی** బోటీ (హి.స్త్రీ) మాంసపుముక్క, కండ,

**بوجہ** బవజహ్(పా) కారణమున-చేత-వలన,

**بوجھ** బోఝ్ (హి.పు) బరువు-భారము.

**بوجھ** బూఝ్ (హి.స్త్రీ) తెలివి, ఆలోచన, చీట్లాటలోసగినముచూచుకొనుట, విడుపు కథయొక్కయుత్తరము.

**بوجھ بجھول** బూఝ్‌బుఝవ్వల్ (హి.స్త్రీ) విడుపుకథ.

**بوجھل** బోఝల్ (హి) భారమైన, బరువైన, సూక్ష్మమైన.

**بوجھنا** బూఝ్నా (హి) తెలియుట,గ్రహించుట, ఆలోచించుట, విడుపుకథ విప్పుట.

**بوچ** బోచ్ (హి.పు) మొసలి. (చెవుల.

**بوچا** బూచా (హి) చెవులుకోసిన, మొండి

**بوچڑ** బూచడ్ (ఇం.పు) కటికవాడు.

**بوچھار-ڑ** బౌఛార్-డ్ (హి.స్త్రీ) విసరికొట్టువాన, గాలితోగూడినవాన,జల్లు, వానజల్లు,వర్షము;విస్తారము,సమృద్ధి.

**بود** బూద్ (పా.స్త్రీ) ఉనికి, స్థితి.

**بود وباش**-బూద్‌ఓబాష్ (పా) నివాసము, ఉనికి.

**بودا** బోదా(హి) దుర్బలమైన, దిటవులేని, ప్రాత;పిరికియైన, తెలివిమాలిన.

**بودار** బూదార్(పా)వాసనగల

**بودھ** బోధ్(పు)బోధ,జ్ఞానము.

**بورا** బూరా(హి.పు)ఖండశర్కర; కట్టెపొడి;చూర్ణము. (గోతాము.

**بورا** బోరా(హి.పు)గోనె, సంచి, బోరెము,

**بورا** బౌరా(హి)పిచ్చి,వెఱ్ఱి,వెడ్డి.

**بورانی** బూరానీ(పా.స్త్రీ) వంకాయబజ్జి; వంకాయపిండిమిరియము.

**بورق** బూరక్(పా.పు)వెలిగారము.

**بورنا-بوڑنا** బోర్నా-డ్నా(హి) ముంచుట, నానుట,తడుపుట.

**بوریا** బోరియా(హి.పు)తాటియాకులచాప.

**بوڑھا** బూఢా(హి.పు)ముసలి,వృద్ధు.

**بوڑھی** బూఢీ(హి.స్త్రీ) ముసలిది,వృద్ధురాలు. (సారాయి.

**بوزا-بوزہ** బూజా (పా.పు) బియ్యపు

**بوزنہ** బోజ్నా(పా.పు)కోతి,వానరము.

**بوس-بوسہ** బోస్-స (పా.పు) చుంబనము, ముద్దు. **بوسہ بازی-بوس وکنار**-బోసబాజీ-బోసొకినార్ (పా) ముద్దులాట.

**بوستان** బోస్తాన్[పా.పు]పూదోట.

**بوسیدگی** బోసీదగీ[పా.స్త్రీ] శైథిల్యము, పాతరికము,క్షయము,క్షీణము,జవుకుదనము.

**بوسیدہ** బోసీద[పా]శిథిలమైన, పాతపడిన,చెడిన,జీర్ణమైన.

**بوغبند** బోగ్‌బంద్[పా.పు]మూటకట్టి, గలిసెన,సంచి.

**بوق** బూక్[పు]బూరగ,కొమ్ము(ఊదునది.

**بوقلموں** బూకలమూఁ (అ.పు)ఊసరవెల్లి-చిత్రవిచిత్రమైన-నానావర్ణమైన-ముళ్లుగల.

**بوک** బోక్ (హి.పు) మేకపోతు.

**بول** బౌల్ (అ.పు)మూత్రము.

**بول** బోల్ (హి.పు) వచనము-మాట-భాషణము; పదము; చెప్పు. **بول بالا**-బోల్‌బాలా (ఉ) జయము, మాటపైచెయిగానుండుట.

**بول چال**-బోల్-చాల్ (హి.స్త్రీ) సంభాషణము-ప్రసంగము-మాటముచ్చటలు-వర్తనము

بول مارنا-బోల్ మార్నా (హి) చెప్పుట,ఎత్తి పొడుచుట.

بولا బోలా (హి) బోసినోటి-పండ్లులేని.

بولتا బోల్తా (హి.పు)జీవము-ప్రాణము-మాటకారి.

بولنا బోల్నా (హి.పు) మాట్లాడుట.చెప్పుట-అనుట-మ్రోయుట-వాగుట-పలుకుట.

بولی బోలీ (హి.స్త్రీ) భాషణ-భాష-మాటలు;పేలాముపాట-చెప్పు-ఎత్తిపొడుపు.

بولی ٹهولی-బోలీ ఠోలీ (హి) ఎత్తిపొడుపులు-చెప్పులు- పరిహాసము- వేళకోళము.

بوم బూమ్(పా.పు) పెద్దపిట్ట-గూబ-భూమి,నేల.

بونا బోనా (హి) విత్తుట-మొలవేయుట.

بونا బౌనా (హి) పొట్టి-కురుచ-వామనుడు.

بونٹ బూంట్ (హి.పు) పొట్టికజ్జము-తట్టువ-పచ్చికాయధాన్యము-పచ్చిసెనగకాయ.

بوند బూంద్ (హి.స్త్రీ) బిందువు-చుక్క, బొట్టు-చుక్కలపట్టుబట్ట. (నతుంపిళ్లు.

بوندا باندی బూందాబాందీ (హి)వా

بوندا బూందా(హి.పు) కుట్మలము-పదునైన మొగ్గ;కాయ;వెన్ను.

بوندی బూందీ (స్త్రీ) వానచినుకులు-రాజస్థానదేశమందలియొకసంస్థానము పేరు-శ్రేష్ఠమైనకటాము-లడ్డుములకైన పిండితోకొట్టినబూంది.

بونگا బౌంగా (హి.పు) మూఢుడు,అవివేకి.

بوهرا బౌహ్రా (హి పు) వర్తకుడు;అప్పిచ్చువాడు. (యము,బోణి.

بوهنی బోహ్నీ (హి. స్త్రీ) ప్రథమవిక్ర

بوئیا బోయ్యా (హి.పు) చిన్నతట్ట,బుట్ట.

بوبیام బోయామ్(హి.పు)పింగాణిబుడ్డి,జాడి.

بویسیا-బవేసియా(హి) వదరుబోతు;మూల వ్యాధిగలవాడు.

به బెహ్ (పా) మంచి,మేలుతరము,

بهبودی-బెహ్బూదీ(పా)మేలు,క్షేమము

به బ (పా) తో-కూడ-చేత-తో.

بها బహా[పా.స్త్రీ]వెల,మూల్యము.

بهابی భాబీ[హి.స్త్రీ]వదిన, అన్నభార్య.

بهاپ భాప్[హి.స్త్రీ]ఆవిరి,పొగ. (నుట.

بهاپنا భాప్నా[హి]ఊహించుట, అనుకొ

بهات భాత్(హి.పు)అన్నము,పొంగలి.

بهاٹ భాట్(హి.పు)బట్టువాడు, పాటకుడు.

بهاٹا భాటా[హి.పు]ప్రవాహము, సముద్రపుపోటు;వంకాయ;ఊయి.

بهاجی భాజీ[హి.స్త్రీ]కూర,శాకము;దానము,భోజనభాగము,తోడిపంపిన భోజనము.

بهادر బహాదుర్[పా] శూరుడు, పరాక్రమశాలి, పోటరి.

بهادری బహాదురీ [స్త్రీ] ధైర్యము-శౌర్యము-మగటిమి. [సము.

بهادوں భాదూఁ [హి.పు] భాద్రపదమా

بهار బిహార్ [హి.స్త్రీ] విహారము-విలాసము,వినోదము.

بهار బహార్(పా.స్త్రీ)వసంతఋతువు,యౌవనము;అందము-అలంకారము;కళ్యాణము-ఆనందము;కాంతి;కళ;నవీనత;ఉల్లాసము.

بهار భార్[హి పు]భారము-బరువు.

بهارن బుహారన్ [హి.స్త్రీ] చెత్త-కసవు-చీపురుపెంట. (దప్పుట.

بهارنا బుహార్నా [హి] చిమ్ముట-ఊ

بهاری బుహారీ [హి.స్త్రీ] చీపురుకట్ట-పొరకకట్ట.

بهاری భారీ[హి]భారమైన-బరువైన;పెద్దలావైన-గొప్ప;బిగ్గరైన;వెలగల;గట్టి;ఓర్పుగల;దిట్టమైన; స్థిరమైన;గంభీరమైన;బలముగల;ముఖ్యమైన; ప్రధానమైన;కష్టతరమైన-కఠినమైన. بهاری بهرکم -భర్కమ్

[హి]గంభీరమైన-సహనముగల;మహేచ్చుడగు-పెద్దమనిషి-కులీనుడైన;బలిసిన-దొడ్డ.

**بھاڑ** భాడ్ (హి.పు) పెద్దపొయ్యి, సెగడి, దాలి,కుమ్మి, ఆవము,బట్టీ, గాడిపొయ్యి. **بھاڑ جھوکنا** -బ-ఝోక్నా[హి.పు] ఆవము కాల్చుట, బట్టీలోకట్టైకంపవేయుట, నీచవృత్తిచేయుట. (యాలి వెల.

**بھاڑ** భాడ్(హి.పు)భాటకము,పణము, వెల

**بھاڑا** భాడా(హి.పు)భాటకము,బాడుగ,కూలి,అద్దె, వేతనము. (హిందీభాష.

**بھاکا-بھاشا** భాషా-కా (హి.స్త్రీ) భాష,

**بھاگ** భాగ్ (హి.పు) భాగ్యము, భాగము; రాగభేదము.**بھاگ لگنا.کھلنا.جاگنا** -లగ్నా-ఖుల్నా-జాగ్నా (హి) అదృష్టముపట్టుట, వృద్ధియగుట.

**بھاگ** భాగ్ (హి.స్త్రీ) పరుగు, ఉరుకు. **بھاگا بھاگ** భాగాభాగ్ (హి) ఉరుకులాట,పలాయనము,పారిపోవుట.

**بھاگڑ** భాగడ్ [హి.స్త్రీ] ఉరుకులాట;పలాయనము,సంభ్రమము,తత్తర.

**بھاگنا** భాగ్నా(హి)పరువెత్తుట, ఉరుకుట.

**بھال** భాల్ (హి.స్త్రీ) బాణపుములికి, బల్లెమురొమ్మ-ఉక్కు-బద్ద; నొసలు, ఫలము,

**بھالا** భాలా (హి.పు) అత్తలము, కుంతము, ఈటె. **بھالا بردار** -బర్దార్(హి) ఈటెవాడు,బల్లెపు బంటు.

**بھالو** భాలూ(హి.పు)ఎలుగుబంటు, గుడ్డెలుగు,భల్లూకము. (కాలము.

**بہان** బిహాన్ (హి.పు) ఉదయము,ప్రాతః

**بھانا** భానా(హి) మనోహరమగుట, ఇష్టమగుట,మనస్సుకువచ్చుట, రుచించుట,తగుట,ఒప్పిదమగుట,హితమగుట.

**بہانا** బహానా(హి) పారించుట, కార్చుట; నీటకలుపుట, వృథాచేయుట; చౌకగా అమ్ముట.

**بھانپنا** భాంప్నా(హి)పొడగాంచుట, తెలియుట, ఊహించుట, భావించుట, గ్రహించుట.

**بھانت** భాంత్ (హి.స్త్రీ) భాంతి,భంగి, రీతి,తీవి, తెరగు,విధము,ప్రకారము, వైఖరి, మార్గము.

**بھانٹا** భాంటా(హి.పు)వంగచెట్టు,వంకాయ.

**بھانجا** భాంజా (హి.పు) భాగినేయుడు. మేనల్లుడు.

**بھانجی** భాంజీ(హి.స్త్రీ) భాగినేయురాలు, మేనకోడలు;ఆటంకము, అభ్యంతరము. **بھانجی مارنا** మార్నా(హి)ఆటంకపెట్టుట,అడ్డము కొట్టుట.

**بھانڈ** భాండ్(హి.పు) భాండుడు, బట్టువాడు,హాస్యగాడు,నటుడు.

**بھانڈا** భాండా(హి.పు)భాండము,కుండ,కాగు,గుట్టు, రహస్యము. **بھانڈا پھوٹنا** -ఫూట్నా(హి)కుండపగులుట,గుట్టుబయలుపడుట.

**بھانمتی** భాన్మతీ (హి.స్త్రీ) కనకట్టు, మంత్రశాస్త్రము,గారడివిద్య; (పు) గారడివాడు,మోసగాడు.

**بھاننا** భాన్నా (హి) పేనుట, మెలివేయుట;త్రిప్పుట;వల్లించుట.

**بہانہ** బహాన (పా.పు) టొంపు, నెపము, మిష,కారణము, హేతువు,కల్పన,కపటము -మోసము. (నెపగొండి,మోసగాడు.

**بہانہ خور-بہانہ ساز** -ఖోర్ -సాజ్(పా)

**بھاو** భావ్ [హి.పు] ధర,వెల;భావము;భరతము;కులుకు; హావయలు;వైఖరి, స్థితిగతి; మోహము,వలపు. **بھاو بتانا** -బతానా అభినయించుట. (దల,వఱద.

**بہاو** బహావ్ [హి.పు] ప్రవాహము,పారు

**بھاوج** భావజ్ [హి.స్త్రీ]వదినె[మరదలు]

**بھاویں** భావీఁ [హి]కానున్నది,రానున్నది.

**بھائی** భాయీ [హి.పు] భ్రాత-సోదరుడు-తోబుట్టువు-సంగాతగాడు, **بھائی بند** భాయీ-బంద్ [హి] దాయాదులు-బంధువులు-వంశస్థులు. **بھائی بندی-بھائی چارا** -బందీ-చారా [హి] భ్రాతృత్వము-సోదరభావము.

**بہائی** బిహాయీ [హి.స్త్రీ] శిశువులకు నిద్రలో నవ్వించునట్టియు ఏడ్పించునట్టియు మాటలు చెప్పు దేవత. (గుప్పను వాసన.

**بھبک** భబక్ [హి.స్త్రీ] భగ్గను మంట,

**بھبکا** భబ్కా [హి.పు] సారాయి బట్టీ-వంకమెడబుడ్డి; మంట-సెగ లేక ఆవిరి; గిన్నె, కోర-వాసన-గబ్బు-ఆగ్రహము.

**بھبکنا** భబక్నా [హి] మండుట-కాలుట, తగులబడుట; కోపించుట-ఊడుకుట; అరచుట-మండిపడుట.

**بھبکی** భబ్కీ [హి.స్త్రీ] గద్దింపు, బెదరింపు.

**بھبوت** భబూత్ [హి.స్త్రీ] విభూతి-బూడిద.

**بہبودی** బిహ్బూదీ [పా.స్త్రీ] మేలు-క్షేమము.

**بھبوکا** భబూకా [హి.పు] జ్వాల-మంట; ప్రకాశించెడు-అందమైన.

**بھپارا** భపారా [హి] ఆవిరి, పొగ, ఆవిరిపట్టుట; సెగ వేయుట; కాపడము, మోసము.

**بہت** బహుత్ (హి) బహు, మిక్కిలి, చాల, అనేకము, సేన, విశేషము, అధికము, సమృద్ధి.

**بھتا** భత్తా (హి.పు) బత్తెము, దారిబత్తెము; బత్తి, చద్ది; ఎక్కువ వజీతము;

**بہتات** బహుతాత్ (హి.స్త్రీ) విస్తారము, పుష్కలము, ఆధిక్యత, సమృద్ధి.

**بہتان** బుహ్తాన్ (అ.పు) నింద, ఆరోపము, అపవాదము. [ఉత్తమము.

**بہتر** బిహ్తర్ (పా) మేలుతరము, శ్రేష్ఠతరము,

**بہتر** బహత్తర్ (హి) డెబ్బదిరెండు; అనేకము.

**بہتری** బిహ్తరీ (పా.స్త్రీ) మేలు, కల్యాణము, గుణాధిక్యము.

**بھتنا** భుత్నా (హి.పు) దయ్యము, భూతము.

**بھتنی** భుత్నీ (హి.స్త్రీ) కామినీభూతము.

**بھتی** భత్తీ (హి.స్త్రీ) ఆదరింపుభోజనము.

**بھتیجا** భతీజా (హి.పు) భ్రాతృజుడు, సోదరునికొడుకు. భార్య, (సోదరునికోడలు.

**بھتیج بہو** భతీజ్ బహూ (హి) భ్రాతృజుని

**بھتیج داماد** భతీజ్ దామాద్ (హి) భ్రాతృజయొక్క భర్త, సోదరునియల్లుడు.

**بھتیجی** భతీజీ (హి.స్త్రీ) భ్రాతృజ, సోదరుని కూతురు. (లి, చాలామటుకు.

**بہتیرا** బహుతేరా (హి) అనేకము, మిక్కి-

**بھٹ** భట్ (హి.పు) గుహ, బొరియ, కలుగు; ఆవము, ప్రొయ్యి, బట్టీ; ప్రొయ్యిలోనికాలిన ఎఱ్ఱనిమట్టి; భట్టు, బ్రాహ్మణపండితుడు.

**بھٹا** భుట్టా (హి.పు) మక్కజొన్నకంకి, వెన్ను.

**بھٹکانا** భట్కానా (హి) భ్రమింపజేయుట, త్రిప్పుట, తప్పుత్రోవ మార్పుట; మోసము చేయుట.

**بھٹکنا** భటక్నా (హి) త్రిమ్మరుట, తప్పుత్రోవపట్టుట, భ్రమించుట, వెదకుచుతిరుగుట.

**بھٹنی** భట్నీ (హి.స్త్రీ) కుచాగ్రము, చనుమొన. [ఆవము.

**بھٹا** భట్టా (హి.పు) సున్నపుఆవము, పెద్ద

**بھٹئی** భటైె (హి.స్త్రీ) బట్టువానివృత్తి, ముఖస్తోత్రము, ఇచ్చకములు

**بھٹی** భట్టీ (హి.స్త్రీ) గాడిపొయ్యి, ఆవము, బట్టీ, చాకిపొయ్యి **بھٹی چڑھانا**-చఢానా (హి) బట్టలు ఉడకబెట్టుట, (చలువచేయుటకు.)

**بھٹیارا** భటియారా(హి.పు)సత్రము వాడు, పూటకూళ్ల వాడు,వంటలవాడు, రొట్టెల వాడు. **بھٹیار خانہ**— భటియార్-ఖానా (ఉ) పూటకూళ్లయిల్లు లేక సత్రము.

**بھج** భుజ్ (హి.స్త్రీ)భుజము,ప్రక్క.

**بہجت** బహ్‌జత్ (అ.స్త్రీ) సంతోషము.

**بھجن** భజన్(హి.పు)భజన,పూజ.

**بھجنا** భజ్నా (హి) భజించుట, పూజించుట,జపించుట.

**بھجنگ** భుజంగ్ (హి.పు) భుజంగము, పాము,కాలసర్పము,నల్లత్రాచు.

**بھجنگا** భుజంగా (హి.పు) దూదేకులపిట్ట, మిక్కిలినల్లనిది[మాలకాకి].

**بھجوانا** భిజ్వానా (హి)పంపించుట,పంపునట్టుచేయుట.

**بھجیا** భుజియా (హి.స్త్రీ) వండినకూర, ఆకుకూరలు, వేయించినబియ్యము (సత్తుచేయుటకు).

**بھچ** భుచ్ (హి)సిద్దీవాడు; మొద్దు, శుంఠుడు; కారునలుపువాడు.

**بھچکنا** భుచక్నా (హి) ఆశ్చర్యపడుట, అచ్చుకొనుట,దిగ్భ్రమచెందుట.

**بھچنا** భిచ్నా (హి) అణగుట, మణగుట. నలుగుట,ముడుచుకొనుట, వాడుట, సిగ్గుపడుట,

**بھدّا** భద్దా(హి) మొద్దు,వికారస్వరూపముగల,బలిసిన,మోటు;తెలివిమాలిన.

**بھداکا** భదాకా(హి.పు)దబ్బునుచప్పుడు.

**بھدرا** భద్రా(హి.పు)అశుభతిథులు,(ద్వాదశి,ద్వితీయ,సప్తమి); ముండనము.

**بھر** భర్ (హి)నిండ,అంత,సాంతము,"ఎడు" ప్రత్యయార్థకమును.

**بھرا** భరా (హి) నిండిన, పూర్ణమైన. **بھرا پرا**—పురా (హి) పరిపూర్ణమైన,సిరిసంపత్తుగల.

**بھڑا** భఱ్ఱా(హి)ఉద్రేకము;ప్రోత్సాహము; మోసము,టక్కు,బుఱ్ఱు[ధ్వని].

**بہرا** బహ్రా (హి) చెవిటి,వినరాని.

**بھراٹا** భరాటా (హి.పు)బుఱ్ఱుని ఎగురుచప్పుడు,చూడు, **بھڑا**.

**بھرانا** భరానా (హి) నిండించుట,నించుట.

**بھراو** భరావ్ (హి.పు) పూరణము,నింపుడు, పట్టినంత,భర్తి.

**بھرائی** భరాయీ (హి.స్త్రీ) నింపుడు,నించుట,నీళ్లుపోసినకూలి.

**بھربھرا** భుర్భురా (హి) కరకరలాడెడు, పొడిపొడిగానున్న, నూకలునూకలుగానున్న

**بھربھرانا** భుర్భురానా (హి) గుప్పుట, చక్కెరమిరియపుపొడి మొ॥ దేనిమీదనైన చల్లుట.

**بھرپور** భర్పూర్ (హి) పరిపూర్ణమైన,కొరతలేని.

**بھرت** భరత్ (హి.పు)రాగియుసీసముకలసినలోహము,కంచు.

**بھرتا** భుర్తా (హి.పు) బజ్జి,పిండి మిరియము.

**بھرتی** భర్తీ (హి.స్త్రీ)పూరణము,నింపుడు-పూర్తి,భర్తి,బరువు, మోత,కొలువుపెట్టుకొనుట, సంచయముచేర్చుకొనుట;పనికిమాలినవస్తువులు.

**بھرتیا** భరతియా (హి.పు) కంచరవాడు.

**بہرحال** బహర్‌హాల్ (హి) అన్నివిధములను,ఏవిధమునసైనను, ఎట్లయినను,సర్వథా

**بھرشٹ** భ్రష్ట్ (హి) భ్రష్టమైన,నీచమైన, పాడైన,చెడిన.

**بہرطور-صورت-کیف** బహర్ తౌర్—సూరత్—కైఫ్ (పా) చూడు, **بہرحال**

**بھرم** భరమ్ (హి.పు) భ్రమ,అనుమానము, సందేహము;కలవరము,చిక్కు,పొరపాటు,

నమ్మకము,విశ్వాసము, బరువసము,పరుపతి, మర్యాద,మన్నన,గౌరవము.

**بھرمار** భర్మార్ (హి) విస్తారము,పుష్కలము, సమృద్ధి,అమితము.

**بھرمانا** భర్మానా (హి) బుదగరించుట, మోసముచేయుట,భ్రమింపచేయుట.

**بھرنا** భర్నా (హి) నిండుట, చాలగుట, అచ్చుకొనుట,తీర్చుట,నెరవేర్చుట,చేయుట,పుండుమానుట,నించుట,అచ్చుట,దండుగయిచ్చుట, అప్పుతీర్చుట,అనుభవించుట, పూరికొల్పుట,అప్పు,ఋణము.

**بھروپ** బహ్రూప్ (హి.పు) బహురూపులు,మారువేషము,మోసము.

**بہروپیا** బహ్రూపియా[హి.పు]బహురూపులవాడు.

**بھروسا** భరోసా[హి.పు] బరువసము, ఆశ, నమ్మకము,ఆశ్రయము,విశ్వాసము.

**بہرہ** బహ్రా[పా.పు]భాగము,పాలు; ఆదాయము,లాభము,అదృష్టము,భాగ్యము.

**بہرہ مند و بریاب**—మంద్-వర్-యాబ్ (పా) అదృష్టవంతుడు, భాగ్యవంతుడు

**بہری** బహ్రీ [హి.స్త్రీ] చెవిటిది;బైరిపిట్ట.

**بھڑ** భిడ్[హి.స్త్రీ]కందిరీగ.

**بھڑانس** భడాంస్[హి.స్త్రీ] ఉష్ణము,సెగ,ఆవిరి,ఉక్క,పగ,స్పర్థ.

**بھڑانا** భిడానా[హి]కదియించుట, కలుపుట,కూర్చుట,చేర్చుట.

**بھڑائی** భిడాయీ[హి.స్త్రీ]తాకుడు, దాడి,కదియుట,సంయోగము.

**بھڑبھڑیا** భడ్‌భడియా [హి] భేలుడు, నిష్కపటి, మనసులో కోపముంచుకొననివాడు,మనసులో మాటనిలవనివాడు.

**بھڑبھونجا** భడ్‌భూంజా [హి.పు] వేపుడుగాడు, గింజలువేయించి అమ్మువాడు; పుట్నాలవాడు,నల్లనివాడు.

**بھڑک** భడక్[హి.స్త్రీ]ప్రకాశము, మెరుపు, మిరుమిట్లు,జ్వాల,కోపము,వైభవము, ప్రదర్శనము,డంభము,

**بھڑکانا** భడ్‌కానా[హి]మంటపెట్టుట, పురికొల్పుట,భయపెట్టుట, రేపుట.

**بھڑکنا** భడక్నా[హి]మండుట, బెదరుట, అదరుట,భయపడుట, కోపపడుట.

**بھڑکیلا** భడ్‌కేలా[హి] ప్రకాశమానమైన, మెరసెడు, తళతళలాడెడు; బెదరెడు, అందమైన;జాంగలు.

**بھڑنا** భిడ్నా [హి] కదియుట, కలియుట, కూడుట, దగ్గుట, పోట్లాడుట, తాకుట.

**بھڑوا** భడ్వా [హి పు]కుంటెనగాడు, తార్చువాడు.

**بھڑی دینا** భడిదేనా
**بھڑیاں دینا** భిడియాందేనా } [హి] పాపురము

లకుపగురచేర్చుట,విసికించుట.

**بھس** భుస్[హి.పు]పొట్టు,ఊక.

**بھساکو** భుసాకు[హి]ఘాటులేనిపొగాకు.

**بھس بھسا** భుస్‌భుసా (హి) లసలసలాడెడు.

**بھسکنا** భసక్నా(హి)జారిపడుట; అమితముగాతినుట.

**بھسکو** భసకప్పు (హి.స్త్రీ) తిండిపోతు, రంకుది.

**بھسم** భసమ్(హి)భస్మము. **بھسم پتری**—[పత్రీ(హి) సిం౦గారము.

**بھسنڈ** భుసండ్ (హి)అతికాయుడు,బలసినవాడు;మాలకాకి.

**بہشت** బిహిష్త్(పా.స్త్రీ)స్వర్గము.

**بہشت کا میوہ**—కామేవ(పా) దానిమపండు. **بہشت کی حوریں**—కీహూ రేఁ(పా)భోగస్త్రీలు.

**بہشتی** బిహిష్తీ(పా. స్త్రీ)స్వర్గ సం॥, స్వర్గ వాసి, నీళ్లవాడు. [దరిద్రుడు.

**بھکاری** భికారీ(హి. పు)బిచ్చగాడు, భిక్షుకుడు,

**بہکانا** బహ్కానా (హి) భ్రమింపజేయుట, తప్పుత్రోవపట్టించుట,కుర్షోభ చేయుట, పురికొల్పుట, మోసముచేయుట, రేపుట, చెరుచుట,వంచించుట.

**بہکاوا-وٹ** బహ్కావా-వట్ (హి.పు) మోసగింపు,టక్కు,భ్రమ.

**بھکت** భకత్ (హి.పు)భక్తిగల,భక్తుడు.

**بھکتی** భక్తి (హి. స్త్రీ)భక్తి.

**بھکرانا** భుక్రానా (హి)దుర్గంధము వచ్చుట,గబ్బులేకగవులుకొట్టుట. (గాలు.

**بھکراند** భుక్రాంద్ (హి)దుర్గంధము,గబ్బు,

**بھکشا** భిక్షా (హి)భిక్షము,బిచ్చము.

**بھک منگا** భిక్మంగా(హి.పు) బిచ్చగాడు, దరిద్రుడు. (గతిలేనివాడు.

**بھک موا** భిక్మువా(హి.పు) నిష్టదరిద్రుడు,

**بہکنا** బహక్నా (హి) భ్రమించుట,త్రోవతప్పుట,మోసపోవుట,కలవరపడుట.

**بھکنا** భుక్నా(హి)పొడవబడుట, గుచ్చుకు పడుట.

**بھکوا** భకుఆ (హి)అవివేకి, తెలివిమాలిన.

**بھکوسنا** భకోస్నా(హి)దిగమ్రింగుట, తినివే యుట.

**بھگانا** భగానా(హి)ఉరికించుట,పారగొట్టుట,వెడలగొట్టుట, పురికొలిపిఎత్తుకొనిపో వుట.

**بھگانا** భిగానా(హి)తడుపుట,నానుచ్చుట.

**بھگت** భగత్ (హి.పు)నటుడు,భక్తుడు.

**بھگتانا** భుగ్తానా(హి)నెరవేర్చుట, తీర్చుట. చేయుట,తుదముట్టించుట,పంచుట, అను భవింపచేయుట.

**بھگتنا** భుగత్నా(హి)భోగించుట, అనుభవించుట;తీర్చుట,చెల్లించుట.

**بھگتیا-بھگتی** భగతియా-భగతీ(హి.పు) నటుడు,ఆటకాడు,నృత్యగాడు.

**بھگر** భగర్ (హి)ముక్కినధాన్యము, వాసన పట్టిన ధాన్యము.

**بھگو** భగ్గూ(హి.పు)పారుబోతు,పిరికి.

**بھگوا** భగ్వా(హి పు)గోచిగుడ్డ,కాషాయము.

**بھگوان** భగ్వాన్(హి.పు)భగవంతుడు,కాషా యవస్త్రము.

**بھگوتی** భగవతీ (హి. స్త్రీ) భగవతి,దేవి.

**بھگوڑا** భగోడా(హి.పు)పారుబోతు,పిరికి.

**بھگونا** భిగోనా(హి)తడుపుట,నానుచ్చుట.

**بھگی** భగ్గీ(హి. స్త్రీ)పలాయనము, బుగులు, కలవరము,పారిపోవుట. (వాడు.

**بھگیلا** భగేలా (హి) పరుగెత్తువాడు,పరువు

**بھل** భల్ (హి)మంచి.

**بھل منسائی**-బల్ మన్సాయీ(హి)మో గ్యత,మంచితనము. (ష్టుడు.

**بھل** భిల్ (హిపు) భిల్లుడు, కిరాతుడు, మూ

**بھلا** భలా(హి.పు)మంచి, క్షేమము, మేలు, మంచిదిరైన,యోగ్యమైన, అద్భుతమైన, అపూర్వమైన. **بھلاچنگا**-చంగా (హి) నిరోగమైన,గట్టిముట్టుగాఉన్న,దృఢమైన.

**بہلانا** బహ్లానా(హి)వినోదపరచుట,ఉల్లా సపరచుట,ఏమరుచుట,మరపించుట,ఊరడించుట, బుజగరించుట.

**بھلانا** భులానా(హి)మరపించుట,ఏమరుచుట, త్రోవతప్పించుట, మోసముచేయుట, బుజగరించుట.

**بھلاوا** భులావా(హిపు) ఏమార్పు,మోసము, టక్కు.**بہلاوا**-బహ్లావా(హి.పు)మనోరంజనము,వినోదము.

**بھلاواں** భిలావాఁ (హి.పు)జీడిగింజ.

بھلائی భలాయీ (హి.స్త్రీ) మంచితనము, మేలు, క్షేమము, ఉపకారము, అందము,

بھلبھلانا భుల్బులానా (హి) వేయించుట, యిసుకకలిపి వేయించుట.

بھلسنا భులస్నా (హి) కాలుట, వ్రేలుట, వేగుట, కమలుట; కాల్చుట, వ్రేల్చుట, వేయించుట, వ్రేల్చుట

بھلکڑ భులక్కడ్ (హి) మరపుగల, అజాగ్రతగల, తెలివిమాలిన.

بھلمنسات - بھلمنسی } భల్మన్సాత్ —
بھلمنسائی }

మన్సీ—మన్సాయీ (హి.స్త్రీ) సజ్జనత, సంభావితత్వము, సభ్యత, మర్యాద, పెత్తనము, మంచితనము,

بہلنا బహల్నా (హి) ఉల్లాసముగానుండుట, వినోదపడుట, రంజితమగుట, సంతోషమగుట.

بہلہ బహ్లా (హి) కరత్రాణము, చేతిపైపక్షులను కూర్చుండబెట్టుకొనుటకు తొడుగుకొను తోలు గలిపెన, చర్మకవచము.

بہلی బహ్లీ (హి.స్త్రీ) కచ్చడము, చిన్న ఎద్దులబండి.

بہلیا బహ్లియా (హి.స్త్రీ) బోయవాడు, కచ్చడముతోలువాడు,

بھلےکو భలేకో (హి) బళిరే, బాగాయెను.

بہم బహమ్ (పా) కలిసి, కూడ.

بہم پہنچنا బహమ్—పహుంచ్నా (ఉ) సమకూడుట, దొరకుట, సంప్రాప్తమగుట.

بہم پہنچانا బహమ్—పహుంచానా (ఉ) సమకూర్చుట, సిద్ధపరచుట, తెచ్చియిచ్చుట.

بہم دیگر బహమ్—దీగ్ర్ (పా) ఒకరికొకరు, కూడి, కలిసి.

بھمباکا భంబాకా (హి.పు) పెద్దకూట, బొంగ, బుంగ. (మిక్కిలిబలిసినది.

بھمبو భంబూ (హి.స్త్రీ) అతికాయురాలు,

بھمبھیری-ڑی భంభీరీ-డీ (హి.స్త్రీ)

ఆకుచిలక, సీతాకోకచిలుక.

بہمن బహ్మన్ (పా.పు) పారసీకుల పదునొకండవసౌరమాసము, (దక్కనులో మూడవది)

بہن బిహన్ (హి.పు) విత్తనపుగింజ.

بہن బహన్ (హి.స్త్రీ) భగిని, తోడబుట్టినది.

بہنا బహ్నా (హి) పారుట, కారుట, వీచుట, జరుగుట; కదుగుట, పాడగుట, స్రవించుట.

بھننا భున్నా (హి) వ్రేలుట, వ్రేగుట, కాలుట; రూపాయిలు మొ॥ మారుట; అసూయపడుట. (వరుస.

بہناپا బహ్నాపా (హి.పు) అక్కచెల్లెండ్ర

بھناس భున్నాస్ (హి) పేనుగుంజ, పేనుగనుకట్టివేయుగూటము.

بھنانا భునానా (హి) వేయించుట; రూపాయిలు మొ॥ మార్చుట.

بھننانا భిన్నానా (హి) చెవులుగడియలు పడుట లేక గింగురుమనుట, దిమ్మపట్టుట.

بھنائی - بھنوائی భునాయీ—భున్వాయీ (హి.స్త్రీ) వేపునట్టుకూలి; పెచ్చు, వట్టము, మార్గము.

بھنبورنا సంభోడ్నా (హి) పండ్లసెరికి తినుట, దిమ్మ్రింగుట, కొరుకుట.

بھنبھنانا భిన్ భిన్నా (హి) ఈగలు మొ॥ ఝుంఝుమనుట, ఘుమ్మనుట, ముక్కునమాట్లాడుట, అనునాసికస్వరముతో మాటలాడుట.

بھنبھناہٹ భిన్ భినాహట్ (హి.స్త్రీ) ఝుంకారము, ఘుమ్మనుధ్వని; ముక్కునమాట్లాడుట.

بھنبیری భన్ బైరీ (హి) మిక్కిలివేగముగా పరుగెత్తువాడు, వేగవంతుడు, ఒకపక్షి.

بھنٹا భంటా (హి.పు) వంకాయ.

بھنڈار భండార్ (హి.పు) ఉగ్రాణము, కొట్టు, భాండాగారము, బండారము.

بھنڈارا భండారా (హి.పు) ఉగ్రాణము, కొట్టు, సన్యాసులసంతర్పన.

بھنڈاری భండారీ(హి.పు) ఉగ్రాణమువాడు, కొట్టుపెత్తనదారుడు.

بھنڈسال-بھنڈسارا భండ్‌సాల్-సారా(హి.స్త్రీ) ధాన్యసంచయము, బండారము, కట్టుగడచేసినధాన్యము.

بھنڈسالی భండ్‌సాలీ(హి.పు) ధాన్యముకట్టుగడచేయువాడు, కరువువచ్చుననిధాన్యసంచయము జేయువాడు, ధాన్యసంచయము.

بھنڈی భిండీ(హి.స్త్రీ) బెండకాయ.

بھنڈیلا భండేలా(హి.పు) భట్రాజు, భాండుడు, హాస్యగాడు. (సుధ్వని; వార్త.

بھنک భినక్(హి.స్త్రీ) హీనస్వరము, ఝుమ్మ

بھنکنا భినక్నా(హి) ఝుమ్మనుట, ఝుమ్మని ఈగలుముసరి యుండుట; పనికిమాలినసోమరిగానుండుట, మురికిగానుండుట.

بھنگ భంగ్(హి.స్త్రీ) భంగి, గంజాయి.

بھنگڑ భంగడ్(హి.పు) భంగిముచ్చు, భంగిలేక గంజాయిత్రాగువాడు.

بھنگڑا భంగ్‌డా (హి.పు) తృణవిశేషము.

بھنگن భంగన్ (హి.పు) పాకిది; గంజాయి త్రాగునది.

بھنگی భంగీ (హి.పు) పాకివాడు, ఊడ్చువాడు, గంజాయిత్రాగువాడు.

بھنگی భహంగీ (హి.స్త్రీ) కావడి,

بھنگی بردار -బర్దార్ (ఉ) కావడివాడు, మోతకూలివాడు.

بھنگیرا-ڑا భంగేరా-డా(హి.పు) భంగియుమ్మువాడు, గంజాయివాడు.

بھننا భున్నా[హి] చూడు بھنا

بھنوانا భూన్వానా [హి] దూపాయులు మొ॥ మార్పించుట, వేయింపించుట, వండించుట.

بھنور భఁవర్[హి.పు] జలావర్తము, నీళ్లసుడి

بھنورجال -జాల్ [హి] ప్రపంచపుచిక్కులు.

بھنورا భౌఁరా [హి.పు] భ్రమరము, తుమ్మెద.

بھنورکلی భఁవర్‌కలీ [హి] జంతువుల మెడపట్టెడ, పలుపు.

بہنوی బహ్నోయీ (హి.పు) తోడపుట్టినదానిపెనిమిటి, బావ, మఱది.

بہنی బుహ్‌నీ[హి.స్త్రీ] చూడు بوہنی

بہنیلا బహ్నేలా (హి.పు) అక్కచెల్లెంద్రభావము, స్నేహము, చెలిమి.

بہنیلی బహ్నేలీ (హి.స్త్రీ) అక్కచెల్లెలివరస పెట్టుకొనినయామె, చెలికత్తె, స్నేహితురాలు.

بہو బహూ (హి.స్త్రీ) కోడలు, పెండ్లికూతురు; కొడుకుపెండ్లాము; భార్య, పెండ్లాము; అమ్మగారు.

بھوا భుఆ (హి.స్త్రీ) మేనత్త, తండ్రితోబుట్టువు; ఒకగొంగడిపురుగు.

بھوان భౌఆఁ (హి.స్త్రీ) కనుబొమలు.

بھوبل భూబల్ (హి.స్త్రీ) కాలెడు లేక వేడిబూడిద, కాలెడుమన్ను, ఇసుకఎడారి.

بھوت భూత్ (హి.స్త్రీ) భూతము, దయ్యము. بھوج-ج భోజ్ (హి.పు) భోజనము, విందు.

بھوجائی-بھوجی భోజాయీ-భోజీ (హి.స్త్రీ) అన్నభార్య, వదినె

بھوجپتر భోజ్‌పత్తర్ (హి.పు) భుజపత్రి

بھوجن భోజన్ (హి.పు) భోజనము.

بھوچک-کا భౌచక్-కా (హి) భ్రమప్పడిన, నివ్వెరగందిన, బిచ్చపోయిన, కలవరపడిన, ఎటుతోచనిస్థితిలోనున్న.

**بھوڈل** భోడల్ (హి.పు) అభ్రకము.

**بھور** భోర్ (హి.స్త్రీ) ఉదయము,ప్రాతః కాలము.

**بھورا** భూరా (హి) ధూమ్రవర్ణముగల,గోధుమవర్ణముగల,నీరుకావి వన్నెగల; కొన్ని తెల్లఈకెలుగల నీలిపావురము.

**بھوڑ** భూడ్ (హి.స్త్రీ) యిసుకనేల.యిసుక ఎడారి.

**بھوسا** భూసా (హి.పు) పొట్టు,ఊక.

**بھوسی**—భూసీ (హి.స్త్రీ) పొట్టు- పిండిలోతేలినసన్న పొట్టు,

**بھوک** భూక్ (హి.స్త్రీ) ఆకలి, క్షుధ.

**بھوکا-کڑ** భూకా-కడ్ (హి) ఆకలిగొన్న, ఆకలిగల;రిక్తుడైన.

**بھوگ** భోగ్ (హి.పు) భోగము,నైవేద్యము సంభోగము.సౌఖ్యము, అనుభవము,

**بھوگنا** భోగ్నా (హి) భోగించుట, అనుభవించుట, సహించుట.

**بھول** భూల్ (హి.స్త్రీ) మరపు, అపస్మారము,పొరపాటు.

**بھولا بسرا-بھولا بھٹکا** భూలాబిస్రా—భట్కా (హి) మరచిన, పొరపాటుపడిన, చెడితిరిగాడు,పామరుడు, **بھول چوک** —చూక్ (హి) మరచితప్పు, పొరపాటు,

**بھولا چیتا**—చీతా(హి)మరపుగొండి

**بھولا** భోలా (హి) భోలుడైన, నిష్కపటియైన,అమాయకుడైన, బేలయైన,సజ్జనుడు,

**بھولاپن** భోలాపన్ (హి.పు) బేలతనము, నిష్కాపట్యము,సౌజన్యము,అమాయికము.

**بھولاناتھ** భోలానాథ్ (హి.పు)శివుడు

**بھول بھلیاں** భూల్ భులయ్యాం(హి.స్త్రీ) విడుపుకథ;అనోమయము, చిక్కు;అంతరాంతరములు. (పొరపడుట,

**بھولنا** భూల్నా (హి) మరచుట,తప్పుట,

**بھولی** భోలీ (హి.స్త్రీ)బేల, నిష్కపటురాలు. (ముద్దుగానున్న.

**بھولی بھولی** భూలీభూలీ [హి] ముద్దు

**بھوم** భూమ్[హి.స్త్రీ]భూమి,జగత్తు.

**بھومیا** భూమియా(హి.పు)స్థలస్వామి,భూస్వామి; పాతకాపు; యజమాని; ముసలివాడు.

**بھوں** భౌం(హి.స్త్రీ)కనుబొమ, భ్రూవు.

**بھوناس** భూనాస్ [హి.పు]ఏనుగను కట్టివేయు గూటము. (గొమ్మ.

**بھونپو** భోంపూ(హి.పు] పెద్దబూరగ,బూరగ

**بھونچال** భోంచాల్ (హి.పు) భూకంపము.

**بھونچکا** భోంచకా(హి) చూడు.**بھوچک**

**بھوندو** భోందూ (హి) బేల,అవివేకియైన, మొద్దు,శుంఠ.

**بھوندا** భోండా (హి.పు) అనాకారియైన, కురూపియైన;అశుభమైన దౌర్భాగ్యమైన.

**بھونداپن-پنا** భోండాపన్-నా [హి]అనాకారము,కురూపము.

**بھونر** భౌంర్[హి]చూడు**بھورا**

**بھونرا** భౌంరా(హి.పు)భ్రమరము, గండుతుమ్మెద; నేలబొంగరము, నేలమాలియ, కారునలుపైనది.

**بھونری** భౌంరీ [హి.స్త్రీ] ఆడతుమ్మెద, వెంట్రుకలసుడి,నిప్పులమీద కాల్చినరొట్టె, ఒకగుఱ్ఱపుసుడి.

**بھونسنا** భౌంస్నా(హి) మొరుగుట,వదరుట.

**بھونکانا** భౌంకానా(హి) మొరిగించుట,విసికించుట.

**بھونکنا** భౌంక్నా (హి) మొరుగుట, ప్రేలుట. (టు,గ్రుచ్చుట.

**بھونکنا** భోంక్నా(హి)పొడుచుట, క్రుమ్ము

**بھونگڑا** భౌంగ్డా (హి) మోటురూపముగల

యాడుడి, దూరపుకుట్టు, పనికిమాలినకుట్టు, నేలమాలియ, నేలబొయారము.

بھونا భూన్నా (హి) వేయించుట, కాల్చుట, విసికించుట; పీడించుట.

بہی బిహీ (పా. స్త్రీ) సీమదాడిమ్మ

بہی دانہ బహీ-దాన[పా]సీమదాడిమ విత్తులు.

بھی భీ (హి) యును, ను, కూడ, ఇంక.

بھئی భై (హి. పు) ఇది بھائی యొక్క సంగ్రహరూపము, రూపాంతరము.

بہی బహీ (హి. స్త్రీ) వహీ, పుస్తకము, పొత్తము, అడ్డముగాకుట్టినపుస్తకము.

بھیا భయ్యా (హి. పు) ఇది بھائی-యొక్క సంగ్రహరూపము.

بھیانک భయానక్ (హి) భయంకరము.

بھیت భీత్ (హి. స్త్రీ) గోడ; అడ్డకట్ట; పాతగోడలు.

بھیتر భీతర్ (హి) లోపల, లో; అంతరంగము.

بھیتری భీతరీ (హి) లోపలి, రహస్యమైన.

بھیتریا భీతరియా (హి. పు) పెండ్లివిందుకు వచ్చినవారు; అంతరంగికుడు.

بھیٹ భేట్ (హి. స్త్రీ) సందర్శనము, దర్శనము, కలియుట, లంచము; కానుక; కట్నము; నైవేద్యము; ముడుపు.

بھیٹنا భేట్నా (హి) కలియుట, సందర్శించుట; కౌగిలించుట. (పొదడు.

بھیجا భేజా (హి. పు) మస్తిష్కము,

بھیجنا భేజ్నా (హి) పంపుట, అంపుట.

بھیچنا భీచ్నా (హి) అదుముట, ఒత్తుట, పిండుట; బలవంతపెట్టుట, అణచుట.

بھید భేద్ (హి. పు) భేదము, గుట్టు.

بھیدو-بھیدی భేదీ-భేదూ (హి. పు) గుట్టెరిగినవాడు; చారుడు, వేగులవాడు, జాడతీయునాడు.

بھیرو-بھیروی భైరవీ-వీ (హి. స్త్రీ) భైరవరాగభేదము.

بھیڑ భీడ్ (హి. స్త్రీ) జనసమ్మర్దము, గుంపు, మూక; సంకటము, పని ఒత్తిడి.

بھیڑ భేడ్ (హి. స్త్రీ) గొఱ్ఱె.

بھیڑا భేడా (హి. పు) తాండ్రకాయ, గొఱ్ఱెపోతు, పొట్టేలు.

بھیڑنا భేడ్నా (హి) మూయుట, కదియవేయుట, దగ్గరించుట; స్వాధీనపరచుట.

بھیڑی భేడీ (హి. స్త్రీ). ఆడగొఱ్ఱె.

بھیڑیا భేడియా (హి. పు) తోడేలు.

بھیڑیا چال-بھیڑیا دھسان
చాల్-ధసాన్ (హి) గొఱ్ఱెదాటు, ఒకరు చేసినట్లుచేయుట.

بھیس భేస్ (హి. పు) వేషము, ఆకారము.

بھیک భీక్ (హి. స్త్రీ) భిక్షము, బిచ్చము.

بھیک مانگنا భీక్-మాంగ్నా (హి) బిచ్చమెత్తుట

بھیگنا భీగ్నా (హి) తడియుట, నానుట.

بھیل భీల్ (హి. పు) చూడు, بھل

بھیلسا భీల్సా (హి. పు) శ్రేష్ఠమైనపొగాకు

بھیلی భేలీ (హి. స్త్రీ) బెల్లపుఎత్తు (సుమారు ౫ శేర్లు) బెల్లపుఅచ్చు, బెల్లపుముద్ద.

بھیلیا బహేలియా (హి. పు) బోయవాడు, పక్షులవేటగాడు. (ణము (పక్షి.)

بھیمراج భీమ్‌రాజ్ (హి. పు) వనభూష

بھیں భేం (హి. స్త్రీ) గొఱ్ఱెబఱ్ఱెలయరుపు.

بھینا భీనా (హి) స్వల్పమైన, తేలికైన, (రంగులేకవాసన.) (بھیٹ

بھینٹ భేంట్ (హి. స్త్రీ) చూడు,

بھینٹنا భేంట్నా (హి) చూడు,
بھیٹنا

بھینس భైంస్ (హి. స్త్రీ) బఱ్ఱె, మహిషము.

بھینسا భైంసా (హి. పు) దున్న, మహిషము.

بھینسا داد—బ్ఙేంసాదాద్ (హి.పు) తానుర (గజ్జి) بھینسا گوگل—బ్ఙేంసాగూగుల్ (హి.పు) మహిషాక్షి بھینسا لہسن—బ్ఙేంసాలహసన్ (హి) ఎఱ్ఱవెల్లుల్లి, పొడ (తెల్లనిదికాక నల్లనిది)

بھینگا భేంగా (హి) మెల్లకంటి.

بھیہو భైహూ (హి) తమ్మునిభార్య, మరదలు.

بھینی بھینی بو భీని భీనిబూ (హి) మంద మందసుగంధము, తేలికైనసువాసన.

بی بی బీ (హి.స్త్రీ) మాడు بی بی.

بے బే (హి) ఓరి, రే, రేరే.

بے బే (పా) ఇదివ్యతిరేకార్థకయుపసర్గము.

بے آب —బే—ఆబ్ (పా) కాంతి విహీనమైన, بے آبروئی —బే—ఆబ్రూయీ (పా) అవమానము بے اجل —బే—అజల్ (పా) అకాలమైన (మరణము) بے ادبی —బే—అదబీ (పా) అవినీతియత, అనాగరికత, మోటుతనము, పలవతనము بے انتہا —బే—ఇంతిహా [పా] అనంతమైన, అంతులేని بے اصل —బే—అసల్ (పా) అసత్యమైన, నిరాధారమైన.

بے آپے ہونا —బే—ఆపేహోనా (పా) ఒళ్లు మరచుట, పరవశుడగుట, తత్తరపడుట

بے انتظامی —బే—ఇంతిజామీ (పా) అవ్యవస్థ بے انصافی —బే—ఇన్సాఫీ (పా) అన్యాయము, بے ایمانی —బే—ఈమానీ (పా) అధర్మము, అక్రమము, అన్యాయము.

بے اولاد —బే—ఔలాద్ (పా) అనపత్యుడు, బిడ్డలులేని بے باک —బే—బాక్ (పా) అభీరువు, నిర్భయుడైన بے باق —బే—బాక్ (పా) నిశ్శేషము, అశేషముగాతీరిన, తీరుమానమైన

بے بدل-نظیر —బే—బదల్-నజీర్ (పా) అద్వితీయమైన, సాటిలేని بے بس —బే—బస్ (పా) దిక్కుమాలిన, గతిలేని بے بہا —బే—బహా (పా) అమూల్యమైన, వెలలేని. بے تابی —బే—తాబీ (పా) అస్వస్థత, కలత, తత్తర, తహతహ. بے تقصیر —బే—తక్‌సీర్ (పా) నిరపరాధియైన, నిర్దోషియైన بے تمیز —బే—తమీజ్ (పా) అవివేకియైన, తారతమ్యజ్ఞానములేని بے توجہ —బే—తవజ్జుహ్ (పా) అలక్ష్యము. నిర్లక్ష్యము. بے جا —బే—జా (పా) అసంగతమైన, అక్రమమైన بے جان —బే—జాన్ (పా) నిర్జీవము—చచ్చిన بے چارہ —బే—చార (పా) దిక్కుమాలిన, గతిలేని.

بے چین —బే— చైన్ (పా) వ్యాకులతగల, అస్వస్థమైన بے حال —బే—హాల్ (పా) దురవస్థలోనున్న, నిరుద్యోగియైన بے حجاب —బే—హిజాబ్ (పా) సిగ్గుమాలిన, బిడియములేని.

بے خود —బే—ఖుద్ (పా) ఒడలుమరచిన, మత్తుగొన్న بے حیا —బే—హయా (పా) సిగ్గుమాలిన.

بیدردی —బేదర్‌దీ (పా) క్రూరత్వము, క్రౌర్యము بے حواسی —బే—హవాసీ (పా) ఎటునుదోచమి, దిగ్భ్రమ; కలవరము, బమ్మెరపుమైమరుపు, అపస్మారకము بے داغ —బే—దాగ్ (పా) నిష్కళంకమైన, నిర్దోషమైన.

بیدھڑک —బేధడక్ (పా) నిర్భయమైన.

بے ڈول —బే—డౌల్ (పా) అనాకారమైన, వికారమైన. بے رحم —బే—రహ్మ్ (పా) నిర్దయుడైన, క్రూరమైన. بے ریشہ —బే—రేశ (పా) పీచులేని, నారలేని بے زبان —బే—జబాన్ (పా) నోరులేని, మూగ بے شرم —బే—షర్మ్ (పా) సిగ్గుమాలిన بے شک —బే—షక్ (పా) నిస్సంశయముగా بے شعور —బే—షఊర్ (పా) శుంఠుడు, మూఢుడు, అజ్ఞాని بے فکری —బే—ఫిక్రీ (పా)

నిర్విచారము,నిశ్చింతగా بےقاعدہ బే-కాఇద (పా)అక్రమమైన, అసాంప్రదాయకమైన. بےکاج బే-కాజ్ (పా)పనికిమాలిన بےکار బే-కార్ (పా) నిరుద్యోగియైన, పనికిమాలిన. بےکس బే-కస్(పా)దిక్కుమాలిన, بےلاگ బే-లాగ్ (పా) నిష్పక్షపాతి, నిర్దాక్షిణ్యుడు بےموسم బే-మౌసిమ్(పా) అకాలమైన بےمعنی బే-మఅనీ(పా)నిరర్థకమైన,అసంగతమైన بےنصیب బే-నసీబ్ (పా)దౌర్భాగ్యుడు بےنیاز బే-నియాజ్ (పా) స్వతంత్రమైన, స్వేచ్ఛగల بےوفا బే-వఫా (పా) కృతఘ్నుడైన,ద్రోహియైన بےوقوف బే-వకూఫ్(పా) బుద్ధిమాలిన, بےکلی బే-కలీ (పా)అస్వస్థత,వ్యాకులత بےہنر బే-హునర్ (పా) ప్రవీణతలేని, పనిరాని بےہوش బే-హోష్ (పా)స్మృతిలేని,మైమరచిన.

بےمحل-موقع-وقت బే-మహల్-మౌకా-వక్త్ (పా)అప్రస్తుతము, అసంగతము, بےنام ونشان బే-నామ్-ఒ-నిషాన్ (పా) అనామధేయుడైన بےموجب బే-మూజిబ్(పా)నిష్కారణము, నిర్హేతుకము, అనర్థము بےوقتی బే-వక్తీ(పా) అవమానము. بےتحاشا బే-తహాషా-తహాషా(పా)వెనుకముందు చూడకుండ.

بیا బయా (హి.పు) గిజ్జిగాడు,ధాన్యముకొలుచువాడు.

بیا బియా(హి.పు)విత్తనము,గింజ.

بیابان బియాబాఁ(ఫా.పు)ఎడారి; ఇసుక ఎడారి;అడవి.

بیاج బ్యాజ్(హి.పు)వడ్డీ-వృద్ధి.

بیاج پر بیاج -పర్ బ్యాజ్ (హి) చక్రవృద్ధి,వడ్డీకివడ్డీ. بیاج خور బ్యాజ్-ఖోర్ (ఉ) వృద్ధ్యాజీవుడు,వడ్డీతినువాడు.

بیاجو బ్యాజూ (హి) వడ్డీగల, వడ్డీయివ్వవలసిన.

بیار బ్యార్(హి.స్త్రీ)వాయువు,గాలి.

بیاسی బ్యాసీ(హి)ఎనుబదిరెండు.

بیاض బయాజ్ (అ.స్త్రీ) తెలుపు,అలేఖము, తెల్లకాగితములపుస్తకము.

بیاکرن బ్యాకరన్(హి పు) వ్యాకరణము.

بیاکل బ్యాకుల్(హి)వ్యాకులము.

بیالو బియాలూ (హి.పు) రాత్రిభోజనము.

بیالیس బ్యాలీస్(హి) నలుబదిరెండు.

بیان బయాన్(అ.పు)ప్రవచనము, స్పష్టవాక్యం, సంభాషణ; వర్ణనము; వయినము, వ్యాఖ్యానము, వివరణము;వర్తమానము; వాఙ్మూలము, సాక్ష్యము; సాహిత్యము; అధ్యాయము, విషయము, అంశము, సామితె,వచనము; بیان کرنا బయాన్ కర్నా(హి) ప్రవచించుట, చెప్పుట, వర్ణించుట, వివరించుట,

بیانا బ్యానా(హి)ఈనుట,కనుట(పశువులు)

بیانہ బయానా-న (ఉ) సత్యంకారము, సంచకరువు.

بیاہ బియాహ్ (హి.పు) వివాహము,పెండ్లి. بیاہ لانا బియాహ్ లానా(హి)మళ్లీపెండ్లికిపిలుచుకవచ్చుట, గృహప్రవేశమునకు పిలుచుకవచ్చుట. بیاہ مانگنا బియాహ్ మాంగ్నా (హి) పెండ్లియుక్తవిచారించుటలేక నిర్ణయించుట.

بیاہا బ్యాహా (హి.పు) వివాహితుడు, పెండ్లాడినవాడు.

بیاہتا బ్యాహ్‌తా(హి.స్త్రీ)వివాహితురాలు,ఇల్లాలు.

بیاہنا బియాహ్నా (హి) పెండ్లాడుట, పెండ్లిచేయుట.

بی بی బీబీ (పా.స్త్రీ) అమ్మగారు,స్త్రీ, భార్య,ఇల్లాలు;స్త్రీలగౌరవనామము.

بی بی جی —బీబీజీ (ఉ) ఆడబిడ్డ,మగనితో బుట్టువు;స్త్రీలగౌరవనామము.

بی بی زن —బీబీ జన్ (పా) పతివ్రత, ఇల్లాలు.

بیوپار బేపార్ (హి.పు) వర్తకము, వ్యాపారము.

بیوپاری బేపారి (హి.పు) వర్తకుడు,వ్యాపారి,బేరగాడు.

بیت బేత్ (హి.స్త్రీ) వేత్రము, బెత్తము, పేము, పేపచెట్టు.

بیت బైత్ (అ.స్త్రీ) ఇల్లు,నివాసము;గుడి, ఆలయము;పద్యము,పాదము.

بیت الحزن — ఉల్ హుజ్న్ (అ) సూతకపు,ఇల్లు. بیت الخلا —ఉల్ ఖలా (అ) మరుగుదొడ్డి بیت الصنم —ఉస్సనమ్ (అ) దేవాలయము, ప్రతిమమందిరము بیت المال —ఉల్ మాల్ (అ) భాండాగారము, బొక్కసము.

بیت السقر —ఉస్సకర్ (అ) నరకము.

بیت الحرام —ఉల్ హరామ్ (అ) పవిత్రగృహము, మక్కాషరీఫు నందలి దేవాలయము بیت المقدس —ఉల్ ముకద్దస్ (అ) పావనగృహము, జెరుసలమందలి దేవాలయము.

بیتال బేతాల్ (హి.పు) భేతాలుడు,పిశాచము.

بیتنا బీత్నా (హి) సంఘటించుట, అనుభవమునకువచ్చుట,సంభవించుట, జరుగుట, తటస్థించుట, తుదముట్టుట, భుక్తమగుట.

بیتی బీతీ (హి.స్త్రీ) చరిత్రము,వృత్తాంతము,వర్తమానము, జరిగినది, అనుభవించినది.

بیٹ బీట్ (హి.స్త్రీ) రెట్ట,పక్షులమలము, గంధకపుఉప్పు. بیٹ کرنا —కర్నా (హి) రెట్టవేయుట.

بیٹا బేటా (హి.పు) కొడుకు, పిల్లవాడు, అబ్బాయి.

بیٹا گود لینا-بنانا గోద్ లేనా-బనానా (హి) దత్తుచేసికొనుట, కొడుకునుపెంచుకొనుట, بیٹا بیٹی —బేటీ (హి) కొడుకులుబిడ్డలు,సంతానము.

بیٹھک బైఠక్ (హి.స్త్రీ) ఆసనము,పీఠము; కూర్చుండుట;రచ్చకూటము, చావడి.

بیٹھن —బేఠన్ (హి.స్త్రీ) మూటగుడ్డ,పరుపుచీర.

بیٹھنا బైఠ్నా (హి) కూర్చుండుట; గుడ్లుపొదుగుట;సోమరిగానుండుట; పేరుట; అణగుట;కూలబడుట,పడిపోవుట.

بیٹھواں బైఠ్వాన్ (హి) కూర్చుండియున్న, బల్లపరుపుగానున్న, పగలుగానున్న, చదునైన,సమానమైన.

بیٹی బేటీ(హి.స్త్రీ)కూతురు,బిడ్డ,

بیٹی کا باپ —కాబాప్ (హి) మగటిమిలేనివాడు,దుర్బలుడు, పనికిమాలినవాడు, హీనుడు.

بیج బీజ్ (హి.పు) బీజము, విత్తనము, మూలము. بیج مارا جانا —మారాజానా (హి) నిర్బీజమగుట,నిర్మూలమగుట.

بیجار బీజార్ (హి) బహుబీజమైన, చాలవిత్తనములుగల.

بیجک బీజక్ (హి.పు) చిల్లాకు, సామానుపట్టి.

بیجنا బీజ్నా (హి.పు) విసనకఱ్ఱ.

بیجنا ڈولنا —డోల్నా (హి) విసరుట, వీవనవేయుట.

بیجھڑ బేఝడ్ (హి.స్త్రీ) కలుపిన్న, కలిసిన ధాన్యము, శెనగలుయవలుకలిసినవి.

بیجلا బీజేలా (హి) చూడుము بیجار

بیچ బీచ్ (హి.పు) నడుమ, మధ్యము, అంతర

ము, భేదము, అన్యోన్యము, కేంద్రము.
بیچ بچاو-బచావ్ (హి) మధ్యవర్తిత్వము, సమాధానము, పరిష్కారము, తీర్పు, తీరుమానము. بیچوں بیچ-بیچا بیچ-బీచోం బీచ్-బిచాబీచ్ (హి) నట్టనడుమ, కేంద్రము.

بیچنا బేచ్నా (హి) అమ్మటు.

بیچو బేచూ (హి) అమ్మువాడు.

بیخ బేఖ్ (పా. స్త్రీ) మూలము, బీజము; కారణము; వంశపరంపర. بیخ کنی -కనీ (పా) నిర్మూలనము, విత్తుమాపుట.

بید బేద్ (హి. పు) వేదము.

بید బెద్ (పా. స్త్రీ) వేత్రము, బెత్తము.

بیدار బేదార్ (పా) జాగ్రతగల, మెలకువగల, మేలుకొనియున్న. بیدار بخت -బఖ్త్ (పా) అదృష్టవంతుడు. (లకువ.

بیداری బేదారీ (పా. స్త్రీ) జాగ్రత, మె

بیدانت బేదాంత్ (హి. పు) వేదాంతము.

بیدائی బైదాయీ (హి. స్త్రీ) వైద్యము, చికిత్స.

بیر బీర్ (హి. పు) వీరుడు, శూరుడు.

بیر బైర్ (హి. పు) వైరము, పగ.

بیر لینا-نکالنا -లేనా-నికాల్నా (హి) పగదీర్చుకొనుట, بیر کارشتہ -కారిష్తా (హి) కానిచుట్టరికము, పవనిచుట్టరికము, (సవతి మొ॥) (తడవ, తేప.

بیر బేర్ (హి. పు) రేగుపండు; ఆలస్యము;

بیرا బైరా (ఉ. ఫు) బోయి, సేవకుడు.

بیراگ బైరాగ్ (హి. పు) వైరాగ్యము, సన్యాసము. [హంసపాది.

بیراگا బైరాగా (హి. పు) యోగదండము,

بیراگی బైరాగి (హి. పు) విరాగి, సన్యాసి; యోగదండము.

بیربہوٹی బీర్‌బహోటీ (హి. స్త్రీ) ఆరుద్రపురుగు, చందమామపురుగు, ఇంద్రగోపము.

بیرک-بیرق బైరక్ (పా. పు) పతాకము, టెక్కెము.

بیرن బైరన్ (హి. స్త్రీ) విరోధురాలు, పగది.

بیرنگ బేరంగ్ (ఇ) అంచెబిళ్ల వేయనిది, అంచెకూలి యివ్వవలసినది.

بیروں బేరూన్ (పా) బయటు, వెలుపల; కాక, ఇతరము. بیروں جات -జాత్ (పా. స్త్రీ) బాహ్య ప్రదేశము, పరిసర ప్రదేశము, పల్లెలు. (పిట్ట.

بیری బైరీ (హి. పు) వైరి, పగవాడు; డేగ, బైరి

بیڑ బేడ్ (హి. పు) ఆవరణము, ఆలవ, అంగణము.

بیڑا బేడా (హి. పు) ఆవరణము, ఆలవ; పడవ, పుట్టి, తెప్ప; నౌకాసమూహము, పడవల గుంపు; సేన, మూక. بیڑا پار ہونا పార్ హోనా (హి) కృతార్థుడగుట, తరించుట, నెరవేరుట, కొనసాగుట.

بیڑا బీడా [హి. పు] విడెము, తమలపాకుల మడపు; ఆకుచుట్ట; కత్తిపిడి త్రాడు.
بیڑا اٹھانا-ఉఠానా (హి) కార్యభారము వహించుట, అప్పగించుకొనుట, పందెము వేయుట, నడుముకట్టుట.

بیڑی బేడీ (హి. స్త్రీ) శృంఖలము, సంకెలు; చుట్టుగొలుసు; పొలములకునీరుకొట్టుగూడ, తమలపాకులమడత.

بیزار బేజార్ (పా) విసికిన, రోసిన; అసమాధానమైన, కోపించిన; అసహ్యపడిన.

بیزاری బేజారీ (పా. స్త్రీ) విసుగు, రోత; అసమాధానము; కోపము, అసహ్యము.

بیس బీస్ (హి) ఇరువది.

**بیسوں** బీసోఁ(హి)అనేకము, పెక్కులు.

**بیساکھ** బైసాఖ్ (హి.పు)వైశాఖమాసము.

**بیساکھا** బైసాఖా (హి.పు) ఇనుపకట్లగుది యా,హంసపాది.

**بیساکھی** బైసాఖీ(హి.స్త్రీ) వైశాఖమాస పుపంటలు, ఒకపెద్దఉసిరికకాయ, చూ డు. **بیسا کھا** (తు,ఆలసుడు.

**بیسا ندو** బైసాందూ.[హి.పు] సోమరిపో

**بیسر** బెసర్[హి.పు]నాసామణి, బేసరి.

**بیسن** బేసన్ [హి.పు]శెనగపిండి.

**بیسوا-یا** బేస్వా-స్యా(హి.స్త్రీ) వేశ్య, వెలయాలు.

**بیش** బేష్(ఫా)అధికము, మేలుతరము,శ్రేష్ఠ ము; బాగు, మేలు. **بیش از بیش**— అజ్ బేష్ [పా] ఉత్తమోత్తమము.

**بیش بہا۔ قیمت** బహా—కీమత్ (పా)వెలపొడుగైన,హెచ్చువెలగల.

**بیش باد**—బాద్ [పా]వృద్ధిరస్తు, వృద్ధియగు గాక.

**بیشہ** బేష [పా.పు] అడవి,ఎడారి,బీడు.

**بیشی** బేషీ [పా.స్త్రీ] ఆధిక్యము; హె చ్చు,పెచ్చు;మిగులు,లాభము; పైబత్తెము.

**بیض** బైజ్[అ.పు]ముద్ర,చిహ్నము.

**بیضا** బైజా [అ.పు] సూర్యుడు; తెల్లని, కాంతిగల. (వణము.

**بیضہ** బైజ[అపు]అండము-గ్రుడ్డు; బీజము,వృ

**بیضوی** బైజవీ[అ]అండాకారమైన, గ్రు డ్డువంటి.

**بیطار** బేతార్(అ.పు) అశ్వవైద్యుడు, గుఱ్ఱ ముల చికిత్సచేయువాడు.

**بیع** బైఉ (అ.స్త్రీ) విక్రయము, అమ్మక ము, క్రయవిక్రయములు. **بیع نامہ**—నా మ (అ.పు) విక్రయపత్రము.

**بیع وشرا**—ఒ-షిరా(అ.స్త్రీ) క్రయవిక్ర యములు. (యువు.

**بیعانہ** బైఆన(అ.పు)సత్యంకారము,సంచక

**بیعت** బైఅత్(అ.స్త్రీ)శిష్యత్వము, దాస త్వము,ప్రమాణము,భక్తి,లోబడుట.

**بیکنٹھ** బైకుంఠ్ (హి.పు) వైకుంఠము.

**بیکنٹھ باسی**—బాసీ(హి) వైకుంఠవా సి,స్వర్గస్థుడు. (సంచి,బొక్కసము.

**بیگ** బేగ్(హి.పు)వేగము; బేగి-బిరాన,(ఇం)

**بیگ** బేగ్ (తు.పు) ప్రభువు,నాయకుడు,రా యడు,మొగలాయివారిగౌరవనామము.

**بیگار-ری** బేగార్-రీ (పా.పు) వెట్టిపట్టుట, బలాత్కారముగా పనిచేయించుకొనుట, వెట్టిపని, వెట్టివాడు. **بیگار ٹالنا**—టా ల్నా(హి)విధిలేక జేయుట,అశ్రద్ధగా జేయు ట, వెట్టిపనిగా జేయుట.

**بیگانگی** బేగాన్గీ(పా.స్త్రీ)అపరిచయము; వేరుబందము;బిడియము;పరాయితనము.

**بیگانہ** బేగాన(పా)పరాయి,పరిచయములేని, పరదేశి,అన్యుడు.

**بیگم** బేగమ్(తు.స్త్రీ)దొరసాని, యజమాను రాలు,రాణి, తురకదేశస్థులస్త్రీలగౌరవనా మము

**بیگن** బైగన్(హిపు)వంకాయ,వంగచెట్టు.

**بیگہ-بیگھا** బీగ-బీఘా(హి.పు)బీగము(భూ మికొలత).

**بیگی** బేగీ(హి)బేగి, వేగముగా.

**بیل** బైల్(హి)ఎద్దు,వృషభము.

**بیل** బేల్(హి.స్త్రీ)తీగ, లత; వెలగచెట్టు; పట్టిగోటు;బట్టలపైచేసినసరిగపని; దిగదు డిచియిచ్చినరొక్కము, పరంపర, వరుస; దొంతరము;సంతానము;ఒక్కపుష్పము.

**بیل** బేల్(పా.పు)గుద్దలి,పార. **بیلا** బేలా

(హి)బేల, దుర్బలుడు, పిరికి, ఆడపోబల్లి వాడు.

بیلا బేలా(హి.స్త్రీ) వేళ,సమయము,కాలము; కోర,గిన్నె,సారంగి,ఒకమల్లెపువ్వు.

بیلا బేలా(పా.పు) బొక్కసము, ధర్మద్రవ్యము,ధర్మముగాపంచురొక్కము.

بیلادار బేలా- దార్ (హి) ధర్మకర్త, గొప్పవారివద్ద ధర్మద్రవ్యము పంచువాడు.

بیلچہ బేల్చ(పా.పు)తొల్లిక,గుద్దలి.

بیلدار బెల్దార్(పా.పు)ఉప్పరవాడు,ఒడ్డరవాడు,పాటకాడు.

بیلک బేలక్(పా.పు) చిన్నగుద్దలి,తొల్లిక, బాణముయొక్కములికి.

بیلن బేలన్ (హి.పు) అప్పడాలకొడుపు, కొడుపు,పాత్రము,రస్తాగుండు.

بیلنا బేల్నా (హి) అప్పడాల కొడుపుతో ఒత్తుట,ఉండనురొట్టెగాఒత్తుట.

بیلنی బేల్నీ (హి.స్త్రీ) చిన్నపాత్తరము, చిన్నరుబ్బురాయి.

بیلی బేలీ (హి.పు) పాలకుడు, రక్షకుడు, పోషకుడు,సహాయకుడు,ఒకతీగ.

بیم బీమ్ [పా.పు] భయము, బుగులు, అపాయము.

بیما-بیمہ బీమా-బీమ(హి.పు) భీమా,భీమము,అభయము,నష్టముఅచ్చుకొను నొప్పందము,రక్షణము.

بیمار బీమార్(పా.పు)వ్యాధిగ్రస్థుడు,రోగి, జాడ్యముగల,జబ్బుగానున్న,

بیمارداری బీమా-దారీ (పా) రోగిపరామర్శ,రోగిపరిచర్య. بیمارپرسی బీమా-పుర్సీ [పా]ఆరోగ్యప్రశ్న,రోగియొక్కశరీరస్థితి విచారించుట. (ము,జబ్బు.

بیماری బీమారీ(పా)వ్యాధి,రోగము,జాడ్య

بیمہ బీమ[పా.పు]చూడు بیما

بین బీన్(హి.స్త్రీ)వీణ, بین نواز బీన్-నవాజ్ (ఉ) వైణికుడు,వీణవాయించువాడు.

بین బయన్ (హి.స్త్రీ) వచనము,వైనము; చచ్చినవానిగుణగణము లెంచుచుఏడ్చుట, ఏడ్పించుటయు.

بین బైన్ (అ)నడుమ,మధ్యము,అంతరము.

بین السطور బైన్-ఉస్సుతూర్ (అ) రేఖాంతరము,గీతలనడుమ. (వణము.

بینا బైనా (హి.పు)తిలకము, బొట్టు భూ

بینا బీనా(పా) ద్రష్ట, చూచువాడు,జాణ, దూరదర్శి,వివేకి. (చుట,వేరుచేయుట.

بینا.بیننا —బీన్నా(హి)ఏరుట,ఏర్పరిం

بینائی బీనాయీ(పా.స్త్రీ)దృష్టి,చూపు, తెలివి,వివేకము.

بینجنی బైంజ్నీ(హి)వంకాయవన్నెగల, ధూమ్రవర్ణముగల,ఊదావన్నె.

بیندھنا బీంధ్నా (హి) తొలికట్టుట, బెజ్జమువేయుట,ఎత్తిపొడుచుట.

بیندا బీండా(హి.స్త్రీ)గడ్డిమె॥ వానికట్టు, లేకఎంటి,లేకచుట్ట,కాగితపుచుట్ట.

بیندا బైండా(హి)వంకరయైన, వంగిన, కఠినమైన,దుష్కరమైన;గడ్డెమాను,

بیندھنا బైంధ్నా (హి) జడవేయుట, అల్లుట. (వి, వివేకము

بینش బీనిష్(పా.స్త్రీ)దృష్టి,చూపు, తెలి

بینگن బైంగన్(హి.పు)వంకాయ.

بینی బీనీ (హి)నాసము, ముక్కు, రెండు రెక్కతలుపులు కదియుటకై వేసినపట్టె.

بینی پاک బీనీ-పాక్(ఉ) ముక్కుతుడుచుకొనుబట్ట,ముక్కుపాత.

بیوپار బేవ్పార్(హి.పు)చూడు بیپار

بیوپاری జేవ్ పారి (హి.పు) చూడుము.
بیپاری (ఇంటివెచ్చము.

بیونات బయూతాత్ [అ] అంతఃపురము,

بیورا బియూరా (హి) వివరము,వర్తమానము, దినచర్యపుస్తకము;వివరణము,జాడ.

بیورے وار —బ్యారేవార్ (హి) వయినముగా,క్రమముగా, తేటతెల్లముగా, విశదముగా. (తీర్పు.

بیوستا బ్యవస్థ (హి) వ్యవస్థ, తీర్మానము,

بیوگ బియోగ్ (హి) వియోగము, ఎడబాటు

بیونت బయోంత్ (హి.పు) కత్తిరింపు, ఖండింపు, ఉడుపులుకుట్టుటకై బట్టలకత్తిరింపు;మితవ్యయము; అనుకూలము;పద్ధతి,రీతి.

بیونتنا బ్యోంత్నా (హి) ఉడుపులుకుట్టుటకై బట్టలుకత్తిరించుట, కత్తిరించుట, ఖండించుట.

بیوہ బేవ (పా.స్త్రీ) విధవ, ముండరాలు

بیوہار జేవ్‌హార్ (హి.పు) వ్యవహారము, వర్తకము,వ్యాపారము.

بیوہاری బ్యోహారీ (హి.పు) బేహారీ, వర్తకుడు.

بیوی బీవీ (పా.స్త్రీ) ఇల్లాలు,భార్య.

بیہڑ బేహడ్ (హి) దున్నని, బీడైన;మిట్టపల్లమైన,ఎగుడుదిగుడైన;అడవి, అరణ్యము.

بیہن బేహన్ (హి.స్త్రీ) వరినారుమడులు; విత్తనమునకైఅప్పుగానిచ్చిన ధాన్యము, నాగులు.

بیہودگی బేహూదగీ (పా.స్త్రీ) బుద్ధిహీనత;అవ్యక్తము,పనికిమాలినతనము.

بیہودہ బేహూద (పా)బుద్ధిమాలిన, తెలివిమాలిన,అసంగతమైన. بیہودہ گوئی —గోయీ (పా.స్త్రీ) అవ్యక్తప్రసంగము.

بیہی బేహీ (హి.స్త్రీ) నాకబలికుండలు. వధూవరులకొరకుమ్మరవారుకానుకగాదెచ్చియిచ్చుకుండలు.

---

(پ)

پ పె (హి.స్త్రీ) పకారము, ఇదిఉరుదూ పారసీక వర్ణమాలలోమూడవయక్షరము, హిందీభాషలోనిరువదియొకటవది,అరబ్బీలో దీనికిమారుగా (ف) వాడుకొందురు, వర్ణసాంఖ్యములో ఇది (ب) వలె రెండు అను సంఖ్యకు సంజ్ఞ.

پ ప (హి.పు) వాయుదేవుడు, గాలి;పాలతడు;త్రాగువాడు.

پا పా (పా.పు) పాదము, కాలు,క్రిందు,షీలకడ, స్థిరత్వము, మూలము, హస్తిభారము,

پا انداز —అందాజ్ (పా) తొక్కుడుచాపలేకపట్ట. پابند —బంద్ (పా) బందము,అలవాటుగల,వాడుకపడిన, అనుస్రోత, నిబద్ధుడు,అనువర్తి,బంటు,కట్టబడిన.

پابندی పాబందీ (పా.స్త్రీ) నిబంధము, కట్టు,నిరోధము,కొలువు, చట్టము,దిట్టము, ఏర్పాటు.

پابوسی పాబోసీ (పా.స్త్రీ) పాదచుంబనము,వందనము,సత్కారము,పూజ, సేవ.

پابوس పాబోస్ (పా.పు) పాదచుంబకుడు, సేవకుడు,పూజకుడు. (కష్టము.

پاپ పాప్ (పా.పు) పాపము, అపరాధము,

پاپا పాపా (పా.పు) తండ్రి,క్రీస్తుమతబోధకుడు.

پاپڑ పాపడ్ (హి.పు) అప్పడము, సన్నని పొర,పలచని, ఎండిన. సారవంతమైన నేల

پاپڑ بیلنا — బేల్నా (హి) అప్పడము ఒత్తుట.

پاپن పాపన్ (హి.స్త్రీ) పాపి, అపరాధి, దోషి. (చెప్పు.

پاپوش పాపోష్ (హి.స్త్రీ) పాదరక్ష,

پاپی పాపీ (హి.స్త్రీ) పాపి,దోషి.

پاپیادہ పాపియాద(పా) కాలినడన, నడచి

پات పాత్ (హి.పు) ఆకు,రేకు;చెవికమ్మ.

پاتابہ పాతాబ (పా.పు) మేజోడు, పాద [illegible]సనము. (కము.

پاتال పాతాల్ (హి.పు) పాతాళము,నర

پاتر పాతర్ (హి.పు) పాత్రము;బాసన;అర్హము,యోగ్యము;గిన్నె,కోర; (నిధి.

پاتر పాతర్ (హి.స్త్రీ) భోగముది; బక్ర—

پاتک పాతక్ (హి.పు)పాతకము. సూతకము.

پاتس పాతస్ (హి.స్త్రీ) జోడు,జత,చెప్పు; పాదరక్ష.

پاتھنا పాథ్నా (హి) ఇటికెలుకోయుట -పిడకలుకొట్టుట,తట్టుట.

پاتی పాతీ (హి.స్త్రీ) ఆకు,పత్రి; చీటి, వర్తమానము;జాడ.

پاٹ పాట్ (హి.పు) వెడలుపు; తిరుగటిరాయి;ఉతుకుడుబండ;పీటు, సింహాసనము; పట్టు (దారము.)

پاٹنا పాట్నా (హి) కప్పుట,మూయుట, ఇచ్చివేయుట,నింపుట;నీరుకట్టుట, ప్రోగుచేయుట,పూడ్చుట,చెల్లించుట.

پاٹھ పాఠ్ (హి పు) పాఠము,చదువుట.

پاٹھا పాఠా (హి.పు) వయసుమృగము, ఏనుగుపిల్ల, వయసువాడు,జట్టి,మల్లుడు.

پاٹھک పాఠక్ (హి.పు)ఉపాధ్యాయుడు, పౌరాణికుడు.

پاٹی పాటీ (హి.స్త్రీ) చిరుచాపు,తుంగ చాపు,వ్రాతపలక; పాపటు; మంచపుపట్టె.

پاجامہ పాజామ (పా.పు)లాగు, చల్లడము.

پاجی పాజీ (పా) పలవ,నీచుడు.

پاچ పాచ్ (హి.పు) పచ్చ.

پاچک-پاچن పాచక్ పాచన్-(హి.పు) పచనకారి,జీర్ణకారి;చూర్ణము,వంటవాడు.

پاچھنا పాఛ్నా (హి) గ్రుచ్చుట,పొడుచుట;టీకాలువేయుట.

پاچھی పాఛీ (హి.స్త్రీ) పశువులరెండుకాళ్లెత్తితన్నుట, వెనుకకాళ్లతన్ను.

پاخانہ పాఖాన (పా.పు) మరుగుదొడ్డి, మలము,పురీషము.

پاد పాద్ (హి.పు) అపానవాయువు,

پادگھابرا — ఘాబ్రా(హి)పిరికిపంద-అధురుగుండె.

پاداش పాదాష్ (పా.పు) ప్రత్యుపకారము;ప్రతీకారము; మారు; వైరశుద్ధి; శిక్ష;బహుమానము.

پادشاہ పాద్‌షాహ్ (పా.పు) రాజు,ప్రభువు, پادشاہزادہ } پادشاہزادی } —జాద్—జాద రాచకొమారుడు,రాజవంశస్థుడు.

پادشاہت-پادشاہی పాద్‌షాహీ-హత్ (పా.స్త్రీ) రాజ్యము, రాజరికము.

پادنا పాద్నా (హి) అపానవాయువువిడుచుట.

پار పార్ (హి.పు) పారము,అంతు,ఆవల, అవతల,తుద,ఆవలిఒడ్డు, కడచిన, దాటిన, పోయిన;గుండా,దూర్చి,అడుగు,క్రింద.

پارکرنا —కర్నా (హి) దాటించుట, దూర్చుట,తూటువేయుట, నెగ్గించుట,తుదముట్టించుట, సెలవేర్చుట, పందెముగెలుచుట.

**پارا** పారా(హి.పు)పాదరసము.

**پاربتی** పార్బతీ(హి.స్త్రీ)పార్వతీ దేవి.

**پارچہ** పార్చ(పా.పు)ఖండము; రేకు, తునక,చింపు;ఉడుపు;వస్త్రము; రేవు.

**پارس** పారస్ (హి.పు) స్పర్శవేది, స్పర్శమణి; నిరోగము; శాశ్వతము; భక్ష్యభేదము; పారసీక దేశము.

**پارسا** పార్సా (పా.పు) పావనుడు, పవిత్రుడు,యతి,ధర్మిష్ఠుడు, పుణ్యాత్ముడు.

**پارسال** పార్సాల్[పా] గడచినసంవత్సరము;నిరుడు.

**پارسائی** పార్సాయీ[పా.స్త్రీ] యమము; ఇంద్రియనిగ్రహము, ధర్మనిష్ఠ, వైరాగ్యము.

**پارسی** పార్సీ(పా.పు)పారసీకుడు; పారసీకభాష,అగ్నియుపాసకుడు.

**پارکھی** పార్ఖీ (హి) పరీక్షకుడు, పరీక్షించువాడు.

**پارنا** పార్నా(హి.పు) కాటుకపట్టుట, దీపపు కొడిపట్టుట,ముగించుట; నెరవేర్చుట.

**پارہ** పార [హి.పు] ఖండము,తునక;పీఠిక, భాగము; చిన్నగోడ, రాళ్లు పేర్చినగోడ; పాదరసము.

**پاڑ** పాడ్ [హి.స్త్రీ] పరవంజ, సారువ, మంచె, గోవ, ఉప్పరవాండ్లుఇండ్లుకట్టుటలో ఎత్తువకెక్కుటకు వేసుకొనినకొయ్యమంచెలు.

**پاڑا** పాడా(హి.స్త్రీ) బట్టెకుక్క;వాడ,వీధి; పొలము మేర;గ్రామభాగము;

**پاڑھا** పాఢా (హి.పు) పృషతము, దుప్పి;

**پازیب** పాజేబ్ (పా.స్త్రీ) గజ్జెగొలుసు, పాదభూషణము.

**پاس** పాస్(ఇం.పు) కృతార్థత, జయము, సెలవుచీటి,మార్గము;సందు, అంగీకారము, అనుజ్ఞ.

**پاس** పాస్ (హి) దగ్గర, సమీపమందు చెంత;పొరుగు; త్రాడు; ఉరి, ఉచ్చు, అధీనము. **پاس پڑوس**—పడోస్(హి) ఇరుగుపొరుగు.

**پاسا** పాసా(హి.పు) పార్శ్వము, ప్రక్క; దిక్కు; పాచిక,పాచికలపందెము;

**پاس** పాస్ (హి.పు) లక్ష్యము, అనుమోదము, ఆదరము, కారణము, దాక్షిణ్యము, పక్షపాతము, కావలి,ప్రహారము, పహరా.

**پاسبان** పాస్బాన్(పా.పు)ద్వారపాలకుడు, కావలివాడు; గొల్లవాడు, పసులకాపరి; (కావలి·

**پاسبانی** పాస్బానీ (పా.స్త్రీ) కాపరికము.

**پاسداری** పాస్దారీ(పా.స్త్రీ) పక్షపాతము, మొగమోటము; కాపరికము; అనుగ్రహము.

**پاسنگ** పాసంగ్ (పా.పు) పడికట్టు;దాళా, తగ్గు,తుట్టి,తూనికసరిపోవుటకై వేసినది,తూనిక, తాసు.

**پاسی** పాసీ [హి.స్త్రీ]పాలకుడు, కాపరి; ఉరి,ఉరిత్రాడు,చిక్కము,వల; బోయుడు, గొండ్లవాడు.

**پاشا** పాషా (పా.పు)నాయకుడు, పెద్ద, అధికారి,తుర్కీదేశస్థులగౌరవనామము.

**پاش پاش** పాష్పాష్ (పా)తుత్తునియలు; చెల్లాచెదరు. (ము; వెనుక.

**پاشنہ** పాష్న(పా.పు) మడిమ,వెనుకభాగ

**پاشی** పాషీ(పా.స్త్రీ) చల్లకము, చిలకరింపు,సేచనము.

**پاشویہ** పాషోయ(పా.స్త్రీ) పాదప్రక్షాల

నము, కాస్లుఉడుకునీళ్లలో వేసికొనికూ ర్చుండుట.

**پاک** పాక్ (పా) పవిత్రమైన, నిర్మలమైన, నిర్దోషమైన,స్వచ్ఛమైన,అప్పటమైన,అమిత్రమైన,నిర్దోషియైన,భక్తిగల.

**پاک باز** పాక్‌బాజ్ (పా) నిర్మలమనస్కుడు,నిజస్థుడు, యదార్థవాది, నిష్కపటీ, భక్తుడు,సరళుడు,నీతిమంతుడు.

**پاکدامن** పాక్‌దామన్ (పా)వ్యభిచారములేని,పవిత్రమైన,నిర్మలుడు,నిర్దోషి, నిష్కళంకుడు,పతివ్రత. (వాడు.

**پاک زاده** పాక్‌జాద(పా)రజకుడు;చాకలి

**پاکھ** పాఖ్ (హి.పు)పక్షము,పదునైదుదినముల కాలము.

**پاکھا** పాఖా (హి.పు) పక్షము, ప్రక్క; ప్రక్కగోడే;కప్పు;నీడ; పాక, పంచపాళి;

**پاکھر** పాఖర్(హి.స్త్రీ)కత్తళము,కవచము; గుఱ్ఱపుకత్తళము,హత్తికత్తళము.

**پاکھنڈ** పాఖండ్ (హి.పు) పాషండము, దుర్మార్గము, మోసము.

**پاکھنڈی** పాఖండీ(హి.పు) పాషండుడు, దుర్మార్గుడు,మోసగాడు.

**پاکی-پاکیزگی** పాకీ — పాకీజ్‌గి (పా.స్త్రీ)పవిత్రత, నైర్మల్యము,ధర్మనిష్ఠ,

**پاکیزه** పాకీజ(పా) పవిత్రమైన, నిర్మలమైన.

**پاگ** పాగ్ (హి.స్త్రీ)తలగుడ్డ; పాదము; పాకము; పానకము. (సేమయవేయుట.

**پاگر-ڑ** పాగర్-డ్(హి.స్త్రీ)రోమంథము,

**پاگل** పాగల్ (హి) వెఱ్ఱివాడు, పిచ్చివాడు, బుద్ధిహీనుడు, మూర్ఖుడు, భ్రమపడినవాడు.

**پاگلپن** పాగల్-పన్(హి)వెఱ్ఱితనము, పిచ్చితనము.మూర్ఖత. **پاگلخانہ** పాగల్-ఖాన(ఉ) ఉన్మాదశాల,పిచ్చియాసుపత్రి.

**پال** పాల్(హి.పు)తెర,గొల్లైన (చిన్న గుడారము;)ఓడచాప;కత్తువ,కట్టు; పండ్లుమాగవేయుటగడ్డి గాదము,కసువు.

**پالا** పాలా(హి.పు) తుషారము, పేరినమంచు; పరకమంచు;శీతము; మంటేదిన్నె,పొలిమేర; ముఖ్యస్థానము;సంబంధము;సమయము,అప్పగింత,.పాలబడుట,అధీనము; ఒడుపు, ఒకజట్టీపట్టు, ఖురళీశాల,. వ్యాయామరంగము; ఎండినఅలము; **پالا پڑنا-پالے پڑنا** పాలా(లే)పడ్నా (హి) పాలపడుట, స్వాధీనముగుట,మంచుకురియుట.

**پالاگن** పాలాగన్ (హి.పు) పాదములకునమస్కరించుట, వందనము, సత్కారము.

**پالان** పాలాన్ (పా.పు) పల్లముక్రిందిమెత్తలేకగంత,కందరికము.

**پالنی** పాల్నీ (హి.స్త్రీ) చూడు, **آلتی پالتی.**

**پالسی** పాలిసీ (ఇం.స్త్రీ) రాజ్యతంత్రము,నీతి,మతము, తంత్రము, ఉపాయము, యుక్తి,యోచన,పద్ధతి,కౌశలము,సాంప్రదాయము,సమయోచితము.

**پالش** పాలిష్ (ఇం.స్త్రీ) మెరుగు,నునుపు.వన్నె,నాగరికత,సౌజన్యత, సభ్యత,సంస్కారము;మెఱుగుచమురు.

**پالغز** పాలగ్‌జ్ (పా పు) స్ఖాలిత్యము, జారిపడుట;పొరపాటు,తప్పు.

**پالک** పాలక్ (హి.పు) పాలకుడు, పెంపుడుకొడుకు;మంచము;పాలాకు, పాలకూర.

**پالکی** పాల్కీ (హి.స్త్రీ) పాలకి,పల్లకి.

**پالن** పాలన్ (హి.పు) పాలనము,పోషణ.

**پالنا** పాల్నా (హి) పోషించుట,పెంచుట పాలనము;బట్టలఉయ్యాల;ఉల్లట;ఉల్లకి;

**پالی** పాలీ (హి.స్త్రీ) పాలీభాష, మాగధీ ప్రాకృతములుక లిసినభాష; మాత; మాత సిబ్బి; కొల్ల పండెపుస్తలము.

**پالیز-فالیز** పాలేజ్-ఫాలేజ్ (పా.స్త్రీ) దోసపండ్లపొలము, దోసకాయలపొలము.

**پام** పామ్ (హి.స్త్రీ) సరిగెదారము, సరిగ చి క్కుపడకుండుటకై అంచునవేసినదారము,

**پامال** పామాల్ (పా.పు) కాళ్లక్రిందనలగ త్రొక్కిన, ధ్వంసమైన, అధ్వానమైన, పా డుబడ్డ, నాశమైన. (ధ్వంసము.

**پامالی** పామాలీ (పా.స్త్రీ) నాశము, పాడు,

**پامردی** పామర్దీ (పా.స్త్రీ) బలము, పట్టుదల.

**پاموز** పామోజ్ (పా.పు) ఒక పావురము; కా ళ్లుఈకలతో కప్పబడియున్న పక్షి.

**پان** పాన్ (హి.పు) తాంబూలము, తమలపా కు; సరిగపని, ఒకచీట్లరంగు, చెప్పుయొక్క మడమ, గంజిపడుగు. **پان دینا**-పాన్‌-దేనా (హి) తాంబూలమిచ్చుట, సెలవిచ్చుట, అంపకముచేయుట.

**پانا** పానా (హి) పొందుట, దొరకుట, తెలి యుట, వెదకుట, అనుభవించుట, అందుకొ నుట, భోజనముచేయుట.

**پانجنا** పాంజ్నా (హి) టంకమువేయుట, మాటువేయుట, అతుకువేయుట.

**پانچ** పాంచ్ (హి) అయిదు; ఉటంకి, జాణ.

**پانچویں** పాంచ్వేం (హి) పంచమితిథి.

**پاندان** పాన్‌దాన్ (ఉ) తమలపాకుల పెట్టె, తాంబూలపేటిక.

**پانڈ** పాండ్ (హి.స్త్రీ) మాచకమ్మ, మొగవా నికుపయోగించని స్త్రీ.

**پانڈو** పాండూ (హి.స్త్రీ) రేగటిభూమి, దేవమాతృక, వర్షమువలనపండు నేల

**پانڈے** పాండె (హి.పు) పండితుడు, కనోజి బ్రాహ్మణుడు.

**پانزده** పాంజ్‌దహ్ (పా) పదునైదు.

**پانس** పాంస్ [పా] ఎరువు, పెంట, పేడ కుప్ప.

**پانسا** పాంసా (హి.పు) చూడు. **پاسا**

**پانسو** పాంసూ (హి పు) పక్కవు, బరిఎముక, ప్రక్కఎముక.

**پانسو** పాన్‌సౌ [హి.పు] ఏనూరు. [పావు]

**پانو-پانوں** పాంవ్-పాంఓం (హి.పు) చూడు

**پانی** పానీ (హి.పు) నీరు, వర్షము; బీజము, రే తస్సు, కాంతి, మెరుగు, సిగ్గు, మర్యాద; చెమ ట; మృదువైనది; కన్నీరు; చల్లని; పలుచని; చప్పని; కులము; సమయము; పందెము.

**پانی اترنا**-పానీ-ఉతర్నా [హి] వర్షించుట -నీరుదిగుట **پانی بھرنا**-పానీ-భర్నా [హి] నీళ్లుచేదుట, ఒకరి అధిక్యమును ఒప్పుకొ నుట. **پانی کاٹنا** - పానీ-కాట్నా [హి] అను కట్ట కట్టుట; ప్రవాహముమరల్చుట.

**پانی پانی ہونا**-పానీ-పానీహోనా [హి] మిగుల సిగ్గుపడుట. **پانی کا بلبلا** — పానీ కాబుల్బులా [హి] నీటిబుగ్గ, అస్థిరము, క్షణ భంగురము. **پانی سے پتلا کرنا** — పానీసే పత్లాకర్నా [హి] నీళ్లకంటెలుచన జేయు ట, భంగపరచుట, తిరస్కరించుట నీచపరచుట, సిగ్గుతీయుట; పలుచనగాచే యుట.

**پاو** పావ్ [హి.స్త్రీ] పావు, పాతిక, కాల,

**پاوروٹی**-పావ్‌రోటీ [హి] సీమరొట్టె.

**پاوتی** పావ్‌తీ [హి.స్త్రీ] ఆదాయము, రాబడి, లాభము.

**پاولا** పావ్‌లా [హి.పు] పావల, కాలరూ పాయి. [నాణెము.]

**پاولی** పావ్‌లీ [హి.స్త్రీ] కాలరూపాయి

پاؤں పాఁవ్[హి.పు] చరణము,అడుగు,కాలు,పాదము;పిక్క,తొడ;మూలము;హస్తిభారము,సంబంధము;భాగము,పాలు; స్థిరత్వము;ఉత్తరవాదము;చిహ్నము,ప్రవేశము.

پاؤں پڑنا పా-పడ్నా [హి.స్త్రీ] కాళ్లకుమ్రె క్కుట, కాళ్లబడుట. (వుట.

پاؤں اٹھ جانا పా-ఉఠ్ జానా[హి]పారిపో

پاؤں بھاری ہونا —భారీహోనా (హి) కడుపుతో నుండుట.

پاؤں پاؤں పా-పాఁవ్[హి]కాలినడన,నడచి.

پاؤں پھٹنا పా-ఫట్నా(హి) కాళ్లుపగులుట.

پاؤں پھولنا పా-ఫూల్నా [హి] అలయుట.

پاؤں پھیرنا పా-ఫేర్నా[హి] బాలింతపుట్టింటికిపోవుట. (ట్రాడుట.

پاؤں تلے ملنا పా-తలేమల్నా [హి] కాళ్లమ

پاؤں دبانا-دابنا పా—దబానా-దాబ్నా (హి)కాళ్లుపిసుకుట. (పీట

پاؤں درانتی పా-దరాఁతీ [హి] కత్తి

پاونا పాఒనా[హి.పు] అతిథి, బాటసారి; అల్లుడు,జామాత.

پاونی పాఒనీ [హి.స్త్రీ] అభ్యాగతురాలు; అంపకాలపాట, అప్పగింతపాట.

پاہ పాహ్[హి.స్త్రీ]కండ్లనొప్పికి పట్టువేసికొను నొకరాయి.

پائی పాయీ [హి.స్త్రీ] అణాలో పన్నెండవపాలు,పమ్మిడి;పంకె కోల;

پائے పాయ్-యె[పా.పు]అడుగు, పాదము, చరణము, కాలు; చూడు. پا అనుశబ్దమునుసమాసములును. پائے خانہ పా-ఖాన [పా] మరుగుదొడ్డి پائے تابہ పా-తాబ [పా]మేజోడు,పాదకూసము.

پائے تخت పా-తఖ్త్ [పా]రాజధాని.

پائے تراب పా-తురాబ్ [పా] నిగ్రహము, ప్రయాణమునకుముందు స్థలముమార్చుట.

پائے جامہ పా-జామ[పా]లాగు,చల్లడము.

پائے زیب పా-జేబ్[పా]గజ్జెగొలుసు.

پائے مال పా-మాల్(పా)చూడు پامال

پایاب పాయాబ్[పా]కాలిరేవు,దాటతగిన,లోతులేని. (అంతు,పూర్తి

پایان పాయాన్ [పా.పు] తుద, అంతము,

پایدار పాయెదార్ [పా] బలిష్ఠమైన, స్థిరమైన,దిట్టమైన, చాలకాలముఉండెడు, ఆటునట్టి.

پایداری పాయెదారీ(పా.స్త్రీ) బలిష్ఠత, దిట్టవు,ఒట్టము,స్థిరత్వము.

پایزہ పాయెజ(పా.పు)లాగు-చల్లడము.

پایک పాయిక్(హి.పు) సందేశహారుడు, కాలరి,బంటు,రాయబారి.

پائےکاشت పాయెకాశ్త్ (పా.స్త్రీ) పొరుగూరికాపుదనము, పొరుగూరివారు కాపుదనము చేయుభూమి.

پائےموز పాయెమోజ్ [పా.పు] చూడు پاموز

پائین పాయీన్(పా.పు)అడుగు, క్రిందు, క్రిందిభాగము, క్రింద, క్రిందుగా, క్రింది,

پائین باغ పా-బాగ్(పా) కోటక్రిందితోట,ఇంటిప్రక్కతోట;ఉద్యానము.

پائینتی పాయీఁతీ (హి.స్త్రీ) }
پائینت పాయీఁనత్ (హి.స్త్రీ) } మంచముయొక్క కాళ్లకట్టు, కాళ్లకడ.

پائینچہ పాయేఁచ(పా.పు)లాగుయొక్క ఒకకాలులేక అరభాగము.

پایہ పాయ[పా.పు]కాలు, స్థంభము, పోటి, అంతస్తు, తరగతి, మెట్టు, హస్తిభారము, పునాది.

**پپڑا** పప్డా(హి.పు)పక్కు, చెక్కు, గుల్ల, పెచ్చు,పొర,పొలుసు. (పిట్ట.

**پپئی** పపై [హి.స్త్రీ] ఒకవిధమైనగోరువంక

**پپڑانا** పప్డానా (హి)చెక్కు కట్టుట, పెచ్చులేచుట,ఎండుట, గుల్లకట్టుట.

**پپڑی** పప్డీ [హి.స్త్రీ] పెచ్చు, పొర, చెక్కు, పరక, పక్కు.

**پپڑیا کتھا** పపడ్యా కత్థా (హి.పు) ఒక మేలుతరమైనకాచు.

**پپڑیلا** పప్డీలా(హి.స్త్రీ)పొరలుగల, పెచ్చులేచిన,చెక్కులుకట్టిన.

**پپنی** పప్నీ (హి.స్త్రీ) రెప్ప వెంట్రుకలు.

**پپوٹا** పపోటా(హి.పు)కనురెప్ప.

**پپوٹن** పపోటన్(హి.స్త్రీ) ఒకమందుఆకు,

**پپولنا** పపోల్నా (హి) చప్పరించుట,గలబరించుట,నోటిలోనిటునటుత్రిప్పుట,పండ్లు తగలకుండముసలివారివలె రసము పీల్చుట.

**پپیا** పపయ్యా (హి.స్త్రీ) మామిడిముట్టె (తోచేసిన)బూరగ;ఈల, కూత;పొప్పాయిపండు.

**پپیانا** పప్యానా(హి)చీముపట్టుట.

**پپیہا** పపీహా(హి.పు)తుతార,బూరగ; కోయిల,కోకిలపక్షి.

**پت** పత్(హి.స్త్రీ)పరుపతి;నమ్మకము; గౌరవము,మాన్యత, పరుపతి,(పు) ఆకు;రుచి; మాదిరి;పతి; మగడు. **پت اتارنا**—ఉతార్నా (హి)మర్యాదదీయుట,మానభంగముచేయుట,

**پت** పిత్ (హి.పు)పిత్తము,పైత్యము.

**پتا** పితా(హి.పు)తండ్రి, పిత. (కమ్మ.

**پتا** పత్తా(హి.పు)పత్రము,ఆకు; చీటి,చెవుల

**پتا** పతా(హి.పు)జాడ,పోబడి;చిహ్నము,గురుతు;పైవిలాసము, వయినము,చిరునామ.

**پتا لگانا**—లగానా(హి) జాడతీయుట,వెదకుట. (శము.

**پتا** పిత్తా(హి.పు)పిత్తకోశము,పైత్యము, ఆవే

**پتال** పతాల్ (హి.పు) పాతాళము,నరకము,

**پتال جنتر**—జంత్ర్(హి.పు) పాతాళయంత్రము,తైలముతీయు ఒక రీతి

**پت جھڑ-ڑی** పత్ ఝడ్-డీ (హి.పు) ఆకురాలుకాలము.

**پتر** పుత్తర్(హి.పు)పుత్రుడు,కుమారుడు.

**پتر** పిత్తర్(హి.పు)పితృదేవతలు,పితరులు.

**پتر** పత్తర్(హి.పు)పత్రము,ఆకు;చీటి,ఉత్తరము,రాగి రేకు. (రేకు.

**پترا** పత్రా (హి.పు)పంచాంగము, పత్రము,

**پتری** పుత్రీ(హి.స్త్రీ)పుత్రిక,బిడ్డ.

**پتری** పత్రీ(హి.స్త్రీ) పత్రిక, జాతకము; చీటి, ఉత్తరము.

**پترے کھولنا**—పత్రేఖోల్నా (హి) గుట్టుబయలుపరచుట,తప్పులుతీయుట.

**پتل** పత్తల్(హి.స్త్రీ)విస్తరి,ఒడ్డించినవిస్తరి.

**پتل پروسنا**—పరోస్నా (హి) విస్తరిలో ఒడ్డించుట.

**پتلا** పత్లా(హి.)పలుచని,సన్నని, కోమలమైన,బక్కని, మెత్తగిలిన,చురుకైన,దుర్బలమైన. **پتلاحال** పత్లాహాల్ (హి) దుర్దశ, దురవస్థ,దరిద్రము,కష్టము.

**پتلا** పుత్లా(హి.పు) బొమ్మ,విగ్రహము; కత్తిపిడి;చిత్తరువు,అందగత్తె.

**پتلانا** పిత్లానా(హి)విత్తళిచిలుముపట్టుట.

**پتلائی** పత్లాయీ(హి.స్త్రీ) పలుచదనము.

**پتلی** పుత్లీ (హి.స్త్రీ) బొమ్మ, కనుపాప, యంత్రము,అందమైనస్త్రీ, గుజ్జుపు గెట్టలో పెరిగినముల్లు. **پتلیاں پھرجانا**—

పుత్లీయాఁఫిర్ జానా(హి)మిడిగుడ్లువడుట, పైచూపుకలుగుట, చచ్చుటకుసిద్ధమగుట.

**پتنگ** పతంగ్ (హి.పు) పతంగము, చిమ్మట, దీపపుపురుగు; గాలిపటము, సూర్యుడు.

**پتنگا** పతంగా(హి.పు) మిడుగురు, దీపపుకొడి, మిడత, రెక్కలపురుగు. **پتنگے لگنا**-పతంగేలగ్నా(హి)ఒళ్లుమండుట, కోపమువచ్చుట. (కొక్కని.

**پتوار-پتوال** పత్వార్-ల్ (హి.స్త్రీ) చుక్కాని.

**پتواس** పత్వాస్ (హి.స్త్రీ) కపోతపాలిక పక్షులుండుటకుచేసినమ్రాను.

**پتوانا** పుత్వానా (హి) అలికించుట, పూయించుట. (కము, ముల్లంగిగడ్డ.

**پتوں والی** పత్తొఁవాలీ(హి.స్త్రీ) మూలకము, ముల్లంగిగడ్డ.

**پتھر** పత్థర్(హి.పు) శిల, బండ, రాయి; వడగల్లు; రత్నము; తియగలి; భారమైన, కఠినమైన; రాతిగుండె, బండబుద్ధి. **پتھر برسنا**-బరస్నా (హి) వడగండ్లు పడుట, రాళ్లు దూకుట. **پتھر گھوڑا**-ఘోడా (హి) ఒడ్డెవాడు, చిరతపక్షి, వడ్రంగిపిట్ట.

**پتھر چٹانا**-చటానా(హి)సానపట్టుట. **پتھر کلا**-కలా(హి)చెకుముకితుపాకి. **پتھر کی لکیر**-కీలకీర్ (హి) శిలాశాశ్వతము.

**پتھروٹا-ٹی** పథ్‌రౌటా-టీ(హి)రాతిచిప్ప, రాతిగిన్నె.

**پتھری** పథ్‌రీ(హి)మూత్రకృచ్ఛ్రము; చెకిముకిరాయి, పలుగురాయి; సానరాయి; పక్షులకడుపులోనుండురాతిసంచియనుకోశము.

**پتھریلا** పథ్‌రేలా(హి)రాతి, రాళ్లుగల, శిలామయము.

**پتھیرا** పథీరా(హి) ఇటుకలుకోయువాడు, తట్టువాడు, పోతపోయువాడు.

**پتی** పత్తీ (హి.స్త్రీ) పత్రము, ఆకు; చిగురుటాకు; గంజాయి; పాలు; భాగము; చందా; ఉమ్మడి; కలముపాళి; రేకు; చెరుకుతోట.

**پتی دار**-పత్తీ-దార్ (హి) భాగస్వామి, పాలివాడు.

**پتی** పిత్తీ(హి.స్త్రీ) పిత్తరోగము, పైత్యపుదురద, పైత్యపుదద్దులు.

**پتی** పతి(హి.పు)పతి, స్వామి.

**پتیارا** పతియారా(హి.పు) పరుపతి, నమ్మకము, బరువసము, లక్ష్యము.

**پتیانا** పతియానా (హి) నమ్ముట, విశ్వాసముంచుట; లక్ష్యపెట్టుట.

**پتیل** పతీల్ (పా.పు)వత్తి, మైనపువత్తి (హి) పలుచని, బక్కని.

**پتیلا** పతీలా (హిపు) వెడలుపుమూతిగల తపేల, కొప్పెర, హండా.

**پٹ** పట్ (హిపు)పటము, బట్ట, తలుపు, రెక్క-తెర, చాటు, మూత, పలక; త్వరగా, తక్షణమే; బోరల, క్రిందల, వెలకిల, వెడలుపు, పీఠము, దెబ్బ.

**پٹا** పటా (హిపు) పట్టెము, కొయ్యకత్తి, బడితెసాము.

**پٹّا پٹّو** పట్టా-పట్టు (హిపు)పీట, ఆసనము; పట్టెడ; పాలముపట్టా; దుప్పటి; మొలదట్టి; జవానుబిళ్ల, పట్టి, పలక; పొడుగువెండ్రుకలు.

**پٹاپٹی کا** పటాపటీకా (హి) చిత్రవిచిత్రమైనవన్నెలుగల, నానావర్ణము.

**پٹاخا** పటాఖా(హి.పు)పెట్లునిమ్మె, టపాసు; జాణ, చురుకుగల.

**پٹارا** పిటారా(హి.పు) పేళ్లపెట్టె, తోలుపెట్టె; పెద్దపెట్టె. (పెట్టె, పేటిక.

**پٹاری** పిటారీ(హి.స్త్రీ)మూతబుట్ట; చిన్న

**پٹاک** పటాక్ (హి.పు) చటాలుమను లేక పటక్కుమను చప్పుడు.

**پٹاکا** పటాకా(హి.పు)చూడు **پٹاخا** (టు;

**پٹانا** పటానా(హి)కప్పించుట,మాయించుట, నీళ్లుకట్టుట; రాపట్టుట; తీర్చుట, చెల్లించుట.

**پٹاو** పటావ్ (హి.పు)మూత,కప్పు, నీరుకట్టుట,ఇల్లుకప్పుగడ్డి పెంకులు మొ॥

**پٹپڑ** పట్ పడ్(హిపు)పండని నేల-పరవ నేల, ఏటావఉదలో మునుగుచుండుభూమి-ఎడారి-బయలు. ((వేటువంకరగాపడుట.

**پٹ پڑنا** పట్ పడ్నా (హి)బోర్లపడుట;

**پٹکھارنا** పట్ ఖార్నా(ఉ)వాయించుట, చటాలుమని(మ్రోయించుట;సంపాదించుట -నేలకుగొట్టుట,

**پٹخنا** పటఖ్నా (ఉ) ఎత్తివేయుట, నేలకుకొట్టుట, పాడుచేయుట,వాపుతగ్గుట.

**پٹرا** పట్రా (హి.పు) పలక,పీట;చాకిబట్టలు ఉతుకుపలక. (పురాణి.

**پٹرانی** పట్రానీ (హి.పు) పట్టపుదేవి,పట్ట

**پٹڑا** పట్ డా(హి.పు)ముక్కాలిపీట; చాకము;గొట్టం,గుంటక,పాపటము.

**پٹڑی** పట్ డీ (హి.పు) కొయ్యపలక; చెట్ల వరుస,వాటిక;నదీతీరము; పట్టె,రేకు;బాట యొక్క రెండుప్రక్కలు.

**پٹس** పిట్టస్ (హి.స్త్రీ) మొత్తుకోళ్లు, లబలబలు,శోకము. చాలు.

**پٹکا** పట్కా (హి.పు) దట్టీ,నడికట్టు;పట్టె,

**پٹکنا** పటక్నా (హి) చూడు, **پٹخنا**

**پٹکی** ఫుట్కీ(హి.స్త్రీ) దెబ్బ, పెట్టు;రోగము,ముప్పు;కూరలలోవేయుపిండి.

**پٹن** పట్టన్ (హి.పు) పట్టనము,నగరము.

**پٹنا** పట్నా (హి) కప్పబడుట; వంటుట, సరిపడుట; తీరుట,చెల్లుట;ఇష్టమగుట;తెగుట, మాయబడుట, పూడుట, నిండుట; దొరకుట;నీరుకట్టబడుట;చదరమగుట.

**پٹنا** పిట్నా (హి)కొట్టబడుట, దెబ్బలుతినుట;సుత్తె. (కవచము.

**پٹو** పట్టూ (హి.పు) ఉన్నిబట్ట,కంబళి,రాం

**پٹوا** పట్వా (హి.పు) పటకారివాడు, పట్టుగట్టించువాడు.

**پٹواری** పట్వారి (హి.పు) కరణము.

**پٹوانا** పట్వానా (హి)రొక్కము యిప్పించుట,తీర్పించుట, చెల్లించుట,నీరుకట్టించుట,కప్పువేయించుట,మాయించుట.

**پٹوانا** పిట్వానా (హి) కొట్టించుట.

**پٹھ** పుత్ (హి.స్త్రీ) మిశ్రణము,కలపటము; చల్లకము,చిలకరింపు;తిరుగబోత, ప్రేరణము.

**پٹھا-پٹھہ** పఠ్ఠా-పఠ్ (హి.పు)వయసు జంతువు, వయసువాడు; నరము; కండరము అట్ట,పుట్ట,పట్టెగాజు; బూరగచేయుఆకు; కొమ్మ; వెడలుపాటిఅంచు లేక గోటు;చెంపవెంట్రుకలు;కొన్ని పక్షులపిల్లలకును పేరు; పోటరి, జెట్టి,మల్లుడు.

**پٹھان** పఠాన్ (ఉ.పు) గాంధారదేశస్థుడు.

**پٹھانا** పఠానా (హి)అంపుట,పంపుట.

**پٹھو** పిట్ఠూ (హిపు) వెంటనుండువాడు, చెలికాడు, తోడు, ఆశ్రయము, కడుపులోనిజిన్సు,సామానుపెట్టె.

**پٹھوال** పఠ్వాల్(హి.పు) సహాయుడు;కన్నముకాచువాడు,దొంగ,టక్కరి.

**پٹھور** పఠోర్(హి.స్త్రీ)కోడిపిల్ల,మేకపిల్ల.

**پٹھی** పిట్ఠీ (హి.స్త్రీ) పిష్టము,పప్పుతడిపినూరినపిండి.

**پٹی** పట్టీ(హి.స్త్రీ)గ్రామభాగము; మంచము పట్టె; పట్టిక; బట్టపీలిక, పాపటు, పార్శ్వము; ప్రక్క; వ్రాతపలక; పాఠము, బారు, వరుస; పట్టి, కట్టు; ఒక దినుసు తినుబండము.

**پٹی پڑھانا** పట్టీ-పఢానా (హి) పెడరేచుట, దుర్బోధ చేయుట. **پٹی دار** పట్టీ-దార్ (హి) భాగస్థుడు, కాపు.

**پٹیت** పటైత్ (హి.పు) గదత్రిప్పువాడు, కుంతుడు, పురోహితుడు, మెడలో తెలుపుగల పావురము.

**پٹیا** పటియా(హి.స్త్రీ)రాతిపలక.

**پٹیل** పటేల్(హి.పు)పెద్దకాపు; గ్రామాధికారి; గదత్రిప్పువాడు.

**پٹیلا** పటేలా(హి.పు) తుంగగడ్డి; బండ్లు దాటించు తెప్ప, పడవ; పసుపు బండ; గొట్టు; గుంటుక; పాపటము.

**پٹیلنا** పటేల్నా(హి) గెలుచుట, తీసికొనుట, ఒడియుట, కొట్టుట, లోపరచుకొనుట, సంపాదించుట, మోసము చేయుట.

**پٹیلی** పటేలీ (హి.స్త్రీ)చిన్న పడవ, పుట్టి, తెప్ప. (పూజాద్రవ్యములు.

**پجاپا** పుజాపా (హి.పు) పూలుపత్రి,

**پجانا** పుజానా (హి) పూజ చేయించుట.

**پجاوا-پجاوہ** పజావా-వ(హి పు)ఇటికెలఆవము, ఇటుకల బట్టి.

**پجوانا** పుజ్వానా(హి)పూజ చేయించుట.

**پجوڑا** పజోడా (హి) తుచ్ఛుడు, నీచుడు, అల్పుడు, కుంఠ.

**پچ** పచ్ (హి.స్త్రీ)దాక్షిణ్యము, పక్షపాతము; వితండము, హఠము, పట్టుదల.

**پچ** పచ్ (హి) అయిదు, (వృత్తియందు)

**پچ رنگا** పచ్-రంగా (హి) పంచవన్నెల.

**پچ میل** పచ్-మేల్(హి)పంచకూలము, అయిదు వస్తువులు కలసినది. [అలుకుపూత,

**پچارا** పుచారా(హి.పు) కూర్చిక, కుంచె,

**پچاس** పచాస్(హి)ఏబది. (లేకతూనిక;

**پچاسا** పచాసా (హి) ఏబదితులముల ఎత్తు

**پچاسوں** పచాసోఁ(హి)అనేకము.

**پچانا** పచానా(హి) జీర్ణించుకొనుట, అపహరించుట, మురుగుట, పులియుట.

**پچانوے** పచాన్వే(హి)తొంబదియైదు.

**پچاو** పచావ్ (హి.పు) జీర్ణశక్తి; గాంభీర్యము, సహనము. (చుదప్పుడు,

**پچ پچ** పచ్ పచ్ (హి)చిత-చిత, బురదలో నడ

**پچپچانا** పచ్ పచానా(హి)పిసపిస లేకలసలసలాడుట, చిత-చితలాడుట.

**پچپن** పచ్పన్(హి)ఏబదియైదు.

**پچتانا** పచ్తానా(హి)పశ్చాత్తాపపడుట, చింతించుట, అనుతాపపడుట.

**پچتاوا** పచ్తావా (హి.పు) పశ్చాత్తాపము, అనుతాపము. (కము,

**پچر** పచ్చర్(హి.పు) మేకు; గూటము; ఆటంక

**پچکارنا** పుచ్కార్నా(హి)ముద్దాడుట, ప్రేమించుట, బుదగరించుట, లాలించుట, బరువసము జెప్పుట.

**پچکاری** పిచ్కారీ (హి.స్త్రీ) చిమ్మనగొట్టము, పింజనగోవి, చిమ్మనగ్రోవి.

**پچکانا** పిచ్కానా(హి) అణచుట, ఒత్తుట, పిసుకుట (ల్యాణి గుఱ్ఱము.

**پچکلیان** పచ్కల్యాన్ (హి.పు) పంచక

**پچکنا** పిచక్నా(హి)మణగుట, అణగుట, ముడుచుకొనుట, వక్కుట.

**پچلڑا-پچلڑی** పచ్లడా-డీ(హి)పంచసరము, అయిదువరుసల పూసల పేరు.

**پچلونا** పచ్‌లౌనా (హి) పంచలవణము; అయిదు ఉప్పులు కలిపిన చూర్ణము.

**پچ محل - لا** పచ్ మహల్-లా (హి) పంచభవనము, అయిదు అంతస్తుల మేడ.

**پچنا** పచ్నా (హి) జీర్ణమగుట; దక్కుట; దక్కిపోవుట, హరించిపోవుట; మనసులోనిలుచుట; పక్షపాతము చేయుట, ప్రయత్నము చేయుట; మురుగుట, కుళ్లుట, పులియుట, దొరకక పోవుట;

**پچوترا** పచోత్రా (హి) పంచోత్తరము; నూటికి అయిదువంతున పెచ్చు లేక పన్ను.

**پچھاڑ** పఛాడ్ (హి స్త్రీ) వెలకిలపడవేయుట; పడగొట్టుట; వెలకిలపాటు, వెలకిలపడుట, పాటు; చెరుగుడు (చేటతో)

**پچھاڑنا** పఛాడ్నా (హి) వెనుకకుపడద్రొబ్బుట, ఓడించుట; గెలుచుట; చెరుగుట.

**پچھاڑی** పిఛాడీ (హి. స్త్రీ) వెనుక, వెనక భాగము; వెనక కాళ్లకట్టు త్రాళ్లు (గుఱ్ఱమునకు కట్టునవి) (మర:

**پچھان** పఛాన్ (హి. పు) పశ్చిమము; పడ

**پچھتانا** పఛ్‌తానా (హి) చూడు **پچتانا**

**پچھتاوا** పఛ్‌తావా (హి) చూడు **پچتاوا**

**پچھتر** పఛ్‌హత్తర్ (హి) డెబ్బదియైదు.

**پچھڑنا** పఛడ్నా (హి) వెలకిలపడుట; ఓడుట; వెనుకపడుట.

**پچھلا** పిఛ్లా (హి) వెనుకటి, కడపటి, తుది, తరువాతి, పూర్వపు. **پچھلا پہر**-పహర్ (హి) వేకువజాము, ప్రొద్దుక్రుంకుజాము, పగలుగాని రాత్రిగాని నాలుగవజాము.

**پچھل پائی** పిఛల్‌పాయీ (హి. స్త్రీ) కామినీభూతము.

**پچھلی رات** పిఛ్‌లీరాత్ (హి. స్త్రీ) అపరరాత్రి, రాత్రి రెండుజాముల తరువాతి కాలము.

**پچھم** పచ్ఛమ్ (హి. స్త్రీ) పశ్చిమము, పడమర.

**پچھنا** పఛ్నా (హి. పు) పొడిచి నెత్తురుదీయుట, లేక అట్టిసాధనము, టీకా సూది.

**پچھوا** పఛ్వా (హి. స్త్రీ) పడమరగాలి.

**پچھواڑا** పిఛ్వాడా (హి. పు) పెరడు; దొడ్డి; ఇంటి వెనుకభాగము.

**پچھوانا** పుఛ్వానా (హి) అడిగిరచుట.

**پچھوت** పిఛౌత్ (హి. స్త్రీ) వెనుకటిపంట; వెనుక; తరువాత. (తో)

**پچھوڑنا** పఛోడ్నా (హి) చెరుగుట (చేట

**پچھیا** పుఛ్వయ్యా (హి. పు) అడుగువాడు; పరీక్షకుడు; విమర్శించువాడు.

**پچی** పచ్చీ (హి. స్త్రీ) మేకు; గచ్చుపూత; అతుకు, అంటుకొన్న. అతికిన, కలసిన; ఇరికిన, బిగిసిన; గట్టి; దిట్టమైన, సుతిగలిసిన; వేరుపిన్న.

**پچیاسی** పచ్యాసీ (హి) ఏనుబదియైదు.

**پچیانوے** పచాన్వే (హి) తొంబదియైదు.

**پچیت** పచైత్ (హి. పు) జెట్టి; మల్లుడు, అనుభవశాలి, గట్టివాడు.

**پچیس** పచ్చీస్ (హి) ఇరువదియైదు.

**پچیسواں** పచ్చీస్వాఁ (హి) ఇరువదియైదవ.

**پچیسی** పచ్చీసీ (హి) పంచవింశతి, పచ్చీసు ఆట.

**پخ** పఖ్ (ఉ. స్త్రీ) వదరుడు, లొడలొడ, జగడము, గంద్రగోళము, ఆక్షేపము, అటంకము, అడ్డంకి, అడ్డము.

**پخال** పఖాల్ (హి. స్త్రీ) తోలుముంచిన, నీళ్లకొరకైన పెద్దతోలుసంచి.

**پختریاں** పఖ్‌తడియాఁ (హి. స్త్రీ) రో

ప్రేతునుకలు,ఒడ్డనపైకొట్టేలు, మంచిరుచి యైనరొట్టెలు.

**پختگی** పుఖ్తగీ(పా.స్త్రీ) దిటవు,గట్టి; పచనము,పాకము; అనుభవము, ప్రవీణత.

**پختہ** పుఖ్త [పా] వండిన; పండిన; గట్టి, దిట్టమైన; అనుభవముగల; ఇటికెసున్నము తోకట్టిన;ప్రవీణతగల, నేర్పుగల.

**پخنا** పఖ్నా [ఉ.పు]వదరుబోతు,తుచ్ఛుడు,గయ్యాళి,తుంట. (గొండి.

**پخیا** పఖ్యా [ఉ.స్త్రీ] గయ్యాళి,జగడ

**پد** పద్ [హి.పు] పదము;అడుగు;అంతస్తు; పద్యపాదము; పదార్థము; దేశము; పాట; గౌరవము.

**پدّا** పిద్దా [హి.పు] వడిసెలలోనిరాయి పెట్టు బిళ్ల, నల్లంచిగాడు అనుపిట్ట, తుచ్ఛుడు,అల్పము,చిన్న (కడుపులోపిల్ల)

**پدانا** పదానా[హి]విసికించుట,ఓడించుట.

**پدر** పిదర్ [పా.పు] తండ్రి.

**پدری** పిద్రీ[పా] పైతృకము,తండ్రి సం॥

**پدڑی** పిదడీ [హి.స్త్రీ] తుచ్ఛము, దుర్బలుడు;నల్లంచిగాడు,(పిట్ట).

**پدم** పదమ్ [హి.పు]పద్మము. (జాతిస్త్రీ.

**پدمنی** పద్మనీ[హి.స్త్రీ]పద్మిని,ఉత్తమ

**پدّو-پدوڑا** పద్దూ-పదోడా [హి] పిత్తుల మారి;పిరికిపంద.

**پدهارنا** పధార్నా [హి] వేంచేయుట, వచ్చుట, పోవుట.కూర్చుండుట;విజయము జేయుట. (ద్దు,పెద్ద.

**پدهان** పధాన్ [హి.పు] ప్రధాని,ముఖ్యు

**پدهی** పద్ధీ[హి.స్త్రీ]ఒకనవీపుపైఎక్కుట

**پذیر** పజీర్ (పా) యోగ్యము, సాధ్యము, అనుగుణ్యము,అర్హము,తగిన,కూడిన.

**پذیر اصلاح** ఇస్లాహ్—[పా] సంస్కారయోగ్యము,సంస్కారార్హము.

**پذیرا-پذیرہ** పజీరా-ర[పా] యోగ్యము, అర్హము.

**پر** పర్ [హి.పు] రెక్క,ప్రక్క,బలము.

**پرو بال نکالنا**—పరొబాల్ నికాల్నా(హి) రెక్కలువచ్చుట; పోకిరియగుట, గర్వించుట,జగడముపెట్టుట. **پردار**—దార్ [హి] రెక్కలుంగల. (పై; పైన,మీద.

**پر** పర్ [హి] కాని,అయిన, అయినప్పటికిని,

**پر** పుర్ (పా) పూరితము,పూర్ణము,నిండినది.

**پر ملال**—మలాల్ [పా] చింతాక్రాంతమైన, దుఃఖపూరితము.

**پر** పర్ [హి] పరాయి, ఇతరము;పరము,పరమము,ఉత్తమము;అధికము,మిక్కిలి;అవలి; దవ్వైన,మారమైన.

**پراپت** ప్రాప్త్ (హి.స్త్రీ)ప్రాప్తము,లాభము,ఆదాయము. (శము.

**پرات** పరాత్(హి.స్త్రీ) పెద్దపళ్లెము,తాంబా

**پرانم-پراتن** పురాతమ్-న్(హి) పురాతనము,పాత.

**پراتا-ٹھا**-పరాటా-ఠా(హిపు)పొరలరొట్టె.

**پراچت** ప్రాచిత్(హి)ప్రాయశ్చిత్తము.

**پراچین** ప్రాచీన్(హి) ప్రాచీనము.

**پراکرت** ప్రాకృత్(హి)ప్రాకృతము, మాటలము,ప్రకృతి,నీచము,పామరము.

**پراگندگی** పరాగందగీ (పా.స్త్రీ) చిందరవందర,చెల్లాచెదరు,కలత,కలవరము, వ్యాకులము.

**پراگندہ** పరాగంద(పా)చిందరవందరలైన, చెదరిన, కలతజెందిన,వ్యాకులితము.

**پرال** పరాల్(పా) పూరి,వరిగడ్డి,కసవు.

**پرالبد** ప్రాలబ్ద్(పా)ప్రారబ్ధము.

**پران** పురాన్(హి.పు)పురాణము.

پران ప్రాణ్ (హి.పు) ప్రాణము, ఉసురు.

پرانا పిరానా (హి) నొచ్చుట, నొప్పిపుట్టుట.

پرانا పురానా (హి) పూరించుట, నింపుట, పూర్తి చేయుట.

پرانا పురానా (హి) పురాణము, ప్రాత.

پرانی ప్రాని (హి), ప్రాణి, జంతువు, ప్రాణముగలది. (అన్యము.

پرایا పరాయా (హి) పరాయి, ఇతరము,

پرائیبیچو పరాయిబేచ (ఉ.పు) ప్రాతబట్టలు కుట్టువాడు, ప్రాతబట్టలతో టోపీలు మొ॥ కుట్టిఅమ్మువాడు,

پرب పర్బ్ (హి.పు) పర్వము; పండుగ;

پربت పర్బత్ (హి.పు) పర్వతము

پربس పర్బస్ [హి.పు] పరాధీనము,

پربھاو ప్రభావ్ (హి.పు) ప్రభావము.

پربھو ప్రభూ [హి.పు] ప్రభువు.

پربین ప్రబీన్ (హి) ప్రవీణుడు, నేర్పరి

پرپنچ ప్రపంచ్ (హి) ప్రపంచము, లోకము, మోసము.

پرپیٹھ పర్పేఠ్ (హి.పు) హుండీయొక్క ప్రతి, రెండవప్రతి, మూడవప్రతి.

پرت పర్త్ (హి.పు) మడత, పొర, చెక్క, పెచ్చు, పరక.

پرتاپ ప్రతాప్ (హి.పు) ప్రతాపము.

پرتال పర్తాల్ (హి.స్త్రీ) చూచు پرتال

پرتلا పర్తలా (హి.పు) కత్తివారు, పేటీ, కత్తికికట్టి భుజముమీదవేసుకొను తోలువారు.

پرتو పర్తౌ (పా.పు) కాంతి, ఛాయ, వెలుగు, ప్రతాపము, కిరణము.

پرتوا పర్తువా (హి.పు) నీడ, ఛాయ.

پرتھی పర్థీ (హి.స్త్రీ) పృథివి, భూమి.

پرتیت పర్తీత్ (హి.స్త్రీ) ప్రతీతి, బరువసము, నమ్మకము, విశ్వాసము.

پرج పరజ్ (హి.స్త్రీ) రాగభేదము, గాలుయొక్క పిడి.

پرجا పజ్జా (హి.స్త్రీ) ప్రజ, లోకులు; సంతానము; అద్దెకున్నవాడు; కాపు.

پرجاپت పజ్జాపత్ (హి.పు) ప్రజాపతి.

پرچا పర్చా (హి.పు) పరీక్ష, పరిచయము

پرچانا పర్చానా (హి) పరిచయముచేసికొనుట, మాలిమిచేయుట, మరులుకొలుపుట; మోసముచేయుట; ముట్టించుట, వెలిగించుట.

پرچک పుర్చక్ (హి.స్త్రీ) బుజగరము, గారాబము; ఆశ్రయము, పక్షపాతము; సహాయము; సౌజ్ఞ, సైగ.

پرچنا పరచ్నా (హి) మాలిమియగుట, పరిచయమగుట, అనుమోదించుట.

پرچون పర్చూన్ (హి.పు) కిరాణము, సామగ్రి, పిండి-సరకులు-దినుసులు.

پرچونیا పర్చూనియా (హి.పు) కిరాణమమ్మువాడు, కోమటి.

پرچہ పర్చ (పా.పు) చింపు-పీలిక; చీటి, ఉత్తరము; వర్తమానము; ప్రశ్నలకాగితము-లేఖ, పత్రిక-వర్తమానపత్రిక.

پرچھا పర్ఛా (హి.పు) పంటెకోల-దారముచుట్టుకొను కోల; తనంతటనే మొలచిన వరిపైరు; పరిగపైరు.

پرچھاواں-پرچھانواں-پرچھائیں పర్ఛావా-ఛాంవా-ఛాయీం (హి.స్త్రీ) ఛాయ-నీడ; గుణము; ఫలితము-ఇతరులగుణము.

پرچھتی పర్ఛతీ (హి.స్త్రీ) నుంటిగోడపై కప్పు-బొద్దుకప్పు.

پرخاش పర్ఖాష్ (పా.స్త్రీ) యుద్ధము,

జగడము; పోట్లాట-విరోధము-స్పర్ధ.

**پرداخت** పర్దాఖ్ త్ [పా॰పు] పరాయణత, పరత, సహాయము-సమర్థత, నిర్వాహకము, రక్షణ- పోషణ- నెగవేర్పు-అలంకారము, శృంగారము-సవరణ.

**پردادا** పర్దాదా[హి॰పు]ప్రపితామహుడు, ముత్తాత-తాతతండ్రి.

**پردادی** పర్దాదీ[హి॰స్త్రీ]ప్రపితామహి, ముత్తవ్వ, ముత్తాతభార్య

**پردازی** పర్దాజీ [పా॰స్త్రీ] పరాయణత, పరత, శృంగారింపు, అలంకారము, వైఖరి, పీతిక, తీవి, సమర్థత, సామర్థ్యము, (వృత్తియందు)

**پردگی** పర్దగీ [హి॰స్త్రీ] పతివ్రత-సౌభాగ్యరాలు-ఇల్లాలు; అంతఃపురవాసము-చాటు, మరుగు, తెర. (దోషకాలము,

**پردوش** ప్రదోష్ [హి॰పు] ప్రదోషము, ప్ర

**پرده** పర్దహ [పా॰పు] తెర-తెరచాప; తిరస్కరిణి; అడ్డగోడ; గుట్టు; వీణయొక్క-అంతస్తులేక మెట్లు; ప్రాకారము; నేత్రపటలము, కంటిపొర, పొర, తెరచాటు.

**پردے پردے** పర్దేపర్దే [పా] లోలోపల, రహస్యముగా.

**پردے میں گرده لگنا-سوراخ پڑنا** పర్దే మేగిర్దలగ్నా-సురాఖ్ పడ్నా [ఉ] అంతఃపురద్రోహముజరుగుట. **پرده نشین** పర్దా—నషీన్ [పా] అంతఃపురవాసి- మరుగుగానుండేడు- **پرده نشینی** పర్దా-నషీనీ [పా] అంతఃపురవాసము- మరుగుగానుండుట, తెరచాటున నుండుట.

**پردیس** పర్దేస్ [హి] పరదేశము.

**پردیسی** పర్దేసీ [హి] పరదేశస్థుడు.

**پردیسن** పర్దేసన్[హి॰స్త్రీ]పరదేశస్థురాలు. పరాయిది.

**پرزه** పుర్జ [పా॰పు] తునక- పీలిక-చీలిక, కీలు-ఈకె. **پرزے اڑانا** పుర్జే ఉడానా [ఉ] తుక్కులుగా గొట్టుట.

**پرس** పుర్స [హి॰పు] పురుషుడు, నిలువు, పురుషప్రమాణము.

**پرس** పుర్స [పా] పృచ్ఛ- అడుగుట-విచారణ- [వృత్తియందు]

**پرسا** పుర్సా[పా॰పు] నిలివెడు, పురుషప్రమాణము; ఉపచారము-ఆదరింపు; రోగినివిచారించుట- దుఃఖములోనున్నవారినిఓదార్చుట; దుఃఖము-ఓదార్పు, ఆదరింపు.

**پرساد** ప్రసాద్ [హి॰పు] ప్రసాదము.

**پرسال** పర్సాల్[హి॰పు]చూడు **پارسال**

**پرساں** పుర్సాఁ(హి॰పు)పృచ్ఛకుడు, విచారించువారు, అడుగువాడు, (వృత్తియందు)

**پرسان حال** పు-సె హాల్ (పా) స్థితిగతులను విచారించువాడు.

**پرست** పరస్త్(పా)పూజకుడు, పూజించువాడు. [వకుడు.

**پرستار** పరస్తార్ [పా॰పు] దాసిన, సే

**پرستان** పరిస్తాన్(పా॰పు)గంధర్వలోకము.

**پرستش** పరస్తిష్(పా॰స్త్రీ)పూజనము, సేవ-సత్కారము, భక్తి.

**پرستشگاه** పరస్తిష్గాహ్[పా॰పు]పూజామందిరము. (సించిన.

**پرسن** ప్రసన్న[పా॰పు]ప్రసన్నమైన. సంత

**پرسنا** పరస్నా(హి)చూడు **پروسنا**

**پرسنگ** ప్రసంగ్[హి॰పు]ప్రసంగము.

**پرسوں** పర్సోఁ[హి]మొన్న, ఎల్లుండి.

**پرسه** పుర్స(పా॰పు)చూడు **پرسا**

**پرش** పురుష్ (హి॰పు)పురుషుడు.

پرشاد పర్షాద్(హి.పు)చూడుము پرساد.

پرکاج పర్కాజ్ [హి.పు] పరకార్యము, ఇతరులపని.

پرکار పర్కార్ [పా.పు] పరిధికారము,పరికారము, పరిధిరేకవర్తులమును గీయుసాధనము.

پرکار పుర్కార్(పా)బలిసిన,లావైన;పనితనముగల;దిట్టమైన;ప్రవీణతగల.

پرکالہ పర్కాల(పా.పు)ఖండము, తునక;మిణుగురు,అగ్నికణము; అద్దపుతునక, గాజుముక్క;

پرکرما-پرکما పర్కమ్మ-పరిక్రమ(హి.స్త్రీ) పరిక్రమము, ప్రదక్షిణము,చుట్టుతిరుగుట, దిగదుడుపగుట.

پرکھ పురఖ్(హి.పు)చూడు پرش

پرکھ పరఖ్ (హి.స్త్రీ)పరీక్ష.

پرکھا పురఖా(హి.పు)వృద్ధు,పెద్దమనుష్యుడు.

پرکھانا పర్ఖానా(హి)పరీక్షచేయించుట, నివేదించుట,స్వాధీనముచేయుట. (నుట.

پرکھنا పరఖ్నా(హి)పరీక్షించుట, ఒరగో

پرکھیا పర్ఖయ్యా (హి.పు) పరీక్షకుడు, పరకాయించువాడు.

پرگاہ పర్గాహ్(పా)పనికిమాలినది, తుచ్ఛము;చెత్త,చెదారము.

پرگنہ- పర్గన(పా.పు) ప్రాంతము, పరగణా

پرگو పుర్గో(పా.పు)మాటకారి.

پرگھٹ-پرگٹ పర్ఘట్-గట్(హి)ప్రకటము,స్పష్టము.ప్రసిద్ధము.

پرگیری పర్గిరీ(పా.స్త్రీ)గరి,బాణపు ఈకె;బాణపుములికి.

پرلا పర్లా(హి)ఆవలి,తరువాతి,కడపటి.

پرلےدرجےکا పర్లేదర్జేకా(హి) మొదటితరగతిలోచేరిన.

پرلوک పర్లోక్(పా.స్త్రీ)పరలోకము.

پرلئے ప్రలయ్(హి.స్త్రీ)ప్రలయము.

پرمان ప్రమాన్ (హి.పు) ప్రమాణము,

پرمٹ పర్మిట్ (ఇం.స్త్రీ) సెలవుచీటి,సుంకపుచావడి. (లు.

پرمل పర్మల్(హి.స్త్రీ)పరిమళము, పేలా

پرنالہ-پرنالی-پرنالا పర్నాలా-లీ-ల (హి.పు)జలదారి,తూము;మిద్దెపైతూము.

پرنام ప్రనామ్ (హి.స్త్రీ) ప్రణామము. దండము.

پرنانا పర్నానా(హి.పు)ప్రమాతామహుడు,తల్లియొక్క తాత.

پرنانی పర్నానీ (హి.స్త్రీ) ప్రమాతామహి,తల్లితల్లియొక్కతల్లి. (ఎగురునది.

پرند-پرندہ పరింద్-ద (పా.పు) పక్షి,

پروا పుర్వా(హి.స్త్రీ) తూర్పుగాలి; మట్టిముంత. (ము,చింత,అక్కఱ.

پروا పర్వా(పా పు) ఆవశ్యకత,ఇచ్ఛ, లక్ష్య

پرواز పర్వాజ్ (పా)ఎగిరెను.

پروازی పర్వాజీ (పా స్త్రీ) ఎగురుడము, డయనము.

پروان పర్వాన్ (పా.స్త్రీ) పర్వాను,నమూను ప్రమాణము, సత్యము, న్యాయము, వృద్ధి, జయము,ఒడచాపయొక్కఅర్ధకోల.

پروان چڑھنا -వఢ్నా (హి) పెరుగుట-వృద్ధియగుట,వివాహితుడగుట.

پروانا పుర్వానా (హి) నిండించుట,నింపించుట.

پروانجات పర్వాన్జాత్ (ఉ.పు) ఉత్త

రువులు, శాసనములు, సెలవుచీటీలు.
(ఎవ-నా-پروانہ) (ఉత్తరువు.

پروانگی పర్వాన్‌గీ (పా.స్త్రీ) అనుజ్ఞ,

پروانہ పర్వాన (పా.పు)పతంగము, దీపపు పురుగు; ఆజ్ఞాపత్రిక, సెలవుచీటి; మోహితుడు. ((క్రింద నెట్టబడునది.

پروایا పర్వాయా (హి.పు) మంచపుకోళ్ల

پروائی పర్వాయీ(పా) అగత్యము,అక్కరగలవాడు.

پروتا పరోతా(హి.పు)ప్రపౌత్రుడు,మునిమనుమడు;మనుమనికుమారుడు; మోయను బత్తెము.

پرور పర్వర్ (పా) పోషకుడు, ఏలినవాడు,

پروردگار పర్వర్దిగార్ (పా.పు) ఈశ్వరుడు,పోషకుడు. (పెడిన;బానిస.

پرورده పర్వర్ద (పా)పోషించబడిన; పెంచ

پرورش పర్వరిష్ (పా.స్త్రీ) పాలన,పోషణము. (వడ్డించిన స్త్రి.

پروسا పరోసా (హి.పు) భోజనము, వడ్డన,

پروسنا పరోస్నా(హి) వడ్డించుట.

پروسیا పరోసియా (హి.పు)వడ్డించువాడు.

پرونا పిరోనా (హి) గ్రుచ్చుట,కూర్చుట, దూర్చుట, సూదిలో దారము దూర్చుట, చొప్పించుట,నెట్టించుట. (తుడు.

پروہت పురోహిత్ (హి.పు) పురోహి

پروہتانی పురోహితానీ [హి.స్త్రీ] పురోహితునిభార్య.

پرویا పుర్వయ్యా [హి.స్త్రీ] తూర్పుగాలి.

پروین పర్వీన్ [పా.పు] కృత్తికానక్షత్రము.

پره పర [పా] అంచు,ప్రక్క, క్రిందు,క్రింది భాగము. (చూడు پرا)

پرہیز పర్‌హేజ్(పా.పు)పథ్యము, వర్జనము,యమము, పరిత్యాగము.

پرہیزگار పర్‌హేజ్‌గార్(పా) జితేంద్రియుడు,వర్జించువాడు,పరిత్యాగి.

پرہیزگاری పర్‌హేజ్‌గారీ (పా.స్త్రీ) జితేంద్రియత్వము,వర్జనము, పరిత్యాగము.

پرے పరే(ఉ.పు) ఆవలిప్రక్క, దూరమున, ఆవల.

پری పరీ(పా.స్త్రీ) దేవతాస్త్రీ, రెక్కలుగల స్త్రీ,సుందరస్త్రీ, గంధర్వస్త్రీ, అప్సరస, అందగత్తె. (బందు.

پری بند పరీబంద్(పా పు) ఒకవిధమైనభుజ

پری خوان పరీఖాఁ (పా.పు) కట్టుబోతు, మంత్రగాడు.

پریت ప్రేత్ (హి.పు) ప్రేతము,భూతము.

پریت ప్రీత్ (హి.స్త్రీ)ప్రీతి,సంతోషము.

پریتم ప్రీతమ్ (హి.పు) ప్రీతము; ప్రియమైన, మగడు,ప్రియుడు.

پریشان పరేషాన్ (పా)చికాకైన, చిందరవందరమైన,చెదరిన,కలతచెందిన, వ్యాకులమైన,కలవరపడిన,చింతగల.

پریشانی పరేషానీ (పా.స్త్రీ) చికాకు, చిందరవందర,చెదరిక, కలత, వ్యాకులము, కలవరము,చింత. ((శ్రద్ధ,చింత.

پریکها పరేఖా(హి.పు)పరిక్ష, విచారము,

پریم పరేమ్ (హి.పు) ప్రేమ,ప్రీతి.

پریوا పరేవా (హి.పు) నీటిపావురము.

پریوں کا اکهاڑا పరియోఁ కాఅఖాడా (ఉ.పు)సుందరస్త్రీసమాజము. (రస్త్రీ.

پریہ పరయ (పా.స్త్రీ)మోహిని,అతిసుంద

پڑا పుడా(హి.పు) పెద్దపొట్లము; మద్దెలతోలు,తోలుకప్పు.

پڑاکا పడాకా(ఉ.పు)చూడు پٹاخا

پڑتےکی పడ్‌కేకీ(ఉ)చూడు پٹاپٹی

**پڑاو** పడావ్ (ఉ.పు) సత్రము, బస, విడిది, శిబినము, సేనానివేశము, గుంపు.

**پڑپڑانا** పడ్‌పడానా (హి) గిజగిజలాడుట, కొట్టుకొనుట; వదరుట, కారముపుట్టుట, నాలికచుఱ్ఱుమనుట.

**پڑت** పడత్ (హి.స్త్రీ) పట్టుబడి, వెల, ధర, లెక్క, కట్టుబడి, సరాసరిలెక్క, సగటు.

**پڑت پھیلانا**—ఫైలానా (హి) ధరలుకట్టుట, వైనముగాధరలువేయుట, సగటుగట్టుట, సగటువేయుట. (పన్ను.

**پڑتا** పడ్‌తా (హి.పు) భాగము; కట్టుబడి,

**پڑتال** పడ్తాల్ (హి.స్త్రీ) పునఃపరీక్ష, పునర్విమర్శన, మరలచూచుట, తిరిగిచూచుట, సరిచూచుట.

**پڑتالنا** పడ్తాల్‌నా (హి) పునఃపరీక్షచేయుట, తిరిగిచూచుట, మరలచూచుట, సరిచూచుట. (చేయనిభూమి.

**پڑتی** పడ్తీ [హి.స్త్రీ] బీడుసేల, చెలక, సాగు

**پڑنا** పడ్నా (హి) పడుట, అగుట, నిలుచుట, దిగుట, పండుకొనుట, సంఘటించుట, అలయుట, చాపుగానగుట, ఆధీనమగుట, వెలయగుట, ధరయగుట, చింతపడుట, ప్రవేశించుట, విడిగానుండుట, మిగులుట.

**پڑوا** పడ్వా (హి.స్త్రీ) ప్రతిపద, పాడ్యమి, (పు) బఱ్ఱెకుఱ్ఱ.

**پڑوایا** పడ్వాయా [హి.పు] మంచపుకాళ్లక్రిందపెట్టుకొయ్యబిళ్లలు, ఎత్తుబిళ్లలు.

**پڑوس** పడోస్ [హి.పు] పొరుగు, సామీప్యము, పొరుగింటివాడు.

**پڑوسن** పడోసన్ [హి.స్త్రీ] పొరుగింటిస్త్రీ, పొరుగింటియామె.

**پڑوسی** పడోసీ [హి.స్త్రీ] పొరుగింటివాడు, పొరుగువాడు.

**پڑھا** పఢా [హి] చదివిన, విద్యావంతుడగు.

**پڑھا گنا**—**لکھا**—గునా-లిఖా [హి] విద్యావంతుడు, పండితుడు.

**پڑھانا**—**پڑھا دینا** పఢానా-దేనా [హి] చదివించుట, విద్యకఱపుట; పెడరేపుట.

**پڑھائی** పఢాయీ [హి.స్త్రీ] శిక్షణ, చదివింపు, చదువుపుస్తకము, బడిజీతము.

**پڑھنا** పఢ్నా [హి] చదువుట, విద్యనేర్చుట, ఒప్పగించుట. (చదువుట.

**پڑھنت** పఢంత్ (హి.స్త్రీ) మంత్రము.

**پڑھوانا** పఢ్వానా (హి) చదివించుట,

**پڑی** పుడీ (హి.స్త్రీ) మద్దెలతోలు.

**پڑیا** పుడియా (హి.పు) చిన్నపొట్లము.

**پڑیا** పడియా (హి.స్త్రీ) బఱ్ఱెపడ్డ.

**پژاوہ**—**پژاوا** పజావా-వ (పా.స్త్రీ) ఇటికెల ఆవము, బట్టీ.

**پژمردہ** పష్‌ముర్ద (పా) వాడిన, చిన్నబోయిన, ఖిన్నమైన, క్షీణమైన.

**پس** పస్ (పా) తరువాత, తదుపరి, కనుక, కాన, తుదకు, ఎట్టకేలకు.

**پس خوردہ**—ఖుర్ద (పా) భుక్తశేషము. **پس انداز** అందాజ్ (పా) మిగులు, శేషము, సంచితము. **پس پا ہونا**—పాహోనా (పా) వెనుతీయుట, మగుడుట.

**پس رو**—రవ్ (పా) అనుయాయి, అనుసారి, వెనుకబోవువాడు. **پس و پیش**—ఒపేష్ [పా] వెనకముందు, సంకోచము.

**پسا** పసా (హి.పు) దోసెడు, పుడిసెడు.

**پسانا** పసానా (హి) వార్చుట, వంచుట, నీరుతీయుట.

**پسارنا** పసార్నా (హి.పు) వ్యాపింపజేయుట,

విస్తరించుట, ప్రసారించుట, పచారించుట, పంచుట.

**پسارا** పసారా (హి.పు) ప్రసారము, విస్తరణము, విరివి, వ్యాప్తి, పచారము, పరచుట.

**پساو** పసావ్ (హి.పు) వార్చిననీరు, గంజి.

**پسائی** పిసాయీ (హి.స్త్రీ) విసరినకూలి.

**پست** పస్త్ (పా) పొట్టి, కురుచ, కొంచమైన, నీచమైన; తుచ్ఛమైన, పిసినారి, అల్పమైన.
**پست خیال**—పస్త్‌ఖ్యాల్ (పా) నీచబుద్ధిగల, అల్పుడైన. **پست قد**—పస్త్‌కద్ [పా] పొట్టి, కురుచ. **پست کرنا**—పస్త్‌కర్నా (ఉ) ఓడించుట, లోపరచుట. **پست ہمت**—పస్త్‌హిమ్మత్ (పా] ధైర్యము లేని, పిరికి.

**پستان** పిస్తాన్ (పా.స్త్రీ) కుచములు, స్తనములు, పాలిండ్లు, చను మొనలు. (ము.

**پستک** పుస్తక్ (హి.స్త్రీ) పుస్తకము, పొత్తము

**پستول** పిస్తోల్ [ఇం పు) పిసుకుడు తుపాకి, చిన్న తుపాకి, పిస్తోలు. (లకుక్క.

**پستہ** పిస్త (పా.పు) మొట్టెపుఁకులు, అడ్డా

**پستی** పిస్తీ (పా) పసరువర్ణము, పసరుచాయగల. (పిరికితనము, పల్లము, తగ్గు.

**پستی** పస్తీ (పా.స్త్రీ) నైచ్యము, అధైర్యము,

**پسر** పసర్ (హి.స్త్రీ) దొంగతనము, రాత్రిళ్లు దొంగతనముగా ఒకరి పొలములో మేపుట.

**پسر** పిసర్ (పా పు) పుత్రుడు.
**پسرخوانده**—పిసర్‌ఖాంద (పా) దత్తు, పెంపుడు కొడుకు. **پسرزاده**—పిసర్‌జాద (పా) పౌత్రుడు, కొడుకుకొడుకు.

**پسرنا** పసర్నా (హి) ప్రసరించుట, వ్యాపించుట, పరుపుగా నగుట, పరుండుట, హాతము చేయుట.

**پسرہٹا** పసర్‌హట్టా (హి.పు) పచారము, కిరాణపుఅంగళ్లు, అంగడివీధి, మందులఅంగళ్లు, బుక్కా అంగళ్లు.

**پسلی** పస్లీ (హి.స్త్రీ) పర్శువు, ప్రక్క ఎముక.

**پسنا** పిస్నా (హి) విసరబడుట, పిండియగుట, నలుగుట, కష్టపడుట.

**پسند** పసంద్ (పా.స్త్రీ) ఇష్టము, ప్రియము, ఒప్పిదము, అభిలాష, మెప్పు, అభీష్టము.
**پسند کرنا**—పసంద్‌కర్నా (ఉ) మెచ్చుట, ఇష్టపడుట, అనుమోదించుట.

**پسندا-پسندے** పసందా-దే (ఉ.పు) ఒక విధమైనకబుకట్లు, చక్కగా చేసినమాంసము.

**پسندیده** పసందీద (పా) అంగీకృతమైన, ఒప్పిదమైన, ఇష్టమైన, ప్రియమైన, మనోహరమైన. (ఆడుది.

**پسنہاری** పిసన్‌హారీ [పా] పిండివిసరు

**پسو** పిస్సూ (పా) మిణ్ణల్లి; (నంగనాచి)

**پسوانا** పిస్వానా (హి) విసరించుట.

**پسوائی** పిస్వాయీ (హి) చూడు. **پسائی**

**پسیجنا** పసీజ్నా (హి) చెమ్మగిలుట, చెమటుపూయుట, స్రవించుట, కారుట, కరుగుట, మెత్తగిలుట.

**پسیری** పసేరీ (హి.స్త్రీ) వీసె, తక్కెడు.

**پسین** పసీన్ (పా) వెనుకటి, తరువాతి, ఆధునికమైన.

**پسینا-پسینو** పసీనా-వ్ [హి.పు] చెమట.
**پسینا آنا**—పసీనాఆనా (హి) చెమటపూయుట.

**پشاب** పిషాబ్ (హి.పు) చూడు. **پیشاب**

**پشت** పుష్త్ (పా.స్త్రీ) పృష్ఠము, వెనుక తోడు, ఆశ్రయము; తరము, వంశము; అనుఊత; చాడి. **پشت بپشت**—బపుష్త్ (పా) తరతరముగా, పరంపరగా
**پشت پناه**—పనాహ్ (పా) వెనక

బలము, ఆశ్రయము, అను

**پشت دکھانا-دینا** దిఖానా-దేనా (ఉ) పారిపోవుట.

**پشتارہ** పుష్తార [పా.పు] బరువు, మోత; ప్రోగు, కుప్ప, దిన్నె.

**پشتک مارنا** పుష్తక్‌మార్నా (ఉ) (గుఱ్ఱము) వెనక కాళ్లతో తన్నుట.

**پشتو** పుష్తో (పా. స్త్రీ) పుష్తోయను కాబూలు దేశస్థుల భాష.

**پشتہ** పుష్త (పా.పు) ఒత్తన, కట్ట; దిన్నె, అను, ఆనిక, దన్ను; గోడకుబలకరముగా క్రింద వేయుమన్ను, వెనుకబలము (గానుండునది).

**پشتی** పుష్తీ (పా. స్త్రీ) ఆశ్రయము, సహాయము; ఆను, ఊత; ఆనుడుదిండు, పుస్తకములకు వేయుఅట్టలేకతోలు.

**پشتی بان** పుష్తీబాన్ (పా.పు) తోడు, సహాయము; గండపట్టె, అడ్డపట్టె, (గా.

**پشتین** పుష్తీన్ (హి) పరంపరగా, తరతరము

**پشٹ** పుష్ట్ (హి) పుష్టిగల, బలముగల; పాలన, పోషణ;

**پشٹی** పుష్టీ (హి. స్త్రీ) పౌష్టికౌషధము.

**پشم** పషమ్ (పా. స్త్రీ) బొచ్చు, ఉన్ని, శష్పము, తుచ్ఛము.

**پشمینہ** పష్మీన (పా) బొచ్చుతో నేసిన, కంబళము, రాంకవము.

**پشو** పశు (హి.పు) పశువు, మూఢుడు.

**پشواز** పిష్వాజ్ (హి.పు) భోగములంగా, పరకారము, పరికిణి.

**پشہ** పష్ష (పా.పు) మశకము, దోమ, అల్పము.

**پشی** పిష్షీ (ఉ. స్త్రీ) పిల్లలమాత్రము.

**پشیمان** పషేమాన్ (పా) పశ్చాత్తాపముగల, సిగ్గుపడిన, ఖిన్నుడైన.

**پشیمانی** పషేమానీ (పా. స్త్రీ) పశ్చాత్తాపము, అనుతాపము, సిగ్గు, భంగపాటు.

**پکّا** పక్కా (హి) పక్వమైన, వండిన, పండిన; పూర్ణుడగు, ప్రవీణుడగు, అనుభవముగల, నిజమైన, సరియైన, రూఢియైన, నిర్ధారణయైన, నిశ్చయమైన, బలిష్ఠమైన; గట్టిమైన; ఇటుకసున్నముతో కట్టిన; రాయిసున్నముతో కట్టిన.

**پکار** పుకార్ (హి.పు) అరపు, పిలుపు, ధ్వని, సద్దు; అల్లరి, మొఱ, కేక.

**پکارنا** పుకార్నా (హి) పిలుచుట, అరచుట, అల్లరిచేయుట, మొరపెట్టుట, కేకవేయుట.

**پکانا** పకానా (హి) వండుట; పండించుట; మా. వేయుట.

**پکاو** పకావ్ (హి) పాకము; పక్వము, పండుట, సిద్ధమగుట, సంధిగల, సక్వముగాగల.

**پکائی** పకాయీ (హి. స్త్రీ) పాకము, వంట, పక్వము, వంటకూలి,

**پکڑ** పకడ్ (హి. స్త్రీ) పట్టు; అధీనము; ఆదాయము, లాభము; ఆక్షేపము.

**پکڑانا** పకడానా (హి) పట్టించుట, పట్టియిచ్చుట; చేతికిచ్చుట, స్వాధీనముచేయుట.

**پکڑنا** పకడ్నా (హి) పట్టుకొనుట, పట్టుట, నిలుపుట, ఆపుట, అందుకొనుట, అతుకుట, అంటుట, ముట్టుట, స్థాపితమగుట, అగుట, తీయుట, జాడతీయుట, ఇరికించుట, ఆక్షేపించుట.

**پکڑوانا** పకడ్వానా (హి) పట్టించుట.

**پکش** పక్ష్ (హి.పు) పక్షము; బలము, సహాయము; రెక్క; గరి (బాణపుఈక); పదునైదుదినముల కాలము. (సహాయుడు, పిట్ట.

**پکشی** పక్షీ (హి.పు) పక్షి; తోటివాడు,

**پکنا** పక్నా (హి) పండుట; ఉడుకుట, వెంట్రుకలు నరియుట; ఈడేరుట, పక్వపడుట, రూఢియగుట, తీరుట.

**پکوان** పక్వాన్ (హి.పు) పక్వాన్నము,పిండి వంటు. (చుటు;పక్వముచేయించుటు.

**پکوانا** పక్వానా(హి) వండించుటు; పండిం

**پکوائی** పక్వాయీ (హి.స్త్రీ) చూడు **پکائی** (బురి;ఉబ్బినది.

**پکوڑا-ڑی** పకోడా-డీ (హి.పు) బజ్జీ;బురు

**پکھ** పఖ్ (హి.పు)మూడు. **پکش**

**پکھال** పఖాల్ (హి.స్త్రీ) తోలు మంకెన, నీళ్లుపట్టు తోలుసంచి.

**پکھراج** ప(ఖ్రాజ్ (హి.పు) పుష్యరాగమణి.

**پکھاوج** పఖ్‌వాజ్ (హి.పు) మద్దెల, మృదంగము. (మద్దెలవాడు.

**پکھاوجی** పఖ్వాజీ (హి) మార్దంగికుడు,

**پکھروٹا** ప(ఖ్రోటా (హి.పు) విడెముల పైపొదిగినఅపరంజి రేకులేక బంగారుత్తంచు.

**پکھڑی** పఖ్‌డీ(హి.స్త్రీ)పూరేకు.

**پکھوا** పఖ్‌వా(హి.స్త్రీ) పక్షము,బాహువు; కౌగిలి.

**پکھیرو** పఖేరు(హి.పు) పక్షి.

**پگ** పగ్ (హి.పు) పాదము,కాలు.

**پگ ڈنڈی**—పగ్‌డండీ (హి) కాలిబాట.

**پگ رکھی**—రఖీ(హి)పాదరక్ష, (లము.

**پگاه** పగాహ్(పా.స్త్రీ)ఉదయము,(ప్రాతఃకా

**پگّا** పగ్గా(హి.పు)పగ్గము,(త్రాడు.

**پگڑی** పగ్‌డీ(హి.స్త్రీ) తలగుడ్డ; మర్యాద; ఒకటు **پگڑی اُترنا-اچھلنا** ఉతర్నా-ఉఛల్నా(హి)తలవంపులగుటు, మానభంగముగుటు.

**پگلا** పగ్లా(హి.పు) వెర్రి,పిచ్చి, తెలివిమాలిన.

**پگلانا** పగ్లానా(హి)పిచ్చిపట్టుటు.

**پگلانا** పిగ్‌లానా (హి) కరిగించుటు; ఒడంబరచుటు.

**پگلنا** పిగల్నా(హి)కరుగుట,లోబడుటు.

**پگیا** పగియా(హి.పు) తలగుడ్డ.

**پل** పుల్ (పా.పు) సేతువు,వారధి, వంతెన; కత్తువ;ప్రోగు,కుప్ప,దిన్నె.

**پل** పల్ (హి.పు)రెప్పవెం(డుకలు,రెప్పపాటు కాలము,క్షణము.

**پلّا** పల్లా (హి.పు) కొంగు,అంచు; తలుపురెక్క; త్రక్కెందు;దవ్వు,దూరము; (ప్రయాణము; సహాయము, ఆ(శ్రయము; గోత్రము, సంచి; బరువు, నెత్తిమోత; స్వాధీనము; (త్రాసుతు దక;తూమెడుఅను(ప్రమాణము, ౧౨౦ శేర్లకొలత.

**پلّا** పిల్లా (హి పు) కుక్కకూన; జారజుడు.

**پلا** పలా(హి.పు)నూనెగరిటె,పెద్దగరిటె.

**پلاس** పలాస్ (హి.పు) మోదుగు,

**پلاس پاپڑا**—పాప్‌డా(హి.పు) మోదుగువిత్తులు. [(హి)పానము.

**پلاس** పిలాస్(పా.పు)నారచీర,ముతకబట్ట.

**پلاسنا** పలాస్నా (హి) చెప్పులుకుట్టినతరువాతసవరించుటు. (యుటు.

**پلانا** పలాన్నా(హి) పల్లముకట్టుటు, గంతవే

**پلانا** పిలానా(హి)(త్రాగించుటు, పట్టించుటు, (త్రాపుటు,ఇంకజేయుటు **پلائی**—పిలాయీ (హి)దాది,ఉపమాత.

**پلپل** పిల్పిల్(పా.పు)మిరియములు.

**پلپلا** పిల్పిలా (హి) మెత్తని,పిసపిసలాడెడు, లసలసలాడెడు,పత్తివలెనున్న.

**پلپلانا** పిల్పిలానా (హి) లసలసలాడుటు, మెత్తగిలుటు, పత్తివలెనగుటు, మెత్తగాచేయుటు,పత్తివలెజేయుటు.

**پلپلا** పుల్పులా (హి) బోలు, బోసి, లొటలొటలాడెడు.

**پلپلانا** పుల్పులానా(హి) గలబరించుట,నమలకుండతినుట,చప్పరించుట.

**پلاو** పులావ్ (పా.పు) మాంసముపరిమళద్రవ్యములుకలిపివండినఅన్నము.

**پلپلاہٹ** పిల్పిలాహట్ (హి.స్త్రీ)లసలస, పిసపిస, మెత్తదనము.

**پلپلاہٹ** పుల్పులాహాట్ (హి.స్త్రీ) గలభరింపు,చప్పరింపు,భయము.

**پل پڑنا** పల్పడ్నా(హి)పైబడుట, ఒటుక్కున పైబడుట;అకస్మాత్తుగా మొదలుపెట్టుట, పైకొనుట.మీదబడుట.

**پلتھی** పల్థీ(హి.స్త్రీ) చూడు. **پالتی**

**پلٹا** పల్టా (హి.పు) తిరుగు, చెల్లు, మారు, తిరుగుదల, మళ్లుదల,పొర్లుదల,మార్పము, చెల్లింపు, ప్రతీకారము, కొట్లైపొర్లించుకడచి,ఒత్తె. **پلٹا لینا** పల్టా-లేనా (హి) పగదీర్చుకొనుట. **پلٹا کھانا** పల్టా-ఖానా (హి) తిరుగబడుట,క్రిందలయగుట,పొర్లుట.

**پلٹاو** పల్టావ్ (హి.పు)తిరుగుడు,మళ్లుదల, తిరుగుదల,ప్రతీకారము,తిరుగుడు.

**پلٹن** పల్టన్ (ఇం.పు) పటాలము,దళము.

**پلٹنا** పలట్నా (హి) మరలుట, తిరుగుట, పొర్లుట;మారుట;నిరాకరించుట,లేదనుట; త్రిప్పుట, పొర్లించుట; మార్చుట; క్రిందల చేయుట;మాగాడుట.బోరలించుట.

**پلچنا** పిలచ్నా (హి) అతుకబడుట,పెనబడుట,పైబడుట,మీదబడుట.

**پلڑا** పల్డా (హి.పు) త్రాసుపడక, పళ్లెము.

**پلستر** పలస్తర్(ఇం.పు)సౌధ,గార,గచ్చు, లేపనము,పట్టు;మందుపూత,పూత.

**پلشت** పలష్త్(పా.పు)అపవిత్రమైన,లంజె.

**پلک** పలక్ (పా.స్త్రీ) రెప్పవెండ్రుకలు,రెప్పపాటుకాలము. **پلک پیٹا** పలక్-పీటా (హి) కండ్లార్చువాడు. **پلک مارنا** పలక్-మార్నా(హి) రెప్పార్చుట, కన్నుగీటుట.

**پلک نواز** పలక్-నవాజ్ (పా) భగవంతుడు, దేవుడు. (ఉయ్యెల, ఊగుట.

**پلنا** పల్నా (హి.పు) ఉయ్యాల,తొట్లి;బట్ట

**پلنا** పల్నా(హి)పెరుగుట,పోషింపబడుట.

**پلنا** పిల్నా (హి) నలుగుట, మెదుగుట;ప్రయాసపడుట;పైబడుట; మార్కొనుట.

**پلندا-پلندہ** పులందా-ద(హి.పు) మూట, మోపు,కట్ట.

**پلنگ** పలంగ్ (హి) పల్యంకము, మంచము, (పా) చిరుతపులి. **پلنگ پوش** పలంగ్-పోష్ (ఉ) నిచోళము,పరుపుచీర.

**پلنگ توڑ** పలంగ్-తోడ్ (హి) నిరుద్యోగి, సోమరిపోతు. (క్కి, చిన్నమంచము.

**پلنگڑی** పలంగ్డీ (హి స్త్రీ) మంచపుకు

**پلو** పల్లూ (హి.పు) అంచు,కొంగు,పైట.

**پلوا** పల్వా(హి.పు)పెంపుడు,పెంచిన.

**پلوانا** పల్వానా(హి)పెంపించుట, పోషింపజేయుట. (తియించుట.

**پلوانا** పిల్వానా (హి) త్రాగించుట;తెలు

**پلوٹھا-پلوٹھہ** పలోఠా-ఠ(హి.పు) తొలుచూలికొడుకు, మొదటపుట్టినకొడుకు.

**پلول** పల్వల్ (హి.పు) ఒకవిధమైనదోసకాయ. (ఉంపస్తు.

**پلہ** పల్ల (పా.పు)త్రాసుపడక,పళ్లెక; మెట్టు,

**پلہنڈا-پلہنڈی** పల్హండా-డీ (హి) నీళ్లయిల్లు,నీళ్లతపెలక్రిందిపీట,నీళ్లకుండలుపెట్టుమంచె.

**پلہی** పల్హీ(హి స్త్రీ) ప్లీహము, గుల్మము.

**پلی** పల్లీ (హి.స్త్రీ)పల్లె,పల్లియము.

**پلی** పలీ(హి.స్త్రీ)మిల్లి,చిన్నగరిటె.

پلی పులీ(హి. స్త్రీ)చిన్నవంతెన,కట్ట

پلیت పలీత్(హి. పు)ప్రేతము;అపవిత్రము.

پلیتا-پلیتہ పలీతా-త(పా. పు)వత్తి,కాగ
డ;యంత్రము,మంత్రము.

پلیتھن పలేథన్(హి. పు)పొడిపిండి,ఒత్తుడు
పిండి,గోదుమపాలుతీసినపిండిపిప్పి.

پلید పలీద్(పా)అపవిత్రమైన,పిశాచము.

پلیدار పల్లేదార్ (పా) మోతకూలివాడు.

پن పిన్ (ఇం. స్త్రీ)గుండుసూది.

پن పున్(హి. స్త్రీ) పుణ్యము.

پن పన్ (హి) ఇది "తనము" అనుదానికిసరి
యైనఅర్థమునిచ్చుప్రత్యయము,

پن పన్(హి)"నీళ్లు" లేక "అయిదు" లేక "త
మలపాకు" అనుఅర్థమునిచ్చు ఒకఉపస
ర్గము پن بٹا పన్-బట్టా(హి) తమలపాకుల
పెట్టె, پن چکی పన్-చక్కీ(హి)జలయం
త్రము, నీళ్ల ప్రవాహముయొక్క సహాయ
మున నడచు యంత్రము پن کال పన్-కాల్
(హి) అతివృష్టి; پن کٹی పన్-కట్టీ (హి)
తాంబూలపు రోలు پن ڈبی పన్-డబ్బీ
(హి)నీటిబాతు|پن کپڑا పన్-కప్డా(హి)
తడిపేలిక پن گھٹ పన్-ఘట్ (హి)జలాశయ
ము, బావి మొ॥ پن بھتا పన్-భత్తా (హి)
జావ, మెత్తగానైనఅన్నము, నీళ్లతోనున్న
అన్నము,

پنا పన్నా(హి. పు)పచ్చరాయి;అపరంజి రేకు;
రేకు,తగడు;పానకము, చెప్పుపైభాగము.

پنا పున్నా(హి)మాసించుట,నిందించుట.

پنا పిన్నా(హి)పంబకొట్టుట; ఏకుట;దారపు
కండె,ఉండ,పింజము.

پنا పన్నా (హి) వెడలుపు,నెరవు.

پنا పనా(హి)మాడు پن ప్రత్యయార్థకము.

پناہ పనాహ్(పా. స్త్రీ)శరణము,ఆశ్రయము;
ఆను, బలుసు; నీడ. پناہ گاہ పనా-గాహ్
(పా)శరణాలయము پناہ گیر పనా-గీర్(పా)
శరణుజొచ్చినవాడు|پناہ لینا పనా-లేనా(ఉ)
శరణు జొచ్చుట. (అభయము.

پناہی పనాహీ(పా) శరణము, రక్షణము,

پنبہ పంబ (పా. పు)పంబ,పత్తి,దూది.
پنبہ بگوش పంబ-బగోష్(పా) పెడచెవినిపె
ట్టువాడు,చెవిటివాడు. پنبہ دوز పంబ-దో
జ్ (పా) ప్రాతబట్టలుకుట్టువాడు.
پنبہ دہن పంబ-దహన్ (పా) మితభాషి.

پنبئی పంబయీ(పా. స్త్రీ) దూదిలేకపత్తి
వేసికుట్టినది. پنبئی راوتی పంబయీ-రావటీ
(ఉ)చలువగుడారము.

پنپانا పన్పానా (హి) అభివృద్ధిచేయుట,
తేర్చుట,బలపరచుట,బాగుపరచుట.

پنپنا పనప్నా(హి)అభివృద్ధియగుట; తేజరి
ల్లుట,రెక్కనుట, బలపడుట, బలియుట,
బాగుపడుట. (త్రము.

پنتھ పంథ్ (హి. పు) పంథము, త్రోవ, మ

پنتھی పంథీ (హి. పు) తెరువరి, మతస్థుడు.
پنتھی پورنا పంథీ-పోర్నా (హి. పు) ప
ద్మాసనము.

پنج పంజ్(పా)పంచ,అయిదు, అయిదేండ్ల
గుఱ్ఱము. پنج تن పంజ్-తన్ (పా) మహమ్మ
దీయులపంచమహాపురుషులు, మహమ్మదు-
అలి-ఫాత్మా-హాసను-హుసేనుగార్లు.
پنج آیت పంజ్-అయత్ (పా) అపరమునకు
(ఫాతెహాలో)చదువుకొరానువరీపుయొక్క
అనువాకపంచకము. پنج شاخ పంజ్-షాఖ
(పా)పంజాయి,పంజు (దివిటీ), పంచశాఖ
ము. پنج نوبت పంజ్-నౌబత్ (పా) పంచ
ఘటికము,పంచవాద్యములు,అయిదు వేళల
నగారా లేక సమాజు. پنج عیب పంజ్-ఐబ్

(పా) పంచదోషములు, అయిదుదోషము లోపలగుట్టము, పంచమహాపాతకములు

پنج شنبہ పంజ్ శంబ(పా)గురువారము.

پنجر పంజర్(హి పు)అస్థిపంజరము, పట్టము, పంజరము.

پنجرہ పింజ్ర[హిపు]పంజరము; దేహము.

پنجری పింజ్రీ (హి.స్త్రీ) చిన్న పంజరము. శవవాహనము. (లు వెలకిలపడినపంజరము.

پنجڑی పంజ్ డీ(హి.స్త్రీ) అయిదుగవ్వ

پنجم పంజుమ్(పా) అయిదవ, పంచమము.

پنجنا పంజ్నా(హి)అతుకుపడుట, టంక ముచేమాటుపడుట, అతుకుట.

پنجہ పంజ(పాపు)వ్రేళ్లతోగూడినఅరచేయి, అయిదు, పంజాయి, చపేటము, పంచశాఖము, అయిదువ్రేళ్లు, పిడికిలి, పట్టు, పిడి. (దివిటీ.

پنجی పంజీ(పా.స్త్రీ) పంజాయి; పంజు;

پنجیرا పంజేరా (హి.పు) కంచరివాడు, పాత్రలకుమాటు వేయువాడు; రేకుపనులవాడు టంకముపనివాడు(టిన్ గరువాడు).

پنجیارا పింజ్యారా (హి.పు) దూదేకుల వాడు. (ము; సీమంతపుసారె.

پنجیری పంజేరీ(హి.స్త్రీ) బాలింత కాయ

پنچ పంచ్ (హి)పంచ, అయిదు; పంచాయితి దారుడు, పంచుడు; మధ్యస్థుడు, న్యాయాధి కారి; పెద్ద; వింటివారి; پنچ پاتر-పాత్ర్ (హి)పంచపాత్రము, పంచలోహములపాత్ర

پنچ کوکی پیالی పంచోకాప్యాల(హి) హుక్కా, గుడుగుడీ,

پنچانوے పంచాన్వే(హి) తొంబదియైదు.

پنچاون పంచావన్ (హి)ఏబదియైదు.

پنچایت పంచాయత్ (హి.స్త్రీ) పంచాయితి; న్యాయసభ; గుంపు; అల్లరి, గంద్రగో ళము. پنچایت نامہ-పంచాయత్-నామ (ఉ) పంచులతీర్పు.

پنچکی పన్ చక్కీ-(హి.స్త్రీ)జలయంత్రము.

پنچمی పంచమీ(హి.స్త్రీ) పంచమితిథి.

پنچھالا-پنچھالی పన్ ఛాల-లా (హిపు) గాలి పడగయొక్కతోక, వెంటతగులు వాడు.

پنچھی పంఛీ (హి.పు)పక్షి, తిరుగుబోతు.

پند పంద్(పా.పు)బోధ, శిక్ష, బుద్ధిచెప్పుట, నీతి, ఉపదేశము. (వైదు.

پندرہ పంద్రహ్ (పా.పు) పదునేను, పదు

پندھرواڑا పంధర్వాడా(హి.పు)పక్షము, పదునైదుదినములకాలము.

پنڈ పిండ్ (హి.పు) పిండము, ముద్ద, బంతి. پنڈ پڑنا-పిండ్-పడ్నా (హి) వెంటతగులు ట, పాలబడుట. پنڈ روگ-రోగ్ (హి) క్షయరోగము, కుష్ఠురోగము.

پنڈا పిండా (హి.పు) పిండము, ఉండ, దేహము. (పురోహితుడు.

پنڈا పండా(హి.పు)అర్చకుడు; బుద్ధి, తెలివి;

پنڈارا పిండారా (హి.పు) పిండారివాడు తెరవాటుగాడు, త్రోవలుకొట్టుదొంగ.

پنڈال పండాల్ (హి.పు)చొప్పరము, గుడార ము.

پنڈالو పిండాలూ (హి.పు) కెంపెలము.

پنڈبا పన్ డబ్బా(హి.పు)నీరుకోడి, నీళ్లలో మునుగువాడు.

پنڈت పండిత్ (హి.పు)పండితుడు.

پنڈتائی పండితాయీ(హి.స్త్రీ) పాండి త్యము.

پنڈلی పిండ్లీ (హి.స్త్రీ)పిక్క; కాలు.

پنڈو పండూ(హి.పు) షండుడు.

**پنڈول** పిండోల్(హి. స్త్రీ) తెల్లమట్టి,చౌడు

**پنڈی** పిండీ(హి. స్త్రీ)ఉండ, పిండము; నులకఉండ;శివలింగము; వేదిక,బలిపీఠము;

**پنس** పిన్స్ (హి. స్త్రీ)పాలకి,డోలిక.

**پنساری** పన్సారీ(హి.పు)-చిల్లరకోమటి,దినుసులమ్మువాడు,మందులవాడు, బుక్కావాడు.

**پنسارہٹا** పన్సార్‌హట్టా(హి.పు) -చిల్లర అంగళ్లవీధి, మందులఅంగళ్లు, బుక్కాఅంగళ్లు.

**پنسال-پنسالا** పన్సాల్-లా(హి.పు)చలిపందిరి, బాటసారులకు నీళ్లు ఇచ్చుచోటు.

**پنسوئی** పన్సోయీ (హి. స్త్రీ) చిన్నపడవ,దోనె.

**پنسیری** పన్సేరీ[హి స్త్రీ]వీసెడు,తక్కెడు

**پنشن** పెన్షన్[ఇం.స్త్రీ] ఉపకారవేతనము,భరణము,తౌజీ, ఉచితముగానిచ్చుజీతము.

**پنکال-پنیاکال** పన్‌కాల్ — పన్యాకాల్ [హి.పు] అతివృష్టి, మిక్కిలి వానలుకురియుటవలన కలిగిన కరువు. (రోలు.

**پنکٹی** పన్‌కట్టీ [హి. స్త్రీ]తాంబూలపు

**پنکھ** పంఖ్ (హి.పు)పక్షము,రెక్క,ఈక.

**پنکھا** పంఖా (హి.పు)విసనకఱ్ఱ.

**پنکھڑی** పంఖ్‌డీ (హి. స్త్రీ) పూరేకు,బండి చక్రముయొక్క ఆకు.

**پنکھیا** పంఖియా (హి.పు) చిన్న విసనకఱ్ఱ,విసనకఱ్ఱతో విసరి బిచ్చమడుగు పకీరు.

**پنگا** పింగా(హి.పు) దొడ్డికాళ్లవాడు,కుంటి,-వంకరదైన, దుర్బలమైన,కోమలమైన.

**پنگت-پنگتی** పంగత్-పంగ్‌తీ(హి. స్త్రీ) పంక్తి,చాలు, వరుస, బారు;కులము.

**پنگورا-پنگھورا** పింగోరా-ఘోరా (హి.పు) తొట్లి, ఉయ్యాల.

**پنگھٹ** పణ్‌ఘట్ (హి.పు)నీళ్లరేవు,బావిఘట్టము; రేవు.

**پنواڑا** పంవాడా(హి.పు)గాథ,సుద్ది,కథ.

**پنواڑی** పన్వాడీ(హి.పు) ఆకుతోట,తమలపాకులవాడు.

**پنوانا** పిన్వానా (హి)పత్తి ఏకించుట.

**پنہا** పణ్‌హా [హి] వెడలుపు,నెరపు.

**پنہاں** పిణ్‌హాం(పా)గుప్తము-దాగిన, మరుగైన,రహస్యమైన.

**پنہانا** పిణ్‌హానా (హి) తొడిగించుట,కట్టించుట, ధరింపజేయుట.

**پنہی** పణ్‌హి [హి. స్త్రీ] చెప్పు,పాదరక్షు.

**پنی** పన్నీ (హి. స్త్రీ) పన్ని, సన్నతగడు,మిగుల సన్ననిరేకు, పొర.

**پنی** పిన్నీ (హి. స్త్రీ) బియ్యపు పిండిలో బెల్లము కలిపి చేసిన ఉండలు.

**پنیا** పన్యా (హి)నీటి,నీళ్లలోనుండు.

**پنیالا** పన్యాలా(హి)నీటివన్నె లేక రుచిగల,చప్పని;ఫలవిశేషము.

**پنیانا** పన్యానా[హి]తడియుట,తడుపుట-నీరు తీయుట, నీరుకట్టుట.

**پنیائی** పున్యాయీ[హి. స్త్రీ] పుణ్యఫలము,సంతానము.

**پنیر** పనియర్[ఇం.పు] పసిబట్టువేటకుక్క.

**پنیر** పనీర్ [పా.పు]జున్ను పాలజున్ను,

**پنیر مایہ** -మాయ [పా] పశువుల పిల్లల కడుపులో చేరిన పాలు.

**پنیری** పనేరి[హి. స్త్రీ]జున్నుతో చేసిన;చెట్ల నారు, చిన్న మొలకలు.

**پنیلا** పనీలా [హి] నీటి, నీరుగల.

**پو** పొ [హి. స్త్రీ]ఉదయము,వేకువ; చలి

పందిరి, నీళ్లియిచ్చుచోటు; పచ్చీసు ఆట లోని పావు ۱۲ پوبارہ —బారహ్ [హి] కల్యాణము, వృద్ధి, గెలుపు پوپھٹنا —పూ-ఫట్నా (హి) ఉదయమగుట, తెల్లవారుట.

پوا పవ్వా [హి.పు] పావు, పావుసేరు,పావు సేరు కొలతపాత్ర లేక తూనిక.

پوآ పుఆ [హి.పు] అరిసెలు.

پوآ పోఆ [హి.పు] పాము పిల్ల,ఒకగడ్డి,

پواج పవాజ్ [ఉ.పు] పాపరులు, దుర్మార్గులు. (కసవు, పూరి.

پوآل-پوآر పుఆల్-ర్ [హి.స్త్రీ] గడ్డి

پوائی పవాయీ [హి.స్త్రీ] ఒంటికాలి చెప్పు, కాలి గొలుసు,

پوپلا పోప్లా [హి] బోసినోటి, బోసినోటి వాడు, బోకి,పండ్లూడిన.

پوٹ-پوٹھ పోట్-ఠ్ [హి.స్త్రీ] నల్లులు, గాజుపూసలు, నీలాలు;పందెము, వంతు; తడవ, తేప; కట్టుబడి, పన్ను;

پوت పూత్ [హి.పు] పుత్రుడు.

پوتا పోతా (హి.పు) మనుమడు,పౌత్రుడు;సున్నము వేయు పిడప లేక కుంచె.

پوتا పోతా [హి.పు] అలుకుచుట్ట, కూర్చను కుంచె కట్ట; పన్ను-కట్టుబడి;

پوت بہو పూత్ బహూ [హి.స్త్రీ] కొడుకుకోడలు, మనుమనిభార్య.

پوتر పవిత్తర్ [హి] పవిత్రమైన,

پوترا పోత్‌డా [హి.పు] పొత్తి, గుడ్డ.

پوتڑوںکے امیر-رئیس పోత్‌డోంకె అమీర్- రయీస్ [ఉ] పుట్టు దొర,పుట్టుభోగి, కులీనుడు.

پوتنا పూత్నా [హి] శుద్ధిచేయుట,అలుకుట, పూయుట.

پوت పోత [హి] వృషణములు.

پوتھا-پوتھی పోథా-థీ [హి] గ్రంథము, పుస్తకము; ఉల్లిపాయ, పాయ.

پوتھیا పోథియా [హి.పు] పొగాకు సంచి, అడపము. (కొడుకు బిడ్డ.

پوتی పోతీ [హి.స్త్రీ] పౌత్రి,మనుమరాలు,

پوٹ పోట్ [హి.పు] మూట, ముల్లె; కట్ట; కుప్ప, గోగు,సమృద్ధి,విస్తారము;కాకితపు అంచు;శవముపై కప్పు బట్ట;కొమ్మ లేక నీళ్లుపోవు నాళము.

پوٹا పోటా (హి.పు) కనురెప్ప; కడుపు; పొట్ట; ఎగుబోత, రెక్కలురానిపక్షి పిల్ల; సామర్థ్యము;పిల్లలు.

پوٹلا పోట్లా (హి పు) పెద్దమూట, మోపు.

پوٹلی పోట్లీ (హి.స్త్రీ) ముల్లె,సంచి,మూట.

پوجا పూజా (హి.స్త్రీ) పూజ, ఆరగింపు, నైవేద్యము. (پجاری

پوجاری పూజారీ (హి.పు) చూడు

پوجن పూజన్ (హి.పు) పూజనము,పూజ.

پوجنا పూజ్నా (హి) పూజించుట,తృప్తియగుట,నిండుట.

پوچ పూచ్ (పా) అసత్యము, అల్పము, తుచ్ఛము.

پوچھ పూఛ్ (హి.స్త్రీ) పృచ్ఛ,అడుగుట; విచారణ;లక్ష్యము, మర్యాద; ఆగత్యము, అక్కర; پوچھ پاچھ పూఛ్—పాఛ్ (హి) విచారణ,విమర్శన.

پوچھا పూఛా(హి.స్త్రీ) ప్రశ్న, సగినము, అడుగుట.

پوچھن పూఛన్ (హి) లక్ష్యము,పిలుపు, ఆదరసత్కారము; ప్రశ్నఅడుగుట, ప్రశ్నఫలము,శకునఫలము.

پوچھن పోఛన్ (హి) తుడిచినపీలిక; మిగులు, చుష్టు చెత్త. (ట్టుట,విచారించుట.
پوچھنا పూఛ్నా (హి) అడుగుట,లక్ష్యపె
پوچھنا పోఛ్నా (హి) తుడుచుట, శుభ్రపరచుట.
پود ఫూద్ (ఫా.స్త్రీ)గిట్ట, గొరిజ,ఖురము.
پود పౌద్(హి.స్త్రీ)చిన్నచెట్టు, మొలక,నారు;వంశము,సంతానము.
پودا పౌదా(హి.పు) చిన్నచెట్టు, మొలక, పక్షుల మెడలోకట్టు పట్టుకుచ్చు; పాప, పిల్ల, (ములుపరికించువాడు.
پودار పోద్దార్(ఫా.పు)పరిక్షకుడు,నాణె
پودنا పోద్నా(హి.పు)మరుగుజ్జు, పొట్టివాడు,ఒకపిట్ట.
پودینہ పోదీన (ఫా.పు) ఈగఎంగిలికూర.
پور పోర్ (హి.స్త్రీ) వ్రేలిగణుపు;చెరకు మొదలైనవానిగణుపు. (ర్ణము, నిండినది.
پور పూర్(ఫా.పు) పురము;గ్రామము,పూ
پور పూర్(హి.పు)కొడుకు.
پورا పూరా (హి)పూర్ణమైన, నిండిన;సరియైన,ఈడేరిన;కడతేరిన; తుదముట్టిన,ముగిసిన, ప్రవీణుడైన;నెగ్గిన, చాలినంత, పూర్తిగా, సరిగా, నిండ, అంతయు, సాంతము.
پورا ڈالنا పూరా-డాల్నా(హి) ముగించుట. పూర్తిచేయుట(پورا پڑنا పూరా-పడ్నా(హి) చాలుట,ముగియుట;నెరవేరుట.
پورب పూరబ్(హి పు)పూర్వము, తూర్పు గంగానదియొక్క తూర్పుననుండు దేశము.
پوربی పూరబీ (హి) పౌర్వాత్యుడు, తూర్పుదేశస్థుడు, తూర్పు సం॥; ఒకరాగము.
پوربیا పూర్బియా(హి పు) పౌర్వాత్యుడు తూర్పుదేశస్థుడు.
پورن పూరన్ (హి) పూర్ణము, అంత.
پورنا పూర్నా (హి) నిండుట, అల్లుట.
پورن ماسی పూరన్‌మాసీ (హి.స్త్రీ) పూర్ణమాసి,పూర్ణిమ. (సం॥
پوروا పూర్వా(హి) తూర్పుగాలి. తూర్పు
پوره పూర(ఉ.పు)పురము,పల్లె.
پوری పూరీ(హి.స్త్రీ)పర్వము,గణుపు, చెరకు మొ॥వానిగణుపు, భాగము, పిష్టకము, గోధుమపప్పు,పూరిక.
پوری పూరీ(హి.స్త్రీ) సాంతము, అంత, నిండ; గోధుమపూరి, నేతిలోకాల్చిన అపూపము. (యువేసిచేసినపక్వాన్నము.
پوڑا పూడా(హి.పు) రవయు ఖండచక్కెర
پوزش పోజిష్(ఫా స్త్రీ)క్షమాపణ.
پوزمال పోజ్‌మాల్ (ఫా.పు) ఉచ్చుపగ్గము, గుఱ్ఱపుపెదవికి కట్టిపట్టుకొనిపోవు త్రాడు. (దవి.
پوزه పూజ (ఫా.పు) ఓష్ఠ్రము, గుఱ్ఱపుపె
پوزی పూజీ(ఫా.పు)గుఱ్ఱపుసామానులోనొకటి,ముఖపట్టి.
پوس పూస్(హి.పు)పుష్యమాసము.
پوست పోస్త్(ఫా.పు)పొట్టు,చెక్క, తాట,తోలు, కాయ, గసగసాలకాయలేక గుల్ల. پوست کنده పోస్త-కండ (ఫా) స్పష్టముగా,నిర్దాక్షిణ్యముగా.
پوستی పోస్తీ (ఫా.పు) గసగసాలతోలు కలిపిత్రాగిమత్తుగొనువాడు, బుద్ధిహీనుడు,
پوستین పోస్తీన్(ఫా.పు)తోలుకూసము, తోలుఅంగీ, వెండ్రుకలుతీయనితోలుతో కుట్టినదుస్తు. (అంచెలచావడి,
پوست آفیس పోస్ట్ఆఫీస్ (ఇం.పు)
پوسنا పోస్నా (హి.పు) పోషించుట, పెంచుట.

**پوسیرا** పాసేరా (హి. పు) పావుసేరురాయి.

**پوشاک** పోషాక్ (పా. స్త్రీ) ఉడుపు, దుస్తు, బట్టలు, వస్త్రాలంకారము. (విప్పుట.

**پوشاک بڑھانا**- పోషాక్ బఢానా (ఉ) బట్టలు

**پوشش** పోషిష్ (పా. స్త్రీ) ఉడుపు, దుస్తు; గవిసెన, ఖాసము, తొడుగు, బట్టలు, మూత, కప్పు

**پوشیدگی** పోషీద్గీ (పా. స్త్రీ) గోపనము, మరుగు, రహస్యము, గుట్టు, దాపరికము.

**پوشیدہ** పోషీద (పా) గుప్తమైన; రహస్యమైన, తెలియని; మూయబడిన.

**پوکھر** పోఖర్ (పా) పుష్కరము, కొలను; అజ్మీరునకు దరిపుపద్ది తీర్థవిశేషము.

**پولا** పూలా (హి. స్త్రీ) కట్ట, పిడికిటికట్ట.

**پولا** పోలా (హి. పు) మృదువైన, తేలికైన, బోలు, బుఱ్ఱ, లొట్ట, శూన్యము.

**پولاد** పొలాద్ (పా. పు) ఉక్కు, గట్టియైన, దృఢమైన, దిట్టమైన.

**پولس** పోలిస్ (ఇం. పు) పురకాపరిదండు, గ్రామరక్షకులు, రక్షకభటులు. (కట్ట.

**پولی** పూలీ (హి. స్త్రీ) పిడికిటికట్ట, చిన్న

**پولی** పౌలీ (హి. స్త్రీ) ద్వారము, కడప.

**پون** పౌన్ (హి) ముప్పాతిక, ముక్కాలు, పాతికతక్కువ. (ప్పుడు.

**پون** పూఁ (హి. స్త్రీ) అపానవాయువు, చ

**پون** పోఁ (హి. స్త్రీ) బూరగచప్పుడు.

**پون** పౌన్ (హి. స్త్రీ) గాలి, ఊపిరి; భూతము; దయ్యము.

**پونا** పౌనా (హి. పు) ముక్కాలుఎక్కము, ముక్కాలుఎరుసు; జల్లిగంటె, ముప్పాతిక.

**پونا** పౌనా (హి) కూర్చుట, దూర్చుట; వండుట

**پون ٹوٹی** పౌన్‌టూటీ (ఇం. స్త్రీ) గ్రామ సుంకము; ఊరికివచ్చుసరకుల మీద గొను సుంకము.

**پونجی** పూంజీ (హి. స్త్రీ) పుంజి, పుంజము, మూలధనము, భండారము, పెట్టుబడి, ఆస్తి; ద్రవ్యము, శక్తి. (లేకఎరుసు.

**پونچا** పౌంచా (హి. పు) అయిదున్నరఎక్కము

**پونچھ** పూంచ్ (హి. స్త్రీ) పుచ్ఛము, తోక; ఎల్లప్పుడు వెంటతగిలియుండువాడు.

**پونچھڑی** పూంఛ్‌డీ (హి. స్త్రీ) చిన్నతోక; కాలువలోవరదకుముందు గావచ్చునీరు.

**پونچھن** పూంఛన్ (హి. స్త్రీ) తుడిచిపారవేసినది, చెత్త, చెదారము.

**پونچھنا** పోంఛ్నా (హి) చూడు **پوچھنا** పోఛ్నా. (రుసు.

**پونڈا** పౌండా (హి. పు) ఒకవిధమైనచె

**پون سلائی** పూన్‌సలాయీ (హి స్త్రీ) కదురు, కదురుపుడక, ఏకులకదురు.

**پونگا** పూంగా (హి. పు) వెదురుగణపు; బొంగు, గొట్టము; వట్టిది; బోలుది, పిక్కఎముక; ఒకవిధమైన డోలు; శుంఠుడు.

**پونگی** పూంగి (హి. పు) నాగసరము, జీనుగోవి. **پونگی پھل** పూంగీఫల్ (హి. పు) పూగీఫలము, పోక, పచ్చిపోక.

**پونو-پونوں** పూనూ-నూఁ [హి. స్త్రీ] పూర్ణిమ, పున్నము.

**پونی** పూని [హి. స్త్రీ] ఏకు, పింజక.

**پونیا** పౌనియా (ఉ. పు) ముప్పాతిక, వెడల్పులేకపొడుగలబట్టరేకు (థాను)

**پوہ** పౌహ్ (హి. పు) చలిపందిరి, బాటసారులకు నీళ్లుత్రాగనిచ్చుచోటు.

**پوئیا-پوئیہ** పోయ్యా-పోయ (ఉ. పు) రేచితము, పరుగు; వేగముగాపోవుట (గుఱ్ఱము).

**پے** పె (ఉ)మీద,పైన; అయినను,చూడు **پر**

**پھاٹ** ఫాట్ (హి.పు) వెడలుపు,భాగము.

**پھاٹک** ఫాటక్(హి.పు)గవను, ద్వారను;నిర్బంధము; ఆటంకము; ఆవరణము,బందె, కట్టు, **پھاٹک دار** -దార్ (హి) ద్వారపాలకుడు,కావలివాడు.

**پُھہار** ఫుహార్(హి.స్త్రీ)తుషారము, తుంపరలు;సన్ననిచుక్కలపట్టుబట్టు.

**پہاڑ** పహాడ్ (హి.పు)కొండ, గుట్ట,కష్టము. **پہاڑ گزرنا** -గుజర్నా(ఉ) కష్టముగా తోచుట. **پھاڑ والی** -వాలీ(హి.స్త్రీ) స్ఫోటకము.

**پھاڑ** ఫాడ్ (హి.పు) చినుగు, పగులు, **پھاڑ کھاو** -ఖావ్ (హి) క్రూరమృగము, క్రూరుడు.

**پہاڑا** పహాడా (హి.పు) ఎక్కము,ఎదుసు.

**پھاڑنا** ఫాడ్నా(హి)చీల్చుట,చించుట, విరచుట, తెరచుట.

**پہاڑی** పహాడీ(హి) కొండసం॥,పర్వతపు; కొండచెంచువారు, గుట్ట, చిన్నకొండ; **پہاڑی کوا** -కవ్వా(హి) కొండకాకి.

**پھاگ** ఫాగ్ (హి.పు) హోలీసమయ, ఆటపాటలు,ఆనందము, సౌఖ్యము.

**پھاگن** ఫాగున్ (హి.పు) ఫాల్గునమాసము.

**پھال** ఫాల్(హి.స్త్రీ)నాగటికఱ్ఱు;పచ్చిపోక

**پھالسا** ఫాల్సా (హి.పు) నీలిరేగు,ఫాల్సపండు.

**پھالی** ఫాలీ [హి.స్త్రీ]కఱ్ఱు.

**پھاند** ఫాంద్[హి.పు]ఉరి,ఉచ్చు,వల; దూకు,గంతు, దాటు; చిక్కు,

**پھاند مارنا** -మార్నా[హి] వల లేక ఉరివేసిపట్టుకొనుట.

**پھاندنا** ఫాంద్నా[హి]దూకుట, గంతువేయుట, వలలోచిక్కవేయుట, ఉరివేయుట,ఇరికించుట, ఆడపశువుపై మొగపశువుదాటుట.

**پھاندی** ఫాందీ [హి.స్త్రీ] చెరుకుల మోపు[నూరులేక ఎబదిచెఱుకులది]

**پھانس** ఫాంస్[హి.పు] చీలిక,పుల్ల,ముల్లు.

**پھانسا** ఫాంసా[హి.పు] ఉరి,ఉచ్చు, వల్లెత్రాడు;సంకటము,బాధ,చిక్కు.

**پھانسنا** ఫాంస్నా [హి] ఉరివేయుట, చిక్కులోపడవేయుట,ఇరికించుట, మోసముచేయుట.

**پھانسی** ఫాంసీ[హి.స్త్రీ]ఉరి,ఉరిత్రాడు, వల్లెత్రాడు, ఉరిదండన. **پھانسی دینا** -దేనా[హి]ఉరితీయుట.

**پھانک** ఫాంక్ [హి.స్త్రీ] తొన, నిమ్మపండుమొ॥నానితొళ; చీలిక,బద్ద, తునక; బుక్క,బుక్కెడు,నోటినిండ.

**پھانکڑا** ఫాంక్డా(హి.పు)సొగసుగాడు; బలిష్ఠుడు;ధైర్యశాలి,గారుడు.

**پھانکنا** ఫాంక్నా(హి)బొక్కుట, ఆత్రముతోతినుట; త్వరగా నడచుట లేక మాటలాడుట; అతిక్రయముచేయుట; బద్దలుగా చీల్చుట,

**پھانکی** ఫాంకీ[హి.స్త్రీ] చూడు **پھانک**

**پھاو** ఫావ్ (హి.పు)కొసరు, కొన్నదానిపై ఉచితముగానిచ్చునది.

**پھاوڑا** ఫావ్డా[హి.పు]పార,బొరిగె,పారచిప్ప,తొల్లిక. **پھاوڑا بجانا** -బజానా[హి]పాడుచేయుట, కూలగొట్టుట.

**پھاوڑی** ఫావ్డీ [హి.స్త్రీ)] చిన్నపార; తొల్లిక; మోగదండము.

**پھاہا** పాహా-ఫాహా-యా [హి.పు] దూది

పింజ;పత్తిపాయ;యందుపీలిక,పట్టునుందు పూసినపీలిక.

**پھب** ఫబ్[హి.స్త్రీ]అలంకారము, అందము.

**پھبتا** ఫబ్తా [హి]అందమైన,అగ్రమైన, ఒప్పిదమైన,పొంకమగు,రాణించు.

**پھبتی** ఫబ్తీ[హి.స్త్రీ] అలంకారము, సింగారము;అపహాస్యము,ఎగతాళి.

**پھپکنا-پھبکنا-پھبدنا** ఫబద్నా-ఫబక్నా-ఫపక్నా[హి]ఉప్పతిలుట,మొలచుట,ఉబుకుట,కొన్నరిలుట,ప్రసరించుట, అంకురించుట, తేజరిల్లుట, వృద్ధియగుట, పైకివచ్చుట, లావగుట.

**پھبن** ఫబన్[హి.స్త్రీ] అలంకారము, అందము,ఒప్పిదము,రాణింపు,పొందుపాటు.

**پھبنا** ఫబ్నా[హి]ఒప్పిదమగుట, రాణించుట,తగుట,అలంకారముగానుండుట.

**پھپا** ఫుప్పా[హి.పు] మేనత్తమగడు,మామ,

**پھپٹ** ఫపట్[హి.పు]ఛలము, మోసము, లొల్లి. (ట,చీముపోయుట.

**پھپدنا** ఫపద్నా[హి] ముదురుగుట, పొంగు

**پھپس** ఫప్పస్[హి] ఊరిన,ఉబ్బిన, లావైన,బలిసిన, బొద్దుగానుబోలుగాను ఉండు పండు,రుచిహీనమైన;చప్పని.

**پھپکا-پھپولا** ఫప్కా-ఫపోలా [హి.పు] బొబ్బ,పొక్కు;పుండు.

**پھپکار** ఫప్కార్ [హి] బుస,పాముబుస, పూత్కారము. (ట,బూజుపట్టుట.

**پھپوندنا** ఫపోంద్నా [హి] బూదువారు

**پھپوندی** ఫపోందీ [హి.స్త్రీ] బూదు, బూజు.

**پھپوندی لگی** ఫపోందీలగీ [హి.స్త్రీ] పాచిపడ్డది.

**پھپھی-پھوپھی** ఫుప్పీ-ఫీ [హి.స్త్రీ]మేనత్త, తండ్రితోబుట్టువు. (తోబుట్టినది.

**پھپیاساس** ఫుప్యాసాస్[హి.స్త్రీ]మామ

**پھپیاسسرا** ఫుప్యాసుస్రా[హి.పు] మామ తోడబుట్టినదానిమగడు;భర్తయొక్క మేనత్తమగడు.

**پھپیرا-پھپیری** ఫుపేరా-రీ (హి) మేనత్తకుపుట్టిన, **پھپیرا بھائی** -భాయీ (హి)మేనత్తకొడుకు,మేనబావలేకమరది.

**پھپیری بہن** -బహిన్ (హి) మేనత్తకూతురు,మేనవదినెలేకమరదలు.

**پھٹ** ఫిట్ (హి)ధిక్కారము,ఛీకొట్టు,ఛీఛీ! ఛూఛూ! (పగులు.

**پھٹا** ఫటా[హి]చినిగిన;పగిలిన (పు).చినుగు,

**پھٹک** ఫటిక్(హి.పు)స్ఫటికము.

**پھٹکار** ఫిట్కార్[హి.స్త్రీ] ధిక్కారము, ఛీకొట్టు;శాపము; మిశ్రణము, కలపడము; చల్లుట,గుప్పుట;

**پھٹکار** ఫట్కార్ (హి.స్త్రీ) నటాలు లేక పటాలు మనుశబ్దము, కొరడాదెబ్బలచప్పుడు.

**پھٹکارنا** ఫిట్కార్నా [హి] ధిక్కరించుట, ఛీకొట్టుట; శపించుట;గుప్పుట,కలుపుట.

**پھٹکارنا** ఫట్కార్నా (హి) కొరడాదెబ్బలుకొట్టుట; ఉతుకుట; సంపాదించుట,విదిలించుట,ఝాడించుట. (రము.

**پھٹکری** ఫిటకరీ (హి.స్త్రీ) పటిక,పటికా

**پھٹکل** ఫుట్కల్(హి)విడి, ఒంటిరి,వేరైన, జతమాలిన,బేసి; చిల్లర, పావలాలుబేడలు మొ|| (పొల్లు.

**پھٹکن** ఫట్కన్[హి.స్త్రీ]ఊముక,పొట్టు

پھٹکنا ఫటక్నా (హి) చెరుగుట; వేరుచేయుట;దులుపుట;తటాలునవచ్చుట, మరచి తప్పులపోవుట.

پھٹکی ఫుటక్కీ(హి.స్త్రీ)ముడి, గ్రంధి, మచ్చ,మరక; పిండిమొదలైనవి నీటిలో కలపగా కలుగు ఉండలు,పిప్పి, ముద్ద; ఒక చిన్న పిట్ట,లిక్కు జట్టిపిట్ట.

پھٹکی ఫటక్కీ (హి.స్త్రీ) మిడివిల్లు,ఉరులు,వల; పేళ్లపంజరము;బోయబుట్ట, పక్షులనుపట్టివేయునది.

پھٹنا ఫట్నా(హి)పగలుట,చినుగుట; చీలుట;చెదరుట,చిందుట,వీడుట; పులియుట, విసుగుట,రోతపడుట,విరుగుట.

پھٹیل ఫుటైల్ (హి) చూడు. پھٹکل

پہچان పహెచాన్ (హి.స్త్రీ) గుర్తు, ఆకళింపు, పరిచయము;జ్ఞప్తి,తెలివి, వివేకము,

پہچاننا పహెచాన్నా (హి) గుర్తించుట, తెలియుట,కనుగొనుట,గుర్తుపట్టుట, వివేచనచేయుట.

پھدپھدانا ఫద్ఫదానా (హి) పిచ్చలించుట,ఉబ్బతిలుట,విస్తరిల్లుట;మురుగుట,పులియుట; చెమటకాయలు మిక్కిలిగాలేచుట; చిగురులుకొమ్మలుమిక్కిలిగలుగుట.

پھدکنا ఫదక్నా (హి) గంతులువేయుట, చెంగనాలుత్రోలుట, ద్రుప్పుట, సంతసించుట.

پھدکی ఫుదక్కీ(హి.స్త్రీ)దూకు, గంతు,దాటు,త్రుళ్లు,ఒకచిన్న పక్షి.

پھڈا ఫిడ్డా (హి) చప్పిడి,అణగిన, పల్లికగానున్న,చదునైన;మడిమలుఅరిగినచెప్పు; ఈడ్చుకాళ్లవాడు.

پھڈا ఫడ్డా(హి.స్త్రీ)కాలిగూడు,(బావిలోదిగుటకుఎక్కుటకుచేసినవి). (ప్పుడు.

پھر ఫుర్(హి.స్త్రీ)బుఱ్ఱు, పక్షులరెక్కలచ

پھر ఫిర్(హి)మరల,మళ్లీ,మగుడి, వెండియు, ఇంక-ఇకమీద,అంతట.

پہر పహర్(హి.పు)ప్రహరము,జాము.

پہرا పహ్రా (హి.పు) ప్రహరము; కావలి, కాపు;యామికుడు, ప్రహరవాడు; కావలివాడు;కాలము,యామము.

پھراٹا ఫర్రాటా(హి.పు)బుఱ్ఱునశబ్దము,తటతటగొట్టుకొనుట, వెదురుతుంట.

پھرانا ఫర్రానా(హి) తటతటకొట్టుకొనుట, అల్లాడుట.

پھرانا ఫిరానా(హి)త్రిప్పుట, గిరగిరత్రిప్పుట,గుడిత్రిప్పుట,విసికించుట.

پہرانا పహ్రానా(హి) తొడిగించుట, ధరింపజేయుట.

پھراو ఫిరావ్(హి.పు)తిరుగుడు, తిరుగుదల, మళ్లుదల,మరలునది, మళ్లునది, ఎరవుగా తెచ్చినది,ఎరవు. (బట్టలు.

پہراوا పహ్రావా (హి.పు) దుస్తు, ఉడుపు,

پھراونی ఫిరావ్నీ (హి.స్త్రీ) పెండ్లికట్నము, పెండ్లి కట్నము లిచ్చుస్త్రీ.

پھرائی ఫిరాయీ(హి.స్త్రీ)తిరుగుదల,మరలయిచ్చుట,తిరుగుదలకూలి.

پھرپھرانا ఫర్ఫరానా (హి) అల్లాడుట, కంపించుట,చలించుట,వణకుట.

پھرپھرانا ఫుర్ఫురానా(హి) గురగురలాడుట,గులగులలాడుట, చెవులో తిరివేయుట. (దడ.

پھرپھری ఫర్ఫరీ (హి.స్త్రీ) కంపము,

پھرپھند ఫర్ఫంద్ (హి.పు) మోసమ్ముతుక్కు,జిత్తు,జగడము,తంటాలు.

پھرت ఫిరత్(హి.స్త్రీ)తిరుగుడు, తిరుగుదల,చలనము,గెల్చునతిరుగుడు,తిరిగియిచ్చి

నదీ, పనికిమాలినది.రంకుదిమిండగానికిచ్చు సొమ్ము,

**پھرتا** ఫిర్ తా (హి.పు) అడితివేతనము,తరుగు, చూడు. پھرا و پھرت

**پھرتی** ఫర్ తీ (హి.స్త్రీ) చురుకుదనము, చాకచక్యము,త్వర,వడి,ఆయత్తత.

**پھرتیلا** ఫర్ తేలా(హి) చురుకుగల,వడిగల, చాకచక్యముగల, నేర్పుగల.

**پھرچا** ఫర్ చా (హి) విముక్తి, తీరుమానము, విమోచనము;విడుదల;పుబ్బువీడుట,స్వచ్ఛమగుట.

**پھرسا** ఫర్ సా(హి.పు)పరశువు,గొడ్డలి.

**پھرکی** ఫిర్ కీ (హి.స్త్రీ)గిరక,పంటెకోల, తిరుగునది.

**پھرنا** ఫిర్నా(హి)తిరుగుట,మరలుట, మరల బడుట,తిరుగుట,విసర్జించుట,భ్రమించుట, తిల్లాడుట, తొలగుట, మలవిసర్జనముచేయుట.

**پہرنا** పహర్నా(హి)తొడుగుట,ధరించుట.

**پھری** ఫరీ (హి) డాలు, వెదురుషేళ్లడాలు.

**پہرےدار** పహేదార్(హి.పు) యామికుడు,ప్రహరీవాడు,కావలివాడు, ద్వారపాలకుడు.

**پھرهرا-پھریرا** ఫరేరా(ఉ.పు) ఎచ్చిపచ్చిగానున్న, బాగాఎండని;ధ్వజము, టెక్కెము,ధ్వజవస్త్రము.

**پھریری** ఫురేరీ(ఉ.స్త్రీ) కంపనము,వణకు, దడ,తత్తర;గుబిలితీయుతిరి,అత్తరుతిరి;

**پھڑ** ఫడ్(హి.స్త్రీ)ద్యూతశాల, పిరంగి (మోయు)బండి,అంగడిపట్టు,పాచిక,బండ్లనుదిగు చోటు,బండినొగ. **پھڑباز** ఫడ్బాజ్(హి.పు) జూదరి,కదరుభోతు.

**پھڑا** ఫడ్డా(హి.పు)కొన్నకట్టు.

**پھڑپھڑانا** ఫడ్ ఫడానా (హి) తటతటకొట్టుకొనుట,రెక్కలుకొట్టుకొనుట, గిజగిజకొట్టుకొనుట,తహతహపడుట,అల్లాడుట.

**پھڑک** ఫడక్(హి.స్త్రీ) తహతహ,అల్లాట, దడ,కలత,గిజగిజలాట, క్షోభము, తత్తర.

**پھڑکانا** ఫడ్కానా(హి)తటతటకొట్టుకొనునట్లుచేయుట,కలతపెట్టుట, క్షోభపెట్టుట, తహతహపెట్టుట.

**پھڑکن** ఫడ్ కన్(హి.స్త్రీ)చూడు.پھڑک

**پھڑکنا** ఫడక్నా (హి) తటతటకొట్టుకొనుట,దడదడపడుట, తహతహపడుట, కలతచెందుట.

**پھڑی** ఫడీ(హి.స్త్రీ) రాళ్లకుప్ప, ఒకగజము ఎత్తుఅంతియె వెడల్పును ముప్పది గజముల పొడుగునుగలరాళ్లతెట్టె.

**پھڑیا** ఫడియా (హి.పు) చిల్లరబేరగాడు, ద్యూతకారకుడు, జూదమాడించువాడు.

**پھڑیا** ఫుడియా(హి.పు)కురుపు,చిన్నపుండు.

**پھس** ఫుస్ (హి.స్త్రీ) తేలికైనచప్పుడు. **پھس پھس**-ఫుస్(హి)గుసగుస, రహస్యము;

**پھس پھسا** ఫుస్ఫుసా (హి) పిసపిస లాడెడు; ఘాటులేని, బలములేని,చప్పని.

**پھسپھسا** ఫస్ఫసా(హి) లసలసలాడెడు, మెత్తని,సడలిన. (లాడుట.

**پھسپھسانا** ఫుస్ఫుసానా (హి) గుసగుస

**پھسپھسانا** ఫిస్ఫిసానా (హి) భయపడుట, గడగడలాడుట; పిసపిసలాడుట.

**پھسڈی** ఫసడ్డీ(హి)వెనుకపడిన, వెనుకటి, కడపటి,పనికిమాలిన,ఓడిన,చాలని.

**پھسکڑا** ఫసక్డా (హి) కాళ్లుబారజాపి కూర్చుండుట,పరచుకొనికూర్చుండుట.

**پھسکنا** ఫసక్నా (హి) దిగబడుట,జారుట, పిటులుట,పగులుట,చిట్లుట.

پھسلانا ఫిస్లానా (హి)జార్చుట,జారించుట, మొగ్గించుట.

پھسلانا ఫుస్లానా (హి) బుజగరించుట, లాలించుట. మోసముచేయుట,ప్రేరేపించుట.

پھسلاؤ-پھسلاوا ఫుస్లావ్—వా (హి.పు) బుదగరింపు,లాలన, మోసము,ప్రేరణ.

پھسلن-پھسلاوا-پھسلاہٹ ఫిస్లన్—ఫిస్లావా—ఫిస్లాహట్ (హి.స్త్రీ) జారుడు, జాఱు,పొరపాటు.దిగజాటు.

پھسلنا ఫిసల్నా (హి) జాఱుట, జఱుగుట, జాఱెడు,జాఱైన,పొరపడుట. (బండ.

پھسلنا پھتر —ఫత్థర్(హి) జారుడు

پھسندا ఫుసండా(హి)దుర్వాసనగల, తెలివిమాలిన.

پھش ఫిష్(హి)-ఛీ,ఛూ.

پھک ఫక్(హి)ధ్వన్యనుకరణము.

پھک دیسی —దేసి (హి) లటుక్కున, తటాలున. (వేయించుట.

پھکارنا ఫకార్నా (హి)తెరచుట, ముసుకు తీయుట, వెల్లడిజేయుట, బిత్తల జేయుట.

پھکانا ఫికానా (హి) పారవేయించుట,

پھکڑ ఫక్కడ్ (హి పు)బూతులు,బండెములు.

پھکڑباز —బాజ్ (ఉ) బూతులమారి, మోటువాడు. (ఉచ్చబుడ్డ.

پھکنا ఫుక్నా (హి.పు) మూత్రాశయము,

پھکنا ఫుక్నా(హి)ఊదబడుట, కాలిపోవుట,తగులబడుట,వృథాయగుట, వ్రయమగుట,మాడుట,మండుట.

پھکنی ఫుక్నీ (హి.స్త్రీ) ఊదుడుగొట్టము, పిసుకుడుతుపాకి.

پھکنی ఫిక్నీ(హి.స్త్రీ)పొడి,చూర్ణము.

پھکیت ఫికైత్ (హి.పు)బడితెసాముచేయువాడు.

پھکیتی ఫికైతీ (హి.స్త్రీ) బడితెసాము.

پھگوا ఫగ్వా(హి.పు)హోలీపండుగ, హోలీ పాట,హోలీబహుమానము.

پہل పహిల్ (హి)ప్రథమము మొదలు,ఆరంభము,ప్రక్క, పక్షము, ప్రత్తిపింజుక, పాతదూది. پہل کرنا పహిల్—కర్నా (హి) మొదలు పెట్టుట,ఆరంభించుట.

پھل ఫల్(హి.పు)ఫలము,పండు,పంట, ప్రాప్తి, సారాంశము, కత్తిఅంచు, కత్తి బద్ద.

پھلدار —దార్ (ఉ)ఫలవంతము,ఫలదాయకము. (మైన,ముఖ్యమైన.

پہلا పహ్లా(హి) ప్రథమము, మొదటి,ఉత్తమ

پھلا ఫలా(హి)ఫలవంతమైన,ఫలించిన,పండ్లుగల,అంచుగల.

پھلا ఫుల్లా(హి.పు) ఉబ్బినది,బుడ్డ, కంటిపూవు, లేక కాయ, వేపుడుగింజలు.

پھلاسرا ఫులాసరా (హి.పు) మోసము, టక్కు,బుజగరింపు,ఇచ్చకములు.

پھلانا ఫులానా (హి.పు) ఉబ్బించుట, ఊరించుట, బలిపించుట, ముఖస్తోత్రముచేయుట. (చంగలింపు, త్రుళ్లు.

پھلانگ ఫలాంగ్ (హి.స్త్రీ)గంతు, దుముకు,

پھلانگنا ఫలాంగ్నా(హి)గంతులువేయుట, చెంగలించుట.

پھلپھلا ఫుల్ఫలా (హి) పుతపుత, లొటలొట, ఉబ్బిన, బోలు,మెత్తని,తుచ్ఛము.

پھلت ఫలత్ (హి.స్త్రీ)కాత,పంట.

پھلجھڑی ఫుల్ఝడీ(హి.స్త్రీ)పూబిరుసులు,కాకరపూబిరుసులు, కొండేలమారియాడుది. (క, శస్త్రధార.

پھلڑا ఫల్డా(హి.పు)కత్తిబద్ద, ఉక్కుతున

پھلکا ఫల్కా(హి.పు)బొబ్బ, పొక్కు, గరడీకాల,ఖురశీకాల.

**پھلکا-پھلکی** ఫుల్కా-కీ (హి) ఉబ్బినలేక పొంగినరొట్టె.

**پھلکاری** ఫుల్కారీ(హి.స్త్రీ)పూలు మొ॥ కుట్టుపని,పూలు మొ॥కుట్టినబట్ట.

**پھلنا** ఫల్నా(హి)ఫలించుట,పండుట,పిచ్చరిల్లుట,వృద్ధియగుట, పొక్కులుపొక్కుట.

**پھلنگ-پھنگ** ఫులంగ్-ఫునంగ్ హి(స్త్రీ)వృక్షకోటరము, చెట్టుకొన, కోటరము,శిఖరము.

**پہلو** పహ్‌లూ(పా.పు) పార్శ్వము, ప్రక్క, భావము,పక్షము,అంచు,వాటము, సమయము,ఒడుపు,సామీప్యము, పొరుగు,జోడు.

**پہلوتہی** పహ్‌లూతహీ(ఉ స్త్రీ)తొలగుట, త్యాగము, విడుచుట, వర్జనము,తప్పించుకొనుట,పరిత్యాగము.

**پھلوا** ఫుల్‌వా(హి.పు)ఒకమంచుబంక.

**پھلوا** ఫల్‌వా(హి.పు) కుచ్చు, అంచు,జాలరుకట్టు.

**پھلواڑی** ఫుల్వాడి (హి.స్త్రీ) పూదోట, పుష్పవాటిక;పిల్లలు,సంతానము.

**پہلوان** పహ్లవాన్ (పా.పు) జెట్టి,మల్లుడు, శూరుడు.

**پہلوانی** పహ్లవానీ(పా.స్త్రీ)మల్లాట, జెట్టిపట్టు, శూరత్వము.

**پہلوٹھا** పహ్‌లౌఠా(హి.పు)లిచూలుబిడ్డ.

**پھلوری** ఫులౌరీ(హి.స్త్రీ)బజ్జీలు.

**پھلی** ఫలీ(హి.స్త్రీ)కాయ, (పైపొట్టు,)గుల్ల,దారపువలయములేకచుట్ట.

**پھلی** ఫుల్లీ(హి,స్త్రీ)కంటిపూవు లేక కాయ, ముక్కుపుడక,చెవికమ్మ.

**پہلے** పహ్‌లే (హి) మొదట, పూర్వము,మునుపు,ముందు,మొదటిది.

**پہلے پہل** పహ్‌లేపహల్(హి) మొట్టమొదట, ముందుముందుగా.

**پھلیل** ఫులేల్ (హి.పు) పూనూనె, వాసనతైలము.

**پھلیند** ఫులింద (హి.పు) నేరేడుపండు.

**پھن** ఫన్ (హి.పు) ఫణము, పాముపడగ.

**پہن** పహన్ (హి.పు) వెడలుపు, నెరవు,విరివి,విస్తారము (పా) తల్లిపాలచేపు.

**پہنا** పహ్‌నా (హి.పు) వెడలుపు, నెరవు,విరివి,విస్తారము. (వేసుకొనుట.

**پہننا** పహన్నా (హి) ధరించుట, తొడగుట,

**پہنانا** పహ్నానా(హి) తొడిగించుట,తొడగుట. (-బట్టలు.

**پہناوا** పహ్నావా(హి.పు) వస్త్రాలంకారము

**پہنائی** పహ్‌నాయీ(హి.స్త్రీ) వెడలుపు, నెరవు,వైశాల్యము.

**پھنپھنانا** ఫన్‌ఫనానా (హి)బుసకొట్టుట,

**پہنچ** పహుంచ్ (హి.స్త్రీ) అందిక,చేరిక, అందుబాటు, ప్రాప్తి, గౌరవ, ఆలోచన, జ్ఞానము. [మణికట్టు.

**پہنچا** పహుంచా (హి.పు) మణిబంధము,

**پہنچانا** పహుంచానా (హి) చేర్చుట,అందించుట, ముట్టించుట, అప్పగించుట,కొంపోవుట.

**پہنچنا** పహుంచ్నా (హి)చేరుట, అందుట, ముట్టుట,తగులుట, తెలియుట,సరిపోవుట.

**پہنچی** పహుంచీ (హి.స్త్రీ) మణిబంధభూషణము,చేకట్టు, (పోంచి)

**پھندا-پھند** ఫంద్-దా (హి.పు) ఉరి, వల,ఉచ్చు,చిక్కు,చెఱ,మోసము.

**پھندانا** ఫందానా (హి) గంతులువేయించుట,దూకులాడించుట.

**پھندنا** ఫుంద్నా (హి.పు) కుచ్చు.

**پھندیت** ఫంద్యైత్ (హి.పు) పెంపుడుజం

**پھوکا** ఫూకా(హి) తేలికైన-చులకని-దుర్బల ము-నిస్సారము.

**پھوکٹ** ఫూకట్(హి) ఉచితమైన-ఊరక వచ్చిన-క్రయములేని-**پھوکٹ میں** ఫూ-మేఁ (హి)ఊరక-ఉచితముగా.

**پھوکڑ** ఫోకడ్(హి)చూడు. **پھوک**

**پھوکل** ఫోకల్ (హి) బోలు-శక్తి-లోతైన ఉత్త;దరిద్రుడు.

**پھوکنا** ఫూక్నా(హి)చూడు.**پھونکنا**

**پھول** ఫూల్(హి.పు)పుష్పము,పువ్వు;మిణు గురు,తెల్లకుష్ఠు; సారాయి;ఋతురక్తము, సంచయముచేసినఎముకలు, మూడవనాడు గోరిమీదపెట్టుపూలు, తెల్లని, తేలికైన, సున్నితము. **پھول پان** ఫూ-పాన్ [హి] మంచిచెడ్డలు,లోపాలోపములు, నిర్వాహ కము,సున్నితము.

**پھولا** ఫోలా[హి.పు]బొగ్గ, పొక్కు; దార పు పుంజము;కంటికాయ; కంటిలోపువ్వు.

**پھولا** ఫూలా[హి.పు]ఉబ్బిన,వాచిన; పూచి న;పుష్పించిన;వాపురోగము.

**پھول کوبی** ఫూల్కోబీ [హి.స్త్రీ] కోసు కూర,పూవుకోసు.

**پھولنا** ఫూల్నా (హి) ఉబ్బుట; ఊరుట, లావెక్కుట, బలియుట; పూయుట, పుష్పించుట; గర్వించుట, సంతసించుట, త్రుళ్లుట, బయలుపడుట, ప్రాప్తినొందుట, వృద్ధియగుట.

**پھونٹ** ఫూఁట్ [హి.స్త్రీ] పండిపగులు దోసకాయ,పుట్టపండు, చూడు. **پھوٹ**

**پھونس** ఫూఁస్[హి.పు]చూడు. **پھوس**

**پھونسڑا** ఫూఁస్డా[హి.పు]చూడు.**پھوسڑا**

**پھونک** ఫూఁక్ [హి.స్త్రీ] ఊదుడు, ఉ చ్ఛ్వాసము,శ్వాస, బుస; ఊపిరి, బోలు; తే లికైన.

**پھونکنا** ఫూఁక్నా(హి)ఊదుట;కాల్చుట,ర గుల్చుట;పెరిరేపించుట; ప్రచురపరచుట; వ్యయపరచుట, కొల్లపెట్టుట;

**پھوہا** ఫోహా (హి.పు) కూదిపింజిక,ఏకు, తునక,దూదిపాయ.

**پھوہار-پھوار** ఫోహార్.(హి.స్త్రీ) చూ డు. **پھار**

**پھوہڑ-پھوڑ** ఫోహడ్-ఫవడ్ (హి) మోటు,పనికిమాలిన, తెలివిమాలిన, పనిరాని యాడుది.

**پھوہی-پھوئی** ఫూయీ-హీ(హి.స్త్రీ) బూజు, బూజు; నేతితేరు; తుంపరలు, తుషారము,

**پھویا** ఫోయా (హి.పు) చూడు. **پھوہا**

**پھوئیاں** ఫోయియాఁ (హి.స్త్రీ) తుషా రము,తుంపరలు,చిన్నచినుకులు.

**پھیپڑا** ఫేప్డా (హి.పు) శ్వాసకోశము, ఊపిరితిత్తి. (వలయము, చుట్టు.

**پھیٹا** ఫేటా(హి.పు)తలగుడ్డ,శిరోవేష్టము.

**پھیٹنا** ఫేట్నా(హి)చాదుట, నుర్దించుట, కలుపుట.

**پھیر** ఫేర్ (హి.పు) త్రిప్పుట, మళ్లుదల, తిరుగుదల, తిరుగుడు,చుట్టు, దూరము;భే దము, మార్పు, వర్తులము, వలయము, ఆ వృత్తి-అంటు-చింత-చిక్కు- సంకటము, టక్కు-మోసము-కష్టము.

**پھیر دینا** ఫేర్-దేనా (హి) తిరిగిఇచ్చుట.

**پھیر لینا** ఫేర్-లేనా(హి)మరలతీసుకొనుట.

**پھیر پھار-پھیر بدل** ఫేర్-ఫార్-బదల్(హి) తారుమారు-మార్పులు.

**پھیرا** ఫేరా [హి.పు] ఆవృత్తి-తిరుగుడు, ప్రదక్షిణము-చుట్టు, వలయము, రాకపోక లు, **پھیری** ఫేరీ(హి)రాకపోక

లు;ఇచ్చిపుచ్చుకోలు; తిరుగుడు, తిర్గాటు; తారుమారు.

پھیرنا ఫేర్నా (హి)త్రిప్పుట, తిరిగియిచ్చుట;మరలించుట;మార్చుట;ఆవృత్తిచేయుట జపించుట; రారుట, పూయుట;అలవాటు;తడవుట;విసికించుట.

پھیری ఫేరీ (హి.స్త్రీ) ప్రదక్షిణము,తిరుగుడు;ఆవృత్తి,పరిచారము.

پھیری والا ఫేరీ-వాలా(హి)వీధివర్తకుడు; వీధులలో తిరిగియమ్మువాడు.

پھیرے ఫేరే(హి.పు)అగ్నిప్రదక్షిణములు, వివాహము. پھیرے پڑنا ఫేరే-పడ్నా(హి) వివాహమగుట.

پھیکا ఫీకా [హి) చప్పని,రుచిలేని;వెలవెలపారు, తెల్లికైన;వివర్ణమైన.

پھیکا پڑنا ఫీకా-పడ్నా (హి) వెలవెలపారుట,సిగ్గుపడుట,చిన్నపోవుట, చప్పనగుట.

پھیلانا ఫైలానా (హి)పఱచుట,విశాలముచేయుట,ప్రసారించుట-చాపుట,పొడిగించుట,విస్తరించుట, విప్పుట, వ్యాపింపచేయుట,వెదచల్లుట,ఆరంభించుట, విమర్శించుట,వెల్లడిజేయుట, ప్రచురపరచుట,లెక్క-వేయుట.

پھیلاو-پھیلاوٹ ఫైలావ్-ఫైలావట్ (హి.పు) ప్రసరణ,విస్తారము; ప్రస్తారము, వెడలుపు,పొడుగు, విమర్శనము, ఉజ్జా,లెక్క-మొ॥ చేయుట.

پھیلنا ఫైల్నా (హి) ప్రసరించుట, వ్యాపించుట,విస్తరిల్లుట,విశాలముగుట,బయలుపడుట.

پھیلی పహేలీ(హి.స్త్రీ)విడికథ, విడుపుకథ,గూఢప్రశ్న. پھیلی بوجھنا పహేలీ-బూఝ్నా (హి] విడికథవిప్పుట

پھین ఫేన్ (హి పు) ఫేనము,కఫము,నురుగు.

پھینپنا ఫేంప్నా (హి.పు) చీమిడికళ్లే, చీమిడి.

پھینچنا ఫీంచ్నా (హి) బట్టనునీళ్లపిండుట, నీళ్లలోజాడించుట లేక కుదిలించుట.

پھینٹی ఫేంటీ (హి.స్త్రీ) దారపుపుంజము.

پھینس ఫేనస్ (హి.పు) ముఱ్ఱుపాలు, జున్నుపాలు.

پھینک ఫేంక్(హి.స్త్రీ) విక్షేపణము,పారవేత, చల్లకము, జాడింపు, రువ్వుడు.

پھینک دینا ఫేంక్-దేనా(హి)పారవేయుట

پھینکنا ఫేంక్నా (హి) పారవేయుట, రువ్వుట, వేయుట,పడవేయుట,చల్లుట, ఎగరవేయుట,బడితసాము చేయుట, పోగొట్టుట,పరుగెత్తించుట,(గుఱ్ఱమును.)

پھینی ఫేనీ(హి.స్త్రీ)ఫేనసం॥, పేణియనుపిండివంట.

پے పై (పా.పు) అడుగు, జాడ, پے در پے పై దర్ పయ్ వెంటవెంట, ఎడతెగకుండవరుసగా,క్రమముగా,అనుపూర్వముగా.

پے పై (హి.స్త్రీ) దోషము,తప్పు,లోపము.

پے لگانا పై-లగానా (హి) తప్పుపట్టుట, లోపముతీయుట. (మగడు.

پی పీ (పా.స్త్రీ) కొవ్వు(హి.పు),ప్రియుడు

پیا పియా (హి.పు) ప్రియుడు,మగడు.

پیا-پیہ పయ్యా-య్య (హి.పు) చక్రము, బండిగాలు.

پیادہ పియాద (పా.పు) పదగుడు,కాలరి, కాలిబంటు,దూత. پیادہ پا పా (పా) కాలినడన,నడచి

پیار ప్యార్(హి.పు)ప్రేమ,ముద్దు, మోహము

پیار کرنا ప్యార్-కర్నా (హి) ముద్దాడుట,లాలించుట,ప్రేమించుట.

پیارا ప్యారా (హి.పు) ప్రియమైన, మనోహరమైన,ముద్దులాడు,ప్రియుడు.

پیاری ప్యారీ (హి.స్త్రీ)ప్రియమైన,మనోహరమైన,ముద్దైన,ముద్దులాడి,ప్రియురాలు.

**پیٹ کی آگ**—పేట్ కీ ఆగ్ (హి) జఠరాగ్ని, ఆకలి; తల్లిప్రేమ, కడుపుతీపి.
**پیٹ کی بات**—పేట్ కీ బాత్ (హి) గుట్టు, రహస్యము. **پیٹ گرنا**—పేట్ గిర్నా (హి) పిండముపడిపోవుట, గర్భస్రావమగుట.
**پیٹ والی**—పేట్ వాలీ (హి) గర్భవతి, చూలాలు. **پیٹ میں پٹھو لینا**—పేట్ మేఁ పిట్ఠూ లేనా (హి) కడుపులోజన్న లేకపిన్న తీసకొనుట.

**پیٹا** పేటా (హి.పు) పరిధి, ఆకారము; ఆహారము; పశువులపొట్ట; గాలిపటపుదారముయొక్క గూనిలేకవంపు; గ్రంథముయొక్క మూలము; మూరము, వెడలుపు; స్వాధీనము, ప్రవాహమార్గము; ఉజ్జ, ఉరమర, లెక్కయొక్కవయినము, మొత్తము, వలయము.

**پیٹل** పేటల్ (హి) తుందిలుడు, పెద్దపొట్టగల

**پیٹنا** పీట్నా (హి) కొట్టుట; మొత్తుకొనుట; సంపాదించుట; శిక్షించుట; చదరముచేయుట, సాగగొట్టుట, అణగగొట్టుట.

**پیٹو** పేటూ (హి) తుందిలుడు, తిండిపోతు, పెద్దపొట్టగల.

**پیٹھ** పీఠ్ (హి) పృష్ఠము, వీపు, వెనుక; ఆశ్రయము, సహాయము, ఆను.
**پیٹھ کا پیٹھ پر کا**—పీఠ్ కా-పర్కా (హి) వెనుకపుట్టిన, తరువాతి, తనకంటెచిన్న.
**پیٹھ کے پیچھے**—పీఠ్ కే పీఛే (హి) పరోక్షము, మందు, మొగముచాటున.
**پیٹھ دکھانا دینا**—పీఠ్ దిఖానా-దేనా (హి) పలాయితుడగుట, పారిపోవుట, విముఖుడగుట.

**پیٹھ** పైఠ్ (హి.పు) ప్రవేశము, అందిక, చొరవ; సంత; అంగడి; రెండవప్రతి (హుండికి)

**پیٹھا** పేఠా (హి.పు) బూడిదగుమ్మడికాయ.

**پیٹھنا** పైఠ్నా (హి) ప్రవేశించుట, చొరుట, చొరబడుట, చొచ్చుట, దూరుట.

**پیٹھی** పీఠీ (హి. స్త్రీ) చూడుము.

**پیٹی** పేటీ (హి. స్త్రీ) దట్టి, నడికట్టు; పేటిక, బొక్కసము; బట్టలపెట్టె; బొమ్మ; మొలపట్టి

**پیٹیا** పేటియా (హి.పు) ఒకమనిషిభోజనమునకుసామగ్రి, బత్తెము, సాయము.

**پائجامہ پیجامہ** పైజామా (పా.పు) చూడుము. **پیجامے سے باہر ہونا**—సేబాహర్ హోనా (హి) ఒడలుమరచుట, మదించుట.

**پیچھ۔پیچھ** పీచ్-ఛ్ (హి. స్త్రీ) గంజి.

**پیچ** పేచ్ (పా.పు) చిక్కు, పెన, మెలిక; మరచీల; యుక్తి; శ్లేష; యంత్రము; చుట్టినచుట్టు, తిరుగుడు, చుట్టు; చిన్న తలగుడ్డ; చింత, వ్యాకులము, జెట్టిపట్టు, పాముచుట్టు, కుండలి, టక్కు, మోసము; భావము.
**پیچ وتاب**—ఒతాబ్ (పా) మెలికలు, చిక్కులు; కులుకు, ఓయారము; తహతహ, సంకటము, కలత, వ్యాకులము, కలవరము; ఆగ్రహము. **پیچ کھانا**—ఖానా (ఉ) మెలికలుతిరుగుట, చిక్కులలోపడుట, కోపపడుట.

**پیچاں** పేచాఁ (పా) ఉంగరములు తిరిగిన, చుట్టుకొనిన, మెలికలుతిరిగిన, చిక్కుపడిన.

**پیچش** పేచిష్ (పా. స్త్రీ) అతిసారము, నులికడుపు.

**پیچک** పేచక్ (పా. స్త్రీ) కండె, దారపు ఉండ.

**پیچنا** పీచ్నా (హి) మట్టాడుట, త్రొక్కుట.

**پیچوان** పేచ్వాన్ (పా.పు) మెలికలుగల, మిక్కిలిపొడుగాటిగుడిగుడీనాళము,

**پیچھ** పీఛ్ (హి. స్త్రీ) గంజి, అన్నరసము.

**پیچھا** పీఛా (హి.పు) పుచ్ఛము, వెనుక, వెనుకభాగము; వెంబడింపు; పరిణామము; పరోక్షము, సారాంశము.
**پیچھا کرنا۔لینا**—కర్నా-లేనా (హి) వెంటతగులుట, గాసిపెట్టుట, విసికించుట.

پیچھا پھیرنا—ఫేర్నా (హి) వెనుకతీయుట, మరలుట.

پیچھے పీఛే (హి) వెనుక, తరువాత, పరోక్షమందు, ఒక్కొక్కరికి, ఒకటికి, వలన, తుదకు. پیچھے پڑنا—పడ్నా (హి) వెంటపడుట. پیچھے لگنا—లగ్నా (హి) వెంటతగులుట.

پیچیدگی—పేచీద్గీ (పా. స్త్రీ) చిక్కు, వెన్న, మెలిక, చుట్టు.

پیچیده పేచీద (పా) చిక్కుగల, చిక్కయిన, మెలికలుపడిన, చిక్కుపడిన, సుబోధముకాని.

پیخال పైఖాల్ (పా. పు) రెట్ట, పెంట, పక్షులమలము.

پیخانه పైఖాన (పా. పు) మరుగుదొడ్డి, మలము. پیخانه پھرنا—ఫిర్నా (ఉ) మలవిసర్జనముచేయుట.

پیدا పైదా (పా) పుట్టిన, దొరికిన, కలిగిన, అయిన, ప్రత్యక్షమైన. ఆదాయము, లాభము, ఉత్పత్తి, కల్పన, కల్పితమైన; సంపాదనము.

پیدا کرنا—కర్నా (ఉ) పుట్టించుట, సంపాదించుట, కలుగజేయుట, కల్పించుట, చేయుట, సిద్ధపరచుట. پیدا ہونا—హోనా (ఉ) పుట్టుట, దొరకుట.

پیداواری పైదావారీ (పా. స్త్రీ) } ఫలము, పంట; ఉత్పత్తి; ఆదాయము, ప్రాప్తి, రాబడి, పట్టుబడి.
پیداوار పైదావార్ (పా. పు)

پیدائش పైదాయిష్ (పా. స్త్రీ) జననము, పుట్టుట, జన్మము, పుట్టుబడి.

پیدائشی పైదాయిషీ (పా) సహజమైన, స్వాభావికమగు, పుట్టుకతోవచ్చిన,

پیدل పైదల్ (హి) కాలినడన, నడచి, పదగుడు, కాలిబంటు.

پیر పైర్ (హి. పు) అడుగు, అడుగుజాడ; పంటకుప్ప, కళ్ళము.

پیر పీర్ (పా. పు) సోమవారము.

پیر పీర్ (పా. పు) వృద్ధు, గురువు, పెద్ద. پیرزال—జాల్ (పా) ముసలియవ్వ, వృద్ధురాలు. پیرزاده—జాద (పా) గురుపుత్రుడు.

پیراک పైరాక్ (హి. పు) ఈతగాడు, ఈదువాడు.

پیراکی పైరాకీ (హి. స్త్రీ) ఈదులాట, ఈత.

پیران పీరాన్ (హి. పు) గుడిమాన్యము, పీర్లమాన్యము.

پیراو పైరావ్ (హి) ఈదుటకుతగని, దాటరాని, లోతైన.

پیراہن పైరాహన్ (పా. పు) దుస్తులు, ఉడుపులు, అంగీ, నిలువుటంగీ.

پیرائی పైరాయీ (ఉ. పు) ఈత, ఈదువిధము, ఈతనేర్చినకూలి.

پیرائی పీరాయీ (ఉ. పు) సుద్దులుచెప్పువాడు, భట్రాజు.

پیرایہ పైరాయ (పా. పు) భూషణము. అలంకారము, సింగారము; ఫక్కి, రీతి, తెరగు, దుస్తులు, ఉడుపులు.

پیرنا పైర్నా (హి) ఈదుట, పాకుట.

پیرو పైరవ్ (పా) శిష్యుడు, అనువర్తించువాడు, మతస్థుడు, అనుయాయి, అనుసారి.

پیرو పేరూ (ఇం. పు) సీమకోడి, మాంకోడి.

پیرون పైరోఁ (హి) కాలినడన, నడచి.

پیرون پڑنا—పడ్నా (హి) కాళ్లమ్రొక్కుట, కాళ్లబడుట.

پیروی పైరవీ (పా. స్త్రీ) అనుసరణము, అనువర్తనము; ఉద్యమము, ప్రయత్నము, విచారణ, విమర్శన.

پیرہن పైర్‌హన్ (పా. పు) చూడు پیراہن

پیری పీరీ (హి. స్త్రీ) వృద్ధాప్యము, ముసలితనము; ఆచార్యత్వము, గురుత్వము.

پیڑ-پیڑا پీడ్-పీడా (హి. స్త్రీ) పీడ, బాధ, కష్టము-నొప్పులు-ప్రసవవేదన.

پیڑ పేడ్ (హి. పు) చెట్టు-వృక్షము.

پیڑا పేడా (హి. పు) తడిపినపిండిముద్ద-రొట్టెఉండ-పేడాయను తినుబండము.

پیڑو పేడూ (హి. పు) పొత్తికడుపు-బొడ్డు క్రిందిభాగము. (పీఠము

پیڑھا పీఢా (హి. పు) చాకీపీట-అనుగలపీట,

پیڑھی పీఢీ (హి. స్త్రీ) చిన్నచాకీపీట-తరము-వంశము. پیڑھی در پیڑھی -పీఢీదర్ పీఢీ (హి) వంశపరంపరగావచ్చెడు-సాంప్రదాయకమైన-పైతృకమైన.

پیڑی పైడీ (హి. స్త్రీ) నిచ్చెన-సోపానములు-మెట్టు.

پیڑی పేడీ (హి. స్త్రీ) స్కంధము-చెట్టుబోదె-మొద్దు; ఒకవిధమైనతమలపాకు, ఒకసారికోసినతరువాతినీలిపైరు. (డమెత్తుకు.

پیز పేజ్ (పా. పు) హితము. వైరము- గో

پیزار పైజార్ (పా. పు) చెప్పు, పాదరక్షు, పాదుకము, పాతచెప్పు.

پیزنہ పేజ్న (పా. పు) జల్లెడ.

پیس పేస్ (పా. పు) కుష్ఠరోగము.

پیسا పైసా (హి. పు) డబ్బు-దుడ్డు-ద్రవ్యము. پیسا لگانا -పైసా-లగానా (హి) పెట్టుబడిపెట్టుట.

پیسنا పీస్నా (హి) విసరుట; నూరుట-నుగ్గుచేయుట; పొడుచేయుట- రాపిడిచేయుట-కష్టపెట్టుట-కష్టముచేయుట, నూరుట, మర్దించుట, పిండివిసరుట.

پیش పేష్ (పా. పు) ముందు-సముఖము, ఎదుట-అగ్రము-ముఖభాగము- మొదటి-పూర్వము- ఎదుటి- ముందలి- ఉకారసౌజ్ఞచొక్కాయియొక్కముందుభాగము, మేరువపూస. پیش آنا -పేష్-ఆనా (ఉ) తటస్థించుట- సంభవించుట- ప్రాప్తమగుట, ప్రత్యక్షమగుట, ముందుకు వచ్చుట వర్తించుట-అగుట پیش بندی -పేష్-బందీ (పా) దూరదృష్టి- ముందుగా ఏర్పాటుచేయుటలేక జాగ్రతపడుట. پیش بین -పేష్-బీన్ (పా) దూరదృష్టిగలవాడు, భావిజ్ఞాని, వివేకి-జాగ్రతగలవాడు. پیش بینی -పేష్-బీనీ (పా) దూరదృష్టి-భావిజ్ఞానము-తెలివి, వివేకము-జాగ్రత్త. پیش خدمت -పేష్-ఖిద్మత్ (పా) పరిచారకుడు- సేవకుడు, బంటు, پیش دست -పేష్-దస్త్ (పా) అగ్రేసరుడు, కార్యదర్శి-సహాయకుడు. پیش رفت -పేష్-రఫ్త్ (పా) కారణము-మూలము; స్వాధీనము. پیش رو -పేష్-రవ్ (హి. పు) పురోగామి-అగ్రేసరుడు-ముఖ్యుడు.

پیش قبض -పేష్-కబ్జ్ (పా) కటారు-కరవాలిక- చూరకత్తి. پیش نماز -పేష్-నమాజ్ (పా) పురోహితుడు. پیش کرنا -పేష్-కర్నా (ఉ) ముందుంచుట-నివేదించుట, చూపుట. پیش قدمی -పేష్-కద్మీ (పా) ముందంజవేయుట-ముందుకుపోవుట.

پیشاب పేషాబ్ (పా. పు) మూత్రము. پیشاب خطا ہونا -పేషాబ్-ఖతాహోనా (ఉ) ఉచ్చపోసుకొనుట, మిక్కిలిబెదురుపడుట. پیشاب کرنا -పేషాబ్-కర్నా (ఉ) మూత్రించుట.

پیشانی పేషానీ (పా. స్త్రీ) ఫాలము, నొసలు; ప్రారబ్ధము; శిర్షిక-చిరునామా.

پیشتر పేష్తర్ (పా) తొలుత, ముందు, మొట్టమొదట, పూర్వము.

پیشکار పేష్కార్ (పా) కార్యదర్శి, సహాయుడు, సమక్షమందుపనిచేయువాడు.

پیشکش పేష్కష్ (పా. స్త్రీ) కప్పము, పన్ను, సుంకము; కట్నము, బహుమానము;

**پیشگاہ** పేష్ గాహ్ (పా.పు) సమక్షము, ఆస్థానము; సభ, ప్రభువు.

**پیشگی** పేష్గీ (పా.స్త్రీ) సత్యంకారము సంచకరువు, ముందుగానిచ్చుసొమ్ము.

**پیشوا** పేష్వా (పా.పు) పురోగామి, అగ్రేసరుడు, ప్రధాని; పురోహితుడు, నాయకుడు, మార్గదర్శి, త్రోవచూపువాడు; మహారాష్ట్రుల ప్రధానమంత్రి. (پشواز

**پیشواز** పేష్వాజ్ (పా.స్త్రీ) చూడు

**پیشوائی** పేష్వాయీ (పా.స్త్రీ) స్వాగతము, ఎదుర్కోలు, దారిచూపుట, మార్గదర్శనము.

**پیشہ** పేష (పా.పు) వృత్తి, జీవనము, వ్యాపారము, వ్యవహారము. **پیشہ ور** పేషా—వర్ (పా) వ్యాపారి, పనివాడు, ఏదైనవొకవృత్తిని చేయువాడు, వృత్తివంతుడు.

**پیشی** పేషీ (పా.స్త్రీ) సమక్షము, సముఖము; నివేదనము, విచారణదినము.

**پیشین** పేషీన్ (పా) పూర్వపు, చిరకాలపు, ముందటి, వెనకటి. **پیشین گوئی** పేషీన్—గోయీ (పా) భవిష్యద్జ్ఞానము, రాబోవుదానినిచెప్పుట, ముందుచెప్పుట.

**پیغام** పైగామ్ (పా.పు) సందేశము, చెప్పియంపినసమాచారము; రాయబారము, మనను ము, అడుగుట. **پیغام ڈالنا** పైగామ్—డాల్నా (ఊ) మనుము అడుగుట, పెండ్లికిపిల్లనుకేక పిల్లవానినిఅడుగుట. (డు, దూత.

**پیغامی** పైగామీ (పా.పు) సందేశహరు

**پیغمبر** పైగంబర్ (పా.పు) సందేశహారుడు, దూత; రాయబారి; ఋషి, దేవదూత.

**پیک** పీక్ (హి.స్త్రీ) తమ్మ, తాంబూలము నమలిఉమ్మివేసినపిప్పి. **پیک دان** పీక్—దాన్ (హి) తమ్మపడిగ, తమ్మతసుకు, పతద్గ్రాహము. (సందేశహారుడు.

**پیک** పైక్ (పా.పు) పదగుడు, కాలరి, బంటు,

**پیکار** పైకార్ (పా.పు) సుంకరీడు, పన్ను తీసుకొనువాడు; చిల్లరవర్తకుడు; జగడము, పోట్లాట.

**پیکان** పైకాన్ (పాపు) బాణపుములికిలేక అలుగు, అంచు, కొన, మొన.

**پیکدان** పీక్దాన్ (హి.పు) తమ్మపడిగ, పతద్గ్రాహము, తమ్మతసుకు.

**پیکر** పైకర్ (పా.పు) ముఖము, ఆకారము, చిత్రము, రూపము. (గొలుసు.

**پیکڑا** పైక్డా (హి.పు) కాలికడియము, కాలి

**پیگو** పైగూ (ఇం.పు) బ్రహ్మదేశముందలి పెగ్గూప్రాంతపు గుఱ్ఱము, పొట్టిజాతిగుఱ్ఱము, వడిగలగుఱ్ఱము.

**پیل** పేల్ (హి.పు) నెట్టు, తోసుకు, ద్రొబ్బు, నూకు, సమ్మర్దము; విస్తారము, సమృద్ధి

**پیل** పీల్ (పా.పు) ఏనుగు, గజము.

**پیلا** పైలా (హిపు) అడ్డ, సుమారుఅయిదుశేరులకొలపాత్ర, పాఖిలి. (దోషము.

**پیلا** పేలా (హి.పు) వృషణము; అను, ఊత

**پیلا** పీలా (హి) పచ్చని, కేసరివన్నెగల, చదరంగములోనిఏనుగు.

**پیلبان** పీల్బాన్ (పా.పు) మావటీడు.

**پیلپا** పీల్పా (పా.పు) బూరకాలు, ఏనుగ కాలు. (గాతిలేకగచ్చు స్తంభము.

**پیلپایہ** పీల్పాయ (పా.పు) స్తంభము,

**پیلڑ** పేలడ్ (హి.పు) వృషణము.

**پیلنا** పేల్నా (హి.పు) ద్రొబ్బుట, నూకుట నెట్టుట; క్రుక్కుట, కూరుట; చొప్పించుట; ఒత్తుట; సాముచేయుట; గానుగాడుట; తైలముతీయుట.

**پیلہ** పీల (పాపు) పిసినికాయ, పట్టుపురుగు; చదరంగములోనిఏనుగు.

**پیلی** పీలీ (హి.స్త్రీ) పచ్చని; బంగారుకాసు;

**پیم** పేమ్ (హి.పు) ప్రేమ, ముద్దు.

**پیمان** పైమాన్ (పా.పు) వాగ్దానము, సమాధానము, సంధి, ప్రమాణము; కొల, మానము; ఉజ్జ, అంచన,

**پیمانہ** పైమాన (పా.పు) ప్రమాణము, కొల, మానము; కొలపాత్ర, పథకము, పట్టిక;

**پیمانۂ بارش**—యె-బారిష్ (పా) వర్షమానము, వాననీరుకొలుచుసాధనము,

**پیمائش** పైమాయిష్ (పా.స్త్రీ) కొలత, భూమికొలత.

**پیمبر** పయంబర్ (పా.పు) చూడు **پیغمبر**

**پیمک** పైమక్ (హి.స్త్రీ) సరిగగోటు, జలతారుఅంచు, వెండిలేక బంగారుసరిగ;

**پیں** పీఁ (హి.స్త్రీ) సన్ననిధ్వని-కీఁ అను చప్పుడు. **پیں بولنا**—బోల్నా (హి) లోపడుట, నిరుపాయమగుట.

**پینا** పైనా (హి.పు) అంకుశము; ములుకోల; తీక్ష్ణమైన, వాడిగల.

**پینا** పీనా (హి) త్రాగుట; ఇంకుట; పీల్చుట, సహించుట, ఓర్చుట (దీయుట.

**پینا** పీన్నా (హి) పింజుట, ఏకుట, పత్తివిడ

**پینتالیس** పైంతాలీస్ (హి) నలువదియైదు. (కట్టు, కాళ్లకడ.

**پینتانہ** పైంతాన (హి పు) మంచముకాళ్ల

**پینتیس** పైంతీస్ (హి) ముప్పదియైదు.

**پینٹھ** పేంఠ్ (హి.స్త్రీ) పేట, అంగడి, సంత, పచారము (మువ్వలు.

**پینجن** పైంజన్ (హి.స్త్రీ) గజ్జలకడియము,

**پینجنی** పైంజ్నీ (హి.స్త్రీ) పావురముల కాళ్లలో వేయు గజ్జెలఉంగరములు.

**پینڈا-پینڈی** పేందా-దీ (హి.పు) అడుగు, క్రిందు, మూలము. **پینڈے کا ہلکا** పేందే కా హల్కా (హి) చపలచిత్తుడు, నిలకడలేనివాడు **پینڈے بے پیٹھنا** పేందే

కేబల్ బైఠ్నా (హి) చతికిలపడికూర్చుండుట, ముడ్డిమోపికూర్చుండుట. (కాలిబాట.

**پینڈ** పేండ్ (హి.పు) అడుగు; త్రోవ,

**پینڈا** పైండా (హి.పు) త్రోవ, బాట.

**پینڈی** పేండీ (హి.స్త్రీ) లడ్డుకము, రవఉండ

**پینس** పీనస్ (హి.స్త్రీ) పీనసరోగము.

**پینس** పీనస్ (ఇం.స్త్రీ) పల్లకీ, డోలిక.

**پینسٹھ** పైంసఠ్ (హి) అరువదియైదు.

**پینک** పీనక్ (హి.స్త్రీ) నల్లమందుమత్తు-తూగు, తూగుపాటు (పెద్దఊపు, ఊగుడు

**پینگ** పేంగ్ (హి.స్త్రీ) ఉయ్యెలత్రాడు,

**پیو** పియూ (హి.స్త్రీ) ప్రియుడు, మగడు.

**پیوڑی** పివ్డీ (హి.స్త్రీ) పచ్చమన్ను.

**پیوستگی** పైవస్తగీ (పా.స్త్రీ) అతుకు, కూడిక, చేరిక, కదియిక, సంయోగము.

**پیوستہ** పైవస్త (పా) అతికిన, కదిసిన, చేరిన, కూడిన, సంయుక్తమైన; సరిగా, ఎప్పటికిని-ఎడతెగకుండ.

**پیوسی** పియోసీ (హి.స్త్రీ) ఈనినఆవు పొదుగులోగడ్డకట్టినపాలు.

**پیوند** పైవంద్ (పా.పు) అతుకు, మాసిక, చెట్టుయొక్క-అంటు, బాంధవుడు.

**پیوند لگانا**—లగానా (ఉ) అతుకువేయుట, అంటుకట్టుట, మాసికవేయుట.

**پیوندی** పైవందీ (పా) అంటుకట్టినచెట్టు లేక దానిపండు.

**پیہر** పీహర్ (హి.పు) భార్యపుట్టిల్లు.

**پیہم** పైహమ్ (పా) వెంటవెంట, ఎడతెగకుండ, క్రమముగా, వరుసగా.

**پیہو** పీహూ (హి.పు) మిణ్ణల్లి.

**پہیا** పహ్యా (హి.పు) చక్రము, బండిగాలు; గ్రామాదాయములో పట్వారీకి ఇచ్చుపాలు, పట్వారీపాలు.

(ٹ)

ٹ తే (అ. స్త్రీ) తకారము; ఇది ఉరుదూ ఫా రసీ భాషలయొక్క వర్ణమాలలలో నాలు గవయక్షరము; అరబ్బీభాషలో మూడవ యక్షరము—బ్జ్బా! వర్ణసాంఖ్యమునందుఇది నన్నూరుఅనుసంఖ్యకుసౌజ్ఞ.

تا తా (హి) మడత, పొర, కాకితపుపత్రము లేకటావు.

تا తా (పా) కు,కి,వరకు,దనుక, అగుగాకయ ని, కొరకలందులకు,అగుటకై.

تابحیات-تادمزیست —తాబహయా త్—తదమెజీస్త్ (పా) బ్రతికినన్నాళ్లు-బ్రతికి యుండగా. تابکجا-تابکے—తాబకుజా —బకయ్ (పా) ఎంతవరకు,ఎందనుక.

تابمقدور —తాబమక్‌దూర్ (పా) యథా శక్తి,శక్తికొలది, చేతనయినంతవరకు.

تاحال —తాహాల్ (పా)ఇప్పటివరకు, ఇంద నుక, تاکہ —తాకె(పా)ఇందుకై,ఇందుకొరకు, ఏలననగా, ఎందుకనగా. تاہم —తాహమ్ (పా) అయినను,తథాపి,అయినప్పటికిని.

تاب తాబ్ (పా. స్త్రీ) ప్రకాశము, కాంతి; వేడిమి,ఉష్ణము;పడి,శక్తి;ఓర్పు;కైన, మెలి కనానلانا-تاب نہ لانا—తాబ్‌నరహ్నా-నలానా (ఉ) తాళజాలకపోవుట- సహింపజాల కుండుట. تاب تلی -తాబ్‌తిల్లీ (ఉ) చూడు تاپ تلی

تابا తబా (పా. పు) పెనము,బాణలి.

تابان తాబాం (పా. పు)ప్రకాశముగల,కాం తిగల; వడిపడిన, మెలికపడిన.

تابدان తాబ్‌దాన్ (పా. పు) గవాక్షము.

تابڑتوڑ తాబడ్‌తోడ్ (హి) వెంటవెంట, కూరసగా, ఎడతెగకుండ.

تابستان తాబిస్తాన్ (పా. పు) వేసవికాల ము, ఎండకాలము. (ము.

تابش తాబిష్ (పా. స్త్రీ)ప్రకాశము, ఉష్ణ

تابع తాబెఉ (అ. పు) విధేయుడు, లోపడిన వాడు تابعدار -తాబెదార్ (పా)విధేయుడు- సేవకుడు, బంటు تابعداری -తాబెదారీ (పా. స్త్రీ) పరిచర్య, కొలువు, విధేయత تابع کرنا -తాబె కర్నా (ఉ) లోబరచుట, విధేయునిగా జేయుట.

تابعین తాబెఈన్ (అ. పు) విధేయులు,మత స్థులు, ఒకతెగవారు.

تابندہ తాబింద (పా) చూడు تابان

تابوت తాబూత్ (అ. పు) శవవాహనము, పాడె; శవము. (పెనము, బాణలి.

تابہ తాబ (పా. పు) వెలిగెడు, మెలికపడిన;

تابیدہ తాబీద (పా) పెనబడిన, చిక్కుబడి న, కాంతిగల.

تاپ తాప్ (హి. పు) తాపము,ఉష్ణము, జ్వ రము تاپ تلی -తాప్‌తిల్లీ (హి) కడుపులోని జ్వరపుబిళ్ల లేకబల్ల.

تاپنا తాప్నా (హి) వెచ్చజేసికొనుట, కా చుకొనుట;కాచుట,వెచ్చజేయుట.

تاتار తాతార్ (పా. పు) ఘోట్రాణము, (దేశము)

تاثر-تاثیر తాస్సుర్—తాసీర్ (అ. పు) ఫలితము,గుణము. ఫలము, సార్థకము;జాడ, పోబడి. تاثیر کرنا తా—కర్నా (ఉ)గుణ మిచ్చుట,ఫలితముకలుగుట.

تاج తాజ్ (పా. పు)కిరీటము,మకుటము,తు రాయి;చీట్లపట్టు;బోదె,బొద్దు,చూరు.

تاج خروس -తాజ్ ఎ-ఖురూస్ (పా) కోడిజుట్టు. تاجدار-تاجور -తాజ్‌దార్—వర్ (పా) కిరీటి,రాజు.

تاجر తాజర్ (అ.పు) వర్తకుడు,బేహారి.
تاجور తాజ్వర్ (పా.పు) కిరీటి, రాజు
تاخ తాఖ్ [పా.పు) ముసుకు,తిరస్కరణి చీకటి;వంటచెఱుకు.
تاخت తాఖ్త్ (పా.స్త్రీ)దోపిడి,దాడి, పైబడుట. تاخت وتاراج -తాఖ్త్-ఒ-తారాజ్ (పా)ధ్వంసము-అధ్వానము, పాడు, నాశము. (యాపనము, అసడ్డ.
تاخیر తాఖీర్ (అ.స్త్రీ) ఆలస్యము-కాల
تادیب తాదీబ్ (అ.స్త్రీ) శిక్ష-సంస్కారము, మర్యాదలు నేర్పుట, సకరి.పు.
تادیب خانہ -తాదీబ్-ఖాన(పా)సంస్కారశాలలు; నీతిశాల, నేరస్థులకునీతికఱపు పాఠశాల.
تار తార్ (హి.పు) తీగ, దారము, పోగు, పడుగు, పేక,తంతి,చీకటి,వరుస, క్రమము, బంధుత్వము,తంతిసమాచారము. تار برقی -బర్కీ (ఉ) విద్యుత్తంతువు, మెరుపుతపాలు, తంతిసమాచారము. تار تار کرنا -తార్తార్ కర్నా (హి) చీలికలుపీలికలుగాజేయుట تارکش -తార్-కష్ (పా) తీగలుతీయు, కమ్మచ్చు. تارگهر -తార్-ఘర్ (హి) తంతెల చావడి, تارتوڑ -తార్-తోడ్ (హి) ఒకసరిగపని, ఒకకట్టుపని
تارا తారా (హి.పు) నక్షత్రము, చుక్క; కంటిపాప, تارے توڑنا -తారే- తోడ్నా (హి) అనన్యసాధారణమగుపనిజేయుట, మోసముజేయుట. تارامنڈل -తారా-మండల్ (హి) తారామండలము-నక్షత్రమండలము; ఒకబాణసంచు. (పాడు.
تاراج తారాజ్ (పా.పు)ధ్వంసము,దోపిడి,
تارک తారిక్ (అ.పు) త్యజించినవాడు, విడిచినవాడు; సన్యసించినవాడు, బైరాగి, విరాగి. تارک الدنیا -తారికుద్దునియా(అ) ప్రపంచత్యాగముజేసినవాడు, సన్యాసి.
تارک الصلوٰۃ -తారికుస్సలాత్ (అ) కర్మశూన్యుడు, నమాజుచేయనివాడు, సంధ్యవార్చనివాడు.
تاریخ తారీఖ్ (అ.స్త్రీ) తిథి, మాసతిథి, తేది; చరిత్రము,ఇతిహాసము.
تاریخ ٹهہرنا -తారీఖ్-ఠైర్నా (ఉ)ముహూర్తనిశ్చయమగుట,తిథినిర్ణయించుట.
تاریک తారీక్ (పా) చీకటిదైన-నల్లని.
تاریکی తారీకీ (పా.స్త్రీ) చీకటి, అంధకారము.
تاڑ తాడ్ (హి.పు) తాటిచెట్టు.
تاڑنا తాడ్నా (హి) తెలియుట,గ్రహించుట,ధిక్కరించుట-కొట్టుట.
تاڑو తాడూ (హి.పు) పరీక్షకుడు, గ్రహించువాడు,ఊహించువాడు,కనుగొనువాడు
تاڑی తాడీ(హి.స్త్రీ)తాటికల్లు,కటారుపిడి
تازگی తాజగీ (పా.స్త్రీ) క్రొత్తదనము, క్రొత్తరికము, నవీనత, పచ్చదనము-తెలివి; కళ,కాంతి,నవనవత్వము,ఉల్లాసము.
تازہ తాజ(పా) నవీనమైన, క్రొత్త,కళగల,కాంతిగల,నవనవలాడెడు, ప్రస్తుతపు, ఉల్లాసముగల. تازہ دم -దమ్ (పా) క్రొత్తయూపిరి,(వచ్చిన),అలసటతీరిన,తేరిన, తెప్పరిలిన, బలమువచ్చిన, మరలసిద్ధముగానున్న. تازہ هونا -తాజ-హోనా (ఉ) క్రొత్తపడుట, క్రొత్తయూపిరివచ్చుట, క్రొత్తగానగుట,నవీనతకలుగుట, అలసటతీరుట, తేరుకొనుట, తెప్పరిలుట, పచ్చపచ్చగానగుట,పచ్చబడుట.
تازی తాజీ (అ) అరబ్బీదేశపు, అరబ్బీదేశపుగుఱ్ఱము లేకకుక్క,అరబ్బీభాష, అరబ్బీయక్షరములు.

**تازیانہ** తాజియాన (పా.పు) కశేము, చేరు కోల; కొట్టుట, కొరడాదెబ్బలు, ప్రహారణములు.

**تأسف** తఅస్సుఫ్ (అ.పు) అనుతాపము, పశ్చాత్తాపము, చింత, దుఃఖము.

**تاش** తాష్ (హి.పు) ఆట చీట్లు-చీట్లాట; సరిగ పట్టుబట్ట.

**تاشہ** తాష (హి.పు) ఆవజము.(వాద్యము),

**تاغ** తాగ్ (పా.పు) ధ్వజస్తంభము, ఒక చెట్టు -దాడిమము. (గుమ్మడు వైనరొట్టె.

**تافتان** తాఫ్తాన్ (ఉ.స్త్రీ) ఒకవిధమ

**تافتہ** తాఫ్త [పా పు] మెఱుపుపట్టుబట్ట; మీగడవన్నెగలపావురము లేకగుజ్జు.

**تاقی** తాకీ (తు) దోషయుక్తమైన, వేరువేరు వన్నెలకండ్లుగల; ఇజ్జోడైన, బేసియైన.

**تاک** తాక్ (పా స్త్రీ) ద్రాక్ష.

**تاک** తాక్ (హి.స్త్రీ) దృష్టి, స్థిరదృష్టి, తేరిచూపు, నిరీక్షణము, శోధ, జాడ, పొంచు, పొంచుండుట. **تاک لگانا**-లగానా (హి) జాడదీయుట, పొంచువేసియుండుట, కనిపెట్టియుండుట, శోధించుచుండుట.

**تاکنا** తాక్నా (హి) తేరిచూచుట-కనిపెట్టియుండుట- తొంగిచూచుట-పొంచియుండుట- తెలిసియుండుట- ఊహించియుండుట-ఎదురుచూచుట-జాడదెలియుట.

**تاکید** తాకీద్ (అ.స్త్రీ) హరము-గట్టిపట్టు, ఒత్తిడి; ఆజ్ఞ-ఉత్తరువు-ప్రోద్బలము-నిర్బంధము-అగత్యము-ఆవశ్యకము.

**تاکید کرنا**-కర్నా (ఉ) ఉత్తరువుచేయుట-గట్టిగా జెప్పుట- మతిమతి జెప్పుట, పట్టుదలగా జెప్పుట- నిర్బంధముజేయుట, బలవంతముగా జెప్పుట,

**تاکیداً** తాకీదన్ (అ) విధిగా-అగత్యముగా, ఆవశ్యముగా-గట్టిగా- నిర్బంధముగా-బలవంతముగా-ఒత్తి-ప్రోద్బలముగా.

**تاکیدی** తాకీదీ (అ) అగత్యమైన-విధియైన, అవశ్యమైన-గట్టి-నిర్బంధకమైన- బలవంతమైన.

**تاگا** తాగా (హి.పు) దారము-నూలు-పోగు.

**تاگا پرونا**-పురోనా (హి) సూదిలోదారముగ్రుచ్చుట **تاگا ڈالنا**-డాల్నా (హి) పోగుతీయుట-కుట్టుట.

**تاگڑی** తాగడీ (హి.స్త్రీ) బంగారులేక వెండిమొలనూలు- మొలత్రాడు- నూలు త్రాడు.

**تاگنا** తాగ్నా (హి) దారముగ్రుచ్చుట.

**تال** తాల్ (హి.పు) చెరువు- తటాకము; సులోచనములోనియద్దము- వాయించుతాళము, దరువు, తాళము. **تال میل**-మేల్ (హి) పూర్వోత్తరసంబంధము-సుతికలియుట- అనుకూలము. **تال دینا**-దేనా (హి) తాళము వేయుట.

**تالا** తాలా (హి.పు) తాళము-బీగము.

**تالاب-تالاو** తాలాబ్-వ్ (ఉ) తటాకము, చెరువు-కుంట.

**تالمکھانا** తాల్మఖానా (హి.పు) ఓషధి విశేషము-తామరవిత్తులు.

**تالو** తాలూ (హి.పు) తాలువు-అంగిలి-మాడు-అంగుడు **تالو اٹھانا**-ఉఠానా (హి) అంగిలిఎత్తుట **تالو لٹکنا**-లట్కానా (హి) కొండనాలుకవచ్చుట, కొండనాలుకయగుట.

**تالی** తాలీ (హి.స్త్రీ) తాళపుచెవి-బీగపుచెవి; రెండుచేతులుతట్టుట-చప్పట.

**تالی بجنا-پٹنا**-బజ్నా-పిట్నా (హి) చప్పట్లుమ్రోగుట, అల్లరియగుట, అవమానమగుట.

**تالیف** తాలీఫ్ (అ.స్త్రీ) మేళనము, కలుపుట-రచన-వేరువేరుగ్రంథములనుండి మొత్తి వ్రాయుట-కూర్చుట-సంగ్రహము.

**تامجهام** తామ్ఝామ్ (హి.పు) పల్లకీ-డోలిక.

**تامڑا** తామ్డా (హి.పు) బట్టతల, బోడితల, తామ్రవర్ణము-ఎరుపు-నిర్మలాకాశము; ఒక తక్క-వజాతిమాణిక్యము.

**تامل** తఅమ్ముల్ (అ.పు) ఆలోచన- విచారణ; అనుమానము-శంక- సంకోచము-ఆలస్యము-అవకాశము-ఓర్పు- తాలిమి- అశ్రద్ధ-అయిష్టము-పర్యాలోచనము.

**تاملوٹ۔تاملیٹ** తామ్లోట్-లేట్ (ఇం.పు) పానపాత్ర- కోర-గిన్నె- (టీను లేకసత్తు రేకుది).

**تامیسور** తామేస్వర్ (హి.పు)
**تامیسری** తామేశ్రీ (హి.స్త్రీ) తామ్రభస్మము, రాగికందు.

**تان** తాన్ (హి.స్త్రీ) తానము, సుతికూర్పు, మంచము మో॥ వాని ఇనుపపుడకలకట్టు లేకబందు. **تان توڑنا** తాన్-తోడ్నా (హి) దరువువేయుట, ఎత్తిపాడుచుట, వెక్కిరించుట. (పుదారము.

**تانا** తానా (హి.పు) పడుగు, నేతలోనినిడు

**تانا** తానా (హి) కాచుట, కరగించుట, పరీక్షించుట.

**تانبا** తాంబా (హి.పు) తామ్రము, రాగి.

**تانبڑا** తాంబ్డా (హి.పు) చూడు: تامڑا

**تانب چون** తాంబ్చూన్ (హి) తామ్రభస్మము.

**تانت** తాంత్ (హి.స్త్రీ) తంతువు, సారంగి మో॥ వానిసరముతోచేసినతంతువు, మర్గము.

**تانتا** తాంతా (హి.పు) బారు, వరుస, పంజ్కి.

**تان سرور** తాన్సరూర్ (హిపు) వెక్కిరింత,

**تانتڑی** తాంత్డీ (హి.స్త్రీ) చిన్న నరము.

**تانتوا** తాంత్వా (హి.పు) అంత్రవృద్ధిరోగము.

**تانتی** తాంతీ (హి.పు) పంక్తి, బారు, తంతువాయుడు, సాలెవాడు. (క్కి-ని.

**تانتیا** తాంతియా (హి) మిగులసన్నని, బ

**تانسنا** తాంస్నా (హి) బెదరించుట, చివాట్లు పెట్టుట, గద్దించుట, కష్టపెట్టుట.

**تانگا** తాంగా (హి.పు) కచ్చడము, గూడులేనిచిన్న బండి.

**تاننا** తాన్నా (హి) బిగించుట, సాగదీయుట, లాగుట, విస్తరించుట, మడతలుతీయుట, వ్యాజ్యము వేయుట, పంపుట, నిర్బంధపెట్టుట, కూర్చుట. (పునూలు.

**تانی** తానీ (హి.స్త్రీ) పడుగు, నేతలోనినిడు

**تانیث** తానీస్ (అ.స్త్రీ) స్త్రీలింగము.

**تاو** తావ్ (హి.పు) ఉష్ణము, వేడిమి, కాక, కోపము, ఆవేశము, మెలిక, పెన, పురి, వడి, బలము, వేగము, కాకితపుపత్రము, టావు.
**تاو کهانا** ఖానా (హి) కాకవచ్చుట, కాగుట, పురియెక్కుట, వడిపడుట, కోపపడుట.

**تاوان** తావాన్ (పా.పు) దండుగ, ప్రతీకారము, చెల్లు, అచ్చుకొనుట.

**تاولا** తావ్లా (హి.పు) దుడుకు, తొందరపాకి. (ల్లార్చుట.

**تاونا** తావ్నా (హి) కాచుట, కాచిచ

**تاویل** తావీల్ (అ.స్త్రీ) అసత్యవాదము, అపార్థము, తప్పునెపము.

**تاهم** తాహమ్ (పా) అయినను, అయినప్పటికిని

**تایا** తాయా (హి.పు) పెత్తండ్రి.

**تائی** తాయీ (హి.స్త్రీ) పెత్తండ్రిభార్య, పెత్తల్లి; పెనము.

**تائید** తాయీద్ (అ.స్త్రీ) ప్రోత్సాహము, సహాయము, ఆశ్రయము, పక్షపాతము, బలపరుచుట.

**تب** తబ్ (హి) అప్పుడు, అంతట, తదుపరి, తరువాత. **تب بهی** తబ్-భీ (హి) అయినను, అయినప్పటికిని. **تب هی** తబ్-హీ (హి)

అప్పుడే,తత్క్షణమే,కనుకనే,కాననే.

تبار తబార్ (అ.పు) కులము, భాంధవ్యము, కుటుంబము.

تبارا-تبارہ తిబారా-ర (హి.పు)మున్మూర, త్రిద్వారము, మూడువాకిండ్లుగలకూటము. (మున్నాళ్ళచద్ది.

تباسی తిబాసీ (హి) మూడుదినములనాటి,

تباہ తబాహ్ (పా)అధ్వాన్నమైన, పాడైన, చెడిన.

تبخالہ తబ్ ఖాల(పా.పు) చూడు.تپخالہ

تباہی తబాహీ (పా.స్త్రీ)ధ్వంసము,నాశము,పాడు,కీడు,అవమానము,ఆపత్తు.

تبدل-تبدیل తబద్దుల్-తబ్దీల్ (అ.పు-స్త్రీ) వ్యత్యయము మార్పు,వ్యత్యాసము, వికారము,స్థానభ్రంశము.

تبر తబర్ (పా.పు) పరశువు,గొడ్డలి.

تبرا తబర్రా (అ.పు) శాపము, దూషణ,అసహ్యము, ధిక్కారము,నింద.

تبرائی తబర్రాయీ (అ) షియామతస్థులగుమహమ్మదీయులలోనొకతెగ.

تبرزین తబర్ జీన్ (పా.పు) గండ్రగొడ్డలి.

تبرک తబర్రుక్ (అ.పు)ప్రసాదము,ఆశీర్వాదము,పూజ్యవస్తువులు.

تبرید తబ్రీద్ (అ.స్త్రీ)చల్లార్చుట,శైత్యోపచారము, చలువపుట్టించుమందు, చల్లగా చేయుట. (రునవ్వు.

تبسم తబస్సుమ్ (అ.పు) మందహాసము, చి

تبلی తబ్లీ(ఉ.స్త్రీ)చద్దిగిన్నె,బుత్తి,పేటిక, తుపాకిసామానుపెట్టె.

تبنی తబన్నీ (అ.స్త్రీ) దత్తు,దత్తత.

تپ తిప్ (హి.పు) తపము,తపస్సు.

تپ తప్(పా.పు)తాపము,జ్వరము, ఉష్ణము

تپ نوبت -ఎ-నవ్ బత్ (పా)వరుస జ్వరము. تپ دق -ఎ-దిక్ (పా)పురాణ జ్వరము,క్షయరోగము.تپ لرزہ -ఎ-లర్జ (పా) చలిజ్వరము,శీతజ్వరము.

تپخالہ తప్ ఖాల(పా.పు) జ్వరపుపొక్కులు,పెదవులపైపొక్కులు.

تپاک తపాక్ (పా.పు)సంభ్రమము, తత్తర,తొట్రు,దడ,ఆదరము,సత్కారము.

تپانا తపానా(హి)కాచుట,వెచ్చజేయుట.

تپت తపత్ (హి.స్త్రీ) ఉష్ణము.

تپسی-تپشی తపసీ-షీ (హి.పు) తాపసుడు,భక్తుడు,తపస్సుచేయువాడు.

تپسیا-تپشیا తపస్యా-ష్యా (హి.స్త్రీ) తపస్సు,భక్తి.

تپش తపిష్ (పా.స్త్రీ) తపనము,ఉష్ణము, తీక్ష్ణత,తల్లడము,తాపము.

تپک తుపక్ (తు.స్త్రీ) చిన్నతోపులేకపిరంగి,తుపాకి.تپکچی -చీ (పా) తుపాకిబంటు.

تپک తపక్(హి.స్త్రీ)దడ,కంపనము,సలుపు.

تپنا తప్నా (హి) కాగుట,ప్రకాశించుట, తపించుట,కాలుట. (రము.

تت తత్ (హి.పు) తత్వము, మూలము,సా

تتا తత్తా (హి) తప్తమైన; వేడియైన,తీక్షణమైన,కాలిన. تتوا -తవా (హి)కాలిన పెనము,జగడాలమారి.

تتار తతార్ (హి) వేడినీళ్లతోకడుగుట-వేడినీళ్లలోనుంచుట.

تتبع తతబ్బుఉ (అ.పు) అనుకరణము, అనువర్తనము,చేసినట్టుచేయుట.

تتربتر తిత్తర్ బిత్తర్ (హి) తారుమారైన, చెల్లచెదరైన,గజిబిజి-గంద్రగోళము.

تتری-تتڑی తిత్ రీ-డీ (హి.స్త్రీ) అతి లోభురాలు- జాణ- చాకచక్యముగలయాడుది.

تلّانا తల్లానా (హి) నత్తుట- అస్పష్టముగామాట్లాడుట. (క్రోకచిలుక.

تلّی తిల్లీ (హి.స్త్రీ) ఆకుచిలుక- సీతా

تلمبا తితంబా (హి.పు) అభ్యంతరము, చిక్కు.

تتمّہ తతిమ్మ (అ.పు) మిగులు-శేషము, అనుబంధము-శేషపూరణము.

تتمیم తత్మీమ్ (అ.స్త్రీ) ముగింపు-సంపూర్తి; పూరణము.

تتھ తిథ్ (హి.స్త్రీ) తిథి. (ఆలాగు.

تتھا తథా (హి.స్త్రీ) శక్తి- సామర్థ్యము,

تتھڑا తథ్డా (హి.పు) నీళ్లుకాచుకొప్పెర,

تتئی తుతై (హి.స్త్రీ) కొమ్ముమంత, కాగు.

تتیا తతయ్యా (హి.పు) కందిరీగ-జాణ-ఉటుంకి. تتیا مرچ తతయ్యా-మిర్చ్ (హి) కొండ మెరపకాయ-లవంగపు మెరపకాయ.

تتیڑا తతైడా (హి.పు) చూడు. تتھڑا

تٹ తట్ (హి.పు) తటము-తీరము.

تثلیث తస్లీస్ (అ.స్త్రీ) త్రిమూర్తులు, తత్వత్రయము, మూడుభాగములుచేయుట.

تثنیہ తస్నియ (అ.పు) ద్విగుణము, ద్వివచనము.

تج తజ్ (హి.స్త్రీ) లవంగపుపట్టలేక చెక్క.

تجّار తుజ్జార్ (అ.పు) వర్తకులు, బేహారులు.(ఏ-వ تاجر)

تجارت తిజారత్ (అ.స్త్రీ) వర్తకము, వ్యాపారము, బేహారము.

تجاری తిజారీ (హి.స్త్రీ) త్రియాహికజ్వరము, మూడవనాడు మరలవచ్చుజ్వరము.

تجاوز తజావుజ్ (అ.పు) అతిక్రమణము, మీరుదల, ఉల్లంఘనము, ఆధిక్యము, భేదము.

تجاہل తజాహుల్ (అ.పు) అజ్ఞానము.

تجاہل عارفانہ తజాహుల్-ఆరిఫానః (అ) తెలిసియు తెలియనట్టుండుట.

تجدید తజ్దీద్ (అ.స్త్రీ) నూతనసృష్టి, క్రొత్తదిగాచేయుట, నూతనకల్పన, క్రొత్తదనము.

تجربہ తజ్రిబ (అ.పు) అనుభవము, పరీక్ష, ప్రమాణము, శోధన, చేసిచూచుట.

تجربہ کار తజ్రిబ-కార్ (పా) అనుభవశాలి, నేర్పరి, ప్రవీణుడు, تجربہ کرنا తజ్రిబ-కర్నా (ఉ) అనుభవించిచూచుట, పరీక్షించిచూచుట, చేసిచూచుట.

تجرّد తజర్రుద్ (అ.పు) ఏకాంతము, ఒంటరికము, బ్రహ్మచర్యము, సన్యాసము.

تجرید తజ్రీద్ (అ.స్త్రీ) దిగంబరత్వము, ఏకాంతము, ఒంటరికము.

تجسّس తజస్సుస్ (అ.పు) అన్వేషణము వెదుకుట, విచారణ, విమర్శన, శోధ, జాడ

تجلجل తజల్జుల్ (అ.పు) సంక్షోభము, కలత, చలనము.

تجلّی తజల్లీ (అ.స్త్రీ) ప్రకాశము, కాంతి.

تجمّل తజమ్ముల్ (అ.పు) వైభవము, పటాటోపము, ఆడంబరము, డంబము, శృంగారము, లావణ్యము, అందము, రూపురేఖావిలాసములు. (వదలుట.

تجنا తజ్నా (హి) త్యజించుట, విడుచుట,

تجنیس తజ్నీస్ (అ.స్త్రీ) సజాతిత్వము, సాదృశ్యము, పోలిక, శ్లేష, సందిగ్ధత.

تجویز తజ్వీజ్ (అ.స్త్రీ) సంస్కారము, పర్యాలోచనము, ఉపాయము, ఏర్పాటు, కట్టుదిట్టము, చట్టము, విచారణ, తీర్పు.

تجویز ثانی తజ్వీజ్-సానీ (అ) పునర్విచారణ, రెండవతీరుమానము.

تجھ తుఝ్ (హి) నీ, నిన్ను.

تجھے తుఝే (హి) నీకు, నిన్ను

تجہیز و تکفین తజ్హీజ్ ఒ తక్ఫీన్

(అ.స్త్రీ) ప్రేతసంస్కారము, అపరకర్మ.

**تپانا** తపానా (హి) కాచుట, కరగుట.

**تپنا** తప్నా (హి) వెచ్చనగుట, కరగుట.

**تچھ** తుచ్ఛ్ (హి) తుచ్ఛము, పనికిమాలినది.

**تحائف** తహాఇఫ్ (అ పు) బహుమానములు, అపూర్వవస్తువులు, కానుకలు, (ఏ.వ **تحفه**)

**تحت** తహ్త్ (అ.స్త్రీ) అడుగు, క్రింద, స్వామ్యము, అధికారము, అధీనము **تحت الثرا**—ఉస్సరా (అ.పు) పాతాళలోకము. **تحت اللفظ**—ఉల్లఫ్జ్ (అ.పు) ప్రతిపదార్థము, ఏమాటకర్థము ఆ మాటకిౘిందనే వ్రాసియుండునది.

**تحرک** తహర్రుక్ (అ.పు) చలనము, కదలిక.

**تحریر** తహ్రీర్ (అ.స్త్రీ) విమోచనము, వ్రాత, పత్రము, శైలి, రచన, రేఖ గీత, వ్రాతకూలి, ఉత్తరము, చీటి, చిత్తరువు, చిత్రింపు, పటమువ్రాయుట.

**تحریص** తహ్రీస్ (అ.స్త్రీ) ఆశపుట్టించుట, ప్రోత్సాహపెట్టుట, రేపుట, పురికొల్పుట, ప్రేరణ.

**تحریف** తహ్రీఫ్ (అ.స్త్రీ) వర్ణవ్యత్యయము, శబ్దవ్యయము, లేఖకదోషము, ఒకటికి మరియొకటి వ్రాయుట, అపార్థముచేయుట.

**تحریک** తహ్రీక్ (అ.స్త్రీ) చలనము, కదలిక, చలింపజేయుట, ప్రేరణ, ప్రోత్సాహము, ప్రస్తావము, ప్రయత్నము.

**تحس نحس**—తహస్‌నహస్ (హి) క్రిందుమీదు, తారుమారు, నాశము, అధ్వానము, పాడు.

**تحسین** తహ్సీన్ (అ.స్త్రీ) శ్లాఘన, పొగడుట, ప్రశంస, మేలు మేలనుట, బళిరేయనుట.

**تحصیل** తహ్సీల్ (అ.స్త్రీ) సంపాదన, ఆదాయము, ప్రాప్తి, స్వామ్యము, పన్ను, కట్టుబడి, సంచయము. **تحصیلدار**—దార్ (పా) తహశీలుదారుడు, సుంకరీడు, తాలూకాపన్ను చెల్లించుకొనువాడు.

**تحصیلنا** తహ్సీల్‌నా (ఉ) సంపాదించుట, గడించుట, రాబట్టుట, చెల్లించుకొనుట.

**تحفگی** తుహ్ఫగీ (పా.స్త్రీ) అమూల్యత, ప్రశస్తత, శ్రేష్ఠత, ఒప్పిదము, అందము.

**تحفه-تحفا** తుహ్ఫ-ఫా (అపు) అరుదైన వస్తువు, కానుక, కట్నము, బహుమానము **تحفه یا طرفه معجون**—ఎ, యా తుర్ఫఎమఒజూన్ (అ) ఆశ్చర్యకరమైనమనిషి, హాస్యగాడు, నవ్వులబండి.

**تحقق** తహక్కుక్ (అ.పు) యదార్థము, నిశ్చయము, రూఢి, వాస్తవము.

**تحقیر** తహ్కీర్ (అ.స్త్రీ) తిరస్కారము, తృణీకారము, అవమానము, అగౌరవము.

**تحقیق** తహ్కీక్ (అ.స్త్రీ) యదార్థజ్ఞానము, నిర్ధారణ, విమర్శన, విచారణ, నిశ్చయము, యదార్థము, సిద్ధాంతము, ప్రమాణము, నిజము, దృష్టాంతము. **تحقیق کرنا**—కర్నా (ఉ) పరీక్షచేయుట, విమర్శించుట, విచారించుట, నిజపరచుట.

**تحقیق هونا**—హోనా (ఉ) యదార్థము తెలియుట, సిద్ధాంతమగుట, నిదర్శనమగుట, నిజపడుట.

**تحقیقات** తహ్కీకాత్ (అ.స్త్రీ) విచారణ, విమర్శన, పరీక్ష, జాడతీయుట.

**تحکم** తహక్కుమ్ (అ.స్త్రీ) ఆజ్ఞాపనము, నిర్బంధము, బలాత్కారము, బలవంతము, అధికారము. (డుట, కరగుట, జీర్ణమగుట.

**تحلیل** తహ్లీల్ (అ.స్త్రీ) వేరువేరగుట, వీ

**تحمل** తహమ్ముల్ (అ.పు) సహనము, ఓర్పు, గాంభీర్యము.

**تحمید** తహ్మీద్ (అ.స్త్రీ) భగవత్ స్తోత్రము,భగవన్నామస్మరణ. (పుట,పీడించుట.

**تحمیل** తహ్మీల్ (అ.స్త్రీ) బరువుమో

**تحویل** తహ్వీల్ (అ.స్త్రీ) మార్పు,తిరుగుడు,స్వాధీనము, అప్పగింత, అప్పగింత పెట్టినరొక్కము, నిలువ, పెట్టుబడి, మూలధనము, మార్కుపులెక్కలు, గ్రహములు మొ॥ మరియొక రాశిలోప్రవేశించుట, సంక్రమణము. **تحویلدار**—తహ్వీల్-దార్ (పా)భాండారికుడు, బొక్కసముపై యధికారి.

**تحیت** తహియత్ (అ.స్త్రీ) వందనము, నమస్కారము.

**تحیر** తహైయుర్ (అ.పు) ఆశ్చర్యము, అచ్చెరువు, దిగ్భ్రమ.

**تخالف** తఖాలుఫ్ (అ.పు) ప్రతికూలము,విరోధము,పరస్పరవైరము.

**تخت** తఖ్త్ (పా.పు) సింహాసనము, పీఠము, పీట, రాచరికము,రాజ్యము.

**تخت بخت**—తఖ్త్-బఖ్త్(పా) రాజపదవీచ్యుతుడు. **تخت پوش**—తఖ్త్-పోష్(పా) సింహాసనముపైనిచోళము లేక గవిసెన.

**تخت رواں**—తఖ్త్-ఎ,రవాఁ (పా)రాజాందోళము. **تخت سلیمان**—తఖ్త్-ఎ-సులేమాన్ (పా) కాశ్మీరదేశములోనిఒకపర్వతము. **تخت طاؤس**—తఖ్త్-ఎ-తావూస్ (పా) మయూరసింహాసనము.

**تخت گاہ**—తఖ్త్-గాహ్ (పా) రాజధాని.

**تخت نشینی**—తఖ్త్-నషీనీ(పా.స్త్రీ) సింహాసనారోహము,రాజ్యాభిషేకము, పట్టాభిషేకము.

**تختہ** తఖ్త (పా.పు) పలక, బల్ల,చెక్క, కాకితపుటావ్రు,పుష్పవాటిక, అడుగు,మడి.

**تختہ پل**—తఖ్త-పుల్ (పా) కొయ్యవంతెన.

**تختہ بندی**—తఖ్త-బందీ (పా)బల్లకూర్పు, పాదులుచేయుట,మళ్లుకట్టుట.

**تختہ تابوت**—తఖ్త-యేతాబూత్ (పా) శవవాహనము. **تختہ تعلیم**—తఖ్త-యేతఽలీమ్ (పా) వ్రాతపలక. **تختہ نرد**—తఖ్త-యే-నర్ద్ (పా) సొగటాపాళి. (పలక.

**تختی** తఖ్తీ(పా.స్త్రీ) చిన్న పలక,వ్రాత

**تخصیص**—తఖ్సీస్(అ.స్త్రీ)విశేషము,నిర్దేశము,అసాధారణత్వము,నిర్ణయము,ప్రత్యేకత

**تخفیف** తఖ్ఫీఫ్ (అ.స్త్రీ) సంక్షేపము,తగ్గింపు, ఉపశమనము, త్రోసివేత.

**تخلص** తఖల్లుస్(అ.పు) విమోచనము, విడుదల, కవీశ్వరునియంకితము.

**تخلف** తఖల్లుఫ్ (అ.పు) ఆలస్యము, వెనుకపడుట.

**تخلل** తఖల్లుల్ (అ. పు) కలత,భంగము.

**تخلیہ** తఖ్లియా (అ.పు)ఏకాంతము, విసర్జనము.

**تخم** తుఖ్మ్ (పా.పు) బీజము,విత్తు,మూలము, అండము. **تخم ریزی**—తుఖ్మ్-రేజీ (పా)విత్తుట, విత్తనములచల్లకము.

**تخمہ** తుఖ్మ (అ.పు) అజీర్ణము,మందము.

**تخمیر** తఖ్మీర్ (అ.స్త్రీ) మురుగుడు, పులియుట.

**تخمینہ** తఖ్మీన (అ.పు) అంచన, ఉజ్జాయింపు; ఉరమర, రమారమి, దాదాపు, ఇంచుమించు. **تخمیناً**—తఖ్మీనన్ (అ) దాదాపుగా, ఉరమరగా, ఇంచుమించుగా.

**تخویف** తఖ్వీఫ్ (అ.స్త్రీ) బెదరింపు, భయపెట్టుట.

**تخیل** తఖయ్యుల్ (అ.పు) అనుమానము, అనుకొనుట,తలంపు-భావన,ఊహ.

**تخیم** తఖైయుమ్ (అ.పు) గుడారము వేయుట.

**تد** తద్ (హి)తదా, అప్పుడు.

**تدارک** తదారుక్ (అ.పు) ప్రతీకారము, ప్రతిఫలము, శిక్ష, ఉపాయము, చీవాట్లు, కట్టుదిట్టము. (యము.

**تداول** తదావుల్ (అ.పు) సాంప్రదా

**تداوی** తదావీ (అ.స్త్రీ) చికిత్స,వైద్యము.

**تدبیر** తద్బీర్ (అ.స్త్రీ) పర్యాలోచనము, తంత్రము, ఉపాయము, కౌశలము, విచారము, ప్రయత్నము, పదిలము, కట్టుదిట్టము, ఏర్పాటు.

**تدبیرسلطنت** -ఎ,సల్తనత్ (అ) రాజ్యతంత్రము, రాజనీతి.

**تدرا** తిదరా (హి.పు) త్రిద్వారము, మూడు వాకిండ్లయిల్లు.

**تدریج** తద్రీజ్ (అ.స్త్రీ) క్రమము, తారతమ్యము. **بہ تدریج** బ-(పా) క్రమముగా,కొంచముగా, మెల్లగా.

**تدریس** తద్రీస్ (అ.స్త్రీ) ఉపన్యాసము, పాఠము చెప్పుట, నేర్పుట.

**تدفین** తద్ఫీన్ (అ.స్త్రీ) భూస్థాపనము, పాతిపెట్టుట.

**تدھارا** తిధారా (హి.పు) త్రినదీకూటము.

**تذبذب** తజబ్‌జబ్ (అ.పు) సంభ్రమము; కలత, కలవరము,ముభావము, ద్వంద్వబుద్ధి, అనిశ్చయము, సందేహము, సందిగ్ధము, అనుమానము.

**تذکرہ** తజ్‌కిర (అ.పు) ప్రస్తావము,ప్రశంస, జ్ఞాపనము, చరిత్రము, ఇతిహాసము.

**تذکیر** తజ్‌కీర్ (అ.స్త్రీ) పుల్లింగము,మొగతనము,జ్ఞాపకము.

**تذلیل** తజ్‌లీల్ (అ.స్త్రీ) తిరస్కారము, తృణీకారము, నీచపరచుట. అవమానము.

**تر** తర్ (పా) తడి,నెమ్మగల;క్రొత్త,నవీనమైన;జిడ్డుగల; ప్రస్తుతపు; పచ్చి,పచ్చని; ద్రవ్యముగల;రసవంతమైన; మిక్కిలి; తరప్రత్యయము.

**تراب** తురాబ్ (అ.పు) నేల, మన్ను.

**ترار** తఱ్ఱార్(హి) వడిగల, చురుకుగల.

**ترارا** తఱ్ఱారా(హి.పు) వేగము, వడి,డంబము, మైకము,గుఱ్ఱపుగంతు,సంభ్రమము.

**ترازو** తరాజూ (పా.స్త్రీ) త్రాసు, తక్కెడ. (బుగులు.

**تراس** త్రాస్ (హి.పు) త్రాస-భయము,భీతి,

**تراس** తిరాస్ (హి.స్త్రీ) దప్పి, దూప, తృష్ణ

**تراسی** తిరాసీ(హి)ఎనుబదిమూడు.

**تراش** తరాష్ (పా.స్త్రీ) కోత,చెక్కడము,రూపము, అందము, వైఖరి, ఫక్కి, తీవి, రీతి,కల్పన, ఆడెదు-చీల్లనుకోయగా వచ్చినచీటి;చీలిక; రచన.

**تراشنا** తరాష్నా (హి)కోయుట, చెక్కుట,చీల్చుట,గోరుగుట.

**ترانا** తిరానా (హి)ఈదించుట, తేల్చుట, తరింపచేయుట,

**ترانوے** తిరాన్వే (హి) తొంబదిమూడు.

**ترانہ** తరాన (పా.పు) ఆలాపనము, దరువు, లయ, రాగము, పాట.

**تراو** తిరావ్ (హి.పు) ఈత.

**تراوش** తరావిష్ (పా.స్త్రీ) ఉరుపు;

చినుకులు, తుంపరలు; కారుట.

تراویح తరావీహ్ (అ.స్త్రీ) రంజాన్ లో చదివెడుఖురాను మరీఫులోని అనువాకములు, (ఆయతులు)

تراہ త్రాహ్ (హి) త్రాహి త్రాహి.

ترہا తిరాహా (హి.పు) త్రిపథము, మూడు త్రోవలుకలియుచోటు.

ترہی తిరాహీ (హి.స్త్రీ) తిరావాయనుయూరిలో చేసిన ఆయుధము, కత్తి, కటారు మొ॥

ترائی తరాయీ (హి.స్త్రీ) పల్లి, చిత్తడి నేల, వాక, కొండక్రింది భూమి. (మన్ను

تربت తుర్బత్ (అ.స్త్రీ) సమాధి, దిబ్బ,

تربوز తర్బూజ్ (పా.పు) కలంగిరిపండు, పుచ్చకాయ.

تربھر తిర్భిర్ (హి) కోపము, చిట్టుబుట్టు.

تربیت తర్బియత్ (అ.స్త్రీ) శిక్షు, విద్యాభ్యాసము.

ترپ తురుప్ (ఇం.పు) గట్టుపుదండు.

ترپال తిర్పాల్ (ఇం.పు) కీలుపూసినగోనె గుడ్డలేకపట్ట.

ترپانا తుర్పానా (హి) కుట్టించుట. (కుట్టు.

ترپائی తుర్పాయీ (హి.స్త్రీ) కూర్పు,

ترپڈ త్రిపడ్ (హి.పు) ముక్కాలిపీట, ముక్కాలిచట్టము.

ترپن తర్పన్ (హి.పు) తర్పణము.

ترپن తిర్పన్ (హి) ఏబదిమూడు.

ترپن తుర్పన్ (హి.స్త్రీ) దిబ్బకుట్టు, అంచుమడచినకుట్టు.

ترپنا తుర్పనా (హి) అంచుమడచికుట్టుట.

ترپولیا త్రిపోలియా (హి.పు) సింహద్వారము, వరుసగానుండుమూడువాకిండ్లు.

ترپھلا త్రిఫలా (హి.పు) త్రిఫలములు, కరక, తాడి, ఉసిరికలు.

ترت తురత్-తుర్త్ (హి) తురుతుగా, ప్రస్తుతము, త్వరగా, తక్షణమే. ترت پھرت తురత్-ఫురత్ (హి) సంభ్రమము, అట్టిహాసము, త్వర, చురుకుదనము, చాకచక్యము.

ترترا తుర్తురా (హి) చురుకైన, చాకచక్యముగల, వడిగల, నాలుకచురుకైన, దుడుకు, తొందరపాకి. (టు, పొటుకు పెట్టుట.

ترترانا తిర్తిరానా (హి) ఉటియుట, కారు

ترترانا తర్తరానా (హి) డంబముకొట్టుట.

ترتراہٹ తర్తరాహట్ (హి.స్త్రీ) డంబము, ప్రకోపము, ఆవేశము. (కొమ్మ.

ترتری తుర్తురీ (హి.స్త్రీ) బూరగ,

ترتریا తుర్తుర్యా (హి.పు) ఉటంకి, చంచలుడు, చురుకుగలవాడు.

ترتیب తర్తీబ్ (అ.స్త్రీ) క్రమము, వర్ణనము, తీర్పు, వరుస, పంక్తి, ఏర్పాటు, విభజన.

ترتیب تہجی ఎ-తర్తీబ్-ఎ-తహజ్జీ (అ) వర్ణక్రమము, ఆకారాదిక్రమము.

ترجمان తర్జుమాన్ (అ.పు) భాషాంతరము చేయువాడు, ద్విభాషి, టీకాకారుడు.

ترجمہ తర్జుమ (అ.పు) భాషాంతరము, టీక.

ترجیح తర్జీహ్ (అ.స్త్రీ) ఆధిక్యత, ఉత్తమత, వాసి, మేలుతరముగానెంచుట, మీరుట.

ترجیع తర్జీఉ (అ.స్త్రీ) తిరుగుదల, మళ్లుదల, గ్రహముల వక్రగతి.

ترچھا తిర్ఛా (హి) అడ్డముగా, వంకరదైన, వాలుగానున్న, ఏటవాలైన, నీటుగల, సొగసుగాడైన. ترچھی نگاہ తిర్ఛీ-నిగాహ్ (హి) కటాక్షవీక్షణము, మెల్ల చూపు, ఓరచూపు; క్రూరదృష్టి, కోపదృష్టి.

**ترچھانا** తర్ ఛానా (హి) ఏటవాలుగానుంచుట, ఒరగ బెట్టుట, వాల్చుట, అడ్డముగా నుంచుట. (మష్టు, మడ్డి.

**ترچھٹ** తర్ ఛట్ (హి. స్త్రీ) అడుగు,

**ترحم** తరహ్హుమ్ (అ. పు) కనికరము, దయ, కరుణ. (సంక్షేపము.

**ترخیم** తర్ ఖీమ్ (అ. స్త్రీ) అంత్యలోపము,

**تردد** తరద్దుద్ (అ. స్త్రీ) రాకపోకలు, పర్యాలోచన, విచారము, వ్యాకులము, చింత, పరిశ్రమ.

**تردست** తర్ దస్త్ (పా) చురుకుగల.

**تردید** తర్ దీద్ (అ. స్త్రీ) పూర్వపక్షము, ప్రతివాదము, కొట్టివేయుట, త్రిప్పివేయుట, నిరాకరణము.

**ترديف** తర్ దీఫ్ (అ. స్త్రీ) వెనుకవచ్చుట.

**ترس** తర్స (హి. పు) కనికరము, దయ.

**ترس کھانا** —ఖానా (హి) కనికరపడుట.

**ترس** తర్స (పా. పు) భయము, భీతి. (వైన.

**ترسان** తర్ సాం (పా) భయపడెడు, భీరు

**ترسانا** తర్ సానా (హి) ఆశ పెట్టుట, అడియాసపుట్టించుట, ఆశాభంగముచేయుట.

**ترستھ** తిర్ సఠ్ (హి) అరువదిమూడు.

**ترسنا** తరస్ నా (హి) ఆశించుట, కనికరపడుట. (న, భయపడిన.

**ترسناک** తర్ స్ నాక్ (పా) భయంకరమై

**ترسول** త్రిసూల్ (హి. పు) త్రిశూలము.

**ترسوں** తర్ సోం (హి) ఆవలి మొన్న లేక ఆవలి ఎల్లుండి. (పంపుట.

**ترسیل** తర్ సీల్ (అ. స్త్రీ) అంపకము,

**ترش** తుర్ష్ (పా) పుల్లని, పరుషమైన, అసమాధానమైన. **ترش رو** —రూ (పా) పరుషుడు, కోపిష్ఠి, చిట్టుబుట్టు అనువాడు.

**ترشانا** తుర్ షానా (ఉ) పులియుట.

**ترشائی** తుర్ షాయీ (ఉ. స్త్రీ) పుల్లదనము, పులుపు; పరుషత్వము, కఠినత.

**ترشح** తరష్షుహ్ (అ. పు) తుషారము, తుంపరలు, చినుకులు; తెలియుట, జాడ.

**ترشنا** త్రిష్నా (హి. స్త్రీ) తృష్ణ, ఆశ.

**ترشنا** తరష్నా (ఉ) తెగుట, కోతపడుట, చీలుట.

**ترشوانا** తర్ష్ వానా (ఉ) కోయించుట, చీల్పించుట, నరికించుట, చెక్కించుట.

**ترشی** తుర్ షీ (పా. స్త్రీ) పులుపు; పరుషత్వము, కఠినత.

**ترصد** తరస్సుద్ (అ. పు) ఆశ.

**ترغیب** తర్ గీబ్ (అ. స్త్రీ) ప్రేరణ, ప్రోత్సాహము, బుజగింపు, ప్రేరేపణ. పురికొల్పు, ఆశపుట్టించుట.

**ترقب** తరక్కుబ్ (అ. పు) నిరీక్షణము, ఎదురుచూచుట.

**ترقی** తరక్కీ (అ. స్త్రీ) వృద్ధి, అభివృద్ధి.

**ترقیق** తరకీక్ (అ. స్త్రీ) పలచదనము, పలచనగాచేయుట. (పత్రము, ఉత్తరము.

**ترقیم** తర్ కీమ్ (అ. స్త్రీ) లేఖనము, వ్రాత,

**ترک** తుర్క్ (అ. పు) తురక, రౌతు, రోధుడు, ప్రియుడు. **ترک سوار** —సవార్ (పా) తురక రౌతు.

**ترک** తర్క్ (అ. పు) విసర్జనము, త్యాగము, పొరపాటు, లోపము; ఒక పుటతుదనుండి మరలతరువాతి పుటలో మొదట వ్రాయుయక్షరము. **ترک ادب** —ఎ, అదబ్ (అ) అనాగరికత, మోటుతనము, అవిధేయత.

**ترک** తరక్ (హి. స్త్రీ) వాసము, దూలము.

ترک తర్క్ (హి.పు) తర్క–శాస్త్రము.

ترکاری తర్కారీ (హి.స్త్రీ) శాకము, కాయలు.

ترکٹا త్రికుటా (హి.పు) శొంఠి,పిప్పళ్లు,మిరియము,త్రికటుకములు.

ترکش తర్కశ్ (పా.పు) తూణీరము, అమ్ములపొది

ترکن-ترکنی తుర్కన్ - తుర్క్‌నీ (హి.స్త్రీ) తురక స్త్రీ.

ترکون త్రికోణ్ (హి.స్త్రీ) త్రికోణము,ముక్కోణము.

ترکہ తర్కః (అ.పు) పైతృకము, ఆస్తి,సొత్తు, తండ్రి పెట్టిపోయినది.

ترکھا తిర్ఖా (హి.స్త్రీ) దప్పి,ఆశ,అత్యాశము.

ترکھنٹی తిర్ఖుంటీ (హి.స్త్రీ) ముక్కాలిపీటలేక చట్టము.

ترکی తుర్కీ (పా.పు) ఘోట్రాణము(గుఱ్ఱము) తురుష్కుడు,తురుష్క భాష,గర్వము.

ترکی-تڑکی తర్కీ-తడ్కీ (హి.స్త్రీ) తాటిచెట్టు చెవులకమ్మ.

ترکیب తర్కీబ్ (అ.స్త్రీ) మిశ్రగుణము, కలుపుట; రచన, ఉపాయము;అన్వయము, పదములసంబంధము.వైఖరి,చేతబడి, పొంకము,రీతి, పరిహారము, శివి,పద్ధతి; శబ్దలక్షణము

ترم తురమ్ (హి.పు) తువారా, కొమ్ము

ترمرا తిర్మిరా (హి.పు) నీటిపైచమురు చుక్క,మిరుమిట్లు.

ترمرانا తిర్మిరానా (హి) తళతళలాడుట,మిరుమిట్లుగొనుట.

ترمراہٹ తిర్మిరాహట్ (హి.స్త్రీ) తళతళ,మిరుమిట్లు. (కండ్లుతిరుగుట.

ترمری తిర్మిరీ (హి.స్త్రీ) కండ్లచీకటి,

ترمورتی త్రిమూర్తి (హి.స్త్రీ) త్రిమూర్తులు.

ترمیم తర్మీమ్ (అ.స్త్రీ) సవరణ, మార్పు, దిద్దుబాటు, సంస్కారము-బాగుచేయుట.

ترنا తర్నా (హి) తరించుట.

ترنا తిర్నా (హి)ఈదుట,తేలుట.

ترنج తురన్జ్ (అ.పు) దబ్బకాయ.

ترنگ తరంగ్ (హి.స్త్రీ)తరంగము,అల; ఉత్సాహము, ఉద్రేకము, లహరి,ధ్యాసము-స్వభావము.

ترنم తరన్నుమ్ (అ.పు) పాట,రాగము.

تروار తర్వార్ (హి.స్త్రీ) కరవాలము, ఖడ్గము.

ترور తర్వర్ (హి.పు)చెట్టు,తరువరము.

ترہ తర(పా.పు)ఆకుకూరలు, తోటకూరలు.

ترہی తుర్హీ (హి.స్త్రీ)బూరగ,తుతార.

ترئی తురై (హి.స్త్రీ)బీరకాయ; బూరగ.

تری తరీ (పా.స్త్రీ) తడి, నెమ్ము, సముద్రము.

تریا త్రియా(హి.స్త్రీ) స్త్రీ,ఆడుది.

تریاق-تریاک తిర్యాక్-క్ (అ.పు) విషపరిహారకౌషధము, నల్లమందు, సర్వరోగహారి

تریتا త్రేతా (హి.స్త్రీ) త్రేతాయుగము.

تریڑا-تڑیڑا తరేడా-తడేడా (హి.పు) నీటిధార(కట్టుట).

تریز తరేజ్(పా.స్త్రీ) చొక్కాయొక్క పక్కపీలిక,ముమ్మూలపీలిక.

تڑ తడ్ (హి.పు) ప్రక్క–పట్టను చప్పుడు.

تڑا తడా (హి.పు) లంక,గడ్డ.

تڑا بھڑی తడాభడీ (హి.స్త్రీ) త్వర,వడి, తొందర,నిరవకాశము,ఉద్రేకము.

تڑاپڑ తడాపడ్(హి)తోడ్తోట, వెంటవెంట, నిరవకాశముగా.

تڑاڑا తడాడా (హి.పు) చూడు. تڑیڑا

تڑاق-تڑاک తడాక్-క్ (హి.స్త్రీ) చటాలులేక వెటాలుమనుచప్పుడు, వెళ్లు-వెళవెళ.

تڑاقا-تڑاکا తడాకా-కా (హి.పు) వెళ్లు, (చప్పుడు) చటాలుమనుచప్పుడు, తక్షణము,వడి, వెళవెళ. تڑاکے-తడాకే (హి) రుచికరమైన, తీక్ష్ణమైన. (డుచుట.

تڑانا తడానా(హి) చిముచిములాడుట, పా

تڑانا తుడానా (హి)విడిపించుట, తెంచుట, రూపాయి మొ॥ మార్చుట. (తుట్టి.

تڑائی తుడాయీ (హి.స్త్రీ) వట్టము

تڑپ తడప్ (హి.స్త్రీ)గిజగిజ, తటతట, దడ,తహతహ,గంతు, మెరుపు, తళుక్కు,మిరుముట్లు,అదురు,అల్లాడము,తల్లడము.

تڑپانا తడ్‌పానా (హి) గిజగిజలాడించుట, కలత పెట్టుట,తల్లడ పెట్టుట,అల్లాడించుట.

تڑپنا తడప్‌నా (హి) తటతటలాడుట, గిజగిజలాడుట,తల్లడపడుట,అల్లాడుట,ప్రయాసపడుట,కొట్టుకొనుట.

تڑپھڑانا తడ్‌ఫడానా (హి)గిజగిజలాడుట, అల్లాడుట, కొట్టుకొనుట,గడగడలాడుట, తటతటలాడుట,తల్లడపడుట,అదరుట.

تڑپھڑاہٹ-تڑپڑاہٹ తడ్‌ఫడాహట్-తడ్‌పడాహట్ (హి.స్త్రీ)గిజగిజ,గడగడ-తటతట-దడదడ- అల్లాట- తల్లడము, అదరు-కొట్టుకొనుట.

تڑخنا తడఖ్నా (హి) పగులుట- చీలుట, చీటుపారుట,పటపటములాడుట-కోపించుట.

تڑکا తడ్‌కా (హి.పు) ఉదయము-బలబల, (తెల్లవారుట) تڑکاہونا-తడ్కాహోనా (హి) బలబల తెల్లవారుట.

تڑکنا తడక్నా (హి) చూడు. تڑخنا

تڑوانا తుడ్‌వానా(హి) విరిపించుట-తెంపించుట-కోయించుట-రూపాయి మొ॥ మార్పించుట.

تڑی తడీ (హి.స్త్రీ)దెబ్బలు-మోసము.

تڑیانا తడ్‌యానా (హి) కొద్దికొద్దిగాఎగిరిపోవుట-కప్పగంతులవలెనడచిపోవుట.

تڑیڑا తడేడా (హి.పు) చూడు تربیڑا

تزک తుజుక్ [తు.పు] వైభవము, డంబము, పటాటోపము, అలంకారము, కట్టుదిట్టము, ఏర్పాటు, చరిత్రము.

تزکیہ తజ్‌కియ [అ.పు] పరిశుద్ధి.

تزلزل తజల్‌జుల్ [అ.పు] భూకంపము, చలనము, కలత. (టుక్కు.

تزویر తజ్‌వీర్ [అ.స్త్రీ] మోసము,

تزئین తజ్‌యీన్ [అ.స్త్రీ] శృంగారము, అలంకారము.

تس తిస్ [హి స్త్రీ] దప్పి,దూప.

تس తిస్[హి]ఆ,అది,ఏది. تس پر-తిస్-పర్ [హి] అందుపై, ఇంక. ఇంతేకాక,మరియు. تس پربھی-తిస్-పర్‌భీ (హి) అయినను,ఇంకను,అయినప్పటికిని.

تس తుస్(హిపు)పొట్టు,గడ్డి,కసవు. (తము

تسار తుసార్(హి. పు)తుషారము,మంచు,శీ

تسالا తిసాలా (హి)మూడేండ్లవయస్సుగల,

تساوی తసావీ (అ.స్త్రీ) సాహ్యము,సమానత. (అశ్రద్ధ,ఆలస్యము.

تساہل తసాహుల్(అ.పు)అశ్రద్ధ, ఆలసము,

تسبیح తస్‌బీహ్(అ.స్త్రీ) జపమాల,జపము,

تسبیح خواں-తస్‌బీహ్-ఖాం (పా) (వేతనము గొని) అనుష్ఠానముచేయువాడు.

تسخر తసఖ్ ఖుర్ (అ.పు) పరిహాసము, ఎగ తాళి.

تسخیر తస్ఖీర్ (అ.స్త్రీ) స్వాధీనము, వశీకరణము, లోపరచుకొనుట-కట్టుబాటు, తంత్రము,

تسر తసర్ (హి.పు) దసలు, ఒకవిధమైనపట్టు.

تسطیر తస్తీర్ (అ.స్త్రీ) లేఖనము, వ్రాత, వాంగ్మూలము వ్రాయుట. (వైష్టికము.

تسکیک తస్కీక్ (అ) నాణెములు చేయుట.

تسکین తస్కీన్ (అ.స్త్రీ) విశ్రాంతి, సంతుష్టి, ఉపశమనము, ఆరోగ్యము, బరువసము, శాంతి-నిమ్మళము. (పల్లెము.

تسلا తస్లా (హి.పు) తాంబాళము-తట్ట.

تسلسل తసల్సుల్ (అ.పు) వరుస-క్రమము బారు-పంక్తి. (ర్వ స్వాతంత్ర్యము.

تسلط తసల్లుత్ (అ.పు) సర్వాధికారము-స

تسلی తసల్లీ (అ.స్త్రీ) సంతుష్టి, బరువసము, నిమ్మళము-నెమ్మది, స్వస్థత.

تسلیم తస్లీమ్ (అ.స్త్రీ) వందనము, నమస్కారము, అంగీకారము, ఒప్పికోలు, సమ్మతము.

تسلیمات తస్లీమాత్ (అ.స్త్రీ) నమస్కారములు, వందనములు. (ఏ-వ تسلیم

تسمہ తస్మహ్ (పా.పు) తోలువారు, తోలుపట్టి. (నామకరణము, పేరు పెట్టుట.

تسمیہ తస్మియ (అ.పు) అభిధానము,

تسمئی తస్మయీ (హి.స్త్రీ) క్షీరాన్నము.

تسنیم తస్నీమ్ (అ.పు) మహమ్మదీయ స్వర్గమందలియొక చెలమ. (కొలత.

تسو తసూ (హి.పు) ఒక చిన్నర అంగుళము

تسوانی بسوانی తిస్వానీ (హి.స్త్రీ) లో ఇరువదియవపాలు. (క, సారూప్యము.

تشابہ తషాబుహ్ (అ.పు) సామ్యము, పోలి

تشاکل తషాకుల్ (అ.పు) అనురూపము, పోలిక, సారూప్యము.

تشبیہ తష్బీహ్ (అ) సామ్యము, ఉపమానము, పోలిక, సాదృశ్యము. تشبیہ دینا -దేనా (ఉ) పోల్చుట, సరిపోల్చుట.

تشت తష్త్ (పా.పు) పళ్లెము, తట్ట.

تشتری తష్తరీ (హి.స్త్రీ) పళ్లెము, సిబ్బి.

تشخیص తష్ఖీస్ (అ.స్త్రీ) నిర్దేశము, నిర్ధారణ, నిర్ణయము, రోగనిదానము, పరీక్ష, అంచన, కట్టుబడి, మదింపు.

تشدد తషద్దుద్ (అ.పు) నిర్బంధము, బలవంతము, కష్టము. (చిహ్నము (ు)

تشدید తష్దీద్ (అ.స్త్రీ) ద్విత్వము, ద్విత్వ

تشریح తష్రీహ్ (అ.స్త్రీ) వివరణము. వయినము, విశదీకరణము, భాష్యము, శారీరశాస్త్రము. تشریح وار -వార్ (పా) వయినముగా, వివరముగా.

تشریف తష్రీఫ్ (అ.స్త్రీ) గౌరవింపు, సత్కారము, బహుమానము (గొప్పవారిచ్చినవి) تشریف لانا-لیجانا -లానా-లేజానా (ఉ) వేంచేయుట, విజయముచేయుట.

تشفی తషఫ్ఫీ (అ.స్త్రీ) తృప్తి, నమ్మకము, నిమ్మళము, ఊరడింపు, బరువసము.

تشنا తిష్నా (హి.స్త్రీ) దప్పి, ఆశ, నింద, దెప్పు, చీవాట్లు.

تشنج తషన్నుజ్ (అ.పు) బిఱ్ఱబిగియుట, నీలుగుట, దేహమందలి ఈడ్పు, అవయవముల ఈడ్పు. (తృష్ణ.

تشنگی తిష్నగీ (పా.స్త్రీ) దప్పి, దూప,

تشنہ తిష్న (పా) దప్పిగొన్న.

تشنیع తష్నీఅ (అ.స్త్రీ) ఎత్తిపొడుపు, దెప్పు, చీవాట్లు.

تشویش తష్వీష్ (అ.స్త్రీ) కలత, తత్తర, వ్యాకులము, చింత, తల్లడము.

**تشہیر** తష్‌హీర్ (అ.స్త్రీ) ఘోషణ, ప్రకటన, చాటింపు, ప్రచురపరచుట.

**تصانیف** తసానీఫ్(అ.స్త్రీ) గ్రంథములు. (ఏ-వ-تصنیف)

**تصحیح** తస్‌హీహ్(అ.స్త్రీ) దిద్దుబాటు,సవరణ, సరి,ఒప్పు, నిజపరచుట,సిద్ధాంతము.

**تصدق** తసద్దుక్ (అ.పు) దిగదుడుచుట, బలి, ప్రసాదము,బిచ్చము.

**تصدیع-تصدیعہ** తస్‌దీఉ,తస్‌దీఅ(అపు) బాధ,తలశూల,కష్టము.

**تصدیق** తస్‌దీక్(అ.స్త్రీ)నిజపరచుట, రూఢిపరచుట, నిజమని వ్రాయుట, ఋజువుపరచుట, సిద్ధాంతము,ప్రమాణము,దృష్టాంతము,సాక్ష్యము.

**تصرف** తసర్రుఫ్(అ.పు) మార్పు,వ్యయము, స్వాధీనము, ఉపయోగము, అధికారము, వాడుక, అపహరణము.

**تصرفی** తసర్రుఫీ (అ) పనిపాటులవాండ్రకై చేసినవంట. (వయినము.

**تصریح** తస్‌రీహ్ (అ స్త్రీ) వివరణము,

**تصریف** తస్‌రీఫ్(అ స్త్రీ)క్రియారూపనిష్పత్తి,శబ్దరూపనిష్పత్తి, శబ్దలక్షణశాస్త్రము.

**تصغیر** తస్‌గీర్ (అ.స్త్రీ) లఘ్వీకరణము, చిన్నదిగా చేయుట,లఘువాచకము.

**تصفیہ** తస్ఫియ(అ.పు) పరిశుద్ధి, తీరుమానము,తీర్పు,సమాధానము.

**تصلیب** తస్‌లీబ్(అ.స్త్రీ)కొరతన వేయుట.

**تصنع** తసన్నుఉ(అ.పు) కల్పన,కృత్రిమము, శృంగారము, ఆడంబరము, టక్కు, మార్పు, చేతబడి.

**تصنیف** తస్‌నీఫ్(అ.స్త్రీ) రచన,కల్పన, గ్రంథము. **تصنیف کرنا**-కర్నా (ఉ) రచియించుట, చేయుట.

**تصور** తసౌవుర్ (అ.పు) భావన, తలంపు, ఆలోచన, ఊహ, ధ్యానము, అభిప్రాయము. (జ్ఞానము,వైరాగ్యము.

**تصوف** తసవ్వుఫ్ (అ.పు) వేదాంతము,

**تصویر** తస్‌వీర్ (అ.స్త్రీ) స్వరూపము, ప్రతిమ,చిత్రము, పటము, చిత్తరువు

**تصویر کھینچنا**-తస్‌వీర్ ఖేంచ్నా (ఉ) ప్రతిమను వ్రాయుట, చిత్తరువు వ్రాయుట, చిత్రించుట. **تصویر ہو جانا**-హోజానా (ఉ) మ్రాన్పడుట, బిచ్చగొనుట, దిగ్భ్రమజెందుట, అచ్చెరువందుట.

**تضحیک** తజ్‌హీక్ (అ.స్త్రీ)పరిహాసము, ఎగతాళి,అవమానము.

**تضرع** తజర్రుఉ (అ.పు) శోకము, దుఃఖము, ఏడ్పు,అంగలార్పు.

**تضمین** తజ్‌మీన్(అ.స్త్రీ)అనుబంధనము, కలుపుట, ఒకరురచించిన పద్య పాదమునుతన పద్యమందు చేర్చికట్టుట,తగుల్చుట.

**تضیع** తజీఉ (అ.స్త్రీ) వృథా చేయుట, వ్యర్థముచేయుట, పాడుచేయుట, చెరుపుట. (పు-రెట్టింపు-ద్విగుణము.

**تضعیف** తజ్‌యీఫ్ (అ.స్త్రీ)ఇనుమడిం

**تطابق-تطبیق** తతాబుక్-తత్‌బీక్(అ.పు) అనుకూలము-సంబంధము-పోలిక-సమానత-సామ్యము. (హరణము.

**تطاول** తతావుల్ (అ.పు) క్రౌర్యము-అప

**تطویل** తత్‌వీల్ (అ.స్త్రీ) విలంబనము-పొడిగించుట.

**تظلم** తజల్లుమ్ (అ.పు) క్రౌర్యము-నిర్బంధము, అన్యాయము-బలాత్కారము.

**تعارف** తఆరుఫ్ (అ.పు) పరిచయము-గురుతు-తెలిసియుండుట.

**تعاقب** తఆకుబ్ (అ.పు) వెంబడింపు-అను వర్తనము-తరుముట.

**تعالی** తఆలా(అ) మహా-గొప్ప-గొప్పవాడ నుట; బాపురే-ఆశ్చర్యార్థకము-అబ్బబ్బా.

**تعاون** తఆవన్ (అ.పు) సహాయము-తోడు.

**تعب** తఅబ్ (అ.స్త్రీ) ప్రయాసము- శ్రమ, చింత-ఆయాసము.

**تعبیر** తఅబీర్ (అ,స్త్రీ) వివరణము-తాత్పర్యము-గూఢార్థము చెప్పుట- తెలియజేయుట. **تعبیرگو**-గో (పా) స్వప్నఫలితము చెప్పువాడు. (అచ్చెరువు.

**تعجب** తఅజ్జుబ్ (అ.పు) ఆశ్చర్యము-వింత,

**تعجیل** తఅజీల్ (అ.స్త్రీ) వేగిరపాటు, త్వర-తత్తర-సంభ్రమము.

**تعداد** తఅదాద్ (అ.స్త్రీ) సంఖ్య-మొత్తము, లెక్క-గణన-అంచన.

**تعدی** తఅద్దీ (అ.స్త్రీ) బలవంతము- బలాత్కారము- నిర్బంధము-క్రౌర్యము- మీరుట-ఉల్లంఘనము, అకర్మకక్రియను సకర్మక క్రియగా జేయుట.

**تعذر** తఅజ్జుర్ (అ.పు) క్షమాపణను వేడుకొనుట-మన్నింపు, నెపము.

**تعرض** తఅర్రుజ్ (అ.పు) ముందరికివచ్చుట, అడ్డము-ఆటంకము-అభ్యంతరము.

**تعریف** తఅరీఫ్ (అ.స్త్రీ) పరిచయము, గుర్తు-నిర్వచనము-వివరణ, ప్రశంస, స్తోత్రము, వర్ణనము-గుణము-విశేషము.

**تعریف المجهول بالمجهول**—
ఉల్ మజ్హూల్ బిల్ మజ్హూల్ (అ) తెలియనిదానికి అంతకంటెను తెలియనివ్యాఖ్యానము (చేయుట)

**تعزیت** తఅజియత్ (అ.స్త్రీ) అనుశోకము, ఊరడింపు, ధైర్యముచెప్పుట, దుఃఖించుట. **تعزیت نامہ**-నామ (పా) అనుశోకపత్రము, ఊరడింపులేఖ.

**تعزیر** తఅజీర్ (అ.స్త్రీ) శిక్ష, ప్రతీకారము.

**تعزیہ** తఅజియ (అ.పు) అనుశోకము, ఓదార్పు, దుఃఖము, మొహర్రములో హసన్ హుసేన్ పీరులగోరీలకుమారుగాకట్టి ఊరేగించుగుమ్మటము మొ॥

**تعشق** తఅష్షుక్ (అ.పు) మోహించుట, మోహము, వలపు, ప్రేమ.

**تعصب** తఅస్సుబ్ (అ.పు) పక్షపాతము, మతదాక్షిణ్యము, పరమతస్పర్ధ.

**تعطل** తఅత్తుల్ (అ.పు) ఆలసము, సోమరితనము, నిరుద్యోగము.

**تعطیل** తఅతీల్ (అ.స్త్రీ) నిరుద్యోగము, ఆటవిడుపు, సెలవు.

**تعظیم** తఅజీమ్ (అ.స్త్రీ) గౌరవము, మర్యాద, ఆదరము, సత్కారము, మన్నన.

**تعفن** తఅఫ్ఫున్ (అ.పు) దుర్గంధము, కౌలు, కబ్బు. (శిక్ష.

**تعقب** తఅక్కుబ్ (అ.పు) వెంబడింపు-

**تعلق** తఅల్లుక్ (అ.పు) సంబంధము, సంయోగము, బాంధవ్యము, కొలువు.

**تعلقہ** తఅల్లుక (అ.పు) సంబంధము, స్వాధీనము, ఆస్తి, సొత్తు, ప్రాంతము, ప్రదేశము.

**تعلم** తఅల్లుమ్ (అ.పు) విద్యాభ్యాసము

**تعلیق** తఅలీక (అ.పు) అనపెట్టుట, ఆనపెట్టినవస్తువు, పట్టి, యాదిక్రమణిక.

**تعلیل** తఅలీల్ (అ.స్త్రీ) కారణముచూపుట; సంధిప్రకరణము (వ్యాకరణము)

**تعلیم** తఅలీమ్ (అ.పు) శిక్ష, నేర్పుట, విద్యకరపుట, ఒరవడి, మేలుబంతి, జట్టివిద్య, గానవిద్య, అభ్యాసము. (వ్యాకరణము)

**تعمیر** తఅమీర్ (అ.స్త్రీ) నిర్మాణము, ఇండ్లుమొ॥ కట్టుట, కట్టడము.

**تعميل** తఒమీల్ (అ.స్త్రీ) నెరవేర్పు, నిర్వాహకము, జరుపుట,చేయుట, అనువర్తనము,కొలుచుట.

**تعويز** తఒవీజ్ (అ.పు) తాయెతు, రక్ష, యంత్రము,శరణము,రక్షణ,గోరీమీదపాతురాయి. **تعويزوطومار**—ఒ-తూమార్ (అ) విభూతిరక్షరేకులు, యంత్రమంత్రములు. 'మంత్రతంత్రములు.

**تعويزی گلوری** తఒవీజీగిలౌరీ (ఉ) నాలుగుమూలలతమలపాకు మడుపు,చౌకపువిడెము. (అసడ్డ.

**تعويق** తఒవీక్ (అ.స్త్రీ) ఆలస్యము,

**تعهد** తఅహ్హుద్ (అ.పు) ఒడంబడిక,ఒప్పందము,సమాధానము, పత్రము.

**تعين** తఅయ్యున్ (అ.పు) నియామకము, నిర్ణయము, ఏర్పాటు, నిర్బంధము, కట్టు, నిర్ధారణ. (కొలువుంచుట.

**تعينات** తఅయ్యునాత్ (అ)నియామకము,

**تعيناتی** తఅయ్యునాతీ (అ.స్త్రీ)నియామకము, ఉద్యోగము,కొలువు.

**تغار** తగార్ (తు.పు)మట్టితొట్టి, సున్నపుతొట్టి, బురదగుంట. (ము,అశ్రద్ధ.

**تغافل** తగాఫుల్ (అ.పు) అసడ్డ,అలక్ష్య

**تغاير** తగాయుర్ (అ.పు)భేదము,భిన్నత.

**تغلب** తగల్లుబ్(అ.పు)అపహరణము, మోసము,లోపరచుకొనుట.

**تغم** తగ్మ (అ.పు) ముద్ర, చిహ్నము; బిరుదుపతకము; అధికారము;కప్పము.

**تغير** తగైయుర్ (అ.పు) మార్పు, భేదము, తారుమారు.

**تف** తుఫ్(పా) ఛీ, థూ, ఛీవాట్లు.

**تفاخر** తఫాఖుర్ (అ.పు) ఆడంబరము, డంబముకొట్టుట, గర్వించుట.

**تفاريق** తఫారీక్ (అ.స్త్రీ) భేదములు, వేరుపాటులు, (ఏవ- **تفريق**

**تفاوت** తఫావత్ (అ.పు)దూరము, అంతరము, భేదము.

**تفتگی** తఫ్తగీ (పా.స్త్రీ) ఉష్ణము, వేడిమి, తీవ్రత, ఉగ్రత. (మైన.

**تفته** తఫ్త(పా)తప్తమైన, వేడియైన, తీవ్ర

**تفتيش** తఫ్తీష్ (అ.స్త్రీ) అన్వేషణము, విచారణ,పరీక్ష, కొజులేక జాడతీయుట.

**تفخر** తఫఖ్ఖుర్ (అ.పు) ఆడంబరము,డంబము,గర్వము. (సము,రంజనము.

**تفرج** తఫర్రుజ్ (అ.పు)క్రీడ,వినోదము, విలా

**تفرح** తఫర్రుహ్ (అ.పు) విహారము, వినోదము,క్రీడ-విలాసము,రంజనము.

**تفرقه** తఫ్రిక(అ.పు)వియోగము, భేదము, చెదరిక, అసమాధానము,స్పర్థ.

**تفريح** తఫ్రీహ్ (అ.స్త్రీ) సంతోషము, ఆహ్లాదము. వినోదము, విహారము, క్రీడ, రంజనము, విలాసము.

**تفريد** తఫ్రీద్ (అ.స్త్రీ) ఏకాంతము,సన్యాసము,ఒంటరికము.

**تفريق** తఫ్రీక్ (అ.స్త్రీ)వియోగము, విభజన,భేదము,వ్యవకలనము, తీసివేత, ఏర్పాటు,విభాగము. (భాష్యము

**تفسير** తఫ్సీర్ (అ.స్త్రీ)వివరణము, టీక,

**تفصيل** తఫ్సీల్ (అ.పు) వివరణము, వయినము,విభజన,పట్టి.

**تفضل** తఫజ్జుల్ (అ.పు) అనుగ్రహము, దయ,శ్రేష్ఠత.

**تفضيح** తఫ్జీహ్ (అ.స్త్రీ) అవమానము,

**تفضیل** తఫ్‌జీల్ (అ.స్త్రీ) తారతమ్యము. ఆధిక్యము, శ్రేష్ఠత, మేలుతరము.

**تفضیل بعض** —తఫ్‌జీలె-బఅజ్ (అ)తరప్రత్యయార్థకము, తరస్థితి. **تفضیل کل** —తఫ్‌జీలె-కుల్ (అ) తమప్రత్యయార్థకము,తమస్థితి. **تفضیل نفسی** —తఫ్‌జీలె-నఫ్సీ (అ) నిజస్థితిబోధనార్థకము, నిజస్థితి.

**تفکر** తఫక్కుర్ (అ.పు)ఆలోచన, చింత.

**تفنگ** తుఫంగ్ (పా.స్త్రీ)తుపాకి,తోపు.

**تفنن** తఫన్నున్ (అ.పు) అనేకవన్నెలుగలదిగాయగుట, మారుట, చిత్రవిచిత్రము, వివిధము. **تفنن طبع** —తబఅ (అ) మనోరంజనము, వినోదము, నవ్వులాట, విలాసము.

**تفویض** తఫ్‌వీజ్ (అ.స్త్రీ) అప్పగింత-స్వాధీనముచేయుట.

**تفہم** తఫహ్హుమ్ (అ.పు) గ్రహింపు-తెలివి.

**تفہیم** తఫ్‌హీమ్ (అ.స్త్రీ) తెలుపుట-నేర్పుట-కరపుట.

**تقاضا** తకాజా (అ.పు)అవసరము-అగత్యము, ఇబ్బంది-ప్రోద్బలిమి- అడుగుట- తెమ్మనుట-పీడింపు- తరువు **تقاضا کرنا** —కర్నా (ఉ) అవసరపెట్టుట- తొందరచేయుట-పీకులాడుట- తేతెమ్మనుట-పీడించుట.

**تقاوی** తకావీ (అ.స్త్రీ)బలపరచుట-సహాయము-సహాయఋణము- పెట్టుబడి.

**تقدس** తకద్దుస్ (అ.పు) పవిత్రత-పరిశుద్ధత.

**تقدم** తకద్దుమ్(అ.పు) పూర్వత-ఆధిక్యము, అగ్రిమత్వము-పురస్కారము- ముందుపోవుట.

**تقدیر** తక్‌దీర్ (అ.స్త్రీ) పరిమాణము-భాగము-భాగ్యము-అదృష్టము.

**تقدیر کا لکھا-بدا** —కాలిఖా-బదా(ఉ) నొసటవ్రాసినది-ప్రారబ్ధము.

**تقدیر کا ہیٹا** —కాహేటా(ఉ) నిర్భాగ్యుడు.

**تقدیم** తక్‌దీమ్ (అ.స్త్రీ) పూర్వత-అగ్రిమత్వము-ఆధిక్యము-మర్యాద-పురస్కారము, ముందుంచుట.

**تقرب** తకర్రుబ్ (అ.పు) సామీప్యము, దరికోలు-గొప్పవారిపరిచయముచేయించుట.

**تقرر** తకర్రుర్ (అ.పు)నియామకము- నిర్ణయము-స్థిరపరచుట-నియోజనము.

**تقرری** తకర్రురీ (అ.స్త్రీ) నియామకము-నియోజనము.

**تقریب** తక్‌రీబ్(అ.స్త్రీ) సామీప్యము-దరికోలు-ప్రయోజనము- నైమిత్తికము-నిమిత్తము-ఆచారము- కారణము-తట్టస్థమగుట.

**تقریباً** తక్‌రీబన్ (అ) ఉరమరగా, ధాదాపుగా.

**تقریر** తక్‌రీర్(అ.స్త్రీ)ఉపన్యాసము,వ్యాఖ్యానము-వాదము-తర్కము.

**تقریری** తక్‌రీరీ (అ) వాఙ్మూలకమైన- తార్కికమైన,నోటిమాటల.

**تقریریا** తక్‌రీరియా(ఉ) హఠవాది- వితండవాది-జగడాలమారి-మాటకారి-వదరుబోతు.

**تقریظ** తక్‌రీజ్ (అ.స్త్రీ) గ్రంథాదులవిమర్శన-ప్రస్తావము-వర్ణనము.

**تقسیم** తక్‌సీమ్ (అ.స్త్రీ) విభజన- విభాగము,పంపకము-భాగహారము-ప్రారబ్ధము.

**تقصیر** తక్‌సీర్ (అ.స్త్రీ) దోషము,లోపము,అసంపూర్ణత, అపరాధము,తప్పు, పొరపాటు.

**تقطیع** తక్‌తీఅ(అ.స్త్రీ)తుత్తునియలుచేయుట;వృత్తముయొక్క గణవిభజన; గుణితము.

**تقلب** తకల్లుబ్ (అ.పు) మార్పు,క్రిందలకల్పన,కృత్రిమము.

**تقلید** తక్లీద్ (అ.స్త్రీ)అనుకరణము,కృత్రిమము, ప్రతిగాచేయుట,చేసినట్లుచేయుట.

**تقلیل** తక్లీల్ (అ.స్త్రీ) లఘ్వీకరణము, తగ్గింపు.

**تقوی** తక్వా(అ.పు)ధర్మనిష్ఠ,భక్తి,పాపభీతి,త్యజనము,నిగ్రహము,ఇంద్రియనిగ్రహము.

**تقویت** తక్వియత్ (అ.స్త్రీ) బలపరచుట,బలము,సహాయము,ఆశ్రయము.

**تقویم** తక్వీమ్ (అ.స్త్రీ) పంచాంగము.

**تقویم پارینہ**—ఎ-పారీన (పా) పాత పంచాంగము,పాతపురాణము,పనికిమాలినది

**تقید** తకైయుద్ (అ.స్త్రీ) నిర్బంధము, నియమము,శ్రద్ధ,జాగ్రతి.

**تک** తుక్(హి.పు)అంత్యప్రాసము. (డియ.

**تک** తక్ (హి)తక్కెడ,తక్కెడదండె, దం

**تک** తక్ (హి) వరకు,పర్యంతము,దనుక.

**تکا** తికా-(హి)మాంసఖండము. **تکا اتارنا**— ఉతార్నా(హి) దృష్టిపరిహారముచేయుట, దృష్టితీయుట,దిగదుడుచుట. **تکا بوٹی**— బోటీ (హి) తుత్తునియలు.

**تکا** తుక్కా (హి) మొండిబాణము,(ఇనుప ములికిలేనిది) **تکا فضیحتی**— ఫజీహతీ (ఉ) తలవంపులు,ఛీకొట్లు, మిక్కిలియవమానము,ఛీ, ఛూ.

**تکاسل** తకాసుల్ (అ.పు) ఆలసము,అజాగ్రత,సోమరితనము,జాడ్యము.

**تکالیف** తకాలీఫ్(అ.స్త్రీ) కష్టములు,సంకటములు (ఏ.వ **تکلیف** )

**تکان-تھکان** తకాన్-థకాన్ (హి.పు) అలసట,ఆయాసము,సేద. **تکان چڑھنا**- చఢ్నా (హి) అలయుట. **تکان اترنا**—ఉతర్నా (హి) అలసటతీరుట, సేదదీరుట.

**تکاہل** తకాహుల్ (అ.పు) అశ్రద్ధ,ఆలసము,అసడ్డ.

**تکبر** తకబ్బుర్ (అ.పు) అహంకారము,గర్వము,పెత్తనము. (గర్వము.

**تکبری** తకబ్బురీ (అ.స్త్రీ) అహంకారము,

**تکبیر** తక్బీర్ (అ.స్త్రీ) గౌరవించుట,భగవత్ స్తోత్రము, "అల్లాహుఅక్బర్" అనుట.

**تکبیر اولا**—ఎ-ఊలా(అ) నమాజుచేయునపుడు మొదటిసారి "అల్లాహుఅక్బర్" అనుట.

**تک تک** తిక్ తిక్ (హి.స్త్రీ) కిఃకిః,కహాః, అనిఎద్దులనుతోలుట.

**تکثیر** తక్సీర్(అ.స్త్రీ) అధికమగుట,వృద్ధి.

**تکثیف** తక్సీఫ్ (అ.స్త్రీ) ఘనీభవించుట, పేరుదల,పేరుట,చిక్కన, చిక్కబడుట.

**تکرار** తక్రార్ (అ.స్త్రీ) పునరుక్తి,పలుమారుచెప్పుట,వివాదము,జగడము,ఒకపాదమును రెండుసార్లుపఠించుట.

**تکرر** తకర్రుర్ (అ.పు) పునరుక్తి, ఆమ్రేడితము. (సత్కారము.

**تکریم** తక్రీమ్ (అ.స్త్రీ) గౌరవించుట,

**تکڑا** తక్డా (హి) బలిష్ఠుడైన, మాంసలుడైన; చురుకుగల. (పైయాకు.

**تکس** తుక్కస్ (హి)తమలపాకులపొట్లము

**تکسل** తకస్సుల్ (అ.పు) జాడ్యము,జబ్బు.

**تکش** తుక్కష్ (ఉ.పు) తూణీరము, అమ్ములపొది.

**تکفیر** తక్ఫీర్ (అ.స్త్రీ) బహిష్కారము; పాషండునిగాభావించుట.

**تکفین** తక్ఫీన్(అ.స్త్రీ) శవవస్త్రముకప్పుట,పాడెకట్టుట. (లిపడగ.

**تکل** తుక్కల్ (హి.స్త్రీ) ఒకవిధమైనగా

**تکلا** తక్లా(హి.పు)కదురు.

تکلّف తకల్లుఫ్ (అ.పు) స్వభావములోలేని దానిని పైకికనపరచుట, కష్టపడియొకపనిని చేయుట; ఆడంబరము, బూటకము; వైభవము, వైఖరి, ఠీవి, వయినము, రీతి, తీరు, శృంగారము, అసాధారణవర్తనము; సంకటము, ఇబ్బంది, మర్యాదలు, ఆచారము; ఆదరసత్కారములు. (వ్రణ.

تکلم తకల్లుమ్ (అ.పు) ప్రసంగము, సంభా

تکلی తక్లీ (హి.స్త్రీ) పంటెకోల (నూలుచుట్టునది.)

تکلیف తక్లీఫ్ (అ.స్త్రీ) కష్టము; శ్రమ, భారము, ఇబ్బంది, దారిద్ర్యము, సంకటము. تکلیف اٹھانا -తకలీఫ్-ఉఠానా (ఉ) కష్టపడుట.

تکمہ తుక్మ (పా.పు) బొందెవలయము, బొందెదూరునదగపుమడతలేకవలయము. బొందెతొలి, గుండీతొలి; బొందె, బొత్తాము, గుండి.

تکمیل తక్మీల్ (అ.స్త్రీ) సంపూర్ణము, సమాప్తి, ముగింపు, నెరవేర్పు, తుదముట్టించుట.

تکنا తక్నా (హి) ఉరిమిచూచుట, తేరిచూచుచుండుట, కనిపెట్టియుండుట, ఆశించియుండుట, కాచుకొనియుండుట, ఎదురుచూచుట, సమయమువేచియుండుట, అవలంబించుట, కొనుట.

تکوا తక్వా (హి.పు) కగురుపుల్ల.

تکواہی తక్వాహీ (హి.స్త్రీ) కాపుదల, కనిపెట్టియుండుట.

تکون-تکونا-تکونیا తికోన్-తికోనా-తికోనియా (హి) త్రికోణము, ముక్కోణము, ముమ్మూలలు.

تکہ తిక్క (పా.పు) మాంసపుతునక.

تکہ తుక్క (పా.పు) మొండిబాణము, ఇనుపములికిలేనిబాణము.

تکھڑی తకఖ్డీ (హి.స్త్రీ) త్రాసు, తక్కెడ.

تکھونٹ-تکھونٹا తిఖూంట్-తిఖూంటా (హి.స్త్రీ) ముమ్మూలలు, ముక్కోణము, تکھونٹ ناپ -నాప్ (హి.స్త్రీ) త్రికోణశాస్త్రము.

تکی لگانا తక్కీలగానా (హి) ఉరిమిచూచుచుండుట, తేరిచూచుచుండుట.

تکیہ తక్యా (పా.పు) ఉపధానము, విశ్రాంతిస్థానము, ఆను దిండు, తలగడ; ఆశ్రయము, నమ్మకము, బైరాగులమఠము, శ్మశానము; మఠము, పక్కీరిఇల్లు; మారుబలము, నిలువదండు, تکیہ دار -దార్ (పా) కాటికాపరి, శ్మశానవాసి, تکیہ دینا -దేనా (ఉ) గౌరవించుట, సత్కరించుట, స్వాగతమిచ్చుట, تکیہ کرنا -కర్నా (ఉ) నమ్మకొనియుండుట, బరువసముంచుట,

تکیہ کلام -కలామ్ (పా) ఊతపదము, تکیہ لگانا -లగానా (ఉ) ఆనుకొనుట,

تکیہ نشین -నషీన్ (పా) పక్కీరు, సన్యాసి,

تگ తగ్ (పా.స్త్రీ) పరుగు, ఉరుకుడు,

تگ و دو -ఒ-డౌ (పా.స్త్రీ) ఉరుకులు పరుగులు, తత్తరపాటు, వేగిరము, సంభ్రమము, శ్రమ, ప్రయత్నము, అన్వేషణము, ఆయాసము, పరిశ్రమ.

تگا తిగ్గా (తు.పు) పిల్లబంటు.

تگا తగ్గా (హి.పు) దారము, నూలు, పోగు.

تگا తగ్గా (హి.పు) దానిమగడు. (నిగల.

تگا తిగ్గా (హి) వంకర, టింకర, వంగిన, గూ

تگا తగా (హి.పు) హిందూస్థానిగౌడబ్రాహ్మణులయొక్క తెగ, తవాక్షీరము.

تگاپو తగాపూ (పా.స్త్రీ) ఉరుకులు, పరుగులు, సంభ్రమము, సంక్షోభము, పరిశ్రమ, గంద్రగోళము, వృథాశ్రమ.

**تگانا** తగానా (హి)కుట్టించుట, అంటకుట్టించుట, బొంతకుట్టించుట.

**تگائی** తగాయీ (హి.స్త్రీ) బొంతకుట్టుట, బొంతకుట్టినకూలి.

**تگرگ** తగర్ గ్ (పా.పు) వడగల్లు.

**تگڑی** తగ్ డీ (హి.స్త్రీ) బంగారురేక వెండి మొలత్రాడు. (మూడంతలు.

**تگنا** తిగునా (హి) త్రిగుణము, ముమ్మడి,

**تگنا** తగ్నా (హి)బొంతకుట్టుట. (تگ پو

**تگ وپو** తగ్-ఒ-పూ (పా.స్త్రీ) చూడు.

**تگی** తగ్గీ (హి.స్త్రీ) త్రాటిలోనిఒకపిరి,

**تِتگی**-తితగ్గీ (హి) ముప్పురిత్రాడు.

**تگی** తిగ్గీ (హి.స్త్రీ)ఒకనివీపుపైగుఱ్ఱమెక్కి కూర్చునుట (పిల్లలయాట)

**تل** తల్ (హి.పు)అడుగు,తలము,క్రిందిభాగము,పల్లము. **تل کرنا** -తల్-కర్నా (హి) దాచుట,దొంగలించుట. **تل نظرا** -తల్-నజ్రా (ఉ) క్రిందిచూపులవాడు, దొంగచూపులవాడు **تل اوپر** -తల్-ఊపర్ (హి) క్రిందల, క్రిందుమీదు,తారుమారు.

**تل** తిల్ (హి.పు) తిలము, నువ్వుగింజ,పుట్టుమచ్చ,కంటిపాప, కాటుకచుక్క,తిలమాత్రము. **تل کٹ-تل بھگا** -తిల్-భుగా-కుట్ (హి) చిమ్మిరి,నువ్వులబెల్లము.

**تل چاولی** -తిల్-చావ్ లీ (హి) నువ్వులుకలిపినబియ్యము,నువ్వులబియ్యము.

**تل چاولے بال** -తిల్-చావ్ లేబాల్ (హి) సగము నర్సినవెంట్రుకలు. **تل چٹا** -తిల్-చట్టా (హి) బరిగెపురుగు,బొద్దింక.

**تل شکری** -తిల్-షక్రీ (హి) తిలశర్కరము, ఒకతినుబండారము,చిమ్మిరి.

**تل** తుల్ (హి) తుల్యము.

**تلا** తలా (హి.పు) అడుగు, చెప్పుయొక్క అడుగు అట్ట; కచ్చు, పార. **تلا دینا** -దేనా (హి) వంటపాత్రయొక్క అడుగు నతడిమన్ను గానిబూడిద గానిపూయుట.

**تلا** తిల్లా(ఉ.పు)తలగుడ్డయొక్కసరిగ అంచు.

**تلا** తులా (హి) తుల, త్రాసు, తులారాశి.

**تلادانی** తిలాదానీ (పా.స్త్రీ) పూసల సంచి,మడుపుసంచి, ఆకువారునూదులు దారము మొ॥ వేసికొనుసంచి.

**تلاش** తలాష్(పా.స్త్రీ) అన్వేషణము,వెదకుట, జాడ, విచారణ. **تلاش کرنا** -కర్నా (ఉ)వెదకుట, జాడదీయుట.

**تلاشی** తలాషీ(పా.స్త్రీ) వెదకువాడు,అన్వేషి,శోధ. **تلاشی لینا** -తలాషీ- లేనా (ఉ) శోధించుట, శోధచూచుట

**خانہ تلاشی** ఖాన-(పా)గృహశోధ.

**تلاطم** తలాతుమ్ (అ.పు) అల, తరంగము, అలలుకొట్టుకొనుట, అల్లకల్లోలము, ఔత్సుక్యము,ఉత్సాహము,ఉద్రేకము.

**تلافی** తలాఫీ(అ.స్త్రీ) నష్టపూర్తి, చెల్లు, మారు, అచ్చుకోలు, దండుగ.

**تلاملی-تلامسی** తలామీ-తలాములీ (హి.స్త్రీ) అస్వస్థత, తల్లడము, వ్యాకులము.

**تلانا** తిలానా (పా.పు) ఒకపాట, చూడు ترانہ

**تلاو** తలావ్ (ఉ.పు) చెరువు,కుంట.

**تلاوا** తలావా (హి.పు) ఉక్కళము.దండు కావలివాడు, తలారివాడు, రాత్రికావలి కాచువారు.

**تلاوا** తలావా (హి.పు) ఇరుసుమ్రాను,బండియిరుసుపైవేయుమొద్దు,మడిగము.

**تلاوت** తిలావత్ (అ.స్త్రీ) అధ్యయనము, కురానుచదువుట, పఠనము.

**تلائی** తిలాయీ (హి.స్త్రీ) చిన్నబాణలి,

పెనము,బూరెలమూకుడు; దివిటిలో చము రుపోయుట.

تلبیس తల్బీస్ (అ.స్త్రీ) మోసము, వేషము, కృత్రిమము, మారువేషము.

تلبیس سکہ —తల్బీస్-ఎ-సిక్కా (అ) టక్కు నాణెములుచేయుట.

تلپٹ తల్పట్ (హి)క్రిందుమీదైన, పాడైన, తారుమారైన, అధ్వానమైన.

تلچھٹ తల్ఛట్ (హి.స్త్రీ) అడుగు బొడుగు, మష్టు,గసి,చెత్త.

تلچھنا తిలఛ్నా (హి) తల్లడపడుట,కలత జెందుట, వ్యాకులపడుట.

تلخ తల్ఖ్ (పా) ఘాటుగల,చేదైన, తీక్ష్ణమైన, అయిష్టమైన, రుచిహీనమైన

تلخ رو తల్ఖ్-రూ (పా) చిట్టుబుట్టును, చిరచిఱలాడెడు,కోపిష్ఠి,మాడుపుమొగము.

تلخا తల్ఖా(పా.పు) అటుకులు.

تلخی తల్ఖీ (పా.స్త్రీ) ఘాటు, చేదు, వేదన, కష్టము.

تلڑ తలడ్ (హి.పు) కరువు, పొట్ట;ఆధీనము.

تلڑا తిలడా(హి.స్త్రీ)మూడువరుసలసరము.

تلذذ తలజ్జుజ్ (అ.పు)రుచి,రసము, సారము,స్వారస్యము.

تلسی తుల్సీ (హి.స్త్రీ) తులసిచెట్టు,

تلسی دانہ తుల్సీ-దాన(హి) భూషణవిశేషము.

تلطف తలత్తుఫ్ (అ.పు)దయ,ప్రేమ, కరుణ, అనుగ్రహము.

تلف తలఫ్ (అ.పు) నాశము, హరణము, పాడు, అధ్వానము,వ్యయము. (బడి.

تلفظ తలఫ్ఫుజ్ (అ పు) ఉచ్చారణ, పలుకు

تلقین తల్కీన్ (అ.స్త్రీ) ఉపదేశము, బోధ,శిక్ష.

تلک తిలక్ (హి.పు) తిలకము, బంగారుబొట్టు, చుక్క, పట్టాభిషేకము, ఒకవిధమైన దుస్తు, వరదక్షిణ.

تلک తలక్ (హి) చూడు. تک

تللی తులల్లీ (హి.స్త్రీ) ధార,నీరు మొ॥ పలుచని వస్తువులధార.

تلملانا తల్మలానా (హి) తల్లడపడుట, వ్యాకులపడుట,అల్లాడుట,విలవిలలాడుట,

تلملی తల్మలీ (హి.స్త్రీ) అస్వస్థత, కలత, తల్లడము, అల్లాటు. (ష్యుడు.

تلمیذ తల్మీజ్ (అ.పు) విద్యార్థి, శి

تلنا తల్నా (హి) నేయి మొ॥వానిలో వండుట, చమురులోకాల్చుటలేక వండుట.

تلنا తుల్నా (హి) తూగుట,సరితూగుట, అంచనయగుట, ముందుకుతూగుట, ఉద్యుక్తుడగుట.

تلنگا తిలంగా (హి.పు) త్రిలింగదేశస్థుడు, తెలగాణపువాడు,యోధుడు.

تلنگی తిలంగీ (హి.స్త్రీ) ఒకవిధమైనగాలిపడగ, ఒకతినుబండారము.

تلوا తల్వా (హి.పు) అరకాలు.

تلوا سہلانا —తల్వా-సహలానా (హి) ఇచ్ఛకములాడుట, ముఖస్తుతిచేయుట.

تلوا کھجلانا —తల్వా-ఖుజానా-ఖుజ్లానా (హి) అరికాలుదురదపుట్టుట (ప్రయాణసూచకము)

تلوار తల్వార్ (హి.స్త్రీ)ఖడ్గము,పట్టెము, కత్తి, కరవాలము,చూడు. تروار

تلوار بند —తల్వార్-బంద్ (హి)కత్తికట్టినవాడు, కత్తిబంటు. تلوار جڑنا —తల్వార్-జడ్నా(హి) కత్తితోనరుకుట. تلوار کا پانی —తల్వార్-కా-పానీ(హి)కత్తిపదను. تلوار کا دورا —తల్వార్-కా-దొరా (ఉ) ఖడ్గధార, కత్తియంచు.

**تلوار کا کھیت**–కాఖేత్ (హి) యుద్ధరంగము. **تلوار کا ہاتھ**–కాహాత్ (హి) కత్తివాటు, కత్తిదెబ్బ.

**تلوانا** తుల్వానా (హి) తూపించుట.

**تلوانا** తల్వానా (హి) నేతిలోవండించుట.

**تلواریا** తల్వారియా (హి.పు) ఖడ్గధారి, కత్తిగట్టినవాడు. శూరుడు.

**تلون** తలౌవున్ [అ.పు] వర్ణములుమారుట. స్థితిమారుట, చాంచల్యము, చపలచిత్తము; అస్థిరత, చపలత్వము. **تلون مزاج**-మిజాజ్ (అ) చపలచిత్తుడు.

**تلون مزاجی**–మిజాజీ (అ) చపల చిత్తము, అస్థిరస్వభావము.

**تلہا** తిల్హా (హి) చమురుగల.

**تلی** తిల్లీ (హి.స్త్రీ) ప్లీహము.

**تلی** తలీ (హి.స్త్రీ) అడుగు, క్రింద, చెప్పు అడుగు, (అట్టు).

**تلی** తులీ (హి.స్త్రీ) సాలెవాడుపడుగుపని చేయుతూలిలేక కూర్చము, కుంచియ, కుంచె.

**تلے** తలే (హి) అడుగున, క్రింద; స్వాధీనములో, చేతిక్రింద **تلے اوپر-اوپر تلے**–ఊపర్; ఊపర్-(హి) క్రిందల-క్రిందుమీదు, వెంటవెంట, ఒకదానిపైయొకటిదొంతిగా.

**تلیا** తలైయా (హి.స్త్రీ) కుంట, చిన్నచెరువు

**تلیٹی** తలేటీ (హి.స్త్రీ) క్రింద, అడుగు, కట్టడపునేల, కొండక్రింది భూమి, చుట్టుప్రక్కలు, శవముక్రింద పరచుబట్ట.

**تلے دانی** తలేదానీ (హి.స్త్రీ) చూడుము **تلا دانی** (యుట.

**تلیین** తల్యీన్ (అ.స్త్రీ) మెత్తగా చే

**تلیر** తిల్యర్ (హి.పు) పక్షివిశేషము.

**تم** తుమ్ (హి) మీరు, తాము **تم آپ**–ఆప్ (హి) తాముస్వతః-స్వతః తాము.

**تم** తమ్ (హి.పు) చీకటి, తమస్సు.

**تماچہ** తమాచ (పా.పు) చరుపు, దెబ్బ, చెంపదెబ్బ. (తాళి.

**تماخره** తమాఖుర (అ.పు) పరిహాసము, ఎగతాళి.

**تمادی** తమాదీ (అ.స్త్రీ) కాలపరిమితి, అవకాశము, కాలము, నియమితకాలము, కాలాతిక్రమణదోషము.

**تمارا** తుమారా (హి) మీయొక్క, తమ.

**تمارض** తమారుజ్ (అ.పు) వ్యాధికలుగజేసికొనుట, రోగనెపము.

**تماشا-تماشہ** తమాషా-తమాష (ఉ.పు) ప్రదర్శనము, వినోదము, క్రీడ, ఆట, లీల, వింత, ఆశ్చర్యము, అచ్చెరువు, వైభవము, ఎగతాళి, పరిహాసము, విలాసము, భోగము, సౌఖ్యము-ఇంద్రియ లోలత్వము (అ) కలసి త్రాగుచుండుట, విహారము, తిరుగాడుట, **تماشبین-تماش بین** – బీన్ - తమాష్‌బీన్ (పా) వినోదము చూచువాడు, చూడవచ్చినవాడు, వినోదగాడు, రంకులాడు, దుర్మార్గుడు.

**تماشبینی-تماش بینی**–బీనీ– తమాష్‌బీనీ (పా) రంకుతనము, దుర్మార్గము, దుర్వర్తనము. **تماشاخانہ**–ఖానహ్ (పా) హాస్యకత్తె, పరిహాసకము లాడుయాడుది, వగలాడి. **تماشاگاہ**–గాహ్ (పా) వినోదస్థానము, రంగము, విహారస్థానము.

**تماشائی**–యీ (పా) చూడవచ్చినవాడు.

**تمام** తమామ్ (అ) అంతయు, సాంతము, తుదముట్ట, సంపూర్ణము, అంతము.

**تمام تر**–తర్ (హి) ఆసాంతము, బొత్తిగా. **تمام وکمال**–ఒ-కమాల్ (అ) ఆసాంతము, తుదముట్ట, బొత్తిగా.

**تمامی** తమామీ (అ.స్త్రీ) అంతము సం పూర్తి, ముగింపు;సరిగ పట్టుబట్టు.

**تمانا** తమానా (హి) ఏకించుట.

**تمباکو** తంబాకూ (హి.పు) పొగాకు.

**تمبو** తంబూ (హి.పు) గుడారము.

**تمتمانا** తమ్‌తమానా (హి) నిగనిగలాడుట, ముఖము గాండ్రించుట, జ్వరాదులచేము ఖమెఱ్ఱబడుట; ఉష్ణము గానగుట.

**تمتماہٹ** తమ్‌తమాహట్ (హి.స్త్రీ) నిగనిగ, ఉబ్బు, గాండ్రింత.

**تمثیل** తమ్‌సీల్ (అ.స్త్రీ) ఉదాహరణ ము, ఉపమానము,దృష్టాంతము, సామ్యము,

**تمر** తమ్‌ర్ (పా.పు) ఖర్జూరము.
**تمرہندی**—ఎ,హింది (పా) చింతచె ట్టు (పండు, కాయ).

**تمرد** తమర్రుద్ (అ.పు) హఠము, తిరుగు బాటు ఉల్లంఘనము, అవిధేయత. శఠ త్వము.

**تمسخر** తమస్‌ఖుర్ (అ.పు) అపహాస్య ము, నవ్వులాట,పరియాచకము,హాస్యము.

**تمسک** తమస్సుక్ (అ.పు) పట్టు, దిట్టము, పత్రము,వ్రాతమూలము,

**تمغا.تمغہ** తమ్‌గా-గ(తు.పు)పన్ను;ముద్ర, గురుతు;మచ్చ;శాసనము; నాణెము;అచ్చు, అధికారము,మానపత్రకము,బిళ్ల,పతకము.

**تمک** తమ్‌క్ (హి.స్త్రీ) గర్వము.

**تمکا** తమ్‌కా (హి.పు) ఉష్ణము,ఎండదెబ్బ.

**تمکنت** తమ్‌కనత్ (అ.స్త్రీ) గౌరవము, గాంభీర్యము;అధికారము,పదవి; మానము, విభవము,సామర్థ్యము,గర్వము;అంతస్తు.

**تمکین** తమ్‌కీన్ (అ.స్త్రీ)గాంభీర్యము,సా మర్థ్యము; పదవి, గౌరవము,వైభవము,పటా టోపము;గర్వము.

**تملق** తమల్లుక్ (అ.పు) మృదుత్వము;స్తోత్ర ము,ఇచ్చకము,లాలన,బుజగరింపు.

**تمن** తుమన్ (తు.పు) దశసహస్రము,పదివేల సేన;ఒకనాణెము (నాలుగున్నరరూపాయ లది) **تمندار**—దార్ (పా) దళవాయి, సేనాపతి.నాయకుడు.

**تمنا** తమన్నా (అ.స్త్రీ) ఆశ,కాంతు,కోరిక; ప్రార్థన,అభీష్టము.

**تمنچہ** తమంచ (తు.పు) చిన్నతుపాకి.

**تمہارا-ری-رے** తుమ్‌హారా-రీ-రే(హి) మీ,మీయొక్క,మీది.

**تمہید** తమ్‌హీద్ (అ.స్త్రీ) పీఠిక, ఉపోద్ఘా తము,ఎత్తుగడ,ప్రారంభము,హంశము.

**تمہیں** తుమ్‌హేం(హి) మీకు,తమకు.

**تمیز** తమీజ్ (అ.స్త్రీ)వివేకము,తారతమ్య జ్ఞానము;విభజన, ఏర్పాటు,గుర్తు,తెలిసికొ నుట, భేదము,అంతరము,పరీక్ష,పరిశీలన,తె లివి,జ్ఞానము,నాగరికత,మర్యాదలు.

**تمیزدار**—దార్ (పా)వివేకి,జాగరూకు డు,నాగరికుడు,తెలివిగలవాడు.

**تن** తన్ (పా.పు) శరీరము,తనువు, దేహము.
**تن آسانی**—ఆసానీ (పా) సుఖపరత్వ ము,శ్రమతప్పించుకొనుట,సుఖేచ్ఛ, సోమ రితనము,హాయికోరుట. **تن پرور**—పర్‌వ ర్ (పా) ఇంద్రియలోలుడు,సుఖప్రియుడు, సోమరి. **تن پروری** —పర్‌వరీ.(పా)ఇం ద్రియలోలత్వము,సుఖపరాయణము, సోమ రితనము**تنہا** **تن تنہا**—తన్‌హా(పా) ఒంటరిగా తోడులేకుండ. **تندرست**—దురుస్త్ (పా) పుష్టిగల,ఆరోగ్యముగల.
**تندرستی**—దురుస్తీ (పా)దేహారోగ్య ము.**تن دہ**—దిహ్‌(పా)పరిశ్రమచేయు, పా టుపడు. **تن دہی**—దిహీ(పా)పాటు,పరి శ్రమ,కష్టము**تن لکو**—లక్కూ-(ఉ)సంగా

తగాడు. تن من —మన్ (పా) తనుమానస ములు,తనుమనములు.

**تنا** తన్నా (హి)బిగియుట,నీలుగుట,సాగుట -చక్కగానగుట,ప్రసరించుట,పెరుగుట,ని క్కుట,బిగదన్నుట,నిగుడుట,ఉబ్బుట.

**تناپا** తనాపా (హి) గర్వము,మదము.

**تنازع** తనాజుఉ (అ.పు) జగడము,పరస్ప రవైరము,వివాదము,పీకులాట, వ్యాజ్యము, తంటా.

**تنازل** తనాజుల్(అ.పు)క్షీణము,తగ్గు, అవ రోహణ,దిగుడు,క్షయము.

**تناسب** తనాసుబ్ (అ.పు) అనురూపము, పరస్పరసంబంధము, అనుకూలము, ఒప్పిద ము,సఖ్యము,సామ్యము,పోలిక, పొంకము, అనురూప్యము. تناسب اعضا —ఎ-అఉ జా (అ) అవయవానురూపత్వము, అవయ వములపొంకము.

**تناسخ** తనాసుఖ్(అ.పు) రూపాంతరము, జన్మపరంపర,పునర్జన్మము,సంసారము.

**تناسل** తనాసుల్ (అ.పు) ప్రజననము,వంశ పరంపర,సంతానము. (తపడుట.

**تنافر** తనాఫుర్(అపు)పరస్పరాసహ్యము,రో

**تنافی** తనాఫీ (అ.స్త్రీ) నిరాకరణము,లే దనుట.

**تناقض** తనాకుజ్ (అ.పు) వ్యాఘాతము; వైరుధ్యము;అన్యోన్యవిరుద్ధము.

**تناقل** తనాకుల్ (అ.పు)అన్యోన్యసంబం ధము,సమాసము, చలనము,చారము

**تنانا** తన్నానా (హి) నిగుడుట,బిగియుట, చక్కగానగుట;సంభోగేచ్ఛకలుగుట;గుం జుట,సలుపుట,తీయుట.

**تناو** తనావ్ (హి) బిగువు;బిగింపు,బిత్తు.

**تناور** తనావుర్ (పా) పుష్టిగల,బలిసిన, బ లిష్ఠమైన.

**تناول** తనావుల్ (అ.పు)భోజనము,తినుట. تناول فرمانا-کرنا —ఫర్మానా-కర్నా (ఉ) భోజనముచేయుట,భుజించుట.

**تنبا-تنبان** తంబా-తంబాన్(పా.పు) ఒక విధమైన వదలులాగు.

**تنباکو** తంబాకూ (హి.పు)చూడు تمباکو

**تنبو** తంబూ (హి) చూడు. تمبو

**تنبور** తంబూర్ (హి.పు) తంబుర. تنبورچی —చీ(ఉ)తంబురమీటువాడు.

**تنبورا** తంబూరా(హి.పు) ఏకతారయను వాద్యము,తంబుర.

**تنبول** తంబోల్ (హి.పు) తమలపాకు;క ల్లుపుగాయమువలనగుఱ్ఱపునోటవచ్చు నెత్తురు.

**تنبولن** తంబోలన్ (హి.స్త్రీ)తమలపాకు లది.(అమ్మునది)

**تنبولی** తంబోలీ (హి.పు) తమలపాకుల మ్మువాడు.(అట్టికులమును)

**تنبہ** తనబ్బుహ్(అ.పు) ఉపదేశము,బోధన ము, తెలియచెప్పుట, బెదరింపు, గద్దింపు, జాగ్రత్తపెట్టుట.

**تنبیہ** తంబీహ్ (అ.స్త్రీ) జాగ్రతచేయుట, తెలియచెప్పుట,బోధ,భద్రపరచుట,గద్దింపు, బెదరింపు,చీవాట్లు,భద్రము,శిక్ష.

**تنت** తన్త్ (హి.పు)మంచిసమయము,సంధి, తరుణము,అవసరము,అగత్యము,తంతు,అంతు.

**تنتر** తంతర్(హి.పు)తంత్రము,మంత్రవిద్య.

**تنتری** తన్త్రీ (హి.పు) తంత్రీవాద్యము గాయకుడు,భజంత్రి

**تنتن** తున్తున్(హి.స్త్రీ)టంకారము,టింగు టింగు,తంత్రీవాద్యములచప్పుడు.

**تنتن کار** తన్తన్ కార్ (హి.పు) వైణికుడు,గా యకుడు,నటుడు.

**تنتنا-تنتنہ** తన్తనా-తన్తన (పా.పు)

పటాటోపము,వైభవము, ఆడంబరము; అధి కారము;ఆగ్రహము,కోపము.

**تننانا** తననా తనానా (హి)సలుపుట,వాపు చేతపొడుచుట;వాయించుట.

**تنناہٹ** తననాహట్ (హి.స్త్రీ)వాపు,సలుపు,తీపు. (చిన్నతంత్రీవాద్యము.

**تننی** తుననీ (హి.స్త్రీ) దాసరివీణె,

**تن فن کرنا** తున్‌ఫున్ కర్నా (ఉ) చిఱ్ఱుబుఱ్ఱులాడుట. (జ్యోతిషము.

**تنجم** తనజ్జుమ్ (అ.స్త్రీ) జ్యోతిషము,ఫల

**تنخواہ** తన్‌ఖాహ్ (పా.స్త్రీ)జీతము,నెలబత్తెము,సంబళము, వేతనము,

**تنخواہ دار** —దార్ (పా) జీతగాడు, ఉద్యోగస్థుడు,

**تنخبر** తఖ్‌బీర్ (అ.స్త్రీ) ఉపన్యాసము, వ్యాఖ్యానము,భావన.

**تند** తుంద్ (పా)చురుకుగల,వడిగల,క్రూరమైన,తీక్షణమైన,ఘాటుగల,గట్టిసైన.

**تندخومزاج** —ఖూ-మిజాజ్ (పా)-చిఱ్ఱుబుఱ్ఱులాడు,కోపిష్ఠి,తీక్ష్ణస్వభావముగల.

**تندور** తన్‌దూర్ (హి.పు)ఆవము,ప్రొయ్యి

**تندی** తుందీ (పా.స్త్రీ)చురుకు, వడి;క్రౌర్యము,కామము. (జ్ఞవాడు.

**تندیل** తుందీల్ (హి.పు) తుందిలుడు, బా

**تنزل** తనజ్జుల్ (అ.పు) క్షీణము, తగ్గు,దళ, క్షయము.

**تنزیل** తన్‌జీల్ (అ.స్త్రీ)అవరోహణము, దైవికజ్ఞానము,కొరాను,మరిపు,స్వాగతము.

**تنزیہ** తన్‌జియ (అ.స్త్రీ)పరిశుద్ధి,శుద్ధిచేయుట,పవిత్రపరచుట.

**تنسل** తనస్సుల్ (అ.పు) వంశావళి.

**تنسیخ** తన్‌సీఖ్ (అ.స్త్రీ) నిరాకరణము, కొట్టివేయుట,త్రోసివేయుట.

**تنصیف** తన్‌సీఫ్ (అ.స్త్రీ) రెండుసమభాగములుగా జేయుట,అర్ధించుట.

**تنفر** తనప్ఫుర్ (అ.పు) అసహ్యము, విసుకు,రోత. (నము,రోజుట,శ్వాస.

**تنفس** తనప్ఫుస్ (అ.పు) ఉచ్ఛ్వాసనిశ్వా

**تنقیح** తన్‌కీహ్(అ.స్త్రీ) పరిశుద్ధి, స్వచ్ఛపరచుట;గుణదోషపరీక్ష,విచారణ; తీర్పు,సమాధానము. (తీరుమానము.

**تنقیہ** తన్‌కియ (అ.పు) బేదిమందు;తీర్పు,

**تنک** తన్‌క్-తనిక్(హి)రవంత,కొంచము.

**تنک** తునుక్ (పా) కోమలము,దుర్బలము, తేలికైన,అబలము,అల్పమైన,కొంచమైన.

**تنک ظرف** —జర్ఫ్(పా)మిట్టైనపాత్రము; అల్పుడు, తెలివిమాలినవాడు, నోటిలోమాటునిలువనివాడు. **تنک مزاج** — మిజాజ్ (పా) చిఱ్ఱుబుఱ్ఱులాడుట, ముక్కోపి.

**تنکا** తిన్‌కా (హి.పు) గడ్డిపోచ, పరక, పుల్ల; వారియొక్క,వానియొక్క.

**تنکار** తిన్‌కార్ (పా.పు)వెలిగారము.

**تنکنا** తినక్‌నా (హి) చిఱ్ఱుబుఱ్ఱులాడుట, కోపగించుట,ఆగ్రహపడుట.

**تنکی** తున్‌కీ (హి.స్త్రీ)సన్న నిరొట్టె.

**تنگ** తుంగ్ (పా.పు) గోనె,అండెము,సంచి.

**تنگ** తంగ్ (పా) బిగువైన, ఇరుకైన,బిగిసిన; కురుచైన; స్వల్పమైన; లొంగిన, లోపడిన, ఆపన్నమైన, చిక్కిన, కష్టదశలోనున్న, బీద, దరిద్రుడైన, గతిలేని; కత్త్యలేకటంగువాడు. **تنگ آنا** —ఆనా (ఉ) రోయుట,ఇబ్బందిపడుట,విసుకుట, లోబడుట. **تنگ چشم دل** —చష్మ్-దిల్

(పా) పిసినారి, నీచుడు. تنگ حال -తంగ్ హాల్ (పా) దరిద్రుడు, రిక్తుడు,బికారి. تنگ دست తంగ్-దస్త్ (పా) దరిద్రుడు, లేద, లేనివాడు, రిక్తుడు. تنگ دستی తంగ్-దస్తీ (పా) దరిద్రము, లేమిడి. تنگ ظرف తంగ్-జర్ఫ్ (పా) అల్పుడు, నీచుడు. (చూడు تنک ظرف) تنگ کرنا తంగ్-కర్నా (ఉ) బిగించుట, ఇబ్బంది పెట్టుట, విసికించుట, కష్టపెట్టుట. تنگ وقت తంగ్-వక్త్ (పా) అల్పావకాశము; సంకటసమయము. تنگ ہونا తంగ్-హోనా (పా) ఇబ్బంది పడుట, కష్టపడుట, జరుగుబాటులేక యుండుట.

تنگی తంగీ (పా.స్త్రీ) బిగువు,ఇరుకు, తగ్గు; దరిద్రము, రిక్తత; సంకటము, ఇబ్బంది, కష్టము.

تنور తనూర్ (పా.పు) ఆవము, పొయ్యి.

تنومند తనూమంద్ (పా) పుష్టిగల,బలిష్ఠమైన, స్థూలమైన.

تنومندی తనూమందీ (పా.స్త్రీ) పుష్టి, బలిష్ఠత, స్థూలము.

تنوین తన్వీన్ (అ.స్త్రీ) ద్విత్వమిచ్చుట, నకారపొల్లిచ్చుట, జబర్లుగాని జేర్లుగాని పేషులుగాని రెండిచ్చుట.

تنہ తన (పా.పు) చెట్టుబోదె.

تنہا తన్‌హా (పా) ఒంటరిగా,ఒకడే, జోడులేని, ఒంటరి, సాటిలేని.

تنہائی తన్‌హాయీ (పా.స్త్రీ) ఒంటరికము, ఏకాంతము, వియోగము.

تنی తనీ (హి.స్త్రీ) కట్టుదారము, బొందె, కట్టు; పాలు, ఉమ్మడి.

تو తో-తా (హి) అయిన, అంతట, అప్పుడు, ఇంక. تو بھی -తోభీ (హి) అయినప్పటికిని, ఇంకను, అయినను تو لگ -తోలగ్ (హి) అంతవరకు, అప్పటివరకు.

تو తూ (హి) నీవు, ఈవు تو تڑاق کرنا -తడాక్ కర్నా (ఉ) బూతులుజోకుట. ఉచ్చనీచములాడుట,తిట్టుట.

تو تکار تو تو میں میں -తూతూకార్-తూతూ మైఁమైఁ (హి) ఉచ్చనీచములు,బూతులు, తిట్లు.

توا తవా (హి.పు) పెంచు,పెనము, రొట్టెల పెంకు.

تواتر తవాతుర్ (అ.పు) ఎడతెగమి, వరుస, బారు.

تواجد తవాజుద్ (అ.పు) జగడము,కలహము; బుద్ధి, అంతర్వృద్ధి; పగులుట; బద్దలగుట.

توارد తవారుద్ (అ.పు) ఒకచోటదిగుట, సహవాసము; ఇద్దరుకవులవ్యాసముఒకటియేయగుట, ఒకేహాంశముఇద్దరిమనసుకు తట్టుట.

تواری తివారీ (హి.పు) బ్రాహ్మణులలో నొకతెగ. త్రివేదిబ్రాహ్మలు.

تواریخ తవారీఖ్ (అ.స్త్రీ) తిథులు, చరిత్రములు, ఉపాఖ్యానములు. ఏ-వ (تاریخ) (చూడు تباسی

تواسی తివాసీ (హి) మూడుదినములది.

تواضع తవాజుఽ (అ.స్త్రీ) వినయత, ఆదరసత్కారము, మర్యాద,సంపర్శనము, విందు, బహుమానము.

تواضع سمرقندی -సమర్‌కందీ (పా) బూటకపుమర్యాదలు, కపటపుసత్కారము,చూపులమెప్పులు.

توالا తవాలా (హి.పు) మూర్ఖు, మత్తు.

توالی తవాలీ (అ.స్త్రీ) ఎడతెగమి.

**توام** తవ్ఆమ్ (అ.పు) కవలు, అమడాలపిల్ల

**توان** తవాన్ (పా.స్త్రీ) సామర్థ్యము,శక్తి, త్రాణ,లావు,సత్తువు.

**توانا** తవానా (హి) కరగించుట.

**توانا** తవానా (పా) పుష్టిగల, బలిష్ఠమైన, బలముగల.

**توانائی** తవానాయీ (పా.స్త్రీ) చూడు (توان)

**توانگر** తవాన్గర్ (పా) ద్రవ్యవంతుడైన, భాగ్యవంతుడైన,సామర్థ్యముగల.

**توبرا-ڑا** తోబ్రా-డా (హి.పు) బొక్కెయము, దాణబొక్కెన,గుఱ్ఱపు దాణసంచి.

**توبہ** తౌబ (అ.స్త్రీ) పశ్చాత్తాపము,పరిత్యాగము,వ్యసనము,ఒట్టు,ఆన, చెంపలు వేసికొనుట. **توبہ کرنا.توبہ بولنا**—బోల్నా-కర్నా (ఉ) పశ్చాత్తాపపడుట, వ్యసనపడుట,చెంపలు వేసికొనుట. **توبہ توبہ**—తౌబ (అ) అబ్బబ్బ, ఛీఛీ, అనిష్టసూచకము. **توبہ توڑنا**—తోడ్నా (ఉ) ఆన తప్పుట,ఆడితప్పుట.

**توبیخ** తవ్బీఖ్ (అ.స్త్రీ) ధిక్కారము,చీవాట్లు,ఎత్తిపొడుపు.

**توپ** తోప్ (తు.స్త్రీ) తోపు,పిరంగి,అగ్నేయాస్త్రము. **توپ چلانا-داغنا-سرکرنا**—చలానా-దాగ్నా-సర్కర్నా (ఉ) తోపు వేయుట,తోపుకాల్చుట.

**توپ کے دم کرنا-توپ کے منہ اُڑانا**—కే దమ్కర్నా-కేముంహ్ఉడానా (ఉ) తోపునకాల్చుట,తోపుమూతికికట్టిపేల్చుట. **توپچی**—చీ (పా.పు) పిరంగికాల్చువాడు. **توپخانہ**—ఖాన (పా) పిరంగిసాల, తోపులుండుచోటు.

**توپانا** తోపానా (హి) పూడ్పించుట, పాతించుట,మూయించుట.

**توپنا** తోప్నా (హి) పూడ్చుట, పాతుట, మూయుట, మెత్తుట.

**توت** తూత్ (అ.పు) కంబళిచెట్టులేకపండు, (పూతికబుడమచెట్టు).

**توتا** తోతా (హి.పు) చిలుక; తుపాకిగుఱ్ఱము; గంజాయిముద్ద. **توتا چشم**—చష్మ (పా) కృతఘ్నుడు, మొగమోటమిలేనివాడు.

**توتلا** తోత్లా (హి) నత్తెదు,మురుముద్దుమాటలాడు.

**توتو** తూతూ (హి) ఉచ్చిళ్ళుకొట్టికుక్కను పిలుచుట,దూదూ అనికుక్కనుపిలుచుట.

**توتی** తోతీ (హి.స్త్రీ) ఆడచిలుక.

**توتی** తూతీ (హి.స్త్రీ) కొమ్ముచెంబు;సుస్వరముగలఒకపిట్ట.

**توتیا** తూతియా (హి.పు) మైలతుత్తము.

**توجہ** తవజ్జుహ్ (అ.స్త్రీ) అభిముఖమగుట, ఇచ్ఛ,అపేక్ష,దాక్షిణ్యము,లక్ష్యము,శ్రద్ధ, అనుగ్రహము,గౌరవము.

**توجیہ** తౌజీహ్ (అ.స్త్రీ) కారణముజూపుట,సమాధానము,కారణము;స్వరూపము. ముఖము,ముఖముపోలికలు,ముఖాకారము. **توجیہ نویس**—నవీస్ (పా) లక్షణలేఖరి, ముఖముగుర్తువ్రాసికొనువాడు.

**توحید** తౌహీద్ (అ.స్త్రీ) ఏకత్వవాదము, ఈశ్వరుడొకడే యనుట, ఒకడే యనుట, అద్వితీయేశ్వరవాదము.

**تودہ** తోద (పా.పు) మట్టిదిబ్బ, దిన్నె,కుప్ప, ప్రోగు;గురిపట్టు,సమృద్ధి, **تودہ بندی**—బందీ (పా) పాలిషేదవేయుట.

**تور** తోర్-తువర్ (హి) కందులు;ఆడంగులడోలికపైకప్పు, అవగుంఠనము లేక దానిపైకట్టుత్రాడు,జాలము,వల.

**تورہ** తూరహ్ (తు. పు) మతము, మార్గము, గౌరవము; బహుమానముగా పంపుభోజనాదులు, వడ్డించినతాంబాళము మొ॥వి.

**تورہ بندی**—తూరబందీ (ఉ) సారెపంచుట, వివాహాదులయందు భోజనాదులు వడ్డించి పంపుట.

**توریت** తౌరేత్ (అ. స్త్రీ) క్రైస్తవమతగ్రంథముయొక్క—పూర్వభాగము.

**توڑ** తోడ్ (హి. పు) విరుపు; పగులు; ప్రవాహబలము, బొక్కె, బొంద, వజర; అనుపానము, ప్రతీకారము, ఉపాయము; ప్రత్యుత్తరము; మార్గము; పాలలోవేయుతోడు, చేమిరి, నీరుకట్టుట, (తుపాకి) గుండుపారుదూరము, విరుగుడు, పరిహారము.

**توڑا** తోడా (హి. పు) లేమిడి, దొరకమి, తగ్గు, తుట్టి, కరవు; రూకలసంచి; జానక్రితాడు; గొలుసు; తీగము, గట్టు; లంక; కత్తువ, కట్ట; అడ్డము, ఆటంకము; కులుకు, నాట్యము; త్రాటి తునక.

**توڑ پھوڑ-توڑ تاڑ** తోడ్‌ఫోడ్-తాడ్ (హి. స్త్రీ) పగులుట, నాశము, ధ్వంసము, కుట్ర, కృత్రిమము, మోసము, పాడు, ఛిన్నభిన్నము, శైథిల్యము.

**توڑ جوڑ** తోడ్‌జోడ్ (హి. పు) పట్టువిడుపు, లగువుబిగువు, సంధివిగ్రహములు, లాభనష్టములు; సవరింపు, చక్కజేత; ఉపాయము, యుక్తి, చేతబడి, కల్పన, వైఖరి, శైలి, తీవి, స్వభావము.

**توڑنا** తోడ్నా (హి) విరుగగొట్టుట, పగులగొట్టుట, పడగొట్టుట, విరుచుట; రూపాయి మొ॥ మార్చుట; పండ్లు మొ॥ కోయుట, కొట్టివేయుట; ఆపుదలచేయుట, నిలిపివేయుట, ఆపుట; కన్నము వేయుట, వేరుచేయుట; తగ్గించుట; మాపుట, లేకుండచేయుట; పరిశ్రమచేయుట, లోపరచుట; దున్నుట, ఉల్లంఘించుట, మీరుట; తుత్తునియలుచేయుట.

**توڑی** తోడీ (హి. స్త్రీ) ఆవాలు, తెల్లఆవాలు.

**توڑی** తూడీ (హి. స్త్రీ) గోధుముపొట్టు, పొట్టు. (తుపాకి

**توڑےدار** తోడేదార్ (హి. పు) జానక్రితాటి

**توزک** తుజుక్ (తు. స్త్రీ) చూడు. **تزک**

**توسدان** తోస్‌దాన్ (హి. పు) తోటాలకు పైలేకపొది, గుండ్లు, తోటాలుపెట్టుకొను కుప్పెలేక కాయలేకపొది

**توسط** తవస్సుత్ (అ. పు) మధ్యస్థత; మితము, పరిమితి; ఆశ్రయము, సహాయము, మూలకము, మధ్యము—నడుము; మాధ్యస్థము.

**توسل** తవస్సుల్ [అ. పు] ఒకరిసహాయము, పరిచయము—ఒకరిని మధ్యవేయుట, మాధ్యస్థము.

**توسن** తౌసన్ [పా. పు] పిల్లగుఱ్ఱము—పోకిరిగుఱ్ఱము

**توشدان** తోష్‌దాన్ [పా. పు] బత్తెపుసంచి, బుత్తి పేటిక—చద్దిమూట—మా॥ **توسدان**

**توشک** తోషక్ [తు. స్త్రీ] పరుపు, బొంత,

**توشک خانہ**—తోషక్‌ఖాన [పా] శయనగృహము; ఉడుపులగది—బట్టలగది; ఉగ్రాణము—సామానుకొట్టు.

**توشہ** తోష [పా. పు] బత్తెము—చద్ది—సంభారము—బుత్తి. **توشہ خانہ**—ఖాన [పా] మా॥ **توشک خانہ**

**توشہ عاقبت** [ఎ, ఆకియత్ [పా] ధర్మసంచితము—ధర్మసంచయము—సత్కార్యములు.

**توشیح** తౌషీహ్ (అ. స్త్రీ) అలంకారము, వృత్తబంధభేదము, ప్రతిపాదమునయొక్క మొదటియక్షరముకలిపిన ఒకనిపేరువచ్చునట్లు వ్రాసినపద్యము.

**توصیف** తౌజీఫ్ (అ. స్త్రీ) వర్ణనము—ప్రశంస—స్తోత్రము—గుణము—విశేషము.

**توضیح** తౌజీహ్ (అ. స్త్రీ) వివరణము, విశదీకరణము.

**توغل** తవగ్గుల్ (అ.పు)అభ్యాసము,పరిశ్రమ.

**توفیر** తౌఫీర్ (అ.స్త్రీ) వృద్ధి- ఆధిక్యము, విస్తారము-లాభము.

**توفیق** తౌఫీక్(అ.స్త్రీ) దైవయోగము, సమావము చేయుట,దైవానుగ్రహము, సహాయము, ఆశ్రయము,బోధ,మార్గదర్శనము, దయ-శక్తి-సామర్థ్యము-త్రాణ.

**توقع** తవక్కుఉ (అ.స్త్రీ)ఆశ-బరువసము, నమ్మకము. (వకాశము-నిలకడ-తాళిమి.

**توقف** తవక్కుఫ్ (అ.పు) ఆలస్యము-అ

**توقیر** తౌకీర్ (అ.స్త్రీ) గౌరవము-సత్కారము.

**توکل** తవక్కుల్ (అ.పు) దైవమునునమ్ముకొనుట-దేవునిపై భారము వేయుట-ఒకనిని నమ్ముట,నమ్మకము-బరువసము.

**تول** తోల్-తౌల్ (హి.పు) తులనము-తూనిక ఎత్తు-పరీక్ష-అంచన.

**تولا-تولہ** తోలా (హి.పు) తులముఎత్తు, ౧౨మాసలు;తూచువాడు. **تولا ماشہ**—తోలామాష(హి) అతిసున్నితస్వభావము-సుకుమార ప్రకృతి-చపలస్వభావము-చపలుడు.

**تولا** తౌలా(హి.పు)పెద్దమూతికుండ, బాన.

**تولا** తవల్లా (అ.పు) ఆశ-అపేక్ష-ప్రేమ.

**تولانا** తౌలానా (హి)తూపించుట-తూనిక వేయుట.

**تولائی** తౌలాయీ (హి.స్త్రీ) కామి-కోరికగలవాడు-మహమ్మదీయులయొక్క తెగ.

**تولد** తవల్లుద్ (అ పు) జననము,పుట్టుక.

**تولنا** తోల్నా (హి) తూచుట-తూనికవేయుట-అంచనవేయుట.

**تولیا** తౌలియా (హి.పు) తువాలు-తుండుగుడ్డ-అంగవస్త్రము-చిన్న పంచ. (టు.

**تولید** తౌలీద్(అ.స్త్రీ)ప్రజననము, పుట్టించు

**تومری-تومڑی** —తూమ్‌రీ-తూమ్‌డీ(హి.స్త్రీ) మొసలి మొ॥ వానిమువ్రై;తుంబి,తుంబిక- సొరకాయబుఱ్ఱలేక దానితో చేసినదీపపుకుప్పె; కణితి- గ్రంథి; ఒకవిధమైనబిరుసులు(బాణసంచు).

**تومنا** తూమ్‌నా (హి) ఏకుట-విడదీయుట, పింజుట. (దారము.

**تومیا** తూమియా (హి.పు) సన్ననినూలు

**تون** తూన్ (హి.పు) తూణీరము-అమ్ముల పొది.

**تونا-توجانا** తూనా-తూజానా (హి)పశువులు ఈచుకపోవుట.(చూలుపోవుట).

**تونبا** తూంబా (హి) చేదుసొరకాయబుఱ్ఱ, తుంబము.

**تونبی** తూంబీ (హి స్త్రీ) చిన్నసొరకాయ బుఱ్ఱ-నాగస్వరము-తుంబిక. (లావు.

**توند** తూంద్(హి.స్త్రీ)తుందిలము, పెద్దబొజ్జ,

**توندل-توندلا** తోందల్-తోంద్‌లా (హి) తుందిలుడు-బొజ్జవాడు-దొడ్డు-లావైన.

**توندی** తోందీ (హి.స్త్రీ) బొడ్డు.

**تونس** తౌన్స్ (హి.స్త్రీ) అతిదాహము.

**تونسنا** తౌన్స్‌నా (హి) ఎండచేతల్లడపడుటలేకదప్పిగొనుట.

**تونگر** తవంగర్(పా.పు)చూడు. **توانگر**

**تونگری** తవంగరీ (పా.స్త్రీ) భాగ్యము,సంపద-సామర్థ్యము.

**توہم** తవహ్హుమ్(అ.పు) అనుమానము-శంక, సందేహము-మూఢవిశ్వాసము.

**توہین** తౌహీన్ (అ.స్త్రీ)నింద-దూషణ, ఆరడి-అవమానము-తిరస్కారము.

**توئی** తోయీ (హి.స్త్రీ) బట్టపైకుట్టినతీగ.

**تہ** తహ్ (పా.స్త్రీ) అడుగు- క్రింద-మడత, పొర-చుట్టు; మూలము-గుట్టు-అభిప్రాయము. **تہ بازار**-తహ్-బాజార్ (పా) అంగడిపట్టు, అంగళ్లుండుచోటు. **تہ بازاری**-తహ్-బాజారీ (పా) అంగడిపన్ను లేక సుంకము.

**تہ بتہ**-తహ్-బతహ్ (పా) పొరలుపొరలుగా, చిక్కగా-ప్రతిపొర-దొంతిగా- ఒకటిపై నొకటి. **تہ بند**-తహ్-బంద్ (పా) అంతరీయము-కట్టుబట్ట. **تہ پیچ**-తహ్-పేంచ్ (పా) పాగాలోవేయుచెమటబట్ట. **تہ توڑنا**-తహ్-తోడ్‌నా (ఉ) బావిలోనీరుతీసివేయుట-అడుగంటించుట- ముగించుట- తుదముట్టించుట. **تہ جمانا**-తహ్-జమానా (ఉ) పేర్చుట- మడతపెట్టుట. **تہ خانہ**-తహ్-ఖాన (పా) నేలమాలియ. **تہ دار**-తహ్-దార్ (పా) పొరలుగల, రహస్యమైన- చిక్కైన. **تہ درز**-తహ్-దర్‌జ్ (పా) మడతవిప్పనిది, క్రొత్తది, వాడనిది.

**تہ دیگی** -తహ్-దేగీ (పా) అడుగుబొడుగు, తపెలడుగు- తపిలెయడుగునమిగిలినయన్నము మొ॥, **تہ کرنا**-తహ్-కర్నా (ఉ) మడతపెట్టుట-ముగించుట-తీర్చుట.

**تہ کو پہنچنا**-తహ్-కోపహుంచ్‌నా (ఉ) అడుగంటుట-మూలము తెలియుట.

**تہ ملانا**-తహ్-మిలానా (ఉ) దాటించుట (పోతును పెంటిపై) **تہ نشین ہونا**-తహ్-నషీన్ హోనా (ఉ) మనసునపట్టుట. **تہ و بالا**-తహ్-ఒ-బాలా (పా) క్రిందుమీదు- క్రిందలతాలుమాలు.

**تہی** తిహీ (పా) వట్టి-ఉత్త-శూన్యమైన.

**تھاپ** థాప్ (హి.స్త్రీ) చరుపు-తట్టు-మృదంగముపై రెండుచేతులవేళ్లన్నిటితో వాయించుటలేక వాయించినచప్పుడు

**تھاپا** థాపా (హి.పు) చపేటపుగుర్తు- చాచినవ్రేళ్లుగలచేతిగుర్తు- అయిదువ్రేళ్లుపడిన గుర్తు.

**تھاپنا** థాప్నా (హి) పిడకలుతట్టుట-చరుచుట-స్థాపించుట.

**تھاپی** థాపీ (హి.స్త్రీ) చరుపు-దెబ్బ-చప్పుడు; దిమ్మెస; కుమ్మరివాడుకుండలుచక్కజేయుటకైకొట్టుగూటము లేక కొయ్యసుత్తె-గారదంచురోకటిబండ.

**تھال** థాల్ (హి.పు) తలియ-కంచము.

**تھالی** థాలీ (హి. స్త్రీ) తట్ట-సిబ్బి-చిన్న పళ్లెము. **تھالی پھرنا**-థాలీ-ఫిర్నా (హి) ఇసుకవేసినరాలకుండుట, క్రిక్కిరిసియుండుట.

**تھالی جوڑ**-థాలీ-జోడ్ (హి) కంచముముంత, కంచముగిన్నెయు. **تھالی کا بینگن**-థాలీ-కా బైంగన్ (హి) అద్దముమీదపెసరగింజ, గోడమీదిపిల్లి, నిలుకడలేనిది.

**تھام** థామ్ (హి.పు) స్తంభము, పోటిగుంజ.

**تھامنا** థామ్నా (హి) ఆపుట, పోటిపెట్టుట, ఆనుపట్టుట, పోషించుట, రక్షించుట, పట్టుకొనుట, అడ్డపడుట, నిలుపుట, సహాయముచేయుట, ఆదుకొనుట.

**تھاں** తహాం (హి) అచ్చట, అక్కడికి.

**تھان** థాన్ (హి.పు) స్థానము, లాయము, కట్టుమట్టు, బట్టలరేకు, తానులేక ఖండము.

**تھان کا ٹرا**-థాన్-కాటట్టా (హి) కట్టుమట్టున పోకిరితనముచేయునది, పలవగుఱ్ఱము; కుండలలోగుఱ్ఱముతోలుట. **تھان کا سچا**-థాన్-కా సచ్చా (హి) కట్టుమట్టమరుపనిది, సాధుగుఱ్ఱము. **تھان میں آنا**-థాన్-మేఁఆనా (హి) గుఱ్ఱముపాగ్లాడుట.

**تہانا** తహానా (హి) మడుచుట, చుట్టుట.

تھانگ థాంగ్ (హి. స్త్రీ) దొంగలయునికి పట్టు, చోరస్థానము, జాడ, పోబడి.

تھانگ لگانا తాంగ్-లగానా (హి) జాడతీయు ట, తెలియుట.

تھانگی థాంగీ (హి. పు) జాడతీయువా డు, వేగులవాడు; దొంగసొత్తులు కొనువాడు

تھانولا థానోలా (హి. పు) ఆలవాలము, చె ట్టుపాదు.

تھانہ థాన (హి. పు) ఠాణము, స్థానము.

تھانہ دار తానా-దార్ (హి) ఠాణదారుడు.

تھاہ థాహ్ (హి. స్త్రీ) అడుగు; తుద; లో తు; అంతు, భావము. تھاہ لینا థాహ్-లేనా (హి) అంతులేకలోతుకనుగొనుట, భావ ము తెలియుట.

تہائی తిహాయీ (హి. స్త్రీ) తృతీయాంశ ము, మూడవపాలు.

تہایت తిహాయత్ (హి పు) మూడవవాడు, ముగ్గురుచేరిచేయు పంచాయితి, పరాయి వాడు.

تھپڑ-تھپڑا థప్పడ్-థప్డా (హి. పు) చరుపు, దెబ్బ; అట్టము, పార; తారుడు, చపేటము, పెట్టు.

تھپڑی థప్డీ (హి. స్త్రీ) చప్పట.

تھپکی-تھپک థప్కీ- థపక్ (హి. స్త్రీ) తట్టు చరుపు, చిచ్చికొట్టుట, తట్టుట, బుజగరిం చుట.

تھپکنا థపక్నా (హి) జోకొట్టుట, తట్టుట.

تھپنا థప్నా (హి) మెడకుపడుట, పాల బడుట, స్వాధీనమగుట, అంటుపడుట; నిందవచ్చుట.

تھپیڑا థపేడా (హి. పు) చూడు تھپڑ

تہتر తిహత్తర్ (హి) డెబ్బదిమూడు. (పులు

تہتک తహత్తుక్ (అ. పు) అవమానము, తలవం

تھتکار థుత్కార్ (హి) ధిక్కారము.

تھتکارنا థుత్కార్నా (హి) ధిక్కరించుట, ఛీకొట్టుట, వెళ్లగొట్టుట.

تھتھانا థుథానా (హి) ఉగ్రముఖుడగు ట, ముఖముబ్బించుట, కోపగించుట.

تھتنی థుత్నీ (హి. స్త్రీ) ముట్టె, గుజ్జము మొ॥ హానిమూతి. (యినమాజు.

تہجد తహజ్జుద్ (అ. పు) జాగరణ, నడిరే

تہجی తహజ్జీ (అ. స్త్రీ) అక్షరాభ్యాసము, గుణితముచెప్పుట. حروف تہجی హురూఫె- (అ. పు) ఓనమాలు, వర్ణమాల,

تہذیب తహ్జీబ్ (అ. స్త్రీ) సంస్కారము, నాగరికత, మర్యాదలు, యోగ్యత, సభ్యత, శిక్ష, సుశిక్ష.

تہرا తిహ్రా (హి) ముప్పొర, ముప్పురి, ముమ్మడి, మూడంతలు, త్రిగుణము.

تہرانا తిహ్రానా (హి) ముమ్మడించుట, మూ డవతూరిచేయుట.

تھرانا థర్రానా (హి) గడగడలాడుట, గజగజలాడుట, వణకుట, అల్లాడుట.

تھرانا థిరానా (హి) తేరుట, పేరుట, స్థిర పడుట. (వడ

تھرتھر థర్ థర్ (హి) గడగడ, గజగజ, వడ

تھرتھرانا థర్థరానా (హి) గడగడలా డుట, గజగజలాడుట, అల్లాడుట, వడవడ వడంకుట,

تھرتھری థర్థరీ (హి. స్త్రీ) వడవడవ డంకు, వణకు, కంపము.

تھرتھراہٹ థర్థరాహట్ (హి. స్త్రీ) అదురు, అల్లాట. (మైన బుల్బుపిట్ట.

تھرتھرکپنی థర్ థర్ కప్నీ (హి) ఒకవిధ

تھرکانا థిర్కానా (హి) గంతులువేయిం చుట, చిందులు త్రొక్కించుట, ఆడిం చుట.

تھرکنا థిరక్నా (హి) గంతులువేయుట, చిందులుత్రొక్కుట,ఆడుట.

تہرو తహారూ (హి.పు) గుఱ్ఱపుపల్లముక్రింద వేయుగంత, కందరికము.

تھڑا థడా (హి.పు) గద్దియ,గద్దె, అంగడి వాడుకూర్చొనుచోటు,(మెత్త).

تھڑدلا థుడ్దలా (హి) పిసినారి,పిరికి.

تھڑی థుడీ (హి.స్త్రీ) సిగ్గు, బిడియము; అవమానము.

تہس نہس తహస్‌నహస్ (హి) అధ్వా నమైన,పాడైన,నాశమైన, తారుమారు.

تھکا థకా (హి) అలసిన, విసికిన, రోసిన, లోపడిన. تھکا ماندہ —మాందా (ఉ) అలసి సొలసిన. (ఆయాసము.

تھکان థకాన్ (హి) అలసట, బడలిక,

تھکانا థకానా (హి) అలయించుట, విసి కించుట.

تھکن థకన్ (హి.స్త్రీ) చూడు. تھکان

تھکنا థక్నా (హి) అలయుట, బడలుట, విసుకుట, బలహీనమగుట. (మాసిక.

تھگلا-تھگلی థిగ్లా-థిగ్లీ (హి.పు) అతుకు,

تھل థల్ (హి.పు) స్థలము,గట్టినేల.

تھل بیڑا —బేడా (హి) ఓడరేవు,నౌకా శయము;స్థాయి;జీవనోపాయము,ఆశ్రయము.

تھل تھل థల్‌థల్ (హి) తొడకు,పితపిత, సళ్లు,వదులువదులుగామండుట, మెత్త మెత్తన, మెత్తగానుండుట.

تھلتھلانا థల్‌థలానా(హి) పితపితలాడుట, తొడకిసలాడుట, మెత్తగానుసళ్లుగానుండుట.

تھلکنا థలక్నా (హి) తొడకుట,తటతట లాడుట,చలించుట.

تہلکہ తహ్లక (అ.పు) సంక్షోభము,గంద్ర గోళము,కలత,ఆపత్తు, నాశము,అల్లకల్లోల ము. تہلکہ مچنا —మచ్నా (ఉ) అల్లక ల్లోలమగుట,కీడుమూడుట.

تھم-تھمب-تھمبا థమ్—థంబ్—థంబా (హి.పు) స్తంభము-కంభము-గుంజ.

تہمت తుహ్మత్ (అ.స్త్రీ)నింద, అపవా దము,దోషము,ఆరోపము.

تہمت جوڑنا-دھرنا-دینا-لگانا-لینا-لئےمرنا జోడ్నా-ధర్నా-దేనా లగానా-లేనా-లియేమర్నా (ఉ) అపవా దము వేయుట,నిందమోపుట, దోషమారో పించుట.

تہمتی తుహ్మతీ (అ.పు) దూషకుడు, నిందమోపువాడు.

تھمنا థమ్‌నా(హి) ఆగుట; నిలుచుట, చా లించుట, ఊతగొనుట,తాళుట.

تھن థన్ (హి.పు)పొదుగు.

تھندار థన్‌దార్ (హి) పెద్దపొదుగుగల.

تھنی థనీ (హి.స్త్రీ) అశ్వదోషభేదము.

تہنیت తహ్నియత్(అ.స్త్రీ) అభినందన ము,శ్లాఘన,మేలుగోరుట,

تھو థూ(హి)థుపుక్కు,థూ! تھوتھو پھڑا థూథూపుడ్డా (హి) ఆటలోస్వల్పవిరా మమునకు సంజ్ఞ. تھوتھو کرنا —థూ కర్నా (హి) ఛీకొట్టుట, ఛీవాట్లు పెట్టుట.

تھوا థువా(హి.పు)మంటిపెడ్డ; ముద్ద; దిబ్బ; తుచ్ఛుడు,

تہوار తహ్వార్ (హి.పు)పండుగ,పబ్బము.

**تھوپ** థూప్ (హి.పు) బుడుపు, పొన్ను.

**تھوپڑا** థోప్‌డా(హి) ముట్టె;మూతి.

**تھوپنا** థోప్నా (హి) మెత్తుట, దన్ను వే యుట;తట్టుట, ప్రోగుచేయుట, కుప్పవే యుట, రొట్టెలు మొ॥ కొట్టుట.

**تھوپی** థోపీ (హి.స్త్రీ) గుద్దు,పోటు.

**تھوتر۔تھوترا** థోతర్-థోత్‌రా(హి) ఎలుకలు మొ॥ కొట్టినలేక కొరికిన; పురుగుతిన్న; ప్రాత, పనికిమాలిన. (ఉత్తమము.

**تھوتھا** థోథా (హి) వట్టి, ఉత్త, బోలు;మై

**تھوتھڑا** థూథ్‌డా(హి.పు) చూడు تھوپڑا

**تھوتھنا** థోథ్‌నా (హి.పు) ముట్టె,మూతి.

**تھوتھنی** థోథ్నీ(హి.స్త్రీ) మూతి,ముట్టె.

**تھوتھہ** థోథ్ (హి) లొత్త,లొట్ట లొటారము,వట్టిది.

**تہوّر** తహవ్వుర్ (అ.పు) శౌర్యము-పౌరుషము;ఆగ్రహము,ఆవేశము.

**تھور** థోర్ (హి.పు) కందులు.

**تھورنا** థూర్‌నా (హి) దిగగొట్టుట, త్రోయుట, క్రుక్కుట, నెట్టుట; దిగమ్రింగుట.

**تھوڑا** థోడా (హి) కొంచము,అల్పము,స్వల్పము. بہت تھوڑا—బహుత్ (హి) కొద్దిగొప్ప,ఇంచుమించు,కొంచకొంచము.

**تھوڑے سے تھوڑا**—థోడే సేథోడా(హి) అత్యల్పము, అతిస్వల్పము, మిక్కిలికొంచము. تھوڑا ہونا۔تھوڑا تھوڑا ہونا—తహోనా-థోడ్ హోనా(హి) చిన్నపోవుట, సిగ్గుపడుట,అవమానపడుట.

**تھوک** థూక్ (హి.పు) ఉమ్మి,నిష్ఠీవము.

تھوک بلونا—బిలోనా (హి) ఉమ్మిన మలుట, పనికిమాలినమాటలాడుచుండుట.

تھوک چاٹنا—చాట్నా (హి) ఆడిత ప్పుట,ఆడిబొంకుట. تھوک اچھلنا—ఉఛల్నా(హి) పనికిమాలినమాటలాడుచుండుట. تھوک لگانا—లగానా(హి) ఓడించుట,లోపరచుట;ఉమ్మిపెట్టుట.

**تھوک** థోక్(హి.పు) కుప్ప,ప్రోగు,దిబ్బ;మొత్తము;పరిమితి;రొక్కము;అఖండము, అడితి,జట్టి,పట్టి,టోకు,సగుటు;సంఘము;సమాజము;ఉమ్మడి;పాలు;పొలిమేర.

تھوک بندی—బందీ (హి) పొలిమేర కట్టుటలేకవేయుట. تھوک دار—దార్ (హి) జట్టిదారుడు, అఖండబేరగాడు,ముఖ్యగు, పెద్ద,అడితిదారుడు.

تھوک فروش—ఫరోష్ (ఉ) అఖండ బేరగాడు,మొత్తముగానమ్మువాడు.

**تھوکنا** థూక్నా (హి) ఉమియుట, ఛీకొట్టుట,చివాట్లుపెట్టుట.

**تھوکوانا** థూక్వానా(హి)ఉమ్మివేయించుట,ఛీకొట్టించుట. (రకములు.

**تھول** థోల్ (హి.పు) వరిపొట్టలు,పొట్టక

**تھولی** థూలీ (హి.స్త్రీ) నూకలుగావిసిరినది,నూక. (పోటి.

**تھونی** థూనీ(హి.స్త్రీ) స్తంభము, గుంజ,

**تھوہڑ** థూహడ్ [హి.పు]ఓషధిభేదము.

**تہی** తిహీ(పా) వట్టి,ఉత్త تہی دست -దస్త్[పా] రిక్తహస్తుడు, దరిద్రుడు, లేనివాడు. (చూడు تھئی

**تہی** తుహీ (హి) నీవే (భగవంతుడు)

**تھئی** థై[హి.స్త్రీ] రొట్టె మొ॥ వానిమడతలు,దొంతరము, మడతలు,దొంతి, కుప్ప.

**تھیبر** థీబ్ [హి]నెమ్మతి,నిమ్మళము.

**تھیگلی** థేగ్లీ [హి.స్త్రీ] మాశిక, అతుకు.

**تھیلا** థైలా[హి] గోనెసంచి.

**تهيوا** థేవా [హి.పు] ఉంగరపురాలు.

**تهیئی تهیئی** థయ్యాథయ్యా [హి. స్త్రీ] తైతైఆటపాటలు.

**تهیه** తహియ్యా [అ] సిద్ధము, సన్నాహము, ప్రయత్నము. **تهیه سفر**— సఫర్ [అ] ప్రయాణసన్నాహము.

**تیا** తియ్యా [హి.పు] మూడుచుక్కల యాటచీటి. **تیا پانچا کرنا**— పాంచా కర్నా [హి] ఆరు మూడుచేయుట, చెడ గొట్టుట, అమ్మివేయుట.

**تیار** తయ్యార్ [అ] సన్నిద్ధము, ఆయత్తము, ఉద్యుక్తము, సిద్ధము, ఉన్ముఖము, పక్వమైన, ఈడేరిన, పుష్టిగలిగిన, బలిష్ఠమైన, బలిసిన. **تیار کرنا**— కర్నా [ఉ] సిద్ధము చేయుట, ఒనగూర్చుట, సిద్ధపరచుట.

**تیاری** తయ్యారీ [పా.స్త్రీ] సిద్ధము, ప్రయత్నము, సన్నాహము, సన్నిద్ధత, ఆట్టహాసము, పటాటోపము; బలుపు—లావు.

**تیاگنا** తియాగ్నా [హి] విసర్జించుట, త్యజించుట, విడుచుట.

**تیپچی** తీప్చీ [హి.స్త్రీ] పోగుపెట్టుట, కూర్పు, సళ్లుకుట్టు, దూకుట్టు.

**تیتا** తీతా [హి] తిక్తము, ఉష్ణము, తీక్ష్ణము.

**تیتالیس. تینتالیس**— తేతాలీస్ - తేంతాలీస్ [హి] నలువదిమూడు.

**تیتر** తీతర్ [హి.పు] కౌజు, తిత్తిరిపిట్ట.

**تیترا** తీత్రా [హి] మూడవబిడ్డ.

**تیتری** తీత్రీ [హి.స్త్రీ] ఆకుచిలుక, సీతాకోకచిలుక; ఆడతిత్తిరిపిట్ట; క్రియాహీకజ్వరము; ఒకమందు. (ముప్పదిమూడు.

**تینتیس. تینتیس** తేతీస్ - తేంతీస్ (హి)

**تیج** తేజ్ (హి.పు) తేజస్సు—తేజము.

**تیج** తీజ్ (హి.స్త్రీ) తృతీయ, తదియ; శ్రావణపట్టిపండుగ; ఇంద్రగోపము; ఆరుద్రపురుగు. **تیج تهوار**— తిహ్‌వార్ (హి) పండుగపబ్బము.

**تیجا** తీజా (హి.పు) మూడవదినము; తురకలలో చచ్చినమూడవనాడు చేయుశ్రాద్ధము.

**تیجپات** తేజ్‌పాత్ (హి.పు) ఒకసువాసన గలఆకులు (తాడిసపత్రి)

**تیکها. تیکهی** తీఖా-ఖీ (హి) ఉటంకి, జాణ; పోకిరి, పలవ, తులవ, తీక్ష్ణమైన; అందమైన, రమ్యమైన. (చెంత, దాపు.

**تیر** తీర్ (హి.పు) తీరము, ఒడ్డు; సామీప్యము,

**تیر** తీర్ (పా.పు) బాణము; బుధగ్రహము; చీకటి; త్రయోదశి; తీరునెల, పారసీకులనాలుగవసౌరమాసము (దక్కనులో ఎనిమిదవది.)

**تیر انداز**— అందాజ్ (పా) విలుకాడు.

**تیر اندازی**— అందాజీ (పా) విలువిద్య.

**تیر بهدف**— బహదఫ్ (పా) అమోఘము, తప్పనిది. **تیر حکمی**— హుక్మీ (పా) అమోఘబాణము, గురితప్పనిది.

**تیر کمان میں رکهنا**— కమాన్ మేఁరఖ్నా (ఉ) బాణమెక్కుపెట్టుట, అరిపెట్టుట. **تیر هوائی**— హవాయీ (పా) గాలితూపు.

**تیرا** తేరా (హి) నీ, నీయొక్క.

**تیرا میرا کرنا**— మేరాకర్నా (హి) నాదినీదియనుట, వేరుబందముగా మాటలాడుట, పరాయిగా నుండుట.

**تیراک** తైరాక్ (హి.పు) ఈతగాడు.

**تیراکی** తైరాకీ (హి.స్త్రీ) ఈత.

**تیراؤ** తైరావ్ (హి) ఈదుటకుతగిన లోతైన

تیرتھ తీరథ్ (హి.స్త్రీ) తీర్థము,యాత్రా స్థానము.

تیرس తేరస్ (హి.స్త్రీ) త్రయోదశి.

دھن تیرس ధన్‌తేరస్-(హి) కార్తీక త్రయోదశి.

تیرگی తీరగీ (పా.స్త్రీ) చీకటి,మసుకు, కండ్లుమిరుమిట్లుగొనుటచేత చీకట్లు క్రమ్ముట.

تیرنا తైర్నా (హి) ఈదుట, తేలుట.

تیرہ తీర (పా) చీకటి,మసుకు,నల్లని.

تیرہ بخت-روزگار —తీర బఖ్త్-రోజ్‌గార్ [పా]దౌర్భాగ్యుడు.

تیرہ తేర [హి]పదమూడు.

تیرھویں తేర్హ్వీఁ[హి.స్త్రీ] సపిండీకరణము; పదమూడవ.

تیز తేజ్ వడిగల;తీవ్రమైన,తీక్ష్ణమైన; ఘాటుగల;మసుకుగల, ప్రియమైన, తెలివిగల, జాణయైన;పదనుగల,వాడియైన; కారమైన; ఉగ్రమైన, క్షారమైన. تیز دست—తేజ్‌దస్త్ [పా]చేయితిరిగిన, నేర్పుగల, వడిగాచేయు. تیز رفتار—తేజ్‌రఫ్తార్[పా] వేగవంతమైన,వడిగాపోయెడు. تیز فہم—తేజ్‌ఫహ్మ్ (పా) సూక్ష్మబుద్ధిగల, తెలివిగల. تیز مزاج—తేజ్‌మిజాజ్ (పా) తీక్ష్ణస్వభావముగల,దుడుకైన. تیز کرنا—తేజ్‌కర్నా [ఉ]పదనుపెట్టుట; కోపము పుట్టించుట. تیز نگاہ—తేజ్‌నిగాహ్ [పా] వాడిచూపు.

تیزاب తేజ్ఆబ్ [పా] జ్వలనస్వభావముగల ద్రావకము,ఒకరసాయనము, క్షారము.

تیزی తేజీ [పా.స్త్రీ] పదను,వాడి;తీక్ష్ణము;వడి;ఘాటు; చురుకుదనము, ప్రియము; కోపము;జాణతనము; క్రౌర్యము; ఉగ్రత,ఉద్రేకము;

تیس తీస్ (హి) ముప్పది. تیسوں دن تیس مارخان—తీస్‌దిన్ [హి] ఎల్లప్పుడు, ప్రతిదినము, నెలయంతయు.

تیس مار خان—తీస్‌మార్‌ఖాఁ[ఉ]మహాశూరుడు,(కాదనుట)బల్లండిసిపాయి (వంటి

تیسا తైసా [హి]అట్లు,ఆప్రకారము, అటు

تیسرا తీస్రా [హి]మూడవది, తృతీయము.

تیسی తీసీ [హి.స్త్రీ] ఎల్లగిసె, ఎల్లగిసె నార, కిత్తాను.

تیشہ తేషః(పా.పు) బాడిసె. (వాలిక

تیغ తేగ్[పా.స్త్రీ] పట్టాకత్తి,బాకు, కర

تیغا తేగా(పా.) చిన్న వెడలుపాటికత్తి; ఒకజట్టిపట్టు, ద్వారము మొ॥ మెత్తివేయుటచేత పూడ్చుట. (కము,బరువసము,

تیقن తయఖ్ఖున్ [అ.పు]నిశ్చయము,నమ్మ

تیکھا తీఖా (హి) తీక్ష్ణమైన.

تیکھی తీఖీ [హి.స్త్రీ] వక్రత,వంక;వగలాడి-సొగసులాడి.

تیل తీల్ [హి.స్త్రీ] ఒకఆడంగులదుస్తు.

تیل తేల్ [హి.పు] తైలము-చమురు.

تیل تواکالا—తేల్‌తవాకాలా [హి] కారుననలుపైన. تیل چڑھانا.لگانا.ملنا—తేల్‌చఢానా-లగానా-మల్నా [హి] చమురురాయుట-పట్టించుట-పూయుట-వివాహామందువధూవరులకుకాలు సేతులకును తలకునుపసుపునూనె యొకటిపిపూయుట.

تیلن తేలన్ (హి.స్త్రీ)గాండ్లది, తెలికలది; నూనెయమ్మునది.

تیلی తేలీ (హి.పు) గాండ్లవాడు, తెలికలవాడు. تیلی راجا—తేలీ-రాజా(హి) నూనెబట్టీలవాడు (ఒకబిచ్చగాండ్లతెగ); మురికివాడు,

تپلیا తేలియా(హి) జిడ్డుగల,చమురు సం॥, నూనెరంగుగల.

تیمارداری తీమార్‌దారీ (పా.స్త్రీ)అను శోకము,సహానుభూతి,ఓదార్పు,విచారణ, రోగిపరిచర్య.

تیمم తయమ్ముమ్ (అ.పు) మృత్తికాస్నాన ము(విభూతిస్నానము వంటిది)

تین తీన్ (హి)త్రి,మూడు تین پانچ-తీన్ పాంచ్(హి) జగడము,పోట్లాట,వాదము; మోసము. تیرہ تین-తేరహ్(హి)అరు మూడు, చెల్లాచెదరు,తెరుమారు,పోడు, تین حرف-తీన్ హర్ఫ్ (ఉ) ధిక్కార ము,శాపము, ఛీవాట్లు,దూషణ. تین کالے-కాలే (హి)ఆశాభంగము. (కము

تیندو తేందూ(హి.పు)తునికిపండు, తిందు

تیندوا తేందువా (హి.పు) ఒకవిధమైన చిరుతపులి.

تیور తేవర్ త్యూర్ (హి) దృష్టి, చూపు, ముఖవిలాసము, లక్షణము, ముఖవైఖరి, ఇంగితము, ముఖముజాడ.

تیورانا తేవ్‌రానా (హి) తలదిమ్మెపట్టు టు,కండ్లుచీకట్లుకమ్ముటులేకతిరుగుటు.

تیورس తేవ్‌రస్ (హి.పు)కడచినలేకరా బో వుమూడవసంవత్సరము.

تیوڑی-تیوری తేవ్‌రీ-తేవ్‌డీ (హి. స్త్రీ) ముఖవైఖరిలేకవిలాసము, దృష్టి, చూపు, నొసటిపైవళులు, ముఖముజాడ.

تیوری بدلنا-چڑھانا-తేవరీ-బదల్నా-చ ఢానా(హి)ముఖముచిట్లించుట,బొమలుము డిపెట్టుట,కోపముఖమగుట.

تیوہار తేవ్‌హార్ (హి.పు)పండుగ,పబ్బము

تیوہاری తేవ్‌హారీ(హి.స్త్రీ)పండుగ, బ హుమానము,పండుగబిచ్చము.

تیہا తేహా (హి.పు) ఉద్రేకము,ఆవేశము, ప్రచండత,తీక్ష్ణము,ఉగ్రము,కోపము.

تیہرا తేహ్‌రా (హి) చూడు تہرا

تیئیس తేయీస్ (హి) ఇరువదిమూడు.

تئیں తయీం(హి) కు, కై, కొఱకు; నిమి త్తము.

تیہہ తీయ (హి.పు) పొలిమేర, పొలిమేర గుర్తు లేక దిబ్బ, تیہہ بندی-బందీ (హి)పొలిమేరవేయుట.

( ٹ )

ٹ టే (హి.స్త్రీ) టకాకారము,ఇది ఉరుదువర్ణ మాలలోఅయిదవవర్ణము, హిందీలోపదునొ కండవది,వర్ణసాంఖ్యము (ابجد) లోఇది యును తే(ت)వలెనే నన్నూటికిసొజ్ఞ.

ٹابر టాబర్ (హి.స్త్రీ)దొంగవు,కుంటు;గుడి సె;కుటుంబము;వంశము;పిల్లవాడు.

ٹاپ టాప్ (హి.స్త్రీ)గుఱ్ఱపుగిట్ట,గొరిజ;గు ఱ్ఱపుముందరికాళ్లగిట్టలచప్పుడు; చేపలపట్టు బుట్టలేకగూడు;బొంగరము.

ٹاپا టాపా (హి.పు) కోళ్లబుట్ట.

ٹاپڑا టాప్‌డా (హి.పు) గుడిసె;పూరిఇల్లు.

ٹاپنا టాప్నా (హి)గుఱ్ఱపుముందరికాలిగిట్ట తోనేలపైతన్నుట,కాలుతన్నుట; వెదకుట; ఎదురుచూచుట; ఆతురపడుట.

ٹاپو టాపూ (హి.పు) లంక, ద్వీపము,గడ్డ; సంభ్రమము,పరితాపము,ఆతురము.

**ٹاٹ** టాట్ (హి.పు) గోనెపట్ట,పట్ట, గోనె; గద్దియ,గద్దె;శెనగమొలవానికాయ(పొట్టు) **ٹاٹ الٹنا**-ఉలట్నా (హి) అప్పులకాపగుట,ఋణగ్రస్థుడగుట. **ٹاٹ بافی**-బాఫీ (ఉ) సరిగపని. (చుట.

**ٹارنا** టార్నా (హి) తొలగుట, త్రోవపడు

**ٹاڑی** టాడీ (హి) చిన్నగొడ్డలి

**ٹال** టాల్ (హి.స్త్రీ) కట్టెలమండె, కుప్ప;పశువులమెడలోకట్టుగంట; తొలగింపు, తప్పించుట, నెపము, మిష, సాకు,టక్కు.

**ٹال پٹال-ٹال ٹول-ٹالم ٹول-ٹال مٹول** -పటాల్-టోల్-టాలంటోల్-మటోల్ (హి.స్త్రీ) విలంబనము, కాలయాపనము; మిషచేయుట;జరపుట;తప్పించుకొనుట.

**ٹالا** టాలా(హి.పు) మిష,నెపము,సాకు;విలంబనము,తప్పించుకొనుట,టక్కు.

**ٹالا بالا بتانا**-బాలాబతానా (హి)జరుపుట, కాలయాపనము చేయుట, తప్పించుకొనుట

**ٹالنا** టాల్నా (హి) తప్పించుకొనుట, కాలముజరపుట,మిషచేయుట, టక్కుచేయుట,తొలగించుట.

**ٹالی** టాలీ(హి.స్త్రీ) పశువులమెడలోకట్టు చిన్నగంట;అర్ధరూపాయి (నాణెము)

**ٹانٹ** టాంట్ (హి.స్త్రీ) నడినెత్తి,మాడు, కపాలము. (దిట్టమైన.

**ٹانٹا** టాంటా (హి) బలిష్ఠమైన,బలిసినది,

**ٹانچ** టాంచ్ (హి) వికటమైన, సంకటకరమైన. (చుండుట.

**ٹانچنا** టాంచ్నా (హి) ఎగురుట,ఎగురు

**ٹانڈیا-ٹانڈہ-ٹانڈ** టాండ్-ఢ్-టాండ్యా (హి.పు) అటుక,మసెల,చేనిలోనిమంచె.

**ٹانڈا** టాండా (హి.పు) సార్థము; లంబాడి తండ;సామాను;కుటుంబము.

**ٹانک** టాంక్(హి.స్త్రీ) నాలుగుమాసలఎత్తు; పాలు, భాగము;అంచన,మదింపు.

**ٹانکا** టాంకా (హి.పు) కుట్టు;మాటు;అతుకు, టంకము;చెరువు,మడుగు.

**ٹانکنا** టాంక్నా (హి) కుట్టువేయుట,అతుకుట,అంటించుట, గ్రుచ్చుట,కలుపుట,వ్రేలాడగట్టుట. (నేలతొట్టి.

**ٹانکھ** టాంఖ్ (హి.పు) కొంకి, జలాశయము,

**ٹانکی** టాంకీ (హి.స్త్రీ)టంకము;ఒడ్డెరవాని ఉలి;చిల్లి;తూటు;తునక;బద్ద; పుండు;గంగాళము,నీళ్లతొట్టి.

**ٹانگ** టాంగ్ (హి.స్త్రీ) కాలు; నాలుగవపాలు, **ٹانگ اڑانا**-అడానా (హి) అడ్డపడుట, ఆటంకపెట్టుట.

**ٹانگڑی** టాంగ్డీ(హి.స్త్రీ)కాలు,పాదము.

**ٹانگن** టాంగన్ (హి.పు)కంగణ,తట్టువ,పొట్టిగుఱ్ఱము.

**ٹانگنا** టాంగ్నా (హి) వ్రేలాడగట్టుట.

**ٹانگی** టాంగీ (హి.స్త్రీ) చేగొడ్డలి.

**ٹبا** టిబ్బా(హి.పు) దిబ్బ,ఎత్తుగుభూమి,మిట్ట.

**ٹبر** టబ్బర్ (హి.స్త్రీ) కుటుంబము; ఇంటివెచ్చము.

**ٹپ** టప్ (హి.పు)బండిగూడు;కప్పు;గంతు, దాటు. **ٹپ جانا**-జానా(హి) దూకిలేక దాటిపోవుట.

**ٹپا** టప్పా (హి.పు) గంతు, దాటు;దూరము; పరగణ,ప్రదేశము;ఒకపాట;గాలిచాపగలబడ;అంచె,అంచెలచావడి; కూర్పు(పోయుట)

**ٹپاٹپ** టపాటప్ (హి) ఎడతెగకుండ,వెంటవెంట,జలజల(రాలుట),పటపట.

**ٹپانا** టప్పానా (హి)గంతులువేయించుట.

**ٹپس** టిప్పస్(హి.స్త్రీ)అధికారము,ఆశ్రయము,సహాయము,సంబంధము,ఆస్తి భారము.

**ٹپک** టపక్ (హి.స్త్రీ) పటుక్కుమనుచప్పుడు; సలుపు,తీపు. **ٹپک پڑنا**-టపక్-పడ్నా (హి)రాలుట,కారుట.

**ٹپکا** టప్కా(హి.పు)ఊరుపు, గాలికిరాలినది (పండ్లమొ||) మరక,పాటు,రాలుట.

**ٹپکانا** టప్కానా(హి)కార్చుట, రాల్చుట, ద్రావకము మొ||దించుట,పిండుట, బొట్లుగా పడునట్లుచేయుట. (సంధానము.

**ٹپکاؤ** టప్కావ్ (హి.పు)ఊరుపు;స్రవింపు,

**ٹپکنا** టపక్నా (హి) ఊరియుట,రాలుట, కారుట, చుక్కలుగాపడుట; తీయుట, సలుపుట. (ఖ్యానము, జాతకము.

**ٹپن** టిప్పన్ (హి.స్త్రీ) టిప్పణము, వ్యా

**ٹپنا** టప్నా (హి) దూకుట,దాటుట,మూయుట;కలియుట. (తడక, అడ్డము.

**ٹٹا ٹٹر** టట్రా-టట్టర్ (హి.పు) వెండము,

**ٹٹانا** టటానా (హి)నొప్పిపుట్టుట (కీళ్లు)

**ٹٹ پونجیا** టట్పూంజియా(హి) బండాలముచెడినవాడు, నష్టపడినవాడు, రిక్తుడు.

**ٹٹروں ٹوں** టట్రూంటూం(హి) పావురపు అరపు; ఒంటరిగా, ఏకాకి.

**ٹٹری** టట్రీ (హి.స్త్రీ) నడినెత్తి, మాడు; మంచపుచౌకము; తడక; అలవ; కంచె.

**ٹٹکا** టట్కా (హి) ప్రస్తుతపు,క్రొత్త.

**ٹٹکا** టుట్కా (హి)తంత్రము, యంత్రము, మంత్రము, చుట్కము.

**ٹٹکارنا** టిట్కార్నా (హి) పశువులనుతోలుట. (టకైచేయుధ్వన్యనుకరణము.

**ٹٹکاری** టిట్కారీ (హి) పశువులనుతోలు

**ٹٹو** టట్టూ(హి.పు)తట్టువ,చిన్నగుఱ్ఱము; సామర్థ్యము,ఉపాయము.

**ٹٹوانی** టట్వానీ (హి.స్త్రీ)ఆడతట్టువ.

**ٹٹول** టటోల్ [హి.స్త్రీ] తడవుట,పుముకులాట,శోధ,జాడ, వెదకుట.

**ٹٹولنا** టటోల్నా [హి] పుముకుట, తడవులాడుట, జేవులాడుట; అభిప్రాయము తెలియజూచుట,పరీక్షించుట.

**ٹٹولواں** టటోల్వాం(హి)అంచనగాఊహించి, ఉజ్జాయించి.

**ٹٹی** టట్టీ (హి.స్త్రీ)తడక,దడి,పెండెము, అడ్డము,మరుగుదొడ్డి. **ٹٹی جانا**-టట్టీ-జానా (హి) చెంబుపట్టుకపోవుట, మరుగుదొడ్డికిపోవుట. (మాను.

**ٹٹیا** టటియా (హి) పెండెము,చిన్నతడక;

**ٹٹیری** టటీరీ (హి.స్త్రీ)పిల్లలాడుకొనుగిలక, ఒకపిట్ట, గిలకపండు.

**ٹچا** టుచ్చా(హి.పు) తుచ్ఛుడు, పలవ, తులువ,పనికిమాలిన. (ధ్వన్యనుకరణము.

**ٹخ ٹخ** టఖ్ టిఖ్(హి)గుఱ్ఱమునుతోలు

**ٹخنا** టఖ్నా (హి.పు) చీలమండ.

**ٹڈا** టిడ్డా(హి.పు) ఋట్టిమిడత, మిడత,ఒక్కి,బక్కనివాడు.

**ٹڈی** టిడ్డీ(హి.స్త్రీ)మిడతలు. **ٹڈی دل**-దల్(హి.పు)మిడతలదండు, గొప్పసైన్యము.

**ٹر** టర్ (హి.పు)గోండ్రింపు,కప్పయరపు; కనుముపండుగ;వదరు,జంబాలు. **ٹر ٹر**-టర్ [హి.స్త్రీ] సణగు,గొణుగు,వదరు.

**ٹرانا**-టరానా(హి)గొణుగుట,సణగుట, వదరుట, ఏడ్చుట, అల్లరిచేయుట.

**ٹرا** టర్రా (హి) వాచాలుడు, వదరుబోతు,పరుషవాది,డంబాలమారి,పలవ,పోకిరి.

ٹرا టుఱ్ఱా (హి.పు) కణము, గింజ;ఆటునిధా న్యము,సజ్జలు మొ॥వి

ٹرانا టఱ్ఱానా (హి) వదరుట,గొణుగుట,ప రుసములాడుట,పోకిరితనముచేయుట.

ٹرخل టర్ఖల్ (హి.పు) తొత్తు,లంజె, దుర్మార్గురాలు.

ٹرکانا టర్కానా(హి)జరపుట,తప్పించుట, మినచేయుట.

ٹرو టఱ్ఱూ (హి.పు) కప్ప; గిలకరాట్నము, (మంటిగిన్నెపైతోలుపొదిగినది)

ٹسر టసర్(హి.పు)దసలు,పట్టు. (జాగు.

ٹسر مسر—టసర్ మసర్ (హి.స్త్రీ)ఆలస్యము,

ٹس سے مس نہ ہونا - టస్ సేమస్ నహోనా (హి) కదలక మెదలకయుండుట,నిశ్చలము గా నుండుట (పోటు.

ٹسک టసక్ (హి.స్త్రీ)నొప్పి,తీపు,సలుపు,

ٹسکنا టసక్నా (హి) అల్లాడుట,కదలుట, మెదలుట;సలుపుట,తీయుట.

ٹسکنا టుసక్నా (హి) నిట్టూర్పువిడుచుట, ఏడ్చుట,అంగలార్చుట.

ٹسن టసన్(హి.స్త్రీ)పోకిరితనము,జగడము.

ٹسوے టస్వే (హి.పు) నీలిఏడ్పు, కపటపు కన్నీరు.

ٹک టక్ (హి.స్త్రీ) దృష్టి,చూపు.

ٹک టుక్ (హి) రవంత,రవంతసేపు.

ٹکا టకా (హి.పు)దుగ్గాని,రూకలు,ద్రవ్యము.

ٹکانا టకానా (హి) నిలుపుట, ఆపుట;ఊత గొనుట,ఆనుట,మోటించుట,అంటించుట.

ٹکاو టికావ్ (హి)దృఢత్వము,గట్టితనము;ఉ నికి,స్థావరము;ఆటునట్టి,చాలాకాలముఉం డునట్టి.

ٹکٹ టికట్(ఇం.పు)చీటి,పత్రము,తిక్కటు

ٹکٹکی టిక్టికీ (హి స్త్రీ) తేరిచూపు,ఉరి మిచూపు,రెప్పవేయకచూచుట,దృష్టి.

ٹکر టక్కర్ (హి.స్త్రీ) సమాఘాతము, తా కుడు,పోటు,పోటి. ٹکر کھانا—టక్కర్ఖానా(హి) తాకుడుతినుట. ٹکر مارنا—టక్కర్ మార్నా (హి) ఎదిరించుట,తాకుట. (రొట్టె.

ٹکڑ ٹکر టిక్కర్-టిక్కడ్ (హి.స్త్రీ)లావు

ٹکرانا టక్రానా (హి) ఢీకొనుట, తాకుట, కొట్టుకొనుట;దేవులాడుట.

ٹکڑا టుక్డా(హి.పు)తునక,ముక్క;పాలు, కబళము. ٹکڑگدا—టుక్కడ్గదా (ఉ) బిచ్చగాడు,మాధవకరుడు.

ٹکڑی టుక్డీ (హి.స్త్రీ) జట్టి, సంఘము, గుంపు,మంద, చూడు. ٹکڑا

ٹکس టికస్ (ఇం.పు) పన్ను,సుంకము.

ٹکسا టుక్సా (హి) రవంత, కొంచము.

ٹکسال టక్సాల్ (హి.స్త్రీ) టంకశాల,ని ష్కశాల, రూపాయలు మొ॥ నాణెము లుచేయుచోటు.

ٹکسالی టక్సాలీ (హి.పు) నైష్కికుడు, టంకసాలదారుడు, స్వచ్ఛమైన.

ٹکلی టిక్లీ (హి.స్త్రీ)పాపటబొట్టు, తిలక ము;బిళ్ల. (టు, అంటుపడుట.

ٹکنا టక్నా (హి) కుట్టబడుట, జతయగు

ٹکنا టిక్నా (హి) నిలుచుట,ఆగుట,తాళు ట,ఆటుట ఉండుట. (కాచప్పుడు.

ٹکور టికోర్ (హి.స్త్రీ) తాకు,దెబ్బ, డం

ٹکور టకోర్ (హి.పు) కాపుడు,పిండికట్టు,

ٹکورا టకోరా (హి.పు) డంకాదెబ్బలేక చప్పుడు.

ٹکورا టికోరా (హి.పు)మామిడి(కసిగాయ); మీటుట. కొట్టుట. (ట్టుట.

ٹکورنا టికోర్నా (హి) కాచుట, ఆవిరి ప

ٹلا టిల్లా (హి)దెబ్బ,తాకుడు,పోటు.

ٹلانا టలానా (హి) తప్పించుట,తొలగించుట; జరపుట; దాటించుట; మాయముచేయుట. (చూడు ٹالنا)

ٹلٹلانا టిల్‌టిలానా(హి) కడుపువాగుట.

ٹلکنا టులక్నా (హి) ప్రాకులాడుట, చచ్చుట,రాలుట. (టుట,జరుగుట.

ٹلنا టల్నా (హి) తొలగుట,తప్పుట, దా

ٹلوا టిల్వా (హి.పు) బుడుపు (గల) కత్తి, వంకరకట్టె; మంగలికత్తి; ముఖస్తోత్రము, వామనుడు, పొట్టివాడు.

ٹما టిమ్మా (హి)పొట్టివాడు; దుర్బలుడు.

ٹماک టిమాక్ (హి.పు) ఆడంబరము, వైభవము.

ٹم ٹم టమ్‌టమ్ (ఇం.పు) తుడుము.

ٹمٹمانا టిమ్‌టిమానా (హి) మిణుకులాడుట,మినిమింతలుపడుట, వెలవెలబారుట.

ٹمٹماهٹ టిమ్‌టిమాహట్ (హి.స్త్రీ)మిణుకుమిణుకు,మినిమింతలు.

ٹمکی టమ్‌కీ (హి.స్త్రీ) తుడుము.

ٹن టన్ (హి.పు) టంగుమనిధ్వని;గర్వము, పీచము.

ٹن ٹن టన్‌టన్ (హి.పు) టణటణ (చప్పుడు)

ٹن టిన్ (ఇం.పు) తగరము,తగరముపూసినరేకు,రేకదానితో చేసినడబ్బి, రేకపాత్ర.

ٹنا టున్నా (హి.పు) తొడిమ.

ٹنٹا టంటా (హి.పు) జగడము-పీకులాట, పోట్లాట,వివాదము. (తొంటువాడు.

ٹنٹا టుంటా (హి.పు) మొండిచేతివాడు,

ٹنٹنانا టంటనానా (హి) సుతికలుపుట; గణగణలాడించుట,వాయించుట.

ٹنچ టంచ్ (హి.)సిద్ధము, ఆయత్తము.

ٹنچ టంచ్(హి)అత్యల్పము,రవంత.

ٹنڈ టుండ్ (హి.పు) మొండికొమ్మ,తుండెము, మొండిచేయి.

ٹنڈا టుండా (హి) మొండిచేతివాడు.

ٹنڈی టుండీ (హి) నాభి, బొడ్డు; దండ; మొండిచేతియాడుది.

ٹنڈیل టండేల్ (హి.పు) శస్త్రాగారము యొక్క అధికారి; పెద్దకూలి.

ٹنکار టంకార్ (హి.స్త్రీ) టంకారము, వింటినారియొక్క ధ్వని. (చుట.

ٹنکارنا టంకార్నా (హి) వాయించిచూ

ٹنگ-ٹنگڑی టంగ్-టంగ్‌డీ (హి.స్త్రీ) (హి) చూడు. ٹانگ

ٹنگارنا టుంగార్నా (హి)పండ్లు మొ॥ కోయుట, తుంచుట,తెంచుట. (కుట.

ٹنگنا టంగ్‌నా (హి)వ్రేలాడుట,వ్రేలాడబ

ٹنہیا టన్‌హియా (హి.పు) మంత్రగాడు,కట్టుబోతు.

ٹوبا టోబా(హి.పు) కూపు, కుట్టు.

ٹوپ టోప్ (హి.పు) గవిసెన; పెద్దటోపి; మూత; కప్పు; కుట్టు; శిరస్త్రాణము, అంగుళిత్రాణము; మోసము, టక్కు.

ٹوپا టోపా (హి.పు) చెవులకుళ్లాయి; కుట్టు.కూపు. (వేయుట.

ٹوپنا టోప్నా (హి)చేతితోవిత్తుట, మొల

ٹوپی టోపీ(హి.స్త్రీ) తోపి;తోపి;టెంకి; తొపారములేక కండ్లగంత;కిరీటము;తుపాకిపూవు.

ٹوٹ టూట్ (హి.స్త్రీ) పగులు, వ్రయ్యి, విరుగుట; శీర్షిక, అంచునవ్రాసినది;లోపపూరణము.

ٹوٹا టూటా (హి)భగ్నమైన, భంగమైన, పగిలిన,విరిగిన, చెడిన,విసికిన,అలసిన,

ٹوٹا టోటా (హి.పు) మొండివత్తి, కాలిన వత్తి; వెదురుతుంట; దీపపుకొడి,తుపాకి తోటము; దండుగ, నష్టము, తుట్టి; పువ్వొత్తి. (యుకిప్పి.

ٹوٹرو టోట్‌రూ (హి) బెల్లగువ్వ; గంజా

ٹوٹکا టోట్కా (హి.పు) మంత్రము, యంత్రము,ప్రయోగము, రక్షరేకు.

ٹوٹکےهائی టోట్ కేహాయీ (హి.స్త్రీ) మంత్రగత్తె,కట్టుబోతుయాడుది, గారడిది.

ٹوٹنا టూట్నా (హి) విరుగుట, పగులుట, వైబడుట, తగ్గుట, నష్టపడుట, దిగుట,పడుట, వీడిపోవుట,భంగమగుట, రిక్తుడగుట. (తుచ్ఛము.

ٹورا టోరా.(హి.పు) గజ్జె;పొట్ట;వికారము;

ٹوڑا టోడా (హి.పు) బిగువు బద్ద,బిగియుటకైవేసినబద్ద, పెండెబద్ద,

ٹوڑی టోడీ(హి.స్త్రీ) తోడిరాగము.

ٹوسا టూసా (హి.పు) జల్లెకుకాయ, కాయ;పీచు,ఈనె,తొడిమ,నార; అంకురము.

ٹوسی టూసీ (హి.స్త్రీ) మొగ్గ.

ٹوک టోక్ (హి.స్త్రీ) దృష్టిదోషము; ఆటంకము,అడ్డు. (ము, తునక.

ٹوک-ٹوکا టూక్-టూకా (హి.పు) ఖండ

ٹوکرا టోకరా (హి.పు) గంపు,తట్ట.

ٹوکری టోకరి (హి.స్త్రీ) బుట్ట, చిన్నతట్ట. (కొప్పెర.

ٹوکنا టోక్నా (హి.పు) గంగాళము,

ٹوکنا టోక్నా (హి) అడ్డపెట్టుట, ఆపుట, నిలుపుట, ఆటంకపెట్టుట, ఎచ్చరించుట, అడుగుట, మల్లచరచుట, దృష్టిపెట్టుట, మత్సరించుట. (ము, పన్ను.

ٹول టోల్ (ఇం.పు).తీరువ, తెరువు, సుంక

ٹول టూల్ (ఇం.పు)ఒకనేతబట్ట.

ٹولا టోలా (హి.పు)వాడ,వీధి, గ్రామభాగము;మొట్టికాయ; జాతిలేక ఇటుకతునక.

ٹولی టోలీ (హి.స్త్రీ) జట్టి,సంఘము; పాటుకులమేళము, చాపరాయి,బండ.

ٹوم టూమ్ (హి.పు) భూషణము,అలంకారము; సొగసుగత్తె, భాగ్యశాలి,జాణ.

ٹونا టోనా (హి.పు) మంత్రము, యంత్రము; పెండ్లిపాట; తడవుట, పుడుకుట.

ٹونےباز-ٹونےباز టోనేబాజ్ (ఉ) కట్టుబోతు. (క్షీముక్క.

ٹونٹ టోంట్ (హి.స్త్రీ) చుంచువు, ప

ٹونٹا టోంటా (హి.పు) పెట్లుదిమ్మె; వెదురుగణుపు. (వానికొమ్ము; తూము.

ٹونٹی టోంటీ (హి.స్త్రీ) చెంబు మొ॥

ٹونڑی టోండీ (హి.స్త్రీ) బొడ్డు, మొన.

ٹونهائی టోన్‌హాయీ (హి.స్త్రీ) చూడు ٹوٹکےهائی

ٹوه టోహ్(హి.స్త్రీ) దేవులాట,పుడుకుట, తడవుట; వేగు,జాడ.

ٹوهنا టోహ్‌నా (హి) తడవుట,దేవులాడుట,వెదకుట,జాడతీయుట.

ٹوئی టోయీ (హి.స్త్రీ) వెదురుపిడి లేకగణపు,తుంట,

ٹها ఠా (హి.పు)ఠాయి, స్థాయి.

ٹهاٹ ఠాట్ (హి.పు) వెదురుకొయ్యలచట్టము, పటాటోపము,వీణెము॥ వానిమెట్లు రాగానుసారము ఏర్పరచుట, సన్నాహము,వైభవము, వైఖరి, శైలి, శయ్య, ఠీవి, రీతి,వయినము, విలాసము,డౌలు, ఔత్సుక్యము, సంభ్రమము, అంగవిన్యాసము.

ٹهاٹر ఠాటర్ (హి.పు) వెదురుచట్టము; తడక;కొల్లగూడు, పారావతము, కపోతపాలిక.

**ٹھا ٹھا** ఠాఠా (హి.పు) కకుదము, ఎద్దు మూపురము.

**ٹھاڈا-ٹھاڑا** ఠాడా (హి) బలిష్ఠమైన, బలిసిన,నిలువబడిన, దిట్టమైన.

**ٹھاکر** ఠాకుర్ (హి.పు) స్వామి, యజమాని, అధికారి,పెద్ద; భూస్వామి; దేవుడు; విగ్రహము; ధనవంతుడు; గౌరవనామము.

**ٹھال** ఠాల్ (హి.స్త్రీ) నిరుద్యోగము, ఆటవిడుపు,సెలవు,పనిలేమి,తీరిక.

**ٹھالی** ఠాలీ (హి) పనిలేని, నిరుద్యోగుడైన, పనికిమాలిన.

**ٹھاں** ఠాఁ (హి.స్త్రీ) ధన్ అనుచప్పుడు, (తుపాకిచప్పుడు.

**ٹھانسنا** ఠాఁస్నా (హి) కుక్కుట,కూరుట, గ్రుచ్చుట,చొప్పించుట.

**ٹھاننا** ఠాన్నా (హి) దృఢపరచుకొనుట, మనోనిశ్చయముచేసికొనుట.

**ٹھاؤں** ఠావుఁ (హి.స్త్రీ) స్థానము, ఉనికిపట్టు,నివాసము,స్థలము,స్థాయి.

**ٹھپا** ఠప్పా (హి.పు) ముద్ర,అచ్చు, మూస, అచ్చుపోయుయంత్రము, సరిగెఅంచు (వెడలుపాటిది).

**ٹھپنا** ఠప్నా (హి) ముద్రించుట,అచ్చుపోయుట,ఘోతపోయుట,నాణెములుచేయుట.

**ٹھٹ** ఠట్ (హి.పు) ఒడ్డు,తీరము; గుంపు, సమూహము; రేవు.

**ٹھٹھا-ٹھٹا-ٹھٹھ** ఠట్టా-ఠఠ్ఠా (హి.పు) పరిహాసము, వేళాకోళము,ఎగతాళి, పరియాచకము,నవ్వులాట, వెక్కిరింత.

**ٹھٹھا اڑانا-کرنا-لگانا-مارنا** ఠట్టా-ఉడానా-కర్నా-లగానా-మార్నా (హి) పరిహాసముచేయుట,ఎకసక్కెములాడుట,పరియాచకములాడుట,ఎగతాళిచేయుట. **ٹھٹھے باز** ఠట్టేబాజ్ (ఉ) పరిహాసకుడు, పరియాచకములాడువాడు. **ٹھٹھے بازی** ఠట్టేబాజీ (ఉ) పరిహాసము,పరియాచకములాడుట.

**ٹھٹھر-ٹھٹھر** ఠట్టర్-ఠఠ్ఠర్ (హి.పు) కొయ్యచట్టము,పెండె,వాసము.

**ٹھٹھر** ఠిట్టర్ (హి.స్త్రీ) చలి,శీతము,వలి.

**ٹھٹھرانا** ఠిఠ్రానా (హి) చలిచేనీలుగుట, తిమ్మిరిపట్టుట,జడమగుట, మొద్దుబారుట, నీలుగుట,కొరడుబారుట.

**ٹھٹکنا** ఠిఠక్నా (హి) మ్రాన్పడుట,దిగ్భ్రమజెందుట,బిమ్మిరపోవుట, తెప్పపడినిలుచుట,కలవరపడుట, వెనకముందాడుట.

**ٹھٹول** ఠఠోల్ (హి.పు) పరిహాసకుడు, నవ్వులబండి,హాస్యగాడు.

**ٹھٹولی** ఠఠోలీ (హి.స్త్రీ) పరిహాసము,పరియాచకము,హాస్యము.

**ٹھٹھ** ఠఠ్ (హి.పు) గుంపు,సమూహము.

**ٹھٹیرا** ఠఠేరా (హి.పు) కంచరవాడు; జొన్న మొ॥ వానికట్టెలేకగంటె.

**ٹھڈا** ఠడ్డా (హి.పు) వెన్నెముక; గాలిపడగయొక్క వెన్నుబద్ద,నిలువుబద్ద.

**ٹھڈی** ఠుడ్డీ (హి.స్త్రీ) గద్దువ; పేలాలుగాని ముడిగింజలు,గుండ్రలు.

**ٹھر** ఠిర్ (హి.స్త్రీ) శీతము,చలి.

**ٹھرا** ఠర్రా (హి.పు) ఘాటులేనిసారాయి;కశము,అంగీబొందె;పచ్చియిటుక;ఒకవిధమైనచెప్పు.

**ٹھرنا** ఠిర్నా (హి) చలిపట్టుట,చలిపుట్టుట; (పేరుట.

**ٹھس** ఠస్ (హి) గట్టి,బోలుగాని;నిండియున్న;స్థిరమైన,దృఢమైన; బరువైన; చుయ్యిమనుశబ్దము,హఠము, మోతలేనితుపాకి.

**ٹھسا** ఠస్సా (హి.పు) గర్వము,ఆడంబరము; ముద్ర,అచ్చు,మూస.

**ٹھسا ٹھس** ఠసాఠస్ (హి) క్రిక్కిరిసిన.

**ٹھسانا** ఠుసానా (హి) కూరించుట.

**ٹھسک-ٹھسکا** ఠసక్-ఠస్కా (హి.స్త్రీ) ఆడంబరము, పటాటోపము; దగ్గు, దగ్గు చప్పుడు.

**ٹھسکنا** ఠసక్నా (హి) పగులుట. (ర్చుట.

**ٹھسکنا** ఠుసక్నా (హి) ఏడ్చుట, అంగలా

**ٹھسنا** ఠుస్నా (హి) పట్టుట, క్రిక్కిరియుట, నిండుట, కూరబడుట.

**ٹھسنی** ఠస్నీ (హి.స్త్రీ) దిమ్మెస, సమ్మెట, ఇరకాటము.

**ٹھسوانا** ఠుస్వానా (హి) క్రుక్కుట, కూరించుట, పట్టించుట.

**ٹھکانا** ఠికానా (హి) స్థాయి, నివాసము, జాడ, పైకిలాసము, దిక్కు, మేర.అంతు, ఆశ్రయము, నమ్మకము, బరువసము.

**ٹھکرا** ఠిక్రా (హి) బోకి, పెంకు, చిల్ల పెంకు.

**ٹھکرانا** ఠుక్రానా (హి) తన్నుట.

**ٹھکرانی** ఠక్రానీ (హి.స్త్రీ) యజమానురాలు, దేవత.

**ٹھکرائی** ఠక్రాయీ (హి.స్త్రీ) స్వామ్యము, అధికారము, గౌరవము, దేవత్వము.

**ٹھکنا** ఠుక్నా (హి) కొట్టబడుట, దెబ్బలు తినుట. (మిండగాడు.

**ٹھکو** ఠుక్కూ (హి.పు) కొట్టువాడు,

**ٹھکوانا** ఠుక్వానా (హి) కొట్టించుట.

**ٹھگ** ఠగ్ (హి.పు) టక్కరి, తెరవాటుగాడు, దొంగ, మోసగాడు.

**ٹھگانا** ఠగానా (హి) మోసపోవుట; మోసపోవునట్లుచేయుట.

**ٹھگائی** ఠగాయీ (హి.స్త్రీ) దోపిడి, దొంగతనము, మోసము, టక్కు. (లించుట.

**ٹھگنا** ఠగ్నా (హి) మోసముచేయుట, దొంగ

**ٹھگنی** ఠగ్నీ (హి.స్త్రీ) మోసగత్తె, తెరవాటుగత్తె, దొంగది.

**ٹھگیا** ఠగియా (హి.పు) మోసగాడు.

**ٹہل** టహల్ (హి స్త్రీ) పరిచర్య, కొలువు; తిరుగాడుట; తిర్గాటు; నిర్గమనము;
**ٹہل جانا** ٹہل-జానా (హి) వెడలిపోవుట, తర్లుట, నిర్గమించుట.

**ٹہلانا** టహలానా (హి) పంపుట, తిరుగాడించుట, త్రిప్పుట, అంపకముచేయుట.

**ٹہلنا** టహల్నా (హి) తిర్గాడుట, విహరించుట, తర్లుట, పోవుట.

**ٹہلنی** టహల్నీ (హి.స్త్రీ) పనికత్తె, దాసి.

**ٹہلوا** టహల్వా (హి.పు) పరిచారకుడు సేవకుడు.

**ٹھلیا** ఠిలియా (హి.స్త్రీ) ముంత, పిడత.

**ٹھمرا** ఠుమ్రా (హి) పొట్టి, చిన్న. (డుగు.

**ٹھمری** ఠుమ్రీ (హి.స్త్రీ) చిన్నపాట, న

**ٹھمک** ఠుమక్ (హి.స్త్రీ) ఒయారము, కులుకు, హొయలు.

**ٹھمکا** ఠమ్కా (హి) పొట్టి, చిన్న.

**ٹھمکنا** ఠుమక్నా (హి) కులుకుట, ఒయారము చూపుట. (లాగుట.

**ٹھمکی** ఠుమ్కీ (హి.స్త్రీ) చివుకుచివుకున

**ٹہنا** టహనా (హి.పు) శాఖ, పెద్దకొమ్మ.

**ٹھننا** ఠన్నా (హి) స్థిరమగుట, దృఢపడుట, నిశ్చితమగుట.

**ٹھناک** ఠనాక్ (హి.పు) టింగుటంగుమను చప్పుడు, గణగణ, మ్రోత, రావము.

**ٹھنٹھ** ఠుంఠ్ (హి.పు) మోడు, మొరడు, మొట్టు-తుండెము; మొండిచేయి.

**ٹھن ٹھن** ఠన్ఠన్ (హి.పు) గణగణచప్పుడు. **ٹھن ٹھن گوپال** ఠన్ఠన్-గోపాల్ (హి) శుంఠుడు, శూన్యము.

**ٹھنٹھنانا** ఠన్‌ఠనానా (హి) గణగణలాడించుట.

**ٹھنڈ** ఠణ్డ్ (హి.స్త్రీ) శీతలము, చల్లదనము.

**ٹھنڈا** ఠండా (హి) శీతలమైన, చల్లని; నెమ్మదిమైన, నెమ్మదిగల; కఠినహృదయుడైన; చల్లారిన, చల్లపడిన; సహనముగల; గంభీరమైన; దయగల; నిశ్చలమైన: ఓదారిన, కోపముచల్లారిన, తాపముతీరిన; నిర్జీవమైన, జడమైన.

**ٹھنڈا کرنا** ఠండా—కర్నా (హి) చల్లార్చుట; ఓదార్చుట, ఊరడించుట **ٹھنڈا ہونا** ఠండా—హోనా (హి) చల్లారుట, చల్లపడుట.

**ٹھنڈائی** ఠండాయీ (హి.స్త్రీ) శైత్యోపచారము, చలువమందు; గంజాయి (దమ్ము)

**ٹھنڈک** ఠండక్ (హి.స్త్రీ) శీతలము, చల్లదనము, శాంతి, నెమ్మది.

**ٹھنڈی** ఠండీ (హి) చల్లని, శీతలమైన; స్ఫోటకము (చల్లనమ్మవారు)

**ٹھنڈی سانس** ఠండీ—సాంస్ (హి) నిట్టూర్పు.

**ٹھنک** ఠినక్ (హి స్త్రీ) నిట్టూర్పు, వెక్కు, మూలుగు.

**ٹھنکانا** ఠన్‌కానా (హి) నాణెములు మ్రోయించుట.

**ٹھنکنا** ఠినక్నా (హి) గునియుట, ఏడ్చుట, మూలుగుతో ఏడ్చుట, వెక్కి ఏడ్చుట.

**ٹھنگنا-ٹھنگنی** ఠింగ్నా-ఠింగ్నీ (హి) పొట్టి, గిడ్డ, కురుచ.

**ٹھنی** ఠహ్నీ (హి.స్త్రీ) కొమ్మ, రెమ్మ.

**ٹھوٹ** ఠూట్ (హి) మూఢుడు, మోటువాడు.

**ٹھور** ఠౌర్ (హి.స్త్రీ) స్థానము, నివాసము, జాడ, చోటు.

**ٹھور** ఠోర్ (హి.స్త్రీ) చుంచువు, పక్షిముక్కు, పక్షిముట్టె.

**ٹھوڑی** ఠోడీ (హి.స్త్రీ) గద్దువ, గడ్డము.

**ٹھوس** ఠోస్ (హి) గట్టి, బోలుగానిది; మోటు, మొద్దు; ఘనమైన.

**ٹھوسا** ఠోసా (హి) బొటనవ్రేలు, తెడ్డు (తేదనుట) మొండివ్రేలుచూపుట.

**ٹھوسنا** ఠోస్నా (హి) కూరుట, క్రుక్కుట, నింపుట.

**ٹھوکا** ఠోకా (హి) నెట్టు, దొబ్బు, పోటు-పొదుపు—చీవాట్లు.

**ٹھوکر** ఠోకర్ (హి.స్త్రీ) నడకలో తడబాటు, తన్ను, దెబ్బ, కాలుతడబాటు, కాలితాకుడు, కాలు దేనికైన కొట్టుకొనుట, కాలుకు తగులురాయి మొ॥; ఒకవిధమైనచెప్పు.

**ٹھوکر کھانا** ఠోకర్—ఖానా (హి). కాలుతడబడుట; నష్టపడుట. **ٹھوکر مارنا** ఠోకర్—మార్నా (హి) తన్నుట.

**ٹھوکنا-ٹھونکنا** ఠోక్నా-ఠోంక్నా (హి) కొట్టుట, బాదుట, దంచుట, మొత్తుట, చరచుట, వ్యాజ్యముచేయుట, చొరకొట్టుట,

**ٹھونسنا** ఠోంస్నా (హి) కూరుట, క్రుక్కుట, చొరగొట్టుట, దూర్చుట, దోపుట.

**ٹھونگ** ఠోంగ్ (హి.స్త్రీ) } ముక్కు-పొడుచుట, ముక్కు-పోటు.
**ٹھونگا** ఠోంగా (హి.పు)

**ٹھونگنا** ఠోంగ్నా (హి) ముక్కుతో పొడుచుట.

**ٹھیا** ఠియా (హి.పు) పొలిమేర దిన్నె, మేర, ఎల్ల; గద్దియ, గద్దె-ఆసనము.

**ٹھیپی** ఠేపీ (హి.స్త్రీ) బిమ్మ-బిరడ, మూత.

**ٹھیٹ.ٹھیٹھ** ఠేట్-ఠేఠ్ (హి) స్వచ్ఛమైన—చొక్కమైన-అచ్ఛమైన, అప్పటమైన—దేశీయమైన.

**ٹھہرانا** ఠైరానా (హి) నిలుపుట-ఆపుట, తీర్చుట—తీరుమానముచేయుట; నిజపరచుట, నిశ్చయముచేయుట; స్థిరపరచుట—తెంచుట.

**ٹھہراؤ** ఠైరావ్ (హి.పు) నిలుకడ—స్థాయి, ఆపుదల; తీర్పు—తీరుమానము—ఏర్పాటు.

**تھبرنا** థైర్నా (హి) నిలుచుట-ఆగుట-ఉం డుట-తాళుట-బసచేయుట, ఆటుట; దిగుట, తేరుట, సహించుట, నిశ్చయమగుట.

**تھپس** థేస్ (హి. స్త్రీ) పోటు; దెబ్బ, ద్రొబ్బు, తాకుడు, నెట్టు.

**تھیک** థేక్ (హి. స్త్రీ) ఆను, ఊత, పోటి; కుప్ప; చెప్పుమడిమ; అడుగు, గోతము, బోషాణము.

**ٹھیک** ఠీక్ (హి) సరి, బాగు; మంచిది; నిజము; నిండు, యోగ్యము, చక్కగా, సరిగా, నిజముగా, నిండుగా, బాగుగా, యోగ్యముగా, న్యాయముగా. **ٹھیک کرنا**–కర్నా (హి) సరిచేయుట, చక్కజేయుట, సవరించుట, శిక్షించుట, కొట్టుట.

**ٹھیک ٹھیک** ఠీక్ ఠీక్ (హి) సరిసరి, అంతయుసరిగా.

**ٹھیکا** ఠేకా (హి. పు) ఆను, ఊత, పోటి; కూలి, అద్దె; గుత్త, జట్టి; మద్దెలవాయించు రీతి, (బొచ్చ).

**ٹھیکری** ఠీకరీ (హి. స్త్రీ) బోకి, పెంకు,

**ٹھیکم ٹھیک** ఠీకమ్ఠీక్ (హి) సరిగా, తగ్గు మెగ్గులులేకుండ, ఎచ్చుతగ్గులులేకుండ.

**ٹھیکہ** ఠేక (హి. పు) చూడు **ٹھیکا**–అను పదము. **ٹھیکہ لینا**–లేనా (హి) గుత్తగొనుట, జట్టిగొనుట. **ٹھیکیدار**–ఠేకేదార్ (హి. పు) గుత్తదారుడు, జట్టిదారుడు, అడితిదారుడు.

**ٹھیلا** ఠేలా (హి. పు) ద్రొబ్బు, నూకు, మోచేతితో క్రుమ్ములేకపొడుచుట, నూకుడుబండి, నెట్టుడుబండి.

**ٹھیلنا** ఠేల్నా (హి) నూకుట, నెట్టుట, ద్రొబ్బుట, మోచేతక్రుమ్ముట.

**ٹھینٹھی** ఠేంఠీ (హి. స్త్రీ) గుబిలి, గులిమి ఉండ, దిమ్మ, బిరడ.

**ٹھینگا** ఠేంగా (హి. పు) బడిత, తెడ్డు, శిశ్నము.

**ٹھینگنا** ఠేంగ్నా (హి) తింగణ, పొట్టి

**ٹھیوا** ఠేవా (హి. పు) జవ, ఉంగరపురాతి కుదురు.

**ٹبیاں** టియ్యాం (హి) బుచ్చి, చిన్న, బుడిబుడి; ఒకవిధమైనచిన్నచిలుక.

**ٹیار-ٹبیا** టైయారు-టైయా (హి. పు) చిన్నగుర్ర, లయ్య.

**ٹیبا** టీబా (హి. పు) దిబ్బ, మిట్ట; గుబ్బలి.

**ٹیپ** టీప్ (హి. స్త్రీ) ఒత్తుడు, అదుముట; కట్టుకమ్మ, పత్రము, చీటి, హుండి బరాతము; ఉచ్చస్వరము; బొందె, కళసూ, ముడి; దండు; ఉత్తమము; ఉత్తరవాదము; యాది; బొట్టు (సొమ్ము). **ٹیپ ٹاپ**–టాప్ (హి) వైభవము, ఆడంబరము, శృంగారము, వైఖరి, ఠీవి, నీటు, పైమెరుగు.

**ٹیپنا** టీప్నా (హి) ఒత్తుట, అదుముట; వ్రాయుట; చేర్చుట; ఆలాపనచేయుట.

**ٹیرنا** టేర్నా (హి) పిలుచుట, కేకవేయుట, అరచుట, పాడుట, కాలముజరపుట.

**ٹیروا** టేర్వా (హి. పు) గుడుగుడీయొక్క కొయ్యనాళము లేకగొట్టము, నిలువుగొట్టము

**ٹیڑھ** టేఢ్ (హి. స్త్రీ) మెలిక, వడి; గర్వము, పోకిరితనము; వంక, వంకర, వంపు, వాలు, మూర్ఖత.

**ٹیڑھا-ٹیڑھی** టేఢా-టేఢీ (హి) వంకర, వాలిన, వంగిన; విరుద్ధమైన; కోపపడిన; అసమాధానపడిన; ప్రతికూలమైన. **ٹیڑھا بیڑا**–బేడా (హి) వంకరటింకర. **ٹیڑھاپن**–పన్ (హి) వక్రత. **ٹیڑھا ہونا**–హోనా (హి) వంకపోవుట; అసమాధానపడుట. **ٹیڑھی کھیر**–ఖీర్ (హి) వ్యాసఘట్టము.

**ٹیڑی** టేడీ (హి.స్త్రీ) చూడు. **ٹڈی**

**ٹیس** టీస్ (హి.స్త్రీ) సలుపు,తీపు,నొప్పి, పోటు, కుట్టు. **ٹیس مارنا**—మార్నా (హి) పోట్లుపొడచుట, సలుపుట.

**ٹیسو** టేసూ (హి.పు) మోదుగు (పువ్వు),దసరానాటిఆడువారియాట,యూరేగింపు

**ٹیک** టేక్ (హి.స్త్రీ) ఆను,పోటి, ఆశ్రయము; వాగ్దానము; బరువసము; గౌరవము; ప్రఖ్యాతి,పల్లవి.

**ٹیک** టీక్ (హి.పు)శిఖ, కొప్పు.

**ٹیکا** టీకా (హి.పు) టీక, వ్యాఖ్యానము; తిలకము, బొట్టు (సొమ్ము) టీకాలు.

**ٹیکن** టేకన్ (హి.పు) ఊత, ఆను,సహాయము. (మోటుట, ఊతగొనుట.

**ٹیکنا** టేక్నా (హి) ఆనుకొనుట,మోపుట,

**ٹیلا** టేలా [హి.పు) చూడు. **ٹیبا**

**ٹیم** టేమ్ (హి.స్త్రీ) దీపపుకొడి (వత్తికొస),కాలిసల్లబడినదీపపువత్తికొన.

**ٹین** టీన్ (ఇం)చూడు **ٹن**

**ٹینٹ** టేంట్ (హి.పు) వత్తికాయ; కంటిగ్రుడ్డు.

**ٹینٹوا** టేంట్వా (హి.పు) గొంతు,బొండుగ, గొంతుపీక, శ్వాసనాళము.

**ٹیں ٹیں** టేఁటేఁ (హి.స్త్రీ) చిలుకపలుకులు. **ٹیں ٹیں کرنا**—కర్నా (హి) గొణుగుట,ప్రేలుట. (డి;గిడ్డ, చిన్న.

**ٹینی** టేనీ (హి.స్త్రీ) ఒకసంకరజాతికోడి;

**ٹیو.ٹیوا** టేవ్ టేవా (హి) అలవాటు, వాడుక; జాతకము,జన్మపత్రిక.

**ٹیہلا** టేహ్లా (హి.పు) వివాహవిధి, పెండ్లి, పెండ్లిబహుమానము,పండుగ,పబ్బము.

---

## (ث) ۴

**ث** సే (అ.స్త్రీ) ఇదిఅరబ్బీ వర్ణమాలలో నాలుగవయక్షరము,ఫారసీలో అయిదవది, ఉరుదూలోఆరవది, (ابجد)వర్ణసాంఖ్యములోదీనిసంఖ్య అయిదునూర్లు.

**ثابت** సాబిత్ (అ)అఖండము, సాంతము; సిద్ధాంతము,స్థిరము, బోధితము, దృఢము, నిజపరుపబడిన; ధృవనక్షత్రము.

**ثابت جنگ**— జంగ్ (పా) యుద్ధస్థిరుడు, యుద్ధమునందు వెనుకతీయనివాడు. **ثابت کرنا**—కర్నా (ఉ) నిజపరచుట,సిద్ధాంతము చేయుట,దృఢపరచుట.

**ثاقب** సాకిబ్ (అ) ప్రకాశమానముగు,కాంతిగల.

**ثالث** సాలిస్ (అ.పు) మూడవవాడు; మధ్యస్థుడు; పంచాయతిదారుడు, మూడవది **ثالث بالخیر**—బిల్ ఖైర్ (అ.పు) నిష్పక్షపాతియైన మధ్యవర్తి.

**ثالث نامہ**—నామ(అ.పు) పంచాయితిదారులతీర్పు,మధ్యస్థులతీర్పు(పత్రము.)

**ثالثہ** సాలిస (అ.స్త్రీ) మధ్యస్థురాలు, మూడవది.

**ثالثی** సాలిసీ (అ.స్త్రీ) మాధ్యస్థము, పంచాయితి.

**ثانی** సానీ (అ.పు) ఈడు, జోడు, జత, రెండవ,ద్వితీయము,తుల్యము,సమానము.

**ثانیہ** సానియ (అ.పు)ద్వితీయము; క్షణము.

**ثبات** సబాత్ (అ.పు) స్థిరత్వము, దృఢత్వము, అచలత.

**ثبت** సబ్త్ (అ.స్త్రీ) అచ్చు, ముద్ర; లేఖనము, వ్రాత.

**ثبوت** సుబూత్ (అ.పు) సిద్ధాంతము, స్థిరత్వము; దృష్టాంతము, నిదర్శనము; ప్రమాణము, సాక్ష్యము.

**ثروت** సర్వత్ (అ.స్త్రీ) భాగ్యము, సంపద; అధికారము, మాన్యత.

**ثری** సరీ (అ.పు) భూమిక్రిందనున్న, పాతాళము, అడుగు, క్రిందిమన్ను, తడిమన్ను.

**ثریا** సురైయా (అ పు) కృత్తికానక్షత్రము; ఉత్తమమైన; ఉన్నతమైన.

**ثریا جاه**— జాహ్ (పా) ఉన్నతపదవిగల, ఉత్తమపదవిగల, ఘనతగల

**ثعلب** సఅలబ్ (అ.పు) గుంటనక్క.

**ثعلب مصری** సఅలబ్ మిస్రీ(అ.స్త్రీ) సాలామిస్రియను మందుదినుసు.

**ثقالت** సకాలత్ (అ.స్త్రీ) భారము, బరువు: అజీర్ణము, మందము.

**ثقل** సిక్ల్ (అ.పు) బరువు, భారము, అజీర్ణము, మాంద్యము.

**ثقیل** సకీల్ (అ) భారమైన, బరువైన; అజీర్ణకారియైన, జీర్ణముకాని.

**ثقه** సిక (అ.పు) విశ్వాసపాత్రుడు, నమ్మకస్థుడు.

**ثلاثی** సలాసీ(అ) త్రిభుజము, మూడుప్రక్కలుగల.

**ثلث** సుల్స్ (అ. పు) తృతీయాంశము, మూడవపాలు.

**ثمانیه** సమానియ (అ.పు) సప్తరాశికము, ఎనమిది.

**ثمر-ثمره** సమర్-సమ్ర (అ.పు) ఫలము.

**ثمن** సమన్ (అ.పు) వెల, క్రయము, మూల్యము. (ఇం) ఆహ్వానపత్రిక, పిలుపుచీటి.

**ثنا** సనా (అ.పు) ప్రశంస, స్తోత్రము, పొగడ్త.

**ثواب** సవాబ్ (అ.పు) పుణ్యము, పుణ్యఫలము.

**ثوابت** సవాబిత్ (అ.పు) ధ్రువనక్షత్రములు, స్థిరనక్షత్రములు.

**ثوب** సౌబ్ (అ.పు) ఉడుపు, దుస్తు, వస్త్రము.

**ثور** సౌర్ (అ.పు) వృషభము, వృషభరాశి.

---

( ج )

**ج** జీమ్ (అ.స్త్రీ) జకారము-ఇదిఉరుదూవర్ణమాలలో ఆరవది, ఫారసీలో నేడవది, (ابجد) వర్ణమాలలో మూడు అను సంఖ్యకుసంజ్ఞ.

**جا** జా (పా.స్త్రీ) స్థలము, చోటు, స్థానము.

**بجا—جا** బజా (పా) అందందు, అంతట, ప్రతిచోట. **بیجا—جا** బేజా (పా) స్థలాస్థలములు; క్రమాక్రమములు, సాధక బాధకములు

**جاضرور—جا** -జరూర్ (పా) మరుగుదొడ్డి.

**جانشین—جا** -నషీన్ (పా) ఉత్తరాధికారి, తరువాతివాడు **جانماز—جا** -నమాజ్ (పా) చిత్రాసనము, నమాజుచేయుటకు పరుచుకొను వస్త్రము.

**جاب** జాబ్ (హి.పు) నోటికట్టు, ముట్టెకట్టు, నోటిచిక్కము; ఒకకసవు.

**جابر** జాబిర్ (అ.పు) క్రూరుడు, అన్యాయస్థుడు, బలాత్కారి, బలవంతపెట్టువాడు.

**جاپا** జాపా (హి.పు) ప్రసవము, ప్రసూతి, కానుపు.

**جات** జాత్ (హి.స్త్రీ) జాతము, జననము, సంతానము; జాతి, కులము; ముదుపు; నైవేద్యము, వైఖరి; ప్రారబ్ధము.

**جاترا** జాత్రా (హి.స్త్రీ) జాతర, తీర్థము, యాత్ర; ఉత్సవము, పబ్బము.

**جاتری** జాత్రీ (హి.పు) యాత్రికుడు.

**جاٹ** జాట్ (హి.పు) ఉత్తరదేశపు ఒకజాతి కాపులు, శూద్రజాతివారు.

**جاتھ** జాత్ (హి.పు) గానుగ స్తంభము లేక కోల, గానుగ రోకలి. (పు చీర.

**جاجم** జాజమ్ (హి.స్త్రీ) అద్దిన రేకు; పరు

**جاچکی** జాచకీ (హి.పు) యాచకుడు, కాటిపాపడు, శవము వెంట వాయించుచు వచ్చువాడు.

**جادو** జాదూ (పా.పు) మంత్రము, కట్టుబోతువిద్య. **جادوگر** —గర్ (పా.పు) మాంత్రికుడు, కట్టుబోతు. **جادوگری** —గరీ (పా.స్త్రీ) కట్టుబోతుతనము, మంత్రవిద్య.

**جادہ** జాద (హి.పు) కాలిబాట.

**جاذب** జాజిబ్ (అ) ఆకర్షించునది, పీల్చునది; అద్దుకు కాగితము.

**جار** జార్ (అ.పు) ఇరుగుపొరుగు, పొరుగువాడు. (చీపురు.

**جاروب** జారూబ్ (పా.పు) పొరక,

**جاری** జారీ (అ) ప్రవహించుచున్న, నడచుచున్న; చెల్లుచున్న, సాగుచున్న, ప్రస్తుతపు, ఈ కాలపు. (కాలము.

**جاڑا** జాడా (హి.పు) శీతము, చలి, చలి

**جاسوس** జాసూస్ (అ.పు) చారుడు, దూత, వేగులవాడు.

**جاسوسی** జాసూసీ (అ.స్త్రీ) వేగులు, చారత్వము, జాడ; దౌత్యము.

**جاکڑ** జాకడ్ (హి.పు) నిలువ, చేబదులు; మంచిచెడ్డలు చూచుకొను నియమముతో కొనుట.

**جاگ جاگرن** జాగ్-జాగరన్ (హి) జాగరణము, మేలుకొనియుండుట, జాగ్రత, మెలకువ,

**جاگنا** జాగ్నా (హి) జాగరూకుడగుట, మేలుకొనుట, మేలుకొనియుండుట.

**جاگیر** జాగీర్ (పా.స్త్రీ) అగ్రహారము, మాన్యము, సర్వాగ్రహారము. **جاگیردار** —దార్ (పా.పు) పాళెగాడు, అగ్రహారీకుడు; మన్నీడు.

**جال** జాల్ (హి.పు) జాలము; వల; ఉరి; తడక, జల్లి, కంతలుగలది; మోసము, టక్కు.

**جالا** జాలా (హి పు) పాదొట్టు పొర లేక వల; కంటిపొర; వలబట్ట.

**جالی** జాలీ (హి.స్త్రీ) అల్లిక, వలబట్ట; చిక్కము; జల్లి, కంతలుగలది, పుట్టినశిశువు పైనుండుమాయ; తిరస్కరిణి, ముఖవస్త్రము.

**جام** జామ్ (పా పు) గిన్నె కోరు; దర్పణము, అద్దము. **جام صحت** —ఎ-సెహత్ (పా.పు) ఆరోగ్యచషకము, ఒకరి యారోగ్యము కొరకై సభలలో పానము చేయు నీరు, మద్యము మొ॥ నా గిపాత్రి)

**جام** జామ్ (హి.పు) జాము; ప్రహరము; బీజము, సంతానము.

**جامن** జామిన్ (అ) పేసినది, గట్టి రె; సిద్ధశబ్దము, మూలపదము.

**جامدانی** జామ్దానీ (పా.స్త్రీ) కరోటకము, బట్టల పెట్టె; పూలు వేసి నేసినబట్ట.

**جامع** జామఉ (అ.పు) సముదాయకము, అంతయు, అశేషము. సంపూర్ణము, సంఘీభూతము, చేర్చెను. **جامع مسجد** —ఎ, మస్జిద్

(అ.పు) ముఖ్యప్రార్థనాలయము, పెద్ద మసీదు.

**جامن** జామన్ (హి.పు) చేమిరి,తోడు;నేరేడుపండు లేక చెట్టు

**جاموس** జామూస్ (అ.పు)దున్న,ఎనుము.

**جامہ** జామ (పా.పు) దుస్తు,ఉడుపు,అంగరేకు,అంగరాక. جامہ خانہ—జామఖాన (పా) బట్టలగది. —جامدانی.جامہ دانی. దానీ-జాందానీ(పా)కరోటము,బట్టలపెట్టె.

**جان** జాన్ (హి.స్త్రీ)జ్ఞానము,ఎరుక,నెలవు, పరిచయము. جان پہچان —జాన్ పహ్చాన్ (ఉ) ఎరుకపరిచయములు.

جان کے انجان ہونا —జాన్‌కే అన్‌జాన్ హోనా(ఉ)తెలిసియు తెలియనట్లుండుట.

**جان** జాన్(పా.స్త్రీ) ప్రాణము,జీవము;త్రాణ,శక్తి,సామర్థ్యము;బలము;ఉల్లాసము;రసము సారము,సింగారము,అందము;ప్రియము, ప్రియురాలు. جان باز.—జాన్‌బాజ్ (పా)ప్రాణమునకు తెగించినవాడు, సాహసుడు,శూరుడు. جان بحق تسلیم ہونا—జాన్‌బహక్ తస్లీమ్‌హోనా (ఉ) కాలధర్మము నొందుట,చచ్చుట. جان پر کھیلنا.—జాన్‌పర్ ఖేల్నా (ఉ) ప్రాణమునకు తెగించుట.

جان جوکھوں—జాన్ జోఖోం (హి)ప్రాణాపాయము. جان سے مارنا—జాన్‌సేమార్నా (హి)ప్రాణముతీయుట. جانفشانی—జాన్‌ఫిషానీ (పా) ప్రబలప్రయత్నము, శ్రద్ధ,పరాయణత,పరిశ్రమ. جان کالیوا—జాన్‌కాలేవా (హి)ప్రాణశత్రువు. جانکندنی—జాన్‌కందనీ(పా)మరణావస్థ,ప్రాణోత్క్రమణదశ.

**جانا** జానా (హి) పోవుట,తర్లుట;జరగుట; చేరుట;గతించుట.

**جاناں** జానాం (పా) ప్రియుడు,ప్రాణసమానము,ప్రాణము;ప్రియుడు.

**جانب** జానిబ్ (అ.స్త్రీ) పక్షము,ప్రక్క,దిక్కు. جانبدار—జానిబ్‌దార్ (పా)పక్షపాతి,పక్షమువాడు,సహాయుడు.

**جانبین** జానిబైన్ (అ.పు) ఇరుపార్శ్వములు, రెండుప్రక్కలు, ఇరుపక్షములవారు, ఉభయులు.

**جانچ** జాంచ్ (హి.పు) పరీక్ష,శోధన;అంచన,ఉజ్జ;గుర్తు. جانچ پڑتال—జాంచ్‌పడ్‌తాల్ (హి)పరిశోధనము,పరిశీలనము.

**جانچنا** జాంచ్నా (హి) పరీక్షించుట,పరిశీలించుట; ఉజ్జాయించుట, అంచనవేయుట; ఊహించుట; తెలియుట, ఎరుగుట; గుర్తించుట.

**جانگلو** జాంగ్లూ (హి) జాంగలము, అడవి. సం॥; మోటు. పల్లెటూరివాడు, మోటువాడు.

**جانگھ** జాంఘ్ (హి స్త్రీ) జంఘ,తొడ.

**جانگھیا.جانگیا** జాంఘియా-జాంగియా (హి.పు) అర్ధోరుకము, చల్లడము,చడ్డి.

**جاننا** జాన్నా (హి) తెలియుట, ఎరుగుట;గుర్తించుట; గ్రహించుట; అనుకొనుట, ఒప్పుకొనుట.

**جانور** జాన్వర్ (పా.పు) పశువు;ప్రాణి; జంతువు.

**جانے** జానే (హి) అనుకొనుట.

**جانی** జానీ (పా) ప్రాణసమానమైన; ప్రియమైన;ప్రాణసం॥; ప్రియురాలు.

**جانے دینا** జానేదేనా (హి) పోనిచ్చుట క్షమించుట.

**جاوتری** జావత్‌రీ (హి.స్త్రీ) జాపత్రి.

**جاوید** జావీద్ (పా.స్త్రీ) శాశ్వతము, ఎల్లప్పుడు, నిత్యము.

**جاویدانی** జావీదానీ (హి.స్త్రీ) శాశ్వతత్వము, నిత్యత్వము.

**جاه** జాహ్ (పా) అంతస్తు; దశ, పదవి; గౌరవము; స్థితి; మానము.

**جاهل** జాహిల్ (అ) అజ్ఞాని, మూర్ఖుడు, అశిక్షితుడు.

**جاے** జాయ్ (పా.స్త్రీ) స్థలము, చోటు, స్థానము. **جاےضرور**—జాయె జరూర్ (ఉ.పు) మరుగుదొడ్డి.

**جائی** జాయీ (హి.స్త్రీ] కూతురు.

**جایا** జాయా (హి.పు) కొడుకు.

**جاےپهل** జాయ్‌ఫల్ (హి.పు) జాజికాయ, శ్యాలూకము.

**جائداد** జాయెదాద్ [పా.స్త్రీ) ఆస్తి; సొత్తు; సంచయము. బండారము,

**جائداد آبائی۔موروثی** —జాయిదాదె ఆబాయీ-మౌరూసీ (ఉ.స్త్రీ) పిత్రార్జితమైన యాస్తి. **جائدادمنقولا**—మన్‌కూల (పా) చరాస్తి. **جائرادغیرمنقولا**—గైర్ మన్‌కూల (పా) స్థిరాస్తి.

**جائز** జాయెజ్ (అ) న్యాయమైన, యోగ్యమైన, సరియైన, సక్రమమైన, యథావిధియైన, తగిన, అర్హమైన.

**جائزه** జాయెజ (అ.పు) ప్రతిఫలము, బహుమానము; పరీక్ష, లెక్క, పరీక్షలు; అప్పగింత; పదార్థము. **جائزهدینا**—దేనా (ఉ) అప్పగింత పెట్టుట, అప్పగించుట, లెక్కయిచ్చుట. **جائزهلینا**—లేనా (ఉ) అప్పగింతగొనుట, అప్పగించుకొనుట, లెక్కగొనుట.

**جب** జబ్ (హి) అప్పుడు ఎప్పుడు, అట్లయితే, అట్టియిన. ఎప్పుడైతే. **جب تب**—తబ్ (హి) అప్పుడప్పుడు. ఎప్పుడును **جب هی**—హీ (హి) అప్పుడే, తత్క్షణమే.

**جبار** జబ్బార్ (అ.పు) మహాబలవంతుడు, సర్వశక్తిమంతుడు, ప్రచండుడు, ప్రబలుడు, క్రూరుడు. (جبل

**جبال** జిబాల్ (పా.పు) పర్వతములు. (ఏ.వ

**جبر** జబ్ర్ (అ.పు) బలవంతము, ప్రోద్బలిమి, క్రౌర్యము, పీడనము, ఉపద్రవము.

**جبراً** జబ్‌రన్ (అ) బలాత్కారముగా, బలవంతముగా. **جبراً وقهراً**—ఒ-కహ్‌రన్ (అ) బలాత్కారముగా, నిర్బంధముగా, అనివార్యముగా. (లుఅను దేవత.

**جبرائیل** జిబ్రాయీల్ (అ.పు) జబ్రాయీ

**جبرومقابله** జబ్‌రోముకాబిల (అ.పు) బీజగణితము.

**جبڑا** జబ్‌డా (హి.పు) దౌడ.

**جبل** జబల్ (అ.పు) పర్వతము, కొండ.

**جبلی** జిబిల్లీ (అ) సహజము-స్వాభావికము, నిజము-ప్రకృతి.

**جبن** జుబన్ (అ) అధైర్యము-పిరికితనము; జున్ను, విరిగిన పాలు, (రు అంగీ.

**جبه** జుబ్బ (అ.పు) ఒకవిధమైన అంగీ-పక్కీ-

**جبین** జబీన్ (అ.స్త్రీ) నొసలు-లలాటము.

**جپ** జప్ (హి.స్త్రీ) జపము. (యుట.

**جپنا** జప్‌నా (హి) జపించుట-జపముచే

**جپنی** జప్‌నీ (హి.స్త్రీ) జపమాల-జపము.

**جتاساری** జతాసారి (హి.స్త్రీ) తిరుగటి పాట.

**جتاناجتلانا** జతానా-జత్‌లానా (హి) జ్ఞాపకముచేయుట-తెలియజెప్పుట-జాగ్రత్తపెట్టుట-పనిలపరచుట.

**جتانا** జితానా (హి) గెలిపించుట-జయింపజేయుట.

جتائی జుతాయీ (హి.స్త్రీ) దున్నకము, దున్నుట.

جتن జతన్ (హి.పు) యత్నము; జతనము; ఉపాయము;పదిలము. (ఎన్ని.

جتنا۔جتنی జిత్నా-జిత్నీ (హి) ఎంత,

جتنا జుత్నా (హి) కాడికికట్టబడుట; దున్నబడుట; పనిపడుట, పూనుకొనుట, యత్నించుట; కలియబడుట, పోట్లాడుట.

جتوانا జుత్వానా (హి) కాడికికట్టించుట, దున్నించుట.

جتھا జథా (హి పు) సమూహము, గుంపు; కుప్ప, సంచయము, జట్టు, సంఘము; బలము; సమాధానము.

جتی జతీ (హి.పు) యతి; ఒంటరి, ఒంటి.

جتیانا జుతియానా (హి) చెప్పుదెబ్బలు కొట్టుట.

جٹ۔جٹھ జుట్-జుఠ్ (హి) జత, జోడు, జతగాడు,సంయోగము.

جٹا జటా (హి.స్త్రీ) జట,జడలుకట్టినవెంట్రుకలు; మోకు; తాడు; మట్టిపూడ; వేరు. جٹا ماسی -మాసీ (హి) జటామాంసి యను మందువేరు. (కూడుట.

جٹنا జుట్నా (హి) కలియుట, కదియుట,

جٹھانی జెఠానీ (హి.స్త్రీ) జ్యేష్ఠునిభార్య, పెద్దతోడికోడలు.

جٹی జుటీ (హి.స్త్రీ) పాగాకుకట్టు,కట్టు; దొంతరము, మండె (ము; శవము.

جثہ జస్స (అ పు) దేహము;పుష్టి,పటుత్వ

ججمان జజ్మాన్ (హి.పు) యజమాని, స్వామి; పోషకుడు.

جچہ జచా (పా స్త్రీ) బాలింత.

جچہ خانہ -ఖాన (పా) పురిటిల్లు.

جچاوٹ జచావట్ (హి స్త్రీ)పరీక్ష, శోధ.

جچنا జచ్నా (హి) పరీక్షితమగుట,అంచనయగుట, ఖరారగుట, నిజపడుట.

جہد జహ్ద్ (అ స్త్రీ) యత్నము, శ్రమ, జతనము, جد وجہد - జద్-ఒ-జహద్ (అ.స్త్రీ) పరిశ్రమ, ప్రయత్నము.

جد జద్ (అ.పు) తాత, తండ్రితండ్రి

جدا జుదా (పా) వేరు,ప్రత్యేకము,అన్యము.

جدا گانہ -గాన (పా) వేరుగా, ప్రత్యేకముగా. جدا ہونا -హోనా (ఉ) వీడుట, వేరగుట.

جدال జిదాల్ (అ.పు) జగడము,పోట్లాట.

جدائی జుదాయీ (పా.స్త్రీ) వియోగము, ఎడబాటు, వీడ్పాటు.

جدل జదల్ (అ.పు) పోట్లాట, జగడము.

جدوار జద్వార్ (అ.స్త్రీ) నిర్విషము, కచోరము.

جدول జద్వల్ (అ.స్త్రీ) కాల్వ, ప్రవాహము; పొరటకొనసగీచినఎఱ్ఱగీత; పథకము, మానము; అంచుగీతలు, వ్రాసినకాకితముఅంచునగీచినగీతలు.

جدھ జుధ్ (హి.పు) యుద్ధము, జగడము.

جدھر జిధర్ (హి) ఎక్కడ, ఎటు,

جدھر تدھر -తిధర్ (హి) అంతటు, ఎక్కడచూచినను.

جدی జదీ (అ.పు) మకరరాశి;ధ్రువప్రాంతనక్షత్రము, ధ్రువనక్షత్రము.

جدی జద్దీ (అ) తాతసహోదరులైన; వంశపరంపరగా వచ్చెడు.

جدید జదీద్ (అ) నవీనము, క్రొత్త,ప్రస్తుతపు, ఈకాలపు, ఆధునికము.

جذام జుజామ్ (అ.పు) కుష్ఠురోగము.

جذامی జుజామీ (అ.పు) కుష్ఠువ్యాధిగ్రస్తుడు, కుష్ఠరోగి.

**جذب** జజ్బ్ (అ.పు) ఆకర్షణము, పీల్చుట,పీల్పు, ఈడ్పు.

**جذبہ** జజ్బ(అ.పు)ఆకర్షణ,ఉత్సాహము. అపేక్ష,ఆవేశము,ఇచ్ఛ,కామాదులలోనొకటి

**جذر** జజ్ర్ (అ.పు)మూలము,వర్గమూలము. **جذرالمربع**—జజ్రు-ఉల్-మురబ్బఅ్, (అ)వర్గమూలము. **جذرالمکعب**—జజ్రు-ఉల్-ముకఅ్బ్(అ)ఘనమూలము,

**جذر اصم** జజ్రె-అసమ్(అ)కరణి.

**جر** జర్ర్ (అ)ఈడ్పు.లాగుట; శబ్దాంతమందలి ఇకారసాజ్ఞమగుస్వరచిహ్నము(జేరు)

**جرا** జుర్రా (పా.పు) మొగబైరిపిట్ట.

**جراب** జుర్రాబ్ (తు.పు)మేజోడు, కాలితొడుగు.

**جرات** జుఱాత్ (హి.స్త్రీ) ధైర్యము, సాహసము.

**جراح** జర్రాహ్ (అ.పు) శస్త్రవైద్యుడు.

**جراحت** జరాహత్ (అ.స్త్రీ) గాయము, వ్రణము.

**جراحی** జర్రాహీ(అ.స్త్రీ)శస్త్రవైద్యము.

**جرار** జర్రార్(అ) శూరుడైన,వీరుడైన,దండిసేనగల, సేనాబాహుళ్యముగల.

**جرائم** జరాయిమ్(అ పు)అపరాధములు-దోషములు (ఏ.వ **جرم**)

**جرح** జరహ్ (అ.పు) గాయము;ఆక్షేపణ; పృచ్ఛ. పూర్వపక్షము. ప్రతివాదము,ఖండనము,

**جرس** జరస్ (అ.పు) గంట, గడియారము,

**جرعہ** జుర్అ(అ పు)ఒకగ్రుక్క(నీరు)ఒకసారి మ్రింగగలంతనీరు,

**جرم** జిర్మ్(అ.పు)పదార్థము,వస్తువు; ప్రకాశమానమగునది, దేహము,

**جرم** జుర్మ్(అ.పు) అపరాధము. దోషము,

**جرمانہ** జుర్మాన(పా.పు)అపరాధము-దండుగ,

**جرہ** జుర్రా(పా పు) మొగడేగ,

**جروا** జుర్వా(హి.స్త్రీ) పెండ్లాము,

**جری** జరీ(అ)వీరుడు,శూరుడు,మొనగాడు, పోటరి.

**جریان** జిర్యాన్ (అ.పు) ప్రవాహము;శుక్లనష్టము; చీముకారుట. **جریان شکم**—జిర్యానె-షికమ్ (పా) ఆవపుప్రవర్తులు.

**جریب** జరీబ్ (యు.స్త్రీ) గొలుసు; పెండి (పొడిగిన)కఱ్ఱ;60గజములకొల(భూమానము)

**جریدہ** జరీద(అ) ఒంటరి,ఏకాకి; రాజ్యాంగపత్రిక.

**جریمانہ** జరీమాన(అ.పు) మాడు. **جرمانہ**

**جڑ** జడ్(హి.స్త్రీ) మూలము,వేరు;కారణము, ఆరంభము.

**جڑانا** జుడానా (హి) కూర్చుట, చేర్చుట, కలుపుట,అతికించుట.

**جڑانا** జడానా (హి) చల్లపడుట; వజ్రము మొ॥ దాపించుట లేక చెక్కించుట.

**جڑاؤ** జడావ్ (హి.పు) వజ్రములు మొ॥ దాపుటలేక చెక్కుట,రత్నఖచితమైన

**جڑنا** జడ్నా (హి)రత్నములు మొ॥ చెక్కుట లేక దాపుట, స్థాపించుట.

**جڑوانا** జడ్వానా (హి)రత్నములు మొ॥ దాపించుట లేక చెక్కించుట.

**جڑی** జడీ (హి.స్త్రీ)ఓషధీమూలము, వేరు; పాముమందు వేరు.

**جڑیا** జడియా (హి.పు) మణికారుడు,రత్నములు మొ॥ దాపు లేక చెక్కువాడు.

**جز** జుజ్ (పా) కాక,ఇంక,వినా,తప్ప.

جز జుజ్ (అ) భాగము, ఖండము, తునక; అంకము, పుస్తకభాగము. جزبندی—బందీ (పా) పుస్తకములకుఅట్టకట్టుట.
جزدان—దాన్ (పా) పుస్తకములఅడపము.
جزوکل—ఒకుల్ (అ) అసాంతము, అశేషము.
(మారు, చెల్లు, ఫలము.
جزا జజా (అ. స్త్రీ) ప్రతీకారము, ప్రతిఫలము,
جزبز జజ్ బిజ్ (పా) అసమాధానపడిన, చిఱచిఱలాడు, చిఱ్ఱుబుఱ్ఱు.
جزر జజ్ ర్ (అ. పు) సముద్రముయొక్క పోటు.
جزرومد—ఒ-మద్ద్ (అ) సముద్రముయొక్క పోటుపాటు.
جزع జజఃఉ (అ) ఆతురము.
جزم జజమ్ (అ. పు) దృఢమైనది, ట్రైజ్, పొల్లువంటి ( ‹ ) ఇట్టిగుర్తు.
جزو జుజ్వ్ (అ. పు) చూడు. جز (అ)
جزوی జుజ్ వీ (పా) అల్పము, స్వల్పము, తుచ్ఛము.
(వివరములు, చిల్లరలు.
جزویات జుజ్వియాత్ (అ. పు) భాగములు,
جزیره జజీర (అ. పు) ద్వీపము, లంక.
جزیره‌نما—నుమా (పా) ద్వీపకల్పము.
جزیه జజ్ య (అ. పు) పరమతస్థులవద్దతీసికొను పన్ను, సుంకము.
جس జస్ (హి. పు) యశస్సు, కీర్తి.
جس జిస్ (హి) ఏ, ఎవరి, దేని.
جس‌جس—జిస్ (హి) ఏఏ.
جسارت జసారత్ (పా. స్త్రీ) శౌర్యము, ధైర్యము, స్థైర్యము.
جسام జసామ్ (అ.) స్థూలమైన, బలసిన.
جسامت జసామత్ (అ. స్త్రీ) ఘనపరిమాణము, లావు, స్థౌల్యము.
(త్రుళ్లు.
جست జస్త్ (పా. స్త్రీ) గంతు, దాటు,
جست۔جستا జస్త్-జస్తా (హి. పు) తుత్తునాగము; రంగము.
جست జుస్త్ (పా) అన్వేషణము, వెదకుట
جستجو జుస్త్ జూ (పా. స్త్రీ) అన్వేషణము, శోధ, దేవులాట, పరీక్ష.
جسم జిస్మ్ (అ. పు) దేహము, శరీరము.
جسمانی జిస్మానీ (అ) దేహసం॥, కాయికమైన, స్థూలరూపముగల.
جسیم జసీమ్ (అ) స్థూలమైన, బలసిన.
جشن జష్న్ (పా. పు) ఉత్సవము సంరంభము, విభవము, పండుగ; చదురు.
جعفری జఒఫరీ (అ. స్త్రీ) అప్పటపుబంగారు, మేలిమి; తడక; ఒకపువ్వు (ఒకజాతి బంతిపువ్వు.)
جعل జఒల్ (అ. స్త్రీ) కృత్రిమము, కల్పన, మోసము, టక్కు. جعل‌سازی—సాజీ (పా) కృత్రిమము (చేయుట), కల్పన (చేయుట), మోసము.
(త్రిమైన.
جعلی జఒలీ (అ) కృత్రిమమైన, కల్పి
جغرافیه జుగ్ రాఫియ (యు. పు) భూగోళశాస్త్రము.
جفا జఫా (పా. స్త్రీ) బలాత్కారము, బలవంతము, నిర్బంధము, కష్టము.
جفاکش—కశ్ (పా) కష్టి, పాటుపడువాడు, శ్రమచేయువాడు.
جفت జుఫ్త్ (పా. పు) సరి, జోడు, జత.
جفته జుఫ్త (పా. పు) కదియిక, చేరిక (బట్టలోనిదారములు) బీటు, పగులు; కళంకము.
جفتی జుఫ్తీ (పా. స్త్రీ) పోతునువెంటియుకలియుట, దాటుట (పశువులు)

جکڑنا జకడ్నా (హి) బిగించుట,బిగదీయు ట, బిగించికట్టుట; బిగియుట, సీలంగుట.

جکھنا జుఖ్నా (హి) తూచబడుట, జ్ఞో కబడుట. (ము,యాగము.

جگ జగ్ (హి.పు) జగము, జగత్తు; యజ్ఞ

جگ జుగ్ (హి.పు) యుగము, జత, కాల ము,కూడిక.

جگالنا జుగాల్నా (హి) నెమరువేయుట.

جگالی జుగాలీ (హి.స్త్రీ) నెమరు.

جگانا జగానా (హి) మేలుకొలుపుట; ఎగస నత్రోయుట(దీపపువత్తిని).

جگانا జుగానా (హి) పదిలపరచుట, ఒకనికి పనిలోత్రోడుపడుట (ఏమైనదొరకునను ఆ శతో) (ఓరలేక అంచు.

جگت జగత్ (హి.పు)జగత్తు,బావియొక్క

جگت జుగత్ (హి.స్త్రీ) యుక్తి,యోచన, యోజన,ఉపాయము,గుట్టు,సమాధానము.

جگجگا జగ్జగా (హి.పు) కాకిబంగారు, తగడు.

جگر జిగర్ (పా.పు) కార్జము,కాలఖండము, హృదయము,గుండె; ధైర్యము,సాహసము, జీవము,త్రాణ,ప్రాణము,శక్తి, ప్రియము.

جگمگا జగ్మగా (హి) తళతళలాడెడు.

جگمگانا జగ్మగానా (హి) తళతళలాడు ట,ప్రకాశించుట.

جگمگاہٹ జగ్మగాహట్ (హి.స్త్రీ)తళ తళ,నిగనిగ,ప్రకాశము. (పించుట

جگنا జగ్నా(హి) మేలుకొనుట, లేచుట; కో

جگنو-جگنوں జుగ్నూం-జుగ్నూ(హి.పు) మిణుగురుపురుగు;ఒకభూషణము.

جگنی జుగ్నీ(హి.స్త్రీ)ఒకకంఠాభరణము

جگہ జగహ్(హి.స్త్రీ)స్థలము,చోటు-స్థానము కొలువు, ఉద్యోగము;వసతి,

جل జుల్(హి.పు) మోసము.టక్కు-మిష.

جل జల్(హి.పు)జలము-నీళ్లు جل ترنگ జల తరంగ్ (హి) జలతరంగమనువాద్యము.

جلا జిలా(అ.స్త్రీ) ప్రకాశము, మెరుగు,కాంతి

جلاب జుల్లాబ్ (అ.పు) బేదిమందు;బేది,ప్ర వర్తి,విరేచనము.

جلاد జల్లాద్ (అ.పు) శిరచ్ఛేదకుడు, తలగొ ట్టువాడు,హింసకుడు,క్రూరుడు,

جلاد فلک ఎ-ఫలక్ (పా) మంగళగ్ర హము.

جلال జలాల్ (అ.పు) పటాటోపము;వైభవ ము, ప్రతాపము, మహాత్వము, గౌరవము, ఖ్యాతి.

جلالیہ జలాలియు (అ పు)శక్త్యుపాసకుడు.

جلانا జలానా (హి)కాల్చుట,ముట్టించుట, వెలిగించుట; అనూయలేకపగలేకకోపము పుట్టించుట.

جلانا జిలానా (హి) బ్రతికించుట;భస్మము నుధాతువుగా మార్చుట.

جلاوطن జలావతన్ (అ) దేశభ్రష్టుడు, దేశమునుండి వెడలగొట్టబడినవాడు.

جلاہا-جلاہ జులాహ్-జులాహా (హి.పు) సాలెవాడు; మూర్ఖుడు, శుంఠుడు

جلد జల్ద్ (పా)త్వరగా,వేగముగా, బిరా న,బేగి. جلدباز -బాజ్ (పా) తొంద రపాటి,దుడుకు.

جلد జిల్ద్ (అ.స్త్రీ) తోలు; పుస్తకము. అట్టము,అత్తడము,సంపుటము.

جلدبند -బంద్ (పా) ముచ్చివాడు,పు స్తకములుకట్టువాడు లేక అట్టకట్టువాడు.

جلدی జల్దీ(పా స్త్రీ) వేగము,వడి,తొందర

جلسہ జల్స(అ.పు)సదస్సు,సభ, సమాజము. సందర్శనము,పాటచదురు, చదురు,విందు

جلن జలన్ (హి.స్త్రీ) మంట, జ్వలనము, తాపము; మత్సరము, వైరము, పగ, కోపము.

جلنا జల్నా (హి) కాలుట, మండుట; కారముపుట్టుట; మత్సరించుట, స్పర్థించుట, కోపపడుట جلنا بجهنا-جل بجهنا -బుఝ్‌నా-జల్ బుఝ్‌నా (హి) కాలికూలుట, బూడిదయగుట.

جلنا జుల్నా (హి) కలియుట, చేరుట.

جلندر జలందర్ (హి.పు) జలోదరము; సంజు, వాపు.

جلو జిలో (అ.స్త్రీ) కళ్లెము, గుఱ్ఱపురౌతు తోనుండునిడిగుఱ్ఱము, మారుగుఱ్ఱము; పటాటోపము, వైభవము; పరివారము, పరికరము.

جلوانا జల్వానా (హి) కాల్పించుట.

جلوس జులూస్ (అ.పు) సదస్సు, సభ; పట్టాభిషేకము, వైభవము, పటాటోపము.

جلوه జల్వ (అ.పు) ప్రకాశము, కాంతి; దర్శనము, ప్రియదర్శనము.

جلوه گر هونا-జల్వ గర్ హోనా (ఉ) ప్రత్యక్షమగుట, దర్శనమిచ్చుట, విజయము జేయుట, సభదీరుట.

جلی జలీ (అ) ప్రకాశమానమైన, స్పష్టమైన, లావుశకునములతో వ్రాసిన

جلیبی జలేబీ (హి.స్త్రీ) జిలేబియనుతినుబండారము. (కాడు.

جلیس జలీస్ (అ) సహవాసి, చెలి

جلیل జలీల్ (అ) మహత్తైన, ప్రసిద్ధమైన, గొప్ప; ప్రతాపముగల, ఘనమైన.

جم జమ్ (హి.పు) యముడు, జముడు.

جم జమ్మ్ (అ.పు) విస్తారము, చాల, గుంపు, సమూహము; جم غفیر-ఎ, గఫీర్ (అ) తండోపతండములు, జనసమ్మర్దము.

جماد జమాద్ (అ.పు) నిర్జీవపదార్థము, నిష్ఫలమైన, గొడ్డు, ఫలరహితము కాని.

جمادی الاول జమాదియుల్ అవ్వల్ (అపు) అరబ్బీ సౌరమాసములో అయిదవమాసము.

جمادی الآخر-الثانی జమాదియుల్ ఆఖిర్-జమాదియుస్సానీ (అ.పు) అరబ్బీ చాంద్రమానములో ఆరవమాసము.

جماع జమాఎ (అ.స్త్రీ) సహవాసము, సంయోగము, సంభోగము.

جماعت జమాఅత్ (అ.స్త్రీ) సమూహము, సమాజము, గుంపు; కులము; తరగతి.

جمال జమాల్ (అ.పు) సౌందర్యము, లావణ్యము, అందము.

جمال گوٹا జమాల్‌గోటా (హి.పు) నేపాళపుచెట్టు, నేపాళము (భేదిమందు).

جمالی జమాలీ (అ.పు) ఒకజాతిదోసపండు (కరుబూజ).

جمانا జమానా (హి) పేరపెట్టుట, పేర్చుట; స్థాపించుట, సవరించుట, అమర్చుట; తీర్చుట; అతికించుట, గట్టిచేయుట, కుప్పవెట్టుట; ప్రోగుచేయుట.

جمانا జిమానా (హి) భోజనముపెట్టుట విందుచేయుట, తినుపించుట.

جماو జమావ్ (హి.పు) చేరిక, కూడుదల; గుంపు, ప్రోగు; స్థాపన, గట్టి, స్థిరత; సమూహము; పేరుట. (ఘనీభావము.

جماوٹ జమావట్ (హి.స్త్రీ) పేరుట,

جماوڑا జమావ్‌డా (హి.పు) సమూహము సమాజము.

جماهی-جمائی-جمهائی జమాహి; జమాయీ-జమ్‌హాయీ (హి.స్త్రీ) ఆవలింత.

جمائی జమాయీ (హి.పు) అల్లుడు

جم جم జమ్‌జమ్ (హి) ఎల్లప్పుడు, సదా, ఎప్పటికి,స్వష్టముగా.

جمدھر జమ్‌ధర్ (హి.స్త్రీ) కటారు.

جمع జమఽ (అ.స్త్రీ) మొత్తము, సంకలనము; మూలధనము, సంచయము, గుంపు, ప్రాప్తి; ద్రవ్యము; పన్ను; బహువచనము; ఆదాయము. جمع دار -దార్ (పా) నాయకుడు. جمع بندی -బందీ (పా) పన్నులవయినము, పన్నులలెక్క.

جمعرات జుమఽరాత్ (అ.స్త్రీ) గురువారము.

جمعه జుమ్అ (అ.పు) శుక్రవారము.

جمعیت జమ్‌ఇయత్ (అ.స్త్రీ) సమాహారము; గుంపు, దండు; మనసునెమ్మతి; నిమ్మళము, నమ్మకము.

جمگھٹا-جمگھٹ -జమ్‌ఘట్ -జమ్‌ఘటా (హి.పు) గుంపు,సమూహము.

جمل జుమల్ (అ) అరబ్బీఅక్షరసాంఖ్యము.

جملگی జుమ్‌లగీ (పా.స్త్రీ) సమస్తము, అంతయు, మొత్తము. (వాక్యము.

جمله జుమ్‌ల (అ.పు) మొత్తము, అంతయు;

جمنا జమ్‌నా (హి) పేరుట,ఘనీభవించుట, స్థిరపడుట,నాటుకొనుట, అంటుట, చేరుట, సరిపడుట, కూడుట, పొందుట, అతుకుట, బలపడుట, దృఢముగానుండుట, పొసగుట, సమకూడుట, హారముచేయుట; యమునానది.

جمہانا జమ్‌హానా (హి) ఆవలించుట.

جمہائی జమ్‌హాయీ (హి.స్త్రీ) ఆవలింత. جمہائی لینا -లేనా (హి) ఆవలించుట.

جمہور జమ్‌హూర్ (అ.పు) ఇసుకదిబ్బ; సమూహము, గుంపు; సర్వజనసామాన్యము; ప్రధానులు, ప్రజాప్రభుత్వము.

جمہوری سلطنت -జమ్‌హూరీ సల్తనత్ (అ) ప్రజాప్రభుత్వముగలరాజ్యము.

جمیع జమీఽ (అ) అన్నియు, సర్వము.

جمیل జమీల్ (అ) సుందరమైన, అందమైన, శ్రేష్ఠమైన. (అందగత్తె.

جمیلہ జమీల (అ.స్త్రీ) సుందరస్త్రీ,

جن జిన్ (హి) ఏ.

جن జిన్ (అ.పు) భూతము, దేవత.

جن జన్ (హి.పు) జనుడు,జనము.

جنا జన్నా (హి) ప్రసవమగుట,కనుట, ఈనుట; పుట్టుట, జనించుట.

جناب జనాబ్ (అ) అయ్యా, స్వామి, పంతులుగారు, రాజేశ్రీగారు, తాము, తమరు.

جناب عالی -ఎ,ఆలీ (అ) మహారాజేశ్రీగారు, శ్రీవారు (మైల.

جنابت * జనాబత్ (అ) అపవిత్రత,

جنات జిన్నాత్ (అ.పు) భూతములు, దయ్యములు, దేవతలు. (ఏ-వ جن)

جنازہ జనాజ (అ.పు) శవవాహనము, పాడె; శవము

جنانا జనానా (హి) కనునట్లు చేయుట, మంత్రసానితనము చేయుట; తెలియచెప్పుట.

جنائی జనాయీ (హి.స్త్రీ) మంత్రసాని.

جنبان జుంబాన్ (పా.స్త్రీ) చలనముగల, అల్లాడెడు, కదలెడు.

جنبش జుంబిష్ (పా.స్త్రీ) చలనము, కదలిక, అల్లాట. (ముత్తోట.

جنت జన్నత్ (అ.స్త్రీ) స్వర్గము; ఆరామ

جنتا జంతా (హి.పు) కమ్మచ్చు, తీగలుతీయుసాధనము.

جنتر జంతర్ (హి.పు) జంత్రము, యంత్రము; తాయెత్తు, పనిముట్టు.

جنتر జంతర్ (హి.పు) కమ్మచ్చు,పంచాంగము.

جنتو జంతూ (హి.పు) జంతువు.

جنتی జన్నతీ (అ) స్వర్గవాసి;స్వర్గ సం॥

جنجال జంజాల్ (హి.పు)చిక్కు, సంకటము, కష్టము, అనిష్టము.

جندرا జంద్రా (హి.పు) పంటికట్టె.

جنس జిన్స్ (అ.స్త్రీ)వస్తువులు; సామగ్రి, పదార్థము;ధాన్యము;జాతి, తెగ,విధము.

جنسیت జిన్సియత్ (అ.స్త్రీ) సజాతీయత,జాతిసామ్యము.

جنگ జంగ్ (పా.పు) యుద్ధము,జగడము.

جنگال జంగాల్ (పా.పు) రాగికిలుము, చిలుము.

جنگل జంగల్ (హి.పు) అడవి, అరణ్యము, జంగలము. جنگل جانا—జంగల్-జానా(హి) బహిర్భూమికిపోవుట.

جنگلا జంగ్లా (హి.పు)పాడు,బీడు,ఎడారి; కంచె,కోట, అలవ, ఆవరణము, కంచెకట్టిన చోటు; ఒకరాగము; అంచు,కొంగు.

جنگلی జంగ్లీ (హి) జాంగలము, అడవిది; మోటయిన پیاز جنگلی — ప్యాజ్ [హి] నక్క-ఉల్లిగడ్డ. جنگلی کوا —కవ్వా (హి) కాకోలము,మాలకాకి.

جنگم జంగమ్ (హి.పు)జంగమము, ప్రాణముగలది; జంగమువాడు.

جنگی జంగీ (పా) యోధుడైన, పోటరియైన; గొప్ప, దొడ్డ;యుద్ధ సం॥

جنم జనమ్ (హి.పు) జన్మము.

جننا జన్‌నా (హి)-చూడు. جنا

جنواسا జన్‌వాసా (హి.పు) పెండ్లికొడుకువారివిడిది (దిగినచోటు).

جنوائی జన్‌వాయీ (హి.పు) అల్లుడు; గూఢశత్రువు.

جنوب జనూబ్ (అ.పు) దక్షిణము,

جنوبی జనూబీ [అ]దక్షిణపు.

جنون జనూన్(అ.పు)ఉన్మాదము-పిచ్చి, వెడ్డి, వెఱ్ఱి,క్రోధము,

جنونی జనూని(అ)పిచ్చి-వెడ్డి. వెఱ్ఱి.

جنہیں జిన్‌హేఁ (హి)ఎవరిని, దేనిని.

جنی జిన్నీ(అ.పు)మంత్రగాడు.

جنین జనీన్ (అ.పు)పిండము.గర్భము.

جنیو జనేవ్, (హి.పు) జందెము;రత్నములు మొ॥వానిధార;కళంకము-దోషము,

جو జో(పా.పు)నది.ఏరు,

جو జో(హి)ఎవరు.ఏది;అయితే;అప్పుడు, ఎప్పుడు.

جو జౌ(హి.పు) యవలు;వ్రేలికణపుగీతలు,

جوا జవా (హి.పు)ఉల్లిగడ్డ మొ॥వానిపాయ; ఒకకుట్టు,నూగింజకుట్టు.

جوا జువా (హి.పు) జూదము;కాడి-కాణి,

جواب జవాబ్ (అ.పు)ఉత్తరము.ఉత్తరవాదము;జోడు .సాటి, తుల్యము; మారు, ప్రతి, చెల్లు. جواب باثواب—బాసవాబ్ (అ.పు) యోగ్యప్రత్యుత్తరము, ఉచితోత్తరము. جواب دہ—దెహ్ (పా) ఉత్తరవాది,ఉత్తరమిచ్చువాడు. جواب دہی—దెహీ(పా) ఉత్తరవాదము,ఉత్తరమిచ్చుట. جواب ملنا—మిల్నా (ఉ) విడుదలయగుట,ఉత్తరముదొరకుట.

جوابی జవాబీ (అ.పు) ఉత్తరవాది; జతది, జోడు,ప్రతి.

جوار జవార్(హి.పు)పొరుగు,సామీప్యము.

جوار జవార్ (హి.స్త్రీ) జొన్నలు;సముద్ర పుపోటు. جوار بھاٹا జ్వార్‌భాటా—భాటా (హి) సముద్రముయొక్క పోటుపాటులు.

جوارا జువారా (హి.పు) ఒకకాడిఎద్దులు, (మోటువి)

جوارش జవారిష్ (పా.స్త్రీ) పౌష్టికలేహ్యము;జీర్ణకారి (లేహ్యము)

جواری జువారీ (హి.పు) జూదరి.

جواری జవారీ(హి.స్త్రీ)స్వరములయొక్కధ్వనిచములమార్పుటకై తంత్రీవాద్యముల పైకట్టియుండు దారము,పజ్జము.

جواز జవాజ్ (అ.పు) యోగ్యత, న్యాయము,క్రమము,ఉచితత్వము.

جواکھار జవాఖార్ (హి.పు)సురేకారము, ఉప్పుమట్టి.

جوالا జ్వాలా (హి.స్త్రీ) జ్వాల,మంట. جوالامکھی జ్వాలా—ముఖీ(హి) జ్వాలాముఖి, అగ్నిపర్వతము,నిప్పుకొండ.

جوان జవాన్ (పా) తరుణుడు, వయసువాడు;సేవకుడు,బంటు;వయసు.

جوان بخت జవాన్—బఖ్త్ (పా) అదృష్టవంతుడు. جوان مرد జవాన్—మర్ద్ (పా) శూరుడు,వీరుడు,పోటరి, మొనగాడు.

جوان مردی జవాన్—మర్దీ (పా) మొనగానితనము,మగటిమి,శౌర్యము,వీర్యము,ఉదారబుద్ధి,మహేచ్ఛ. جوان مرگ موت జవాన్—మర్గ్-మౌత్ (పా) అకాలమరణము.

جوانی జవానీ (పా.స్త్రీ) వయసు,తారుణ్యము.

جواہر.جواہرات జవాహిర్-జవాహిరాత్ (అ.పు) రత్నములు,వజ్రములు

جواہر نگار జవాహిర్—నిగార్(పా) రత్నఖచితము.

جوبن జోబన్ (హి.పు) యౌవనము, వయసు;గబ్బిగుబ్బలు;సౌందర్యము,లావణ్యము; మైఖరి,ఠీవి,అందము,పొంకము.

جوت జోత్ (హి స్త్రీ) జ్యోతి,ప్రకాశము, కాంతి;చూపు;దృష్టి;వెలుతురు;జీవము;మంటు;ప్రాణము;అంగడిసామాను;త్రాసుత్రాళ్లు.

جوت జోత్ (హి.స్త్రీ)సేద్యము,దున్నుట; పొలముపన్ను;పోబడి,జాడ.

جوتا.جوتی జూతా-జూతీ(హి.పు) చెప్పు, పాదరక్షు. (దున్నువాడు.

جوتا జోతా (హి.పు) సేద్యగాడు, కాపు,

جوتری జవత్రీ (హి స్త్రీ) జాపత్రి.

جوتشی జోతిషీ (హి.పు)జ్యోతిష్కుడు.

جوتنا జోత్నా (హి) కాడికికట్టుట; దున్నుట, సేద్యముచేయుట; యోజించుట, కూర్చుట,జతచేయుట.

جوتی జూతీ (హి.స్త్రీ) చూడు. جوتا جوتی پیزار జూతీ—పైజార్ (ఉ) తన్నులాట, (చెప్పులాట.)

جوٹ జోట్ (హి.పు) జోడు, జత.

جوجھنا జూఝ్నా (హి) పోట్లాడుట, యుద్ధముచేయుట.

جود జూద్ (హి) ఔదార్యము, దానము, ఉపకారము (దుతనము.

جودت జూదత్ (పా) వడి,వేగము, చురు

جور జౌర్ (అ.పు) క్రౌర్యము,బలాత్కారము, నిర్బంధము. (ము.

جورو జోరూ (హి.స్త్రీ) భార్య, పెండ్లా

جوری జూరీ (హి.స్త్రీ) చలిజ్వరము.

جوڑ జోడ్ (హి.పు) కీలు,అతుకు; జత, జోడు, ఈడు, సామ్యము, ముడి, అవయవము, సంబధము, మొత్తము, మోసము,

నింద, కల్పన. جوڑ توڑ జోడ్ తోడ్ — (హి,) సవరణ, ఉపాయము, వయినము. మాను

جوڑ توڑ

**جوڑا** జోడా (హి.పు) జోడు, జత, తోడు, రెండవది, ప్రతి; మగడు; దుస్తు, బట్టలు.

**جوڑا** జూడా (హి.పు) మాడ, సిగముడి; గడ్డివెంటి; పక్షిచుంచువు; తలగుడ్డతోక, చుట్టు, కొప్పు.

**جوڑنا** జోడ్నా (హి) కలుపుట, కూర్చుట జతచేయుట, అతుకుట, మొత్తముచేయుట, కూడుట, లెక్కచేయుట; చేర్చుట, కట్టుట; కుట్టుట; కాడికికట్టుట; ముట్టించుట, ముడివేయుట. (యెద్దులు. మొ॥

**جوڑی** జోడీ (హి.స్త్రీ) జత, జోడు, బండి

**جوز** జౌజ్ (అ.పు) జాజికాయ.

**جوزا** జౌజా (అ.పు) మిథునరాశి.

**جوش** జోష్ (పా.పు) ఉడుకు, మరుగు, పొంగు; ఉత్సాహము, ఔత్సుక్యము; ఆతురము, ఆవేశము, వేగిరిపాటు, కోపము; వడి, వేగము; మదము, తాపము, చలనము, ఉద్రేకము; మతవిరోధము.

**جوشاں** జోషాఁ (పా) ఉడుకుచున్న, మరుగుచున్న, పొంగుచున్న. (ము.

**جوشاندہ** జోషాందహ్ (పా.పు) కషాయ

**جوشن** జౌషన్ (పా.పు) కవచము; భుజకీర్తులు.

**جوف** జౌఫ్ (అ.పు) ఈటెపోటువలనకలిగిన గాయము; తొర్ర-బొర్ర-బోలు; బొంద.

**جوق** జౌక్ (అ.పు) సమూహము- గుంపు దండు. **جوق جوق** — జౌక్ (అ) గుంపులుగుంపులుగా. మందలు మందలుగా,

**جوکھ** జోఖ్ (హి.స్త్రీ). తూనిక-జోకు. కొలత; అంచన; పరిమాణము; పరీక్ష.

**جوکھنا** జోఖ్నా (హి) తూచుట, జోకుట; పరీక్షచేయుట.

**جوکھم-جوکھوں** జోఖమ్-జోఖోఁ (హి.స్త్రీ) భయము, అపాయమున,

**جوگ** జోగ్ (హి.పు) యోగము, జోగము, యోగ్యము; లగ్నము, శాంతనము.

**جوگا** జోగా (హి) యోగ్యమైన, ఉచితమైన, తగిన.

**جوگن-جوگنی** జోగిన్-జోగ్ని (హి.స్త్రీ) యోగిని, జోగిది, జోగురాలు; దేవత, భూతము, మంత్రగత్తె.

**جوگی** జోగి (హి.పు) యోగి, జోగి.

**جوگیا** జోగియా (హి.పు) ఎరుపుపసుపుకలిసినవర్ణము; రాగభేదము.

**جولان** జౌలాన్ (పా.పు) చలనము, కుప్పిగంతులు, తీవ్రము, వేగము, పరుగు, తిర్గాటు, సంకెళ్లు, శృంఖలము.

**جولانی** జౌలానీ (పా.స్త్రీ) మనోబలము, బుద్ధి సూక్ష్మత; ఉద్రేకము, వేగము, వడి, చాకచక్యము, చురుకుదనము.

**جون** జౌన్ (హి) ఎవరు, ఏది.

**جوں** జూఁ (హి.స్త్రీ) పేను.

**جون** జూన్ (హి.స్త్రీ) జన్మము, పుట్టుక, సంసారము, కాలము.

**جوں** జూఁ (హి) ఎట్లు, అట్లు, వలె.

**جوں توں** — తూఁ (హి) ఎట్టకేలకు, ఎట్టయినను. **جوں جوں** — జూఁ (హి) ఎట్టెట్టు, ఎంతెంత, ఏకీరుగా, ఎట్లు.

**جوں کا توں** — కాతూఁ (హి) ఉన్నది, ఉన్నట్లు, అట్లే, యదార్థము.

**جوں ہی جونہی** — హీ-హీఁ (హి) ఎప్పుడు, అప్పుడే, తక్షణమే.

**جونا** జూనా (హి.పు) గడ్డివెంటి.

جونار జౌనార్ (హి.స్త్రీ) విందు.
جونک జోఁక్ (హి.స్త్రీ) జెనగ, జెలగ.
جونہیں జూఁహీఁ(హి)అప్పుడే,తక్షణమే.
جوہر జౌహర్ (అ.పు) రత్నము;గుణము; వస్తువు,సత్తు;తత్వము;విశేషము; సారము, మూలము;పదార్థము;గుట్టు.
جوہری జౌహరీ (అ.పు) మణికారుడు,రత్నములవర్తకుడు,పరీక్షకుడు.
جوہڑ జౌహఁడ్ (హి.పు) కుంట, మడుగు, దొరువు.
جوہنا జోహ్నా (హి) నిరీక్షించుట,ఎదురుచూచుట, దేవులాడుట, వెదకుట, శోధించుట.
جوہی జూహీ (హి.స్త్రీ) జాజిమల్లె.
جویا جوئندہ జోయాఁ—జోయింద (పా.పు) అన్వేషకుడు,వెదకువాడు.
جھابا ఝాబా (హి.పు) తోలుసిద్దె.
جھابر ఝాబర్ (హి.స్త్రీ) చిత్తడినేల, ఉబ్బలి.
جہات జిహాత్ (అ)దిక్కులు.(ఏ.వ جہت)
جہاد జిహాద్ (అ.పు)ప్రయత్నము,సహాయము;మతయుద్ధము. (కట్టినభంగు.
جھارا ఝారా (హి.పు) జల్లిగంటె;వడియ
جھارنا ఝార్నా (హి) జల్లించుట,చెరుగుట,శోధించుట, సేయుట. (లేకజాడీ
جھاری ఝారీ (హి.స్త్రీ) కొమ్ముచేంబు
جھاڑ ఝాడ్ (హి.పు)చెట్టు, మందుచెట్టు, కంప, దీపస్తంభమువంటిగాజుచెట్టు;కాకరపూవుబుడ్డి(బాణసంచు),వరుస,బారు,పంక్తి
جھاڑ باندھنا ఝాడ్—బాంధ్నా (హి) జడివానకురియుట, ధారాసంపాతము(గాకురియుట),వానవిడువకుండకురియుట.
جھاڑکھنڈ ఝాడ్—ఖండ్ (హి) అడవి.
جھاڑا ఝాడా (హి.పు) విరేచనము,బేది, మలము,చెత్త,శోధ, వెదకుట,మంత్రము.
جھاڑا پھرنا ఝాడా—ఫిర్నా (హి) మలవిసర్జనముచేయుట.
جھاڑن ఝాడన్ (హి.పు) చెత్త-కసవు; తుండుగుడ్డ,దుమ్ముదులుపుగుడ్డ.
جھاڑنا ఝాడ్నా (హి).ఊడ్చుట,రాల్చుట,ధాన్యముదుల్పుట; దువ్వుట,చిక్కుతీయుట;మంత్రము వేయుట.
جھاڑو ఝాడూ (హి.స్త్రీ) చీపురుకట్ట; పొరక; తోకచుక్క.
جھاڑو پھیرنا.دینا ఝాడూ—ఫేర్నా-దేనా (హి)ఊడ్చుట,చిమ్ముట. جھاڑو تارا ఝాడూ—తారా [హి) తోకచుక్క
جھاڑی ఝాడీ (హి స్త్రీ) పొద, కంప, అడవి,వనము.
جہاز జహాజ్ (అ.పు) ఓడ,నావ,పడవ.
جہازی జహాజీ (అ.పు) నావికుడు,ఓడపైనుంచులేకపోవువాడు,నాకాసం॥
جھاگ ఝాగ్ (హి.పు) ఫేనము, నురుగు; తేలినమష్టు.
جھال ఝాల్ (హి.స్త్రీ) తీక్ష్ణము,కారము; మంట;అతుకు, మాటు;జల్ల, వెడలుపాటితట్ట;ఆశ,కోరిక;కోపము, అల.
جہالت జహాలత్ (అ.స్త్రీ) అజ్ఞానము, మూఢత్వము.
جھالر ఝాలర్ (హి.స్త్రీ) జీబు, వ్రేలాడు అంచు,అల్లికపుఅంచు,కుచ్చె, వలయంచు.
جھالنا ఝాల్నా (హి) మాటువేయుట,అతుకుట,టంకము వేయుట. [ల్లిక.
جھام ఝామ్(హి.పు,జొరిగ.పెద్దపార,తో
جہان-جہاں జహాన్-జహాఁ (పా.పు) ప్రపంచము. جہاں پناہ జహాఁ—పనాహ్ (పా) లోకరక్షకుడు,ఏలినవారు. جہاں دیدہ జహాఁ—దీద (పా) అనుభవశాలి, ప్రపంచము చూ

చినవాడు, అనుభవజ్ఞుడు.

**جہاں** జహాఁ (హి) ఎక్కడ,ఎచ్చోట.

**جہاں تک** జహాఁ-తక్ (హి) ఎంతవరకు.

**جھانپ** ఝాఁప్ (హి.స్త్రీ) వెదురుతట్ట, మూతగంప,బండిగూడు;పంచ;పెండెము.

**جھانپنا** ఝాఁప్నా (హి) మూయుట, కప్పుట,దాచుట.

**جھانپو** ఝాఁపూ (హి.పు) కాటుకపిట్ట.

**جھانٹ** ఝాఁట్ (హి.స్త్రీ) శేఫము; తుచ్ఛము.

**جھانجھ** ఝాఁఝ్ (హి.స్త్రీ) కోపము,ఆతురము,కలవరము;వాయించు తాళము,కామము.

**جھانجھر** ఝాఁఝర్ (హి) పగిలిన, ఓటి, కారెడు,చిల్లిపడిన.

**جھانجھن** ఝాఁఝన్ (హి.స్త్రీ) గజ్జెలకడియములేక అందెలు. [క్కు,మిన.

**جھانسا** ఝాఁసా (హి.పు) మోసము, టు

**جھانسو-جھانسیا** ఝాఁసూ-ఝాఁసియా (హి.పు) మోసగాడు,టక్కరి.

**جھانک** ఝాఁక్ (హి.స్త్రీ) తొంగిచూపు, ఓరచూపు,దొంగచూపు. (ప;బక్కని.

**جھانکڑ** ఝాఁకడ్ (హి.పు) మడ్లచెట్టు,కం

**جھانکنا** ఝాఁక్నా (హి)తొంగిచూచుట, దొంగతనముగాచూచుట.

**جھانکی** ఝాఁకీ (హి.స్త్రీ) ప్రదర్శనము, చూపు,దర్శనము,కంత,సందు;వేషము.

**جھانواں-جھانمان** ఝాఁవాఁ—ఝాన్మాఁ (హి.పు)గులకరాయి,కరకుగలకాలినఇటుకరాయి (కాళ్లలోముకోసుటది) కఱుకు గాయి.

**جھانولی** ఝాఁవ్లీ (హి.స్త్రీ)రెప్పపాటు, కనుసైగ,కటాక్షవీక్షణము,ఒయారము.

**جھانولی باز** ఝాఁవ్లీ-బాజ్ (హి) కులుకులాడి,వగలాడి. **جھانولی لینا** ఝాఁవ్లీ-లేనా(హి) క్రేగంటచూచుట,ఒయారముగాచూచుట.

**جھاولی** ఝావ్లీ (హి.స్త్రీ) కుండ,భాండము.

**جھائیں** ఝాయేఁ(హి.స్త్రీ)ఛాయ, నీడ, పొడ, అద్దములోని మరకలు.

**جھائیں مائیں** ఝాయేఁ-మాయేఁ(హి) ఒక్కయాట.

**جھبا** ఝబ్బా (హి.పు) కుచ్చు, గుత్తి.

**جھبرا-جھبوا** ఝబ్రా-బ్వా (హి) దట్టమైన బొచ్చుగల, చింపిరి.

**جھپ** ఝప్(హి)తత్క్షణమే,త్వరగా,

**جھپ کھانا** ఝప్-ఖానా(హి) తలక్రిందగుట,(గాలిపటము) [డోలిక

**جھپان** ఝప్పాన్ (హి.పు)డోలిక, కుర్చీ

**جھپٹ** ఝపట్ (హి.స్త్రీ)ఒడియుట, పైబడుట,కవియుట,గంతు,త్వర,లటుక్కు,పరుగు,ఒడుపు,పెట్టు,దెబ్బ. **جھپٹ لینا**-లేనా(హి)పైకిదూకుట,కవియుట, ఓడిసి తీసికొనుట.

**جھپٹا** ఝపట్టా (హి.పు) బడియుట, కవియుట, పైకొనుట, గంతు,త్వర, తన్నుకపోవుట,ఒడుపు, పెట్టు.

**جھپٹانا** ఝప్టానా(హి)త్వరగాపంపుట.

**جھپٹنا** ఝపట్నా (హి)కవియుట, పైబడుట,బిరబిరనడచుట, ఒడిసితీసికొనుట.

**جھپک** ఝపక్ (హి.స్త్రీ) రెప్పవాల్పు,సిగ్గు, బిడియము, భయము; విసరుట.

**جھپکنا** ఝపక్నా (హి)రెప్పవాల్చుట, దూకుట,పైబడుట,విసరుట, భయపడుట.

**جھپکی** ఝప్కీ (హి.స్త్రీ) రెప్పపాటు తూగు, కూరుకు. (جھپٹ

**جھپیٹ** ఝపేట్ (హి.స్త్రీ) చూడు

**جھپیٹا** ఝపేటా (హి.పు) గ్రహబాధ చూడు جھپٹا

**جہت** జిహత్ (అ.స్త్రీ)మూలము,కారణము, పార్శ్వము, ప్రక్క,దిక్కు.

**جھٹ** ఝట్ (హి)చూడు جھپ అను

مارنا جھٹ پٹ ఝట్-పట్ (హి) దడ దడ,చెఱచెఱ,దబదబ, త్వరగా.

جھٹالنا ఝుటాల్నా (హి)ఎంగిలిచేయుట -వాడుట, అబద్ధముచేయుట.

جھٹپٹا ఝట్ పుటా(హి.పు) సంధ్యాకాల ము, మసచీకటి-కసుచీకటి.

جھٹک ఝటక్ (హి.స్త్రీ) విదిలింపు, కద లించుట, చివుక్కునలాగుట, ఆదరు, చల నము, జాడింపు.

جھٹکا ఝట్ కా (హి.పు)విదిలింపు, పెట్టు, ఆదురు, ద్రొబ్బు, చివుక్కున లాగుట, ఈడ్పు, కదలిక, జాడింపు, ఒంటిగుఱ్ఱపు బండి, కచ్చడము.

جھٹکانا ఝట్ కానా(హి)లాగుట, అల్లా డించుట, విదిలించుట, దులిపించుట, జా డించుట.

جھٹکنا ఝటుక్నా(హి) విదిలించుట, ఒడి యుట, బక్కబడుట, దుఃపుట, సన్న గిలుట. (టు.

جھٹلانا ఝుట్ లానా(హి) అబద్ధముచేయు

جھٹیل ఝుటైల్(హి) ఎంగిలి,భుక్తశేషము -రంకుడి. [బు-ముంత.

جھجر ఝుజ్జర్ (హి) పెద్దజాడి,కొమ్ముచెం

جھجک ఝుఝక్ (హి.స్త్రీ) ఆదరిపాటు, ఆదురు,భయము,బుగులు,గుప్పు(అనువాసన)

جھجکنا ఝుచక్నా (హి) ఆదరిపడుట, బె దరుట,వెనకముందాడుట,సంకోచించుట.

جہد జెహద్ (అ.పు) ప్రయత్నము, శ్రమ, పాటుపడుట,ఉద్యోగము.

جھرجھرا ఝిర్ఝిరా(హి)పలచని, సన్నని.

جھرجھری ఝుర్ఝురీ (హి.స్త్రీ) పులక రింపు,చలి;వణకు,కంపరము.

جھرکٹ ఝుర్ కట్ (హి.స్త్రీ) కొట్టివేసి నమండలు;వాడిన,చిన్నపోయిన.

جھرمٹ ఝుర్ మట్ (హి.పు)దొమ్మి, గుం పు;జగడము;దిమ్మిస;ముసుగు.

جھرنا ఝుర్నా (హి.పు) సెలయేరు,ప్రవాహ ము,నిర్ఝరము;నీరువడియు పోయుసాధనము, తేఃపోయునది; తేరపోయుట, కారుట,చె మర్చుట.

جھرنا ఝుర్నా (హి) బక్కపడుట, క్షీణిం చుట,వాడుట,కృశించుట,సన్నగిలుట.

جھرنا ఝిర్నా (హి) కారుట,పారుట, చె మర్చుట. (కిటికీ,జల్లికడక.

جھروکا ఝరోకా (హి.పు) కిడ్డి,గవాక్షము,

جھرّی ఝుర్రీ (హి.స్త్రీ)ముడత,వలి.

جھرّی ఝిర్రీ (హి.స్త్రీ) పగులు, సందు, మడుగు.

جھڑ ఝడ్ (హి స్త్రీ) జడివాన, వానజల్లు, తాళపుబెట్టు,ముండ్లచెట్టు.

جھڑجھڑ ఝడ్ఝడ్(హి)వెంటవెంట,చెక చెక,త్వరగా,దడదడ. (టుము.

جھڑاکا ఝడాకా (హి.పు) వానజల్లు,పోరా

جھڑانا ఝడానా(హి) ఊడ్పించుట,దయ్య ము వదలగొట్టించుట,మంత్రము వేయించుట. దులిపించుట.

جھڑبتاس ఝడ్బటాస్ (హి స్త్రీ)ఝుం ఝూమారుతము, గాలివాన.

جھڑبیری ఝడ్ బేరీ (హి.స్త్రీ) జిట్టరేగు.

جھڑپ ఝడప్ (హి.స్త్రీ) జ్వాల,ప్రచండ త;పుంజులపోట్లాట, జగడము, ఉద్రేకము, కాంము,కోపము,వానజల్లు.

جھڑپانا ఝడ్పానా (హి)జగడమాడించు ట,పోట్లాటపెట్టుట. (డుట.

جھڑپنا ఝడప్నా(హి)కలియుట, పోట్లా

جھڑجھڑ ఝడ్ఝడ్ (హి) వెంటవెంట, ఎడతెగక, బిరబిర, త్వరగా.

جھڑجھڑانا ఝుఁడ్‌ఝుఁడానా (హి) విది లించుట, జల్లాడించుట, చిప్పుకుచిప్పుక్కు నలాగుట, గద్దించుట-చీవాట్లుపెట్టుట.

جھڑک (హి.స్త్రీ) గద్దింపు, చీవాట్లు, విది లింపు, దులుపు.

جھڑکنا ఝుఁడక్నా (హి) గద్దించుట, దులు పుట, విదలించుట, చీవాట్లుపెట్టుట, లా గుట.

جھڑکی ఝుఁడ్‌కీ (హి. స్త్రీ) గద్దింపు, చీవాట్లు -విదలింపు, చిఱచిఱ. [రాలుట.

جھڑن ఝుఁడన్ (హి. స్త్రీ) చీపురుకసవు, చెత్త;

جھڑنا ఝుఁడ్నా (హి) రాలుట, ఊడ్చబడుట, చిమ్మబడుట, చెత్తలేకుండ పోవుట.

جھڑی ఝుఁడీ హి. (స్త్రీ) ముసురు, జడివాన.

جھک ఝుక్ (హి) నిర్మలము, స్వచ్ఛము, ధవ ళము, నిగనిగ; పిచ్చి, దిమ్మ; వదరుపోతుతన ము, నిరర్థకము, తుచ్ఛము. جھک مارنا -మార్నా (హి) పిచ్చి కూతలుకూయుట, వృథావాగుట, తప్పుపనిచేయుట.

جھکانا ఝుకానా (హి) వంచుట, వాల్చుట, మొగ్గించుట, క్రిందికిలాగుట, మాటతప్పిం చుట, ఎత్తిపొడుచుట, లంచమిచ్చుట, గురి పెట్టుట. [కష్టపెట్టుట.

جھکانا، ఝుకానా (హి) అగచాట్లపెట్టుట,

جھکاؤ-جھکاوٹ ఝుకావ్ -ఝుకావట్ (హి. పు) వంపు, వాలు, మొగ్గు, రేశ.

جھکرا ఝుక్రా (హి. పు) కుండ.

جھکڑ ఝుక్కడ్ (హి. పు) ప్రచండవాతము, గాలి వాన, వడిగాలి. [గ్గుట.

جھکنا ఝుక్నా (హి) వంగుట, వాలుట, మొ

جھکنی ఝుక్నీ (హి. స్త్రీ) తూగు, కూరుకు; కష్టము. [విసరుడు గాలి.

جھکور ఝుకోర్ (హి. స్త్రీ) నష్టము, కష్టము,

جھکول ఝుకోల్ (హి. స్త్రీ) నీళ్లలో కదలా డుట, జాడింపు (నీటిలో)

جھکولا ఝుకోలా (హి. పు) అల, బుడక, మునక, జాడింపు (నీటిలో)

جھکولنا ఝుకోల్నా (హి) నీటిలో చెరలాడు ట, నీటిలో జాడించుట, కడుగుట.

جھکی ఝుక్కీ (హి) వదరుపోతు; ఆతురగా డు, వితండుడు. [పోరాటము.

جھگڑا ఝగ్డా (హి. పు) జగడము, పోట్లాట,

جھگڑالو ఝగ్డాలూ (హి) జగడగొండి.

جھگڑنا ఝుగ్డ్నా (హి) పోట్లాడుట, జగడ మాడుట, వాదించుట, తర్కించుట.

جھل ఝల్ (హి. స్త్రీ) సెగ, కాక, ఉద్రేకము ఆవేశము, మత్సరము, ఓర్వలేమి.

جہل జహ్ల్ (అ. పు) అజ్ఞానము, మౌఢ్యము

جھلا ఝుల్లా (అ. పు) ఒక అంగీ,

جھلا ఝుల్లా (అ. పు) జల్లు, పెద్దగంప; కోప పడినవాడు.

جھلابور ఝుల్లాబూర్ (హి) ఆధిక్యము, సమృ ద్ధి వరద; నిగనిగమెరయు ప్రకాశము.

جھل جھلا ఝులాఝుల్ (హి) ప్రకాశమాన ముగు, దివ్యమైన, మెరయు, తళతళలాడు.

جھلانا-جھولانا ఝులానా- ఝూలానా (హి) ఊపుట, జాగుచేయుట.

جھلانا ఝుల్లానా (హి) చిరచిరలాడుట, కోప పడుట, తీయుట, సలుపుట

جھلجھلانا ఝుల్‌ఝులానా (హి) మెరయు ట, తళతళలాడుట, తీయుట, సలుపుట, కోపపడుట.

جھلجھلاہٹ ఝుల్ ఝులాహట్ (హి. స్త్రీ) తళతళ, మెరుపు; తీపు, సలుపు.

جھلڑ ఝుల్లడ్ (హి. పు) మంద, గుంపు.

جھلسانا ఝుల్సానా (హి) కాల్చుట.

جھلسنا ఝుల్స్నా (హి) కాలుట.

جھلک-جھلکا ఝులక్ -ఝుల్కా (హి. స్త్రీ) తళుక్కు, తళతళ, ప్రకాశము, దీప్తి -అద్దము మొ॥వానినీడ; దర్శనము, చూపు; తొంగు, వెలుతురుయొక్క ఛాయ, ప్రతి ఫలము, ప్రతిబింబము.

**جھلکا** ఝల్కా (హి.పు) పొక్కు. బొబ్బ.

**جھلکانا** ఝల్కానా(హి) ప్రకాశింపజేయుట, మెరపించుట,తళతళలాడించుట.

**جھلکنا** ఝలక్నా(హి)తళతళలాడుట, మెరయుట.

**جھلکی** ఝల్కీ(హి.స్త్రీ) చూడు **جھلک**

**جھلم** ఝిలమ్ (హి.స్త్రీ)ముఖకవచము.

**جھلمل** ఝిల్‌మిల్(హి పు) మిణుకుమిణుకు-చంచల ప్రకారము- తళతళ; తడకతెర, జల్లితెర,జాలకము, పలతెర; ఆకురెక్కల తలుపు.

**جھلملانا** ఝిల్‌మిలానా (హి) మిణుకుమిణుకులాడుట, తళుకుతళుకుమనుట, మెరయుట.

**جھلملی** ఝల్‌మిలీ(హి.స్త్రీ) జాలకము, ఆకురెక్కలతలుపు, మిణిమిణిలు, కొద్ది ప్రకాశము, మిణుకుమిణుకు, అల్లికతెర, వలతెర. తెరతడిక. (కుట.

**جھلنا** ఝల్నా(హి)విసురుట, వీచుట, ఆకు

**جھلوانا** ఝల్వానా (హి) మాటువేయించుట, అతికించుట, విసరించుట.

**جھلنگا** ఝలంగా (హి. పు) మంచపుకుక్కి,వదలైన మంచము, బక్కని, పలచని,చిక్కిన.

**جھلی** ఝల్లీ(హి.స్త్రీ) జల్ల, పెద్దగంప.

**جھلی** ఝిల్లీ(హి.స్త్రీ) క్లోమము, పేగుల తిత్తి,సన్నని పొర, పలచని.

**جھم جھم-جھما جھم** ఝమా ఝమ్-ఝమ్‌ఝమ్ (హి.పు) వానచప్పుడు, జడివాన, విసరికొట్టెడు వానచప్పుడు.

**جھمجھمانا** ఝమ్‌ఝమానా (హి) మెరయుట, తళతళలాడుట.

**جھمک** ఝమక్(హి స్త్రీ) మెరుపు,తళతళ.

**جھمکا-جھمکا** ఝుంకా - ఝుమకా (హి.స్త్రీ) కమ్మ, గుత్తి,జూకీయను భూషణము; గుంపు;కృత్తికానక్షత్రము

**جھمکانا** ఝమ్‌కానా(హి) మెరపించుట, తళుక్కుమనిపించుట.

**جھمکنا** ఝమక్నా (హి) మెరయుట, తళతళలాడుట, తళుక్కుమనుట.

**جھمکڑا** ఝమక్డా(హి) పటాటోపము, వైభవము, విలాసము, అందము.

**جھمورا** ఝమూరా(హి) బొచ్చుగల జంతువు, గుడ్డెలుగు.

**جھمیلا-جھمیل** ఝమేల్-లా (హి.పు) చిక్కు; అలస్యము; స్నేహము

**جھن** ఝున్ (హి.స్త్రీ) ఘల్లు, టంగు,ఠణఠణ, లోహముల చప్పుడు,ఝుంకారము.

**جھن جھن**—ఝున్ (హి) ఘల్లు ఘల్లు ఠణఠణ,టింగుటింగు, టంగుటంగు, ఝణఝణత్కారము.

**جھنجلانا** ఝుంఝ్లానా(హి) చిటచిటలాడుట, కోపపడుట.

**جھنجوڑنا** ఝన్‌ఝోడ్నా (హి) అల్లాడించుట,కదల్చుట, ఊసులాడించుట; మేలుకొలుపుట, పండ్లతో పెరుకుట.

**جھنجھٹ** ఝన్‌ఝట్ (హి.పు)పీకులాట-చిక్కు,జగడము,సంకటము.

**جھنجھٹیا** ఝన్ ఝటియా (హి) జగడగొండి,పీకులాటగాడు.

**جھنجھلاہٹ** ఝుంఝ్లాహట్ (హి.స్త్రీ)చిటచిట,కోపము,విసరింపు,కసరు.

**جھنجھنا** ఝున్‌ఝునా(హి.పు)పిల్లలాడు కొనుగిలక.

**جھنجھنانا** ఝున్‌ఝునానా(హి)గలగలలాడుట;సలుపుట;ఘల్లుఘల్లుమనుట.

**جھنجھناہٹ** ఝున్‌ఝునాహట్ (హి.స్త్రీ)గలగల-ఘల్లుఘల్లు- ఝణత్కారగతి.

**جھنجھنی** ఝుంఝుని (హి.స్త్రీ)తిమురు

**جھنجھی-جھنجھی** ఝుంఝీ-ఝుంఝీ (హి.స్త్రీ)గుడ్డిగవ్వ.

**جھنڈ** ఝుండ్ (హి.పు) గుంపు. మంద; తోపు,వనము; నిక్కపొడుచుకొనియుండు

వెంట్రుకలు.

**جھنڈا** ఝండా (హి. పు) ధ్వజము, టెక్కెము, పతాకము, జయంతము, చిహ్నము, అంకము.

**جھنڈولا** ఝండోలా (హి. పు) తలనిండ వెంట్రుకలుగలబిడ్డ; గుబురుగా వెంట్రుకలుగల వాడు, చిగురు జొంపముతో నున్న చెట్టు, గుబురుగానున్న చెట్టు.

**جھنڈی** ఝండీ (హి. స్త్రీ) చిన్న టెక్కెము.

**جھنک** ఝనక్ (హి. స్త్రీ) ఘల్లుఘల్లు, గణగణ, గలగల, కంయుకంయు, ఝుంకారము.

**جھنکار** ఝంకార్ (హి) ఝణత్కారము, ఖంగుమను లేక గల్లుమనుచప్పుడు, ఝణత్కారము.

**جھنکاو** ఝంకావ్ (హి. స్త్రీ) గలగల, గణగణ, ఘల్లుఘల్లుమనుట, టింగుటింగు. ఝణత్కారము. [ఖంగుమనుట.

**جھنکنا** ఝనక్నా (హి) ఘల్లుఘల్లుమనుట,

**جھنگار** ఝంగార్ (హి. స్త్రీ) అరుపు, కేక, కూత, కీచుబొబ్బ, ఝీంకారము. [నరకము.

**جہنم** జహన్నమ్ (అ. పు) అంధకూపము,

**جہنمی** జహన్నమీ (అ) నరకవాసి, నరకసం॥

**جھوت** ఝోత్ (హి) ఒరసందు, రెండుగోడలనడిమిచోటు.

**جھوٹھ-جھوٹ** ఝూట్-ఝూఠ్ (హి. పు) అసత్యము, కల్ల; ఎంగిలి; మోసము.

**جھوٹھ موٹھ-جھوٹ موٹ** ఝూట్ మూట్ (హి) ఊరిక, ఎగతాళికి; నిరర్థకముగా.

**جھوٹت-جھوٹن-جھونٹن** ఝూటన్-ఝూంటన్ (హి. స్త్రీ) ఎంగిలి, భుక్తశేషము.

**جھوٹا** ఝూటా (హి) కల్లరి, అబద్ధికుడు, నిజము కాని, కల్లయైన, కృత్రిమమైన, మోసమైన.

**جھوٹا-جھونٹا** ఝోటా-ఝోంటా (హి. పు) ఊపు, పొడుగు వెంట్రుకలు.

**جھوجھرا** ఝోఝ్రా (హి) పగిలిన, బోలు.

**جھورنا** ఝోర్నా (హి) పండ్లుదులుపుట లేక రాల్చుట.

**جھوڑ** ఝోడ్ (హి. స్త్రీ) జగడము, వివాదము.

**جھوک** ఝోక్ (హి. స్త్రీ) వంపు, వాలు, తూగు, కూయుకు; మొగ్గు, బరువు, తూలిక; దొబ్బు పెట్టు, పోటు; ఆదురు; విసురుడు; సారాయి పొంగు.

**جھوکا** ఝోకా (హి. పు) గాలివడిలేక దెబ్బ లేక విసరుడు; కూరుకు. తూగు; ఊపు, విసరుడు.

**جھوکنا** ఝోక్నా (హి) పారవేయుట, రువ్వుట, విసరుట, వేయుట, పడవేయుట; మంటచేయుట; పడపోయుట; పాడుచేయుట.

**جھول** ఝోల్ (హి. పు) ముడత, మడత, వదలు; బంగారు మొ॥ వానినీరుపోయుట; పీనుగుయొక్క వంకరనడక, మాంసపు ద్రావకము ఒక కానుపు. [లపై వేయుబట్ట.

**جھول** ఝూల్ (హి) అశ్వకంబళము, పశువు

**جھولا** ఝోలా (హి. పు) సంచి, తిత్తి, జోలె, అడపము; వదలైన; పక్షవాతము; వెచ్చని గాలి.

**جھولا** ఝూలా (హి. పు) ఉయ్యాల, ఉయ్యాలత్రాడు.

**جھولنا** ఝూల్నా (హి) ఊగుట; వ్రేలాడుట, అల్లాడుట; జాగు చేయుట; పడియుండుట.

**جھولنا** ఝోల్నా (హి. పు) సంచి, తిత్తి, అడపము.

**جھولی** ఝోలీ (హి. స్త్రీ) జోలె, తిత్తి.

**جھومر** ఝూమర్ (హి. పు) గుంపు, తిలకము, బొట్టు (భూషణము)

**جھومکا-جھومکی** ఝూమ్కా-ఝూమ్కీ (హి. పు) (హి స్త్రీ) చూడు. **جھمکا**

**جھومنا** ఝూమ్నా (హి) వ్రేలాడుట, ఊగులాడుట, తూగుట, కునుకుట, కూడుట.

**جھونا** ఝూనా (హి. పు) ఒకవలిపెము.

جھونا झोना ఝోనా (హి) ఆరంభించుట; కొట్టుట.

جھونپا झोंपा ఝోంపా (హి) పండ్లకత్తి.

جھونپڑا झोंपड़ा ఝోంప్డా (హి.పు) గుడిసె, కుటీరము. [గుడిసె.

جھونپڑی झोंपड़ी ఝోంప్డీ (హి.స్త్రీ) చిన్న

جھونٹا झोंटा ఝోంటా (హి.పు) ఉయ్యాలఊపు, బక్కైదూడ, ఆడువారిసిగముడి.

جھونج झोंज ఝోంజ్ (హి.స్త్రీ) గజ్జి; రుచి; పక్షిగూడు. [ముంగోపము.

جھونجل झुंजल ఝూంజల్ (హి.స్త్రీ) విసుకు,

جھونڈی झुंडी ఝూండీ (హి) గడ్డిగుబురు, (ఒకచోటకట్టుగానున్నది)

جھونک झोंक ఝోంక్ (హి) చూడు. جھوک

جھونکا झोंका ఝోంకా (హి.పు) చూడు. جھوکا

جھونکنا झोंकना ఝోంక్నా (హి) చూడు جھوکنا

جھونکنا झोंकना ఝోంక్నా (హి) పశువులుకుమ్ముట, కుమ్మవచ్చుట.

جھیپنا झेपना ఝేప్నా (హి) బిడియపడుట, సిగ్గుపడుట, కినుమరుగగుట.

جھیرا झेरा ఝేరా (హి.పు) భావి, గుంట, గొయ్యి, బుగ్గ, చెలమ, ఏరుమొ॥ వానియుత్పత్తిస్థానము.

جہیز जहेज़ జహేజ్ (అ.పు) ఓలి, అరణము, సామగ్రి.

جھیل झील ఝీల్ (హి.స్త్రీ) కొలను, చెరువు, ఉబ్బలి, బురదనేల; పల్లపుభూమి.

جھیلنا झेलना ఝేల్నా (హి) సహించుట, ఓర్చుట, అనుభవించుట.

جھینکنا झींकना ఝీంక్నా (హి) మూలుగుట, ఏడ్చుట, గోడాడుట, అంగలార్చుట, వ్యసనపడుట.

جھینگا झींगा ఝీంగా (హి.స్త్రీ) రొయ్యచేప.

جھینگر झींगुर ఝీంగుర్ (హి.పు) చిమ్మటపురుగు, కీచురాలు, ఇలకోడి, బొద్దెంక.

جَے जय జయ్ (హి) జయఘోషము, స్తోత్రము; జయము, గెలుపు.

جی जी జీ (హి) గౌరవార్థకము, అయ్యా, స్వామీ, పంతులుగారు; ఓయి; అవును; చిత్తము, మంచిది, సరియే.

جَئی जई జై (హి.స్త్రీ) చిట్టిరువలు.

جی जी జీ (హి.పు) మనస్సు, చిత్తము; జీవము; ప్రాణము; హృదయము; ప్రాణి, జంతువు: ఆత్మ బుద్ధి; సాహసము, ధైర్యము; సామర్థ్యము; శక్తి, త్రాణ, స్వభావము, ప్రకృతి; ఇచ్ఛ, అపేక్ష, కోరిక; ప్రేమ, ఇష్టము.

جی اکتانا जी उकताना —ఉక్తానా (హి) రోతబుట్టుట. جی برا کرنا जी बुरा करना —బురాకర్నా (హి) ఓకరించుట, వాంతిచేయుట.

جی بھر آنا जी भर आना —భర్ఆనా (హి) వ్యసనము వచ్చుట. جی بھرنا जी भरना —భర్నా (హి) రోయుట, విసుకుట, విముఖుడగుట.

جی بہلانا जी बहलाना —బహలానా (హి) మనస్సు ఉల్లాసపరచుట. جی پر کھیلنا जी पर खेलना —పర్ఖేల్నా (హి) సాహసించుట جی چلانا जी चलाना —చలానా (హి) సాహసించుట. جی جلنا जी जलना —జల్నా (హి) దుఃఖపడుట, ఖేదపడుట, మనమెరియుట جی چاہنا जी चाहना —చాహ్నా (హి) మనసుకువచ్చుట جی چرانا जी चुराना —చురానా (హి) తప్పించుకొనుట جی چھوٹنا जी छूटना —ఛూట్నా (హి) నిరాశచెందుట; అధైర్యపడుట. جی دار जी दार —దార్ (హి) ధైర్యశాలి.

جی ڈالنا जी डालना —డాల్నా (హి) బ్రతికించుట.

جی سے مارنا. جی لینا जी से मारना —సేమార్నా—లేనా (హి) చంపుట, ప్రాణముతీయుట.

جی کانپنا. دھڑکانا जी कांपना —కాంప్నా—ధడ్కానా (హి) గుండెలుకొట్టుకొనుట, దడపుట్టుట. جی کرنا जी करना —కర్నా (హి) ఇచ్ఛించుట, కోరుట. جی لگانا जी लगाना —లగానా (హి) మోహించుట, శ్రద్ధచేయుట, جی لگنا जी लगना —లగ్నా (హి) ఇష్టపడుట, వలపుగొనుట.

(ఈ)చబుకుచేయుట, చబుకులో కొట్టుట.

چابنا చాబ్నా (హి) నములుట, కొరుకుట.

چابی చాబీ (హి.స్త్రీ) తాళపుచెవి.

چاپ చాప్ (హి.స్త్రీ) చాపము, ధనుస్సు, విల్లు. (తవుడు.

چاپٹ చాపట్ (హి.స్త్రీ) సన్నపొట్టు,

چاپڑ చాపడ్ (హి.స్త్రీ) గట్టిభూమి.

چاپلوس చాప్లూస్ (పా. ) ముఖస్తోత్రము చేయువాడు, ఇచ్ఛకములాడువాడు, ఇచ్ఛకాలమారి.

چاپلوسی చాప్లూసీ (పా.స్త్రీ) ఇచ్ఛకములు, ముఖస్తోత్రము. (నేర్పరి, టక్కరి.

چاتر చాతుర్ (హి.పు) చతురుడు, జాణ.

چاتک చాతక్ (హి.పు) చాతకపక్షి, వానకోయిల.

چاٹ చాట్ (హి.స్త్రీ) రుచి; ఆశ, కోరిక; అలవాటు.

چاٹنا చాట్నా (హి) నాకుట, గతుకుట.

چاٹی చాటీ (హి.స్త్రీ) మంథని, మజ్జిగ (చిలుకు)కుండ.

چاچا చాచా (హి.పు) పినతండ్రి, పెత్తండ్రి.

چاچر చాచర్ (హి.పు) హోళీపాట.

چاچی చాచీ (హి.స్త్రీ) పినతండ్రి లేక పెత్తండ్రిభార్య.

چادر చాదర్ (హి.స్త్రీ) పచ్చడము, దుప్పటి; రేకు, సెలయేరు, ప్రవాహము; అలుగు, మత్తడి.

چار చార్ (హి) నాలుగు. چارآدمی —ఆద్మీ (హి) నలుగురు, లోకులు.
چارانگل —అంగుల్ (హి) బెత్తెడు.
چارآئینہ —ఆయీనా (పా) యుద్ధకవచము. چاربالش —బాలిష్ (పా) సింహాసనము, మంచము. چارپایہ —పాయ (పా) చతుష్పాత్తు. چارپائی —పాయీ (హి) మంచము. چارجامہ —జామ (పా) పల్లము, అశ్వకంబళము. چارچشم —చష్మ్ (పా) సంఘర్షణము, భేటి. چارخانہ —ఖాన (పా) పట్టెచీర, ముగ్గుల. چاردن کی چاندنی —దిన్ కీ చాంద్నీ (హి) మూన్నాళ్ళముత్తైదువతనము, భంగురము. چاردیواری —దీవారీ (హి) ఆవరణము, ప్రాకారము. چارزانو —జానూ (హి) చకిలముకిలము. چارکونی —కోనీ (హి) చతురము, నాలుగుమూలల. چارکھونٹ —ఖూంట్ (హి) ప్రపంచమంతయు.
چاروں شانے چت پڑنا —చారోఁ శానే చిత్ పడ్నా (హి) వెల్లవెలికిలపడుట.

چارا చారా (హి.పు) పశువులమేత.

چارده చార్‌దహ్ (పా) పదునాలుగు.

چارناچار చార్‌నాచార్ (పా) అనివార్యముగా, నిరుపాయముగా, బలవంతముగా, నిర్బంధముగా. విధిలేక.

چاره చార (పా.పు) చికిత్స, ఉపాయము, ఉపచారము, సహాయము, పరిహారము, పశువులమేత. چاره جوئی —జోయీ (పా) పరిహారప్రార్థన, ఉపాయాన్వేషణము, నివారణకోరుట, మొర.

چاشت చాష్త్ (పా) పూర్వాహ్ణము, ప్రొద్దుటిపూట, ప్రొద్దుటిభోజనము, చద్దితినుట, జాముప్రొద్దెక్కినకాలము.

چاشنی చాష్నీ (పా.స్త్రీ) రుచి, కమ్మదనము, పాకము, తీపిపులుసుకలిసినరుచి, పచ్చు, మాదిరి, బంగారు పెంకా వానికన్న లేకపచ్చు; పెద్దబాణలి.

چاق چوبند చాక్ చౌబంద్ (తు) ఆరోగ్యమైన, పుష్టిగల, చురుకైన.

چاقو చాకూ (పా.పు) చురకత్తి, పేనాకత్తి, చిన్న

కత్తి,సురియ.

**چاک** చాక్ (పా.పు) చినుగు,చీరిక,కోత, చినిగిన, చీలిన, అంగీయొక్క జీరాడుభాగము,(వేలాడుఅంచు,పగులు,బీటు.

**چاک کرنا**-కర్నా (ఉ) చించుట, చీరుట;చీల్చుట,కోయుట. (రక;బావిబర.

**چاک** చాక్ (హి.పు) కుమ్మరసారె, బావిగి

**چاک** చాక్ (ఇం.పు) సీమసున్నము.

**چاکر** చాకర్ (పా.పు) సేవకుడు, బంటు,పనివాడు,బంటుబంటు.

**چاکری** చాక్రీ(పా.స్త్రీ) సేవ,కొలువు పని.

**چاکسو** చాక్సూ (పా.పు) ఒకవిధమైన కనకటిబిత్తులు.

**چال** చాల్ (హి.స్త్రీ) వర్తనము, నడవడిక, వాడుక,వైఖరి,రీతి;హావభావములు, చలనము, నడక,గతి,స్వభావము,యుక్తి,టక్కు,మోసము. **چال باز**-చాల్బాజ్ (ఉ) టక్కరి.

**چال چلن**-చాల్చలన్ (హి) వర్తనము, నడవడిక. **چال ڈھال**-చాల్ఢాల్ (హి) వర్తనము,పనితనము,రీతి,వైఖరి.

**چالا** చాలా (హి.పు) నిర్గమనము,తల్లిగట్టు-పుట్టింటికిపోవుట.సుముహూర్తము.

**چالاک** చాలాక్ (పా) చురుకుగల, తెలివిగల,నేర్పరి,జాణమైన,ఉటంకితమైన,టక్కులమారి,యుక్తిమంతుడు,నిపుణతగల.

**چالاک دست**-దస్త్ (పా) చేయితిరిగిన,నిపుణతగల.

**چالاکی** చాలాకీ (పా.స్త్రీ) చురుకుదనము, నిపుణత, నేర్పు, యుక్తి,టక్కు.

**چالان** చాలాన్ (హి.పు) ఉల్లాకు, సరకుల పట్టీ;చెల్లుచీటి; సెలవుచీటి, అప్పగింత-అర్పనము చేయుట

**چالنا** చాల్నా (హి) జల్లించుట,సేయుట.

**چالیا** చాల్యా (హి.పు)టక్కరి.మోసగాడు, జాణ,యుక్తిమంతుడు.

**چالیس** చాలీస్ (హి)నలువది.[రెండినములు.

**چالیسا** చాలీసా (హి.పు) మండలము,

**چام** చామ్ (హి.పు) చర్మము,తోలు.

**چام چور**-చోర్ (హి) రంకువాడు.

**چام کے دام چلانا**-కేదామ్చలానా(హి) తోలునాణెములుచెల్లించుట,మితిమీరి,అధికారముచెల్లించుట, బలాత్కారపు ప్రభుత్వము. (విల్లు,చాపము.

**چانپ** చాంప్ (హి.స్త్రీ) తుపాకీగుఱ్ఱము,

**چانٹا** చాంటా (హి.పు) చరపు,దెబ్బ,వ్రేటు.

**چاند** చాంద్ (హి.పు) చంద్రుడు, మాడుపట్టు,కురిపట్టు,గాలుపైనెనుపరేకు; కిరీటము; నెల; నెలయొక్క కనపడినదినము, ఒకఘాణము. (నిపరుపుచీర,ఒక తెల్లనిపువ్వు.

**چاندنی** చాంద్నీ(హి.స్త్రీ) వెన్నెల;తెల్ల

**چاندنی چوک**-చౌక్(హి)రాజవీధి, అంగడివీధి;పచారము **چاندنی رات**-రాత్ (హి) వెన్నెలరేయి.

**چاندہ** చాంద (హి.పు) అర్ధవస్తులము,కొలతలలోనుపయోగించునొక యుపకరణము.

**چاندی** చాందీ(హి.స్త్రీ) వెండి,ధనము,ధాన్యము,కల్యాణము,సంపద.

**چانگلا** చాంగ్లా (హి)పుష్టిగల, బలిష్ఠమైన, ఆరోగ్యముగల;చురుకుగల.

**چانول.چاول** చాంవల్-చావల్ (హి.పు)బియ్యము,రతిలోఎనిమిదవభాగము(తూనిక)

**چاو** చావ్ (హి.పు) ఆశ,ఆతురము,అపేక్ష, ఉత్సాహము;ముద్దు.**چاو چوچلا**-చోచ్లా (హి) ముద్దులాట,లాలనము.

**چاہ** చాహ్ (హి.స్త్రీ) ఇచ్ఛ,అపేక్ష,ప్రేమము,ముద్దు,అగత్యము,అక్కర,అవశ్యము.

**چاہ ہونا** -హోనా(హి)అక్కరయుండుట.

**چاہ** చాహ్ (పా.పు) నూయి,బావి,గోయి

چپڑ کھنڈی చపడ్ ఖండీ (హి.స్త్రీ) అంగడితొత్తు, లంజె.

چپڑنا చపడ్నా (హి) చమురుటు, చమురుపోయుట, మెరుగు (నూనె) పూయుట, ఇచ్చకములాడుట.

چپڑی చుప్డీ (హి) చమురుపూసిన, జిడ్డైన, ఇచ్చకములమాట. چپڑی بات —బాత్ (హి.స్త్రీ) ఇచ్చకపుమాట, ఇచ్చకాలు.

چپقلش చప్కలష్ (తు.స్త్రీ) సమ్మర్దనము, ఇరుకు, ఒత్తిడి; జగడము; తారుమారు; గుంపు.

چپک చప్పక్ (హి.స్త్రీ) ఆసకప్పెరగాడు, (పిట్ట). [కుచ్చు, నిమ్మళమైన; టక్కరి.

چپکا చుప్కా (హి) మౌనముగానున్న, ఊరక

چپکانا చిప్కానా (హి) అంటించుట, అతికించుట; పనిపెట్టుట; అణచుట; ఒత్తుట.

چپکن చప్కన్ (హి.స్త్రీ) ఒకవొక్కాయ (సేవకులది).

چپکنا చిపక్నా (హి) అంటుకొనుట, అతుకుట, అణగుట, తగులుకొనుట.

چپکی చుప్కీ (హి.స్త్రీ) మౌనము, నిశ్శబ్దము; సిగ్గుపాటు; ముడుకుదనము.

چپنا చప్నా (హి) ఊరకుండుట, సిగ్గుపడుట, ఒడియుపడుట, నలుకుట, నక్కుట, ఒదుగుట. [మోకాటిచిప్ప.

چپنی చప్నీ (హి.స్త్రీ) మూత, మూకుడు,

چپو చప్పూ (హి.పు) తెడ్డు, నౌకాదండము.

چپوتی చపోటీ (హి.స్త్రీ) టెంకి, పాతకుళ్లాయి.

چپی చిప్పీ (హి.స్త్రీ) అతుకు, మాసిక.

چپی చప్పీ (హి.స్త్రీ) అంగమర్దనము, కాళ్లుపిసుకుట. మొ॥

چپیٹ చపేట్ (హి.స్త్రీ) చపేటము, చరుపు, చరము, దెబ్బ, పెట్టు; కష్టము, నష్టము, (వేళ్లుచాచినఅరచేయి. [జారజుడు.

چپیٹا చపేటా (హి.పు) చఱపు, దెబ్బ,

چپیٹنا చపేట్నా (హి) చూడు. چپکانا

چت చిత్ (హి) వెలికిల. چت کرنا —కర్నా (హి) వెలికిలించుట, వెలికిలపడద్రోయుట; ఓడించుట, (హి.స్త్రీ) చిత్తము, తలంపు.

چتا చితా (హి.పు) చిత (కాష్ఠము) కుప్ప.

چتانا చితానా (హి) జ్ఞాపకముచేయుట.

چتر చతుర్ (హి) చతురతగల, చాతుర్యముగల; నాలుగు. [ర్యము.

چترائی చతురాయీ (హి.స్త్రీ) చాతు

چتکبرا చిత్కబ్రా (హి) కర్బురము, చిత్రమైన, నానావర్ణమైన, మచ్చలుగల, నీలశ్వేతమైన. [లుగల.

چتلا చిత్లా (హి) చుక్కలుగల, మచ్చ

چتون చిత్వన్ (హి.స్త్రీ) దృష్టి, చూపు

چتهاڑنا చిథాడ్నా (హి) చించుట, చీల్చుట, పీలికలుచేయుట, తుత్తునియలుచేయుట; తిట్టుట; జిలుగుగాగీకుట.

چتهڑا చిథ్డా (హి.పు) పీలిక, చింపు.

چتهڑیا చిథడియా (హి) చింకి, చీలికలైన, జీర్ణమైన, పీలికలైన. [బండి, విదూషకుడు.

چتهل చుథల్ (హి) పరిహాసకుడు, నవ్వులప

چتی చిత్తీ (హి.స్త్రీ) చురక, మచ్చ, చుక్క; ఒకసాము. [చింపు.

چٹ చిట్ (హి.స్త్రీ) చీటి; పీలిక, చీలిక,

چٹ చట్ (హి) చప్పున, వెంటనే, తక్షణమే. چٹ پٹ چٹ—పట్ (హి) చెరచెర, దబదబ, బడబడ, వడిగా, త్వరగా, బిరాన, చెకచెక, బిరబిర, చిటచిట (చప్పుడు).

چٹ کرنا —కర్నా (హి) తినివేయుట

కాజేయుట. [నాణెము,రూప్యము.

چٹا చిట్టా (హి) తెల్లని,శుభ్రమైన; వెండి

چٹاپٹی చటాపటీ (హి.పు) చెటచెట,బదబద,త్వర,వేగము;వెళవెళ, వెంటవెంట, చిటచిట;మారకము, (చచ్చుట) ;చిత్రవిచిత్రమైన,నానావర్ణమైన.

چٹاچٹ చటాచట్ (హి.పు) చిటచిట; చెటచెటచప్పుడు,వ్రేళ్లు విరిచినచప్పుడు,చెటికలువిరిచినచప్పుడు.

چٹاک-چٹاکا-چٹاخ-چٹاخا చటాక్-చటాఖ్-చటాఖా-చటాకా (హి.పు) పెళ్లు, పెళపెళ, చిటచిట, చెటచెట,చటుక్కు,చటాలు,చప్పుడు.

چٹان చటాన్ (హి.పు)చాపరాయి;పరుపుబండ;బండభూమి, రాతి నేల.

چٹانا చటానా (హి) నాకించుట;లంచమిచ్చుట;వ్రయము చేయుట, పంచిపెట్టుట.

چٹائی చటాయీ (హి.స్త్రీ) చాప, చిరిచాప. [వెచ్చము,చిల్లరవ్రయము.

چٹ پٹ చట్ పట్ (హి.స్త్రీ) చిల్లర

چٹپٹا చట్ పటా (హి) ఉప్పుకారముచక్కగాపడిన,రుచిగల,చురుకుగల.

چٹپٹانا చట్ పటానా (హి) కలతనొందుట,చిడిముడిపడుట,వ్యాకులత నొందుట, కలవరపడుట; తటతటలాడుట.

چٹخارا చట్ ఖారా (హి) లొటుక, లొట్టు,రుచిమాచుటలో చేయునాలికచప్పుడు.

چٹخارنا-چٹکارنا చట్ ఖా (కా)ర్నా (హి) చిటుకరించుట,చటాలుమనిపించుట.

چٹخنا చటఖ్నా (హి) చిటపటలాడుట; చిట్లుట; చటాలుమనుట, చిటుక్కుమనుట.

چٹک చటక్ (హి.స్త్రీ) చిటుక్కు, పెళ్లు; తెలివి, మెరుపు, తళుకు, కాంతి, బెళుకు, సింగారము; త్వర, చురుకు. [దప్పి.

چٹکا చట్ కా (హి.పు) రుచి, కమ్మదనము;

چٹکا చుట్కా (హి.పు) పిడికెడు,కొంచెము, చిటికెడు.

چٹکارا చిట్ కారా (హి.పు) చూడు چٹخارا

چٹکارنا చట్ కార్నా (హి) నోటిచప్పుడుతో పశువులను తోలుట.

چٹکانا చట్కానా (హి) చిటకరించుట, చటాలుమనిపించుట.

چٹکلا చుట్ కులా (హి.పు) సరసవచనము, చమత్కారపుమాట,సరసము: స్వల్పము, అమోఘమైనమందు; చిన్న తోయము.

چٹکنا చటక్నా (హి) చిట్లుట,పగులుట, చీలుట, చటాలుతెకచిటుక్కుమనుట,బెడియుట;రంగుపోవుట; వెలవెలపోవుట.

چٹکنا చుటక్నా (హి) తుంచుట, కోయుట;కాటువేయుట,కరచుట.

چٹکنی చట్ కనీ(హి.స్త్రీ)తలుపుగడియ.

چٹکی చుట్ కీ (హి. స్త్రీ) పిడికెడు; చిటికెడు;చిటుక;గిల్లుట; కాలివ్రేలిపిల్లాణి.

چٹکی بھرنا -భర్నా (హి) గిల్లుట;దెప్పుట.

چٹکیلا చట్ కీలా (హి) కారమైన,రుచికరమైన-ప్రకాశమానమైన, మెరయు.

چٹلا చుట్ లా (హి.పు) సవరము, కొప్పు, జడకొల్లె.

چٹنی చట్నీ (హి.స్త్రీ) ఉపదంశనము,పచ్చడి,తొక్కు,వ్యంజనము, నంజుకొనునది.

چٹور-چٹورا చటోర్ - చటోరా(హి. పు) రుచులకోరువాడు,రుచులమారి, తిండిపోతు.

چٹھا చిట్ఠా (హి.పు) దినచర్యపుస్తకము

వహీ,కరుడు,కవిలియ,కవిలె;పట్టి, లెక్కల పుస్తకము.

چٹھا చట్ఠా (హి.పు) రక్తదోషమువలనగలిగినపొడలేకమచ్చ.

چٹھی చిట్ఠీ (హి.స్త్రీ) పత్రిక,చీటి,జాబు.

چٹی చట్టీ (హి.స్త్రీ) నష్టము,దండుగ; సుంకము,వ్రయము. [జుట్టు.

چٹیا చుటియా (హి.స్త్రీ) చూడ, మాడు

چٹیا చటియా (హి.పు) దొంగలపెద్ద.

چٹیانا చుటియానా (హి) గాయముచేయుట,కొట్టుట,కాటువేయుట.

چٹیل-چٹیلا చుటీల్-చుటీలా (హి) గాయపడిన,దెబ్బతగిలిన.

چٹیل చటియల్ (హి) చదునైన,బల్లపరపుగానున్న,బయలైన, ఎడారిగానున్న,బట్టబయలుగానున్న.

چٹیلنا చుటీల్నా (హి) గాయముచేయుట, కాటువేయుట,కొట్టుట.

چچا చచా (హి.పు) చూడు. چاچا అను పదము. بنانا چچا—బనానా(హి) శిక్షించుట,దండించుట,చిక్కుపరచుట.

چچانا చచానా (చచ్చానా)(హి)కారుట,చెమర్చుట,తడియుట.

چچڑی చిచ్‌డీ(హి.స్త్రీ)గోంజు,పిడుసు.

چچکارنا చుచ్‌కార్నా (హి) బుజ్జగించుట,లాలించుట,ముద్దాడుట.

چچنڈا-چچیندا చిచిండా- చిచేండా (హి.పు)కూరగాయలభేదము (పొట్లకాయ).

چچوڑنا చచోడ్నా (హి) పీల్చుట,పిసుకుట,త్రాగుట.

چچہانا చహ్‌చహానా (హి)కిచకిచలాడుట,కీచుకీచులాడుట, (పక్షులు)

چچی చచీ (హి.స్త్రీ) చూడు. چاچی

چچیانا చిచియానా (హి)కీచుమనుట, అరచుట,కిచకిచలాడుట.

چچیرا చచేరా (హి) పినతండ్రికి పెత్తండ్రికి పుట్టిన.

چخ చఖ్ (పా.స్త్రీ)జగడము,వాదము, అల్లరి,పదరు,జొల్లి. [రాటము.

چخاچخی చఖాచఖీ (పా.స్త్రీ) పో

چخے చఖే (పా) పోపో,వెళ్లిపో,ఛీపో.

چدر-چدریا చద్దర్-చదర్‌యా(హి.స్త్రీ) రేకు,పచ్చడము,చూడు. چادر

چدر نچوڑ —నిచోడ్ (హి) బట్టలతడుపుకువాన.

چڈا చడ్డా (హి.పు) గజ్జ,గ్రామీణుడు, మోటువాడు,హాస్యగాడు.

چدو చుద్దూ(హి.స్త్రీ) తొత్తు, లంజె.

چڈی చడీ (హి.స్త్రీ) వీపువైపెక్కుట.

چر చర్ (హి.స్త్రీ)చట్టు,పట్టు,బట్టచించుచప్పుడు; ఇసుకదిన్నె, ఒండు.

چراغ చరాగ్ (పా.పు) ప్రమిద, దీపము సంతానము, వెలుతురు, چراغدان—దాన్ (పా.పు) దీపస్తంభము.

چراغ بڑھانا-بجھانا-ٹھنڈا کرنا —బఢానా, బుఝానా, ఠండాకర్నా (హి) దీపముపెద్దదిచేయుట, చల్లార్చుట లేక తీయుట بے چراغ బే-(పా)చీకటైన, దీపములేని, పాడుపడిన.

چراغی చరాగీ (పా.స్త్రీ) దేవాలయాదులలో దీపముపెట్టుటకైయిచ్చు ద్రవ్యములేక మాన్యము.

چراگاہ చరాగాహ్ (పా.స్త్రీ) పచ్చికబయలు,పసరికబయలు,కంచె,అడవి,మేతపొలము.

**چرانا** చరానా (హి) మేపుట, కాయుట; వేఱడించుట, టక్కు చేయుట.

**چرانا** చిరానా (హి) చీల్పించుట, చింపించుట, చీరించుట.

**چرانا** చురానా (హి) దొంగలించుట, అపహరించుట, టక్కు చేయుట.

**چرانا** చఱ్ఱానా (హి) సలుపుట, తీయుట, నొచ్చుట.

**چراند** చిరాండ్ (హి.స్త్రీ) కమురువాసన, గబ్బు.

**چراو** చిరావ్ (హి.పు) చినుగు, చీరిక, పగులు, బీట, చీల్చినపేడు.

**چراو** చరావ్ (హి.పు) పచ్చికనేల, మేతపొలము.

**چرائتہ-چرایتا** చరాయితా-చరాయిత (హి.పు) సిలాసత్తుకొయ్య(మందు).

**چرائی** చరాయీ (హి.స్త్రీ) పుల్లరి, మేతకూలి; మేపుట.

**چرب** చర్బ్ (పా) క్రొవ్విన, బలిసిన; జిడ్డుగల; చురుకైన. **چرب زبان** చర్బ్-జబాన్ (పా) నాలికచురుకైన, మాటకారియైన, మాటలనేర్పుగల, తియ్యనిమాటలాడువాడు.

**چربانک** చర్బాంక్ (హి) చురుకైన, జాణయైన, తెలివిగల, బిత్తరియైన, వగలాడియైన, కులుకులాడియైన, సాహసముగల, పోకిరి.

**چربرانا** చర్బరానా (హి) నేర్పుతో మాటలాడుట, తియ్యనిమాటలాడుట.

**چربی** చర్బీ (పా.స్త్రీ) క్రొవ్వు, చమురు.

**چرپرا** చర్పరా (హి) కారమైన, చురుకైన, తీక్ష్ణమైన, మంటపుట్టించు, ఉష్ణమైన, చిరచిరలాడెడు.

**چرپرانا** చర్పరానా (హి) మంటపుట్టుట, చిరచిరలాడుట, చురుకుపుట్టుట, సలుపుట.

**چرپراہٹ** చర్పరాహట్ (హి.స్త్రీ) మంట, సలుపు; కారము, చురుకు; చిరచిర.

**چرپوز** చర్పూజ్ (పా) దుర్బలమైన, పనికిమాలిన, తెలివిమాలిన.

**چرتر** చరిత్తర్ (హి.పు) చరిత్రము, వర్తనము, స్వభావము, కథ.

**چرتی** చర్తీ (హి.పు) ఉపవాసవ్రతముచేయనివాడు.

**چرچا** చర్చా (హి.పు) చర్చ, ప్రశంస, ప్రస్తావము; వదంతి, ప్రఖ్యాతి; వివాదము, ముచ్చట, ప్రసంగము.

**چرچر** చర్చర్ (హి.స్త్రీ) చెటచెట, చిఱచిఱ, కిట్టుకిట్టు, చిటచిట, చిట్టుబుట్టు.

**چرچرا** చుర్చురా (హి) కరకరలాడెడు, బొరుగుబొరుగులాడెడు.

**چرچرا** చర్చరా (హి) చూడు. چڑچڑا

**چرچرانا** చర్చరానా (హి) చిటచిటలాడుట, కిట్టుకిట్టుమనుట, చిరచిరలాడుట, సలుపుట, వదరుట.

**چرچراہٹ** చర్చరాహట్ (హి.స్త్రీ) చెటచెట, చిట్టుబుట్టు, కోపము, సలుపు, తీపు, మంట, చురుకు.

**چرخ** చర్ఖ్ (పా.పు) చక్రము; ఆకసము; తరిమెనదోడ్డి; గుమపోతు; ఒకజాతిడేగ; ప్రదక్షిణము, తిరుగుడు; భ్రమణము.

**چرخ کھانا** -ఖానా (హి) గిరగిరతిరుగుట.

**چرخہ-چرخا** చర్ఖా-చర్ఖ (హి.పు) రాట్నము; ముసలి; పనికిమాలిన; భ్రమరకము, రాసము.

బిడియము, సిగ్గు.

**حجام** హజ్జామ్ (అ.పు) మంగలవాడు, క్షౌరకుడు.

**حجامت** హజామత్ (అ. స్త్రీ) క్షౌరము, ముండనము, గొరుగుట, తలపని.

**حجامی** హజ్జామీ (అ.స్త్రీ) మంగలపని, మంగలవృత్తి.

**حجت** హుజ్జత్ (అ స్త్రీ) తర్కము, వాదము; పిడివాదము, వివాదము, వాగ్వివాదము, జగడము.

**حجتی** హుజ్జతీ (అ) వాదించువాడు, హఠవాది, పిడివాదము చేయువాడు; జగడగొండి.

**حجر** హజర్ (అ.పు) రాయి, శిల, **کالنقش فی الحجر** కల్ నక్ష్ ఫిల్ హజర్ (అ) శిలాక్షరము, శిలాశాసనము.

**حجره** హుజ్ర (అ.పు) అఱ, గది, ఏకాంతము.

**حجم** హజ్మ్ (అ.స్త్రీ) లావు, ఘనము; పరిమాణము.

**حد** హద్ద్ (అ.స్త్రీ) ఎల్ల, సీమ, మేర, మర్యాద. తుద, అంతు; మితము; ఆవరణము; నిర్వచనము.

**حدت** హిద్దత్ (అ.స్త్రీ) ఆవేశ, ఉద్రేకము, ఉగ్రము, వేగము, తీక్ష్ణత, ఆగ్రహము; వాడి, పదను, అతిశయము; ఆధిక్యము.

**حدود** హుదూద్ (అ.స్త్రీ) ఎల్లలు, సీమలు, మేరలు, **حدود اربعہ** — ఎ, అర్బఅ (అ) సీమాచతుష్టయము, నాలుగు దిక్కులఎల్లలు (చూడు ఎ.వ **حد**).

**حديث** హదీస్ (అ.స్త్రీ) జరిగినది, క్రొత్తసంశము, ప్రస్తావము, మాట, ఇతిహాసము, వృత్తాంతము, గాథ, కథ, చరిత్ర హజరత్ మహమ్మదుగారిచరిత్రము.

**حديقہ** హదీక (అ.పు) గృహారామము, ఇంటితోట.

**حذر** హజర్ (అ.పు) వర్జనము, త్యాగము మానుకొనుట, భయము, భీతి బుగులు.

**حذف** హజ్ఫ్ (అ పు) లోపము, లుప్తము జేయుట, వదలివేయుట.

**حرارت** హరారత్ (అ.స్త్రీ) ఉష్ణము, వేడిమి, కోపము, తాపము, పులకరము, జ్వరము; ఆవేశము, ఔత్సుక్యము, **حرارت دینی** — ఎ, దీనీ (అ) మతాభిమానము,మతావేశము **حرارت غریزی** — ఎ, గరీజీ (స్త్రీ) ప్రాణోష్ణము, ప్రాణము, ఆధారమైనఉష్ణము, చేతనము.

**حراست** హిరాసత్ (అ. స్త్రీ) ఆక్రమణము, స్వాధీనము, బందె, కాపు, చెర.

**حراج** హర్రాజ్ (అ.పు) అమ్మకపుపాట, అమ్మబాడుట, ఏలముపాట

**حراف** హర్రాఫ్ [అ] వ్యత్యయమైన, చురుకైన, జాణయైన, జిత్తులమారియైన.

**حرام** హరామ్ [అ] అశాస్త్రీయమైన, అక్రమమైన, నిషిద్ధము, త్యాజ్యము, అనుచితము, అపవిత్రము, దురాచారము; పవిత్రము, పావనము **حرام زاده** — జాద [పా] జారజుడు **حرام کاری** — కారీ [పా] రంకుతనము, వ్యభిచారము, **حرام کا مال** — కామాల్ [పు] అన్యాయార్జితవిత్తము, లంచము.

**حرامی** హరామీ [అ] దుర్మార్గుడు, **حرامی پلا** — పిల్లా [పు] జారజుడు.

**حرب** హర్బ్ [అ.పు] కలహము, పైబడుట, కవియుట; ఆయుధము, శస్త్రము.

حرج హరజ్ (అ.పు) ఇబ్బంది, ఇరుకు, నిర్బంధము; ఆలస్యము, అటంకము, లోపము, కష్టము, నష్టము, లోటు.

حرز హిర్జ్ (అ.పు) శరణము, రక్ష, తాయితు, యంత్రము.

حرص హిర్స్ (అ.స్త్రీ) అత్యాశ, లోభము, కాంక్ష, పేరాస, ఆశగొట్టుతనము.

حرف హర్ఫ్ (అ.పు) అక్షరము, మాట; అవ్యయము; ధార, అంచు; నింద, దోషము, లోపము, తప్పు حرف پکڑنا — పకడ్నా (ఉ) తప్పులుపట్టుట, حرف صحیح — ఎ, సహీహ్ (అ) హల్లు. వ్యంజనము, حرف علت — ఎ, ఇల్లత్ (అ) అచ్చు, స్వరము, حرف و حکایت — ఒ హికాయత్ (పు) మాటముచ్చటలు, ప్రసంగము, సంభాషణము, వ్యాఖ్యానము, حرفاً హర్ఫన్ (అ) అక్షరశః, అక్షరాక్షరము.

حرفت హిర్ఫత్ (అ స్త్రీ) కాయికము, వృత్తి, వ్యాపారము; పని, విద్య, పంచాణము

حرفہ హిర్ఫ (అ.పు) కాయికము వృత్తి, పని. విద్య. నేర్పు, పనితనము, యుక్తి, టక్కు, చాకచక్యము, పంచాణము

حرکات హర్కాత్ (అ స్త్రీ) చూడు, (ఏ వ. حرکت) حرکات ثلاثہ — ఎ. సలాస (అ) సంజ్ఞాత్రయము: ఆకార ఇకార ఉకారసంజ్ఞలు.

حرکت హర్కత్ (అ. స్త్రీ) చలనము, కదలిక, గతి, పని, చేత, కార్యము, స్వర చిహ్నము, నడవడిక, దుర్వర్తనము, చెడుపని.

حرم హరమ్ (అ స్త్రీ) అంతఃపురము, ఆవరణము, గర్భగృహ ; ఇల్లాలు, భార్య స్త్రీలు; లంజె, తొత్తు —حرم سرا — సరా, خانہ — ఖానా (పా) అంతఃరము, స్త్రీలుండుచోటు, రాణివాసము

حرمت హుర్మత్ (అ స్త్రీ) మానవ మర్యాద, గౌరవము, పెత్తనము, పవిత్రత; అపవిత్రత, నిషేధము, حرمت لینا — లేనా (ఉ) సిగ్గుదీయుట, అవమానించుట.

حروف హురూఫ్ (అ.పు) అక్షరములు వర్ణములు حرف هجا تهجى — తహజ్జీ (అ) అక్షరమాల; వర్ణమాల ఓనమాలు.

حریر హరీర్ (అ.పు) పట్టు, పట్టుబట్ట.

حریرہ హరీర (అ.పు) పాలునుపిండియు కలిపి చేసినచోష్యము, జావ.

حریری హరీరీ (అ) పట్టుతోనేసిన: పలచని, సన్నని.

حریص హరీస్ (అ.పు) లుబ్ధుడు, లోభి; దురాచారముగలవాడు

حریف హరీఫ్ (అ.పు) ప్రతిస్పర్థి, వైరి, పోటిగాడు, దాయ, విరోధి ప్రతిపక్షి.

حزن హుజ్న్ (అ.పు) దుఃఖము, చింత, వ్యసనము.

حزین హజీం (అ పు) దుఃఖితుడు, వ్యసనముగలవాడు.

حس హిస్స్ (అ. స్త్రీ) ఇంద్రియజ్ఞానము, విషయజ్ఞానము, తెలివి, చలనము.

حساب హిసాబ్ (అ.పు) లెక్క, గణనము, గణితము, ధరనియమము, సంఖ్య, حساب دان — దాం (పా) గణితశాస్త్రజ్ఞుడు, లెక్కవాడు, حساب کتاب — కితాబ్ (అ) లెక్కపత్రము.

حسابی హిసాబీ (అ) గణితసం॥. లెక్కవాడు, గణికుడు.

حسب హసబ్ (అ.పు) గణనము, లెక్క; వంశము, మాతృవంశపరంపర, حسب و نسب — ఒ నసబ్ (అ) మాతాపితరులవంశపరంపర, తల్లిదండ్రులవంశావళి.

حسب హస్బ్ (అ) అనుసారము, ప్రకారము حسب الحکم - ارشاد — ఉల్ హుక్మ్ - ఇర్శాద్ (అ) ఆజానుసారము حسب دلخواه — ఏ, దిల్ ఖాహ్ (పా) అభీష్టానుసారము, حسب ذیل — ఎ జైల్ (అ) ఉత్తరోక్తానుసారము, క్రిందవ్రాసినప్రకారము.

حسد హసద్ (అ.పు) మాత్సర్యము, అసూయ, ఓర్వలేమి, కడుపుమంట, పేరాస,

حسرت హస్రత్ (అ.పు) పశ్చాత్తాపము, అనుతాపము, వ్యసనము, కాంక్ష, ఆశ.

حسن హుస్న్ (అ.పు) అందము, సౌందర్యము, మంచితనము, యోగ్యత, ఉచితము, బాగు, మేలు, గుణము.

حسین హసీన్ (అ) అందమైన, బాగైన, సొగసైన, సుందరము.

حشاش హష్షాష్ (అ.పు) కూరగాయలమ్మువాడు, గడ్డికోయు లేక అమ్మువాడు.

حشاش بشاش హష్షాష్ బష్షాష్ (అ) పరమానందముగల, సంభ్రమముగల, పరమసంతోషముగల.

حشر హష్ర్ (అ.పు) ఉద్ధారము, ఉద్ధరణము, లేపుట, పుణ్యపాపముల విచారణ దినము, ప్రళయము, అంత్యదినము, తుది, అంతము. అల్లరి, లొల్లి, గంద్రగోళము, అల్లకల్లోలము, దొమ్మి.

حشرات హష్రాత్ (అ.పు) కీటకములు, పురుగులు, అల్లరి, కల్లోలములొల్లి, భయము, సంకటము حشرات العرض — ఉల్ అర్జ్ (అ) పిపీలకాదులు, పాములు తేళ్లుమొ॥.

حشم హష్మ్ (అ.పు) పరివారము, అనుచరులు, పరికరములు.

حشمت హష్మత్ (అ.స్త్రీ) పరివారము, పటాటోపము, వైభవము, సన్నాహము.

حشو హష్వ్ (అ.పు) చెత్తచెదారము, తుచ్ఛము, నీచులు.

حشیش హషీష్ (అ.స్త్రీ) భంగుఆకులు. ఎండినగడ్డిగాదము, ఆకుఅలము, ఓషధివిశేషము.

حصار హిసార్ (అ.పు) ప్రాకారము, ఆవరణము, కోట, ప్రహరి, చుట్టుకోట.

حصر హస్ర్ (అ.పు) ముట్టడి, చుట్టువేయుట.

حصول హుసూల్ (అ.పు) ప్రాప్తి, ఆదాయము, రాబడి, లాభము.

حصه హిస్స (అ.పు) భాగము, పాలు, మాధుకరము, కబళము, حصه دار — దార్ (పా పు) భాగస్వామి, పాలివాడు, భాగస్థుడు, حصه رسد - رسدی — రసద్, రసదీ (పా) అంశానుసారభాగము, భాగానుసారమైనది, ఉచితభాగము, తగినపాలు.

حصیر హసీర్ (అ,పు) చిరుచాప, చాప; లోభి, పిసినారి; కష్టసంచి.

حضرت హజ్రత్ (అ.పు) ఉండుట, ప్రత్యక్షము, సమక్షము, సముఖము; ఏలినవారు, ప్రభువు, దేవరవారు ఆచార్యుడు, అయ్యగారు, దొరగారు, పంతులు.

حضور హుజూర్ (అ పు) ఉండుట, ప్రత్యక్షము, సమక్షము, సముఖము, దివాణము, ఆస్థానము, ప్రభువు, మహారాజు, ఏలినవారు,

**حضوری** హుజూరీ (అ.పు) ఉండుట, రాక, ప్రత్యక్షము, సమక్షము; రాజసం||, ఆస్థానికమైన, సహచరుడు, పరిచారకుడు.

**حظ** హజ్జ్ (అ.పు) ఆనందము, సంతోషము, భాగ్యము, అదృష్టము, రుచి, సారస్యము.

**حفاظت** హిఫాజత్ (అ.స్త్రీ) సంరక్షణము, కాపుదల, కావలి, భద్రము, పదిలము.

**حفظ** హిఫ్జ్ (అ.పు) సంరక్షణము, కాపుదల, కంఠపాఠము, నోటిపాఠ, **حفظ کرنا** — కర్నా (ఉ) కంఠపాఠముజేయుట.

**حق** హక్క్ (అ.పు) బ్రహ్మము, ఈశ్వరుడు, తత్త్వము, సత్తు; సత్యము, నిజము, న్యాయము, యథార్థము, సరియైనది; అధికారము, స్వామ్యము, **حق پسند** — పసంద్ (పా) యథార్థప్రియుడు, **حق تلفی** — తల్ఫీ (అ) అన్యాయము, **حق دار** — దార్ (పా) అధికారి; స్వామ్యవంతుడు, న్యాయముగలవాడు, **حق شفع** — షఫ్ఆ (పు) పొరుగుననున్నందున వచ్చినయధికారము, పొరుగువారియధికారము, **حق ناحق** — నాహక్ (పా) న్యాయమైనను అన్యాయమైనను; అనివార్యముగా, నిర్బంధముగా.

**حقا** హక్కా (అ) దైవసాక్షిగా, సత్యముగా.

**حقارت** హిక్కారత్ (అ.స్త్రీ) తిరస్కారము, తృణీకారము, అలక్ష్యము, నిరసనము, అసహ్యము, **حقارت کی نظر سے دیکھنا** — కీనజర్ సెదేఖ్నా (ఉ) తిరస్కారదృష్టితో చూచుట, చిన్నచూపుచూచుట

**حقنہ** హుక్నా (అ.పు) చిన్నగొట్టము, వస్తికర్మ, ఆసనముద్వారా చొప్పించుగొట్టము.

**حقوق** హుకూక్ (అ.పు) అధికారములు, (ఏ.వ. حق).

**حقہ** హుక్కా (అ.పు) పెట్టె, సొమ్ములపెట్టె, గుడ్గుడి, చొంగ **حقہ پانی بند کرنا** — పానీబంద్ కర్నా (ఉ) బహిష్కారము పెట్టుట, వెలివేయుట, కులతప్పు పెట్టుట.

**حقیت** హక్కీయత్ (అ.స్త్రీ) స్వామ్యము, అధికారము.

**حقیر** హకీర్ (అ) అల్పము, స్వల్పము, నీచము, తుచ్ఛము, నికృష్టము, బక్కని, సన్నని.

**حقیقت** హకీకత్ (అ.స్త్రీ) యథార్థము, మూలము, నిజము; వర్తమానము వయినము, స్థితిగతులు, మూలము.

**حقیقی** హకీకీ (అ) యథార్థమైన, నిజమైన, సరియైన, మూలమైన; ఏకోదరులైన, ఒకేతల్లికడుపునపుట్టిన, **حقیقی بھائی** — భాయీ (ఉ) సోదరభ్రాత, సోదరుడు, (ఒక తల్లిపిల్లలు).

**حک** హక్క్ (అ.పు) రాయుట, గీరుట, రుద్దుట, గోకుట, గీకుట.

**حکام** హుక్కామ్ (అ.పు) అధికారులు, పాలకులు, (ఏ.వ. حاکم).

**حکایت** హికాయత్ (అ.స్త్రీ) ఇతిహాసము, గాథ, కథ, మాట, వచనము.

**حکم** హుక్మ్ (అ.పు) ఉత్తరువు, శాసనము. ఆజ్ఞ, సెలవు; నిర్బంధము, బలవంతము; ఫలితము; పాలనము, తీర్పు,

حکم رانی — రానీ (పా) ప్రభుత్వము, దొరతనము, పాలనము, అధికారము, حکم نامہ — నామ (పా) అధికారపత్రము, ఆజ్ఞాపత్రము.

حکمت హిక్మత్ (అ. స్త్రీ) తత్వజ్ఞానము, జ్ఞానము, ఎఱుక, తెలివి, బుద్ధి; నేర్పు, ఉపాయము, ప్రవీణత, యుక్తి, ధైర్యము, కుట్ర; వైద్యము, చికిత్స.

حکمتی హిక్మతీ (అ.పు) తత్వజ్ఞాని, నేర్పరి, నిపుణుడు, యుక్తిమంతుడు.

حکمی హుక్మీ (అ) విధియైన, తప్పని, అమోఘము; వశవర్తియైన, లోబడియున్న, విధేయమైన, ఆజ్ఞారూపమైన, ఆజ్ఞాప్రాయము.

حکومت హుకూమత్ (అ. స్త్రీ) అధికారము, పాలనము, దొరతనము; స్వాధీనము; బలవంతము. నిర్బంధము حکومت جتانا — జతానా (ఉ) అధికారము జూపుట, حکومت کرنا — కర్నా (ఉ) అధికారముచేయుట, అధికారము జెల్లించుట, పాలించుట, రాజ్యముజేయుట, దొరతనముజేయుట.

حکیم హకీమ్ (అ.పు) తత్వజ్ఞాని, వైద్యుడు.

حکیمی హకీమీ (అ. స్త్రీ) వైద్యసం॥, తత్వజ్ఞానసం॥, వైద్యము, చికిత్స

حل హల్ల్ (అ.పు) విడదీయుట, వేరుజేయుట, విప్పుట, పృథక్కరణము, చిక్కు విడదీయుట, మర్దనము, కరగుట, కలియుట; సులభముచేయుట, ప్రశ్నకుఉత్తరము తీయుట, లెక్క మొ॥చేయుట, తీరుమానముజేయుట, పరిష్కరించుట, విశదీకరించుట, لاحل లాహల్ (అ) విడదీయరాని, క్లిష్టము. దుస్సాధ్యము, అసాధ్యము,

حلال హలాల్ (అ) శాస్త్రీయమైన, పవిత్రము, అర్హము, యోగ్యము, తగిన, حلال کرنا — కర్నా (ఉ) పవిత్రముజేయుట, పశ్వాదుల వధించుట.

حلاوت హలావత్ (అ. స్త్రీ) తియ్యదనము, రుచి, కమ్మదనము; సుఖము, సౌఖ్యము.

حلف హల్ఫ్ (అ.పు) ప్రమాణము, ఒట్టు, సత్తెము, బాస, حلف نامہ — నామా (పా) ప్రమాణపత్రము, حلفاً — అన్ (అ) ప్రమాణపూర్వకముగా.

حلق హల్క్ (అ పు) గొంతుక, గొంతు, బొంగుర, గొంతుపీక, శ్వాసనాళము.

حلقہ హల్కా (అ.పు) వలయము, వృత్తము, మట్టు, గీఱ, ఆవరణము; ప్రాంతము; సమాజము. బాంధవ్యము; కడియము, ఉంగరము; గంధము, తూటు, حلقہ بگوش — బగోష్ (పా.పు) సేవకుడు, బానిస.

حلم హిల్మ్ (అ.పు) శాంతము, సహనము, క్షమ, నిమ్మళము, ఓర్పు, తాలిమి,

حلوا హల్వా (అ.పు) లేహ్యము మెత్తనిది, حلوا نکالنا — నికాల్నా (ఉ) మెత్తగా మొత్తుట; బాగాకష్టముజేయించుట.

حلوان హల్వాన్ (ఉ.పు) మేకపిల్ల, గొఱ్ఱెపిల్ల, మృదువైనమాంసము, రుచ్యము.

حلوائی హల్వాయీ (అ.పు) భక్ష్యకారుడు, అపూపికుడు, తినుబండము చేసి అమ్మువాడు.

حلواین హల్వాయిన్ (ఉ.స్త్రీ) భక్ష్యకారునిభార్య, అపూపికురాలు.

حلیم హలీమ్ (అ.పు) గంభీరుడు, సహనముగలవాడు, దయాళువు; మొహర్రము

వంటకము, (గోధుమలు సెనగపప్పు మాంసము పరిమళద్రవ్యములును కలిసినది).

**حمار** హిమార్ (అ.పు) పోతుగాడిద, ఖరము.

**حمار** హమ్మార్ (అ.పు) గాడిదను తోలువాడు.

**حماقت** హమాఖత్ (అ.స్త్రీ) బుద్ధిహీనత, తెలివిమాలినతనము.

**حمال** హమ్మాల్ (అ.పు) భారవాహకుడు, బరువుమోయువాడు, మోతకూలివాడు.

**حمام** హమ్మామ్ (అ.పు) స్నానము, స్నానవాటిక, నీళ్లసాల.

**حمامی** హమ్మామీ (అ.పు) నీళ్లవాడు, మంగలివాడు, స్నానముజేయించువాడు.

**حمایت** హిమాయత్ (అ.స్త్రీ) ఆశ్రయము, సహాయము, పక్షపాతము, ప్రోత్సాహము, తోడు, రక్షణము.

**حمایتی** హిమాయతీ (అ.పు) సహాయుడు, రక్షకుడు, పక్షపాతి, తోడు.

**حمائل** హమాయిల్ (అ.స్త్రీ) మెడలో సవ్యముగా వేసికొనుకత్తివారు, సవ్యముగా వేసికొనుపూలదండ మొ||, మెడలో వ్రేలాడకట్టుకొనుచిన్న కురానుషరీపు సంపుటము.

**حمد** హమ్ద్ (అ.స్త్రీ) భగవంతునిస్తోత్రము. స్తోత్రము, ప్రశంస, నుతి.

**حمق** హుమ్ఖ్ (అ.పు) బుద్ధిహీనత, తెలివిమాలినతనము, అజ్ఞానము, అవ్యక్తము.

**حمل** హమల్ (అ.పు) బరువు, భారము; గర్భము. మేషరాశి.

హమ (అ.పు) అభియోగము, దాడి, పైబడుట, ఎగబడుట, కవియుట, తలకొనుట.

**حمیت** హమియ్యత్ (పా.స్త్రీ) అభిమానము, మానము, సిగ్గు, కోపము, అసహ్యము.

**حمیده** హమీద, (అ) నుతము, ప్రశంసనీయము, శ్రేష్ఠము, ఉత్తమము.

**حنظل** హన్జల్ (అ.పు) వెఱ్ఱిపుచ్చ.

**حنفی** హనఫీ (అ) సత్యమైన, యథార్థమైన; ఒకతెగమహమ్మదీయులు.

**حوا** హవ్వా (అ.స్త్రీ) హజరతు ఆదముగారిభార్య, ఆదిపురుషునిభార్య, ఆదినారి, లోకమాత

**حواری** హవారీ (అ.పు) స్నేహితుడు, చెలికాడు, శిష్యుడు, భక్తుడు; చాకలివాడు.

**حواس** హవాస్ (అ.పు) ఇంద్రియములు, అంతఃకరణము, స్మృతి, తెలివి. స్మారకము, **حواس خمسه** — ఖంస (అ) పంచేంద్రియములు, జ్ఞానేంద్రియములు, **حواس باختہ ہونا** — బాఖ్తహోనా (ఉ) ఎటునుతోచనిస్థితిలోనుండుట, దిగ్భ్రమజెందుట, స్మృతితప్పుట, **حواس ٹھکانے ہونا** — ఠికానేహోనా (ఉ) స్మృతివచ్చుట, తెలివివచ్చుట, స్మారకమువచ్చుట, తెలివిలోనుండుట.

**حواصل** హవాసిల్ (అ.పు) చీకుబాతు, గూడకొంగ, గుడికొంగ.

**حوالات** హవాలాత్ (అ.స్త్రీ) బంది, నిర్బంధము, స్వాధీనము, చెఱ, అప్పగింత

**حوالدار** హవాల్దార్ (పా.పు) నాయకుడు, రక్షకుడు.

**حواله** హవాల (అ.పు) స్వాధీనము, అప్పగింత, ప్రమాణము; జోడ, సూచనము.

**حوالی** హవాలీ (అ.స్త్రీ) పరిసరప్రదేశము, చుట్టుప్రక్కలు, **حوالی موالی**

— మహాలీ (అ) తోడుక్కోడు.

**حوت** హూత్ (అ.స్త్రీ) పెద్దచేప; మీనరాశి.

**حور** హూర్ (అ.స్త్రీ) నల్లనివెండ్రుకలు కనుపాపలునుగల స్త్రీ, సుందరస్త్రీ, దేవాంగన, అచ్చర.

**حوصلہ** హౌస్లా (అ.పు) సామర్థ్యము, శక్తి త్రాణ, ధైర్యము, ఉత్సాహము, నాడెము, ఆయము, ఇచ్ఛ, ఆశయము.

**حوض** హౌజ్ (అ.పు) జలాశయము, తొట్టి, తొట్టికట్టు, దొరువు, కొలను, కోనేరు.

**حویلی** హవేలీ (పా.స్త్రీ) ప్రాకారము, నగరు; భవనము, పెద్దఇల్లు, అంతఃపుర స్త్రీ, ఇల్లాలు, అంతఃపురము.

**حیا** హయా (అ.స్త్రీ) సిగ్గు, లజ్జ, బిడియము, మానము, **حیادار** — దార్ (పా) మానవంతుడు, సిగ్గరి, అభిమానసుడు.

**حیات** హయాత్ (అ.స్త్రీ) జీవనము, ఆయుష్యము, బతుకు, ప్రాణము.

**حیثیت** హైసియత్ (అ స్త్రీ) సామర్థ్యము, శక్తి, త్రాణ; స్థితి, దశ, పదవి; ప్రవీణత నేర్పు; ఆస్తి, ఆదాయము; వైఖరి, తీవి, రీతి, ఆకారము.

**حیران** హైరాన్ (అ) దిగ్భ్రమజెందిన, ఉచ్చగొన్న, బన్నురిల్లిన, కష్టపడిన, కలతపడిన, కలవరపడిన; విసికిన, రోసిన, కళవళపడిన, కంగారుపడిన.

**حیرانی** హైరానీ (అ.స్త్రీ) కలవరము, బమ్మెర, ఉచ్చ, దిగ్భ్రమ; విసుకు, విసువు, రోత, కళవళము; కష్టము, దురవస్థకలత, వ్యాకులము, తబ్బిబ్బు, నివ్వెర.

**حیرت** హైరత్ (అ.స్త్రీ) అద్భుతము, ఆశ్చర్యము, అచ్చెరువు, ఉచ్చ, తబ్బిబ్బు. కలవరము, **حیرت زدہ** — జద (పా) అద్భుతపడిన, అచ్చెరువొందిన, కలవరపడిన, ఉచ్చగొన్న, దిగ్భ్రమజెందిన, నివ్వెరబోయిన.

**حیص بیص** హైస్ బైస్ (అ.స్త్రీ) వాదము-వివాదము, జగడము, పోట్లాట, అనుమానము, ఆటంకము, గందరగోళము.

**حیض** హైజ్ (అ.పు) ఆర్తవము, ఋతురక్తము, ముట్టు.

**حیض** హైజ్ (అ) ముట్టుకుంక, ముట్టుపుట్టువు, దుర్మార్గుడు, (ఒకతిట్టు).

**حیف** హైఫ్ (అ) ఆహా, అయ్యో, పరితాపము, పీడ, నిర్బంధము.

**حیلہ** హీల (అ.పు) మిష, నెపము, సాకు; టక్కు, మోసము; కొలువు, జీవనము.

**حیلہ باز - ساز** — బాజ్, సాజ్ (పా) టక్కరి, నెపగొండి, మోసగాడు.

**حیوان** హైవాన్ (అ.పు) ప్రాణి, జంతువు; మృగము, పశువు, బుద్ధిహీనుడు, **حیوان مطلق** — ఎ, ముత్లక్ (అ) పశువు, మృగము, **حیوان ناطق** — ఎ, నాతిక్ (అ) మానవుడు, మానిసి, మాటలాడగలప్రాణి.

**حیوانی** హైవానీ (అ) పశుసం॥, పశుప్రాయము.

**حیوانیت** హైవానియత్ (అ.స్త్రీ) పశుత్వము, ప్రశుప్రాయత, అజ్ఞానము, మూఢ్యము, మొద్దుతనము, సిగ్గుమాలినతనము.

## ( خ )

**خ** ఖే (అ.స్త్రీ) ఖకారము, ఇదిఉరదూ వర్ణమాలలో పదియవయక్షరము, అరబ్బీలో నేడవది, పారసీకభాషలో తొమ్మిదివ

ది, అరబ్బీలో ఏడవయక్షరము, అరబ్బీ వర్ణ సాంఖ్యము ( ابجد ) లో దీని సంఖ్య ఆరునూర్లు,

**خاتمہ** ఖాతిమ్ (అ-స్త్రీ) ముగించునది, తుద ముట్టించునది; (పు) తుద, అంతము.

**خاتم** ఖాతమ్ (అ. స్త్రీ) ముద్రటుంగరము, ఉంగరము, ముద్ర, అచ్చు.

**خاتمہ** ఖాతిమ (అ.పు) అంతము, తుద, ఉపసంహారము, సమాప్తి, సారాంశము.

**خاتون** ఖాతూన్ (తు-స్త్రీ) దొరసాని, యజమానురాలు, అమ్మగారు. గౌరవ నామము, కులీనురాలు.

**خادم** ఖాదిమ్ (అ-పు) పరిచారకుడు, సేవకుడు_బంటు_పూజారి_అర్చకుడు.

**خادمہ** ఖాదిమ (అ. స్త్రీ) సేవకురాలు, పనికత్తె.

**خار** ఖార్ (పా-పు) ముండ్లు, కంప, కోడి కాలిముల్లు. లేక ఆరెబొట్టె, మత్సరము, గడ్డపు వెంట్రుకలు-خارپشت-ఖా-పుష్త్ (పు.) ముండ్లపంది, ముండ్లఎలుక, خاردار-ఖా-దార్ (పా) ముండ్లు, ముండ్లుగల, خار کھانا-ఖా-ఖానా (క్రి) మత్సరించుట-అసూయపడుట-خاروخس-ఖా- ఒ, ఖస్ (పు) చెత్తచెదారము, పెంట.

**خارا** ఖారా (పా-పు) నల్లరాయి, గట్టిరాయి.

**خارج** ఖారిజ్ (అ) బహిష్కృతము, బహిర్గతము-బాహ్యము, తోసివేసిన, కొట్టివేసిన, తీసివేసిన خارج کرنا-కర్నా (క్రి) తీసివేయుట, త్రోసివేయుట, వెడలగొట్టుట, వెలువరించుట. خارج قسمت ఏ- క్విస్మత్ (పు) భాగహారలబ్ధము

**خارجاً** ఖారిజన్ (అ) బాహ్యముగా, జనవాదముగా, ప్రవాదముగా, కింవదంతిగా

**خارجہ** ఖారిజ (అ.పు) బాహ్యము, వెలుపలి, బహిర్గతము, బహిష్కృతము, త్రోసివేసినది زاویہ خارجہ జావియయే (అ.పు) లంబకోణము బాహ్యకోణము.

**خارجی** ఖారిజీ (అ.పు) బహిష్కృతుడు-పాషండుడు, బాహ్యుడు; మహమ్మదీయులలో నొకతెగవాడు.

**خارش-خارشت** ఖారిష్ - ఖారిష్త్ (పా, స్త్రీ) గోకుడు, గజ్జి, తీట, చిడుము

**خاشاک** ఖాషాక్ (పా.పు) చెత్త. పెంట

**خاص** ఖాస్ (అ) అసాధారణమైన, ప్రత్యేకమైన విశేషమైన, స్వంత, తన, ప్రియమైన-నిర్దిష్టమైన, నియమితమైన, ముఖ్యమైన, ప్రధానమైన, నిర్ణయమైన, خاص بردار-ఖాస్-బర్దార్ (పు) యజమానియొక్క-ఆయుధములను తెచ్చువాడు خاصدان-ఖా..దాన్ (పు) బట్టలపెట్టె, తమలపాకులతట్ట (మూతగలది) తమలపాకుల పేటిక. خاص کر-కర్ [క్రి] ముఖ్యముగా, ప్రత్యేకముగా, خاص وعام-ఖా- ఒ, ఆమ్ (పు) సర్వజనులు, లోకులు, జనులు, ప్రజలు, చిన్న పెద్దలు.

**خاصا** ఖాసా (అ) మంచి-బాగైన-ఉత్తమము-తగిన-యోగ్యమైన-అందమైన;

సామాన్యమైన, సన్న బట్ట.

خاصہ ఖాస (అ.పు) గొప్పవారి భోజనము మృష్టాన్నము, వలిపము, దుకూలము, గొప్ప, మేలైన, ఘనమైన, అందమైన, రాజు లేక గొప్పవారు ఎక్కు గుఱ్ఱము.

خاصہ ఖాస్స (అ.పు) స్వభావము, ప్రకృతి, వాడుక గుణము.

خاصیت ఖాసియత్ (అ-స్త్రీ) స్వభావము, నైజము, విశేషణము, గుణము, వాడుక.

خاطر ఖాతిర్ (అ.స్త్రీ) అంతరంగము, హృదయము, అభిప్రాయము, మనస్సు, చిత్తము, ధ్యానము, ఇచ్ఛ, ఇష్టము, మొగమోటము, పక్షపాతము, ఆదరము, సత్కారము, కొరకు, కై, నిమిత్తము, خاطرجمع -జమఽ (స్త్రీ) మనస్స్వాస్థ్యము, మనసు నెమ్మతి, నిమ్మళము, తృప్తి, నమ్మకము నిశ్చింత, خاطرخواه - ఖాహ్ (పా) అభీష్టానుసారము, మనసుకు వచ్చినట్లు కావలసినంత. خاطرداری - దారీ (స్త్రీ) ఆదర సత్కారము.

خاقان ఖాకాన్ (తు-పు) చక్రవర్తి-రారాజు.

خاک ఖాక్ (పా.స్త్రీ) మృత్తిక, మన్ను, దుమ్ము, బూడిద, భస్మము. మట్టి, భూమి. خاک اڑانا -ఉడానా (హి) దుమ్ము రేగించుట خاک اڑنا - ఉడ్నా (హి) దుమ్ము రేగుట. خاکروب - రోబ్ (పు) పాకీవాడు, మురుగుదొడ్డి ఊడ్చువాడు.

خاکسار -సార్ (పు) విధేయుడు. సేవకుడు.

خاکستر ఖాకిస్తర్ (పా.స్త్రీ) బూడిద, భస్మము, خاک میں ملنا -ఖాక్ మే(ం)మిల్నా, పాడగుట, నాశనమగుట, చచ్చుట, మంటకలియుట; خاکنائے - నాయ్ (స్త్రీ) భూసంధి.

خاکا - خاکہ ఖాకా - ఖాక (పా.పు) చుట్టుగీత, రేఖాకృతి, ఆకారము, రూపము చిత్రము, చిత్తుపటము, మట్టి మొదలైనవానితో చేసినగురుతు, లేక ఆకారము. خاکا اڑانا - ఉడాన (హి) బొమ్మకట్టుట, అనుకరించుట, ఎగతాళి చేయుట.

خاکی ఖాకీ మంటివంటి- మన్నుతో చేసిన మురికైన - దుమ్ము పట్టిన - కాషాయ వన్నెగల; బూడిదవన్నె పావురము - కాషాయము.

خاگینہ ఖాగీన (పా.పు) వండినగ్రుడ్లు-కోడిగ్రుడ్లతో చేసినకూర.

خال ఖాల్ (అ.పు) పుట్టుమచ్చ, కాటుకచుక్క, మేనమామ, రెండువన్నెల పావురము

خالا ఖాలా (అ.స్త్రీ) పినతల్లి - పెత్తల్లి - తల్లితో బుట్టువు, خالازاد - జాద్ (పా) పినతల్లి లేక పెత్తల్లికి పుట్టిన خالازادبھائی - జాద్ భాయి (పు) పెత్తల్లి లేక పినతల్లి కొడుకు మాతృష్వసేయుడు.

రము - అందము - బిత్తరము - కులుకు خراماں

خراماں ఖిరామాఁ - ఖిరామాఁ (పా) ఒయారపు నడకతో, కులుకులాటతో,

خرابات ఖరాబాత్ (ఆ) ము సిలి, అరితేరిన - అ సుభవశాలియొక్క జిత్తులమారి - గట్టివాడు

خربزه - خربوزه ఖర్బూజ (పా - పు) దోసపండు (పండిన దోసకాయగాదు సుమా)

خراج - خرچو ఖరాజ్ - ఖర్చో (పా) అతివ్య యముచేయువాడు - దూబరతిండి

خرج ఖర్జ్ (అ - పు) నిర్గమనము - బహిర్గమనము. వెలువడుట - వినియోగము - వ్యయము - వ్యయము - సెలవు - వెచ్చము

خرجی ఖర్జి (పా - స్త్రీ) ఆళ్వసంచి - గోనె - గోతము

خرج ఖర్చ్ (పా - పు) వెచ్చము - వ్యయము - వ్యయము - వినియోగము - సెలవు - పెట్టుబడి - కట్టు బడి خرج دینا ఖర్చ్‌దేనా (హి) పెట్టుబడి పెట్టుట

خرچنا ఖర్చానా (హి) సెలవు వేయుట - వెచ్చ పెట్టుట - వ్యయముచేయుట

خرچنگ ఖర్చంగ్ (పా - పు) కర్కాటకము, ఎండ్రికాయ

خرچہ ఖర్చ (పా - పు) వెచ్చము - సెలవు - వ్యయము - వ్యాజ్యవ్యయము

خرچی ఖర్చీ (అ - స్త్రీ) వెలయాలివెల - వ్యయముచేయువాడు

خرخر ఖర్ ఖర్ (పా - పు) గుఱ్ఱుగుఱ్ఱు - గుఱుగు ఱుగుఱుక

خرخشہ ఖర్‌ఖశ (పా - పు) జగడము - పోట్లాట పీకులాట

خرد ఖిర్ద్ (పా - స్త్రీ) బుద్ధి - తెలివి - జ్ఞానము خردمند మండ్ (పా) తెలివిగలవాడు - బుద్ధిమంతుడు

خرد ఖుర్ద్ (పా) పసి - చిన్న - బుచ్చి - అల్పము - స్వల్పము خردبینی ఖుర్ద్‌బీన్ (పా స్త్రీ) సూక్ష్మదర్శకము خردسال సాల్ (పా) చిన్నవయసుగల - చిన్న, పిన్న.

خردل ఖర్దల్ (అ - పు) ఆవాలు

خردگ ఖుర్దహ్ (పా - పు) తునక - చీలిక - నీలిక - అరవలు - తుక్కు - చూరు, చెత్త; చిల్లగ - మార్కము - నేబులు - అమ్మకము, దోషము - తప్పు خردہ فروش ఫరోష్ (పా పు) సూరుబేరగాడు - చిల్లరవర్తకుడు - నెబులమ్ము వాడు - చిల్లరఅమ్మువాడు خردہ کرنا కర్నా (హి) అమ్ముట; రూపాయి మొ॥ మార్చుట.

خردی ఖుర్దీ (పా - స్త్రీ) చిన్నతనము - అల్పత్వము.

خردیم ఖుర్దియ (పా - పు) నేబులమ్ము వాడు చిల్లరఅమ్మువాడు.

خرس ఖిర్స్ (పా - పు) గుడ్డెలుగు - మోటువాడు - అశిక్షితుడు,

خرسند ఖుర్సంద్ (పా) సంతోషించిన - ఆనందముగల.

خرسنگ ఖర్సంగ్ (పా - పు) వైరి - ప్రతిస్పర్థి పెద్దరాయి - బండ - ఆటంకము.

خرطوم ఖర్తూమ్ (అ - పు) ఏనుగతొండము

خرفہ ఖుర్ఫ (అ - పు) గంగవాయిలి.

خرقہ ఖిర్క (అ - పు) బొంత - కంథా خرقہ پوش (పా) సన్యాసి - బికుకుడు

خرگاہ ఖర్‌గాహ్ (పా - స్త్రీ) గుడారము - పటకుటీరము - భవనము - పార్శ్వము

خرگوش ఖర్గోష్ (పా.పు) కుందేలు-చెవులపిల్లి.

خرم ఖుర్రమ్ (పా) సంభ్రమముగల-ఆనంద భరితమైన-ఉల్లాసముగల.

خرما ఖుర్మా (పా.పు) ఖర్జూరము-ఒకతీపు పండుము.

خرمست ఖర్మస్త్ (పా) కామాతురముగల మదించిన-అలత్యముచేయు,కంఠకావరము పట్టిన.

خرمن ఖర్మన్ (పా.పు) పంట-పంటకుప్ప-పరిసేపము.

خرموش ఖర్మూష్ (పా.పు) పెద్ద ఎలుక.

خرمهرا ఖర్మ్హ్రా (పా.పు) గవ్వ-వరాటకము,

خرمی ఖుర్రమీ (పా.స్త్రీ) ఆనందము-సంతోషము-ఉల్లాసము

خروار ఖర్వార్ (పా.పు) ఖరభారము-గాడిద మోతి.

خروج ఖురూజ్ (అ.పు) నిర్గమనము-బహిర్గమనము-వెడలిక-బయలుపడుట-వెలువడుట; తిరుగుబాటు.

خروس ఖురూస్ (పా-పు) కోడి

خروش ఖరోష్ (పా.పు) అల్లరి-అల్లకల్లోలము-లొల్లి-చప్పుడు-అట్టహాసము-సంభ్రమము.

خروشاں ఖరోషాం (పా) గొప్పధ్వనిచేయు, అల్లరిచేయు-రోదనముచేయు

خریج ఖరీజ్ (అ) వివిధములైన-చిల్లర-పలు, మిగిలిన, శేషించిన.

خرید ఖరీద్ (పా.స్త్రీ) మూల్యము-వెల-క్రయము-కొనుగోలు-కొనినది

خریدکامول ఖరీద్ కా మోల్ (పా.పు) కొనుమొదలు-కొనుబడి

خریدوفروخت ఖరీదొ, ఫరోక్త్ (పా.స్త్రీ) క్రియ విక్రయములు-వ్యాపారము-బేరము.

خریدار ఖరీదార్ (పా.పు) క్రయికుడు-కొనువాడు.

خریداری ఖరీదారీ (పా-స్త్రీ) క్రయము కొనుగోలు-కొనుట

خریدنا ఖరీద్నా (హి) కొనుట-వెలయిచ్చి తీసికొనుట.

خریدہ ఖరీద (పా) కొనిన వెలయిచ్చి తీసికొనిన,

خریط ఖరీత (అ.పు) సంచి-తిత్తి-ఒర-అడపము-కోశము-ఆధ్యానము గా నుండుట,

خریف ఖరీఫ్ (అ-స్త్రీ) మెట్టకారు-పాడికారు-పువాసపంటలు-జొన్న-సజ్జ-మొక్కజొన్న పంటలు.

خزاں ఖిజాం (పా-స్త్రీ) ఆకురాలు కాలము-శరదృతువు-ఆకురాలుడు-క్షయము-క్షీణదశ

خزانچی ఖజాన్చీ (పా.పు) కోశాధ్యక్షుడు భాండాగారికుడు

خزانہ ఖజాన (అ.పు) కోశము-బొక్కసము-భాండాగారము-బండారము-ఉగ్రాణము-సంచితము-సంభారము-కొట్టు

خزانہ دار ఖజానదార్ (పా-పు) ఉగ్రాణి-పెత్తనదారుడు చూడు خزانچی

خزینہ ఖజీన (అ-పు) కోశము-బొక్కసము బండారము.

خس ఖస్ (పా-పు) ఆవురుగడ్డి-సువాసనగల

خرگوش ఖర్గోష్ (పా.పు) కుందేలు-చెవులపిల్లి.

خرم ఖుర్రమ్ (పా) సంభ్రమముగల-ఆనంద భరితమైన-ఉల్లాసముగల.

خرما ఖుర్మా (పా.పు) ఖర్జూరము-ఒకతిను బండము.

خرمست ఖర్మస్త్ (పా) కామాతురముగల మదించిన-అలక్ష్యముచేయు,కండ కావరము పట్టిన.

خرمن ఖిర్మన్ (పా.పు) పంట-పంటకుప్ప-పరిశేషము.

خرموش ఖర్మూష్ (పా.పు) పెద్ద ఎలుక.

خرمهرا ఖర్ముహ్రా (పా.పు) గవ్వ - వరాటకము,

خرمی ఖుర్రమీ (పా.స్త్రీ) ఆనందము-సంతోషము-ఉల్లాసము

خروار ఖర్వార్ (పా.పు) ఖరభారము-గాడిద మోత.

خروج ఖురూజ్ (అ.పు) నిర్గమనము-బహిర్గమనము-వెడలిక-బయలుపడుట-వెలువడుట; తిరుగుబాటు.

خروس ఖురూస్ (పా.పు) కోడి

خروش ఖురోష్ (పా.పు) అల్లరి-అల్లకల్లోలము-లొల్లి-చప్పుడు-అట్టహాసము-సంభ్రమము.

خروشاں ఖురోషాఁ (పా) గొప్పధ్వనిచేయు, అల్లరిచేయు-రోదనముచేయు

خریج ఖరీజ్ (అ) వివిధములైన-చిల్లర-పలు, మిగిలిన, శేషించిన.

خرید ఖరీద్ (పా.స్త్రీ) మూల్యము-వెల-క్రయము-కొనుగోలు-కొనినది

خریداصول ఖరీదుసూల్ (పా.పు) కొను మొదలు-కొనుబడి

خرید و فروخت ఖరీదొ, ఫరోక్త్ (పా.స్త్రీ) క్రయ విక్రయములు-వ్యాపారము-బేరము.

خریدار ఖరీదార్ (పా.పు) క్రయికుడు-కొనువాడు.

خریداری ఖరీదారీ (పా.స్త్రీ) క్రయము కొనుగోలు-కొనుట

خریدنا ఖరీద్నా (హి) కొనుట-వెలయిచ్చి తీసికొనుట.

خریدہ ఖరీద (పా) కొనిన వెలయిచ్చి తీసి కొనిన,

خریطہ ఖరీత (అ.పు) సంచి-తిత్తి-ఒర-అడపము-కోటు-అధ్యానముగా నుండుట,

خریف ఖరీఫ్ (అ.స్త్రీ) మెట్టకాయ-పొడికాయ-పువాసపంటలు-జొన్న-సజ్జ-మొదలు పంటలు.

خزاں ఖిజాఁ (పా.స్త్రీ) ఆకురాలు కాలము-శరదృతువు-ఆకురాలుడు-క్షయము-క్షీణదశ

خزانچی ఖజాన్చీ (పా.పు) కోశాధ్యక్షుడు భాండాగారికుడు

خزانہ ఖజాన (అ.పు) కోశము-బొక్కసము-భాండాగారము-బండారము-ఉగ్రాణము-సంచితము-సంభారము-కొట్టు

خزانہ دار ఖజానదార్ (పా.పు) ఉగ్రాణి-పెత్తనదారుడు చూడు خزانچی

خزینہ ఖజీన (అ.పు) కోశము-బొక్కసము బండారము.

خس ఖస్ (పా.పు) ఆవురుగడ్డి-సువాసనగల

గడ్డి; గడ్డి-కసవు. خس و خاشاک ఖస్‌వ ఖాషాక్ (పా-పు) చెత్త-చీపురు కసవు-పెంట.

خساره ఖసార (అ-పు) నష్టము-తుట్టి.

خسانده ఖిసాందహ్ (పా-పు) కషాయము రసము.

خست ఖిస్సత్ (అ స్త్రీ) అల్పత్వము-నీచత్వము-లుబ్ధత్వము-పిసినారితనము.

خستگی ఖస్తగి (పా-స్త్రీ) అలసట-మాంద్యము, విచ్ఛిన్నత-భగ్నము-దురవస్థ; గాయము; వ్యసనము-చింత-వ్యాకులము; రిక్తత, దరిద్రము.

خسته ఖస్త (పా) అలసిన, దురవస్థలోనున్న, విచ్ఛిన్నమైన-భగ్నమైన-గాయపడిన-చెడిన-వ్యాకుల పడిన-రిక్తుడైన خسته حال ఖస్త హాల్ (పా) దురవస్థ خسته دل ఖస్త దిల్ (పా) గుండెపగిలిన-అధైర్యపడిన.

خسر ఖుసుర్ (పా-పు) మామ-పెండ్లాము యొక్కగాని పెనిమిటియొక్కగాని తండ్రి

خسرو ఖుస్రో (పా-పు) పారసీక దేశపురాజు

خسروانه ఖుస్రవాన (పా) రాజఠీవిగల రాజోచితమైన.

خسره ఖస్రిహ్ (అ-పు) పొలముల టిప్పణము-పట్టి; ఊరిపొలముల పట్టిక.

خسوف ఖుసూఫ్ (అ-పు) భూమిలో దిగబడుట, చంద్రగ్రహణము.

خسیس ఖసీస్ (అ-పు) అల్పము-నీచము-లుబ్ధుడు-పిసినారి-నీచుడు-మూఢుడు.

خشت ఖిష్త్ (పా-స్త్రీ) ఇటుక-ఇష్టిక-ఒక తినుబండము, పితృపిండము రొట్టె.

خشتک ఖిష్తక్ (పా-స్త్రీ) చంక పేగు-చల్లడముయొక్క కాళ్లనడిమి చౌకము.

خشخاش ఖష్‌ఖాష్ (పా-పు) గసగసాలు-యవములో ఎనిమిదవ భాగము.

خشخش ఖష్‌ఖష్ (తూనిక)

خشک ఖుష్క్ (పా) ఎండిన-ఆరిన-వాడిన-వట్టి-కలుపు గోలుతనము లేని-రసహీనమైన- خشک سالی ఖుష్క్ సాలీ (స్త్రీ) అనావృష్టి-కరువు خشک دماغ ఖుష్క్ దమాగ్ (పా) పిచ్చివాడు.

خشکه ఖుష్క (పా-పు) అన్నము (మాత్రము) చప్పిడి మెతుకులు.

خشکی ఖుష్కీ (పా-స్త్రీ) మెట్ట-బెట్ట-కరువు ఎండిపోవుట-వట్టిపోవుట-రసహీనత-అరంజకత-కలిపిగోలుతనము లేమి-బెరుకుతనము.

خشم ఖష్మ్ (పా-పు) క్రోధము-ఆవేశము-కోపము خشمگین ఖష్మ్‌గీఁ (పా) కోపావేశముగల కుపితుడైన.

خشنود ఖుష్నూద్ (పా స్త్రీ) సంతోషపడిన-తృప్తిజెందిన.

خشنودی ఖుష్నూదీ (పా-స్త్రీ) సంతోషము-తృప్తి.

خشوع ఖుషూఅ (అ) వినయము-ప్రార్థన-దేబిరింపు.

خصلت ఖస్లత్ (అ-స్త్రీ) స్వభావము-ప్రకృతి-గుణము-వాడుక.

خصم ఖసమ్ (అ-పు) భర్త-యజమాని-మగడు వైరి-స్పర్థి. خصم والی ఖసమ్ వాలీ (స్త్రీ) ముత్తైదువ-మగనాలు

خصوص ఖుసూస్ (అ-పు) ముఖ్యము-ప్రధా

నఘు-విశిష్టము-ప్రత్యేకము-విశేషము-ప్రాధాన్యము.

**خصوصاً** ఖుసూసన్ (అ) ముఖ్యముగా-ప్రత్యేకముగా-విశిష్టముగా.

**خصوصیت** ఖుసూసియ్యత్ (అ-స్త్రీ) ముఖ్యత్వము విశిష్టత-ప్రాధాన్యత-విశేషము-స్నేహము-సంబంధము.

**خصومت** ఖుసూమత్ (అ-స్త్రీ) స్పర్థ-పగ వైరము.

**خصی** ఖిస్సీ (అ-పు) పిడగొట్టిన-వట్టలుకొట్టిన మేక; పండుడు-ఎద్దు (కొజ్జ)

**خصیہ** ఖుస్య (అ-పు) వృషణము.

**خضاب** ఖిజాబ్ (అ-పు) వన్నె-రంగు-నరసిన వెండ్రుకలకు వేయువన్నె- నీలివన్నె-నలుపు నూనె.

**خضر** ఖిజ్ర్ (అ-పు) అమృతము త్రాగిన ఒక పైగంబరు పేరు.

**خضوع** ఖుజూఉ (అ-స్త్రీ) వినయము-విధేయత.

**خط** ఖత్ (అ-పు) రేఖ-లిఖితము-గీత-వ్రాత, జాబు, చీటి-పత్రము-వ్రాసినది- ముడుత-గురుతు; గడ్డము మీసములు- **خط آنا یا نکلنا** అనా నికాల్నా (క్రి) మీసకట్టు ఏర్పడుట **خط استوا** ఎ ఇస్తివా (పు) భూకక్ష్య-భూమధ్య రేఖ **خط بنانا** బనానా (క్రి) ముఖక్షౌరము చేయుట **خط جدی** ఎ, జదీ (పు) దక్షిణాయన వృత్తము **خط جلی** ఎ, జలీ (పు) లావు అక్షరములు **خط سرطان** ఎ, సర్తాన్ (పు) ఉత్తరాయణ వృత్తము **خط شکستہ** ఎ, షికస్త (పు) గొలుసుకట్టు **خط عمود** ఎ, అమూద్ (పు) లంబము-నిలువు గీటు **خط گلزار** ఎ, గుల్జార్ (పు) పూల అక్షరములు **خط متوازی** ఎ, ముతవాజీ (పు) సమాంతర రేఖ **خط مستدیر** ఎ, ముస్తదీర్ (పు) వృత్త రేఖ - వర్తుల రేఖ - గుండుగీత **خط مستقیم** ఎ, ముస్తకీమ్ (పు) సరళ రేఖ-చక్కని గీత, **خط منحنی** మున్హనీ (పు) వంకరగీత-వక్ర రేఖ.

**خطا** ఖతా (అ-స్త్రీ) పాపము-అపరాధము-దోషము-తప్పు- పొరపాటు-అపచారము.

**خطاب** ఖితాబ్ (అ-పు) అభిముఖుడై మాటలాడుట-పరిసంగము- సంభాషణ-బిరుదు-కోపము-సంబోధనము.

**خطام** ఖుత్తామ (అ-స్త్రీ) ఉత్కృష్ట రాలు-రంకులాడి.

**خطبہ** ఖుత్బ (అ-పు) భగవత్ స్తోత్రము-మతధర్మోపన్యాసము - మతోపదేశము; గ్రంథపీఠిక-అవతారిక; తురక పురోహితుడు, శుక్రవారమునాడు గాని పండుగులలో గాని మసీదులో చేయు ఉపన్యాసము, నైతికోపన్యాసము.

**خطر خطرہ** ఖతర్-ఖత్ర (అ-పు) అపాయము-భయము-చింత-సందేహము- కష్టము-**خطرناک** నాక్ (పా) భయంకరము-అపాయకరము.

**خطمی** ఖత్మీ (అ-స్త్రీ) అడవి బెండచెట్టు

**خطوط** ఖుతూత్ (అ-పు) చూడు (ఏ.వ. خط)

**خطہ** ఖిత్త (అ-పు) పట్టణము; దేశము; ప్రదేశము; పొలిమేర.

**خطیب** ఖతీబ్ (అ-పు) మతోపన్యాసకుడు

జగడము-పగ-స్పర్థ-కలత-చింత-అసమాధానము.

خلط ఖిల్త్ (అ-పు) మిశ్రణము-రక్తవాతపిత్తశ్లేష్మములలో నొకధాతువు-ప్రకృతి

خلط فاسد ఖిల్త్ ఎ.ఫాసిద్ (స్త్రీ) కొరకుడుపుండు,వ్రణము.

خلط ఖల్త్ (అ-పు) మిశ్రణము-కలపటము-

خلط ملط ఖల్త్ మల్త్ (పా) మిశ్రితమైన-కలిసిన-తారుమారైన గజిబిజి.

خلعت ఖిల్అత్ (అ-పు) కట్నము-బహుమానవస్త్రములు-దుస్తు-ఉడుపు-సరియని పెట్టినగురుతు.

خلف ఖలఫ్ (అ-పు) కొడుకు-ఉత్తరాధికారి-దాయ-విధేయుడైన-సుపుత్రుడు.

خلفا ఖులఫా (అ-పు) కలీఫాలు-మతాధ్యక్షులు (వి. వ. خلیفہ)

خلق ఖుల్క్ (అ-పు) సత్స్వభావము-వర్తనము మర్యాదలు-యోగ్యత-సభ్యత-అభ్యాసము వాడుక-వినయము-మర్యాద-కలిపిగోలుతనము.

خلق ఖల్క్ (అ-స్త్రీ) సృష్టి-లోకులు-జనులు, మానవులు.

خلقت ఖిల్కత్ (అ-స్త్రీ) సృష్టి-మానవులు జనులు-జననము.

خلقی ఖల్కీ (అ) స్వాభావికమైన-సహజమైన.

خلل ఖలల్ (అ-పు) పగులు-ఛిద్రము-చెరుపు లోపము-విఘ్నము-దోషము-అంతరము అంతరాయము-అభ్యంతరము-నష్టము-తారుమారు

خلل انداز ہونا ఖలల్ అందాజ్ హోనా (ఉ) అభ్యంతరము చెయుట-కలత పెట్టుట-చెరుచుట

خلل دماغ ఎ, దిమాగ్ (పు) పిచ్చి-వెఱ్ఱి-చిత్తవైకల్యము.

خلو ఖులూ (అ-పు) శూన్యత.

خلوت ఖల్వత్ (అ-స్త్రీ) ఏకాంతము-చాటు,మరుగు,ఉత్తచోటు, خلوت خانہ ఖల్వత్‌ఖాన(పు)ఏకాంతస్థలము, خلوت نشین ఖల్వత్ నషీన్ (పా) ఏకాంత వాసి خلوتی ఖిల్వతీ (పా) ఏకాంతవాసి-సన్యాసి-కేవలమిత్రుడు-ప్రియమిత్రుడు.

خلوص ఖులూస్ (అ-పు) స్వచ్ఛత-నైర్మల్యత-యథార్థత-నిజము,విశ్వాసము-చెలిమి చనువు.

خلیا ساس ఖల్యాసాస్ (హి-స్త్రీ) అత్త యొక్క చెల్లెలు లేక అక్క; పిన్నత్త-పెద్దత్త.

خلیج ఖలీజ్ (అ-స్త్రీ) సముద్రశాఖ-సింధుశాఖ.

خلیرا ఖలేరా (పా) చూడు خالہ زاد

خلیط ఖలీత(ఉ-పు)సంచి-తిత్తి-ఆడపము.

خلیفہ ఖలీఫహ్ (అ-పు) ప్రభువు-పెద్ద-ఉత్తరాధికారి-యువరాజు; బడిపెద్ద-కలీఫా-మతాధ్యక్షుడు; చాకలి-మంగలి-మొ|| వారు,

خلیق ఖలీక్ (అ) సభ్యుడు-యోగ్యుడు-మర్యాదస్థుడు.

خلیل ఖలీల్ (అ-పు) స్నేహితుడు-నిజమైన మిత్రుడు,

خم ఖమ్ (పా-పు) వంపు-వంక-మెలిక-పెనవడి-వలయము-చుట్టు-ఉంగరములు-తిరుగుట-వంగిన-వంకరైన-పెనవడిన-మెలిక

పశిన- చుట్టుకొనిన(ఖమ్‌తోకనా)(క్రి) వల్లచరచుట-సన్నదుడగుట ఖمچشم చమ్ (పా-పు) కులుకు- ఒయారము- خم دار ఖమ్ దార్ (పా) వంగిన-వంపుగల-మెలికపడిన-

خم ఖుమ్ (పా-పు) కాగు-కల్లుముంత-సారాయిపొంగు-కాడి خم چڑھانا ఖమ్ చఢానా (క్రి) బట్టలుఉదక పెట్టుట خمخانہ ఖమ్‌ఖాన (పు) చూడు خمارخانہ

خمار ఖుమార్ (అ-పు) మత్తు-మైకము-తూగు తూరికిపాటు خمار آلود ఖమార్ ఆలూద (పా) మత్తుగొన్న خمارخانہ ఖానా (పాపు) మదిరాగృహము-గంజా.

خماری ఖుమారీ (అ-స్త్రీ) చూడు خمار

خمر ఖమ్ర్ (అ-పు) సారాయి- మత్తుపదార్థము.

خمس ఖుమ్స్ (అ) అయిదవపాలు-పంచమాంశము.

خمسہ ఖమ్స (అ) పంచకము- అయిదుగలది.

خمکدہ ఖుమ్‌కద (పా-పు) చూడు خمخانہ

خمیازہ ఖమ్యాజ (పా-పు) ఒళ్లువిరుపు- శిక్షదండుగు-ప్రతీకారముచెల్లు మారు-వ్యాకులము-కష్టము-పశ్చాత్తాపము-చింత.

خمیدہ ఖమీద (పా) చూడు خم دار

خمیر ఖమీర్ (అ-పు) పులియుడు-మండము-మురుగుడు-పొంగు-కాడి-బంకమన్ను

خمیر آٹھانا ఉఠానా (క్రి) పులియపెట్టుట-మురగపెట్టుట.

خمیرہ ఖమీర (అ-పు) పింగాణిగిన్నెలోవండిన ఔషధము- మురుగుడు లేక కాడి కలిపి చేసినది-లేహ్యము-ఒకవిధమైన పొగాకు.

خمیری ఖమీరీ (అ-స్త్రీ) పిండిపులియపెట్టి చేసినరొట్టె-అట్టు-పెం॥

خنا ఖనా (అ-స్త్రీ) గర్వము- తలబిరుసు-పనికిమాలినమాట.

خناس ఖన్నాస్ (అ-పు) బేతాళుడు- పిశాచము-ధూర్తు-పోకిరి.

خناق ఖునాక్ (అ-పు) ఒకవిధమైనకంఠరోగము-ఊపిరాడమి

خنث خنثے ఖున్స-ఖున్సా (అ-పు) నపుంసకుడు -మందుడు-ఎగ్గలి.

خنجر ఖంజర్ (అ-పు) ముప్పిడి-కటారు-సురియ-చూరకత్తి.

خنجری ఖంజరీ (పా-స్త్రీ) చారలపట్టుబట్ట-కంజిరియను చిన్న చర్మవాద్యము- కఠారివంటి నేతచారలు.

خندق ఖన్దక్ (అ-స్త్రీ) ఖాతము-అగడ్త-గాతము-గొయ్యి-

خندہ ఖన్ద (పా-పు) నవ్వు خندہ پیشانی రూ ఖన్ద పేషానీ-రూ (పా) హసన్ముఖుడు-నవ్వుమోముగలవాడు.

خندی ఖందీ (ఉ-స్త్రీ) పకపకనవ్వు ఆడుది సిగ్గిడి-రంకులాడి.

خنزیر ఖిన్‌జీర్ (అ-పు) పంది-ఆడవిపంది-

خنک ఖునక్ (పా) శీతలమైన-చల్లని.

خنکی ఖున్కీ (పా-స్త్రీ) శీతలము - చల్లదనము.

خنگ ఖింగ్ (పా-పు) తురంగము-గుఱ్ఱము.

خنگا ఖిన్గా (పా-పు) బలిసినవాడు, పుష్టిగలవాడు, నవ్వులబండి.

خنیا ఖున్యా (పా-పు) గానము-పాట-రాగము

خنیاگر ఖున్యాగర్ (పాపు) పాటకుడు خنیا

گری గరీ (స్త్రీ) గానవృత్తి.

خو ఖో-ఖూ (పా-పు) స్వభావము-వాడుక-అలవాటు-వర్తనము خوگرفتہ ఖోగిరఫ్త (పా) అలవాటుపడిన.

خواب ఖాబ్ (పా-పు) స్వప్నము-నిద్ర-తలంపు-ధ్యానము خواب آلود ఖాబ్ ఆలూద (పా) నిద్రవచ్చుచున్న-నిద్రమత్తు గొన్న-

خواب خیال ఖాబ్ ఖయాల్ (పు) భ్రాంతి-భ్రమ خوابگاہ ఖాబ్‌గాహ్ (పు) శయన గృహము-పడకటిల్లు

خوابیدہ ఖాబీద (పా) నిద్రితుడైన-నిద్రగొన్న

خواجہ ఖాజ (పా-పు) ప్రభువు-పెద్ద-స్వామి యజమాని, దండివర్తకుడు-షండుడు-షేకు తండ్రి వలన సయ్యదు తల్లికి పుట్టిన తురక

خواجہ سرا ఖాజసరా (పు) షండుడు-ఎగ్గలి కంచుకి.

خوار ఖార్ (పా) భ్రష్టుడు-దుర్మార్గుడు-చెడినవాడు-నింతుడు-తుచ్ఛుడు.

خوارق ఖవారిక్ (అ-పు) అద్భుతక్రియలు-మాహాత్మ్యము,

خواری ఖారీ (పా-స్త్రీ) భ్రష్టత-దైన్యము కష్టము-దుర్దశ-సంకటము-అరడి خواری کرنا కర్నా (క్రి) పోట్లాడుట - అరడి పెట్టుట-గద్దిచేయుట-నిందమోపుట.

خواست ఖాస్త్ (పా-స్త్రీ) విజ్ఞాపన-కాంక్ష-కోరిక-ఇచ్ఛ-ప్రార్థన خواستگار ఖాస్తగార్ (పా) అర్థి-కోరువాడు-ప్రార్థించువాడు.

خواص ఖవాస్ (అ పు) పరిచారకులు-పెద్దసేవకుడు-చెలికాడు-స్వభావము-గుణములు-ముఖ్యులు-పెద్దలు.

خواصی ఖవాసీ (అ-స్త్రీ) సవారీ అంబారి వెనుకస్థలము-పెద్దసేవకునిపని-కొలువు,

خوان ఖాన్ (పా-పు) ఒడ్డనపళ్లెము-తాంబాళము خوان پوش ఖాన్‌పోష్ (పు) కప్పుబట్ట, తాంబాళముమూతలేక కప్పు-మూతబట్ట-

خوانچہ ఖాంచ (పు) తట్ట-పళ్లెము-చిన్న పళ్లెము.

خواں ఖాఁ (పా-పు) పాఠకుడు-చదువు వాడు.

خواں - خوان سامان ఖాన్-ఖ్వాన్ సామాఁ (పా-పు) వంటయింటి పెత్తన దారుడు-వంటవాడు-సేవకుడు.

خواندہ ఖాన్ద (పా) విద్యావంతుడగు-చదివిన-పిలువబడిన.

خوانی ఖానీ (పా-స్త్రీ) పఠనము-చదువుట.

خواہ ఖాహ్ (పా) కోరువాడు-అర్థి-ఇచ్ఛ-కోరిక-ప్రార్థన-అథవా- కాక-లేక-

خواہ مخواہ خواہ نخواہ خواہ ناخواہ ఖాహ్‌మఖాహ్ నఖాహ్ (పా) విధిగా-నిర్బంధముగా విధిలేక-ఇష్టమైనను లేకున్నను.

خواہان ఖాహాఁ (పా) అర్థి-కోరువాడు.

خواہر ఖాహిర్ (పా-స్త్రీ) భగిని - తోడబుట్టినది,

خواہش ఖాహిష్ (పా-స్త్రీ) ఇచ్ఛ-కోరిక ఇష్టము-అభిప్రాయము خواہش مند ఖాహిష్ మంద్ (పా) ఇచ్ఛించువాడు - కోరికగల వాడు.

خوب ఖూబ్ (పా) మంచి-బాగైన-మేలైన-

అందమైన-ప్రియమైన-నేన-చాల-బాగా-

خوب رو صورت ఖూబ్ రూ - సూరత్ (పా) అందమైన-సుందరమైన-సొగసైన-

خوبصورتی ఖూబ్ సూరతీ (స్త్రీ) అందము-సౌందర్యము.

خوبان ఖూబాఁ (పా-పు) అందములు-ప్రియుఁడు.

خوبانی ఖూబానీ (పా-స్త్రీ) ఫలవిశేషము.

خوبکلان ఖూబ్ కలాఁ (పా-పు) ఒకఔషధపుగింజలు.

خوبی ఖూబీ (పా-స్త్రీ) శ్రేష్ఠత- మంచి-బాగు-మేలుతరము-విశేషము - అధిక్యత-గుణము-అందము-పొంకము-సొంపు.

خوج ఖోజ (పా-పు) పండుడు-ఎగ్గలి-ఒకజాతి.

خود ఖోద్ (పా-పు) శిరస్త్రాణము - తలకవచము-ఇనుపకుల్లాయి.

خود ఖుద్ (పా) ఆత్మ-తాను-తనంతటు-స్వకీయమైన-తన خودبخود ఖుద్ బఖుద్ (పా) తనంతటుతాను خودبدولت ఖుద్ బదౌలత్ (పా) ఏలినవారు خودبین ఖుద్ బీఁ (పా) అహంకారియైన خودپرست ఖుద్ పరస్త్ (పా) స్వప్రయోజనపరుడు-ఆత్మంభరుడైన خودپسند ఖుద్ పసంద్ (పా) తనకుతానే మెచ్చుకొనెడు خودرای ఖుద్ రాయ్ (పా) తలబిరుసైన-హఠవాదియైన-అహంకారియైన- స్వేచ్ఛుడైన خودرو ఖుద్ రో (పా) తానేపెరిగెడు-అడవి-వేసిపెంచని - అటవికము- خودستائی ఖుద్ సతాయీ (స్త్రీ) ఆత్మస్తుతి خودسر ఖుద్ సర్ (పా) స్వేచ్ఛగల తలబిరుసైన-అహంకారియైన خودغرض ఖుద్ గరజ్ (పా) స్వప్రయోజన పరుడు خودکرده ఖుద్ కర్ద (పా) స్వకృతమైన خودکشی ఖుద్ కుషీ (స్త్రీ) ఆత్మహత్య خودمختار ఖుద్ ముఖ్తార్ (పా) సర్వస్వాతంత్ర్యము గల-స్వతంత్రము - స్వేచ్ఛగల خودنما ఖుద్ నుమా (పా) ఆడంబరముగల- గర్విష్ఠియైన خودنمائی ఖుద్ నుమాయీ (స్త్రీ) ఆడంబరము-గర్వము.

خودی ఖుదీ (పా-స్త్రీ) ఆత్మ-గర్వము-స్వప్రయోజనపరత- ఆత్మంభరిత్వము.

خور ఖుర్ (పా-పు) తిండి-భక్షణము خورونوش ఖురొ, నోష్ (పు) అన్నపానములు-తినుడు-త్రాగుడు.

خوراب ఖోరాబ్ (పా-పు) మధుమత్తము; మురికనీరు-వండునీరు-నీపరుట్టు.

خوراک ఖూరాక్ (పా-స్త్రీ) ఆహారము-బత్తెము- మేత-తిండి-మాత్ర; ఔషధపరిమాణము.

خورجین ఖూర్ జీన్ (పా-పు) బొక్కసము అడపము.

خورد ఖుర్ద్ (పా) చిన్న-పిన్న- అల్పమైన- خوردبرد ఖుర్ద్ బుర్ద్ (పా- స్త్రీ) అపహరణము- خوردسال ఖుర్ద్ సాల్ (పా) చిన్న పిన్న వయసుగల.

خوردن ఖుర్దన్ (పా-స్త్రీ) భక్షణము-తినుట-పానము.

خوردنی ఖుర్దనీ (పా-స్త్రీ) అహారయోగ్యము-తిండితిను బండము.

خورده ఖుర్ద (పా-పు) తినిన-తినబడిన-చిల్లర

خورده فروش ఖుర్దఫరోష్ (పా) మారు బేరగాడు-చిల్లరబేరగాడు.

خوردی ఖుర్దీ (పా-స్త్రీ) చిన్నతనము-అల్పత్వము.

خورسند ఖుర్సంద్ (పా) తృప్తిచెందిన-సంతోషించిన.

خورش ఖురిష్ (పా-స్త్రీ) ఆహారము-తిండి-భక్షణము-పానము.

خورشید ఖుర్షీద్ (పా-పు) సూర్యుడు-ప్రొద్దు.

خوره ఖూర (పా-పు) కుష్టరోగము-బట్టతల రోగము.

خوش ఖుష్ (పా) సంతోషముగల-సంతోషకరమైన-ఉల్లాసము-సౌఖ్యముగల-మనోహరమైన-అందమైన-పొంకమైన-ఇష్టముగల-తృప్తిజెందిన-మంచి మేలైన-బాగైన

خوش اسلوب అస్లూబ్ (పా) అందమైన-పొంకమైన-సొంపైన

خوش اسلوبی అస్లూబీ (పా-స్త్రీ) అందము-పొంకము-సొంపు

خوش اطوار అత్వార్ (పా) సద్వర్తనగల-మర్యాదలుగల-సభ్యమైన

خوش الحان ఇల్హాన్ (పా) సుస్వరమైన

خوشامد ఆమద్ (పా-స్త్రీ) ముఖస్తోత్రము-ఇచ్చకములు

خوشامدی ఆమదీ (స్త్రీ) ఇచ్చకాలమారి-ముఖస్తోత్రముచేయువాడు-సుస్వరము గల

خوشبو బూ (స్త్రీ) సుగంధము-సువాసన

خوشبودار బూదార్ (పా) సువాసనగల సుగంధముగల

خوش بیان تقریر బయాన్-తక్రీర్ (పా) వక్తయైన-వాక్చాతుర్యముగల-వాగ్ధాటిగల

خوش بیانی బయానీ (స్త్రీ) వక్తృత్వము-వాగ్ధాటి-వాక్చాతుర్యము

خوش پوشاک పోషాక్ (పా) వస్త్రాలంకారముగల

خوش حال హాల్ (పా) ధనవంతుడు-కలవాడు స్థితిమంతుడు

خوش خرام ఖిరామ్ (పా) మందయానముగల-అందమైన నడకగల

خوش خبری ఖబ్రీ (పా-స్త్రీ) శుభవార్త-సువార్త

خوش خط ఖత్ (పా) కుదురైనవ్రాత-మంచివ్రాత

خوش خلق ఖల్క్ (పా) సభ్యుడైన-మర్యాదస్థుడు

خوشدامن దామన్ (పా-స్త్రీ) (పిల్లనిచ్చిన) అత్త

خوش رنگ రంగ్ (పా) సువర్ణము-మంచివన్నెగల

خوش سلیقه సలీక (పా) సభ్యుడైన-మర్యాదస్థుడు-

خوش طالع-نصیب తాలఽ-నసీబ్ (పా) అదృష్టవంతుడు

خوش طبع తబఽ (పా) హాస్యముఖుడు-సంతోష స్వభావముగల

خوش قطع కతఽ (పా) అందమైన-పొంకమైన

خوش کرنا కర్నా (ఉ) సంతోషపెట్టుట

خوش گپ గప్ (పా) సల్లాపము-వాచాలుడు-వాక్చాతుర్యముగలవాడు

خوش گوار గవార్ (పా) ఇంపైన-మనోజ్ఞమైన

خوش معاش మఆష్ (పా) బాగాపెరిగినవాడు-స్థితిమంతుడు-కలవాడు

خوش نما నుమా (పా) అందమైన-సొంపైన-సుందరమైన-

خوش نویس ఖుష్‌నవీస్ (పా) మంచి వ్రాత గాడు-సు లేఖకుడు خوش نیت ఖుష్ నియత్ (పా) సచ్చింతగల-మంచి తలంపు గల-సునీతుడైన خوش ہونا ఖుష్ హోనా (పా) సంతోషపడుట.

خوشنود ఖుష్నూద్ (పా) సంతసించిన-సంతోషముగల-ప్రీతిగల - అనుమోదించిన అనుగ్రహింప బడిన.

خوشنودی ఖుష్నూదీ (పా-స్త్రీ) సంతోషము-ప్రీతి-అనుమోదము.

خوشہ ఖోష (పా-పు) కంకి-వెన్ను-గుత్తి-గుచ్ఛము خوشہ چیں ఖోషచీఁ (పా) రాలిన కంకులుఏరువాడు-ఉంఛవృత్తుడు.

خوشی ఖుషీ (పా-స్త్రీ) సంతోషము- ఆనందము- ఆహ్లాదము-అనుమోదము-ఉల్లాసము తృప్తి-ఉత్సాహము خوشی خوشی سے ఖుషీ ఖుషీసే (పా) బుద్ధిపూర్వకముగా-మనః పూర్వకముగా خوشی کرنا ఖుషీకర్నా (ఉ) ఉత్సవముచేయుట-ఉత్సహించుట.

خوض ఖౌజ్ (అ-పు) ధ్యానము-పర్యాలోచన-శోధన విచారణ, విమర్శ.

خوف ఖౌఫ్ (అ-పు) భయము-భీతి خوفناک ఖౌఫ్‌నాక్ (పా) భయంకరమైన.

خوک ఖూక్ (పా-పు) పంది-సూకరము.

خوگر ఖూగర్ (పా-పు) అలవాటుపడిన-అభ్యాసముగల-వాడుకపడిన.

خوگیر ఖోగీర్ (పా-పు) కందళము-పల్లము, క్రిందిగంత-గొంగడి బొంత-చెమటబొంత.

خول ఖోల్ (పా-పు) బుఱ్ఱ-తిత్తి-సంచి-గవిసెన-చెక్కు-ఛాయ.

خولنجان ఖూలింజాన్ (పా-పు) తమలపాకుతీగ వేరు,

خون ఖూన్ (పా-పు) రక్తము - నెత్తురు; హత్య-చంపుట خون آلودہ ఖూన్ ఆలూద (పా) రక్తలిప్తమైన خون بہا ఖూన్‌బహా (పా) రక్తమూల్యము-ఒకనిని చంపినవాడు వాని వారసులకిచ్చు రొక్కము خون ٹپکانا ఖూన్ టప్‌కానా (ఉ) (అయథము) రక్తలిప్తమగుట خون خرابہ ఖూన్ ఖరాబ (పు) రక్తపాతము-ప్రాణహాని- ప్రాణనష్టము - خون خوار ఖూన్ ఖార్ (పా) ఘాతుకమైన క్రూరమైన-خون ریزی ఖూన్ రేజీ (పా-స్త్రీ) రక్తపాతము-సంహారము-ప్రాణఘాతము- خون سفید کرنا ఖూన్ సఫేద్ కర్నా (ఉ) నిర్దయుడగుట-అసమాధానపడుట-కోపించుట خون ہونا ఖూన్ హోనా (ఉ) చంపబడుట-హతమగుట- హత్యయగుట-వృథాయగుట.

خونی ఖూనీ (పా-పు) హంతకుడు-హత్యచేసినవాడు; ఘాతుకమైన-క్రూరమైన.

خوید ఖవీద్ (పా-స్త్రీ) గోధుమజాడు-షండకము-పశువులకు మేతగా ఉపయోగించు గోధుమపైరు-లేతపైరు,

خویش ఖేష్ (ఖ్వేష్) (పా-పు) స్వతః- స్వంత-స్వకీయమైన-ఆప్తమైన-బంధువుడు- అల్లుడు-బాంధవ్యముగల-సామీప్యము

خیار ఖియార్ - خیارین ఖియారైన్ (అ-పు) దోసకాయ.

خیاط ఖియాత్ (అ-పు) సూదిపనివాడు

خیاط ఖియాత్ (అ-పు) నూలు-పట్టుదారము.

خیال ఖయాల్ (అ-పు) చిత్తవృత్తి-ధ్యానము-తలంపు-ఆలోచన-చింత-విచారము-అభిప్రాయము-లక్ష్యము-మనస్సృష్టి-గ్రహింపు-తెలివి-ఒకపాట-లవారీ-మనోరథము خیال باطل ఎ, బాతిల్ (పు) తప్పు తలంపు-తప్పు అభిప్రాయము-వెడ్డితలంపు خیال خام ఎ, ఖామ్ (పు) వెడ్డితలంపు-పిచ్చితలంపు-పనికిమాలిన తలంపు خیال سے باہر సే బాహర్ (క్రి) ఆసంభవము-అసమంజసము-అచింత్యము-అసంగతము خیال فاسد ఎ, ఫాసిద్ (పు) దుష్టచింతనము-చెడుతలంపు خیال کرنا కర్నా (క్రి) తలంచుట-లక్ష్యపెట్టుట-గౌరవించుట.

خیالات ఖియాలాత్ (అ-పు) మనోరథములు-మనస్సృష్టి-చిత్తవృత్తులు-తలంపులు-(ఏ. వ خیال)

خیالی ఖయాలీ (అ) మానసికమైన-మనఃకల్పితమైన خیالی پلاو పులావ్ (పు) మనోరథసృష్టి-గొంతెమ్మ కోరికలు-గంధర్వనగరము.

خیانت ఖియానత్ (అ-స్త్రీ) అపహరణము-అన్యాయముగా తీసికొనుట.

خیر ఖైర్ (అ-పు) క్షేమము-మేలు-మంచి-బాగు-శుభము-ఆరోగ్యము-కానీ-మంచిది సరియే-మధ్యమపక్షము خیر اندیش خیر اندیش అందేశ్-ఖాహ్ (పా) స్నేహితుడు-హితుడు-మేలుకోరువాడు خیر اندیشی خواہی అందేశీ-ఖాహీ (స్త్రీ) మేలుకోరుట-ఉపకారము-ఉపకారబుద్ధి خیرباد బాద్ (స్త్రీ) వీడ్కోలు (పదము); మేలుగాక خیر مقدم మకదమ్ (పు) స్వాగతము-ఆదరసత్కారము خیر و عافیت ఒ,ఆఫియత్ (స్త్రీ) క్షేమారోగ్యములు-కుశలము, క్షేమలాభములు.

خیرات ఖైరాత్ (అ-స్త్రీ) ధర్మము-దానము పుణ్యము-బిచ్చము خیرات خانہ ఖాన (పు) ధర్మసత్రము-ధర్మశాల-భిక్షాశాల సత్రము.

خیراتی ఖైరాతీ (అ) ధర్మార్థమైన خیراتی شفاخانہ షఫాఖాన (పు) ధర్మవైద్యశాల.

خیرگی ఖీరగీ (పా-స్త్రీ) చీకట్లు-మిరుమిట్లు, దిగ్భ్రమ-చీకట్లుక్రమ్ముట-తిచ్చ-దౌష్ట్యము-వైరము.

خیرہ ఖీర (పా) చీకటియైన-దుష్టమైన-ఎటునుతోచని-కలవరపడిన.

خیریت ఖైరియ్యత్ (అ-స్త్రీ) క్షేమము-కుశలము-ఆరోగ్యము.

خیزاں ఖేజాం (పా) లేచెడు-ఎదిగెడు-ఎగిరెడు.

خیلا ఖైలా (అ-స్త్రీ) పనికిమాలిన-బుద్ధిలేని తెలివిమాలిన-శుంఠ.

خیمہ ఖైమ (అ-పు) పటకుటీరము-గుడారము خیمہ زدن జదన్ (పా) గుడారము వేయుట-గుడారముకట్టుట خیمہ زن జన్ (పా) గుడారములు వేయువాడు లేక కట్టువాడు خیمہ کرنا కర్నా

(క్రి) విడియుట-దిగుట-బసచేయుట,

گاہ خیمہ గాహ్ (పా-స్త్రీ) విడిదిస్థలము-బిరము-గుడారము వేసిన చోటు.

## د

, ధాల్ (అ-స్త్రీ) దకారము, ఇది ఉరుదు వర్ణములలో పదునొకండవ యక్షరము పారసీక భాషలో పదియవది అరబ్బీలో ఎనిమిదవది అరబీ వర్ణసాంఖ్యము (ابجد) లో దీని సంఖ్య నాలుగు.

داب దాబ్ (హి-స్త్రీ) ఒత్తు-ఒత్తుడు-బలము భారము-అధికారము-బలవంతము-పోలిద్బలిమి-నిర్బంధము-నొక్కు-భయము-పెత్తనము-ఒకపొరటు యొక్క నూరుపాలితులు,

داب یا دبیٹھنا యా-దబాబైఠ్నా (క్రి) అపహరించుట - బలవంతముగా తీసికొనుట

داب جمانا జమానా (క్రి) అధికారముచేయుట అధికారముస్థాపించుట

داب దాబ్ (అ-పు) రీతి-తెరగు-రీవి;స్వభావము - వాడుక (పా) వైభవము - పటాటోపము.

دابنا దాబ్నా (హి) ఒత్తుట-అణచుట-పిండుట చూడుము دابا

دابادینا దాబాదేనా (హి) కప్పిపెట్టుట-మూసిపెట్టుట.

داتا దాతా (హి-పు) దాత - యజమాని-భగవంతుడు.

داتن దాతన్ (హి-స్త్రీ) దంతకాష్ఠము-పండ్లపుడక.

داج దాజ్ (అ-పు) చీకటి - చీకటిరేయి (హి-పు) అరణము-పెండ్లికూతురికి తల్లిగారిచ్చిన సొత్తు.

داخل దాఖిల్ (అ) ప్రవేశించెడు-చొరెడు-చొచ్చెడు-చేరెడు-చేరిన-వొచ్చిన-చేర్చిన దూరిన-కూర్చిన - లోపల-సరిగా داخل

کرنا కర్నా (క్రి) చేర్చుట-చొనుపుట చొప్పించుట-కూర్చుట-దూర్చుట-ప్రవేశపెట్టుట-చెల్లించుట.

داخلہ దాఖిల (అ-పు) స్వాధీనము-అప్పగింత, చెల్లు- ప్రవేశము-చెల్లుచీటి-చేర్చిన కూలి.

داخلی దాఖిలీ (అ) చేరియున్న-సంబంధించియున్న-లోపలి.

داد దాద్ (హి-పు) తామర-తీట-గజ్జి పుండ్లు.

داد దాద్ (పా-పు) దానము- న్యాయము ప్రశంస-స్తుతి, మొఱ-ప్రతీకారము- శిక్ష,

داد رسی దాదరసీ (పా-స్త్రీ) న్యాయవిచక్షణ-న్యాయముచేయుట

داد فریاد ఫర్యాద్ (స్త్రీ) న్యాయప్రార్థన-న్యాయముచేయుమనికోరుట-మొఱ

داد و ستد ఒ, సితద్ (స్త్రీ) ఇచ్చి పుచ్చుకోలు.

دادا దాదా (హి-పు) తాత-తండ్రి తండ్రి, పితామహుడు.

دادر దాదుర్ (హి-పు) కప్ప-మండూకము

دادرا దాద్రా (హి-పు) రాగభేదము.

دادنی దాద్నీ (పా-స్త్రీ) ముందుగా నిచ్చినది-అప్పు-ఋణము-సంచకరువు.

دادو దాదూ (హి-పు) దాదో పంతులు అనునొక మతస్థాపకుడు

دادو پنتھی దాదుపంథీ (హి) దాదోపంథీ-దాదోపంతులమతస్థుడు

دادی దాదీ (హి-స్త్రీ) అవ్వ-తండ్రి తల్లి.

دار దార్ (హి-పు) దారువు- కొయ్య-కట్టె.

دار దార్ (పా-స్త్రీ) కొఱత-శూలము.

دار దార్ (అ-పు) నివాసము-ఇల్లు-వాడ-వీధి-స్థానము-శాల-

دار الامارت

خلافت سلطنت ఉల్, ఇ మారత్ ఖిలాఫత్-సల్తనత్ (పు) రాజధాని-రాజ నివాసము-ముఖ్యపట్టణము دار البقا ఉల్-బకా (పు) పరలోకము دار الشفا ఉష్షఫా(పు) వైద్యశాల دار الضرب ఉజ్జర్‌బ్ (పు) టంకసాల-నిష్క-శాల. دار العلوم ఉల్-ఉలూమ్ (పు)విద్యాపీఠము- సర్వకళాశాల دار العمل ఉల్ అమల్ (పు) కార్యస్థానము- ప్రపంచము పనిజరుగుచోటు دار الفنا ఉల్, ఫనా (పు) మర్త్యలోకము-ప్రపంచము دار المحن ఉల్-మిహన్ (పు) సంసారము-ప్రపంచము دار المکافات ఉల్, ముకాఫాత్ (పు) కర్మభూమి-ప్రపంచము ప్రతిఫలము దొరకుచోటు.

دار దార్ (పా) ధారుడు -దారుడు- కాడు, వాడు-కలది-మతుబర్థక ప్రత్యయము دار و مدار ఒ, మదార్ (పు) నిర్ణయము-నిర్ధారణము-ఏర్పాటు-మూలము-ఆధారము ఉండుటేమూలు.

دارچینی దార్-చీనీ (పా-స్త్రీ) లవంగపు చట్ట.

دارو దారూ (పా-పు) సారాయి- తుపాకి మందు.

دارو దారూ (పా-పు) ఔషధము - మందు సారాయి دارو درمن దరమన్(పా-పు) వైద్యము-చికిత్స-మందుమాకులు.

داروغائی దారోగాయీ (పా-స్త్రీ) దారోగాయొక్క ఉద్యోగము.

داروغہ దారోగా (పా-పు) అధ్యక్షుడు-అధికారి-నాయకుడు- కార్యదర్శి, పె విచారణకర్త.

داری దారీ (హి-స్త్రీ) చెరపట్టినయాడుది-దాసి.

داس దాస్ (హి-పు) దాసుడు-సేవకుడు.

داس దాస్ (పా-పు) కొడవలి-కత్తి.

داسا దాసా (హి-పు) రాతిపలక, కొయ్యపలక, ఎత్తుకొరకు పెట్టునది.

داستان దాస్తాన్ (పా-స్త్రీ) గాథ-కథ-చరిత్రము-సుద్ది.

داسی దాసీ (హి-స్త్రీ) దాసి-సేవకురాలు

داشت దాష్త్ (పా-స్త్రీ) పోషణ-పాలన-రక్షణ-పదిలము-ఉంచుట.

داعی దాఈ (అ-పు) మేలుకోరువాడు-వాది-వ్యాజ్యెకాడు-పిలుచువాడు -కోరువాడు.

داعیہ దాఇయ (అ-పు) వ్యాజ్యము-కొంట ప్రార్థన-వ్యాజ్యెగత్తె-మేలుకోరునది.

داغ దాగ్ (పా-పు) మరక,మచ్చ- కళంకము చుక్క-గురుతు, దోషము-లోపము మారుటు, నింద, వాత-చురుకు-గాయము-పుండు-చింత-వ్యసనము- మత్సరము داغ دینا దేనా (ఉ) వాతపెట్టుట- కాల్చుట మాన్పుట.

داغنا దాగ్నా(ఉ) వాతపెట్టుట-కాల్చుట తుపాకి పేలు॥ కాల్చుట.

داک దాక్ (హి-స్త్రీ) ద్రాక్ష.

دال దాల్ (హి-స్త్రీ) దాలి-విసరినకాయ, ధాన్యము-పప్పు, గ్రుడ్డునుండివచ్చినపక్షి, పిల్లయొక్క ముక్కు-పచ్చదనము-కిరణకేంద్రము دال گلنا గల్నా (ఉ) పప్పుఉడుకుట-పప్పుచిముడుట-ఉపయోగించుట-గుణమిచ్చుట-సాగుట- నెరవేరుట-

دالان దాలాన్ (పా-పు) కూటము-పడక

డు. **دیدارو** దీదారూ (పా) సుందర మైన, సొగసైన, అందమైన: రూపసియైన.

**دیدہ** దీద (పా.పు) నేత్రము, కన్ను, చూచిన

**دیدہ ودانستہ** —ఓదానిస్త (పా) ఎరిగిఎరిగి, తెలిసితెలిసి, చేజేతల, మనఃపూర్వకముగా

**دیر** దైర్ (పా.పు) దేవాలయము, పూజా మందిరము.

**دیر** దేర్ (పా. స్త్రీ) ఆలస్యము, చాల కాలము, చిరకాలము, ఆలస్యమైన, చాల సేపు, కాలాతీతమైన, నెమ్మతి, మెల్లన, **دیرپا** —పా (పా) నిలుకడైన, చాలకాల ముండెడు, గట్టి, బలమైన.

**دیرہ** దైర (హి.పు) దేవాలయము.

**دیری** దేరీ (హి. స్త్రీ) ఆలస్యము, చాల సేపు; కాలాతీతము, నెమ్మతి, మెల్లన.

**دیرینہ** దేరీన (హి) చిరకాలపు, పురాణ మైన, అనుభవశాలియైన.

**دیس** దేస్ (హి.పు) దేశము, ప్రాంతము, **دیس نکالا** —నికాలా (హి) దేశభ్రష్టుని జేయుట, వెడలగొట్టుట.

**دیسا** దేసా (ఉ.పు) ఆధిక్యము, తర్జిమము [తురుష్కులలో]

**دیسنا** దీస్నా (హి) అగపడుట, కనుపడుట.

**دیسی** దేసీ (హి) స్వదేశపు, దేశీయమైన.

**دیغ** దేగ్ (పా. స్త్రీ) చెరవ, కాగు, గాబు, వంటతపేల.

**دیکھنا** దేఖ్నా (హి) చూచుట, కనిపెట్టి యుండుట, వెదకుట.

**دیکھنا** దీఖ్నా (హి) అగుపడుట, కనుపడుట

**دیگ** దేగ్ (పా. స్త్రీ) చూడు. **دیغ** అను పదము. **دیگدان** —దాన్ (పు) ప్రొయ్యి. **دیگچہ-دیگچی** దేగ్చ-దేగ్చీ చిన్న చెరవ, చిన్నవంటతపేల.

**دیگر** దీగర్ (పా) చూడు **دگر**

**دے مارنا** దేమార్నా (హి) విసరి నేలకు కొట్టుట, విసరికొట్టుట, పారవేయుట.

**دیمک** దీమక్ (హి. స్త్రీ) చెదలు **دیمک لگنا** —లగ్నా (హి) చెదలుపట్టుట.

**دیں** దీఁ (హి) దీనుడు, దిక్కులేనివాడు.

**دین** దీన్ (అ.పు) మతము, ధర్మము, పరము, పరమార్థము. **دیندار** —దార్ [పా] ధర్మనిష్ఠుడు, పారమార్థికుడు. **دینداری** —దారీ [స్త్రీ] పారమార్థికము, ధర్మనిష్ఠ.

**دین** దైన్ (అ.పు) అప్పు, ఋణము, **دیندار** —దార్ (పా) ఋణస్థుడు.

**دینا** దేనా (హి) ఇచ్చుట, ఒసగుట; అప్పు, ఋణము; కొనుట; కొట్టుట.

**دینار** దీనార్ (అ.పు) ఒక బంగారు నాణెము, (దాని విలువ తెలియదు)

**دین لین** దేన్ లేన్ (హి.పు) ఇచ్చి పుచ్చు కోలు, వ్యాపారము, బేరము, వర్తకము.

**دینی** దీనీ (అ) పారమార్థికమైన, మతసం॥.

**دیو** దేవ్ (పా.పు) రాక్షసుడు, దయ్యము; బలవంతుడు, భూతము.

**دیو** దేవ్ (హి.పు) దేవుడు దేవత **دیوستان** —స్థాన్ (పు) కోవెల, దేవాలయము.

**دیوا** దేవా (హి.పు) దాత, ఇచ్చువాడు.

**دیوار** దీవార్ (పా. స్త్రీ) గోడ, **دیوار قہقہہ** —ఎ, కహ్కహా (స్త్రీ) అత్యున్నతమైన చీనా దేశపుగోడ, అత్యున్నతమైన లేక పొడు గైన గోడ, **دیوارگیری** —గీరీ (స్త్రీ) గోడసంచులు, గోడను అలంకారముగా కట్టుబట్ట మొ॥వి; గోడదీపము.

**دیوال** దేవాల్ (హి.పు) దాత, ఇచ్చువాడు.

**دیوان** దీవాన్ (పా.పు) దివాణము, ఆస్థానము; మంత్రి, ప్రధాని; సంపుటము, గ్రంథము, **دیوان اعلیٰ** —ఎ, ఆలా [పా] ప్రధానమంత్రి, **دیوان خاص** —ఎ, ఖాస్ [పా] మంత్రాంగము, సభ, రాజసభ,

కొలువుకూటము; **دیوان خانہ**—ఖాన [పు] కొలువుకూటము, రచ్చకూటము, కార్యాలయము.

**دیوانگی** దీవానగీ [పా. స్త్రీ] పిచ్చితనము, ఉన్మాదము, వెఱ్ఱితనము.

**دیوانہ** దీవాన [పా. పు] పిచ్చిపట్టిన, వెఱ్ఱి, వెడ్డి, పిచ్చివాడు.

**دیوانی** దీవానీ [పా. స్త్రీ] పిచ్చిది, ఉన్మత్తురాలు.

**دیوانپن** దీవానపన్ [పా. పు] పిచ్చితనము, ఉన్మాదము.

**دیوتا** దేవ్‌తా [హి. పు] దేవత.

**دیوٹ** దీవట్ [హి. స్త్రీ] దీపస్తంభము.

**دیوث** దయ్యూస్ [అ. పు] భార్యయొక్క వ్యభిచారమును ఆటంకపరచనివాడు, కుంటెనగాడు, సిగ్గిడి, సిగ్గుమాలినవాడు.

**دیودار** దేవ్‌దార్ [హి. పు] దేవదారుచెట్టు.

**دیور** దేవర్ (హి. పు) మరది, దేవరుడు, మగని తమ్ముడు, **دیورانی** దేవ్‌రానీ (హి. స్త్రీ) దేవరునిభార్య, చిన్నతోడికోడలు.

**دیوڑھی** దేవ్‌ఢీ [హి. స్త్రీ] కడపగుమ్మము, ఆస్థానము, దివాణము, భవనము, హర్మ్యము.

**دیوک** దీవక్ [హి. స్త్రీ] చూడు **دیمک**

**دیول** దేవల్ [హి. పు] దేవాలయము, గుడి.

**دیولا** దేవ్‌లా [హి. పు] చిన్నదీపము.

**دیولی** దేవ్‌లీ [హి. స్త్రీ] చేపపొలుసు, పొర, పక్కు, స్ఫోటకపుపక్కు, చిన్నదీపము, కనుగుంట.

**دیوی** దేవీ (హి. స్త్రీ) దేవి, దేవత.

**دیہ** దేహ్ [హి. స్త్రీ] దేహము.

**دیہ** దీహ్ [పా. పు] గ్రామము, పల్లియ, **دیہات** దీహాత్ [పు] గ్రామములు, [ఏ. వ **دیہ**] (యము.

**دیہرا** దేహ్రా (హి. పు) జీనమతస్థుల దేవాలయము.

**دیہی** దీహీ [పా] గ్రామీణము, మోటు, తెలివిమాలిన, అనాగరికమైన.

# ( ڈ )

**ڈ** డాల్ [హి. పు] ఇది ఉరుదు వర్ణమాలలో పన్నెండవ యక్షరము, అరబ్బీ పారసీక భాషలలో ఈవర్ణములేదు గాన అరబ్బీవర్ణ సాంఖ్యములో దీనిసంఖ్య د అనుఅక్షరము యొక్క సంఖ్యకు సమముగా, నాలుగని యెంచుదురు.

**ڈاب** డాబ్ [హి. పు] దర్భ; కత్తిగలమొలపట్టె; పచ్చికొబ్బరికాయ.

**ڈابر** డాబర్ (హి. పు) చిత్తడినేల, జాడువ, కుంట, మడుగు, నీళ్లగంగాళము.

**ڈابی** డాబీ (హి. స్త్రీ) కోతవానిపాలు, పంటలో పదియవ భాగము, దశాంశము.

**ڈاٹ** డాట్ (హి. స్త్రీ) మూత, దిమ్మ, బిరడ, మేకు, దట్టన, (బెదరింపు) లాదు (విలువంపు) లాదులోని నడిమి రాయి, **ڈاٹ ڈپٹ** — డపట్ (హి) కండ్లబెదరు, గద్దింపు.

**ڈاٹنا** డాట్నా (హి) దట్టనచేయుట, గద్దించుట, బెదరించుట, చివాట్లుపెట్టుట; బిరడాపెట్టుట, దిమ్మవేయుట, గట్టించుట, క్రుక్కుట, కూరుట.

**ڈار** డార్ (హి. స్త్రీ) లేళ్లగుంపు, పశువుల మంద, పక్షులపిండు; బారు, వరుస, కొమ్మ, సమూహము.

**ڈاڑم** డాడిమ్ (హి. స్త్రీ) దాడిమము - దాళిమ్మ - దాడింబ - (పండు.)

**ڈاڑھ** డాఢ్ (హి. స్త్రీ) దవడపల్లు- పక్కపల్లు - **ڈاڑھ گرم ہونا** - డాఢ్-గరమ్‌హోనా (ఉ) తినుట - చెంపదెబ్బతినుట.

**ڈاڑھی** డాఢీ (హి. స్త్రీ) గడ్డము; మత్తి చెట్లు మొ॥ వానిఊడలు.

**ڈاک** డాక్ (హి. స్త్రీ) ఉత్తరముల సంచి, అంచియ, అంచె; కక్కుడు; వాంతి, డోకు; పల్లకి మొ॥ వాని అడుగుచట్టము, చౌకము, **ڈاک بنگلا** డాక్ - బంగ్లా (పు) సత్రము, బాడుగసత్రము, **ڈاک چوکی - خانہ - گھر** డాక్ - చౌకీ - ఖాన - ఘర్ (పు) అంచెలచావడి, అంచెలసాల.

**ڈاکا** డాకా (హి. పు) బందిపోటు, దోపిడి, తెరవాటు, బందిపోటుగాడు.

**ڈاکنا** డాక్నా (హి) ఓకరించుట, వాంతి చేయుట.

**ڈاکنی** డాక్నీ (హి. స్త్రీ) ఢాకినీదయ్యము, గయ్యాళి.

**ڈاکو** డాకూ (హి. పు) తెరవాటుకాడు, బందిపోటువాడు, దోపుడుదొంగ.

**ڈاکیا** డాకియా (హి. పు) ఉత్తరములుపంచువాడు, అంచెలవాడు, జాబులవాడు, సంకేతహరుడు, కాటరి, బందిపోటువాడు.

**ڈاگی** డాగీ (హి. పు) తిండిపోతు.

**ڈال** డాల్ (హి. స్త్రీ) కొమ్మ, మండ; నీరు కట్టుట, గూడకట్టుట; కత్తిబద్ద; బొక్కెన. **ڈال والا** డాల్ - వాలా (పు) శాఖామృగము, కోతి, **ایک ڈال کا** - ఏక్ - కా ( ) ఆఖండము.

**ڈالا** డాలా (హి. పు) పెద్దకొమ్మ; డోలిక.

**ڈالنا** డాల్నా (హి) పడవేయుట, వేయుట; పోయుట, ఉంచుట, పెట్టుట; వాంతి చేయుట; పారవేయుట; తొడుగుట; కూరుట, గుచ్చుట.

**ڈالی** డాలీ (హి. స్త్రీ) కొమ్మ, మండ, రెమ్మ; దెబ్బ; ఫలహారపుకట్నము, కానుకగా పంపుపండ్లకొమ్మలు మొ॥వి, సంగ్రహం. (వ:చె.

**ڈامچا** డామ్చా (హి. పు) పొలములో ...

**ڈامر** డామర్ (హి. పు) కీలు. తారు. సాల జిగురు.

**ڈانٹ** డాంట్ (హి. స్త్రీ) దట్టన, గద్దింపు, బెదరింపు, చివాట్లు, కండ్లబెదరు.

**ڈانٹنا** డాంట్నా (హి) బెదరించుట, గద్దించుట, కండ్లబెదరుపెట్టుట, ఉరిమిచూచుట.

**ڈانٹھ - ڈانٹھل** డాంఠ్ - డాంఠల్ (హి. పు) కాడ, తొడిమె; మంజరి, వృంతము.

**ڈانٹھی** డాంఠీ (హి. స్త్రీ) వరి మొ॥ వాని మొట్టిక, దంటు, దుబ్బు, కోసగామిగిలిన మొట్టిక. గడ్డిపరక.

**ڈانڈ** డాండ్ (హి. పు) దండము, కఱ్ఱ, నాకాదండము, తెడ్డు; దండుగ; వెన్నెముక; పొలముచేర, కొండి ట్టు.

**ڈانڈا** డాండా (హి. పు) కొండిట్టు; పొలముచేర, మేర, త్రోవ, డొంక, ఎల్ల, సీమ.

**ڈانڈی** డాండీ (హి. పు) నావికుడు, పడవతెడ్డువేయువాడు, డోలిక, త్రాసుదండె.

**ڈانس** డాంస్ (హి. పు) బొమిడి. పెద్దదోమ, పురుగుకాటు. దంశము.

**ڈانک** డాంక్ (హి. స్త్రీ) ఉంగరపురాయి క్రిందవేయుతగడు మొ॥వి.

**ڈانگ** డాంగ్ (హి. స్త్రీ) బడితె; కఱ్ఱ; పర్వతశిఖరము.

**ڈانگر** డాంగర్ (హి.పు) పశువు, గోద; మొద్దు (వాడు).

**ڈانواں ڈول** డాంవాఁడోల్ (హి) దేశ ద్రిమ్మరియైన, చంచలమగు, స్థాయిలేని, చెడిన, పాడైన, త్రోవమాలిన, దిక్కుమాలిన, **ڈانواں ڈول پھرنا** — ఫిర్నా (హి) ద్రిమ్మరిగాతిరుగుట, దేశద్రిమ్మరిగా తిరుగుట.

**ڈانواں ڈولی** డాంవాఁడోలి (హి. స్త్రీ) దేశద్రిమ్మరితనము, దిక్కుమాలిన తనము, త్రోవమాలినతనము.

**ڈانورو** డానోరూ (హి.పు) పులిపిల్ల.

**ڈاہ** డాహ్ (హి. స్త్రీ) మత్సరము, పగ, వైరము, స్పర్థ, కావేశము.

**ڈاهنا** డాహ్నా (హి) మత్సరించుట, కడుపుమండుట; లోహాదులను కాచుట, లేక కరగుట.

**ڈاهی** డాహి (హి. స్త్రీ) మత్సరముగల, స్పర్థగల, పగగల, వైరముగల.

**ڈائن** డాయిన్ (హి. స్త్రీ) కట్టుబోతుదయ్యా ముది, మంత్రగత్తె, కురూపి.

**ڈب** డబ్ (హి.పు) సంచి, తిత్తి; కుప్పె; పెట్టె; శక్తి; అధికారము; శిద్దెలుచేయు తోలు. (టిక.

**ڈبا** డబ్బా (హి.పు) తోలుసిద్దె, కుప్పె, షే

**ڈبا** డిబ్బా (హి.పు) పేటిక, పెట్టె, కరండము.

**ڈبانا** డుబానా (హి) ముంచుట, పాడుచేయుట.

**ڈباو** డుబావ్ (హి.పు) మనిషిబుడకలోతుగల, (నీరు) లోతైన, మునిగెడు.

**ڈبڈبانا** డబ్‌డబానా (హి) నీళ్లతోలేక కన్నీరుతో నిండియుండుట, కండ్లుతడియగుట.

**ڈبرا** డబ్రా (హి.పు) బాడువ, బురదగుంట, అడుసునేల.

**ڈبری** డబ్రీ (హి. స్త్రీ) గిన్నె, బోగణి.

**ڈبریا** డబర్యా (హి) ఎడమచేతివాడుకగల, ఎడమచేత పనిచేయువాడు. (నీరు

**ڈبکا** డబ్కా (హి.పు) అప్పుడు బావినుండిచేదిన

**ڈبکا** డఁబ్కా (హి.పు) భయము, బెంగ, దిగులు.

**ڈبکی** డుబ్కీ (హి. స్త్రీ) బుడక, మునక.

**ڈبو** డుబ్బూ (హి.పు) పెద్దగరిటె, ఇనుపగరిటె. (టు.

**ڈبوانا** డుబ్వానా (హి) ముంచునట్లుచేయు

**ڈبونا** డుబోనా (హి) ముంచుట, పాడుచేయుట.

**ڈبی** డిబ్బీ (హి. స్త్రీ) చిన్నపెట్టె, బరిణ, కాయ, కరండము.

**ڈبیا** డిబియా (హి. స్త్రీ) చిన్నపెట్టె, బరిణ, కాయ.

**ڈپٹ** డపట్ (హి. స్త్రీ) గుఱ్ఱపుపరుగు, తాకుడల, ఉరుకు, పరుగు; గద్దింపు, బెదరింపు.

**ڈپٹانا** డప్టానా (హి) గుఱ్ఱమును వడిగాపరుగెత్తించుట.

**ڈپٹنا** డపట్నా (హి) ఉరుకుట, పరుగెత్తుట; గద్దించుట, చివాట్లుపెట్టుట, బెదరించుట.

**ڈپوره** డప్పూహ్ (హి) మిక్కిలి లావైన, పెద్ద, దొడ్డ. (తైన.

**ڈپول** డపోల్ (హి) దొడ్డ, గొప్ప, మహా

**ڈپھ** డఫ్ (హి.పు) తప్పెట, డప్పు, ఢక్క.

**ڈپھالی** డఫాలీ (హి.పు) తప్పెటవాడు, పక్కీరు.

**ڈٹا** డట్టా (హి.పు) దిమ్మ, బిరడ, మూత.

**ڈٹنا** డట్నా (హి) దిట్టముగా నిలుచుట, దిటవుగానుండుట, నిలుచుట, ఆగుట,

ఎదురుచూచుట, కదలకుండుట, బెట్టుబిగి

**ڈتھنا** డిత్నా (హి) అగుపడుట, తోచుట, కనుపడుట. (బెదరు.

**ڈر** డర్ (హి.పు) భయము, బుగులు, భీతి,

**ڈرالو** డరాలూ (హి) భయపడెడు, పిరికి.

**ڈرانا** డరానా (హి) బెదరించుట, భయపెట్టుట, **ڈراؤ** డరావ్ (హి.పు) భీతి, భయము, బెదరు.

**ڈراونا** డరావ్నా (హి) భయంకరమైన, భయపెట్టెడు.

**ڈرپوکنا - ڈرپوک** డర్‌పూక్ - డర్‌పూక్నా (హి) పిరికి, పంద, భయపడెడు.

**ڈرنا** డర్నా (హి) భయపడుట, బెదరుట.

**ڈرویا** డర్వయ్యా (హి) పిరికి, భయశాలి,

**ڈری** డరీ (హి.పు) భయము, బెదురు. (గల.

**ڈڑھیل** డఢియల్ (హి) పొడుగుగడ్డము

**ڈس** డస్ (హి.స్త్రీ) త్రాసుత్రాళ్లు, బట్టకొసన నేయకవిడిచినపడుగుపోగులు, బద్దె.

**ڈسنا** డస్నా (హి) దంశించుట, కుట్టుట, కరచుట, కాటువేయుట, చంపుట.

**ڈف** డఫ్ (హి.పు) తప్పెట, డప్పు.

**ڈفالی - ڈفالچی** డఫాలీ - డఫాల్చీ (హి.పు) చూడు **ڈفلی - ڈپھالی** డఫ్లీ (హి.స్త్రీ) చిన్నడప్పు లేక తప్పెట.

**ڈک** డుక్ (హి.పు) పిడికిటిపోటు, పిడిగ్రుద్దు.

**ڈکار** డకార్ (హి.స్త్రీ) త్రేనుపు, ఉద్గారము, గర్జనము, **ڈکارلینا** - డకార్లేనా (హి) చూడు. **ڈکارنا**

**ڈکارنا** డకార్నా (హి) త్రేనుపుట, అరచుట, అపహరించుట. (గుట.

**ڈکڈکانا** డక్‌డకానా (హి) గటగట త్రా

**ڈکر** డక్కర్ (హి.పు) అడవిపంది.

**ڈکرانا** డక్‌రానా (హి) బాధచేకఠినముగా యేడ్చుట, అొప్పుట.

**ڈکریا** డుక్‌రియా (హి) మిక్కిలి ముసలిది.

**ڈکوت** డకాత్ (హి.పు) ప్రశ్నజెప్పనేర్పుగల ఒకసంకరజాతి హిందువులు.

**ڈکیت** డకైత్ (హి.పు) చూడు. **ڈاکو**

**ڈکیتی** డకైతీ (హి.స్త్రీ) బందిపోటు, దోపిడి, తెరవాటు.

**ڈگ** డగ్ (హి.స్త్రీ) అడుగు, అంగ, జంగ.

**ڈگا** డగ్గా (హి.పు) పొడుగుకాళ్ల బక్కగుఱ్ఱము, ముసలిగుంఱ, తెలివిమాలినముసలివాడు.

**ڈگانا** డిగాన (హి) తొలగించుట, వ్యభిచరింపచేయుట, జరపుట, జారించుట; చెలింపజేయుట, బెణకించుట, మొగ్గించుట, కదలించుట, లోపరచుట.

**ڈگڈگی** డుగ్‌డుగీ (హి.స్త్రీ) బుడుబుడుక్క, రాయిడిగిడిగిడి, తుడుము.

**ڈگر - ڈگرا** డగర్ - డగ్రా (హి.పు) త్రోవ, బాట, మార్గము, డొంక. (చెరగుట.

**ڈگرانا** డగ్రానా (హి) దొరలించుట, త్రోయు,

**ڈگری** డిగ్రీ (ఇ.స్త్రీ) (Decree) తీర్పు, నిర్ణయము, శాసనము, విధానము, ఆజ్ఞ.

**ڈگمگ** డగ్‌మగ్ (హి.స్త్రీ) తొట్రుపాటు, అల్లాడు, వణకు, కంపనము, తూలుట, ఊగుడు.

**ڈگمگانا** డగ్మగానా (హి) తొట్రుపడుట, కంపించుట, వణకుట, అల్లాడుట, కదలుట, తూలుట, ఊగుట.

**ڈگمگاہٹ** డగ్మగాహట్ (హి.స్త్రీ) కంపనము, అల్లాడు, వణకు, చలనము.

**ڈگنا** డిగ్నా (హి) తొలగుట, జరగుట, చలించుట, అల్లాడుట, కాసడుట, బెణకుట, వ్యభిచరించుట, మొగ్గుట.

ڈلا డలా (హి.పు) ముద్ద; గడ్డ, పెద్దతునక, పెడ్డ; గంప, పెద్దబుట్ట.

ڈلا డల్లా (హి.పు) గంప, జల్ల, సారెపంపు గంప; తునక, ఖండము.

ڈلانا డులానా (హి) డోలాయమానముగా చేయుట, ఊపుట, అల్లాడించుట, చలింప చేయుట, త్రిప్పుట, కదలించుట, విసికించుట. (గుంట.

ڈلاو డలావ్ (హి) పెంటదిబ్బ, కుప్ప, చెత్త

ڈلنا డల్నా (హి) పడుట, పడియుండుట, ఉంచబడుట, ఉండుట.

ڈلوانا డల్వానా (హి) ఇది డాల్నా ڈالنا యొక్క ప్రేరణార్థకము, వేయించుట మొ॥

ڈلی డలీ (హి.స్త్రీ) గడ్డ, తునక, ఖండము; చికినము, (పోక) వక్క.

ڈلیا డలియా (హి.పు) మూతలేనిగంప, బుట్ట; చిన్నతునక, గడ్డ.

ڈمرو డమరూ (హి.పు) డమరము, బుడ బుడక్క, రాయిడిగిడిగిడి.

ڈنٹھل-ڈنٹل డంఠల్-డంటల్ (హి.పు) దంటు, కాడ, కఱ్ఱ.

ڈنٹھلا డంఠ్లా (హి.పు) కాడ, కఱ్ఱ.

ڈنڈ డండ్ (హి.పు) దండము, కఱ్ఱ, దండచేయి, దండాము, (ఒకదేహ పరిశ్రమ), దండుగ, పన్ను కప్పము, శిక్ష.

ڈنڈا డండా (హి.పు) దండము, కఱ్ఱ, గడ, ఇంటిచుట్టుగోడ, పహరి, ప్రాకారము, ڈانڈا کھینچنا డాండాఖీంచ్నా (హి) గోడపెట్టుట. (మము.

ڈنڈوت డండవత్ (హి.స్త్రీ) దండప్రణా

ڈنڈی డండీ (హి.స్త్రీ) పిడి, పిడికోల, త్రాసుదండ, (పూలకొమ్మ లేక దండ) కాడ, తొడిమ ڈنڈی پگ పగ్-(హి) కాలిబాట. ڈنڈی مارنا-మార్నా (హి) తక్కువతూచుట.

ڈنڈے డండే (హి.పు) కోలాటమాడు కోలలు.

ڈنک డంక్ (హి.పు) తేలుమొ॥ వానికొండి లేక ముల్లు, కలముయొక్క పాళి, మొన, కాటు, పోటు. ڈنک مارنا-మార్నా (హి) కొండితోపొడుచుట, కుట్టుట, కాటువేయుట.

ڈنکا డంకా (హి.పు) భేరి, ఢక్క, డమారము; భేరివాయించుకోల, వృద్ధి, జయము.

ڈنکنی డంక్నీ (హి.స్త్రీ) ఢాకిని, మంత్రకత్తె, యాళి.

ڈنکیلا డంకీలా (హి) కొండి లేక ముల్లుగల,

ڈنگوارا డంగ్వారా (హి.పు) పరస్పర సహాయము, కాపువారు ఒకరికి ఒకరు అరకలుమొ॥ బాడుగలేక యిచ్చుకొనుట.

ڈوا డవా (హి.పు) పెద్దకొయ్యతెడ్డు.

ڈنگیا డంగ్యా (హి.పు) పిడి (గల)గిన్నె,

ڈوب డోబ్ (హి.పు) బుడక, మునక, ముంచుట.

ڈوبا డూబా (హి.పు) నీళ్లలో మునిగియున్న పల్లపుభూమి, బాడువ. (శయము.

ڈوبن డోబన్ (హి) మడుగు, కుంట, జలా

ڈوبانا డుబానా (హి) ముంచుట.

ڈوبنا డూబ్నా (హి) మునుగుట, బుడకవేయుట, అస్తమించుట, క్రుంకుట, నాశమగుట. (క్లేశము.

ڈوڈا డూడా (హి.పు) కాయ, పొట్టు, బీజ

ڈور డోర్ (హి.స్త్రీ) దారము, నూలు, పిరి, ధార, కత్తిఅంచు, కులుసు, ڈورے ڈالنا-ఏడాల్నా (హి) కుట్టుట, జడవేయుట.

ڈورا డోరా (హి) త్రాడు, దారము, బంధుత్వము, సంబంధము, రేఖ, గీత, పిడి(గల) గిన్నె, గరిటె, ధార, అంచు, కాయ,

మోసము, టక్కు. (డమర.

ڈورو డోరూ (హి.పు) బుడుబుడుక్కు

ڈوری డోరీ (హి.స్త్రీ) త్రాడు, దారము, నూలు, పిడిగిన్నె, నులక, చేత్రాడు.

ڈوریا డోరియా (హి.పు) అంతటంతటు లానాటి నూలుపోగులుగల సన్నబట్ట, కుక్కలకాపరా. (దివాణము.

ڈوڑی డోడీ(హి.స్త్రీ) కడప, ద్వారము,

ڈوک డోక్ (హి.స్త్రీ) పశువులశ్వాసకోశ రోగము, దొమ్మరోగము.

ڈوکرا డోక్రా (హి.పు) చాలముసలివాడు.

ڈوکنا డోక్నా(హి) డోకరించుట, గటగట త్రాగుట, ఇంకుట, పీల్చుట.

ڈول డౌల్ (హి.పు) శివి,తెరగు, విధము, రీతి, వైఖరి, ప్రకారము, తీరు, వయసు, క్రమము, ఆకారము, రూపము, ఉనికి, పద్ధతి, మాదిరి, మార్గము, ఉపాయము, వాటము, ఒడుపు, సమయము, డౌలు, లాఘవము, بےڈول బేడౌల్(ఉ) వికారమైన, అనాకారమైన. (చేద.

ڈول డోల్ (హి.పు) నీళ్లుచేదుబొక్కెన,

ڈولا డోలా (హి.పు) డోలిక, ఉయ్యాల, కట్టె,

ڈولا డౌలా (హి.పు) పొలముకట్ట, గట్టు, మేర, ఎల్ల, కంచె, ఆవరణము.

ڈولچی డోల్చీ (హి.స్త్రీ) చిన్నబొక్కెన.

ڈولنا డోల్నా (హి) ఊగుట, అల్లాడుట, తూగాడుట, దిమ్మరుట, తిరుగుట, చలించుట, కదలుట, పోతపోయుట.

ڈولی డోలీ [హి.స్త్రీ] డోలిక,కట్టె.

ڈولیا డోలియా [పా.పు] బోయి వాడు, పల్లకీమోయువాడు.

ڈوم డోమ్ [హి.పు] సుద్దులుచెప్పు కులము వాడు, పాటకుడు.

ڈومنی డోమ్నీ [హి.స్త్రీ] పాటకురాలు, సుద్దుచెప్పుకులపు యాడుది.

ڈونجا డోంజా[హి.పు] సొరుప,పరువంజా.

ڈوندا డూండా [హి.పు] ఒకకొమ్ముపెరిగి లేక వాలిపోయినఎద్దు, సుడిగాలి.

ڈونڈی డౌండీ [హి.స్త్రీ] తు డు ము, చాటింపు, ప్రఖ్యాతి.

ڈونگا డోంగా (హి) లోతైన.

ڈونگا డోంగా [హి.పు] దోనె, చిన్నపడవ తొట్టి, పిడి(కోల ల)గిన్నె, మిళ్లి, చిన్న గరిటె,

ڈونگر డోంగర్ [హి.పు] కొండ, గుట్ట, మిట్ట, గట్టు. (దోనె.

ڈونگی డోంగీ [హి.స్త్రీ] చిన్నపడవలేక

ڈوهرا డోహ్రా [హి.పు] చెరుకుసొగసుకొలి యనెట్టు తెడ్డు. (గరిటె

ڈوئی డోయీ (హి.స్త్రీ) తెడ్డు, కొయ్య

ڈھابا ఢాబా (హి) గోడమైపాడిగించిన మిద్దె, పొడుగుగావచ్చియున్న చూరు, గోడతడియకుండవేసినకప్పు-వల, జాలము.

ڈھاٹا ఢాటా (హి.పు) గడ్డపు వెంట్రుకలు పైకి ఎగదీసికట్టుగుడ్డపేలిక, గడ్డముపాతి.

ڈھاٹی ఢాటీ [హి.స్త్రీ] ఉరి, గుడ్డము మూతికి కట్టిముకుసూచుగా వేయుతూచ్చు.

ڈھارس ఢారస్ (హి.స్త్రీ) ధైర్యము, స్థైర్యము, సహాయము, ఆశ్రయము, ప్రోత్సాహము, దిటవు, నెమ్మతి, బరువసము.

ڈھال ఢాల్ (హి.పు) వాలు, వంపు; పల్లము; అచ్చు, మూస; తెరగు, రీతి, పోలిక; ఏటవాలు, దిగుడు; కేడెము,

డాలు; నెమ్మదిగా.

**ڈھالنا** ఢాల్నా (హి) పోత పోయుట, పోయుట, (తాగుట, పారపోయుట, ఒలకపోయుట; నిందించుట, ఎత్తిపొడుచుట, కొల్లపెట్టుట,

**ڈھالو ڈھلوان** ఢాలూ - ఢల్వాన్ (హి) ఏటవాలైన, వాలుగానున్న, ఎగుడు దిగుడు.

**ڈھانا** ఢానా (హి) పడగొట్టుట, పడవేయుట, పాడుచేయుట, క్రమ్మనట్లుచేయుట, వ్యాపింపచేయుట, ప్రసరింపచేయుట.

**ڈھانپنا** ఢాంప్నా (హి) దాచుట, మూయుట, దాపెట్టుట, కప్పుట.

**ڈھانچا - ڈھانچ** ఢాంచా - ఢాంచ్ (హి.పు) చట్టము, చౌకట్టు, ఆకారము, రూపము, పటము, కొయ్యచట్టము.

**ڈھانس** ఢాంస్ (హి. స్త్రీ) దగ్గు.

**ڈھانکنا** ఢాంక్నా (హి) చూడు **ڈھانپنا**

**ڈھائی** ఢాయీ (హి) రెండున్నర.

**ڈھب** ఢబ్ (హి.పు) ఆకారము, రూపము, విధము, ప్రకారము, తెరగు, రీతి, మార్గము, వైఖరి, పద్ధతి, ఉపాయము, డౌలు, వర్తనము, తెలివి, స్థితి, గతి. వయినము.

**ڈھبوا** ఢబువా (హి) దుడ్డు, డబ్బు, పైస.

**ڈھپ** ఢప్ (హి.పు) తప్పెట.

**ڈھپنا** ఢప్నా (హి) మరుగుపడుట, దాగుట; మూత, మూకుడు.

**ڈھٹائی** ఢిటాయీ (హి. స్త్రీ) దిట్టతనము, సిగ్గుమాలినతనము, హఠము, మొండితనము, పోకిరితనము, అధిక ప్రసంగము, విడ్డూరము.

**ڈھچر** ఢచర్ (హి.పు) చూడు **ڈھانچ** సన్నాహము, సామగ్రి; ముసలివాడు.

**ڈھڈو** ఢడ్డూ (హి. స్త్రీ) వృద్ధవేశ్య, ముసలిది, వదరుబోతుయాలుది.

**ڈھڈھانا** ఢఢాఢానా (హి) క్రొత్తదనము కలిగియుండుట, వృద్ధిలోనుండుట, నవనవలాడుట, తేజరిల్లుచుండుట, కళకళలాడుచుండుట, తేజస్సుకలిగియుండుట.

**ڈھڈی** ఢడ్డీ (హి. స్త్రీ) త్రోటిక, మడ్డిపూస (ఎముక), ఒకవిధమైనగుడుగుడి.

**ڈھر** ఢహర్ (హి.పు) వానమడుగు, కుంట, పల్లము, ఓడయడుగు, కసుంబావన్నె.

**ڈھکنا** ఢక్నా (హి) మూయుట, దాచుట, మూత;

**ڈھکنی** ఢక్నీ (హి) మూత.

**ڈھکوانا** ఢక్వానా (హి) మూయించుట, కప్పించుట, దాచిపెట్టించుట.

**ڈھکوسلا** ఢకోస్లా (హి.పు) మోసము, టక్కు, పనికిమాలినది. (గుట.

**ڈھکوسنا** ఢకోస్నా (హి) గుటగుటత్రా

**ڈھگ** ఢిగ్ (హి) ప్రక్కన, దగ్గిర, సమీపము, దాపు.

**ڈھگا** ఢగ్గా (హి.పు) చూడు **ڈگا**

**ڈھلان** ఢలాన్ (హి.పు) ఏటవాలు, వాలు, దిగుడు, ఇచ్ఛ, కోరిక, మొగ్గు.

**ڈھلانا** ఢలానా (హి) పోతపోయించుట, పోయించుట, పడగొట్టించుట, **ڈھلائی** ఢలాయి (హి. స్త్రీ) పోతకూలి, పోత.

**ڈھلانا** ఢులానా (హి) మోయించుట.

**ڈھلائی** ఢులాయీ (హి. స్త్రీ) మోతకూలి, మోత.

**ڈھلڑ** ఢిల్లడ్ (హి) ఆలసుడు, సోమరి.

**ڈھلکا** ఢిల్కా (హి) కండ్లనీరు కారుచుండు రోగము గల, పుసికండ్ల.

**ڈھلکانا** ఢుల్కానా (హి) దొర్లించుట, బొర్లించుట, పోయుట, ఒలికించుట.

**ڈھلکنا** ఢులక్నా (హి) ఒలుకుట, పొరలుట, దొరలుట.

**ڈھلکنا** ఢలక్నా (హి) పొరుటు, దొరలుట.

**ڈھلملانا** ఢల్మలానా (హి) చూడు. **ڈگمگانا** వెనకముందాడుట, అనుమానించుట.

**ڈھلنا** ఢుల్నా (హి) వాలుట, వంగుట. మొగ్గుట, ఒరగుట, జారుట, ఇచ్చించుట. దొరలుట, పొరలుట.

**ڈھلنا** ఢల్నా (హి) పోత పోయబడుట, పోయబడుట, ఒలుకుట, పొరుట, పడుట, జారుట, జరుగుట, తొలగుట, తగ్గుట, వాలుట, ఒరగుట, క్షీణించుట, తీరుట.

**ڈھلوان** ఢల్వాన్ (హి) ఏటవాలైన, వాలైన, ఒరగియున్న, దిగుడైన, జారేడు,

**ڈھلوانا** ఢుల్వానా (హి) మోయించుట.

**ڈھلوائی** ఢుల్వాయీ (హి. స్త్రీ) చూడు **ڈھلائی**

**ڈھلوائی** ఢల్వాయీ (హి, స్త్రీ) చూడు. **ڈھلائی**

**ڈھلیت** ఢలైత్ (హి.పు) దండధరుడు, డాలు కత్తి కట్టినభటుడు, బంటు, భటుడు, ఊరి తెలారి, చాకీదారు; పోతపోయువాడు.

**ڈھمڈھمی** ఢంఢమీ (హి.పు) ఒక చర్మ వాద్యము, తుడుము.

**ڈھنڈورا** ఢండోరా (హి) చాటింపు, తుడుము, ప్రకటన. ప్రచురణము.

**ڈھنڈیل** ఢండైల్ (హి) వంటకాడు (చమురు), గారెలు మొ॥ వండగా మిగిలిన నేయి మొ॥ చమురు.

**ڈھنڈورچی - ڈھنڈوریا** ఢండోర్చీ- ఢండోరియా (హి.పు) చాటించువాడు.

**ڈھنگ** ఢంగ్ (హి.పు) శైలి. రీతి, తెరగు, పద్ధతి, ప్రకారము, విధము, తీరు, వైఖరి, వర్తనము, నడవడిక, చర్య, ఉపాయము, యుక్తి, వేషము, క్రమము, లాఘవము.

**بے ڈھنگ** బేఢంగ్ (ఉ) ఆసాకార మైన, వికారమైన, మోటు, వయినముమాలిన.

**ڈھور** ఢోర్ (హి.పు) పశువు, గొడ్డు.

**ڈھول** ఢోల్ (హి.పు) ఢోలము, మద్దెల.

**ڈھولا** ఢూలా (హి.పు) గట్టు, తీరము, ఒడ్డు, దిబ్బ, పొలిమేరదిన్నె, మిట్ట.

**ڈھولک - ڈھولکی** ఢోలక్ - ఢోల్కీ (హి.పు) చిన్నఢోలము, చిన్నమద్దెల.

**ڈھولکیا** ఢోల్కియా (హి.పు) ఢోలువాయించువాడు, మద్దెలకాడు, మార్దంగికుడు.

**ڈھولنا** ఢోల్నా (హి.పు) గుండుతాయితు.

**ڈھولی** ఢోలీ (హి. స్త్రీ) (౨౦౦ మొదలు ౧౦౦౦వరకును గల) తమలపాకులకట్ట.

**ڈھونا** ఢోనా (హి) మోయుట, మోసి కొనిపోవుట.

**ڈھونڈ** ఢూండ్ (హి. స్త్రీ) అన్వేషణము, రేవులాట, శోధ, పిలుపు, కూత, జాడ.

**ڈھونچا** ఢోంచా (హి.పు) నాలుగున్నర (౪౻) ఎరుసు.

**ڈھونڈ** ఢోండ్ (హి.పు) కాయ, బీజకోశము, పొత్తకొంప.

**ڈھونڈنا** ఢూండ్నా (హి) వెదకుట. రేవులాడుట, అన్వేషించుట.

**ڈھونڈی** ఢూండీ (హి. స్త్రీ) కాడ ధాన్యపుకాయ.

**ڈھونڈیا** ఢూండియా (హి.పు) జీనుమతస్థుడగు సన్యాసి.

**ڈھونگ** ఢోంగ్ (హి.పు) మోసము, మాయ, టక్కు.

**ڈھونگی - ڈھونگیا** ఢోంగీ- ఢోంగియా (హి) మాయికమైన, మోసపు, వంచకమైన, మోసగాడు, టక్కరి, మాయికుడు, కపటపు.

**ڈھیا** ఢయ్యా (హి.పు) రెండున్నర శేర్లతూకాల.

**ذات** జాత్ (అ. స్త్రీ) స్వభావము, వస్తువు, సత్తు, పదార్థము, మూలము, దేహము. ఉనికి, మనిషి, వంశము, విధము, కులము, జాతి, స్థితి, వైనము, ప్రకృతి, వర్తనము, వాడుక, గుణము, మతము, అంతస్థు, పదము, దశ, అధికారము, త్రాణ, సామర్థ్యము, ప్రభువు, స్వామి, అయ్యగారు.

**ذات شریف** -ఎ షరీఫ్ (పా) మహాత్ముడు, దొడ్డవాడు; పలవ, పోకిరి.

**ذاتی** జాతీ (అ) స్వాభావికమైన, సహజమైన, నిజమైన, ప్రధానమైన, మూలమైన సజాతీయమైన, స్వంత, తన.

**ذاف** జాఫ్ (అ.పు) ఆకస్మికమరణము, అపమృత్యువు.

**ذاکر** జాకిర్ (అ) ప్రస్తావించువాడు, భగవంతుని తలచువాడు, జ్ఞాపకము చేయువాడు, భాగవతుడు.

**ذاہل** జాహిల్ (అ) మరచుస్వభావముగల, అజాగ్రతగల, విస్మృతిగల.

**ذائقہ** జాయిక (అ.పు) రుచి, రసము, కస్తుదనము, రసనేంద్రియము.

**ذبح** జబహ్ (అ. పు) వధ, బలిహరణము, పశుచ్ఛేదనము. (సకా స్త్రీయముగ)

**ذبیح** జబీహ్ (అ) శాస్త్రోక్తవిధజేయబడిన జంతువు, వధింపబడినది.

**ذخائر** జఖాయిర్ (అ.పు) సంభారములు; ఉగ్రాణములు, కోశములు, సంచితములు, సంగ్రహములు, సామగ్రులు ( **ذخیرہ** ఏ.వ)

**ذخیرہ** జఖీరా (అ.పు) సంభారము, సామగ్రి, ఉగ్రాణము, సంచితము, కోశము, సంగ్రహము.

**ذرا-ذری** జరా- జరీ (అ) కొంచము, స్వల్పము, రవంత. **ذراسا** జరా-సా (ఉ) కొంచమంత, రవంత, కొంచపాటి.

**ذراع** జరాఅ (అ.పు) మూర, హస్తప్రమాణము.

**ذرہ** జర్రా (అ.పు) అణువు, నలుసు, కొంచెము.

**ذریت** జుర్రియత్ (అ. స్త్రీ) సంతానము, వంశము.

**ذریعہ** జరీఅ (అ.పు) సాధనము, సంబంధము, కారణము, మూలము, ఆశ్రయము, బలము. మాధ్యస్థము.

**ذعاف** జుఆఫ్ (అ.పు) విషము, గరళము.

**ذقن** జకన్ (అ.పు) గడ్డము, గద్దువ.

**ذکا** జకా (అ.పు) వడి, తీవ్రము, సూక్ష్మబుద్ధి, చురుకుదనము, తీక్ష్ణబుద్ధి.

**ذکاوت** జకావత్ (అ, స్త్రీ) బుద్ధితీక్ష్ణత, బుద్ధిసూక్ష్మము, వివేకము, తెలివి, చురుకుదనము.

**ذکر** జిక్ర్ (అ.పు) జ్ఞాపకము, ప్రస్తావము. భగవతాస్తోత్రము, పారాయణము, పురాణము.

**ذکر** జకర్ (అ.పు) మగ, శిశ్నము, లింగము, పుంలింగము, పురుషుడు.

**ذکی** జకీ (అ) మేధావి, బుద్ధిసూక్ష్మతగలవాడు, తీక్ష్ణబుద్ధిగలవాడు, చురుకుగల, తెలివిగల.

**ذل** జుల్ల్ (అ.పు) నీచత్వము, దైన్యము.

**ذلت** జిల్లత్ (అ. స్త్రీ) పరాభవము, అవమానము, చిన్నతనము, భంగము, న్యూనత, తిరస్కారము.

**ذلیل** జలీల్ (అ) నీచమైన, తుచ్ఛమైన, అల్పమైన, **ذلیل کرنا** - కర్నా (ఉ) తిరస్కరించుట, అవమానించుట, నీచపరచుట.

**ذم** జమ్మ (అ. స్త్రీ) దూషణ, నిందు, చివాట్లు.

**ذمہ** జిమ్మ (అ.పు) ఒడంబడిక, ఒప్పుకోలు, ఒప్పందము, వాగ్దానము, ఉత్తరవాదము, అప్పగింత, పూచి, పూటు, బాధ్యత, స్వాధీనము, **ذمہ دار - ذمہ ور** దార్ - వర్ (పా) పూచిదారుడు, ఉత్తరవాది, అధికారి, బాధ్యుడు, స్వాధీనపరచుకొనినవాడు, పూటపడినవాడు, **ذمہ داری** - దారీ (స్త్రీ) ఉత్తరవాదము, అప్పగింత, ఒడంబడిక, ఒప్పందము, స్వాధీనము, పూటు, పూచి, బాధ్యత, అధికారము.

**ذمیم** జమీమ్ (అ) నింద్యము, దూష్యము.

**ذنب** జంబ్ (అ.పు) దోషము, అపరాధము, తప్పు.

**ذنب** జనబ్ (అ.పు) తోక, కేతుగ్రహము, కంటివెలుపలికొలికి.

**ذو** జూ (అ.పు) ఇదిమతుపర్థకప్రత్యయము, యజమాని, కలవాడు, మంతుడు, వంతుడు, కలది, కాధు, అనుఅర్థములనిచ్చును, **ذو اربعتہ الا ضلاع** - అర్ బఅతుల్ అజ్లా (పు) చతుర్భుజము, **ذو اضعاف** - ఇజ్ అఫ్ (పు) గుణజము, **ذو اضعاف اقل** - అజ్ అఫ్ అక్ల్ (పు) కనిష్టసామాన్య గుణజము,

**ذوالجلال** జుల్ జలాల్ (అ) ఘనతగలవాడు, గౌరవవంతుడు, ప్రతాపవంతుడు,

**ذوالفقار** జుల్ ఫకార్ (స్త్రీ) మహమ్మదుగారిఫట్టాకత్తి (రెండుధారలుగలది)

**ذوالفنون** జుల్ ఫనూన్ (పు) వివిధకళాసంపన్నుడు, **ذوالقرنین** జుల్ కర్నైన్ (పు) రెండుకొమ్ములుగలవాడు, మహాసికందరను నొకయవన దేశపురాజు అనుకొందురు, **ذومعنیٰ** - మఅన (అ) ద్వ్యంద్వార్థము, శ్లేషార్థకము, పరిహాసము.

**ذوق** జౌక్ (అ.పు) రుచి, రసము, రసనేంద్రియము, ఉద్రేకము, ఉత్సాహము, ఉల్లాసము, కామము.

**ذوی** జవీ (అ.పు) కలవారు, ఉన్నవారు, యజమానులు, స్వాములు, అధికారులు, (ఏ.వ. ذو ) **ذوی الاعتبار** - జవిల్ ఇతిబార్ (అ) నమ్మకస్థులు.

**ذہاب** జహాబ్ (అ.పు) వెడలిపోవుట, పోవుట.

**ذہب** జహబ్ (అ.పు) బంగారము, గ్రుడ్డులోని చందమామ, (పచ్చనిభాగము)

**ذہل** జహ్ల (అ.పు) మరపు, అజాగ్రత, విస్మృతి.

**ذہن** జిహ్న (అ.పు) మేధ, బుద్ధి, తెలివి, జ్ఞాపకము, సూక్ష్మబుద్ధి, **ذہن دقیق** - ఎదకీక్ (పు) అతిసూక్ష్మబుద్ధి, **ذہن لڑانا** - లడానా (ఉ) బుద్ధిబలముపయో

గించుట, పర్యాలోచించుట, **ذهن نشین** - నిషీన్ (పా) మనసునునాటిన.

**ذهين** జహీన్ (అ) మనస్వి, మేధావి, చురుకుగలవాడు, తెలివిగలవాడు.

**ذئب** జియబ్ (అ.పు) తోడేలు.

**ذی** జీ (అ.పు) మతుపర్థక ప్రత్యయము, చూడు **ذو** అనుపదము, **ذی اختیار** - ఇఖ్తియార్ (అ) అధికారకంతుడు, **ذی استعداد** - ఇస్తెఉదాద్ (అ) శక్తిమంతుడు, సామర్థ్యము గలవాడు, **ذی حق** - హక్ (అ) అధికారముగల, యదార్థమైన, న్యాయముగల, **ذی حیات** - హయాత్ (అ) జీవవంతము, ప్రాణము గలది, **ذی الحجہ** - జిల్ హిజ్జ (అ.పు) అరబ్బీ చాంద్రమానము యొక్క కడపటినెల, **ذی حرمت-عزت** - హుర్మత్ - ఇజ్జత్ (అ) మానముగల, గౌరవముగల, **ذی قعد** - కెఒద్ (పు) అరబ్బుల పదునొకండవ చాంద్ర మాసము **ذی رتبہ** - రుత్బ (అ) ఉన్నతపదవిగల, **ذی روح** - రూహ్ (అ) సచేతనము, సజీవము, **ذی هوش** - హోష్ (అ) తెలివిగల.

**ذیل** జైల్ (అ.పు) జీరాడుఅంచు, కొంగు, క్రిందిభాగము; మండలము, వర్గము, సమాజము; ఉత్తరభాగము; అనుబంధము; క్రింద, దిగువ, **ذیل دار** - దార్ (పా.పు) గోష్ఠుడు, కొన్నిగ్రామములకుఅధికారి, **حسب ذیل** హస్బ్-(అ) క్రిందనున్న ప్రకారము, ఉత్తరోక్తానుసారము.

---

# (ر)

**ر** రే (అ, స్త్రీ) రకారము, ఇది ఉరుదువర్ణమాలలో పదునాలుగవయక్షరము, పారసీకభాషలోపన్నెండవది, అరబ్బీలోపదియవది, అరబ్బీవర్ణసాంఖ్యము (**ابجد**) లో దీనిసంఖ్య రెండువందలు. (క్రమ.

**راب** రాబ్ (హి.స్త్రీ) బెల్లపుపాగు, పా

**رابڑی** రాబ్డీ (హి. స్త్రీ) పిండిమెం॥ నవి వేసిచేసిన మజ్జిగపులుసు, చిలికిచిక్కగా చేసినపాలు, తిమ్మనము, కరంభము.

**رابط** రాబిత (అ.పు) సంబంధము, బంధుత్వము, సంయోగము, సంసర్గము, క్రమము.

**راپڑ** రాపడ్ (హి.పు) ఫలింపనిభూమి, నిస్సారమైనభూమి.

**رابی** రాపీ (హి.స్త్రీ) రంపె, మాదిగవాండ్రు తోళ్లుకోయుకత్తి.

**رات** రాత్ [హి.స్త్రీ] రాత్రి. రేయి.

**راتا** రాతా (హి) ఎఱ్ఱని.

**راتب** రాతిబ్ (అ.పు) దినభరణము, దినబత్తెము, భరణము, బత్తెము, పశువులకుదినమువాడుకకనిచ్చునది.

**راتبہ** రాతిబ (అ.పు) జీతము, బత్తెము. భరణము.

**راتھور** రాఠోర్ [హి.పు] బలిష్ఠమైన, దిట్టమైన, బలముగల; ఒక కులము (రాజపుత్రులు).

**راج** రాజ్ [హి.పు] రాజ్యము, దొరతనము,

ప్రభుత్వము, విద్యమానము; (అ.పు)కాసె వాడు, ఉప్పరవాడు, గచ్చుపనిలేక తాపీ పనివాడు. راجپهوڑا -ఘోడా(హి.పు) రాచపుండు. راج گیری -గీరీ(పా.స్త్రీ) ఉప్పరిపని, కాసెపని. راج هنس - హంస్ (పు) రాజహంస,

راجا రాజా [హి.పు] రాజు, ప్రభువు.

راجائی రాజాయీ (హి. స్త్రీ) రాజరికము, దొరతనము.

راچهه రాఛ్ (హి.పు) ఉపకరణము, పని ముట్టు, ఆయుధము, (పంచాణులది.) కైట్టె యొక్క చేవ. (రక్కసుడు.

راچهس రాచ్ఛస్ (హి.పు) రాక్షసుడు,

راچهسنی రాఛస్నీ [హి.స్త్రీ] రక్కసి.

راحت రాహత్ (అ.స్త్రీ) విశ్రాంతి, నెమ్మది, నిష్కళము, హాయి, శాంతి,సుఖము.

راحم రాహిమ్ (అ) దయాళువు, కనికరము గల, జాలిగల. (ఛీము, రసిక.

راده - راد రాద్ - రాద (హి.స్త్రీ)

راڑ రాడ్ (హి. స్త్రీ) జగడము, కలహము, యుద్ధము, పోరాటము, వాదము.

راڑیا రాడియా (హి.పు) జగడగొండి.

راز రాజ్ (పా.పు) అంతరంగము, రహస్యము, గుట్టు, గోప్యము. راز دار -దార్ (పా) అంతరంగుడు, నమ్మకస్థుడు,ఆప్తుడు. راز فاش کرنا - ఫాష్‌కర్నా (ఉ) గుట్టుబయలుపరచుట, రహస్య భంగము చేయుట. راز و نیاز - ఒ నియాజ్ (పు) ప్రార్థన, దేబరింపు, సల్లాపములు, సరససల్లాపములు. (ర్త, దేవుడు.

رازق రాజిక్ (అ.పు) పోషకర్త, జగద్భ

راس రాస్ (అ.పు) శిరము, తల, శిఖరము, సైభాగము, కోటరము, అగ్రము; సముద్రములోనికి చొచ్చియున్న భూభాగము, బాట, రాహుగ్రహము; పెద్దనాయకుడు. راس الجدی - ఉల్‌జదీ (పు) దక్షిణాయనము. راس السرطان - ఉస్‌సర్తాన్ (అ.పు) ఉత్తరాయనము. راس المال - ఉల్‌మాల్ (పు) మూలధనము, బండారము, రాష్ట్రియఋణము, راس وذنب - ఒజనబ్(పు) రాహుకేతువులు.

راس రాస్ (హి.స్త్రీ) రాశి, ప్రోవు, కుప్ప; కళ్ళెపువాడు. راس چکر - చకర్ (పు) రాశిచక్రము.

راس రాస్ (సం.పు) రాసక్రీడ; ధాన్యరాశి; వృద్ధి; వడ్డి; రాశికూటములు, అనుకూలము, అనుగుణ్యము.

راس రాస్ (హి. స్త్రీ) దత్తు, పెంపకము. راس بتهانا - لینا - బిఠానా- లేనా (హి) దత్తుతీసికొనుట.

راسا రాసా (హి.పు) జగడము.

راست రాస్త్ (పా) తిన్నని,చక్కని,యదార్థమైన, నిజమైన, సత్యమైన, సరియైన,సరళమైన. راست آنا - ఆనా (ఉ) సరిపడుట, అనుకూలించుట. راست باز - బాజ్ (పా) సరళుడు, నిజస్థుడు,యదార్థవాది, నీతిమంతుడు, న్యాయస్థుడు.

راست بازی బాజీ (స్త్రీ) యదార్థత, సరళత్వము, న్యాయము, సరళవర్తనము. راست گو - గో (పా) యదార్థవాది. راست گوئی - గోయీ (స్త్రీ) యదార్థవాదము, నిజమాడుట.

راسته రాస్తా (పా.పు) శ్రేణి, వీధి, బాట, త్రోవ, మార్గము.

راستی రాస్తీ(పా. స్త్రీ) సరళత్వము,సత్య

వాదము, యదార్థత, భిన్నదనము, క్రమము.

**راسخ** రాసిఖ్ (అ) బలిష్ఠమైన, స్థిరమైన, శాశ్వతమైన, యదార్థమైన, విశ్వసనీయమైన; శుద్ధిచేసిన (తామ్రము).

**راسو** రాసూ (పా.పు) ముంగిస, బభ్రువు.

**راسی** రాసీ (హి.పు) సాధారణమైన, సామాన్యమైన, మధ్యమజాతిగుఱ్ఱము. (ము.

**راش** రాష్ (అ.పు) దినభరణము, దినబత్తె

**راشد** రాషిద్ (అ) చక్కని త్రోవనడచువాడు, న్యాయస్థుడు, సజ్జనుడు, నిష్కపటుడు.

**راشی** రాషీ (అ.పు) లంచగొండి.

**راضی** రాజీ (అ) సంతుష్టిచెందిన, అనుమోదించిన, అంగీకరించిన, సమ్మతించిన, సమాధానపడిన, ఇష్టముగల, ఇచ్ఛగల, తృప్తిచెందిన, సహనముగల, సంతోషముగల,

**راضی کرنا** - కర్నా (ఉ) సమాధానపెట్టుట, తృప్తిపరచుట, ఒప్పించుట.

**راضی نامہ** - నామ (పు) పరిత్యాగపత్రము, సమాధానపత్రిక. **راضی ہونا** - హోనా (ఉ) అంగీకరించుట, తృప్తిపడుట, సమాధానపడుట.

**راغ** రాగ్ [పా.పు] పసిరికబయలు, బయలు.

**راغب** రాగిబ్ (అ) ఇష్టముగల, ఆశగల, మొగ్గిన, కోరికగల. **راغب ہونا** - హోనా (ఉ) ఇచ్ఛించుట, ఆశించుట, కోరుట.

**رافضی** రాఫిజీ (అ.పు) పాషండుడు, షియామతస్థుడు.

**راقب** రాకిబ్ (అ) వైరి, స్పర్థి.

**راقم** రాకిమ్ (అ.పు) లేఖకుడు, లేఖరి, వ్రాయువాడు.

**راکب** రాకిబ్ (అ.పు) రౌతు, ఎక్కువాడు.

**راکڑ** రాకడ్ (హి.స్త్రీ) గులకనేల, ఇసుకనేల.

**راکھ** రాఖ్ (హి.స్త్రీ) బూడిద, భస్మము.

**راکھی** రాఖీ (హి.స్త్రీ) రక్ష, తోరము; కాపు, కాపరి, రక్షకుడు, ఉంచువాడు.

**راگ** రాగ్ (హి.పు) రాగము, పాట, స్వరము, కోపము, జగడము; కామము, కఫ.

**راگ رنگ** - రంగ్ (పు) ఆటపాటలు. వినోదము.

**راگنی** రాగ్ని (హి.స్త్రీ) రాగిణి, రాగము యొక్క భార్య, జారిణి.

**راگی** రాగీ (హి.పు) పాటకుడు, రాగి, కామి.

**رال** రాల్ (హి.స్త్రీ) చొల్లు, చొంగ, లాల; ఒక బంక.

**رالا** రాలా (హి.పు) నవధాన్యములు, కలపటపుధాన్యము.

**رام** రామ్ (పా) విధేయమైన, మచ్చికపడిన, లోపడిన, సేవకుడు, స్వాస్థ్యమైన, సంతుష్టమైన.

**رام رام** రామ్ రామ్ (హి.స్త్రీ) జేజే, వందనము, వందనము.

**راموں** రామూం (హి.పు) ఒకవిధమైన మేక.

**ران** రాన్ (పా.స్త్రీ) తొడ, జంఘ.

**رانا** రానా (హి.పు) నాయకుడు, పాళెగాడు, రాజాధిరాజు.

**رانا** రానా (హి) జాంగలము, అడవిపిల్లి, తానుగా పుట్టిన, అటవికము.

**رانبھنا** రాంభ్నా (హి) ఱంకవేయుట, అరుచుట, అంబాయనుట. (ఆవు మొ॥)

**رانپی** రాంపీ (హి.స్త్రీ) చూడు. **رانبی**

**رانجھا** రాంఝా (హి.పు) ప్రియుడు, వలపుపాట.

**رانجھن گول** రాంఝన్ గోల్ (హి.పు) గాబు, పెద్దకుండ.

**راندھم** రాంధ్ (హి. స్త్రీ) జగడము.

**راندنا** రాంద్నా (ఉ) బహిష్కరించుట, వెడలగొట్టుట.

**راندہ** రాందహ (పా) బహిష్కృతమైన, తిరస్కృతమైన, తుచ్ఛమైన.

**راندھنا** రాంధ్నా (హి) వండుట, ఉడకబెట్టుట, పక్వముచేయుట, రొట్టెమువడకుట.

**رانڈ** రాండ్ (హి. స్త్రీ) వయసుది, ముండ, విధవ, ముండమోపి, రండ, **رانڈکا سانڈ** -రాండ్‌కాసాండ్ (హి. పు) ముండబెంచినబిడ్డ, చెడినవాడు, దుర్మార్గుడు.

**رانڈا** రాండా (హి. పు) అపత్నీకుడు, పెండ్లాములేనివాడు; పండని, నిస్సారమైన, బీడు.

**رانگا - رانگ** రాంగ్-రాంగా (హి. పు) రంగు, తగరము, సత్తు, **رانگ بھریا** - రాంగ్ భర్యా (పు) సత్తు లేక తగరపుబొమ్మలు చేయువాడు.

**رانگھڑ** రాంఘడ్(హి. పు) ముసల్మానులలో కలిసిన రాజపుత్రులజాతి.

**رانوا** రాన్వా (హి. పు)బీడు, కంచె, పుల్లరి, మేత, పన్ను. (ము.

**رانی** రానీ (హి. స్త్రీ) రాణి, రాజుపెండ్లాము.

**رانی** రానీ (పా. స్త్రీ) సారథ్యము, తోలుట, నడపుట, (వృత్తియందు)

**راو** రావ్ (హి. పు) రాయడు, నాయకుడు, రావు, గౌరవనామము.

**راوت** రావత్ (హి. పు) శూరుడు, వీరుడు, దిట్ట; ఊడ్చువాడు, ఒకజాతి.

**راوتی** రావ్‌టీ (హి. స్త్రీ) కురుమాడు, గొల్లెన,చిన్నగుడారము, మేలుకట్టు,కప్పు,

**راوچاو** రావ్‌చావ్ (హి. పు) అన్యోన్యము, ప్రేమ, ముద్దు, అపేక్ష.

**راول** రావల్ [హి. పు] అధికారి, నాయకుడు, పెద్ద, ప్రభువు, ముఖ్యుడు; రాజసభ, యోధుడు, పోటరి, వీరుడు; జోగి, సన్యాసి. (ము.

**راولا** రాల్లా [హి. పు] జగడము, గందరగోళ

**راوند** రావంద్ (పా, స్త్రీ) రేవలము, (రేవల్చిన్ని యనుమూలిక), బట్టలాగవేయు దండెము, **راوندچینی** - చీనీ (స్త్రీ) చీనారేవలము (మూలిక).

**راوی** రావీ [అ. పు] కథకుడు, ఇతిహాసకుడు, చెప్పువాడు.

**راہ** రాహ్ (పా. స్త్రీ) త్రోవ, బాట, మార్గము; రీతి, తెరగు; సంబంధము, వర్తనము, **راہ خرچ** -ఖర్చ్ [పు] త్రోవబత్తెము, **راہ داری** -దారీ (స్త్రీ) తెరవుసుంకము, **راہ دیکھنا - تکنا** దేఖ్నా-తక్నా (ఉ) ఎదురుచూచుట, **راہ ربط - رسم** -రబ్త్ - రస్మ్(పా) ఆచారవ్యవహారములు, ఎరుకపరిచయములు, సంబంధము, పరిచయము, నెలవు, వర్తనము, **راہ رو-گیر** — రౌ- గీర్ (పా) బాటసారి, తెరువరి, **راہ روش** - రవిష్(స్త్రీ) స్వభావము, వర్తనము, వైఖరి **راہ عدم** - అదమ్ (పా)మరణము, **راہ زن - مار** - జన్-మార్ (ఉ) తెరవాటుకాడు, **راہ زنی** - జనీ(పా. స్త్రీ) తెరవాటు, త్రోవలుకొట్టుట, **راہ گزر** - గుజర్ (పా. పు) రాజమార్గము,**راہ لینا** - లేనా [ఉ] త్రోవబట్టుట, బయలుదేరుట, **راہنما-بر** నుమా - బర్ (పు) మార్గదర్శి, త్రోవచూ

పువాడు, راہ نمائی-بری -నుమాయీ - బరీ (స్త్రీ) ఉపదేశము, త్రోవచూపుట, మార్గదర్శనము, راہوار - వార్ (పు) వడి లగుఱ్ఱము, నడకగుఱ్ఱము, راہواری - వారీ (స్త్రీ) రెంఖ, గుఱ్ఱపునడక.

**راہب** రాహిబ్ (అ.పు) భాగవతుడు, సన్యాసి, యోగి, తపస్వి (క్రైస్తవులలో).

**راہن** రాహిన్ (అ.పు) కుదువపెట్టినవాడు.

**راہنا** రాహ్నా (హి) పిసరురాయి మిల్లుడించుట.

**راہو** రాహూ (హి.పు) రాహువు (గ్రహము).

**راہی** రాహీ (పా.పు) పాంథుడు, బాటసారి.

**رائے** రాయె-రాయ్ (అ, స్త్రీ) అభిప్రాయము, మతము, బుద్ధి, ఆలోచన, తలంపు, ఊహ, విచారము, ఉపదేశము,

**رائی** రాయీ (హి. స్త్రీ) ఆవాలు.

**رایا** రాయా (హి. స్త్రీ) పెద్దఆవాలు.

**رایت** రాయత్ (అ. స్త్రీ) ధ్వజము, టెక్కెము.

**رایتا** రాయితా (హి.పు) పెరుగుపచ్చడి.

**رایج** రాయిజ్ (అ) వర్తమానమగు, నడచుచున్న, చెల్లుచున్న, రూఢిలోనున్న, వాడుకలోనున్న, సాంప్రదాయకమైన, رائج الوقت - ఉల్, వక్త్ (పు) ప్రస్తుతవ్యవహారములోనున్న, ఇప్పుడుచెల్లుచున్న, వర్తమానములోనున్న.

**رائگاں** రాయెగాఁ (పా) త్రోవలోదొరికిన, ఉచితమైన; వ్యర్థమైన, పనికిమాలిన, నిష్ఫలమైన, వృథా, رائگاں کرنا - కర్నా (ఉ) వృథాచేయుట, వ్యర్థముచేయుట,

**رب** రబ్బ (అ.పు) పోషకుడు, పాలకుడు, కర్త, స్వామి, ప్రభుడు, رب العالمین - ఉల్, ఆలమీన్ (పు) జగత్కర్త, ఈశ్వరుడు.

**رب** రుబ్బ్ (పా.పు) కషాయము, రసము, సారము, గుజ్జు, పండ్లరసము.

**ربا** రుబా (పా) అపహరించువాడు, ఆకర్షకుడు, హరించు, ఆకర్షించునది, دلربا దిల్- (పా) మనోహరము.

**رباب** రబాబ్ (అ.పు) ఒకతంతివాద్యము, సారంగి.

**ربابی** రబాబీ (పా.పు) వైణికుడు.

**رباط** రిబాత్ (అ.పు) సత్రము, ధర్మశాల.

**رباعی** రుబాఈ (అ. స్త్రీ) నాలుగుపాదములుగలపద్యము, నాలుగుచరణములుగల మాట.

**ربانا** రబానా (హి.పు) చిన్నతప్పెట.

**ربڑ** రబడ్ (హి. స్త్రీ) అలసట, ఆయాసము, ప్రయాసము. సంచారము, వృథాశ్రమ.

**ربڑ** రబ్బడ్ (హి.పు) కటికవాడు.

**ربڑی** రబ్డీ (హి. స్త్రీ) ఉడకపెట్టిచిక్కగాచేసినపాలు, తిమ్మనము, మజ్జిగపులుసు.

**ربط** రబ్త్ (అ.పు) బంధనము, సంబంధము, సంయోగము, అభ్యాసము, వాడుక, స్నేహము, పరిచయము, ربط ضبط - జబ్త్ (పు) కట్టుదిట్టము, ఎరుకపరిచయములు, ఆదరసత్కారము, మర్యాదలు, సంబంధము, వర్తనము.

**ربع** రుబ్అ (అ.పు) చతుర్థాంశము: నాలుగవపాలు, ربع مسکون - మస్కూన్ (పు) పృథివిలోనాలుగవభాగము, జనులు నివసించుభాగము.

**ربیب** రబీబ్ (అ.పు) సంరక్షకుడు, సవతితల్లికొడుకు, మారుతల్లికొడుకు.

ربیع రబీ౨(అ. స్త్రీ) వసంతఋతువు, తడి కాలు, ربیع الاول రబీఉల్ అవ్వల్ (పు) అరబ్బుల మూడవ చాంద్రమాసము
ربیع الثانی - آخر రబీఉస్సానీ - ఆఖర్ (పు) అరబ్బుల నాలుగవ చాంద్ర మాసము.
رپ రిప్ (హి.పు) రిపువు, వైరి, పగవాడు.
رپٹ రపట్ (హి. స్త్రీ) బంకమంటిబీడు, వేటాడుబయలు, జారునది.
رپٹن రప్టన్ (హి. స్త్రీ) జారుట.
رپٹنا రపట్నా (హి) జారుట, జరుగుట.
رپ رپ రప్‌రప్ (ఉ. స్త్రీ) నడుచు చప్పుడు, జోడన, ఒకగుఱ్ఱపుపరుగు.
رپرپانا రప్‌రపానా (హి) వడిగాబోవుట, జోడనపోవుట.(గుఱ్ఱము)
رپلی రుప్లీ (హి, స్త్రీ) రుపాయి (తిరస్కారముగా). (తెల్లని.
رپہلی రుపహ్లీ (హి) రౌప్యవర్ణముగల,
رت రత్ (హి. స్త్రీ) రాత్రి, రేయి, رت جگا - జగా (పు) జాగరణ, మెలకువ, జాగ్రత.
رت రిత్ (హి. స్త్రీ) ఋతువు, కాలము; ఇసుక.
رتالو రతాలూ (హి.పు) రత్నపురిగడ్డ, కంద, గెనుసుగడ్డ.
رتانا రితానా (హి) రిక్తముగాచేయుట, విడిచేయుట, వట్టిదిచేయుట.
رتبہ రుత్బ (అ,పు) అంతస్తు, మెట్టు; పదవి, దశ, అధికారము, పెత్తనము, గౌరవము.
رتن రతన్ (హి.పు) రత్నము; కంటిపాప; రేతస్సు; సారము, మూలము, తారుణ్యము, సౌందర్యము; శ్రేష్ఠమైనది, رتن جڑاو -జడావ్ (హి) రత్నఖచితము, رتن جوت - జోత్ (పు) ఓషధీభే(దము.
رتنا రిత్నా (హి) ఉత్తదియగుట; ఆకురాయితోరాయబడుట, సారంగిమ్రోగుట,
رتنارے రత్నారే (హి. స్త్రీ) ప్రకాశమానమైన లేక తేటయైన (కండ్లు).
رتوانا రిత్వానా (హి) ఆకురాయిపట్టించుట, రాపిడిపెట్టించుట. (ము.
رتوندھا రతోంధా [హి.పు] రేజీకటిరోగ
رتھ రథ్ (హి. స్త్రీ) రథము.
رتھی రథీ [హి.పు] రథి, రథారూఢుడు,
رتی రతీ [హి. స్త్రీ] రతి, రతీదేవి; గురిజ ఎత్తు; భాగ్యము, అదృష్టము; రక్తిక, రక్తి, కామము; రవంత, కొంచెము.
رٹ రట్ (హి. స్త్రీ) ఆవృత్తి, వల్లింపు, జపము, స్మరణ, సదాచింతనము.
رٹنا రట్నా (హి) వల్లించుట, ఆవృత్తి వేయుట, జపించుట, స్మరించుట, సదా చింతించుట.
رج రజ్ (హి. స్త్రీ) రజము, ఇసుక, దుమ్ము, పుష్పరజము, పుష్పొడి, రజస్సు, రజో రక్తము.
رجال రిజాల్ (అ.పు) మనుష్యులు (رجل ఏ.వ)
رجال الغیب - ఉల్ - గైబ్ (పు) దిశాశూలల (గారశూలలవంటిది.).
رجالا రిజాలా (అ) నీచమైన, తుచ్ఛమైన.
رجب రజబ్ (అ.పు) అరబ్బులఏడవచాంద్రమాసము.
رجسٹر రజిస్టర్ (ఇం.పు) పట్టీపుస్తకము, అనుక్రమణిక, పట్టీ, పట్టిక.
رجسٹری రిజిస్టరీ (ఇం. స్త్రీ) పట్టీపుస్తకములో చేర్చుట లేక ఎక్కించుట.
رجعت రజ్అత్ (అ, స్త్రీ) తిరుగుదల, మళ్లుదల, వక్రగతి, పునస్స్వీకారము

(విడిచినభార్యను). رجعت قہقری -క హ్ కరీ (స్త్రీ) ముఖము మరలించక వెనుకకు నడుచుట;

**رجنا** రజ్నా (హి) కడుపునిండుట, చాలుట, సంతుష్టియగుట.

**رجواڑا** రజ్వాడా (హి.పు) రాజ్యము, రాజుదేశము, సంస్థానము.

**رجوع** రుజూఅ్ (అ.స్త్రీ) తిరుగుదల, మళ్లుదల, వాలు, మొగ్గు, ఉన్ముఖము, అవధానము, ఇచ్ఛ, కోరిక, విజ్ఞాపనము, ప్రార్థన.

**رجولیت** రజూలియత్ (అ.స్త్రీ) పురుషత్వము, మొగతనము, పుంసత్వము.

**رجھانا** రిఝానా (హి) తృప్తిపరచుట, సంతోషపెట్టుట, వశపరచుకొనుట, మోహింపజేయుట, లోపరచుకొనుట,

**رجھنا** రిఝ్నా (హి) నిలుచుట, ఆగుట, వ్రేలాడుట, తృప్తిపడుట, వశపడుట.

**رچ** రుచ్ (హి.స్త్రీ) రుచి, ఆపేక్ష, కోరిక, ఆకలి, కాంతి.

**رچا** రిచా (హి. స్త్రీ) వేదఋక్కు...

**رچانا** రచానా (హి) రచించుట, చేయుట, కలుగజేయుట, సువాసనలేక ఎరుపురంగు కలుగజేయుట, పచారించుట, ప్రసరింపచేయుట, ఇచ్ఛపుట్టించుట, ఆచరించుట, జరుపుట.

**رچاوٹ** రచావట్ [హి.స్త్రీ] రచన, రంగు, వన్నె.

**رچنا** రచ్నా (హి) రచితమగుట, అగుట, పట్టుట, ఇముడుట, అలవడుట; పరిచియమగుట, అలవాటుపడుట, వాడుకగుట; ప్రసరించుట, పచారింపబడుట, వయినము గానుండుట,. మంచివాసన గలదియగుట, వన్నెకలదియగుట, ఇంగుట, ఆచరితమగుట. చూడు رچانا

**رچنا** రుచ్నా (హి) రుచించుట, ఇష్టమగుట,

**رچنی مہندی** రచ్నీ మెహందీ (హి.స్త్రీ) మంచివన్నెనిచ్చుగోరింట.

**رچھا** రచ్ఛా (హి. స్త్రీ) గస్తు, రక్షణము, కాపు, ఆశ్రయము, సహాయము.

**رحل** ర(రి)హిల్ (అ.స్త్రీ) స్థావరము, పుస్తకపట్టు, వ్యాసపీఠము, సరస్వతీపీటు, ప్రయాణము, సంచారము.

**رحلت** ర(రి)హ్లత్ (అ. స్త్రీ) నిర్గమము, గమనము, పోక, మరణము.

**رحم** రి(రె)హ్మ్ (అ.పు) గర్భాశయము.

**رحم** రహ్మ్ (అ.పు) దయ, కరుణ. కనికరము; పరితాపము, **رحم دل** -దిల్ (పా) దయాళువు, **رحم کھانا** -ఖానా (ఉ) జాలిపడుట, కనికరించుట.

**رحمان** రహ్మాన్ (అ) దయాళుడు, దయగల, కరుణానిధి. భగవంతుడు.

**رحمت** రహ్మత్ (అ.స్త్రీ) దయ, కరుణ, క్షమ, -నుగ్రహము. (తుడు.

**رحیم** రహీమ్ (అ) దయాళువు, క్షమావంతుడు.

**رخ** రుఖ్ (పా.పు) ముఖము, చెంప, గల్లము; పార్శ్వము, ప్రక్క, దిశ, తట్టు; అంచు. కడ; ముందు, ఎదురు; ఇచ్ఛ, అనురాగము, గండభేరుండమువంటి ఒకపౌరాణికపక్షి.

**رخام** రుఖామ్ (పా.పు) నాపరాయి, చలువరాయి.

**رخت** రఖ్త్ (పా.పు) సామగ్రి, పరికరము, ఉపకరణములు; దుస్తు, ఉడుపు; డోలు, చట్టము; ఆస్తి, వస్తువులు; తోలు; కూబిగా చేర్చిన మిఠాయివస్తువుల దొంతరము,

**رخسار - رخسارہ** రుఖ్ సార్ - రుఖ్ సారా (పా.పు) గల్లము, చెంప.

**رخش** రఖ్ష్ (పా.పు) గుఱ్ఱము, కాంతి.

**رخصت** రుఖ్సత్ (అ.పు) సెలవు, అనుజ్ఞ,ఆజ్ఞ, అనుమోదము. విడుదల, అవకాశము; వేంచేపు,పోక **رخصت کرنا** -కర్నా (క్రి) సెలవిచ్చుట, పంపుట, **رخصت ہونا** -హోనా(క్రి) వేంచేయుట, సెలవు పుచ్చుకొనుట. పోవుట.

**رخصتانہ** రుఖ్సతాన (అ.పు) గొప్పవారు పోవు-పుడు ఇచ్చుబహుమానము.

**رخصتی** రుఖ్సతీ (అ) సెలవుగల, సెలవు తీసుకొనిన, వీడ్కోలుకట్నము.

**رخنہ** రఖ్న (పా.పు) పాతగోడ పడుట వలన ఏర్పడినత్రోవ, సందు, కంత; పగులు, తూటు, బొందె;అడ్డు,ఆటంకము, జగడము.

**رد** రద్ద్ (అ.పు) తిరుగుదల, మళ్లుదల, నిరాకరణము,నిరసనము, తిరస్కారము, అనంగీకారము; వాంతి, కక్కు, **ردجواب** -రద్దె,జవాబ్ (పు) పూర్వపక్షము, ప్రత్యుత్తరము, **رد و قدح - رد و بدل** -రద్దొ,బదల్ - ఒ,కద్హ్ (స్త్రీ) పూర్వపక్ష సిద్ధాంతము, వాదవివాదము, భేదము, మార్పు, తారుమారు, క్రిందుమీదు.

**رداء** రిదా (అ.స్త్రీ) దుప్పటి, కప్పుబట్ట, సన్యాసులబొంత.

**ردا - ردہ** రదా-ద (పా.పు) గోడమొ॥ వానికీటు, ఇటుకమొ॥వానివేరుపు,చాలు, అంతస్తు, పొర, వరుస; కచ్చు.

**ردی** రద్దీ (అ.స్త్రీ) పనికిమాలిన లేక చిత్తు కాగితము, చెడ్డది, చెత్త, పనికిమాలినది.

**ردیف** రదీఫ్ (అ.స్త్రీ) గుఱ్ఱపురౌతు వెనకకూర్చుండువాడు, కాలము (సైన్యము యొక్క వెనుకభాగము); అంత్యప్రాసము వెనుకపలుమారువచ్చుశబ్దము, **ردیف وار** -వార్ (పా) అక్షరక్రమానుసారము, అకారాదిగా.

**رذال** రజాల (అ) నీచమైన, అల్పమైన, తుచ్ఛమైన, పోకిరి పలవ. కూళ, బూతులమారి.

**رذیل** రజీల్ (అ.పు) నీచుడు, తుచ్ఛుడు, అల్పుడు, దుర్మార్గుడు.

**رریانا** రిర్యానా (హి) గోడాటుట, గునియుట, దేబరించుట, మూలుగుచు ఏడ్చుట, పీడించుట, అడుగుట.

**رڑکا** రడ్కా (హి.పు) చీపిరికట్టె, నలుసు, ముక్క.

**رڑکنا** రడ్కనా (హి)పొడుచుకొను,నొచ్చుట, తీయుట.

**رز** రజ్ (పా.స్త్రీ) ద్రాక్ష.

**رزاق** రజ్జాక్ (అ.పు) భర్త, ఆహారము పెట్టువాడు, పోషకుడు. ఈశ్వరుడు.

**رزاقی** రజ్జాకీ (అ.స్త్రీ) పోషణ, పాలన.

**رزق** రిజ్క్ (అ.పు) బత్తెము, ఆహారము, జీవనము, భరణము.

**رزائی** రజాయీ (ఫా.స్త్రీ) అద్దినదుప్పటి లేక పచ్చడము, బొంత, వస్త్రచీర.

**رزم** రజ్మ్ (పా.పు) యుద్ధము, జగడము, **رزم گاہ** -గాహ్ (స్త్రీ)యుద్ధరంగము,

رزمیہ రజ్మియ్య(పా.పు)యుద్ధచారిత్రము, యుద్ధసం॥, యుద్ధవృత్తాంతము.

رس రస్ (హి.పు) రసము.

رس రస్(పా)అందునది, చేరునది, ముట్టునది,

رس రిస్ (హి. స్త్రీ) క్రోధము, ఆవేశము, ఆగ్రహము.

رسا రసా (పా.పు)చేరువాడు, అందువాడు.

رسا రస్సా (హి.పు) మోకు, త్రాడు.

رسال రసాల్ (హి.పు) చెరుకు, మామిడి చెట్టు; రసాలము. [కాకిచెరుకు]

رسالت రిసాలత్ (అ.స్త్రీ) దూత్యము, రాయబారము, అంపకము.

رسالہ రిసాల (అ.పు) పాత్రము, చిన్నగ్రంథము, సంపుటము, గుఱ్ఱపుదండు, رسالہ دار -దార్ (పా) గుఱ్ఱపుదళవాయి.

رسام రస్సామ్ (అ.పు)త్రవ్వువాడు, చిత్రించువాడు, పటముగ్రాయువాడు.

رسان రసాం (పా.పు) తెచ్చు, ముట్టించుట, అందించుట, చేర్చుట, చేరునట్లుచేయుట, అందించునది, చేర్చునది.

رسانا రిసానా (హి) అసమాధానపడుట, కోపపడుట.

رساول రసావల్ (హి.పు)చెరుకుపాలుకలిపి వండినఅన్నము, ఇక్షురసాన్నము.

رسائی రసాయీ(పా. స్త్రీ) అందుబాటు, అందిక, చొరవ; గ్రహణశక్తి; పాండిత్యము; యోగ్యత,పరిచయము, సందర్శనము, (హి. స్త్రీ.) నెమ్మది, నిమ్మళము.

رسائن రసాయన్(హి.పు) రసాయనము.

رست రుస్త్ (పా) ధైర్యశాలి.

رستخیز రస్తఖేజ్ (పా.పు) పునరుత్థానము, ప్రళయకాలము, విమోచనకాలము, క్రొత్తగామొలచినది.

رستگاری రస్తగారీ (పా.స్త్రీ) విమోచనము, ముక్తి, పాపవిమోచనము.

رستم రుస్తమ్ (పా.పు) వీరుడు, మల్లుడు, పారసీకులలోని యొకమహావీరునిపేరు.

رستمی రుస్తమీ (పా, స్త్రీ) శౌర్యము, వీర్యము, శూరత్వము, బలాఢ్యత, అధికారము.

رستہ రస్త (పా,పు) త్రోవ, బాట; విముక్తము, విడుదలపొందినది.

رسد రసద్(పా. స్త్రీ) దండు, సంభారము; సామగ్రి, భోజనపదార్థములు, బత్తెము, ధాన్యసంచయము; భాగము; యోగ్యము, యుక్తము;సంగ్రహము,దిగుమతి,వచ్చినది.

رسدی రసదీ (పా) భాగానుసారము, యోగ్యమైన, యుక్తభాగమైన, رسدی حصہ -హిస్సా- (పా) యుక్తభాగము.

رسرا రస్రా (హి.పు) మోకు, త్రాడు.

رسری రస్రీ (హి. స్త్రీ) త్రాడు. (ము.

رسکپور రస్కపూర్ (హి.పు) రసకర్పూర

رسم రస్మ్ [అ.స్త్రీ]చిహ్నము, లాంఛనము, లేఖనము. పత్రము, విధి, ఆచారము, శాస్త్రము,స్మృతి, సాంప్రదాయము. జీతము. బత్తెము, భరణము, నడవడిక, వర్తనము, వాడుక, అలవాటు. رسم و رواج -ఒ, రివాజ్ [పు]. ఆచారవ్యవహారము,సాంప్రదాయము, రీతి. رسم و راہ -ఒ,రాహ్ (స్త్రీ) దారి. راہ و رسم

رسمسا రస్మసా (హి) సుగంధలేపితమైన, చెమటతోతడిసిన, పితపితలాడెడు.

رسمسانا రస్మసానా (హి) సుగంధద్రవ్యములతో లేక చెమటతో పూయబడుట, తడిసి పితపితలాడుట.

رسمی రస్మీ (అ)వాడుకగల॥, ప్రిహితమైన,

సాంప్రదాయికమైన, సాధారణమయిన, వాడుకైన, సామాన్యమైన.

**رسنا** రిస్నా (హి) చెమర్చుట, స్రవించుట, కారుట, కోపపడుట.

**رسنا** రస్నా (హి. స్త్రీ) నాలుక, రసనేంద్రి (యము.

**رسوا** రుస్వా (పా) నిందితమైన, అపవాదపడిన, భంగపడిన, అవమానితుడైన, ఖట్టుపడిన, అవ్వపడిన.

**رسوائی** రుస్వాయీ (పా. స్త్రీ) అవమానము, అపవాదము, ఆరడి, రట్టు. రచ్చ.

**رسوت** రసౌత్ [హి. స్త్రీ] రసాంజనము, కాటుక, (ఒక చెట్టుపాలు.)

**رسوخ** రుసూఖ్ (అ. పు) ప్రాబల్యము, బలము, దిట్టము, దృఢత, స్థిరత, బలిష్ఠత, దిటవు, నిలుకడ; గట్టి, పరిచయము, చొరవ; చెల్లుబడి, అధికారము, పరపతి, పలుకుబడి; సంబంధము, ఆశ్రయము; అందుబాటు, స్వాధీనము.

**رسوخیت** రుసూఖియత్ (అ. స్త్రీ) నిలుకడ, దృఢస్నేహము, దార్ఢ్యము. చూడు. **رسوخ**

**رسول** రసూల్ (అ. పు) పంపబడినవాడు, దూత, సందేశహరుడు, దేవదూత, హజరత్ మహమ్మదు.

**رسوم** రుసూమ్ (అ. స్త్రీ) చిహ్నములు, లాంఛనములు, ఆచారములు, విధులు; స్మృతి శాస్త్రము; జీతము, భరణము, పన్ను, కట్టుబడి, స్వామ్యము, అరి, కప్పము, కట్నము, వేతనము. చూడు. (ఏ.వ **رسم**)

**رسولی** రసౌలీ [హి. స్త్రీ] కణతి, గ్రంధి, బుడిపి, కిణము.

**رسوئی** రసోయీ (హి. స్త్రీ) వంటకము, భోజనము, వంటపట్టు, భోజనస్థలము.

**رسوئیا** రసోయ్యా (హి. పు) వంటవాడు.

**رسی** రస్సీ [హి. స్త్రీ] త్రాడు.

**رسیا** రసియా (హి. పు) రసికుడు, సుఖలోలుడు.

**رسیانا** రిసియానా (హి) కోపపడుట, విసుకుట.

**رسیانا** రసియానా (హి) రసవంతముగా నుండుట, కారుట, చెమర్చుట.

**رسید** రసీద్ (పా. స్త్రీ) ప్రాప్తి, చేరిక, చొరవ, సందర్శనము, జాడ, వయినము, చెల్లుచీటి, చెల్లుపత్రము.

**رسیدگی** రసీదగీ (పా. స్త్రీ) ప్రాప్తి, చేరుట, చేరిక, ముట్టుట, సంపూర్ణత, పరిపక్వత.

**رسیده** రసీద (పా) చేరిన, ముట్టిన, అందిన. పక్వమైన, ప్రాప్తమైన.

**رسیلا** రసీలా (హి) రసవంతమైన, రసముగల, సరసమైన, సొగసుగల, వన్నెకాడైన, పోకిరియైన.

**رشاو** రషావ్ (హి. పు) బీడుభూమిని సాగుబడి చేయుట.

**رشتہ** రిష్త (పా. పు) దారము, నూలుపోగు; సంబంధము, బాంధవ్యము; వారిపుండు.

**رشتہ دار** —దార్ (పా) బంధువు, చుట్టము, **رشتہ داری** —దారీ (స్త్రీ) బంధుత్వము, చుట్టరికము.

**رشت پشت** రుష్ట్‌పుష్ట్ (హి) దృష్టిపుష్టిగల, దట్టిముట్టియైన, కాయపుష్టిగల, బలిసిన, పుష్టిగల, దిట్టమైన, బలముగల.

**رشک** రష్క్ (పా. పు) మత్సరము, అసూయ, ఓర్వలేమి, స్పర్ధ, ప. వైరము, సిగ్గు, ప్రతిస్పర్ధ, పోటి, బిడియము.

**رشوت** రిశ్వత్-రుష్వత్ (అ. స్త్రీ) ఉత్కోచము, లంచము. **رشوت خور** —ఖోర్ (పా) లంచగొండి. **رشوت ستانی**

-సితానీ (సి) లంచముతీసికొనుట, ఉత్కోచగ్రహణము.

**رشی** రిషీ (హి.పు) ఋషి.

**رشید** రషీద్ (అ) సుశిక్షితుడు, విధేయుడు, సద్వర్తనముగలవాడు.

**رصد** రసద్ (అ.పు) జ్యోతిషము, నక్షత్రగణితము, ఆకాశాలోచనము. **رصد خانہ - گاہ** -ఖాన-గాహ్ (పా.స్త్రీ) నక్షత్రశాల.

**رضا** రజా (అ.స్త్రీ) ఇష్టము, సంతోషము, అనుజ్ఞ, అనుమోదము, సమ్మతి, సెలవు.

**رضا و رغبت** -వ, రగ్బత్ (స్త్రీ) మనఃపూర్వకానుమోదము, స్వేచ్ఛానుమోదము. **رضا مند** -మంద్ (పా) అనుమోదించినవాడు, ఇష్టపడినవాడు, సమ్మతించినవాడు. **رضامندی** -మందీ (స్త్రీ) ఇష్టము, అనుమోదము, సమ్మతి, సెలవు.

**رضاع** రజాఉ (అ.పు) పోషణము, స్తన్యపానము.

**رضاعت** రజాఅత్ (అ.స్త్రీ) స్తన్యపానము.

**رضاعی** రజాఈ (అ) ఒకతల్లిపాలుత్రాగిన, దాదికొడుకైన, దాదిసోదరులైన.

**رضوان** రిజ్వాన్ (అ.పు) ఒక వైకుంఠ ద్వారపాలకుని పేరు, అనుగ్రహము, అభీష్టము.

**رضوی-رضویہ** రజ్వీ-రజ్వియ (అ) ఇమామ్అత్ యొక్కయు, మూసారజాయొక్కయు గోత్రీయులు.

**رطب و یابس** రత్బ్ వ.యాబిస్ (అ) తడిపొడి, మంచిచెడ్డలు, పుణ్యపాపములు, ఎచ్చుతగ్గులు.

**رطل** రిత్ల్ (అ.పు) చషకము, సారగిన్నె.

**رطوبت** రుతూబత్ (అ.స్త్రీ) తడి, నెమ్ము, చిత్తడి, చెమ్మ, నోటితడి.

**رعایا** రఆయా (అ.స్త్రీ) రక్షింపబడువాడు, ప్రజ, కాపులు, చేతిక్రిందివారు, అద్దెకున్నవారు.

**رعایت** రిఆయత్ (అ.స్త్రీ) పక్షపాతము, అనుగ్రహము, దాక్షిణ్యము, మొగమోటము, లక్ష్యము.

**رعایتی** రిఆయతీ (అ.పు) ఆశ్రితుడు, అనుగ్రహపూర్వకమైన, విశేషమైన.

**رعب** రఉబ్ (అ.పు) భయము, బెదరు, గౌరవము, అధికారము, ప్రఖ్యాతి. **رعب دار** -దార్ (పా) ప్రబలమైన, భయానకమైన.

**رعد** రఉద్ (అ.పు) ఉరుము, మేఘగర్జనము.

**رعشہ** రఉష (అ.పు) దడ, వణకు. కంపనము, వణుకురోగము, తొందర, తిమురువాతము.

**رعنا** రఉనా (అ) ఒయ్యారమైన, సొగసైన, అందమైన, కులుకుగల, నేర్పుగల, ఒయ్యారపునడక, జాణ.

**رعنائی** రఉనాయీ (అ.స్త్రీ) ఒయ్యారము, సొగసు, అందము, కులుకు, జాణతనము.

**رعونت** రఊనత్ (అ.స్త్రీ) సింగారము, ఒయ్యారము, గర్వము, అహంకారము, తలబిరుసు, అభిమానము.

**رعیت** రఇయత్ (అ.స్త్రీ) రక్షింపబడువాడు, ప్రజ, కాపు, అద్దెకున్నవాడు.

**رعیتی** రఇయతీ (అ.స్త్రీ) ప్రజాత్వము, కాపుదనము.

**رغبت** రగ్బత్ (అ.స్త్రీ) అపేక్ష, కోరిక, ఇచ్ఛ, ప్రేమ.

**رفاقت** రఫాకత్ (అ.స్త్రీ) సహవాసము, స్నేహము, సంగతి, చెలిమి, దారితోడు, విశ్వాసము.

**رفاه-رفاهیت** రఫాహ్-రఫాహియత్ (అ,స్త్రీ) సౌఖ్యము, క్షేమము, ఆరోగ్యము, మేలు, **رفاه خلائق - عام** ఎ, ఖలాయెక్ - ఆమ్ (స్త్రీ) జనసౌఖ్యము, ప్రజా సౌఖ్యము.

**رفت** రఫ్త్ (పా. స్త్రీ) పోక, గమనము.

**رفتار** రఫ్తార్ (పా.స్త్రీ) నడక, పోక, వర్తనము, గతి.

**رفتگی** రఫ్తగీ (పా. స్త్రీ) పోక, నిర్గమనము, నష్టము.

**رفته** రఫ్త (పా) పోయిన, **رفته رفته** - రఫ్త (పా) పోనుపోను, రాను రాను, క్రమేణ.

**رفض** రఫ్జ్ (అ.పు) పాషండము, రాఫ్జీ మతము.

**رفع** రఫఽ (అ.పు) ఎత్తుట, ఎత్తివేయుట, పరిహారము, ఔన్నత్యము, ఎత్తు, వర్జనము, తీరుమానము, **رفع دفع** - దఫఽ (పు) వగ తెగింపు, తీరుమానము, సమాధానము, తీర్పు, తీసివేత.

**رفعت** రఫ్అత్ (అ. స్త్రీ) ఔన్నత్యము, ఎత్తు, గౌరవము, వృద్ధి, పదవి.

**رفقاء** రఫకా (అ.పు) మాడు (ఏ.వ **رفیق**)

**رفو** రఫూ (అ.పు) మాసిక, కూర్పుమాసిక, చినుగును దారముతో కుట్టి మూయుట,

**رفو چکر** - చక్కర్ (పు) మటుమాయము. పలాయనము, చిక్కు, కడగండ్లు,

**رفوگر** - గర్ (పు) రఫ్పూతీయువాడు.

**رفی** రఫీ (అ. స్త్రీ) ధూమము, ధూమ్రము, పొగ, దుమారము, తుక్కు, దుమ్ము.

**رفیده** రఫీద (పా.పు) అతుకులబొంత, బొంత.

**رفیع** రఫీఽ (అ) ఉన్నతమైన, ఎత్తైన, ఘనమైన, **رفیع الشان** - యుష్షాన్ (అ) మిక్కిలిఘనతగల, ఉన్నతపదవిగల.

**رفیق** రఫీక్ (అ.పు) సహవాసి, చెలికాడు, తోడు, దారితోడు, స్నేహితుడు, మిత్రము.

**رقاب** రకాబ్ (అ) బానిసలు, పరివారము, సేవకులు, (ఏ.వ **رقب**)

**رقابت** రకాబత్ (అ.స్త్రీ) ఏకఫలాపేక్ష, పోటి, స్పర్ధ, వైరము, పొత్తు, పగ.

**رقاص** రక్కాస్ (అ.పు) నటుడు, ఆటకాడు.

**رقبه** రకబ (అ.పు) పరిసరప్రదేశము, ఊరి క్రిందిభూమి, ఆవరణము, విరివి, విస్తీర్ణము, చదరము.

**رقت** రిక్కత్ (అ. స్త్రీ) పలచదనము, మెత్తదనము, సన్నదనము, ఆర్ద్రవము, కరుణ, దుఃఖము, కనికరము, ఏడ్పు.

**رقعات** రుక్అత్ (అ.పు) లేఖనములు, లేఖన సంగ్రహములు, చీట్లు, పత్రికలు. (ఏ.వ **رقعه**)

**رقعه** రుక్అ (అ.పు) చీలిక, ఖీలిక, చింపు, చీటి, పత్రిక, పత్రము, ఉత్తరము, జాబు.

**رقم** రకమ్ (అ. స్త్రీ) లేఖనము, లేఖ, వ్రాత, ముద్ర, గురుతు, అచ్చు, సంఖ్య, అంకె,

అంకము, పద్దు, ఒంటు; మూల్యము, ద్రవ్యము, సొమ్ము, రొక్కము, రత్నములు, మొత్తము, ధనవంతుడు; విధము, రీతి; కులము; జాణ, ఉటంకి, నేర్పరి, చురుకు గలవాడు. **رقم کرنا** - కర్నా (ఉ)ఎక్కించుట, వ్రాయుట, అంకువేయుట, గురుతు వేయుట. **رقم وار** - వార్ (పా) వయినముగా. **رقم ہونا** - హోనా (ఉ) వ్రాయబడుట.

**رقمی** రక్మీ (అ) వ్రాసిన, అక్షరాల; రొక్కపు, ద్రవ్యసం॥, డబ్బుతోకూడిన.

**رقو** రకూ (అ.పు) నెత్తురుకారకుండుటకై వేయునది.

**رقیب** రకీబ్ (అ.పు) రక్షకుడు, పాలకుడు; వంతువాడు, పోటివాడు, ప్రతిస్పర్థి, వైరి, పగవాడు.

**رقیق** రకీక్ (అ)పలచని, ఆర్ద్రమైన, ద్రవరూపమయిన, సూక్ష్మమైన, సున్నితమైన, మృదువైన.

**رقیمہ** రకీమ (అ.పు) లిఖితము, లేఖ, పత్రిక, చీటి, జాబు, ఉత్తరము.

**رکاب** రికాబ్ (అ.స్త్రీ) అంకవన్నె, అంకోడు, పళ్లెము, తట్ట, గిన్నె. **رکابدار** -దార్ (పా) అంకోడుపట్టువాడు, తోటివాడు, చెలికాడు. (సిబ్బ.

**رکابی** రకాబీ (పా. స్త్రీ) పళ్లెము, తట్ట,

**رکان** రకాన్ (హి) తీరు, రీతి, వైఖరి; డబ్బు, అంగు, కళ్లెము.

**رکاو** రుకావ్ (హి.పు) ఆపుదల, ఆటంకము, అడ్డము, పట్టు, నిలుకడ, ఓగింపు, వెనుదీయుట.

**رکاوٹ** రుకావట్ (స్త్రీ) అభ్యంతరము, అసమాధానము, అలుక, కపటము, కల్మషము, కోపము.

**رکت** రక్త్(హి.పు)రక్తము, నెత్తురు **رکت پا** -పా (పు) జెలగ.

**رکعت** రక్అత్ [అ.స్త్రీ] వాలు, వంపు, వంగుట; నమాజులో కొంతభాగము, ఒకసారి నిలిచికూర్చుండువరకుగలభాగము.

**رکن** రుక్న అ(.పు) స్తంభము, గుంజ, రాడు, పోటి, ఆను; పద్యపాదము; మంత్రి, కార్యదర్శి, ప్రముఖుడు, రాజ్యాంగము, భాగము, హంశము. **رکن السلطنت** -ఉస్, సల్తనత్ (పు) రాజ్యనిర్వాహకుడు, రాజ్యాంగము, మంత్రి.

**رکن** రుకన్ (హి.స్త్రీ) ఆపుదల.

**رکنا** రుక్నా (హి) ఆగుట, నిలుచుట, తడబడుట, తట్టుట, కట్టుబడుట, క్రిక్కిరియుట, బిగియుట; అలుగుట, మాట్లాడకపోవుట.

**رکوع** రుకూఅ (అ.పు) వంగుట, వందనము, నమాజులో మోకాళ్లపై చేతులుంచుకొని వంగియుండుట.

**رکویا** రుక్వైయా [హి.పు] రక్షకుడు. ఆపువాడు, నిలుపువాడు,

**رکھانا** రఖానా (హి) చూడు **رکھنا**యొక్క ప్రేరణార్థకము. పెట్టించుటమొ॥.

**رکھانی** రుఖానీ(హి.స్త్రీ) ఉలి, బర్మా.

**رکھائی** రుఖాయీ (హి.స్త్రీ) అలుక, అరంజకత, అసమాధానము, అలక్ష్యము, ఉపేక్ష, కోపము, మాట్లాడకపోవుట.

**رکھنا** రఖ్నా (హి) ఉంచుట, పెట్టుట, కలిగియుండుట, కాపాడుట, నిలుపుట, ఆపుట, సంచితముచేయుట, మోపుట, కుదువపెట్టుట, దక్కించుకొనుట, ఉంచుకొనుట, పెట్టుకొనుట, దించుట,

వేయుట, పెట్టుబనిపెట్టుట.

**رکھوالا - رکھوار** రఖ్వార్ - రఖ్వాలా (హి.పు) కాపరి, కావలివాడు, రక్షకుడు, పసులకాపరి; పదిలము, కాపు, కావలి, రక్షణ.

**رکھوالی** రఖ్వాలీ (హి. స్త్రీ) సంరక్షణ, కావలి, కాపు, పదిలము, అప్పగింత; కావలికూలి, కాచినందుకుజీతము.

**رکھوانا** రఖ్వానా (హి) చూడు **رکھانا** యొక్క ప్రేరణార్థకము.

**رکھوائی** రఖ్వాయీ (హి. స్త్రీ) కావలి కూలి, కాచినందుకుజీతము, కాపుదల.

**رکھی** రిఖీ (హి.పు) ఋషి; ఆరు రూపాయీలు (తరు?రాల పరిభాష).

**رکھی** రఖీ (హి. స్త్రీ) గడ్డివామి, గడ్డికుప్ప.

**رکیبی** రకేబీ (ఉ. స్త్రీ) **رکابی** యొక్క సంకరము.

**رکیک** రకీక్ (అ) పలచని, బక్కని, బలహీనము, తుచ్ఛము.

**رگ** రగ్ (పా. స్త్రీ) నరము, నాళము, రక్తనాళము, నాడి; దారము, నూలు. ఆకు మొ||గాని ఈనె; కులము, వంశము; స్వభావము, గుణము; హఠము, మొండితనము, ధైర్యము, పీనము, కోపము **رگ جان** -ఎ,జాం(స్త్రీ) బృహద్ధమని పెద్దరక్తనాళము. **رگ زن** -జన్ (పా) శస్త్రవైద్యుడు. **رگ و ریشہ** -ఒ,రేష (పు) నరములు, నాళములు; స్వభావము, ప్రకృతి, దేహము.

**رگڑ** రగడ్ (హి. స్త్రీ) రాపిడి, ఒరయిక, ఘర్షణము, రుద్దుట, గీరుకపోవుట, చిన్న గాయము.

**رگڑا** రగ్డా (హి.పు) రాపిడి, ఒరయిక, రుద్దుట, మర్దనము, నూరుట, ఘర్షణము; జగడము; గాయము, నష్టము; కొటుక.

**رگڑنا** రగడ్నా (హి) రాయుట, రుద్దుట, తోముట, నూరుట, నలుచుట, మర్దించుట, పొట్టుగీరుట; వాడుట, ఉపయోగించుట; రాపిడిపెట్టుట, పీడించుట, అగచాట్లు పెట్టుట.

**رگڑی** రగడీ (హి) జగడగొండి.

**رگنا** రగ్నా (హి) తగులుకొనుట, మోహించుట, ప్రేమించుట.

**رگی - رگیلا** రగీ-రగీలా (పా) నరములు గల, ఈనెలుగల, మొండి, హఠవాది, మూర్ఖుడు, తలబిరుసు, పోకిరి, లావైన నరములు లేక దారములు లేక ఈనెలుగల.

**رگید** రగేద్ (హి. స్త్రీ) తరుముట, వెంబడింపు, వెన్నాడుట.

**رگیدنا** రగేద్నా (హి) పరుగెత్తించుట, వెంబడించుట, వెంటతగులుట.

**رلا** రలా (హి.పు) మిశ్రణము, కలయిక, కూడిక, పొరపాటు, భేదము.

**رلانا** రలానా (హి) కలుపుట, గజిబిజిచేయుట.

**رلانا** రులానా (హి) ఏడ్పించుట.

**رلنا** రల్నా (హి) కలియుట, తారుమారగుట, పొడియగుట.

**رلنا** రుల్నా (హి) జవరబడుట, ప్రోగగుట, పొడగుట, ఏర్పరుపబడుట; స్వాచ్ఛగుట, నేమబడుట, చెరుగబడుట.

**رم** రమ్ (పా.పు) పారుట, పలాయనము, భయము, తొట్రు, తత్తర, విమోగము. **رم ہونا** -హోనా (ఉ) దాగుట, పారిపోవుట.

**رماز** రమ్మాజ్ (అ.పు) గూఢభాషి, రహస్యపుమాటలాడువాడు, సౌజ్ఞలతో మాటలాడువాడు.

**رمال** రమ్మాల్ (అ) జ్యోతిష్కుడు, భవిష్యత్తును చెప్పువాడు, ప్రశ్న చెప్పువాడు, ప్రశ్నశాస్త్రజ్ఞుడు.

**رمان** రుమ్మాన్ (అ.పు) దాడింబ, దాళిమ్మ.

**رمانا** రమానా (హి) త్రిప్పుట, పరుగెత్తించుట, స్వాధీనపరచుకొనుట, అనుభవించుట, ఉపయోగించుట, నష్టముజేయుట, మోసపుచ్చుట.

**رمبا** రంబా (హి.పు) బొరిగ, పార, తొల్లిక.

**رمبھانا** రంభానా (హి) అంబాయనుట, ఆవుఅరచుట.

**رم جھم** రిమ్‌ఝిమ్ (హి. స్త్రీ) వానజల్లుచప్పుడు; నడకచప్పుడు.

**رم جھول - لا** రంఝోల్ - లా (హి.పు) అందె, పాదభూషణము.

**رم چیرا** రమ్‌చేరా (హి.పు) బానిస.

**رمد** రమద్ (అ.పు) అవిరి, కంటిరోగము.

**رمز** రమ్జ్ (అ, స్త్రీ) భావము, ఇంగితము, చేష్ట, చిహ్నము, చిన్నె, గురుతు, సెజ్ఞ, పెదవులాడించుట, సూచన; విడికథ, గూఢవాక్యము, శ్లేషపదము, అపహాస్యము, గుట్టు, రహస్యము, సూక్ష్మము, ఉద్దేశము, తాత్పర్యము, అభిప్రాయము, హాంశము, విషయము.

**رمضان** రమజాన్-రమ్‌జాన్ (అ.పు) అరబ్బులతొమ్మిదవచాంద్రమాసము.

**رمق** రమక్ (అ. స్త్రీ) కొనఊపిరి, కొంచెము, సూక్ష్మము, రవంత.

**رمل** రమల్ (అ.పు) ప్రశ్నశాస్త్రము.

**رمنا** రమ్నా (హి) భ్రమించుట, తిరుగుట, దిమ్మరుట, నివసించుట, రంజిల్లుట, అనుభవించుట, భోగించుట, రమించుట, విహరించుట, వెళ్ళిపోవుట, పోవుట, నష్టమగుట, ఇముడుట, పట్టుట, ఉండుట, త్రోవతప్పుట, మోహించుట, నిలుచుట, స్థావరమగుట, నివాసమగుట.

**رمنا** రమ్నా [హి.పు] పచ్చికబయలు, కంచె, పసరికస్థలము.

**رموز** రమూజ్ (అ. స్త్రీ) చూడు (ఏ.వ. **رمز**) సౌంజ్ఞలు, సూచనలు.

**رمہ** రమ (పా.పు) గుంపు, మంద.

**رمیدگی** రమీదగీ (పా. స్త్రీ) ఉరుకు, పరుగు, పలాయనము, భీతి, అసహ్యము.

**رمیم** రమీమ్ (అ) చితికిపోయిన, పాతపడిన, విచిత్రమైన, శిథిలమైన, ముదిగిన.

**رن** రన్ (హి.పు) రణము, యుద్ధము, రణరంగము; అడవి, బీడు, గురుతు, మచ్చ.

**رنج** రంజ్ (పా.పు) దుఃఖము, చింత, వ్యసనము, వ్యాకులము, బాధ, కష్టము, రోగము, పీడ, ఆయాసము, కోపము, అలుక.

**رنجش** రంజిష్ (పా. స్త్రీ) దుఃఖము, వ్యసనము, చింత, అసమాధానము, కోపము, అరంజకత, అసంతోషము, స్పర్ధ, పగ.

**رنجک** రంజక్ (పా. స్త్రీ) రంజకము, తుపాకిచెవిలో వేయు మందు.

**رنجور** రంజూర్ (పా) రోగపీడితుడైన, వ్యాధిగ్రస్తుడైన, దుఃఖితుడైన, పీడగల, వ్యసనముగల, బాధగల.

**رنجھنا** రంఝ్నా (హి) పుష్కలము, పెరుగుట, వృద్ధియగుట, రోగము పాతబడుట.

**رنجیدگی** రంజీదగీ (పా. స్త్రీ) చూడు **رنجش**

**رنجیدہ** రంజీద (పా) ఖిన్నుడైన, వ్యసనపడిన, దుఃఖితుడైన, అసమాధానపడిన, చిన్నపోయిన, అలిగిన, కోపపడిన, చింతగల, వ్యాకులముగల, అసంతుష్టుడైన.

**رند** రింద్ (పా.పు) పాషండుడు, నష్టధర్ముడు, దురాచారి, పోకిరి, త్రాగుబోతు, దుష్టుడు, కుకర్మి.

**رندانہ** రిందాన(పా) దుర్మార్గుడైన, కుకర్మియైన, పోకిరియైన.

**رندنا** రంధ్నా (హి) త్రొక్కుడు పడుట, నలుగుట, చితుకుట.

**رندنا** రంద్నా (హి) చిత్రకతో నునుపు చేయుట, తోపుడు పెట్టుట.

**رندہ** రంద (పా.పు) చెక్కపొడి, చిత్రిక, కట్టెనునుపుగా చేయు సాధనము.

**رندہ پھیرنا** - రంద ఫేర్నా (ఉ) చిత్రికతో నునుపుచేయుట, త్రోపుడు పెట్టుట.

**رندھنا** రంధ్నా (హి) ఉడుకుట, పక్వమగుట.

**رندی** రిందీ (పా. స్త్రీ) అధర్మము, కుకర్మ, దురాచారము, మోసము.

**رنڈ** రండ్ (హి) తలలేని దేహము, మొండెము,

**رنڈ** రండ్ (హి.స్త్రీ) చూడు **رانڈ**

**رنڈاپا** రండాపా (హి.పు) వైధవ్యము, రండరికము, ముండమోపితనము.

**رنڈسالا** రండ్‌సాలా (హి.పు) ముండమోపి ధరించు వస్త్రములు.

**رنڈوا** రండ్వా (హి.పు) అపత్నీకుడు, పెండ్లాములేనివాడు, పనికిమాలినవాడు.

**رنڈی** రండీ[హి.స్త్రీ] ఆడుది, వెలయాలు, లంజె, తొత్తు, ముండ, ఆటకత్తె, పాటకత్తె, **رنڈی باز**-రండీబాజ్ [ఉ] ముండలమారి, **رنڈی بازی**-రండీబాజీ(ఉ. స్త్రీ) వ్యభిచారము, ముండలమారితనము.

**رنڈیا** రండ్యా (హి. స్త్రీ) ముండ, లంజె.

**رنگ** రంగ్ (పా.పు) రంగు, వర్ణము, వన్నె, ఛాయ, కాంతి, మెరుగు, ఠీవి, తెరగు, వైఖరి, రీతి, పోలిక, ప్రకారము, మాదిరి, వర్తనము, వాడుక, నడవడిక, రూపురేఖలు, ఆకారము, అవస్థ, గతి, స్థితి, వయినము, స్వభావము, లక్షణము, గుణము, డౌలు, వయసు, తారుణ్యము, ఆచారము, సాంప్రదాయము, సౌందర్యము, సొగసు, రంగము, ఆటపాటలు, ఉల్లాసము, విలాసము, ఉత్సాహము, సౌఖ్యము, ఆనందము, సరసము, వినోదము, రసము, సంబంధము, మోసము, ఉపాయము, టక్కు, యుక్తి, మైకము, మత్తు, లహరీ ఫలము, సారాంశము, **رنگ اڑجانا- زرد ہونا- فق ہوجانا**- ఉడ్‌జానా - జర్ద్ హోనా - ఫక్ హోజానా (ఉ) వెలవెలపారుట, కాంతిహీనమగుట, వెలిసిపోవుట, వివర్ణమగుట, **رنگ اڑنا** - ఉడ్నా (ఉ) వన్నె వెలిసిపోవుట, **رنگ افشانی** - అఫ్‌షానీ (స్త్రీ) రంగుచల్లుట, **رنگ برنگ کا**-బరంగ్ కా (ఉ) చిత్రవిచిత్రమైన, నానావర్ణమైన, వివిధములైన, నానావిధమైన, **رنگ پاشی**-పాషీ(స్త్రీ) రంగాడుట, వసంతములాడుట, **رنگ ڈھنگ** - ఢంగ్ (ఉ.పు) స్వభావము, వర్తనము, **رنگ رسیا** - రసియా(ఉ) వన్నెకాడు, పోకిరి, విలాసకాడు, **رلیاں** - **رنگ رسیاں** - రసియాం - రలియాం (స్త్రీ) ఆటపాటలు, వేడుకలు, వినోద

ములు, **رنگ روپ** - రూప్ (పు) అందము,చందము, రూపురేఖావిలాసములు, **رنگ ریز** - రేజ్ (పా) రంగాజీవుడు, రంగరి, **رنگ ساز** - సాజ్ (పా) రంగరి, రంగాజీవుడు, **رنگ محل** - మహల్ (పు) రంగశాల, విలాసగృహము.

**رنگا رنگ** రంగారంగ్ (పా) చిత్రవిచిత్రమైన, నానావర్ణమైన, వివిధమైన.

**رنگانا** రంగానా(హి) అద్దుట,వన్నెవేయుట,

**رنگاوٹ** రంగావట్ [హి.స్త్రీ] అద్దకము, రంగువేయుట.

**رنگائی - رنگوائی** రంగాయీ - రంగ్వాయీ (హి. స్త్రీ) అద్దకము, అద్దకపు కూలి, రంగువేసినకూలి.

**رنگت** రంగత్ (ఉ. స్త్రీ) వర్ణము, దేహచ్ఛాయ, వన్నె, రూపము,వయినము,స్థితి, వైఖరి.

**رنگترا** రంగ్‌తరా (ఉ.పు) కమలాఫలము, తియ్యనారింజ.

**رنگنا** రంగ్నా (హి)రంగువేయుట, అద్దుట, తనవలెజేయుట.

**رنگوانا** రంగ్వానా(హి)రంగువేయించుట.

**رنگی** రంగీ (హి. స్త్రీ) అద్దకపుగుడ్డ, కలంకారి బట్ట.

**رنگیلا** రంగీలా (హి) వన్నెలకాడు, వేడుకకాడు,సొగసుగాడు,విలాసవంతుడు,పోకిరి,ఆడంబరమైన, డంబమైన,చూపుల,రసికమైన,

**رنگیلی** రంగీలీ (హి) వన్నెలాడి, సొగసుగత్తె,విలాసవతి,దుర్మార్గురాలు,రసికమైన, డంబమైన.

**رنگین** రంగీన్ (పా)శృంగారమైన, సొగసైన, అద్దిన, రంగువేసిన, అలంకృతమైన, ఉత్సాహముగల; అలంకారయుక్తమైన, చిత్రమైన, వన్నెలుగల, నానావర్ణమైన, కత్తిరి, అందమైన, ఆడంబరమైన, ప్రకాశమానమైన.

**رنگینی** రంగీనీ (పా. స్త్రీ)రసవంతత్వము; శృంగారము, అలంకారము, విలాసము, వైచిత్ర్యము, సరసత్వము, సొగసు, సింగారము.

**رنی** రనీ (హి. స్త్రీ) జామపండు.

**رو** రౌ (పా)పోయెడు,గామి,(వృత్తియందు) **پیش رو** పేష్ - (పా) పురోగామి, ముందుపోయెడు.

**رو** రౌ (హి. స్త్రీ)ప్రవాహము, ధార; వర్తనము; ఉత్సాహము, ఉద్రేకము, ఆవేశము, కోపము,దళము,సేన,గుంపు, సమూహము.

**رو** రో(పా)పెరిగెడు,రుహము.(వృత్తియందు)

**رو** రూ (పా.పు) ముఖము, రూపము; కారణము, మూలము; పైభాగము, మీదు; క్షేత్రము, ముఖభాగము, పరుపు, విరివి, చిత్తు, ఆశ, సంభవము, **روپوش ہونا** -పోష్‌హోనా (ఉ) ముఖముతప్పించుట, దాగుట, పారిపోవుట, **رودار** -దార్ (పా)గౌరవవంతుడు,అందమైన, కీర్తిగల, **رودینا** -దేనా (ఉ) అభిముఖుడగుట, అవధానించుట, **رورعایت** -రిఆయత్ (స్త్రీ) మొగమోటము, పక్షపాతము, దాక్షిణ్యము, **روسیاہ** -సియాహ్ (పా) నిందితుడు, పాపి, అపకీర్తిపడిన, **روسیاہی** -సియాహీ (స్త్రీ) నల్లమొగము, అపకీర్తి, అవమానము, **روشناس** -షినాస్ (పా) పరిచయస్థుడు, గురుతున్నవాడు, **روشناسی** -షినాసీ(స్త్రీ) ముఖపరిచయము, గుర్తు, **روگردان** -గర్దాన్ (పా) పారిపోయెడు, విముఖమైన,

మరలిన, తిరిగిన. **روگردانی** - గర్దానీ (స్త్రీ) విముఖత, తిరుగుబాటు, అసమాధానము.

**روا** రవా (పా) సరియైన, యోగ్యమైన, అర్హమైన, తగిన, భాగైన, రూఢియైన; సాంప్రదాయకమైన, నడచెడు, చెల్లెడు, వ్యవహారములోనున్న, **روادار ہونا** - దార్ హోనా (ఉ) సరియనుట, అనుమోదించుట. మెచ్చుట, పక్షపాతియగుట, మేలుకోరుట, **رواداری** - దారీ (స్త్రీ) అంగీకారము, మెప్పు, పక్షపాతము, అభిమానము.

**روا** రవా (హి.పు) కణము, వలుసు, రవ, నూక, వెండిబంగారుయొక్క నలుసులు.

**رواج** రివాజ్ (అ.పు) వాడుక, ఆచారము, వ్యవహారము, సాంప్రదాయము, చెల్లుబడి, రూఢి.

**رواجی** రివాజీ (అ) సాంప్రదాయికమైన, వాడుకలోనున్న, చెల్లుచున్న, నడచుచున్న, పరిపాతమైన.

**رواروی** రవారవీ (పా. స్త్రీ) చూడు **دوڑادوڑی**

**رواس** రొవాస్ [హి. స్త్రీ] ఏడ్పువచ్చుట, రోదనేచ్ఛ, వ్యసనము.

**رواسا** రువాసా (పా) ఏడ్పువచ్చుచున్న, దుఃఖితుడైన, రోసిన, విసికిన.

**رواق** రవాక్ (అ.పు) ద్వారమంటపము, పంచ, ఒంటెనిటారితిగు డారము.

**روال** రవాల్ (హి.పు) బంగారములేక వెండి నలుసు లేక రవ.

**رواں** రవాం (పా) ప్రవహించుచున్న, నడచుచున్న, తిరుగుచున్న, వాడుకలోనున్న, పరగుచున్న, అలవాటైన, చేయితిరిగిన, నేర్పుగల, వడిగల, పరిపాతమైన, చెల్లుచున్న; అధ్యయనము, వాచకము, ఊరిక చదువుట; గమనము, పోక, బయలుదేరిక.

**رواں** రువాం (హి.పు) రోమములు, బొచ్చు, ఉన్ని. వెండ్రుకలు, నూగు.

**روانا** రొవానా (హి) ఏడ్పించుట.

**روانگی** రవానగీ (పా. స్త్రీ) బయలుదేరిక, గమనము, పోక, అంపకము, ప్రసరణము.

**روانہ** రవాన (పా.పు) నిర్గమనము, అంపకము, సెలవు, సెలవుచీటి.

**روانی** రవానీ (పా. స్త్రీ) ప్రవాహము, వడి, వేగము, పోక; వాచకము, ధారాళము. (నము.

**روانی** రొవానీ (హి. స్త్రీ) ఏడ్పు, రోదనము.

**روایت** రివాయత్ (అ. స్త్రీ) కథనము, చెప్పుట, వచనము, ఇతిహాసము, కథ, ప్రస్తావము, చరిత్రము.

**روب** రోబ్ (పా) ఊడ్చుట, ఊడ్చువాడు. (వృత్తియందు)

**روباہ** రూబాహ్ (పా. స్త్రీ) గుంటనక్క, **روباہ بازی** - బాజీ (స్త్రీ) నక్కజిత్తులు, మోసము.

**روبراہ** రూబరాహ్ (పా) వ్యవహారయోగ్యము, ఉన్ముఖము, ఉద్యుక్తము, సిద్ధము, సంస్కరింపబడిన, మంచిత్రోవలోనున్న.

**روبرو** రూబరూ (పా) ముఖాముఖి, ఎదురుబడి, ఎదుట, సమక్షమైన, ప్రత్యక్షమైన, ముందు, ముందర.

**روبکار** రూబకార్ (పా.పు) కార్యోన్ముఖమైనది, ఉన్ముఖము, సమక్షము, ఉత్తరువు, తీర్పు, వ్యవహారలేఖ లేక ఉత్తరము.

**روبکاری** రూబకారీ (పా. స్త్రీ) విచారణ, వ్యవహారము, విమర్శన.

**روپ** రూప్ (హి.పు) రూపము, ఆకార

ము, వేషము, అందము, వెండి. روپ درشن -దర్శన్ (హి.పు) రూప్యము, రూపాయి. روپ رس -రస్ (పు) రౌప్యభస్మము, వెండిభస్మము.

روپا రూపా (హి.పు) రూప్యము, వెండి.

روپبجست రూప్‌జస్త్ (హి) సత్తు, కాంస్యము, కంచు.

روپڑ రోపడ్ (హి.పు) వరినారు.

روپنا రోప్నా (హి) నాటుట, విత్తుట; అభ్యంతరముచేయుట; ప్రదానము.

روپہلا-پہلا-پہلی రూపహ్లా - పహ్లా - పహ్లీ (హి) వెండి, వెండితోచేసిన, వెండివంటి.

روپیہ రూపియ (హి.పు) రూప్యము, రూపాయి, నాణెము, రొక్కము.

روت రువత్ (హి.స్త్రీ) సౌందర్యము, గౌరవము, లక్ష్యము.

روٹ - روٹا రోట్ -రోటా (హి.పు) పెద్దరొట్టె.

روٹھا- راٹھی రూఠా-రాఠీ(హి.స్త్రీ)అసమాధానము, అరంజకత, స్పర్ధ.

روٹھنا రూఠ్నా (హి) అసమాధానపడుట, కోపపడుట, అలుగుట.

روٹی రోటీ (హి.స్త్రీ) రొట్టె, ఆహారము, అన్నము. روٹیوکاما را రోటియోంకామారా (హి) ఉపాసి, గతిలేనివాడు, రిక్తుడు.

روج రోజ్ (హి.పు) రోదనము, ఏడ్పు.

روجھ రోఝ్ (హి.పు) మనుబోతు.

روح రూహ్ (అ.స్త్రీ) ఆత్మ, జీవము, ప్రాణము; సత్తు, రసము, సారము; హృదయము, అంతరంగము, మనోరంజకము, روح افزا -అఫ్జా (పా) ఉల్లాసకరము, హృదయరంజకము, ప్రోత్సాహకము, ఉత్తేజకము, روح الله -ఉల్లాహ్(పు) ఏసుక్రీస్తు.

روحانی రూహానీ (అ) అధ్యాత్మికమైన, మానసికమైన.

رود రూద్ (పా.పు) నది, ఏరు.

رودا- روده రోదా - రోద (పా.పు) వింటినారి, నరము, ప్రేగు.

روداد రూదాద్ (పా.స్త్రీ) వయినము, వర్తమానము, వ్యవహారము, యథార్థము, స్థితిగతులు, లక్షణము, వర్తనము.

رودبار రూద్‌బార్ (పా.పు) జలసంధి, (విశాలమయినది) వాగు, కొండకాలువ.

رور రోర్ (హి.స్త్రీ) అల్లరి, లొల్లి.

روڑا రోడా (హి.పు) రాయి, రాతిఇసుక, ఇటుకపెడ్డ, రాయి యిటుకతోచేసినపని; పాతకుండ, పాతకాపు; ఆటంకము, అడ్డు, కట్టడము; పశువుల ఒకరోగము.

روڑھا రూఢా (హి) గులకరాళ్లుగల, మోటు, అసమాధానపడిన, కఠినము.

روز రోజ్ (పా.పు) దినము, తిథి, వారము, నిత్యము, దినకూలి లేక బత్తెము. روز افزوں -అఫ్జూం (పా) దినదినప్రవర్ధమానము, روز روشن - రోషన్ (పా.పు) ఉదయకాలము. روز بروز- مرہ -బరోజ్ -మర్రహ్ (పా) నిత్యము, ప్రతిదినము, దినదినము. روزنامچہ -నామ్చ (పు) దినచర్య. روز حساب - حشر- داد- شمار- قیامت -ఎహిసాబ్ -హశ్ర్ -దాద్ -షుమార్ -కియామత్ (పు) పునరుద్ధానదివసము, విమోచనకాలము, అంత్య

కాలము, చచ్చినవారిపుణ్యపాపములువిచారింపబడుదినము.

**روزانہ**-రోజానః(పా) నిత్యము, దినబత్తెము లేక భరణము, ప్రతిదినము.

**روزگار**- రోజ్ గార్ (పా.పు) ఉద్యోగము, కొలువు. వృత్తి, పని, కాలము. సంసారము, దినము, ప్రపంచము. **روزگار پیشہ** -పేశ(పా) సేవకావృత్తి, కూలిపని.

**روزن** రోజన్ (పా.పు) ఛిద్రము, సందు, బొంద, తూము, తూటు, గవాక్షము,

**روزہ** రోజ (పా.పు) ఉపవాసము. ఒక్కప్రొద్దు, నిరాహారము.

**روزی** రోజీ (పా. స్త్రీ) దినబత్తెములేక భరణము, జీవనము, ఉద్యోగము, కొలువు, కూలి.

**روزینہ** రోజీన (పా.పు) దినభరణము, దినబత్తెము, దినకూలి, భరణము, దినవెచ్చము.

**روس** రోస్ (హి.పు) రోషము, కోపము, అలుక.

**روس** రౌస్ (పా. స్త్రీ) తోపు, వనము. తోట.

**روساء** రూసా (అ.పు) ప్రభువులు, చూడు (ఏ.వ **رئیس** )

**روستائی** రూస్తాయీ (పా.పు) గ్రామీణుడు, కాపు, పల్లెటూరువాడు.

**روسنا** రోస్నా (హి) రోషించుట, అలుగుట, కోపపడుట.

**روسی** రూసీ (హి. స్త్రీ) చుండు, పొర.

**روش** రవిష్ (పా. స్త్రీ) వర్తనము, నడక, పోక; గతి, రీతి, వైఖరి, డౌలు, పద్ధతి, ఆచారము, సాంప్రదాయము; వాటిక, బాట, ఎక్కము, కాలిబాట, (తోటలోని ది ).

**روشن** రౌషన్-రోషన్ (పా) ప్రకాశమానము, కాంతిగల, వెలుగైన, మెరయునట్టి, వెలుతురుగల. స్పష్టమయిన, విశదమయిన, విపులమయిన, ప్రచురమయిన, బాహాటమయిన, రాద్ధాంతమయిన, ప్రకటమయిన, విదితమయిన, సుప్రసిద్ధమయిన, **روشن چوکی** - చౌకీ (ఉ. స్త్రీ) పాఠకులమేళము, **روشن دان** - దాన్ (పు) గవాక్షము, **روشن ضمیر-دل** - జమీర్ - దిల్ (పా) జ్ఞానియైన, బోధగల, ప్రతిభావంతుడైన, తెలివిగల.

**روشنائی** రోష్నాయీ (పా. స్త్రీ) ప్రకాశము, వెలుతురు, కాంతి; సిరా, మసి.

**روشنی** రోషనీ (పా. స్త్రీ) ప్రకాశము, వెలుతురు, వెలుగు, దీపాలంకారము; దృష్టి, కంటిచూపు.

**روضہ** రౌజ (అ.పు) గొప్పసమాధి; తోట, పసరికబయలు, వనము, కొయ్యపేటిక.

**روغن** రౌగన్ (పా.పు) చమురు, తైలము, నూనె, జిడ్డు, వన్నె, మెరుగు, మెరుగు నూనె, మీగడ, వెన్న, నెయ్యి, కొవ్వు, **روغن تلخ** - ఎ,తల్ఖ్ (పు) ఆవాలనూనె, **روغن زبان** - జబాన్ (పా) ముఖస్తోత్రముచేయువాడు **روغن زرد** - ఎ, జర్ద్ (పు) నెయ్యి, **روغن سیاہ** - ఎ, సియాహ్ (పు) ఆవిసెనూనె.

**روغنی** రౌగనీ (పా) జిడ్డుగల, చమురుగల, జిడ్డైన, నున్నని, మెరుగుగల. (గల,

**روف** రౌఫ్(అ)అతిదయాళువు, మిక్కిలిప్రేమ

**روک** రోక్ (హి. స్త్రీ) అడ్డు, ఆటంకము, కట్టు, నిర్బంధము, అభ్యంతరము,ఆపుదల, అడ్డము, ఆవరణము, కట్ట. **روک ٹوک** -టోక్ (స్త్రీ) అభ్యంతరము, ఎదురు,ప్రతిబంధము.

**روکاو** రోకావ్(హి.పు) ప్రతిబంధము,ఆటంకము, అడ్డము, తగులాటము.

**روکڑ** రోకడ్ (హి.పు)రూకలు,రొక్కము, ద్రవ్యము, పైకము. **روکڑبهی** -బహీ రూకలపొత్తము.

**روکڑیا** రోకడ్‌యా(హి.పు)భాండాగారుడు, కోశాధ్యక్షుడు.

**روکنا** రోక్నా (హి) ఆపుట,నిలుపుట, అడ్డపడుట, అడ్డగించుట, ఆటంకపరచుట,వద్దనుట, అడ్డకట్టుట, ఊంచుట.

**روکھ** రూఖ్ (హి.పు) వృక్షము, చెట్టు. **روکھ چڑها** -చఢా [పు] కోతి.

**روکها** రూఖా (హి) పొడియైన, ఉత్త,వట్టి, సామాన్యమైన, చప్పని, చమురులేని, బిరుసైన, కరుకైన, నిర్లక్ష్యమైన, నిర్దాక్షిణ్యమైన, అనారోగ్యమైన, మోటు, నిర్దయుడైన,కఠినుడైన.కఠోరమైన,ఉదాసీనమైన,

**روکهانی** రూఖానీ (హి) చూడు **رکهانی**

**روکهاپن - روکهائی** రూఖాపన్-రూఖాయీ(హి. స్త్రీ) కరుకు,బిరుసు.కాఠిన్యము, రసహీనత, అరంజకత, అసమాధానము, అలుక, చిరాకు, ఉపేక్ష, పొడిగానుండుట, ఉదాసీనత.

**روگ** రోగ్ (హి.పు) రోగము, జాడ్యము, ఆపత్తు, జగడము, సంకటము, కీడు, తారుమారు, కష్టము.

**روگی - روگیا - روگیلا** రోగీ -రోగియా - రోగీలా(హి.పు)రోగి,వ్యాధిగ్రస్తుడు,జగడగొండి. దుష్టరోగి.

**رول** రూల్ (ఇం.పు) రేఖాదండము, గీతలకోల; సూత్రము, నిబంధన, నియమము, చట్టము, ఏర్పాటు, పద్ధతి.

**رول-رولا** రౌల్ - రౌలా (హి.పు) అల్లరి, లొల్లి, రట్టు,రంతు,గందరగోళము, దొమ్మి, తిరుగుబాటు, అల్లకల్లోలము.

**رولن** రోలన్ (హి. స్త్రీ) జవరినది, ఏరినది, చెరిగినది, ఏరగామిగిలినది.

**رولنا** రోల్నా (హి) చెరుగుట, సేముట, జారుట;ఏరుట,పోగుచేయుట; సన్నగా చేయుట.త్రోపుడుపెట్టుట,తోముట,తడవుట, రాయుట, రుద్దుట, జవురుకొనుట.

**رولی** రోలీ (హి. స్త్రీ) కుంకుమము.

**روم** రోమ్ (హి. పు) రోమములు, బొచ్చు.

**رومال** రూమాల్ (పా.పు) ముఖముతుడుచుకొనుట, ముఖవస్త్రము, చౌకము, తుండుగుడ్డ,చేతిగుడ్డ. ఉత్తరీయము, సెల్లా, శాటి.

**رومالی** రూమాలీ (పా. స్త్రీ)ఒకపావురము; తుండుగుడ్డ, చిన్నచౌకము,చేతిగుడ్డ,శిరోవస్త్రము, పచ్ఛదము, కాసికోక, దట్టి; ఒకపరిశ్రమ.

**رومی** రూమీ (అ.పు) తుర్కీదేశస్థుడు, రోమకుడు. (రోముదేశస్థుడు)

**رونا** రోనా (హి) ఏడ్చుట, దుఃఖించుట, గోడాడుట, చింతపడుట. వ్యసనము,కష్టము, ఏడ్పు, మొర, చింత, దుఃఖము, **رونی صورت** రోనీసూరత్ (స్త్రీ) ఏడ్పుమొగము.

**رونا** రౌనా [హి.పు] తుపాకులలో వేయు సీసపురవలు, గజ్జెలలో వేయుగుండ్లు; మళ్లు పెండ్లికి పెండ్లికూతురిని పిలుచుకవచ్చుట.

**رونا** రవన్నా (హి.పు) కంచుకి, ఆడువారి సేవకుడు, య్యర్గలి. (టు.

**رونپنا** రోంపన్నా (హి) నారునాటుట, నాటు

**روند** రౌండ్ (ఇం. స్త్రీ) చుట్టు, ప్రదక్షిణము, భ్రమణము, తిరుగుడు, ప్రహరి, కావలితిరుగుట, వంతు, పర్యాయము.

**روندن** రౌందన్ (హి.పు) మట్టాడుట, తొక్కుడు.

**روندنا - روندهنا** రౌందనా-రౌంధనా (హి) త్రొక్కుట, మట్లాడుట. మట్టించుట, కాలరాయుట, నలుగత్రొక్కుట.

**رونده** రవింద (పా.పు) గామి, పోవువాడు. (వృత్తియందు)

**روں روں** రూఁరూఁ (హి. స్త్రీ) పిల్లల మూల్గుగు, గొణుగుడు, సారంగిచప్పుడు.

**رونق** రౌనక్ (అ. స్త్రీ) కాంతి, ప్రకాశము, మెరుపు, నవీనత, తారుణ్యము, అందము, సింగారము, వన్నె, మిసిమి, పటాటోపము, వైభవము. **رونق افروز هونا - افزا هونا** - అఫ్రోజ్ హోనా - అఫ్జా హోనా (ఉ) విరాజమానులగుట, విజయము చేయుట, వేంచేయుట. **رونق‌دار** -దార్ (పా) ప్రకాశమానము, కాంతిగల, కళగల.

**رونگ - رونگٹا** రూంగ్ -రూంగ్‌టా (హి.పు) బొచ్చు, నూగు, దేహముపై మెత్తని వెండ్రుకలు, రోమము, **رونگٹے کهڑے هونا** రూంగ్‌టే ఖడేహోనా (హి) గగురుపొడుచుట, రోమాంచమగుట, పులకాంకితమగుట.

**رونگهٹ** రూంఘట్ (హి. స్త్రీ) మురికి, మైల.

**رونم** రవన్న (ఉ.పు) అంపకము, సెలవుచీటి, ఉల్లాకు, సరుకులవెల. మొ॥ -వాని పట్టి, చూడు **رونا**

**روها** రూహా (హి) వాడిన, ప్రాత.

**روهو** రూహూ [హి. స్త్రీ] చేపపిల్ల; కంటి కొలికి. (మెత్తని.

**روئی** రూయీ (హి. స్త్రీ) దూది, ప్రత్తి,

**رویت** రూయత్ (అ. స్త్రీ) దర్శనము, చూపు, అగపడుట, ఆకారము. రీతి, వైపు, లక్షణము. **رویت هلال** ఎ,హిలాల్ (స్త్రీ) చంద్రదర్శనము,

**روئیداد** రూయెదాద్ (పా. స్త్రీ) చూడు **روداد**

**روئیدگی** రోయీదగీ (పా. స్త్రీ) అంకురింపు, మొలచుట, ఉత్పత్తి, పెరుగుట.

**روئیں** రూయేఁ (హి.పు) దేహముపైనూగు, బొచ్చు, సన్నవెండ్రుకలు.

**رویه** రవియ (పా.పు) వర్తనము, నడవడిక, ఆచారము, సాంప్రదాయము, వాడుక, పద్ధతి, రీతి.

**روئین** రోయీన్ (పా,పు) పిత్తలము, ఇత్తడి, తగరపుపూతగల, తగరముపూసిన, (కలాయిచేసిన)

**ره** రహ్ (పా. స్త్రీ) చూడు **راه**

**رها** రహా (పా) విముక్తమైన, విడుదలయైన, విడువబడిన. విడుదల, విముక్తి.

**رهانا** రహానా (హి) విసురుటాయి మొ॥ వానికి కక్కు వేయించుట, మల్లాడించుట.

**رهاو** రహావ్ (హి.పు) నిలుకడ, నివాసము, ఉనికి, అపుదల, వ్యవధి, అవకాశము; చాలకాలముడుండెడు.

**رهائی** రహాయీ (పా. స్త్రీ) విముక్తి, విడుదల, విమోచనము.

**رهایش** రహాయిష్ (హి. స్త్రీ) నిలుకడ, నివాసము, ఉనికి.

**رهبر** రహబర్ (పా.పు) చూడు **راهبر**

**رہبری** రహ్‌బరీ (పా. స్త్రీ) చూడు **راہبری**

**رہٹ** రహాట్ (హి. పు) గిరక మోటు, మోటు రాటము. (టము.

**رہٹا** రహ్‌టా (హి. పు) రాటము, నూలు రా

**رہرو** రహ్‌రౌ (పా. పు) చూడు **راہرو**

**رہروی** రహ్‌రవీ (పా. స్త్రీ) త్రోవ నడచుట; ప్రవాసము, ప్రయాణము.

**رہڑو** రహ్‌డూ (హి. పు) ఊతబండి, పిల్లలకు నడక నేర్పు ఆటబండి.

**رہزن** రహ్‌జన్ (పా. పు) చూడు **راہزن**

**رہس** రహస్ (హి. పు) రభసము, సంతోషము, వేడుక, విలాసము.

**رہسنا** రహస్నా (హి) వేడుకచేయుట. సంతోషించుట, ఉత్సహించుట, సుఖించుట, అనుభవించుట.

**رہکلا-رہکلہ** రహ్‌కలా-రహ్‌కల (హి. పు) చిన్నతోపు, పిరంగిమోయుబండి.

**رہگزر** రహ్‌గుజర్ (పా. పు) చూడు **راہگزر**

**رہن** రహ్న్ (అ. పు) బంధనము, ఆయకము, కుదువ, తాకట్టు. **رہن نامہ** -నామ (పు) తాకట్టుపత్రము, కుదువచీటి. **رہن دار** -దార్ (పు) కుదువపట్టినవాడు.

**رہنا** రహ్నా (హి) ఉండుట, నిలుచుట, మిగులుట, ఆగుట, ఆటుట, మ్రొప్పడుట, శాపపుట. **رہنا سہنا** -సహ్నా (హి) నివాసముచేయుట, కాలముగడపుట.

**رہنما** రహ్‌నుమా (పా. పు) చూడు **راہنما**

**رہنمائی** రహ్‌నుమాయీ (పా. స్త్రీ) చూడు **راہنمائی**

**رہوا** రహ్వా (హి. పు) బానిస, రిక్తుడు.

**رہوائی** రహ్వాయీ (హి. స్త్రీ) ఇంటిబాడుగ, కావలికూలి.

**رہویا** రహ్‌వైయా (హి. పు) ఉండువాడు, నివాసి.

**رے** రే (హి) రే, రేరే, ఓరి, ఓరీ.

**رئی** రయీ (హి. స్త్రీ) కవ్వము.

**ریاء** రియా (అ. స్త్రీ) స్పర్ధ, వైరము, మోసము, కుయుక్తి, ఆడంబరము. ఎక్కు, కపటము. **ریاکار** -కార్ (పా) కపటి, మోసగాడు, మాయలమారి.

**ریاح** రియాహ్ (అ. స్త్రీ) కడుపుబ్బు, అపానవాయువు, దుర్వాసన.

**ریاست** రియాసత్ (అ. స్త్రీ) అధ్యక్షత, అధికారము, ప్రభుత్వము, రాజరికము, రాజ్యము, నాయకత్వము, దొరతనము; శౌర్యము, పెత్తనము, గాంభీర్యము. **جمہوری ریاست** -ఎ జమ్‌హూరీ (స్త్రీ) ప్రజాప్రభుత్వము.

**ریاض** రియాజ్ (అ. పు) శిక్ష, నేర్పుట, పరిశ్రమ, ప్రయాసము. చూడు **ریاضیت**

**ریاض** రియాజ్ (అ. పు) ఉద్యానవనములు, తోటలు. (ఏ. వ **روضہ**)

**ریاضت** రియాజత్ (అ, స్త్రీ) పరిశ్రమ, ప్రయాసము, కష్టము, యమము, వర్జనము, ఇంద్రియనిగ్రహము, త్యాగము, సన్యాసము, తపస్సు, నిష్ఠ; మల్లాటు, సాము, కొలువు, కూలిపని.

**ریاضتی** రియాజతీ (అ, పు) సన్యాసి, తపస్వి, నిష్ఠపరుడు; కష్టి, శ్రమచేయువాడు, యతి.

**ریاضی** రియాజీ (అ, స్త్రీ) శాస్త్రములు; గణితశాస్త్రము. **ریاضی دان** -దాన్ (పు) గణితశాస్త్రజ్ఞుడు.

**ریائی** రియాయీ (అ) కపటము, టక్కు,

వ్మాయ, మోసము, మాయలమారి. కపటి.

**ریت** రేత్ (హి. స్త్రీ) ఇసుక, రవ, పొడి, నూక.

**ریت** రీత్ (హి. స్త్రీ) రీతి, సాంప్రదాయము, పద్ధతి. **ریت رسم** -రస్మ్ (పు) ఆచార వ్యవహారములు. రీతివర్తనములు.

**ریتا** రేతా (హి. పు) ఇసుక, ఇసుకనేల.

**ریتا** రీతా (హి) రిక్తము, ఉత్త, వట్టి, శూన్యమైన, విడిగానున్న.

**ریتائی** రేతాయీ (హి. స్త్రీ) ఆకురాయి పట్టినకూలి.

**ریتنا** (హి) ఆకురాయితో రాయుట, రాయిడి పెట్టుట, రుద్దుట, రాయుట, నునుపుగా చేయుట, మెరుగుపెట్టుట. (నేల.

**ریتی** రేతీ (హి. స్త్రీ) ఆకురాయి; ఇసుక

**ریتیلا** రేతీలా (హి) ఇసుకగల, ఇసుకగానున్న, నూకలుగా లేక పొడిపొడిగానున్న.

**ریٹھا** రీఠా (హి. పు) కుంకుడుకాయ.

**ریجھ** రీఝ్ (హి. స్త్రీ) మెప్పు, ఇష్టము, ఒప్పిదము, ఇచ్ఛ, కోరిక, సంతోషము, అపేక్ష, స్వభావము, వాంఛ, అలవాటు

**ریجھنا** రీఝ్నా (హి) సంతోషించుట, ఇష్టపడుట, అపేక్షించుట, మెచ్చుట.

**ریچھ - رِیچھ** రీచ్ -ఛ్ (హి. పు) భల్లూకము, గుడ్డేలుగు.

**ریح** రీహ్ (అ. స్త్రీ) వాయువు, అపానవాయువు.

**ریحان** రైహాన్ (అ. పు) ఒకసువాసనగల చెట్టు. (తులసివంటిది.)

**ریخ** రేఖ్ (హి. స్త్రీ) రేఖ, పండ్లపడిమి దాచెనకర్రి, పంటిచిగురు, మూలము, కీలు.

**ریختہ** రేఖ్త (పా) పోతపోసిన, కారిన, రాలిన, జారిన; చెల్లాచెదరైన, విశీర్ణమైన, తారుమారైన, మిశ్రితమైన, కలిసిన; దిట్టమైన, గట్టియైన, బలిష్ఠమైన; (పు) సోద, గచ్చు; ఉర్దుదుభాష, ఉర్దుదుభాషలోని కవిత్వము, గ్రామ్యభాష.

**ریختی** రేఖ్తీ (పా. స్త్రీ) ఆడంగులమాటలతో రచించినకవిత్వము.

**ریداس** రైదాస్ (హి. పు) ఒకమాదిగకులమందుబుట్టిన భక్తునిపేరు.

**ریڑ** రీడ్ (హి. స్త్రీ) వెన్నెముక.

**ریز** రేజ్ (పా) చల్లు, పోయు, కార్చు రాల్చు, చెదర్చు. చెల్లాచెదరుచేయు; పిట్టలపలుకు, కిచకిచలాట. (వృత్తియందు)

**ریزاں** రేజాఁ (పా) పోయు, చల్లెడు, వెదచల్లెడు, చెల్లాచెదరుచేయు. (వృత్తియందు)

**ریزش** రేజిష్ (పా. స్త్రీ) కారుట, ఉరుపు, పోటుకు, జలుబు, పడిసెము, విశీర్ణత, చెదరుట.

**ریزگاری** రేజ్‌గారీ (ఉ. స్త్రీ) చిల్లరనాణెములు, చిల్లర, మార్కము, నేబులు.

**ریزگی** రేజ్‌గీ (పా. స్త్రీ) తునక, చుక్క, త్రుక్కు, నుగ్గు, మష్టు, చెత్త, చెక్కుచేసిన మాంసము, చిల్లరనాణెము, మార్కము.

**ریزہ** రేజహ్ (పా. పు) అణువు, రవ, తునక, నలుసు, తుంపు, చీలిక, సీలిక; చిల్లర, మారకము; ఒట్టురేకు; ఉప్పగపిల్లము; పిల్ల, బోగముపిల్ల, కూస; చిన్నపెట్టె, కాయ.

**ریزہ ریزہ ہونا** - రేజహ్రేజహ్హోనా (ఉ) తుత్తునియలగుట, నుగ్గునుగ్గుఅగుట, సున్నిసున్నియగుట.

**ریس** రీస్ (హి. స్త్రీ) రోషము, రేశము, కోపము, పోటి, ప్రతిస్పర్ధ, వైరము, వంతు,

సరితూగుట, సమానత, మత్సరము, అనూయ, ఆతురము.

**رئیس - رئیس** రఇస్ - రయీస్ (అ) ప్రభువు, నాయకుడు, కులీనుడు, పెద్ద, తలకట్టు, పాళెగాడు, నివాసి, గొప్పవాడు, గ్రామస్థుడు, నగరవాసి.

**ریسمان** రీస్మాన్ (పా. స్త్రీ) త్రాడు, పగ్గము.

**ریش** రీష్ (పా. స్త్రీ) గడ్డము. **ریش بچہ** -బచ్చ (పు) పిల్లిగడ్డము. **ریش خند** -ఖంద్ (పు) నవ్వులబండి, ఇచ్ఛకాలు, హాస్యము, పరియాచకము.

**ریش** రేష్ (పా. పు) చీము, గాయము, పుండు.

**ریشائیل** రీషాయీల్ (అ. పు) పొడుగాటి గడ్డముగలవాడు, హజ్రత్ ఆదముగారి గురువైన దేవత.

**ریشم** రేషమ్ (పా. పు) పట్టు, పట్టుదారము, పోగు.

**ریشمی** రేష్మీ (పా) పట్టు(తో చేసిన)

**ریشہ** రేష (పా. పు) నార, పీచు, పొట్టు, నరము, నూలు. **ریشہ دار** -దార్ (పా) నారగల, పీచుగల.

**ریغل** రీగల్ (పా) ఎండిన, బక్కని, పలుచని.

**ریکاں** రేకాఁ (హి. స్త్రీ) ఏటినీరు, అందని భూమి.

**ریکھ - ریکھا** రేఖ్ - రేఖా [హి. స్త్రీ] రేఖ, గీత, అదృష్టము.

**ریگ** రేగ్ (పా. స్త్రీ) ఇసుక. **ریگدان** -దాన్ (పు) ఇసుకబుడ్డి.

**ریگزار** రేగ్‌జార్ (పా. పు) ఇసుక నేల, ఇసుకఎడారి.

**ریگستان** రేగిస్తాన్ (పా. పు) ఇసుకఎడారి, ఇసుకబయలు.

**ریگھاری** రేఘారీ (హి. స్త్రీ) చాలు, గీత.

**ریل** రేల్ (ఇం. స్త్రీ) రైలు, పొగబండి, ఇనుపకమ్మి, ఇనుపదారి.

**ریل** రీల్ (ఇం. స్త్రీ) దారపుగిరక, సీమదారపు (కండె.

**ریلا** రేలా (హి. పు) వరద, పోటు, ఉప్పెన, ప్రవాహము, ధార, దొబ్బు, నూకు, నెట్టు, గుంపు.

**ریل پیل** రేల్ పేల్ (హి. స్త్రీ) సమ్మర్దనము, ఒత్తిడి, అల్లరి, దొమ్మి, సమృద్ధి, విస్తారము, పుష్కలము.

**ریلنا** రేల్నా (హి) నెట్టుట, దొబ్బుట, నూకుట, గెంటుట, తోయుట, గందరగోళముచేయుట.

**ریم** రీమ్ (పా. స్త్రీ) రసిక, చీము.

**رین** రైన్ (హి. స్త్రీ) రాత్రి, రేయి, రేను.

**رینٹ - رینٹا** రేంట్ - టా (హి. పు) చీమిడి, కళ్లె.

**ریں ریں** రేఁరేఁ (హి. స్త్రీ) పిల్లలఏడ్పు చప్పుడు, గునియుట, అపస్వరము.

**رینڈی** రేఁడీ (హి. పు) ఆముదాలు, ఎరండము.

**رینڈ** రేఁడ్ (హి. పు) చూడు **رینڈی**

**رینک** రేఁక్ (హి. స్త్రీ) గాడిద యరపు, ఓండ్రింత.

**رینکنا** రేఁక్నా (హి) గాడిద లేక బట్టెమొ॥నవి యఱచుట, ఓండ్రించుట, అంబా యనుట.

**رینگٹا** రేఁగ్‌టా (హి, పు) గాడిదపిల్ల.

**رینگنا** రేఁగ్నా (హి) ప్రాకుట, పాకుట, జీరాడుచుపోవుట, జీరాడుట.

رینی రైనీ(హి. స్త్రీ)కుసుంబావస్త్రతీయుట లేక వేయుట, కుసుంబాఅద్దకము; ఒక పికిలిపిట్ట.

ریوڑ రేవడ్ (హి.పు) గొఱ్ఱెలమంద, మేకలమంద. (లు.

ریوڑی రేవడీ(హి. స్త్రీ)నూవులపాకుబిళ్ల

ریوند رینی ریوند చీనీ రీవంద్ (పా.పు) రేవలము

ریوند -చీనీ(పా) చీనా రేవలము, రేవల చీనము.

ریہ రియ (అ.పు) శ్వాసకోశము, ఊపిరితిత్తి.

ریہ రేహ్ (పా. స్త్రీ) చౌడు,ఉప్పుమన్ను.

ریہڑ రేహడ్ [హి. స్త్రీ) చౌటినేల, ఉప్పు మంటినేల.

ریہو రేహూ (హి. స్త్రీ) ఒంటిముంటిచేప.

---

## ( ڑ )

ژ డే (హి. స్త్రీ) డకారము. ఇది ఉరదూ వర్ణమాలలో పదునేనవ యక్షరము. ఇది అరబీ పారసీక భాషలలో లేదు. హిందీ భాషలోగూడ దీనితో నారంభించు పదములులేవు. అరబీ వర్ణసాంఖ్యములో దీని సంఖ్య ( ر ) యొక్క సంఖ్యకు సమము. అనగా రెండుపందలు.

---

## ( ز )

ز జా-జె (అ. స్త్రీ) ఇది ఉరదూవర్ణమాలలో పదునారవయక్షరము. అరబీలో పదునొకండవది, పారసీకభాషలో పదమూడవది. అరబీవర్ణసాంఖ్యములో దీని సంఖ్య ఆరున్నొకటి.

زا జా (పా) జాతము,జాతుడు,జన్మ,పుట్టిన, పుట్టించువాడు,కలిగించునది.(వృత్తియందు)

زاج జాజ్ (అ.పు) పురిటాలు; నల్లపుగాత, క్షారము. زاج سفید జా-ఎ, సుఫైద్(అ.పు) పటికారము.

زاد జాద్(అ,పు)ఆహారము,బత్తెము. زاد راه జా-రాహ్ (పు) త్రోవబత్తెము, సద్ది.

زاده - زاد జాద్ - జాద (పా) జాతుడు, జాతము, పుట్టినది. (వృత్తియందు)

زاد بوم జా-బూమ్ (స్త్రీ) జన్మభూమి, స్వదేశము. شهزاده షహ్- (పు) రాజపుత్రుడు.

زار జార్ (పా.పు) ఇచ్ఛ,కోరిక, అపేక్ష; అంగలార్పు, వ్యసనము, శోకము, గోడు, మొర; సమూహము, విస్తారము, స్థలము, స్థానము. زار زار-زار و قطار -జార్-ఒ, కతార్ (పా)పరిలాపము,అంగలార్పు, మిక్కిలిశోకము, గోడాట. زار و نزار -ఒ,నిజార్ (పా) కృశించిన, సన్నగిలిన, బక్కని, దుఃఖితమైన, దుర్బలమైన. زا

**سبزه** సబ్‌జ- (పా,పు) పసిరికబయలు, పచ్చికనేల. **گلزار** గుల్-(పు) పూదోట.

**زاری** జారీ (పా. స్త్రీ) ఆక్రందనము, ఏడ్పు, అంగలార్పు, రోదనము, మొర, ప్రలాపము, దుఃఖము.

**زاغ** జాగ్ (పా.పు) కాకి, వాయసము; వింటికొప్పు.

**زال** జాల్ (పా) ముసలి, నరిసిన వెండ్రుకలు గలవాడు; రుస్తుము తండ్రి పేరు. (ఇతని వెండ్రుకలు పుట్టినప్పుడే తెల్లగానుండెనట.)

**زانو** జానూ [పా.పు) జానువు, తొడ, మోకాలు, ముడుము. **زانو پوش** -పోష్ (పు) భోజనసమయమందు మెతుకులు మొ॥ పైబడకుండుటకై మోకాళ్లపై వేసికొను వస్త్రము.

**زانی** జానీ (అ.పు) జారుడు, ముండలమారి, దురాచారుడు.

**زانیه** జానియ (అ, స్త్రీ) రంకులాడి.

**زاویه** జావియ (అ.పు) కోణము, మూల. **زاویه حاده** -ఎ,హాద్దహ్ (పు) లఘుకోణము. **زاویه قائمه** -ఎ,కాయెమహ్ (పు) సమకోణము. **زاویه مستقیم** -ముస్తకీమ్ (పు) సరళకోణము. **مکرره زاویه** -ముకర్రర (పు) **زاویه منفرجه** -ఎ,మున్‌ఫరిజహ్ (పు) లంబకోణము.

**زاهد** జాహిద్ (అ.పు) భక్తుడు, సన్యాసి, తపస్వి, కష్టముచేయువాడు, ధర్మనిష్ఠగల.

**زاهدی** జాహిదీ (అ. స్త్రీ) ధర్మనిష్ఠ, భక్తి.

**زائچه** జాయిచ (అ.పు) జాతకము, జన్మపత్రిక.

**زائد** జాయిద్ (అ) అధికము, హెచ్చు, ఎక్కువ, మిగులు, శేషము; తక్కువ, వ్యర్థము, వృథా, నిరర్థకము, పనికిమాలిన.

**زائر** జాయిర్ (అ.పు) యాత్రస్థుడు, యాత్రికుడు.

**زائل** జాయిల్ (అ) భంగురము; అస్థిరము, నశించెడు, నశ్వరము.

**زائیده** జాయీద (పా.పు) జాతుడు, కొడుకు, కుమార్తె, బిడ్డ.

**زاینده** జాయంద (పా) కనునది, తల్లి, జనయిత్రి, జనకము.

**زبان** జ(జు)బాన్ (పా. స్త్రీ) నాలుక; భాష, బాస; మాట, వాగ్దత్తము, ప్రసంగము, వచనము. (నోరు.) **زبان آور** -ఆవర్ (పా) వక్తయైన. **زبان بدلنا** -బదల్నా (ఉ) ఆడితప్పుట, మాటతప్పుట. **زبان بند کرنا** -బండ్ కర్నా (ఉ) నోరు మూయుట. **زبان پرلانا** -పర్ లానా (ఉ) అనుట. **زبان چلانا** -చలానా (ఉ) వదరుట, తిట్టుట. **زبان دانی** -దానీ (స్త్రీ) భాషాజ్ఞానము. **زبان دراز** -దరాజ్ (పా) తిట్టుబోతు, అధికప్రసంగము. **زبان دینا-هارنا** - దేనా - హార్నా (ఉ) మాటయిచ్చుట, వాగ్దానము చేయుట. **زبان لڑکھڑانا** - లడ్ ఖడానా (ఉ) నత్తుట, మాటలుతడబడుట. **زبان هلانا** -హిలానా (ఉ) నోరాడించుట, నోరెత్తుట, మాటాడుట.

**زبانہ** జబాన (పా.పు)జ్వాల, మంట; త్రాసుముల్లు.

**زبانی** జబానీ (పా)నోటి, వాగ్మూలికము, ప్రసంగికము. **زبانی تکے-جمع خرچ** -తుక్కే- -జమఖర్చ్ (పు) ఉత్త నోటి మాటలు, పొడిమాటలు, జంభాలు.

**زبد** జుబ్ద్ (అ.పు) వెన్న, మీగడ, సారము.

**زبر** జబర్ (అ) పై, మీది, ఎత్తైన, గొప్ప, పెద్ద. దొడ్డ, బలిష్ఠమైన, అతిశయమైన, మేలైన;అకారచిహ్నము( َ ). **زبردست** -దస్త్ (పా) పైచేయిగల, బలముగల,క్రూరమైన, దిట్టమైన, బలిష్ఠమైన, అధికారము గల. **زبردستی** -దస్తీ (స్త్రీ) బలవంతము, ప్రోద్బలిమి,అధికారము,క్రౌర్యము, నిర్బంధము.

**زبرجد** జబర్ జద్(పా.పు)పచ్చ,మరకతము

**زبس** జిబస్ (పా) చాలుకోలది, కావలసినంత, పుష్కలము, అధికము.

**زبور** జబూర్ (అ.స్త్రీ) స్తోత్రము, భజన, స్తోత్రపాఠము, పుస్తకము, లిఖితము; మహమ్మదీయులయొక్క మతగ్రంథము,

**زبوں** జబూం (పా) చెడు, దుష్టమైన, నిందితమైన, లోబడిన.

**زبونی** జబూనీ (పా.స్త్రీ) చెడుగు,దుర్మార్గము, నైచ్యము, నాశము.

**زٹل** జటల్ (హి.స్త్రీ) వదరు, తెలివిమాలిన ప్రసంగము, నిరర్థకభాషణము,

**زٹلی** జటల్లీ (హి.పు)నిరర్థకప్రసంగి, వదరుబోతు, తెలివిమాలిన మాటలాడువాడు.

**زجاج** జుజాజ్ (అ.పు) అద్దము, గాజు.

**زجر** జజ్ర్ (అ.పు) బెదరింపు, గద్దింపు. చివాట్లు; శకునపరీక్ష, పక్షిశకునము.

**زچ** జిచ్ (హి.స్త్రీ) నిరుపాయుడైన,చిక్కిన, విసికిన,లోపడిన, చదరంగములో రాజు కదలకముందే కట్టివేయుట.

**زچا-زچہ** జచా-జచ్చ(పా.స్త్రీ)బాలింత, **زچاخانہ** -ఖాన (పు) పురిటిల్లు,

**زحل** జుహల్ (అ.పు) శనిగ్రహము.

**زحمت** జహ్మత్ (అ.స్త్రీ) కష్టము,వ్యసనము, దుఃఖము, రోగము, శ్రమ, బాధ, పాటు, ఆయాసము, చింత, సంకటము.

**زخّار** జఖ్ఖార్ (అ) అలలుకొట్టుచున్న,పూర్ణముగానిండియున్న, పరిపూర్ణము,

**زخم** జఖ్మ్ (పా.పు) గాయము, పుండు; నష్టము. **زخم کھانا** -ఖాన (ఉ) గాయపడుట.

**زخمہ** జఖ్మ (పా.పు) నఖి, వీణ మొ॥నవి వాయించు సాధనము.

**زخمی** జఖ్మీ (పా) గాయపడిన.

**زد** జద్ (పా.పు) వేటు,దెబ్బ,గాయము, నష్టము, వాటము, ఒడుపు, లక్ష్యము, అందుబాటు, దూరము. **زد وکوب** -వ-కోబ్ (పా.స్త్రీ) దెబ్బలు, దెబ్బలాడుట.

**زدہ** జద (పా) ఉపహతము, కొట్టబడిన, ఆపన్నుడైన, దుర్బలమైన.

**زر** జర్ (పా.పు) బంగారము, ద్రవ్యము, ధనము, రొక్కము, సరిగ, పుప్పొడి.

زردک జర్దక్ (పా. స్త్రీ) పీతకంద, పచ్చ ముల్లంగి, శిశామూలము, గర్జగము.

زرده జర్ద (పా.పు) పచ్చనిగుడ్డుము; పైత్య ము, పిత్తము; కేసరిఖాతు; పచ్చని వ్వ; తమలపాకులతోగూడ దినెడు పొగాకు పొడి.

زردی జర్దీ (పా. స్త్రీ) పచ్చదనము, వైవర్ణ్యము; జైన (గుడ్డులోని పచ్చని నీరము). పచ్చ కామిలలు; కింజిల్కము, పుష్పాడి.

زرع జర్ఉ (అ.పు) విత్తుట, విత్తనముల చల్లకము,విత్తినపొలము,సేద్యము,సాగుబడి

زرفین జర్ ఫీన్ (పా.పు)తలుపుగడియ, బేడెము.

زرق برق జర్క్ బర్క్ (అ) ధగధగాయమానమగు, తళతళలాడెడు, ప్రకాశముగల, మెరయు,దివ్యమైన, చిత్రవిచిత్రమైన, పటాటోపముగల, వైభవము, విభవయుక్తమైన, శృంగారమైన, ఆడంబరము ల, అలంకారము.

زرنباد జురుంబాద్ (పా.పు) మూలికా విశేషము. Zeodary.

زرنیخ జర్ నీఖ్ (పా.పు) పాషాణము, సంకుపాషాణము.

زره జిరహ్-జిర్హ్ (పా. స్త్రీ) కవచము, కంచుకము, కత్తళము, యినుపచొక్కాయి.

زری జరీ (పా. స్త్రీ) బంగారు లేక వెండి తీగ, సరిగ, సరిగబట్ట, సరిగపని.

زرین జర్రీన్ (పా) బంగారపు, సరిగ(తో జేసిన) సరిగపనిగల.

زرباف -బాఫ్ (పు) సరిగపని చేయువాడు. زربفت -బఫ్ త్ (పా.పు) సరిగపనిచేసినబట్ట. زرپرست -పరస్త్(పా) లోభి,ధనలోలుడు. زرخیز -ఖేజ్ (పా) సారవంతము, ఫలవంతము; బంగారు కలిగాడు. زردار -దార్ (పా) ధనవంతుడు, ధనముగల. زردوز -దోజ్ (పు) సరిగపని చేయువాడు. زردوست దోస్త్ (పా) ధనప్రియుడు, ధనలోలుడు.

زرسرخ -ఎ,సుర్ఖ్ (పు) మేలిమిబంగారు. زرسفید -ఎ;సుఫైద్ (పు) వెండి, రూప్యము, రజితము. زرکوب -కోబ్ (పు) వెండి బంగారు రేకులుకొట్టువాడు. زرگر -గర్ (పు)అగసాలివాడు. زرگری -గరీ (స్త్రీ) అగసాలిపని; ఒక బాస. زرگل ఎ,గుల్ (పు) కింజిల్కము, పుష్పరజము. زرنقد -ఎ,నక్ద్ (పు) రొక్కము. زرنگاری -నిగారీ (స్త్రీ) బంగారుపూత.

زراعت జరాఅత్ (అ. స్త్రీ) వ్యవసాయము, సేద్యము, కృషికర్మము, సాగు పైరు.

زرد జర్ద్ (పా)పచ్చని,పాలిన. زردآب -ఆబ్ (పు) రసి, వస; పైత్యపుపసరు, పైత్యము. زردپڑنا -పడ్నా(ఉ) వెలవెలబోవుట, పాలిపోవుట, వివర్ణమగుట. زردچوب -చోబ్ (స్త్రీ) పసుపుకొమ్ము. زردرو -రూ (పా) వెలవెలబారిన, సిగ్గుపడిన, వివర్ణమైన.

زردشت -జర్దుష్త్ (పా.పు) పారసీక మతస్థాపకుడు. (పేరు)

**زژ** జిడ్ (హి. స్త్రీ) తెలివిమాలినమాట, పిచ్చిమాటలు

**زشت** జిష్ట్ (పా) వికారమైన, కురూపియైన; అసహ్యమైన.

**زعاف** జుఆఫ్ (అ.పు) అకాలమరణము.

**زعفران** జఒఫరాన్ (అ.స్త్రీ) కేసరి, కుంకుమపువ్వు.

**زعفرانی** జఒఫరానీ (అ) కేసరితో చేసిన, కేసరివన్నెగల.

**زعم** జుఅమ్ (అ.పు) అభిప్రాయము, నమ్మకము, అనుమానము, అభిమానము, గర్వము; సాహసము.

**زغال** జుగాల్ (పా) అంగారము, బొగ్గు, నిప్పుకణిక.

**زغند** జగంద్ (పా. స్త్రీ) కుప్పిగంతు, దాటు, గంతు, దూకు; గర్జనము, అరపు.

**زفاف** జిఫాఫ్ (అ.పు) నిషేకపురాత్రి, పెండ్లిరాత్రి, గర్భాదానము, శోభనము, పెండ్లికూతురు అత్తింటికిపోవుట.

**زفیر** జఫీర్ (అ.స్త్రీ) ఈల, బూరగ.

**زفیل** జఫీల్ (అ. స్త్రీ) పెద్దఈల **زفیلنا - زفیل مارنا** -మార్నా - జఫీల్నా (ఉ) ఈలవేయుట.

**زقوم** జక్కూమ్ (అ.పు) ఒక ముండ్లచెట్టు.

**زک** జక్ (అ. స్త్రీ) ఓటు, అవమానము, చిన్నతనము, నష్టము, పరాభవము.

**زکا** జకా (పా.పు) తెలివి, చాతుర్యము, చురుకుదనము; పవిత్రత, వృద్ధి.

**زکات - زکاته** జకాత్ - థ్ (అ. స్త్రీ) దానము, ధర్మము, ఆదాయములో నలువదియవపాలు.

**زکام** జుకామ్ (అ.పు) పడిశము, జలుబు.

**زکاوت** జకావత్ (అ. స్త్రీ) చూడు **ذکاوت**

**زکواة** జకాత్ (అ. స్త్రీ) చూడు **زکات**

**زکی** జకీ (అ) చూడు **ذکی**

**زلازل** జలాజిల్ (అ.పు) భూకంపములు, కష్టములు. (ఏ.వ - **زلزله**)

**زلال** జులాల్ (అ.పు) నిర్మలము, నిర్మలోదకము; స్వచ్ఛమైన (నీరు).

**زلف** జుల్ఫ్ (పా. స్త్రీ) కాకపక్షములు, అలకములు, ముంగురులు, ఉంగరపువెండ్రుకలు, వెండ్రుకలకుచ్చు, చెంపలజారియుండు వెండ్రుకలకుచ్చులు, (అ) మునిమాపు.

**زلفی** జుల్ఫీ (పా.పు) తలుపుగొళ్లెము, మణిమేఖలము, కత్తివారు, గొలుసు, చిలుక.

**زلل** జలల్ (అ.పు) జారుడు, తొక్కిపడుట, పొరపాటు.

**زله** జల్ల (అ.పు) పెండ్లిదినముల వంటలలో మిగిలినఅన్నాదులు.

**زمام** జిమామ్ (అ. స్త్రీ) వాగె, కళ్లెపువారు, పగ్గము, కళ్లెము, ఒంటెముకుత్రాడు.

**زمانا - زماں** జమాం - జమాన (అ.పు) కాలము, ప్రపంచము, సంసారము. **زمانه ساز**

-సాజ్ (పా) కాలానువర్తి, సమయానువర్తి, ఇచ్చకాలమారి, స్వార్థపరుడు.

**زمبور** జంబూర్ (అ.పు) సవాణము, పటుకారు, తేనెటీగ, కందిరీగ; చిన్నతోపు, శతఘ్ని.

**زمرد** జుముఋద్ (పా.పు) పచ్చ, మరకతము.

**زمردی** జుముఋదీ (పా) పచ్చవన్నెగల.

**زمره** జుమ్ర (అ.పు) సమూహము, గుంపు, జట్టు, వర్గము, సమాజము.

**زمزم** జమ్‌జమ్ (పా.పు) మక్కాలోనియొక పవిత్రకుండము, సమృద్ధి.

**زمزمه** జమ్‌జమ (అ.పు) పారసీకులు అగ్నిపూజలో చదువుమంత్రములు. చూడు **زمزم**

**زمستان** జమిస్తాన్ (పా.పు) శీతకాలము, శరదృతువు, చలికాలము.

**زمهریر** జమ్‌హరీర్ (పా.పు) అతిశీతలము, మేఘమండలము.

**زمین** జమీన్ (పా. స్త్రీ) భూమి, పృథివి, నేల, ప్రపంచము, సంసారము, దేశము, క్షేత్రము, మన్ను, మూలము, అడుగు, క్రింది, భాగము, యతిగణప్రాసములు. **زمین آسمان کا فرق** -ఆస్మాన్ కా ఫర్క్ (పు) హస్తిమశకాంతరము, గొప్పభేదము. **زمین آسمان کے قلابے ملانا** -ఆస్మాన్ కే కులాబే మిలానా (ఉ) అతిశయోక్తిగా చెప్పుట, గోరంతకొండంతగా చెప్పుట. **زمین دوز** -దోజ్ (పా) నేలమట్టము, పడిపోయిన, పాతుకొనిపోయిన.

**زمیندار** జమీన్‌దార్ (పా.పు) భూస్వామి, క్షేత్రస్వామి, పట్టాదారుడు, కాపు, అగ్రహారీకుడు, పాళెగాడు.

**زمینداری** జమీన్‌దారీ (పా.స్త్రీ) భూస్థితి, అగ్రహారము, మాన్యము.

**زمینی** జమీనీ (పా) భూసం॥, భూగోళసం॥; భౌతికము.

**زن** జన్ (పా.స్త్రీ) స్త్రీ; ఆడుది, భార్య, ఇల్లాలు, (సమాసములలో) కొట్టువాడు, కొట్టెడి. **زن مرید** -మురీద్ (పా) భార్యాటీకుడు, భార్యకు లొంగియుండువాడు.

**زنا** జినా (అ.పు) వ్యభిచారము, రంకు **زنا بالجبر** -బిల్ జబర్ (పు) బలాత్కారవ్యభిచారము. **زناکار** -కార్ (పా) వ్యభిచారి, **زناکاری** -కారీ (స్త్రీ) వ్యభిచారము.

**زناٹا** జన్నాటా (హి.పు) గట్టిపట్టుత గాలిలో వడిగా బోవుధ్వనియనుకరణము, రివ్వు, (మనుధ్వని), రింగు (మనుధ్వని).

**زنار** జున్నార్ (అ.పు) మొలనూలు, యజ్ఞోపవీతము, జందెము. **زناردار** -దార్ (పా) యజ్ఞోపవీతధారి.

**زنانه** జనాన (పా.పు) అంతఃపురము, కుటుంబము; నపుంసకుడు, దుర్బలుడు, పిరికి; భట్రాజు; చాటు, మరుగు; స్త్రైణము, స్త్రీయోగ్యము.

**زنانی** జనానీ (పా) స్త్రైణము, స్త్రీసం॥; ఆడంగుల.

**زنبور** జంబూర్ (అ.పు) చూడు **زمبور**

**زنبورچی** జంబూర్చి (అ.పు) తుపాకిబంటు,

**زنبوره** జంబూర (పా.పు) తంబుర. చూడు **زنبور**

**زنبیل** జంబీల్ (పా.స్త్రీ) కత్తుపాల, జోలె, తోలుతిత్తి, తోలుజోలె, అక్షయపాత్ర, ఖర్జూరపుఆకుదొన్నె.

**زنجبیل** జంజబీల్ (అ.స్త్రీ) సారాయి; శొంఠి; స్వర్గమందలి నది పేరు.

**زنجیر** జన్‌జీర్ (పా.పు) గొలుసు, శృంఖలము, గొళ్లెము, చిలుకు.

**زنجیرا-زنجیر** జంజీరా-ర (పా.పు) హారము, దండ; గొలుసువంటిది.

**زنخدان** జన్‌ఖ్‌దాన్ (పా.స్త్రీ) గడ్డము, గదువ; గద్దువగుంట.

**زنخ** జన్‌ఖ (పా.పు) ఆడపోబల్లవాడు.

**زندان** జిన్‌దాన్ (పా.పు) చెరసాల, బంధనాలయము.

**زندگانی** జిందగానీ (పా.స్త్రీ) జీవనము, బ్రతుకు, జీవితకాలము, జీవనాధారము, ఆహారము.

**زندگی** జిందగీ (పా.స్త్రీ) బ్రతుకు, జీవనము, జీవితకాలము. **زندگی کا جام** -కాజామ్ (పా) చూడు **سلامتی کا جام**; ఆరోగ్యచషకము; ఆయుశ్చషకము, ఆశీర్వాదచషకము.

**زنده** జిన్‌ద (పా) జీవముతోనున్న, బ్రతికియున్న, కదలికగానున్న, ఉత్సాహముగల, ఎచ్చరికగానున్న, సంతోషముగల. **زنده دلی** -దలీ (స్త్రీ) సంతోషస్వభావము **زنده درگور** -దర్‌గోర్ (పా) జీవన్మృతుడు,

**زندیق** జిన్‌దీక్ (అ.పు) పారసీకమతస్థుడు, పాషండుడు, నాస్తికుడు.

**زنگ** జంగ్ (పా.పు) చిలుము, తుప్పు; మువ్వ, గజ్జె, గంట. **زنگ آلوده** -ఆలూద (పా) తుప్పుపట్టిన.

**زنگار-ل** జన్‌గార్-ల్ (పా.పు) కిలుము, చిలుము, తుప్పు.

**زنگاری** జన్‌గారీ (పా) కిలుమువన్నెగల, పసరువన్నెగల.

**زنگوله** జంగూల (పా.పు) గంట, గజ్జె, మువ్వ; గిలకకాయ.

**زنگی** జన్‌గీ (పా,పు) సిద్దీవాడు. **زنگی ہڑ** -హడ్ (స్త్రీ) సన్నరాష్ట్రము.

**زنہار** జిన్‌హార్ (పా) శరణము, ఆశ్రయము; సర్వధా, కదాపి, బొత్తిగా.

**زوال** జవాల్ (అ.పు) క్షీణము, క్షయము, నాశము, భంగము; ప్రొద్దుక్రుంకుట.

**زوائد** జవాయిద్ (అ.పు) వృద్ధులు, అధికములు, చేరికలు, హెచ్చులు, ఎక్కువలు, పెంపులు; వ్యర్థము, అనావశ్యకము. (ఏ.వ **زائد** )

**زوج** జౌజ్ (అ.పు) జోడు, జత; పెండ్లాము, భార్య; భర్త, పెనిమిటి, మగడు.

**زوجه** జౌజ (అ.స్త్రీ) భార్య, పెండ్లాము.

**زوجیت** జౌజియత్ (అ.స్త్రీ) ఇల్లాలితనము, వివాహితత్వము, వివాహము.

**زود** జూద్ (పా) వేగముగా, త్వరగా,

వేగి,బిరాన,శీఘ్రము. **زودرنج** -రంజ్ (పా)ముంగోపి. **زودفهم** -ఫహ్మ్(పా) శీఘ్రబుద్ధిగల, తెలివిగల, మేధావి.

**زور** జూర్ (అ.పు) కాపట్యము,అసత్యము, మోసము, దబ్బర, కల్ల; తుచ్ఛము.

**زور** జోర్ (పా.పు) బలము, శక్తి, సామర్థ్యము, ప్రయత్నము, ప్రాబల్యము, అధికారము, బలాత్కారము; విస్తారము, అధిక్యము, సమృద్ధి, ఆశ్రయము,సహాయము, ఆశ్చర్యకరము. **زورآور** - ఆవర్ (పా) బలిష్ఠమైన, బలముగల, బలవంతమైన. **زورآوری** -ఆవరీ(స్త్రీ)బలము, బలాత్కారము. **زوردار** -దార్ (పా) బలముగల. **زورشور** -షోర్ (పు) ప్రాబల్యము, అట్టహాసము, పటాటోపము, సంభ్రమము; ఉత్సాహము, ఆటోపము. **زورمارنا** -మార్నా(ఉ) ప్రయత్నము చేయుట.

**زوفه** జూఫ (అ.పు) ఒకసువాసనగలచెట్టు.

**زه** జిహ్ (పా.స్త్రీ) ప్రసవవేదన, శిశువు, పిల్ల; ప్రసవము, కానుపు; వింటినారి;గోడ అంచు, ఓర, బొద్దు, కచ్చు.

**زهار** జిహార్ [పా.పు] జననేంద్రియము.

**زهد** జుహ్ద్ (అ.పు) ధర్మనిష్ఠ,భక్తి, వైరాగ్యము, త్యాగము.

**زهر** జహ్ర్ (హి.పు) విషము; ఉగ్రమైన, తీక్ష్ణమైన, విప్రియమైన,అనిష్టమైన, ఆగ్రహము. **زهرآلوده** — ఆలూద (పా) విషాక్రాంతమైన. **زهرباد** -బాద్(పు) విషవాయువు, కంఠరోగము. **زهرمهره** -ముహ్రా(పు) విషపరిహారకౌషధము,గోరజము.

**زهره** జహ్రా (పా,పు)పిత్తకోశము;ధైర్యము, శౌర్యము, సామర్థ్యము.

**زهره** జుహ్రా (అ.పు) శుక్రుడు. **زهره جبين** -జబీఁ(పా) అందమైనమోముగల.

**زهريلا** జహ్రీలా (పా) విషముగల.

**زهى** జహీ-హే (పా)మేలుమేలు!, బాగు!, బళిరే!, ఏంతోశ్లాఘ్యమైనది!.

**زيادتى** జియాదతీ (పా.స్త్రీ) అధిక్యము, హెచ్చు, విస్తారము, సమృద్ధి, వృద్ధి,ఎక్కువ; బలాత్కారము, నిర్బంధము,క్రౌర్యము.

**زياده** జియాద (అ) అధికము, ఎక్కువ, విస్తారము, మిక్కిలి, విశేషము. **زيادهگو** -గో (పా) వదరుబోతు, అతిశయోక్తిగా మాటలాడువాడు.

**زيارت** జియారత్ (అ.స్త్రీ) యాత్ర. దర్శనము, పుణ్యాత్ముల లేక పుణ్యస్థలముల చూచుట. **زيارتگاه** -గాహ్ (స్త్రీ) యాత్రాస్థానము, పుణ్యక్షేత్రము.

**زيارتى** జియారతీ (అ.పు) యాత్రికుడు, యాత్రికుడు. (రము.

**زيان** జియాన్ (అ.పు) నష్టము, అపకా

**زيب** జేబ్ (పా,స్త్రీ) అలంకారము, అందము, భూషణము, సింగారము.

**زيبا** జేబా (పా) (పా) అలంకారప్రదము, శృంగారకము, అర్హము, యోగ్యము, అందమైన, తగిన.

**زيبائش** జేబాయిష్ (పా.స్త్రీ) శృంగారము,అలంకారము,సింగారము,భూషణము.

**زیبائشی** జేబాయిషీ (పా) అలంకారప్రదము, భూషకము.

**زیبق** జీబక్ (పా.పు) పాదరసము.

**زیتون** జైతూన్ (అ.పు) ఒకనూనె (అగిసెనూనె).

**زیر** జీర్ (పా. స్త్రీ) మధ్యమస్వరము, మధురధ్వని.

**زیر** జేర్ (పా.పు) క్రింది, అడుగు, తక్కైన; లోపడిన, లొంగిన; ఇకారస్వర చిహ్నము ( ِ ) **زیر بار ہونا** -బార్ హోనా (ఉ) అప్పుల పాలగుట, ఋణియపడుట. **زیر باری** -బారీ (స్త్రీ) అప్పులు, వ్యయము, వెచ్చము, భారము. **زیر بند** -బంద్ (పు) క్రిందికట్టు వారు, గుఱ్ఱము యొక్క ముఖపట్టకును టంగు వారకును కట్టు పట్టి లేక వారు, తంగువారు. **زیر پائی** -పాయీ (స్త్రీ) పాదరక్ష. **زیر دست** -దస్త్ (పా) చేతిక్రింది వాడు, లోపడినవాడు. **زیر زبر** -జబర్ (పా) క్రిందుమీదు, మార్పు, తలక్రిందు, తారుమారు, గందరగోళము. **زیر کرنا** -కర్నా (ఉ) ఓడించు, లోపరచుకొనుట. **زیر لب** -లబ్ (పా) గుసగుస, అస్పష్టముగా.

**زیر مشق** -మష్క్ (పు) ఒత్తు, ఒత్తుకు. (వ్రాయుకాకితముక్రింద బెట్టుకొనునది.)

**زیرا-زیره** జీరా-జీర (పా.పు) జీరకము, జీలకఱ్ఱ; పుప్పొడి.

**زیرک** జీరక్ (పా) తెలివిగల, బుద్ధిగల, చురుకుగల, నేర్పుగల, నిపుణతగల.

**زیرین** జేరీన్ (పా) క్రింది, అడుగు.

**زیست** జీస్త్ (పా. స్త్రీ) జీవనము. బ్రతుకు, జీవితము.

**زین** జీన్ (పా.పు) పల్యయనము, పర్యాణము, కందళము, పల్లనము, పల్లము **زین پوش** -పోష్(పు) పల్లముపై వేయు చాకము, ఆస్తరము.

**زینت** జీనత్ (అ. స్త్రీ) అందము, పొంకము, సొంపు, సొబగు సింగారము, అలంకారము.

**زین خان** జీన్ ఖాన్ [ఉ.పు] బ్రూచి, బ్రూచివాడు.

**زینہ** జీన (పా.పు) నిచ్చెన, మెట్లు, సోపానములు; పడికట్లు.

**زینہار** జీన్ హార్ (పా) సర్వధా, కదాపి, బొత్తిగా, సుతరాము.

**زیور** జేవర్ (పా.పు) భూషణము, సొమ్ము, అలంకారము.

---

## ( ژ )

**ژ** షే (పా. స్త్రీ) ఇది ఉరుదు వర్ణమాలలో పదునేడవయక్షరము. పారసీకభాషలో పదునాలుగవది. అరబ్బీ వర్ణ సాంఖ్యము (ابجد) లో దీని సంఖ్య ( ز ) అను అక్షరము యొక్క సంఖ్యతో సమానము. అనగా ఆరున్నొకటి.

**ژاژ** షాష్ (పా.పు) రజ్జు, నిరర్థక ప్రసంగము, తుచ్ఛపుమాటలు, పనికిమాలినమాటలు; ఒక కంప. **ژاژخا** -ఖా (పా) వదరుబోతు, తెలివిమాలిన మాటలాడువాడు. **ژاژخائی** -ఖాయీ (స్త్రీ) వదరుబోతుతనము, తెలివిమాలినప్రసంగము.

**ژاله** షాల (పా.పు) వడగండ్లు, వానరాళ్లు; గట్టిమంచు, తుషారము; ఈత కాయ, ఈతకాయ. **ژاله باری** -బారీ (స్త్రీ) శిలావృష్టి, వడగండ్లవాన.

**ژرف** షర్ఫ్ (పా) గహనమైన, గంభీరమైన, ఘనమైన, ఎత్తైన, లోతైన, అగడ్త, సూక్ష్మమైన, తీవ్రమైన.

**ژند** షంద్ (పా.పు) కంథ, బొంత, చింపిగుడ్డ; పారసీక దేశస్థుల ఆదిభాష, పారసీ మతస్థుల మతగ్రంథము.

**ژنده** షింద (పా.పు) బొంత, అతుకులబట్ట; భయంకరమైన, దొడ్డ, గొప్ప, మహత్తైన.

**ژولیده** షులీద (పా) చిక్కైన, చిక్కుపడిన, గందరగోళమైన, తారుమారైన, రాపిడిపడిన.

**ژیان** షియాన్ (పా) ఘోరమైన, భయంకరమైన, కరాళమైన, క్రూరమైన, క్రూరమృగము, ఉగ్రమైన, ఘాతుకమైన. **شیر ژیان** షేర్,ఎ, - (పు) ఉగ్రమృగేంద్రము.

## ( س )

**س** సీన్ (అ.పు) ఉరుదువర్ణమాలలో నిది పదునెనిమిదవయక్షరము; అబ్జద్ (ابجد) ప్రకారము అక్షరసాంఖ్యమునదీనిసంఖ్యయఱువది (౬౦).

**سا** సా (ఉ) తుల్యార్థకప్రత్యయము; సమము, తుల్యము; వంటి, వలె, అంత; పోలిన, సరియైన.

**سابر** సాబర్ (హి.పు) దుప్పి, కణుజు; కన్నకోల, కన్నము వేయు సాధనము.

**سابق** సాబిక్ (అ) పూర్వపు, మునపటి, వెనుకటి; మొదటి; మేలుతరమైన; ఉపాధ్యాయుడు, పాఠము చెప్పువాడు. **سابق دستور** -దస్తూర్ (పా) పూర్వాచారము, సాంప్రదాయానుసారము; ఎప్పటివలె, మునుపటివలె. **سابق الذکر** -ఉజ్జికర్ (అ) పూర్వోక్తము, ముందు చెప్పినది, పూర్వోదాహృతము. **سابق میں** -మే (ఉ) పూర్వము, ముందు.

**سابقه** సాబిక (అ) పూర్వపు, మునుపటి; మొదటిది; పూర్వస్నేహము, పూర్వపుపరిచయము, సంబంధము, పని, వ్యవహారము; మొదటిభార్య.

**سابل** సాబల్ (హి.పు) కన్నకోల, కన్నము వేయుసాధనము.

**سابن** సాబన్ (ఉ.పు) సబ్బు, బట్టలు మొll వానిని శుభ్రపరచువస్తువు.

**سابوت** సాబూత్ (ఉ) అంతయు, సాంతము; అఖండము.

ساٹ సాత్ (హి) ఏడు, ఆరునొక్కటి.

ساٹ پانچ సాత్‌పాంచ్ (హి) మోసము, టక్కు,వాదము, జగడము; ساٹ سنگار సాత్‌సింగార్ (ఉ.పు) ముత్తైదువలకుండవలసినసప్తాలంకారములు; బూబుసానులముత్తైదువపోబడులు ( గాజులు, సొమ్ములు, తాంబూలము, కాటుక, పడ్ల పాడి, తలముడుచుకొనుట, గోరింట)

ساٹ سہیلیونکا جھمکا సాత్‌సహేలియోంకాఝుంకా (హి.పు) కృత్తికానక్షత్రము, ساٹ پھیرے సాత్‌ఫేరే (హి.పు) సప్తపది, ఏడడుగులు, పెండ్లిలోఅగ్నిహోత్రముచుట్టు వధూవరులుచేయుప్రదక్షిణములు.

ساتواں సాత్‌వాఁ (హి) ఏడవ,సప్తమము.

ساتویں సాత్‌వేఁ (హి) ఏడవది,సప్తమము.

ساتھ సాథ్ (హి) సహ, కూడ, తోడ; కలిసి, కూడి; సమాజము, వర్గము, జట్టు, సంగతి, కూడిక; తోడు, సంబంధము ساتھ دینا సాథ్ దేనా (హి) తోడ్పడుట, సహాయముచేయుట. (యాడుది.

ساتھن సాథన్ (హి.స్త్రీ) చెలికత్తె, తోటి

ساتھی సాథీ (హి.పు) చెలికాడు, తోటివాడు, సహకారి.

ساٹا సాటా (హి.పు) పరివర్తనము, వస్తువుల మార్పు; ఇచ్చిపుచ్చుకోలు; మారకము, సాటా.

ساٹھا సాఠా (హి.పు) అరువదిఏండ్ల ఏనుగు లేక మనిషి, ساٹھا پاٹھا సాఠాపాఠా (హి.పు) ఏనుగుకు ౬౦ ఏండ్లకుయౌవనము వచ్చును. అరువదియేండ్ల వయసునను శరీర పాటవముగలవాడు.

ساٹن సాటిన్ (ఇం) ఒకవిధమైనపట్టుబట్ట, మెరుపుబట్ట.

ساٹھ సాఠ్ (హి) అరువది.

ساٹھی సాఠీ (హి.స్త్రీ) అరువది దినములకు పండువరి లేక వరిబియ్యము.

ساج సాజ్ (హి.పు) సజ్జ, సజ్జనము, సామగ్రి, సన్నాహము.

ساج సాజ్ (అ) టేకుమ్రాను, టేకుచెట్టు.

ساجن - سجن సాజన్ - సజన్ (హి.పు) సజ్జనుడు; మగడు; ప్రియుడు; భర్త,యజమానుడు.

ساجنا సాజ్నా (హి) సజ్జనముచేయుట; సింగారించుట; సిద్ధపరచుట; అమర్చుట; అమరుట, అలంకారమగుట.

ساجھا సాఝా (హి.పు) పొత్తు, ఉమ్మడి, కూడిక; పాలు, భాగము

ساجھی సాఝీ (హి.పు) భాగస్థుడు, భాగస్వామి, పాలివాడు.

ساچق సాచక్ (పా.స్త్రీ) పెండ్లికి ముందు పెండ్లిపిల్లకు పండుపసుపుపెట్టుట.

ساحت సాహత్ (అ.పు) అంగణము, వైశాల్యము, బయలు, ప్రదేశము. (బోతు.

ساحر సాహిర్ (అ.పు) మంత్రగాడు, కట్టు

ساحرہ సాహిర (అ.స్త్రీ) మాంత్రికురాలు,

ساحری సాహిరీ (అ.స్త్రీ) మంత్రవిద్య.

ساحل సాహిల్ (అ.పు) సముద్రతీరము, తీరము, గట్టు; ఏటివాక.

ساخت సాఖ్త్ (పా.స్త్రీ) చేత, పనితనము; నిర్మాణము, రచన, కల్పన; మోసము.

ساختہ సాఖ్తా (పా) కల్పితము,కృత్రిమము; మోసము; చేసిన,నిర్మించిన, కల్పించిన بے ساختہ బే-(పా) అయత్నకృతముగా,అప్ప

టికప్పుడు,తక్షణము ساختہ پرداختہ-సాఖ్తా-పర్దాఖ్తా (పా.పు) అన్నివిధములసిద్ధపరుపబడిన పరిష్కృతము, అలంకృతము, చక్కజేయ బడిన, అమర్చబడిన, ఆచరణము, ఆచార ము, చేతలు, చేసినపనులు, కర్మము.

**سادات** సాదాత్ (అ.స్త్రీ) ప్రభువులు, సయ్యదువంశమువారు, సయ్యదుకుల ము వారు.

**سادگی** సాదగీ(పా.స్త్రీ) అమాయికత్వము, నిష్కాపట్యము; బేలతనము; సాధుత్వము, సామాన్యత, సాధారణత్వము; అలంకార ములేమి; సరళత, స్పష్టత.

**سادہ** సాదా (పా) వ్రాయని, తెల్లని, స్వచ్ఛమైన; అలంకారములేని; ప్రవీణతలేని; అమాయికమైన, బేలయైన,నిష్కపటమైన; తెలివిమాలిన, వెఱ్ఱిబాగుల; ఉత్త, వట్టి; చప్పని; **سادہ لوح**-లూహ్(పా.అ.పు) వెఱ్ఱిబాగులు, బేల, తెలివిమాలినవాడు, అవివేకి; **سادہ رو** సాదరూ (పా) గడ్డము మీసములేని, నున్ననిమోముగల, **سادہ دھتورہ** సాదధతూరా (ఉ)ఉమ్మెత్త, ధత్తూరము. (యతి.

**سادھ** సాధ్ (హి.పు) సాధువు, బైరాగి,

**سادھارن** సాధారణ్(హి)సాధారణము, సాధారణముగా, సాధారణమైన.

**سادھنا** సాధ్నా (హి) సాధనముచేయుట, సాధించుట; అమర్చుట, సవరించుట, అల వాటుపరచుట, నేర్పుట, అలవార్చుట.

**سادھن** సాధన్ (హి.పు) సాధనము, సాధించుట, నిర్వహణము.

**سادھنی** సాధ్నీ[హి.స్త్రీ] మాలమట్టము; సాధ్వి; సాధువుయొక్కభార్య.

**سادھو** సాధూ (హి.పు) సాధువు, బైరాగి.

**سادی** సాదీ (హి.స్త్రీ) చూడు **سادہ**

**سار** సార్ (హి.పు) సారె, పాచిక, పందెపు గవ్వలు; సారము; ఇనుము; బలము.

**سارا** సారా (హి) సాంతము, అంత(హి.పు) పసుపతి, సమ్యకము, చిత, కావ్యము;

**ساربان** సార్బాన్ (పా.పు) ఒంటెనుతోలువాడు; రాజకుమారుడు.

**سارٹیفکیٹ** సార్టీఫికెట్ (ఇం) యోగ్యతాపత్రిక,ప్రమాణపత్రిక, నిదర్శనపత్రిక, నిర్ధారణపత్రిక, నిర్ణయపత్రిక.

**سارس** సారస్ (హి.పు) కొంగ, సారసము,

**سارق** సారిక్ (అ,పు) దొంగ, చోరుడు.

**سارکا** సార్కా (హి.పు) శారిక, గోరువంక పక్షి;

**سارنا** సార్నా (హి) ముగించుట, నెరవేర్చుట; కాటుకపెట్టుట లేక పారించుట.

**سارنگ** సారంగ్ (సం.పు) సారంగము నెమలి; ఒకరాగము, మేఘము, ఏనుగు పులి; ఇంద్రధనస్సు; నెమలికూత.

**سارنگی** సారంగి (హి.స్త్రీ) సారంగి, (వాద్యవిశేషము)

**سارنگیا** సారంగియా (హి.పు) సారంగివాయించువాడు.

**سارو** సారూ (పా.స్త్రీ) పెడిసెపిట్ట, గోరువంకపిట్ట, (పు) తోడల్లుడు.

**ساری** సారీ (హి.స్త్రీ) మొగడ; చీర,కోక;

**ساری** సారీ (అ) గుణమునిచ్చునది, పనిచేయునది, వ్యాపించునది.

**سادھ ستی** సాఢ్సతీ (హి.స్త్రీ) ఏడున్నరయేండ్లశనిబళ, ఎల్నాల్లశని, దురదృష్టము, దుర్దశ, కష్టకాలము.

**ساڑھو** సాఢూ (హి.పు) షడ్డకుడు.

**ساڑھی** సాఢీ(హి. స్త్రీ) చూడు **آساڑھی** శెనగలు, గోధుమలు మొ॥ ధాన్యములపంట కాలము; చీర, కోక.

**ساڑھے** సాఢే (హి) అర, సగము, అర్ధము, **ساڑھے سات** -సాత్ (హి) ఏడున్నర

**ساز** సాజ్ (పా) కార్యసాధనము, సాధకుడు. కౌశకుడు; సజ్జ, సజ్జనము, సామగ్రి, సన్నాహము, ఉపకరణములు, వాద్యము; మేళవము, స్వరమేళనము, సవరణము, అనుకూలము; సంబంధము, పొందు, కూడిక; మోసము, టక్కు. **ساز باز** -బాజ్ (పా.పు) సమ్మె, కుట్ర, పన్నగడ, సంధి, కట్టు. **ساز وسامان** -వసామాన్ (పా.పు) సజ్జనము, సామగ్రి, సన్నాహము, ఉపకరణములు.

**سازش** సాజిష్ (పా. స్త్రీ) సమ్మె, పన్నగడ, కుట్ర; కట్టుబాటు, ఐకమత్యము.

**سازگار** సాజ్గార్ (పా) యోగ్యము, అనుకూలము, అర్హము, అనుగుణ్యము.

**سازندہ** సాజంద (పా.పు) గాయకుడు, వాద్యగాడు.

**ساس** సాస్ (హి. స్త్రీ) శ్వశ్రువు, అత్త.

**ساسرا** సాసరా (హి. స్త్రీ) శ్వశురగృహము, అత్తిల్లు.

**ساسم** సాసిమ్ (అ) సిమ్మూకత్తి.

**ساعت** సాఅత్ (అ.స్త్రీ) కాలము, ఘడియ, క్షణము, నిమిషము, గంట, గడియారము.

**ساعد** సాఅద్ (అ.పు) ముంజేయి.

**ساعی** సాఈ (అ.పు) ప్రయత్నము చేయువాడు, ప్రయత్నపడువాడు, శ్రమచేయువాడు, ప్రయత్నకారి.

**ساغر** సాగర్ (పా.పు) కోర, గిన్నె, పానపాత్రము, చషకము.

**ساق** సాక్ (అ. స్త్రీ) పిక్క, జంఘ; కాడ, దంటు; మొద్దు, బోదె.

**ساقط** సాకిత్ (అ) పడినది, పతితము, పడిన, చ్యుతమైన, భ్రష్టమైన; పనికిమాలిన, చెడిన, లోపించిన. **ساقط ہونا** -హోనా (ఉ) గర్భపాతమగుట, పోవుట, నష్టమగుట, పడిపోవుట, లోపించుట.

**ساقن** సాకిన్ (అ. స్త్రీ) సారాయి పంచు మొ॥ అస్మైము లేక సిద్ధము జేసియిచ్చెడు స్త్రీ.

**ساقی** సాకీ (అ.పు) సారాయితాగించువాడు, సేవకుడు; ప్రియుడు, ప్రియురాలు.

**ساکت** సాకిత్ (అ) మౌనముగానున్న, మాటాడని, నిశ్శబ్దముగానున్న, ఊరకున్న.

**ساکن** సాకిన్ (అ.పు) నివాసి, ఉండువాడు; నిశ్చలమైన, స్థిరమైన; పొల్లక్షరము.

**ساکھ** సాఖ్ (పా. స్త్రీ) కాలము, ఋతువు; పంట, పంటకారు; విశ్వాసము, నమ్మకము; పరపతి, ప్రఖ్యాతి; మన్నన, గౌరవము; సాక్ష్యము.

**ساکھا** సాఖా [హి.పు] శాఖ, కొమ్మ; శకము; యుద్ధము, జగడము; సాక్ష్యము; ఐకమత్యము.

**ساکھی** సాఖీ(హి. స్త్రీ) చెలికత్తె, సఖి; సాక్షి.

**ساگ** సాగ్ (హి.పు) శాకములు, కాయగూరలు **ساگ پات** -పాత్ (హి. స్త్రీ) కూరగాయలు, ఆకుకూరలు.

**ساگر** సాగర్ (హి.పు) సాగరము, సముద్రము. **ساگر گولا-گھولا** గోలా-ఘోలా (హి) గచ్చకాయ, కుబేరాక్షము.

**ساگون - ساگوان** సాగూన్-సాగ్ వాన్ (హి. స్త్రీ) టేకుచెట్టు. టేకుకఱ్ఱ,

**ساگودانہ - سابودانہ** సాగూదాన - సాబూదాన (ఇం.పు) సగ్గు బియ్యము, సబ్బుబియ్యము.

**سال** సాల్ (హి.పు) సాలవృక్షము, మద్ది చెట్టు; గాతము, బొంద, తూటు, మేకు, ముల్లు; శాల, బడి; గద్ద, ఒకచేప.

**سال** సాల్ (పా.పు) సంవత్సరము,వర్షము.

**سال وار - سال بسال** -వార్-బసాల్ (పా) ఏటేట, ప్రతిసంవత్సరము. **سال پیوستہ** -పైవస్త (పా) మునియేడు, నియటేకి ముందుసంవత్సరము. **سال خوردہ** -ఖుర్ద (పా) పురాతనము,ప్రాత, ముసలి, వయసుమీరిన. **سال گرہ** -గిర(పా. స్త్రీ) పుట్టినదినము, జయంతి,వర్ధంతి, జన్మదినము. **سال گزشتہ** -గుజ్‌ష్తా(పా.పు)నిరుడు, క్రిందటి సంవత్సరము. **سال شمسی** -షంసీ (పా,అ.పు) సౌరమానవత్సరము. **سال فصلی** -ఫస్లీ (పా.అ.పు) పంట కాపులపు నరిపడునట్లేర్పరచిన చాంద్రమానవత్సరము. **سال قمری** -కమ్రీ (పా.అ.పు) చాంద్రమానవత్సరము.

**سال** సాల్ (పా) టేకుమ్రాను, టేకుచెట్టు.

**سالا** సాలా (హి.పు) స్యాలుడు, బావమరది, భార్యసోదరుడు.

**سالار** సాలార్ (పా.పు) నాయకుడు,పెద్ద; దళవాయి; ప్రముఖుడు, తలకట్టు. **سالار جنگ** -జంగ్ (పా) సేనానాయకుడు, సేనాధిపతి, హైదరాబాదు రాజ్యమున ప్రధానమంత్రి కుటుంబమువారి బిరుదము. (ఉ) స్యాలుడు, బావమరది.

**سالانہ - سالیانہ** - సాలానా-సాలియాన (పా) వార్షికము, ఏటేటవచ్చునది.

**سالسا** సాల్సా(హి.పు)సుగంధపాల,సారస వేరు, సీమసుగంధపాల.

**سالک** సాలిక్ (అ.పు) తెరువరి,బాటసారి; భక్తుడు, ఆచారనిష్ఠగలవాడు, నైష్ఠికుడు.

**سالگرام** సాలిగ్రామ్(హి.పు) సాలగ్రామము.

**سالم** సాలిమ్ (అ) అంత, సాంతము; సమగ్రము. అఖండము; ఆరోగ్యమైన,సురక్షితమైన, చెడని.

**سالن** సాలన్ (హి.పు) శాకము.కూర; ఆదు వాసము, దిమ్మ్క; మాంసము, చేపలు.

**سالنا** సాల్నా(హి)తూటుపొడుచుట,తొలుచుట, కోయుట.

**سالو** సాలూ (హి.పు) మద్దిరసెల్లా,ఎఱ్ఱబట్ట.

**سالوتری** సాలోత్‌రీ (హి.పు) అశ్వ వైద్యుడు, పశువైద్యుడు.

**سالہ** సాల (పా) (ఇది యొక ప్రత్యయము.) ఏడు లేక ఏండ్లుగల,ఆయుస్సుగల,వార్షికము.

**سالہا** సాల్‌హా (పా)ఏండ్లు,ఏండ్లకొలది, **سالہا سال** -సాల్ అనేకవత్సరములు, ఏండ్లతరబడి.

**سالی** సాలీ (హి. స్త్రీ) భార్యతోడబుట్టినది, వదిన, మరదలు.

**سالیانہ** సాలియాన(పా) వర్షాశనము,వార్షికము, ఏడాదికొకసారి యిచ్చుద్రవ్యము. **سالیانہ دار** -దార్ (పా) వర్షాశనము గలవాడు.

**سامان** సామాన్ (పా.పు) సామగ్రి, ఉపకరణములు; ఆస్తి,వస్తువులు;ఆయుధములు, పరికరములు;సన్నాహము; సజ్జనము, సవరణము,ఏర్పాటు,కట్టుదిట్టము; ప్రయత్నము; సమయము; ప్రజ్ఞ, స్థానకము, తెలివి.(హి) సామాన్యము.

**سامدرک** సాముద్రిక్ (హి.స్త్రీ) సాముద్రికశాస్త్రము.

**سامرتهه** సామర్థ్ (పా.స్త్రీ) సామర్థ్యము.

**سامری** సామిరీ (అ.పు) మంత్రశాస్త్రము, ఒక గొప్పమంత్రశాస్త్రజ్ఞుని పేరు.

**سامع** సామెఉ (అ.పు) శ్రోత, వినువాడు.

**سامعه** సామెఅ (అ.స్త్రీ) శ్రవణేంద్రియము.

**سامک** సామక్ (హి.పు) ధాన్యవిశేషము.

**سامگری** సామగ్రి (హి.స్త్రీ) సామగ్రి.

**سامنا** సామ్నా (హి.పు) సమ్ముఖము, ఎదురు, ముందు; ఎదురుబాటు, ఎదిరింపు, అభిముఖము, తటస్థము, భేటి; జగడము.

**سامنے** సామ్నే (హి) ఎదుట, ముందర, ముందు, సముఖమున.

**سامی** సామీ (హి.పు) స్వామి, సామి; (హి.స్త్రీ) సారవంతమైన పొలము, కఱ్ఱ లోనగువానిపొన్ను.

**سان** సాన్ (హి.స్త్రీ) సానరాయి, **سان گر** - గర్ (పా.పు) కత్తులుమొ॥ సానబట్టువాడు, **سان دهرنا** - ధర్నా (హి) సానపట్టుట, పదనుపెట్టుట.

**سان** సాన్ (పా) పోబడి, జాడ, వైఖరి, నడవడిక, **سان گمان** సాన్ గుమాన్ (ఉ) జాడపోబడులు, అనుమానము.

**سانبهر** సాంభర్ (హి.స్త్రీ) జయపూరు రాజ్యమందలి యొకసరస్సునకును అందుండితీయబడిన ఉప్పునకును పేరు.

**سانپ** సాంప్ (హి.పు) సర్పము, పాము.

**سانپا** సాంపా (హి.పు) శాపము; శోకము.

**سانپن** సాంపణ్ (హి.స్త్రీ) ఆడపాము, రెండుతలలశిఖండి.

**سانٹ - سانٹهه** సాంట్ - సాంఠ్ (హి.స్త్రీ) బడితె, కొరకటిబండ; గ్రంధి, ముడి; సమ్మె, కుట్ర; వైరము, పగ; సంబంధము, సంయోగము, చేరిక.

**سانٹا** సాంటా (హి.పు) కశము, చేగ్లకోల.

**سانٹنا** సాంట్నా (హి) అతికించుట, ముడివేయుట, కలుపుట, పిరికెట్టుట, పైనవేయుట, పేనుట; జోడించుట; కలుపుకొనుట, తనవైపునకుత్రిప్పుకొనుట.

**سانجهه** సాంఝ్ (హి.స్త్రీ) సంధ్యాకాలము, సాయంకాలము, స్నేహము.

**سانجهی** సాంఝీ (హి.స్త్రీ) బతకమ్మ, బతకమ్మపండుగ.

**سانچ** సాంచ్ (హి.పు) సత్యము, సరి, నిజము.

**سانحه** సానిహ (అ.పు) ఆకస్మికముగజరిగినది, దైవికము, కీడు, చెడుగు, ప్రమాదము, ఆకస్మికముగా తెలిసినవిషయము, సంగతి, సంఘటనము.

**سانچا** సాంచా (హి.పు) గర్భాశయము; మూస, అచ్చు; సత్యమైన, యదార్థమైన, నిజమైన.

**سانڈ** సాండ్ (హి.పు) ఆబోతు, కోడె; పిడికొట్టనిజంతువు; పోకిరి.

**سانڈا** సాండా (హి.పు) ఉడుము.

**سانڈنی** సాండ్నీ (హి.స్త్రీ) ఆడఒంటె. **سانڈنی سوار** - సవార్ (ఉ.పు) ఒంటెరౌతు.

**سانڈیا** సాండియా (హి.పు) ఒంటెపిల్ల; సరిగజేయుకొండెకోల;

**سانس** సాంస్ (హి.పు) శ్వాసము, ఊపిరి, ఆవిరి; బీట, పగులు; **سانس بهرنا** - భర్నా (హి) నిట్టూర్పువిడుచుట, రొజుట, **سانس چڑهنا - پهولنا** - చఢ్నా - ఫూల్నా (హి) రొజుపుట్టుట, అలయుట, **سانس رکنا** - రుక్నా (హి) ఊపిరాడక

పోవుట, سانس اکھڑنا - సాఁస్ ఉఖడ్నా ఊపిరి తిరుగకపోవుట, ఊపిరి గుక్కిరి మిక్కిరియగుట.

سانسا సాఁసా (హి.పు) చింత, భయము, సందేహము, ఆలోచన, విచారము.

سانسی సాఁసీ (హి.పు) ఒకజాతి ఎఱుకల వారు.

سانک సాఁక్ (హి.స్త్రీ) శాఖ, కొమ్మ,(పు) ఖండము, తునక; ఈటె. [లము.

سانکل సాఁకల్ (హి.స్త్రీ)గొలుసు, శృంఖ

سانگ సాఁగ్ (హి.పు) వేషము, అనుకరణము; పరిహాసము, హాస్యము; ఆట,నాటకము, ప్రదర్శనము, వినోదము; యుక్తి, టక్కు, మోసము; క్రీడ, లీల, విలాసము, చేత, కార్యము. سانگ آنے - సాఁగ్ ఆనె (హి.పు) ఒకఅణా.

سانگی సాంగీ (హి.పు) వేషధారి, నటుడు, బహురూపులవాడు; భట్రాజు.

سانگی సాంగీ (హి.స్త్రీ) బండితోలువాడు కూర్చుండుచోటు, బండి తొట్లు, బండి నొగలు నిలువబెట్టు ముక్కాలిపీట మొ॥ కొయ్యలు. (సాని.

سانن సాఁనన్ (హి.స్త్రీ) తోటకాపుది,రెడ్డి

ساننا సాఁన్నా (హి) పిండి మొ॥ పిసుకుట లేక కలుపుట, చేర్చుట, పూయుట,చిక్కవేయుట, అంటకట్టుట; కళంకపెట్టుట, నిందమోపుట, ఆరోపించుట,.

سانوٹا సానోటా [హి] జాగ్రత్తపడిన;సన్నిద్ధమైన, జాగరూకుడైన, సమాళించుకొనిన, ఎదుర్కొనిన.

سانورا - سانولا సాఁవ్లా - సాఁవ్రా (హి) శ్యామలవర్ణముగల, చామనచాయగల, గోధుమవన్నెగల. سانولا سلونا -సలవ్నా (హి) రూపసియైన, చక్కని రూపురేఖలుగల.

سانولیا సాఁవలియా (హి.పు) శ్యామలవర్ణుడు, కృష్ణుడు.

سانی సానీ (హి.స్త్రీ) పశువులకు పెట్టు పొట్టు, గానుగపిండి, గడ్డి మొదలగునవి కలిపి చేసినసుగ్గు. (పు)తోటవాడు,మాలి, ప్రియుడు, యజమాని.

سائیں سائیں సాఁయీఁ సాఁయీఁ (హి.స్త్రీ) గాలివీచుట మొ॥ వాని ధ్వని యనుకరణము; మర్మరము, (చప్పుడు).

ساور సావర్ (హి.స్త్రీ) కన్నకోల, గునపము, గడ్డపార.

ساوڑ సావడ్ (హి.స్త్రీ) పురిటిల్లు,పురుడు.

ساوڑی సావడీ(హి.స్త్రీ) కళ్లముపద్దపెట్టు ముష్టి లేక బిచ్చము.

ساون సావన్ (హి.పు) శ్రావణమాసము.

ساونت సావంత్(హి.పు) శూరుడు,వీరుడు, యోధుడు.

ساونی సావనీ (హి.స్త్రీ) శ్రావణమాసాదిక పండు పంటలు; వరి మొక్కజొన్న మొదలగు ధాన్యములు పండు ఋతువు, శ్రావణపట్టి. (శ్రావణమాసములోకొడలికిచ్చు వస్తువులు)

ساه సాహ్ (హి.పు) వర్తకుడు, వ్యాపారముచేయువాడు, కోఠీదారుడు; నిజస్థుడు, యోగ్యుడు; వర్తకుల గౌరవనామము.

ساها సాహా (హి.పు) ఋతువు, కాలము, పెండ్లిదినములు, లగ్నసరి. ساها چمکنا సాహా-చమక్నా(హి)పెండ్లిండ్లుమిక్కిలిగానగుట.

ساهل సాహుల్ (హి.పు) గోడ మొ॥వాని నిడుపుచూచు గుండు లేక గుంజబల్ల.

ساهو సాహూ [హి.పు] మేలుకోరువాడు; పోషకుడు; దాత; దొంగ; వర్తకుడు.

**ساهوکار** సాహూకార్ (ఉ.పు) కోటీదారుడు, వర్తకుడు, వడ్డీవ్యాపారము చేయువాడు, కుసీదకుడు.

**ساهوکارا** సాహూకారా (ఉ.పు) కోటీవ్యాపారము, కుసీదకము, వడ్డీవ్యాపారము.

**ساهوکاری** సాహుకారీ(ఉ.స్త్రీ) వర్తకము, వడ్డీ వ్యాపారము, అర్ధప్రయోగము, వ్యాపారము; యోగ్యత, న్యాయస్థుడు,

**ساهول** సాహూల్ (హి.పు) చూడు **ساهل**

**ساهی** సాహీ (హి.స్త్రీ) ఏదుపంది,

**سائی** సాయీ (హి.స్త్రీ) సంచకరువు, సత్యంకారము.

**سائیبان** సాయబాణ్ (హి.పు) పంచ, పంచపాళి, వసారా, పందిరి.

**سایه‌دار** సాయదార్(హి) నీడయిచ్చెడు, నీడగల, (వృక్షము.)

**سایه‌هونا** సాయాహోనా(హి) దయ్యము (పట్టుట.

**سائیر** సాయిర్ (అ.పు) తిరుగువాడు, సంచారి; అంతయు; సాంతము; సుంకము, పన్ను; చిల్లర, మిగులు;

**سائیس** సాయీస్ (ఉ.పు) గుఱ్ఱపువాడు.

**سائیسی** సాయీసీ (ఉ.స్త్రీ) గుఱ్ఱపుకొలువు, గుఱ్ఱపువానిపని.

**سائیل** సాయిల్ (అ.పు) ప్రశ్న చేయువాడు, అడుగువాడు; యాచకుడు, బిచ్చగాడు.

**سایه-سایا** సాయా (పా.పు) ఛాయ, నీడ; ఆశ్రయము, సహాయము, పోషణము, రక్షణము, గ్రహబాధ, **سایه‌پرورده** —పర్వర్ద (పా) ఇంటబుట్టిన దాసివాడు, ముద్దుబిడ్డ.

**سائیں** సాయీం(హి.పు) భర్త, యజమాని, పోషకుడు; స్వామి, ఈశ్వరుడు; భర్త, సన్యాసి.

**سب** సబ్ (హి) సర్వము, అంత, సాంతము, అశేషము, బొత్తిగా. **سب‌کچھ** —సబ్-కుఛ్ (హి) సమస్తము, ప్రతివస్తువు, **سب کوئی** —కోయీ(హి) అందరు, ప్రతివాడు.

**سبابه** సబ్బాబ (అ) తర్జని, జుట్టినప్రేలు, చూపుడుప్రేలు. (మళము.

**سباس** సుబాస్ (హి.స్త్రీ) సువాసన, పరి

**سبب** సబబ్ (అ.పు) సామగ్రి, వస్తువులు, కారణము, హేతువు, నిమిత్తము, మూలము, ప్రయోజనము, సంబంధము, ఉద్దేశము, సాధనము.

**سبحان** సుబ్‌హాణ్ (అ) పవిత్రమైన, ముక్తమైన, శుద్ధమైన, స్తుత్యమైన, **سبحان الله** - అల్లా (అ) ఆశ్చర్యార్థకము, పరమ పావనుడగు భగవంతుడు దలపునకు వచ్చుచున్నాడనుట, బళిరె, బాపురె, బాగు, బహుబాగు, మేలు, మేలుమేలు.

**سبحه** సుబ్‌హ (అ.స్త్రీ) జపమాల, **سبحه گردانی** గర్దానీ(ఉ) జపమాల త్రిప్పుట.

**سبرن** సుబరన్ (హి.పు) సువర్ణము, బంగారము.

**سبز** సబ్‌జ్ (పా) పచ్చి, పచ్చని; నవనవలాడెడు, తేజరిల్లుచున్న; నవీనతగల, పచ్చగానున్న, పచ్చిగానున్న; క్రొత్త, క్రొత్తగానున్న; కోమలమైన; పచ్చికగల; పండని, పక్వముగాని, పసరికగానున్న. **سبزقدم** —కదమ్(పా.అ) అమంగళ పాదుడు, అడుగుబెట్టుటచేత అశుభము గలుగజేయువాడు.

**سبزباغ دکهانا** —బాగ్ దిఖానా(ఉ) అరచేతిలో వైకుంఠము జూపుట, మోసము జేయుట. **سبزبخت** —బఖ్త్ (పా)

అదృష్టవంతుడు.

**سبزہ** సబ్జ (పా.పు) పచ్చదనము,పచ్చిక, పసిరిక, చెట్టుచేమలు; క్రొత్తదనము, నవ నవ, నవీనత;పచ్చ,పచ్చరాయి; గంజాయి. **سبزہ آغاز** -సబ్జ-ఆగాజ్ (పా) నవయౌవనుడు, గడ్డము మీసము రానారంభించుచున్నవాడు. **سبزہ رنگ** -రంగ్ (ఉ) చామన ఛాయగల,. గోధుమ వన్నెగల, రూపసియైన. **سبزہ زار** -సబ్జ-జార్ (పా.పు) పచ్చికబయలు, పసరికపొలము.

**سبزی** సబ్జీ (పా.స్త్రీ) పచ్చదనము,పసిరిక, పచ్చిక, చెట్టుచేమ, కూరగాయలు, ఆకుకూరలు; గంజాయి. **سبزی فروش** -ఫరోష్ (పా) కూరగాయలమ్మువాడు, **سبزی منڈی** -మండీ (ఉ) కూరగాయల అంగడి.

**سبط** సిబ్త్ (అ.పు) దౌహిత్రుడు, మనుమడు, బిడ్డకొడుకు; వంశము, కుటుంబము, సంతానము,

**سبع** సబ్ఒ ఏడు, సప్తకము. **سبع سیارہ** సయ్యార (అ) సప్తగ్రహములు; కృత్తికా నక్షత్రము.

**سبق** సబక్ (అ.పు) అగ్రిత్వము, పురస్సరణము, ముందుండునది, ప్రాముఖ్యము,ఆధిక్యత; పాఠము, పఠనము.

**سبقت** సబ్కత్ (అ. స్త్రీ) అగ్రగామిత్వము, పురస్సరణము, ప్రాముఖ్యత, ఆధిక్యత, ప్రాధాన్యము, ముందుండుట. **سبقت لیجانا** -లేజానా(ఉ) ఆధిక్యతనొందు, మీరిపోవుట.

**سبک** సు - సబుక్ (పా) తేలికైన,సున్నితమైన, సూక్ష్మమైన, కోమలమైన, లాఘవమైన; అల్పమైన, తుచ్ఛమైన,కొంచమైన, నీచమైన; చురుకైన, వడిగల, చాకచక్యముగల. **سبک دوش - سبک بار** -బార్ -దోష్(పా)బరువుతీరిన, భారము తొలగిన, విముక్తుడైన; ఏకాకియైన;ఉల్లాసముగానున్న, సంతోషముగానున్న. **سبک دست** -దస్త్ (పా) హస్తలాఘవముగల,చేయితిరిగిన, నేర్పరియైన. **سبک سر** -సర్ (పా) అల్పుడు, శుంఠుడు, నీచుడు.

**سبکنا** సుబక్‌నా (హి) వెక్కుట, వెక్కివెక్కి (ఏడ్చుట.

**سبکی** సుబ్కీ (హి.స్త్రీ) వెక్కు,(పా)లాఘవము, తేలిక;సూక్ష్మత్వము; కొంచదనము; కోమలత; చిన్నతనము; అవమానము, తిరస్కారము. **سبکیاں لینا** సుబ్కియాంలేనా వెక్కుట, వెక్కి-వెక్కి-యేడ్చుట.

**سبل** సబల్ (అ.పు) ఒకకండ్లరోగము.

**سبل** సబ్బల్ (హి.పు) గడ్డపార,కన్నకోల.

**سبو** సబూ (పా,పు) కుండ, ముంత, పిడత.

**سبوچہ** సబూచ (పా.పు) ముంత,పిడత.

**سبورا** సబూర(ఉ.పు) చూడు **عابورہ**

**سبھ** సుభ్ (హి) శుభము, శుభ్రము.

**سبھا** సభా (హి.స్త్రీ) సభ,సదస్సు,చదురు,

**سبھاسد** సభాసద్ (హి.పు) సభాసదుడు.

**سبھاو** సుభావ్ (హి.పు) స్వభావము.

**سبیتا-سبھیتا** సుబీతా-సుభీతా (హి.పు) అవకాశము, విసుదల, నెమ్మతి, నిమ్మళము, శాంతి, ఉపశమనము, ఏకాంతము, విమోచనము, సమయము,వసతి,విశ్రాంతి, సౌఖ్యము. (త్వరగా.

**سبیر** సబేర్ (హి) వెందలకడ, శీఘ్రము,

**سبیرا** సబేరా (హి.పు) ఉదయము, ప్రొద్దు

పాడువు, వేకువ.

**سبیل** సబీల్ (అ.స్త్రీ) త్రోవ, మార్గము; పద్ధతి, రీతి, తెరగు, విధము; ఏర్పాటు, కట్టుదిట్టము.

**سبیل پلانا-رکھنا-لگانا** సబీల్ పిలానా -రఖ్‌నా - లగానా చలిపందిలి పెట్టుట, బాటసారులకు నీళ్లు త్రాగించుట.

**سپا** సిప్పా (హి.పు) లక్ష్యము, గురిపట్టు, అంతరము, అంచ, దూరము,ప్రయాణము, గురి, గురుతు, అందుబాటు,ఉపాయము, రీతి, వైఖరి, పోబడి, జాడ.

**سپاٹ** సపాట్ (హి)పరుపుగానున్న,చదునైన, బయలుగానున్న,చదరమైన,సమముగానున్న.

**سپاٹا** సపాటా (హి.పు) పరుగు, ఉరుకు, దూకు,గంతు;విహారము;వేగము,వినోదము.

**سپاره** సిపారా (హి.పు) త్రింశదంశము, కురానులోని ఒకఅధ్యాయము, (ముప్పదియవ భాగము.)

**سپارا** సుపారా(పా.పు)శిశ్న ముఖము,(పోక)

**سپیاری-سپاری** సుపారీ - సుప్యారీ (హి.స్త్రీ) పూగీఫలము, పోక, వక్క; శిశ్న ముఖము.

**سپاس** సిపాస్ (పా.స్త్రీ) కృతజ్ఞత,వందనము, ప్రశంస. **سپاس نامه** - నామ (పా.పు) అభినందన పత్రము, ప్రశంసా పత్రము,

**سپاه** సిపాహ్ (పా.స్త్రీ) సేన, బలము, దండు,దళము.**سپاه‌سالار**-సాలార్ సేనాధిపతి,దళవాయి.**سپاه‌گری** -గరీ సైనిక విద్య, సైనికత్వము.

**سپاها** సిపాహా (హి.పు) ముక్కాలుపీట.

**سپاهی** సిపాహీ(పా.పు)సైనికుడు,బంటు, యోధుడు, సేవకుడు, భటుడు, వీరుడు.

**سپاهیانه** సిపాహియాన(పా) వీరయోగ్యమైన,సైనికయోగ్యమైన, పరాక్రమయుక్తమైన, యోధార్హమైన.

**سپر** సిపర్ (పా.స్త్రీ) కేడెము, అరిగె, (డాలు), శరణము, అడ్డము.

**سپرد** సుపుర్ద్ (పా.స్త్రీ) అప్పగింత,స్వాధీనము, అధీనము.

**سپردا-سپردائی** సపర్దా - సపర్దాయి (హి.పు) భోగముదాని వెంటనుండు మేళగాండ్లు.

**سپردگی** సుపుర్దగీ (పా.స్త్రీ) అప్పగింత, స్వాధీనము; కాపు, కావలి.

**سپڑنا** సపడ్నా (హి) ముగియుట, తుదముట్టుట, తీరుట, వ్రియమగుట; పట్టుబడుట, చిక్కుట, చిక్కుబడుట.

**سپستان** సపిస్తాన్ (పా.పు) ఇరికిచెట్టు, నక్కెరచెట్టు, బొటుకుచెట్టు,(పండును)

**سپنا** సుప్నా (హి.పు) స్వప్నము, కల.

**سپنڈ** సపిండ్ (హి.పు) సపిండుడు, జ్ఞాతి.

**سپوت** సపూత్ (హి.పు) సత్పుత్రుడు.

**سپوتی** సపూతీ (హి) సత్పుత్రులు లేక సంతానముగల.

**سپورن** సపూరణ్ (హి) సంపూర్ణము.

**سپولا-سپولیا** సపోలా - సపోలియా (హి.పు) పాముపిల్ల.

**سپه** సిపహ్ (పా) చూడు **سپاه** (వ్యుత్పత్తి యందుమాత్రము), **سپه‌سالار** చూడు **سپاه‌سالار**, **سپه‌گری** చూడు **سپاه‌گری**

**سپهر** సిపహ్ర్ (పా.పు) ఖగోళము, ఆకాశమండలము, ఆకసము.

**سپهر** సిపహర్ (పా.పు) అపరాహ్ణము.

**سپھری** సిపహీ్రి (హి. స్త్రీ) ఒకవిధమైన తళతళలాడెడు చిన్నచేప.

**سپیاری** సుప్యారీ (హి. స్త్రీ) **سپاری**

**سپید** స(సు)పేద్ (పా) తెల్లని.

**سپیده** సపేద (పా.పు) సత్తు లేక తుత్తు నాగపుపొడి లేక చూర్ణము, తెల్లరంగు, తెల్లపూత.

**سپیدی** స(సు)పేదీ [ఉ. స్త్రీ] తెలుపు, ధావళ్యము; సున్నము; వెలుగు, ప్రకాశము.

**سپیرا** సపేరా (హి.పు) పాములవాడు, పాములాడించువాడు,

**ست** సత్ (హి) ఆరున్నొకటి, ఏడు; (వ్యుత్పత్తియందుమాత్రము) **ست لڑا** -సత్-లఢా (హి) ఏడుసరములదండ.

**ست** సత్(హి) సత్యమైన, నిజమైన, (పు) నిజము,సత్యము,సరళత్వము, ఋజుత్వము; సత్యము, సారము, సత్తు; సత్తువ,బలము; **ست جگ** -సత్-జుగ్ (హి.పు)సత్యయుగము. (దీనిపరిమాణము 1728000 సంవత్సరములు. **ست گلو** -సత్-గిలో (హి) తిప్పసత్తు.

**ستار** సితార్ (పా.పు)ఒకతంత్రీవాద్యము, త్రితంత్రి, సితారు.

**ستار** సత్తార్ (అ.పు) దాచువాడు, మాయువాడు;ఈశ్వరుడు. **ستار العیوب** -ఉల్ ఉయూబ్ (అ) పాపములనుకప్పిపుచ్చువాడు. ఈశ్వరుడు. (అనుకూలము.

**ستار** సీతార్ (హి.పు)కాలము,సమయము,

**ستاری** సుతారీ(హి. స్త్రీ) వడ్రము,కదురు, వడ్రింగిభార్య. (చువాడు.

**ستاریا** సితారియా (ఉ.పు) సితారువాయిం

**ستاسی** సతాసీ-సత్తాసీ(హి)ఎనుబదియేడు.

**ستان** సితాఁ (పా.పు) స్థలము, స్థానము, చోటు, దేశము. **بوستان** బో- (పా) తోట, ఉద్యానము, **گلستان** గుల్- (పా) పూలతోట,

**ستانا** సతానా(హి) పీడించుట,బాధించుట, హింసపెట్టుట.

**ستانوے** సత్తాన్వే (హి) తొంబదియేడు.

**ستاور** సతావర్ (హి)శతావరి. (ఓషధి)

**ستاون** సత్తావన్(హి) ఏబదియేడు.

**ستائیس** సత్తాయిస్ (హి) ఇరువదియేడు.

**ستتر** సతత్తర్ (హి) డెబ్బదియేడు.

**ستر** సత్తర్ (హి) డెబ్బది.

**ستروان** సత్తర్వాఁ (హి) డెబ్బదియవది.

**سترہ** సత్రె (హి) పదునేడు.

**سترھواں** సత్రహ్వాఁ (హి) పదునేడవది.

**ستری** స్త్రీ (హి. స్త్రీ) ఆడుది.

**ستکاری** సత్కారీ (హి) సత్యము, సత్కార్యముచేయువాడు; శవముకాల్చువాడు.

**ستلی** సుత్లీ (హి. స్త్రీ) పురికొన, సన్నత్రాడు; నులక, నులకత్రాడు.

**ستم** సితమ్ (పా.పు) హింసపెట్టుట, పీడింపు, బాధ, బలాత్కారము, అన్యాయము, అక్రమము. **ستم کش** -సితమ్-కష్ (పా) హింసకోర్చువాడు, హింసపడువాడు, హింసపడు,పీడింపబడు. **ستم گر** -గర్ (పా) హింసపెట్టువాడు, పీడించువాడు. **ستم گری** -గరీ (పా)హింసింపు,పీడింపు,బాధింపు, బలాత్కారము, **ستم رسیده** -రసీద (పా) హింసపొందిన, బాధపొందిన, పీడింపబడిన, పీడనొందిన.

**ستمی** సత్తిమి (హి. స్త్రీ) సప్తమితిథి.

**ستو-ستوا** సత్తూ — స తు వా (హి.పు) గోధుమలును శెనగలును వేయించి కలిపి విసిరినపిండి; సత్తు, సక్తు, సత్తుపిండి, **ستو سنکرانت** -సంక్రాంత్ (హి) మేషసంక్రమణము, మేషసంక్రాంతి.

**ستوانسا** సత్వాఁసా (హి) ఏడునెలలలో పుట్టినబిడ్డ, నెలతక్కువవాడు, సాప్తమాసికుడు, మాసావరుడు.

**ستور** సుతూర్-సుత్వర్ (పా.పు) మోతపశువు; పశువు, ఒంటె.

**ستوده** సితూద (పా) స్తుతము, స్తోత్రము జేయబడిన, శ్లాఘింపబడిన, శ్లాఘితము, శ్లాఘనీయము, స్తోత్రపాత్రము, **ستوده صفات** -సిఫాత్ (పా) శ్లాఘనీయగుణములుగల, సద్గుణసంపన్నుడు.

**ستون** సుతూన్ (పా.పు) స్తంభము, కంబము, గుంజ.

**ستونتی** సత్వంతీ (హి) సత్యవంతుడు, న్యాయస్థుడు, నీతిమంతుడు.

**ستوه** సుతూహ్ (పా.స్త్రీ) భయము, దుఃఖము, బాధ, పీడ; దారిద్ర్యము, కష్టము.

**ستهان** స్థాన్ (హి.స్త్రీ) స్థానము, చోటు, స్థలము.

**ستهرا** సుథ్రా (హి) స్వచ్ఛమైన, శుభ్రమైన, సలక్షణమైన, పరిశుభ్రమైన, తీర్చిన, దిద్దిన, సక్రమమైన, పొంకమైన, సలక్షణముగానున్న.

**ستهرائی** సుథ్రాయీ (హి) తీర్పు, దిద్దుబాటు, పొంకము, సలక్షణత. పరిశుభ్రత, స్వచ్ఛత్వము, అందము, సక్రమత్వము.

**ستہ** సిత్త (అ) ఆఱు, (౬)

**ستہ متناسبہ** సత్తయెముతనాసిబ (అ.పు) పంచరాశికము. (గణితము)

**ستهنی** సుథ్నీ (హి.స్త్రీ) పెండలమువంటి గడ్డ, ఒకజాతిపెండలము.

**ستی** సతీ (హి.స్త్రీ) సహగమనము, చచ్చినభర్తతోగూడ భార్యచితనెక్కుట, సతి, పతివ్రత, ఇల్లాలు, మంచిఇల్లాలు.

**ستیا** సతియా (హి.పు) నేత్రవైద్యుడు.

**ستیاناس** సత్యానాస్ (హి.పు) సత్యానాశనము, సర్వనాశనము, మూలధ్వంసము, మొదలంటునశించుట, పాడగుట, నాశమగుట.

**ستیاناسی** సత్తియానాసీ(హి) నాశకుడు, సర్వనాశముజేయు, పాడుజేయు, మొదలంటుజెఱచు.

**ستیز** సితేజ్ (పా) జగడము, పోట్లాట; స్పర్ధ, పోటి; యుద్ధము.

**سٹ** సట్ (హి.స్త్రీ) సమాజము, సంఘము, సమితి, దగ్గరసంబంధము. **سٹا سٹ** సటా సట్ (హి) వెంటవెంటనొట్టుచప్పుడు, వెంటవెంట, పైపైన, వడిగా.

**سٹا** సిట్టా (హి.పు) మక్కజొన్నకంకి, మక్కజొన్నవెన్ను.

**سٹا** సట్టా (హి.పు) జట్టు, గుత్త, అడతి; ముందుకొంతధనముగొనిధాన్యాదులనిచ్చు ఒడంబడిక, వ్యాపారము, వర్తకము, **سٹا بٹا** -బట్టా (హి) రహస్యసంఘము లేక వ్యాపారము, లోలోపలిఒడంబడిక, కుట్ర, పరివర్తనము. ఒకవస్తువునయిచ్చిమరియొక వస్తువనుగొనుట, వస్తువులుమార్చుకొనుట, మాఱకము, ఇచ్చిపుచ్చుకోలు.

**سٹانا** సటానా (హి) అతికించుట, అంటించుట, కలుపుట, జోడించుట.

**ستپٹانا** సట్ పటానా (హి) కలవరపడుట, ఆతురపడుట, కలతజెందుట.

**سٹرپٹر** సటర్ పటర్ (హి. స్త్రీ) చిల్లరలు, చిల్లరవస్తువులు.

**سٹک** సటక్ (హి. స్త్రీ) హుక్కానాళము, గుడుగుడీనాళము.

**سٹکانا** సట్కానా (హి) పారదోలుట, మాయముజేయుట, అదృశ్యముజేయుట, తొలగించుట, తప్పదీయుట, సన్నగిలజేయుట.

**سٹکنا** సటుక్నా (హి) పారిపోవుట, మాయమగుట, తప్పించుకొనిపోవుట, దొంగతనముగాపోవుట.

**سٹکنا** సటుక్నా (హి) గుటుక్కునమ్రింగుట, గుటకవేయుట.

**سٹنا** సట్నా (హి) అతుకుకొనుట, అంటుకొనుట, కలియుట, జోడిల్లుట, కలిసికొనుట.

**سٹھیانا** సఠియానా (హి) షష్టిపూర్తియగుట, అరువదియేండ్లునిండుట, ఏండ్లుముదురుట, అస్తావిస్తమగుట, దుర్బలమగుట.

**سٹھورا** సఠోరా (హి.పు) కాయము, సూతికా కాయము, ప్రసవమైనవారికి యిచ్చు ఔషధము.

**سٹی** సిట్టీ (హి. స్త్రీ) పంచేంద్రియములు, తెలివి. **سٹی گم ہونا** సిట్టీ-గుమ్‌హోనా (హి) కలవరపడుట, దిగ్భ్రమపడుట, ఎటునుతోచకయుండుట.

**سج** సజ్ (హి. స్త్రీ) సింగారము, సింగారించుట, సజ్జ, అలంకారము, సజ్జనము, సన్నాహము, సిద్ధపరచుట, **سج دھج** సజ్-ధజ్ [హి. స్త్రీ] అలంకారము, సింగారము, ఆకారము, అందము, ఠాంకము.

**سجاد** సజ్జాద్ (అ) సాష్టాంగపడిదేవుని ప్రార్థించువాడు, మిక్కిలిగా ప్రార్థించువాడు, నమస్కరించువాడు, మిక్కిలి మొక్కువాడు, భక్తుడు.

**سجادہ** సజ్జాద (అ.పు) మహమ్మదీయులు నమాజుజేయుటకు పరచుకొనువస్త్రము, చిత్రాసనము, మసీదు. **سجادہ نشین** సజ్జాద-నిషీన్ (పా) మసీదునందలిపెద్ద, ధర్మకర్త.

**سجان** సుజాన్ (హి) సుజ్ఞాని, మంచితెలివిగలవాడు.

**سجانا** సజానా (హి) అలంకరించుట, సింగారించుట, ఏర్పరచిపెట్టుట, తీర్చుట, దిద్దుట, సిద్ధపరచుట.

**سجاوٹ** సజావట్ (హి. స్త్రీ) అలంకారము, సింగారింపు, తీర్చుట. (వాటులు.

**سجایا** సజాయా (అ) స్వభావములు, అల

**سجدہ** సిజ్‌ద (అ.పు) ప్రార్థనలోనొసలు భూమికి తగులునట్లువంగుట, నొసలంట మ్రొక్కుట.

**سجع** సజఒ (అ.పు) ఛందము, పద్యము, కవనము, వచనము, భాషణము. **سجع گر** -గర్ (పా) వక్త, ధారాళముగమాటలాడగలవాడు, ఉపన్యాసకుడు.

**سجل** సిజల్ (హి) మంచి, మనోజ్ఞము, అందమైనది. **سجل کرنا** సుజల్-కర్నా (హి) మెరుగుపెట్టుట, బాగుజేయుట.

**سجل** సిజిల్ల్ (అ.పు) ముద్రవేసినకాగితము, వ్రాసినతీర్పు, న్యాయాధిపతితీర్పు, దృఢీకరణము, వ్రాసినది, లిఖితము, గ్రంథస్థము, గ్రంథగతము.

**سجلا** సజ్లా (హి.పు) మూడవవాడు, నలుగురులేక యెక్కువమంది యన్నదమ్ములలో మూడవవాడు.

**سجن** సజన్ (హి.పు) సజ్జనుడు, పెద్దమనుష్యుడు; ప్రియుడు, మగడు.

**سجنا** సజ్నా (హి) సిద్ధమగుట, సజ్జితమగుట, అలంకృతమగుట, దిద్దుబాటుగుట.

**سجنی** సజ్నీ (హి.స్త్రీ) స్నేహితురాలు, ప్రియురాలు.

**سجھانا** సిఝూనా (హి) ఉడికించుట, కరగించుట.

**سجھانا** సుఝూనా (హి) తలపునకుదెచ్చుట, చూపుట, తెలియజేయుట, తోచునట్లుజేయుట.

**سجی** సజ్జీ (హి.స్త్రీ) సజ్జకారము. **سجی کھار-مٹی** సజ్జీ-మిట్టీ-ఖార్ (హి) చౌడు, చవుటికారము, చవిటిమట్టిలాట సచ్చి.

**سجیلا** సజీలా (హి) అలంకృతము, సింగారింపబడినది, సింగారించుకొనినది, సజ్జితమైన, అందమైన, పొంకమైన.

**سجیہ** సజియ (అ.పు) స్వభావము, ప్రకృతి, అలవాటు, వాడుక, నైజము.

**سچ** సచ్ (హి.పు) సత్యము, నిజము, యథార్థము.

**سچا** సచ్చా (హి) సత్యమైన, నిజమైన, యథార్థమైన; విశ్వాసపాత్రమైన; స్వచ్ఛమైన, నిర్మలమైన.

**سچائی-سچاپن** సచ్చాపన్-సచాయీ (హి.స్త్రీ) యథార్థ్యము, నిజాయితీ, సత్యము.

**سحاب** సహాబ్ (అ.పు) మేఘము, మబ్బు.

**سحاف** సుహాఫ్ (అ.పు) క్షయరోగము.

**سحر** సిహ్ర్ (అ.పు) ఇంద్రజాలము, మంత్రవిద్య, కనుకట్టువిద్దె. **سحر حلال** -సిహ్ర్ ఎ-హలాల్ (అ) శాస్త్రీయమైనఇంద్రజాలము; నిషిద్ధముగాని ఇంద్రజాలము, వక్తృత్వము, సయుక్తికమైన యుపన్యాసము, నేర్పుగలయుపన్యాసము.

**سحر** సహర్ (అ.పు) ఉషఃకాలము, ఉదయము, తెల్లవారుజాము.

**سحری** సహ్రీ (హి.స్త్రీ) ప్రాతఃకాలభోజనము, తెల్లవారుజాముభోజనము, ఉదయకాలపు భోజనము, (అ) ఉదయకాలపు, ప్రాతఃకాలపు.

**سخاوت** సఖావత్ (అ.స్త్రీ) ఔదార్యము, దాతృత్వము, దానము, ఈవి, ధర్మము.

**سخت** సఖ్త్ (పా) పరుషమైన, కఠినమైన, కష్టమైన, క్రూరమైన, రాతిగుండెగల, దయాశూన్యమైన; పిసినారియైన, లోభియైన, దురదృష్టమైన; అధికమైన, తీవ్రమైన, తీక్ష్ణమైన, **سخت گوئی** -గోయీ (పా) పరుషభాషణము, **سخت گیری** -గీరీ (పా) బలాత్కారము, కాఠిన్యము.

**سختی** సఖ్తీ (పా.స్త్రీ) కాఠిన్యము, పారుష్యము, కఠినత్వము; నిర్దయ, క్రౌర్యము; తీవ్రము, తీక్ష్ణత; దారిద్ర్యము, దౌర్భాగ్యము, కష్టము. **سختی کرنا** -కర్నా (ఉ) బలాత్కారముజేయుట, కాఠిన్యముజూపుట, కఠినముగావర్తించుట.

**سخرہ** సఖ్ర (అ.పు) పరిహాసము, నవ్వులాట, ఎగతాళి; వెట్టిగాడు, వెట్టిపని, ప్రతిఫలములేనిపని.

**سخن** సఖున్-సుఖున్- సుఖన్ - సఖున్

(పా.పు) మాట, వచనము, భాషణము. **آرا سخن**-ఆరా (పా) వక్త, అలంకృతశైలిగలాడు, మంచిశైలి గలవాడు, అలంకృతభాషగలవాడు, **سخن پرور** -పర్వర్ (పా) మాటతప్పనివాడు, మాట నిలుపుకొనువాడు, కవి, కావ్యకర్త, వక్త. **سخن تکیہ** -తక్య (పా) ఊతపదము, కొందరికి మాటలాడునపుడు వెంట వెంట నిరర్థకముగావచ్చు అలవాటు పదము. **سخن چیں**-చీఁ (పా) విమర్శకుడు, విమర్శించువాడు; కొండెములు చెప్పువాడు, దూషకుడు, కుకవి. **سخن داں** -దాఁ (పా)పండితుడు;కవి; వక్త, తెలివిగలవాడు. **سخن رس** - రస్ (పా) వక్త, పండితుడు, **سخن ساز** -సాజ్ (పా) వక్త, మాటకారి;సమయోచితముగ మాటలుకల్పించువాడు,మోసగాడు,వంచకుడు. **سخن گوئی** - గోయీ (పా) కవిత్వము.

**سخی** సఖీ (అ) దాతృత్వముగల, ఔదార్యముగల, దాత,ఉదారుడు, ధర్మము జేయువాడు.

**سد** సద్ద్ (అ.పు) మూయుట, అడ్డుకట్టుట, నిరోధము, ఆటంకము, అడ్డు. **سد رمق** - ఎ,రమక్ (అ) ఊపిరిపోకుండుట, ప్రాణోత్క్రమణావస్థ, కొనప్రాణము,కొన ఊపిరి.

**سدا** సదా (హి) సదా, ఎల్లప్పుడు, ఎడతెగక, విడువకుండ. **سدا بہار** -బహార్ (హి)సదాపచ్చగనుండునది. **سدا سہاگن** -సుహాగన్ (హి) సదా ముత్తైదువగానుండునది, అయిదవతనము సదా చల్లగానుండుగాక అను ఆడువారి దీవన; ఆడవేషముతోనుండు ఒకజాతి పకీరులు;ఒకపుష్పము; ఒకపక్షి; మంచి ఇల్లాలు.

**سدابرت** సదాబర్త్ (హి.స్త్రీ) ప్రతి దినము వ్రతముగా బీదలకిచ్చుచుండు దినబత్తెము, సదావృత్తి.

**سداپ - ف** సదాప్ - ఫ్ (హి) సదాపాకు, అరుదుపాకు.

**سدر** సిద్ర్ (అ.పు) రేగుపండు, గంగరేగు.

**سدھ** సిద్ధ్ (హి.పు) సిద్ధము, సంసిద్ధము, సిద్ధాంతము, తీరుమానము; సంపూర్ణము, కృతార్థము, రససిద్ధి, సిద్ధి, పవిత్రము; సిద్ధుడు, యోగీశ్వరుడు; గంజాయి.

**سدھ** సుధ్ (హి.స్త్రీ) జ్ఞాపకశక్తి, స్మృతి, తెలివి; శుద్ధము, స్వచ్ఛమైనది, చక్కని, సరియైనది. **سدھ بدھ** -బుధ్ (హి.స్త్రీ) తెలివితేటలు, ఆలోచనము, జాగ్రత్త.

**سدھارنا** సిధార్నా (హి) వెడలిపోవుట, గతించుట, పోవుట; చచ్చుట.

**سدھارنا** సుధార్నా(హి) చక్కజేయుట, తీర్చుట, దిద్దుట, అమర్చుట, సవరించుట, చక్కబెట్టుట, అలంకరించుట, సింగారించుట.

**سدھانا** సధానా (హి) అలవరచుట, శిక్షించుట, మచ్చికజేయుట, సాధువుజేయుట, నేర్పుట, తీర్చుట.

**سدھانا** సుధానా (హి) జ్ఞప్తికితెచ్చుట, జ్ఞప్తికివచ్చునట్లుజేయుట.

**سدھرنا** సుధర్నా (హి) చక్కబడుట, చక్కనగుట, సవరణజెందుట, అమరుట, సవరింపబడుట.

**سدھنا** సధ్నా (హి) సాధువుగానగుట, మచ్చికపడుట, అలవడుట, శిక్షితమగుట,

నేర్పుకొనుట, నేర్పబడుట, నేర్చుట.

**سدی** సుదీ (హి. స్త్రీ) శుక్లపక్షము, శుద్ధ పక్షము.

**سڈول** సుడౌలు (హి) మంచి యాకారము గల, పొంకముగానున్న, అవయవానురూపత్వముగలిగియున్న, అందముగానున్న.

**سر** సిర్ (హి.పు) శిరము తల; శిఖరము,పై భాగము; కొన; ఆరంభము, ఆది. **سر اُٹھانا** —ఉఠానా(హి) తలయెత్తుట,తిరుగబడుట, మరలబడుట. **سر آنکھوں سے - پر** —ఆంఖోం సే-పర్ (హి) సగౌరవముగా, మిక్కిలిఆదరపూర్వకము, సంతోషముగా. **سربھاری ہونا** -భారీహోనా (హి) తలభారమగుట, తలనొప్పియెత్తుట, **سرپرخاک ڈالنا** -పర్ ఖాక్ డాల్నా (హి) దుఃఖించుట, విలపించుట. **سرپرستی کرنا** -పరస్తీకర్నా (హి)కాపాడుట,సహాయపడుట. **سرپرہاتھ رکھنا** -పర్ హాథ్ రఖ్నా [హి] నెత్తినచేయి పెట్టుట, అభయహస్తమిచ్చుట, కాపాడుట, సహాయమగుట. **سرپھیرنا** -ఫేర్నా(హి) తలతిప్పుట, తిరుగబడుట,మరలబడుట, **سرپیٹنا** -పీట్నా (హి) నెత్తి కొట్టుకొనుట, తలబాదుకొనుట, శోకించుట, విలపించుట. **سرجھکانا** -ఝుకానా(హి) తలవంచుట, విధేయుడగుట, సమస్కరించుట. **سرچڑھانا** - చఢానా (హి) తలకెక్కించుకొనుట, మిక్కిలిగౌరవము జూపుట, అతి గౌరవము జేయుట. **سرچڑھا** -చఢా (హి) నెత్తికెక్కిన,ముద్దు జేయుటవలన చెడిన, (బిడ్డ) గర్వించెడు, అహంకారపడెడు. **سردھنا** -దహ్నా(హి) తలమోదుకొనుట, విలపించుట. **سردینا** -దేనా (హి) తలపడుట, తలదుపూనుకొనుట, తల తాకట్టుపెట్టుట,పూనుకొనుట. **سرسےپاؤں تک** - సే పావ్ తక్ (హి)ఆపాదమస్తకము, నఖశిఖపర్యంతము. **سرسےکفن باندھنا** —సే కఫన్ బాంధ్నా (హి) ప్రాణమునకు తెగించుట ప్రాణాపాయముగలపనికి పూనుకొనుట. **سرسےکھیلنا** -సేఖేల్నా (హి) దయ్యముపట్టుటచే తల యాడించుచుండుట **سرکٹا** -కటా (హి) తల తెగిన (మొండెము) **سرکھانا** -ఖానా (హి) పీడించుట, విసికించుట. **سرکےبل** -కే బల్ (హి) తల క్రిందుగా. **سرگنجاکرنا** -గంజాకర్నా (హి)నెత్తిబొచ్చూడగొట్టుట. **سرگندھی** -గుంధీ(హి) తలముడుపు, పెండ్లిలో పెడ్లికూతురితలముడుచుకలాపము. **سرگھومنا** -ఘూమ్నా (హి) తలతిరుగుట, తలద్రిమ్మపట్టుట. **سرلگنا** -లగ్నా (హి) తలకు దాకుట, మెడకు పడుట. తప్పు మోపబడుట, నిందవచ్చుట. **سرمارنا** -మార్నా (హి) మిక్కిలి పాటుపడుట, మిక్కిలి కష్టించుట. **سرمنڈا** - ముండా (హి) బోడగొట్టినతల, బోడి తల. **سرمیں بال ہونا** -మేం బాల్ హోనా (హి) సహనశక్తి యుండుట, ఓర్పుకొనగలిగియుండుట,శక్తిగలిగియుండుట. **سرنوانا** -నవానా (హి) తలవంచుట, లోబడుట. **سرنیچاکرنا** -నీచాకర్నా (హి) తల వంచుకొనుట, సిగ్గు పడుట. **سرہونا** -హోనా (హి) తలపడుట, పట్టుపట్టుట, పోట్లాడుట. **سرنہ پیر** -న పైర్ (హి) తల మొదలు లేకయుండుట, తలదోకలేకయుండుట, కలవరముగానుండుట.

**سر** సర్ (పా,పు) చూడు **سِر** (సిర్) అనుపదము; తల, శిరము; పెద్ద, నాయకుడు; ఆరంభము, మొగము; శిఖరము, పైభాగము, కొన, కొస; ఇచ్ఛ, కోరిక; ముఖము, ముందరిభాగము. **سراپا** సరాపా (పా) నఖశిఖపర్యంతము, ఆపాదమస్తకము. **سر اجلاس** -ఎ,ఇజ్లాస్ (పా) సభలో, సభయెదుట. **سرافگندہ** -అఫ్గంద (పా) తలవంచుకొనిన, ముఖము క్రిందైన, భంగపడిన. **سرفراز** -ఫరాజ్ (పా) తల యెత్తియున్న, గౌరవముగానున్న. **سر انجام** -అంజామ్ (పా.పు) సన్నాహము, సామగ్రి, ప్రయత్నములు, ఏర్పాటులు, కట్టుదిట్టములు; పరిణామము, ఫలితము, అంతము; తుదమొదలు. **سرانجام کرنا** -అంజామ్ కర్నా (ఉ) సన్నాహము జేయుట, ఏర్పాటులు జేయుట; నిర్వాహము జేయుట, కట్టుదిట్టము జేయుట, నెరవేర్చుట, తుదముట్టించుట. **سربراہ کار** -బరాహ్ కార్ (పా) కార్యనిర్వాహకుడు, కార్యదర్శి. **سربراہی کرنا** -బరాహీ కర్నా (ఉ) కావలసిన ఏర్పాటులు జేయుట, కార్యనిర్వాహము జేయుట. **سربستہ** -బస్త (పా) మూతికట్టిన, మూసికట్టిన, మూసిన, దాచిన, మరుగుపరచిన. **سربسر** -బసర్ (పా) సమగ్రముగా, సాంతము, అంతయు. **سربلند** - బలంద్ (పా) ఉన్నతశిరస్కుడు, తలయెత్తియున్నవాడు, ఘనతగల, గౌరవనీయమైన. **سر بلندی** -బలందీ (పా) గౌరవము, ఘనత. **سربمہر** -బముహ్ర్ (పా) ముద్రవేసిన, ముద్రితము. **سرپرست** -పరస్త్ (పా) పాలకుడు, పోషకుడు, కాపాడువాడు, నిర్వాహకుడు. **سرپرستی** - పరస్తీ (పా) పాలనము, నిర్వాహము, పోషణము, కాపాడుట. **سرپنچ** -పంచ్ (ఉ.పు) పంచులలో పెద్ద, అధ్యక్షుడు, పెద్ద. **سر پوش** -పోష్ (పా) కప్పు, మూత. **سرپیچ** - పేచ్ (పా) పతకము, ముఖపతకము; శేఖరము, తురాయి. **سرتاج** -తాజ్ (పా) నాయకుడు; పెద్ద. **سرحد** -హద్ద్ (పా) ఎల్ల, మేర, పొలిమేర, కడ, అంచు. **سرحساب رهنا** -హిసాబ్ రహ్నా (ఉ) ఆదాయము ననుసరించుకొని జీవించుట, ఆదాయమును మీరి వ్యయపరుపకుండుట, పరిమితముగానుండుట. **سرخود** -ఖుద్ (పా) స్వేచ్ఛగా, స్వతంత్రుడు, **سردست** -ఎ,దస్త్ [పా] ప్రస్తుతము, చేతిలో, అందుబాటులో. **سردفتر** -ఎ,దఫ్తర్ (పా) ప్రధానలేఖరి. **سرراہ** -ఎ,రాహ్ (పా) త్రోవన, త్రోవలో; గండుబాట, పెద్దబాట, రాజమార్గము, **سرزد ہونا** -జద్ హోనా (ఉ) సంభవించుట, అగుట. **سرزمین** -జమీన్ (పా) భూమి, ప్రాంతము, దేశము, పొలిమేరలు. **سرزنش** -జనిష్ (పా) చివాట్లు, గద్దింపు. **سرزور** -జోర్ (పా) తలబిరుసైన, తిరుగబడెడు, అవిధేయుడు. **سرزوری** -జోరీ (పా) అవిధేయత, తలబిరుసు దనము, తిరుగుబాటు, బలాత్కారము. **سرسبز** -సబ్జ్ (పా) చిగుర్చుచున్న, పచ్చగానున్న, వర్ధిల్లుచున్న, జయప్రదముగానున్న, కళగలిగి

యున్న. **سربزکرنا** -సబ్జ్ కర్నా (ఉ) పునరుద్ధారము జేయుట, పునర్జీవిగా జేయుట, మరల బ్రతికించుట. **سربزهونا** -సబ్జ్ హోనా (ఉ) వర్ధిల్లుట, బాగు పడుట. **سرشام** -ఎ, షామ్ (పా) సాయాహ్నమున, సందెకడ, సాయముసమయమున, సందెబాటున. **سرفرازکرنا** -ఫరాజ్ కర్నా (ఉ) గౌరవాభివృద్ధి జేయుట, గౌరవించుట, బహుమానించుట, బహుమానమిచ్చుట. **سرکرنا** -కర్నా (పా) జయించుకొనుట, జయించుట, గెలుచుకొనుట, గెలుచుట; నెరవేర్చుట, తుదముట్టించుట. **سرکش** -కష్ (పా) తలబిరుసైన, తిరుగబడెడు, తిరుగుబాటుజేయు, అవిధేయమైన, లొంగని. **سرکشی** -కషీ (పా) తిరుగుబాటు, మరలుబాటు, అవిధేయత, **سرکوبی** -కోబీ (పా) నెత్తిగొట్టుట, శిక్షించుట. **سرگزشت** -గుజష్త్ (పా) జరిగినవృత్తాంతము, కథ, జరిగినది, తటస్థించినది, ఘటన, జరిగినవిషయము, వృత్తాంతము. **سرگران** - గిరాం (పా) తలభారముగానున్న, తలనొప్పి; మత్తు, రిమ్మ; గర్వము, అహంకారము. **سرگرانی** -గిరానీ (పా) తలభారము, గర్వము. **سرگردان** -గర్దాన్ (పా) తలతిరుగుడు గలిగిన, తలదిమ్ముగలిగిన, కలవరముగలిగిన, దిగ్భ్రమగలిగిన; దిప్పకాయ, దేశద్రిమ్మరి; కష్టముగలిగిన, ఆయాసముగలిగిన, శ్రమగలిగిన. **سرگردانی** -గర్దానీ (పా) కలవరము, దిగ్భ్రమము, అచ్చెరువు, తలదిమ్ము, తలదిరుగుడు; ద్రిమ్మరితనము, కష్టము, శ్రమ, ఆయాసము. **سرگرم** -గరమ్ (పా) ఉత్సాహముగల, ఆతురతగల, శ్రద్ధగల, ఆతురతతో. **سرگرمی** -గర్మీ (పా) ఉత్సాహము, శ్రద్ధ, ఆతురత. **سرگروه** -గురోహ్ (పా) నాయకుడు, తలమానిసి, పెద్ద. **سرگشت** -గష్త్ (పా) పరిహరము, పరిహారా, పహరాదిరుగుట, కావలి దిరుగుట. **سرمست** - మస్త్ (పా) మత్తుగొన్న, కైపెక్కిన, మదించిన. **سرمشق** -ఎ,మష్క్ (పా) ఒజ్జబంతి, వ్రాతమాదిరి, మేలుబంతి, చూచివ్రాయుటకై పెట్టినది. **سرمو** -ఎ,మూ (పా) వెంట్రుకకొనమాత్రము, వెంట్రుక మందము మాత్రము, లేశమాత్రము. **سرگوشی** -గోషీ (పా) కర్ణేజపము, చెవిగరచుట, రహస్యములాడుట, గుసగుసలు, చెవులో జెప్పుట. **سرنامه** -నామ (పా) వక్కణము, లేఖారంభము, నామబిరుదములు, బిరుదాంకములు; పైవిలాసము. **سرنگون** -నిగూన్ (పా) తలవంచిన, ముఖము వ్రాలవేసిన, సిగ్గుపడిన, భంగపడిన, దీనమైన; తలక్రిందైన; పల్లిమిరియము. **سرنو** -ఎ,నౌ (పా) పునరుద్ధారము, పునరారంభము, మరల మొదలుపెట్టుట. **از سرنو** -అజ్ సరెనౌ (పా) మగల మొదలిడి, నూతనారంభము. **سرنوشت** -నవిష్త్ (పా) లలాటలిఖితము, నొసటి వ్రాలు. **سراپا** -ఒ పా (పా) ఆపాదమస్తకము, నఖశిఖపర్యంతము, ఆసాంతము. **سروسامان** -ఒ సామాన్ (పా) పరికరములు, సాధనము, సామగ్రి, సంభారము, కావలసిన వస్తువులు.

**سر** సుర్ (హి.పు) సురుడు, దేవత.

**سر** సుర్ (హి.పు) సుతి, స్వరము, శ్రుతి;

రాగము; అచ్చు. (హల్లుకానిది) **سر ملانا** -మిలానా (హి) సుతిమేళగించుట, సుతి గలుపుట, ఒకవాద్యముధ్వనిని రెండవ వాద్యము ధ్వనితో కలుపుట. **اونچا سر** ఊంచా- (హి)ఉచ్చస్వరము. **دهیما سر** ధీమా- (హి) మధ్యమస్వరము. **نیچا سر** నీచా- (హి) నీచస్వరము,మంద్రస్వరము.

**سر** సర్ (హి.పు)ఒకరెల్లు, బాణములకుచువ్వలగా నుపయోగపడు రెల్లు; సరస్సు,తటాకము.

**سر** సిర్ర్ (అ.పు) రహస్యము, గుప్తము, గోప్యము. Sacrament.

**سرا** సరా (పా.పు) సత్రము, ధర్మశాల; గృహము, హర్మ్యము.

**سرا** సిరా (హి.పు) ఆరంభము,మొదలు,అంతము, కొన, కొస; మొ॥. **سرے سے** సరేసే (హి) ఆరంభమునుండి, మొదటినుండి. (మావులు.

**سراب** సరాబ్ (అ.పు)మరుమరీచిక,ఎండ

**سراپ** సరాప్ (హి.పు) శాపము, తిట్టు.

**سراج** సిరాజ్ (అ.పు) దీపము, దివ్వె; సూర్యుడు. **سراج القطوب** - ఉల్ కుతూబ్ (అ) మిణుగురుమొక్క, మిణుగురు పురుగువలె రాత్రియందు వెలుగుచుండు ఒక వనస్పతి.

**سرادھ** సరాధ్ (హి.పు) శ్రాద్ధము, తద్దినము, అపరకర్మలు.

**سراسر** సరాసర్ (పా) తుదామొదలు,ఆసాంతము, సమగ్రము, మొత్తముమీదగా మొదటినుండి కొనవరకును, చూచాయగా, ఉరమరగా, ఒకమాదిరిగా, సగటుగా.

**سراسری** సరాసరీ (పా.స్త్రీ) సంగ్రహము, సంక్షేపము; మధ్యస్థము,సగటు, ఉరమర, ఒకమాదిరి, మొత్తముమీద, సగటుమొత్తము.

**سراسیمگی** సరాసీమగీ (పా.స్త్రీ) కలవరము, దిగ్భ్రమ, అచ్చెరువు.

**سراسیمہ** సరాసీమ (పా)దిగ్భ్రమజెందిన, కలవరపడిన; నివ్వెరజెందిన.

**سراغ** సురాగ్ (పా.పు)అన్వేషణము,వెదకుట; చిహ్నము, గురుతు; జాడ, పోబడి, వేగులు. **سراغ رسانی** -రసానీ(పా) జాడదీయుట, పోబడి కనుగొనుట, రహస్యాన్వేషణము, వేగులుదీయుట. **سراغ لگانا** -లగానా (ఉ) జాడదీయుట, పోబడి కనుగొనుట.

**سراغی** సురాగీ (పా) చారుడు, రహస్యవేది, వేగులవాడు.

**سراگاے** సురాగాయె (హి.స్త్రీ) టిబెటు దేశమునందలి కుచ్చుతోకయావు.

**سرانا** సిరానా (హి) చల్లార్చుట, చల్లబడునట్లుజేయుట. (జీనుమస్థుడు.

**سراوگی** సరావగీ (హి.పు) శ్రమణకుడు,

**سراون** సరావన్ (హి.పు) గుంటక, దున్నినభూమిని చదరముజేయుసాధనము.

**سراہن** సరాహన్ (హి.పు) స్తోత్రము, గొప్పజేయుట, పొగడ్త.

**سراهنا** సరాహ్నా (హి) స్తోత్రముజేయుట, పొగడుట, శ్లాఘించుట. (శాల.

**سراے** సరాయె(పా.స్త్రీ)సత్రము, ధర్మ

**سرائی** సరాయీ (అ.స్త్రీ) గానము, పాడుట, (వృత్తియందు.) పఠనము.

**سرایت** సరాయత్ (అ.స్త్రీ)వ్యాపనము, ఒకవస్తువునుండి మరియొకదానికిఅంటుట, చొరుట, దూరుట,వ్యాపించుట.

**سرائندہ** సరాయింద (పా) పాటకుడు, గాయకుడు, స్తోత్రపాఠకుడు.

**سرب** సుర్బ్ (పా) సీసము, నాగము.

**سربھنگی** సర్‌భంగీ(హి.పు) వర్ణ వ్యవస్థను పాటించని ఒకజాతి బైరాగులు.

**سرپت۔سرپتا** సర్పత్-సర్పతా(హి.పు) ఒకజాతిరెల్లు.(దీనితో ఇండ్లకుకప్పుకొందురు)

**سرپٹ** సర్పట్(హి.స్త్రీ) వేగమైనపరుగు, నాలుగుకాళ్లపరుగు (గుఱ్ఱము). **سرپٹ پھینکنا** - ఫేంక్నా (హి) గుఱ్ఱము నాలుగుకాళ్లపరుగు వేయించుట, నాలుగు కాళ్లపరుగునపోవుట.

**سرپن** సుర్పన్ (హి)పొన్నచెట్టు, పున్నాగ వృక్షము.

**سرپھونکا** సర్‌ఫోంకా (హి) వెంపలిచెట్టు.

**سرت** సురత్ (హి. స్త్రీ)స్మృతి, జ్ఞాపకము, తలపు, ఆలోచన, శ్రద్ధ, మననము, జాగరూకత, మనసు. **سرت سے** -సే (హి) స్మృతిపూర్వకముగా, శ్రద్ధతో.

**سرتی** సుర్తీ (హి. స్త్రీ) సూరత్ ప్రదేశపు పొగాకు, తినుటకుపనికివచ్చుపొగాకు.

**سرجنا** సిరజ్నా(హి)సృజించుట,పుట్టించుట.

**سرچشمہ** సర్‌చష్మ (పా.పు) నీరూరు చోటు, ఊటస్థలము, ఉత్పత్తిస్థానము, మూలము; చెలమ.

**سرچنگ** సర్‌చంగ్(పా.స్త్రీ) ముడ్డిమీద తన్నుట, తన్ను, వెడలనడచుట, పారద్రోలుట; తన్నిపంపుట; కష్టము.

**سرخ** సుర్ఖ్ (పా) ఎఱ్ఱని, రక్తవర్ణముగల. **سرخ بادہ - سرخ رو** -బాద (పా) -రూ (పా) గౌరవముగలవాడు, కృతార్థుడు, జయమందినవాడు. **سرخ روئی** -రూయీ (పా) జయము, గౌరవము, కృతార్థత, కీర్తి. **سرخ سفید** - సఫేద్ (పా) ఎఱ్ఱగా ఫుల్లగానున్న, అందమైన, అంగముబొద్దుగానున్నవాడు. **سرخ ہونا** -హోనా (ఉ) ఎఱ్ఱబడుట; పండుపారుట; మాగుట; సిగ్గుపడుట;ఆగ్రహపడుట, జేవురించుట.

**سرخاب** సుర్‌ఖాబ్ (పా,పు) ఎఱ్ఱనీళ్లు; హంసవంటిపక్షి; పెద్దబాతు; పక్షివిశేషము **سرخاب کا پر لگنا** - కాపర్ లగ్నా (ఉ) ఘనకార్యముజేయుట, గొప్ప వాడగుట. **سرخاب کا پر ہونا** - కాపర్ హోనా (ఉ) గర్వించుట, గర్వపడుట.

**سرخواب** సర్‌ఖాబ్ (పా) నిద్రారంభము, నిద్రమొదలు, మొదటినిద్ర.

**سرخط** సర్‌ఖత్ (పా.పు) వ్రాతమూలకము, ఒడంబడికపత్రము, పత్రము, చెల్లుచీటి.

**سرخی** సుర్‌ఖీ (పా. స్త్రీ) ఎఱ్ఱదనము, రక్తిమము; ఇటుకపొడి. (ఇదిసున్నములో కలిపి గచ్చుజేయుదురు.) **سرخی مائل** -మాయిల్ [పా]కొంచముఎఱ్ఱగానున్న.

**سرد** సర్ద్ (పా) చల్లని, చల్లగానున్న, శీతలము, తడిగానున్న, చెమ్మగల; ఉష్ణము లేని; మైత్రిలేని, ప్రేమలేని. **سرد مہری** -మెహ్రీ (పా. స్త్రీ) ప్రేమలేనిస్నేహము, నామమాత్రమైత్రి, నామమాత్రస్నేహము, మాటకుమాత్రమున్నస్నేహము. **سرد مہر** -మెహ్ర్(పా)మైత్రిలేనిమిత్రుడు, నామమాత్రమిత్రుడు, పేరునకుమాత్రము స్నేహితుడు.

**سردا** సర్దా(హి.పు)కాబూలుదేశపు పుచ్చ (పండు.

**سردآبہ** సర్దాబ (హి. పు) చలినీళ్ల స్నానము, శీతలోదక స్నానము; శీతోదక స్థానము, నీళ్లు చల్లగా నుంచుచోటు; శీతగృహము, ఎండకాలములో చల్లగా నుండునట్లు ఏర్పరచిన గృహము. నేలమాళిగ; మిత్రము, స్నేహితుడు.

**سردار** సర్దార్ (పా. పు) నాయకుడు, పెద్ద; ప్రభువు, ప్రముఖుడు, యజమాని.

**سردارنی** సర్దానీ (పా. స్త్రీ) నాయిక, యజమానురాలు.

**سرداری** సర్దారీ (పా. స్త్రీ) నాయకత్వము, ప్రభుత్వము, యజమానిత్వము, పాలనము, పరిపాలనము.

**سردانا** సర్దానా (హి) చల్లబడుట, పేరు (క్రొనుట.

**سردی** సర్దీ (హి. స్త్రీ) చల్లదనము, శైత్యము; నెమ్ము, తేమ; జలుబు, పడిసెము; **سردی بائی** -బాయీ (హి) వాతపుపట్లరోగము, కీళ్లు పట్టుకొను రోగము. **سردی پڑنا** -పడ్నా (హి) చలి పెట్టుట. **سردی ہونا** -హోనా (హి) పడిసెము పట్టుట, జలుబు చేయుట.

**سرس** సిరస్ (హి. పు) శిరీషవృక్షము, దిరిసెనపుచెట్టు.

**سرسام** సర్సామ్ (పా. పు) సన్నిపాతము, దోషించుట, రోగముతో దోషగుణము.

**سرسرانا** సుర్ సురానా (హి) ప్రాముఃప్వను ధ్వనియగుట; పాకుట, సురసుర లేక సరసరయను చప్పుడగుట.

**سرسری** సుర్ సురీ (హి) పాకుధ్వని, కదలిక, సరసర లేక సురసురమను చప్పుడు.

**سرسوتی** సరస్వతీ (హి) విద్యాధిదేవత, సరస్వతి.

**سرسوں** సరసోఁ (హి. స్త్రీ) పెద్దఆవాలు, (తెల్లఆవాలు.

**سرشار** సర్ షార్ (పా) సంపూర్ణము, పూర్తిగానిండినది, పొరలిపోవునట్లు నిండినది; మత్తెక్కిన.

**سرش** సిరిష్ (పా) జిగట, అంటు. (హి) దిరిసెనపుచెట్టు, శిరీషవృక్షము, తెల్ల దిరిసెనచెట్టు,

**سرشت** సరిష్త్ (పా. స్త్రీ) మిశ్రము, స్వభావము, ప్రకృతి, నైజము.

**سرشتہ** సిరిష్త (పా. పు) దారపుకొన, దారము కొస, పురికొన, పురికొస; సంబంధము, వరుస, క్రమము; నియమము, వాడుక, నడవడి; ఆచారము, సాంప్రదాయము; రాజ్యాంగము, రాజ్యాంగశాఖ. **سرشتہ دار** -దార్ (పా) శాఖాధిపతి, ప్రధానలేఖరి.

**سرشف** సర్షఫ్ (పా. పు) ఆవాలు, సర్షపము,

**سرشک** సిరిష్క్ (పా. పు) కన్నీటిచుక్క, అశ్రుబిందువు; చుక్క, బిందువు; మిణుగురు.

**سرطان** సర్తాన్ (అ. పు) కర్కాటకరాశి; కర్కాటకము, ఎండ్రకాయ; పశువుల మెత్తగాళ్లు లేక కాలిపుండ్లు.

**سرعت** సుర్అత్ (అ. స్త్రీ) త్వర, వేగము, వడి, బువ్వడి.

**سرغنہ** సర్ గన (పా. పు) నాయకుడు; ప్రముఖుడు, సాటిలేనివాడు; గొప్ప, పెద్ద.

**سرفن** సుర్ ఫన్ (ద) పొన్నచెట్టు.

**سرفہ** సుర్ ఫ (పా. పు) దగ్గు, కాసము.

**سرقہ** సర్క (అ. పు) దొంగతనము, చౌర్యము.

**سرکار** సర్ కార్ (పా. స్త్రీ) రాజ్యాంగసభ, దొరతనమువారు; కార్యాధిపతి, పెద్ద, ప్రభువు, యజమాని; కార్యస్థానము, దొరతనము; గౌరవనామము.

**سرکانا** సర్కానా (హి) జరుపుట,తొలగించుట, నెట్టుట, త్రోవజేయుట,ప్రక్కకు దీయుట.

**سرکش** సర్కష్ (పా) తలబిరుసు, తలపొగరుగల, తిరుగబడెడు, మరలబడెడు, అవిధేయుడైన, నీతిబాహ్యమైన.

**سرکشی** సర్కషీ (పా. స్త్రీ) తలబిరుసుదనము, తలపొగరుతనము.

**سرکنا** సరక్నా (హి) జరగుట, తొలగుట, ఒదుగుట, తోవనిచ్చుట, ప్రక్కకు పోవుట, జారుట.

**سرکنڈا** సర్కండా (హి.పు) రెల్లు.

**سرکنگبین** సిర్కంగబీన్ (పా) మధ్వామ్లము చూడు **سکنجبین**

**سرکہ** సిర్కా (పా.పు) పులుసు, కాడి, పుల్లనీళ్లు. **سرکہ انگوری** -ఎ,అంగూరీ (ఉ) ద్రాక్షపులుసు,ద్రాక్షపుల్లనీళ్లు. **سرکہ بوت** -ఎ,బూట్ (ఉ) శెనగ పులుసు. **سرکہ نخود** -ఎ,నఖూద్ (ఉ) శెనగ పులుసు. **سرکہ تاڑی** -ఎ,తాడీ (ఉ) తాటికల్లు కాడి, తాటి పులుసు. **سرکہ سیندھی** -ఎ, సేందీ(ఉ)ఈతకల్లుకాడి.

**سرکی** సిర్కీ(హి.స్త్రీ) రెల్లుతడక,తడకతెఱ.

**سرگ** సరగ్ (హి.పు)స్వర్గము,స్వర్గలోకము. **سرگ باسی** -బాసీ (హి)స్వర్గస్థుడు, చచ్చినవాడు.

**سرگشتگی** సర్గష్తగీ (పా.స్త్రీ) నివ్వెఱ, దిగ్భ్రమ; తలదిమ్ము, తలదిరుగుడు; భ్రమరితనము; దుఃఖము, కష్టము.

**سرگشتہ** సర్గష్త (పా) నివ్వెఱబోయిన, దిగ్భ్రమజెందిన; తలదిమ్ముబట్టిన, తలదిరుగుచున్న; దుఃఖితమైన, కష్టములోనున్న.

**سرگم** సర్గమ్ (హి.స్త్రీ) సరిగమలు, సప్తస్వరములు. (యము.

**سرگین** సర్గిన్ (పా.పు) ఆవుపేడ, గోమ

**سرما** సర్మా (పా.పు) చలికాలము, శీతకాలము.

**سرل** సరల్ (హి.పు) దేవదారుచెట్టు. **سرل کی گوند** -కీగోంద్ (హి) దేవదారుపిసును, గందబరోజా, దేవదారు బంక.

**سرمائی** సర్మాయీ (పా.స్త్రీ)చలికాలపు దుస్తులు.

**سرمایہ** సర్మాయా (పా.పు) మూలధనము, మొదలు,సంచికట్టు;సంచితము, సాధనము; సామగ్రి, సాధనసంపత్తి.

**سرمد** సర్మద్(అ)శాశ్వతము,నాశము లేనిది.

**سرمغزن** సరేమగ్జన్(పా.పు)సంకటము, కష్టము, ఎటుమతోచనిస్థితి, కలవరము.

**سرمہ** సుర్మ (పా.పు) కాటుక, కజ్జలము; మిగుల మెత్తగానలిగినది. **سرمہ دانی** -దానీ (పా) కాటుకకాయ. **سرمہ کا پتھر** -కాపత్థర్ (హి) అంజనపురాయి, కాటుకరాయి. (తెలుపువన్నెగల.

**سرمئی** సుర్మయీ (పా) నలుపు గలిసిన

**سرنا** సర్నా - సుర్నా (పా.పు) బూరగ, సన్నకొమ్ము. (వాద్యము) చూర్ణాలు.

**سرنام** సర్నామ్(పా)ప్రసిద్ధమైన,ప్రఖ్యాతిగల, పేరుపొందిన.

**سرنائی** స(సు)ర్నాయీ(పా.పు)సాన్నాయి వాయించువాడు, సానాయి పాడువాడు, మేళగాడు.

**سرنج** సిరంజ్ (పా) సింధూరము.

**سرنگ** సురంగ్ (హి.స్త్రీ) సురంగము, భూమిలోపలి మార్గము; మంచివన్నెగల గుఱ్ఱము.(బాదామువన్నె.) **سرنگ لگانا**

-లగానా (హి) బర్మాగొట్టుట,సురంగము త్రివ్వుట. سرنگ اڑانا -సురంగ్ - ఉడానా (హి) సురంగములో తుపాకిమందు పెట్టి కాల్చివేయుట, బర్మాలుకాల్చుట.

سرنگیا సురంగియా (హి.పు) సురంగములు త్రివ్వువాడు, బర్మాలుకొట్టువాడు.

سرو సరూ (పా.పు) సరుపుచెట్టు, చీకటిమాను, పుడకమ్రాను. سرو اندام -అందామ్ (పా) అవయవసురూపత్వము గలయాడుది. అందమైనయాడుది. سرو قد -కద్ (పా) ఎత్తరియై పొంకముగానున్న యాడుది.

سروا సుర్వా (హి.పు) చెరువు, కొయ్యగరిటె. (తెడ్డు.

سروال సర్వాల్ (అ.పు) లాగు, పొడుగు చల్లడము.

سروپ స(సు)రూప్ (హి.పు) అందమైన ముఖము లేక రూపముగలవాడు.

سروتا సరోతా (హి.పు) అటకొత్తు, పోకొత్తు.

سرود సురోద్ (పా.పు) పాట, గానము, రాగము.

سرودی సురోదీ (పా.పు) గాయకుడు, (పాటగాడు.

سرور సురూర్ (అ.పు) సంతోషము, ఆనందము; మత్తు, లాహిరి.

سرور సర్వర్ (పా.పు) నాయకుడు, ప్రభువు. سرور کائنات -ఎకాయినాత్ (పా) సృష్టి నాయకుడు, సృష్టి భూతములకెల్ల నాయకుడు, హజరతు మహమ్మదుగారి బిరుదనామము.

سروری సర్వరీ (పా. స్త్రీ) నాయకత్వము, ప్రభుత్వము, పాలనము, అధికారము.

سروش సరోష్ (పా.పు) దేవత, సురుడు.

سروکار సరోకార్ (పా.పు) సంబంధము, వ్యవహారము, జోక్యము.

سرہانا సిర్హానా (హి.పు) తలాపి, మంచము యొక్కగాని సమాధి యొక్కగాని తల తట్టు; తలకడ; తలగడ.

سرہنگ సర్హంగ్ (పా.పు) సేనానాయకుడు, నాయకుడు; కొలిబంటు; తలబిరుసువాడు, పోకిరి, అవిధేయుడు; బలిష్ఠుడు; ఓడనడపువాడు, నాకానాయకుడు.

سری సిరీ (హి. స్త్రీ) శ్రీ; సిరి, లక్ష్మి. سری پھل -ఫల్ (హి.పు) మారేడుపండు.

سری సరీ (పా.పు) నాయకత్వము, అధికారము, పెత్తనము.

سری సిడీ (హి) పిచ్చి, వెర్రి, వెఱ్ఱి.

سریا సరియా (హి.పు) వెండి లేక బంగారు సరిగచేయు రెల్లుకునక.

سریانا సర్యానా (హి) సవరించుట, అమర్చుట. చక్కబెట్టుట; కట్టిపెట్టుట.

سریر సరీర్ (హి.పు) శరీరము, దేహము.

سریری సరైరీ (హి. స్త్రీ) సున్నముగొట్టుట, వెల్లవేయుట.

سریش సరీష్ (పా.పు) అంటు, జిగురు; గంజి, గంజిబిగువు, బట్టలకుబెట్టుగంజి,

سریع సరీఉ (అ) వడిగల, త్వరితము, వేగముగల, త్వరగల, శీఘ్రపు. سریع التاثیر -ఉత్ తాసీర్ (అ) త్వరగా గుణము నిచ్చునది. سریع لزوال -ఉజ్ జవాల్ (అ) త్వరగా నశించిపోవునది. سریع الفہم -ఉల్ ఫహ్మ్ (అ) త్వరగా తెలిసికొనువాడు,

سریکا-سریکھا సరికా - ఖా (హి) పోలి, వలె, సమానముగా, అట్లే, సామ్యముగలిగి, (ఇది సామ్యమును దెలుపు ప్రత్యయము.)

سریلا-سریلی సురీలా—లీ (హి) సుస్వరమైన, మంచిధ్వనిగల.

سرین సురీన్ (పా.పు)పిరుదులు, తొడలు, తొంట్లు.

سڑ సిడ్ (హి) పిచ్చి, వెఱ్ఱి.

سڑا సిడా (హి) పిచ్చిగల, వెఱ్ఱిపట్టిన.

سڑا సడా [హి] మురిగిన, కుళ్ళిన, చెడిన; చీముపట్టిన. (వేయుట.

سڑانا సడానా (హి)మురగబెట్టుట, కుళ్ళ

سڑاند సడాంద్ (హి. స్త్రీ) మురుగుడు; కుళ్లుకంపు, దుర్గంధము.

سڑپنا సుడప్నా (హి) కొంచెము కొంచముగా పీల్చుట, పీల్చిపీల్చితాగుట, పీల్చుకొనుట.

سڑک సడక్ (హి. స్త్రీ) బాట, వీధి.

سڑکنا సుడుక్నా (హి) గుటుకున త్రాగుట.

سڑکی సడ్కీ (హి. స్త్రీ) గాలిపడగదారమును తటాలున సళ్లువిడుట.

سڑن సడన్ (హి. స్త్రీ) మురుగుడు; కుళ్లుకంపు, దుర్గంధము.

سڑن సిడన్ (హి. స్త్రీ) పిచ్చిది. (ఆడుది.)

سڑنا సడ్నా (హి) మురుగుట, కుళ్లుట, కంపుపట్టుట.

سڑی సిడీ (హి) పిచ్చియెత్తిన, వెఱ్ఱిపట్టిన.

سڑی کسوندی సడీకసోందీ (హి) కాసమర్దకము, తరగచెట్టు, నూతికసింద, పైడితంగేడు.

سڑیل సడియల్ (హి) మురిగిన, కుళ్ళినకంపుబట్టిన, పనికిమాలిన.

سزا సజా (పా. స్త్రీ) శిక్ష, దండన. سزا دینا -దేనా (ఉ) శిక్షించుట, దండించుట. سزایاب -యాబ్ (పా) శిక్షార్హమైన, దండింపదగిన. سزایافتہ -యాఫ్తః [పా] శిక్షితుడు, ఇదివరలో శిక్షపొందియున్నవాడు, ప్రాతనేరస్థుడు.

سزاوار సజావార్ (పా)అర్హము, తగినది, యోగ్యము.

سزاول సజావల్ (తు.పు) పన్ను రాబట్టువాడు, సుంకరి; పైవిచారణజేయువాడు, నాయకుడు.

سس సిస్ (హి.పు) శిష్యుడు, అనుచరుడు,

سسا ససా (హి.పు) శశము, కుందేలు.

سست సుస్త్ (పా) సోమరియైన, అలసుడైన, ప్రాలుమాలెడు, ఆలస్యముజేసెడు, మాంద్యముగల, చురుకులేని, దుర్బలమైన, మందమైన, మెల్లని, వడిలేని, నీరసమైన, నీరసముగానున్న, విచారముగల, చింతగలిగినట్లు, జడ్డుగల.

سستا సస్తా (హి) చౌకయైన, వెల కురుచయైన, వెలసరసమైన.

سستانا స(సు)స్తానా (హి) విశ్రాంతిగొనుట, విశ్రమించుట, సేదదీర్చుకొనుట, పడుకొనుట.

سستی సుస్తీ (పా. స్త్రీ) జాడ్యము, ఆలస్యము, సోమరితనము, ఆలసము, మాంద్యము, నీరసము, మందము.

سسرا - سسر ససుర్ - సుస్రా (హి,పు) పిల్లనిచ్చినమామ, భార్యతండ్రి; ఒకతిట్టు.

سسرار - سسرال సుస్రార్-ల్(హి.పు) అత్తగారిల్లు, మామగారియిల్లు. سسرال کا - కా కుత్తా(హి) అత్తింటపడితినువాడు.

سسری సుస్రీ (హి. స్త్రీ) అత్త, భార్యతల్లి; ఒకతిట్టు. (పాము)

سسکارنا సుస్కార్నా (హి) బుసగొట్టుట.

سسکنا సిసక్నా (హి) ఎగఊపిరి తీయుట, ఎగఊశ్వాసదీయుట, నిట్టూర్పువిడుచుట, ఎగరోజుట, ఎగఊశ్వాసముపుట్టుట; కుక్కను ఉసికొలుపుట.

**سسکی** సిస్కీ (హి. స్త్రీ) నిట్టూర్పు, ఎగరోజు, ఎగరొప్పు. **سسکی بھرنا** - భర్నా (హి) నిట్టూర్పు విడుచుట, ఎగరోజుట, ఎగరొప్పుట.

**سسیل** సుసీల్ (హి) సుశీలయుగల, సభ్యుడైన, మర్యాదగల.

**سطح** సతహ్ (అ. స్త్రీ) పైభాగము, ఉపరిభాగము, వెలుపలిభాగము, చదరము; మిద్దెకప్పు, చదరమైనకప్పు, చదరమైనఅరుగు.

**سطر** సతర్ (అ. స్త్రీ) రేఖ, గీత; పంక్తి, వరుస. **سطر بندی** - బంది (ఉ) గీట్లు గొట్టుట, గీతలుగీయుట, వ్రాయుటకైన గీట్లు.

**سطل** సత్ల్ (అ. స్త్రీ) విత్తడికాగు, రాగిలేక విత్తడి తాంబాళము, రెండుచెవులతాంబాళము.

**سطوت** సత్‌వత్ (అ. స్త్రీ) అధికారము, బలము, సామర్థ్యము; రాజసము, ప్రభావము, గాంభీర్యము.

**سطور** సుతూర్ (అ. స్త్రీ) గీతలు, రేఖలు, పంక్తులు. (ఏ.వ. سطر) **- بین السطور** బైనుస్సుతూర్ (అ) పంక్తులమధ్య, పంక్తుల మధ్యభాగము, రేఖాంతరము.

**سعادت** సఆదత్ (అ. స్త్రీ) శుభము, మంగళము, సంతోషము, కల్యాణము. **سعادت مند** -మంద్ (పా) శోభనవంతము, అదృష్టవంతుడు, సజ్జనుడు, నీతివర్తనముగల. **سعادت مندی - سعادت** మందీ (అ) కల్యాణము, అభివృద్ధి, సౌజన్యము, నీతివర్తనము.

**سعد** సఽద్ (అ. పు) సంతోషము, కల్యాణము, శుభము, వృద్ధి.

**سعی** సఈ (అ. స్త్రీ) ప్రయత్నము, యత్నము; పరిశ్రమ, శ్రమ, శ్రద్ధ, జాగరూకత.

**سعیر** సఈర్ (అ. స్త్రీ) అగ్ని, నరకాగ్ని; తురకల నరకలోకములో విగ్రహారాధనజేయు వారికై యేర్పరుపబడిన భాగము.

**سفارت** స-సు-సిఫారత్ (అ. పు) రాయబారితనము, సంధికలుపుట, రాయబారము, మాధ్యస్థము, గ్రంథరచన.

**سفارش** సిఫారిష్ (పా. స్త్రీ) శ్లాఘన, మెచ్చ జెప్పుట, యోగ్యతజూపుట, యోగ్యుడని జెప్పుట. **سفارش کرنا** - కర్నా (ఉ) యోగ్యుడని జెప్పుడు.

**سفارشی** సిఫారిషీ (పా) ఒకరిచే యోగ్యుడని చెప్పబడిన, మొగమోటమువాడు, మొగమోటస్థుడు. **سفارشی ٹٹو** - టట్టూ (ఉ) మొగమోటముచేత యుంచుకొనబడిన వాడు, పనికిమాలినవాడు.

**سفاک** సఫ్‌ఫాక్ (అ. పు) రక్తపాతము కలిగించువాడు, కటికవాడు, క్రూరుడు.

**سفال** సిఫాల్ (పా. పు) మట్టిపాత్ర, పెంకు, గూన, గూనపెంక; కుండ, కుండపెంకు.

**سفالی** సిఫాలీ (పా) మట్టిసం॥, భూమిసం॥, మట్టితోజేసిన.

**سفانت** సిఫానత్ (అ. స్త్రీ) నౌకావిద్య, నావికత్వము, నావనుజేయుట, నావనునడపుట.

**سفاہت** సఫాహత్ (అ. స్త్రీ) బుద్ధిహీనత, తెలివిమాలినతనము, అజ్ఞానము, అవివేకత.

**سفت** సఫ్‌త్ (పా. స్త్రీ) విదాహము, ఎంత త్రాగిననుదప్పికతీరకపోవుట, అతిదాహము.

**سفتہ** సుఫ్‌త (పా) రంధ్రముజేసిన, పొడిచిన, తూటుపొడిచిన, వేధితము.

**سفر** సఫర్ (అ.పు) ప్రయాణము, యాత్ర. **سفر خرچ** - ఖర్చ్ (పా) త్రోవబత్తెము, బాట బత్తెము, యాత్ర వ్యయము, బాట వెచ్చములు. **سفرنامہ** - నామ (పా) యాత్రచరితము,యాత్రవృత్తాంతము. **سفر دریائی** - దర్యాయీ (పా) సముద్ర యానము, ఓడప్రయాణము.

**سفرجل** సఫర్ జల్ (అ.పు) సీమదాడిమ. **سفرجل ہندی** - హిందీ(పా)మారేడుపండు

**سفرہ** సుఫ్ర (అ.పు) భోజన పాత్ర, భోజన వస్త్రము, విస్తరియాకు, భోజనము జేయు టకై పరచినది. (అదియేవస్తువైననుసరే)

**سفری** సఫ్రీ (అ.పు) ప్రయాణసంభారము, యాత్రాసామగ్రి; జామపండు. **سفری آم** - ఆమ్ (పా) జామపండు.

**سفل** సుఫ్ల్ (అ.పు) అధమము, నీచము, హీనము, తుచ్ఛము; నీచస్థితి, తగ్గియుండుట, తగ్గుదశ, హైన్యము, నైచ్యము; అవమానకరము; చెత్త, పెంట, చెత్తచెదారము.

**سفلہ** సిఫ్ల (అ) హీనము, తుచ్ఛము, అధమము, నీచము. **سفلہ پن** - పన్ (ఉ) హైన్యము, నైచ్యము, నీచత్వము. **سفلہ خو** - ఖూ (పా) నీచస్వభావముగల, హీనస్వభావముగల, తుచ్ఛస్వభావముగల,

**سفلی** సిఫ్లీ (అ) అధమము,నీచము,హీనము, తుచ్ఛము.

**سفوف** స-సుఫూఫ్ (అ.పు)పొడి, చూర్ణము.

**سفید** సు-సఫేద్ (పా) తెల్లని, ధవళము. **سفید پوش** -పోష్ (పా) తెల్లదుస్తులు ధరించువారు,కలవారు,ధనవంతులు. **سفید پان کی جڑ** - పాన్ కీ జడ్ (హి) పెద్ద దుంపరాష్ట్రము. **سفید تربد** -తుర్బుద్ (హి) తెల్లతెగడవేరు, (పట్టు) **سفید توتا** -తూత(హి)పాలతుత్తము, **سفید تلسی** -తుల్సీ(హి) తెల్లతులసి,కుక్కతులసి **سفید تھوتھا** -థూథా(హి)పాలతుత్తము **سفید چمنی** - చమ్నీ (హి) జలప్రిమ్మి, సాంబ్రాణిఆకుచెట్టు. **سفید چندن** -చందన్ (హి) గంధపుచెక్క, శ్రీగంధము, **سفید ڈامر** - డామర్ (హి)ధూపదామరు,తెల్ల దామరు. **سفید جام** - జామ్ (ఉ) తెల్ల జామిపండు. **سفید سفری آم** -సఫ్రీ ఆమ్(ఉ) తెల్లజామిపండు. **سفید سنبل** - సుంబుల్ (ఉ) తెల్లపాషాణము, ఉల్లిపాషాణము. **سفید سنبھالو** - సంభాలు (హి)నీరువావిలి. **سفید سورہ مچھی** -షోరామచ్ఛీ (ఉ) తెల్లసొఱచేప **سفید کتھا** - కత్థ (హి) గడ్డకాచు, తెల్లకాచు, ముద్దకాచు. **سفید کیکر** -కీకర్ (హి) తెల్ల తుమ్మచెట్టు. **سفید مدھ** - మద్ (హి) తెల్లపురుగుడుచెట్టు. **سفید موسلی** - ముస్లీ (హి) నల్లగడ్డలు, పిల్లిపీచరగడ్డలు.

**سفیدہ** సఫేద (పా)తెల్లపూతరంగు, సీసభస్మము, నాగభస్మము.

**سفیدی** సఫేదీ (పా.స్త్రీ) తెల్లదనము,ధావళ్యము, తెలుపు, సున్నపుపూత; వెలుతురు; గ్రుడ్డులోని తెల్లభాగము.

**سفیر** సఫీర్ (అ.పు) రాయభారి, మాధ్యస్థము చేయువాడు,మధ్యస్థుడు,సంధిచేయువాడు.

**سفینہ** సఫీన (అ.పు) పడవ, ఓడ; న్యాయస్థానమునుండివచ్చినపిలుపు; పిలుపుపత్రము.

سفیہ సఫీహ్ (అ) బుద్ధిహీనుడు, తెలివిమాలిన వాడు, వెఱ్ఱివాడు.

سقہ۔سقا -సిక-కా (అ.పు) పెద్దమనిషి, స భ్యుడు; నమ్మకస్థుడు,

سقاء సక్ కా (అ.పు) నీళ్లవాడు, నీళ్లుమోయువాడు.

سقاوہ సకావ (అ.పు) స్నానశాల, చలినీళ్లస్నానమునకనుకూలమైనచోటు.

سقر సకర్ (అ.పు) నరకము سقرمقر -మకర్ (అ) నరకవాసి, నరకమందుండువాడు.

سقط సక్త్ (అ.పు) స్ఖలితము, జారినది, తప్పు, పొరపాటు, స్ఖాలిత్యము, భ్రంశము.

سقف సక్ఫ్ (అ. స్త్రీ) ఇంటికప్పు, మిద్దె; చాందినీ; ఆకాశము; మంచము, మంచె.

سقم సుకుమ్ (అ.పు) లోపము, అవగుణము, దోషము. (లము.

سقفی సక్ఫీ [అ.పు] దూలము, కడి, పిల్లదూ

سقمونیا సక్మూనియా (యూ.పు) మామూదబంక, మామూదపిసును, శకిమూనబంక.

سقنقور సకంకూర్ (అ.పు) మెట్టమొసలి.

سقیم సకీమ్ (అ) రుగ్మతగల, రోగి; దుర్బలుడు, అశక్తుడు. (వాడు.

سقہ సక్క (అ.పు) నీళ్లవాడు, నీళ్లుమోయు

سکات సుకాత్ (అ. స్త్రీ) మౌనము, నిశ్శబ్దము.

سکار సకార్ (హి) బరాతము-చీటీనిఒప్పుకొనుట, బరాతముచీటిచెల్లుట.

سکارنا సకార్నా (హి) బరాతము-చీటీనిఒప్పుకొనుట, బరాతముచీటీనిమన్నించుట.

سکاک సక్కాక్ (అ.పు) కత్తులకమ్మరి, కత్తులుచేయువాడు, కత్తులవాడు.

سکال సకాల్ (హి.పు) సకాలము, మంచి ముహూర్తము, ఉదయము, ఋతువు, ఒక వస్తువుపుష్కలముగాదొరకుకాలము, సుగ్గి.

سکان సుక్కాన్ (అ.పు) చుక్కాని, ఓడనిటునటు మరల్చుసాధనము; పతువారము; నివాసులు, నివసించియుండువారు (ఏ.వ. ساکن)

سکان گیر -సుక్కాన్ గీర్ (పా) చుక్కానిత్రిప్పువాడు.

سکتر సికత్తర్ (ఇం.పు) కార్యదర్శి, కార్యనిర్వాహకుడు.

سکتہ సక్త (అ.పు) మౌనము, నిశ్శబ్దము; మూర్ఛ, అపస్మారము సొమ్మ. سکتہ ہونا -హోనా (ఉ) మూర్ఛిల్లుట, మూర్ఛపోవుట, సొమ్మవచ్చుట.

سکتا సుక్తా (హి) కుచించిన, బక్కని, బక్కపడిన, కృశించిన, సన్నగిలిన, ఎండిపోయిన.

سکر సుక్ర్ (అ.పు) మత్తు, కైపు, ఒడలుమరచుట, మద్యము, మత్తుపదార్థము, మత్తుపానీయము,

سکر సుక్కర్ (అ) చక్కెర. سکرالعشر సుక్కరుల్ ఉషర్ (అ) సీమమందారపాలు.

سکڑا۔سکڑی సక్డా-డ్డీ (హి) ఇరుకైన, సంకుచితమైన, ముడుచుకపోయిన, బిగువైన, చిన్న, చాలని.

سکرات సక్రాత్ (అ. స్త్రీ) స్మృతితప్పుట, అపస్మారము, సొమ్మ, శోష, మరణవేదన, మరణావస్థ. سکرات موت -ఎ, మౌత్ (అ) మరణశోష, ప్రాణోత్క్రాంతి మణావస్థ, మరణవేదన, మరణావస.

**سکڑا** సుక్డా (హి) శుష్కించిన, కృశించిన, సంకుచితమైన,ముడతలుపడిన, ముడుచుకపోయిన, సన్నగిలిన.

**سکڑنا** సుకడ్నా (హి) శుష్కించుట, కృశించుట, సంకుచితమగుట, ముడుచుకపోవుట, సన్నగిలుట.

**سکڑدادا** సకడ్ దాదా (హి.పు) ముత్తాత, తాతతండ్రి, పెత్తాత, తాతతాత.

**سکشا** సిక్షా (హి.స్త్రీ) శిక్ష, నేర్పుట, పాఠనము.

**سکن** సకన్ (అ.పు) నివసించువారు, ఉండువారు, నివాసులు, (ఏ.వ ساکن) నివాసము, గృహము, ఇల్లు; ఇంటివారు, కుటుంబమువారు.

**سکنا** సక్నా (హి) శక్తిగలిగియుండుట.

**سکنا** సిక్నా (హి) వేయింపబడుట,వేగుట,

**سکنات** సక్నాత్ (అ) చూడు (ఏ.వ سکنت).

**سکنت** సకనత్ (అ.స్త్రీ) ఆపుదల, నిలకడ, విరామము, అచ్చుకలియక కేవలము హల్లుగానేయుండుట, పొల్లుగలిగియుండుట.

**سکنجبین** సికంజబీన్ (పా) నిమ్మపండ్ల రసముగాని ఇతరపులుపునుగాని చక్కెరలోనో తేనెలోనో కలిపిచేసిన మధుర పదార్థము, మధ్వామ్లము, చక్కెరపులుసు, తేనెపులుసు,

**سکوار** సుక్ వార్ (హి) కోమలము, సుకుమారము, సున్నితమైన, సూక్ష్మమైన;మృదువైన, దుర్బలమైన.

**سکوت** సుకూత్ (అ.స్త్రీ) మౌనము. నిశ్శబ్దము, శాంతి, నిమ్మళము, విరామము, విశ్రాంతి. (సానిక.

**سکورہ** సుకూర (పా.స్త్రీ) మట్టికంచము,

**سکوری** సుకూరీ (పా.స్త్రీ) మట్టిసానిక, చిన్నసానిక, చిన్నమూకుడు.

**سکوڑنا** సకోడ్నా (హి) అవయవములు ముడుచుకొనుట, సంహరించుకొనుట, సంకుచితమగుట, ముడుచుకొనిపోవుట, బిగుసుకపోవుట.

**سکون** సుకూన్ (అ.పు)నిమ్మళము, శాంతి, నెమ్మది, విరామము, నిలుకడ, ఆపుదల, అచ్చుకలియకుండుట, పొల్లుగలిగియుండుట, పొల్లక్షరము.

**سکونت** సుకూనత్ (అ.స్త్రీ) శాంతి, విరామము, నిమ్మళము; వాసము, నివాసము; గృహము, ఇల్లు.

**سکھ** సిఖ్ (హి.పు)గురునానకుగారిశిష్యుడు, సిక్కుజాతివారు, పాంచాలదేశీయులు.

**سکہ** సిక్క (అ.పు) ముద్ర, అచ్చు; అచ్చుమూస, పోతమూస; గురుతు, చిహ్నము; నాణెము, **سکہ بٹھانا** సిక్క - బిఠానా (ఉ) అధికారముస్థాపించుట, లోపరచుకొనుట, అధికారముచెల్లించుట, తననాణెముచెల్లించుట. **سکہ جعلی** సిక్క - జాలీ (అ) కృత్రిమనాణెము. **سکہ چہرہ شاہی** సిక్క - యె చహ్రాషాహీ (ఉ) రాజరూప్యము, రాజుముఖముగలనాణెము,ఆంగ్లరూప్యము, ఇంగ్లీషురూపాయి. **سکھ درسن** సుఖ్-దర్సన్ (హి) లక్ష్మినారాయణచెట్టు, విషముంగలిచెట్టు, కేసరిచెట్టు.

**سکھ** సుఖ్ (హి.పు) సుఖము, సౌఖ్యము, విశ్రాంతి, సంతోషము.

**سکھانا** సుఖానా (హి) ఎండించుట,శుష్కింపజేయుట, ఎండగట్టుట,కృశింపజేయుట, ఎండబెట్టుట.

**سکھلانا-سکھانا** సిఖానా-సిఖ్లానా(హి) శి

క్షించుట, నేర్పుట, బుద్ధిజెప్పుట, సుశిక్షితునిజేయుట.

**سکھدرشن** సుఖ్ దర్శన్ (హి.పు) ఒకఓషధి. (వీనిరసము చెవిపోటునకు ఉపయోగింతురు)

**سکھر** సిఖర్ (హి.పు) శిఖరము, పైభాగము, కొన, కొస; కావడిచిక్కములు, కావడిచేర్లు.

**سکھی** సఖీ(హి.స్త్రీ) సఖి, చెలికత్తె, ఆడువేషముతోనుండు ఒకతెగపకీరులు.

**سکھی** సుఖీ (హి) సుఖి, సుఖముగనున్నవాడు, సంతోషముగనున్నవాడు.

**سکھیا-سکھیا سنبل** సఖ్యా- సఖ్యాసంబుల్ (హి) సంకుపాషాణము, తెల్లపాషాణము, ఉల్లిపాషాణము.

**سکیت** సకేత్ (హి) ఇరుకైన, సంకుచితమైన, చిన్న, సన్న; కష్టము, సంకటము, దరిద్రము.

**سکیتنا** సకేత్నా (హి) బిగించుట, బిగువుజేయుట, సంకుచితముజేయుట, సన్నగించుట.

**سکیرنا-سکڑنا** సకేర్నా - సుకేడ్నా (హి) ముడుచుకొనుట, సంకుచితమగుట,

**سکیلا** సకేలా (హి.పు) ఖడ్గము, కత్తి; ఉక్కు, లోహము.

**سگ** సగ్ (పా.పు) శునకము, కుక్క. **سگ تازی** -తాజీ (పా) వేటకుక్క. **سگ پستان** - పిస్తాన్ (పా) చూడు **سپستان** అనుపదము. **سگ انگور سیاہ** - అంగూర్ సియాహ్ (పా) నల్లకామంచిపండ్లు. **سگ انگور سرخ** - అంగూర్ సుర్ఖ్ (పా) ఎఱ్ఱకామంచిపండ్లు.

**سگا** సగా (హి) స్వంత, కావలసిన, బంధుత్వముగల, సోదరులైన, ఏకోదరులైన, రక్తసం॥, దగ్గర, బంధువుడు, చుట్టము, జ్ఞాతుడు. **سگا بھائی** -భాయీ (హి) సహోదరుడు, సోదరభ్రాత.

**سگاوت-سگاوٹ** సగావత్ - సగావట్ (హి.స్త్రీ) బంధుత్వము, చుట్టరికము.

**سگائی** సగాయీ (హి.స్త్రీ) నిశ్చితార్థము, ప్రదానము, మాటమనుము.

**سگرا-سگلا** సగ్రా - సగ్లా (హి) సకలము, అంతయు.

**سگرئی** సగ్రయీ (హి.స్త్రీ) మధ్యాహ్నమప్పుడుపొద్దు నొకభాగము. (బండి.

**سگڑ** సగ్గడ్ (హి.పు) శకటము, బండి, ఛకడా

**سگندی پالا** సుగంధిపాల (హి) సుగంధపాలవేరు, గడ్డిసుగంధి, గోపిమూలము, పాలచుక్కందవేరు.

**سگھا** సఘా (హి) ధాన్యరాశి, కుప్ప.

**سگھڑ** సుఘడ్ (హి) ప్రవీణతగల, చతురమైన, నేర్పుగల, పనితనముగల, అందమైన, యోగ్యమైన, పొంకమైన, పనివాడైన, సుఘటితమైన, సులభమైన, సిద్ధమైన. **سگھڑ بھلائی** -భలాయీ (హి) మంచిమాటలు, ఇచ్ఛకములు, ముఖస్తుతి.

**سل** సిల్ (అ.పు) క్షయరోగము, ఎండుకామెన్ను, క్షయజ్వరము.

**سل-سلا** సిల్-సిలా (హి.స్త్రీ) శిల, రాయి, సన్నెకల్లు, పచ్చడిబండ, పట్టు, రాతిపలక లేక బల్ల, చాపరాయి. **سل بٹا** -బట్టా (హి) సన్నెకల్లుగుండ్రాయి.

**سلا** సిలా (హి.పు) శిలము, ఉంఛము, రాలినపంటవెన్నులు (ఏరుకొనుటయు). **سلا ہار** -హార్ (హి) శిలాహారుడు, ఉంఛవృత్తుడు,

పరిగ యేరుకొని బ్రతుకువాడు.

**سلاجت-سلاجیت** సలాజిత్ (పా. స్త్రీ) -సిలాజీత్ (హి. స్త్రీ) సిలాజిత్తు, శిలా జతువు, శిలాపుష్పము.

**سلاح** సిలాహ్ (అ.పు) శస్త్రము, ఆయుధము, ఉపకరణము, పనిముట్టు. **سلاح بند** - బంద్ (పా) కట్టాయితుడు, శస్త్రధారి, **سلاح خانہ** -ఖాన (పా) అస్త్రాగారము, శస్త్రశాల, ఆయుధశాల.

**سلاخ** సలాఖ్ (హి.పు) శలాకము, ఇనుప పుడక లేక పుల్ల.

**سلارس** సిలారస్ (హి.పు) ఏలకుల తైలము చూడు **سلاجیت**

**سلاست** సలాసత్ (అ.స్త్రీ) సౌలభ్యము, సుబోధముగా నుండుట, సుసాధ్యముగా నుండుట, ధారాళము, సులభము, మృదుత్వము, సులువు, తిన్నన, స్పష్టత, సాధారణత్వము, సామాన్యత, చులకన.

**سلاسل** సలాసిల్ (అ.స్త్రీ) శృంఖలములు, గొలుసులు, సంకెలలు.

**سلاطین** సలాతీన్ (అ.పు) చక్రవర్తులు, రాజులు, రాజవంశస్థులు.(ఏ.వ **سلطان**)

**سلام** సలామ్ (అ.పు) నతి, వందనము, నమస్కారము, ప్రణామము, దండము, జేజే, రాంరాం, ఆశీర్వాదము, దీవెన, క్షేమము, వష్ట్యంతములు, అభివాదనము, సెలవు, అంపకము, దర్శనము. **سلام پیام-پیغام** -పయాం - పైగామ్ (పా) పెండ్లిప్రస్తావము, పెండ్లిమాటలు, మాటముచ్చటలు. **سلام علیکم** - అలైకుమ్ (అ) స్వస్తి, మీకుశుభమగుగాక, నమస్కారము, జేజేలు, **سلام طلب** -తలబ్ (అ) నమస్కారప్రియుడు. **سلام کرائی** -కరాయీ (ఉ) నాగవెల్లి కట్నము లేక అంపకాల కట్నము, పెండ్లికూతురు వైపువారిచ్చు రొక్కము.

**سلامت** సలామత్ (అ) సురక్షితము, క్షేమయుక్తము, క్షేమముగా, సురక్షితముగా, సరిగా, బాగా. (స్త్రీ) సురక్షితత్వము, క్షేమము, మేలు, బాగు, కుశలము. **سلامت رو** -రవ్ (పా) మితవ్యయుడు, పొదిమిగలవాడు, నిర్వాహకుడు. **سلامت روی** -రవీ (పా) మితవ్యయము, పొదిమి, నిర్వాహము.

**سلامتی** సలామతీ (అ.స్త్రీ) సురక్షితత్వము, క్షేమము, ఆరోగ్యము, స్వస్థత, బాగు, మేలు, కుశలము. **سلامتی کاجام** -కాజామ్ (ఉ) స్వస్తిచషకము. ఆరోగ్యచషకము, ఒకరి ఆరోగ్యమును గోరి పానము జేయు చషకము.

**سلامی** సలామీ (అ.స్త్రీ) అభివందనము, వందనము, సత్కారము, అభివందనార్థకము; కట్నము, కానుక; వాలు, వంపు, దిగుడు; పిరంగులు మొ॥ కాల్చుట; భట్రాజు, బట్టు, వంది, వందనముచేయువాడు. **سلامی اتارنا** -ఉతార్నా (ఉ) అభివాదనముచేయుట, అభివందనము జేయుట, (తోపులు కాల్చుట) సత్కారముచేయుట. (చంపుట.

**سلادینا** సులాదేనా (హి) పండ పెట్టుట, **سلانا** సులానా (హి) నిద్రపుచ్చుట, పండ పెట్టుట, చంపుట.

**سلانا** సిలానా (హి) చల్లగాచేయుట, పొత్రించుట, నల్లార్చుట; పాడెకట్టుట; కుట్టించుట, కుట్టునట్లుజేయుట.

**سلائی** సిలాయీ (హి.స్త్రీ) కుట్టుకూలి, కుట్టు, కుట్టుట, కుట్టుపని; ధాన్యపుపురుగు.

سلائی సలాయీ (హి. స్త్రీ) శలాక, దబ్బనము, పుల్ల, పుడక, కదురు, కండెపుల్ల, కాటుకపుల్ల; అగ్గిపుల్ల, నిప్పుపుడక.

سلب సలబ్ (అ.పు) అభావము, హరణము, లేకుండ జేయుట, తోసివేయుట, ఒడియుట, తీసికొనుట, నిషేధము, గ్రహణము, అపహరణము, ఆకర్షణము, లాగుకొనుట.

سلپٹ సిల్‌పట్ (హి) నునుపైన, నున్నని, సమమైన, చదునైన, చదరమైన, సపాటమైన; మాసిన, చెరగిన, అక్షరములు లేక గీతలుమాసిపోయిన; గుడ్డి.

سلتنا సులట్నా (హి) సరిపడ జేయుట, సమాధానము చేసికొనుట, తీర్చుకొనుట. అనుభవించుట, కడ తేర్చుట, తీరుమానము చేసికొనుట.

سلتانہ چمپا సుల్తానచంప (హి) పున్నాగచెట్టు, పొన్నచెట్టు.

سلجھانا సుల్‌ఝానా (హి) చిక్కుతీయుట, విడదీయుట, విప్పుట, తీర్చుట, పరిష్కారముచేయుట, తీరుమానముచేయుట, వివరించుట, విశదపరచుట, సంశయము తీర్చుట, సులభముచేయుట.

سلجھاو- وا సుల్‌ఝావ్ - వా (హి.పు) చిక్కుతీయుట, వివరణము, విశదీకరణము, తీరుమానము, పరిష్కారము, తీర్పు.

سلجھنا సులఝ్నా (హి) చిక్కువీడుట, వీడుట, తీరుట, తీరుమానమగుట, పరిష్కారమగుట, విశదమగుట, సులభమగుట

سلخ సల్‌ఖ్ (అ.పు) చాంద్రమానమాసము యొక్క కడపటి దినము; మేకతోలు; పాముకుబుసము.

سلس సల్స (అ) సమమైన, మృదుమైన, స్పష్టమైన, సులభమైన, సామాన్యమైన, తిన్నని.

سلسلانا సల్‌సలానా (హి. స్త్రీ) గులగులమనుట, దురదపుట్టుట, పాకినట్లుండుట, పాకుట.

سلسلاہٹ సల్‌సలాహట్ (హి. స్త్రీ) గులగుల, దురద, పాకినట్లుండుట, జలజిలమనుట.

سلسلہ సిల్‌సిల (అ.పు) గొలుసు, సంకెల; వరుస, బారు, మాల, పంక్తి, పరంపర, క్రమము, సరణి, వయినము, పద్ధతి, తీరు, శ్రేఢి, రీతి; వంశము, కులము, వంశవృక్షము, వంశావళి, వంశచరిత్ర. سلسلہ وار -వార్ (పా) క్రమమైన, వరుసగానున్న, తెంపులేని, వయినమైన.

سلطان సుల్తాన్ (అ.పు) చక్రవర్తి, రాజు, రాచకుమారుడు.

سلطانہ సుల్తాన (అ.స్త్రీ) చక్రవర్తిని, రాణి, రాచకుమార్తె.

سلطانی సుల్తానీ (అ) రాజకీయమైన.

سلطنت సల్తనత్ (అ.స్త్రీ) రాజ్యము, దొరతనము, ప్రభుత్వము, రాజరికము. (హి) నెమ్మది, నిమ్మళము, స్థిరము.
سلطنت جمہوری -జంహూరీ (అ) ప్రజాప్రభుత్వము, చూడు جمہوری
سلطنت. سلطنت شخصی -ఎ, షఖ్‌సీ (అ) రాజప్రభుత్వము, ఏకరాజాధిపత్యము.

سلف సలఫ్ (అ) గతము, జరిగిన, కడచిన; పూర్వపు, మొదటి, మునుపటి; పూర్వకాలము, గతకాలము; పూర్వికులు, పెద్దలు.

سلف సులఫ్ (ఉ.పు) వెచ్చము, చిల్లర, సామగ్రి, వస్తువులు.

**سلف** సుల్ఫ్ (పా.పు) దగ్గు, కాసము.

**سلفا - سلفہ** సుల్ఫా - సుల్ఫ (ఫా.పు) గుడ్డడిని పెంకటిళ్లవేయక ఉత్తపొగాకు వేసితాగుట, ఉత్తపొగాకు లేక పొగాకు ఉండలు (వేసి తాగుట). **سلفا کرنا** -కర్నా (ఉ) భస్మముచేయుట, పాడు చేయుట, కొల్లపెట్టుట, నాశముచేయుట.

**سلفچی** సలఫ్చీ (ఉ.స్త్రీ) ప్రక్షాళన పాత్రము, కాళ్లు చేతులు కడుగుకొను పళ్లెము.

**سلک** సిల్క్ (అ.పు) హారము, మాల; దారము, నూలు; వరుస, బారు, పంక్తి, పరంపర; అంటుకట్టుట.

**سلگانا** సుల్గానా (హి) అంటపెట్టుట,గగులపెట్టుట, రాజెవెట్టుట, మంట పెట్టుట, ముట్టించుట, వెలిగించుట; ప్రేరేపించుట, పురికొల్పుట,

**سلگنا** సులగ్నా (హి) అంటుకొనుట, రాజుట, మండుట, రగులుట, వెలుగుట, ముట్టుకొనుట.

**سلم** సల్మ్ (అ.పు) క్షేమము,సురక్షితత్వము, (సలమ్) పెట్టుబడి,సహాయబుణము,కొనుగోలుకైముందు వెలనిచ్చుట(సంచకరువును)

**سلما** సల్మా (హి.పు) బంగారు లేక వెండి సరిగతీగ. (పొడుచుట.

**سلنا** సల్నా [హి] తూటుపడుట, గుచ్చుట,

**سلنا** సిల్నా (హి) కుట్టబడుట.

**سلو** సల్లూ(హి.పు) చెప్పులుకుట్టుతోలువారు.

**سلوانا** సల్వానా (హి) తూటువేయించుట, చిల్లిపొడిపించుట, తొలికొట్టించుట.

**سلوانا** సిల్వానా (హి) కుట్టించుట.

**سلوائی** సల్వాయీ (హి.స్త్రీ) చిల్లులు వేసిన లేక తొలులుకొట్టినకూలి.

**سلوائی** సిల్వాయీ (హి.స్త్రీ)కుట్టినకూలి. చూడుము **سلائی** .

**سلوتری** సలోత్రీ (హి.పు) అశ్వశాస్త్రజ్ఞుడు, పశువైద్యుడు.

**سلوٹ** సిల్వట్ (హి.స్త్రీ)ముడత,మడత.

**سلوک** సులూక్ (అ.పు) ప్రయాణము; త్రోవ, మార్గము; పద్ధతి, రీతి, తెరగు, వర్తనము, నడవడిక; ఉపకారము, మేలు, సహాయము; ప్రేమ, స్నేహము, చెలిమి; ఆదరము;బ్రహ్మజిజ్ఞాస. **سلوک سے رہنا** -సే రహ్నా (ఉ) కలిసిమెలిసి యుండుట, కూడియుండుట, చెలిమిగలిగి యుండుట, స్నేహముతోనుండుట.

**سلونا** సలోనా (హి) సలవణము, ఉప్పుకారముగల. ఉప్పని; లావణ్యమైన, అందమైన.

**سلونو - سلونون** సలూనో - సలూనోన్ (హి. స్త్రీ) రాకిపున్నమ, శ్రావణపౌర్ణమ.

**سلونی** సలోనీ (హి) చూడుము **سلونا** .

**سلہج - سلیج** సల్హజ్-సలీజ్ (హి.స్త్రీ) స్యాలునిభార్య, బావమరదిభార్య.

**سلی** సిల్లీ (హి.స్త్రీ) చెట్టుబోదె, మోటు, మొట్టు; పలక, చెక్క, బల్ల, కత్తులుమొ॥ నూరు సాన; చేరుబ్లు (ధాన్యము).

**سلیس** సలీస్ (అ) వృదువైన, సమమైన, సరియైన, సులభమైన, స్పష్టమైన సాధారణమైన, ధారాళమైన, సుబోధమైన, సుసాధ్యమైన.

**سلیقہ** సలీక (అ.పు) స్వభావము, వర్తనము. యోగ్యత, సభ్యత, మర్యాదలు, చాతుర్యము, నాగరికత, ప్రవీణత, నేర్పు, పద్ధతి, తెలివి, వివేకము, తారతమ్యజ్ఞానము, **سلیقہ دار - مند** - దార్ - మంద్

(పా) సభ్యుడు, యోగ్యుడు, వివేకి. **سليقہ مجلس** -ఏ,మజ్లిస్ (అ) సభ్యత, మర్యాదలు, సభామర్యాదలు.

**سليم** సలీమ్ (అ) అన్యూనము, అఖండము, లోపరహితమైన, సంపూర్ణము, సాంతము, అంత, సరియైన, నిండు; నెమ్మతిగల, గంభీరమైన, చెడని, ఆరోగ్యముగల, దిట్టమైన, పుష్టిగల, శాంతమైన. **سليم الطبع** -ఉత్ తబఽ (అ) శాంత స్వభావముగల, గంభీరస్వభావముగల.

**سليمان** సులేమాన్ (పు) యూదులరాజుల లోనొకరి పేరు, ఒకపైగంబరు పేరు, ఒక జ్ఞాని పేరు.

**سم** సుమ్ (పా.పు) గిట్ట, గొరజే, **سم لينا** -లేనా (ఉ) గుఱ్ఱముతడబడుటలేకపడుట.

**سم** సమ్ (హి.పు) కాలము, సమయము, లయ.

**سم** సమ్ (అ.పు) విషము, గరళము. **سم الفار** -ఉల్ ఫార్ (అ) సంకుపాషాణము, ఎలుకపాషాణము.

**سماء** సమా (పా.పు) కాలము, సమయము, అనుకూలము, లయ, సమతాళము, ఋతువు, వర్తమానము, పద్ధతి, స్థితి, రీతి, వైఖరి; రీవి, అందము, పొంకము; సకాలము, చౌకదనము; సమము, సంవత్సరము; వినోదము, క్రీడ, ఆలంకారము, విశేషము, ప్రాబల్యము, (అ) ఆకాశము, మిన్ను, ఎత్తు.

**سمات** సమాత్ (అ.స్త్రీ) గుర్తు, చిహ్నము.

**سماجت** సమాజత్ (అ.స్త్రీ) స్తోత్రము, పొగడ్త.

**سماحت** సమాహత్ (అ.స్త్రీ) దానము: దాతృత్వము, ఔదార్యము.

**سمادھ** సమాధ్ (హి.స్త్రీ) సమాధి.

**سماط** సిమాత్ (అ.పు) పంక్తి, వరుస, బారు, చాలు.

**سماع** సమాఽ (అ.పు) శ్రవణము, వినికి, గాయనము, ఆటపాటలు, నిమగ్నత, పరవశత్వము.

**سماعت** సమాఅత్ (అ.స్త్రీ) శ్రవణేంద్రియము, శ్రవణము, వినికి. **سماعت كرنا** -కర్నా (ఉ) ఆలకించుట, వినుట, లక్ష్యపెట్టుట, వివాదించుట, విమర్శన, విచారణ.

**سماعى** సమాఈ (అ) శ్రుతము, ఐతిహ్యము, సాంప్రదాయికము, పరంపరాగతము; వదంతియైన, వినిన, కర్ణాకర్ణియైన, జనవాదమైన; (వ్యా) నిపాతము, సామయికము.

**سمان** సమాఁ (పా.పు) ఆకాశము, ఆకసము, (హి) ఋతువు, కాలము, వత్సరము.

**سمانا** సమానా (హి) పట్టుట, ఇముడుట, నిండుట, సరిపోవుట, స్థావరముగుట, ఇష్టమగుట, సరిపడుట.

**سماوى** సమావీ (అ) ఆకాశసంబంధమైన, దివ్యమైన, అధిదైవికమైన, అచింతితమైన, పై.

**سمائى** సమాయీ (హి.స్త్రీ) అవకాశము, చోటు, ఎడము, స్థలము; కొల, పట్టినంత, పరిమాణము; ఓర్పు, సహనము, త్రాణ, ఆయము, అలవు, అలవి,

**سمبا** సుంబా (హి.పు) తుపాకిసలాక, తుపాకిచువ్వ, గట్టినకాడ, గట్టినసలాక.

**سمت** స(సి)మ్త్ (అ.స్త్రీ) తెరువు, బాట, మార్గము; తట్టు, ప్రక్క, వైపు, దిశ, **سمت الراس** -ఉర్, రాస్ (అ) తలతట్టు, ఆకాశమధ్యము, ఉచ్చము. **سمت القدم** -ఉల్, కదమ్ (అ) క్రిందితట్టు

నీచము, అధోబిందువు, అధమము.

**سمٹ** సిమట్ (హి. స్త్రీ) సంకోచము, ముడుగుకొనుట, పేరుట, ఘనీభావము, **سمٹ جانا** -జానా (ఉ) చూడు **سمٹنا** (వళి.

**سمٹن** సిమ్‌టన్ (హి. స్త్రీ) ముడత, మడత,

**سمٹنا** సిమట్నా (హి) సంకుచితమగుట, ముడుగుకొనుట, వక్కుట, తగ్గుట, కూడుకొనుట, ఒకటిగానగుట, చేరుకొనుట.

**سمجھ** సమఝ్ (హి. స్త్రీ) గ్రహణము, గ్రహణశక్తి, తెలివి, బుద్ధి, జ్ఞానము, ఆలోచన, ఊహ, భావము, వివేకము, తలంపు, అభిప్రాయము. **سمجھ آنا** - ఆనా (హి) బుద్ధి తెలియుట, తెలివివచ్చుట లేక పుట్టుట. **سمجھ بوجھ** -బోఝ్ (హి) ఊహాపోహలు, సమీక్షణము, బోధ, తెలివి, ఎరుక. **سمجھ دار** -దార్ (ఉ) బుద్ధిమంతుడు, తెలివిగలవాడు, వివేకి.

**سمجھانا** సమ్‌ఝానా (హి) తెలియజెప్పుట, బోధించుట, విశదపరచుట, వివరించుట, బుద్ధి చెప్పుట, ఎరుకచేయుట, సమాధానము చెప్పుట.

**سمجھنا** సమఝ్నా (హి) గ్రహించుట, తెలియుట, ఎరుగుట, జాగ్రతపడుట, ఆలోచించుట, లక్ష్యపెట్టుట, వినుట, ఒప్పుకొనుట, సమాధానపడుట; అనుకొనుట, తలంచుట, నేర్చుకొనుట, ఊహించుట, భావించుట; తీర్చుకొనుట, మారుకొనుట, ప్రతీకారముచేయుట, దండనజేయుట, శిక్షించుట, కొట్టుట.

**سمجھوتا** సమ్‌ఝోతా (హి. పు) సమాధానపడుట, సమాధానము.

**سمجھوتی** సమ్‌ఝోతీ (హి. స్త్రీ) సమాధానముజేయుట, సమాధానము.

**سمدم** సుమ్‌దుమ్ (పా) మిక్కిలిబలిసిన.

**سمدھن** సమ్‌ధన్ (హి. స్త్రీ) వియ్యపురాలు, సంబంధనము. (కుడు.

**سمدھی** సమ్‌ధీ (హి) వియ్యంకులు, వియ్యం

**سمدھیانا** సమ్‌ధియానా (హి. పు) వియ్యాలవారియిల్లు.

**سمسم** సింసిమ్ (అ. పు) తిలలు, నువ్వులు.

**سمع** సమఒ (అ. పు) శ్రవణము, చెవి, కర్ణము. **سمع خراشی** -ఖురాషీ (పా) తలబీకసకాయ, వదరుడు, వ్యర్థప్రసంగము.

**سمل الفار** సముల్ ఫార్ (అ) ఉల్లిపాషాణము.

**سمن** సమన్ (ఇం. పు) పిలుపు, ఆకారణపత్రిక, పిలుపుచీటి, ఆకారణము.

**سمن** సమన్ (పా. పు) సుమనస్సు, జాజిపువ్వు. **سمن اندام - بر** -అందామ్-బర్ (పా) పూబోడి, పున్నాగబోణి, సుందరమైన, కోమలదేహముగల, లావణ్యముగల, అందమైన.

**سمند** సమంద్ (పా. పు) జాతిగుఱ్ఱము, బాదామువన్నెగల గుఱ్ఱము, గుఱ్ఱము.

**سمندر** సముందర్ (హి. పు) సముద్రము, **سمندر پھل** -ఫల్ (హి) సముద్రఫలము, సముద్రపాల. **سمندر جھاگ** -ఝాగ్ (హి) సముద్రఫేనము. **سمندر سوکھ** -సూఖ్ (హి) త్రాగుబోతు, ఒకఓషధియును. **سمندر کھار** -ఖార్ (హి) సంకుపాషాణము, **سمندر کا پات - پتہ** - కాపాత్ - పతా **سوف - سوکھ** సూఫ్-సూఖ్ (హి) సముద్రపాల, పాలసముద్ర.

**سمندر** సమందర్ (అ.పు) అగ్నిమూషకము, నిప్పులో పుట్టి పెరుగు ఒక ఎలుకవంటి జంతువు.

**سمندری** సముందరీ (హి) సముద్రీయము. సాముద్రికము, సాముద్రము, సముద్రసం॥

**سموچا** సమూచా (హి) సమగ్రము, సాంతము.

**سمور** సమ్మూర్ (అ.పు) నక్కవంటి ఒక పృథువైన వెండ్రుకలుగలజంతువు లేక దానితోలు.

**سموسہ** సమోస (పా.పు) కరిజెలు, మాంసపు కరిజె, ముమ్మూలయాకారముగలది.

**سموم** సుమూమ్ (అ.స్త్రీ) విషవాయువు, వడగాలి.

**سمونا** సమోనా (హి) వేడినీళ్లు పోట్లుచే(యుట, కలుపుట.

**سمی** సమీ (అ.పు) పేరిటికాడు, ఒకని పేరుగలమరియొకడు, పేరిటివాడు.

**سمیت** సమేత్ (హి) సమేతము, సహితము, సహా, కూడ, తో.

**سمیٹ** సమేట్ (హి. స్త్రీ) సంకోచము, ముడుగుకొనుట; బద్ధకోష్ఠము, కట్టుమందు, నీళ్లాడినవారికి యోనిపూర్వస్థితికివచ్చుటకై యిచ్చుమందు.

**سمیٹنا** సమేట్నా (హి) చేరదీయుట, కూడదీయుట, చేర్చుట, జమచుట. ప్రోగుచేయుట, కూడదీయుట, దగ్గరకుతీయుట, మూడుచుట, బిగించుట, ముగించుట, దగ్గరకుతీయుట, ముడుచుట, ముగించుట, కట్టిపెట్టుట, సమాప్తిజేయుట.

**سمین** సమీన్ (అ) కొవ్వు, చమురు.

**سن** సన్ (అ.పు) సంవత్సరము, ఏడు, శకము.

**سن** సిన్న్ (అ.పు) ఏడు, వయసు, ఆయుస్సు, **سن بلوغ- بلوغت- تمیز** -ఎ, బులూగ్-బులూగత్-తమీజ్ (అ) తారుణ్యము, వయసు, బుద్ధితెలియువయసు, జ్ఞానదశ. **سن رسیدہ** -రసీదహ్-వయసుమీరిన, ముసలి.

**سن** సన్ (హి.పు) నార, జనుము. **سن کے بیج** -కేబీజ్ (హి) జనుపవిత్తులు.

**سن** సిన్ (హి. స్త్రీ) మర్మము, (ధ్వని) తీవ్ర (చప్పుడు), తింగు, త్వరగ, వేగము. **سن سے جی ہوجانا** - సేజీహోజానా (హి) బమ్మెరపోవుట, తెచ్చగొనుట, రాపడుట.

**سن** సున్ (హి) మూర్ఛిల్లిన, స్మృతి తప్పిన, తిమ్మిరిపట్టిన, చచ్చిపోయిన, (అవయవము) జడమైన, స్తంభించిన, నిశ్చలమైన, నిశ్శబ్దమైన, కదలనిమెదలని, జిల్లుమనిన, గుడ్డిపడిన. (అర్ధము) **سن بہری** - బహ్రీ (హి) తిమురువాతము, పక్షవాతము.

**سنا سن** సున్-సున్నా (హి.పు) సున్న, బిందువు.

**سنا-سنا مکھی** సనా-సనామక్కీ-సానాముఖీ (అ.స్త్రీ) సునాముఖి, నేలతంగేడు.

**سننا** సున్నా (హి) వినుట, ఆలకించుట, లక్ష్యపెట్టుట, అవధరించుట, చెవినిపెట్టుట, శ్రద్ధపెట్టుట. **ان سنا کرنا** - అన్ సునాకర్నా (హి) పెడచెవిపెట్టుట, వినియువిననట్లుండుట.

**سناٹا** సన్నాటా (హి.పు) అల్లకల్లోలము, సముద్రముయొక్క లేక గాలియొక్క గర్జనము, ప్రబలము, ఝుయి, ఝుంకారము, గొప్పధ్వని, భయంకరధ్వని, బమ్మెర, తెచ్చ, అచ్చెరువు, దిగ్భ్రమ, భయము, భీతి, బుగులు, మాటుమణుగుట, నిశ్శబ్దము.

**سنار** సునార్ (హి.పు) స్వర్ణకారుడు, అగస

లివాడు, కమసాలివాడు. (మసాలిది.

**سنارنی** సునార్నీ (హి. స్త్రీ) అగసాలిది, కమసాలి

**سناری** సునారీ (హి. స్త్రీ) కమసాల పని. అగసాలపని.

**سنان** సినాన్ (పా. స్త్రీ) బాణము మొ॥ వాని మొన, కొన, పాళి, ఈటె, బల్లెము.

**سنانا** సునానా (హి) వినిపించుట, ఒప్పచెప్పుట, చెప్పుట, అనుట, తెలియచెప్పుట.

**سنائے هندی** సనాయెహిందీ (పా) నేల తంగేడు.

**سنائی** సునాయీ (హి. స్త్రీ) వినికి, తీర్పు, ప్రవేశము, విచారణ, న్యాయము, మొర ఆలకించుట.

**سنبل** సుంబుల్ (అ.పు) జటామాంసిచెట్టు, ఒకగడ్డి, ఒకపుష్పము. **سنبل الطیب العصافیر** -ఉత్ తీబ్-ఉల్ ఆసాఫీర్ (అ) చూడు **بالچهڑ** అనుపదము. **سنبل کهار** -ఖార్ (ఉ) సంకుపాషాణము.

**سنبلہ** సుంబుల (అ.పు) వెన్ను, కంకి, గోధుమకంకి; కన్యరాశి.

**سنبوسہ** సంబోస (పా. పు) చూడు **سموسہ**

**سنبہ** సుంబ (పా. పు) పిడిసాన, (బర్మా); తోపు లేక పిరంగిలో మందు గట్టించు గట్టనదండము, గట్టన రోకలి; ఆకురాయి.

**سنبهالو** సంభాలూ (హి. పు) వావిలిచెట్టు, తెల్లవావిలిచెట్టు.

**سنبهالنا** సంభాల్నా (హి) సంభాళించుట, పడిపోకుండనిలుపుట, ఆపుట, ఆధారమిచ్చుట, పట్టుకొనుట, బలపరచుట, భరించుట, ఆశ్రియమిచ్చుట, సహాయము జేయుట, తోడ్పడుట, పోషించుట, కాపాడుట, సంరక్షించుట, జాగ్రిత చేయుట, ఆగపట్టుట, పడనివ్వకపోవుట, చెడనివ్వకపోవుట, నిర్వాహముచేయుట, నెరవేర్చుట, ఎత్తిపోట్టుట, పదిలపరచుట; యథాపూర్వముగాచేయుట, మునుపటివలె నుంచుట, యథాప్రికారముచేయుట; విచారించుట, పరీక్షించుట, పరిశీలించుట, శోధించుట; ఉపచారము చేయుట, ఉపశమింప చేయుట; స్వాధీన పరచుకొనుట, చేతికితీసుకొనుట, పోడిమిగా నుంచుట, అలవిచేసికొనుట, లోపరచుకొనుట; ముడుచుకొనుట, సవరించుట; స్థిరపరచుట, ఆయత్తపరచుట, ఉన్ముఖముచేయుట.

**سنبهالو** సంభాలూ (హి) తెల్లవావిలిచెట్టు, వావిలిచెట్టు.

**سنبهلنا** సంభల్నా (హి. పు) సంబళించుట, యథాపూర్వముగానగుట, ఎప్పటివలెనగుట, పడకుండనిలుచుట, ఆగుట, దిటవుగానుండుట, స్థిరపడుట, నిలుచుట, తెలివినొందుట, జాగ్రితపడుట, పదిలపడుట, పక్కపడుట, మెలకువపడుట, ఉపశమించుట, ఆరోగ్యమగుట, తేజరిల్లుట, బాగుపడుట, తెప్పరిలుట, కళవచ్చుట, తెలివివచ్చుట, పునరుద్ధారితమగుట, చక్కపడుట, సరిగానగుట, దిద్దుపాటుగుట, విశ్రాంతికొనుట, అలసట తీర్చుకొనుట, స్వాధీనమగుట, అలవియగుట, అరపుట, నిర్వాహమగుట, నెరవేరుట, ఆధారమగుట, వహించుట, సిద్ధముగుట, ఆయత్తముగుట, ఉన్ముఖమగుట, ప్రియత్నపడుట.

**سنپولا - سنپولیا** సంపోలా-సంపోలియా (హి. పు) పాము పిల్ల, చిన్న పాము.

**سنپیرا** సంపేరా (హి. పు) పాములవాడు.

**سنت** సంత్ (హి. పు) సత్పురుషుడు, సాధువు, మంచి వాడు.

**سنت** సున్నత్ (అ. స్త్రీ) పంథము, మార్గము, పద్ధతి, తెరగు, రీతి, వర్తనము, సాంప్రదాయము, ఆచారము, మహమ్మదీయ మతాచారము, చర్మసంస్కారము, ముందోలు కోత (సున్నతి). (అనుపదము.

**سنترا** సంత్రా (హి.పు) చూడు **سنگترا**.

**سنتری** సంత్రీ (ఇం.పు) పరిచారకుడు, ప్రహరీవాడు, కావలివాడు, తలారివాడు.

**سنتوکھ** సంతోఖ్ (హి.పు) సంతోషము.

**سنتی** సింతీ (హి.పు) ప్రతినిధి, మారుగా, ప్రత్యామ్నయముగా.

**سنٹی** సుంటీ (హి. స్త్రీ) కొమ్మ. రెబ్బ, చువ్వ, మెల్లె, బరిగ, కోల, రెమ్మ.

**سنج** సంజ్ (పా) తూచువాడు, సరిజూచువాడు, (వృత్తియందు).

**سنجاب** సంజాబ్ (పా. స్త్రీ) అడవిపిల్లి.

**سنجاف** సంజాఫ్ (పా. స్త్రీ) అంచు, గోటు, తెలుపుఎరుపు లేక పచ్చనివన్నెలు కలిసియున్న గుత్తము.

**سنجافی** సంజాఫీ (పా) అంచు లేక గోటు కుట్టిన; ఎరుపు పసుపువన్నెలుగల (గుత్తము)

**سنجافی گنجا** -గంజా (ఉ) నడినెత్తిన మాత్రము వెంట్రుకలుగల బట్టతలవాడు.

**سنج سبویہ** సంజ్ సబోయ (అ) తరిగిస చెట్టు, తంటెపుచెట్టు.

**سنجوگ** సంజోగ్ (హి.పు) సంయోగము.

**سنجوگی** సంజోగీ (హి. స్త్రీ) రెండుపక్షు లుండునట్లుచేసినపంజరము, కుటుంబముగల జోగి. (ట.

**سنجونا** సంజోనా (హి) వడ్డించుట, అమర్చు

**سنجھو** సంఝూ (హి) మూడవ సంతానముల్లో మూడవబిడ్డ.

**سنجیدگی** సంజీదగీ (పా. స్త్రీ) గంభీరత, గాంభీర్యము, గౌరవము, గురుత్వము.

**سنجیدہ** సంజీద (పా) తూచిన, తులితమైన; గంభీరమైన, ఘనమైన, గురుత్వము గల, భారమైన, గొప్ప, సరసస్వభావము గల, అనుభవముగల, ఆరితేరిన, వివేకము గల, సరియైన, యోగ్యమైన.

**سند** సనద్ (అ. స్త్రీ) ఆనుకు, దిండు, ఆధారము, ఆశ్రయము, ఊతె, నమ్మకము, నిదర్శనము, ప్రమాణము, ఉపమానము, సాంప్రదాయికము, దృష్టాంతము, ఉదాహరణము, యోగ్యతాపత్రిక, ప్రమాణపత్రిక, నిదర్శనపత్రిక, అధికారపత్రము, పత్రము, పత్రిక, సెలవుచీటి, సాక్ష్యపత్రము, దానపత్రము, ఆజ్ఞాపత్రిక, శాసనము, మాన్యమైన, విశ్వసనీయమైన, నమ్మదగిన.

**سندان** సిన్దాన్ (పా. స్త్రీ) దాగలి, పట్టెడ, కమ్మరిపనిచేయు ఇనుపగూటము.

**سندرتائی** సుందర్ తాయీ (హి. స్త్రీ) సౌందర్యము, అందము.

**سندولے کا گڑ** సందోలే కా గుడ్ (హి) ఈత బెల్లము, **سندولے کا پیڑ**-పేడ్ (హి) ఈతచెట్టు.

**سندور** సింధూర్ (హి. స్త్రీ) సింధూరము.

**سندھارا** సంధారా (హి.పు) శ్రావణపట్టి లేకకట్నము.

**سندھلی** సంధ్లీ (హి. స్త్రీ) నిచ్చెనపీటు, (దీనికి నాలుగువైపులనుండియు ఎక్కుటకు మెట్లుండును.)

**سندھی** సింధీ (హి) సొంటి.

**سنڈ - سنڈا** సండ్-సండా (హి) బలిష్ఠమైన, బలముగల, బలిసిన, లావైన, కండకావరముగల. **سنڈا مسنڈا سنڈا**

(రాళ్లు పొడిచిచంపుట, రాళ్లురువ్వి చంపుట). **سنگ سرمہ** -సుర్మ (పా) సౌవీరము, తుత్థము, కాటుకరాయి. **سنگ ماہی** - మాహీ (పా) చేప(తలలోని) రాయి. **سنگ مثانہ** -ఎ,మసాన(పా) మూత్రకృచ్ఛ్రము, అశ్మరోగము. **سنگ مرمر** -ఎ,మర్ మర్ (పా) చలువరాయి, బలపపు రాయి. **سنگ مقناطیس** -ఎ, మిక్నాతీస్ (పా) సూదంటు రాయి, **سنگ موسی** -ఎ,మూసా (పా) నల్ల రాయి. **سنگ یشب** -ఎ,యష్బ్(పా) ఒకవిధమైన పచ్చరాయి. (తెలుపు మీరి యున్నది).

**سنگ** సంగ్ (హి) తోడు, సహ, కూడ, కలిసి, సంగము, సహవాసము, సంగతి.

**سنگ سبوی** సంగ్ సబోయ (పా) తరిగిస చెట్టు, తంటెపుచెట్టు.

**سنگ کپی-کوپی** సంగ్ కుప్పీ-కూపీ(హి) పీసంగిచెట్టు, ఊటిచెట్టు,తక్కోలపుచెట్టు, పీశనికిచెట్టు.

**سنگاتی** సంగాతీ(హి.పు)చెలికాడు, తోటి వాడు, సహవాసి.

**سنگار** సింగార్ (హి.పు) శృంగారము, సింగారము, అలంకారము. **سنگاردان** -దాన్ (హి) ఆడువారి బొట్టుపెట్టె.

**سنگارنا** సింగార్నా(హి) శృంగారించుట, అలంకరించుట, సింగారించుట. (గడ్డ.

**سنگاڑا** సింగాడా (హి.పు) పందిగడ్డ,పరిక

**سنگت** సంగత్ (హి.స్త్రీ) సంగతి, సహవాసము, గోష్ఠి, చెలిమి,జట్టు, సమాజము.

**سنگترہ** సంగ్ తర (హి.పు) తియ్యనారింజ పండు, కమలాఫలము.

**سنگتی** సంగతీ(హి.పు)చూడు **سنگاتی**.

**سنگم** సంగమ్ (హి.పు) సంగమము,కూడిక; నదులు కలిసినచోటు.

**سنگن** సున్ గున్ [హి.స్త్రీ] రహస్యము, గుట్టు, భావము, జాడ, పోబడి, సూచన.

**سنگھ** సింఘ్ (హి.పు) సింహము, సింగము.

**سنگھارنا** సంఘార్నా(హి) సంహరించుట, నాశముచేయుట.

**سنگھاڑا** సింఘాడా (హి.పు) పరిక గడ్డ, పందిగడ్డ, సింగాడి కాయ. **سنگھاڑا مچھلی** -మఛ్లీ(హి) ఒకవిధమైన ముండ్ల చేప.

**سنگھاسن** సింఘాసన్(హి.పు)సింహాసనము.

**سنگھانا** సుంఘానా (హి) వాసనచూపుట.

**سنگھنی** సింఘ్నీ (హి.స్త్రీ) ఆడసింహము.

**سنگی** సంగీ (పా) రాతి, రాతిసం॥.

**سنگی** సంగీ (హి.పు) ఒకవిధమైనపట్టుబట్ట, చూడు **سنگاتی**.

**سنگین** సంగీన్ (పా) రాతి; బరువైన,భారమైన; బలిష్ఠమైన, దిట్టమైన, గట్టి, కఠినమైన; దిట్టముగా నేసిన బట్ట; తుపాకి శూలము.

**سنگیا** సంగియా (హి.పు)సంకుపాషాణము. **سنگیا بس** -బిస్ (హి) సంకు పాషాణము, ఉల్లిపాషాణము.

**سنگینی** సంగీనీ (పా.స్త్రీ) దృఢత్వము, గట్టి, బలము, దిటువు,కాఠిన్యము, భారము, బరువు, గాఢత్వము.

**سنمکھ** సన్ముఖ్ (హి) సముఖము, సమక్షము, ఎదుట.

**سنوار** సఁవార్ (హి.స్త్రీ) సంస్కారము, సవరణ, సజ్జన, అలంకారము, దిద్దుబాటు, దెబ్బ, పెట్టు.

**سنوارنا** సఁవార్నా (హి) సవరించుట,

చక్క చేయుట,దిద్దుట,తీర్చుట,అమర్చుట, అలంకరించుట, సింగారించుట, త్రోవకు తెచ్చుట.

**سنورنا** సంవర్నా (హి) చక్కబడుట, దిద్దబడుట, బాగగుట, సరిపడుట, త్రోవకు వచ్చుట, అమరుట, సజ్జితమగుట, అలంకృతమగుట, తగియుండుట, యోగ్యమగుట, అనుకూలమగుట, వయినముగానగుట, కడతేరుట, నెరవేరుట.

**سنون** సనూన్ (అ.పు) పండ్లపొడి.

**سنہ** సన - సన్హ్ (అ.పు) సంవత్సరము, ఏడు. **سنہ جلوس** -ఎ,జులూస్ (అ) మూర్ధాభిషేక వత్సరము. **سنہ رواں** -రవాం (పా) వర్తమాన సంవత్సరము. **سنہ عیسوی** -ఎ,ఈస్వీ (అ) క్రైస్తవ శకము. **سنہ فصلی** -ఎ,ఫస్లీ(అ) మొగలాయి శకము. **سنہ ہجری**-ఎ,హిజ్రీ మహమ్మదీయ శకము.

**سنہرا - سنہری** సునెహరా - సునహ్రీ (హి) బంగారపు,బంగారు సం॥. **سنہری**

**ورق - تگٹ** సునెహ్రీ వరక్-తగట్ (ఉ) కుందనపు రేకు, బంగారు వలిపము, బంగారు తగటు. (నార.

**سنی** సనీ (హి.స్త్రీ)మృదువైన జనుము లేక

**سنی** సున్నీ (అ.పు) శాస్త్రీయమైన మహమ్మదీయుల యొక్క తెగవారు.

**سنیچر** సనేచర్ (హి.పు) శనైశ్చరుడు,శనివారము, శని, తిండిపోతు.

**سو** సూ (పా.స్త్రీ) ప్రక్క, తట్టు,పక్షము, దిశ, వైపు. **سوبسو** -బసూ (పా) ప్రతి దిక్కును, అన్నిదిక్కులను.

**سو** సౌ (హి) శతము, నూరు. **سوبسوے**

-బిస్వే (హి) శతవిధముల, బహుశః, నిశ్చయముగా.

**سو** సో (హి) కనుక, కాన, కాబట్టి; వాడు, అది, అట్టివాడు, అట్టిది.

**سو** సో - స్వ (హి) స్వ, తన. **سودیشی** -దేషీ (హి) స్వదేశీయము.

**سوء** సూ (అ.స్త్రీ) కీడు, చెడుగు, దుష్టమైన, చెడ్డ, చెడు. **سوءادبی** -యె, అదబీ (అ) అవిధేయత, పోకిరితనము, దుర్మార్గము. **سوءحضمی** - యె,హాజ్మీ (అ) అజీర్ణము, మందము. **سوءظن** - జన్ (అ) దురభిప్రాయము. **سوء**

**مزاجی** -మిజాజీ (అ)అనారోగ్యము, రోగము.

**سوا** సవా (హి)ఒకటింపాతిక. **سوانیزے**

**پر سورج آنا** -నే జేపర్ సూరజ్ ఆనా(ఉ)ప్రళయకాలసూర్యుడువచ్చుట, నిప్పులుకురియుట,అత్యుష్ణముగానుండుట.

**سوا** సుఆ (హి.పు) శుకము, చిలుక; వెన్ను, కంకి; పెద్దసూది, దబ్బనము.

**سوا** సివా (అ) వినా, కాక, తప్ప, ఇంక, ఇంతేకాక, ఎక్కువ, అధికము.

**سوات** స్వాత్(హి.స్త్రీ) స్వాతీ నక్షత్రము, స్వాతి కార్తె, స్వాతికార్తె వాన. **سوات بند** -బింద్ (హి) స్వాతి బిందువు, స్వాతికార్తె వానచుక్క. (ఇది ముత్యపుచిప్పలలో బడిన ముత్యమగు నందురు.) [రుచి.

**سواد** సువాద్ - స్వాద్ (హి.పు) స్వాదు,

**سواد** సవాద్ (అ.పు) నలుపు, నీలవర్ణము, హృదయముపై నల్లమచ్చ; హృదయము, మనస్సు, బుద్ధి; చుట్టుప్రక్కలు, సామీప్యము, పరిసరప్రదేశము.

**سوار** సువార్ (హి.పు) పురిటిల్లు.

**سوار** సవార్ (పా.పు) ఎక్కువాడు, రౌతు, గుఱ్ఱపు రౌతు, ఎక్కియున్న; మదించిన, మత్తుగొనిన. **سوار ہونا** -హోనా (ఉ) ఎక్కుట, తర్లుట, పోవుట. **سوار کرنا -کرانا** -కర్నా-కరానా (ఉ) ఎక్కించుట.

**سوار - سیوار** సివార్-సీవార్ (హి.పు) చూడు **سوانا** .

**سوارتھ** స్వార్థ్ (హి.పు) స్వార్థము, స్వప్రయోజనము.

**سواری** సవారీ (పా. స్త్రీ) ఆరోహణము; బండి గుఱ్ఱము మొ॥ వాహనము; వాహనముపై యెక్కుట, రౌతు, ఆరోహకుడు, ఎక్కువాడు; వాహ్యాళి, ఊరేగింపు. **سواری کسنا** -కస్నా (ఉ) జెట్టిపట్టుగా పైనెక్కి కూర్చుండుట. **سواری لینا** -లేనా (ఉ) ఎక్కుట, ఎక్కిపోవుట.

**سوال** సుఆల్ (అ.పు) ప్రశ్న, పృచ్ఛ, అడుగుట, విచారణ, విమర్శన; ప్రార్థన, వినంతి, విన్నపము, మనవి, యాచన; సంశయాంశము, ఉపపాదనము. **سوال جرح** -జిరహ్ (అ) విమర్శన ప్రశ్న, పూర్వపక్షము, ఆక్షేపము. **سوال جواب** -జవాబ్ (అ) ప్రశ్నోత్తరములు, వివాదము, ప్రసంగము, తర్కము.

**سوالات** సుఆలాత్ (అ.పు) ప్రశ్నలు. (ఏ. వ **سوال**)

**سوامی** స్వామీ (హి.పు) స్వామి, యజమాని, భర్త, స్వాములవారు.

**سوانا** సివానా (హి.పు) పొలముగట్టు లేక మేర, పొలిమేర, ఎల్ల, సీమ, ఎల్లరాయి, పొలిమేర రాయి.

**سوانح** సివానెహ్ (అ.పు) ఘటనలు, సంగతులు, సంభవములు, జరిగినవి, స్థితిగతులు, వర్తమానము, చరిత్రలు, వృత్తాంతము, వయినము, చర్య, చరితము. (ఏ. వ **سانحہ**). **سوانح عمری** -ఉమ్రీ (అ) జీవచరిత్ర, జీవన చరిత్ర. **سوانح نگار** -నిగార్ (పా) వృత్తాంతలేఖకుడు, వర్తమానలేఖకుడు.

**سوانگ** సువాంగ్-సవాంగ్ (హి.పు) నాటకము, ఆట, వినోదము, వేషము, బహురూపులు, అనుకరణము, ప్రదర్శనము, విలాసము, క్రీడ, లీల, మోసము, కార్యము, చర్యలు.

**سوانگی - سوانگیا** -సువాంగీ-సువాంగియా (హి.పు) వేషధారి, వేషగాడు, బహురూపులవాడు, మోసగాడు.

**سواہا** సువాహా (హి.పు) స్వాహా, భస్మీభూతము.

**سوائے** సివాయె (అ) చూడు **سوا**

**سوباس - سوبس** సూబాస్ - సూబస్ (హి.పు) సువాసము, మంచివసతి, సుగంధము, సువాసన.

**سوبڑا** సూబ్డా (హి.పు) కలపటుపు వెండి లేక బంగారు, కందు వెండి, కందుబంగారు.

**سوبھا** సోభా (హి. స్త్రీ) శోభ, అలంకారము, సౌందర్యము, అందము, గౌరవము.

**سوبھیتا - سوبیتا** సుభీతా - సుబీతా (హి.పు) చూడు **سبھیتا** .

**سوپ** సూప్ (హి.పు) చేట, శూర్పము.

**سوپابینا** సూపాబీనా (హి.పు) వాన కోయిల, చాతకము. (పక్షివిశేషము)

**سوت** సౌత్ (హి. స్త్రీ) సవతి, సపత్ని.

**سوت** సూత్ (హి.పు) దారము, నూలు, రేఖ, పంక్తి, దారమువలెచుట్టుకొనియుండు

**سوندا نمک۔ لون** సోందానమక్-లోన్ (హి) సైంధవ లవణము.

**سوندھا** సో-సోంధా (హి) తడిసినకొత్త కుండయొక్క లేక వేయించిన శెనగలయొక్క వాసనగల; కొన్ని వస్తువులు కలిపిచేసిన పరిమళద్రవ్యము. ( తలమసాలవంటిది )

**سوندھا پن۔ ھٹ** -పన్ - హట్ (హి) క్రొత్తకుండ లేక వేయించిన శెనగల వాసన, మంచివాసన.

**سوندھنا** సోంధ్నా (హి) బట్టలను ఉతుకుట కుముందుచవుడులో పులుముట, పులుముట, కలుపుట.

**سوندھی** సోంధీ (హి.స్త్రీ) చౌడు, ఉప్పుమట్టి, క్రొత్తమట్టి, వాసనగల చాకిలొట్టి లేక బాన ( చాకలవాడు బట్టలు తడిపి పెట్టునది ); ఒక ఫలము. (తొండము.

**سونڈ** సూండ్ (హి.స్త్రీ) తొండము, ఏనుగు

**سونڈا** సూండా (హి.పు) గంత, పల్లము; ముక్కుపురుగు.

**سونڈی** సూండీ (హి.పు) శౌండికుడు, సారాయిమొ॥నవి అమ్మువాడు, గాండ్లవాడు; నాభి, బొడ్డు; శెనగలలోని ఎట్టి ముక్కుపురుగు. (మీను.

**سونس** సూంస్ (హి.పు) శిశుకము, ఉలుప

**سون سون** సూంసూం (హి.స్త్రీ) బుస, బుస బుస, ముక్కునుండిశ్వాసదీయు చప్పుడు, రోజుచప్పుడు.

**سونپ-سونف** సోంఫ్-సోంప్ (హి.పు) సోపుగింజలు, సోపుజిలకఱ.

**سونگھا** సూంఘా (హి.పు) వేటకుక్క, వాసనపట్టుకుక్క, వేగులవాడు, వాసనచేత పాతిపెట్టినధనధాన్యములు కనిపట్టువాడు.

**سونگھنا** సూంఘ్నా (పా) వాసనచూచుట, మూర్కొనుట. (నశ్యపుకాయ.

**سونگھنی** సూంఘ్నీ (హి.స్త్రీ) నశ్యము,

**سونھ** సోంహ్ (హి.స్త్రీ) చూడు **سون**

**سونہلا** సోనెహ్లా (హి) బంగారపు.

**سونہلا پانی** -పానీ (హి) జలపోతము, బంగారునీరు.

**سونیا** సూనియా (హి.పు) శకునములుజూచువాడు, ప్రశ్నచెప్పువాడు.

**سونیا** సోనియా (హి.పు) జెలగకుడుగువాడు, మన్నుబూడిద మొ॥వానినుండి బంగారము వేరుజేసి తీయువాడు.

**سونیری ورق** సోనేరీవర్క్ (హి) కుందనపురేకు, బంగారువలిపము.

**سووا** సోవా (హి) చూడు **سوئی**

**سوھاگا** సోహాగా (హి.పు) పాపటము, గుంటక, దున్నినభూమిని చదునుచేయు సాధనము.

**سوھن - سوھان** సోహాన్ - సోహన్ (పా.స్త్రీ) ఆకురాయి, సానరాయి, కత్తులునూరురాయి.

**سوھنا** సూహ్నా (హి) శోభిల్లుట, సొంపారుట, అందముగానుండుట, తగియుండుట.

**سوھنی** సోహినీ (హి.స్త్రీ) అందమైన, శృంగారమైన, శోభాయమానమైన; చీపురుకట్ట, శృంగారకట్ట.

**سویا-سوئی** సోయా-సోయీ (హి) పెద్ద సదాపవిత్తులు, శతకుప్పవిత్తులు, సోయికూరవిత్తులు.

**سوئی** సూయీ (హి.స్త్రీ) సూచి, సూది, గడియారము లేక త్రాసు మొ॥వానిముల్లు, ముల్లు, అంకురము, మొన.

**سوئی کا بھالا - پھاوڑا ہوجانا** కాభాలా-ఫావ్డా హోజానా (హి) గోరంతలు కొండంతలు

గానగుట, కొద్దిదిగొప్పగానగుట. **سوئی پرونا** -పిరోనా (హి) సూదిలో దారము కూర్చుట లేక గ్రుచ్చుటలేక ఏక్కించుట. **سوئی کا ناکا** -కానాకా (హి) సూది చెవి, సూదితూము.

**سوے** సూయే (పా. స్త్రీ) చూడు **سوء**.

**سویا** సువైయా (హి.పు) నిద్రపోతు.

**سویا** సవైయా (హి.పు) ఒకటింపావు ఎరుసు, శేరుంపావు ఎత్తు లేక బాటు; ఒక పాట.

**سویاں** సివైయాఁ (హి. స్త్రీ) సేవియలు, సేవెలు, సేవికలు. **سویاں بٹنا-توڑنا** -బట్నా-తోడ్నా (హి) సేవెలుచేయుట లేక నలుచుట.

**سویدا** సువైదా (అ.పు) హృదయముపై నల్లమచ్చ; కొంచెము నల్లని.

**سویر** సవేర్ (హి) వేళము, శీఘ్రము, మొదట, మొదలు, పెందలాడి.

**سویرا** సవేరా (హి.పు) ఉదయము, వేకువ, ప్రొద్దుపొడుపు, పగలు, పెందలకడ.

**سویرے** సవేరే (హి) వేకువన, ప్రొద్దున, పెందలకడ.

**سویم** సోయమ్ (పా) తృతీయము, మూడవ.

**سوئمبر** సొయెంబర్ (హి.పు) స్వయంవరము.

**سہ** సెహ్ (పా) త్రి, మూడు. **سہ بندی** -బందీ (పా.పు) మూడు నెలల గడువు, గడువుపన్ను, సుంకము; సుంకరి, సుంకరీడు, పన్నురాబట్టువాడు, తరువుబంట్రోతు, బంట్రోతు. **سہ پایہ** -పాయ (పా) ముక్కాలి పీట. **سہ پتی** -పత్తీ (ఉ) పులిచింత కూర. **سہ پہر** -పహర్ (పా) మూడు ఝాములు, అపరాహ్నము. **سہ پہل** -పహల్ (పా) త్రిభుజమైన, మూడు ప్రక్కలుగల. **سہ چند** -చంద్ (పా) ముమ్మడి, మూడంతలు. **سہ حرفی** -హర్ఫీ (పా) త్ర్యక్షరము, మూడుఅక్షరములుగల. **سہ درہ** -దర (పా.పు) త్రిద్వారము, మూడు ద్వారములు గల కూటము. **سہ سالہ** -సాల (పా) త్రివార్షికము. **سہ شنبہ** -షంబ (పా.పు) మంగళవారము. **سہ فصلہ** -ఫస్లా (పా) మూడుకారులుపండెడు. **سہ کرر** -కర్రర్ (పా) ముమ్మారు, మూడవమారి. **سہ گوشہ** -గోష (పా) ముమ్మూలల, ముక్కోణమైన. **سہ ماہی** -మాహీ (పా) త్రైమాసికము. **سہ منزلہ** -మన్జిల (పా) మూడంతస్తులుగల.

**سہانا** సుహానా (అ.పు) మనోజ్ఞమైన, ఇంపైన, మనోహరమైన, రమ్యమైన, ఉల్లాసకరమైన, మంచి; గోరువెచ్చని, కొంచెము ఉడుకుగానున్న.

**سہارا** సహారా (హి.పు) ఆశ్రయము, ఆధారము, ఆను, ఊత, పోటి, అడ్డము, సహాయము, తోడ్పాటు, ప్రాపు, ఆశ, నమ్మకము, బరువసము, స్థితి, స్థావరము.

**سہاگ** సుహాగ్ (హి.పు) సౌభాగ్యము, శుభము, మంగళము, అదృష్టము, ముత్తైదువ తనము, భార్యాభర్తలఅన్యోన్య ప్రేమము, ఉల్లాసము, చెలిమి, ముత్తైదువ పోబల్లు లేక అలంకారములు(గాజులు, కాటుక, కుంకుమ మొ॥), అలంకారము, సింగారము; ఒక పరిమళము. **سہاگ اترنا** -ఉతర్నా (హి) ముండమోయుట. **سہاگ پٹار** -పిటార్ (హి) ఆడంగుల బొట్టుపెట్టె లేక సొమ్ముల పెట్టె (పెండ్లి

కూతురికి పెండ్లికొడుకు యిచ్చునది).

سہاگ رات -రాత్ (హి) పొన్పు నాటి రాత్రి, గర్భాదానమునాటిరాత్రి, శోభనపురాత్రి. سہاگ گھوڑی - ఘోడీ, పెండ్లికూతురిపైపాట,వరుసపాట.

سہاگ کا پلنگ -కా పలంగ్ (హి.పు) పెండ్లిమంచము, పొన్పునాటి మంచము.

سہاگ لہر - లహర్ (హి) మలయ మారుతము.

سہاگا-سہاگہ సుహాగా_గ (హి.పు) వెలిగారము, టంకము, చూడు سوہاگا

سہاگن సుహాగన్ (హి.స్త్రీ) సౌభాగ్యవతి, ముత్తైదువ, పతిచేత ప్రేమింపబడుభార్య.

سہالگ సహాలగ్ (హి.పు) పెండ్లిండ్ల దినములు, పెండ్లిండ్లకాలము.

سہام సిహామ్ (అ.పు) భాగములు, ఖండములు, తునకలు; బాణములు, అమ్ములు, అంబులు. (ఏ. వ سہم)

سہانا సొహానా (హి) మనోహరమగుట, ఇష్టముగానుండుట, రుచించుట, ఇష్టమగుట, సొంపారుట, శోభిల్లుట, ఇంపుగానుండుట, అందగించుట, మనోజ్ఞమగుట, బాగుండుట, మంచిగానుండుట; గోరువెచ్చగానుండుట,వెచ్చవెచ్చగానుండుట.

سہانا سایہ -సాయ (హి) సంధ్యారాగము, సాయంకాలము.

سہاو సహావ్ (హి.పు) సహనము, ఓర్పు, వహనము. (ఆశ్రయము.

سہاے సహాయ్ (హి) సహాయము, బలము,

سہایتا సహాయతా (హి.స్త్రీ) సహాయత, సహాయము. (ఆశ్రయుడు.

سہایک సహాయక్ (హి.పు) సహాయకుడు,

سہت సహిత్ (హి) సహితము,కూడ,తోడ.

سہج సహాజ్ (హి.పు) సహాజము,సులభము, సులభముగా, నెమ్మది, నిమ్మళము.

سہجنا సహాజ్నా (హి.పు) మునగచెట్టు.

سہرا సిహ్రా (హి.పు) పూల బాసికము, బాసికము; పెండ్లికొడుకుపైపాట; పెండ్లి.

سہس సహస్ (హి) సహస్రము, వేయి.

سہل సహ్ల్ (అ) మృదువైన, మెత్తని, సులభమైన, సహువైన, సామాన్యమైన, సుసాధ్యమైన, చులకనైన. سہل انگار -అంగార్ (పా) ఆలసుడు, సోమరి, సౌఖ్యప్రియుడు, జాగ్రతలేని,నెపగొండి.

سہل انگاری -అంగారీ (పా) ఆలసత్వము, సోమరితనము,అసడ్డ, అజాగ్రత, నెపగొండితనము.

سہلانا సహ్లానా (హి) మెల్లగానలుపుటలేక రాయుట లేక తట్టుట, కితకితపెట్టుట,గిలిగింతపెట్టుట.

سہلاہٹ సహ్లాహట్ (హి.స్త్రీ) తట్టుట, తడుపుట, గిలిగింత, కితకిత.

سہم సహ్మ్ (అ.పు) ఖండము, భాగము, పాలు; బాణము, అమ్ము; వృత్తము.

سہم సహమ్ (పా.పు) భయము, బుగులు, భీతి. سہم ناک -నాక్ (పా) భయంకరము.

سہما సహ్మా (పా) భీతిల్లిన, భయపడిన.

سہمے سہمے نظر సహ్మేసహ్మే నజర్ (ఉ) బెదరుచూపులు, భీతిల్లినదృష్టి, బెదరి బెదరిచూచుట. (రించుట.

سہمانا సహ్మానా (ఉ) భయపెట్టుట, బెద

سہمنا సహమ్నా (ఉ) భయపడుట, భీతిల్లుట.

سہنا సహ్నా (హి) వహించుట,సహించుట, తాళుట, ఓర్చుట, అరుగుట.

سهنک సహ్నక్ (అ.స్త్రీ)చూడు صحنک
سهنهار సహన్‌హార్ (హి) సహ్యమైన, సహింపగల, తాళగల.
سهو సహ్వ(అ. స్త్రీ) ప్రమాదము,స్ఖాలిత్యము, పొరపాటు, స్ఖలనము, తప్పు,మరపు. سهو قلم -ఎ,కలమ్ (పా) లేఖక ప్రమాదము, వ్రాతలోపము, లేఖనస్ఖాలిత్యము. سهو کاتب -ఎ,కాతిబ్(అ)లేఖకప్రమాదము, లేఖకదోషము. (పొరపాటున.
سهواً సహ్వన్(అ) ప్రమాదముచేత,మరచి,
سهولت - سهولی - سهولیت సహూలత్ - సహూలీ - సుహూలియత్ (అ.స్త్రీ) సౌలభ్యము, సులభముగానుండుట, సుళువు, చులకన, మృదుత్వము, సౌలభ్యత, సుళువు, నిమ్మళము.
سهی సహీ (ఉ) నిజము, అవును, మంచిది, బాగు, కాని, ఉండని, సరి, మేలు, విశేషము, నిశ్చయము, అయితే, కదా, యింతే చాలు.
سهی సహీ (పా) సరళము, చక్కని.
سهیلی సహేలీ (హి.స్త్రీ) సఖి, చెలికత్తె.
سی సీ (పా) ముప్పది, سی پاره - పారా (పా) త్రింశదంశము, కురానులోనిముప్పది యవభాగము.
سے సే (హి) నుండి, నుంచి, చేత,తో,తోడ, వలన, కంటె, కి, కు, కూడ, లో, లోపల మొ॥ అర్థములనిచ్చు ప్రత్యయము.
سے సె (హి) శతము, నూరు.
سیاح సయ్యాహ్ (అ.పు) యాత్రికుడు, సంచారి, బాటసారి, లోకసంచారి,ప్రయాణస్థుడు.
سیاحی - سیاحت సయ్యాహత్- సయ్యాహీ(అ. స్త్రీ)యాత్ర, ప్రయాణము, సంచారము.
سیادت సియాదత్(పా. స్త్రీ)ప్రభుత్వము, ఆధిపత్యము, పెత్తనము, అగ్రేసరత్వము, గౌరవము; హజరత్ ఫాతిమాయొక్క సంతానము. (మృగము.
سیار-ل సియార్-ల్ (హి.పు)నక్క,సాలా
سیار సయ్యార్ (అ.పు) ద్రిమ్మరి, సంచారి, తిరుగువాడు. (నక్షత్రము.
سیاره సయ్యారహ్ (అ.పు) గ్రహము, చలన
سیاست సియాసత్(అ. స్త్రీ)పరిభుత్వము, పరిపాలనము, అధికారము, కట్టుదిట్టము, ఏర్పాటు, చట్టము, కట్టడి, నిర్వాహము, శిక్ష, గద్దింపు,చివాట్లు, దండనము, నిర్బంధము, ఉపద్రవము, బాధ,భయము,బెదురు.
سیاست مدن -మదన్ (అ) గ్రామపాలనము, ఊరిపారుపత్తెము, గ్రామనిర్వాహము, ఊరికట్టుదిట్టము.
سیاق సియాక్ (అ.పు) గణితము, లెక్క, గణితశాస్త్రము, ధోరణి, ఫణితి, శైలి, పద్ధతి,వైఖరి,ఫక్కి, సరణి. سیاق عبارت - ఎ,ఇబారత్ (అ) పదధోరణి, ఫణితి, శబ్దశైలి, سیاق کلام-ఎ,కలామ్(అ) వాక్యసరణి, మాటలధోరణి, వాగ్వైఖరి.
سیال సయ్యాల్(అ) పారెడు, ద్రవమైన పలచని, ద్రవత్వముగల. (వెల్లువ.
سیالہ సైయాల (అ.పు) ప్రవాహము, వరద,
سیام స్యామ్ (హి.పు) శ్యామలము, నల్లని, చామనిచాయగల; నల్లకోకిల;ఒకరాగము.
سیام برن -బర్ణ్ (హి)శ్యామలవర్ణము, చామనిచాయ.
سیاما స్యామా(హి.పు)నల్లకోయిల,కోకిలము.

**سیاں** సయ్యాఁ (హి) ప్రియుడు, స్వామి, మగడు.

**سیانا - سیان** స్యాన్-సియానా(హి.పు) జ్ఞాని, ఉపాయశాలి, అనుభవశాలి, జాణ, తెలివిగల, చురుకుగల, నేర్పరి, ఉటంకి, టక్కరి, మాయలమారి, పిసినారి. **سیان پت - پن** -పత్ -పన్ (హి) జాణతనము, చాతుర్యము, మోసము, మాయలమారితనము, టక్కరితనము, పిసినారితనము.

**سیاه** సియాహ్ (పా) నల్లని, చెడు. **سیاه باطن** -బాతిన్ (పా) కపటి, వంచకుడు.

**سیاه بخت - طالع** -బఖ్త్ -తాలె (పా) దౌర్భాగ్యుడు, నిర్భాగ్యుడు.

**سیاه بختی - طالعی** -బఖ్తీ-తాలెఈ (పా) దౌర్భాగ్యము, దురదృష్టము.

**سیاه چشم** -చష్మ్ (పా) నల్లని కండ్లుగల, నిర్దయుడైన. **سیاه دل** - దిల్ (పా) పాపిష్ఠి, నిర్దయుడు. **سیاه رو** -రూ (పా) నల్లమొగము, నిందితుడు, అవమానితుడు, లజ్జితుడు. **سیاه فام** -ఫామ్ (పా) శ్యామలవర్ణముగల, చామనచాయగల, నల్లని. **سیاه کار** -కార్ (పా) పాపిష్ఠి, దుర్మార్గుడు, దురాచారి, పోకిరి, అపరాధి. **سیاه کاری** -కారీ (పా) దుర్మార్గము, దురాచారము, పాపము, అపరాధము. **سیاه گوش** -గోష్ (పా) చిరుతపులివంటి అడవిమృగము, అడవిపిల్లి. **سیاه مست** -మస్త్ (పా) చెడత్రాగిన, ప్రమత్తుడైన, త్రాగి మైమరచిన. **سیاه مستی** -మస్తీ (పా) ప్రమత్తత, చెడత్రాగి మత్తుగొనుట, త్రాగి మైమరచుట. **سیاه موسلی** -మూస్లీ (ఉ) నల్లనేలతాటిగడ్డ.

**سیاهه** సియాహా (హి.పు) దినలెక్క పుస్తకము, టిప్పణపుస్తకము, పట్టి, వర్గము, బహి. **سیاهه نویس** -నవీస్ (ఉ) కరణము, లెక్క వ్రాయువాడు, వ్రాయసగాడు, లేఖరి. **سیاهه کرنا** -కర్నా (హి) వ్రాయుట, చేర్చుట, లిఖితరూపము చేయుట.

**سیاهی** సియాహీ (పా. స్త్రీ) నలుపు, చీకటి; మసి, సిరా; కాటుక, కళంకము, మరక; దయ్యము. **سیاهی چٹ چوس** -చట్ -చూస్ (హి) ఒత్తుడు కాకితము, అద్దుడు కాకితము. (గద్దువ(పాలిక).

**سیب** సేబ్ (పా) సీమరేగుపండు; ఒకపండు;

**سیپ -سیپی** సీప్-సీపీ (హి. స్త్రీ) సీపి, ముత్యపుచిప్ప, పలచని టెంకిగల మామిడి పండు; పక్షిరోగ భేదము; కాచిప్ప.

**سی پھل** సీఫల్ (హి) మారేడుపండు.

**سیت** సీత్ (హి. స్త్రీ) శీతము, చలి; తడి, నెమ్ము, చెమట.

**سیتا** సీతా (హి. స్త్రీ) సీతాదేవి, రాముని భార్య. **سیتا پھل** -ఫల్ (హి) సీతాఫలము; పొలగుమ్మడికాయ.

**سیتل** సీతల్ (హి) శీతలము చల్లని; (స్త్రీ) తుంగ. **سیتل پاٹی** - పాటీ (హి) తుంగ చాప, చిరిచాప. **سیتل تائی** -తాయీ (హి) శీతలత, చల్లదనము. **سیتل چینی** -చీనీ(హి) ఒకానొక పరిమళద్రవ్యము. (గరమ్మసాలా)

**سیتلا** సీత్లా (హి) స్ఫోటకము, అమ్మవారు. **سیتلا کا کھاجا** -కాఖాజా (హి) స్ఫోటకమునకు బలి, అమ్మవారి యాహారము; చంటిబిడ్డ. **سیتلا کھایا** -ఖాయా (హి) అమ్మవారి మచ్చలుగల.

**سیٹھ** సేఠ్ (హి.పు) శ్రేష్ఠుడు, దొడ్డ వర్తకుడు, ధని, ద్రవ్యవంతుడు; గౌరవనామము.

**سیٹھا** సీఠా (హి) రుచిహీనమైన, చప్పని, నిస్సారమైన, సారములేని. **سیٹھاپن** -పన్ (హి) చప్పదనము, నిస్సారము.

**سیٹھی - سیٹی** సీఠీ - సీటీ (హి.స్త్రీ) చెత్త, మష్టు; ఈల, కూత. **سیٹی بجانا** -బజానా (హి) ఈల వేయుట. **سیٹی دینا - لگانا** -దేనా-లగానా (హి) ఈల కొట్టుట (పిలుచుటకు). **سیٹی بندھنا - گم ہونا - بھولنا** -బంధ్నా - గుమ్ హోనా -భూల్నా (హి) దిగ్భ్రమ చెందుట, బమ్మెరపోవుట, తోచక పోవుట, కలవరపడుట.

**سیتاکی پنجیری** సీతాకీ పంజీరీ (హి) రోగచెట్టు, కర్పూరవల్లి. ఓమపాకుచెట్టు.

**سیج** సేజ్ (హి.స్త్రీ) శయ్య, సెజ్జ, పానుపు, మంచము. **سیج بند** -బంద్ (హి) మంచపు త్రాళ్లు (వీనితో పరుపును మంచమునకు కట్టుదురు). **سیج گاڑی** -గాడీ (హి) నాలుగుచక్రముల బండి, శకటము.

**سیج** సీజ్ (హి.పు) ఆకుజెముడు.

**سیچنا** సీచ్నా (హి) సేచనము, నీరుకట్టుట, నీరుపెట్టుట.

**سیچائی** సీచాయీ [హి.స్త్రీ] సేచనము, నీరుకట్టుకూలి.

**سیخ** సీఖ్ (పా.స్త్రీ) శలాక, కడ్డి, కమ్మి, ఇనుపపుల్ల. **سیخ پاہونا** -పాహోనా (ఉ) చూడు **چراغ پاہونا** అనుమాట.

**سیخ کباب** సీఖకబాబ్ (ఉ) కట్టెకుపుల్లు, కఱుకుట్లు.

**سید** సయ్యిద్ (అ.పు) ప్రముఖుడు, హజరతు మహమ్మదు సంతానము, ఒక తెగతురకలు. (హజరత్ అలీ, హజరతు ఫాతెమా గార్ల సంతతివారు).

**سید خانم** సేద్‌ఖానమ (పా.పు) మరుగుదొడ్డి.

**سیدھ** సీధ్ (హి.స్త్రీ) సరళత్వము, చక్కన, నూటి, తిన్నన, గురి, వంకలేమి, నిదానము.

**سیدھا - سیدھی** సీధా-సీధీ (హి) సరళము, చక్కని, తిన్నని, సూటి, తిన్నన, గురి, వంకలేమి, కుడి, సరియైన, సూటియైన, నిదానమైన, అనుకూలమైన, సులభమైన, యదార్థమైన, నిష్కపటమైన; ఎదుట, ముందర, సరిగా; తక్షణమే, వెంటనే. **سیدھا سادھا سادا** -సాధా -సాదా (హి) అమాయికమైన, నిష్కపటమైన, యదార్థమైన, తిన్నని, బేలయైన, చిక్కులేని, సులభమైన.

**سیدھا ہاتھ** -హాథ్ (హి) మేలుతరము, కుడిచేయి. **سیدھی آنکھ** -ఆఁఖ్ (హి) కుడికన్ను; కటాక్షము, అనుగ్రహము, తిన్నని చూపు. **سیدھا کرنا** -కర్నా (హి) చక్కచేయుట, వంక తీర్చుట. **سیدھا ہونا** -హోనా (హి) చక్కపడుట, వంకతీరుట. **سیدھی نظر** -నజర్ (ఉ) అనుగ్రహ దృష్టి, తిన్నని చూపు, అనుగ్రహము.

**سیر** సీర్ (పా) తెల్లగడ్డ, వెల్లుల్లి.

**سیر** సైర్ (అ. స్త్రీ) సంచారము, పర్యటనము, విహారము, వాహ్యాళి, తిరుగుడు, తిరుగులాట, విశ్రమము, వినోదము, సంతోషము, విలాసము, గ్రంథకాలక్షేపము. **سیرکرنا** -కర్నా (ఉ) సంచరించుట, విహరించుట, వినోదము చూచుట. **سیرگاہ** -గాహ్ (పా) వినోదస్థానము, విలాసస్థానము, విహారస్థానము.

**سیر** సేర్ (పా)నిండిన,పూర్ణమైన,తృప్తిచెందిన, తనివితీరిన, సంతుష్టిచెందిన,నిశ్చింతయైన, వెక్కసములేక వెగటుపుట్టిన, మొగము మొత్తిన, మొగముచాటుగలిగిన, విసికిన,రోసిన.

**سیر چشم** -చష్మ్ (పా) ఇచ్ఛాపూర్తియైన, తనివితీరిన, నిశ్చింతగానున్న, సంతుష్టిచెందిన, సిరిసంపత్తులుగల, సంపన్నుడైన, ఉదారుడైన, త్యాగియైన,తృప్తిగల.

**سیر چشمی** -చష్మీ(పా)ఇచ్ఛాపూర్తి, తృప్తి, సంతుష్టి, తనివి, శాంతి, నిశ్చింత, ఔదార్యము. **سیر حاصل** - హాసిల్ (పా) సారవంతము, ఫలవంతము. **سیر ہونا** -హోనా [ఉ] సంతుష్టియగుట. కడుపునిండుట, తనివితీరుట, నిశ్చింత యగుట, వెగటుపుట్టుట,రోయుట,విసుకుట.

**سیر** సియర్ (అ.స్త్రీ) గుణములు, స్వభావములు;చరిత్ర,ఇతిహాసము. (ఏ.వ**سیرت**)

**سیر** సేర్ (హి.పు) సేరు, ఎనుబది తులముల యెత్తు.

**سیر** సీర్ (హి.స్త్రీ) పట్టాదారుని సాగుబడిలోనే యున్న పొలము; ఉమ్మడిగా,పొత్తులో. **سیر جوتا** -జోతా (హి) తన భూమిని తానే సాగుబడిచేసుకొను కాపు లేక భూస్వామి, పట్టాకాపు, పట్టా సేద్యగాడు.

**سیرا** సీరా (హి.పు) రవపాకము, రవయు చక్కెరయు కలిపిచేసిన వంటకము, పాగాకులోవేయు పలచని బెల్లము.

**سیراب** సేరాబ్ (పా) జలమయము, జలపూరితము, నీళ్ళతోనిండిన, చెమ్మగల, తడిగల; పరిపూర్ణమైన, నవనవలాడెడు, పచ్చపచ్చగానున్న, నవీనతగల, తేజరిల్లుచున్న; ఫలవంతమైన, సారవంతమైన, పచ్చిగల.

**سیرابی** సేరాబీ (పా. స్త్రీ) తేమ, చెమ్మ, జలమయత్వము, తడి, పచ్చి, నవీనత, సారము, రసము, ఫలవంతత్వము.

**سیرت** సీరత్ (అ.స్త్రీ) స్వభావము, గుణము, లక్షణము, గుణవిశేషము, నైజగుణము; చరితము, చరిత్ర.

**سیرو - سیروا** సేరూ - సేర్వా (హి.పు) మంచముయొక్క అడ్డపట్టెలు (తలవైపు యొక్కయు కాళ్లవైపుయొక్కయుపట్టెలు).

**سیری** సేరీ (పా. స్త్రీ)పరిపూర్ణత, పూర్తి, నిండు, తృప్తి, సంతుష్టి, తనివి తీరుట, నిశ్చింత, చాలియుండుట, సంపత్తు.

**سیڑھی** సీఢీ (హి. స్త్రీ) నిచ్చెన, మెట్టు, అంతస్తు, పదవి; సాధనము.

**سیزدہ** సేజ్దహ్ (పా) పదమూడు.

**سیس** సీస్ (హి.పు) తల, శిరస్సు. **سیس پھول** -ఫూల్ (హి) ఒక శిరోభూషణము; మగడు, పెనిమిటి.

**سیسا - سیسہ** సీసా-స (హి.పు) సీసము, (లోహము). (సిసూనుకట్టె.

**سیسم - سیسو** సీసమ్ - సీసూ (హి.పు)

**سیس ناگ** సేస్ నాగ్(హి.పు)ఆదిశేషువు.

**سیف** సైఫ్(అ. స్త్రీ)ఖడ్గము, కత్తి. **سیف زبان** - జబాన్ (పా) వాక్సిద్ధిగల, వాక్చతురతగల; పరుషవాది, తిట్టుబోతు, శాపములు పెట్టువాడు.

**سیفی** సైఫీ (అ.స్త్రీ) ప్రయోగము, మంత్రము, శాపము; జపమాలిక; కత్తివంటి.

**سیک** సేక్ (హి.పు) సెగ, వేడిమి, కాక, కాపడము, సెగచూపుట.

**سیکڑا** సైక్డా(హి.పు)శతము, నూరు,నూటికి.

**سیکنا** సేక్నా (హి) కాచుట, సెగచూపుట,

వెచ్చచేయుట,నిప్పుమీదకాల్చుట,రొట్టె మొ॥నవి కాల్చుట.

**سیکھ** సీఖ్ (హి. స్త్రీ) శిక్ష, బోధ, పాఠము, ఉపదేశము, ఆలోచన. **سیکھ دینا** -దేనా (హి) శిక్షయిచ్చుట, బోధించుట, నేర్పుట, ఉపాయముచూపుట, ఆలోచన చెప్పుట.

**سیکھنا** సీఖ్నా (హి) నేర్చుకొనుట, అభ్య (సించుట.

**سیگوا** సేగ్వా (హి) మునగచెట్టు.

**سیل** సేల్ (హి.పు) ఈటె, బల్లెము; మీసకట్టు; (ఇం) బంబాసు. **سیل کاگولہ** -కాగోల (ఉ) బంబాసుగుండు.

**سیل** సీల్ (హి.పు) శీలము,వర్తనము, మంచి నడత, సిగ్గు, లజ్జ.

**سیل** సీల్ (హి. స్త్రీ) శీతలము, నెమ్ము, తడి. **سیل گرم** -గరమ్ (ఉ) గోరువెచ్చని.

**سیلا** సీలా(హి)శీతలమైన,చల్లని,తడిగల,నెమ్ముగల, తడిసిన.

**سیلا** సేలా (హిపు) సేల, సెల్ల, ఉత్తరీయము, పట్టుతలగుడ్డ, శిరోవస్త్రము.

**سیلاب** సైలాబ్ (పా.పు) ప్రవాహము, వరద, వెల్లువ; ఏరు, నది, కాలువ.

**سیلابی** సైలాబీ (పా. స్త్రీ)పరవనేల,వెల్లువలో మునుగు భూమి; జలమయత్వము; తడి; వఱద, వెల్లువ, ప్రవాహము.

**سیلانی** సైలానీ (పా) దేశద్రిమ్మరి,సంచారి, తిరుగుబోతు, సంచారేచ్ఛగల, తిరుగ నిచ్ఛగల.

**سیلکھڑی** సేల్ ఖడీ (హి. స్త్రీ) చూడు (**سنگ جراحت**

**سیل گوند** సేల్ గోంద్ (హి) అందుగుపిసును, అందుగు బంక.

**سیلی** సైలీ (పా. స్త్రీ) అరచేతిప్రక్కతో మెడపై కొట్టుదెబ్బ,అరచేతి అంచుపోటు.

**سیم** సేమ్ (హి. స్త్రీ) చిక్కుడుకాయ.

**سیم** సీమ్ (పా.పు) వెండి,రౌప్యము;ధనము, ద్రవ్యము. **سیم بر - بدن - تن** -బర్ -బదన్ -తన్ (పా) రౌప్య దేహముగల, తెల్లని, అందమైన, సొగసైన.

**سیماهنگ** సీమాహంగ్ [పా] కాకరచెట్టు.

**سیما** సీమా (పా.పు) నొసలు, నుదురు.

**سیماب** సీమాబ్ (పా.పు) పాదరసము. **سیماب دار** -దార్ (పా) చపలమైన. చంచలమైన, వ్యాకులమైన.

**سیمابی - سیمابیا** సీమాబీ - సీమాబియా (పా.పు) పాదరసపువన్నెగల.

**سیمرغ** సీమర్గ్ (హి.పు) గండభేరుండము (పక్షి).

**سیمل** సేమల్ (హి.పు) బూరుగచెట్టు.

**سینا** సీనా (హి) కుట్టుట, రఫ్ఫూతీయుట. **سینا پرونا** -పిరోనా (హి) కుట్టుపని.

**سینا** సేనా (హి.పు) సేన, సైన్యము. **سینا پتی** -పతీ (హి) సైన్యాధిపతి.

**سینا** సేనా (హి) గుడ్లుపొదుగుట; పూజించుట. సేవించుట.

**سیناسینی - سینابینی** -సైనాసైనీ -సైనాబైనీ (హి. స్త్రీ) సైగలు, సన్నలు, కనుసన్నలు.

**سینت** సేంత్ - సైంత్ (హి) ఉచితముగా, ఊరక, నిరర్థకముగా; వ్యర్థముగా, వృథా.

**سینتالیس** సైంతాలీస్ (హి) నలువదిఏడు.

**سینتنا** సేంత్నా (హి) పదిలపరచుట,భద్రముగాపెట్టుట, దాచిపెట్టుట, చక్కజేయుట, సవరించుట, ఉంచుట,కూర్చుట, చేర్చుట, వేరుగాతీసిఉంచుట.

**سینتیس** సైంతీస్ (హి) ముప్పదిఏడు.

**سیندالون-نمک- سیند هالون-نمک**

లోన్-నమక్ — సేంధాలోన్-నమక్ (హి) సైంధవలవణము.

**سیندور** సేందూర్ (హి.పు) సిందూరము.

**سیندور کا تمباکو** سیندور -కా తంబాకూ (హి) సిందూరు పొగాకు.

**سیندوریا** సేందూరియా (హి) ఎఱ్ఱ మామిడిపండ్లు.

**سیندھ** సేంధ్ (హి. స్త్రీ) కన్నము, గోడలో దొంగలుచేసిన ద్వారము; పుట్ట దోస పండు, పుట్టపండు.

**سیندھا** సేంధా (హి.పు) సైంధవలవణము.

**سیندھنا** సేంధ్నా(హి) కన్నము వేయుట, సొరంగము వేయుట.

**سیندی - سیندھی** సేంధీ - సేందీ (హి. స్త్రీ) ఈతకల్లు, చూడు **سوندی**. **سیندھی کا گڑ** سیندھی -కా గుడ్ (హి) ఈత బెల్లము. **سیندھی کا سرکہ** سیندھی -కా సిర్కా (హి) ఈత కాడి, ఈతపులుసు, ఈతకల్లు కాడి. **سیندھی کا شراب** سیندھی -కా షరాబ్ (ఉ) ఈతసారాయి.

**سینڈھ - سینڈ** సేండ్ - ఢ్ (హి.పు) చూడు **سانڈھ**

**سینک** సీంక్ (హి. స్త్రీ) పూచికపుడక, చీపురుపుడక, పలుకట్టుపుల్ల, కాడ, చార, పట్టె, గీత.

**سنکڑا** సేంక్డా (హి) చూడు **سیکڑا**

**سیکنا** సేంక్నా(హి) చూడు **سیکنا**

**سینکیا** సీంకియా (హి. పు) చారలుగల, పట్టెలు లేక గీతలుగల, సన్నగోటు.

**سینگ** సీంగ్ (హి.పు) శృంగము, కొమ్ము, తెడ్డు. (శిశ్నము)

**سینگڑا** సీంగ్డా (హి.పు) తుపాకిమందు మొ॥ వేసికొను కొమ్ముబుఱ్ఱ.

**سینگڑی** సేంగ్డీ (హి. స్త్రీ) బీజకోశము, -కాయ; ముల్లంగి కాయ.

**سینگا** సీంగా (హి.పు) కొమ్ము, బూరగ.

**سنگوٹی** సింగోటీ (హి. స్త్రీ) సింగోటి, దుప్పికొమ్ము పిడివేసినకటారు, చిన్నకొమ్ము, చిన్న బూరగ, ఎద్దుల కొమ్ములకు వేయు పొన్నులు.

**سینگی** సీంగీ (హి. స్త్రీ) ఆచూషణము, నెత్తురుతీయు కొమ్ము; ఒకచేప.

**سینہ** సీన(పా.పు) వక్షము, ఱొమ్ము, గుండె, ఉరము, హృదయము. **سینہ بند** سینہ-బంద్ (పా) కంచుకము, ఆవిక, చోలము, ఉరవస్త్రము, ఱొమ్ముపట్టి. **سینہ چاک** سینہ -చాక్(పా) విదళితహృదయుడైన, గుండెపగిలిన, భగ్న హృదయుడైన, దుఃఖితుడైన. **سینہ زن** -**کوب**-జేన్ -కూబ్ (పా) శవమువెంట ఱొమ్ముకొట్టుకొని ఏడ్చువాడు, విలాపకుడు.

**سینہ زور** سینہ - జోర్(పా) బలిష్ఠమైన, రొమ్ముపుష్టిగల, ప్రబలుడైన, తలబిరుసైన, సాహసియైన, మూర్ఖుడైన, దురుసైన.

**سینہ زوری** سینہ -జోరీ(పా) ప్రబలము. ప్రాద్బలము. సాహసము, తలబిరుసు, మూర్ఖత్వము, దురుసుతనము. **سینہ سپر** -సిపర్ (పా) ఎదురుబడి. ముఖాముఖి, ఎట్టఎదుట, సాహసముగల, దురుసైన. **سینہ سے لگانا** سینہ -సే లగానా (ఉ) ఆలింగనముజేయుట, అక్కునజేర్చుట, కౌగలించుట. **سینہ صندوق** سینہ -సందూక్ (పా) విశాలవక్షముగల. **سینہ کاوی** -కావీ (పా) ప్రబలప్రయత్నము, ఆయాసము, అతిశ్రమ, అతికష్టము. **سینہ افگار** -అఫ్‌గార్ (పా) భగ్న హృదయమైన, గుండెపగిలిన, దుఃఖితుడై.

سینی సీనీ (పా. స్త్రీ) పళ్లెము, సిబ్బి, తట్ట, అరివాణము.

سیو సేవ్ (పా.పు) చూడు سیب.

سیو సేవ్ (హి.పు) సేనగ సేవియలు. ఓమపూస.

سیو సేవ్ (హి) సేవ, పరిచర్య, కొలువు.

سیوار సీవార్ (హి.పు) చక్కెరశుద్ధిచేయుటకుఉపయోగించు ఒకకసవు, సుద్దికసవు.

سیواری సేవారీ (హి. స్త్రీ) శుద్ధి చేసిన చక్కెర; (ద) చూడు سیوار

سیوتی సేవ్‌తీ (హి. స్త్రీ) తెల్లచేమంతిపువ్వు.

سیورا సేవ్‌రా (హి.పు) సగము కాలిన మంటిపాత్రలు.

سیورغال సుయూర్‌గాల్ (పా.పు) మాన్యము, అగ్రహారము.

سیوڑا సేవ్‌డా (హి.పు) జీనుమతస్థుల సాధువు.

سیوک సేవక్ (హి.పు) సేవకుడు, పరిచారకుడు, శిష్యుడు, పూజకుడు, పంథుడు.

سیوکائی సేవకాయీ (హి. స్త్రీ) సేవ, పరిచర్య, కొలువు, పూజనము. (అతుకు.

سیون సీవన్ (హి. స్త్రీ) కుట్టు, కుట్టడము,

سیون సేవన్ (హి.పు) సేవనము, సేవించుట,

سیونا సేవ్నా (హి) సేవించుట; పొదుగు.

سیوین సేవైన్ (హి. స్త్రీ) చూడు سویاں

سیہنڈ సేహండ్-సేహ్నాండ్ (హి.పు) జెముడు, పాలజెముడు, కాడజెముడు, పుడకజెముడు.

---

# ش

ش షీన్ (అ.పు) ఇది ఉరుదూ వర్ణమాలలోని పందొమ్మిదవయక్షరము. పారసీకభాషలో పదునారవది. అరబీలో పదమూడవది. అరబీ వర్ణసాంఖ్యము (ابجد) లో దీనిసంఖ్య మూడువందలు.

شاب షాబ్ (అ.పు) యౌవనుడు, వయసువాడు, తరుణుడు, నడివయసులోనున్నవాడు.

شاباش షాబాష్ (పా) భళిభళీ!, భళిరే!, మేలుమేలు!, బాగు [ప్రశంసనార్థకము].

شاباشی షాబాషీ (పా. స్త్రీ) ప్రశంస, శ్లాఘన, స్తుతి, పొగడ్త, మెప్పు, ప్రోత్సాహము. شاباشی دینا - దేనా (ఉ) ప్రశంసించుట. శ్లాఘించుట, మెచ్చుకొనుట, ప్రోత్సాహపెట్టుట.

شاپ షాప్ (ఇం. స్త్రీ) విపణి, అంగడి, కార్యస్థానము.

شاخ షాఖ్ (పా. స్త్రీ) శాఖ, కొమ్మ; కొమ్ము, శృంగము; ఖండము, తునక, భాగము; ఆక్షేపము, రోమము; భంగము; సంబంధము, తగులాటము; నెత్తురువీయు కొమ్ము మొ॥ సాధనము; కలకండపూరికలు; విశేషము, కల్పనము, సంతాపము; వింటి కొయ్య. شاخچہ شا-చ (పు) రెమ్మ, చిన్న కొమ్మ. شاخدار شاخ-దార్ (పా) శాఖావంతము, కొమ్మలుగల; కొమ్ములుగల. شاخ درشاخ -దర్ షాఖ్ (పా) శాఖోపశాఖలు, చిక్కులుగల. شاخ زعفران شاخ-జేఫ్రాన్ (పా) అపూర్వము; అమూల్యము; నీలుగుబోతు. شاخسار شا-సార్ (స్త్రీ) వనము,

తోట;పొదరిల్లు,లతాగృహము. شاخسانہ
- شاخشانہ -సాన -షాన (పు) వివా
దము,ఆక్షేపము,జగడము,నింద, దోషము,
కళంకము, అరడి, రవ్వ, అనుమానము,
మోసము. شاخ غزال - آهو -గజాల్
-ఆహూ (స్త్రీ) దుప్పికొమ్ము;వింటికొయ్య;
పాడ్యమినాటిచంద్రుడు, బాలచంద్రుడు,
చంద్రవంక.

شاخم షాఖ్ (పా.పు) కాడి, యుగము;
కొమ్ము; కొమ్మ; బొండకొయ్య.

شاد షాద్ (పా) సంతోషయుక్తమైన,ఆనంద
యుక్తమైన, సంతుష్టమైన, సుఖముగా
నున్న, నిశ్చింతగల, సంపూర్ణమైన,నిండిన.

شاداب షాదాబ్ (పా) జలమయమైన,
పచ్చి, పచ్చని, పచ్చికగల, పసిరికగల,
క్రొత్తగానున్న, పచ్చపచ్చగానున్న,నవీన
మైన, నవనవలాడెడు, మనోజ్ఞమైన,మనో
హరమైన, తేజరిల్లుచున్న.

شادابی షాదాబీ (పా. స్త్రీ) జలమయ
త్వము, పచ్చి,పచ్చదనము,పసిరిక,పచ్చిక,
క్రొత్తదనము, నవీనత, నవనవ, తేజరిల్లుట,

شادان షాదాం (పా) ఆనందయుక్తమైన,
సంతోషముగల, ఉల్లాసముగల.

شادمان షాద్మాన్ (పా) ఆనందముగల,
సంతోషముగల, ఉల్లాసముగల.

شادمانی షాద్మానీ (పా. స్త్రీ) ఆనందము,
సంతోషము, ఉల్లాసము, ఆహ్లాదము.

شاده షాదహ్ (పా) సంతోషముగల,ఉల్లా
సముగల, ఆనందసహితమైన.

شادی షాదీ (పా. స్త్రీ) సంతోషము,ఆనం
దము, ఉల్లాసము, ఉత్సాహము; వివా
హము, పెండ్లి, సంబరము, ఉత్సవము, పం
డుగ, మహోత్సవము. شادی مرگ
-మర్గ్ (స్త్రీ) అత్యానందమువలన కలిగిన
మరణము, సుఖమరణము.

شادیانہ షాదియానహ్ (పా.పు) మంగళవా
ద్యములు, జయఘోషము, పెండ్లి కట్నము
లేక కానుక.

شاذ షాజ్ (అ) ప్రత్యేకము,ఏకము,ఒంటరి,
ఒకమైన, వేరైన; అపూర్వమైన, దుర్లభ
మైన, అరుదైన, సకృత్, కదాచిత్;అసా
ధారణము, నిపాతము, అపవాదము.
شاذ نادر -ఒ,నాదిర్ (అ) అరుదుగా,
కదాచిత్, అప్పుడప్పుడు, ఎడపదడప,
ఎప్పుడైనను.

شارح షారెహ్ (అ.పు) భాష్యకారుడు,
టీకాకారుడు.

شارع షారెఉ (అ.పు) మార్గదర్శి, మత
గురువు, భగవద్భక్తిమార్గముచూపువాడు;
రాజమార్గము, పెద్దత్రోవ, దండుబాట.
شارع عام -ఎ,ఆమ్ (పు) సర్వసామా
న్యమార్గము, రాజమార్గము, పెద్దబాట.

شارق షారిక్ (అ పు) సూర్యుడు.

شارک షారక్ (పా.పు) గోరువంక,శారిక.

شاستر షాస్తర్ (హి.పు) శాస్త్రము.

شاستری షాస్త్రీ (సం) శాస్త్రి, శాస్త్రజ్ఞుడు.

شاش - شاشہ షాష్ - షాష (పా.పు)
మూత్రము, ఉచ్చ. شاش دان
-దాన్ (పా) మూత్రపాత్రము; ఉచ్చ
బోకి.

شاطر షాతిర్ (అ) ఉటంకి, జాణ, చతు
రుడు,మాయలమారి; చదరంగమాడువాడు.

شاعر షాఇర్ (అ.పు) కవీశ్వరుడు, కవి.

شاعره షాఇరహ్ (అ. స్త్రీ) కవీశ్వరి, కవి
త్వముచెప్పు స్త్రీ.

**شاعری** షాఇరీ (అ. స్త్రీ) కవిత్వము.

**شاغل** షాగిల్ (అ) ఉద్యోగి, ఏదైన నొక పనిగలవాడు లేక చేయువాడు, అనుస్యూత, నిమగ్నపరుడు, భగవంతునిధ్యానములోనుండువాడు.

**شافع** షాఫెఽ (అ.పు) మధ్యవర్తి, మధ్యస్థుడు, పక్షవాది, మెచ్చజెప్పువాడు, నచ్చజెప్పువాడు.

**شافعی** షాఫిఈ (అ) మహమ్మదీయుల నలుగురి ఇమాములలో నొకరిపేరు.

**شافہ** షాఫహ్ (అ.పు) పుండు మొ॥వానిలో పెట్టు మందువత్తి, పొచన నాళము, [Enema.]

**شافی** షాఫీ (అ) ఆరోగ్యకారి, ఆరోగ్యదాత, ఆరోగ్యకరమైన, కుదుర్చు, మాన్పునట్టి, తీర్చునట్టి; అనుమానరహితమైన, తీరుమానమైన, పరిష్కారమైన, ఖండితమైన, స్పష్టమైన, నిష్కర్షమైన, నిశ్చయమైన, యదార్థమైన. **شافی مطلق-حقیقی** -ముత్లక్ -హకీకీ (అ) పరమారోగ్యదాత, ఈశ్వరుడు.

**شاق** షాక్ (అ) దుర్ఘటమైన, కఠినమైన, కష్టతరమైన, బాధకరమైన, దుర్భరమైన, అసంతోషకరమైన, అనిష్టమైన, అసహ్యమైన. **شاق گزرنا** -గుజర్నా (ఉ) దుర్భరమనిపించుట, కష్టతరముగాతోచుట, అనిష్టముగానుండుట, అసహ్యమనిపించుట.

**شاکر** షాకిర్ (అ) కృతజ్ఞత తెలుపువాడు, కృతజ్ఞుడైన, సంతుష్టిగల, తృప్తిగల.

**شاکی** షాకీ (అ) మొఱ పెట్టుకొనువాడు, మొఱగలవాడు, కొండెగాడు, తప్పుపెట్టువాడు, చాడీలుచెప్పువాడు, అసంతుష్టుడు, సణుగువాడు, నేరముమోపువాడు.

**شاگرد** షాగిర్ద్ (పా.పు) పరిచారకుడు, సేవకుడు; విద్యార్థి, శిష్యుడు; అభ్యాసకుడు, ఆరంభకుడు. **شاگرد پیشہ** -పేశ (పు) పరివారము, పరిచారకులు, పనివాండ్లు, బంట్లు, బానిసలు, ఇంటిప్రక్కన పనివాండ్లకొరకై వేసినచిన్నయిల్లు, ఓరపాక. **شاگردرشید** -ఎ, రషీద్ (పు) ప్రియశిష్యుడు, ఉత్తమ శిష్యుడు.

**شاگردی** షాగిర్దీ (పా. స్త్రీ) పరిచారము, కొలువు; విద్యార్థిత్వము, శిష్యత్వము, సేవకుల బహువచనము.

**شال** షాల్ (పా. స్త్రీ) రాంకవము, శాలువ.

**شالباف** -బాఫ్ (పా) కురపవాడు, శాలువనేయువాడు. **شال دوز** -దోజ్ (పా) శాలువలు కుట్టువాడు (పట్టుతో పూలుమొదలైనవి).

**شام** షామ్ (పా. స్త్రీ) సంధ్యాకాలము, సాయంకాలము, ప్రొద్దుగ్రుంకుజాము, సంజెప్రొద్దు, అస్తమానము. **شام و سحر** -ఒ, సహర్ (పా) ఉదయాస్తమయములు, ఎల్లప్పుడు, రేపుమాపు, రెండుపూటలు. [ఒకదేశము.

**شام** షామ్ (హి. స్త్రీ) రోకలి మొ॥వానిపొన్ను,

**شام** షామ్ (హి.పు) శ్యామవర్ణముగల, నల్లని, నీలపు, శ్యాముడు, కృష్ణుడు.

**شاما** షామా (హి. స్త్రీ) ఇంపుగాపలుకు నొక పక్షి, నల్లపిట్ట.

**شامت** షామత్ (అ. స్త్రీ) దురదృష్టము, దౌర్భాగ్యము, దుర్దశ, ఆపత్తు, కష్టము, నింద, అపవాదము, పెద్దమ్మ, చెడుగు. **شامت اعمال** -ఎ, ఆఽమాల్ (స్త్రీ) దుష్కర్మ

ఫలము,పాపఫలము,దుర్గతి. شامت زده-شامت مارا-کا گھیرا -జద-కామారా-కాఘేరా (ఉ)దైవోపహతుడు,దౌర్భాగ్యుడు,దురదృష్టుడు, شامت سر پر کھیلنا-سوار ہونا -సర్పర్ ఖేల్నా-సవార్ హోనా (ఉ) చెడ్దమ్మ నెత్తికెక్కుట,చెడుకాలమువచ్చుట.

**شامخ** షామిఖ్ (అ) ఎత్తైన, ఉన్నతమైన, గర్వముగల.

**شامل** షామిల్ (అ) ఆక్రమించు, వ్యాపించు, కలుపుకొను, చేర్చుకొను, ఇముడ్చుకొను, చేరిన, కలిసిన, మిళితమైన,ఇమిడిన, కూడుకొనిన, సంయుక్తమైన,యోజితమైన, సమేతమైన, జేతమైన, సహా, కలిసి, కూడి, చేరి, ఏకమై, ఒకటిగా, తో, కూడ. شامل حال -హాల్- ఒకే స్థితిలో, యథాప్రస్తుతముగా, యథాస్థితిగా, చేరి, కలిసి. شامل کرنا -కర్నా (ఉ) చేర్చుట, కూర్చుట, కలుపుట, జేతచేయుట, భాగము యిచ్చుట, చేర్చుకొనుట. شامل ہونا -హోనా(ఉ) కలియుట, చేరుట, కూడుట, జేతయగుట, సంబంధించుట, పాలుగొనుట.

**شاملات** షామిలాత్ (ఉ.పు) అవిభక్తాస్తి, సమష్ట్యాస్తి, ఉమ్మడి, పొత్తు,సహభాగము.

**شاملاتی** షామిలాతీ (ఉ) ఉమ్మడిగానున్న, సమష్టిగానున్న, పొత్తుగల.

**شامہ** షామ్మ(అ.పు)ఘ్రాణేంద్రియము;వాసన.

**شامیانا** షామియాన(తు.పు) పంచే,పందిరి, వితానము, మేలుకట్టు, చప్పరము, చదరపు గుడారము.

**شان** షాన్ (అ.స్త్రీ) గొప్పతనము, మహత్వము, ప్రకాశము,ప్రతాపము, విభవము, ఘనత, ప్రభావము,గౌరవము,ఆడంబరము, ప్రఖ్యాతి, పదవి, పరువు, మర్యాద, మానము, అంతస్తు, వైఖరి, ఠీవి, డౌలు, రీతి, అందము, రూపు, ఆకారము. شاندار -దార్ (పా) మహత్వముగల, ఘనమైన, గౌరవముగల, ఘనతగల, ఆడంబరమైన, విభవయుక్తమైన, దివ్యమైన, దొడ్డ,గొప్ప, శృంగారమైన, అలంకారమైన. شان و شوکت -ఒ,షౌకత్ (స్త్రీ) పటాటోపము, వైభవము, ఆడంబరము.

**شان** షాన్ (పా.పు) తేనెతెట్టె,తేనెపట్టు.

**شانہ** షాన (పా.పు) దువ్వెన; బుజము, స్కంధము; సాలెవానికుంచ.

**شاہ** షాహ్ (పా.పు) ప్రభువు, యజమాని, భర్త, దొర,రాజు,రేడు,గొప్ప,దొడ్డ,పెద్ద, స్వామి, ఆచార్యుడు, చదరంగములోని రాజు, తోసిరాజు [అనుట]. شاہ باز -బాజ్ (పు)వేటడేగ. شاہ بالا-బాలా (పా.పు) తోడుపెండ్లికొడుకు. شاہبلوط -బలూత్ (పు) సిందూర వృక్షము లేక ఫలము. شاہ پر -పర్ (పు) పక్షుల రెక్కలలోని పెద్దఈక. شاہ تیر -తీర్ (పు) దూలము. شاہ خاور -ఎ,ఖావర్ (పు) సూర్యుడు. شاہ درہ - దర (పు) రాజహర్మ్యముయొక్కగాని కోటయొక్కగాని చుట్టుప్రక్కలనుండు ఇండ్లు, రాచవాడ. شاہزادگی -జాదగీ (స్త్రీ) రాజకుమారత్వము,రాజకుమారుని కౌమారదశ. شاہزادہ -జాదహ్ (పు) రాజకుమారుడు, యువరాజు. شاہزادی -జాదీ (స్త్రీ) రాజపుత్రిక,రాచకుమార్తె. شاہسوار -సవార్ (పు) బంట్రౌతు, బాగా గుఱ్ఱముయెక్క నేర్చినవాడు, మేటి

రాతు. شاه صاحب - شاه جی - సాహిబ్ -జీ(పు) స్వాములవారు(పకీర్రుల గౌరవనామము). شاه گام -గామ్ (పు) అశ్వగతిభేదము, మందయానముగల (గుఱ్ఱము), సుందరయానముగల(గుఱ్ఱము).

شاه مشرق -మష్రిక్(పు) సూర్యుడు.

شاهانه షాహాన [పా] రాజార్హమైన, రాజయోగ్యమైన, రాజఠీవిగల, రాజకీయమైన, శ్రేష్ఠమైన, దొడ్డ;ఘనమైన, పెండ్లి వస్త్రములు, పెండ్లి దుస్తులు; సాయంకాలము;సాయంకాలపురాగము. (విశేషము.

شاهتره షాహ్‌తరహ్ (పా.పు) వనస్పతి

شاهد షాహిద్ (అ.పు) సాక్షి, చూచువాడు. (పా) అందమైన,మనోహరమైన, ప్రియురాలు, ప్రియమైన, మనోజ్ఞమైన, రూపసి. شاهد باز -బాజ్ (పు) సౌందర్య లోలుడు, స్త్రీలోలుడు. شاهد بازار -ఎ,బాజార్ (పు) వెలయాలు, భోగముది. شاهد حال ఎ,హాల్ (పు) ప్రత్యక్షముచూచినవాడు.

شاهدی షాహిదీ (అ. స్త్రీ) సాక్ష్యము, వాఙ్మూలము.

شاهنشاه షాహన్‌షాహ్(పా.పు) రాజాధిరాజు, రారాజు, చక్రవర్తి.

شاهنشاهی షాహన్‌షాహీ (పా)సామ్రాజ్యము, ప్రభుత్వము, చక్రవర్తిత్వము, రాజ్యము, రారాజసం॥, చక్రవర్తిసం॥.

شاهی షాహీ (పా)ప్రభుత్వము,రాజకీయమైన, రాజ యోగ్యమైన, రాజఠీవిగల, రాచ, రాజుయొక్క.

شاهین షాహీన్ (పా.పు) తెల్లడేగ, ఒక వేటపక్షి; త్రాసుదండె లేక ముల్లు.

شایان షాయాన్ (పా) శోభస్కరము, యోగ్యమైన, తగిన,అర్హమైన,ఉచితమైన.

شاید షాయద్ (పా) కావచ్చును, ఉండవచ్చును, యోగ్యము, ఉచితము;ఒకవేళ, కాబోలు, బహుశః, సాధ్యము, ఏమో.

شاید و باید -ఒ,బాయద్ (పా) యథోచితము,యథావిధి,కావలసినట్లు,బాగా, బహుశః,కాబోలు,ఉండవచ్చును,అగును.

شایستگی షాయిస్తగీ (పా. స్త్రీ) సంస్కారము, నాగరికత, సభ్యత, యోగ్యత, పెద్దమనిషితనము, మర్యాదలు, నమ్రత, సరసత్వము, సౌజన్యత, సుశీలత, దాక్షిణ్యము, సుశిక్షితత్వము.

شایسته షాయిస్త (పా)సంస్కృతమైన,నాగరికతగల, యోగ్యమైన,సభ్యతగల,తగిన, మర్యాదగల, నమ్రతగల, సరసమైన, సౌజన్యతగల, ఉచితమైన, సుశిక్షితమైన,సుశీలతగల, మర్యాదగల, దాక్షిణ్యముగల, బాగైన, పెద్దమనిషియైన,మంచి,వినయముగల, లొంగెడు.

شایع షాయెఉ (అ) బహిరంగమైన, ప్రచురమైన, ప్రకటమైన, బాహాటమైన, ప్రసిద్ధము. شایع هونا -హోనా (ఉ) ప్రచురమగుట,ప్రకటితమగుట,బహిరంగమగుట, ప్రసిద్ధమగుట.

شایق షాయక్ (అ) ప్రియుడు; ఆపేక్షగల, ఆశగల, ప్రియముగల, వాంఛగల, భ్రాంతిగల, కోరికగల, కాంక్షగల, ఇచ్ఛగల.

شب షబ్(పా. స్త్రీ) రాత్రి, రేయి,మాపు, شب باز -బాజ్ (పా) బొమ్మలాటవాడు. شب باش -బాష్(పా) నిశానివాసి, రాత్రియుండువాడు, రాత్రికియుండువాడు, రాత్రియంతయు ఉండువాడు.

**شب بخیر**-షబ్-బఖైర్ (పా) రాత్రి క్షేమముగా జరుగుగాక, ఆశీర్వాదపూర్వక వందనము. **شب برات** -షబ్-ఎ,బరాత్ (పా) పితృదినము, షాబాను నెలయొక్క ౧౪వతిథి. **شب باشی** -షబ్-బాషీ(పా) నిశావాసము, రాత్రికియుండుట, రాత్రియంతయు ఉండుట, మాపట్టిబస లేక విడిది లేక ఉనికి. **شب بیدار خیز** -షబ్-బేదార్-ఖేజ్(పా) జాగరణచేయువాడు. **شب بیداری خیزی** -బేదారీ-ఖేజీ (పా) జాగరణ, జాగరము, మేలుకొనుట. **شب تار تاریک** -ఎ,తార్-తారీక్(పా) చీకటిరేయి. **شب یلدا** -ఎ,యల్దా(పా) నిడుపైన చీకటిరేయి, దీర్ఘనిశ. **شب چراغ** -చిరాగ్ (పా) సూర్యకాంతమాణిక్యము. **شب خوابی** -షబ్-ఖాబీ (పా) మాపటిబట్టలు, పడకదుస్తు, మాపటినిద్ర. **شب خون** -ఖూన్(పా) మాపటిదాడి, రేదాడి, రాత్రివేళపైబడిచంపుట. **شب دیز** -దేజ్(పా.పు) నల్లగుఱ్ఱము. **شب دیگ** -దేగ్ (పా) రాత్రియంతయు సన్ననిమంటపై వండిన మాంసపు వంటకము. **شب رنگ** -రంగ్ (పా) చీకటివన్నెగల, నల్లని (గుఱ్ఱము). **شب زفاف** -షబ్-ఎ,జఫాఫ్ (పా) శోభనపురాత్రి, పాన్పునాటిరాత్రి, గర్భాదానపు నాటి రాత్రి. **شب شهادت** -ఎ, షహాదత్ (పా) మొహర్రముయొక్క ౯వ తిథి, మొహర్రము యొక్క ౧౦వ నాటిరాత్రి. **شب قدر** -ఎ, కదర్ (పా) ఖురానుగ్రంథము అవతరించినదినము, రంజానుయొక్క ౨౭వ తిథి. **شب کور** -షబ్-కోర్(పా) రేచీకటివాడు. **شب کوری** -కోరీ (పా)రేచీకటి. **شب کی شب** -కీషబ్ (పా) ఒక రాత్రి. **شب گرد** -షబ్-గర్ద్ (పా) తలారివాడు, రాత్రికావలివాడు. **شب ماه** -షబ్ **ماهتاب** -ఎ, మాహ్ -మాహ్‌తాబ్ (పా) వెన్నెలరేయి. **شب و روز** -షబ్-ఒ,రోజ్ (పా) రాత్రింబగళ్లు, రేయింబవలు.

**شب** షబ్బ (అ.పు) పటికారము.

**شباب** షబాబ్ (అ.పు) తారుణ్యము, యౌవనము, వయసు, నడివయసు, ఆరంభము, మొదలు.

**شبان** షబాన్ (పా.పు) పసులకాపరి, (గొల్లవాడు.

**شبانگاه** షబాంగాహ్ (పా. స్త్రీ) పశువులు మొ॥వి రాత్రిపూటయందుకట్టుమట్టు లేక కొట్టము; సాయంకాలము.

**شبانه** షబాన (పా) రాత్రియందు, మాపున.

**شبانه روز** -షబాన-రోజ్ -అహోరాత్రము, రాత్రింబగళ్లు, రేయింబవలు.

**شباهت** షబాహత్ (అ. స్త్రీ) సారూప్యము, పోలిక, సామ్యము, ఆకారము, రూపము, రూపురేఖావిలాసములు.

**شبد** షబ్ద్ (సం.పు) శబ్దము.

**شبر** షిబ్ర్ (అ.పు) జేన.

**شبستان** షబిస్తాన్ (పా.పు) పడకటిల్లు, ఏకాంతము, మందిరములలో రాత్రియుండి భగవద్ధ్యానముచేయుచోటు.

**شبگون** షబ్‌గూఁ (పా) చీకటివన్నెగల, మసకగానున్న.

**شبگیر** షబ్‌గీర్ (పా)కీచురాయి, ఇలకోడి,

ఒకపక్షి; మాపటిదాడి,రాత్రిలో పైబడుట.

**شبنم** షబ్‌నమ్ (పా. స్త్రీ) హిమము,మంచు.

**شبہ** షిబహ్ (అ. స్త్రీ) సారూప్యము,పోలిక, రూపము, ఆకారము.

**شبہ** షుబహ్(అ.పు) అనుమానము,సంభవము, ఏమ్యము, సందేహము, సందిగ్ధము, శంక, సంకోచము, భ్రాంతి, భ్రమ. (రైన.

**شبینہ** షబీన(పా)రాత్రిసం॥,మాపటి, చద్ది

**شبیہ** షబీహ్ (అ) సరూపము, సదృశము, పోలినది, పోలిక, ప్రతిమ, పటము, ఆకారము, రూపము.

**شپرک - شپرہ** షపర - షపరక్ (పా) గబ్బిలము, గబ్బిలాలు.

**شتاب** షితాబ్ (పా) శీఘ్రము,త్వర,వడి, ఆతురము, వేగము, తొందర,శీఘ్రముగా, త్వరగా, వెంటనే, బడాన, బిరాన, త్వరగల, వడిగల, వేగముగల. **شتابکار** -కార్ (పా) శీఘ్రకారుడు, చురుకుగలవాడు.

**شتابی** షితాబీ (పా. స్త్రీ) శీఘ్రము,త్వర, వడి, వేగము, తత్తర, తొట్రుప్రా, తొందర, త్వరగా, తొందరగా, బడాన, బిరాన, వ్యాకులము, కలత.

**شتالنگ** షితాలంగ్ (పా. పు)-చీలమండ; మడిమ, కాలుఎముక, కాలు.

**شتر** షుతుర్ (పా.పు) ఒంటె, లొట్టియ, లొట్టిపిట్ట. **شتربان** -బాన్ (పా) ఒంటెవాడు, ఒంటెతోలువాడు. **شتربےمہار** -బేమహార్ (పా) ముకుతాడు లేని ఒంటె, అడ్డమదుపులేనిది,పోకిరియైన, అవిధేయమైన, చెడిన, దిప్పకాయ, తలబిరుసైన, స్వేచ్ఛానువర్తియైన, ముకుత్రాడు లేని ఎద్దువంటి. **شترخانہ** -ఖాన [పా] ఒంటెలదొడ్డి లేక కొట్టము లేక లాయము.

**شترسوار** -సవార్ (పా)ఒంటెరౌతు.

**شترغمزہ** -గమ్‌జే (పా) పోకిరితనము, ఛలము, మోసము. **شترکینہ** -కీన(పా) అతిద్వేషి, అతికపటి, తీరని పగగలవాడు.

**شترگاو** -గావ్ (పా) పొడలలొట్టియ.

**شترمرغ** -మర్గ్ (పా) నిప్పుకోడి, నిప్పుదిండి, ఉష్ట్రపక్షి. **شترنال** -నాల్ (పా) బంబాసు, చిన్నతోపు (ఒంటెపై గట్టుదురు).

**شتری** షుతురీ (పా) ఒంటె బొచ్చుతో నేసిన వస్త్రము, రల్లకము, రాంకవము, ఒంటెపైపెట్టివాయించు భేరి లేక నగార. ఒంటెవన్నెగల, గోధుమ లేక బాదాము వన్నెగల. (వీరుడు, సాహసి.

**شجاع** షుజాఉ (అ) ధైర్యశాలి, శూరుడు,

**شجاعت** షుజాఅత్ (అ. స్త్రీ) ధైర్యము, శౌర్యము, సాహసము.

**شجر** షజర్ (అ.పు) వృక్షము, చెట్టు. **شجردار** -దార్- చెట్టువలె చెక్కిన ఉంగరపురాయి.

**شجرہ** షజర (అ.పు) వృక్షము,చెట్టు;వంశవృక్షము, వంశావళి; పొలము మొ॥వాని పటము.

**شحنہ** షహ్నహ్ (అ.పు) పరిపాలకుడు, ఊరి పోలుపత్తెగాడు, గ్రామాధికారి, తలార్రి, కావలివాడు.

**شخص** -షఖ్స్ (అ.పు) దేహము, ఆకారము, మూర్తి,ఒకడు,మనిషి, మనుష్యుడు.

**شخصیت** షఖ్‌సియత్ (అ. స్త్రీ)మూర్తిమత్వము, మానుషత్వము, గొప్పతనము, దొరతనము, కులీనత, పెత్తనము, సౌజన్యత,

మర్యాద, ఘనత, యోగ్యత, మానము, గౌరవము, పెద్దమనిషితనము, వైభవము, ప్రతాపము.

**شد** షుద్(పా) గతము, ఆరంభము, మొదలు, మూలము. **آمد شد** - ఆమద్ (పా) జరుగుచూవచ్చినది, ఆచారము, వాడుక, సాంప్రదాయము. **شد بد** -బుద్ (పా) స్వల్పజ్ఞానము, కొంచెముగా తెలిసియుండుట;

**شد** షద్ద్ (అ) ప్రబలత,కఠినత, గట్టి, దిట్టము. **مد شد** -ఒ, షద్ద్ (అ) పటాటోపము, వైభవము, ఠీవి, ప్రచండత,ప్రబలత, కఠినత, గట్టి, దిట్టము, బలవంతము, ప్రోద్బలము, ఒత్తిడి, బలాత్కారము.

**شدا** షద్దా (ఉ.పు) మొహర్రములో గుమ్మటముల (శవవాహనముల) తో గూడనుండు టెక్కెము.

**شدت** షిద్దత్ (అ. స్త్రీ) కఠినత, ఉద్రేకము, తీవ్రత, తీక్ష్ణత, కష్టము, బలిష్ఠత, ముమ్మరము, ప్రబలత, ప్రోద్బలము, బలవంతము, ఆధిక్యత, ప్రచండత,విశేషము,విస్తారము.

**شدنی** షుదనీ (పా. స్త్రీ) భావి, భవిష్యము, కాగలది, సాధ్యము,తరము,శక్యము, సంభావ్యము.

**شدھ** షుద్ధ్ (సం) శుద్ధము.

**شدید** షదీద్ (అ) కఠినమైన, ప్రబలమైన, కష్టమైన, అధికమైన, బలవంతమైన, బలిష్ఠమైన,ప్రోద్బలమైన.**شدیدالعداوت** -ఉల్,అదావత్ (అ) ప్రబలద్వేషి.

**شر** షర్ర్ (అ) దౌష్ట్యము,చెడ్డతనము,దుర్మార్గము, చెడ్డతనము, దుష్టత్వము, దొమ్మి, తంటాలు, తగులాటము, జేగడము. పోకిరితనము.

**شرا** షిరా (అ.పు) క్రియము, విక్రియము, కొనుగోలు, క్రియ విక్రియము.

**شراب** షరాబ్ (అ. స్త్రీ) పానము, త్రాగు పదార్థము, సారాయి,మద్యము, పానకము. **شراب پرتگالی** ఎ,పుర్తగాలీ (పా) బుడతగీచు సారాయి. **شراب خانہ** - ఖాన (పా) శుండ, మదిరాగృహము,సంధానశాల, మద్యశాల, సారాయి అంగడి. **شراب خوار** -ఖార్ (పా) త్రాగుబోతు. **شراب خواری** -ఖారీ (పా)త్రాగుడు,త్రాగుబోతుతనము. **شراب دوآتشہ** -ఎ, దోఆతిష (పా) రెండుమారులు సంధానముజేసినసారాయి, ఘాటుగలసారాయి. **شراب الطهور-طهرا** -ఉత్ తహూర్ -తహ్రా (పు) సోమరసము, అమృతము.

**شرابور** షరాబోర్ (పా) మునిగితేలిన, తడితడిగానున్న, నీళ్లుకారుచున్న,మిక్కిలి తడిసిన.

**شرابی** షరాబీ (పా.పు) త్రాగుబోతు, త్రాగిన, మత్తుగొనిన, మైకముఎక్కిన.

**شرادھ** ప్రాద్ధ్ (సం.పు)శ్రాద్ధము, అపరకర్మ.

**شرار** షరార్ (అ.పు) మిణుగురు, కణము, నిప్పురవ.

**شرارت** షరారత్ (అ. స్త్రీ) దౌష్ట్యము, దుర్మార్గము, దౌర్జన్యము, పోకిరితనము; అగ్గికణము, మిణుగురు; దొమ్మి, తిరుగుబాటు. **شرارتاً** షరారతన్-దౌష్ట్యము చేత, పోకిరితనముచేత, దుర్మార్గముచేత.

**شرارہ** షరార (అ.పు) అగ్గికణము, మిణుగురు, నిప్పురవ.

**شرافت** షరాఫత్ (అ. స్త్రీ) కులీనత, సౌజన్యత, గొప్పతనము, ఘనత, యోగ్యత,

సభ్యత, పెద్దమనిషి తనము, మర్యాద, సుశీలత, నాగరికత,

**شراکت** షరాకత్ (అ.స్త్రీ)సహభోగము, పొత్తు, ఉమ్మడి, సమ్మె, సంధి, వంతు, భాగము, పాలు, చేరిక,కూడిక, సంయోగము; వైరము, ప్రతిస్పర్ధ, దాయాదత్వము. **شراکت نامہ** -నామ(పు)ఉమ్మడి పత్రము.

**شرائط** షరాయిత్ (అ.స్త్రీ) ప్రతిజ్ఞలు, ఒడంబడికలు, నిబంధనలు,చట్టములు,నియమములు. (ఏ. వ **شریط**)

**شرب** షుర్బ (అ.పు) పానము, త్రాగుట.

**شربت** షర్బత్ (అ.పు) పానకము,పాకు.

**شربتی** షర్బతీ (పా) తియ్యనిమ్మపండు; రవసెల్లా, వలిపెము; ఎరుపు పసిమికలిసిన వన్నె లేక అట్టివన్నెగల ఉంగరపురాయి; సారవంతమైన, రసవంతమైన.

**شرح** షర్హ్–షరహ్ (అ.స్త్రీ)వివరణము, వ్యాఖ్యానము, భాష్యము, అర్థము, టీక, వర్ణనము; దర, వంతు, లెక్క, కట్టుబడి, వయినము. **شرح بندی** -బందీ (పా) ధరలవైనము,ధరలపట్టి లేక వర్గము. **شرح وار** -వార్ (పా) వయినముగా, క్రమానుసారము. (మిణుగురులు.

**شرر** షరర్ (అ పు) అగ్నికణము,నిప్పురవ,

**شرط** షర్త్ (అ.స్త్రీ) ప్రతిజ్ఞ, ఏర్పాటు, ఒడంబడిక, నిబంధన, నియమము,చట్టము, ఒడ్డు, పందెము, చిహ్నము.

**شرطیہ۔شرطی** షర్తీ-షర్తియ (అ) ప్రతిజ్ఞాపూర్వకమైన, నిబంధనపూర్వకమైన, సనియమమైన; నిశ్చయముగా, నిస్సంశయముగా, తప్పకుండ.

**شرع** షర్ఉ (అ) రాజమార్గము, ధర్మ మార్గము, మతము, మహమ్మదీయమతధర్మము, పద్ధతి, ఆచారము, సాంప్రదాయము.

**شرع محمدی** - ఎ,మహమ్మదీ (అ) మహమ్మదీయధర్మశాస్త్రము.

**شرعاً** షర్అన్ (అ) శాస్త్రతః, ధర్మానుసారము, మహమ్మదీయశాస్త్రానుసారముగా.

**شرعی** షర్ఐ (అ) ధర్మశాస్త్రోక్తమైన, మహమ్మదీయ ధర్మశాస్త్రోక్తమైన.

**شرف** షరఫ్ (అ.పు)అగ్రగణ్యత్వము,గౌరవము, గొప్పతనము, ఆధిక్యత. విశేషత, ఉత్తమత, శ్రేష్ఠత, ప్రతిష్ఠ; పదవి, మర్యాద, పరువు. **شرف لیجانا** -లేజానా (ఉ) అగ్రగణ్యతనుపొందుట, ఆధిక్యతనొందుట, మించుట, మీరుట. **شرف یاب** -యాబ్ (పా) ఖ్యాతి పొందిన, గౌరవముపొందిన, సత్కారముపొందిన.

**شرق** షర్క్ (అ.పు) ఉదయాద్రి, ఉదయము, తూర్పు, పూర్వదిశ.

**شرقی** షర్కీ (అ) పౌరాత్యమైన, తూర్పు సం॥.

**شرک** షిర్క్ (అ.పు) మేళనము,కలపటము, ఉమ్మడి, పొత్తు;విగ్రహారాధనము, ఈశ్వరునియొక్క అద్వితీయభంగము; వ్యభిచారము.

**شرکت** షిర్కత్(అ.స్త్రీ)చూడు**شراکت**

**شرم** షర్మ్ (పా.స్త్రీ) సిగ్గు,బిడియము,లజ్జ. **شرمناک** -నాక్ (పా) లజ్జాళువైన, లజ్జాకరమైన. **شرمگاہ** - గాహ్ (పా) సిగ్గు, సిగ్గుపట్టు, గుహ్యేంద్రియము.

**شرما شرمی** షర్మాషర్మీ(ఉ)అభిమానము, సిగ్గుబిడియములు,అభిమానముచేత,సిగ్గుతో బిడియముతో.

**شرمالو** షర్మాలూ (పా) లజ్జాళువైన, బిడియముగల, సిగ్గుగల.

**شرمانا** షర్మానా (ఉ) అభిమానించుట, సిగ్గుపడుట, లజ్జించుట, బిడియపడుట,సిగ్గుపరచుట,భంగపరచుట, అవమానించుట.

**شرماو** షర్మావ్ (ఉ) చూడు **شرمالو**

**شرمسار** షర్మ్సార్ (పా) లజ్జాళువైన, లజ్జావంతుడైన, సిగ్గుపడిన. లజ్జగొనిన.

**شرمساری** షర్మ్సారీ (పా.స్త్రీ) లజ్జాళుత్వము, సిగ్గు, బిడియము, లజ్జ.

**شرمگین** షర్మ్గీన్ (పా) లజ్జాళువైన, బిడియపడెడు, సిగ్గుపడెడు.

**شرمندگی** షర్మందగీ (పా. స్త్రీ) సిగ్గు, బిడియము, లజ్జాళుత్వము, అవమానము, భంగము, చిన్నతనము.

**شرمنده** షర్మింద (హి) లజ్జాళువైన, బిడియముగల, సిగ్గుపడిన, లజ్జితుడైన, ఉపకృతినొందిన.

**شرمیلا** షర్మీలా (ఉ) చూడు **شرماو**

**شروال** షర్వాల్(పా.పు)చెల్లడము,లాగు.

**شروط** షురూత్(అ. స్త్రీ) చూడు(ఏ.వ**شرط**)

**شروع** షురూఅ (అ.పు)ఉపక్రమము,ఆరంభము,మొదలు,ఆది,మూలము, **شروع کرنا** -కర్నా (ఉ) ఉపక్రమించుట, ప్రారంభించుట, మొదలుపెట్టుట. **شروع هونا** -హోనా (ఉ) ప్రారంభమగుట, మొదలగుట.

**شریان** షిర్యాన్ (అ.స్త్రీ) ధమని, రక్తనాళము, నాడి, (షిరము, సిర).

**شریر** షరీర్ (అ) దుష్టుడైన, దుర్మార్గుడైన, పోకిరి, పాపిష్టి, చెడు.

**شریعت** షరీఅత్ (అ.స్త్రీ)ధర్మశాస్త్రము, మహమ్మదీయధర్మశాస్త్రము, ధర్మము,పవిత్రత, పరిశుద్ధత.

**شریف** షరీఫ్ (అ) గొప్పవంశస్థుడైన,గౌరవముగల,అగ్రగణ్యుడు,కులీనుడైన, పరువుగల, సజ్జనుడైన, మర్యాదగల, పెద్దమనిషియైన, యోగ్యుడైన, సభ్యుడైన, నాగరికతగల, సశిక్షితుడైన, శ్రీయుతమైన,పవిత్రమైన, (గౌరవార్థకము). **شریف قوم** -కౌమ్ (పు) కులనాయకుడు, కులాగ్రగణ్యుడు.

**شریفه** షరీఫ (పా) శ్రీఫలము,సీతాఫలము.

**شریک** షరీక్ (అ) సహకారి, సహభోగి, భాగస్థుడు, పాలివాడు, ఉమ్మడిదారుడు, దాయాది, బంధువు, కావలసినవాడు, జేతకాడు, సహాయుడు,సహవాసి,చెలికాడు; వైరి, పగవాడు, సాటివాడు; సహభోగమైన, కలిసిన, చేరిన, కూడిన, పొత్తుగల, జేతపడిన, ఉమ్మడియైన, సమష్టియైన,జేతయైన. **شریک حال** -హాల్ (పా) చూడు **شامل حال** . **شریک هونا** -హోనా (ఉ) చేరుట, పొత్తుకలియుట, కలియుట, పాలుగొనుట, జేతపడుట.

**شست** షస్త్ (పా. స్త్రీ)పెద్దవేలు, అంగుళిత్రము, కుట్రపువారు లేక విలుకాండ్రు, బొటనవ్రేలికి పెట్టుకొను చుట్టు; చేపలగాలము; లక్ష్యము, గురిపట్టు, గురి; భూమి కొలతలో సరళత్వము చూచుటకు వాడుకొను శంఖు అను సాధనము.

**شستر** షస్తర్ (హి.పు) శస్త్రము.

**شسته** షుస్త (పా) కడిగిన, పరిశుభ్రమైన, శుద్ధమైన, స్వచ్ఛమైన, చేతిగుడ్డ.

**شش** షుష్(పా.పు)శ్వాసకోశము,ఊపిరితిత్తి.

**شش** షష్ (పా) ఆరు. **شش پهلو** -పహ్లూ (పా) షడ్భుజము, షట్కోణము.

**ششدانگ** - దాంగ్ (పా) అఖండము, అంతయు. **شش ماهی** ‑ మాహీ (పా) షాణ్మాసికము. **شش پنج** ‑ పంజ్ (పా) ఆరుమూడు, వెనుకముందు, జూదము, పాచికలు, ఆలోచన, అనుమానము, సందిగ్ధము, సంకోచము, చిక్కు, చింత, వ్యాకులము.

**ششدر** షష్దర్ (పా.పు) షడ్ద్వారము, షడ్భుజము, పాచిక, చిక్కు, సంకటము; దిగ్భ్రమచెందిన, బమ్మెరపోయిన, కలవరపడిన, వ్యాకులపడిన.

**ششم** షషుమ్ (పా) షష్టము, ఆరవది.

**شط** షత్ (అ) నదీతీరము, ఒడ్డు.

**شطاح** షత్తాహ్ (అ) దుష్టుడైన, పోకిరి, పలవ, తులువ, కూళయైన, మాయలమారి, లజ్జాహీనమైన, సిగ్గుచేటైన, కామాతురతగల.

**شطرنج** షత్రంజ్ (అ. స్త్రీ) చదరంగము, చతురంగము. **شطرنج باز** ‑ బాజ్ (పు) చదరంగపు ఆటగాడు. **شطرنج بازی** ‑ బాజీ (స్త్రీ) చదరంగపుఆట.

**شطرنجی** షత్రంజీ (పా. స్త్రీ) రత్నకంబళి.

**شعار** షఆర్ (అ.పు) అడుగుబట్ట, [షిఆర్] లాంఛనము, సౌజ్ఞాపదము, సేనలోనివారు ఒకరిని ఒకరు గుర్తుపట్టుటకు ఏర్పరచుకొన్న పదము; పద్ధతి, వైఖరి, రీవి, రీతి, ఆచారము, వాడుక, సాంప్రదాయము, వర్తనము, నడవడిక, అలవాటు.

**شعاع** షుఆ (అ. స్త్రీ) సూర్యకిరణము, ఎండ, రశ్మి, ప్రకాశము, కాంతి, ప్రభ, తేజస్సు, వెలుగు.

**شعبده** షుఒబదహ్ (అ.పు) కనుకట్టు, గారడి, మాయ, యక్షిణి, మోసము, టక్కు. **شعبده بازگر** ‑ బాజ్ ‑ గర్ (పా) గారడివాడు, కనుకట్టువాడు. **شعبده بازی** ‑ బాజీ [పా] కనుకట్టు విద్య, యక్షిణివిద్య, గారడి.

**شعبه** షుఅబ (అ.పు) సమాజము, జట్టు; శాఖ, కొమ్మ; రాగము; నదీశాఖ, కాలువ, వాగు.

**شعر** షెఉర్ (అ.పు) జ్ఞానము, తెలివి; పద్యము, పదము, కవనము. **شعرتر** ‑ తర్ (పా) సరసపదము. **شعرگوئی** ‑ గోయీ (పా) కవిత్వము.

**شعرا** షుఅరా (అ.పు) కవులు, కవీశ్వరులు. [ఏ.వ شاعر]

**شعله** షుఒల (అ.పు) జ్యోతి, జ్వాల, మంట, ప్రభ, ప్రకాశము, నిప్పు, ఆగ్రహము. **شعله بهبهوکا** ‑ భభూకా (ఉ) మండిపడెడు, కోపావేశముగల, అతిసుందరమైన. **شعله جواله** ‑ జవాల (ఉ) జ్వాలామయము, **شعله رو** ‑ రూ (పా) అతిసుందరమైన, దేదీప్యమానముఖముగల.

**شعور** షఉూర్ (అ.పు) జ్ఞానము, తెలివి, వివేకము, బుద్ధి. **شعور پکڑنا** ‑ పకడ్నా (ఉ) బుద్ధి తెలియుట, జ్ఞానము వచ్చుట, బుద్ధినేర్చుకొనుట, వివేకము తెచ్చుకొనుట, జ్ఞానియగుట, తెలివిగలవాడగుట.

**شغال** షిగాల్ (అ.పు) నక్క, సృగాలము.

**شغب** షగబ్ [అ.పు] అల్లరి, లొల్లి, రంతు.

**شغل** షగల్ ‑ షుగల్ ‑ షగల్ ‑ షుగుల్ (అ.పు) ఉద్యోగము, పని, వృత్తి, వ్యాపారము, ధ్యానము, తలంపు, భగవద్ధ్యానము; ఆటపాటలు, వినోదము.

**شفاء** షిఫా (అ. స్త్రీ) చికిత్స, వైద్యము, ఔషధము, ఆరోగ్యము, స్వస్థత, కుదురుబాటు. **شفاخانه** ‑ ఖాన (పా) వైద్యశాల, ఆరోగ్యశాల, చికిత్సాగృహము.

**شفاعت** షఫాఅత్ (అ.స్త్రీ) మాధ్యస్థము, మధ్యవర్తిత్వము, అడ్డ పడుట, సహాయ పడుట.

**شفاف** షఫ్ఫాఫ్ (అ) స్ఫటికమువంటి, అతి నిర్మలమైన, స్వచ్ఛమైన, అద్దమువంటి.

**شفافی** షఫ్ఫాఫీ (అ.స్త్రీ) నైర్మల్యత, స్వచ్ఛత.

**شفتالو** షఫ్తాలూ (పా.పు) దొండపండు వంటి యొక ఎఱ్ఱనిపండు. (Peach.)

**شفتل** షఫ్తల్ (ఉ) భ్రష్టురాలు.

**شفق** షఫక్ (అ.స్త్రీ) సంధ్యారాగము, సంధ్య, సంజె, సంధ్యావేళ, సౌందర్యము, దయ, అనుగ్రహము.

**شفقت** షఫకత్ (అ.స్త్రీ) వాత్సల్యము, కటాక్షము, అనుగ్రహము॥ దయ, కనికరము, ప్రియము, ప్రేమ, కృప, సహానుభూతి.

**شفیع** షఫీఉ (అ.పు) ప్రార్థకుడు. మధ్యవర్తి, మాధ్యస్థుడు, అడ్డపడువాడు, సహాయపడువాడు.

**شفیق** షఫీక్ (అ) కృపాళువైన, కటాక్షముగల, దయాళువైన, అనుగ్రహముగల. వాత్సల్యముగల, ప్రేమగల, దయగల, కనికరముగల, దయగలస్నేహితుడు.

**شق** షక్క్ (అ.పు) పగులు, బీట, వ్రయ్య, బీటిక, పగిలిన, ఛిద్రమైన; ఉదయము పగిలిన. **شق ہونا** -హోనా (ఉ) పగులుట.

**شقایق** షకాయిక్ (అ.పు) పగుళ్లు, బీటలు. [ఏ.వ **شقیقہ**]

**شقہ** షక్కః (అ.పు) శ్రీముఖము, చీటి, రాజు గాని కొప్పుగారుగాని వ్రాసినది; చీలిక, సగముతునక.

**شقی** షకీ (అ) దౌర్భాగ్యుడైన, దురదృష్టుడైన, దిక్కు-మాలిన; దరిద్రుడు.

**شقیقہ** షకీక (అ.పు) కణత; కంటికడ; ఒంటితలనొప్పి, పార్శ్వపుతలనొప్పి.

**شک** షక్క్ (అ.పు) అనుమానము, శంక, సందేహము, అపనమ్మకము, సందిగ్ధము, సంశయము. **شک رفع کرنا** - రఫఉ కర్నా- సంశయముతీర్చుట.

**شکار** షికార్ (హి.పు) మృగయ, వేట; మృగము; వేటజంతువు, మాంసాహారము. **شکار افگن** -అఫ్గన్ (పా) వేటరి, వేటకాడు. **شکار بند** - బంద్ (పా) వేట (జంతువును) కట్టు త్రాళ్లు. **شکار پیشہ** - పేష (పా) వేటవలన జీవించువాడు, మృగయాజీవుడు. **شکار گاہ** -గాహ్ (పా) వేటపట్టు.

**شکاری** షికారీ (పా.పు) వేటరి, వేటకాడు, మృగయుడు; వేటాడెడు, వేటసం॥.

**شکایت** షికాయత్ (అ.స్త్రీ) మొర, నింద, చాడి, దూషణ, కొండెము; వ్యాధి, జాడ్యము, జబ్బు, శోకము.

**شکتی** షక్తి (హి.స్త్రీ) శక్తి.

**شکر** షుక్ర (పా.స్త్రీ) కృతజ్ఞత, మేలుమరువమి, వందనము, ఉపకార స్మరణము. **شکرگزار** -గుజార్ (పా) కృతజ్ఞుడు, మేలుమరువని. **شکرگزاری** -గుజారీ (పా) కృతజ్ఞతాద్యోతనము, ఉపకారప్రశంస, ఉపకారస్మరణము, కృతజ్ఞత, వందనము.

شکر - شکر షకర్ - షక్కర్ (పా. స్త్రీ) షక్కర, చక్కెర, పంచదార. شکر پارہ -పార (పా) చక్కెరబిళ్లలు అను నొక తినుబండము. شکر تری -తరీ(పా)రవ చక్కెర, తెల్లతంపదార. شکر خورہ -ఖోర (పా) తీపియందిష్టముగలనొకపిట్ట. شکر رنجی -రంజీ (పా) అలక, అలుగుట; ప్రణయ కోపము, ప్రియులలో అప్పుడప్పుడుకలుగు అసమాధానము,పైపై కోపము. شکرقند -కంద్ (పా)తియ్య కంద, గెనుసుగడ్డ; కలకండ,పటికిబెల్లము.

شکرانہ షుక్రాన(పా.పు) కృతజ్ఞతాసూచకము, కృతజ్ఞతపూర్వకముగానిచ్చుద్రవ్యము.

شکرہ షిక్ర (పా.పు), సాళువపక్షి, డేగ, శ్యేనము. (నము, వందనము.

شکریہ షుక్రియ (పా.పు) కృతజ్ఞతాసూచ

شکست షికస్త్ (పా. స్త్రీ) భంజనము, భంగము, పగులు,విఱుగు,ఓటు, అపజయము. నష్టము, తుట్టి, తరుగు, شکست فاش -ఫాష్ (పా)సంపూర్ణాపజయము,స్పష్టమైనఅపజయము.

شکستگی షికస్తగీ (పా. స్త్రీ) భంగము, పగులు, విఱుగు, ఓటమి, అపజయము, అథైర్యము, విచారము.

شکستہ షికస్త (పా) భగ్నమైన, పలిగిన, విరిగిన, చెడిన, పడిన, నష్టపడిన,నష్టమైన. شکستہ حال -హాల్ (పా) దుర్దశలో నున్న, కష్టదశలోనున్న,దురవస్థలోనున్న, ఆపద్గ్రస్తుడైన. شکستہ حالی -హాలీ (పా) దురవస్థ, దుర్దశ, కష్టదశ, ఆపన్నత, شکستہ خاطر-دل -ఖాతిర్-దిల్(పా) ఖిన్నహృదయుడైన, మనస్సుచిన్నపోయిన, వ్యసనగ్రస్తుడైన. شکستہ دلی - దిలీ (పా) మనఃక్షోభము, వ్యసనము. شکستہ خط -ఖత్ (పా) కలిపివ్రాత, గొలుసుకట్టు,గొలుసుకత్తువ్రాత, గొలుసు,మోడి.

شکل ష(క్)కల్ (అ. స్త్రీ) ఆకారము,రూపము, ఆకృతి, పోలిక, పటము, చిత్తరువు, వైఖరి, భంగి, ఠీవి, రూపురేఖలు, పద్ధతి, రీతి, ప్రకారము, విధము, తెరగు, ఉపాయము, మార్గము, స్థితి, గతి, వయినము, ప్రతిజ్ఞ. شکل وشمائل -ఒ,షమాయిల్ (అ) అందము, రూపురేఖావిలాసములు.

شکم షికమ్ (పా.పు) కడుపు, పొట్ట. شکم بندہ -پرور -బందె-పర్వర్ [పా] తిండిపోతు, ఉదరపోషకుడు.

شکمی షికమీ (పా) గూఢమైన, రహస్యమైన, లోపలి, అంతరంగపు, జన్మసం॥, పుట్టుక సం॥,సహజమైన. شکمی اندھا -అంధా(ఉ)పుట్టుగ్రుడ్డి. شکمی شریک -షరీక్ (పా) లోపాయకారి, లోభాగస్థుడు, స్వంతపాలివాడు.

شکن షికన్ (పా. స్త్రీ) ముడుత, మడత, పగులు, బీట, పగలగొట్టువాడు.

شکنجہ షికంజ (పా.పు) బొండుకొయ్య, ఒత్తుడుపలకలు,పుస్తకముల అట్టకట్టువాని యొద్దనుండు నొకచిన్న యంత్రము; చిత్రహింస, బాధ, కష్టము.

شکنی షికనీ (పా. స్త్రీ) భంగము, పగులు, ఓటమి, అపజయము (సమాసములలో).

شکوفہ షికూఫ (పా.పు) పుష్పము,పువ్వు; కాంతి. (చెప్పుకొనుట, అంగలార్పు.

شکوا شکوہ షిక్వా-షిక్వ(పా.పు)మొఱ,

شکوہ షికోహ్ (పా. స్త్రీ) పటాటోపము, ఆడంబరము, వైభవము, డంబము.

شکی షక్కీ (పా) సంశయాత్ముడైన, అను

మానములగల, నమ్మకములేని. (తాళిమి.

شکیب షికేబ్ (పా. స్త్రీ) సహనము, ఓర్పు,

شکیبا షికేబా (పా) మిగుల సహనముగల, మిగులఓర్పుగల, తాళిమిగల.

شکیبائی షికేబాయీ (పా. స్త్రీ) దీర్ఘ సహనము, మిక్కిలి ఓర్పు. (చక్కని.

شکیل షకీల్ (అ) రూపసియైన, అందమైన,

شگاف షిగాఫ్ (పా. పు) చీలిక, పగులు, బీటిక, బీట, చీలిక, సందు.

شگرف షిగర్ఫ్ (పా) అపరూపమైన, అందమైన, సొగసైన, సొంపైన, ఘనమైన, దొడ్డ, ప్రబలమైన. (అచ్చెరువు.

شگفت షిగఫ్త్ (పా. స్త్రీ) ఆశ్చర్యము,

شگفتگی షిగుఫ్తగీ (పా. స్త్రీ) వికాసము, వికసించుట, పూయుట, పూత; ఆనందము. కల్యాణము, వృద్ధి, తేజరిల్లుట, ఉల్లాసము.

شگفتہ షిగుఫ్తహ్ (పా) పూచిన, వికసించిన, ఆనందమైన, సంతోషముగల, ఉల్లాసముగల.

شگن షగున్ (హి. పు) శకునము, సగినము.

شگوفہ ష(షి)గూఫ (పా. పు) పువ్వు, మొగ్గ; చమత్కారము, వింత, వినోదము, సొద్దము, అపరూపము.

شگون షగూన్ (పా. పు) చూడు شگن

شگونیا షగూనియా (పా. పు) జ్యోతిష్కుడు, ప్రశ్న చెప్పువాడు, సగినముజూచువాడు.

شل షల్ (అ) కాళ్లుచేతులు చచ్చిపోవుట, అలయుట, సొమ్మసిలుట, సొలయుట, డస్యుట, పలుచని.

شلق شلک షిల్క్-మల్క్ (అ) తుపాకుల మోత, గుండ్లబారుమోత, పిరంగుల మ్రోత; చెబుకుదెబ్బచెప్పుడు.

شلوار షల్వార్ (పా. పు) చెల్లాడము, లాగు, చెల్లడము.

شلوکا-شلوکہ షలూకా-క (పా. పు) అర చొక్కకుబుసము, మొండిచేతుల కుబుసము.

شلہ షల్ల (పా. పు) పెంటదెబ్బ, పెంటకుప్ప; విగ్రహము, మూర్తి; ఇరుకుత్రోవ; చీలిక, బట్టపీలిక.

شما షుమా (పా) మీరు.

شماتت షమాతత్ (అ. స్త్రీ) ఒకరి కీడునకు సంతోషించుట.

شمار షుమార్ (పా. పు) గణనము, లెక్క, సంఖ్య, ఎన్నిక. ● شمارکنند -కునింద (పా) భిన్నాంకముయొక్క పైఅంకె, అంశము, లవము, గుణకము.

شماری షుమారీ (పా. స్త్రీ) గణనము, ఎన్నిక, ఎంచుట; జపమాల.

شمال షి(షు)మాల్ (అ. పు) ఎడమ చేయి, ఎడమతట్టు, ఉత్తరము.

شمالی షుమాలీ (అ) ఉత్తరపు, ఉత్తరదిశాసం॥.

شمائل షమాయిల్ (అ. పు) గుణములు, అలవాటులు, స్వభావములు, లక్షణములు.

شمر షిమర్ (అ. పు) హజరతు ఇమాము హుసేనునువధించిన సేనాని పేరు; క్రూరుడు, భ్రష్టుడు, దుష్టుడు.

شمردہ షుముర్ద (పా) గణితమైన, లెక్కపెట్టిన, ఎంచేబడిన.

شمس షమ్స్ (అ. పు) సూర్యుడు.

شمسہ షమ్స (అ. పు) జపమాలకు వేసియుండు చిన్న కుచ్చులు; మసీదుల గుమ్మటములపై నుండు చంద్రవంక.

شمسی షంసీ (అ) సూర్య సం॥, شمسی سال -సాల్ (పా) సౌరవర్షము, సౌర మానవత్సరము.

**شمشاد** షంషాద్ [పా.పు] ఒకవిధమైన చీకటిమాను, చక్కని పొడుగాటిచెట్టు.

**شمشیر** షంషీర్ (పా.స్త్రీ) ఖడ్గము, కత్తి.

**شمع** షమఽ (అ.స్త్రీ) మైనము, మైనపువత్తి, దీపము, దివ్వె, దివియ. **شمعدان** -షమ్ఽ-దాన్ (పా) ప్రమిద, సెమ్మె,దివ్వె. **شمع رو** -రూ (పా) దేదీప్యమానముఖముగల, అందమైన. **شمع سحری** -సహరీ (అ) ప్రాతఃకాలపు దివ్వె, ఆరిపోనున్న దీపము.

**شمله** షంల (అ.పు) నడికట్టు, కాసెకోక, దట్టి, తలగుడ్డ. శిరోవస్త్రము, మొలపట్టి యొక్కగాని తలగుడ్డయొక్కగాని జారవిడిచినకొంగు లేక కొన.

**شمن** షమన్ (పా.పు) విగ్రహారాధకుడు.

**شمول** షుమూల్ (అ.పు) సమగ్రము,ఆసాంతము, అంతయు; చేర్చుకొని, కలుపుకొని.

**شمه** షమ్మ (అ.పు) అణువు,రవంత,కొంచము, కొంచముసువాసన. (ళము.

**شمیم** షమీమ్ (అ. స్త్రీ) సుగంధము, పరిమ

**شناخت** షినాఖ్త్ (పా. స్త్రీ) జ్ఞానము, ఆకళింపు, తెలివి, గురుతు, పరిచయము, వివేకము.

**شناس** షినాస్ (పా)జ్ఞానముగల, తెలిసిన, ఎరిగిన, పరిచయముగల.

**شناسا** షినాసా (పా.పు) తెలియువాడు, కనుగొనువాడు, గుర్తించువాడు, ఎరుగువాడు. (పరిచయము.

**شناسائی** షినాసాయీ (పా. స్త్రీ)ఎరుక,

**شناور** షినావర్ (పా)ఈతకాడు, చురుకుగలవాడు.

**شناوری** షినావరీ(పా. స్త్రీ) ఈదులాట, ఈత, చురుకుదనము.

**شنبه** షంబ(పా.పు) శనివారము.

**شنجرف۔شنگرف** షంజర్ఫ్-షంగర్ఫ్ (పా.పు) ఇంగిలీకము.

**شنگرفی** షింగర్ఫీ(పా) ఇంగిలీకవన్నెగల, కోతిపిల్లమామిడికాయ.

**شنید** షనీద్ (పా) వినబడిన,వినిన,శ్రుతము; పక్షిముక్కు. (ఉతుకునది.

**شو** షూ-షో [పా] ప్రక్షాలకము,కడుగునది,

**شو** షూ (పా.పు) మగడు, భర్త.

**شو** షివ్ (హి.పు) శివుడు.

**شوال** షవ్వాల్ (అ.పు) అరబ్బుల పదియవ చాంద్రమాసము. (డ్డ, తలగుడ్డ.

**شوب** షోబ్ (పా.పు) ఉతుకుట, చేతిగు

**شوخ** షోఖ్ (పా) దుర్మార్గుడైన, అవినీతుడైన, పోకిరియైన, తుంటరియైన,దుష్టుడైన, పొగరుబోతైన, అహంకారియైన, సాహసియైన, దురుసైన, అడ్డము అదుపులేని, తంటాలమారి; సిగ్గుమాలిన,అవిధేయుడైన,అధికప్రసంగియైన;ఉటంకియైన,జాణయైన; చపలమైన, చంచలమైన; దిప్పకాయయైన, ఆటకాయయైన,వినోదకాడైన; కామాతురతగల, విలాసప్రియుడైన;గాఢమైన(వన్నె). **شوخ چشم-دیده** -చష్మ్-దీద (పా) నిర్భయదృష్టిగల, సిగ్గుబిడియములేని చూపులుగల; సిగ్గుమాలిన, పోకిరియైన, తుంటరియైన, పలవరియైన.

**شوخی** షోఖీ (పా. స్త్రీ) అవినీతత్వము, దురుసుతనము, దుర్మార్గము, పోకిరితనము, ఆటకాయతనము, తుంటరితనము, పొగరుబోతుతనము, అహంకారము, అవిధేయత, అధికప్రసంగము; నిర్భయము, హఠము, సాహసము, సిగ్గుమాలినతనము; చంచలత, చపలత, తొందర, చాంచల్యము.

شودر షూదర్ (హి.పు) శూద్రుడు.

شور షోర్ (పా.పు) అల్లరి, లొల్లి, రంతు, కేక, బొబ్బ, గంద్రగోళము, కోలాహలము, అల్లకల్లోలము, అరుపు, సందడి, కలకలము, దురదృష్టము, భయము, కలత, దొమ్మి.

شورپشت -పుష్త్ (పా) చూడుము شوره پشت.

شوروشر - پشت -ఒ,షర్ (పా) దొమ్మి, జగడము, పోట్లాట, కోలాహలము, అల్లకల్లోలము.

شور షోర్ (పా.పు) క్షారము, ఉప్పు, ఉప్పని, ఉప్పుమంటి, చాటి(నేల). شوربخت -బఖ్త్ (పా) దౌర్భాగ్యుడు. شورزمین -జమీన్ (పా) ఊషరక్షేత్రము, చాటినేల.

شورےکی پتلی షోరేకీపుత్లీ (ఉ) లావణ్యవతి, అతిసుందర స్త్రీ, అందకత్తె.

شورا షోరా (పా.పు) సురేకారము, వెట్లుప్పు. شوراآب -ఆబ్ (ఉ) ఉప్పునీళ్లు. شورےکاتیزاب షోరేకాతేజాబ్ (ఉ) వెట్లుప్పుద్రావకము.

شوربا షోర్‌బా [పా.పు] చూడుము شوروا

شورش షోరిష్ (పా. స్త్రీ) దొమ్మి, కలత, అల్లరి, జగడము, కల్లోలము, గంద్రగోళము.

شوروا షోర్వా (ఉ.పు) మాంసరసము, మాంసపుకట్టు, పచ్చడిమొ॥ వానిఊట తేక రసము.

شوره షోరహ్ (పా.పు) చూడుము شورا అను పదము. شوره پشت -పుష్త్ (పా) అవిధేయుడు, పొగరుబోతు, పెడసరమైన, మూర్ఖమైన, జగడాలమారి, లొంగని. شوره پشتی -పుష్తీ (పా) అవిధేయత, పొగరుబోతుతనము, పెడసరము, మూర్ఖత్వము, జగడగొండితనము, జగడము, దొమ్మి, తన్నులాట, పోట్లాట, పీకులాట. (ఉప్పన.

شوریت షోరియత్ (ఉ. స్త్రీ) ఉప్పదనము,

شوریده షోరీద (పా) కళవళపడిన, వ్యాకులతనొందిన, కలతనొందిన, భ్రమపడిన, పిచ్చిపట్టిన, వెర్రిపట్టిన, ఉన్మత్తుడైన, ఖిన్నుడైన, విచారగ్రస్తుడైన.

شوشه షూశ (పా.పు) ఖండము, తునక, ముక్క, తునియ, భాగము, అంశము; బంగారుమొ॥ వానికడ్డి; మంటికుప్ప, దిబ్బ, ప్రోగు, కుప్ప; కల్పన, వింతమాట, పీకులాటమాట; కొన్ని అక్షరముల పొక్కిలి లేకగంటు. شوشه اٹھانا -ఉఠానా (ఉ) జగడముకల్పించుట, వింతమాట పుట్టించుట.

شوق షౌక్ (అ.పు) అపేక్ష, వాంఛ, కాంక్ష, కోరిక, ఇచ్ఛ, భ్రాంతి, ఆశ, అభిలాష, రుచి, ఇష్టము, అభిరుచి; ముచ్చట, వలపు కామము, ఉత్సాహము, ఉల్లాసము; తత్పరత, శ్రద్ధ, ధ్యానము, లహరీ; పని, ఉద్యోగము. شوق ذوق -జౌక్ (అ) ఉత్సాహము, ఉల్లాసము, సంతోషము.

شوقین షౌకీన్ (అ) అభిలాషగల, అభిరుచిగల, వాంఛగల, ఇచ్ఛగల, అపేక్షగల, భ్రాంతిగల, జిజ్ఞాసగల; విలాసవంతుడు, సొగసుగాడు, వినోదగాడు, ప్రియుడు, కామాతురుడు, వలపుకాడు, జిజ్ఞాసువు; అలవాటుపడినవాడు, అభ్యాసకుడు.

شوقیہ షౌకియ (అ) అత్యాతురుడు, ఉత్సుకుడు, ప్రియుడు.

شوکت షౌకత్ (అ. స్త్రీ) ప్రబలత, బలము, వైభవము, ఆడంబరము, పటాటోపము,

పరువు, ఘనత, గొప్పతనము, గౌరవము, అంతస్థు, పదవి, దశ.

**شولم** షోల (పా.పు) చూడు **شلم**

**شوم** షూమ్ (అ) అశుభమైన, అమంగళమైన, అపశకునమైన, దౌర్భాగ్యమైన, పిసినారి.

**شومڈا** షూమ్‌డా (ఉ.పు) కృపణుడు, పిసినారి.

**شومی** షూమీ (అ.పు) దౌర్భాగ్యము, దరిద్రము, పిసినారితనము, అశుభము.

**شومیت** షూమియత్ (అ.స్త్రీ) దౌర్భాగ్యము, దరిద్రము, అశుభము, పిసినారితనము.

**شوهر** షౌహర్ (పా.పు) భర్త, మగడు.

**شه** షహ్ (పా.పు) ప్రభువు, రాజు; పెద్దది, గొప్పది; చదరంగములో రాజును ఎదిరించె ననుటకు సౌంజ్ఞ; త్రోసిరాజనుట, పెండ్లి కొడుకు; ఆటంకము, నిరోధము, అడ్డు; వదలు, సళ్లు; గాలిపడగ దారమును కొద్ది కొద్దిగా విడచుటు; ప్రోత్సాహము, సహాయము, పురికొలుపుట, రేపుట. **شهباز** - బాజ్ (పా) చూడు **شاهباز**. **شهبالا** - బాలా (పా) చూడు **شاهبالا** అను పదము. **شهپر** -పర్ (పా) చూడు **شاهپر**. **شهتیر** -తీర్ (పా) చూడు **شاهتیر**. **شهرگ** -రగ్ (పా) చూడు **شاهرگ**. **شهزاده** - జాద (పా) చూడు **شاهزاده** అనుపదము. **شهسوار** -సవార్ (పా) చూడు **شاهسوار** అను పదము. **شهنشین** నిషీన్ (పా) చూడు **شاه نشین** అనుపదము. **شهگام** గామ్ (పా) చూడు **شاهگام** అనుపదము. **شه پانا** -పానా (ఉ) ప్రోత్సాహ పెట్టబడుట, పురికొల్పబడుట, సహాయము పొందుట, ఆశ్రయము పొందుట. **شه دینا** -దేనా (ఉ) ప్రోత్సాహపెట్టుట, సహాయము చేయుట, పురికొల్పుట, రేపుట, ఎగసన త్రోయుట, ఎక్కువపెట్టుట, గాలిపడగ దారము కొద్దికొద్దిగా విడుచుట, చదరంగములో త్రోసి రాజనుట. **شهزور** -జోర్ (పా) మహాబలముగల, ప్రబలుడైన, ధైర్యశాలియైన, అతి బలవంతుడైన, బలిష్ఠుడైన.

**شهزوری** - జోరీ (పా) మహాబలము, ప్రబలత్వము, ప్రోద్బలము, బలిష్ఠత.

**شهمات** -మాత్ (పా) చదరంగములో రాజును కట్టివేయుట. **شهتوت** -తూత్ (పా) కంబళిపండు, బొంతపండు.

**شهاب** షిహాబ్ (అ.పు) జ్వాల, పెద్దమంట, ఉల్కము, ఆకాశమునుండిపడిపోవుచున్నట్టుగపడు జ్యోతి.

**شهاب** షహాబ్ (పా.పు) కుసుంబరసము, ఎఱ్ఱవన్నె, అగ్నికణము, మిణుగురు.

**شهادت** షహాదత్ (అ.స్త్రీ) సాక్ష్యము; మరణము, చావు, మతవిషయికమైన మరణము, హత్య. **شهادت هونا** -హోనా (ఉ) సాక్ష్యమగుట. మతవిషయమున చంపబడుట, చచ్చుట; మతవీరస్వర్గము పొందుట.

**شهامت** షహామత్ (అ.స్త్రీ) ఘనత, గౌరవము, శక్తి, సాహసము, ఘనబుద్ధి, ఔదార్యము.

**شهان** షహాన (పా) చూడు **شاهان**

**شهتوت** షహ్‌తూత్ (పా.పు) కంబళిపండు, బొంతపండు.

**شهد** షహ్‌ద్ (అ.పు) మధువు, తేనె. **شهد لگا کے الگ هوجانا** -లగాకే అలగ్ హోజానా (ఉ) జగడము పెట్టి తెలియ

సట్లుండుట. شهد لگا کر چاٹنا -శహద్-లగాకర్ చాట్నా (ఉ) పనికిరానివస్తువును జాగ్రత గాదాచిపెట్టుట. شهد کی مکهی -శహద్‌కీ మక్ఖీ (ఉ) తేనెటీగ.

**شهدا** శుహదా (అ.పు)చూడు(ఏ.వ.شهید)

**شهدا-ئى** శుహ్దాఈ (ఉ) దుర్జనుడు, దుష్టుడు, దుర్మార్గుడు, పోకిరి,తిప్పకాయ, పలువ, తులువ, కూళ, شهدا پن- شهدپن-شهدپنا -పన్-షొహద్‌పన్ -షొహద్‌పనా (ఉ) దౌష్ట్యము, దుర్మార్గము, పోకిరితనము.

**شهر** శహ్ర్ (పా.పు) నగరము, పట్టణము. شهربدر - శహర్‌బదర్ (పా) నగరభ్రష్టత, దేశభ్రష్టత, ఊరు లేక దేశమునుండివెడల గొట్టుట. شهربند -బంద్ (పా) నగర ప్రాకారము,ఊరిచుట్టుగోడ,చుట్టుకోట; చెఱసాల, బంధనాలయము. شهرپناه -పనాహ్ (పా) నగరప్రాకారము, ఊరి ప్రహరి, చుట్టుకోట. شهرخبرا- شهرکی دائی -شهرگرد - ఖబ్రా -కీ దాయీ -గర్ద్ (ఉ) నగర చారుడు, గ్రామచారుడు, గ్రామతలారి, ఊరిసంగతులు తెలియువాడు. شهرخاموشاں- خموشاں -ఎ,ఖామోషాం -ఖమోషాం (పా) శ్మశానము, ఒలుకులమిట్ట, కాడు. شهرگشت -శహర్‌గష్త్ (పా) పెండ్లి ఊరేగింపు. شهریار -యార్ (పా) గ్రామాధ్యక్షుడు, నగరాధిపుడు, రాజు, రాజశ్రేష్ఠుడు.

**شهرت** శుహ్రత్ (అ. స్త్రీ) ప్రవాదము, బహిర్గతము, ప్రకటన, ప్రచురము,వదంతి, విఖ్యాతి, ప్రఖ్యాతి, కీర్తి, యశస్సు,ప్రతిష్ఠ, పేరు, ఖ్యాతి, ప్రసిద్ధి, ప్రతీతి.شهرت پانا -పానా (అ) ప్రఖ్యాతికెక్కుట, ప్రసిద్ధికెక్కుట, పేరుపొందుట.

**شهره** శుహ్రహ్ (అ.పు)చూడు شهرت అను మాట. شهره آفاق -ఎ,ఆఫాక్ (అ) లోకప్రసిద్ధము, సుప్రసిద్ధము.

**شهری** శహ్రీ (పా) పౌరుడు, పురజనుడు, నగరవాసి, నాగరికమైన, నగర సం॥.

**شهریت** శహ్రియత్ (పా. స్త్రీ) నాగరికత, మర్యాదలు, సభ్యత.

**شهنائی** శహ్నాయీ (పా. స్త్రీ) క్రోవి, మురళి, వేణువు, పిల్లనగ్రోవి(సొన్నాయి).

**شهنشاه-شهنشه** శహన్‌షాహ్ - శహన్‌శహ్ (పా.పు) రాజాధిరాజు, రారాజు, చక్రవర్తి.

**شهنشاهی** శహన్‌షాహీ (పా. స్త్రీ) చక్రవర్తిత్వము, రాజాధిరాజత్వము, ప్రభుత్వము, రాజ్యము, చక్రవర్తి సం॥, రాజకీయమైన.

**شهوار** శహ్వార్ (పా) రాజయోగ్యమైన, రాజార్హమైన;శ్రేష్ఠమైనముత్యము,మౌక్తికరాజము.

**شهوت** శహ్వత్ (అ. స్త్రీ) ఇచ్ఛ, కోరిక, కాంక్ష; క్షుధ, ఆకలి; మోహము, కామము, సంభోగేచ్ఛ, విషయాతురము, కామవికారము. شهوت پرست -శహ్వత్ - పరస్త్ (పా) విషయలోలుడు,ఇంద్రియలోలుడు, భోగపరాయణుడు, కామాతురుడు. شهوت پرستی -పరస్తీ (పా) ఇంద్రియసుఖపరాయణత, విషయలోలత,కామాతురము. شهوت انگیز -శహ్వత్ - అంగేజ్ (పా) కామోద్రేకముగలుగజేయు, కామదీపకము.

**شهوتی** షహ్వతీ (అ) కామాతురముగల, విషయలోలుడైన, భోగనిరతుడైన.

**شهود** షుహూద్ (అ.పు) ప్రత్యక్షము, బ్రహ్మసాక్షాత్కారము; జగద్బ్రహ్మసాక్షిత్వము; సాక్షులు, చూచినవారు.

**شهودی** షుహూదీ (అ.పు) పరమహంస, జగద్బ్రహ్మసాక్షి, అమనస్కుడు, బ్రహ్మసాక్షాత్కారమునొందినవాడు, జీవన్ముక్తుడు

**شهید** షహీద్ (అ.పు) సాక్షి; హతుడు, మతవిషయమై చంపబడినవాడు, మతవీరస్వర్గము పొందినవాడు, అన్యాయముగా చంపబడినవాడు; జగత్సాక్షి; సర్వసాక్షి. ఈశ్వరుడు. (ఇష్టము.

**شے** షై (అ. స్త్రీ) పదార్థము, వస్తువు; ఇచ్ఛ,

**شے** షయ్ (ఉ. స్త్రీ) వృద్ధి, ఆదాయము, ఆధిక్యము, సహాయము, ప్రోత్సాహము, ఎక్కులు, ఉసికొలుపుట, రేపుట.

**شیاطین** షయాతీన్ (అ.పు) చూడు (ఏ. వ شیطان).

**شیام** ష్యామ్ (హి.పు) శ్యాముడు, కృష్ణుడు, శ్యామము, నల్లని, నీలపు. (మా.

**شیب** షేబ్ (పా.పు) దిగుడు, వాలు, పల్ల

**شیخ** షైఖ్ (అ.పు) ఆచార్యుడు, గురువు, మతాధికారి; వృద్ధు, ముసలివాడు, పెద్ద; అగ్రేసరుడు, ముఖ్యుడు; శాస్త్రి, పండితుడు; మహమ్మదీయులలోనొక తెగ. **شیخ الاسلام** -ఉల్, ఇస్లామ్ (అ) మహమ్మదీయమతాధ్యక్షుడు, మతగురువు. **شیخ چلی** -చిల్లీ [ఉ.పు] పరమానందాయ శిష్యుడు, చాదస్తుడు, శుంఠుడు, మూఢుడు, వెడ్డివాడు, పిచ్చివాడు. **شیخ وندو** -డోందూ (ఉ) వాననిలుచుటకై చేసిపెట్టు నాఘరాంవంటి ఒకవికారమైనబొమ్మ. **شیخ سدو** -సద్దో (ఉ) ఒకభూతము పేరు. [స్త్రీ.

**شیخانی** షేఖానీ (ఉ. స్త్రీ) షేఖుకులపు

**شیخی** షేఖీ (ఉ. స్త్రీ) జంబాలు, జంబములు, ప్రగల్భము, పెద్దరికము, ప్రజ్ఞ, షగ్గియ, పగ్గెలు, డంబము ఆత్మస్తుతి, అహంకారము, గర్వము, నీలుగుబోతుతనము. **شیخی باز-خورا** -బాజ్-ఖోరా (ఉ) డంబాలమారి, పగ్గెలమారి, నీలుగుబోతు, **شیخی بگهارنا-مارنا** -బఘార్నా -మార్నా (ఉ) జంభములుకొట్టుట, పగ్గెలునరుకుట, నీలుగుట.

**شیدا** షైదా (పా) మోహితుడు, వలపుకాడు, పిచ్చివాడు, మిక్కిలివలపుగొన్న, అతిమోహితుడైన, మోహాతురుడు, పిచ్చిగొన్నవాడు.

**شیدائی** షైదాయీ (పా.పు) మోహి, కాముకుడు, ప్రియుడు, మోహించువాడు.

**شیر** షీర్ (పా.పు) క్షీరము, పాలు. **شیر برنج** -బిరంజ్ (పా) క్షీరాన్నము, పరమాన్నము. **شیرخوار** -ఖార్ (పా) చంటిబిడ్డ, స్తన్యపానుడు. **شیردار** -దార్ (పా) పాలుగల, పాడిగల, పాలిచ్చెడు. **شیرشکر** -షకర్ (పా) కలిసిమెలిసిన, అత్యంతానోన్యముగల; ప్రాణస్నేహితుడు; ఒకపట్టువలిపెము. **شیرگرم** -గర్మ్ (పా) గోరువెచ్చని, నులివెచ్చని. **شیرمال** -మాల్ (పా) పాలరొట్టె.

**شیر** షేర్ (పా.పు) సింహము, సింగము; వ్యాఘ్రము, పులి; శూరుడు, వీరుడు, బలాఢ్యుడు. **شیرآبی** -ఎ,ఆబీ (పా.పు) మకరము, మొసలి. **شیرببر** - బబర్

(ఉ) వ్యాఘ్రేంద్రము, సింహము. شیر بچہ -బచ్చా (ఉ) పులిపిల్ల; చిన్నతుపాకి. شیر برقع -బుర్ కఅ్ (పా) సన్యాసము. شیر بکری -బక్రీ (ఉ) పులిజూదము. شیر دہان -దహాన్ (పా) వ్యాఘ్రముఖము, సింహ తలాటము; పులిముఖము; చెక్కిన కఱ్ఱ లేక తుపాకి; ముందువైపు వెడలుపు తక్కువగాగల యిల్లు. شیر کی بولی -కీ బోలీ (ఉ) ఓకరింత. شیر مرد -(పా) శూరుడు, వీరుడు, పురుషసింహుడు.

شیرازه షీరాజె (పా.పు) పుస్తకములకు వేయు గోటు; కుట్లు, గోటు; సమకూర్పు; కట్టుదిట్టము, చట్టము. شیرازه بندی -బందీ (పా) ముచ్చిపని, పుస్తకములు కుట్టుట లేక అట్టకట్టుట.

شیر خشت. شیرخشک షీర్ ఖిష్త్-షీర్ ఖుష్క్ (పా) మేనాయను నొకవిధమైన బేదిమందు.

شیرنی షేర్నీ (ఉ) ఆడపులి.

شیرنی షీర్నీ (ఉ) చూడు شیرینی.

شیره షీర (పా.పు) పానకము, రసము, సారము, పాకము, ద్రాక్షరసము లేక సారాయము, పలచనిబెల్లము.

شیرین షీరీన్ (పా) మధురమైన, తియ్యని, మనోహరమైన, మనోజ్ఞమైన, రుచికరమైన, కమ్మని, ప్రియమైన, మృదువైన, రసవంతమైన, సరసమైన, రమ్యమైన, ఇంపైన; ఒక సుందరస్త్రీపేరు. شیرین زبان-کلام -జెబాన్-కలామ్ (పా) తియ్యనిమాటలాడువాడు, మధురవచుడు, సరసవచుడు, ఇంపుగా మాటలాడువాడు.

شیرین زبانی-گفتار -జెబానీ-గుఫ్తార్ (పా) మధురవచనము, సరసవచనము, తియ్యనిమాటలు.

شیرینی షీరీనీ (పా.స్త్రీ) మాధుర్యము, తీపు, తియ్యదనము, రుచి, కమ్మదనము, భక్ష్యములు, తియ్యనితినుబండము, మధుర పదార్థములు.

شیشم షీషమ్ (ఉ) నల్లమద్ది, నల్లచేవ.

شیش محل షీష్‌మహల్ (ఉ) అద్దాల మేడ. شیش محل کا کتا -కాకుత్తా (ఉ) పిచ్చికుక్క, పిచ్చివాడు.

شیشہ షీష (పా.పు) కాచము, అద్దము, గాజు, దర్పణము, చూపుటద్దము, గాజు బుడ్డి, గాజుపలక లేక బిళ్ల. شیشہ باز -బాజ్ (పా) గారడివాడు. شیشہ دکھائی -దిఖాయీ (ఉ) అద్దపుదోసిలి, మంగలి వానికిచ్చుబహుమానము. شیشہ ساعت -సాఅత్ (పా) ఇసుక గడియారము.

شیشی షీషీ (పా.స్త్రీ) గాజుకుప్పె, బుడ్డి లేక కాయ, చిన్నఅద్దము.

شیطان షైతాన్ (అ.పు) పిశాచాధిపతి, పిశాచి, దయ్యము, భూతము; దైత్యుడు, మాయావి; దుష్టుడు, ధూర్తుడు, దుర్మార్గుడు, పోకిరి, అపవిత్రుడు, పలువ, తులువ, కూళ, కుచేష్టుడు, అవిధేయుడు, కలహకారణుడు, జగడాలమారి, తంటాలమారి, పలగాకి; మోహకారణము, మాయ, ఆరడి, నింద, జగడము, అపవాదము, తంటాలు, తగులాటము, ఆగ్రహము, కోపము, పీకులాట, ఆసురము, దుర్మార్గమైన, దుష్టచేష్ట. شیطان چوکڑی -చౌక్డీ (ఉ) పిశాచములసమూహము, దయ్యపుగుంపు, పోకిరిపట్టము, పోకిరి సముదాయము. شیطان کی آنت -కీఆన్త్ (ఉ)

కొండవీటిచేతాడు, అతిదీర్ఘమైనది, అమోఘమయము, చిక్కైనది. **شیطان کی چرخی** -కీచర్ఖీ (ఉ) దుష్టచిహ్నము, అపవాదకారణము. **شیطان کی خالہ** -కీఖాల (ఉ) కలహకారకురాలు, జేగడము పెట్టు యాకుది. **شیطان کی ڈور** -కీడోర్ (ఉ) మిక్కిలి పొడవైన సాలెపురుగు దారము. **شیطان مجسم** - ముజస్సమ్ (అ) మూర్తీభవించినదయ్యము, రాక్షసావతారము, పరమదుష్టుడు, (తోకవాలో అక్కడక్కడ కనుపడునది).

**شیطانی** షైతానీ (అ) అసురమైన, దయ్యపు సం॥, అతిదుష్ట, చెడ్డ, దుర్మార్గమైన, పాపిష్టి; స్త్రీలస్వప్నదోషము. **شیطانی حرکت** -హర్కత్ (పా) దయ్యపుచేష్ట, దుష్కార్యము, పోకిరితనము.

**شیطنت** షైతనత్ (అ. స్త్రీ) దౌష్ట్యము, దుర్మార్గము, పోకిరితనము. తిరుగుబాటు, కలహము.

**شیعہ** షీఅ (అ.పు) సహాయుడు, సహకారి, అనువర్తకుడు; మహమ్మదీయుల యొక తెగ (హజరత్ అలీ యొక్క సాంప్రదాయము వారు.)

**شیفتہ** షేఫ్తహ్ (పా) అతిమోహితుడు, ఉన్మత్తుడు, మోహించిన, వలపుగొన్న, మోహామత్తుడైన.

**شیفتگی** షేఫ్తగీ (పా. స్త్రీ) మోహము, ఉన్మత్తత, వలపు, కావరము, అపస్మారము, భ్రమము.

**شیون** షేవన్ (పా.పు) విలాపము, శోకము, ఆపత్తు, దుఃఖము, కష్టము.

**شیوہ** షీవ (పా.పు) వ్యవహారము, చేష్ట, కార్యము, పని, మర్యాద, పద్ధతి, వైఖరి, సాంప్రదాయము, ఆచారము, వాడుక, నడవడిక, వర్తనము.

**شیہہ** షైహ (పా.పు) గుఱ్ఱపుసకిలింత; హేష.

---

## ص

**ص** సాద్-స్వాద్ (అ.పు) ఇది ఉరుదువర్ణమాలలో నిరువదియవ యక్షరము. అరబ్బీలో పదునాలుగవది. పారసీకభాషలో పదునేడవది. దీనిసంఖ్య అబ్జదువర్ణసాంఖ్యములో తొంబది. ఇయ్యది **صحیح** అను పదమునకుసంకేతముగా వాడబడును. **صاد کرنا** -కర్నా (ఉ) సరియనుట, అంగీకరించుట.

**صابر** సాబిర్ (అ) ఓర్పుగల, క్షమగల, శాంతముగల.

**صابون** సాబూన్ [అ.పు] సబ్బు, నిర్మలి, (మురికిని బోగొట్టునది).

**صاحب** సాహిబ్ (అ.పు) స్నేహితుడు చెలికాడు, సహవాసి; ప్రభువు, స్వామి, యజమాని, పెద్ద, నాయకుడు, భర్త, పతి, మగడు, అధికారి, ఈశ్వరుడు, (మతుపర్థక ప్రత్యయము), మంతుడు, వంతుడు, శాలి, కలవాడు, సహితుడు; దొర, జాతివారి గౌరవనామము; పెద్దమనుష్యుడు, పంతులుగారు. అయ్యగారు. **صاحب اختیار** - ఎ, ఇఖ్తియార్ (పు) అధికారస్థుడు, స్వతంత్రుడు. **صاحب اخلاق** -ఎ, అఖ్లాక్ (పు) మర్యాదస్థుడు, సభ్యుడు.

**صاحب اقبال . نصیب** - ఎ,ఇక్బాల్ -నసీబ్ (పు) అదృష్టశాలి, భాగ్యవంతుడు. **صاحب تاج** -ఎ,తాజ్ (పు) కిరీటి, రాజు. **صاحب تخت** -ఎ, తఖ్త్ (పు) సింహాసనస్థుడు, రాజు. **صاحب تدبیر** -ఎ,తద్బీర్(పు) అనుభవజ్ఞుడు, ఉపాయశాలి, నేర్పరి. **صاحب تمیز** -ఎ, తమీజ్(పు) బుద్ధిశాలి,వివేకి, నాగరికుడు, రసజ్ఞుడు. **صاحب جائداد** -ఎ,జాయెదాద్ (పు) భూస్వామి,స్థితిమంతుడు,ఆస్తిగలవాడు,గృహస్థుడు. **صاحب جمال** -ఎ,జమాల్ (పు) సౌందర్యవంతుడు. **صاحب حیثیت** -ఎ,హైసియత్ (పు)స్థితిమంతుడు. **صاحب خانہ** -ఖాన (పు) ఇంటియజమాని, విందువెట్టినవాడు, గృహస్థుడు. **صاحب دل** -ఎ, దిల్ (పు) గొప్ప మనసు గలవాడు, బుద్ధిమంతుడు, సజ్జనుడు, జ్ఞాని. **صاحب ذوق** -ఎ,జౌక్ (పు)ఆసక్తిగలవాడు, ప్రియుడు,కాముకుడు, ఉత్సాహవంతుడు, సంతోష ప్రియుడు. **صاحب راز** -ఎ,రాజ్ (పు) రహస్యము తెలిసినవాడు, అంతరంగుడు. **صاحب رائے** -ఎ, రాయ్ (పు) మంత్రజ్ఞుడు, ఆలోచనపరుడు, ఉపాయశాలి, ప్రవీణుడు. **صاحب زادہ** -జాద (పా.పు)ఆర్యజుడు,రాజవంశస్థుడు, పెద్దమనిషికొడుకు,కొమారుడు, అనుభవరహితుడు. **صاحب سلامت** -సలామత్(స్త్రీ)మర్యాదలు,వందనములు, పరిచయము. **صاحب سلیقہ** -ఎ,సలీక (పు) నేర్పరి, ప్రవీణుడు, వివేకవంతుడు, సాహసుడు. **صاحب ضلع** -జిల ( పు) మండలాధికారి (తాలూకదారుడు). **صاحب فراش** -ఫరాష్ (పు) మంచాన పడినవాడు, మంచమెక్కినవాడు,లేవలేని రోగి. **صاحب قدرت ۔ مقدور** -ఎ,కుదరత్ -మక్దూర్ (పు)సమర్థుడు, స్థితిమంతుడు,శక్తిమంతుడు,ఆస్తిమంతుడు. **صاحب کمال** -ఎ,కమాల్ (పు) ఒక పని బాగా తెలిసినవాడు, సిద్ధహస్తుడు, సిద్ధుడు, ప్రవీణుడు, నిపుణుడు. **صاحب لوگ** • లోగ్ (పు) దొరలు, జాతివారు. **صاحب نسبت** - ఎ,నిస్బత్ (పు) యోగి, జ్ఞాని.

**صاحبہ** సాహిబ (అ) అమ్మగారు, యజమానురాలు,(స్త్రీ) దొరసాని.

**صاحبی** సాహిబీ (ఉ. స్త్రీ) ప్రభుత్వము, అధికారము.

**صاد** సాద్ (పా. స్త్రీ) అరబ్బీభాషయొక్క పదునాలుగవ యక్షరము, కురానులోని 38వ అధ్యాయము, అంగీకారము, అనుమోదము, సరియనుటకుచిహ్నము,అంగీకార సూచనము. **صاد کرنا** -కర్నా (ఉ)అంగీకరించుట, అనుమోదించుట,సరియనుట, నిజపరచుట.

**صادر** సాదిర్ (అ) బహిర్గతమగు, బయటికి వచ్చు, వెడలు. బయలుదేరు;ప్రవర్తించు, వెడలిన, బయలుదేరిన, అయిన, జరిగిన, చెల్లిన, వెళ్లిన, ఘటించిన. **صادر کرنا** -కర్నా (ఉ) బయటికిపంపుట, ఇచ్చుట, పంపుట, ప్రవర్తింపజేయుట, వర్తింపజేయుట. **صادر و وارد** -వారిద్(అ)వచ్చిపొయ్యేదువారు, అతిథిఅభ్యాగతి, అరదేశి

పరదేశి. صادر ہونا -హోనా (ఉ) బయలువెడలుట, వర్తించుట, జరుగుట, అగుట. చేరుట, సంభవించుట, ఘటించుట, తటస్థించుట.

صادق సాదిక్ (అ) నిజస్థుడు, నిజమైన, యదార్థమైన, నమ్మదగిన, యుక్తమైన, వాస్తవమైన, నిష్కపటమైన. صادق القول -ఉల్, కౌల్ (అ) ప్రామాణికుడు, నిజస్థుడు, ఆడితప్పనివాడు. صادق آنا - ఆనా (ఉ) సరిపడుట. పొసగుట, తగుట, యుక్తముగానుండుట.

صادقی సాదిక్ (అ. స్త్రీ) యథార్థము, నిజము, వాస్తవము. (పిడుగు.

صاعقہ సాఇక (అ. స్త్రీ) విద్యుత్తు, మెరుపు,

صاف సాఫ్ (అ) శుద్ధమైన, స్వచ్ఛమైన, నిర్మలమైన; స్పష్టమైన; పవిత్రమైన; యథార్థమైన, నిర్దోషమైన, నిష్కపటమైన, నిర్వ్యాజమైన, సులభమైన, తేటయైన, విశదమైన, అప్పటమైన, నిజమైన, సరళమైన, శుభ్రమైన, నునుపైన, చదునైన, నున్నగా నున్న, సమమైన, సరియైన, ఆసాంతము, బొత్తిగా, తద్వారా, నిరాటంకమైన, పరిష్కారమైన, రూఢియైన, ధారాళమైన, ఖండితమైన, కచ్చితమైన. صاف کرنا -కర్నా (ఉ) శుభ్రపరచుట, శుద్ధిచేయుట, కడుగుట, తోముట. శోధించుట; నిర్మలముచేయుట; చదునుచేయుట, నునుపుచేయుట, సమముగాచేయుట, సరిచేయుట; ఊడ్చుట; మురికితీయుట; పాడుచేయుట; అభ్యాసముచేయుట; ఏర్పరచుట; సవరించుట; శుద్ధప్రతివ్రాయుట; తినివేయుట, లేకుండచేయుట, తీర్చుట, తీర్మానము జేయుట.

صائم సాఫ్ (ఉ.పు) పస్తు, ఉపవాసము, నిరాహారము; పట్టము, శిరోవస్త్రము, తలగుడ్డ. صائم دینا -దేనా (ఉ) పస్తుపెట్టుట.

صافی సాఫీ (అ. స్త్రీ) పరిశుద్ధత, యథార్థత; తుండుగుడ్డ, గంజివార్చుగుడ్డ; చిలుము పీలిక, బట్టపీలిక, వడియపోయుగుడ్డ, పరిశుద్ధమైనది.

صالح సాలెహ్ (అ) మంచి, నీతిగల, పవిత్రమైన, యోగ్యమైన, యోగ్యుడు.

صالحہ సాలిహా (అ. స్త్రీ) పతివ్రత, యోగ్యురాలు.

صانع సానెఅ (అ.పు) పంచాణుడు, పనివాడు, కర్త, చేయువాడు, శిల్పి, కల్పించువాడు, పుట్టించువాడు. صانع مطلق - ముత్లక్ (పు) సృష్టికర్త, ఈశ్వరుడు.

صائب సాయిబ్ (అ) అందునట్టి. అందిన, సరియైన, చక్కని.

صائم సాయిమ్ (అ.పు) ఉపవాసవ్రతము చేయువాడు. صائم الدهر - ఉద్, దహ్ర్ (అ) నిత్యసత్యవ్రతుడు, ఎల్లప్పుడు ఉపవాసవ్రతముచేయువాడు.

صبا సబా (అ. స్త్రీ) ప్రొద్దుటిగాలి, తూర్పుగాలి, తెమ్మెర, మందమారుతము; పిల్లతనము. (రేపు.

صباح సబాహ్ (అ. స్త్రీ) ఉదయము, వేకువ,

صباحت సబాహత్ (అ. స్త్రీ) తెలుపు ఛాయ, మంచి దేహచ్ఛాయ, అందము, సౌందర్యము.

**صباغ** సబ్బాగ్ (అ.పు) రంగకి,రంగాజీవుడు.

**صبح** సబహ్ (అ. స్త్రీ) ఉదయము, వేకువ, ప్రొద్దుపొడుపు. **صبح خیز - خیزیا** ఖైజ్-ఖేజియా (పా) ఉషర్బుధుడు, ప్రొద్దుపొడుపునసే లేచేవాడు. **صبح دم** -దమ్ (అ) వేకువజాము, ప్రొద్దుగల. **صبح صادق** -సాదిక్ (అ) అరుణోదయము. **صبح کاذب** -కాజిబ్ [అ] ఉషఃకాలము. **صبح هونا** -హోనా (ఉ) తెల్లవారుట, ప్రొద్దుపొడుచుట.

**صبر** సబ్ర్ (అ.పు) సహనము, ఓపిక, ఓర్పు, తాళిమి, క్షమ, శాంతము, ఉసురు, అపకారకఫలము.

**صبوح-صبوحی** సుబూహ్ -సుబూహీ (అ. స్త్రీ) ప్రొద్దుటిసారాయి, ప్రాతఃకాలమందు త్రాగుసారాయి.

**صبوری** సబూరీ (ఉ. స్త్రీ) సహనము, ఓర్పు, తాళిమి.

**صبیح** సబీహ్ (అ) తెల్లనిచాయగల, సుందరమైన, అందమైన. (బిడ్డ.

**صبیه** సబియ (అ. స్త్రీ) పుత్రిక, కూతురు,

**صحاب** సిహాబ్ (అ) సహవాసులు, చెలికాండ్రు, సంగడిగాండ్రు. (ఏ.వ صاحب)

**صحابت** సహాబత్ (అ. స్త్రీ) సహవాసము.

**صحاری** సహారీ (అ) ఎడారులు,బయళ్లు. (ఏ.వ صحرا)

**صحاف** సహ్హాఫ్ (అ.పు) ముద్రివాడు,పుస్తకములకు అట్టలుకట్టువాడు లేక కుట్టువాడు.

**صحایف** సహాయిఫ్ (అ.పు) సంపుటములు, గ్రంథములు, పుటలు, ఆకులు.

**صحبت** సుహ్బత్ (అ. స్త్రీ) సహవాసము, సంగతి, సమాజము, సంఘము, సభ, సహాయము, తోడు; స్నేహము, చెలిమి; సాంగత్యము, పొందు, సమాగమము, కూడిక, కూటము, సంభోగము. **صحبت داری** -దారీ (స్త్రీ) సంభోగము,సాంగత్యము. **صحبت یافته** -యాఫ్త [పా] సత్సాంగత్యఫలముపొందిన,సుశిక్షితుడైన, నాగరికతగల, మర్యాదస్థుడైన.

**صحبتی** సుహ్బతీ(ఉ) సహవాసి, స్నేహితుడు.

**صحت** సిహత్ (అ. స్త్రీ) ఆరోగ్యము, కుదురుబాటు, సౌష్టవము; సవరణ, దిద్దుబాటు; శుద్ధత, తప్పులులేమి, ఒప్పు. **صحت بخش** -బఖ్ష్ (పా) ఆరోగ్యకరమైన, ఆరోగ్యదాయకమైన. **صحت خانه** -ఖాన (పా) మరుగుదొడ్డి. **صحت نامه** -నామ (పా) శుద్ధపత్రము, ఆరోగ్యపత్రము.

**صحرا** సహ్రా (అ.పు) ఎడారి, బయలు. **صحرا نشین** -నిషీన్ (పా)వానప్రస్థముచేయువాడు, సన్యాసి, వనవాసి.

**صحرائی** సహ్రాయీ (అ) జాంగలము, అడవిసం॥.

**صحن** సహ్న్ (అ.పు) ముంగిలి, అంగణము, ఆవరణము. **صحن چمن** - చమన్ (పా) వాటిక, ఉద్యానవాటిక.

**صحنک** సహ్నక్ (అ. స్త్రీ) కంచెము, పళ్లెము; సానిక, మట్టిమూకుడు.

**صحیح** సహీహ్ (అ) సరియైన, తప్పులేని, శుద్ధమైన, యదార్థమైన, ఆరోగ్యముగల, నిరోగమైన, అంతయు, సమగ్రమై; సంతకము, చేవ్రాలు, హల్లు, (అచ్చుగానిది),

صحیح العقل - ఉల్ - అక్ల్ (అ) జ్ఞానశుద్ధిగల,బుద్ధిచెడని. صحیح النسب -ఉన్-నసబ్ (అ) కులీనుడు, ఔరసుడు, సాంప్రదాయకుడు. - صحیح سالم سلامت - సాలిమ్-సలామత్ (పా) సురక్షితమైన, సమగ్రమైన, క్షేమముగా.

صحیفہ సహీఫ(అ.పు) పుస్తకము, పత్రము, పుట.

صد సద్ (పా) శతము, నూరు, صد برگ -బర్గ్ (పా) శతదళము, బంతి పువ్వు. صد پا -పా (పా) జెఱ్ఱి,శతపది, صد ها -హా (పా) నూర్లకొలది, అనేకము.

صدا సదా (అ. స్త్రీ) ప్రతిధ్వని,మారుమ్రోత; ధ్వని, చెప్పుడు; స్వరము; పిలుపు,అరపు; వదంతి.

صدارت సదారత్ (అ. స్త్రీ) అధ్యక్షత, అగ్రాసనాధిపత్యము.

صداقت సదాకత్ (అ. స్త్రీ) సత్యత, నిజాయితి, యదార్థత, నిజము, వాస్తవము, ఋజుత్వము, సరళత, నిష్కాపట్యము, సిద్ధాంతము, సాక్ష్యము, దృష్టాంతము.

صدر సద్ర్-సదర్ (అ.పు) ఉరము, ఱొమ్ము,గుండె,అంగణము, ముఖభాగము, ఉన్నతాసనము, ముఖ్యస్థానము, సేనానివాసము, ఉన్నతమైన, గొప్ప, దొడ్డ, ప్రధానమైన,ముఖ్యమైన, పెద్ద, మొదటి. صدر اعظم -ఎ,అజీమ్ (పా) ప్రధానమంత్రి, పాలనసంఘాధ్యక్షుడు. صدر الصدور -ఉస్ సుదూర్ (అ) మతశాఖాధ్యక్షుడు. صدر مقام - మకామ్ (పా) ముఖ్యస్థానము, ముఖ్యపట్టణము. صدر نشین -నిషీన్ (పా) అగ్రాసనాధిపతి, అధ్యక్షుడు. صدر مهتمم -ముహతమిమ్(అ) ప్రధానవనిర్వాహకులు

صدری సద్రీ (అ.స్త్రీ) అరచేట్టి, చిన్నకుబుసము.

صدف సదఫ్ (అ.స్త్రీ) ముత్యపుచిప్ప.

صدق సద్క్ (అ.పు) నిజము, వాస్తవము, సత్యము, యదార్థము, నిష్కాపట్యము.

صدقہ సద్క (అ.పు) దానము, ధర్మము, బలిహరణము, దిగదుడుపు, ముడుపు. صدقہ اتارنا -ఉతార్నా (ఉ) దిగదుడుపుచేయుట, దిగదుడుచుట. صدقہ جانا-ہونا -జానా-హోనా (ఉ) బలిహారమగుట, దిగదుడుపుఅగుట. صدقہ کرنا -కర్నా (ఉ) బలిపెట్టుట, దిగదుడుపుచేయుట.

صدمہ సద్మ(అ.పు)ఆఘాతము,దెబ్బ, పెట్టు, తాకు,అపాయము,గండము,తాకుడు, హాని, నష్టము,విపత్తు,ఆపద,కీడు, దుఃఖము, బాధ, కష్టము.

صدور సుదూర్ (అ.పు) బహిర్గమనము, బయలువెడలుట, ప్రచురము అగుట, నిర్గమనము, ఆగమనము,వెడలిక, ప్రవర్తించుట,వర్తించుట. [కాలము, నూటికి.

صدی సద్దీ (అ.స్త్రీ)శతాబ్దము,౧౦౦ ఏండ్ల

صدیق సిద్దీక్ (అ.పు) అతిసత్యవంతుడు, యదార్థవంతుడు, దృఢ విశ్వాసముగలవాడు.

صدیق సదీక్ (అ.పు)నిర్వ్యాజస్నేహితుడు, నిజమైనస్నేహితుడు.

صراحت సరాహత్(అ. స్త్రీ) వివరణము, స్పష్టత,స్వచ్ఛత, తేటదనము,విశదత్వము.

صراحتاً సరాహతన్ (అ) వివరముగా.

స్పష్టముగా, తేటతెల్లముగా, విశదముగా.

**صراحی** సురాహి (అ. స్త్రీ) గిండికలశము, సోగమెడబుడ్డి. **صراحی دار** -దార్ (పా) సొగసైన, పొడుగాటి.

**صراط** సిరాత్ (అ. స్త్రీ) చక్కనిత్రోవ, సరళమార్గము, ఋజుమార్గము

**صراف** సర్రాఫ్ (అ.పు) ద్రవ్యవ్యాపారము చేయువాడు, మార్కపువాడు; వైయాకరణి.

**صرافہ** సర్రాఫ (ఉ.పు) ద్రవ్యవ్యాపారము, మార్కపువ్యాపారము, ద్రవ్యవ్యాపారస్థానము.

**صرافی** సర్రాఫీ [ఉ. స్త్రీ] ద్రవ్యవ్యాపారము, మార్కము, హుండీవ్యాపారము.

**صرصر** సర్‌సర్ (అ.పు) శిశిరవాతము, చలిగాలి, ప్రచండవాతము, వడిగాలి, సుడిగాలి.

**صرع** సర్అ-సరఅ (అ. స్త్రీ) సొగిలబడుట; మూర్ఛరోగము, కాకిసొమ్మ.

**صرف** సిర్ఫ్ (అ) స్వచ్ఛమైన, నిర్మలమైన, అమిశ్రితమైన, కేవలము, మాత్రము, శుద్ధముగా, ఒంటరిగా, ఒకటియె, బొత్తిగా, ఉత్తగనే, ఏకముగా.

**صرف** సర్ఫ్ (అ.పు) వ్రయము, వెచ్చము, సెలవు, గిట్టుబడి, పట్టుబడి, తగులుబడి, మార్పు, మార్కము; శబ్దలక్షణము. **صرف و نحو** -వనహూ (అ) వ్యాకరణము.

**صرفہ** సర్ఫ (అ.పు) ఆధిక్యము, మిగులు; పొదుపు, పిసినారితనము, పదిలము, వెచ్చము, వ్యయము.

**صرہ** సుర్రహ్ (అ.పు) సంచి, తిత్తి.

**صریح** సరిహ్ (అ) విదితమైన, వివరమైన, విశదమైన, స్పష్టమైన, తేటతెల్లమైన, స్వచ్ఛమైన, ప్రత్యక్షమైన.

**صریحاً** సరీహతన్ (అ) విదితముగా, విశదముగా, స్పష్టముగా, ప్రత్యక్షముగా, తేటతెల్లముగా, స్వచ్ఛముగా.

**صریر** సరీర్ (అ. స్త్రీ) కిఱ్ఱు, తలుపుచేప్పుడు, బుఱ్ఱు, మిడుతలు లేచుచప్పుడు; కరకర, కలముచివ్వుచేప్పుడు, రాపిడివలన గలుగు చేప్పుడు.

**صعب** సఅబ్ (అ. స్త్రీ) కఠినమైన, కష్టమైన, బాధకమైన.

**صعوبت** సుఊబత్ (అ. స్త్రీ) కఠినత, కష్టము, సంకటము, ఆపద, వ్యసనము.

**صعود** సఊద్ (అ.పు) ఔన్నత్యము, ఎత్తు, ఆరోహణము, ఎక్కుడు, లేచుట.

**صعود نزول** -వ,నుజూల్ (అ) ఆరోహణావరోహణములు.

**صعوہ** సఅవ (అ.పు) కాటుకపిట్ట.

**صغر** సగ్ర్ (అ.పు) చిన్నదనము, లఘుత్వము, అల్పత్వము. **صغرسن** -సన్ (అ) పిన్నవయసువాడు, అల్పవయస్కుడు, చిన్నవాడు, యుక్తవయసురానివాడు.

**صغریٰ** సుగ్రా (అ) చిన్నది; మిగులచిన్నది, కనిష్ఠము, అల్పిష్ఠము.

**صغیر** సగీర్ (అ) చిన్న, అల్పమైన, స్వల్పమైన, స్వల్పతరమైన, కొద్దియైన, తక్కువైన.

**صغیر سن** -సన్ (అ) చూడు **صغرسن**

**صغیر و کبیر** -వ,కబీర్ (పా) చిన్నపెద్ద.

**صغیرہ** సగీర (అ) స్వల్పమైన, చిన్న, స్వల్పతప్పితము, చిన్నతప్పు.

**صف** సఫ్ (అ. స్త్రీ) పంక్తి, వరుస, బారు,

క్రిమము; పరుపు, చాప,చిరుచాప; సమాజము. జట్టు, వర్గము. صف آرا - ఆరా (పా) సేనలను బారులుతీర్చునట్టి. صف آرائی -ఆరాయీ (పా)వ్యూహము, మోహరము, సేనలుబారుతీర్చుట,వ్యూహరచన. صف بستہ -బస్త (పా) బారుతీరిన, వరుసగానున్న. صف جنگ -ఎ, జంగ్ [పా]సంగరవ్యూహము,యుద్ధము. صف کشی -కషీ (పా) వ్యూహరచన, సేనలను బారులుతీర్చుట,

**صفا** సఫా (అ) పవిత్రమైన, పరిశుద్ధమైన, స్వచ్ఛమైన, నిర్మలమైన, శుభ్రమైన,తోమిన, మెరుగుపెట్టిన,నిర్దాక్షిణ్యమైన,నిర్మొగమోటమైన, నిస్సంగమైన, తేటయైన, అప్పటమైన, చేదునైన,సమమైన, నున్నగాయున్న, స్వచ్ఛత, నిర్మలత, పరిశుద్ధత,పరిశుభ్రత, సంతోషము, వినోదము, కుతూహలము.

**صفات** సిఫాత్ (అ.స్త్రీ) గుణములు, స్వభావములు, సద్గుణములు. (ఏ.వ صفت)

**صفاتی** సిఫాతీ(అ) ఆగంతుకమైన, గౌణమైన, స్వాభావికముగాని, కృత్రిమమైన.

**صفائی** సఫాయీ (ఉ. స్త్రీ) పవిత్రత,పరిశుద్ధత, పరిశుభ్రత, స్వచ్ఛత, నిర్మలత, తేటదనము; సరళత్వము, ప్రామాణికము, నిష్కాపట్యము, యథార్థత, నిజాయితీ, వెట్టిబాగులతనము, జెలతనము, అమాయికము; బుద్ధిహీనత, నునుపు, మెరుగు, చేదును,సమత్వము, ఎచ్చుతగ్గులులేకయుండుట,నిర్దోషిత్వము,విమోచనము, విడుదల, తీరుమానము, తీరుదల. వగ తెగింపు, సమాధానము, సిగ్గుమాలినతనము, ఖండన, నిరసనము, పూర్వపక్షము, నరుకుట, కొట్టివేయుట, ఉపవాసము, నిరాహారము, పస్తు, నాశనము, పాడు, నిర్మూలనము, నేలమట్టము, లాఘవము.

**صفت** సిఫత్ (అ.స్త్రీ) ప్రశంస,స్తోత్రము, వర్ణనము, గుణము, స్వభావము,విశేషము, వాడుక,ధర్మము, లక్షణము, వైఖరి, తీరు, విశేషణము.

**صفحہ** సఫ్హ (అ.పు) పత్రము, పొరట, ముఖము, పైభాగము.పరుపు, వైశాల్యము, صفحہ ہستی -ఎ,హస్తీ(పా) పృథివి, ప్రపంచము, లోకము.

**صفر** సిఫ్ర్ (అ.పు) శూన్యము, వట్టిది, ఒక ఉదరరోగము; అరబ్బుల రెండవ చాంద్రమాసము; రాగి, బంగారము.

**صفر** సిఫర్ (అ.పు) శూన్యము, సున్న.

**صفراء** సఫ్రా (అ.పు) పైత్యము, పిత్తము; పచ్చని, బంగారము.

**صفراوی** సఫ్రావీ (అ) పైత్యముగల,పిత్తసంబంధమైన.

**صفوف** సుఫూఫ్ (అ.పు)పంక్తులు,వరుసలు, బారులు. (ఏ.వ صف)

**صفی** సఫీ(అ) పవిత్రమైన, పరిశుద్ధమైన, స్వచ్ఛమైన, ప్రామాణికమైన, నిజమైన, న్యాయమైన, యథార్థమైన, శ్రేష్ఠమైన.

**صفیر** సఫీర్ (అ) ఈల, కూత.

**صلا** సలా (అ.స్త్రీ) ఆహ్వానము, పిలుపు, ఆమంత్రణము, సంబోధనము,ప్రకటనము, వార్త, వదంతి.

**صلابت** సలాబత్ (అ. స్త్రీ) కఠినత్వము, గట్టి, దృఢత, దిటవు, స్థిరత; ఘనత. صلابت جنگ -జంగ్ (పా) యుద్ధస్థిరుడు, వీరుడు, శూరుడు.

**صلاح** సలాహ్ (అ. స్త్రీ) ఔచిత్యము,మర్యాద, మంచి, మేలు; సన్మార్గము; పవిత్రత; ఆలోచన, వుపాయము, బోధన; అభిప్రాయము, మంత్రణము, వుపదేశము,సమ్మతము, సంధి, సమాధానము. **صلاح سمرقندی** -సమర్‌కందీ (పా) కపటపు మర్యాదలు. **صلاح کار** - కార్ (పా) మంత్రి, ఆలోచన చెప్పువాడు.

**صلاح وقت** -వక్త్ (అ) సమయోచితము, కాలోచితము.

**صلاحیت** సలాహియత్ (అ. స్త్రీ) మేలు, మంచి, సన్మార్గము, సుశీలత, పవిత్రత, పావనత, మంచితనము, ధర్మము, నీతి, శుద్ధత్వము, సామర్థ్యము, గ్రహణశక్తి, త్రాణ, యోగ్యత, అర్హత, తెలివి, బుద్ధి, శుద్ధి, సవరణ, దిద్దుబాటు, నమ్రత,నెమ్మతి, మంచితనము, నిమ్మళము, శాంతము, తిన్నదనము, వివరణము, వయినము.

**صلب** సుల్బ్ (అ.పు) వెన్నుపూస, గట్టి భూమి; కులీనత; సంతానము. బీజము; గట్టి, కాఠిన్యము.

**صلبی** సుల్బీ (అ) క్షారసుడైన, సంతానమైన, వంశస్థుడైన, నిజమైన.

**صلح** సుల్హ్-సులహ్ (అ. స్త్రీ) సమాధానము, సంధి, అనుకూల్యము, ఒడంబడిక, మరలస్నేహము,శాంతి. **صلح نامہ**-నామ (పు) సంధిపత్రము, సమాధానపత్రము.

**صلعم** సుల్హా (అ.పు) స్నేహము.

**صل علے** సల్లెఅల (అ. స్త్రీ) ( భగవంతుడు హాజీరతు మహమ్మదుపై అనుగ్రహించుగాత). బాగు, మేలు, బళిరె, అను సందర్భములో వుపయోగించేబడు ప్రశంసావాచకము.

**صلعم** సల్ అమ్ (అ) ఇవిసంకేతాక్షరములు, భగవంతుడు మహమ్మదుగారికి అనుగ్రహమును శాంతియు ప్రసాదించుగాతయని అర్థము.

**صلوات** సలవాత్ (అ. స్త్రీ) దైవానుగ్రహములు, భగవత్కటాక్షములు,ప్రార్థనలు, ఆశీర్వాదములు, ఉచ్చనీచములు, తిట్లు, బూతులు,చివాట్లు, దండము,నమస్కారము, పరిత్యాగము, వర్జనము,నిరసనము, తిరస్కారము,విడుచుట,వదలుకొనుట. (ఏ.వ **صلوٰۃ**)

**صلوٰۃ** సలాత్ (అ. స్త్రీ) ప్రార్థన, ఆశీర్వాదము, దైవానుగ్రహము.

**صلہ** సిలహ్ (అ.పు) ప్రతిఫలము, ప్రతీకారము, మారు, చెల్లు, ప్రీతి, బహుమానము, బహుమతి, కట్నము, ఫలము, సంబధసర్వనామము.

**صلے اللہ علیہ** సల్లల్లాహుఅలైహి (అ) అతనిపై దైవము అనుగ్రహించుగాత యను ఆశీర్వాదము.

**صلے اعلے** సల్లఅల (అ) చూడు **صل علے**

**صلیب** సలీబ్ (అ.పు) శిలువ, + ఇట్టి యాకారముగల కొరత లేక దారువు లేక శూలము; క్రైస్తవమత చిహ్నము.

**صم** సుమ్మ్ (అ.పు) బధిరుడు, చెవిటివాడు, చెవిటి. (ఏ.వ **اصم**) **صم و بکم** - ఒ,బుక్మ్ (పా) మూగ చెవిటివారు, మూగవారు చెవిటివారు. (ఘనుడు.

**صمد** సమద్ (అ.పు) ఈశ్వరుడు, ప్రభువు,

**صمصام** సమ్‌సామ్ (అ. స్త్రీ) ఖడ్గము, పదునుగల కత్తి.

**صمغ** సమగ్ (అ.పు) అంటు, బంక.

**صمیم** సమీమ్ (అ) శుద్ధమైన, యదార్థమైన, స్వచ్ఛమైన.

**صناع** సున్నాఉ (అ.పు) పంచాణులు, పనివాండ్రు; మంచిపనివాడు, ప్రవీణుడు. (ఏ. వ **صانع**)

**صناعت** సినాఅత్ (అ. స్త్రీ) చేతిపని,పని, వృత్తి, విద్య, పంచాణము, పనితనము.

**صنایع** సనాయెఉ (అ) పనితనములు, పంచాణములు, చమత్కారములు,యుక్తులు, నేర్పులు. **صنایع بدایع** -బదాయెఉ (అ) భాషాలంకారములు. (దనము.

**صندل** సందల్ (అ.పు) శ్రీగంధపుకట్టె; చం

**صندلی** సందలీ (పా) సున్నము కొట్టుట మొ॥పనులకుపయోగించు ముక్కాలిపీటు; పుట్టు నపుంసకుడు, లింగహీనుడు; చందన వర్ణముగల, గంధపుకొయ్యతో చేసిన.

**صندوق** సందూక్ (అ.పు) పెట్టె, పేటిక; శవవాహనము; సంపుటము.

**صندوقچہ-صندوقچی** సందూక్చ-క్చీ (పా.పు) చిన్న పేటిక, సంపుటము; చిన్న పెట్టె, కరండము.

**صندوقی** సందూకీ (అ) పెట్టెవంటి,పెట్టె యాకారముగల (సమాధి లేక కత్తిఒర).

**صنع** సన్ఉ (అ. స్త్రీ) పనితనము, పని, చేత, సృష్టి.

**صنعت** సన్ఉత్ (అ. స్త్రీ) పంచాణము, చేతిపని, విద్య, వృత్తి, పని, నేర్పు, పనితనము, చేతబడి, చాతుర్యము, యుక్తి, రహస్యము. (తెరగు, భాగము.

**صنف** సన్ఫ్ (అ. స్త్రీ) జాతి, విధము,

**صنم** సనమ్ (అ.పు) మూర్తి, విగ్రహము, ప్రతిమ, ప్రియురాలు, ప్రియమైనది. **صنم خانہ-کدا** -ఖానా-కదా (పా) దేవాలయము, విగ్రహాలయము, మందిరము.

**صنوبر** సనొబర్ (అ) దేవదారువృక్షము, ఒకవిధమైనచీకటిమ్రాను, పుడకమ్రాను.

**صواب** సవాబ్ (అ.పు) సౌష్ఠ్యము, సరి, మంచి, ఒప్పు; పుణ్యము, ధర్మము, సత్కార్యము; ఔచిత్యము, యోగ్యము.

**صوابدید** సవాబ్దీద్ (పా. స్త్రీ) సదుపాయము, మంత్రణము, ఆలోచన,కాలోచితము, సమయోచితము,యోగ్యము,ఉచితము. (ఏ వ **صوبہ**)

**صوبجات** సూబజాత్ (అ.పు) చోడు

**صوبہ** సూబ (అ.పు) ప్రదేశము,ప్రాంతము, రాజ్యభాగము, దేశభాగము. **صوبہ دار** -దార్ (పా) ప్రదేశాధిపుడు, ప్రాంతాధికారి, దళనాయి, నాయకుడు.

**صوت** సౌత్ (అ.స్త్రీ) ధ్వని, కూత; కేక, అరపు.

**صور** సూర్ (అ. స్త్రీ) ఊదెడుకొమ్ము, తిరుచూర్ణములు, చుయ్యంకి.

**صورت** సూరత్ (అ) ముఖము, ఆకారము, రూపము, ఆకృతి, పటము, ప్రతిమ,విగ్రహము, మూర్తి; చేష్టము, అవస్థ,స్థితి, గతి, వయినము, దశ, భంగి, తెరగు, వైఖరి, తీరు, రీతి, ఠీవి, విధము, పద్ధతి, డౌలు, ఆలోచన, ఉపాయము, సమయము, వాటము, వేషము.చిహ్నము,గుర్తులు, బాహ్యాకారము, దర్శనము, ప్రయోజనము, ఉద్యోగము, సాధనము, ఆధారము, కారణము. **صورت آشنا** -ఆష్నా (పా) ముఖపరిచయముగల, పరిచయస్థుడైన, గురుతున్నట్టి. **صورت آشنائی** -ఆష్నాయీ (పా) ముఖ పరిచయము, గుర్తు. **صورت حال** -ఎ,హాల్ (పా) స్థితిగతులు, వయినము, వర్తమానము.

**صوری** సూరీ (అ) బాహ్యమైన, వెలుపటి, బయటి, ముఖ సం॥.

**صوف** సూఫ్ (అ.పు) ఉన్ని, బొచ్చు, గొంగడి, రాంకవము, సిరాబుడ్డిలో వేయుబట్ట, కలపుకట్టెలోని పీచు, గోటులోని పేక దారము.

**صوفی** సూఫీ (అ.పు) గొంగడి వేసుకొను వాడు, సన్యాసి, ఇంద్రియములు జయించినవాడు, యతీశ్వరుడు, జ్ఞాని.

**صولت** సౌలత్ (అ.స్త్రీ) ఉరవడి,తీవ్రత, వేగము, తీక్ష్ణత, ఉద్రేకము, ఉగ్రము. పటాటోపము, దాడి.

**صوم** సౌమ్ (అ.పు) ఉపవాసము, నిరాహారము. **صوم وصلوة** -ఒ,సలాత్ (అ) జపతపములు.

**صومعہ** సౌమఅ (అ.పు) మఠము,ఆశ్రమము.

**صہبا** సహ్‌బా (అ. స్త్రీ) ద్రాక్షసారాయము, సారాయి.

**صیاد** సయ్యాద్ (అ.పు) వేటకాడు,బోయవాడు,మృగయుడు. **صیاد اجل** -అజల్ (అ) యమదూత, మృత్యుదూత.

**صیادی** సయ్యాదీ(అ. స్త్రీ) వేట,మృగయ.

**صیام** సియామ్ (అ.పు) ఉ పవా సములు, (ఏ. వ **صوم**).

**صیانت** సియానత్ (అ.స్త్రీ) రక్షణము, కాపు, పదిలము, సహాయము.

**صید** సైద్ (అ. స్త్రీ) వేట, వేటమృగము; మృగము వేటాడినజంతువు, పందెము.వైరము. (గాడు.

**صیدی** సైదీ (అ.పు)పందెగాడు, వైరి; వేట

**صیغہ** సీగ (అ.పు) ముద్ర, అచ్చు; మూస, పోత,పోతపోసినది;క్రియారూపము,శబ్దముయొక్క రూపాంతరము; వివాహము,పెండ్లి; పెండ్లిమంత్రము, రాజ్యాంగము, వ్యవహారశాఖ; భాగము, అంగము, శాఖ. **صیغہ پڑھانا** -పఢానా (ఉ) పెండ్లి చేయించుట, పెండ్లిమంత్రముచెప్పుట.

**صیف** సైఫ్ (అ. స్త్రీ)వేసవికాలము, ఎండకాలము.

**صیقل** సైకల్ (అ. స్త్రీ)తుప్పువదలగొట్టుట, మెరుగు పెట్టుట, తోముట, శుభ్రపరచుట, నునుపుగా చేయుట. (చికిలి). **صیقل کرنا** -కర్నా (ఉ)మెరుగుపెట్టుట,తోముట. **صیقل گر** -**صیقلی گر**- సైకల్‌గర్-సిక్‌లీగర్(పా) మెరుగుపెట్టువాడు, సానపట్టువాడు.

## ض

**ض** జాద్-జ్వాద్ (అ.పు) జకారము. ఇది ఉరదూవర్ణమాలలోనిరువదియొకటవయక్షరము, అరబీలో పదునేనవది. పారసీకములో పదునెనిమిదవది. అబ్జదువర్ణసాంఖ్యములో దీనిసంఖ్యఎనిమిదివందలు.

**ضابط** జాబిత్ (అ.పు) రక్షకుడు,పాలకుడు, అధికారి, ఆధీనముగలవాడు, ఉపాయశాలి, ప్రవీణుడు, శాసకుడు, నైష్ఠికుడు; సక్రమమైన, సకాలమైన, క్రమమైన, కట్టుదిట్టానుసారమైన, చట్టము ననుసరించిన, విధాయకమైన; గంభీరమైన, సహా

నముగల, ఓర్పుగల, ఓపికగల, స్థిరస్వభావుడైన.

**ضابطہ** జాబిత (అ.పు) నియమము,చేట్టము, కట్టుదిట్టము, ఏర్పాటు, నిబంధన, పద్ధతి, క్రమము, పదిలము, స్మృతి, శాసనము, శాస్త్రము, విధి, సూత్రము.

**ضابطگی** జాబ్తగీ (పా.స్త్రీ) క్రమానుసరణము, నియమానుసరణము, క్రమానుగుణ్యత, నియమానుగుణ్యత, చేట్టమునను సరించియుండుట, నియమబద్ధత్వము.

**ضاحک** జాహిక్ (అ.పు) పరిహాసకుడు, హాస్యగాడు, నవ్వువాడు, విదూషకుడు.

**ضال** జాల్ల (అ.పు) సద్మార్గముగ చెప్పువాడు; భ్రమ్మరి; మఱపుగొట్టు.

**ضامن** జామిన్ (అ.పు) ప్రతిభువు, బాధ్యుడు, పూటపడువాడు;చేమిరి,పాలతోడు.
**ضامن ہونا** -హోనా- పూటపడుట, పూచీపడుట.

**ضامنی** జామినీ (అ. స్త్రీ)ప్రతిభువత్వము, బాధ్యత, పూట, అప్పగింత, పూచీ, అడ్డము; పూటవాటు, పూచీవాటు.

**ضائع** జాయెఽ (అ) నష్టమైన, చెడిన, వృధాయైన, పాడైన.

**ضبط** జబ్త్ (అ.పు) రక్షణ,కాపు,పదిలము, జాగ్రత; కట్టుదిట్టము, ఏర్పాటు,చేట్టము, శాసనము; అధికారము, పాలనము, ప్రభుత్వము, నిగ్రహము, నిరోధము;ఆటంకము, అడ్డగింపు; నిర్బంధము, కట్టు; స్వాధీనము, అధీనము; దివాణాధీనము, దొరతనము వారి స్వాధీనము, రాజాధీనము.

**ضبطی** జబ్తీ (ఉ.స్త్రీ) రాజాధీనము, దొరతనమువారు లోపరచుకొనుట, ఆధీనము, నిరోధము, రాజనిరోధము, నిగ్రహము, నిరోధకుడు.

**ضحا-ضحی** జుహా [అ.పు] పూర్వాహ్ణము, ప్రొద్దటిపూట.

**ضحاک** జేహ్హాక్ (అ.పు) అట్టహాసకుడు, మిక్కిలి నవ్వువాడు.

**ضخامت** జేఖామత్ (అ.స్త్రీ) ఘనము, లావు, పరిమాణము, కొలది.

**ضد** జిద్ద్ (అ.స్త్రీ) విరుద్ధము, వ్యతిరేకము, విరోధము, వైరము, పగ, హఠము, వితండము, మొండితనము.

**ضدی** జిద్దీ (అ) మూర్ఖపు, హఠముగల, పట్టుగల,పెడసరమైన, మొండి,పంతముగల.

**ضدین** జిద్దైన్ (అ) పరస్పర విరుద్ధములు (రెండు), అన్యోన్యవిరుద్ధములు.

**ضر** జేర్ర్ (అ) నష్టము, హాని, కీడు, చెరుపు; హానికరము.

**ضراب** జిరాబ్(అ.పు)కొట్లాట,కత్తివ్రేటు.

**ضرب** జేర్బ (అ. స్త్రీ) దెబ్బ,పెట్టు,పోటు, తాకుడు; ప్రహారము; సాంప్రదాయము, వ్యాఖ్యానము, ప్రశంస; పాదములోని కడపటిమాట; పద్ధతి, రీతి; ముద్ర,అచ్చు, నష్టము, తుట్టి, లోటు, కత్తివేటు; ఘనపాత్రమువలె ఒకవిధముగాచేదువుటు; గుణకారము, గుణనము. **ضرب المثل** - ఉల్,మస్ల (అ)లోకోక్తి,సామెత,సామ్యము. **ضرب چلیپا** - చలీపా (పా) గుణకారపులెక్కల తప్పొప్పులను పరీక్షించు నొకపద్ధతి, కత్తెరపద్ధతి.

**ضرر** జెరర్ (అ.పు) నష్టము, హాని, కీడు, చెరుపు, అపాయము,ఉపద్రవము, దెబ్బ పెట్టు, ఆపద, కష్టము, నొప్పి, బాధ.

**ضرر خفیف** ఖఫీఫ్(అ) అల్పహాని, చిన్నపెట్టు. **ضرر شدید** -షదీద్ [అ] అనల్పహాని, పెద్దపెట్టు.

**ضرور** జెరూర్ (ఉ) విధాయకమైన, అగత్యమైన, ఆవశ్యమైన, విధిగాయైన,తప్పని, అగతికముగా, అగత్యముగా, నిశ్చయముగా, తప్పకుండ. **ضرور جاے** జాయ్-(పా) మరుగుదొడ్డి.

**ضرورت** జెరూరత్ (అ.స్త్రీ) ఆవశ్యకత, అవశ్యము, అగత్యము, అక్కర, కొఱత, తక్కువ, లేమిడి, అవసరము, రిక్తత,పేదరికము. **ضرورت مند** -మంద్ (పా) అక్కరగలవాడు, పేదయైన, బీదయైన, రిక్తుడైన.

**ضروری** జెరూరీ (ఉ) విధాయకమైన,అగత్యమైన,ఆవశ్యకమైన,తప్పని,బలవంతమైన.

**ضروریات** జెరూరియాత్ (ఉ.స్త్రీ) ఆవశ్యకతలు, అక్కరలు, అవశ్యకములు, అగత్యమైనవి. (ఏ.వ **ضرورت**)

**ضریح** జెరీహ్ (అ. స్త్రీ) సమాధి; శవవాహనము; సమాధిప్రాకారము.

**ضعف** జొఅఫ్ (అ) ఇమ్మడి, రెండంతలు, ద్విగుణము, రెట్టు, రెట్టింపు.

**ضعف** జొఅఫ్ (అ.పు) దౌర్బల్యము, అశక్తి, నిస్త్రాణ, నిస్సత్తువ, మాంద్యము, బలహీనత, ఆలసము. **ضعف بصارت** -ఎ, బసారత్ (అ) దృష్టిమాంద్యము.

**ضعیف** జెఈఫ్ (అ) బలహీనమైన, దుర్బలమైన, సత్తువలేని, ముసలి,వక్కి. **ضعیف العقل** -ఉల్,అక్ల్ (అ) మందబుద్ధియైన, బుద్ధిబలములేని, తెలివిమాలిన.

**ضعیفی** జెఈఫీ (అ. స్త్రీ) దౌర్బల్యము, దుర్బలము, బలహీనత, నిస్త్రాణ,నిస్సత్తువ, వృద్ధాప్యము, ముసలితనము.

**ضلالت** జెలాలత్ (అ. స్త్రీ) భ్రంశము,పొరపాటు, వక్రగతి, తప్పు, దోషము, స్ఖాలిత్యము, ప్రమాదము.

**ضلع** జిలఅ (అ.పు) పక్కవు, ప్రక్కఎముక; రేఖ, గీత; భుజము, ప్రక్క, బాహువు; ప్రదేశము, ప్రాంతము, దేశభాగము, భాగము; దొంతి, వరుస; ఒకవిధమైన శ్లేష్మభాషణము.

**ضلل** జెలల్ (అ.పు) చూడు **ضلالت**

**ضم** జమ్మ్ (అ.పు) అనుబంధనము, సంయోజనము, చేర్చుట, కూర్చుట; సంకలనము, కూడిక, కలుపుట;ఉ కారచిహ్నముగు ( ُ ) గురుతు.

**ضماد** జెమాద్ (అ.పు)లేపనము,పట్టు, పూత, పట్టువేయుట; పూతమందు.

**ضمانت** జెమానత్(అ.స్త్రీ)ప్రతిభువత్వము, పూట, తాకట్టు, బాధ్యత, పూచి, పూటవాటు, అప్పగింత. **ضمانت داخل کرنا - دینا** -దాఖిల్ కర్నా-దేనా(ఉ) పూటపెట్టుట. **ضمانت نامہ** -నామ (పా) పూటపత్రము.

**ضمانتی** జెమానతీ (ఉ.పు) ప్రతిభువు, బాధ్యుడు, పూటపడినవాడు, అప్పగింతగొన్నవాడు, పూచిదారుడు.

**ضمائر** జెమాయిర్ (అ. స్త్రీ) చూడు (ఏ. వ **ضمیر**)

**ضمن** జిమన్ (అ.పు) అనుబంధము, సంబం

ధము, కలిసినది, సందర్భము;లోభాగము, అంతరంగము, లోనిది, ప్రకరణము, విష యము.

**ضمناً** జిమ్నన్ (అ) అనుసారముగా, ప్రస్తావ వశముగా, సంబంధముగా, సందర్భ వశ మున, సందర్భముగా, సూచనగా, కలిపి, సహా, కూడ.

**ضمه** జేమ్మ (అ.పు) ఉకారచిహ్నమగు ( ' ) ఇట్టి గురుతు, క్రొమ్మగురుతు.

**ضمير** జేమీర్ (అ. స్త్రీ) అంతర్యము, అం తస్తు, అంతరంగము, మనస్సు, రహస్యము, గుట్టు, భావము, తలంపు, అభిప్రాయము; సర్వనామము.

**ضميمه** జేమీమ (అ.పు)అనుస్యూతము,అను బంధము, ఉపాంగము, శేషపూరణము. చేర్చబడినది, కల్పబడినది.

**ضوابط** జేవాబిత్ (అ.పు) నియమములు, కట్టుబడులు, నిబంధనము, శాసనము, ఏర్పా టులు, కట్టుదిట్టములు. (ఏ.వ ضابطه)

**ضياء** జియా (అ) ప్రకాశము, ప్రభ, జ్యోతి, కాంతి, తళతళ, మెరుపు.

**ضيافت** జియాఫత్ (అ. స్త్రీ) ఆతిథ్యము, విందు, ఆరగింపు, సంతర్పణము.

**ضيف** జైఫ్ (అ.పు) అతిథి, అభ్యాగతుడు, విందుకువచ్చినవాడు.

**ضيق** జీక్ (అ. స్త్రీ) సంకోచము, ఇరుకు, ఇబ్బంది, తగ్గు, క్షీణము, కొరత, సంకటము, కష్టము, బాధ. **ضيق النفس** -ఉన్, నఫ్స్ (అ) ఉబ్బసరోగము; శ్వాసకాసము.

## ط

**ط** తా-తోయ్-తోయ్(అ. స్త్రీ) తకారచిహ్నము. ఇది ఉరుదూ వర్ణమాలలో నిరువదిరెండవ యక్షరము. అరబీలో పదునారవది. పార సీకభాషలో పందొమ్మిదవది. అబ్జదు వర్ణ సాంఖ్యములో దీనిసంఖ్య తొమ్మిది.

**طاب** తాబ్ (అ) మనోజ్ఞమైన, శుద్ధమైన, స్వచ్ఛమైన, శ్రేష్ఠమైన, సక్రమమైన, శాస్త్రీయమైన.

**طارم** తారమ్ (పా.పు) సరంబీ లేక గోపుర శిఖరముగల గుండ్రని కట్టడము, గుండు, గోపురము, ఆకాశమండలము.

**طاری** తారీ (అ)ఆసన్నమగు, తారసిల్లు, ప్రత్యక్షమగు, అచింతితముగా కలిగెడు, తటస్థించు, సంభవించు, ఆక్రమించు, వ్యాపించు, క్రమ్ముకొను, ప్రబలమగు, అతిశయించు. **طاری هونا** -హోనా (ఉ) ప్రత్యక్షమగుట, తారసిల్లుట, అతిశ యించుట, ప్రబలమగుట, క్రమ్ముకొనుట లోపరచుకొనుట, వ్యాపించుట, సంభ వించుట.

**طاس-طاش** తాస్-తాష్ (పా) గిన్నె, కోర, తాంబాళము, తట్ట, సరిగ పట్టు బట్ట; ఆటచీట్లు.

**طاشه** తాష (అ.పు) ఆవజము (వాద్యము).

**طاشه مرفه** -మర్ఫ (పా) ఆవజము ఢక్క, ఆవజముతుడుము.

**طاعت** తాఅత్ (అ. స్త్రీ) విధేయత, విన యము, పరిచర్య, భక్తి, పూజనము.

**طاعن** తాఇన్ (అ.పు) దూషకుడు, ఆక్షేపకుడు, ఎత్తిపొడుచువాడు; దెప్పువాడు.

**طاعون** తాఊన్ (అ.పు) మహామారి, బొబ్బలరోగము.

**طاغی** తాగీ (అ.పు) పొగరబోతు, తిరుగబడువాడు, మరలబడినవాడు, కలహకారకుడు.

**طاقِ** తాక్ (అ) ధనురాకారము, విలువంపు.

**طاق** తాక్ (అ.పు) గూడు, గోపురము, విలువంపు కట్టడము, గోడలోనిగూడు; ఏకము, ఒకటి, ఒంటరి; బేసి; అద్వితీయము, సాటిలేనిది, అపరూపము, అరుదైనది, లేనిది, దొరకనిది; మడత, పొర. **طاق آبرو** -అబ్రూ- భ్రూశరాసనము. **طاق پر دھرنا رکھنا**. -పర్ ధర్నా-రఖ్నా (ఉ) గూటిలో పెట్టుట, మూలలో చెక్కుట, వదలుకొనుట, విసర్జించుట. **طاق جفت** -జుఫ్త్ (పు) సరిబేసులు అను ఆట.

**طاقت** తాకత్ (అ. స్త్రీ) బలము, శక్తి, సామర్థ్యము, త్రాణ, సత్తువ, అధికారము, ప్రభుత్వము. **طاقت ور** -వర్ (పా) బలశాలి, బలముగల, శక్తిగల, సశక్తమైన.

**طاقچہ** తాక్చ (పా.పు) చిన్న కిటికి, దిడ్డి, కంత, చిన్నగూడు.

**طاقم** తాక (అ.పు) బట్టలతాను లేక రేకు.

**طاقی** తాకీ (పా. స్త్రీ) పొడుగాటి టోపి, కుళ్లాయి. (పు) మెల్లకంటివాడు; పిల్లికండ్ల గుఱ్ఱము, విలువంపైన.

**طالب** తాలిబ్ (అ.పు) అర్థి, ఇచ్ఛకుడు, అభిలాషి, కోరువాడు, కాంక్షి, వాంఛితుడు, జిజ్ఞాసి, అన్వేషి, వెదకువాడు, అడుగువాడు; లోలుడు, లోభి, ఆశగలవాడు. **طالب دنیا** -ఎ,దునియా (అ) లౌకికుడు, లుబ్ధుడు, లోభి, ప్రాపంచికుడు. **طالب دیدار** -ఎ,దీదార్ (పా) దర్శనార్థి, ప్రియుడు, మోహితుడు. **طالب زر** -ఎ,జర్ (పా) లుబ్ధుడు, ధనాశగలవాడు. **طالب علم** -ఎ,ఇల్మ్ (అ) విద్యార్థి.

**طالع** తాలఅ (అ.పు) ఉదయించునది, వేడునది, లేచునది, బాలచంద్రుడు, జాతకము, జన్మలగ్నము, వృశ్చికలగ్నము, అదృష్టము, భాగ్యము, ప్రారబ్ధము, దశ. **طالع چمکنا** -చమక్నా (ఉ) భాగ్యోదయమగుట. **طالع شناس** -షినాస్ (పా) జ్యోతిషికుడు. **طالع مند-ور** -మంద్-వర్ (పా) అదృష్టవంతుడు, భాగ్యవంతుడు, దశావంతుడు.

**طامات** తామాత్ [పా] నిరర్థప్రసంగము, అస్పష్టభాషణము, అపభ్రంశములు.

**طامع** తామెఅ (అ) లోభియైన, అత్యాశగల, ఆశగల, పేరాసగల.

**طاوس-طاؤس** తాఊస్ - తావూస్ (అ.పు) మయూరము, నెమలి; సారంగి, ఒకతంత్రీవాద్యము.

**طاہر** తాహిర్ (అ) పవిత్రుడైన, పరిశుద్ధుడైన, పావనమైన.

**طائر** తాయిర్ (అ.పు) పక్షి, పిట్ట, ఎగురునది.

**طائف** తాయిఫ్ (అ) ప్రహార, రాత్రికావలి, చుట్టుతిరుగుట.

**طایفہ** తాయిఫ (అ.పు) కులము, జాతి, వంశము; జట్టు, సమాజము, సంఘము, గుంపు; సార్థవాహము, బిడారు; భోగముమేళము; రాజపరివారము, సహచరులు, పరిచారకులు.

**طب** తిబ్బ్(అ.స్త్రీ)వైద్యశాస్త్రము, చికిత్స, ఉపచారము, వైద్యము. (శాఖ.

**طبابت** తిబాబత్(అ.స్త్రీ)వైద్యము,వైద్య

**طباخ** తబ్బాఖ్ (అ.పు)పాచకుడు, వంటలవాడు.

**طباشیر** తబాషీర్ (అ) తవాక్షీరము, వంశలోచనము, బొంగుతవాక్షి.

**طباق** తబాక్ (అ.పు) పళ్లెము, తాంబాళము, కంచము, కపాలము. [గిన్నెడు.

**طبال** తబ్బాల్ (అ.పు) మద్దెలకాడు,మార్దం

**طبانچہ** తబాన్చ(పా.పు)చూడు **طمانچہ**

**طبائع** తబాయెఒ (అ.స్త్రీ) చూడు (ఏ.వ **طبیعت**)

**طبراق** తబరాఖ్ (ఉ.పు) కత్తుపాల,బిచ్చగాండ్ల జోలె, అక్షయపాత్రము.

**طبرزد** తబర్‌జద్ (పా.పు) రవచక్కెర.

**طبع** తబ్ఒ (అ.స్త్రీ) ప్రకృతి,స్వభావము, నడవడిక, వర్తనము, నిసర్గము; ముద్రి, అచ్చు, ముద్రణము; నైసర్గికములు. **طبع زاد** -జాద్ (పా) ఊహితము,స్వభావజనితము, మనోకల్పితమైన. **طبع کرنا** -కర్నా(ఉ)ముద్రించుట,అచ్చువేయుట.

**طبعی** తబ్ఈ (అ) ప్రకృతి సం॥, ప్రాకృతమైన, నైసర్గికమైన,స్వాభావికమైన, సహజమైన, నైజమైన. **طبعی جغرافیہ** -జుగ్రాఫియ(అ) నైసర్గిక భూగోళము.

**طبق** తబక్ (అ.పు) తాంబాళము, పళ్లెము, తట్ట, కంచము, సిబ్బి; తగడు, రేకు, అపరంజిరేకు, పొర. అంతస్తు, దేశము, లోకము, గుఱ్ఱముయొక్క వాపురోగము.

**طبقہ** తబక (అ.పు) అంతస్తు, తరగతి,జాతి, వర్గము, గణము, జట్టు, సమాజము, వరుస, పొర, గౌరవస్థితి, పదవి, దశ, స్థితి, అంతరము, లోకము, దేశము, భువనము.

**طبل** తబ్ల్ (అ.పు) ఢక్క,డంక,మృదంగము.

**طبلچی** తబల్‌చీ (ఉ.పు) మార్దంగికుడు, మద్దెల వాయించువాడు.

**طبلق** తబ్‌లక్ (అ.పు) కాకితముల కట్ట, కాకితములకట్టపైవేసిచుట్టు కాకితపు రేక బట్ట పీలిక, కాకితపుకట్టు, కట్టుఅట్టము.

**طبلک** తబ్‌లక్ (పా.స్త్రీ) మద్దెల, కాకితపుకట్టు, కాకితపుకట్టకు పైనచుట్టు కాకితము, కట్టట్టము. (చిన్న పెట్టె.

**طبلہ** తబ్ల (అ.పు)మద్దెల,మృదంగము; డబ్బి;

**طبی** తిబ్బీ (అ) వైద్య సం॥.

**طبیب** తబీబ్ (అ.పు) వైద్యుడు, చికిత్సకుడు. **طبیب حاذق** -హాజిక్ (అ) అనుభవశాలియైన లేక ప్రవీణుడైన వైద్యుడు, ఘనవైద్యుడు.

**طبیبی** తబీబీ (అ)వైద్యము, వైద్యవృత్తి.

**طبیخ** తబీఖ్ (అ) పక్వమైన, వండబడిన, పచితమైన.

**طبیعت** తబీఅత్ (అ. స్త్రీ)ప్రకృతి,స్వభావము, గుణము,జానము,ధర్మము, నిసర్గము, నైజము, వర్తనము, మనసు, బుద్ధి, ఇచ్ఛ. **طبیعت آنا** -ఆనా(ఉ) మోహించుట, వలచుట.ప్రేమించుట. **طبیعت بھر جانا** -భర్జానా (ఉ)మనసుతీరుట,తనివితీరుట, రోయుట.

**طبیعی** తబీఈ(అ) స్వాభావికమైన,సహజమైన, నైజమైన, నైసర్గికమైన.

**طبیلہ** తబేల (ఉ) చూడు **طویلہ**

**طپش** తపిష్ (పా. స్త్రీ) చూడు **تپش**

**طپیدہ** తపీదః (పా) దడబట్టిన, తల్లడపడిన, తపించిన, కలతనొందిన, తడబడిన.

طپنچہ తపంచ (పా.పు) చేతుపు తمنچہ

طحال తిహాల్ (అ.స్త్రీ) ప్లీహము, (ఒక కోశము), జ్వరపుబిళ్ల.

طرار తర్రార్ (అ.పు) ముడియవిడుపు, కత్తెరదొంగ, పోకిరి, దుష్టు, జాణ, చురుకుగల, టక్కరియైన, వడిగల, చంచలమైన, నాలిక చురుకైన, మాటకారియైన, వక్త యైన. طرار فرار -ఫర్రార్ (అ) అతి చంచలుడు, అతి చాకచక్యముగలవాడు, ఇంద్ర మహేంద్రజాలికుడు, మాయలకారి, ఉటంకి, మిక్కిలిజాణ, నాలిక చురుకు వాడు, అతిమాటకారి.

طرارہ తర్రార (ఉ.పు) గంతు, దూకు, దాటు, వడి, వేగము.

طراری తర్రారీ (అ.స్త్రీ) వడి, వేగము, తీవ్రత, నాలికచురుకు, చురుకుదనము. వాగ్ధాటి, వాగ్ఝరి, మాటకారితనము, చాంచల్యము, చాకచక్యము.

طراز తిరాజ్ (అ.పు) సరిగ, అంచు; సరళి, రీతి; అలంకారము.

طراوت తరావత్ (అ.స్త్రీ) పచ్చి, పచ్చదనము, నవీనత, నవనవ, క్రొత్తదనము, తడి, తెమ్మ, చల్లదనము, శీతలత.

طرب తరబ్ (అ.స్త్రీ) సంతోషము, ఆనందము, ఉల్లాసము, ఉత్సాహము, విలాసము.

طرح తర్హ్ (అ.స్త్రీ) తీసివేత, త్రోసివేత, పరిత్యాగము; వ్యవకలనము; బలాత్కారము, మూలము, ఆరంభము; చిత్తరువు, పటము, ఆ కా ర ము , ఆ కృ తి; సహాయసేన, మారుబలము; వైఖరి, రీతి, తెరగు, ప్రకారము, విధము, పద్ధతి, త్రోవి, అవస్థ, భంగి, స్థితి, గతి, వయినము, వర్తమానము, మాదిరి చరణము, మాదిరిగానిచ్చిన పద్యపాదము. طرح بطرح کا -బతర్హ్ కా (ఉ) నానా విధములైన, వివిధములైన, పలుతెరగుల.

طرحدار -దార్ (పా) అందమైన, సొగసైన, పొంకమైన, సొంపైన. طرحداری -దారీ (పా) అందము, పొంకము, సొగసు, సొంపు, వైఖరి. طرح دینا -దేనా (ఉ) విముఖుడగుట. అలక్ష్యము చేయుట, చూచిచూడనట్లుండుట.

طرز తర్జ్ (అ.స్త్రీ) ఆకారము, రూపము, ఆకృతి, పద్ధతి, తీరు, రీతి, భంగి, వైఖరి, తెరగు, స్వభావము, వర్తనము, నడవడిక, మార్గము, ఆచారము, నియమము, చట్టము. طرز کلام -ఎ,కలామ్ (అ) సంభాషణా వైఖరి.

طرف తరఫ్ (అ.స్త్రీ) అంచు, ప్రక్క, దిశ, తట్టు, వైపు, దిక్కు, పక్షము, పక్షపాతము, భాగము. طرفدار -దార్ (పా) పక్షపాతి, సహాయుడు, పాక్షికుడు. طرفداری -దారీ (పా) పక్షపాతము, ఆశ్రయము, సహాయము.

طرفگی తుర్ఫగీ (పా.స్త్రీ) శ్రేష్ఠత, అపరూపత, అపూర్వత, వింత, అసాధారణత్వము, ఆశ్చర్యము.

طرفہ తుర్ఫ (అ) అపూర్వమైన, అపరూపమైన, అసాధారణమైన, ఆశ్చర్యకరమైన, వింతయైన, అరుదైన, శ్రేష్ఠమైన. طرفہ گل پھولنا -గుల్ ఫూల్నా (ఉ) వింత మాటపుట్టుట, క్రొత్తమాటపుట్టుట. طرفہ معجون -మఒజూన్ (అ) వింతలేహ్యము; వింత మనుష్యుడు, నవ్వులబండి, హాస్యగాడు, కుంటుడు.

طرفہ తరఫ (అ.స్త్రీ) నిముషము, రెప్పపాటు, రెప్పపాటుకాలము. طرفۃ العین میں

తర్ఫతుల్ఐన్‌మేం (ఉ) రెండు రెప్ప పాటుల మధ్యకాలములో, రెప్పపాటు కాలములో, నిమిషములో, క్షణములో.

**طر** తుర్రా (అ.పు) తలమొక్క రెండు చెంపలను వ్రేలాడుచుండు ఉంగరములుతిరిగిన వెండ్రుకలకుచ్చులు, కాకపక్షములు, అలకములు, ముంగురులు, టోపీ మొదలగువాని కుచ్చు, పెండ్లికొడుకు చెంపల శేఖరము, శిఖాభూషణము, శిఖ, పక్షులచుంచు లేక జుట్టు, తురాయి, శిఖామణి, (కొమ్మ, గర్వకారణము,) ఆధిక్యత, అపూర్వత, అసాధారణత్వము, శ్రేష్ఠత, ఇంటిచూరులు, చేబుకు, చేరకోల, శిఖరము, జుట్టు, కుచ్చు, గుత్తి, పింఛ, ఒకపుష్పము, మోసము, టుక్కు, గంజాయి లేక భంగి.

**طريق** తరీక్ (అ.పు) మార్గము, త్రోవ, పథము, ఆచారము, సాంప్రదాయము, నియమము, పద్ధతి, వైఖరి, రీతి, రీవి, తీరు, భంగి, తెరగు, చట్టము, మర్యాద, మతము, ఉపాయము.

**طريق الشمس** - ఉష్‌షమ్స్ (అ) సూర్యపథము, రాశిచక్రము.

**طريقت** తరీకత్ (అ. స్త్రీ) మార్గము, త్రోవ, పంథము, మతము, ఆచారము, సాంప్రదాయము. (طريق

**طريقه** తరీక (అ.పు) ఉపాయము, పోడు

**طشت** తష్త్ (పు) తాంబాళము, పళ్లెము, పెద్దగిన్నె; మలపుతొట్టి, పురీషపాత్రము.

**طشت ازبام هونا** - అజ్‌బామ్ హోనా [ఉ] ఎల్లరకు తెలియుట, లోకప్రసిద్ధమగుట, బట్టబయలగుట. **طشت وچوكى** -ఒ, చౌకీ (ఉ) మరుగు దొడ్డిలోని చౌకిపీట. (తట్ట, సిబ్బి.

**طشترى** తష్తరీ (ఉ. స్త్రీ) చిన్న పళ్లెము,

**طعام** తఆమ్ (అ.పు) ఆహారము, భోజనపదార్థములు, ధాన్యము, భోజనము, అన్నము.

**طعام بخش** - బఖ్ష్ (పా) అన్నము పెట్టించునట్టిది. (జనము.

**طعم** తఅమ్ (అ. పు) స్వాదు, రుచి, కమ్మ

**طعم** తుఅమ్ (అ.పు) ఆహారము, తిండి, సస్యములు.

**طعمه** తుఅమ (అ.పు) భోజనము, ఆహారము, జీవనము, వేటపక్షులమేత లేక ఎర, కబళము, కడి, ఎర.

**طعن. طعنه** తఅన్-తఅన (అ.పు) ఈటెతో పొడుచుట; ఆక్షేపము, నింద, దూషణ, ఎత్తిపొడుపు, దెప్పు. **طعن توڑنا** -తోడ్నా (ఉ) ఆక్షేపించుట, ఎత్తిపొడుచుట, **طعنه زن** -జన్ (పా) ఆక్షేపకుడు, ఎత్తిపొడుచువాడు, దెప్పువాడు.

**طغرا** తుగ్రా (తు.పు) ముద్రాక్షరము, గోలుసుకట్టు, చిక్కైనవ్రాత.

**طغيانى** తుగ్యానీ (పా. స్త్రీ) మేరమీరుట, తిరుగబాటు, మరలబాటు; ప్రవాహము, వెల్లువ, వరద; పొర్లిపోవుట, ఆధిక్యము, విస్తారము, సమృద్ధి. (బిడ్డ.

**طفل** తిఫ్ల్ (అ.పు) శిశువు, చిన్నవాడు, పిల్ల,

**طفلى. طفولت. طفوليت** తిఫ్లీ-తుఫూలత్-తుఫూలియత్ (అ. స్త్రీ) చిన్నతనము, పసితనము, శైశవము, బాల్యము.

**طفيل** తుఫైల్ (అ.పు) అధికుడు, కూడవచ్చినవాడు, అనాహూతుడు; పరాన్నభోజి; ఆశ్రయము, ప్రసాదము, అనుగ్రహము, వలన, గుండ, చేత, కారణమున, మూలమునఅను అర్థములనిచ్చును.

**طفيلى. طفيليا** తుఫైలీ - తుఫైలియా

(అ.పు) పరాన్నభోజి, పరులవలనజీవనము చేయువాడు, అవాంతరుడు.

**طلا** తిలా (పా.పు) సువర్ణము, బంగారు; జలపోత, బంగారునీరు, సరిగ. **طلا ساز - کار** -సాజ్-కార్ (పా) జలపోతగాడు, బంగారు నీరుపోయువాడు.

**طلا** తిలా (పా.పు) క్షౌషధతైలము, లేపనము, నపుంసకత్వమునకు చికిత్స.

**طلاق** తలాక్ (అ. స్త్రీ)వివాహచ్ఛేదము, పరిత్యాగము, విడుదల, విమోచనము, ధారాళము, నాలికచురుకుతనము,ఆన, శపథము.

**طلاقت** తలాకత్(అ.స్త్రీ)వాగ్ధాటి, నాలికచురుకు, వక్తృత్వము.

**طلاقن** తలాకన్ (ఉ. స్త్రీ) వివాహబంధము తెగినయాడుది,మొగడువిడిచిన లేక మగనివిడిచిన యాడుది.

**طلاوت** తలావత్ (అ. స్త్రీ)సౌందర్యము.

**طلائی** తిలాయీ (పా) బంగారపు, బంగారు సం॥.

**طلایہ** తిలాయ (పా.పు) రాత్రియందుజ్జరు కాచువారు, గ్రామతలారులు, పరిచారులు, కావలివాండ్రు, ప్రహరివాండ్రు. **طلایہ بھرنا** -భర్నా (ఉ) ప్రహరితిరుగుట, కావలితిరుగుట,

**طلب** తలబ్ (అ. స్త్రీ) అన్వేషణము, వెదకుట, ప్రార్థన, అడుగుట, ఇచ్ఛ,వాంఛ, కోరిక, అక్కర, అపేక్ష; ఆకరణము లేక పిలుపు, జీతము, వేతనము, బత్తెము, కుతి (అనగా అలవాటైనవస్తువు కావలసి యుండుట). **طلب دار** -దార్(పా) వ్యసనము గలవాడు. **طلب گار** - గార్ (పా) అలవాటుగలవాడు,జీతగాడు, బత్తెగాడు, అన్వేషకుడు, కోరువాడు, ఇచ్ఛకుడు,అక్కరగాడు,కోరువాడు,యాచకుడు.

**طلبا** తులబా (అ.పు) చూడు **طلبہ**

**طلبانہ** తలబాన (ఉ.పు) సాక్షులు మొ॥ వారిని పిలుచు బంట్రోతులకు గాను తీసికొను దినబత్తెము, వేతనము, బత్తెము.

**طلبہ** తులబ(అ.పు)విద్యార్థులు(ఏ.వ **طالب**)

**طلبی** తలబీ (ఉ. స్త్రీ) ఆకారణము,పిలుపు.

**طلسم** తిలిస్మ్ (అ.పు) రక్ష,తాయెతు,మంత్రవిద్య. యక్షిణి, భూతవిద్య, కనుకట్టు,ఇంద్రజాలము, వింతమాట లేక విషయము.

**طلسمات** తిలిస్మాత్ (అ.పు) చూడు (ఏ. వ **طلسم**)

**طلسماتی - طلسمی** తిలిస్మాతీ-తిలిస్మీ (ఉ) ఇంద్రజాలికమైన, మాయకమైన, అద్భుతమైన, మంత్రికమైన,అపూర్వమైన, వింతమైన.

**طلعت** తల్అత్ (అ. స్త్రీ) ముఖము, ఆకారము, చూపు, వదనము, రూపము. **ماہ طلعت** మాహ్- (పా) చంద్రముఖి,చంద్రవదన.

**طلوع** తులూఉ (అ.పు) సూర్య చంద్రాదుల ఉదయము, పొడుపు, లేచుట, వెలుట.

**طماع** తమ్మాఉ (అ)అత్యాశగల,లోభిమైన.

**طمانچہ** తమాన్చ (ఉ) దెబ్బ, చెరుపు, చెంపదెబ్బ.

**طمانیت** తమానియత్ (అ. స్త్రీ)మనసు నెమ్మతి, నిమ్మళము,విశ్రాంతి, నిశ్చింత,తృప్తి, శాంతము.

**طمطراق** తంతరాక్ (పా.పు) పటాటోపము, ఆడంబరము, వైభవము.

**طمع** తమఉ (అ. స్త్రీ) లోభము, అత్యాశ, అభిలాష, ఇచ్ఛ, కోరిక, ఆశ.

**طمنچہ** తమంచ (ఉ.పు) చిన్నతుపాకి, పిసుకుడుతుపాకి. (త్రాడు,పగ్గము.

**طناب** తనాబ్(అ. స్త్రీ) గుడారపుత్రాడు,

**طناز** తన్నాజ్ (అ) పరిహాసకమైన, నవ్వులమారియైన, హాస్యాకారియైన, వేళాకోళపు, సరసమైన, జాణతనముగల, ఆక్షేపకమైన, ఎత్తిపొడిచెడు, దెప్పెడు,పరియాచకాలమారి,ఎగతాళిజేయు. (త్రాడు.

**طنب** తనబ్(అ)గుడారము మొ॥వానిపగ్గము

**طنبو** తంబూ (ఉ.పు) చూడు. **تنبو**

**طنبور** తంబూర్ (పా.పు)చూడు **تنبور**

**طنبورہ** తంబూర(పా.పు)చూడు **تنبورا**

**طنز** తన్జ్ (అ. స్త్రీ)సరసము,పరిహాసము, పరియాచకము. వక్రోక్తిగామాటలాడుట, ఆక్షేపము. ఎత్తిపొడుపు,దెప్పు, ఎగతాళి, నింద, తిరస్కారము.

**طنزاً** తన్జన్ [అ] పరిహాసముగా, ఆక్షేపణగా,ఎత్తిపొడుపుగా,తిరస్కారముగా.

**طنطنہ** తన్తన (అ.పు) వాద్యములచప్పుడు, పటాటోపము, వైభవము, ఆడంబరము,అధికారము, బలాత్కారము,పెత్తనముచూపుట, ఆగ్రహము, కోపము, అహంకారము, గర్వము, నీలుగుడు, హొయలు, ఒయారము.

**طواسی** తవాసీ (పా.స్త్రీ) రత్నకంబళి.

**طواف** తవాఫ్ [అ.పు] ప్రదక్షిణము. చుట్టుతిరుగుట, ఊరేగింపు.

**طوالت** తవాలత్(అ.స్త్రీ) దీర్ఘత, ఆలస్యము, పొడుగు, బహుళ్యము, విస్తారము.

**طوائف** తవాయిఫ్ (అ.పు) నటి,ఆటకత్తె, బోగముది,బోగముమేళము,సంఘము, సమాజము,జాతులు, (ఏ.వ **طائفہ**) **طوائف الملوک** ఉల్,ములూక్(అ)అరాజకమైన.

**طوبےٰ** తూబా (అ.పు) కల్పవృక్షము,ఉత్తమము. శ్రేష్ఠము, పవిత్రము, మేలుతరము.

**طور** తూర్ (అ.పు) పర్వతము, అరబ్బీదేశప్రాంతమందలి సీనాపర్వతము పేరు; వల, సరిగ.

**طور** తౌర్ (అ.పు) ఒకసారి, మేర, ఎల్ల, అస్థిభారము, ప్రక్క-వైపు,విధము,తెరగు, రీతి, వైఖరి, భంగి, తీరు. పద్ధతి, నడవడిక, వర్తనము, స్థితి, గతి, అవస్థ, వయినము, వర్తమానము, వ్యవహారము. **طور طریق** -తరీక్ (అ.పు) ఆచారవ్యవహారములు,నడవడిక, వర్తనము, సాంప్రదాయము.

**طوس** తూస్(అ.పు) ఒకవిధమైనఉన్నిబట్ట, రాంకము; ఒకఔషధము; ఒక యూరి పేరు.

**طوسی** తూసీ(అ)ఒకవన్నె పేరు, రక్తవర్ణము.

**طوطا** తోతా (పా) చిలుక, శుకము.

**طوطی** తూతీ (పా) చూడు **توتی**

**طوطی نامہ** తూతీనామ (పా.పు) శుకసప్తతివంటి కథలపుస్తకము.

**طوطیا** తూతియా(పా.పు) తుత్తము,కాటుకరాయి, మైలతుత్తము; నింద,అపవాదము.

**طوعاً وکرھاً** తౌఅన్ వకర్హన్(అ) అనివార్యముగా, తప్పకుండ, ఇష్టమయియుయును కాకయున్నను.

**طوفان** తూఫాన్ (అ.పు) జలప్రళయము, వెల్లువ, వరద, ప్రళయవాతము, ఉప్పెన, ఝంఝామారుతము, గాలివాన, గాఢాంధకారము, మహామారి, ప్రజాక్షోభము, నింద, ఆరడి, అపవాదము, అల్లకల్లోలము, కోలాహలము, గొల్లు, గల్లంతు, గందరగోళము, జగడము, దొమ్మి, కలహము, సంక్షోభము, జగడగొండి, జగడాలమారి,

పోట్లాట, పీకులాట, ఆక్రందనము, శోకము,ప్రలాపము, మొత్తుకోళ్లు, లబలబలు, శంఖధ్వనులు, ఆపత్తు, కీడు, ముప్పు, ప్రళయము, తండోపతండములు, అమితము,విస్తారము,బాహుళ్యము. **طوفان شیطان** -షైతాన్ (అ) అపవాదము, నింద, ఆరడి,తంటాలు,తగులాటము, పీకులాట. జగడగొండి.

**طوفانی** తూఫానీ (ఉ) ప్రచండమైన, నిందమోపెడు, ఆరడి పెట్టినట్టి,అపవాదము వేయునట్టి, కలహ కారకుడైన, జగడాలమారి, తంటాలమారి, తలకొట్లమారి, చేట్లకొరవి, పోకిరియైన, దుర్మార్గుడైన,దుష్టైన, ఇంద్రమహేంద్రజాలికుడైన, ఉద్రేకమైన, ప్రకోపమైన, సంక్షోభకరమైన, ప్రళయకారకమైన,అల్లకల్లోలముగానున్న, ప్రళయమైన.

**طوق** తౌక్ (అ.పు) వలయము,గళబంధనము, కంటె, కంఠమాల లేక సరము,కడియము, మెడకువేయు బండకొయ్య, పక్షుల మెడచుట్టునుండు చార లేక గిర; బంద్రౌతుల విళ్ళు, మొక్కుబడికంటె. **طوق وزنجیر** -ఒ.జన్ జీర్ (పా) అందెబందెలు, సంకెలలు.

**طول** తూల్(అ.పు) పొడుగు,నిడుపు,దీర్ఘము, **طول پکڑنا یا کھینچنا** -పకడ్నా యా ఖీంచ్నా (ఉ) దీర్ఘసూత్రమగుట, పెరుగుట, వృద్ధియగుట, చాలాకాలమువరకు నుండుట, ఆలస్యమగుట, కాలము జరుగుట. **طول دینا** -దేనా (ఉ)పెంచుట,పొడిగించుట. **طول کلام** -కలామ్ (పా) వాగ్బాహుళ్యము, అధికప్రసంగము, అధికముగామాట్లాడుట. (దీర్ఘత.

**طولانی** తూలానీ(ఉ. స్త్రీ) పొడుగు,నిడుపు,

**طومار** తూమార్ (అ.పు) గ్రంథము, కాకితముకట్ట లేక చుట్ట; నింద, అపవాదము, అసత్యవాదము; ప్రోగు, విస్తారము, బాహుళ్యము, అనావశ్యముగా, పెంచివ్రాసినది లేక చెప్పినది, అతిదీర్ఘమైన కథ లేక ఉత్తరము.

**طوئی** తూయీ (పా) చూడు **توئی** ; ఒక పెద్దపక్షి.

**طویل** తవీల్ (అ) దీర్ఘమైన, నిడుపాటి, పొడుగైన, విస్తారమైన; ఒకవృత్తము.

**طویلہ** తవీల (అ.పు) దామెన (గుఱ్ఱములను వరుసగా కాళ్లకు లంకెవేసికట్టు త్రాడు), అశ్వశాల, గుఱ్ఱపుకొట్టము, లాయము,గుఱ్ఱముల గాడి అనగా మేయుస్థలము.

**طہارت** తహారత్ (అ. స్త్రీ) ప్రక్షాళనము, కడుగుకొనుట, పరిశుభ్రత, పరిశుద్ధత, స్వచ్ఛత,పవిత్రత,నిర్మలత;మడి, శౌచము.

**طہر** తుహ్ర్ (అ.పు) పవిత్రత, పరిశుభ్రత, శుద్ధత, నిర్మలత, శౌచము, మడి.

**طہور** తహూర్ (అ) పరిశుద్ధమైన, పవిత్రమైన; పవిత్రముచేయు.

**طے** తై (అ. స్త్రీ)చుట్టిపెట్టుట,మడతపెట్టుట, మడత, చుట్ట, త్రోవనడచుట, తీర్పు, తీరుమానము, పరిష్కారము, ముగింపు.

**طیار** తైయార్ (అ) వడిగా ఎగురునట్టి, మిక్కిలి ఎగురునట్టి, సంసిద్ధమైన, ఆయత్తమైన, ఉన్ముఖమైన, సిద్ధమైన, పక్షి,పాదరసము.

**طیاری** తైయారీ (అ. స్త్రీ) సన్నాహము, సంసిద్ధత, ప్రయత్నము.

**طیر** తైర్ (అ.పు) పక్షి, పిట్ట, ఎగురునది.

**طیش** తైష్ (అ.పు) చాపల్యము, చులకదనము, బుద్ధిహీనత, ఆగ్రహము,కోపము,

ఆవేశము, ఉద్రేకము, ప్రకోపము, ఉగ్రము, తీవ్రము, తీక్ష్ణము.

**طین** తీన్ (అ. పు) మన్ను, మృత్తిక, మట్టి.

**طینت** తీనత్ (అ. స్త్రీ) ప్రకృతి, గుణము, స్వభావము. [ (ఏ.వ **طیر**)

**طیور** తుయూర్ (అ. స్త్రీ) పక్షులు, పిట్టలు,

## ظ

**ظ** జా-జోయే-జోయే (అ. స్త్రీ) జకారచిహ్నము. ఇది ఉరుదూ వర్ణమాలలో నిరువదియారవ యక్షరము. అరబీలో పదునేడవది. పారసీకభాషలో నిరువదవది. అబ్జదువర్ణసాంఖ్యములో దీనిసంఖ్య తొమ్మిదినూర్లు.

**ظالم** జాలిమ్ (అ) అంధకారముకలుగ చేయునట్టి, ప్రళోపద్రవకరమైన, క్రూరమైన, నిర్దయాత్మకమైన, అన్యాయకరమైన, హింసకరమైన, దౌర్జన్యమైన, కఠినమైన, బలాత్కారమైన, బలవంతమైన, బాధకమైన, హింసకుడు. క్రూరుడు.

**ظاهر** జాహిర్ (అ) బహిరంగమైన, బయలైన, కనబడుచున్న, సుస్పష్టమైన, తేటయైన, ప్రత్యక్షమైన, విశదమైన, ప్రసిద్ధమైన, ప్రకటమైన, ప్రచురమైన, బాహ్యమైన, వెలుపలి, బయటి, పైపై, మీది.
**ظاهردار** -దార్ (పా) పైకిమాత్రము అగుపడునట్టి, కృత్రిమమైన, కపటమైన, డంబముగల, ఆడంబరముగల, బూటకమైన, మాయయైన, కల్లయైన. **ظاهرداری** -దారీ (పా) బాహ్యాడంబరము, బూటకము, పైమర్యాదలు, లాంఛనము. **ظاهر ظهور** -జోహూర్ (అ) విస్పష్టము, తేటతెల్లము, బట్టబయలు, ప్రత్యక్షము.

**ظاهرا-ظاهراً** జాహిరా-జాహిరన్ (అ) మోచూచుటకు, బయటికి, పైకి, వెలుపలికి, ప్రత్యక్షముగా, తెలియునట్లు.

**ظاهری** జాహిరీ (అ) పైకికనబడుచున్న, బాహ్యపు, బయటి, వెలుపలి, స్పష్టమైన, ప్రత్యక్షమైన.

**ظبی** జబీ (అ. పు) దుప్పి.

**ظرافت** జరాఫత్ (అ. స్త్రీ) బుద్ధిచాతుర్యము, జాణతనము, బుద్ధికుశలత, సారస్యము, చాతుర్యము, తెలివి, హాస్యము, పరిహాసము, చమత్కారము, సరసము, వినోదము.

**ظرف** జర్ఫ్ (అ. పు) బుద్ధిచాతుర్యము, జాణతనము; బుద్ధికుశలత, సారస్యము, చమత్కారము; పాత్ర, భాసిన, భాండము; సామర్థ్యము, త్రాణ, పరిమాణము, కొలత.
**ظرف آفتاب** -అఫ్తాబ్ (పా) చషకము, సారాయి గిన్నె, సారాయి కోర, **ظرف زمان** - ఎ.జమాం (అ) కాలబోధక క్రియావిశేషణము. **ظرف مکان** -ఎ.మకాం (అ) స్థలబోధక క్రియావిశేషణము.

**ظروف** జురూఫ్ (అ. పు) మోచూడు (ఏ.వ **ظرف**)

**ظریف** జరీఫ్ (అ. పు) బుద్ధికుశలుడు, బుద్ధిచాతుర్యము గలవాడు, సరసుడు, జాణ, చమత్కారి, చతురుడు, హాస్యగాడు, నవ్వులబండి, పరిహాసకుడు, విదూషకుడు.

ظفر జఫర్ (అ.పు) జయము, గెలుపు, కృతార్థత, కల్యాణము, వృద్ధి, సిద్ధి. ظفر تکیہ -తక్య (పా) యోగదండము, హంసపాది వంటి కఱ్ఱ.

ظل జిల్ల్ (అ.పు) ఛాయ, నీడ, రక్షణ, రక్ష, చీకటి. ظل البہ - الہی -అల్లా-ఇలాహీ (అ) భగవంతుని నీడ, భగవదంశ సంభూతుడు, రాజు, పాలకుడు.

ظلم జుల్మ్ (అ.పు) అంధకారము, దౌర్జన్యము, అన్యాయము, ప్రజాపీడనము, జనోపద్రవము, అన్యాయము, బలాత్కారము, నిర్బంధము, క్రౌర్యము, నిర్దయ, కఠినత్వము, అవినీతి, దుర్మార్గము, దౌష్ట్యము, పాపిష్ఠితనము, పరపీడనము, హింసనము, బాధ, పీడ. ظلم توڑنا - ڈھانا - کرنا -తోడ్నా-ఢానా-కర్నా (ఉ) దౌర్జన్యముచేయుట, ఉపద్రవముచేయుట. ظلما ظلمی జుల్మాజుల్మీ (ఉ) పరమోపద్రవము, మహాపీడనము.

ظلمات జుల్మాత్ (అ. స్త్రీ) అంధకారములు, చీకటులు, గాఢాంధకారము, అమృత సరస్సు ఉండుచోటు. (ఏ. వ ظلمت)

ظلمت జుల్మత్ (అ. స్త్రీ) అంధకారము, చీకటి.

ظلمی జుల్మీ (అ) ద్రోహము ظالم

ظلمیت జుల్మియత్ (అ. స్త్రీ) ద్రోహము ظلم

ظلیل జలీల్ (అ) నీడ గల, నీడయిచ్చెడు.

ظن జన్న్ (అ.పు) భావము, భ్రమము; భ్రాంతి, సందేహము; అనుమానము, ఆపోహము; తలంపు, అభిప్రాయము, ఊహ; విశ్వాసము; నమ్మకము, నింద, అపవాదము. ظن غالب -ఎ, గాలిబ్ (అ) బహుళోభావము, ప్రామోభావము, నమ్మకము. ظن فاسد -ఫాసిద్ (అ) దుర్భావము, దురభిప్రాయము, చెడుతలంపు, అపనమ్మకము.

ظہر జుహ్ర్ (అ.పు) అపరాహ్ణము, మధ్యాహ్నము; అపరాహ్ణమునమాజు.

ظہر జహ్ర్ (అ. స్త్రీ) పృష్ఠము, వీపు, వెనుక, వెనుకతట్టు.

ظہور జుహూర్ (అ.పు) ప్రత్యక్షము, అగపడుట, ప్రచురమగుట, ప్రకటమగుట, బహిరంగమగుట, ప్రకాశము, సంభవము, ఉద్భవము, కలుగుట, వర్తనము.

ظہورا జుహూరా (అ.పు) ప్రకటము, ప్రసిద్ధి ప్రకాశము, ప్రఖ్యాతి, ఠీవి, వైభవము, ఆడంబరము, పటాటోపము.

ظہیر జహీర్ (అ.పు) పోషకుడు, సహాయుడు.

---

# ع

ع ఐన్ (అ) ఇది ఉరుదూ వర్ణమాలలో నిరువదినాలుగవ యక్షరము. అరబీలో పదునెనిమిదవది. పారసీకములో నిరువదియొకటవది. అబ్జదు వర్ణసాంఖ్యములో యిది డెబ్బదియను సంఖ్యకు సంకేతము.

عابد ఆబిద్ (అ.పు) పూజకుడు, భక్తుడు, ఉపాసకుడు, దాసుడు, తపస్వి, నైష్ఠికుడు.

عابر ఆబిర్ (అ) బాటసారి, ప్రయాణస్థుడు, వ్యాఖ్యాత.

عاج ఆజ్ (అ.పు) ఏనుగదంతము.

**عاجز** ఆజిజ్ (అ) అశక్తుడైన, అసమర్థుడైన, చేతకాని, అణకువగల, వినయముగల. విధేయుడైన, చిక్కిన, నిరుపాయుడైన,లొంగిన, లోబడిన, భంగపడిన, ఓటుపడిన,అలసిన, సొలసిన, నిరాశచెందిన, దురవస్థలోనున్న, విసికిన, రోసిన.

**عاجزانہ** ఆజిజానా (పా) వినయ పూర్వకమైన, విధేయతగల.

**عاجزی** ఆజిజీ (ఉ. స్త్రీ) అశక్తత, అసమర్థత, వినయము, విధేయత, నమ్రత, అణకువ, ప్రార్థన, వేడికోలు, ఆదరువులేమి, నిరాధారము,దిక్కుమాలినతనము, దురవస్థ, దుర్గతి.

**عاد** ఆద్ (అ) ఒకసంఖ్యను శేషములేకుండ భాగించు సంఖ్య, పూర్ణభాజకము, లబ్ధమూలము. [عادت]

**عادات** ఆదాత్ (అ. స్త్రీ) చూడు (ఏ. ఐ

**عادت** ఆదత్ (అ. స్త్రీ) అభ్యాసము, అలవాటు, వాడుక, గుణము, స్వభావము, ప్రకృతి, వర్తనము, నడవడిక, ఆచారము, సాంప్రదాయము, పద్ధతి, మర్యాద, వ్యవహారము.

**عادل** ఆదిల్ (అ) న్యాయము చేయువాడు, న్యాయస్థుడు, న్యాయాధిపతి, నిష్పక్షపాతమైన, న్యాయమైన.

**عادی** ఆదీ (ఉ) అలవాటుగల, వాడుకపడిన, అభ్యాసమైన, మరిగిన.

**عادی** ఆదీ (అ.పు) శత్రువు, పగవాడు.

**عاذر** ఆజిర్ (అ.పు) క్షమాపణ జెప్పువాడు; గాయపుమచ్చ.

**عار** ఆర్ (అ. స్త్రీ) సిగ్గు, లజ్జ; బిడియము, సంకోచము; అవమానము.

**عارض** ఆరిజ్ (అ.పు) చెంప, బుగ్గ, గల్లము; దళవాయి, సేనాధిపతి; సంభవించునది, ఘటించునది, తటస్థించునది, అడ్డపడునది, ఆకస్మికము, నడుమంతరమున వచ్చునది, మధ్యవచ్చినది.

**عارضہ** ఆరిజా (అ.పు) రోగము, జాడ్యము, జబ్బు, ఘటన, సంఘటన, ఆకస్మికము.

**عارضی** ఆరిజీ (అ) ఆగంతుకమైన, తాత్కాలికమైన, అశాశ్వతమైన, స్థిరముకాని,సహజముకాని, ఆకస్మికమైన, మధ్యవచ్చిన, అనంతరమైన; అస్వాభావికమైన, సంఘటించిన, తటస్థమైన.

**عارف** ఆరిఫ్ (అ.పు)జ్ఞాని,యోగి, భక్తుడు, భాగవతుడు, సాధువు, తెలివిగలవాడు.

**عاری** ఆరీ (అ) నగ్నమైన, రిక్తలయైన, రిత్త, వట్టి, శూన్యమైన, రహితమైన, విహీనమైన, విసికిన, రోసిన, లోబడిన,చేతకాని, సమర్థతలేని. **عاری آنا** -ఆనా (ఉ) విసుకుట, రోయుట.

**عاریت** ఆరియత్(అ.స్త్రీ)అప్పు,ఋణము, అరువు, ఎరవు.

**عاریتاً** ఆరియతన్ (అ) అప్పుగా,అరవుగా, ఎరవుగా, ఋణముగా.

**عاریتی** ఆరియతీ (అ) అప్పుగా తీసకొనిన, ఎరవుగాతీసుకొనినలేకయిచ్చిన,అప్పుస౦॥, అశాశ్వతమైన, నశ్వరమైన.

**عاشق** ఆషిక్(అ.పు) మోహితుడు, ప్రేమించువాడు, అభిరుచిగలవాడు, ప్రియుడు, కాముకుడు, వలపుకాడు, మిండడు; భాగవతుడు, భగవద్భక్తుడు. **عاشق مزاج** -మిజాజ్ (అ) కాముక స్వభావముగల వాడు, విలాసవంతుడు, వినోదగాడు.

عاشقانہ ఆషికానా (పా) మోహబోధకమైన, ప్రేమసూచకమైన, శృంగారసం॥, వలపుసం॥, కామవిషయకమైన, మోహితుడు.

عاشقی ఆషికీ (ఉ. స్త్రీ) మోహితత్వము, వలపు, మోహము, ఉపసర్పణము.

عاشورا ఆషూర (అ.పు) మొహర్రుము నెల యొక్క పదియవతిథి లేక మొదటి పది దినములు.

عاصم ఆసిమ్ (అ) పవిత్రమైన, పరిశుద్ధమైన, స్వచ్ఛమైన, నిర్దోషమైన, నీతిగల, సురక్షితమైన.

عاصمہ ఆసిమ (అ)పతివ్రతయైన,

عاصی ఆసీ (అ) అపరాధి, నేరస్థుడు, పాపి, ద్రోహి, అవిధేయుడు, దుర్మార్గుడు, తిరుగబడినవాడు.

عاطر ఆతిర్ (అ) పరిమళప్రియుడు, పరిమళముగల, సువాసనగల, మేలుకోరెడు, సచ్చింతనగల,సజ్జనుడు, సద్గుణసంపన్నుడు.

عاطفت ఆతిఫత్ (అ. స్త్రీ) కృప, కరుణ, దయ, అనుగ్రహము, కటాక్షము, ప్రేమ.

عافیت ఆఫియత్ (అ.స్త్రీ) ఆరోగ్యము, క్షేమము, శాంతము, సౌఖ్యము, స్వస్థత.

عاق ఆక్ (అ) తల్లి దండ్రులకు తిరుగబడిన వాడు, అవిధేయుడు, పోకిరి, దుర్మార్గుడు, అవిధేయతవలన దాయాధికారమునుండితొలగింపబడినవాడు.

عاقبت ఆకిబత్ (అ. స్త్రీ) అంతము, అవసానము, సారాంశము, ఫలము, ఫలితము, పర్యవసానము, సమాప్తి, భవిష్యము, పరము, పరలోకము, ఎట్టకేలకు, తుదకు, عاقبت اندیش - అన్దేష్ (పా) పూర్వాపరవివేకముగల, దూరదృష్టిగల, ముందు తెలియు, భవిష్యత్తును ఆలోచించెడు. عاقبت اندیشی -అందేషీ (పా) పూర్వాపరవివేకము, భవిష్యద్జ్ఞానము, దూరదృష్టి.పర్యవసానజ్ఞానము. عاقبت کاتوشہ -కాతోష (పా) కడబత్తెము, పుణ్యము, సత్కర్మము.

عاقرقرحا ఆకిర్‌కర్‌హా(అ.పు) అక్కలకర యను వేరు.

عاقل ఆకిల్ (అ) బుద్ధిమంతుడైన, జ్ఞానముగల, వివేకముగల, తెలివిగల,బుద్ధిశాలియైన.

عاکف ఆకిఫ్ (అ) తపస్వి, నిష్ఠపరుడు, మసీదులో కూర్చొనిఅనుష్ఠానము లేక స్నానము చేయువాడు.

عالم ఆలిమ్ (అ.పు) జ్ఞాని, తెలిసిన వాడు, ఎరుగువాడు, విద్యావంతుడు, పండితుడు, శాస్త్రి, ఎరుకగల వాడు, జ్ఞానవంతుడు. عالم الغیب -ఉల్‌గైబ్ (అ)పరము తెలియువాడు,సర్వజ్ఞుడు, ఈశ్వరుడు.

عالم ఆలమ్(అ.పు) ప్రపంచము,లోకము,సృష్టి, కాలము, సంసారము, ప్రజ, లోకులు, జనులు, విధము,తెరగు, జాతి, ప్రకారము, స్థితి, అవస్థ,వైఖరి, గతి,దశ, రీతి, పద్ధతి, వయినము, వర్తమానము,రూపము, ఆకృతి, అందము,యౌవనము, రూపురేఖావిలాసములు, సామ్యము, పోలికగల, పోలిన. عالم ارواح -ఎ.అర్వాహ్(అ) దేవలోకము, పితృలోకము, జీవలోకము,భూతసంఘము, పంచభూతములు, عالم اسباب -ఎ. అస్బాబ్ (అ) కార్యకారణ ప్రపంచము, ప్రపంచము. عالم افروز -అఫ్రోజ్ (పా) ప్రభాకరుడు, సూర్యుడు. عالم بالا

-علوی -ఎ,ఔలా-ఉల్వీ (అ) పరలోకము, స్వర్గము. عالم پناہ - ఎ,పనాహ్ (పా) భూపాలుడు, రాజు. عالم خلق -ఎ,ఖల్క్ (అ) స్థూలప్రపంచము. عالم سفلی - فانی -సిఫ్లీ-ఫానీ (అ) భూలోకము. జగత్తు. عالم صغری -صغیر -ఎ,సుగ్రా-సగీర్ (అ) పిండాండము, మనుష్యదేహము. عالم غیب -ఎ,గైబ్ (అ) పరలోకము. عالم کبیر -ఎ,కబీర్ (అ) సంసారము, ప్రకృతి, మాయ, శక్తి. عالم کون -ఎ,కౌన్ (అ) స్థూలప్రపంచము, సృష్టి. عالم گیر - గీర్ (పా) జగజ్జేత, జగత్తునంతయు జయించువాడు. عالم مثال -ఎ,మిసాల్ (అ) సూక్ష్మప్రపంచము, స్థూలప్రపంచముయొక్క సూక్ష్మకోశము. عالم معنی - ఎ, మఅ్ని (అ) సూక్ష్మలోకము.

عالمی ఆలమీ (అ.పు) ప్రపంచమందుండు, ప్రపంచవాసి, లోకమందుండు, ప్రాపంచికము.

عالمیان ఆలమియాన్ (పా) లోకులు, ప్రపంచమందుండువారు. (ఏ.వ عالمی)

عالی ఆలీ (అ) ఉన్నతమైన, ఎత్తైన, గొప్ప, పెద్ద, దొడ్డ, ఘనమైన, గౌరవముగల, ఘనతగల. عالی جاہ -జాహ్ (అ) ఉన్నతపదవిగల. عالی جناب -జనాబ్ ఏలినవారు, దేవరవారు. عالی خاندان -ఖాన్దాన్ (పా) కులీనుడు, గొప్పవంశమునందుపుట్టిన. عالی ہمت -హిమ్మత్ (అ) మిక్కిలిసమర్థుడు,ఘనబుద్ధిగలవాడు, ఉదారుడు, ఉదారబుద్ధిగలవాడు,సాహసముగలవాడు.

عام ఆమ్మ (అ) సాధారణముగా వ్యాపించియున్న, సర్వసామాన్యమైన, సాధారణమైన, వాడుకైన,సార్వజనికమైన, అందరు. عام فہم - ఫహమ్ (అ) సుబోధమైన, అందరికి తెలిసెడు.

عامرہ ఆమిర (అ)పరిపూర్ణమైన,నిండియున్న, దొరతనమువారిభాండాగారము, కోశము, భూరిభాండాగారము. (خزانہ عامرہ)

عامل ఆమిల్ (అ) కర్త, చేయువాడు, నడచుకొనువాడు,మంత్రగాడు,అధికారి,నిర్వాహకుడు, పనినడుపువాడు.

عامہ ఆమ్మ (అ) పన్నులు రాబట్టువాడు, సుంకరీడు. (చూడు ఏ.వ عام)

عامی ఆమీ (అ) సామాన్యుడు, పామరుడు. చూడు عام

عائد ఆయిద్ (అ) మరలునట్టి, తిరుగునట్టి, సంభవించెడు, తటస్థించెడు, మీదికివచ్చు. సంబంధించు. (జోగులఅంగీ.

عبا అబా (అ.పు)తురకసన్యాసులగీతలఅంగీ.

عباد ఇబాద్ (అ.పు)దాసులు. (ఏ.వ عبد)

عبادت ఇబాదత్ (అ.స్త్రీ) భగవదారాధనము, పూజనము, భగవంతునిసేవ, నిష్ఠ, ప్రార్థన, భక్తి,వినయము, عبادت گاہ -గాహ్ (పా.పు) ప్రార్థనాలయము,పూజామందిరము, మందిరము, మఠము.

عبادتی ఇబాదతీ (అ.పు) భక్తుడు, పూజకుడు, నైష్ఠికుడు.

عبارت ఇబారత్(అ.స్త్రీ) వివరణము,తెలియజేయుట, రచన, శైలి, సాకము, పదగుంభనము, శబ్దసరళి, వ్రాత, శయ్య,భావము, మాట, అభిప్రాయము. عبارت رنگین -ఎ,రంగీన్ (పా) శృంగారశైలి, అలంకారశైలి.

**عباسی** అబ్బాసీ (అ.పు) రుద్రాక్షపూల చెట్టు, సందెమల్లెచెట్టు, ఒకమహాపురుషు నిపేరు, ఒకవిధమైన బలపపురాయి, నీలవ ర్ణము, ఎఱ్ఱరంగు.

**عبث** అబస్ (అ) నిష్ఫలమైన, పనికిమాలిన, వృథా, నిష్కారణముగా; ఆట, పందెము.

**عبد** అబ్ద్ (అ.పు) బానిస, సేవకుడు. **عبد الدنیا** -ఉద్‌,దున్యా (అ) శుద్ధపాపం చికుడు, పామరుడు, **عبد الشہوت** -ఉష్-షహ్వాత్ (అ) కామి, ఇంద్రియలో లుడు, కామాతురుడు.

**عبرت** ఇబ్‌రత్ (అ. స్త్రీ) ఊహ, అనుమాన నము, శిక్ష, బుద్ధి, భయము, బెదరు, చూ చినేర్చుకొనుట లేక బుద్ధితెచ్చుకొనుట. **عبرت انگیز** -అంగేజ్ (పా) నీతిదా యకము, బుద్ధికరపుసట్టి, బెదరుపుట్టించునట్టి, జాగ్రతపుట్టించునట్టి. **عبرت پکڑنا** -పకడ్నా (ఉ) చూచిబుద్ధితెచ్చుకొనుట, జాగ్రతపడుట.

**عبودیت** ఉబూదియత్ (అ. స్త్రీ) బాని సతనము, దాస్యము, సేవ, పరిచర్య.

**عبور** ఉబూర్ (అ.పు) ఏరుదాటుట, దా టుట, పైగాపోవుట, కడచుట, కడతేరుట; ప్రవీణత, అధికారము, పాండిత్యము.

**عبہر** అబ్‌హర్ (అ.పు) మల్లెజాతిపువ్వు, పూబోడి, సుకుమారమైనయాడుది,

**عبید** ఉబైద్ (అ.పు) బానిస, దాసుడు, సేవకుడు.

**عبیر** అబీర్ (అ.పు) అంబరములేకపటవాస కము, గందపొడి, బట్టలపైవేయుసువాసన గలపొడి; కుంకుమపువ్వు, కేసరము.

**عتاب** ఇతాబ్ (అ.పు) ఆగ్రహము, కోపము, చివాట్లు, గద్దింపు. **عتاب و خطاب** - వఖితాబ్ (అ) ఆక్రోశనము, చివాట్లు.

**عجالت** ఉజాలత్ (అ. స్త్రీ) ఆతురము, త్వర, తీవ్రత, వేగము, కాచినఊచేబియ్యము.

**عجائب** అజాయిబ్ (అ.పు) వింతలు, విచిత్రములు. (ఏ.వ. **عجیب**) **عجائب خانہ** -ఖాన (పా) వస్తుప్రదర్శనశాల, వింతవస్తువులుంచియుండుగృహము.

**عجائبات** అజాయిబాత్ (అ.పు) చూడు. **عجائب**

**عجب** అజబ్ (అ) ఆశ్చర్యకరమైన, అపూ ర్వమైన, అరుదైన, వింతైన, అపరూపమైన, వినోదకరమైన; నవ్వులబండి, వినోదగాడు, గారడివాడు, ఆశ్చర్యము.

**عجب** ఉజ్బ (అ.పు) అహంకారము, గర్వ ము, నీలుగుడు, దురభిమానము.

**عجز** అజ్‌జ్ (అ.పు) అశక్తత, అసామర్థ్యము, చేతకానితనము; ఓటు, గతిమాలినస్థితి, భంగము, నిరుపాయత, అసహాయత; విన యము, విధేయత, లొంగుట, ప్రార్థన, వేడికోలు, దిక్కుమాలినతనము.

**عجلت** అజలత్ (అ. స్త్రీ) వేగము, వడి, తీవ్రత, ఆతురము, తొందర.

**عجم** అజ్మ్ (అ.పు) మ్లేచ్ఛదేశము, పరదేశ ము, పారసీకదేశము. [పారసీకదేశస్థుడు.

**عجمی** అజమీ (అ.పు) మ్లేచ్ఛుడు, పరదేశి,

**عجوبہ** అజూబ (అ.పు) అద్భుతము, అపూ ర్వవస్తువు, వింత, అపరూపము.

**عجول** అజూల్ (అ) వేగిరపడెడు, తొంద రపడెడు, ఆతురమైన, తీవ్రమైన.

**عجیب** అజీబ్ (అ) ఆశ్చర్యకరమైన, అద్భు తమైన, అపూర్వమైన, అపరూపమైన, వింతమైన.

عدالت అదాలత్ (అ. స్త్రీ) సమానత, సమత్వము, సామ్యము; న్యాయము, న్యాయస్థానము, న్యాయసభ.

عدالتی అదాలతీ (అ) న్యాయవిచారణ సం॥; న్యాయసం॥.

عداوت అదావత్ (అ. స్త్రీ) ద్వేషము, విరోధము, పగ, స్పర్థ, శత్రుత్వము.

عداوتی అదావతీ (అ) శత్రువు, ద్వేషి, వైరి, పగగల, ద్వేషముగల.

عدت ఇద్దత్ (అ. స్త్రీ) సంఖ్య, మహమ్మదీయమతములో వివాహచ్ఛేదానంతరము గాని లేక మగడు చనిపోయినతరువాత గాని స్త్రీ పెండ్లియాడకుండ యుండవలసిన కాలము, విశ్రాంతుదినము.

عدد అదద్ (అ. పు) సంఖ్య, లెక్క, లెక్క పెట్టబడినది, అంకె, అంకము, ఒకటి. عدد صحیح -ఎ, సహీహ్ (అ) పూర్ణాంకము, عدد مطلق -ఎ, ముత్‌లక్ (అ) కేవల సంఖ్య, సంఖ్యామాత్రము, సంఖ్యావాచకము, عدد وصفی ఎ, వస్ఫీ (అ) సంఖ్యా పూరణార్థకము.

عدل అద్ల్ (అ. పు) సమత్వము. సామ్యత, సమానత, న్యాయము. عدل گستر -గుస్తర్ (పా) న్యాయాధిపతి, న్యాయము చేయువాడు, తీర్పుచేయువాడు, తీర్పరి.

عدم అదమ్ (అ. పు) అవిద్యమానత్వము, అభావము, శూన్యము, లేనిది, పూజ్యము, సున్న, లేమి, లేకుండుట. عدم تعمیل -తాఁమీల్ (అ) అనిర్వహణము, నెరవేర్పమి, చేయమి, జరిగింపమి. عدم توجہ -తవజ్జుహ్ (అ) పరధ్యానము, పరాకు, అలక్ష్యము, నిర్లక్ష్యము, అజాగ్రత, శ్రద్ధలేమి.

عدم حاضری -అదమ్-హాజిరీ (అ) ఉండకపోవుట, లేకపోవుట, పరోక్షత, లేకుండుట, గైరుహాజరి. عدم فرصت -ఫుర్‌సత్ (అ) తీరికలేమి, తీరుపాటులేమి. عدم وقفیت -వక్ఫియత్ (అ) అజ్ఞానము, తెలియమి, అపరిచయము, పరిచయములేమి.

عدو అదువ్ (అ. పు) శత్రువు, ద్వేషి, వైరి, పగవాడు, ప్రతిస్పర్థి.

عدول ఉదూల్ (అ. పు) ఉల్లంఘనము, అవిధేయత, మరలబాటు, విముఖత, భంగము, తిరస్కారము. عدول حکمی -హుక్మీ (అ) ఆజ్ఞోల్లంఘనము, ఆజ్ఞాభంగము, తిరుగబాటు, మరలబాటు, ఆజ్ఞాతిరస్కారణము.

عدیل అదీల్ (అ) సమానమైన, సామ్యమైన, (పు) న్యాయాధిపతి, న్యాయముచేయువాడు.

عدیم అదీమ్ (అ) విహీనపడిన, విహీనమైన, రహితమైన, విరహితమైన, లేని, عدیم الفرصت -ఉల్, ఫుర్‌సత్ (అ) తీరికలేని, వ్యవధిలేని, విశ్రాంతిరహితము, విరామశూన్యము.

عذاب అజాబ్ (అ. పు) బొండకొయ్యలు, శిక్ష, యాతన, కష్టము, బాధ, హింస, పీడనము, వేదన, దుఃఖము, పరితాపము, దోషము, పాపము, పాపఫలము, వ్యాధి, రోగము, సంకటము, పీకులాట, తగులాటము, عذاب ثواب -అజాబ్-సవాబ్ (అ) పాపపుణ్యములు, మంచిచెడ్డలు, మేలుకీడులు.

عذار ఇజార్ (అ. పు) చెంప, బుగ్గ, గల్లము, చెక్కిలి, ముఖము, రూపము.

**عذر** ఉజ్ర్ (అ.పు) నెపము, మిష, సాకు, క్షమాపణ, ఆక్షేపణ, ఆక్షేపము, ప్రతిబంధము, ప్రతికూలమైన హేతువు, కారణము, క్షమాపణకోరుట. **عذرپذیر** - పజీర్ (పా) క్షమార్హమైన. క్షమింపదగిన, మన్నింపదగిన. **عذرخواه** -ఖాహ్ (పా) క్షమార్థి, క్షమాపణకోరువాడు. ప్రార్థించువాడు, మన్నించుమనువాడు. **عذرخواهی** -ఖాహీ (పా) క్షమాప్రార్థన, క్షమాపణ కోరుట, మన్నింపుమనుట; ప్రార్థన, వినంతి, వేడికోలు, **عذردار** -దార్ (పా) ఆక్షేపముగలవాడు, ఆక్షేపకుడు, అడ్డగించువాడు. **عذرداری** -దారీ (అ) ఆక్షేపణము, ఆక్షేపము, ప్రతిబంధము, అడ్డగింపు.

**عذرا** అజ్రా (అ. స్త్రీ) కన్య, ప్రియురాలు.

(బండితోలువాడు.

**عرابچی** అరాబ్‌చీ (పా.పు) చకడా

**عرابہ** అరాబ (పా.పు) శకటము, చకడా బండి, పెద్దబండి.

**عراق** ఇరాక్ (అ.పు) నదీప్రాంతము, నదీతీరము, ఏటివాక లేక కఱ, ఏటియొడ్డునఉండు దేశము లేక గ్రామము.

**عراقی** ఇరాకీ (అ.పు) అరబ్బీగుఱ్ఱము.

**عرایض** అరాయిజ్ (అ. స్త్రీ) ప్రార్థనలు, విజ్ఞాపనలు, ప్రార్థనపత్రములు, విజ్ఞాపనపత్రములు. (ఏ.వ **عریضہ**)

(దేశస్థుడు.

**عرب** అరబ్ (అ.పు) అరబ్బీదేశము, అరబ్బీ

**عربدہ** అర్‌బద (అ.పు) జేగడము, పోట్లాట, దొమ్మి, యుద్ధము, పీకులాట, దౌష్ట్యము, దౌర్జన్యము.

(దేశము.

**عربستان** అరబిస్తాన్ (పా.పు) అరబ్బీ

**عربی** అరబీ (అ.పు) అరబ్బీ గుఱ్ఱము, అరబ్బీ భాష, అరబ్బీదేశస్థుడు, అరబ్బీదేశసం॥ **عربی باجہ** -బాజ (ఉ) డప్పు, తుడుము, ఆవజము.

**عرس** ఉరుస్-ఉర్స్ (అ.పు) పెండ్లివిందు; సమాధులవద్ద జేరుగుఉత్సవము.

**عرش** అర్ష్ (అ.పు) సింహాసనము; ఇంటికప్పు; భగవంతుని సింహాసనము, వైకుంఠము, కైలాసము, సత్యలోకము, ఆకాశము, ధ్రువమండలము, శవవాహనము.- **عرس معلے** - **عرس بریں** -ఎ, ముఅల్లా -ఎ, బరీన్ (పా) ధ్రువమండలము, సత్యలోకము,

**عرصہ** అర్సహ్ (అ.పు) అంగణము, ఆవరణము; బయలు, యుద్ధభూమి, విస్తీర్ణము, పరుపుచీర, పరుపు; దూరము, అంతరము, ఎడము, దీర్ఘకాలము, మధ్యకాలము, ఆలస్యము, అవకాశము, కాలము, వ్యవధి.

**عرض** అర్జ్ (అ) ఒకదానిని ఆశ్రయించుకొనియున్నది, అవలంబితము, ఆశ్రితము.

**عرض** అర్జ్ (అ) విజ్ఞాపనము, వినంతి, మనవి, ప్రార్థన, చెప్పుకొనుట, (పు) విస్తీర్ణము, వెడలుపు, నేరుపు, వైశాల్యము, విశాలత, అంతరము, వ్యవధి, అవకాశము, మధ్యకాలము, ఎడము. **عرض بلد** -ఎ, బలద్ (అ) అక్షాంశము, అక్షభాగము. **عرض بیگی** -బేగీ (పా) కార్యదర్శి, ఇతరుల ప్రార్థనలను రాజునకు తెలియజేయువాడు. **عرض حال** -హాల్ (అ) వివరణము, వయినము, వర్తమానము. **عرض داشت** -దాష్త్ (పా) ప్రార్థనపత్రము, విజ్ఞాపనపత్రము, మనవి, విజ్ఞాపనము.

**عرضاً** అర్జన్ (అ) వెడల్పువైపున, అడ్డముగా, అవాంతరముగా, అచింతితముగా.

عرضی అర్జీ (అ. స్త్రీ) ప్రార్థనపత్రము, విజ్ఞాపనపత్రము, విజ్ఞాపనము, మనవి, వినంతి, అగాంతుకమైన, అనంతుకమైన, తటస్థమైన. عرضی دعوے -దావా (అ) అభియోగపత్రము, విజ్ఞాపనపత్రము.

عرف ఉర్ఫ్ (అ.పు) ఎరుక, గురుతు; ప్రసిద్ధనామము, ప్రతినామము. నామాంతరము, మారుపేరు.

عرفا ఉర్ఫా (అ) జ్ఞానులు, భక్తులు, భాగవతులు. (ఏ.వ عارف)

عرفات అరఫాత్ (అ. స్త్రీ) మక్కా దగ్గర ఒకపుణ్యస్థలము, ఒక పర్వతము.

عرفان ఇర్ఫాన్ (అ.పు) ఎరుక, పరిచయము, జ్ఞానము, బ్రహ్మజ్ఞానము.

عرفه అరఫహ్ (అ.పు) జీహజ్జ్ నెల యొక్క తొమ్మిదవ తిథి, ప్రతి పండుగ యొక్క లోగటిదినము, జాగరణదినము.

عرفی ఉర్ఫీ (అ) ప్రసిద్ధమైన, సాధారణమైన, సామాన్యమైన, వ్యవహారములోనున్న.

عرق అరక్ (అ.పు) స్వేదము, చెమట, కషాయము, సారము, రసము, ద్రావకము, ధృతి, సత్తు, నిగ్గు. عرق گیر -గీర్ (పా) గోను. خوگیر, చెమటతుడుచుకొను గుడ్డ, తుండుగుడ్డ. عرق چین -చీన్ (పా) టెంకి, చెమటపట్టకుండుటకై తలగుడ్డక్రింద పెట్టుకొను చిన్నతోపి

عروج ఉరూజ్ (అ.పు) ఆరోహణము, ఎక్కుట, ఎక్కుడు, ఉదయము, ఉచ్చము, ఊర్ధ్వగమనము, వృద్ధి, కల్యాణము.

عروس ఉరూస్-అరూస్ (అ. స్త్రీ) పెండ్లికూతురు, పాన్పువుత్సవము, పెండ్లికొడుకు.

عروض అరూజ్ (అ) మక్కా పట్టణము, ఛందశ్శాస్త్రము, ఛందము.

عریان ఉర్యాన్ (అ) నగ్నమైన, బిత్తలగానున్న, దిగంబరమైన, బహిరంగమైన, బట్టలు లేని.

عریانی ఉర్యానీ (అ. స్త్రీ) దిగంబరత్వము, నగ్నత, వస్త్రహీనత, బిత్తల.

عریض అరీజ్ (అ) వెడల్పైన, విశాలమైన, వెడలుపాటి, నెరవుగల.

عریضه అరీజె (అ.పు) విజ్ఞాపనపత్రము, ప్రార్థనపత్రము, చిన్నలు పెద్దలకువ్రాసినపత్రము.

عز అజ్జ్ (అ) ఘనత, గౌరవము, గొప్పతనము, మర్యాద, మహిమ, ఘనమైన, అపూర్వమైన.

عزا అజా (అ. స్త్రీ) ఆదరణము, దుఃఖోపశమనము, అనుశోకము, ఆక్రోశము, వ్యసనము, దుఃఖసహనము, శోకము, దుఃఖము, విచారము. عزادار -దార్ (పా) వ్యసనములోనున్నవాడు, దుఃఖితుడు.

عزت ఇజ్జత్ (అ. స్త్రీ) గౌరవము, మర్యాద, మానము, సత్కారము.

عزرائیل ఇజ్రాయీల్ (అ.పు) మృత్యుదేవత, యముడు.

عزل అజ్ల్ (అ.పు) ఉద్యోగముతీసివేయుట, పదభ్రష్టత, తీసివేయుట, త్రోసి వేయుట, త్రోసుడు.

عزلت ఉజ్లత్ (అ. స్త్రీ) ఉద్యోగత్యాగము, కొలువువదలుకొనుట, పదభ్రష్టత, పరిత్యాగము, చాలించుకొనుట, ఏకాంతము, సన్యాసము.

عزم అజ్మ్ (అ.పు) వుద్దేశము, సంకల్పము,

అభిప్రాయము, తలంపు, యత్నము, పూనిక, నిశ్చయము.

**عزیز** అజీజ్ (అ) ప్రియమైన, ఇష్టమైన, ముద్దైన, మనోహరమైన, విలువగల, అపరూపమైన, అరుదైన, శ్రేష్ఠమైన, అమూల్యమైన, అర్హమైన, యోగ్యమైన, గౌరవముగల, మర్యాదగల, ఘనతగల, పరువుగల, పూజ్యమైన. (పు) బంధువు, సంబంధుడు, చుట్టము, కావలసినవాడు; స్నేహితుడు, ప్రియుడు, ఈజిప్టుదేశపు రాజుబిరుదు, భగవంతుని విశేషణము. **عزیزداری** - దారీ (పా) సంబధము, బాంధవ్యము, చుట్టరికము.

**عزیمت** - అజీమత్ (అ. స్త్రీ) మంత్రవిద్య, చూడు **عزم** [ (ఏ. వ **عسکر**)

**عساکر** అసాకిర్ (అ.పు) సేనలు, దాణువలు,

**عسرت** ఉస్రత్ (అ. స్త్రీ) కష్టము, సంకటము, ఆపద, దుర్దశ, బీదరికము, రిక్తత, దారిద్ర్యము. (పారుపత్తెగాడు.

**عسس** అసస్ (అ.పు) గ్రామ రక్షకుడు,

**عسکر** అస్కర్ (అ.పు) సేన, బలము, దండు దాణువ.

**عسکری** అస్కరీ (అ) సైనికుడు, యుద్ధభటుడు.

**عسل** అసల్ (అ.పు) మధువు, తేనె.

**عشا** ఇషా (అ.పు) రాత్రి, చీకటి, రాత్రినమాజు, పండుకొనబోవునపుడు చేయు నమాజు.

**عشا** అషా (అ.పు) రాత్రిభోజనము.

**عشاق** ఉష్షాక్ (అ.పు) ప్రియులు, కాముకులు. (ఏ. వ **عاشق**)

**عشبہ** ఉష్బ (అ.పు) సుగంధి పాల (ఒక ఓషధి).

**عشر** ఉష్ర్ (అ) దశాంశము, పదియవపాలు.

**عشرعشیر** - ఎ, అషీర్ (అ) శతాంశము; రవంత, కొంచెము.

**عشرت** ఇష్రత్ (అ. స్త్రీ) సంభాషణము, సంభోగము, ఆనందము, సంతోషము, సుఖము, భోగము, సుఖానుభవము, సంబరము, విలాసము, వినోదము. **عشرتخانہ** ఖాన (పా) విలాసగృహము, కేళికాగృహము, ఆనందభవనము.

**عشعش** అష్అష్ (ఉ.పు) బళిబళీ, మేలు మేలు, బాగు, భళిరే.

**عشرہ** అష్రహ్ (అ. పు) పది దినములు, దశరాత్రములు.

**عشق** ఇష్క్ (అ.పు) మోహము, కామము, వలపు, ప్రేమ, స్నేహితము, ప్రియము, అభిరుచి, అపేక్ష, ఆసక్తి, ఇష్టము, అంపకాల వందనము, అభ్యాసము, వ్యసనము, బళిరే, బాగు, మేలు. **عشقباز** - బాజ్ (పా) స్త్రీలోలుడు, కాముకుడు, విలాసవంతుడు, పోకిరి, ఇంద్రియలోలుడు. **عشقبازی** - బాజీ (పు) స్త్రీలోలత్వము, ఇంద్రియలోలత్వము.

**عشوہ** ఇష్వహ్ (అ.పు) వగలు, బిత్తరము, కులుకు, ఒయ్యారము. **عشوہ ساز-گر** - సాజ్ - గర్ (పా) వగలాడి, కులుకులాడి, ఒయ్యారి, ముద్దులాడి, ప్రియురాలు.

**عشیر** అషీర్ (అ.పు) దశాంశము, పదియవ పాలు.

**عصا** అసా (అ.పు) గుదియ, బడితె, దుడ్డుకఱ్ఱ, దండము, కఱ్ఱ, వేత్రము, బెత్తము, బల్లెకోల, రాజ దండము. **عصابردار** - బర్దార్ (పా) దండధరుడు, భటుడు, ఈటెకాడు. (పిండినది, పిప్పి.

**عصارہ** ఉసారహ్ (అ.పు) గసము, సారము;

عصابہ ఇసాబ (అ.పు) స్త్రీల శిరోవస్త్రము లేక తలకట్టు, కట్టుపీలిక.

عصب అసబ్ (అ.పు) వస, నరము, స్నాయువు, మజ్జాతంతువు.

عصبیت అస్బియ్యత్ (అ. స్త్రీ) సంబంధము, బంధుత్వము, రక్తసంబంధము.

عصر అస్ర్ (అ.పు) సాయంకాలము, అస్తమానము, పొద్దుకూకు జాము.

عصفور ఉస్ఫూర్ (అ.పు) పిచ్చుక, ముంగురులు.

عصمت అ(ఇ)స్మత్ (అ. స్త్రీ) పరిశుద్ధత, పాతివ్రత్యము, పతివ్రతత, వ్యభిచారము లేమి, మానము, గౌరవము.

عصیان ఇస్యాన్ (అ.పు) పాపము, ద్రోహము, అపరాధము, నేరము.

عضلہ అజల (అ.పు) కౌలు; కండరము.

عضو అజ్వ్-అజో (అ.పు) అంగము, అవయవము, కీలు, దేహము, శరీరము, కాయము, దేహభాగము. عضو تناسل -తనాసుల్ (పు) జననేంద్రియము, లింగము.

عطا అతా (అ. స్త్రీ) దానము, ఈవి, ధర్మము, బహుమానము, మాన్యము. عطا نامہ -నామ (పా) దానపత్రము.

عطار అత్తార్ (అ.పు) పరిమళకారుడు, సౌగంధికుడు, బుక్కావాడు, మందులవాడు.

عطارد ఉతారద్ (అ.పు) బుధగ్రహము; పాదరసము.

عطائی అతాయీ (అ.పు) గురువు లేకనే ఒకవిద్యను నేర్చుకొనినవాడు, తనకుతానే నేర్చుకొనినవాడు.

عطر ఇ(అ)త్ర్ (అ.పు) సుగంధము, పరిమళము, సుగంధరసము, ద్రావకసారము, ధృతి, రసము, నిర్యాసము, సత్తు, ద్రావకము

عطردان -దాన్ (అ) గంధపేటిక. పరిమళములు పెట్టుకొను డబ్బి.

عطریات ఇత్రియాత్ (అ. స్త్రీ) చూడు (ఏ. వ عطر)

عطس అత్స (అ.పు) తుమ్ము, తుమ్ముట.

عطش అత్ష్ [అ. స్త్రీ] తృష్ణ, దప్పి, దూప.

عطشان అత్షాన్ (అ) దప్పిగొనిన, తగ్గితుదైన.

عطف అత్ఫ్ (అ.పు) మరల్చుట, త్రిప్పుట, మళ్లించుట, ఒకమాటనుమరియొకమాటలో కలుపుట; సముచ్చయము.

عطوفت ఉతూఫత్ [అ. స్త్రీ] అనుగ్రహము, దయ, ప్రేమ, కృప, కటాక్షము.

عطیہ అతియ (అ.పు) దానము, బహుమానము, మాన్యము, ధర్మము, ఇచ్చినది.

عظم అజ్మ్ (అ.పు) అస్థి, ఎముక, శల్యము.

عظم ఉజ్మ్ [అ.పు] ఘనత, గొప్పతనము, గురుత్వము.

عظما ఉజమా (అ.పు) పెద్దలు. (ఏ.వ عظیم)

عظمت అజ్మత్ (అ. స్త్రీ) ఘనత, గురుత్వము, పెద్దతనము, గౌరవము, మర్యాద, మానము, వైభవము.

عظمیٰ ఉజ్మా (అ. స్త్రీ) దివ్యము, ఘనమైనది, పెద్దది, గొప్పది.

عظیم అజీమ్ (అ) ఘనమైన, పెద్ద, గొప్ప, దొడ్డ, మహిమగల, గౌరవముగల.

عفت ఇఫ్ఫత్ (అ. స్త్రీ) పాతివ్రత్యము, పరిశుద్ధత, పవిత్రత, మానము.

عفریت ఇఫ్రీత్ (అ.పు) భూతము, పిశాచము, దయ్యము.

**فرزند** ఫర్జన్ద్ (పా) పుత్రుడు, కొడుకు; సంతానము. **فرزند ارجمند** - అర్జ్మంద్ (పా) సుపుత్రుడు, యోగ్యమైనకొడుకు.

**فرزندی** ఫర్జందీ (పా. స్త్రీ) పుత్రత్వము, పుత్రత. **فرزندی میں لینا** - మేఁ లేనా (ఉ) దత్తుగొనుట, పెంచుకొనుట, ఇల్లిటముంచుకొనుట.

**فرزی · فرزین** ఫర్జీ-ఫర్జీన్ (పా.పు) చదరంగములోని మంత్రి.

**فرس** ఫరస్ (అ.పు) అశ్వము, గుఱ్ఱము, చదరంగములోనిగుఱ్ఱమును.

**فرستادہ** ఫిరిస్తాద (పా.పు) పంపబడిన, దూత, వార్తికుడు.

**فرسخ** ఫర్సఖ్ (పా.పు) చూడు **فرسنگ**

**فرسنگ** ఫర్సంగ్ (పా.పు) క్రోశము, యోజనము.

**فرسودہ** ఫర్సూద (పా) జీర్ణమైన, చెడిన, మిక్కిలివృద్ధైన, అరిగిన, మిక్కిలి పాతబడిన, పనికిమాలిన.

**فرسے** ఫర్సే (ఉ) బుఱ్ఱున, వడిగా.

**فرش** ఫర్ష్ (అ.పు) పరుపు, ఆస్తరణము, పరచునది, భూమి, నేల, చదునుచేసిన నేల. నట్టిల్లు, రాళ్లు మొ॥నవి పరచియున్న నేల. **فرش کرنا** - కర్నా (ఉ) పరచుట, పరుపు మొ॥నవి పరుచుట, రాళ్లు మొ॥నవిపరచి చదును చేయుట, పడగొట్టుట.

**فرشتگان** ఫరిష్తగాన్ (పా) చూడు (ఏ.వ **فرشتہ**).

**فرشتہ** ఫరిష్త (పా.పు) దూత, వార్తికుడు, దేవదూత, దేవత. **فرشتہ صفت** - సిఫత్ (పా) పవిత్రుడైన, ధర్మపరాయణుడైన, యోగ్యుడైన, సజ్జనుడు, దివ్యస్వభావముగల.

**فرشی** ఫర్షీ (అ. స్త్రీ) వెడల్పాటిఅడుగుగల గుడ్గుడి, పరపు సం॥, పరుపుకొరకైన,

**فرصت** ఫుర్సత్ (అ. స్త్రీ) వంతు, తడవ, తేప, సమయము, సంధి, తరుణము, ఒడుపు, వాటము, విమోచనము, విడుదల, సెలవు, తీరిక, తీరుబాటు, తీరుబడి, వ్యవధి, అవకాశము, విశ్రాంతి, నెమ్మతి, నిమ్మళము, ఉపశమనము.

**فرض** ఫర్జ్ (అ.పు) నిర్ణయము, నిర్ధారణ, విచారము, ధర్మము, విధి, నియోగము, నియమము, బాధ్యత, విహితము, కర్తవ్యము, అధికారము, ఉత్తరవాదము, చచ్చిన వానియాస్తిని శాస్త్రోక్తముగాపంచిపెట్టుట, భావన, మనఃకల్పన, ఊహ, అనుకొనినది, అనుమానము, వట్టితలంపు, కల్పన, మనోరథము, మనస్సృష్టి. **فرض کرنا** - కర్నా (ఉ) ఊహించుకొనుట, భావించుకొనుట, అనుకొనుట, ఒప్పుకొనుట.

**فرضاً** ఫర్జన్ (అ) ఊహాగా, భావనగా, అనుకొందము, ఊహింతము, ఒప్పుకొందము విధిగా.

**فرضی** ఫర్జీ (అ) కర్తవ్యమైన, విధిగానున్న, విహితమైన, ఊహింపబడిన, అనుకొనబడిన, కల్పితమైన, మిథ్యయైన, మనఃకల్పితమైన, భావితమైన, మనఃసృష్టియైన, కృత్రిమమైన, వట్టితలంపైన, ఊరికయైన పేరుకుమాత్రమైన, యథార్థముకాని, నామకార్థమైన, నిజముకాని.

**فرط** ఫర్త్ (అ) ఆధిక్యము, విస్తారము, పుష్కలము, సమృద్ధి, విశేషము.

**فرع** ఫర్ఉ (అ. స్త్రీ) శాఖ, కొమ్మ. ధర్మసందేహము.

**فرعون** ఫిర్ఔన్ (అ, స్త్రీ) మొసలి, మకరము; క్రూరుడు, పరాపకారి, ఉపద్రవకారుడు, గర్విష్ఠి, ఈజిప్టుదేశపు ఒక రాజు పేరు. **فرعون بے سامان** -బేసామాన్ (పా) ఉత్తనీలుగుబోతు.

**فرغل-فرغول** ఫర్గుల్ (పా) దూదివేసి కుట్టిన చొక్కాయ, దూదిదుబుసము, బొంత, పచ్చడము.

**فرفر** ఫర్‌ఫర్ (పా) బిరబిర, చెరచెర, కరకర, వడిగా, త్వరగా, ధారాళముగా.

**فرق** ఫర్క్ (అ.పు) వియోగము, ఎడబాటు, దూరము, అంతరము, వ్యత్యాసము, భేదము, వేరు, వేరుబందము; తల, తలవెండ్రుకల పాపట; లోపము.

**فرقت** ఫుర్కత్ (అ. స్త్రీ) వియోగము, ఎడబాటు, వేరగుట, విరహము.

**فرقه** ఫిర్క (అ.పు) కులము, తెగ, జాతి, వంశము; వర్గము, గణము; సంఘము, సమాజము, జట్టు.

**فرمان** ఫర్మాన్ (పా.పు) రాజాజ్ఞ, శాసనము, ఉత్తరువు, ఆజ్ఞ, రాజశాసన ప్రకటనము, అధికారపత్రము, నియోగము. **فرمان بردار** -బర్దార్ (పా) ఆజ్ఞాకారి, ఆజ్ఞానువర్తి, విధేయుడు, లోబడిన వాడు, సేవకుడు, బంటు, కింకరుడు, వశవర్తి. **فرمان برداری** -బర్దారీ [పా] ఆజ్ఞానువర్తనము, విధేయత, వశవర్తనము, పరిచర్య, సేవ, కొలువు. **فرمان روا** -రవా (పా) శాసకుడు, అధికారి, పాలకుడు. **فرمان روائی** -రవాయీ (పా) అధికారము, ప్రభుత్వము, దొరతనము.

**فرمانا** ఫర్మానా (ఉ) ఆజ్ఞాపించుట, ఉత్తరువుచేయుట, విధించుట, నియమించుట, సెలవిచ్చుట, చెప్పుట

**فرمایش** ఫర్మాయిష్ (పా. స్త్రీ) ఆజ్ఞ, ఉత్తరువు, నియోగము, అగత్యము, అక్కర, కోరిక, అడుగుట, చెప్పుట.

**فرمایشی** ఫర్మాయిషీ (పా) ఉత్తరువు చేసిన, చెప్పిన, చెప్పిచేయించిన, అడిగిన, కోరిన, శ్రేష్ఠమైన, మేలుతరమైన.

**فرنگ** ఫరంగ్ [పా.పు] పిరంగిదేశము, ఐరోపాఖండము; పిరంగివాడు, జాతి దేశము, జాతివారు, దొర. **فرنگستان** -ఇస్తాన్ (పా) పిరంగిదేశము, సీమ.

**فرنگی** ఫరంగీ (పా) జాతివాడు, పిరంగివాడు, దొర.

**فرنی** ఫిర్నీ (పా. స్త్రీ) పాలతో జేసిన బియ్యపుసంకటి, బియ్యపుపిండితో జేసిన పాలజావ.

**فرو** ఫరో (పా) క్రింద, అడుగున, తక్కువ, అణగి, నీచము. **فرو کرنا** -కర్నా (ఉ) అణచివేయుట, లొంగదీయుట, శమింపచేయుట, శాంతిచేయుట, నెమ్మదిపరచుట, చల్లార్చుట. **فرو هونا** -హోనా (ఉ) అణగుట, లొంగుట, చల్లారుట, శాంతినొందుట, శమించుట.

**فروتن** ఫరోతన్ (పా) విధేయుడు, అధీనుడు, దీనుడు, వినయముగల, అణకువగల.

**فروتنی** ఫరోతనీ (పా. స్త్రీ) విధేయత, వినయము, దీనత, అణకువ.

**فروخت** ఫరోఖ్త్ (పా. స్త్రీ) విక్రయము, అమ్మకము, అమ్మటు.

**فروختہ** ఫరోఖ్త (పా) ప్రజ్వలించిన. మండిన, కాలిన, ప్రకాశించెడు, వెలిగెడు, అమ్మిన.

**فرود** ఫరోద్ (పా) క్రింద, అడుగున, (పు) దిగుడు, నిలుకడ, ఉనికి, నివేశము, వాసము. **فرودگاہ** - గాహ్ (పా. పు) దిగుచోటు, బస, నివేశము, నివాసము.

**فروش** ఫరోష్ (పా. పు) విక్రయకుడు, అమ్మువాడు, (సమాసములలో).

**فروشندہ** ఫరోషింద (పా. పు) విక్రయికుడు, అమ్మువాడు.

**فروع** ఫరోఉ (అ. పు) శాఖలు, కొమ్మలు, ధర్మసందేహములు. (ఏ. వ **فرع**)

**فروغ** ఫరోగ్ (పా. పు) ప్రకాశము, కాంతి, ప్రభ, తేజస్సు.

**فروکش ہونا** ఫరోకష్ హోనా (ఉ) దిగుట, బసచేయుట, ఉండుట.

**فروگزاشت** ఫరోగుజాష్త్ (పా. స్త్రీ) మరచివిడిచిపెట్టుట, లోపము, పొరపాటు, మరపు, తప్పు, ఉపేక్ష, చూచి చూడనట్లుండుట, మన్నింపు, పోనిచ్చు, క్షమాపణ, అలక్ష్యము, ఏమారిక.

**فروماندگی** ఫరోమాందగీ (పా. స్త్రీ) దైన్యము, దీనత్వము, నిరుపాయత, దౌర్బల్యము, చేతకామి, పేదరికము, రిక్తత, బీదరికము.

**فروماندہ** ఫరోమాంద (పా) దీనుడైన, దైన్యమునొందిన, లొంగిన, వేసరిన, అలసిన, డస్సిన, సొలసిన, దీనదశలోనున్న.

**فرومایہ** ఫరోమాయ (పా) నీచమైన, అల్పమైన, తుచ్ఛమైన, పనికిమాలిన, రిక్తుడైన, దరిద్రుడైన, హీనమైన.

**فرہاد** ఫర్హాద్ [పా. పు] కాసెవాడు షీరీన్ యొక్క వలపుకాడు.

**فرہنگ** ఫర్హంగ్ (పా. స్త్రీ) బోధ, బుద్ధి, తెలివి, వివేకము; కోశము, నిఘంటువు.

**فریاد** ఫర్యాద్ (పా. స్త్రీ) ఆక్రందనము, అంగలార్పు, రోదనము, అల్లరి, అరపు, మొఱ చెప్పుకొనుట, వ్యాజ్యము, అభియోగము. **فریادرس** -రస్ (పా) న్యాయముచేయువాడు, మొరవినువాడు. **فریادرسی** -రసీ (పా) న్యాయ తీర్పు, మొఱవినుట, న్యాయముచేయుట.

**فریادی** ఫర్యాదీ (పా. పు) మొఱపెట్టుకొనువాడు. వాది, వ్యాజ్యము వేసినవాడు.

**فریب** ఫరేబ్ (పా. పు) మోసము, టక్కు, వంచన, ఛలము, మాయ, జిత్తు.

**فریبندہ** ఫరేబింద (పా. పు) మోసము చేయువాడు, మోసగాడు, వంచకుడు.

**فریبی** ఫరేబీ (పా) మోసగాడు, టక్కరి, వంచకుడు.

**فرید** ఫరీద్ (అ. పు) మణి, శ్రేష్ఠము, అద్వితీయము.

**فریفتہ** ఫరేఫ్త (పా) మోసపోయిన మోహితమైన, వలచిన, మోహించిన, మరులుకొనిన.

**فریق** ఫరీక్ (అ.పు) కులము, తెగ, వేఱైనది, సముదాయము, వర్గము; కక్షి, పక్షము; తరగతి, భాగము; పాక్షికుడు, పక్షమువాడు, వ్యాజ్యెగాడు, కక్షిదారుడు. **فریق اول** -ఎ, అవ్వల్ (పా) వాది. **فریق ثانی** -ఎ, సానీ (పా) ప్రతిపక్షి, ప్రతివాది.

**فریقین** ఫరీకైన్ (అ) ఉభయ పక్షముల వారు, ఉభయకక్షులవారు.

**فساد** ఫసాద్ (అ.పు) దౌష్ట్యము, చెడుగు, చెరుపు, చెడుటు, కలత, అల్లరి, సంక్షోభము, దొమ్మి, జగడము, తంటాలు, కలహము, పోరు, తిరుగబాటు, పోకిరితనము, దుర్మార్గము, కుచేష్ట, ద్రోహము.

**فسادی** ఫసాదీ (అ) దుష్టు, తుంటరి, కుచేష్టుడైన, కలహకారకమైన, జగడగొండి, పోకిరి, దుష్టుడైన, కుట్రచేయు.

**فسانہ** ఫసాన (పా.పు) కథ, కల్పితకథ, గాథ, కట్టుకథ, సుద్ది, చరితము, వృత్తాంతము.

**فسخ** ఫస్ఖ్ (అ.పు) భంగము, తిరుగుదల, మళ్లుదల, తప్పుట, ఉల్లంఘనము, ఖండనము, అతిక్రమణము, అభిప్రాయము, త్రిప్పుట, కొట్టివేయుట, తీసివేయుట.

**فسق** ఫిస్క్ (అ.పు) భ్రంశము, భ్రష్టత, దుర్మార్గము, పాపము, వ్యభిచారము.

**فسوں** ఫుసూన్ (పా.పు) మంత్రము, తూన్యము, చిల్లంగి, మాయ, మోసము. **فسوں ساز** -సాజ్ (పా) మంత్రగాడు, కట్టుబోతు.

**فشار** ఫిషార్ (పా.పు) సమాధివలన లోని శవమునకు నలుగు ఒత్తిడి లేక అదుముడు, ఒత్తిడి, ఇరుకు, సంకోచము.

**فشان** ఫిషాన్ (పా) ప్రసారకము, చల్లెడు, వెదచల్లెడు, చిలకరించెడు (సమాసము లలో).

**فشانی** ఫిషానీ (పా.స్త్రీ) ప్రసారణము, వెదచల్లుట, చిలకరింపు, చల్లకము.

**فصاحت** ఫసాహత్ (అ.స్త్రీ) వక్తృత్వము, వాక్చాతుర్యము, ధారాళము, నాగరికత, సుబోధత, అస్ఖలత్వము.

**فصاد** ఫస్సాద్ (అ.పు) శస్త్రవైద్యుడు, శరీరములోనుండి నెత్తురుతీయువాడు.

**فصادی** ఫస్సాదీ (అ.స్త్రీ) శస్త్రవైద్యము.

**فصد** ఫస్ద్ (అ.స్త్రీ) శరీరములోనుండి రక్తముతీయుట. **فصد کھولنا** -ఖోల్నా (ఉ) రక్తనాళముకోసి అశుద్ధరక్తముతీసి వేయుట.

**فصل** ఫస్ల్ (అ.స్త్రీ) ఎడము, ఎడ, భేదము; అంతరము, భాగము, ఖండము, అంశము; ఋతువు, కాలము; వాక్యాంశము, శబ్దాంశము, ప్రకరణము, అధ్యాయము, పరిచ్ఛేదము, పర్వము; అడ్డము, తెర, చాటు, తిరస్కరిణి; ఛేదనము, ఖండనము, కోత, ధాన్యము, గింజలు, పంట; స్పర్ధ, అసమాధానము, టుక్కు. **فصل بہار - فصل گل** -ఎ, బహార్ -గుల్ (పా) వసంతఋతువు. **فصل خریف** -ఎ, ఖరీఫ్ (అ) వర్షాకాలము అంతమందువచ్చు పంట. **فصل ربیع** -ఎ, రబీఉ (అ) వైర పంట, చలికాలము అంతమందువచ్చు పంట.

**فصلی** ఫస్లీ (అ)పంటసం॥, ఋతుసం॥, కాలానురూపమైన, కాలమునను సరించియున్న, కాలికమైన. **فصلی کوا** -కవ్వా (హి) అద్రికాకము, కొండకాకి, తనకుఅక్కరయున్నంతవరకుఅనుసరించు కొనియుండువాడు.

**فصول** ఫసూల్ (అ. స్త్రీ) చూడు (ఏ,వ **فصل**)

**فصیح** ఫసీహ్ (అ. స్త్రీ) వక్తయైన, వాగ్ధాటిగల, అనర్గళముగా మాటలాడెడు, సుబోధముగా మాటలాడెడు, శబ్దచాతుర్యముగల, సుబోధమైన, నాగరికమైన.

**فصیل** ఫసీల్ [అ. స్త్రీ] నగరప్రాకారము, చుట్టుకోట, ఊరిచుట్టుగోడ.

**فضا** ఫజా (అ. స్త్రీ) విస్తీర్ణము, వైశాల్యము, విశాలత, బయలు, నవీనత, నవయౌవనము, అందము, సొంపు; సొగసు, మనోజ్ఞత, మనోహరత.

**فضال** ఫుజాల (అ.పు) మిగులు; శేషము, అధిక్యము.

**فضائل** ఫజాయిల్ (అ.పు) సుగుణములు, సుశీలములు, ప్రవీణతలు, గుణములు, విశేషములు. (ఏ. వ **فضیلت**).

**فضل** ఫజ్ల్ (అ.పు) ఆధిక్యత, విశేషము, బహుమానము, కృప, ఉపకారము, మేలు, అనుగ్రహము, కటాక్షము, దయ, ప్రసాదము. **فضل الہی** -ఇలాహీ (అ) భగవదనుగ్రహము, భగవత్ప్రసాదము, బళీ, బళిరె.

**فضلا** ఫుజేలా(అ.పు)పండితులు. (ఏ.వ **فاضل**)

**فضلہ** ఫుజ్ల (అ.పు) మిగులు, శేషము, అధికము, భుక్తశేషము, ఉచ్ఛిష్టము, ఎంగిలి, పిప్పి, మష్టు, చెత్త, మలము, అనావశ్యకము, పనికిమాలినది.

**فضول** ఫ(ఫు)జూల్(అ) అధికమైన, ఎక్కువైన, విస్తారమైన, అనావశ్యకమైన, నిష్ప్రయోజకమైన, నిరర్థకమైన, వ్యర్థమైన, పనికిమాలిన, వృథా. **فضول گو** -గో (పు) వదరుబోతు, మాటలు పెంచువాడు.

**فضیح** ఫజీహ్ (అ) అవమానకరమైన, అపవాదకరమైన, అపకీర్తికరమైన.

**فضیحت** ఫజీహత్ (అ. స్త్రీ) అవమానము, అపకీర్తి, తలవంపు, ఆరడి, మానభంగము, పోరు, జగడము, చివాట్లు.

**فضیلت** ఫజీలత్ (అ. స్త్రీ) ఆధిక్యము, విశేషము, అతిశయము, గొప్పతనము, శ్రేష్టత, ఘనత, ఉత్తమత, ఉత్కృష్టత, సామర్థ్యము, ప్రవీణత, వాసి, మేలిమి, గుణాధిక్యము.

**فطانت** ఫితానత్ (పా. స్త్రీ) జ్ఞానము, బుద్ధి, తెలివి, బుద్ధికుశలత, బుద్ధిచాతుర్యము.

**فطر** ఫిత్ర్ (అ.పు) ఉపవాసత్యాగము, నిరాహారానంతరము భోజనము చేయుట; పారణము.

**فطرت** ఫిత్రత్ (అ. స్త్రీ) ప్రకృతి, స్వభావము, నైజము, నిసర్గము, జ్ఞానము, బుద్ధికుశలత, తెలివి, బుద్ధిచాతుర్యము, యుక్తి, జాణతనము, చతురత, తంత్రము, కుట్ర, ఉపాయము, టక్కు, మోసము.

**فطرتی** ఫిత్రతీ (అ) స్వాభావికమైన, సహజ

మైన, నైజమైన, సాధారణమైన ,కృత్రి మముకాని, కుయుక్తిగల, మాయికమైన, జిత్తులమారి, తంటాలమారి, టక్కరి, మోసకారి.

**فطری** ఫిత్ర (అ.పు) రంజాను పండుగలో జేయు దానధర్మములు.

**فطیری** ఫతీరీ (అ.పు) క్రొత్తగా తడిపికలిపిన పిండి (పులియనిది), **فطیری روٹی** -రోటీ (ఉ) అప్పుడు కలిపిన పిండితో జేసిన రొట్టె.

**فعل** ఫెఅల్ (అ.పు) క్రియ, కార్యము, పని, కృతి, చేత, కర్మ; పోకిరితనము, హతము, సంభోగము, జగడము, తంటాలు, తగులాటము. **فعل لازمی** -లాజిమా (అ) అకర్మకక్రియ. **فعل متعدی** -ఎ,ముతఅద్దీ (అ) సకర్మక క్రియ. **فعل مجہول** -ఎమజ్హూల్ (అ) కర్మార్థకక్రియ. **فعل معروف** -ఎ,మఅరూఫ్ (అ) కర్తర్థక క్రియ. **فعل ناقص** -ఎ,నాకిస్ (అ) న్యూనక్రియ.

**فعلاً** ఫెఅలన్ (అ) కార్యముచేత, అనుభవపూర్వకముగా, ఆచరణలో.

**فعلی** ఫెఅలీ(అ)కార్యసం॥, అనుభవపూర్వకమైన, ఆచరణసం॥.

**فغان** ఫిగాం (పా.పు) ఆక్రందనము, రోదనము, మొఱ, అరపు, గల్లంతు, లొల్లి.

**فغفور** ఫగ్‌ఫూర్ (పా.పు) చీనా చక్రవర్తుల సామాన్యనామము.

**فق** ఫక్క్*(అ) వివర్ణమైన, వెలవెలపోయిన, పాలిపోయిన, కాంతిహీనమైన. **فق فق** -ఫక్ (అ) దిగ్భ్రమ చెందిన, బమ్మెరపోయిన, కలవరపడిన, వెలవెలపోయిన, కళాహీనమైన,

**فقر** ఫక్ర్ (అ.పు) రిక్తత, దరిద్రత, నిస్సంగత, సన్యాసము, భైక్షుకము, పక్కీరితనము. **فقر و فاقہ** -ఒ,ఫాక (అ) నిరుపేదరికము, నిష్టదరిద్రము.

**فقرا** ఫుకరా (అ.పు) భిక్షుకులు, బైరాగులు, పక్కీరులు, సన్యాసులు. (ఏ.వ **فقیر**).

**فقرہ** ఫిక్ర (అ.పు) వెన్నుపూస; ప్రకరణము, పరిచ్ఛేదము, వాక్యము; మోసము, టక్కు, జిత్తు. మాయ. **فقرہ بازی** -బాజీ (పా) మోసము, టక్కు, మాయమాటలు. **فقرہ بندی** -బందీ (పా) వాక్యరచన, సాహిత్యము, శబ్దచాతుర్యము.

**فقط** ఫకత్ (అ)ఒకటే,ఒంటరిగా, మాత్రము, కేవలము; చాలిన, సరిపోయిన; అంతము, అవసానము, సమాప్తము, ఇకలేదు.

**فقہ** ఫిక (అ. స్త్రీ) జ్ఞానము, తెలివి, ఎఱుక, ధర్మశాస్త్రజ్ఞానము, మహమ్మదీయ ధర్మశాస్త్రము, ధర్మశాస్త్రము.

**فقیر** ఫకీర్ (అ. స్త్రీ) భిక్షుకుడు, బిచ్చగాడు, సన్యాసి, బైరాగి, దరిద్రుడు, రిక్తుడు.

**فقیرانہ** ఫకీరాన(పా) భిక్షుకయోగ్యమైన, భిక్షుకునివంటి, పకీరువంటి, ధర్మమాన్యము.

**فقیرنی** ఫకీర్నీ (ఉ) బైరాగిని, భిక్షుకురాలు, పక్కీరుది, దరిద్రురాలు,రిక్తురాలు.

**فقیری** ఫకీరీ(అ. స్త్రీ) భైక్షుకము, యాచనవృత్తి, సన్యాసము, పక్కీరితనము, దారిద్ర్యము, రిక్తత, పక్కీరు సం॥.

**فک** ఫక్క్ (అ. స్త్రీ) విడుచుట, విప్పుట, విమోచనము, విడిపించుట, విడుదల, విడ్పాటు. **فک الرهن** -ఉల్‌రహ్న్ (అ) బంధవిమోచనము, తాకట్టువిడిపించుట.

**فکر** ఫిక్ర్ (అ. స్త్రీ) ఆలోచన, యోచన, విచారము, చింతన, చింత, వ్యాకులము, ధ్యానము. **فکرمند** -మంద్ (పా) విచారముగల, చింతనగల, చింతాక్రాంతుడైన, వ్యాకులముగానున్న. **فکرمندی** -మందీ (పా) చింత, విచారము, వ్యాకులము.

**فگار** ఫిగార్ (పా) విచ్ఛిన్నమైన, గాయపడిన, వ్యాకులితమైన, చింతాక్రాంతమైన, వ్యసనగ్రస్తమైన, (సమాసములలో).

**فلاح** ఫలాహ్ (అ. స్త్రీ) జయము, అభ్యుదయము, శ్రేయస్సు, అభివృద్ధి, క్షేమము, మేలు, సంపత్తు, భాగ్యము, కల్యాణము, సాఫల్యము, లాభము, సౌఖ్యము, సంతోషము.

**فلاحت** ఫలాహత్ (అ. స్త్రీ) కృషికర్మ, సేద్యము.

**فلاخن** ఫలాఖన్ (పా. స్త్రీ) ఒడిసెల, ఒడిసె, రాళ్లుమోపిపెట్టి ఉవ్వుతాడు.

**فلاسفه** ఫలాసిఫ (యు. పు) తత్వజ్ఞానులు, ఒకఔషధము. (ఏ.వ **فلسفی** )

**فلاکت** ఫలాకత్ (అ. స్త్రీ) దౌర్భాగ్యము, దారిద్ర్యము, రిక్తత, దుర్దశ, దురదృష్టము.

**فلاں** ఫులాం (అ. పు) అముక, అల్ల, అల్లా, ఒకానొక, ఒక, ఏదో, ఎవరో, ఏదోఒకటి, ఎవరోఒకడు, జయనేంద్రియము.

**فلانا ـ نہ** ఫులానా-నె (ఉ) ఎవడో ఒకడు, ఒకడు, లింగము.

**فلز** ఫిలిజ్జ్ (అ. స్త్రీ) ఖనిజము, లోహము, ధాతువు.

**فلزات** ఫిలిజ్జాత్ (అ. స్త్రీ) చూడు (ఏ.వ **فلز**)

**فلس** ఫల్స్ (అ. పు) రాగినాణెము. దుడ్డు, డబ్బు, పొలుసు, చేపమైపొట్టు, బిళ్ల.

**فلسفه** ఫల్సఫ (యు. పు) తత్త్వజ్ఞానము, జ్ఞానము.

**فلسفی** ఫల్సఫీ (యు. పు) తత్వజ్ఞాని, తత్వజ్ఞానసం॥.

**فلالین** ఫలాలీన్ (ఇం. పు) ఉన్నిబట్ట, రల్లకము.

**فلفل** ఫిల్‌ఫిల్ (అ. పు) పిప్పళ్లు, మిరియాలు.

**فلک** ఫలక్ (అ. పు) ఆకాశము, అంతరిక్షము, ఆకసము, దైవము, దివి. **فلک الافلاک** -ఉల్, అఫ్లాక్ (అ) సత్యలోకము, ఉత్తమలోకము. **فلک سیر** -సైర్ (పా) భంగి, గంజాయి. **فلک زده** -జద (అ) దైవోపహతుడు, దౌర్భాగ్యుడు.

**فلکی** ఫలకీ (అ) ఆకాశసం॥, దివ్యమైన, దైవికమైన.

**فلوس** ఫులూస్ (అ. పు) రాగినాణెములు, దమ్మిడి, దుడ్డు, డబ్బు, బిళ్ల. (ఏ.వ **فلس**)

**فلیتہ** ఫలీత (అ. పు) వత్తి, దీపపువత్తి, జానకితాడు, తాలిక, పేనినది, తాల్చినది. **فلیتہ دار** - దార్ (పా) జానకితాటితుపాకి.

فم ఫమ్మ్(అ.పు)నోరు,ముఖము,ముఖద్వారము.

فن ఫన్న్(అ.పు)పద్ధతి,రీతి,తీరు,విధము,వైఖరి, మార్గము, తెరగు,గుణము, శాస్త్రము,విద్య, విద్దె, నేర్పు, పనితనము, పని, ప్రవీణత, సామర్థ్యము, మోసము, ఛలము, టక్కు, మాయ.

فنا ఫనా (అ. స్త్రీ) నాశము, క్షయము, మర ణము, చావు, వినాశము,పోడు,నష్టమైన. నాశమైన, నాస్తియైన. فنا فی اللہ - ఫిల్లా (అ) కైవల్యప్రాప్తి, బ్రహ్మమందు కలిసిపోవుట, కైవల్య సాక్షాత్కారము. فنا فی اللہ ہونا -ఫిల్లహోనా (ఉ) కైవల్యప్రాప్తినొందుట, చచ్చుట, బ్రహ్మ మందులీనమయిపోవుట.

فنجان ఫిన్‌జాన్ (పా. పు) పింగాణి తట్ట రేక కంచేము, పింగాణిగిన్నె.

فند ఫన్‌ద్ (అ.స్త్రీ) మోసము, టక్కు, ఛలము, మాయ, మిష, సాకు, నెపము.

فندق ఫన్‌దక్ (అ, స్త్రీ) సీమరేగుపండు; సీమరేగుపండువలెనున్న వ్రేలికొనలు.

فنون ఫునూన్ (అ.పు) విద్యలు, విద్దెలు, నేర్పులు, (ఏ. వ فن).

فوارہ ఫవ్వారా-ర (అ.పు) ఉప్పొం గుడు, పొంగు, నిలువుధార, చిమ్మనము, చిమ్మగొట్టము, చిమ్మనగొట్టము, జల సూ త్రము.

فوائد ఫవాయిద్ (అ.పు) ఫలములు, లాభ ములు. (ఏ. వ ఃفائدہ).

فوت ఫౌత్(అ.స్త్రీ) మరణము, నాశనము, చావు. فوت ہونا - ఫహోనా (ఉ) చచ్చుట, మరణించుట, నష్టమగుట, పోవుట.

فوتی ఫౌతీ (అ) మృతుడు, చచ్చినవాడు. فوتی نامہ -నామ(పా) మృతిపత్రము, చచ్చినవారిపట్టి.

فوج ఫౌజ్(అ. స్త్రీ)సమూహము,గుంపు. బలము, సేన, సైన్యము, దళము. فوج کشی -కషీ (పా) దండయాత్ర, దాడి.

فوجدار ఫౌజ్‌దార్(పా.పు) దళవాయి, నాయకుడు, అధికారి, పెత్తనదారుడు.

فوجداری ఫౌజ్‌దారీ (పా. స్త్రీ) దళ వాయితనము, నాయకత్వము; న్యాయాధి పత్యము, నేరశాఖ,అపరాధవిచారణశాఖ, పోలీసులువిచారించు రాజ్యాంగము, అభి యోగవ్యాజ్యము, అపరాధము, నేరము.

فوجی ఫౌజీ (అ) సేనా సం॥, సైనికమైన,

فور ఫౌర్ (అ.పు) కాలము, వేళ, శీఘ్రము, త్వర, వేగము.

فوراً ఫౌరన్ (అ) శీఘ్రము, త్వరగా,తక్షు ణమే, వెంటనే, తోడనే.

فوز ఫౌజ్ (అ. స్త్రీ) జయము, గెలుపు, కృతార్థత, సాఫల్యము,విముక్తి, మరణము.

فوطہ ఫోత (పా.పు) నడికట్టు,కాసె,చిన్న పంచె, తుండుగుడ్డ, స్వామ్యము; పన్ను; కోశము, భాండాగారము; సంచి, తిత్తి; వృషణము, అండములు. فوطہ خانہ -ఖాన (పా) భాండాగారము, కోశము శాల. فوطہ دار -దార్ (పా) ఖజా నాచి, కొశాధికారి, సుంకరీడు.

**فوفل** ఫో(ఫూ)ఫల్ (అ)పూగీఫలము, పోక.

**فوق** ఫౌక్ (అ.పు) ఔన్నత్యము, ఎత్తు, మీదు, ఉత్తమత, ఆధిక్యత, హెచ్చు, శ్రేష్ఠత, ఘనత, గౌరవము, గొప్పతనము. మేలుతరము, అతిశయము, ప్రముఖత, ప్రాధాన్యము, అగ్రగణ్యము, పెత్తనము, పైన, మీద, ఎత్తైన, పై. **فوق البهڑک** -ఉల్, భడక్ (ఉ) ప్రకాశమానమైన, తళతళలాడెడు, మెరసెడు, ధగధగాయమానమైన, పై మెరపులుగల, ఆడంబరమైన, పటాటోపముగల, కాంతిగల. **فوق العادت** -ఉల్, ఆదత్ (అ) స్వాభావికమైన, అసాధ్యమైన.

**فوقانی** ఫౌకానీ (అ) ఉపరి, పై, మీది, పైనబొట్టులుగల(అక్షరము).

**فوقیت** ఫౌకియత్ (అ. స్త్రీ)ఆధిక్యత, అతిశయము, ఘనత, గౌరవము, ఉత్తమత, శ్రేష్ఠత, శ్లాఘ్యత, ప్రాశస్త్యము, ఉత్కృష్టత, మేలిమి, వాసి, హెచ్చు, విశేషము, పెత్తనము, పైచేయి.

**فولاد** ఫౌలాద్ (పా.పు) ఉక్కు. చూడుము **پولاد**

**فولادی** ఫౌలాదీ (పా) ఉక్కుతో చేసిన; ఈటెయొక్క కోల లేక గడ.

**فهرست** ఫెహరిస్త్ (పా.స్త్రీ) వర్గము, పట్టి, వయినము, సూచి, అనుక్రమణిక, సూచిక. **فهرست مضامین** -ఎ,మజామీన్ (పా)విషయానుక్రమణిక, సూచిపత్రము, విషయసూచిక.

**فهم** ఫహ్మ్ (అ, స్త్రీ) బుద్ధి, జ్ఞానము, తెలివి, వివేకము, గ్రహణశక్తి, బోధము.

**فهمایش** ఫహ్మాయిష్ (పా. స్త్రీ) శిక్ష, ఉపదేశము, బోధన, ప్రబోధనము, మార్గదర్శనము, తెలియచెప్పుట, ఉత్తరువు, ఆజ్ఞ.

**فهمیدگی** ఫహ్మీదగీ (పా. స్త్రీ) గ్రహణశక్తి, తెలివి, బుద్ధిబలము.

**فهمیده** ఫహ్మీద (పా) బుద్ధిశాలియైన, తెలివిగల, బుద్ధిగల.

**فهیم** ఫహీమ్ (అ) బుద్ధిమంతుడైన, బుద్ధిశాలియైన, సూక్ష్మబుద్ధిగల, బుద్ధికుశలతగల.

**فی** ఫీ-ఫీ (అ) లోపల, అందు, లోన, లోను; ప్రతి, చెప్పి, తల; కి, కు. (స్త్రీ) దోషము, లోపము, కళంకము, కుట్ర, సమ్మె, కుచేష్ట, కట్టు, ద్రోహము, మోసము. **فی البدیهه** -ల్, బదీహ (అ) అయత్నపూర్వకముగా, అనుకవిత్వముగా, చాటుధారగా, తత్క్షణకృతముగా, ముందుఆలోచించకయే సమయోచితముగా (నేరైన చెప్పుట). **فی الجمله** -ల్, జుంల(అ) ముఖ్యాంశము, ఫలితార్థము, సారాంశము (గా). మొత్తమునకు, ఎట్టకేని, ఎట్టకేలకు, కొంచముగా. **فی الحال** - ల్, హాల్ (అ) ప్రస్తుతము, ఇప్పుడు, సద్య, తత్క్షణము. **فی الحقیقت - فی الواقع** -ల్, హకీకత్ -వాకెఅ (అ) యదార్థముగా, వాస్తవముగా, రూఢిగా, నిజముగా. **فی الفور** -ల్, ఫౌర్ (అ) శీఘ్రముగా, తక్షణము, ఈక్షణము, వెంటనే, సద్య, తోడనే. **فی النار** -న్, నార్ (అ) కాలిపోను, నరకాగ్నిలోబడి కాలిపోవుగాక. **فی روپیه** -రూప్య(ఉ)రూపాయకు, ప్రతిరూపాయకు, రూపాయ

ఒక్కొంటికి. **فی روز** -రోజ్ (పా) దినమొక్కంటికి, దినమునకు. **فی زمانہ** -జేమాన (అ) ఈకాలములో, ప్రస్తుతములో, నిన్నా నేడు, ఇప్పుడు. **فی سبیل اللہ** -సబీల్లాహ్ (అ) భగవదర్పణముగా, ధర్మార్థముగా. **فی صدی** -సదీ (అ) నూటికి, నూరొక్కంటికి. **فی کس** -కస్ (పా) మనిషికి. ప్రతి మనిషికి, మనిషి ఒక్కంటికి. **فی مابین** -మాబైన్ (అ) ఉభయమధ్యమున, పరస్పరము, రెంటినడుమ, మధ్య, నడుమ, ఉభయములలో.

**فیاض** ఫయ్యాజ్ (అ) అత్యౌదార్యముగల, మిక్కిలి ఉదారుడైన, దానశీలుడైన, ఈవిగల, ధారాళమైన, దాతృత్వముగల, ఉదారతగల.

**فیاضی** ఫైయాజీ (అ. స్త్రీ) ఔదార్యము, దాతృత్వము, ఉదారత్వము, ఈవి, ధారాళము, దానము, ధర్మము.

**فیتا-فیتہ** ఫీతా(త)(పా) పట్టె, బద్దె, గోటు.

**فیروز** ఫీరోజ్ (పా) జయముగల, అదృష్టవంతమైన. కల్యాణవంతమైన.

**فیروزہ** ఫీరోజె (పా.పు) వైడూర్యము.

**فیروزی** ఫీరోజీ(పా. స్త్రీ) జయము, గెలుపు, కల్యాణము, అదృష్టము; వైడూర్య వర్ణమైన, నీలవర్ణమైన.

**فیصل** ఫైసల్ (అ.పు) తీర్పు, పరిష్కారము, తీరుమానము, ఆజ్ఞ, విధానము, శాసనము, నిర్ధారము.

**فیصلہ** ఫైసల (అ.పు) తీర్పు, తీరుమానము, పరిష్కారము, నిర్ణయము.

**فیض** ఫైజ్ (అ.పు) వెల్లువ, వరద; ఔదార్యము, ఉదారత, దాతృత్వము, ఈవి, దానము, ధర్మము. పుణ్యము, ఉపకారము, మేలు, అనుగ్రహము, ప్రసాదము, సమృద్ధి, ఆదాయము, ఫలము, లాభము. **فیض عام** -ఎ,ఆమ్ (అ) జనహితము, లోకహితము, దేశహితము.

**فیل** ఫీల్ (పా.పు) గజము, ఏనుగు. **فیل بان** -బాన్ (పా) మావటీడు, మావటివాడు, ఏనుగువాడు. **فیل پا - پاؤں** - పా -పావ్ (పా) ఏనుగుకాలు, బూరగాలు, **فیل پایہ** -పాయ(పా) స్తంభము. **فیل خانہ** -ఖాన(పా) ఏనుగులకొట్టము, గజశాల, ఏనుగులదొడ్డి. **فیل مرغ** -ముర్గ్ (పా) వాంకోడి, సీమ కోడి.

**فیلسوف** ఫైల్సూఫ్ (యు.పు) జ్ఞాని, తత్త్వజ్ఞుడు, పండితుడు; వంచకుడు, మోసగాడు, పాషండుడు.

**فیلسوفی** ఫైల్సూఫీ (యు. స్త్రీ) జ్ఞానము, తత్త్వజ్ఞానము; కుయుక్తి, మోసము, ఛలము, మాయలు, టక్కరితనము.

---

# ق

**ق** కాఫ్ (అ.పు) ఇది ఉరదూ వర్ణమాలలో నిరువదియేడవ యక్షరము. అరబీలో నిరువదియొకటవది. పారసీకములో నిరువది నాలుగవది. అబ్జదు సాంఖ్యములో దీనిసంఖ్య నూరు.

**قاآن** కాఆన్ (పా.పు) సార్వభౌముడు,

**قادر** కాదిర్ (అ) శక్తిగల, బలముగల, త్రాణగల, సమర్థుడైన; సామర్థ్యముగల, బలవంతుడైన, ప్రాబల్యతగల, పైచేయిగల, అధికారముగల, స్వాధీనముగల. **قادر انداز** -అందాజ్ (పా) అమోఘమైన విలుకాడు, గుఱితప్పకుండ బాణము వేయగల విలుకాడు. **قادر مطلق** -ఎ, ముత్లక్ (అ) సర్వశక్తిమంతుడు, ఈశ్వరుడు.

**قاروره** కారూర (అ.పు) గాజుకుప్పె, కుప్పె, కాయ; మూత్రము, ఉచ్చ; బొంబాసు గుండువలె ఉపయోగించు తుపాకిమందు కుప్పె; ఈకె మొ॥వాని ఉక్కు బద్ద. **قاروره ملنا** -మిల్నా (ఉ) అనుకూలపడుట, సరిపడుట, కలిసి మెలిసి యుండుట.

**قارون** కారూన్ (అ.పు) హజరతు మోసెసు యొక్క పినతండ్రి కొడుకు ఇతను మిక్కిలి ధనవంతుడును మిక్కిలి లుబ్ధుడును.

**قاری** కారీ (అ.పు) పాఠకుడు, పాఠి, చదువువాడు, అధ్యయన సంపన్నుడు, కురాను షరీఫును స్వరయుక్తముగా చదువగలవాడు.

**قاز** కాజ్ (తు. స్త్రీ) హంస, పెద్దబాతు.

**قاسم** కాసిమ్ (అ.పు) పంచువాడు, విభాజకుడు, పాళ్లుపెట్టువాడు.

**قاش** కాష్ (తు. స్త్రీ) పండు మొ॥వాని బద్ద లేక చీలిక, తొన, బద్ద, తునక, ముక్క, చెక్క; భ్రూవు, కనుబొమ. **قاش زین** -ఎ, జీన్ (పా) పల్లముపై ముందును వెనుకను మూపురములవంటి గుబ్బలు లేక దిండ్లు, లోకులు, లొడ్డులు.

**قاصد** కాసిద్ (అ.పు) సందేశహారుడు, రాయబారి, దూత, వార్తికుడు, కాలరి, వర్తమానము తీసికొనిపోవువాడు.

**قاصر** కాసిర్ (అ) లోపము జేయు, తక్కువ చేయు, తప్పుచేయు, చాలని, లోపముగల, అసమర్థమైన, చేతకాని.

**قاضی** కాజీ (అ.పు) ధర్మశాసకుడు, అధికారి, న్యాయాధిపతి, న్యాయము చేయువాడు, తీర్పుచేయువాడు, పురోహితుడు, పెండ్లి మొ॥నవి చేయించువాడు, నెరవేర్చువాడు, తీర్చువాడు. **قاضی الحاجات** -ఉల్, హాజాత్ (అ) అక్కరలు తీర్చువాడు, కోరికలు సఫలము చేయువాడు, ఈశ్వరుడు, (ద్రవ్యము, డబ్బు). **قاضی القضات** -ఉల్, కొజాత్ (అ) వరిష్ఠ న్యాయాధిపతి, ప్రధాన న్యాయాధిపతి. **قاضی فلک چرخ** -ఎ, ఫలక్-చర్ఖ్ (అ) బృహస్పతి.

**قاطع** కాత్వ (అ) కోయునట్టి, తెగగొట్టునట్టి; ఖండితమైన, పరిష్కృతమైన, కచ్చితమైన, తీరుమానమైన. **قاطع الطریق** -ఉల్, తరీక్ (అ) తెరవాటుకాడు, త్రోవలుకొట్టువాడు.

**قاعده** కాఇద (అ.పు) ఆధారము, మూలము, సాంప్రదాయము, నడవడిక, మర్యాద, ఆచారము, వర్తనము, రీతి, పద్ధతి, క్రమము, వరుస, వైఖరి, తీరు, వయినము, విధి, నియమము, నిబంధనము, ఏర్పాటు, చట్టము, న్యాయము; సూత్రము, ఉపాయము; అడుగు, క్రిందు, పీఠము; అలవాటు, వాడుక, స్వభావము; అభ్యాసము; బాల

శిక్షు, బాలబోధము, ఓనమాల పుస్తకము, ప్రథమ పాఠపుస్తకము; నమాజులో మొదటి నీతి అయిన తరువాత కొంచెము కూర్చుండుట; గుజ్జుపుకళ్లెము వెనుకకుతీసి పల్లము వెనుక తోక వారకు కట్టియుంచుట. قاعدہ کی بات ہے కాఇదఃకీ బాత్ హై (అ) లోకసాధారణమైనమాట, సర్వసాధారణమైనది, అందరికిని తెలిసినమాట.

**قاف** కాఫ్ (అ.పు) చక్రవాళము(భూమిని చుట్టియున్నట్లనుకొనబడునొక పౌరాణిక పర్వతము).

**قافلہ** కాఫిల (అ.పు) బాటసారుల సమూహము, బిడారు, సార్థవాహము, వర్తకుల గుంపు, యాత్రికులసమూహము. قافلہ سالار -సాలార్ (పా) సార్థవాహనాయకుడు, బిడారునాయకుడు.

**قافیہ** కాఫియ (అ.పు) అంత్యప్రాసము, ప్రాసము, యమకము. قافیہ بندی -బందీ (పా) ప్రాసకూర్పు, ప్రాసము కలుపుట. قافیہ پیمانی -పైమానీ (పా) హీనకవిత్వము, అర్థసారస్యము లేని కవిత్వము, అర్థసారస్యమును లక్ష్యపెట్టక కేవలము ప్రాసమాత్రము కూర్చుట. قافیہ تنگ ہونا -తంగ్ హోనా(ఉ) ప్రాసము కలియకపోవుట, ప్రాసమునకు అనుగుణ్యములగు పదములు దొరకక పోవుట; తడబడుట, కృత్యాద్యవస్థలో నుండుట,దిగ్భ్రమచెందుట,చిక్కుపడుట, ఎటూతోచకయుండుట.

**قاق** కాక్ (తు.పు) మాంసపువరుగు, వక్క వాడు,బక్కచాని వాడు,దుర్బలుడు, ఎండిపడి.

**قاقا** కాకా (అ.పు) కావుకావు,కాకియరపు.

**قاقلہ** కాకుల (అ.పు) పెద్ద ఏలకులు.

**قاقم** కాకుమ్ (తు.పు) మిక్కిలి మృదువైన చర్మమును రోమములునుగల తెల్లని అడవి పిల్లి.

**قال** కాల్ (అ.పు) ప్రసంగము, సంభాషణ, మాటముచ్చటలు, వచనము, యుక్తి వాక్యము, మాట, పైమాటలు, జంఝాట్లు,వట్టి మాటలు, ఆడంబరము, మాటలమారితనము. قال مقال -మకాల్ (అ) వివాదము, పోరాటము.

**قالب** కాలిబ్ (అ.పు) అచ్చు, ముద్ర, పోత,చట్టము.ఆకారము,రూపము,దేహము, కాయము, శరీరము, పిండము, قالب بدلنا -బదల్నా (ఉ)పరకాయము పొందుట, రూపాంతరము నొందుట, మారు దేహముపొందుట.

**قالبی** కాలిబీ (అ) పోతపోసిన.

**قالی - قالین** కాలీ - కాలీన్(అ. స్త్రీ) రత్నకంబళి.

**قالیچہ** కాలీచ (పా.పు) చిన్నరత్నకంబళి, చిత్రాసనము.

**قامت** కామత్ (అ. స్త్రీ)ఉన్నతి,పొడుగు, దేహము, ఆకారము, ఎత్తు.

**قاموس** కామూస్ (అ.పు) సముద్రము; అరబ్బీభాషయొక్క నిఘంటువుపేరు.

**قانع** కానె (అ) తృప్తికల, సంతుష్టిగల, అల్పసంతోషియైన, తనివిగల.

**قانون** కానూన్ (అ.పు) ఆధారము, మూలము, విధి, పద్ధతి, క్రమము, సాంప్రదాయము, వ్యవహారము, నడవడిక, ఆచారము, తెరగు, రీతి, తీరు, వర్తనము, నియమము, ఏర్పాటు, మర్యాద, నిబంధన, చట్టము, శాస్త్రము, న్యాయము, శాసనము, కట్టడి, కట్టుదిట్టము, నీతి, న్యాయ శాస్త్రము, ధర్మశాస్త్రము; రేఖ, గీత, గీట్లుకట్టు, గీతలుగీచు సాధనము, కొలతసాధనము; వీణ వంటి ఒక తంతి వాద్యము. **قانون چھانٹنا**-ఛాంట్నా (ఉ) తర్కించుట, వివాదించుట. **قانون دان** -దాన్ (పా) న్యాయశాస్త్రజ్ఞుడు.

**قانوناً** కానూనన్ (అ) శాస్త్రోక్త, శాస్త్రానుసారముగా, విధ్యనుసారముగా.

**قانونی** కానూనీ (అ) న్యాయశాస్త్రవిధాయకుడు, శాసకుడు, చట్టములు నిర్మించువాడు; న్యాయశాస్త్రజ్ఞుడు, హరవాది, తప్పులమారి, శాస్త్రీయమైన, శాస్త్రోక్తమైన, శాస్త్ర సం॥న.

**قانونیا** కానూనియా (ఉ) న్యాయశాస్త్రజ్ఞుడు, వాదశీలుడు, తర్కించువాడు, హరవాది, తగవులమారి, జగడగొండి, వ్యాజ్యెగొండి.

**قاہر** కాహిర్ (అ) ప్రబలుడు, ఉగ్రుడు, క్రూరుడు, జయశీలుడు, గెలుపుగలవాడు.

**قاہرہ** కాహిర (అ) ప్రబలమైన, జయశీలమైన, గెలుపుగల, ఈజిప్టుదేశపు ముఖ్యపట్టణము.

**قائد** కాయిద్ (అ.పు) నాయకుడు, పాలకుడు, అధ్యక్షుడు.

**قائزہ** కాయెజేహ్ (అ.పు) లంఖుని, కళ్లెము (గుఱ్ఱపు నోటిలోనుండు భాగము). **قائزہ کرنا** -కర్నా (ఉ) గుఱ్ఱపుకళ్లెము వెనకకు తీసి తోకకు కట్టియుంచుట. (గుఱ్ఱమును తోసూనపుకు కరవకుండుటకై).

**قائل** కాయిల్ (అ) కథకుడు, చెప్పువాడు, నమ్మిన, ఒప్పిన, ఒప్పుకొనిన, నేరముఒప్పుకొనిన, నిరుత్తరుడైన, ఓడిన. **قائل کرنا** -కర్నా (ఉ) మెప్పించుట, నమ్మించుట, ఒప్పించుట, తనతప్పును ఒప్పుకొనునట్లు చేయుట, సాధించుట, ఓడించుట, లోపరచుట.

**قائم** కాయిమ్ (అ) నిలిచియున్న, నిలువుగానున్న, నిలిచెడు, సరళమైన, నిలుకడయున్న, నిలువైన, స్థిరమైన, నిశ్చలమైన, మారని, నిత్యమైన, శాశ్వతమైన, దృఢమైన, బలిష్ఠమైన, బలమైన, దిట్టమైన. గట్టి, చెడని, చాలాకాలముఉండెడు. **قائم اٹھنا** -ఉఠ్నా (ఉ) సమానపందెమగుట, ఒకరికిని చదరంగములో ఓటుకలుగకపోవుట. **قائم کرنا** -కర్నా (ఉ) స్థాపించుట, నిర్మించుట, ఏర్పరచుట, కట్టుట, నిలుపుట, కలుగజేయుట, స్థిరపరచుట, బలపరచుట, పెట్టుట

**قائم مزاج** -మిజాజ్ (అ) స్థిరచిత్తుడు, నిశ్చలబుద్ధిగలవాడు, స్థిరబుద్ధిగలవాడు, మనస్థైర్యముగలవాడు, గంభీరుడు. **قائم مقام** -ముకామ్ (అ) ప్రతిప్రభువు, ప్రతినిధి, ఉత్తరాధికారి, ప్రత్యామ్నాయుడు, మారుగానున్నవాడు, ప్రత్యామ్నాయమైన. **قائم مقامی** -ముకామీ (అ) ప్రతినిధిత్వము, ఉత్తరాధికారము.

**قائمہ** కాయిమ (అ.పు) సమకోణము, నిలువు, లంబము.

قبا కబా (అ. స్త్రీ) నిలువుటంగీ. قبا کرنا - కర్నా (ఉ) చీరుట, తుత్తునియలుచేయుట.

قباحت కబాహత్ (అ. స్త్రీ) దౌష్ట్యము, చెడుగు, అవగుణము, దోషము, లోపము, చెఱుపు, తప్పిదము, న్యూనత, సంకటము. కష్టము, కీడు, హాని, నష్టము.

قبالہ కబాల (అ.పు) పత్రము, కట్టుకమ్మ, విక్రయపత్రము, అధికారపత్రము, స్వామ్య పత్రము, శాసనము.

قبائل కబాయల్ (అ.పు) కులములు, సంఘములు, కుటుంబములు. (ఏ.వ قبیلہ)

قبح కుబ్హ్-కుబహ్ (అ. స్త్రీ) చెరుపు, దోషము, చెడుగు, నైచ్యము.

قبر క్బ్ర్ (అ. స్త్రీ) సమాధి, శవమునుపూడ్చు గుంట. قبر سلامی - సలామీ (అ) కాటిసుంకము. قبرکا تعویز -కాతావీజ్ (ఉ) సమాధిశిల. قبرستان - స్తాన్ (అ.పు) శ్మశానము, వలుకులమిట్ట. قبر کے مردے اکھاڑنا -కెముర్దేఉఖాడ్నా (ఉ) ప్రాతజగడములుదుల్లగించుట. قبر میں پاؤں لٹکانا -మేంపాపూం లట్కానా (ఉ) కాటికికాళ్లు చాచుట, చావసిద్ధముగానుండుట. قبر میں سے اٹھکر آنا -మేంసేఉఠ్కర్ ఆనా (ఉ) పీనుగుమొగముకలిగియుండుట, భయంకర స్వరూపము కలిగి యుండుట, మిక్కిలి కృశించియుండుట.

قبرہ కుబ్బర (అ.పు) భరద్వాజము, ఏంట్రింతపిట్ట.

قبض కబ్జ్ (అ.పు) పరిగ్రహము, తీసికొనుట, గ్రహణము, పట్టు. మలబంధకము, ఆనాహము, సంకోచము, స్వాధీనము, అధికారము, వశము, అధీనము, పుచ్చుకొనుట, చెల్లు. قبض الوصول -ఉల్ వసూల్ (అ. స్త్రీ) చెల్లుపాత్రము, చెల్లుచీటి.

قبضہ కబ్జ (అ.పు) గ్రహణము, పట్టు, స్వాధీనము, అధీనము వశము, అధికారము, అనుభవము, ఆక్రమణము, పట్టుకొనుట, పిడికిలి, చేతిపిడి, పిడి, కత్తిమొ॥వానిపిడి.

قبضیت కబ్జియత్ (అ. స్త్రీ) ఆక్రమణము, స్వాధీనము, ఆనాహము, బంధకము, మలబద్ధము.

قبل కబ్ల్ (అ) పూర్వము, ముందు, మునుపు, మొదలు, ముందర; ముట్టడము, చుట్టుకొనుట. قبل ازین -అజీం (పా) ఇంతకుముందు, ఇదివరకు, ఇతఃపూర్వము.

قبلہ కిబ్ల (అ.పు) ఎదుటనున్నది, ఎదురు, ఎదుటివైపు, నమాజుచేయుదిశ, మక్కాలోని ప్రార్థనాలయము, పూజ్యమైన, ఆరాధనీయమైన, మహారాజశ్రీ, దొడ్డవారికిఉపయోగించు గౌరవవాచకము. قبلہ حاجات -యెహాజాత్ (అ) అక్కరలను కోరికలునుతీర్చువాడు, గౌరవవాచకము. قبلہ رو -రూ (అ) మక్కావైపునకు మరలి యున్న(ది)వాడు, మక్కావైపు. قبلہ عالم -యె,ఆలమ్ (అ) లోకారాధ్యుడు, రాజులగౌరవవాచకము. قبلہ کونین -ఎ,కౌనైన్ (అ) ఉభయలోకపూజ్యుడు, తండ్రిగౌరవవాచకము. قبلہ گاہ -గాహ్ (అ.పు) పూజ్యుడు, తండ్రి. قبلہ نما -నుమా(అ.పు)మక్కాదిక్కూచిసాధనము,

మక్కా-యున్నవైపు చూపించునొక సాధనము. قبلہ وکعبہ -వకఽబ (అ) అతి పూజ్యులు, గౌరవవాచకము.

قبول కుబూల్-కబూల్ (అ.పు) సమ్మతము, అనుమోదము, అంగీకారము, అనుమతి, సమ్మతి, మెప్పు, ఒప్పిదము, స్వాగతము, ప్రియము, ఇష్టము. قبول صورت -సూరత్ (అ) ఒప్పిదమైన ముఖముగల.

قبولنا కుబూల్నా (ఉ) ఒప్పుకొనుట, అనుమోదించుట, అంగీకరించుట, సమ్మతించుట, ఒప్పుట, తప్పు ఒప్పుకొనుట.

قبولی కబూలీ (పా. స్త్రీ) బియ్యము లేక మాంసమును శెనగలును కలిపివండినపక్వాన్నము, పులగము.

قبولیت కబూలియత్ (ఉ. స్త్రీ) ఒడంబడికపత్రము, కట్టుకమ్మ, అంగీకారపత్రము, అంగీకారము, అనుమోదము, సమ్మతి.

قبہ కుబ్బ (అ.పు) కలశము, గుమ్మటము, గోపురము, గోపురశిఖరము, గూడు.

قبیح కబీహ్ (అ) అపవిత్రమైన, చెడిన. దోషయుక్తమైన, దుష్టమైన, కురూపమైన, అసహ్యమైన, నింద్యమైన, సిగ్గుపడదగిన.

قبیل కబీల్ (అ.పు) కులము, వంశము, కుటుంబము, గణము, జాతి, వర్గము, విధము, తెగ, శాఖ.

قبیلہ కబీల (అ.పు) సమాజము, కులము, తెగ, సంతానము, వర్గము, గుంపు, జేట్టి, కుటుంబము, వంశము, భార్య, పెండ్లాము.

قتال కితాల్ (అ. స్త్రీ) యుద్ధము, సంగ్రామము, పోరాటము, జగడము, పోట్లాట. తిట్టుట, శపించుట.

قتّال కత్తాల్ (అ. పు) అతిక్రూరుడు, హత్యచేయువాడు, హింసచేయువాడు.

قتل కత్ల్ (అ.పు) హత్య, హింస, సంహారము, వధము, చంపుట. قتل عام -ఆమ్ (అ) సర్వసంహారము, జనసంహారము. قتل عمد -ఎ,అమ్ద్ (అ) బుద్ధిపూర్వక హత్య.

قتلا قتلہ కత్లా-త్ల (ఉ. పు) బద్ద, చెక్క, ముక్క, తునక, తోన.

قتیل కతీల్ (అ) హతుడు, చంపబడినవాడు.

قحبگی కహ్బగీ [పా] లంజెరికము, వ్యభిచారము.

قحبہ కహ్బ (పా) లంజె, తొత్తు.

قحط కహ్త (అ.పు) అనావృష్టి, క్షామము, దుష్కాలము, కరువు, దొరకమి, قحط زدہ -జద (పా) కరువునపడిన. قحط سالی -సాలీ (పా) కరువుకాలము, కరువు.

قد కద్ (అ.పు) ఉన్నతి, ఎత్తు, పొడుగు, నిలువు, قد آدم -ఎ,ఆదమ్ (అ) పురుషప్రమాణము, మనిషినిలువు. قد آور -ఆవర్ (పా) పొడుగుగల, పొడుగాటి, నిలువాటి, పొడుగైన, ఎత్తరి. قددار -దార్ (పా) శృంగారమైనఎత్తు, చాలా ఎత్తును చాలాపొట్టిగను లేక, సామాన్యమైనఎత్తు. قد وقامت -ఒ, కామత్ (అ.పు) ఒడ్డుపొడుగు, దేహపరిమాణము.

**قدامت** కదామత్ (అ.స్త్రీ) శాశ్వతత్వము, పురాతనత్వము, ప్రాచ్యత, పూర్వత, ప్రాచీనత, పూర్వము, పూర్వకాలము, ప్రాచీనకాలము.

**قدح** కదహ్ (అ.పు) పంచపాత్ర, గిన్నె, పెద్దకోర; ఆక్షేపము, ఖండనము, తప్పుని పించుట, పూర్వపక్షము, ప్రతివాదము. **قدح وار-کش** -వార్-కష్ (పా) త్రాగుబోతు.

**قدر** కద్ర్ (అ.స్త్రీ) పరిమాణము, పరిమితి, భాగము, పాలు; విధి, శాసనము, దైవనియోగము; భాగ్యము, అదృష్టము; శక్తి, సామర్థ్యము, త్రాణ; ఎన్నిక, మర్యాద, గౌరవము, ఘనత, సత్కారము, పెత్తనము, పాత్రత, మానము, యోగ్యత, విలువ, గుణము, విశేషము. ఆదరము, గురుత్వము, ఆధిక్యము. **قدر انداز** - అందాజ్ (పా) చూడు **قادرانداز** అనుమాటు. **قدردان-شناس** -దాన్-షనాస్ (పా) గుణగ్రాహి, ఆశ్రయుడు, ప్రాపకుడు. **قدردانی** -దానీ (అ.స్త్రీ) గుణగ్రహణము, గౌరవము, మర్యాద. **قدرکونا** - కర్నా (ఉ) గౌరవించుట, మెచ్చుకొనుట, గుణమునుగ్రహించుట. **قدرومنزلت** -ఒ,మంజిలత్ (అ) ఆదరసత్కారము, ఘనత, గౌరవము, పెత్తనము.

**قدرت** కుద్రత్ (అ.స్త్రీ) శక్తి, బలము, సామర్థ్యము, త్రాణ, ఈశ్వరశక్తి, భగవదైశ్వర్యము, భగవద్విభూతి, సృష్టి, విశ్వము, ప్రకృతి, స్వభావము, నైజము.

**قدرتی** కుద్రతీ (అ) ప్రకృతిసిద్ధమైన, సహజమైన, నైజమైన, స్వాభావికమైన, ప్రకృతిసిద్ధమైన, అకృత్రిమమైన, సాధారణమైన.

**قدرے** కద్రే (అ) క్వచిత్, కొంచము, కవంత, కొంత, కొంతమట్టుకు, కొద్దిగా. **قدرےقلیل** -కలీల్ (పా) అణుమాత్రము, అత్యల్పము, మిగులకొంచము.

**قدسی-قدسیہ** కుద్సీ - కుద్సియా (అ) పవిత్రమైన, పావనమైన, పరిశుద్ధమైన, పూజనీయమైన, స్వర్గీయమైన, పవిత్రుడు, సాధువు, పవిత్రాలయము.

**قدس** కుద్స్ (అ) పూజ్యత, పవిత్రత, పావనత, పరిశుద్ధత, పుణ్యాలయము.

**قدم** కిద్మ్ (అ) ప్రాచీనత, పురాతనకాలము, ఆదికాలము.

**قدم** కదమ్ (అ.పు) పాదము, చరణము, అడుగు, జేంగ, అంగ, నడక, చలనము, ఆగమనము, రాక, విజయము, సంబంధము, ఉనికి, (ఉ) కదమను ఒకవిధమైన చెట్టును కనవును, ఫారితకము. (అను అశ్వగతి భేదము) **قدم باز** -బాజ్ (పా) నడకగల, నడకనేర్చిన, నడకవచ్చిన, వడిగానడచెడు. **قدم بقدم** - బకదమ్ (పా) అడుగడుగునగా, క్రమక్రమముగా, అడుగులో అడుగుబెట్టి, అనుసరించి, అనువర్తించి, వెనువెంట. **قدمبوس ہونا. قدم چومنا.** -బోస్ హోనా - కదమ్ చూమ్నా (ఉ) పాదచుంబనము చేయుట, కాళ్లకు మ్రొక్కుట. **قدم بوسی** - బోసీ (పా) పాదచుంబనము, కాళ్లకు మ్రొక్కుట. **قدم رکھانا** -రఖానా (ఉ) నడక,

మాపుట, పోవుట. قدم رنجہ فرمانا۔ کرنا -రంజ ఫర్మా నా - కర్నా (ఉ) విజయంచేయుట, శ్రమచేయుట, వచ్చుట, పోవుట, దయచేయుట, (గౌరవార్థకము) قدم لگنا -లగ్నా (ఉ) గుట్టుముబాగా నడచుట, గుట్టమునకునడకవచ్చుట, కాళ్లు పడుట, వశగతుడగుట. సంరక్షణలోకి వచ్చుట. قدم لینا۔ لگنا۔ کوہاتھ لگانا -లేనా -లగ్నా -కుహాథ్ లగానా (ఉ) కాళ్లుపట్టుకొనుట, చరణములుస్పృశించుట. قدم مارنا -మార్నా (ఉ) ప్రయత్నముచేయుట, పరుగులుపెట్టుట.

سبز قدم సబ్జ్- (పా) దురదృష్టపు అడుగులు, అశుభదాయకము.

قدما కుదమా (అ.పు) పూర్వీకులు, పెద్దలు ప్రాచీనులు, (ఏ.వ قدیم)

قدوس కుద్దూస్ (అ) పవిత్రమైన, పావనమైన, పరిశుద్ధమైన.

قدوم కుదూమ్ (అ.పు) ఆగమనము, చేరిక, రాక, తిరిగివచ్చుట, తిరుగుదల. (ఏ.వ قدم)

قدیر కదీర్ (అ) శక్తిమంతుడు, బలవంతుడు, ప్రబలుడు, బలిష్ఠుడు.

قدیم కదీమ్ (అ) పురాణమైన, ప్రాచీనమైన, పూర్వపు, పూర్వకాలపు. పురాతనమైన, ప్రాత, సనాతనమైన, పరంపరగా వచ్చుచున్న, ప్రహతమైన, ఎప్పటి.

قدیمی కదీమీ (అ) పూర్వపు, పురాతనమైన, ప్రాచీనపు, ఎప్పటి, ప్రాత, చాలాకాలపు.

قرابت కరాబత్ (అ.స్త్రీ)సామీప్యము, సంబంధము, బంధుత్వము, చుట్టరికము, قرابت دار -దార్ (పా.పు)బాంధవుడు, సంబంధుడు, బంధువు, చుట్టము, కావలసినవాడు. قرابت داری -దారీ (పా) బాంధవ్యము, సంబంధము, చుట్టరికము.

قرابتی కరాబతీ (అ)రక్తసంబంధముగల, బంధుత్వముగల, కావలసిన.

قرابہ కరాబ (అ.పు) గాజుజాడీ, జాడీ, గాజుబుడిగె, కొమ్ముబుడిగ, ద్విముఖి.

قرابین కరాబీన్ (స్త్రీ) చిన్నతుపాకి, చేతితుపాకి.

قرات కిరాత్ [అ.స్త్రీ]పఠనము, వాచకము, పాఠము, చదువుట, ఉచ్చారణము.

قرار కరార్ (అ.పు) విశ్రాంతి, విరామము, విశ్రామము, సౌఖ్యము, శాంతము, నెమ్మతి, నిమ్మళము, హాయి, సుఖము, స్వస్థత, నిలుకడ, స్థిరత, స్థిమితము, దృఢత, స్థైర్యము, క్షమ, ఓర్పు, ఓపిక, తాళిమి, సహనము, ధీరత్వము, నిశ్చలత్వము, స్థిరబుద్ధి; ఒడంబడిక, ఒప్పందము, సమాధానము, ప్రతిజ్ఞ, ఒప్పుదల, నిబంధనము. قرار پانا -పానా (ఉ) స్థిరపడుట, నిశ్చయమగుట, తీరుమానమగుట. قرار داد -దాద్ (పా)ఒడంబడిక, ఒప్పుదల, ఒప్పందము, తీర్పు, నిశ్చయము, తీరుమానము, పరిష్కారము, قرار دینا -దేనా (ఉ) స్థిరపరచుట, స్థాపించుట, నిశ్చయపరచుట. قرار واقعی -వాకెయీ(అ)

ఖండితముగా, సంపూర్ణముగా, పరిష్కార ముగా, నిష్కర్షగా, యథావిధిగా, సక్ర మముగా, సరిగా. **قرار ومدار** -ఒ, మదార్ (అ) ఒడంబడిక, మాటముచ్చ టలు, ఒప్పందము, నిశ్చయము, నిశ్చితా ర్థములు.

**قراری** కరారీ (అ) స్థిరమైన, స్థిమితమైన, దృఢమైన, నిశ్చయమైన, ఒడంబడికయైన, **بے قراری** -బే (పా)చిత్తవైకల్యము, వ్యాకులత, తల్లడము, అస్వస్థత, కలత.

**قراقر** కరాకుర్ (అ.పు) గుడగుడ, కడుపు లోడగుగుడలాడుట, కడుపువాగుట.

**قران** కిరాన్ (అ.పు) సామీప్యము, చేరిక, సంయోగము, గ్రహకూటము, రెండుగ్రహ ములు ఒకరాశిలోచేరుట, యోగము. **قران السعدين** -ఉస్సఅదైన్ (అ) శుభగ్రహద్వయకూటము, శుభయోగము.

**قرآن** కురాన్ (అ.పు) చదువుట, నేర్పుట, మహమ్మదీయ మత గ్రంథము. **قرآن هديہ كرنا** -హిద్యకర్నా (అ)కురాను కానుక, కురానునువిక్రయించుట(గౌరవా ర్థమిట్లందురు).

**قراول** కరావల్ (తు.పు) తుపాకివేట కాడు, తుపాకిబంటు, వేటాడించువాడు, సైనికుడు, ఉక్కళము, దండుతలారి, పరి చారుడు, సేనకాచువాడు, యామికుడు, ప్రహరివాడు, కావలివాడు, ముందుండు సైన్యభాగము,

**قراين** కరాయన్ (అ.పు) చూడు (ఏ.వ **قرينہ**). స్థితిగతులు, సందర్భములు, ఊహాపోహములు.

**قرب** కుర్బ్ [అ.పు] సామీప్యము, సం బంధము,దగ్గర,చుట్టరికము. **قرب وجوار** -ఒ,జువార్ (అ) చుట్టుపట్టు, చుట్టుప్రక్కలు, ఇరుగుపొరుగు, పరిసరప్రదేశము, సామీప్యస్థలములు.

**قربان** కుర్బాన్ (అ.పు) బలి,ఉపహారము, బలిదానము, బలిహారము, అర్పణ్యము; అంబులపొదికట్టి తలిగించుకొను తోలు వారు. **قربان گاه** -గాహ్ (పా) బలి పీఠము, బలిస్థానము.

**قربانی** కుర్బానీ (అ. స్త్రీ)బలి,బలిదానము, బలిహారము, మహమ్మదీయశాస్త్రానుసార మైనపశువధ.

**قربت** కుర్బత్ (అ,స్త్రీ) సామీప్యము, దగ్గర, బంధుత్వము, చుట్టరికము.

**قرة** కుర్రత్ (అ. స్త్రీ) శీతలము, చల్లదనము, శీతము, చలువ, ప్రకాశము, ఉల్లాసము, సంతోషము. **قرة العين** -తుల్ ఐన్ (అ) నేత్రోత్సవము; కొమారుడు; కండ్ల చలునమందు; ఒకకూరాకు.

**قرح** కర్హ్ (అ.పు) పుండు, గాయము.

**قرحه** కర్హ (అ పు) చీముపడినపుండు, వ్రణము.

**قرص** కుర్స్ (అ.పు) మండలము, గోళము, బింబము, వర్తులము, చక్రము, బిళ్ల,గుండ్ర నితునక, గుండు, గుళిక.

**قرض** కర్జ్ (అ.పు) ఋణము, అప్పు, అరువు, ఇయ్యవలసినది, అడిగితెచ్చినది. **قرض حسنہ** -ఎ,హస్న (అ) ధర్మ ఋణము, చేబదులు, వడ్డీయును కాలనియ

మములేనిఅప్పు, **قرض خواه** -ఖా-హ్ (పా) అప్పులవాడు, ఉత్తమర్ణుడు, అప్పిచ్చినవాడు. **قرض دار** -దార్ (పా) అధమర్ణుడు, ఋణగ్రస్థుడు, ఋణికుడు, ఋణస్థుడు, అప్పులకాపు, అప్పుతీసికొనిన వాడు. **قرض داری** -దారీ (పా) ఋణము, అప్పుపడుట, అప్పు.

**قرضه** కర్జే (అ.పు) ఋణము, అప్పు.

**قرضی** కర్జీ (అ) అప్పుసం॥, అప్పుగొనిన,

**قرط** కుర్త్ (అ.పు) ఖండము, తునక, కబళము, బుక్క; చెవిపోగు.

**قرطاس** కిర్తాస్ (యు.పు) పత్రము, కాగితము, కాగదము,

**قرعه** కుర్అ (అ.పు) పాచిక, సారె, పందెము, జూదము, భావము తెలియజేయుటకు ఉపయోగించు చీట్లు మొ॥వి. **قرعه بازی** -బాజీ (పా) చీట్లు వేయుట, జూదమాడుట. **قرعه ڈالنا - انداز ی کرنا** - డాల్నా - అందాజీకర్నా (ఉ) చీట్లుమొ॥వి వేయుట, సగినముచూచుట, పాచికవేయుట.

**قرق** కుర్క్ (అ.పు) సంరక్షణము, పదిలము, కాపు, కావలి, ఆటంకము, కట్టు, అడ్డు, నిర్బంధము. కట్టడి, రాజాధీనము, అధీనము, అధికారములోపెట్టుట.

**قرقی** కుర్కీ (అ.స్త్రీ) చూడు **قرق**

**قرم - قرم ساق** కుల్టుమ్ - కుల్టుమ్‌సాక్ (తు.పు) తనభార్యను పరులకప్పచెప్పిన వాడు, కుంటెనగాడు.

**قرمز - قرمزی** కిర్మిజ్ (పా.పు) -కిర్మిజీ (పా.స్త్రీ) క్రిమిజమైన, యొకవర్ణము, ఎఱ్ఱని, రక్తవర్ణమైన, కెంపువన్నెగల.

**قرن** కిర్న్ (అ.పు) గ్రహకూటము, యోగము, ౧౨ నుండి ౧౨౦ ఏండ్లవరకునుగల కాలపరిమితి, దీర్ఘకాలము; శృంగము, కొమ్ము, (ఊదుబడి).

**قرنا - قرنائی** కర్నా-కర్నాయీ (పా.పు) కొమ్ము, బూరగ, చుయ్యాంకి, తుతారము.

**قرنبيق** కఅన్‌బీక్ (అ.పు) వంకమెడబుడ్డి, సంధానపాత్రము.

**قرنفل** కరన్‌ఫుల్ (యు.పు) లవంగము.

**قرولی** కరౌలీ (తు.స్త్రీ) ఉక్కళము, దండుకావలివాడు, ప్రహరివాడు, యామికుడు, పరిచారుడు, కావలివాడు; వేటకత్తి.

**قريب** కరీబ్ (అ) సమీపమున, దగ్గర, చేరి, దరిలో, పొరుగున, దాదాపుగా, కొంచె ముతక్కువగా. **قريب الاختتام** - ఉల్,ఇఖ్తితామ్ (అ) కానచ్చిన, ముగియనున్న, ముగియుటకు కొంచెము మిగిలియున్న. **قريب الفهم - قياس** - ఉల్,ఫహ్మ్ - కియాస్ - సంభావ్యమైన, సులభమైన, సుబోధమైన, సాధ్యమైన, సయుక్తికమైన, యుక్తమైన. **قريب المرگ** -ఉల్,మర్గ్ (అ) చావనున్న, అవసానదశలోనున్న. **قريب الوقوع** -ఉల్,వకూఅ (అ) కానున్న, శీఘ్రములో కాగల, కాగల.

**قرین** కరీన్ (అ.పు) సహవాసి, చెలికాడు, సరియైన, పోలిన, సామ్యమైన, కలిసియున్న, సమకాలికమైన, చేరియున్న, చేరువైన, సమీపమున, దగ్గర, చేరువలో. **قرین قیاس** -ఎ,కియాస్ (అ) ఊహానుగుణ్యమైన, సంభావ్యమైన, సయుక్తికమైన, సుబోధమైన. **قرین مصلحت** -ఎ, మస్లహత్ (అ) సంభావ్యమైన, హితమైన, ఉచితమైన, యుక్తమైన, మంచి.

**قرینہ** కరీన (అ.పు) సందర్భము, సంబంధము, సంయోగము, చేరిక, కూడిక, పొందిక, ఊహ, అనురూపత్వము, అనుగుణ్యత, యుక్తత, ఏర్పాటు, క్రమము, వరుస, పద్ధతి, అనుసారము, వైఖరి, తీరు, రీతి, భంగి, తెరగు, విధము, మార్గము, ప్రకారము, సజ్జన, అందము. **قرینہ سے لگانا** -సేలగానా (ఉ) ఏర్పాటుచొప్పున పెట్టుట, ఏర్పరచియుంచుట, క్రమప్రకారముంచుట, సవరించుట.

**قریہ** కర్య (అ.పు) గ్రామము, పల్లె.

**قز** కజ్ (పా.పు) పట్టు, ముడిపట్టు.

**قزاق** కజ్జాక్ (తు.పు) దోపుడుదొంగ, తెరవాటుగాడు, త్రోవలు కొట్టువాడు, కొల్లకాడు. **قزاق اجل** -ఎ,అజల్ (అ) మృత్యుదేవత.

**قزاقی** కజ్జాకీ (తు. స్త్రీ) దోపుడు, కొల్ల, త్రోవలుగొట్టుట, దాడి.

**قزح** కుజేహ్ (అ.పు) మేఘునాధుడు, మేఘాధిదేవత. **قوس قزح** కౌసె-(అ) ఇంద్రధనుస్సు, సింగాణి.

**قساوت** కసావత్ (అ. స్త్రీ) కఠినత్వము, నిర్దయ, పరుషత్వము, దుఃఖము, వ్యాకులము.

**قسائی** కసాయీ (ఉ.పు) కట్టికవాడు, కట్టిడి, క్రూరుడు.

**قساینی** కసాయినీ (ఉ. స్త్రీ) కట్టికవాని భార్య, కట్టికది.

**قسط** కిస్త్ (అ. స్త్రీ) భాగము, అంశము, విభాగము, పాలు, విభాగములుగా చెల్లించు ద్రవ్యము, పాలము మొ॥ వానిపన్ను. **قسط بندی** -బందీ (ఉ) విభాగములుగా చెల్లించుఏర్పాటు. **قسط وار** -వార్ (ఉ) విభాగములుగా, క్రమముగా, కొంత కొంతగా.

**قسم** కసమ్ (అ.పు) శపథము, ప్రమాణము, సత్తెము, బాస, ఒట్టు. **قسم کھانا** -ఖానా (ఉ) ఒట్టుతినుట, ప్రమాణముచేయుట, సత్యమని నిరూపించుట.

**قسم** కిస్మ్ (అ. స్త్రీ) ఖండము, భాగము, విభాగము, పాలు; జాతి, వర్గము, భేదము; విధము, తీరు, రీతి, వైఖరి.

**قسما قسمی** కస్మాకస్మీ (ఉ. స్త్రీ) ఉభయుల ప్రమాణములు, ఒట్లుసత్తెములు, ఒకరికొకరు ప్రమాణముచేసుకొనుట.

**قسمت** కిస్మత్ (అ. స్త్రీ) విభాగము, భాగము, పాలు; అదృష్టము, భాగ్యము, ప్రారబ్ధము; ప్రాంతము, ప్రదేశము; భాగహారము. **قسمت والا** - వాలా (ఉ) అదృష్టవంతుడు.

**قسمیہ** కస్మియ (అ) శపథపూర్వకముగా, ఒట్టుపెట్టి, బాసచేసి, ప్రమాణపూర్వక

వృత్తఖండము. قطع کلا م -కలామ్ (అ) పరిసంగభంగము, ఒకరుమాట్లాడుచుండగా అడ్డుపడి నడుమమాట్లాడుట. قطع نظر -ఎ,నజేర్ (అ) ఇదిగాకను, విడిచి, వదలి, కాక, తప్ప; ఇంక, మరియు, ఇంతేకాక, ఇదికాక, అదియెట్లున్నను, ఎట్లైనను, అదికావుండనే, అదిఆలోచించకుండ.

قطعہ క(కి)త్అ (అ.పు) ఖండము, భాగము, తునక; పత్రము, పత్రిక, ప్రదేశము, ప్రాంతము, భూభాగము. ఒకతుండు నేల, తుండు, పద్యము లేక పదములోని కొన్నిచరణములు, బంధవిశేషము.

قطعی కత్యీ (అ) ఖండితమైన, నిష్కర్షయైన, పరిష్కారమైన, తీర్చైన, నిశ్చయమైన, కడపటి, తుది, ఆసాంతము, బొత్తిగా, సంపూర్ణముగా, నిశ్చయముగా, నిస్సంశయముగా, పరిష్కారముగా, నిష్కర్షగా, యదార్థముగా.

قطمیر కిత్మీర్ (అ.పు) ఖర్జూరపు విత్తనము పైపొర లేక పల్లముగానున్నగీత, ఖర్జూరపు కాయ తొడిమవద్ది తెలుపు, అల్పము, కొంచము, రవంత, ఒకకుక్కపేరు.

قطن కుత్న్ (అ.స్త్రీ) కార్పాసము, పత్తి.

قعب కఅబ్ (అ.పు) గుహ, లోయ, బొరియ, గుంట, గిన్నె.

قعر కఅ్ర్ (అ.పు) అగాధము, అడుగు, లోతు.

قفا కఫా (అ.స్త్రీ) మచ్చిలిగుంట, పెడతల, మూపు అనగా మెడయొక్క వెనుకటి భాగము, వెనుక, తరువాత, వెంట, దొబ్బు, దెబ్బ.

قفس కఫస్ (పా.పు) పంజేరము, దేహము, కాయము; బందె, చెఱ, తడక, కిటికీ కమ్ములు.

قفل కుఫ్ల్ (అ.పు) తాళము, బీగము. قفل ابجد -ఎ,అబ్జద్ (అ) అక్షరాలబీగము, ఒనమాలబీగము. قفل وسواس -ఎ, వస్వాస్ (అ) చిక్కుతాళము, అక్షరాల బీగము, చిక్కు, తిరుగుడు.

قفلی కుఫ్లీ (ఉ.స్త్రీ) మూతగలపాత్రము, మెలిచుట్టులతోడుగు, బరణి, డబ్బి, అందమైనపిల్లవాడు, ముద్దులాడు.

ققنس - ققنوس కుక్నుస్ - కుక్నూస్ (పా.పు) కోయిలవంటిఒకఅపరూపమగు కవికల్పితమైన పక్షి.

قل కుల్ (అ) సమాధి ఉత్సవములలోను తద్దినాదులలోను పెద్దలపేరుమీద నేదైన చదివించెడు కాలములో చదివెడుకురాను లోని (కుల్‌హువల్లా) యని ఆరంభమగు కొన్ని అనువాకములు, సమాధి, ఉత్సవము, తద్దినము, చదివింపుడు, మంగళము, అవసానము, అంతము, తీయమానము.

قل آغوزیہ -ఆగోజియ(అ) బ్రాహ్మణార్థములు కుడుచువాడు, పిండాకూళ్లు తినువాడు, తేరతిండితినువాడు, సత్రపు కూళ్లుతినువాడు, ఎత్తుకతినువాడు. قل ھونا -హోనా (ఉ) సమాధిఉత్సవమగుట, చదివింపగుట, మంగళముపాడుట, పని తెల్లవారుట లేక తీరుట, ఆసాంతమగుట, అంతమునొందుట.

قلا కలా (ఉ.స్త్రీ) కళ, విద్య, వినోదము, ఆట, మోసము, టక్కు, విద్దె, మాయ,

పిల్లిగంతు, పల్లటి. **قلا بازی** -ఖలా-బాజీ(ఉ) చూడు **قلابازی** **کلابازی** అనుమాట. **قلابازی کھانا** -బాజీఖానా (ఉ) పల్లటీల్గొనుట, పల్లటీల్లాటుట, పల్లటీల్ వైచుట, పొర్లిగింతలు పెట్టుట, పరుగులాడుట.

**قلابہ** కుల్లాబ (అ.పు) ఇనుపకొక్కి-లేక నాగవాసము, చేపలగాలము, ఇనుపకడియము లేక ఉంగరము.

**قلاچ-قلانچ** కల్లాచ్-కల్లాంచ్ (ఉ) చూడు **قلاش**

**قلاش** కల్లాష్ (పా.పు) దుర్మార్గుడు, పోకిరి, తలకొట్టుమారి, సిగ్గుమాలినవాడు, మాయలమారి, అనామధేయుడు, పేరుప్రతిష్ఠలేనివాడు, దరిద్రుడు, రిక్తుడు, దిక్కుమాలినవాడు.

**قلانچ** కుల్లాంచ్ (ఉ.స్త్రీ) గుఱ్ఱము మొ॥ వానిదాటు, గంతు, దూకు, చెంగనము, బట్టలు కొలుచు కొలబద్ద లేక కొలకోల, రెండుమూరల కొలత.

**قلب** కల్‌బ్ (అ.పు) తలక్రిందైనది, క్రిందలగా వ్రేలాడునది; హృదయము, గుండెకాయ, మనస్సు, అంతస్సు; మధ్యము, నడుమ, అంతర్భాగము, మధ్యభాగము, మూలబలము, సేనామధ్యము, అశుద్ధమైన వెండి లేక బంగారు, కృత్రిమ నాణెము, కృత్రిమమైన, కొండలనడిమిచిక్కు-త్రోవ, కొండకనుమలు; ఎడమ (కుడికివిరుద్ధము); గిజేరు, గుంజు, కాయలలోగుజురులేకపప్పు; టెంకాయ మొ॥ వాని లోని బొండలము. **قلب ساز** -సాజ్ (పా) కృత్రిమనాణెములుచేయువాడు.

**قلبہ** కుల్బ (అ.పు) హలము, నాగేలు.

**قلبی** కల్బీ (అ) హృదయమైన, హృదయసం॥, హృదయపూర్వకమైన, మనఃపూర్వకమైన, అశుద్ధమైన, కృత్రిమమైన.

**قلت** కిల్లత్ (అ.స్త్రీ) అల్పత్వము, తగ్గు, లోపము, దొరకమి, లేమి, కొరత, తక్కువ, చాలమి, కఱవు, క్షామము, కష్టము, సంకటము, ఇరుకు, ఇబ్బంది.

**قلتین** కుల్లతైన్ (అ.పు) నీళ్ల కాగులు లేక బానలు (రెండు), మురికినీళ్లు, లంజతొత్తు, అశుద్ధమైన, మురికియైన, అసహ్యమయిన, మిక్కిలివాడబడిన, అనేకులుఉపయోగించుటచే చెడిన, అపవిత్రమైన.

**قلزم** కుల్‌జుమ్ (అ.పు) కెంపుసముద్రపుగట్టునయున్న నొకగ్రామముపేరు, కెంపుసముద్రము, సముద్రము.

**قلع** కల్‌అ (అ.పు) పడగొట్టుట, కూలగొట్టుట, నిర్మూలనము, పాడు, భంగము, భగ్నము. **قلع قمع** -కమ్‌అ (అ) చిన్నభిన్నము, నేలమట్టము. భగ్నము, పాడు, ధ్వంసము, నాశము.

**قلعہ** కిల్‌అ (అ.పు) కోట, దుర్గము, రాజభవనము, లేక నగరు. **قلعہ دار** -దార్ (పా) దుర్గాధిపతి, కోటనాయకుడు, కోటపైయధికారి.

**قلعی** కల్‌యీ (అ.స్త్రీ) తగరము, సున్నము, వెల్లచరుపు, సున్నమువేయుట, తగరపుపూత, మెరుగుపూత, మెరుగు, మెరపు, మిసిమి, పైపైమెరుగులు, ఆడం

బరము, డంబము. قلعی کاکشتہ -కాకుష్త (పా) వంగభస్మము. قلعی کھلنا -ఖుల్నా (ఉ) రాగి తేలుట, కుండపగులుట, గుట్టు బయలుపడుట, రహస్యముబట్టబయలగుట. యదార్థము తెలియుట. قلعی گر - గర్ (పా) తగరపుపనివాడు.

**قلفی** కుల్ఫీ (ఉ. స్త్రీ) చూడుము قلفی

**قلق** కలక్ (అ.పు) మనోవ్యథ, వ్యాకులము, చింత, పరితాపము, వ్యసనము, కలత, కలక.

**قلقل** కుల్ కుల్ (అ. స్త్రీ) జాడిలేక బుడ్డిలో నుండి నీరుపడుచప్పుడు, బుడబుడ.

**قلم** కలమ్ (అ.పు) లేఖిని, కలము, వ్రాయు సాధనము, కడ్డీ, పుల్ల, కణిక, పొడుగాటి తునక, ఆద్దపుకణిక, కొమ్మ, శాఖ, జంతువులకొమ్ము, పశువుల జననేంద్రియము, కొలబుడ్డీ లేక పొడుగాటిసన్నని సొరాయి బుడ్డీ, కూచిగా గోరిగిన రెండు వెండ్రుకలు, రంగులు వేయుటకూర్చిక లేక తూలిక, మొలకె వేయుటకై కోసినకొమ్మ, అంటు, అంటు కొమ్మ, పూలబాణమునకున్న బాణపుమొన; అధికారము, ప్రభుత్వము, ఖండించిన, ఖండితమైన, కోసిన, నరికిన, ఛేదితమైన, భిన్నమైన. قلم انداز کرنا -అందాజ్ కర్నా (ఉ) లేఖకప్రమాదముచేయుట, వ్రాయుటకు మరచిపోవుట, వ్రాయుటలో విడిచిపెట్టుట. قلم بند -బంద్ (పా) లిఖితము, వ్రాసినది, వ్రాతమూలకమైనది. قلم بند کرنا -బంద్ కర్నా (ఉ) లిఖించుట. వ్రాయుట, పుస్తకములలోలేక లెక్కలోచేర్చుట. వ్రాతమూలకముగాచేయుట. قلم بند ہونا -బంద్ హోనా (ఉ) లిఖితమగుట, వ్రాతమూలకమగుట, వ్రాయబడుట. قلم پاک -పాక్ (పా) లేఖిని తుడుచు గుడ్డపీలిక. قلم پھیرنا - مارنا -ఫేర్నా-మార్నా (ఉ) వ్రాసినది కొట్టివేయుట, తుడుపుపెట్టుట. قلم تراش -తరాష్ (పా) పేనాకత్తి. قلم دان -దాన్ (పా) లేఖినిపెట్టె. قلم رو -రౌ (పా) రాజ్యము, ప్రభుత్వము. قلم

**قسائی - قصائی** కసాయీ (ఉ) లంచములుతిని అన్యాయముచేయు రాయసగాడు. قلم کار -కార్ (పా) లేఖకుడు, రాయసగాడు, కంసాలి. చిత్రకారుడు, పటములువ్రాయువాడు, చెక్కడపుపనిచేయువాడు, ముద్రలులేక అచ్చులుచేయువాడు, కత్తిరిబట్ట, చీటిబట్ట. قلم کاری -కారీ (పా) లేఖనము, వ్రాత, వ్రాతపని, కంసాలిపని, చిత్రలేఖనము, చెక్కడపుపని, ముద్రలు మొ॥వి చెక్కుపని. قلم کرنا -కర్నా (ఉ) ఛేదించుట, ఖండించుట, కోయుట, నరుకుట, తెగగొట్టుట. قلم لگانا -లగానా (ఉ) అంటువేయుట. అంటుపెట్టుట. قلم ہونا -హోనా (ఉ) ఛేదితమగుట, తెగుట, నరుకుడుపడుట, కోయబడుట. قلم مو -ఎ, మూ (పా) రోమతూలిక, వెండ్రుకలకూర్చిక.

**قلمی** కలమీ (అ) హస్తలిఖితమైన, చేతవ్రాసిన, వ్రాసిన, కణికవలె లేక కడ్డీవలెనున్న, హస్తలిఖితము, అదర్శనము, లేఖనము, వ్రాత, లేఖ. قلمی آم -ఆమ్ (ఉ) అంటుమామిడిపండ్లు. قلمی شورہ -షోర (పా.పు) శుద్ధిచేసినపెట్లుప్పు, పెట్లుప్పు కణికలు. قلمی کرنا -కర్నా (ఉ) వ్రాయుట, లిఖించుట.

**قلندر** కలందర్ (పా.పు) గడియ, గడెత్రాను, తుంటు, మొద్దు, మోటువాడు, గడుసు వాడు, తుంటరివాడు, పోకిరి, సిగ్గిడి, కోతుల వాడు. దొమ్మరివాడు, సన్యాసి, భిక్షుకుడు, నిర్భాడు.

**قلندرا** కలందరా (ఉ.పు) ఒకవిధమైన పట్టుబట్ట.

**قلندری** కలందరీ (ఉ. స్త్రీ) నిర్భాడు.

**قلم** కుల్ల (అ. స్త్రీ) కొండకోటరము, పర్వత శిఖరము, శిఖరము, కొన; మాడు, నడినెత్తి; ఒకవిధమైన గుఱ్ఱపువన్నె, కొంచెము పసరు వన్నె.

**قلی** కులీ (తు.పు) బానిస, సేవకుడు, బరువులు మోయువాడు, కష్టముచేయువాడు, పనివాడు, వైతనికుడు, వేతనమునకుపనిచేయువాడు. **قلی گری** -గరీ (పా) వైతనికము, కష్టము, పాటు, సేవకావృత్తి, చాకిరి, కూలిపని.

**قلیل** కలీల్ (అ) స్వల్పమైన, అల్పమైన, కొంచెమైన, లఘువైన, చిన్న, పొట్టి, తక్కువైన.

**قلیه** కలియ (అ.పు) దేనితోనైన కలిపివండిన మాంసము.

**قلیان** కల్యాన్ (పా.పు) గుడుగుడీ, హుక్కా.

**قمار** కిమార్ (అ.పు) ద్యూతము, జూదము, పందెము, పాచికలాట, ద్రవ్యము ఒడ్డియాడు ఓటు గెలుపుగలయాట; నడవడిక, వర్తనము. **قمارباز** -బాజ్ (పా) జూదరి, జూదమాడువాడు. **قماربازی** -బాజీ (పా) జూదము, పాచికలాట.

**قمارخانه** -ఖాన (పా) ద్యూతశాల, జూదమాడుచోటు.

**قماش** కుమాష్ (అ.పు) విధము, జాతి, వర్గము, వైఖరి, పద్ధతి, లక్షణము, ఒకవిధమైనప్లాటు; పట్టుబట్ట, నారబట్ట, నీచులు.

**قمچی** కమ్‌చీ (తు. స్త్రీ) వేత్రము, బెత్తము, పేము, కశము, చేతికోల; చిన్నకొమ్మ, చువ్వ, రెమ్మ, పుల్ల, జెట్టిపట్టు, చేయి విదలించుట, ఝాడించు; వంకకత్తి.

**قمر** కమర్ (అ.పు) చందురుడు, చంద్రమాసం, వెండి, రౌప్యము. **قمروعقرب** -వ-అక్‌రబ్ (అ) వృశ్చికస్థచంద్రుడు, అశుభలగ్నము, ఇబ్బోడు.

**قمری** కమరీ (అ) చంద్ర సం॥, చాంద్రమానపు.

**قمری** కుమ్రీ (అ. స్త్రీ) తెల్లగువ్వ, గువ్వ, ఒకతెగ పైరాణి స్త్రీలు.

**قمع** కమ్అ (అ.పు) పడగొట్టుట, కూలగొట్టుట, భగ్నముచేయుట, చిన్నాభిన్నము చేయుట.

**قمقمه** కుమ్‌కుమ (అ.పు) దీపపుకుప్పె (చిన్నలాంతరు), జాడి, గిండి; హోలీలో బుక్కా మొ॥ గంధపొడులు పోసి ఒకరిపై ఒకరు విసరివేసికొను లక్కబుడ్లు, గంధపొడికాయ.

**قمیض** కమీజ్ [అ. స్త్రీ] లోపలిబనసము, అడుగుఅంగీ.

బగము, డంబము. **قلعی کا کشتہ**-కాకుష్త (పా) వంగభస్మము. **قلعی کھلنا**-ఖుల్నా (ఉ) రాగి తేలుట, కుండపగులుట, గుట్టు బయలుపడుట, రహస్యముబట్టబయలగుట. యదార్థము తెలియుట. **قلعی گر** - గర్ (పా) తగరపుపనివాడు.

**قلفی** కుల్ఫీ (ఉ. స్త్రీ) చూడుము **قفلی**

**قلق** కలక్ (అ. పు) మనోవ్యథ, వ్యాకులము, చింత, పరితాపము, వ్యసనము, కలత, కలక.

**قلقل** కుల్ కుల్ (అ. స్త్రీ) జాడీలేకబుడ్డిలో నుండి నీరుపడుచప్పుడు, బుడబుడ.

**قلم** కలమ్ (అ. పు) లేఖిణి, కలము, వ్రాయు సాధనము, కడ్డీ, పుల్ల, కణిక, పొడుగాటి తునక, అద్దపుకణిక, కొమ్మ, శాఖ, జం తువులకొమ్ము, పశువుల జననేంద్రియము, కొలబుడ్డీ లేక పొడుగాటిసన్ననిసాంబ్రాయి బుడ్డీ, కూచిగానొరిగినచెంబు వెంట్రుకలు, రంగులు వేయుకూర్చిక లేక తూలిక, మొల కవేయుటకై కోసినకొమ్మ, అంటు, అంటు కొమ్మ; పూలబాణమునకున్న బాణసుచు; అధికారము, ప్రభుత్వము, ఖండించిన, ఖండితమైన, కోసిన, నరికిన, ఛేదితమైన, భిన్నమైన. **قلم انداز کرنا** -అందాజ్ కర్నా (ఉ) లేఖకప్రమాదముచేయుట, వ్రాయుటకు మరచిపోవుట, వ్రాయుట లో విడిచిపెట్టుట. **قلم بند** - బంద్ (పా) లిఖితము, వ్రాసినది, వ్రాతమూలకమైనది. **قلم بند کرنا** -బంద్ కర్నా (ఉ) లిఖించుట. వ్రాయుట, పుస్తకములో లేక లెక్క లో చేర్చుట. వ్రాతమూలకముగా చేయుట. **قلم بند ہونا** -బంద్ హోనా (ఉ) లిఖితమగుట, వ్రాతమూలకమగుట, వ్రాయ బడుట. **قلم پاک** -పాక్ (పా) లేఖిణి తుడుచు గుడ్డచీలిక. **قلم پھیرنا - مارنا** ఫేర్నా-మార్నా (ఉ) వ్రాసిదికొట్టి వేయుట, తుడుపు పెట్టుట. **قلم تراش** -తరాష్ (పా) పేనాకత్తి. **قلم دان** -దాన్ (పా) లేఖిణిపెట్టె. **قلم رو**-రౌ (పా) రాజ్యము, ప్రభుత్వము. **قلم قسائی - قصائی** కసాయీ (ఉ) లంచములుతిని అన్యాయముచేయు రాయస గాడు. **قلم کار** కార్ (పా) లేఖకుడు, రాయసగాడు, రంగరి. చిత్రకారుడు, పటములువ్రాయువాడు, చెక్కడపుపనిచేయు వాడు, ముద్రలులేక అచ్చులుచేయువాడు, కత్తిరిబట్ట, చీటిబట్ట. **قلم کاری** - కారీ (పా) లేఖనము, వ్రాత, వ్రాతపని, రంగ రిపని, చిత్రలేఖనము, చెక్కడపుపని, ము ద్రలు మొ॥వి చెక్కుపని. **قلم کرنا** - కర్నా (ఉ) ఛేదించుట, ఖండించుట, కోయుట, నరుకుట, తెగగొట్టుట. **قلم لگانا** -లగానా (ఉ) అంటువేయుట. అంటు పెట్టుట. **قلم ہونا** -హోనా (ఉ) ఛేదితమగుట, తెగుట, నరుకుడుపడుట, కోయ బడుట. **قلم مو** -ఎ, మూ (పా) రోమ తూలిక, వెండ్రుకలకూర్చిక.

**قلمی** కలమీ (అ) హస్తలిఖితమైన, చేత వ్రాసిన, వ్రాసిన, కణికవలె లేక కడ్డీవలె నున్న, హస్తలిఖితము, ఆదర్శనము, లేఖ నము, వ్రాత, లేఖ. **قلمی آم** -ఆమ్ (ఉ) అంటుమామిడిపండ్లు. **قلمی شورہ** -షోర (పా. పు) శుద్ధిచేసినపె ట్లుప్పు, పెట్లుప్పు కణికలు. **قلمی کرنا** -కర్నా (ఉ) వ్రాయుట, లిఖించుట.

**قلندر** కలందర్ (పా.పు) గడియ, గడె(మాను, తుంటు, మొద్దు, మోటువాడు, గడుసువాడు, తుంటరివాడు, పోకిరి, సిగ్గిడి, కోతులవాడు. దొమ్మరివాడు, సన్యాసి, భిక్షుకుడు, నిర్రూడు.

**قلندرا** కలందరా (ఉ.పు) ఒకవిధమైన పట్టుబట్ట.

**قلندری** కలందరీ (ఉ.స్త్రీ) నిర్రూడు.

**قلم** కుల్ల (అ.స్త్రీ) కొండకోటరము, పర్వతశిఖరము, శిఖరము, కొన; మాడు, నడినెత్తి; ఒకవిధమైనగుజ్జుపువన్నె, కొంచెముపసరువన్నె.

**قلی** కులీ (తు.పు) బానిస, సేవకుడు, బరువులుమోయువాడు, కష్టముచేయువాడు, పనివాడు, వైతనికుడు, వేతనమునకుపనిచేయువాడు. **قلی گری** -గరీ(పా) వైతనికము, కష్టము, పాటు, సేవకావృత్తి, చాకిరి, కూలిపని.

**قلیل** కలీల్ (అ) స్వల్పమైన, అల్పమైన, కొంచెమైన, లఘువైన, చిన్న, పొట్టి, తక్కువైన.

**قلیہ** కలియ (అ.పు) దేనితోనైన కలిపివండిన మాంసము.

**قلیان** కల్యాన్ (పా.పు) గుడుగుడీ, హుక్కా.

**قمار** కిమార్ (అ.పు) ద్యూతము, జూదము, పందెము, పాచికలాట, ద్రవ్యము ఒడ్డియాడు ఓటుగెలుపుగలయాట; నడవడిక, వర్తనము. **قمار باز** -బాజ్ (పా) జూదరి, జూదమాడువాడు. **قمار بازی** -బాజీ (పా) జూదము, పాచికలాట.

**قمارخانہ** -ఖాన (పా) ద్యూతశాల, జూదమాడుచోటు.

**قماش** కుమాష్ (అ.పు) విధము, జాతి, వర్ణము, వైఖరి, పద్ధతి, లక్షణము, ఒకవిధమైనసన్నటిగుడ్డ; పట్టుబట్ట, నారబట్ట, నీచులు.

**قمچی** కమ్చీ (తు.స్త్రీ) వేత్రము, చెత్తము, పేము, కళము, చేరుకోల; చిన్నకొమ్మ, చువ్వ, రెమ్మ, మెల్లె, జెట్టిపట్టు, చేయివిడలించుట, ఝాడించు; వంకకత్తి.

**قمر** కమర్ (అ.పు) చంద్రుడు, చందమామ, వెండి, రౌప్యము. **قمروعقرب** - వ అక్రబ్ (అ) వృశ్చికస్థచంద్రుడు, అశుభలగ్నము, ఇబ్బోడు.

**قمری** కమరీ (అ) చంద్ర సం॥, చాంద్రమానపు.

**قمری** కుమ్రీ (అ.స్త్రీ) తెల్లగువ్వ, గువ్వ, ఒకతెగ పైరాని స్త్రీలు.

**قمع** కమ్అ (అ.పు) పడగొట్టుట, కూలగొట్టుట, భగ్నముచేయుట, ఛిన్నాభిన్నముచేయుట.

**قمقمہ** కుమ్కుమ (అ.పు) దీపపు కుప్పె (చిన్నలాంతరు), జాడి, గిండి; హోలీలో బుక్కా మొ॥ గంధపొడులు పోసి ఒకరిపై ఒకరు విసరివేసికొను లక్కా బుడ్డలు, గంధపొడికాయ.

**قمیض** కమీజ్ (అ.స్త్రీ) లోపలిఉసము, అడుగులంగీ.

**قنات** కనాత్ (స్త్రీ) ప్రక్క, పార్శ్వము, గుడారముచుట్టునుండుబట్టతెఱ, తెరచాప,

**قنادیل** కనాదీల్(అ. స్త్రీ) చూడు ( ఏ.వ **قندیل**)

**قنار** కనార(అ.పు)కట్టికయంగడి, మాంసము వ్రేలార్చుకొక్కెములు.

**قناعت** కనాఅత్ (అ, స్త్రీ) సంతుష్టి, తృప్తి, తనివి, లాభసంతుష్టి, తనకు ఉన్న దానితోసంతోషించుట.

**قناویز** కనావీజ్(తు. స్త్రీ) పట్టువలిపెము.

**قنبر** కుంబర్ (అ.పు. స్త్రీ) భరద్వాజపక్షి.

**قند** కంద్ (ఉ.పు) కండచక్కెర, కలకండ, రవచక్కెర,ఒకతినుబండము, మధురమైన, తియ్యని; మధురబట్టు, తొగరుగుడ్డ.

**قندیل** కందీల్ (అ. స్త్రీ) గాలిగుమ్మటము, కాకితముతోచేసినదీపపుగుమ్మటము,దివ్వె గుమ్మటము, దీపపుకుప్పె, గాజుకుప్పె.

**قوا-قوے** కువా (అ.పు) శక్తులు,ఇంద్రియములు, చూడు (ఏ.వ **قوت**)

**قواعد** కవాఇద్ (అ.పు) నిబంధనలు, నియమములు, చట్టములు, రీతులు, పద్ధతులు, తెరగులు, లక్షణములు;సూత్రములు, శాస్త్రము; స్మృతి, వ్యాకరణశాస్త్రము;యుద్ధపరిశ్రమ, ఖురళి, సైనికశిక్ష (ఏ.వ **قاعدہ**)· **قواعد دان** -దాన్ (పా) శాస్త్రజ్ఞుడు; వ్యాకరణశాస్త్రజ్ఞుడు,యుద్ధశాస్త్రజ్ఞుడు. **قواعدگاہ** -గాహ్(పా) ఖురళీశాల, గరడీసాల,యుద్ధపరిశ్రమచేయుచోటు, ఖురళీస్థానము.

**قوال** కవ్వాల్ (అ.పు) మాటకారి, మాటలమారి, పాటకుడు,గాయకుడు, గాథకుడు, సుద్దులుచెప్పువాడు, కథకుడు.

**قوالی** కవ్వాలీ (అ. స్త్రీ) గానము, కథనము, సుద్దులు.

**قوام** కవామ్ (అ.పు) న్యాయము, పాకము, సారము,

**قوام** కవ్వామ్ (అ.పు) నిలిచియుండుట, నిలువుగానుండుట, స్థిరము, స్థిమితము,నిలకడ, ఏర్పాటు, రచన, నిర్మాణము.

**قوام** కివామ్ (అ.పు) సారము, మూలము, మూలవస్తువు, పదార్థసారము, పాకు, పాకము, పానకము.

**قوانین** కవానీన్ (అ.పు) శాసనములు, నియమములు, చట్టములు, నిబంధనలు, (ఏ.వ **قانون**)

**قوت** కూత్(అ. స్త్రీ) జీవనము, ఆహారము. తిండి,భోజనము,అన్నపానములు, బత్తెము, భోజనపదార్థములు. **قوت بسری کرنا** -బస్రీకర్నా (ఉ) జీవనముచేయుట,బ్రతుకుట,కాలముగడుపుట, పొట్టపోసికొనుట, కష్టసుఖములతోకాలముగడుపుట. **قوت لا یموت** -ఎ,లాయమూత్ (అ) కేవలము ప్రాణాధారమైన యాహారము, చావకుండ ఊపిరిపట్టుకొని యుండునంత మాత్రమైనయాహారము.

**قوت** కూవత్ (అ.పు) శక్తి, బలము, పటుత్వము, సామర్థ్యము, వీర్యము, సత్తువ, త్రాణ, పరాక్రమము, పస, సారము, దార్ఢ్యము, సహాయము, ఆశ్రయము,ప్రభుత్వము,రాజ్యము, దొరతనము,అధికారము,

ఇంద్రియము, ఇంద్రియజ్ఞానము. قوت باصره -ఎ,బాసిర(అ)చక్షురింద్రియము, చూపు, దృష్టి. قوت باه -బాహ్ (అ) కామోద్రేకము, కామము. قوت جاذبه -ఎ,జాజిబ (అ) ఆకర్షణశక్తి. قوت حافظه -ఎ,హాఫిజే (అ) జ్ఞాపకశక్తి. قوت دافعه -ఎ,దాఫిఅ (అ) నివారణశక్తి,పరిహారశక్తి. قوت دینا -దేనా (ఉ) బలపరచుట, బలమిచ్చుట. قوت ذاتیه -ఎ,జాతియ(అ)నైజశక్తి. قوت ذائقه -ఎ,జాయిక(అ)రసనేంద్రియము. قوت سامعه -ఎ,సామిఅ (అ) శ్రవణేంద్రియము. قوت شامه -ఎ,షామ్మ (అ) ఘ్రాణేంద్రియము, قوت لامسه -ఎ,లామిస (అ) స్పర్శేంద్రియము. قوت ماسکه -ఎ,మాస్క (అ) ధారణశక్తి. قوت مدرکه -ఎ,ముద్రికా(అ) గ్రహణశక్తి, జ్ఞానము. قوت ممیزه -ఎ,ముమయ్యిజే (అ) తారతమ్యజ్ఞానము, వివేకము. قوت هاضمه -ఎ,హాజిమ (అ) జీర్ణశక్తి.

قور కోర్ (అ. స్త్రీ) నూలుపగ్గము; అంచు, కమ్మి; పరివారము, పరిజనము. قورخانه -ఖాన(పా) ఆయుధశాల, బట్టలగది, వస్త్రశాల.

قورچی కోర్చీ (పా.పు) బట్టలగదిపై యుండువాడు, వస్త్రశాలాధిపుడు ,వస్త్రనాయకుడు.

قورمه-قورما కోర్మా-ర్మా (తు.పు) నేతిలో వేల్చినమాంసము.

قوس కౌస్ (అ.పు)ధనుస్సు, విల్లు, వర్తుల (ములోనొక) భాగము, ధనుస్సురాసి, ఇంద్రధనుస్సు. قوس قزح -ఎ,కుజేహ్ (అ) ఇంద్రధనుస్సు, قوس نما -నుమా(పా) ధనురాకారమైన, విలువంపైన.

قوسی కౌసీ (అ) ధనురాకారమైన, ధనుస్సు సం॥.

قول కౌల్ (అ.పు)వాక్కు, వచనము,ఉక్తి, పలుకు, మాట, భాషణము, వాగ్దానము, శపథము, ప్రమాణము, ఒడంబడిక, ఒప్పందము, సామెతె, నీతివచనము, సామ్యము, قول کا چھلا -కా ఛల్లా (అ) జ్ఞాపకార్థమైనఉంగరము, చేతులుకలిపినట్లుండు ఉంగరము. قول و فعل -ఒ, ఫెఅల్ (అ) వర్తనము, వ్యవహారము. قول قرار -ఒ, కరార్ (అ)మాటముచ్చటలు, ఒడంబడిక, ఏర్పాటు, ఒప్పందము. قول هارنا -హార్నా (ఉ) మాటజారుట, మాటయిచ్చుట, వాగ్దానముచేయుట, ఆడితప్పుట.

قولنج కూలంజ్ (యు.పు) కడుపుకుట్టు, శూలనొప్పి, ప్రక్కకుట్టు.

قوم కౌమ్ (అ. స్త్రీ) ప్రజ, జాతి, కులము, వంశము, వర్గము, గణము, తెగ, సంఘము. قوم دار -దార్ (పా) కులీనమైన, మేలుజాతియైన, సవర్ణుడైన.

قومی కౌమీ (అ) జాతీయమైన, దేశీయమైన, కులపు,వంశపు; జాత్యమైన, قومی حکومت -హుకూమత్ (అ) ప్రజాప్రభుత్వము. قومی مجلس -మజ్లిస్(అ) జాతీయసభ, జాతీయసమాజము.

**قومیت** కౌమియత్ (అ. స్త్రీ) జాతిత్వము, జాతి, కులము, కులసంబంధము, జాతీయ సంబంధము.

**قوی** కవీ (అ) ప్రబలమైన, బలిష్ఠమైన, బలీయమైన, శక్తివంతమైన, దృఢమైన, దిట్టమైన, స్థిరమైన, కాఠిన్యముగల, పటుత్వముగల, బలముగల, పుష్టిగల, పాటవముగల, బలవంతమైన, గట్టి **قوی جسم** -జుస్మ (అ) దృఢగాత్రుడైన, కండపుష్టిగల, కాయపుష్టిగల, మాంసలుడైన. **قوی ہیکل** -హైకల్ (అ) బ్రహ్మాండమైన, అతికాయమైన, బలిష్ఠమైన, దృఢకాయుడైన, మాంసలుడైన, బలీయమైన.

**قہار** కహ్హార్ (అ) ప్రచండుడు, ప్రకోపనుడు, క్రూరుడు, దోర్దండుడు.

**قہر** కహ్ర్ (అ.పు) ప్రకోపము, ఉగ్రకోపము, ఆగ్రహము, క్రోధము, కోపము, ఉద్రేకము, ఆవేశము, ఉగ్రము, తీవ్రము, తీక్ష్ణత, ఆక్రోశము, దుర్ఘటన, కష్టము, ఆపత్తు, విపత్తు, కీడు, ఇడుము, దుఃఖము, దౌర్జన్యము, అక్రమము, అన్యాయము, అసహ్యము, విచిత్రము, విపరీతము, ప్రచండము, దుర్భరము, అమితము, అత్యంతము. **قہر توڑنا** -తోడ్నా (ఉ) అత్యాగ్రహపడుట, నిప్పులు కురిపించుట, సంక్షోభముచేయుట, క్రౌర్యము జూపుట.

**قہراً** కహ్రన్ (అ) బలాత్కారముగా, బలవంతముగా.

**قہقہہ** కహ్కహ (పు) అట్టహాసము, పకపక, వికవిక, పెద్దగానవ్వుట, పరిహాసము, వేళాకోళము, అపహాస్యము. **قہقہہ مارنا** -ఉడానా-మార్నా (ఉ) పకపక నవ్వుట, పరిహసించుట, వేళాకోళముచేయుట,

**قہوہ** కహ్వ (అ.పు) కాపివిత్తులు, **قہوہ دان** -దాన్ (పా) కాపిచెంబు, కాపి గిండి.

**قے** కై (అ. స్త్రీ) వమనము, వాంతి, ఓకరింత, ఓకర.

**قیاس** కియాస్ (అ.పు) అనుమానము, ఊహ, భావన, తలంపు, అభిప్రాయము, ఉజ్జ, అంచెన; బుద్ధి, తెలివి, జ్ఞానము, వివేకము, విచారము, ఆలోచన, యోచన, నమ్మకము, బహుశోభావము, ఇంగితజ్ఞానము. **قیاس سے باہر** -సేబాహర్ (ఉ) దురూహ్యము, బుద్ధికి తోచనిది, అగమ్యగోచరము, అగమ్యము, ఊహింపరానిది, తలపశక్యము కానిది. **قیاس میں آنا** -మేఆనా (ఉ) ఊహాయోగ్యముగా నుండుట, ఊహ్యముగానుండుట, ఊహకువచ్చుట, ఊహకుఅందుట.

**قیاسی** కియాసీ (అ) శాస్త్రీయమైన, అనుమానగోచరమైన, అనుమానికమైన, ఊహితమైన, భావితమైన, మానసికమైన, మనఃకల్పితమైన, మనోరథసృష్టియైన, భావించిన, తలంచిన, అనుకొనిన.

**قیافہ** కియాఫ (అ.పు) రూపురేఖలు, ముఖవైఖరి, ఇంగితము, రూపము, ఆకారము, ఆకృతి, లక్షణములు; ఊహ, భావన, ఉజ్జ, అనుమానము, బుద్ధి, తెలివి, వివేకము, ఇంగితజ్ఞానము; శకునము, సగినము, ప్రశ్న, సాముద్రికము (శాస్త్రము), ముఖసాముద్రి

కము. قیافہ شناس -షనాస్ (పా) ముఖసాముద్రిక శాస్త్రజ్ఞుడు. قیافہ شناسی -షనాసీ (పా) సాముద్రిక శాస్త్రజ్ఞానము, ముఖసాముద్రిక జ్ఞానము.

**قیام** కియామ్ (అ.పు) నిలుచుట, నిలుకడ, నిలుపు, ఉనికి, స్థితి, స్థావరము, విరామము, స్థాయి, స్థిరత, స్థిరత్వము, దృఢత్వము, గట్టి, దిట్టము, తాయి, నివాసము, అచపలత్వము, నిశ్చలత, అచలత్వము, చాలాకాలముఉండుట. **قیام پذیر** - పిజీర్ (పా) నిలుకడగల, స్థిరమైన, స్థావరమైన, వాసముచేసిన, నివాసమైన, దిగిన, బసచేసిన. **قیام کرنا** -కర్నా(ఉ) దిగుట, బసచేయుట, నివాసముచేయుట, ఉండుట, నిలుచుట.

**قیامت** కియామత్ (అ. స్త్రీ) లేచినిలుచుట, నిలువుగానుండుట, నిలుచుట, ఉద్ధానము, పునరుద్ధానదివసము అనగా మహమ్మదీయమతానుసారము చచ్చినవారందరు పాపపుణ్య వివేచనార్థము లేచుదినము, అత్యంతకాలము, ప్రళయకాలము, వినాశకాలము, యుగాంతరము, దీర్ఘకాలము, సృష్టిస్థితిపర్యంతమైన కాలము, ఆచంద్రతారార్క కాలము, నాశము. మృత్యువు, మరణము, చావు, అద్భుతము, విపరీతము, చిత్రము, ఆపద, విపత్తు కీడు, ఆగ్రహము, క్రోధము, గంద్రగోళము, సంక్షోభము, కలత, అల్లకల్లోలము, కోలాహలము, క్రౌర్యము, ఉపద్రవము, అసాధ్యము. ప్రళయము, దురంతము, అనిష్టము.

**قید** కైద్ (అ. స్త్రీ) బంధనము, బంధము, చెర, బందె, అడ్డము, అడ్డంకి, నిరోధము, అభ్యంతరము, కట్టు, ఆటంకము, అదుపు, నియోగము, నిర్బంధము, నిబంధనము, నియమము, కట్టుదిట్టము, మేర, పరిమితి. మితము, పరిమాణము. **قیدخانہ** -ఖానా (పా) బంధనాలయము, చెరసాల, కారాగృహము, చెర. బందె. **قید رہنا** -రహ్నా(ఉ) చెరపడుట, చెరలోనుండుట. **قید کرنا** -కర్నా (ఉ) చెరపెట్టుట, చెరలోపెట్టుట, బద్ధునిచేయుట, అడ్డపెట్టుట, పట్టుకొనుట, నిరోధించుట. **قید لگانا** -లగానా (ఉ) నిబంధనచేయుట, కట్టుదిట్టముచేయుట, నియమమేర్పరచుట, నిరోధించుట, మితిమేర్పరచుట. **قید ہونا** -హోనా-చెరపడుట, చెరలోపడుట, బద్ధుడగుట, పట్టుపడుట.

**قیدی** కైదీ (అ.పు) బందికాడు, బద్ధుడు, చెరలోనున్నవాడు, కారాగృహవాసి, శిక్షితుడైనయపరాధి, పట్టుపడినవాడు, నేరస్థుడు.

**قیر** కీర్ (అ.పు) శిలాజితు, నల్లశిలాజితు, నల్లనిది.

**قیراط** కీరాత్ (అ.పు) నాలుగువడ్లగింజల యెత్తు, ఇరువదినాల్గవపాలు.

**قیصر** కైసర్ (రు.పు) గర్భవతిచనిపోగా గర్భముఛేదించి తీసినశిశువు, రూమాదేశము యొక్క మొదటిచక్రవర్తిపేరు, సామాన్యముగా చక్రవర్తి, రారాజు, సార్వభౌముడు.

**قیطان - قیطون** కైతాన్ - కైతూన్ (అ. స్త్రీ) సరిగపట్టునారము, అంచు.

**قیف** కీఫ్ (అ.పు) గరాటము, గరగట్టము,

బుడ్లలో ద్రవపదార్థములు పోయుటకుపయోగించుసాధనము.

**قیل** కీల్ (అ.స్త్రీ)వచనము, మాట. **قیل و قال** -వ్‌కాల్ (అ) సంభాషణము, ప్రసంగము, మాటముచ్చటలు, వివాదము, తర్కము, ఘర్షణ, జగడము.

**قیلولہ** కైలూల (అ.పు) మధ్యాహ్ననిద్ర. పగటిభోజనానంతరముపోవునిద్ర, పగటికూరుకు. **قیلولہ کرنا** -కర్నా (ఉ) పగటికూరుకుపోయుట, పగటిభోజనానంతరము నిద్రించుట.

**قیمت** కీమత్ (అ. స్త్రీ) క్రయము, విలువ, వెల, మూల్యము,ధర,గౌరవము. **قیمت لگانا** -లగానా (ఉ) ధరకట్టుట, ధర వేయుట, వెలకట్టుట, ధర చేయుట. **قیمت چکانا** -చుకానా (ఉ) ధర తెంచుట, వెలతీరుమానము చేయుట. **قیمت ٹھیرانا** -ఠైరానా (ఉ) వెల లేక ధరనిశ్చయించుట.

**قیمتی** కీమతీ(అ)మూల్యమైన, విలువగల, బహుమూల్యమైన, వెలపొడుగైన, హెచ్చువెలగల, అనర్ఘ్యమైన, మేలుతరమైన, ఘనమైన, ఉత్కృష్టమైన, ప్రియమైన, శ్రేష్ఠమైన, గౌరవనీయమైన.

**قیمہ** కీమ(అ.పు) చెక్కుచేసిన మాంసము, ముక్కలు ముక్కలుగాచేసిన మాంసము. **قیمہ کرنا** -కర్నా (ఉ)చెక్కుచేయుట, చెండాడుట, ముక్కలుగానరుకుట. **قیمہ کیمہ کرنا** -కీమకర్నా(ఉ) చెండుచెండాడుట, తుత్తునియలుగానరుకుట, చెక్కుచేయుట.

**قینچی** కైన్‌చీ (తు. స్త్రీ)కృపాణి, కృపాణిక, కర్తరి, కత్తెర, కత్తెరకోల,కటకటాకమ్ములు, కటకటాలు, కత్తెరకంచె, కత్తెరతడక, కత్తెరవాసము, కత్తెరగుంజలు, **قینچی باندھنا** -బాంధ్నా (ఉ) కాళ్లుపేనవేయుట, (ఎదుటివానికాళ్లలో) ఒకజట్టిపట్టు. **قینچی سی زبان چلنا** -సీజబాన్‌చల్నా (ఉ) మిగులధారాళము గామాట్లాడుట, మిగుల చురుకుగా లేక వడిగా మాటలాడుట. **قینچی لگانا** -లగానా (ఉ) కత్తించుట, కత్తెరకంచె కట్టుట, కత్తెరతడకట్టుట, కటకటాలుకట్టుట లేక పెట్టుట.

**قیوم** కైయూమ్ (అ) శాశ్వతమైన, స్థిరమైన, నిలుకడగల; ధరకట్టువాడు, ధరవేయువాడు, అంచెనగాడు; ఈశ్వరుడు.

---

# ک

**ک** కాఫ్ (అ.పు) ఇదిఉరుదూవర్ణమాలలో నిరువదియొనిమిదవ యక్షరము, పారసీకములో నిరువదియైదవది, అరబ్బీవర్ణమాలలో ఇరువదిరెండవది, అరబీవర్ణసాంఖ్యములో దీనిసంఖ్య ఇరువది.

**کا** కా (హి) సంబంధబోధకమైన, షష్టివిభక్తి ప్రత్యయమై "యొక్క" అను నర్థమును నిచ్చును, విశేషణ ప్రత్యయమై విశేష్యములను విశేషణములుగామార్చి, అయిన, కల, తో, చేసిన, కారకమైన అను మొ॥

ప్రత్యయముల యర్థమునిచ్చును, భావార్థ కక్రియారూపములతోఁజేరిభవిష్యదర్థకము లుగా మార్చును.

کابر కాబర్ (హి.పు) కర్బురవర్ణము, కప్పిర వర్ణము, నలుపుతెలుపునుగలిసిన వర్ణము, పొట్టపైని తెల్లమచ్చలుగల యొకవిధమైన నల్లపిట్ట, కప్పిరిగాడనుపిట్ట; మచ్చలుగల, ఇసుకకలిసిన మట్టిగలభూమి.

کابر కాబిర్ (అ) మహత్తైన, గొప్ప,దొడ్డ, పెద్ద, దండి, ఘనమైన.

کابک కాబుక్ (పా.స్త్రీ) విటంకము, కపోతపాలిక, పావురములుండుటకై చేసినకొయ్యచట్టము, పావురములగూడు.

کابلی కాబులీ (పా) కాబూలునగరవాసి, కాబూలునగర సం॥, మిక్కిలి ఎగురగల ఒకమేలుజాతిపావురము.

کابوس కాబూస్ (అ.పు) నిద్రలోఁగుండెలపైనెవరో కూర్చున్నట్లు బరువై భయము కలుగునొకవ్యాధి.

کابوک కాబూక్ (పా. స్త్రీ)చూడుکابک

کابین కాబీన్(అ.పు) ఉంకువ, ఓలి, వివాహవిషయమై పెండ్లికొడుకు పెండ్లికూతురికిచ్చుటకు ఒప్పుకొనినద్రవ్యము. کابین نامہ -నామ (పా.పు) ఓలిపత్రము, ఉంకువపత్రము.

کاپور కాపూర్ (హి) కర్పూరము. کاپور کچری -కచ్రీ (హి) సీమకిచ్చిలిగడ్డలు, సీమకచోరము.

کاتا కాతా (హి) వడికినది, దారము. (పు) వెదురుకోయుకత్తి, బురుడీకత్తి.

کاتک కాతిక్ (హి.పు) కార్తిక మాసము. کاتک کی کتیا -కీకుతియా (హి) చిత్త కార్తెకుక్క, జంతులాడి.

کاتب కాతిబ్ (అ.పు) లేఖరి, వ్రాతగాడు.

کاتنا కాత్నా (హి) దారము వడుకుట.

کاتها కాథా (హి.పు) నాగటికొఱ్ఱు మిక్కిలి లోతునకుకూరుకపోకుండపెట్టు ఇనుపబిళ్ల.

کاتی కాతీ (హి.స్త్రీ)శాణము,సవాణము, అగసలవాని చిన్నకత్తెర; దారము వడుకు ఆడుది.

کاٹ కాట్ [హి.స్త్రీ]ఖండనము, ఛేదనము, కోఁత, నరుకు, కాటు, గాయము, తుంపుడు, తుంపు, చీలిక, పేడు, తునక, చెక్క, బద్ద; తెంపు, తీవ్రము, వేగము; పగ, ద్వేషము, వైరము, కంటకము, ప్రతికూలము, విరుద్ధము, చెడుగు; త్రోపుడు, తీసివేత, లోపము, కొట్టివేత, అంచు,ఓర, నష్టము, కోఁతలు, సవరణ, ఉపాయము, యుక్తులు, పన్నుగడలు. کاٹ پهانس -ఫాఁస్ (హి. స్త్రీ) సవరణలు, తరుగులు, త్రోపుడులు, కోఁతలు, టక్కులు, మోసము, కొండెతనము (అనగా కొండెములు చెప్పి చెడుగు చేయుట). کاٹ چهانٹ-کوٹ -ఛాఁట్ -కూట్ (హి.స్త్రీ) కోఁతలు, తరుగుడులు, చక్కజేయుట, కోయుటచెక్కుట మొ॥ పనులు, సవరణలు, ఎచ్చుతగ్గులు,త్రోపుడులు,తరుగులు, తుక్కుడు, తుక్కు, నుగ్గు.

کاٹا కాటా (హి) కాటువేసిన, కరచిన,(పు) కాటు, గాయము.

کاٹنا కాట్నా (ఉ) ఛేదించుట,ఖండించుట, కోయుట, నరుకుట; తెంచుట; కరచుట, కాటువేయుట; గాయముచేయుట,ఖండము చేయుట; తొలగించుట, తప్పించుట,

తోసినతప్పించుట; ముఖము తప్పించుట; బిడియపడుట, లజ్జించుట, పరిత్యజించుట, వర్జించుట.గడపుట, జరపుట, అనుభవించుట. తీరుమానముచేయుట, తీర్చుట,పగ తెగించుట, కడపుట, అడ్డమువచ్చుట, అడ్డుకట్టుట,చెట్లు మొ॥నవి కొట్టుట,త్రోవ మొ॥నవి తీయుట, తరుగుయిచ్చుట, అడ్డ మాటలాడుట, కొట్టివేయుట, ఆక్షేపించుట, వాదముఖండించుట, చీట్లాటలో చీట్లుకోయుట, చెల్లుపెట్టుట, కోసివేయుట, తోసిపుదుపెట్టుట, తీసివేయుట.

**کاٹھ** కాఠ్ (హి.పు) కొయ్య, కఱ్ఱ, కట్టె, మొద్దు, తుండు, బొండకొయ్యలు,మోటువాడు, కఠినమైన, కష్టమైన. **کاٹھ کا اُلو** -కా ఉల్లూ (హి.పు) శుంఠుడు, మోటు మొద్దు, మూఢుడు. **کاٹھ کی پتلی** -కీ పుత్లీ (హి) కొయ్యబొమ్మ,పరాధీనుడు. **کاٹھ کباڑ** -కబాడ్ (హి.పు) కొయ్య కొఱతము, చేటుపీట, పనికిమాలిన వస్తువులు. **کاٹھ کٹول بانسلی** -కటువ్వల్ బాఁస్లీ (హి.పు) వాగుడుమూతవంటి ఒక యాట. **کاٹھ ہوجانا** -హోజానా(హి) మాన్పడుట, జాపడుట, బిచ్చపడుట, కట్టెపారుట.

**کاٹھی** కాఠీ (హి. స్త్రీ) కాయపుష్టి, దేహ పటుత్వము, కాయము, కొయ్య మొ॥ వానితోచేసిన ఆకృతి, చట్టము, కత్తిఒఱ, ఖడ్గకోశము, తోలుపల్లము, పల్యాణము, పల్లన.

**کاج** కాజ్ (హి.పు) కార్యము,పని,శ్రాద్ధము, తోలిక (చొక్కాయి గుండీలు చొనుపు రంధ్రము).

**کاجل** కాజల్ (హి.పు) కజ్జలము, కాటుక, దీపపు మసి. **کاجل پاڑنا** -పాడ్నా (హి) దీపమునుండి కాటుకపట్టుట. **کاجل کی کوٹھڑی** -కీ కోఠ్డీ (హి. స్త్రీ) నింద్యస్థానము, అపవాదస్థానము,అవమానము తెచ్చునది. **کاجل گھلانا - لگانا** -ఘులానా -లగానా (హి) కాటుక పెట్టుకొనుట.

**کاجو** కాజూ (హి.పు) జీడిమామిడి, ముంతమామిడి. **کاجو بھجو** -భుజూ (ఉ) అతిసున్నితమైన, పనికిమాలిన, కాయికమైనది, చేయుటకుబాగాయుండిత్వరలో చెడిపోవునది.

**کاچ** కాచ్(హి, స్త్రీ)కాచము,అద్దము,గాజు. **کاچ کوری** కాచ్‌కోరీ (హి) పిల్లదుగు, మూలగొండి.

**کاچھ** కాఛ్ (హి. స్త్రీ) కచ్చము, కచ్చ, గోచి, కాసె, జేబిలాగు. చేల్లడము, అర్ధోరుకము,కాసెకోక; మొల, కటిప్రదేశము, వేషము, ఆకారము, అలంకారము.

**کاچھا** కాఛా (హి.పు) అర్ధోరుకము, చేల్లడము, కాసె.

**کاچھن** కాఛన్ (హి. స్త్రీ) తోటది, కూరగాయలమ్ము యాడుది.

**کاچھی** కాఛీ (హి. స్త్రీ) తోటవాడు, కూరకాయలమ్మువాడు, ఒకజాతి.

**کاچے** కాచే (హి.పు) పాలజావ, పాలలో నానినరొట్టె.

**کاخ** కాఖ్ (పా.పు) హర్మ్యము, భవనము, నగరు, రాజభవనము.

**کادی** కాదీ (పా) మొగిలిచెట్టు.

کاذب కాజిబ్ (అ)అసత్యమైన, కల్లయైన, కల్లరి, దబ్బరకాడు.

کار కార్ (పా.పు) కార్యము, క్రియ, పని, చేత, కర్మ, చేష్ట, కృత్యము. ఉద్యోగము, వ్యాపారము,విద్దె,విద్య, నేర్పు, పనితనము, వృత్తి, పాటు, కష్టము, కొలువు, వ్యవసాయము,కృషి,ప్రయోజనము,ఉపయోగము, సంబంధము,వ్యాజము,జగడము,పోరాటము విషయము, వ్యవహారము. کار آزمودہ - کردہ -ఆజ్మూద-కర్ద (పా) అనుభవశాలియైన, అనుభవముగల. کار آمد -ఆమద్- ఫలకారి, ఉపయోగకరమైన, లాభకరమైన, పనికివచ్చెడు, సార్థకమైన. کاربار -బార్ (ఉ.పు) కార్యభారము, పనిపాటలు, వ్యవహారము, పని, ఉద్యోగము, వ్యాపారము. کارباری -బారీ (పు) పనివాడు, కార్యదర్శి, నిర్వాహకుడు, వ్యవహారి, వ్యాపారి, వర్తకుడు. کاربراری -బరారీ (పా. స్త్రీ) కార్య నిర్వాహకము. کاربند ہونا -బంద్ హోనా (ఉ) ఆచరించుట, అనుష్ఠించుట, ప్రకారము నడచుకొనుట, నెరవేర్చుట, జేరపుట, అనువర్తించుట, ఆజ్ఞానుసారము వర్తించుట. کارپرداز -పర్దాజ్ (పా) కార్య నిర్వాహకుడు, కార్యదర్శి, పనివాడు. کارپردازی -పర్దాజీ (పా. స్త్రీ) కార్యనిర్వాహము,కార్యదర్శిత్వము. کارچوب -చోబ్ (పా.పు) మగ్గపుకోలలు, మగ్గపు చట్టము, మగ్గము, సరిగపనిచేయు కొయ్యచట్టము, సరిగపని. کارچوبی -చోబీ (పా. స్త్రీ) సరిగపని, సరిగపనిచేసిన. کارخانہ -ఖాన (పా.పు) కార్య శాల, కర్మాగారము, కార్యాలయము, కార్యస్థానము, కొట్టు, ఆవేశనము, పట్టడ, వ్యవహారస్థానము,పని పాటలు, వ్యవహారము, ఉద్యోగము, సాలెవాండ్రు మగ్గాలిపేట, సరిగమగ్గము, మగ్గము, పనితనము. کارخانۂ الٰہی -ఖానఎ,ఇలాహీ (పా.పు) ఈశ్వరసృష్టి, ప్రపంచము, ఈశ్వరమాయ, ఈశ్వరకృత్యము, సృష్టి. کارخیر -ఎ,ఖైర్ (పా.పు) సత్కార్యము, కన్యాదానము, పిల్లపెండ్లి. کاردار -దార్ (పా.పు) కార్యనిర్వాహకుడు. కార్యదర్శి, పనివాడు, అధికారి, ఉద్యోగస్థుడు. کاردان -దాఁ (పా) అనుభవశాలి, కార్యానుభవము గలవాడు, పరిమంతుడు, ప్రవీణుడు. నేర్పరి, కార్యజ్ఞానముగలవాడు, పనితెలిసినవాడు. کارروائی -రవాయీ (పా. స్త్రీ) వ్యవహారము, కార్యనిర్వర్తనము, చర్య,కార్యనిర్వాహము, పని జేయుగుట లేక నడచుట లేక సాగుట, ఆచరణము, పనిజేరపుట, చర్యనడపుట, చర్య, కట్టుదిట్టము, ప్రయత్నము, ఏర్పాటు, ఉపాయము, కార్యసాధనము. کارزار -జార్ (పా. స్త్రీ) యుద్ధము, జగడము, పోరాటము. کارساز -సాజ్ (పా) ప్రవీణుడు, నేర్పరి, పని వాడు, ఈశ్వరుడు. کارسازی -సాజీ (పా. స్త్రీ) పనితనము, నేర్పు,విద్య,విద్దె, యుక్తి, ఉపాయము, చాతుర్యము, ప్రవీణత, కుయుక్తి, మోసము, పోకిరితనము. کارستانی -సితానీ (పా. స్త్రీ) ప్రవీణత, నేర్పు, నిపుణశక్తి, విద్దె, ఉపాయము, నిపుణత, కుయుక్తి. [illegible]

మోసము, జిత్తులు, పోకిరితనము. **کارشناس** -షనాస్ (పా.పు) అనుభవజ్ఞుడు, అనుభవశాలి, అనుభవముగలవాడు. **کارفرما** -ఫర్మా (పా.పు) నాయకుడు, అధికారి. **کارکن** -కున్ (పా.పు) కార్య నిర్వాహకుడు, కార్యదర్శి, పనివాడు, రాయసగాడు, లేఖరి, వ్రాతగాడు. **کارگاہ** -గాహ్ (పా.పు) కార్యస్థానము, పట్టెడ, సాలెవాండ్రమగ్గపుగుంట. **کارگر** -గర్ (పా) కార్యకారి, ఉపయోగకరమైన, గుణకరమైన, లాభకరమైన, పనికివచ్చు, ఫలవంతమైన, సఫలమైన, సార్థకమైన, చంపెడు, హానికరమైన, ప్రాణాంతకమైన, **کارگزار** -గుజార్ (పా) బాగా పనిచేయువాడు, పనిమంతుడు, పనివాడు, విధేయుడు, పరిచారకుడు, సేవకుడు.

**کارگزاری** -గుజారీ (పా.స్త్రీ) కార్య నిర్వాహము, పరిచర్య, కొలువు, సేవ, ఆజ్ఞానువర్తనము, కార్యసాధనము, పనిలో నేర్పు, పనిమంతునితనము, కార్య నైపుణ్యము. **کارنامہ** -నామ (పా.పు) యుద్ధచారిత్రము, చరిత్రము, చరితము, ఉద్యోగచర్య, శూరకృత్యము, శూర చరితము, పనితనముచేపుటకువ్రాసిన పటము మొదలగునవి, ఉద్యోగచర్య (పుస్తకము).

**کارتوس** కార్‌తూస్ (ఇం.పు) గుండ్లతూటము.

**کارج** కారజ్ (హి.పు) కజ్జము, కార్యము, పని.

**کارد** కారద్ (పా.పు) కత్తి, సురియ.

**کارڈ** కారడ్ (ఇం.పు) దళసరి కాకితము, అట్టము, అత్తడము, పత్రము; అట్టచీటి, తపాలచీటి, బిళ్లచీటి, (పోష్టుకార్డు).

**کارن** కారన్ (హి.స్త్రీ) కారణము, మూలము.

**کارندہ** కారింద (పా) పాటుపడువాడు, కూలివాడు, కార్యనిర్వాహకుడు, కార్యదర్శి, పనివాడు.

**کاروان** కార్వాఁ (పా.పు) సార్థవాహము, బిడారు, బాటసారులగుంపు. **کاروان سرائے** -సరాయె (పా.స్త్రీ) బిడారుల సత్రము, బాటసత్రము.

**کاری** కారీ (పా) ప్రాణాంతకమైన, చంపెడు, లోతైన, అపాయకరమైన.

**کاریگر** కారీగర్ (పా.పు) కారువు, పనివాడు, పనిమంతుడు, పంచాణుడు, చేతిపనివాడు, ప్రవీణుడు, నేర్పరి, నిపుణుడు, మాదిగవాడు, గొడారి, గొడగరవాడు, చెప్పులుకుట్టువాడు.

**کاریگری** కారీగరీ (పా.స్త్రీ) పనితనము; పంచాణము, నేర్పు, ప్రవీణత, నైపుణ్యము.

**کاڑا تنباکو** కాడాతంబాకూ (హి) కాడపొగాకు. (సారము.

**کاڑھا** కాఢా (హి.పు) కషాయము, క్వాథ

**کاڑھنا** కాఢ్నా (హి) బయటికి తీయుట, తీయుట, వ్రాయుట, తీసి వేయుట, గీచుట, కుట్టుట, చిత్రించుట, కాచుట.

**کاڑی** కాడీ (హి.స్త్రీ) పుడక, గడ్డి పుల్ల, పుల్ల. **کاڑی کھار** -ఖార్ (హి) కాడికారము.

**کاست** కాస్త్ (పా.స్త్రీ) నష్టము, తుట్టి, లోపము, తరుగు.

**کاسنی** కాస్నీ (పా.స్త్రీ) అడవిముల్లంగి, ఒకపుష్పము, ఒకజాతినూర్యకాంతపుష్పము, తెల్లికైనడూదావన్నె. **کاسنی کے بیج** -కే బీజ్ (హి) కాసినివిత్తులు.

**کاسہ** కాస (పా.పు) గిన్నె, కోర, కంచేను,

అక్షయపాత్ర), భోజనము, తుడుము. **کاسہ سر** -యెసర్ (పా.పు) కపాలము, తలపుర్రె. **کاسہ لیس** - లీస్ (పా) అంట్లునాకువాడు, పరాన్నభోజి, ఇచ్చె కాలమారి, లుబ్ధుడు, పిసినారి, తిండిపోతు.

**کاش** కాష్ (పా) అభిలాష సూచకావ్యయము, ఆహా (ఎంతబాగుండును), ఇట్లైన బాగుండును, అహా, అగుగాక.

**کاشانہ** కాషాన (పా.పు) కుటీరము, గుడిసె, పిట్టగూడు; చిన్నయిల్లు; రాజభవనము,

**کاشت** కాష్త్ (పా.స్త్రీ) కృషికర్మ, వ్యవసాయము, సేద్యము, దున్నెడుభూమి, సాగుబడి, పొలము, చేను, పైరుగల పొలము, పంటపొలము, పట్టాపొలము. **کاشتکار** - కార్ (పా.పు) పంట కాపు, సేద్యకాడు, కృషీవలుడు, కాపు, కాపువాడు. **کاشتکاری** - కారీ (పా.స్త్రీ) కాపుదనము, వ్యవసాయము, సేద్యము.

**کاشف** కాషిఫ్ (అ.పు) తెరచువాడు, విప్పువాడు, వివరించువాడు, తేటతెల్లముగా తెలియజేయువాడు.

**کاغد . کاغز** కాగద్ -జ్ (అ.పు) కాకితము, కాగదము, పత్రము, చీటి, పత్రిక, ఉత్తరము, జాబు. **کاغزباد ی . بادی** -బాద్ -బాదీ (పు) గాలిపటము, గాలిపడగ. **کاغز کے گھوڑے** - కేఘోడే (ఉ.పు) ఉత్తరములు, జాబులు, పత్రికలు, చీట్లు. **کاغز ملانا** - మిలానా (ఉ) లెక్క సరిచూచుట.

**کاغزات** కాగజాత్ (అ.పు) కాకితములు, (ఏ. వ کاغز).

**کاغزی** కాగజీ (అ.పు) కాకితములవాడు (అమ్మువాడు లేక చేయువాడు), లేఖరి, లెక్కలవాడు, రాయసగాడు, వ్రాతగాడు, తెల్లపావురము, సున్నితమైన, పలచని, కాకితపు, వ్రాతమూలమైన. **کاغزی بادام** -బాదామ్ (పా.పు) సన్నని చెక్కుగల బాదముకాయ.

**کافر** కాఫిర్ (అ.పు) కృతఘ్నుడు, నిజమును దాచువాడు, ధర్మభ్రష్టుడు, నాస్తికుడు, పాషండుడు, దుర్మార్గుడు, పోకిరి, అపవిత్రుడు, కఠినుడు; గాంధారదేశములోని యొక తెగవారిభాష లేక తెగవాడు. **کافر حربی** - ఎ,హర్బీ(అ) పగవాడగు పాషండుడు. **کافر زمی** - ఎ,జిమ్మి (అ) లోబడియుండి పన్ను చెల్లించు పరమతస్థుడు. **کافر کتابی** - ఎ,కితాబీ(అ) హజరత్ మహమ్మదుగారికి తక్కిన పైగంబరుల మతస్థులు. **کافر نعمت** - ఎ, నిఒమత్ (అ) కృతఘ్నుడు, మేలుమరచువాడు.

**کافور** కాఫూర్ (అ.పు) కర్పూరము. **کافور قیصوری** - కైసూరీ (పా) పచ్చకర్పూరము. **کافور کچری** - కచ్రీ (హి) సీమకచోరము. **کافور بتائی** - ఎ,బతాయీ (ఉ) బత్తాయి కర్పూరము. **کافور ولایتی** - ఎ, విలాయతీ (పా) సీమకిచ్చిలిగడ్డలు. **کافور چینی** - ఎ, చీనీ(పా) చీనాకర్పూరము. **کافور صورتی** - ఎ,సూరతీ (పా) సౌరాష్ట్రకర్పూరము, సూరతుకర్పూరము. **کافور ہونا** -హోనా (ఉ) అదృశ్యమగుట, మటుమాయమగుట; నష్టమగుట.

**کافوری** కాఫూరీ (అ) కర్పూరము సం॥.

**کافی** కాఫీ (ఇం. స్త్రీ) పేరు **قهوه**

**کافی** కాఫీ (అ) చాలుకొలది, కావలసినంత, చాలినంత. (స్త్రీ) కాపిరాగము, పద్యము, పదము. **کافی ووافی**-వవాఫీ (అ) చాలియెక్కువగునంత, విస్తారము, పుష్కలము, అమితము. **کافی هونا**-హోనా (ఉ) చాలుట, సరిపోవుట.

**کاک** కాక్ (ఇం.పు) సింధూరవృక్షభేదము, ఒక విధమైన వావిలిచెట్టు, ఆట్టి వృక్షపు తాటుతో చేసిన బిమ్మె, బిరడ, దట్టము.

**کاک** కాక్ (పా.పు) రొట్టెబిళ్ల, పూరిక.

**کاک ماری کےبینج** కాక్‌మారీకేబీంజ్ (హి) కాకచంపవిత్తులు, కాకమారివిత్తులు.

**کاکا** కాకా (పా.పు) అన్న, జ్యేష్ఠుడు, తమ్ముడు, ఇంటపుట్టిన పాత సేవకుడు, పిల్లలముద్దుపేరు.

**کاکا** కాకా (హి.పు) తండ్రిసోదరుడు, పినతండ్రి, పెత్తండ్రి. **کاکاتوآ - کاکاکوا** -తూఆ -కవ్వా (హి.పు) ఒకజాతి తెల్ల చిలుక.

**کاکریزی** కాక్‌రేజీ (హి) ధూమ్రవర్ణమైన, కొంచెమునీలమైన (వర్ణము).

**کاکڑا** కాక్డా (హి.పు) మనుబోతు, దుప్పి వంటి ఒకజంతువు. **کاکڑسینگی - کاکڑاسینگی** - సీంగీ (హి) ఒకవిధమైన మెలిక లుగల చిక్కుడు వంటిమందుకాయ; బట్టపేలిక మొ॥ పేనిచేసినదివిటీ; నులిదివిటీ; నులికాయ, (మందులలో వేయుదురు) పిన్నపాపర.

**کاکل** కాకుల్ (పా. స్త్రీ) ముంగురులు, అలకము, భ్రమరకములు; గుజ్జుపుజాలు,

**کاکلود - کاکلوت** కాక్‌లూద్ - త్ (హి. స్త్రీ) మమత, ప్రేమ.

**کاکی** కాకీ (హి. స్త్రీ) పినతండ్రిలేక పెత్తండ్రిభార్య, ఆడపిల్లలముద్దుపేరు.

**کاگ** కాగ్ (హి.పు) కాకము, కాకి, చిరునాలుక, కొండనాలుక.

**کاگ** కాగ్ (ఇం.పు) బోడు. **کاک**

**کاگا-کگوا-کگوا** కాగా -కగ్రువా - కగ్వా (హి.పు) కాకి, కాకము. **کاگور**-వర్ (హి) కాకపిండము, శ్రాద్ధాదులలో కాకులకు వేయుఅన్నము. **کاگاباسی موتی** - బాసీమోతీ (హి.పు) ఒకవిధమైననల్లనిముత్తెము. **کاگارول** - రౌల్ (హి. స్త్రీ) కాకులయఱపు, కలకలము, అల్లరి, గోల్లు.

**کال** కాల్ (హి.పు) కాలము, ఋతువు, మృత్యువు, కాలసర్పము, క్షామము; కఱవు, కాటకము, నల్లని, చాలా కాలపు, దొడ్డ, దండి, రేపు. **کال بنجر** - బంజర్ (హి. స్త్రీ) చిరకాలపుబీడు. **کال کا توتا یامارا** -కాటూటా యామారా (హి) కఱవుగొట్టువాడు. **کال کوٹهڑی** - కోఠ్డీ (హి. స్త్రీ) చీకటిగది, చెరకొట్టు.

**کالا** కాలా (హి) నల్లని, నల్లనివాడు, తాచుపాము, కాలము; మిక్కిలి, చాల. **کالا اکولا** -అక్కోలా (హి) అంకోలము, నల్లఊడుగ చెట్టు. **کالا بال** - బాల్ (హి.పు) శమ్మము, తుచ్ఛము. **کالا بچهناگ** -బఛ్‌నాగ్ (హి) వసనాభి. **کالا بهجنگ. کوئلا** - భుజంగ్ - కోయిలా (హి) కాఱునలుపైన. **کالا پانی** -పానీ (హి.పు) ద్వీపాంతరము,

నొచ్చిలి. کالے کوس . کوسوں -కాలె కోస్-కోసూఁ(హి.పు)మిక్కిలి దూరము.
کالی مٹی -మిట్టీ (హి.స్త్రీ) నల్లబంక మన్ను, నల్లరేగడిమన్ను. کالی مرچ -మిర్చ్ (హి.స్త్రీ) మిరియాలు, ఊసలు.
کالے منہ اندھیرے -కాలేముఁహ్ అంధేరే (హి) వేకువజామునే,కొంచెము చీకటియుండగ, బాగా తెల్లవారకముందే, ఉషఃకాలమందు. کالی ہانڈی -హాండీ (హి.స్త్రీ) అపవాదము, నింద, ఆరడి. (వాడు.

کالیا కాలియా (హి) కారునలుపైన ,నల్లని

کام కామ్ (పా.పు) అంగిలి, అంగుడు, తాలువు, గొంతు, నోరు, అభిలాష, ఉద్దేశము, సంకల్పము, ఆసక్తి, కోరిక, అభిప్రాయము.

کام కామ్ (సం.పు) కాముడు, మన్మథుడు, కామము, మోహము, కోరిక.

کام కామ్(హి.పు)కార్యము,పని, క్రియ,చేష్ట, కృతి, కృత్యము, వ్యవహారము, వ్యాపారము, ఉద్యోగము,వ్యవసాయము.పాటు, కష్టము, వృత్తి, విద్య, విద్దె, కామము, కోరిక, పనితనము, పంచాణము, చేతిపని, వర్తకము, అగత్యము, అవశ్యము,అక్కర, అభిప్రాయము, సంబంధము, ప్రయోజనము, ఉపయోగము, జరిగపని, అధికారము, కొలువు, విధి,నియోగము, ధర్మము, చేయవలసినది, చతురత, చాతుర్యము, ప్రవీణత, నేర్పు, నైపుణ్యము, సంభోగము, సంపర్కము. کام آنا -ఆనా (హి) పనికివచ్చుట, ఉపయోగ పడుట, సార్థకమగుట, తోడ్పడుట, సహాయపడుట, హాతుడగుట, చేచ్చుట, ప్రియమగుట, వ్యయపడుట, పనిపడుట. کام بر آنا -బర్ ఆనా (ఉ) పనిలేక కోరిక సఫలమగుట, کام بنا -బన్నా (హి) పని సాగివచ్చుట, కాలమనుకూలమగుట, పని లేక కోరిక నెరవేరుట, ఈడేరుట, కడతేరుట, కొనసాగుట. کام پڑنا -పడ్నా (హి) పనిపడుట, అక్కరపడుట, కావలసియుండుట. کام پر لگانا -పర్ లగానా (హి) పనిమీద పెట్టుట, పని గొనుట, పనిమీదఉంచుట, పనిలోచేర్చుట లేక ఉంచుట, వాడుట, ఉపయోగించుట. کام بٹانا ۔ بٹا لینا -బటానా. -బటాలేనా(హి) పనిపంచుకొనుట,పనిలోపాలుగొనుట, సహాయపడుట. کام پر لگنا -పర్ లగ్నా (హి) పనిలో చేరుట, పనిలోఉండుట, పనిపడుట. کام تمام کرنا -తమామ్ కర్నా (హి) పని ముగించుట, పనితీర్చుట, అంతమునొందించుట, చంపుట. کام تمام ہونا -తమామ్ హోనా (హి) పనిముగియుట లేకతీరుట, అంతమునొందుట, చచ్చుట. کام چلاؤ -చలావ్ (హి) పనిజేరిపెడు,పనికివచ్చెడు, పనిసాగించెడు, ఉపయోగకరమైన. کام چور -చోర్ (హి) పనిదొంగ, సోమరిపోతు, ఆలసుడు. کام دار -దార్ (హి) కార్యనిర్వాహకుడు, కార్యదర్శి, ఉద్యోగస్థుడు, అధికారి, పనివాడు, జరిగపనిచేసిన, పట్టుతో లేక జరిగతో చెట్లు పూలు మొ॥ కుట్టిన. کام دینا -దేనా (హి) అక్కరకువచ్చుట, పనికివచ్చుట, ఉపయోగపడుట, పనిజేరపుట, ఉద్యోగమిచ్చుట,పనియిచ్చుట,పనిపెట్టుట. کام رکھنا -రఖ్నా (హి) అక్కరగలిగియుం

డుట, కావలసియుండుట, కాబట్టియుండుట. **کام کے سر ہونا** -కె సర్ హోనా (హి) పనివడియుండుట, కార్యనిమగ్నుడగుట. **کام کا** -కా (హి) ప్రయోజనకరమైన, ఉపయోగకరమైన,ఉపయోగమైన, పనికివచ్చెడు, సార్థకమైన. **کام کاج** -కాజ్ (హి) పనిపాటలు, వ్యవహారము, వ్యాపారము, ఉద్యోగము. **کام کاجی** -కాజీ (హి) పాటుపడెడు, కష్టపడి పనిచేయు, పని పాటులుచేయు. **کام کرنا** -కర్నా (హి) పనిచేయుట,గుణమిచ్చుట, నేర్పుజూపుట,ఆకాంక్షతీర్చుట, పనితీర్చుట, చంపుట. **کام میں لانا** -మేంలానా (హి) ఉపయోగించుట, వాడుకొనుట. **کام میں لگانا** -మేంలగానా (హి) పని లోఉంచుట, పనిగొనుట. **کام نکالنا** -నికాల్నా (హి) పని నెరవేర్చుట, పనిజేయుట. లేక కొనసాగించుట, పనితీరుమానముచేయుట. **کام ہونا** -హోనా (హి) పనియుండుట, పనిపడుట, అగత్యముండుట, పనిముగియుట. పనియగుట, పనితీరుట, చెచ్చుట.

**کامران** కామ్రాన్ (పా) అభ్యుదయముగల, అదృష్టశాలి,ధన్యుడు, దశావంతుడు, జయవంతుడు.

**کامرانی** కామ్రానీ (పా. స్త్రీ) అభ్యుదయము, అదృష్టము, సుభాగ్యము. కార్యసిద్ధి, ధన్యత. (నాంచకేవము.

**کامری** కామ్రీ (హి. స్త్రీ) కంబళము,

**کامگار** కామ్గార్ (పా) అభ్యుదయముగల, అదృష్టశాలియైన, దశావంతుడు, కార్యసిద్ధిగలవాడు, జయవంతుడు, బలిష్ఠుడైన,

**کامل** కామిల్ (అ) పరిపూర్ణము, సంపూర్ణము, సమగ్రము, సాంతము, అంతయు, ఆసాంతము, లోపరహితము, శ్రేష్ఠమైన, ప్రవీణుడు, జ్ఞానియైనపండితుడు, విద్వాంసుడు, పారంగతుడు, బ్రహ్మజ్ఞాని, పరిపూర్ణుడు. (స్త్రీ). కామిలి.

**کامنی** కామినీ (హి. స్త్రీ) కామిని, సుందరి

**کامود** కామోద్ (హి. పు) కాంభోజి లేక కాంబోదిరాగము (మాలకంసు భేదము).

**کامونی-کمونی** కామూనీ-కమూనీ (యు. స్త్రీ) జీర్ణకారియగు జిలకరలేహ్యము; కామంచిచెట్టు.

**کامی** కామీ (అ) పనిగల, ఉద్యోగియైన, పనిగావున్న, పనికివచ్చెడు (హి) కాముకుడు.

**کامیاب** కామ్యాబ్ (పా) కృతార్థుడు. ధన్యుడు, జయముగల,కార్యసిద్ధిగల, సఫలమైన.

**کامیابی** కామ్యాబీ (పా. స్త్రీ) అదృష్టము, కార్యసిద్ధి, అభివృద్ధి, కృతార్థత, జయము, గెలుపు. సాఫల్యము, శ్రేయస్సు, అభ్యుదయము.

**کان** కాన్ (పా. స్త్రీ) ఖని, గని, లోహములుత్పత్తియగుస్థానము, ఉత్పత్తిస్థానము.

**کان** కాన్ (హి. పు) కర్ణము, చెవి, వినికి, కోసు, మంచము మొ॥ వానిపస, సొగసుగా సాగినమూల, లోపము, ధ్యానము, శ్రేష్ఠలక్ష్యము,ఆడువారియొక్క కర్ణభూషణము, (కమ్మలు) తాంబూరా మొదలగువానితీగ లుబిగించుకొయ్యచీల,అగ్రముతేచుస్థానం, త్రికోణాకృతియొక్క కర్ణము. **کان اڑنا-پھٹنا-پھوٹنا** -ఉడ్నా - ఫట్నా- ఫూట్నా (హి) అమితమైనధ్వనిచేత చెవులు

పెట్టుటు, గౌరవించుటు, సిగ్గుపడుటు, బిడియపడుటు. **کان کا پردہ**-కాన్ కా పర్దా(హి.పు) కర్ణభేరి, చెవిగూబ. **کان کا کچا**-కాన్ కా కచ్చా (హి) చెప్పుడుమాటలువినువాడు, సులభముగానమ్మువాడు. **کان کھڑے ہونا**-కాన్ ఖడే హోనా (హి) జాగ్రతపడుటు, మేలుకొనుటు, బెదరుటు, చెవులునిక్కుటు. **کان کھلنا** - ఖుల్నా(హి) జాగ్రతబడుటు, మేలుకొనుటు, గ్రహించుటు. **کان لگانا** - లగానా (హి) చెవియొగ్గుటు, శ్రద్ధతో వినుటు, చాటుగావినుటు. **کان لگنا - کان سے لگنا**-లగ్నా-సెలగ్నా (హి) చెవిచేరుటు, రహస్యముబాడుటు, గుసగుసలాడుటు, అంతరంగికుడగుటు, వద్దచేరుకొనుటు. **کان میل**-కాన్ మైల్(హి.పు)చెవిలోమురికి.గుబిలి. **کان میں اُنگلی دینا** -మేఁ ఉంగ్లీదేనా (హి) చెవులుమూసికొనుటు,వినకపోవుటు. **کان میں پارہ بھرنا** - మేఁ పారభర్నా (హి) చెవిలోసీసము కాచిపోయుటు. **کان میں تیل ڈالنا** -మేఁ తేల్ డాల్నా (హి) నోరుమూసికొనియుండుటు, ఊరకుండుటు, విననట్లుండుటు. **کان میں تیل ڈالکر یا روئی دیکر سو رہنا یا ہو بیٹھنا** -మేఁ తేల్ డాల్కర్ యా రూయీ దేకర్ సోరహ్నా యా హోబైఠ్నా (హి) పరాకుగానుండుటు, అశ్రద్ధగానుండుటు,అలక్ష్యముగానుండుటు, **کانوں کان**-కానోఁకాన్ (హి) బొత్తుగా తెలియకుండ, అతిరహస్యముగా. **کان ہونا** -హోనా(హి)మంచేము మొ॥నాలుగుమూలల వస్తువులయొక్క వసమూల-పొడుగు గానగుటు, ఏసపోవుటు, తెలియవచ్చుటు.

పడుటు, చెవులు గడియలు పడుటు. **کان اینٹھنا - مروڑنا - ملنا - اُکھاڑنا - اُمیٹھنا** - ఉఖాడ్నా - అమేఠ్నా - ఐఁఠ్నా - మరోడ్నా - మల్నా (హి) చెవులుపిండుటు, శాస్తిచేయుటు,చెవులుపిండుకొనుటు.వదలుకొనుటు, పరిత్యజించుటు. **کان آ لگنا**-కాన్ ఆలగ్నా రహస్యములాడలేక గుసగుసలాడ నారంభించుటు. **کان بال** -కాన్ - బాల్ (హి.పు) చెవులుకుట్టినపుట్టు వెంట్రుకలు తీయు కర్మము, చౌలము. **کان بجنا**-కాన్ -బజ్నా (హి) చెవులు గింగురుమనుచుండుటు,చెవులలోమోతలు మోగుచుండుటు. **کان بھرنا** -భర్నా(హి) దుర్బోధచేయుటు, చాడీలు చెప్పుటు. **کان بہنا**-కాన్ -బహ్నా(హి) చెవిలోచీము మొ॥ కారుటు. **کان پر جوں نہ چلنا** -పర్ జూఁనచల్నా (హి) చెవిమీద ఈగవాలకపోవుటు, చెవినపెట్టకపోవుటు, అలక్ష్యముచేయుటు, మాటవినకపోవుటు. **کان پڑنا - میں پڑنا**-కాన్-పడ్నా -మేఁపడ్నా(హి) చెవినిబడుటు, చెవిసోకుటు, వినబడుటు. **کان میں پھونکنا - کان پھونکنا**-మేఁఫూఁక్నా -ఫూఁక్నా (హి) చెవిలోఊదుటు, దుర్బోధచేయుటు, **کان جھکانا** -కాన్-ఝుకానా (హి) చెవియొగ్గుటు. **کان دباکر چلا جانا** -కాన్-దబాకర్ చలాజానా(హి)నోరెత్తకుండపోవుటు, నోరుమూసికొనిపోవుటు. **کان دبانا** -కాన్- దబానా (హి) నోరెత్తకపోవుటు, భయపడుటు. **کان دکھانا** -కాన్ -దిఖానా (హి)చెవిలోమైలతీయించుటు. **کان دھرنا - دینا** -ధర్నా-దేనా(హి) చెవియొగ్గుటు,శ్రద్ధతో వినుటు. **کان رکھنا** -కాన్ -రఖ్నా (హి)లక్ష్య

**کانا** కానా (హి) కాణము, ఒంటికంటి; పుచ్చిన, (కూరగాయమాత్రము), పురుగుబట్టిన, వంకరైన, సోగైన; బుద్ధిహీనుడు. **کانا باتی** -బాతీ (హి) చెవిలో రహస్యము చెప్పెదనని పిల్లలచెవిలో కుర్ అని ధ్వని నవ్వించుటు, రహస్యము, గుసగుసలు. **کانا پھوسی** -ఫూసీ (హి. స్త్రీ) గుసగుసలు.

**کانا کچھو** -కచ్చో (హి) శాకభేదము.

**کانا کوڈی** -కౌడీ (హి) గుడ్డిగవ్వ.

**کانا گوشی** -గోషీ (ఉ. స్త్రీ) రహస్యము, గుసగుసలు, చెవులుపిండుట.

**کانپ** కాంప్ (హి, స్త్రీ) గాలిపడకయొక్క విలువంపుబద్ద; అందమైన నమూను; పందియొక్క ముందటికోర; ఏనుగుయొక్క దంతము; మంచిసున్నము; దురదృష్టము.

**کانپنا** కాంప్నా (హి) కంపించుట, వడకుట.

**کانٹا** కాంటా (హి. పు) కంటకము, ముల్లు; త్రాసుముల్లు, పెద్దత్రాసు, చేపముల్లు, గాలము; పాతాళగరిగ, శూలము, శల్యము, జాతివారు భోజనముచేయుటలో వాడు కొనుముండ్లగరిటె, గుఱ్ఱపురౌతుల కాళ్ళ కుండు తన్నుముల్లులేక తోదనము, చేపముల్లు, పందిముల్లు, పక్షిఈక, కొలికి, ఇనుప కొండి లేక కొక్కెము, దోటీకోల యొక్కదోటి, కోడికాలియొక్క ఆరె బొట్టె, గడ్డిగాటమువేయుపండ్లకోల, గడియారము మొ॥ వానిముల్లు లేక సూది, గుణకారము మొ॥ వానిలబ్ధము సరిచూచుపద్ధతి, తక్కెడ, త్రాసు, పాడినాలుక, నాలిక బరుసు, విరోధి, వైరి, పగవాడు, శత్రువు, అభ్యంతరము, ఆటంకము, నిరోధము, బాధము, శల్యము, మిక్కిలిబక్కగాన్నవాడు, వక్కవాడు, వ్యథ, అనిష్టము, అసహ్యము, సహ్యము, పక్షిరోగభేదము. **کانٹے مات** -మాట్ (హి) ముండ్లతోకకూర.

**کانٹوں پرکھینچنا-میں گھسیٹنا** కాంటోంపర్ ఖీంచ్నా -మేఁఘసీట్నా (హి) ముండ్లమైకీడ్చుట, మిగులబాధ పెట్టుట, హింసపెట్టుట, మితిమీరిశ్లాఘించుటలేక ఆదర సత్కారము చేయుట.

**کانٹے پرکی اوس** కాంటేపర్కీఓస్ (హి. స్త్రీ) క్షణభంగురము, అశాశ్వతము.

**کانٹے پڑنا** కాంటేపడ్నా (హి) అతిదాహముచేత నాలుక ఎండుట.

**کانٹی سیمل** - కాంటీ - సేమల్ (హి) ముండ్లబూరుగచెట్టు.

**کانٹی** కాంటీ (హి. స్త్రీ) పనికిమాలినదూది, కట్టెత్రాసు, చిన్నత్రాసు, చిన్నకొక్కెము, కొలికి, కొండి, దొంగలసంకెలలు.

**کانجی** కాంజీ (హి. స్త్రీ) గంజి; పుల్లనీళ్లు, ఆవపుల్లనీళ్లు;

**کانجی هوس** కాంజీహౌస్ (ఇం. పు) పశువులబందెదొడ్డి, చెరకొట్టు, చెర, బందె.

**کانچ** కాంచ్ (హి. స్త్రీ) అద్దము, గాజు, గూడ, (రోగము).

**کانچو** కాంచూ (హి. పు) గూదవిడిచినవాడు, గుదసంపర్కము చేయువాడు. (గడ్డ.

**کاندا** కాందా (హి. పు) ఉల్లిగడ్డ, నక్కఉల్లి

**کاندها** కాంధా (హి. పు) బుజము, స్కంధము.

**کاندهی دے جانا** కాంధీ దేజానా (హి) తప్పించుకొనిపోవుట.

**کانڑا-کانڑاں-کانڑی** కాండా - కాండాం -కాండీ (హి) కోనుడు **کانا**

**کانس** కాంస్ (హి. స్త్రీ) ఒకవిధమైనపొడుగాటిగడ్డి, జొండము, ప్రకాశము, కాంతి.

**کانس میں تیرنا** - కా-మెతీర్నా (హి) చిక్కులలోనుండుట, మోసపడుట.

**کانس** కాంస్ (ఇం. స్త్రీ) గోడబొద్దు,బోదె, గోడ, అంచు.

**کانسا** కాంసా(హి.పు) కాంస్యము, కంచు, రాజాన్నము, మంచిభోజనము.

**کانسہ** కాంస (ఉ.పు) చూ کاسہ

**کانسہ گر** -గర్ (ఉ.పు) కంచరివాడు.

**کانسی** కాంసీ [హి.స్త్రీ] కాంస్యము, కంచు.

**کانگرس** కాంగ్రెస్ (ఇం.స్త్రీ)సమాజము, సభ, సంఘము, మహాజనసభ.

**کانگڑی - کانگری** కాంగ్రి - కాంగ్డీ (హి.స్త్రీ) రొమ్ముకుంపటి, చిన్నకుంపటి.

**کانگن** కాఙ్గన్ (హి.పు) కంగుణి,కొఱ్ఱలు.

**کانور** కాంవర్ (హి.స్త్రీ) కాశిగంగతెచ్చు కావడి, కాశీకావడి.

**کانورا** కాంవ్రా (హి) మిక్కిలిగంద్రగోళ మగుటచే కలవరపడిన; భ్రమజెందిన.

**کانوری** కాంవరీ (హి.పు) కాశిగంగకావడి తెచ్చువాడు.

**کانی** కానీ (హి.స్త్రీ) ఒంటికంటియాడుది, (పా) ఖనిజము, గనినుండిత్రవ్వినది.

**کانی زہرمہرہ** కానీజెహ్రెమొహరా (ఉ) ముండ్లబూరుగచెట్టు.

**کاو** కావ్ (పా.స్త్రీ) త్రవ్వుడు, కుళ్లగింపు, రేపుట, కెలకుడు, గిరుట, గీరుట, ప్రయత్నము, పరిశోధనము.

**کاوا** కావా(ఉ.పు)గుడిత్రిప్పుట(గుఱ్ఱమును).

**کاوا دینا** కావా దేనా (ఉ) గుఱ్ఱమును గుడిత్రిప్పుట, టుక్కుచేయుట.

**کاور** కావర్ (హి.స్త్రీ) కాశీకావడిబుట్ట.

**کاوش** కావిష్ (పా.స్త్రీ) ఖననము, త్రవ్వుడు, కుళ్లగింపు, ఏమియుతోచనప్పుడు నెత్తిగోకుకొనుట,శోధ,అన్వేషణము, వెదకుట, కావేషము, వైరము, పగ, ద్వేషము.

**کاوک** కావక్ (హి) బోలు, గుల్లగానున్న, వికారమైన, పనికిమాలిన.

**کاہ** కాహ్ (పా.స్త్రీ) ఎండుగడ్డి, కోత గడ్డి,కసవు **کاہ کشاں** -కహ్‌కషాం (పా.స్త్రీ) ఆకాశగంగ. **کاہگل** -గిల్(పా. స్త్రీ)రేగటిమన్ను కసవుకలిపి త్రొక్కిచేసినగోడ పూతమన్ను.

**کاہش** కాహిష్(పా. స్త్రీ) క్షీణము, తగ్గు, క్షయము, కృశింపు, బక్కపడుట, చింత, వ్యాకులము.

**کاہل** కాహిల్ (అ) ఆలసుడు, సోమరి,

**کاہل وجود** -వజూద్ (పా.పు)సోమరిపోతు. (ఆలసము.

**کاہلی** కాహిలీ (ఉ. స్త్రీ) సోమరితనము,

**کاہو کے بنج** కాహూకేబీజ్ (హి)కావు గింజలు, కావువిత్తులు. [చ్ఛేదనము.

**کاہی** కాహీ (ఉ) గడ్డిసంబంధమైన, ఆకుప

**کاہے-کاہے کو** కాహే-కాహేకు (హి) ఎల? ఏమి? ఎందుకు? ఏది?

**کائی** కాయీ (హి. స్త్రీ) పాచి, పాకుడు, నాచు, నీరుకావివర్ణము. **کائی بوٹی** -బూటీ **کائی تیل** కాతేల్ (హి) కైఫూలితైలము. **کائی پھل** -కాయీఫల్(హి)కైడర్యము (పట్ట).

**کایا** కాయా (హి. స్త్రీ) కాయము, దేహము, ఆకారము, స్వరూపము. **کایا پلٹ** - పలట్(హి)పునర్జన్మము, వేషముమారుట, ముసలివారువయసువారగుమందు, ఔషధము, కాయపుష్టిమందు.

**کا یپھل** కాయఫల్(హి.పు)కేరడము (పట్టి).

**کا یتھ-کا یستھ** కాయథ్-కాయస్థ్(హి.పు) కాయితీబ్రాహ్మణుడు, కాయస్థుకరణము.

**کا ئنات** కాయినాత్ (అ. స్త్రీ) సృష్టి, ప్రపంచము, లోకము, సంసారము, లోకములోనిపదార్థములు, సృష్టిభూతములు, సృష్టివర్గము, నైసర్గికములు, సృజింపబడినదంతయును, మూలధనము, భండారము, ఆస్తి. ద్రవ్యము, విలువ, మూలము.

**کا ئیاں** కాయియాం (ఉ) అనుభవశాలి, నేర్పరి, మాయలమారి, స్వప్రయోజనపరుడు, లోభి, ఒకతెగమార్వాడీవాడు.

**کا ئیاپن** కాయియాపన్ (ఉ.పు) నేర్పరితనము, జాణతనము, మోసము, పిసినారితనము.

**کائیں-کائیں** కాయేంకాయేం (హి.స్త్రీ) కాకులయరపు, కలకలము, అల్లరి,వదరుడు.

**کب** కుబ్(హి.పు) వంకి, వంపు. గూను, ఒంటెవీపుపైనుబ్బు లేక గుబ్బ, ఒంటెమూపురము.

**کب** కబ్ (హి) ఎప్పుడు, ఎట్లు; ఎక్కడ. **کب تلک-کب تک**-తక్-తిలక్(హి) ఎంతదనుక, ఎంతకాలము. **کب سے**-సే (హి) ఎప్పటినుండి, ఎన్నటినుండి. **کب کا**-కా (హి) ఎప్పటిది, చాలాకాలపుది, ఏనాటిది. చాలాకాలమాయెను, చాలాకాలమునుండి. **کب کب**-కబ్ (హి) ఎప్పుడెప్పుడు, ఎప్పుడైనను.

**کباب** కబాబ్ (అ.పు) కబ్బుకుట్లు, వేయించిన మాంసము. **کباب ہونا**-హోనా(ఉ) మాంసముకాలిపక్వమగుట, మనోవ్యథపడుట, ఆగ్రహపడుట,

**کباب چینی** కబాబ్‌చీనీ(ఉ.స్త్రీ)చలువమిరియాలు, తోకమిరియములు.

**کبابہ** కబాబ (అ.పు) చలువమిరియము.

**کبابی** కబాబీ (పా.పు) కబాబులుచేయు లేక అమ్మువాడు.

**کبادہ** కబాద(పా.పు) విల్లులకైనవిల్లు, గరడీవిల్లు (ఇనుపగొలుసునారిగాగలవిల్లు).

**کبار** కిబార్ (అ.పు) గొప్పవారు, పెద్దలు (ఏ.వ **کبیر**).

**کباڑ** కబాడ్ (హి.పు) కసాటము, తెలుపు; ప్రాతవస్తువులు.

**کباڑی-کباڑیا** కబాడీ - కబాడియా (హి.పు) ప్రాతవస్తువులు అమ్మువాడు.

**کبت** కబిత్ (హి.పు) కవిత్వము, పద్యము.

**کبجا** కుబ్జా (హి.పు) కుబ్జుడు, గూనివాడు.

**کبد** కబ్ద్ (అ.పు) కాలిజము, కాలఖండము.

**کبڈی** కబడ్డీ(హి. స్త్రీ) బలిగూడుఅనుఆట, చెడిబలిగుడు.

**کبر** కిబ్ర్(అ.పు) ఘనత, గొప్పతనము, గర్వము. **کبر سن**-సిన్ (అ.పు) వయసుమీరినవాడు, ముసలివాడు.

**کبرا** కబ్రా (హి) కబ్బరము, నలుపు తెలుపు కలిసిన, చిత్రవర్ణముగల.

**کبریٰ** కుబ్రా(అ.పు) పెద్దలు; తర్కములు, పూర్వసిద్ధాంతము, ప్రతిజ్ఞ (ఏ.వ **کبیر**).

**کبریا** కిబ్రియా (అ.పు) ఘనత, పెత్తనము, గర్వము, ఈశ్వరుడు.

**کبریت** కిబ్రీత్ (అ. స్త్రీ) గంధకము, మేలిమిబంగారము. **کبریت احمر**-ఎ, అహ్మర్(అ.స్త్రీ) ఎఱ్ఱగంధకము; అపరూపము, దొరకనివస్తువు.

**کبڑ** కుబ్డ్ (హి.పు) గూను, నడుమువంపు.

**کبڑا** కుబ్డా (హి.పు) చూడు **کبجا**

**کبڑی** కుబ్డీ (హి. స్త్రీ) కుబ్జ, గూనిది.

**کبک** కబ్క్ (పా.పు) చకోరము, పిట్ట,

**کبک رفتار** -రఫ్తార్ (పా) అందమైన నడకగలయాడుది.

**کبوتر** కబూతర్ (పా. పు) కపోతము,పావురము. **کبوترباز** -బాజ్ (పా)పావురములను పెంచువాడులేక ఎగిరించువాడు, పావురముల పందెములాడువాడు. **کبوترخانہ** -ఖానా(పా) కపోతపాలిక, పావురముల గూడు. **کبوتر کا جھاڑ** - కాఝాడ్ (హి) నాగమల్లెచెట్టు.

**کبوتری** కబూతరీ (ఉ. స్త్రీ) ఆడపావురము, భోగముది, ఆటభోగముది, సొగసుకత్తె.

**کبود** కబూద్ (పా. పు) నీలివర్ణము,

**کبودی** కబూదీ (పా) నీలివర్ణముగల.

**کبھی - کبھوں - کبھو - کبھی** కభూ–కభూం–కభీ (హి) కదాచితు, ఎప్పుడైనను, ఎప్పుడో, ఎన్నడో, అరుదుగా,ఒకానొకప్పుడు, పూర్వమెప్పుడో, పూర్వము, ఎప్పటికిని,బొత్తిగా, కదాపి, ఒకప్పుడును, కొంచముసేపులో, క్షణములో. **کبھی کا** -కా(హి)చాలాకాలముక్రిందట. చాలాకాలమునుండి. **کبھی کبھار** -కభార్ (హి) ఎప్పుడైనను, **کبھی کبھی** -కభీ (హి) ఎప్పుడెప్పుడు, అప్పుడప్పుడు, కొన్నిజేళల. **کبھی نہ کبھی** -నకభీ(హి) ఎప్పుడైనను, ఒకానొకప్పుడు, ఎప్పుడోఒకప్పుడు. **کبھی نہیں** -నహీ (హి)ఎప్పుడునులేదు,కదాచిన,ఎంతమాత్రమునుకాదు.

**کبیت** కబీత్(అ) వెలగపండు.

**کبیدہ** కబీద (పా) వికలమైన, తునకలైన; దుఃఖితమైన, చింతపడిన, చింతిలిన.

**کبیدہ خاطر** -ఖాతిర్ (పా) భిన్నమనస్కుడు, చింతనొందినవాడు, చింతిలినవాడు.

**کبیر** కబీర్ (అ) ఘనమైన, పెద్ద, గొప్ప ; కబీరుదాసుపేరు.

**کبیسہ** కబీస (అ. పు) అధికమాసము, అధికదినము (గలవత్సరము).

**کبیکج** కబీకజ్ (పా. పు)పురుగులరాజు, కీటకరాజు, ఈపేరు పుస్తకములమీద వ్రాసిన పుస్తకములకు పురుగుపట్టదని నమ్మెదురు.

**کبیشر** కబీశర్ (హి. పు) కవీశ్వరుడు.

**کپ** కుప్(హి.పు) పొట్టుగూడు, వరిపొట్టుగూడు, రాశి; కూపము, బావి.

**کپا** కుప్పా (హి.పు)తోలుసిద్దె,తోలుకుప్పె; బలిసిన, ఉబ్బిన.

**کپاٹ** కపాట్ (హి. పు) తలుపురెక్క.

**کپار - ری** కుపార్-రీ (హి.పు)తలపుఱ్ఱె, గుజ్జుపువెన్నుపూస, వంగదేశమందలి ఒకజాతి.

**کپاس** కపాస్ (హి. స్త్రీ)కార్పాసము,విత్తులుతీయనిపత్తి, పత్తిచెట్టు.

**کپاسی** కపాసీ (హి) పత్తితోచేసిన, పత్తివంటి, మృదువైన, పత్తిపూవువన్నెగల, కప్పుపచ్చని.

**کپال** కపాల్ (సం. స్త్రీ) కపాలము, తలపుఱ్ఱె, నొసలు, అదృష్టము.

**کپتان** కప్తాన్ (ఇం.పు) నాయకుడు, దళవాయి, నావికుడు. (స్వగ.

**کپٹ** కపట్ (హి. స్త్రీ)కపటము,మోసము,

**کپٹی** కప్టీ(హి)కపటి,కపటముగల,మోసపు.

**کپڑ** కపడ్ (హి. పు) వస్త్రము, బట్ట ( వృత్తియందు) **کپڑچھان** -ఛాన్(హి) వస్త్రగాలితము. **کپڑچھن** -ఛన్ (హి) వస్త్రగాలితమైన, మిగులమెత్తని. **کپڑ دھول**

-پھول -ఫూల్-ఫూల్ (హి.పు) పట్టునలి పెము, సన్ననిబట్ట. کپڑکوٹ-కోట్ (హి.పు) గుడారము, کپڑگند - గంద్ (హి) బట్టకాలిన వాసన.

کپڑا కప్డా (హి.పు) వస్త్రము, బట్ట, గుడ్డ, ఉడుపులు. کپڑونسے ہونا కప్డోంసే హోనా (హి) ఋతుమతియగుట.

کپڑوتی కప్డౌతీ (హి. స్త్రీ) పుటము, బట్ట కుమన్ను పూసి పాత్రకుచుట్టి పుటము పెట్టుట; వస్త్రగాలితము.

کپڑے కప్డే (హి.పు) బట్టలు, ముట్టు. کپڑےآنا -ఆనా (హి) చెరగుమాయుట-ముట్టగుట.

کپکپی కప్కపీ [హి.స్త్రీ] కంపము, వణకు.

کبوت కపూత్ (హి.పు) కుపుత్రుడు, కొరగానికొడుకు.

کپور కపూర్ (హి.పు) కర్పూరము. کپوری-కచ్రీ (హి. స్త్రీ) తుంగముస్తెగడ్డలు. (మణములు.

کپورا కపూరా (హి.పు) గొఱ్ఱెమేకలవృ

کپوری కపూరీ (హి.స్త్రీ) ఒకవిధమైనతమలపాకు; కర్పూరరసం॥.

کپی కుప్పీ (హి. స్త్రీ) తోలుకుప్పె. కుప్పె, కాయ, చినసిద్దె.

کت కత్ (హి) ఎక్కడ, ఎటు, ఏమి.

کتا కిత్తా (హి) ఎంత, ఏకొలది, ఎన్ని, ఏ మాత్రము, చాలా, మిక్కలి.

کتا కుత్తా (హి.పు) కుక్క; బానిస, దాసుడు, నీచుడు; ఒకవిధమైనపట్టాకత్తి; బిగింతగడ్డి; గడియ, బెట్టు, మీట; తుపాకి గుఱ్ఱము, తుపాకిబెట్టు. کتاگھانس-ఘాంస్ (హి) అంటుసగడ్డి

کتاموتا - మూతా (హి.పు) కుక్క గొడుగు, పుట్టగొడుగు. کتےکی ہڑک కుత్తేకీహడక్ (హి. స్త్రీ) వెఱ్ఱికుక్కకాటువలనిరోగము.

کتاب కితాబ్ (అ. స్త్రీ) గ్రంథము, పుస్తకము. کتاب الٰہی - آسمانی - ఇలాహీ - ఆస్మానీ (అ. స్త్రీ) ఈశ్వర దత్తమైన గ్రంథము, మతగ్రంథము. کتاب خواں - ఖాం (పా) పౌరాణికుడు. کتاب رو -రూ (పా) సోగమొగమువాడు. کتاب ہدیٰ - హుదా (అ) మార్గదర్శక గ్రంథము, కురానుమరిప్రు.

کتابت కితాబత్ (అ. స్త్రీ) లేఖనము, వ్రాత.

کتابہ కితాబ (అ.పు) రేకు లేక బండమొ॥ వాని పైచెక్కు యుండు అక్షర ములు, శాసనము.

کتابی కితాబీ (అ) గ్రాంధికము, వ్రాసినది గ్రంథసం॥. کتابی چور-చోర్ (ఉ) కావ్యచోరుడు, గ్రంథచోరుడు. کتابی چہرا -చిహ్రా (ఉ) సోగమొగము.

کتارا కతారా (హి.పు) చెఱుకు, చింతకాయ.

کتان కతాన్ (హి. స్త్రీ) అగిసెలు, నారబట్ట.

کتانا కతానా (హి) వడికించుట.

کتائی కతాయీ (హి. స్త్రీ) వడుకుడు, వడికినకూలి.

کتب కుతుబ్ (అ.పు) పుస్తకములు, [ఏ.వ کتاب). کتب خانہ -ఖాన (పా.పు) గ్రంథశాల, పుస్తకాలయము.

کتبہ కత్బ (అ.పు) చూడు کتابہ

کتخدا కత్ఖుదా (పా.పు) పెండ్లికొడుకు, యజమాని, అధికారి.

کتخدائی కత్ఖుదాయీ (పా. స్త్రీ) వివాహము, పెండ్లి, అధికారము.

**کترا - کتر** కతర్ - కత్రా (హి. పు) చీలిక, పీలిక, కత్రించినతునకలు, పట్టము లేకతలకట్టునాడెము. **کتربیونت** - బియూంత్ (హి. స్త్రీ) కత్తిరింపులు. కోతలు, ఎచ్చు తగ్గులు. త్రోవ్పుడులు, అపహరణము, చింత, వ్యాకులము, యుక్తి.

**کترانا** కత్రానా (హి) కోయించుట, కత్రించుట, మార్గముతప్పించిపోవుట, మొగము తప్పించుట, తప్పించుకొనుట, విడనాడుట. (తుంపులు, చీలిక.

**کترن** కత్‌రన్ (హి. స్త్రీ) కత్రించినతునకలు,

**کترن** కుత్రన్ (హి. స్త్రీ) పండ్లతోకొరికినది.

**کترنا** కతర్నా (హి) కత్తిరించుట. నరుకుట, చెక్కుట, చీరుట.

**کترنا** కుతర్నా (హి) పండ్లతోకొరుకుట.

**کترنی** కతర్నీ (హి. స్త్రీ) కత్తెర, కత్తెరకోల.

**کتروان** కతర్‌వాఁ (హి) వంకరైన, అడ్డముగానైన, ఏసరైన.

**کتروائی** కతర్‌వాయీ (హి. స్త్రీ) కోతకూలి; ప్రక్కత్రోవ, అడ్డత్రోవ.

**کتروانا** కతర్వానా (హి) కోయించుట, నరికించుట, ఛేదింపజేయుట, కత్రింపించుట,

**کتف** కతిఫ్ (అ. పు) భుజము, బుజేము, గూడయెముక, బుజేముయెముక.

**کتک** కుత్తక్ (హి. పు) చూడు **خنک**

**کتکا** కుత్‌కా (హి. స్త్రీ) చూడు **خنکا**

**کتل** కత్తల్ (హి. స్త్రీ) రాతిబిళ్ల, ఇటుకతునక, చెక్క, ముక్క. **کتل ترا** - తిరా (పా. పు) నీళ్లమీద గంతులిడునట్టు రాళ్లు మొ॥ రువ్వెడు కప్పగంతులయాట.

**کتلا** కత్లా (హి. పు) చీరిక, చెక్క. బద్ద.

**کتمان** కిత్మాన్ (అ. పు) దాపరికము, దాపుడు.

**کتنا** కిత్నా (హి) ఎంత, ఏకొలది, ఎన్ని, ఏమాత్రము, చాలా, మిక్కిలి. **کتنا ایک** -ఏక్ (హి) ఎంతయో, ఎన్నియో, కొన్ని.

**کتنا** కత్నా (హి) వడకబడుట, దారమగుట.

**کتنا** కుత్నా (హి) మతింపవడుట, అంచెన యగుట, వెలలేక ధరకట్టబడుట.

**کتنی** కత్నీ (హి. స్త్రీ) ఏకులబుట్ట.

**کتوانا** కత్వానా (హి) వడికించుట, దారముచేయించుట.

**کتوال** కత్వాల్ (హి. పు) చూడు **کوتوال**

**کتها** కత్థా (హి. పు) కాచు (తాంబూల ద్రవ్యము)

**کتها** కథా (హి. స్త్రీ) పురాణము.

**کتهک** కథక్ (హి. పు) కథకుడు, బట్రాజు, నాటకపు పిల్లవాడు, ఒకజాతి.

**کتهیل** కథీల్ (హి) తగరము. (కత్తి.

**کتی** కత్తీ (హి) అగసలవాని సవాణము;

**کتی** కుత్తీ (హి. స్త్రీ) ఆడకుక్క, శుని.

**کتی** కిత్తీ (హి) ఎంత, ఎన్ని, **کتے کی جیبھ کے سینڈ** కుత్తేకీజీభ్ కీసేండ్ (హి) ఆకుజెముడు.

**کتیا** కుత్తియా (హి. స్త్రీ) శుని, ఆడకుక్క.

**کتیرا** కతీరా (హి. పు) బాదాముబంక, ఒకవిధమైనబంక, **کتیرا ے هندی** -ఎహిందీ (హి) నాటుబాదాము పిసునులేక బంక.

**کٹ** కుట్ (హి. స్త్రీ) కాకితపుఅట్టము, అత్తడము, స్నేహభంగము, తెంపు, కటుక్కను చెప్పుడు, దంపుడు, మొత్తుడు, రాగియు సీసముకలిసిన లోహము.

**کٹ** కట్ (హి. పు) ఖండనము, కోత, నలుపు.

**کٹ کهنا** -ఖనా (హి) కొరికి తినునది,

**کمار** కుమార్ (హి.పు) కుమారుడు, కొడుకు, బాలుడు. (కమార్) కలబంద. (కన్య.

**کماری** కుమారి (హి. స్త్రీ) కుమారి. కూతురు.

**کمال** కమాల్ (అ.పు) పరిపూర్ణత, సంపూర్ణత, అన్యూనత, లోపరాహిత్యము, విద్యా ప్రవీణత, నేర్పు, కుశలత, పారంగతత్వము, నైపుణ్యము, పాండిత్యము, చాతుర్యము, పనితనము, సామర్థ్యము, గుణము, విశేషము, అధిక్యత, శ్రేష్ఠత, యోగ్యత. అద్భుత కార్యము, ఆశ్చర్యకృత్యము, అపూర్వకృత్యము, అద్భుతశక్తి, సంపూర్ణమైన, అన్యూనమైన, లోపరహితమైన, పూర్ణమైన, పూర్తియైన, విస్తారమైన, విశేషమైన, మిక్కిలి, అతి, అమితమైన. **کمال کو پہونچنا** -కూ పహూంచ్నా (ఉ) పరమావధికి ముట్టుట, పారంగతుడగుట, తుదముట్టుట, పరిపూర్ణమగుట, పారము ముట్టుట.

**کمالا** కమాలా (ఉ.పు) పరిపక్వావస్థమైన మల్లాటు లేక జెట్టిపట్టు.

**کمالات** కమాలాత్ (అ.పు) చే- డు (ఏ.వ **کمال**)

**کمالیت** కమాలియత్ (అ.పు) పరిపూర్ణత్వము, సంపూర్ణత, అన్యూనత, పారంగతత్వము.

**کمان** కమాన్ (ఇం.పు) ఆజ్ఞ, ఉత్తరువు, అధికారము, నియోగము. **کمال افسر** -అఫ్సర్ (ఉ) అధిపతి, అధికారి, దళవాయి, సేనానాయకుడు.

**کمان** కమాన్ (పా. స్త్రీ) ధనుస్సు, విల్లు; ధనురాశి; వృత్తఖండము లేక భాగము; దారు, విలువంపు, అర్థచంద్రాకారము, ధనురాకారము; శారీక, పిడీలువాయించు సాధనము; ఇంద్రధనుస్సు; విలువంపైన, వంగిన, వంపుగల. ధనురాకారమైన, కూనిగల **کمان ابرو** -అబ్రూ (పా) విలువంపైన కనుబొమలుగల, ప్రియుడు. **کمان بردار** -బర్దార్ (పా) ధనుష్మంతుడు, విలుకాడు. **کمان تاننا-چڑھانا** -తాన్నా-చఢానా (ఉ) విల్లెక్కు పెట్టుట. **کمان دار** -దార్ (పా) విలుకాడు, విలువంపైన, వంపుగల. **کمان دور** -డోర్ (పా) వింటినారి, విలుత్రాడు. **کمان کرنا** -కర్నా (ఉ) వంచుట, వడచుట. **کمان گر** -గర్ (పా) శల్యవైద్యుడు, విల్లులు చేయువాడు.

**کمانا** కమానా (హి) గడించుట, ఆర్జించుట, సంపాదించుట, చేయుట, తోళ్లు మొ॥ పదును చేయుట, మెత్తగా చేయుట, పాకి పని చేయుట, మరుగుదొడ్డి ఊడ్చుట, వేశ్యావృత్తి చేయుట, కష్టము చేయుట, పాటుపడుట, పరిశ్రమ చేయుట, భూమిని దున్ని సత్తువ గలుగ చేయుట, సారవంతముగా చేయుట, వ్యాయామాదులచే దేహమును బలపరచుట, తగ్గించుట, తక్కువ చేయుట.

**کمانچه** కమాన్చ (పా.పు) చిన్న విల్లు, పింజనము (దూది ఏకుల వారిది), దారు, విలువంపైన సరంబీ, గూనా, బగ్గీలు మొ॥ వానికి వేయు ఉక్కు వంపు లేక విలువంపు, విసవిల్లు.

**کمانی** కమానీ (హి. స్త్రీ) బగ్గీలు మొదలైన వానికి వేయు ఉక్కు విలువంపు, విసవిల్లు; సారంగి వాయించు విల్లు; శారీక; గడియారముల విసతీగ.

کم خرچ بالانشین -ఖర్చ్ బాలాన
షీన్ (పా) వెలకొంచము ఫలమధికము.
کم خرچی -ఖర్చీ (పా)మితవ్యయము,
పిసినారితనము. کم خور-خوراک
-ఖోర్-ఖూరాక్ (పా) మితభోజియైన,
అల్పాహారి. کم رو రవ్(పా)మందగామి
యైన, మెల్లగాపోయెడు. کم رو -రూ
(పా) కురూపి, నీచుడు. کم زور -
జోర్ (పా) దుర్బలమైన, బలహీనమైన.
کم زوری -జోరీ (పా) దౌర్బల్యము,
మాంద్యము. کم زیاد-ده -జియాద్
-ద (హి) ఇంచుమించు, ఎచ్చుతక్కువ,
దాదాపుగా. کم سال సాల్(పా) పసి,
పిన్నవయసుగల. کم سخن - సఖున్
(పా) మితభాషి. کم سخنی -సఖునీ
(పా. స్త్రీ) మితభాషిత్వము. کم سن-عمر
-సిన్-ఉమ్ర్ (పా) చిన్న, పిన్న, పసి,
పిన్నవయసుగల, ఏండ్లు తక్కువైన. کم
سنی -సినీ (పా. స్త్రీ) సిన్నవయసు,
పసితనము, బాల్యము. کم سےکم -సేకమ్
(పా) అధమపక్షము,కనీసము. کم طالعی
-తాలఈ (పా) దౌర్భాగ్యము,దుర్దైవము.
کم ظرف -జర్ఫ్ (పా.) అల్పుడైన,
నీచబుద్ధిగల. کم عقل అక్ల్(పా) బుద్ధి
తక్కువైన, తెలివిమాలిన. کم فرصتی
ఫుర్సతీ (పా. స్త్రీ) తీరికలేమి. کم فهم
-ఫహ్మ్ (పా)బుద్ధితక్కువైన, తెలివిలేని.
کم قدر -కదర్ (పా) గౌరవహీనమైన,
అల్పమైన, తుచ్ఛమైన, పనికిమాలిన, کم
قسمتی -కిస్మతీ (పా. స్త్రీ) దౌర్భా
గ్యము, నిర్భాగ్యము, అభాగ్యము. کم
قیمت -కీమత్ (పా) వెలతక్కువైన,
చౌకైన. کم کرنا కర్నా(ఉ)తగ్గించుట,
త్రోపుడుపెట్టుట, తీసివేయుట. کم کم
-కమ్(పా) కొంచకొంచము,కొద్దికొద్దిగా.
کم گو -గో (పా) చూడుము کم سخن
అనుపదము. کم گوئی -గోయీ (పా)
చూడుము کم سخنی . کم مائگی -
మాయగీ (పా. స్త్రీ) లేమి, బీదరికము,
దరిద్రము. کم مایہ -మాయ(పా) లేని,
బీదయైన, రిక్తుడైన. کم محنت -
మిహ్నత్ (పా) సోమరియైన, పనిదొంగ
యైన. کم نصیب -నసీబ్ (పా) దుర
దృష్టుడైన,దౌర్భాగ్యమైన. کم نصیبی
-నసీబీ (పా. స్త్రీ) దౌర్భాగ్యము, దుర
దృష్టము. کم نگاهی - నిగాహీ
(పా. స్త్రీ)అలక్ష్యము,అశ్రద్ధ,నిర్లక్ష్యము.
کم و بیش ఒ,బేష్ (పా) ఎచ్చుతక్కు
వగా, ఇంచుమించుగా, దాదాపుగా. کم
وکاست -ఒ,కాస్త్ (పా) ఎచ్చు
తగ్గులు. کم هونا -హోనా(ఉ)తగ్గుట,
తక్కువపడుట, క్షీణించుట. کم یاب
-యాబ్ (పా) దొరకని, అరుదైన, అప
రూపమైన. کم یابی -యాబీ(పా. స్త్రీ)
దొరకమి, అపరూపత్వము.

کما కమా (అ) వలె, పోలి, ఎట్లు, ఏవిధము
గా. کما حقہ -హక్కహు (అ) యథో
చితముగా, యథావిధిగా, సక్రమముగా,
తగినట్లు, సరిగా, బాగా, న్యాయముగా,
కావలసినట్లు. (తరము.

کماذریوس కమాజేరియూస్ (అ) బోడ

-మసోస్నా (హి) గుండెలాపుకొనుట, దుఃఖము అణచుకొనుట లేక ఆపుకొనుట. **کلیجہ ٹھنڈا ہونا** -ఠండా హోనా (హి) మనసు చల్లపడుట లేక నెమ్మది పడుట, మనసుకుతృప్తియగుట, మనసు తీరుట. **کلیجہ جلنا ۔ سلگنا** -జల్నా -సులగ్నా (హి) కడుపుమండుట, మనసు వ్యసనపడుట. **کلیجہ کانپنا** -కాంప్నా (హి) గుండె దడవు పుట్టుట, గుండెలు కొట్టుకొనుట. **کلیجہ ملنا** -మల్నా (హి) మనసునుపీడించుట, దుఃఖపెట్టుట. **کلیجہ منہ کو آنا** -మూంహ్ కొ ఆనా (హి) పేగులునోటికివచ్చుట, ప్రాణముతల్లక్రిందగుట, అసహ్యపడుట, తల్లడపడుట. **کلیجے سے لگا رکھنا** కలేజేసే లగారఖ్నా (హి) ప్రాణ సమానముగా నుంచుట, **کلیجے سے لگا لینا** కలేజేసే లగాలేనా (హి) కౌగలించుట, మిక్కిలిప్రేమించుట.

**کلیجی** కలేజీ (హి.స్త్రీ) జంతువుల కాలిజము, ప్రేగులు.

**کلیچہ** కులీచ (పా.పు) రొట్టె బిళ్ల, చిన్న రొట్టె. చూడు **کلچہ**

**کلید** కలీద్ (పా.స్త్రీ) తాళపు చెవి లేక చెయి, బీగము,

**کلیسا ۔ کلیسہ** కలీసా-స (యూ.పు) క్రైస్తవులగుడి, క్రైస్తవమందిరము.

**کلیل** కులేల్ (హి.స్త్రీ) గుఱ్ఱముసంతోషము చేత ఇటునటు గంతులు వేయుట, చెంగలింత, గంతులాట, ఉల్లాసము, సంతోషము.

**کلیم** కలీమ్ (అ.పు) సంభాషించువాడు, మాటలాడువాడు. **کلیم الله** -ఉల్ల (అ) దేవునితో సంభాషించువాడు, హజ్రత్ మూసా యొక్క బిరుదనామము.

**کلیو ۔ وا** కలేవ్-వా (హి.పు) చద్దియన్నము, చద్ది, చలిది.

**کم** కమ్ (పా) కొంచమైన, తక్కువైన, కొద్దియైన, స్వల్పమైన, నీచమైన, అల్పమైన, అరుదైన, లేని, దుష్ట, చెడు. **کم اخلاقی** -అఖ్లాకీ (పా.స్త్రీ) కలిమిగోలుతనము లేమి. **کم اصل ۔ ذات** -అస్ల్-జాత్ (పా) కులహీనుడు, నీచుడు. **کم بخت** -బఖ్త్ (పా) దురదృష్టమైన, దౌర్భాగ్యమైన. **کم بختی** -బఖ్తీ (పా.స్త్రీ) దురదృష్టము, దౌర్భాగ్యము, అశుభము. **کم بختی کے دن** -బఖ్తీకెదిన్ (ఉ) కష్టకాలము, దుర్దినములు. **کم بغل** -బగల్ (పా) స్వల్పపరివారముగల, కొద్దిపరిజనముగల. **کم پا** -పా (హి) అశాశ్వతమైన, చాలాకాలముండని. **کم پائی** -పాయీ (పా.స్త్రీ) అస్థిరత, చాలాకాలముఉండమి. **کمتر** -తర్ (పా) అల్పతరమైన, నీచతరమైన, కొంచమైన, హీనమైన. **کمترین** -తరీన్ (పా) అల్పతమమైన, నికృష్టమైన (విధేయుడు). **کم توجهی** -తవజ్జుహీ (పా) అశ్రద్ధ, నిర్లక్ష్యము. **کم حرکت** -హరకత్ (పా) సోమరియైన, అలసుడైన.

**کم حوصلگی** హౌసలగీ (పా) అధైర్యము, కొంచపాటిస్థితి, అనౌదార్యము, నీచబుద్ధి. **کم حوصلہ** -హౌసల (పా) కొంచపాటిస్థితిగల, అనౌదార్యమైన, నీచబుద్ధిగల. **کم خرچ** -ఖర్చ్ (పా) మితవ్యయము చేయు, పిసినారియైన, లోభియైన.

**کلوٹا** కలోటా(హి) నల్లని, చామనిఛాయగల.

**کلوخ** కలూఖ్ (పా.పు) మంటిపెడ్డ, పచ్చియిటుక,

**کلول** కిలోల్ (హి. స్త్రీ) కల్లోలము, కేళి, వేడుక, క్రీడ, లీల, వినోదము, ఆటపాటలు, గంతులాట, విహారము.

**کلونچی** కలౌంచీ (హి. స్త్రీ) నల్లజీలకఱ్ఱ.

**کلونس** కలౌంస్ (హి. స్త్రీ) మైల్యము, గలుపు, చూడు **کالک**.

**کلم** కల్మ (పా.పు) చూడు **کلا**

**کلم** కుల (పా.పు) కుళ్లాయి, తోపి. **کلم**

**شجرہ** షజ్రా (పా) ఉత్తరాధికారము, ఆస్తి, సొత్తు, సామగ్రి.

**کلھاری** కల్హారీ (హి. స్త్రీ) గయ్యాళి, జగడాలమారి(ఆడుది). (పెద్దగొడ్డలి.

**کلھاڑا** కుల్హాడా (హి.పు) గండ్రగొడ్డలి,

**کلھاڑی** కుల్హాడీ (హి. స్త్రీ) గొడ్డలి.

**کلھم** కుల్లుహుమ్ (హి) వారందరును, అందరును, అంతయు, అన్నియును, అశేషము.

**کلھیا** కుల్హియా(హి. స్త్రీ) మట్టిముంత, పిడత, చిట్టి; బిరుసులు (ఒక బాణసంచు). **کلھیا سا** -సా- పిడతవంటి ఇరుకైన, చిన్న.

**کلی** కుల్లీ (అ) సర్వము, అంత, అశేషము, సర్వసామాన్యము. (స్త్రీ) మొత్తము, వెరశి, సమస్తము, అంతయు.

**کلی** కుల్లీ (హి. స్త్రీ) గండూషము, పుక్కిలింత, నోరుకడుగుకొనుట.

**کلی** కలీ (హి. స్త్రీ) మొగ్గ, మొగడ, ముకుళము, అంకురము, ఇగురు, చిగురు, చొక్కాయి మొ॥వానిలోవేయు ముమ్మూలచీలిక, పీలిక, మట్టిచొంగ లేక గుడ్గుడి, కన్నెపడుచు, కన్నె, కన్య, సమర్తాడనిది, కలికాలము. **کلی کا چونا** -కా చూనా (హి) రాళ్లసున్నము, సున్నపుగాళ్లు.

**کلیات** కుల్లియాత్ (అ. స్త్రీ) మొత్తములు, సంహిత, సంగ్రహము. (ఏ.వ **کلی**).

**کلیان** కల్యాన్ (సం.పు) కల్యాణము.

**کلیجا** కలీజా (హి.పు) చూడు **کلیجہ**.

**کلیجن** కులీజన్ (హి.పు) దుంపరాష్ట్రము, తమలపాకు తీగలయొక్క వేరు.

**کلیجہ** కలీజ(హి.పు) కార్జము, కాలఖండము, హృదయము, గుండె, గుండెకాయ, గుండెలు, ధైర్యము, సాహసము, తెగువ, శక్తి, ముఖ్యభాగము, ప్రాణసమానము, ప్రియమైనవస్తువు, మనస్సు, అంతరంగము. **کلیجہ اچھلنا** -ఉఛల్నా (హి) గుండెలు కొట్టుకొనుట, గుండె దడపుట్టుట, **کلیجہ اڑا جانا** -ఉడాజానా (హి) దిగ్భ్రమజెందుట, తబ్బిబ్బునొందుట, మనసు చెదరుట, మతిభ్రమచెందుట, కలవరపడుట, చీకాకుపడుట. **کلیجہ الٹنا** -ఉలట్నా (హి) ప్రాణము తలక్రిందగుట, పేగులు గొంతులోనికివచ్చుట, తబ్బిబ్బులగుట. **کلیجہ بیٹھا جانا** -బైఠాజానా (హి) మనసుకుంగుట, నిరుత్సాహపడుట, నిస్త్రాణపడుట. **کلیجہ پانی ہونا** -పానీహోనా (హి) మనసు కరగుట, కనికరమువచ్చుట. **کلیجہ پکڑنا** -పకడ్నా (హి) ఱొమ్మున చేయిపెట్టుకొనుట (దుఃఖసూచకము). **کلیجہ پکنا** -పక్నా (హి) గుండె దహించుకపోవుట, మనసు మిక్కిలి దుఃఖితమగుట. **کلیجہ پھٹنا** -ఫట్నా (హి) గుండెలుపగులుట, దుఃఖమువచ్చుట, కడుపుమండుట. **کلیجہ تر ہونا** -తర్ హోనా (హి) స్థితిమంతుడైయుండుట, సంపత్తుకలిగియుండుట. **کلیجہ تھامنا - مسوسنا** -థామ్నా

**کلاونت** కలావంత్ (హి.పు) పాటకుడు, గాయకుడు, కలావంతుడు.

**کلاوہ** కలావ (పా.పు) దారపుకండె, వస్త్ర దారము.

**کلاہ** కులాహ్ (పా.పు) కుల్లాయి, తోపి, కిరీటము, పట్టము.

**کلائی** కలాయీ (హి.స్త్రీ) ముంజేయి,మణికట్టు. **کلائی اُتارنا-کرنا** -ఉతార్నా -కర్నా (హి) మణికట్టుపట్టుట, (తనమణికట్టు విడిపించుకొని ఎదటివాని మనికట్టు పట్టుకొను జట్టిపట్టుపట్టుట).

**کلب** కల్బ్ (అ. పు) శునకము, కుక్క.

**کلب** కలబ్ (ఇం.పు) సమాజము, సంఘము.

**کلبل** కిల్‌బిల్ (హి.స్త్రీ) లుకలుక, పురుగులు పాకులాడుట, పసిపిల్లలు, పిల్లల సందడి.

**کلبلانا** కిల్బిలానా (హి) పురుగులుపాకులాడుట, పిల్లలుసందడిచేయుట.

**کلبلانا** కుల్బులానా (హి) అల్లాడుట, ఊసులాడుట, గులపుట్టుట, దురద పుట్టుట, తల్లడపడుట, పరితపించుట, గిజిగిజిలాడుట, విలవిలలాడుట, వ్యాకులపడుట, లుకలుకలాడుట, పాకులాడుట, కడుపులో గుడగుడలాడుట, పిల్లలకుగిలిగింతచేయుట.

**کلبلاہٹ** కుల్బులాహట్ (హి. స్త్రీ) అల్లాట, ఊసులాట, లుకలుక, పాకులాట.

**کلبہ** కుల్బ (పా.పు) కుటీరము,గుడిసె, బీద గుడిసె. **کلبۂ احزان** -యె,అహ్‌జాన్ (పా) శోకగృహము, ఎవరైనచచ్చిన యిల్లు. సూతకపుయిల్లు.

**کلپ** కల్ప (సం.పు)కల్పము,బ్రహ్మకల్పము, సంకల్పము, కల్పన, ఒక వేదాంగము, వ్యాకరణము.

**کلپ** కల్ప (హి. స్త్రీ) వెండ్రుకలకలపము, నరిసిన వెండ్రుకలకువేయు నలుపువన్నె, చేకలివాడు బట్టలకువేయు గంజి, గంజి బిఱ్ఱు, దోసము, మరక, మచ్చ.

**کلپانا** కల్పానా (హి) బాధించుట, దుఃఖపెట్టుట,తల్లడపెట్టుట, వ్యాకులపెట్టుట, బట్టలకుగంజిపెట్టుట.

**کلپنا** కలప్నా (హి) దుఃఖపడుట, వ్యసనపడుట, చింతిల్లుట, పరితపించుట, తల్లడపడుట, వ్యాకులపడుట,శపించుట, పశ్చాత్తాపపడుట.

**کلتھی** కుల్థీ (హి.స్త్రీ) ఉలవలు.

**کلٹا** కిల్టా (హి.పు) గంప, గుల్ల, గుమ్మి.

**کلجگ** కల్జుగ్ (హి.పు) కలియుగము.

**کلچہ** కుల్చ (ఉ.పు) గోధుమబూరె, రొట్టె బిళ్ల,గుడారముయొక్క నిట్రాటిపైదూర్చియుండు గుండ్రని కొయ్యబిళ్ల.

**کلچھن** కులచ్ఛన్ (హి.పు) దుర్లక్షణము, దుర్గుణము.

**کلچھی** కుల్ఛీ (హి.స్త్రీ) వ్రేలికణుపు లేక గుంపు, కణపు.

**کلر** కల్లర్ (హి.స్త్రీ)ఊషరక్షేత్రము, ఉప్పుమంటినేల, చౌటినేల, బీడు, నిస్సారము. **کلر لگنا** -లగ్నా (హి) ఉప్పరియుట, ఉప్పుమన్ను గానగుట.

**کلرن** కల్రన్ (హి.స్త్రీ) గయ్యాళి, జగడము పుట్టించునాడుది.

**کلز** కిల్జ్ (పా) నరమామిడిచెట్టు, మెదచెట్టుచెక్క.

**کلس** కలస్ (హి పు) కలశము, శిఖరము,

**کلس** కిల్స్ (అ) సున్నము.

**کلسا** కల్సా (హి.పు) విత్తళి లేక రాగిబిందె, కూచిబిందె.

**کلسی** కల్సీ (హి.స్త్రీ) కలశి,చిన్నకలశము, బిందె.

మును. کل جمع కుల్-జమఅ (అ) కూడ మొత్తము, సగటుమొత్తము.

کل కుల్ (హి.పు) కులము, వంశము, జాతి, వర్ణము. کل ونتا కుల్-వంతా (హి) కులవంతుడు, కులీనుడు, సౌభాగ్యుడు.

کلا కుల్లా (హి.పు) పుక్కిలింత, గండూషము, నోరుకడుగుకొనుట, గొంతుకడుగుకొనుట.

کلا కలా (సం. స్త్రీ) కళ, కల, చంద్రకళ, అల్పభాగము, 30 కాష్టలకాలము, భాగము, అంశము, చంద్రవృత్తములోని 16వ భాగము, విద్య, విద్దె, టక్కు, మోసము, యుక్తి, మహాత్మ్యము, దివ్యశక్తి, పల్టీయ గంతు, పల్లటి, చతుష్షష్టికళలలోనొకటి. کلا بازی కలా-బాజీ (ఉ) పల్టీయ గంతు, పల్లటీ, పిల్లిమిరియము, పిల్లిగంతు, తలక్రిందైనగంతు. کلا جنگ కలా-జంగ్ (ఉ.పు) ఒక జెట్టిపట్టు. کلاکار కలా-కార్ (హి) ప్రవీణుడు, టక్కరి, దుర్మార్గుడు, అల్లరికాడు, జగడగొండి. کلا کھانا కలా-ఖానా (హి) పల్లటీల్గొనుట, పిల్లిగంతు వేయుట.

کلا-کلم కల్లా (ఉ.పు) గల్లము, చెంప,దవుడ, తల, గొంతు, బిగ్గరగామాట్లాడుట. کلا بکلا కల్లా-బ-కల్లా (ఉ) సరిసమానముగా, ఎదురుబడి. کلادراز కల్లా-దరాజ్ (ఉ) అల్లరికాడు, వదరుపోతు, తిట్టుబోతు, జగడగొండి.

کلاب కిలాబ్ (అ.పు) కుక్కలు, (ఏ.వ کلب).

کلاب కల్లాబ్ (అ.పు) కుక్కలవాడు, కుక్కలకాపరి.

کلابتوں-کلابتو کلا కలాబత్తూ-కలాబత్తూఁ (తు.పు) బంగారు లేక వెండి పోగుల దారము, సరిగపోగు.

کلابتونی కలాబత్తూనీ (పా) సరిగ పని చేసిన, సరిగతో నేసిన.

کلابہ కలాబా (పా.పు) నూలుకండె, బుడత, పప్పుదారపుచుట్ట.

کلاس కిలాస్ (సం. స్త్రీ) కులము, జాతి, వర్గము, తరగతి.

کلاغ కలాగ్ (పా.పు) కాకము, అడవికాకి, మాలకాకి.

کلار-کلال కలాల్-ర్ (హి.పు) శౌండికుడు, గౌండ్లవాడు, సాంద్రికుడు, సారాయదించువాడు. کلال خانہ కలాల్-ఖానా (ఉ) మదిరాగృహము, కల్లంగడి.

کلالن-رن కలాలన్-రన్ (హి. స్త్రీ) గౌండ్లది, గౌండ్లవానిది.

کلام కలామ్ (అ.పు) వచనము, పలుకు, మాట, ప్రసంగము, భాషణము, సంభాషణ, వాక్యము, పద్యము, పదము, రచన, గ్రంథము, కృతి, కావ్యము, ఆక్షేపము, వాదము, ఖురాను. (ఉ) సందేహము, కష్టము. کلام اللہ-مجید కలామ్-ఉల్లా-మజీద్ (అ) ఖురాను గ్రంథము. کلام تام కలామ్-తామ్ (అ) సమాపకవాక్యము, సంపూర్ణవాక్యము. کلام کرنا కలామ్-కర్నా (ఉ) సంభాషించుట, మాట్లాడుట, వాదించుట. کلام ناقص కలామ్-నాకిస్ (అ) అసమాపకవాక్యము, న్యూనవాక్యము.

کلاں కలాఁ (పా) పెద్ద, గొప్ప, పొడుగైన, విశాలమైన, ఎత్తైన.

کلانا కిలానా (హి) చేతితోచేయుట, చెరుగుట.

کلانا కలానా (హి) కాల్చుట, వేయించుట, కలుపుట. (దూకు.

کلانچ కులాంచ్ (ఉ. స్త్రీ) గంతు, దాటు,

వాఁడు, దుర్మార్గుఁడు, పాపిష్ఠివాఁడు. **کفن کھسوٹ** -ఖసూట్ (ఉ) దోపుడుగాఁడు, కొల్లగాఁడు; చూడు **کفن چور**

**کفنانا** కఫ్‌నానా (ఉ) పీనుగునుకడిగి పైన బట్టచుట్టుట, శవవస్త్రముకప్పుట.

**کفنی** కఫ్నీ (అ.స్త్రీ) పక్కెరలు నడుమ చీరికజేసి మెడలో వేసికొను బట్టరేకు, పీనుగు మెడకుకట్టు గుడ్డ, పుట్టిన శిశువు మెడలో దీర్ఘాయుష్మంతురగుటకు మహమ్మదీయులు వేయు బట్ట.

**کفو** కుఫూ (అ.పు) సమానము, సజాతీయము, ఒకేకులముగలది, కులస్థుఁడు, బాంధవ్యము, కులము, వంశము, సమాజము.

**کفہ** కఫ (అ.పు) గసగసాల(నల్లమందు) రసములో ముంచిన గుడ్డ, దొంగ నల్లమందు వ్యాపారము.

**کفیل** కఫీల్ (అ.పు) ప్రతిభువు, పూటపడిన వాఁడు, బాధ్యుఁడు, పూటకాపు, పూచిదారుఁడు, ఒప్పుకొనినవాఁడు, ఉత్తరవాది, బంధనము, తాకట్టు, కుదువ, పూట. **کفیل ہونا** -హోనా (ఉ) పూటపడుట, అప్పగించుకొనుట, ఒప్పుకొనుట

**ککا** కక్కా (హి.పు) చూడు **ککا** ; తెల్లనిది. దూసరవన్నెఁగలది, కాగుణితము, హల్లులు.

**ککرالی** కక్రాలీ (హి.స్త్రీ) చంకగడ్డ, చంకబిళ్ల.

**ککروندا** కుక్రోందా (హి.పు) అడవిముల్లంగి.

**ککڑ** కుక్కడ్ (హి.పు) కుక్కుటము, కోడి.

**ککڑ** కక్కడ్ (హి.పు) పదనుచేసినపొగాకు.

**ککڑوں کوں** కుకుడూఁకూఁ (హి.స్త్రీ) కొక్కొరొకో, కోడికూత.

**ککڑی** కుక్డీ (హి.స్త్రీ) దారపుకండె, బుడత, కండె, మొక్కజొన్న కంకి, కోడి పెట్ట; జిల్లెడుకాయ. **ککڑی ہونا** -హోనా (హి) చిక్కుపడుట, సన్నగిలుట.

**ککڑی** కక్డీ (హి.స్త్రీ) దోసకాయ. **ککڑی کا چور** -కాచోర్ (హి) చిల్లరదొంగ.

**ککیانا** కక్యానా (హి) అరచుట, కోతి అరచుట.

**کگرو** కఁగరూ (హి.స్త్రీ) అంచు, ఓరకత్తి మొ॥వాని వాయి లేక అంచు, ధార, గోడ మొ॥వాని శృంగారమైన అంచు, బోదె, బొద్దు.

**کل** కల్ (హి) నల్లని(వృత్తియందు). **کل دمہ** -దుమ (ఉ) నల్లతోక పావురము, ఒక పక్షి. **کل سرا** -సరా (హి) నల్లతల లేక జుట్టుగల పక్షి, నల్లతలవాఁడు, మానవుఁడు. **کل موہا - منہا** -మూహా-ముఁహా (హి) నల్లమొగము, దౌర్భాగ్యుఁడు.

**کل** కల్ (హి.స్త్రీ) యంత్రము, జంత్రము, కీలు, తుపాకిగుఱ్ఱము, బెట్టు, బిసగడియ, కిటుకు, మోసము, ఛలము, టక్కు, భాగము, అవయవము. **بے کل ہونا** -బే కల్‌హోనా (హి) కీలుతొలగుట, బిసలు తప్పుట, అస్వస్థతకలుగుట, అస్వస్థత, అసహ్యము, కలత. **کل دار** -దార్ (ఉ) యంత్రమునచేయబడిన నాణ్యము, బండీ రుపాయి, ఇంగ్లీషురూప్యము.

**کل** కల్ (హి.స్త్రీ) విశ్రాంతి, సౌఖ్యము, హాయి, నెమ్మది, నిమ్మళము, రీతి, విధము.

**کل** కల్ (హి.స్త్రీ) నిన్న, రేపు, స్వల్పకాలము, కొద్దికాలము. **کل کی بات** -కీ బాత్ మొన్నమొన్నటిమాట, కొద్దికాలము క్రిందటిమాట.

**کل** కల్ (హి.పు) కలి, కలియుగము.

**کل** కుల్ (అ) అంతయు, అన్ని, సాంతము, అందరు, మొత్తము, సంపూర్ణము; ఈశ్వ

వ్యాఖ్యానము, ప్రత్యక్షము, సాక్షాత్కారము, దివ్యవాణి, దివ్యశక్తి, దివ్యజ్ఞానము, ఈశ్వర దత్తజ్ఞానము, మహాత్మ్యము. **کشف و کرامات** -ఒ,కరామాత్ (అ) దివ్య మహాత్మ్యములు, మహాత్మ్యములు.

**کشفی** కష్ఫీ (అ) ఈశ్వరదత్తము, అవిష్కృతము, ప్రకటితము, దివ్యము.

**کشک** కుష్క్ (పా.పు) భవనము, హర్మ్యము, నగరు, గొప్పకట్టడము, మిద్దెటిల్లు.

**کشک** కషక్ (పా) చోఅ, కర, గీత.

**کشکول** కష్కూల్ (పా.పు) చూడు **کچکول**

**کشمش** కిష్మిష్ (పా.స్త్రీ) ద్రాక్షపరుగు, ఎండుద్రాక్ష, డాకపండ్లు, (అల్పబీజము, ఏకబీజము).

**کشمشی** కిష్మిషీ (పా) ద్రాక్షపరుగుసం॥, ద్రాక్షపరుగు వర్ణముగల, కప్పుపచ్చని, ఎరుపుకలిసిన పచ్చవర్ణముగల.

**کشمشی دن** కిష్మిషీదిన్ (ఉ.పు) క్రీస్తుపుట్టిన దినము, క్రీస్తుజయంతి, కిసుమిసుపండుగ.

**کشمکش** కష్మకష్ (పా.స్త్రీ) చూడు **کش** క్రింది సమాసపదములు.

**کشملا** కష్మలా (హి) ఒద్దిమాద్రిను.

**کشمیر** కష్మీర్ (హి.పు) కాశ్మీరము (దేశము).

**کشمیری** కష్మీరీ (హి) కాశ్మీరదేశపు. (పు) కాశ్మీరదేశస్థుడు, నటకుడు, నాట్యము చేయు పిల్లవాడు. (స్త్రీ) కాశ్మీరభాష.

**کشنیز-کشنیج** కష్నీజ్ - జ్ (పా.పు) కుస్తుంబరి, కొత్తిమిరి, ధనియాలు.

**کشود** కుషూద్ (పా. స్త్రీ) తెరచుట, విప్పుట; లాభము, జయము; వ్యాపించుట, వ్యాపనము.

**کشور** కిష్వర్ (పా.స్త్రీ) దేశము, భూఖండము, (కషూర్) గంధకచోరము.

**کشیدگی** కషీదగీ (పా. స్త్రీ) ఆకర్షణము, గుంజుడు, సంకోచము, అసమాధానము, స్పర్ధ.

**کشیدہ** కషీద (పా) ఆకర్షితమైన, లాగబడిన, సాగిన, సంకుచితమైన, బిగిసిన, నిడుపైన, పొడుగైన, అనుభూతమైన, సహించిన, రోసిన, అసమాధానపడిన, విముఖమైన, చింతనొందిన, కోపపడిన, తీసిన, కుట్టిన, సరిగ, కుట్టుకుట్టిన, కుట్టుపనిచేసిన. (పు) సరిగపని, కుట్టుపని. **کشیدہ خاطر ہونا** - ఖాతిర్ హోనా (పా) అసమాధానపడుట, చింతిలుట, మనసునొచ్చుట.

**کعب** కఉబ్ (అ.పు) కాలి చీలమండ; పాచిక; ఘనము; పొడుగు వెడలుపు ఎత్తు లేక లోతు సమానముగల ఆకారము.

**کعبتین** కఉబతైన్ (అ.పు) దేవాలయ ద్వయము; మక్కాలోనియు జరుసలేము లోని దేవాలయములు, పాచికలు (రెండు).

**کعبہ** కఉబ (అ.పు) నలుచదరమైనకట్టడము, మక్కాలోని మందిరము (మహమ్మదీయ యాత్రస్థానము).

**کف** కఫ్ (అ.పు) అరచేయి, అరకాలు, చేయి, హస్తము, చేర, పిడికిలి, చొక్కాయ యొక్క ముంచేతికప్పులు.

**کف** కఫ్ (పా.పు) కఫము, నురుగు, ఫేనము, ఉమ్మి, కల్లె, అశ్వశిక్షకుడు, చేయి (అయిదు) **کف افسوس ملنا** -ఎ, అఫ్సూస్ మల్నా (ఉ) చేతులుపిసుకుకొనుట, చింతపడుట, పశ్చాత్తాపపడుట. **کف پا** -ఎ, పా (పా) అరకాలు. **کف پائی** - పాయీ (పా) అరకుమచ్చలు, అరుచెప్పులు, పలచని పాదరక్షలు. **کف دست** -ఎ,

కష్టము, ఇబ్బంది, సంకటము, చిక్కు, జగడము, పోట్లాట, వివాదము.

**کشا** కుషా (పా.ప్ర) తెరచెడువాడు, విమోచకుడు, (వృత్తి యందు).

**کشاد** కుషాద్ (పా) తెరచుట, విప్పుట, విమోచకుడు, సుఖదాయకుడు.

**کشادگی** కుషాదగీ (పా.స్త్రీ) వైశాల్యము, విస్తీర్ణము, ఎడము, వెడల్పు, పొడుగు, విరివి, విపులత, ఆహ్లాదము.

**کشادہ** కుషాద (పా) తెరచియున్న, ఎడముగానున్న, విశాలమైన, బయలుగ నున్న, వెడల్పైన, పొడుగైన, విపులమైన, వికసితమైన. **کشادہ ابرو** -అబ్రూ (పా) విశాలభ్రూమధ్యముగల. సంతోషముగా నున్న. **کشادہ پیشانی-جبیں-رو** -పేషానీ -జబీఁ -రూ (పా) వికసిత ముఖమైన, నగుమోముగల, **کشادہ دل** -దిల్ (పా) ఉదారబుద్ధిగల. సంతోషమనస్కుడైన. **کشادہ رو** -రౌ (పా) వెనక కాళ్లు పంటించి నడచెడు (గుఱ్ఱము). **کشادہ کشادہ** -కుషాద (హి) ఎడఎడముగా, మూర మూరముగా, విడివిడిగా.

(బట్టబయలుచేయునట్టి.

**کشاف** కశ్శాఫ్ (అ) బాగా తెరచువాడు,

**کشاکش** కషాకష్ (పా.స్త్రీ) ఇగ్గాముగ్గు, గుంజులాట, పీకులాట, సమ్మర్షము, జగడము, పోట్లాట, కల్లోలము.

**کشاورز** కషావర్జ్ (పా.పు) కాపుదనము చేయువాడు, కృషీవలుడు, కాపు.

**کشایش** కుషాయిష్ (పా.స్త్రీ) తెరచి, వికసనము, వికాసము, ఉల్లాసము, సంతోషము.

**کشت** కుష్త్ (పా.స్త్రీ) హత్య, చంపుట. **کشت وخون** -ఒ,ఖూన్ (పా) సంహారము, వధము.

**کشت** కిష్త్ (పా.స్త్రీ) సేద్యము, వ్యవసాయము, పైరులపొలము, వితుక పొలము, చదరంగములో తోసిరాజనుట. **کشت زار** -జార్ (పా.స్త్రీ) పంటపొలము. **کشت کار** -కార్ (పా.పు) కాపు, సేద్యగాడు. **کشت کاری** -కారీ (పా.స్త్రీ) సేద్యము. కాపుదనము.

**کشتم کشتا** కుష్తమ్‌కుష్తా (హి.పు) పోట్లాట, కొట్లాట.

**کشتہ** కుష్త (పా) హతము, చంపబడిన, భస్మము, పీనుగు, మోహితుడైన, లోహముల భస్మము.

**کشتی** కిశ్తీ (పా.స్త్రీ) పడవ, నావ; ఆదిరాణము, సాంకుతట్ట. పానాయినెన్న, అక్షయపాత్ర. **کشتی بان** -బాన్ పడవవాడు, నావికుడు.

**کشتی** కుష్తీ (పా.స్త్రీ) మల్లయుద్ధము, పల్లాట, జెట్టిగట్టు, పోట్లాట, పెనుగులాట. **کشتی باز-گیر** -బాజ్ -గీర్ (పా) మల్లుడు, జెట్టి. **کشتی دلانا** -దిలానా (హి) జెట్టిపట్టించుట, మల్లాడించుట. **کشتی کرنا-لڑنا** -కర్నా -లడ్నా (హి) పల్లాడుట, పెనుగులాడుట, జెట్టిపట్టుపట్టుట.

**کشٹ** కష్ట్ (హి.పు) కష్టము.

**کشٹا** కిష్టా (హి.పు) జెల్లిడుపండు.

**کشش** కషిష్ (పా.స్త్రీ) ఆకర్షణము, ఈడ్పు, లాగుట, ఆసక్తి, ఆశ, మోహము, కామము, వాలు, కులుకు, ఆలస్యము, వెనుకదీయుట. కష్టము, సంకటము, అసమాధానము, స్పర్ధ.

**کشف** కషఫ్ (పా.పు) తాబేలు, కచ్ఛపము.

**کشف** కష్ఫ్ (అ.పు) తెరచుట, తెలుపుట, వెల్లడియగుట, వెల్లడిచేయుట, వివరణము,

చోూచుట, తుపాకి దట్టించుట, ధర హెచ్చించుట, వెల ఎక్కువ చేయుట, తక్కువగాతూచుట, బిగ్గరగాఅనుట.

**کسوانا** కస్వానా (హి) ఇది **کسنا** యొక్క ప్రేరణార్థకము; బిగదీయించుట, గుంజి కట్టించుట, కట్టించుట, బిగుతుగాచేయించుట, కష్టపెట్టించుట, ఒత్తించుట, పరీక్షచేయించుట, ?ట్టనచేయించుట, ధరఎక్కువ చేయించుట, తక్కువగా తూపించుట, బాధపెట్టించుట, వేయించుట, బిగ్గరగా అనుపించుట.

**کسوانا** కుస్వానా (హి) శాపముపెట్టించుట.

**کسوت** కిస్వత్ (అ.స్త్రీ) చూడు **کسبت** వస్త్రాలంకారము, దుస్తులు, ఆకారము, రూపము, వైఖరి, రీతి.

**کسوتی** కసౌటీ (హి. స్త్రీ) ఒరగల్లు, గీటురాయి, వన్నె, మచ్చు, పరీక్ష, కష్టము, ప్రమాణము. **کسوتی پر لگانا** -పర్ లగానా (హి) ఒరపెట్టిచూచుట, పరీక్షచూచుట.

**کسور** కుసూర్ (అ. స్త్రీ) భాగములు, అంశములు, ఖండములు, భిన్నాంకములు, (ఏ. వ **کسر**)

**کسوف** కుసూఫ్ (అ.పు) సూర్యగ్రహణము.

**کسوں** కసూం (ఉ) మెల్లకండ్లు లేక పిల్లికండ్లుగల (గుఱ్ఱము).

**کسوندی** కసౌందీ (హి. స్త్రీ) ఒకవిధమైన ఊరగాయ; కసిందచెట్టు.

**باس کی کسوندی** బాస్‌కీక సౌందీ (హి) కాసమర్దకము, నూతికసింద, తగరచెట్టు, వైడితంగేడు.

**کسی** కసీ (హి. స్త్రీ) తొల్లిక, చిన్నపార; ఆరడుగులకొలత.

**کسے** కసే (పా) ఒకానొకడు, ఒక మనిషి, ఒకడు, ఎవరో ఒకరు. **کسے باشد** -బాషద్ (పా) ఎవరేకాని, ఎవరోఒకడు.

**کسے** కిసే (హి) ఎవరికి, ఎవరిని.

**کسی** కిసీ (హి) ఏదైన, ఎవడైన, ఏమైన, ఒకానొక, ఏదోఒక. **کسی ایک**-ఏక్ (హి) ఏదోఒక, ఎవరోఒక, ఏమోఒక, ఒకానొక. **کسی قدر** -కదర్ (ఉ) ఎంతైనను, ఏమాత్రమైన, కొంచెముగా, కొద్దిగా, స్వల్పముగా. **کسی نہ کسی** -నకిసీ (హి) ఎవరోఒక, ఒకానొక, ఏదోఒక. **کسی نے** -నే (హి) ఎవరోఒకరు ఎవరో, ఒకడు.

**کسیانا-کسیاجانا** కసియానా - కసియా జానా (హి) చిలుమూరుట, కిలుముపట్టుట, చెడిపోవుట.

**کسیرا** కసేరా (హి.పు) కంచెరవాడు.

**کسیرو** కసేరూ (హి.పు) ఒకవిధమైన గడ్డిదుంపలు (ఇవికాల్చియుఁవట్టివియునుతిందురు).

**کسیرہٹا** కసేర్‌హట్టా (హి.పు) కంచెరవీధి, కంచెరంగళ్లు. (గంధకముల విక్రయము.

**کسیس** కసీస్ (హి.పు) అన్నభేది, లోహ

**کسیف** కసీఫ్ (అ) మాలిన్యముగల, మష్టుగల, చిక్కని, భారమైన, దుష్టమైన, దూషితమైన, నిర్భాగ్యమైన.

**کسیلا** కసేలా (హి) మలినము, కలుషితము, ఒగరైన, అరుచి ల.

**کش** కుష్ (పా.పు) చంపువాడు, చంపెడు, నాశకము, సహనము, మారకము, చంపునది.

**کش** కష్ (పా.పు) ఆకర్షకము, లాగునది, సహించునది, ఈడువు, గుర్రిక్క, సహనము (వృత్తియందు):

**کشمکش** -మకష్ (పా) ఇగ్గాముగ్గి, గుంజులాట, పీకులాట, అసమాధానము, చింత, వ్యాకులము, వెనకముందాట,

ఎల్లలు ఏర్పరచుట. کوچہ سر بستہ -చె, సర్‌బస్త (పా) మూతసందు, దాటి ఆవలకు బోవుటకు దారి లేని సందు లేక వీధి. کوچہ گرد -గర్ద్ (పా) వీధులు తిరుగువాడు, తిరుగువాడు, దిప్పకాయ.

کوچی కూచీ (హి. స్త్రీ) కూర్చియు లేక కూర్చె, వరహాకట్ట.

کود కూద్ (హి. స్త్రీ) గంతు, దూకు, దాటు. کود پھاند -ఫాంద్ (హి. స్త్రీ) గంతులు, ఆటలు.

کودک కోదక్ (పా. పు) బాలుడు, పిల్లవాడు, పిల్లడు, పిల్లకాయ.

کودگر కోద్గర్ (పా. పు) త్రవ్వువాడు.

کودن కౌదన్ (పా. పు) మెల్లగానడచెడు గుఱ్ఱము, మోతగుఱ్ఱము; మందబుద్ధి, తెలివి మాలినవాడు.

کودنا కూద్నా (హి) దూకుట. దాటుట, గంతు వేయుట, ఎగురులాడుట, త్రుళ్లుట, సంతోషించుట.

کودو-کودوں కోదూ-కోదూఁ (హి. స్త్రీ) ఒక రకపు ధాన్యము, کودوں دیکے پڑھنا -దేకె పఢ్నా (హి) తప్పుపెట్టి నేర్చుకొనుట, తేరగా నేర్చుకొనుట, బాగా నేర్వకపోవుట, హీనాహారము. کودوں دلانا -దలానా (హి) కష్టపెట్టుట.

کور కోర్ (హి. స్త్రీ) అంచు, కమ్మి, కడ, కొన, మొన, అగ్రము; పిడకతునక; గోటి మొదటిలో వేచిన చిగురు. کور کسر -కసర్ (ఉ. స్త్రీ) ఎచ్చు తగ్గులు, తగ్గు మొగ్గులు, లోపములు, కొఱతలు.

کور కోర్ (పా) అంధము, గ్రుడ్డి. کور باطن-دل -బాతిన్-దిల్ (పా) బుద్ధి హీనుడైన, తెలివిలేని. کوربخت -బఖ్త్ (పా) దురదృష్టమైన. کورده -దెహ్ (పా) కుగ్రామము, పల్లెకొంప. کورنمک -నమక్ (పా) కృతఘ్నుడు, మేలుమరచువాడు.

کورا కోరా (హి) క్రొత్త, వాడని, ఉపయోగించబడని, ఉతక, వట్టి, వ్రాయని, వన్నె వేయని, తడపని, నేసినది నేసినట్లున్న, క్రొత్తగా నేసిన, చలువచేయని, గంజి బెట్టుగల, చదువురాని, విద్యలేని, అశిక్షితుడైన, బుద్ధిలేని, తెలివిమాలిన, అనుభవములేని, మూఢుడైన. దరిద్రుడైన, రిక్తుడైన, కలిపిగోలుతనము లేని, మొగమోటము లేని, నిర్దాక్షిణ్యుడైన, శుద్ధమైన, బొత్తిగా, పూర్తిగా, సాంతముగా, మాత్రము.

کوراپن -పన్ (హి) క్రొత్తదనము, అనుభవము లేమి. کوراپنڈا -పిండా (హి) పురుష స్పర్శ లేని యువతి లేక స్త్రీస్పర్శ లేని పురుషుడు, కన్య, బ్రహ్మచారి.

کورپان కోర్‌పాన్ (హి. స్త్రీ) బట్టలకు వేయుగంజి, బిగువు, బెట్టు.

کورنش కోర్నిష్ (తు. స్త్రీ) వంగుట, నమనము, నమస్కారము, వందనము.

کوری కోరీ (హి) ఇది کورا యొక్క స్త్రీలింగము. کوری آنکھ سے دیکھنا -ఆంఖ్ సే దేఖ్నా (హి) కోరచూపు చూచుట, తేరి చూచుట, నిర్భయముగాను నిర్లజ్జగాను చూచుట. کوری سنانا -సునానా (హి) స్పష్టముగా అనుట, తిట్టుట. (సాలెవాడు.

کوری కోరీ (హి. స్త్రీ) కన్య, కన్నె;

کورے کی جڑ కోరేకీ జడ్ (ఉ) ముస్తకము, తుంగముస్తె (వేరు).

సము) దంచేబడిన, కొట్టబడిన, కష్టమను భవించిన.

**کوفہ** కూఫ (అ.పు) అరబ్బీ దేశమందలి యొక గ్రామము, ఇక్కడి జనులు మిక్కిలి క్రూరులు.

**کوفی** కూఫీ(అ) కూఫాగ్రామస్థుడు, క్రూరుడు, కృతఘ్నుడు.

**کوک** కోక్ (హి.పు) కోక్కోకశాస్త్రము, కోకము; ఒకహంస (ఎఱ్ఱనిది).

**کوک** కూక్ (పా. స్త్రీ) దూర దూరముగా కుట్టుట, దూకుట్టు, పోగుపెట్టుట. **کوک دینا** -దేనా (హి) దూకుట్టు కుట్టుట, పోగుపోయుట.

**کوک** కూక్ (హి. స్త్రీ) కూక, కేక, కూత, అరపు, ధ్వని, అల్లరి, గొల్లు, కలరవము; కేకారవము, నెమలికూత; ఏడ్పు; గడియారము మొ॥ వానిబీగము.

**کوکا** కోకా (హి.పు) సిక్కు మతములోని యొక క్రొత్తతెగపేరు; సన్నచీల, మొల; దాదికొడుకు. **کوکا بیلی** -బేలీ (హి) కోకనదము, ఎఱ్ఱకలువ.

**کوکب** కౌకబ్ (అ.పు) నక్షత్రము.

**کوکبہ** కౌకబ (అ.పు) నక్షత్రము; గుంపు, మూక, పరివారము; వైభవము, పటాటోపము; రాచేమెరవడి, రాజపరివారముతో గూడ బయలుదేరగా ముందరకొనిపోవు మెరసెడు ఉక్కుగుండు.

**کوکر** కూకర్ (హి. పు) కుక్కురము, కుక్క. **کوکر بسیرا** -బసేరా (హి) స్వల్ప విశ్రాంతి, కొద్ది నిలుకడ. **کوکر لینڈ** -లేండ్ (హి) కుక్కపీకులాట. **کوکرمتّا** -ముట్టా (హి) కుక్క గొడుగు.

**کوکلا - کوکل** కోకిల్ - లా (హి. స్త్రీ) కోకిల పక్షి.

**کوکنا** కూక్నా (హి) దూకుట్టుకుట్టుట, పోగుపోయుట.

**کوکنا** కూక్నా (హి) కూకవేయుట, అరచుట, కేకవేయుట, కేకరించుట, కూయుట, కూతపెట్టుట, బాధచేతఅరచుట, అల్లరిచేయుట, నెమలి, గువ్వ, కోకిల మొ॥ నవి కూయుట; గడియారము మొ॥ వానికి బీగము యిచ్చుట లేక బిస తిప్పుట.

**کوکنار** కొక్నార్ (పా.పు) గసగసాల గింజలు లేక కాయ.

**کوکنی** కోక్నీ (హి) చిన్న, పొట్టి, తక్కువైన.

**کوکنی** కోక్నీ (హి.పు) ఒకవర్ణము, ధూమ్రవర్ణము, ఊదావన్నె.

**کوکو** కోకో (హి. స్త్రీ) కాకి, బూచి (పిల్లలను భయపెట్టుట).

**کوکہ** కోక (తు.పు) దాదికొడుకు లేక కూతురు, ఒకతల్లిపాలు తాగినవారు.

**کوکھ** కోఖ్ (హి. స్త్రీ) ఉదరము. కడుపు, గర్భము, మేలు, డొక్క, ప్రక్కకడుపు, సంతానము. **کوکھ بند** -బంద్ (హి) గొడ్రాలు. (ఊదావన్నె.

**کوکئی** కోకయీ (హి. స్త్రీ) ధూమ్రవర్ణము

**کول** కౌల్ (హి.పు) ఊచేబియ్యము.

**کول** కవల్ (హి.పు) కమలము, బుక్క.

**کولا** కౌలా (హి.పు) కవల, ద్వారము యొక్క కుడి ఎడమ ప్రక్కలు, ప్రక్క గోడ. వాకిటి మొత్త గోడ, వాకిటి మూల లేక మొత్త, మూల; కౌగిలి, ఆలింగనము; కమలాఫలము, తియ్యకిచ్చిలిపండు.

**کولا - کولھا** కూలా కూల్హా (హి.పు) పిరుదు,

کوہ آتش خیز - فشاں -ఎ, అతిష్ ఖేజ్ -అతిష్ఫిషాం (పా) అగ్ని పర్వతము, జ్వాలాముఖి. کوہ آدم -ఎ, ఆదమ్ (పా) లంకయందలి ఒక పర్వతము పేరు. کوہ پیکر -ఎ, పైకర్ (పా) పర్వతమువంటి, అతిబలాఢ్యమైన. کوہ کن -కన్ (పా) షీరీనుయొక్క ప్రియుడైన ఫర్హాదుయొక్క ఉపనామము. کوہ نور -ఎ, నూర్ (పా) ప్రపంచమందలి అన్ని వజ్రములకంటె పెద్దదియైన ప్రస్తుతము హిందూదేశ చక్రవర్తి మెడలోనుండు ఒక వజ్రముపేరు (ఇది హిందూదేశమున పుట్టినది).

کوہان కోహాన్ (పా.పు) కకుదము, ఒంటెలేక ఎద్దుయొక్క మూపురము.

کوہر కోహర్ (హి. స్త్రీ) గూడ మంచు, పొగమంచు.

کوہسار కోహ్సార్ (పా.పు) పర్వతపంక్తి, కొండభూమి, శైలదేశము.

کوہستان కోహిస్తాన్ (పా.పు) కొండభూమి, పర్వతప్రదేశము, పర్వత ప్రాంతము.

کوہستانی కోహిస్తాని (పా.పు) కొండదేశపువాడు, పర్వతమయమైన, కొండదేశపు.

کوہنی కోహ్నీ (హి. స్త్రీ) మోచేయి,

کوہی కూహీ (హి. స్త్రీ) సాళువ, డేగ.

کوہی కోహీ (పా) పర్వతపు, పర్వతమయము.

کویا కోయా (హి.పు) కంటిగ్రుడ్డు, కంటికొలికి; పిసినికాయ, పట్టుపురుగుకోశము.

کوئی కోయీ (హి) ఏ, ఏదైన, ఏమైన, ఎవడైన, ఎవరైన, ఏదోఒక, ఒకానొక, ఏమో, ఎవడోఒకడు, ఎవరో ఒకరు, ఏమో, ఏదో, ఎవడో, ఎవరో, ఒక, ఒకడు, ఇంచుమించుగా, దాదాపుగా, ఉరమరగా, రమారమి, కొద్ది, కొంచము, కొన్ని کوئی دم -దమ్ (హి) స్వల్పకాలము, శీఘ్రము. کوئی دن -దిన్ (హి) కొద్దిదినములు, కొన్నిదినములు. کوئی سا - سی -సా-సీ(హి) ఒకానొక, ఏదోఒక, ఏదైన, ఎవరైన, ఏమైన, ఎవరోఒకరు. کوئی کوئی -కోయీ (హి) కొందరు, ఒకరొకరు, ఎవరైన. کوئی نہ کوئی -నకోయీ (హి) ఒకానొక, ఏదోఒక, ఎవరోఒకరు, ఏదైనను, ఎవరైనను. کوئی ہو -హో (హి) ఎవరేకాని, ఎవరైనాసరే, ఏదేకాని, ఏదైననుసరే. کوئی ہے -హై (హి) ఎవరక్కడ (సేవకుడెవరైన ఉన్నాడా).

کوے کا نشاستہ కోయేకా నషాస్త (ఉ) సీమపిండిగడ్డలు, ఆరారూటు పిండిగడ్డలు.

کوئل కోయల్ (హి. స్త్రీ) కోకిలపక్షి.

کوئلا - کوئیلا కోయ్లా- కోయీలా (హి.పు) అంగారము, బొగ్గు.

کویہ కోయ (పా.పు) పిసినికాయ, పట్టుపురుగుండెడికాయ.

کہ కె (పా) ఎవరు, ఏమి, ఏది, ఎందుకనగా, ఏలనగా, కొరకు, కై, లేక, కాక, ఇంతలో, అప్పుడే, లేటాలున, అకస్మాత్తుగా; అని, కద, కదా.

کہا కహా (హి.పు) అనినది, చెప్పినది, వచనము, మాట, పలుకు, వాక్యము. کہا سنا - سنی -సునా-నీ (హి) అనినది వినినది, అనినవి వినినవి, చెప్పుడుమాటలు, పోడి, కొండెము, మంచిచెడ్డలు, సంభాషణము.

کھانا ఖానా (హి) భుజించుట, తినుట, మ్రింగుట, తినివేయుట, అనుభవించుట, సహించుట, అపహరించుట, పట్టుట, లంచము తినుట, ప్రాణము తినుట, బాధించుట, పీడించుట, విసికించుట, వ్యయపరచుట, కాజేయుట, లేకుండ జేయుట, నాశము జేయుట, కొరకుట, కాటు వేయుట, గాయముచేయుట, పడుట, పొందుట.

کھانپ ఖాంప్ (హి. స్త్రీ) బద్ద, చెక్క.

کھانچا ఖాంచా (హి.పు) గంప, బుట్ట, కోళ్లనుమూయుగంప, పంజరము, గూడు.

کھانڈ ఖాండ్ (హి. స్త్రీ) కండ చెక్కెర.

کھانڈا ఖాండా (హి. స్త్రీ) పట్టాకత్తి, రెండువాయిలకత్తి. کھانڈا بجنا - బజ్నా (హి) ఖడ్గవాదమగుట, యుద్ధమగుట

کھانسنا ఖాంస్నా (హి) దగ్గుట.

کھانسی ఖాంసీ (హి. స్త్రీ) దగ్గు, కాసము.

کھانگ ఖాంగ్ (హి.పు) ఏనుగుదంతము, పందికోర; ఖడ్గమృగముకొమ్ము.

کھاو ఖావ్ (హి) తిండిపోతు. کھاو اڑاو -ఉడావ్ (హి) దూబరతిండి.

کہاوت కహావత్ (హి. స్త్రీ) సామెత, లోకోక్తి, వచనము, వాక్యము.

کھائی ఖాయీ (హి. స్త్రీ) ఖాతము, అగడ్త.

کھبا - کھبی ఖబ్బా – బ్బీ (హి) దాపలి, ఎడమ, పుఱ్ఱి, ఎడమచేయివాడుకగల.

کھبنا ఖుబ్నా (హి) గ్రుచ్చుకొనుట, గ్రుచ్చుడుపడుట, దూరుట, నాటుట, పట్టుట, కంటికింపై యుండుట, మనసుకు నాటుట, మనసుపట్టుట.

کھپاچ ఖపాచ్ (హి. స్త్రీ) వెదురుపేడు, వెదురుపుల్లలేక పుడుక; మిగుల బక్క నిమనిషి.

کھپا دینا - کھپانا ఖపానా–దేనా (హి) వినియోగపెట్టుట, సెలవుచేయుట, వ్రయపరచుట, వ్యయపెట్టుట, ఉపయోగపరచుట, కాజేయుట, పోగొట్టుట, నష్టము జేయుట, ఇముడ్చుట, పట్టించుట, చొనుపుట, నింపుట, ఇనికించుట, చితకపొడుచుట, నలగకొట్టుట.

کھپت ఖపత్ (హి. స్త్రీ) వ్రయము, సెలవు, విక్రయము, అమ్మకము, వినియోగము, పట్టుట, ఇమిడిక, ఎడము, స్థలము, ఇముడుట.

کھپچی ఖపచ్చీ (హి. స్త్రీ) చూడు کھپاچ

کھپچی ఖప్చీ (హి. స్త్రీ) కౌగిలి, ఆలింగనము.

کھپر ఖప్పర్ (హి.పు) కపాలము, పుఱ్ఱె, జోగివాండ్ల సొరకాయ చిప్ప లేక బుఱ్ఱ, బలిరక్తముపోయుపళ్లెము.

کھپرا ఖపారి (హి.పు) పెంకు, వెడుపాటి ములికిగలబాణము, పొలుసు; పెంచు, మూకుడు, పెంకాసు, తునక, ముక్క, పేడు, పొట్టు, తాట, చెక్క, తోలు, పట్ట, గోధుమలకు పట్టు పురుగు.

کھپریل ఖప్రేల్ (హి. స్త్రీ) పెంకుటికప్పు, పెంకుటిల్లు.

کھپنا ఖప్నా (హి) వ్రయపడుట, వ్రయమగుట, సెలవగుట, అయిపోవుట, పట్టుట, ఇముడుట, చొరుట, ఇంకుట, ఎండిపోవుట, అమ్ముడుపోవుట, విక్రయపడుట, వినియోగపడుట, కృశించుట, క్షయించుట, నాశిలుట, చేచ్చుట.

کھتا ఖత్తా (హి.పు) ధాన్యముపాతిపెట్టుగోయి, పాతర, పాతిపెట్టుగుంట, రాశి, ప్రోగు, బొక్కసము, ఉగ్రాణము, బండారము.

کہتا కహ్తా (హి.పు) అనువాడు, చెప్పువాడు.

వేయబడుట; చిక్కులోపడుట; చాలా కాలము వరకు నిలిపివేయబడుట; ఆగిపోవుట; కాలముజేయకున్నట్లగుట.

**کھٹ پٹ** ఖట్ పట్ (హి. స్త్రీ) శ్రమ, కష్టము, చూడుము **کھٹ پٹی**

**کھٹک** ఖటక్ (హి. స్త్రీ) పోటు, సలుపరము; సంకటము, కష్టము.

**کھٹکا** ఖట్కా (హి. పు) కటుక్కు లేక టుక్కు (తాకుచప్పుడు), అడుగుల చప్పుడు, చప్పుడు; పోటు, సలుపరము; పండ్లచెట్లపై పక్షులు వాలకుండ చప్పుడు చేయుటకై కట్టు వెదురుతుంట మొ॥; గడియ, కొలికి, మీట, కొక్కి, తగులు; తాళములోని మీట; స్వరముయొక్క ఇంపైనకంపనము లేక ఒత్తు లేక ఝూడింపు; భయము, బెంగులు, దిగులు, భీతి, సంకోచము; అనుమానము, సందేహము, జంకు, శంక, సంశయము; చింత, భ్రమ; మరుగుదొడ్డి.

**کھٹکا** ఖుట్కా (హి. పు) నష్టము, తుట్టి, సంశయము, సందేహము, భ్రమ, శంక, అనుమానము, భయము, చింత, చప్పుడు.

**کھٹکنا** ఖటక్నా (హి) గుచ్చుకొనుట, కంటకముగానుండుట, నొప్పిపుట్టించుట, నొచ్చుట, పోటుపుట్టుట, సలుపుట, మెరమెరలాడుట, వేదనకలుగజేయుట, అనిష్టముగానుండుట, కష్టముగాతోచుట, కటకటమనుట, కొట్టుకొనుట, చప్పుడగుట, మ్రోగుట, అయిష్టపడుట, విముఖమగుట, వైమనస్యముకలుగుట, విసుకుట, జగడమగుట, జెడియుట, విరోధమగుట, పోట్లాటజరుగుట, బెదరుట, భయపడుట, దిగులుపడుట, జంకుట, సంకోచించుట, అనుమానించుట, శంకించుట, నాటుకొనుట, మనసుకుతట్టుట, ఇంపుగానుండుట

**کھٹکنا** ఖుటక్నా (హి) గుడ్డునుముక్కులో పొడుచుకొని పిల్లలు బయటికి వచ్చుట. కొరికి లేక పొడిచితీయుట.

**کھٹ کھٹ** ఖట్ ఖట్ - ఖుట్ ఖుట్ (హి. స్త్రీ) టుక్కుటుక్కు, టికుటికు, సుత్తెపోటులు, చప్పుడు, శ్రమ, కష్టము, సంకటము, కటకట.

**کھٹکھٹا** ఖట్ఖటా (హి) కటకట; జగడము, వ్యాకులము; చిక్కులు, జంజాటము, వ్యాపారము; పాటు, కష్టము.

**کھٹکھٹانا** ఖట్ఖటానా (హి) కటకట మనిపించుట, గొళ్లెమువాయించుట, చప్పుడు చేయుట, తట్టుట, కొట్టుట, చప్పటలు తట్టుట.

**کھٹکی** ఖుట్కీ (హి. స్త్రీ) దారము మొ॥ వానికి పంటితో కాటువేయుట, గుంటపెట్టుట.

**کھٹ گیر** ఖట్ గీర్ (ఉ. పు) చూడు **کھٹمل**

**کھٹلا** ఖట్లా (హి. పు) ఇంటివారు; ఇంటిసామాను; వస్తుసామగ్రి, పరివారము, భార్యాపిల్లలు, కుటుంబము వారు; అసమాధానము, స్పర్ధ, జగడము, ఆటంకము, చిక్కులు, జంజాటము.

**کھٹ مٹھا** ఖట్ మిట్ఠా (హి) చూడు **کھٹا میٹھا**

**کھٹمل** ఖట్ మల్ (హి. పు) మత్కుణము, నల్లి; ఒకపురుగు.

**کھٹنا** ఖట్నా (హి) గడించుట, ఆర్జించుట, లాభమగుట, నిలుచుట, సాగుట.

**کھٹو** ఖట్టూ (హి) గడించువాడు, సంపాదనపరుడు, కష్టము చేయువాడు; వైతనికుడు, కూలివాడు.

**کھٹواٹی** ఖట్వాటీ (హి. స్త్రీ) కోపమువచ్చి

**کھدانا** ఖుదానా (హి) బంకమన్ను త్రవ్వి నచోటు, గుంట, గోయి.

**کھدائی** ఖుదాయీ (హి.స్త్రీ) ఖననము, త్రవ్వుట, త్రవ్వినకూలి, చెక్కుటపుపని, చెక్కడము.

**کھدبد** ఖద్‌బద్ (హి.స్త్రీ) కుతకుత, కళ పెళ, ఉడుకు చప్పుడు, ఉడుకు.

**کھدبدانا** ఖద్‌బదానా (హి) కుతకుత లాడుట, కళపెళలాడుట, ఉడుకుట.

**کھدرا** ఖుద్రా (హి) మెరక పల్లములుగల, సమముగాలేని, బరుసైన, నునుపుగాలేని.

**کھدنا** ఖుద్నా (హి) త్రివ్వబడుట, చెక్క బడుట, చెక్కడపుపనిచేయబడుట, చిత్రింప బడుట; వెల్లగిలుట, నిర్మూలమగుట, పాడగుట.

**کھدوانا** ఖుద్వానా (హి) త్రివ్వించుట, చిత్తరువు మొ॥నవి చెక్కించుట.

**کھدوائی** ఖుద్వాయీ (హి. స్త్రీ) త్రవ్వించుకూలి, చెక్కడపుపనిచేయించినకూలి.

**کھدها** ఖుధా (హి.స్త్రీ) క్షుధ, ఆకలి.

**کھدیا** ఖుదియా (హి) క్షుధగల, ఆకొన్న.

**کھدیڑ** ఖదేడ్ (హి.స్త్రీ) వెంబడింపు, తరుముడు.

**کھدیڑنا** ఖదేడ్నా (హి) వెంటతగులుట, వెంబడించుట.

**کھڈ** ఖడ్డ (హి.పు) కొండలసందు కాలువ, ఏరు, కనుమ, అగడ్త, లోయ.

**کھڈی** ఖుడ్డీ (హి. స్త్రీ) మరుగు దొడ్డిలోని పొయ్యి లేక పొయ్యిగడ్డలు, గుంట, పండ్ల నడిమి సందు, తొట్టి, పొయ్యి యాకా రముగా లేక అర్ధచంద్రాకారముగా ముం దరి వెంట్రుకలుమాత్రము గొరిగిన తలపని, శౌచపుపీట (నడుమరంధ్రముండును).

**کھر** ఖుర్ (హి) ఖురము, చీలిన డెక్క లేక గొరిజె, గుఱ్ఱపు లాడెము.

**کھر** ఖుర్ (హి. స్త్రీ) దగ్గు, దగ్గు చప్పుడు. **کھرکھرانا** -ఖురానా (హి) దగ్గుట.

**کھرا - کہرا** ఖుర్హా - ఖుర్హా (హి. స్త్రీ) చూడుము **کوهر**

**کھرا** ఖుర్రా (హి.పు) బట్టపై మడతలును మెలికలును ఏర్పరచు గిన్నెవంటి యొక సాధనము, అచ్చుగిన్నె, అచ్చుచిప్ప, అచ్చుబండపై అక్షరములుతుడుచుబొంత ఇటుక, బొంతరాయి (ఒక కరకైన మిశ్ర పదార్థము); కాఠిన్యము, కఠినుడు, కఠిన స్వభావుడు. (చిత్తు.

**کھرا** ఖర్రా (హి.పు) చిత్తుకవిలె, చిత్తులెక్క,

**کھرا** ఖరా (హి) నికరమైన, స్వచ్ఛమైన, శుద్ధమైన, ఉత్తమమైన, నిష్కపటమైన, అకృత్రిమమైన, నిర్వ్యాజమైన, న్యాయ మైన, నిజమైన, నీతిగల, సత్యవంతుడైన, సరళమైన, నిష్పక్షపాతమైన. **کھراپن** -పన్ (హి) పరిశుద్ధత, న్యాయము, నిష్కా పట్యము, యదార్థత, నిజాయితి. **کھرا کھیل** -ఖేల్ (హి.పు) న్యాయ వ్యవహా రము, నీతివర్తనము, శీఘ్రగు.

**کھرام** కుహ్రామ్ (హి.పు) ఏడ్పులార్పులు, శోకము, లబలబలు, అల్లకల్లోలము.

**کھراٹ** ఖుర్రాట్ (హి.పు) మిక్కిలి వృద్ధుడు, అనుభవశాలి, జిత్తులమారి.

**کھراند** ఖురాంద్ (హి. స్త్రీ) మాడుకంపు, మురికి కంపు, కంపు.

**کھرب** ఖర్బ్ (హి.పు) ఖర్వము, లక్షకోట్లు.

**کھڑ** ఖడ్ (హి. స్త్రీ) గాజుపొడి, సొమ్ములకు మెరుగుపెట్టు గాజు ఇసుక; రవపొడి; గడ్డి, కసవు.

**کھڑا** ఖడా (హి) నిలబడియున్న, నిలువుగా నున్న. స్థిరముగానున్న, అమర్చియున్న, సైరుగల(పొలము), సగముడుడికిన, శీఘ్రమైన, తాత్కాలికమైన. **کھڑا پچھاڑیں کھانا** -పఛాడేంఖానా (హి) చాపకట్టుగా పడుచుండుట, లేచిలేచి పడుచుండుట. **کھڑا دونا** -దానా (హి) ఆతురమైన వైద్యము. **کھڑا کھیل** - ఖేల్ (హి) తాత్కాలిక వ్యవహారము, తొందరపాటు వ్యవహారము. **کھڑا ہونا** -హోనా (హి) నిలువపడుట, సంభవించుట, దూకుట్టు కుట్టుట. **کھڑے پاؤں** ఖడే పావూం (హి) వెంటనే, తక్షణము. **کھڑے پاؤں کا روزہ** ఖడే పావూం కా రోజే (హి) నిలువు కాళ్ల జీతము. **کھڑےکھڑے** -ఖడేఖడే (హి) తక్షణము, వెంటనే, ఇంతలో. **کھڑے گھاٹ دھلوانا** ఖడేఘాట్ ధుల్వానా (హి) ఉడకపెట్టకుండ వెంటనే ఉతికించుట.

**کھڑاکا** ఖడాకా (హి.పు) చటచట, చెప్పుడు, చూడుము **کھٹکا**

**کھڑاؤں- کھڑاوان- کھڑانو** ఖడాంవ్ - ఖడావూం - ఖడావాం (హి. స్త్రీ) గిట్టలచప్పుడు, దడబడ, కల్లోలము.

**کھڑک** ఖడక్ (హి.పు) చూడుము **کھرک**

**کھڑکا** ఖడ్కా (హి.పు) చప్పుడు, పండ్లు కుట్టుకొనుపుల్ల, దొప్పలు లేక విస్తళ్లుకుట్టు పుడక లేక పుల్ల; సంశయము.

**کھڑکانا** ఖడ్కానా (హి) కటకట లేక గలగలమని చప్పుడుచేయుట, గొల్లెముచాయించుట, తలుపు చప్పుడుచేయుట; చివాట్లు పెట్టుట, గద్దించుట.

**کھڑکنا** ఖడక్నా (హి) ఎండుఆకులు పాత్రలు కత్తులు మొ॥వాని చప్పుడగుట; పోట్లాట కలుగుట.

**کھڑکھڑ** ఖడ్‌ఖడ్ (హి) దడ దడ, బండ్లు నడుచుచప్పుడు.

**کھڑکھڑانا** ఖడ్‌ఖడానా (హి) గడగడలాడించుట, తలుపుతట్టుట, గొల్లెముఆడించుట, చివాట్లుపెట్టుట, బెదరించుట.

**کھڑکھڑاہٹ** ఖడ్‌ఖడాహట్ (హి. స్త్రీ) గణగణ, గలగల; పాత్రలు బండ్లు ఎండు ఆకులు కత్తులు మొ॥వాని చప్పుడు.

**کھڑکی** ఖిడ్కీ (హి.స్త్రీ) దిడ్డి,గవాక్షము, కంత. **کھڑکی دار انگرکھا** -దార్ అంగర్ఖా (హి) రొమ్ముభాగము తెరచియుండు చొక్కాయ, తెఱపి కూసము. **کھڑکی دار پگڑی** -దార్ పగ్డీ(హి) మార్వాడీల తలగుడ్డ.

**کھڑگنجا** ఖడ్‌గంజా (హి) బట్టతలవాడు; అమ్మవారి మచ్చల ముఖముగలవాడు, అతి కురూపి.

**کھڑنجا** ఖడంజా (హి) చూడుము **کھرنجا**.

**کھڑی** ఖడీ (హి) చూడుము **کھڑا**; నిలువుయీత, నీళ్లలో నిలుచుండినట్లు ఈదుట; నామము, కడి.

**کھڑینچ** ఖడైంచ్(హి. స్త్రీ)చిన్న గాయము; పగ, కంటు, దూషణ, జగడము.

**کھسار** కుహ్‌సార్ (పా.పు)చూడుము **کوہسار**

**کھسرا** ఖస్రా (హి,స్త్రీ) ఆటలమ్మ,చిన్నమ్మవారు.

**کھسر پھسر - کھس پھس** ఖుస్ ఫుస్ -

**کھلائی** ఖిలాయీ (హి. స్త్రీ) తినిపించుట ఆహారము, తిండి; బిడ్డలను పెంచు దాది పెంపుడుదాది; భోజన వేతనము, ప్రొద్దుకూలి. **کھلائی پلائی** - ఖిలాయీ (హి. స్త్రీ) అన్నపానాదులవ్యయము.

**کھلابلی** ఖలాబలీ (హి. స్త్రీ) చూడు **کھل بلی**
హెంగుట.

**کھل بلانا** ఖల్ బలానా (హి) ఉడుకుట,

**کھل بل - بلی** ఖల్ బల్ -లీ (హి. స్త్రీ) సంక్షోభము, కలత, కలకుండు, అల్లకల్లోలము, అల్లరి, కలహము, దొమ్మి, గందరగోళము, గల్లంతు.

**کھلڑ** ఖల్లడ్ (హి. స్త్రీ) తోలుతిత్తి, బక్కని ముసలిది.

**کھل کھل** ఖిల్ ఖిల్ (హి. స్త్రీ) కిలకిల, నవ్వుచప్పుడు.

**کھل کھلانا** ఖిల్ ఖిలానా(హి)కిలకిలనవ్వుట,

**کھل کھیلنا** ఖుల్ ఖేల్నా (హి) బహిరంగముగా సిగ్గుమాలి వర్తించుట, విడిబడుట, తెగబడుట.

**کھلنا** ఖిల్నా (హి) వికసించుట. పూచుట, పుష్పించుట, విచ్చుట, ఉబ్బుట,నవ్వుట, ఆనందించుట, సంతోషించుట,విడివిడిగా నగుట,పొడిపొడిగానగుట,చీలుట, పేలుట, పేలాలు పోవుట, శోభిల్లుట,తగియుండుట, చిక్కువీడుట, పాయుట, వేరగుట.

**کھلنا** ఖుల్నా (హి) తెరచుకొనుట, వీడుట, ఊడుట, వదలుట, విప్పుకొనుట, తెరపియగుట, తెరవబడుట, బయల్పడుట, బహిరంగమగుట, ప్రయ్యుట, పగులుట, విడవబడుట, విడి పడుట, వీడి పోవుట, చీలుట, తేటతెల్లమగుట, ప్రచురమగుట, విచ్చుకొనిపోవుట, పాయుట, వేరగుట, వెల్లడిపడుట, వదలించుకొనిపోవుట, వగతెగుట, తీరుమానమగుట, వదలిపోవుట, ఆరంభమగుట, సాగుట, మరుగులేక పోవుట, సిగ్గులేకపోవుట, మౌనమువీడుట, అడ్డములేకపోవుట, విశాలముగా నగుట, విస్తీర్ణముగానగుట, నిర్మలాంకాశమగుట, తెలుపియిచ్చుట,శోభిల్లుట,ప్రకాశించుట, తగియుండుట, చేవరంగపు కాయనడచుట, వెలనిశ్చయింప బడుట, మదింప బడుట, కట్టులేక పట్టువీడుట, సళ్లుట, విడుదలయగుట, విమోచనమగుట.

**کھلنڈرا - ڑی** ఖిలండ్డా - డీ (హి) ఆటలమారి, ఆటకాయ, క్రీడావినోది, ఆటలాడెడు.

**کھلوانا** ఖుల్వానా (హి) ఇది **کھلنا** యొక్క ప్రేరణార్థకము. తెరపించుట మొ॥.

**کہلوانا** కహల్వానా (హి) అనిపించుట, చెప్పించుట.

**کھلونا** ఖిలోనా(హి. పు) ఆటవస్తువు, బొమ్మ, బూటకపు వస్తువు, పనికిమాలిన వస్తువు, నవ్వులబండి, హాస్యాదులవలన సంతోషపెట్టువాడు.

**کھلی** ఖలీ(హి. స్త్రీ) తెలికపిండి,గానుగపిండి.

**کھلی** ఖిల్లీ (హి) నవ్వులాట, సరసము; పరిహాసము, హాస్యము, హేళనము.

**کھلیان** ఖలియాన్ (హి. పు) కళ్లము, రాశికుప్ప, ధాన్యపుకొట్టు.

**کھم** ఖమ్ (హి. పు) స్తంభము, గుంజె.

**کھماج** ఖమాజ్ (హి. స్త్రీ) రాగభేదము.

**کھمبا** ఖంబా (హి. పు) స్తంభము, గుంజె.

**کھمبی** ఖుంబీ (హి. స్త్రీ) పుట్టకొక్కు, పుట్టగొడుగు.

**کھوانا** కహ్వానా (హి) కోరడు **کہلوانا**

**کھوپرا-ڑا** ఖోప్రా - డా (హి.పు) కొబ్బరికాయ, కొబ్బరి, కొబ్బరికాయ లోని కురిడి, బొండలము; తలపుర్రె,కపాలము.

**کھوپری-ڑی** ఖోప్రీ - డీ (హి.స్త్రీ) తలపుర్రె,కపాలము. **کھوپری کھاجانا** -ఖాజానా (హి) తలబీకకొట్టజేయుట, ప్రాణముతీసుట, విసికించుట, పీడించుట. **کھوپری گنجی کرنا** -గంజీకర్నా (హి) నెత్తిబొచ్చుఊడగొట్టుట. క్రూర్పలు రాలగొట్టుట.

**کھوٹ** ఖోట్ (హి.స్త్రీ) కలపటము, కంరు, మిశ్రితము, తక్కువలోహము కల పడము, దోషము, లోపము, అవగుణము, తప్పు, నష్టము. కీడు, హాని, దుర్మార్గము, పోకిరితనము, కపటము, కృత్రిమము, మోసము, కాపట్యము, కౌటిల్యము.

**کھوٹا** ఖోటా(హి) అస్వచ్ఛము, అశుద్ధము, మిశ్రితము, తక్కువలోహము కలిసిన, కృత్రిమమైన, కలపటపు, బూటకమైన, కంరుగల, కపటపు, కల్పితమైన, చెడు, చెల్లని, పనికిమాలిన, దుష్టము,పోకిరియైన, కుటిలచిత్తముగల, దుర్మార్గమైన, అసత్యమైన, తప్పైన, అబద్ధమైన, ద్రోహియైన, వంచకమైన, మోసమైన, దోషయుక్తమైన, దుష్టచింతనగల,అపకారియైన, **کھوٹا پیسہ** -పైస (హి) చెల్లనిడబ్బు.

**کھوج-کھوجڑا** ఖోజ్ - డా (హి.పు) జాడ, కోజు, పొబడి, అడుగుల జాడ, ఉనికి, ఆనవాలు, గురుతు, విచారణ, శోధ, వేగు, వర్తమానము, బుడమము,వయి నము, మూలము. **کھوج کھاج** -ఖాజ్ (హి) పరీక్షణము, పరిశోధనము. **کھوج لگانا** -లగానా (హి) జాడ దీయుట. **کھوج لگنا** -లగ్నా (హి) జాడ దొరకుట. **کھوج مٹنا** -మిట్నా (హి) నిర్మూలమగుట, నాశమగుట.

**کھوجنا** ఖోజ్నా (హి) జాడతీయుట.

**کھوجی-جیا** ఖోజీ - జియా (హి.పు) శోధకుడు, వేగులవాడు, జాడ తీయువాడు, విచారణచేయువాడు.

**کھوچڑ** ఖోచడ్ (హి.పు) కార్యహానిచేయువాడు, ఘాతుకుడు.

**کھودانا** ఖోదానా (హి) త్రవ్వించుట, చిత్తరువులు మొ॥నవి చెక్కించుట, చెక్కడపుపని చేయించుట.

**کھودنا** ఖోద్నా (హి) త్రవ్వుట,తోడుట, కుళ్లగించుట, దోకుట, గోకుట, కోదుట, చిత్తరువులు అక్షరములు మొ॥ చెక్కుట, పరిశోధించుట, విచారణచేయుట.

**کھور** ఖోర్ (హి.స్త్రీ) మట్టితొట్టి; పశువులు మేయు గాడి; మూత, సిబ్బి; సందు, గొంది, త్రోవ, తెరువు; బొంత, పచ్చడము, దుప్పటి; ఆవేశనము, దేవతల కోపము; భూతబాధ. (ఖార్) గంధపు చెక్క.

**کھورو** ఖోరూ (హి.పు) పశువులు కాలు త్రవ్వుట, గిట్టతో నేలకొట్టుట,జెగడము.

**کھوڑ** ఖోడ్ (హి. స్త్రీ) భూతబాధ, భూతావేశము, భూతముపట్టుట.

**کھوڑ** ఖౌడ్ (హి. స్త్రీ) అడ్డ గంధము, అడ్డబొట్టు, గంధముతో దేహముపై వేసికొనిన గుర్తులు,

**کھوسا** ఖోసా (హి.స్త్రీ) గడ్డము మీసములురానివాడు, పేడి, పేడిమూతివాడు, చెక్కు, తోలు, తాటు, తొక్క. చిప్ప.

వ్రేపుడుబియ్యము మొ॥; వానకుతడియ కుండ గొంగడి మొ॥ వానితో చేసిన కొప్పెరము లేక గూడ, కప్పు.

**کھو یا** ఖవయ్యా(హి.పు)తిండిపోతు,తిండిడు.

**کھو یا** ఖోయా (హి.పు) ఇగురగాచినపాలు, పాలఇగురు.

**کھو یا جانا - کھو ئے جا نا** ఖోయా(యే) జానా (హి) పోవుట, నష్టమై పోవుట, కలవరపడుట, ఎటును తోచకయుండుట, నిరుత్తరుడగుట.

**کھے** ఖే-ఖై (హి. స్త్రీ) బూడిద, బుగ్గి. దుబ్బ, దుమ్ము; చెత్త, మలము, అశుద్ధము,

**کہی** కహి (హి. స్త్రీ) చూకు **کہی**, అన్నది, మాట. **کہی بدی** -బదీ (హి) మాట ముచ్చటలు, ఒడంబడిక, ఒప్పందము. **کہی سنی** -సునీ (హి) చెప్పడు మాటలు.

**کھیپ** ఖేప్ (హి. స్త్రీ) పశువుల మోత, బలువులు, బరువు, భారము, ఓడలోవేసిన సరుకులు లేక బరువు; ప్రమాణము, ఓడ ప్రమాణము; తడవ, తేప, మారు; కందు, కలపటము, మిశ్రము, కేటు,

**کھیت** ఖేత్ (హి.పు) క్షేత్రము,పొలము, చేను, పంట, పైరు, కృషి, సేద్యము, భూమి, దేశము, పుట్టుబడి, జాతి,బయలు, ఎడారి, యుద్ధరంగము, యుద్ధము, జన సంహారము, కత్తిబద్ద, చంద్రకాంతి, వెన్నెల ప్రకాశము. **کھیت کا لکھا پڑا** -కా లిఖ్ఖా పడా (హి) కాపుదనపు వాడు, పల్లెటూరివాడు, మోటువాడు. **کھیت کیا ر** -కియార్ (హి) కాపుదనము, సేద్యము.

**کھیتی** ఖేతీ (హి. స్త్రీ) కృషి, సేద్యము, కాపుదనము, పంట, పైరు. **کھیتی باڑی** -బాడీ (హి) కాపుదనము, సేద్యము.

**کھید** ఖేద్ (సం. స్త్రీ) ఖేదము, దుఃఖము.

**کھیدا** ఖేదా (హి.పు) ఏనుగులను పట్టుట కైన గుంట, ఓదము.

**کھیدنا** ఖేద్నా (హి) వెడలగొట్టుట, పార తోలుట, ఖేదపెట్టుట, కష్టపెట్టుట.

**کھیر** ఖీర్ (హి. స్త్రీ) క్షీరాన్నము, పరమాన్నము. **کھیر چٹائی** -చటాయీ (హి) అన్నప్రాశనము.

**کھیر (ببول)** ఖైర్ (బబూల్) (హి) పొడల మ్రాను, కాచుచెట్టు.

**کھیرا** ఖైరా(హి.పు)నీరుకావివర్ణము; ఎడమ చేయి; ఒకచేప; ఒకపావురము.

**کھیرا** ఖీరా(హి.పు) ఒకదినుసు దోసకాయ (పొడుగుదోసకాయ). **کھیرا ککڑی کرنا** -కక్డీ కర్నా (హి) చూకచేసి మిక్కిలి తిట్టుట.

**کھیری** ఖీరీ (హి. స్త్రీ) పొదుగు, పొదుగు మాంసము లేక కండ.

**کھیڑا** ఖేడా (హి.పు) ఊరు, పల్లె, చిన్న గ్రామము; అనేకధాన్యముల కలపడము, నానాధాన్యములు.

**کھیڑی** ఖేఢీ (హి. స్త్రీ) ఉక్కు, గట్టి లోహము.

**کھیس** ఖేస్ (హి.పు) నేత పూల బట్ట, దుప్పటి తేను.

**کھیس** ఖీస్ (హి. స్త్రీ) ముర్రుపాలు, జున్నుపాలు.

**کھیسا** ఖీసా (హి.పు) చొక్కాసంచి, కీసర, కీసరతిత్తి, సంచి,తుండుగుడ్డ మొ॥.

کھیئی ఖేయీ (హి.స్త్రీ) ముడ్డ కంప, రేగుకంప, కంచె, అలవ.

کے కే (హి) షష్ఠ్యర్థక ప్రత్యయము, సంబంధ షష్టివిభక్తి ప్రత్యయము (యొక్క).

کئے - کے కయే (హి) కయ్ (పా) ఎన్ని, ఎందరు, పలు, పెక్కులు.

کئی కయీ (హి) ఎన్నియో, పలు, పెక్కు. کئی ایک -యేక్ (హి) ఎన్నియో, కొన్ని. کئی بار -బార్ (హి) ఎన్నియో సారులు, పలుమారు.

کی కీ (హి) సంబంధషష్టివిభక్తి ప్రత్యయము (యొక్క).

کیا క్యా (హి) ప్రశ్నార్థకము, ఏమి, ఏల, ఎందుకు, ఏది, ఎంత, చాలా, బహు, کیا جانے -జానే (హి) ఎవరెరుగుదురు, ఏమో తెలియదు, ఉండవచ్చు, కాబోలు. کیا چیز ہے -చీజ్ హై (ఉ) ఏమి మహాత్మ్యము, ఎంతమాత్రము, ఏపాటిది. کیا ہے -హయ్ (హి) ఏమి, ఏమి ఉన్నది. کیا ہی -హీ (హి) ఎంతేని, బహు, మిక్కిలి.

کیاری క్యారీ (హి. స్త్రీ) కేదారము, అల వాలము, పాదు, వాటిక, మడి; ఉప్పు పట్టి.

کیاست కియాసత్ (అ. స్త్రీ) తెలివి, తెలివితేటలు, చురుకుదనము, చాకచక్యము.

کیانی కయానీ (హి) ఈరాను తూరాను దేశముల రాజులబిరుద నామము, రాజసం.

کیت కేత్ (హి. పు) కేతువు, కేతుగ్రహము.

کیت - کیتھ కైత్ - థ్ (హి. పు) ఒక పుల్లని పండ్లచెట్టు. (చెట్టు.

کیتکی కేతకీ (హి. స్త్రీ) మొగిలిపువ్వు లేక

کیتلی కేత్లీ (ఇం. స్త్రీ) కొమ్ముచెరవ, తేనీళ్ల చెరవ.

کیٹ کీట్ (హి. పు) కీటము, పురుగు, చీము రలో పేరినమష్టు, దీపపుమైనము, ప్రమి దఅడుగు జిడ్డు, హుక్కానాళములోని మైల లేక మరికి.

کیجا కీజా (హి. పు) కార్జము, ప్రాణము.

کیجا جان -జాన్ (హి) దాది, ఉప మాత, ప్రాణసమానము.

کیچ - کیچڑ కీచ్ - కిచడ్ (హి. స్త్రీ) అడుసు, బురద, చిత్తడి, కంటిపుసి, మష్టు, మైల,

کیچوا కేచ్వా (హి. పు) వానపాము, ఎట్టి, ఎమిడికపాము, ఎమిడిక.

کیر కేర్ (పా. పు) శిశ్నము, మేఢ్రము.

کیرا కైరా (హి) పిల్లికండ్లు, మెల్లకండ్లు.

کیری కైరీ (హి. స్త్రీ) పిల్లికండ్ల యాడుది; మామిడికాయ; మెడలో వేలకట్టుకొను అత్తరు కాయ (మామిడికాయ వంటిది)

کیری آنکھ -ఆంఖ్ (హి) పిల్లి కండ్లు, కేకరములు.

کیڑا కీడా (హి. పు) కీటము, పురుగు, విష జంతువు. ప్రాకెడుజంతువు, పేను. చెదలు.

کیڑا مار -మార్ (హి) కడపరఆకు, గాడిదగడపరాకు.

کیڑی కీడీ (హి. స్త్రీ) చీమ, జెలగ, జొట్టు.

کیس కేస్ (హి పు) కేశము, వెండ్రుక, జొట్టు, కోడిజొట్టు.

کیسا కైసా (హి) ఎట్లు, ఏలాగు, ఏటి, ఎట్టి, ఏలాటి, ఏ, ఏమి, ఏల, ఎంత, మిక్కిలి. کیسا ہی -హీ (హి) ఎంతైనను, ఎట్లైనను. ఎంతేని, ఎట్టిదైనను, ఏలాటిదైనను.

గాను, జాణుడు. **کیمیاگری** -గరీ (హి) రససిద్ధి, రసవాదము.

**کین** కీన్ (పా.పు) పగ, వైరము, స్పర్థ.

**کینیا** కీనియా (ఉ.పు) కపటి, మోసగాడు

**کینچلی - کینچل** కేంచల్ - కేంచ్లీ (హి.స్త్రీ) పాము కుబుసము.

**کینچوا** కేంచ్వా (హి.పు) చేోడు **کیچوا**

**کینڑا** కేంఢా (హి.పు) అచ్చు, పోత, మాదిరి, మచ్చు, చిత్తు, చిత్తుపటము, ఆకారము, రూపము, పోలిక, డౌలు, పరిమాణము, కొలత, మానము.

**کینہ** కీన (పా.పు) పగ, వైరము, స్పర్థ, కంటుు.

**کیوان** కైవాన్ (పా.పు) శని గ్రహము, సప్తమలోకము.

**کیوتی** కేవటీ (హి స్త్రీ) అనేక దినుసులు కలిపివండిన పప్పు, అనేకవిధములపప్పులు కలిపివండిన సూపము. (చెట్టును).

**کیوڑا** కేవ్డా (హి.పు) మొగిలి పువ్వు

**کیوکا** కేవ్కా (హి.పు) నీళ్లాడినవారికికావలసిన దినుసులు లేక వస్తువులు.

**کیوں** క్యాం (హి) ఏల, ఎందుకు, ఎట్లు. ఏమి, ఎందుకని. **کیونکر** -కర్ (హి) ఎట్లు, ఏలాగు, ఎందుకు, ఎందుకని, **کیونکہ** -కె (హి) ఏలననగా, ఎందు[illegible]గా, కాన, కనుక. **کیوں نہو** -నహూ (హి) ఏలకాగూడదు, ఏలకాదు, కానిమ్ము, అవశ్యము, కావలసినదే యనుట, మేలు, మంచిది, భళిరే. **کیوں نہیں** -నహీం (హి) ఏలకాదు, ఎందుకు కాదు. అవును నుట, నిస్సందేహమనుట.

---

# گ

**گ** గాఫ్ (పా.పు) గ కారము. ఇది ఉరుదూ వర్ణమాలలో నిరువదితొమ్మిదవ అక్షరము. పారసీకభాషలో నిరువదియారవది. అరబీ భాషలో ఈవర్ణము లేదు గావున అబ్జదు వర్ణసాంఖ్యములో దీనిసంఖ్య **ک** యొక్క సంఖ్యకు సమానముగా "నిరువది" నిర్ణయించి ఉరుదులో వాడుకొనుచున్నారు.

**گا** గా (హి) భవిష్యదర్థకప్రత్యయమైనపుడు కలదు, కలడు మొ॥ అర్థముల నిచ్చును; బహుమానార్థక ప్రత్యయము మధ్యమ పురుష క్రియలతుదను డ్, డు, డా, డి, డీ అను అర్థములనిచ్చును.

**گاب** గాబ్ (హి.పు) గవ్వ, బెండు, చేవ, ఒకచెట్టు (తునికిచెట్టు).

**گابھ** గాభ్ (హి.పు) పశువులచూలు. **گابھ** **گابا** -డాల్నా (హి) చూలుబోవుట, ఈచుకపోవుట.

**گابھا** గాభా (హి.పు) మోవు, మోసు, అరంటి లేక ఖర్జూరపు చెట్టుమొక్క క్రొత్త యాకు; దవ్వ, ఊచె, చేవ; పొట్టి కరుకులు, మైరు, పచ్చిధాన్యము; పాత పరుపులు మొ॥వానిలోనుండి బయటికి వెడలిన దూది.

**گابھنی - گابھن** గాభిన్ - గాభ్నీ (హి. స్త్రీ) చూలింత, చూలుగల; కట్టిన (పశువు).

**گات** గాత్ (హి. స్త్రీ) గాత్రము, శరీరము; వక్షము, రొమ్ము; రొమ్ములు; స్త్రీ దేహముయొక్క నడుమునకు పైభాగము; గర్భము, చూలు; దేహముయొక్కడౌలు.

گاتی గాతీ (హి. స్త్రీ) పోకము, నాలుగు మూలల సెల్లా, తుండు గుడ్డ. گاتی مارنا۔ لگانا -మార్నా - లగానా (హి) పోకమును వక్షమునకు లేక భుజమునకు కట్టుకొనుట.

گاتھی గాథీ (హి. స్త్రీ) మూట, గింజి; మూట, ముల్లె.

گاج గాజ్ (హి. స్త్రీ) పిడుగు; గాజులు; నురుగు, పొంగు, ఫేనము; ఆగ్రహము; ఆపత్తు. گاج مرچ గాజ్ -మిర్చ్ (హి) మరీచిఫలము, మిరపకాయ.

گاجا باجا గాజా బాజా (హి. పు) మేళ తాళములు, వాద్యఘోషములు.

گاجر గాజర్ (హి. స్త్రీ) గర్జరము, పచ్చకంద, పచ్చిముల్లంగి. گاجر مولی -మూలీ పనికిమాలిన వస్తువు. తుచ్ఛ వస్తువులు. گاجر کے بیج -కేబీజ్ (హి) పచ్చిముల్లంగివిత్తులు.

گاجنا గాజ్నా (హి) గర్జించుట, గర్జించుట, ఉఱుము, అఱచుట, పెలరేగుట.

گاچ గాచ్ (ఇం. స్త్రీ) వలిపెము, వలబట్ట.

گاد గాద్ (హి. స్త్రీ) మడ్డి, గసి, కల్మషము, చేమురునేయి మొ॥ గాని అడుగున పేరిన మైల, మష్టు.

گاڈرو గాడూరి (హి. పు) గారడీవాఁడు, పాములవాఁడు; పాముమంత్రము.

گاذر గాజర్ (పా. పు) చాకలి వాఁడు, రజకుడు.

گار గార్ (పా) ఇది యొక ప్రత్యయము (వృత్తివాచకము) కారి, కారుఁడు, చేయు వాఁడు అను అర్థములనిచ్చును.

گارا గారా (హి. పు) సోద, గార, గోడలు మొ॥వి పూయుటకు లేక పెట్టుటకు త్రొక్కఁబడిన మన్ను లేక కలిపిన బురద, అడుసు, గచ్చు.

گاڑا గాఢా (హి. పు) గొయ్యి, ఖాతము; మాటు, మాటుగొయ్యి, పొంచియుండుస్థలము.

گاڑنا గాడ్నా (హి) పూడ్చుట, పాతుట, దిగగొట్టుట, నాటుట, స్థాపించుట, పొదుగొలుపుట, మేకు మొ. దిగగొట్టుట.

گاڑھ గాఢ్ (హి. స్త్రీ) కష్టము, సంకటము; ముప్పుగుంట.

گاڑھا۔ ڑھی గాఢా-ఢీ (హి) గాఢమైన, దట్టమైన; చిక్కని; చిక్కని నేతగల; ప్రియమైన స్నేహితము; ప్రగాఢమైన, కఠిన మైన, కష్టతరమైన; దిట్టమైన, బలిష్ఠమైన, గట్టి; ముతకైన; మిాఠీన, అధికమైన. (పు) ముతకబట్ట; మత్తేభము, మదపుటేనుఁగు.

گاڑی గాడీ (హి. స్త్రీ) శకటము, బండి. گاڑی وان۔بان -వాన్ -బాన్ (హి) బండివాఁడు, బండి తోలువాఁడు. گاڑی بھر -భర్ - బండికొలది, బండి మోత, బండిపోవుటకు చాలిన (త్రోవ). گاڑی خانہ -ఖానా (ఫా) శకటశాల, బండ్లశాల; బండ్లకొట్టు.

گازر గాజర్ (పా. పు) చాకలివాఁడు.

گاگر గాగర్ (హి. స్త్రీ) బిందె, తపేల, చెంబు, కలశము.

گال గాల్ (హి. పు) గల్లము, బుగ్గ, చెక్కిలి, చెంప; గ్రాసము, కబళము (గుక్క); తిరుగటి వాయి; జంభాలు, డంబములు, అధిక ప్రసంగము (వాచాలత). گال بجانا -బజానా (హి) చెంపలు తట్టు తటతటాడించుట. జంభాలు పలుకుట, ప్రగ్భలు

కొట్టుట,పదరుట,పేలుట. **گال پھٹکنا** گాల్ ఫ్టకా (హి) చెంపలు గుంటలుపడుట, చిక్కుట, బక్కపడుట. **گال پھلانا** ...

**ఘాలా** గాలా (హి.పు) ఏకిన ప్రత్తి, పింజిక, ప్రత్తి, ఉండ, ప్రత్తివిడిపేకు, ప్రత్తికాయ లోని పత్తిఉండ, మిగుల తెల్లని.

**گالو** గాలూ (హి.పు) వదరుబోతు, మాటకారి, వాచాలుడు.

**گالی** గాలీ (హి.స్త్రీ) తిట్టు, బూతు, అపహాస్యము. **گالی گلوج** గాలీ-గలాజ్ (హి) తిట్లాట, తిట్టుకొనుట. **گالی دینا** గాలీ-దేనా (హి) తిట్టుట. **گالی کھانا** గాలీ-ఖానా (హి) తిట్టుతినుట, తిట్లుపడుట.

**گام** గామ్ (పా.పు) గ్రామము, ఊరు.

**گام** గామ్ (పా.పు) అడుగు, అంగ, జంగ; పాదము; కల్లము; ఒకగుఱ్ఱపునడక; ఒక అడుగుకొలత, మూర, అరగజము.

**گان** గాన్ (హి.పు) గానము, పాట.

**گانا** గానా (హి) గానముచేయుట, పాడుట, ప్రచురపరచుట, చెప్పుట. **گانا بجانا** గానా-బజానా (హి) గీత వాద్యములు.

**گانٹھ** గాంఠ్ (హి.స్త్రీ) గ్రంధి, ముడి, గంటు, కణుపు, సంధి, కీలు, అతుకు, కంతి, మాంసగ్రంధి, నాభి, బొడ్డు, మూట, సంచి, ముల్లెపసుపు లేక సొంటి మొదలయినవాని కొమ్ము, స్పర్ధ, కలత, విరోధము, ఒడంబడిక, ఒప్పందము, ఆటంకము, అడ్డు. **گانٹھ دینا - لگانا - باندھنا** గాంఠ్-దేనా-లగానా-బాంధ్నా (హి) ముడివేయుట, మూటకట్టుట, జ్ఞప్తియుంచుకొనుట. **گانٹھ پڑنا** గాంఠ్-పడ్నా (హి) ముడిపడుట, స్పర్ధకలుగుట, చిక్కుపడుట. **گانٹھ جوڑنا** గాంఠ్-జోడ్నా (హి) వధూవరుల కొంగులు ముడివేయుట. **گانٹھ کا** గాంఠ్-కా (హి) స్వంతము ముల్లెలోని. **گانٹھ کا پورا** గాంఠ్-కా-పూరా (హి) ముల్లెగలవాడు, ధనవంతుడు, ముల్లెగల, గ్రంధిలమైన, దిట్టమైన.

**گانٹھا** గాంఠా (హి.పు) కట్టెమొ॥ వాని ముడి లేక గుంపు.

**گانٹھنا** గాంఠ్నా (హి) కట్టుట, ముడివేయుట లేక ముడిపెట్టుట అతుకువేయుట, అతుకుపెట్టుట, అంటుపట్టుట, పోగుపోపోయుట, కవిత్వముచేయుట, రచించుట, ఉద్దేశించుట, సంకల్పించుట, జేతచేయుట, కలుపుట, కూర్చుట, చేర్చుట, కట్టుకొనుట, కలుపుకొనుట, తనతో జేర్చుకొనుట, లోపరచుకొనుట, చిక్కువేయుట, లంకెవేయుట, దెబ్బ మొ॥ వానిని దేనితో నైనదప్పించుకొనుట.

**گانجھا . گانجا** గాంజా - గాంఝా (హి.పు) గంజాయి, భంగి, కలంజము.

**گانڈ** గాండ్ (హి.స్త్రీ) గుదము, గుహ్యము, ముడ్డి, పృష్ఠము.

**گانڈا** గాండా (హి.పు) చెరకు, ఇక్షువు.

**گانڈر** గాండర్ (హి.స్త్రీ) వట్టివేళ్లగడ్డి.

**گایک** గాయక్ (హి.పు) గాయకుఁడు, పాటపాడువాఁడు.

**گاین** గాయన్ (హి. స్త్రీ) పాట పాడునది, పాటకురాలు.

**گبّدا** గబ్దా (హి) బలిసిన, ఊరిన.

**گبر** గబ్ర్ (పా.పు) కవచము, శిరస్త్రాణము; అగ్న్యుపాసకుఁడు, పారసీక మతస్థుఁడు; విమతస్థుడు.

**گبّر** గబ్బర్ (హి) దండి, దొడ్డ, గొప్ప,దర్పము గల, విలువగల, గర్వముగల, అహంకారియైన.

**گبرو** గబ్రూ (హి.పు) గడ్డము మీసము రానివయసువాఁడు, నవయౌవనుఁడు,తరుణుఁడు; పెండ్లికొడుకు,మగఁడు,యజమాని.

**گبروتا۔ تا۔ را۔ لا۔ گبرندا۔ گبری گبریلا** గబ్రౌతా-టా-రా-లా-గబ్ రౌందా -గబ్రీ-గబ్ రేలా- పేడబుఱ్ఱి,పెండపురుగు.

**گپ گپ** గప్‌గప్ (హి.పు) గుటుగుటు, గటగట (గుటుకలచేప్పుడు).

**گپ** గప్ (హి. స్త్రీ) ముచ్చట, మాట, భాషణము. వృత్తాంతము, వేడుకమాట, ఉబుసు, వట్టిమాట, ఉత్త మాట, నీలి వార్త, వదంతి; వదరు, ప్రేలుడు, జంభము, వగ్గ, ఎచ్చులు; బుడుకు (మ్రింగుచప్పుడు). **گپ شپ** గప్-షప్ (హి) పుక్కిటి పురాణములు, వేడుక మాటలు, ఆకాశపురాణము, జంభాలు. **گپ مارنا ہانکنا** మార్నా-హాఁక్నా (హి) జంభాలునరుకుట లేక కొట్టుట, నీలివార్తలు చెప్పుట, అబద్ధము చెప్పుట, వట్టిమాట చెప్పుట.

**گپ** గుప్ (హి) రహస్యము; చిమ్మచీకటి, చెవుల గడియలు పడుట, చప్పుడులేని, గప్-చుప్ (హి) నిశ్శబ్దము, **گپ چپ** మౌనము; పిల్లలయొక్క-యాట; ఒక తిను బండము; ఒకఆటవస్తువు.

**گپاگپ** గపాగప్ (హి.పు) గబగబ, గటగట, గుటుగుటు, పుక్కిలము, విస్తారము.

**گپت** గుపత్ (హి) గుప్తమైన, గుప్తముగా, చాటుగా.

**گپتی** గుప్తీ (హి. స్త్రీ) గుప్తమైన ఆయుధము, గుమ్మితి, కత్తికఱ్ఱ.

**گپکنا** గపక్నా (హి) గుటకవేయుట, దిగమ్రింగుట, గబుక్కునపట్టుకొనుట, పైన నున్నదానిని పైననేపట్టుట.

**گپھا** గుఫా (హి.పు) గుహ, అడవి.

**گپھا** గుఫ్ఫా (హి.పు) గుత్తి,కుచ్చు,గుచ్ఛము.

**گپی۔ گپیا** గప్పీ-గప్పియా (హి.పు) జంభాలమారి, వదరుబోతు, కల్లరి, దబ్బరకాఁడు, మాటకారి.

**گت** గత్ (హి. స్త్రీ) చలనము, కదలిక; గతి, దశ, స్థితి; మార్గము, రీతి, తీరు, వైనము, పద్ధతి; వర్తనము, లక్షణము; వైఖరి; జ్ఞానము, తెలివి, ఉపాయము; ఉత్తరక్రియలు; నృత్య గీత వాద్యాదుల గతి; లయ; తాళము; నాట్యము; అభినయము; ముక్తి, మోక్షము; గతమైనది; దుర్దశ, దురవస్థ, దుర్గతి; మొత్తుడు,కొట్టుట. **گت بھرنا ۔ ناچنا** గత్ -భర్నా-నాచ్నా (హి) అభినయముఁ జూపుట, ఆడుట, వేషముతెచ్చుట లేక చూపుట.

**گتکا** గత్‌కా (హి.పు) బడిత, బాణాకఱ్ఱ, దుడ్డుకఱ్ఱ.

**گتھم گتھا** గుథమ్‌గుథా (హి) పెనఁగిన, పెనఁబడిన, పెనగులాట, పీకులాట.

**گتھنا** గుథ్నా (హి) పెనఁగుట, పెనఁబడుట, పెనగులాడుట, గుచ్చబడుట, పేనఁబడుట, కూర్చఁబడుట, దూర్చఁబడుట, నిమగ్నమగుట, మునుగుట, తత్పరమగుట.

**گتھوان** గుథ్వాన్ (హి) పేనఁబడిన, పెనఁబడిన, గుచ్చబడిన, కూర్చబడిన.

**گتھی** గుథీ (హి. స్త్రీ) పెన, ముడి, చిక్కు, సంధి.

**گٹ** గుట్ (హి.పు) జట్టు, సమాజము.

**گٹا** గట్టా (హి.పు) చీలమండఎముక, మణిబంధము, చేతులయొక్క గాని కాళ్లయొక్క గాని ఎముకల కీలు లేక బంధము; ఓరడా లేక దట్టము; హుంకా నాళము; కలియు చోటు లేక అతుకు; ఒక తినుబండము, బెల్లము మొ॥ పాకముతోఁ జేసిన ఒక తినుబండము; పాత్రిత సున్నము; గులకరాళ్లు; దేహమందు రాపిడిచే కాయగాచిన భాగము; వజ్రపుటాలతునక.

**گٹا** గుట్టా (హి.పు) మరుగుజ్జు, పొట్టివాఁడు, గిడ్డవాఁడు; నాలుగుమూలల పాచికలు, గులకరాయి, గొట్టికాయ.

**گٹ پٹ** గట్‌పట్ (హి) కలిసిన, కలిసి మెలిసిన, పెనఁబడిన. **گٹ پٹ ہونا** -హోనా- పెనఁగుట, కలియుట, సంపర్కమగుట.

**گٹرگوں** గటర్‌గూఁ (హి.పు) చూడు **غٹرغوں**

**گٹک** గిట్టక్ (హి. స్త్రీ) ఓరడ, దట్టము, దిమ్మ, గుద్దడీలో పెట్టు పెంకుబిళ్ల.

**گٹکا** గుట్కా (హి.పు ఘుటిక, మందుమాత్ర, చదరంగము మొదలగు ఆటలలోని కాయ, చిన్న పుస్తకము, చేతిపుస్తకము, టిప్పణము, సంగ్రహము, చిన్నలక్ష్యము లేక ఉండ, తాంబూలమునకు మారుగా వేసుకొనుటకు తాంబూల ద్రవ్యములతో చేసిన మాత్ర, తాంబూలమాత్ర; సిద్ధ ఘుటిక; నోటిలో బెట్టుకొనిన మనుష్యుడు కనఁబడకుండునట్లును ఇష్టము వచ్చినచోటునకు ఎగిరిపోవునట్లును చేయు మంత్రశక్తిగల మాత్ర.

**گٹکنا** గుటక్నా (హి) గుటకవేయుట, దిగమింగుట, గుటుక్కున మింగుట, పావురము అరచుట లేక కూయుట,

**گٹ گٹ** గట్‌గట్ (హి. స్త్రీ) గటగట, గుటుగుటు, బుడబుడ

**گٹھ** గఠ్ (హి. స్త్రీ) ముడి, గంటు, (చూడు **گٹھا کا**). **گٹھکٹا** -కట్టా (హి) ముడి యవిడుపు. కత్తెరదొంగ,

**گٹھا** గఠ్ఠా (హి.పు) మోపు, భారము, మూట, కట్ట, పుల్లగడ్డ మొదలగువాని పాయ, అంటు కట్టించుట, మూఁడు జాములకొలత (నేల) కట్టించుట.

**گٹھانا** గఠానా (హి) కుట్టువేయించుట, పాత చెప్పులు కుట్టించి బాగు చేయించుట, పట్టు మొ॥ కుట్టించుట, గట్టించుట, కూర్పించుట.

**گٹھڑ** గఠ్ఠడ్ (హి.పు) పెద్దమూట లేక కట్ట, భారము, మోపు.

**گٹھڑی** గఠ్డీ (హి. స్త్రీ) మూట, కట్ట, ముల్లె; ముడుపు; ద్రవ్యము; పరిమాణము, ఒక విధమయిన కుస్తీ. **گٹھڑی چور** -చోర్- ముల్లెచేయువాఁడు, ఓడినాడి.

**گٹھل** గుఠ్ఠల్ (హి) ఘనీభూతము, గట్టిపడుట, గడ్డకట్టుట, గడ్డ, ముద్ద, గ్రంథి, కంతి, ముడి, పెద ముక్కె లేక ముంకల,

గిజేరులేని; బుద్ధిలేని, తెలివిమాలిన, మొద్దు.

**گتهلی** గుఠ్లీ (హి. స్త్రీ) ముట్టె, టెంకి, విత్తనము; మాంసగ్రంధి, కంతి, నరములముడి, లోహములంగలుంగు మూస.

**گتهنا** గత్నా (హి) పోగు పోయఁబడుట, కుట్టబడుట, అట్ట కుట్టబడుట, అతుకు వేయఁబడుట; కలియుట, చేరుట, ఒకటిగానగుట, కూడుట, అంటుకొనుట, పోతు పెంటియుఁ గలియుట; కవనము మొ॥నవి రచింపఁబడుట, రచితమగుట.

**گتهوانا** గత్వానా (హి) మోడు **گتهانا**; కలుపుట, చేర్చుట, ఒకటిగాచేయుట.

**گتهوانسی** గత్వాఁసీ (హి. స్త్రీ) సుమారు అయిదు అంగుళములకొలత.

**گتهی** గఠ్ఠీ (హి. స్త్రీ) ముడి, ముల్లె, మూట, కీలు బంధము, చెఱుకు మొ॥ వానికణుపు, పసుపు మొ॥వానికొమ్ము, ఉల్లిగడ్డ మొ॥ వాని పాయ.

**گتهیا** గఠియా (హి. స్త్రీ) చిన్న మూట, ముల్లె, సంచి; కీళ్లనొప్పి, వాతపు పట్లు, వాతరోగము.

**گتهیلا** గఠీలా (హి. స్త్రీ) ముళ్లుగల, గ్రంధిలమైన, దృఢమైన, దిట్టమైన, బలిష్ఠమయిన, దృఢగాత్రమయిన, గట్టి.

**گتی** గుట్టీ (హి. స్త్రీ) దారపుగిలక లేకకండె, చొంగలోవేయు తాతితుసక లేక పెంకు బిళ్ల, గులకఱాయి.

**گج** గజ్ (సం. పు) గజము, ఏనుఁగు. **گج پپلی** -పిప్లీ (హి) గజపిప్పళ్లి, ఏనుఁగు పిప్పలి. **گج باگ** -బాగ్ (హి) గజాంకుశము. **گج نال** -నాల్ (హి) గజనాళము, పెద్ద పిరంగి. **گج موتی** -మోతీ (హి) ఏనుగు తలయందుండెడు ముత్యము (అందురు).

**گجر** గజర్ (హి. పు) ప్రబోధిక, ప్రహార వాద్యము; ఎచ్చరికగంటలు, మారుమ్రోత, నాలుగు ఎనిమిది లేక పండ్రెండుగంటల తోడ వెంటవెంట అన్నిగానొట్టుగంటలు; వేకువ, తెల్లవాఱుజాము, ప్రాతఃకాల వాద్యము (నగారా మొ॥నవి), ఎఱ్ఱవియు తెల్లవియు కలిసిన గోధుమలు; గర్జనము. **گجردار** -దార్ (హి) ప్రబోధికాల (గడియారము). **گجردم** -దమ్ (హి) వేకువ, తెల్లవాఱుజాము.

**گجر** గజర్ (హి. స్త్రీ) గర్జరము, పీతకంద.

**گجرا** గ్రజా (హి. పు) పీతకంద కూర లేక ఆకులు; దట్టముగాగుర్చిన దండ లేక హారము; పూల కంకణము, ఒక విధమైన కంకణము, మణిమేఖల.

**گجری** గుజ్రీ (హి. స్త్రీ) గొల్లది, గొల్ల భామ (మంటిబొమ్మ).

**گجگجا** గిజ్‌గిజా (హి) తడితడిగానున్న, తడితడిగా, చెల్లచెల్లగా, పచ్చిపచ్చిగానున్న, బాగాఉడకని, ఎచ్చి పచ్చియైన, మెత్తమెత్తగానున్న, లుకలుకలాడు.

**گجگا** గజ్గా (హి. పు) గచ్ఛ్వకారు, కుబేరాక్షుము.

**گجگجانا** గిజ్‌గిజానా (హి) లుక లుకలాడుట, గులగులలాడుట, ప్రాకు చుండుట (పురుగులు).

**گجها** గఝ్ఝా (హి. పు) ధనము, ద్రవ్యము, ధనరాశి, రాశి, ప్రోవు, కుప్ప.

**گجها** గుఝ్ఝా-ఝా (హి) గుప్తమైన, మఱుఁగైన, రహస్యమైన, లోలోపలి.

**گجهی گرمی** గఝీగర్మీ (హి. స్త్రీ) ఉక్క, ఉడుకుపోత.

**گدرانا** గదాఁనా (హి) దోరపండుట, పండుటకు సిద్ధ మగుట; బొద్దు పాఱుట, వయసువచ్చుటచేతలావెక్కుట, బలియుట, ఊరుట, కన్ను పచ్చి పడుట, కన్ను నొచ్చుట.

**گدراہٹ** గద్రాహట్ (హి. స్త్రీ) దోరదనము, దోరగా పండియుండుట.

**گدڑی** గుద్ డీ (హి. స్త్రీ) కంథ, బొంత, తూట్లబొంత; సామర్థ్యము, శక్తి, త్రాణ; సాయంకాలపు అంగడి, గుజలీ అంగడి, పాతవస్తువుల అంగడి; కలగూరగంప, సంకరము.

**گدڑیا** గుద్ డియా (హి. పు) బొంత కప్పుకొనువాఁడు, చింపిగుడ్డలవాఁడు, బొంతలవాఁడు, గంతలు బొంతలు మొ॥నవిఅమ్మువాఁడు లేక బాడుగకిచ్చువాఁడు.

**گدکا** గద్ కా (హి. పు) చూడు **گتکا**.

**گدگدا** గుద్ గుదా (హి) మృదువైన, మెత్తని, బలిసిన, బొద్దుగానున్న.

**گدگدانا** గుద్ గుదానా (హి) గిలిగించుట, చక్కిలిగింత పెట్టుట, నవ్వించుట, ప్రోత్సాహపెట్టుట, పురికొలుపుట, రేపుట.

**گدگداہٹ** గుద్ గుదాహట్ (హి. స్త్రీ) చక్కిలిగింత, గిలిగింత.

**گدگدے** గద్ గదె (హి. పు) గుగ్గిళ్లు, (శెనగలు, జొన్నలు, గోధుమలు).

**گدگدی** గుద్ గుదీ (హి. స్త్రీ) గిలిగింత.

**گدلا** గద్లా (హి) కల్మషముగల, మురికిగల, మైలగల, కలఁగిన, కలఁకపడిన, పంకిలమైన, మురికియైన, మష్టుగల, బురదగానున్న. **گدلاپن** -పన్ - కలఁత, కలక, పంకిలిత, మురికి. మష్టు,

**گدلانا** గద్లానా (హి) కలఁగుట, కలకపారుట, మురికిగానగుట, మురికియగుట.

**گدلائی** గద్లాయీ (హి. స్త్రీ) పంకిలిత, మురికి, మష్టు, మైల.

**گدما - گدم** గుద్ మ-మా (హి. పు) రొంకవము, మృదువైన గొంగడి, గొంగడిబొంత, ముతకశాలువ.

**گدن** గుదన్ (హి. స్త్రీ) పచ్చబొడుచుకొనిన యాఁడుది.

**گدنا** గుద్నా (హి) పచ్చపొడువఁబడుట, పచ్చపొడుపు, పొడుపు.

**گدنا - گدانا** గుద్నా-గుదానా (హి) పచ్చపొడిపించుట, పొడిపించుకొనుట.

**گدوا** గుదవ్వా (హి. పు) చంక (పిల్లలనెత్తుకొనుచోటు), రొండి.

**گدھ** గిధ్ (హి. పు) గద్ద, బోరువ, రాబందు; ఒకవిధమైన గాలిపటము.

**گدھا** గధా (హి. పు) గార్ధభము, గాడిద, గాలిగాడు, మొద్దు, శుంఠుడు, మూర్ఖుడు, గాడిదమోత. **گدھاپن** -పన్ (హి) బుద్ధిహీనత, తెలివిమాలిన తనము. **گدھا چند** -చంద్ (హి) బుద్ధిహీనుఁడు, శుంఠుఁడు. **گدھا کیا جانے زعفران کا مزا** "గాడిదకేమి తెలియును గంధపొడి వాసన". **گدھا گدھی** -గధీ(హి) దాగిలివంటి ఒక పిల్లలయాట.

**گدھی** గధీ (హి. స్త్రీ) ఆడు గాడిద.

**گدھیڑی** గధేడీ (హి. స్త్రీ) గాడిది, మోటు ఆఁటుది (ఆఁడుది).

**گدی** గుద్దీ (హి. స్త్రీ) పెడతల, తలయొక్క వెనుక భాగము; మూపు, మెడయొక్క

వెనుకటి భాగము; అరచేతి కండరము, చఱపు. گدی بہانا۔ ناپنا -భానా -నాపాన (హి) తాటించుట, దెబ్బలు కొట్టుట. మెడమీద చఱచుట.

**گدی** గద్దీ (హి. స్త్రీ) గద్దియ, గద్దె, సింహాసనము, దూదిపరుపు, ఆసనము, దుకాణపువాఁడు కూర్చుండు చిన్న పఱుపు లేక మెత్త లేక చోటు, గంత, ఒత్తు లేక ఒత్తుడు, మెత్తబిళ్ల, చిన్న మెత్త, ముట్టుపీలిక, చుట్టకుదురు, కుదురు; ఒకజాతికురుమవాఁడు, గొల్లవాఁడు. **گدی نشین** -నిషీన్ (పా) సింహాసనారూఢుఁడు, గద్దెపై కూర్చుండువాఁడు. **گدی نشینی** -నిషీనీ (పా) సింహాసనారోహణము.

**گدیلا** గదీలా (హి. పు) మెత్త, దూది పరుపు, ఏనుఁగుపైపరచు మెత్త.

**گڑ** గడ్ (హి. స్త్రీ) (گاڑی کا مخفف) శకటము, బండి; కట్టె.

**گڑا** గడ్డా (హి. పు) శకటము, బరువులబండి. కట్ట, మోపు; పెడ్డ, పెళ్ల. గడ్డ; గ్రంధి, వాపు, బిళ్ల.

**گڈا** గుడ్డా (హి. పు) బొమ్మ, గుడ్డ బొమ్మ (ఎగతాళికిఁజేసినది). **گڈا بنانا** -బనానా- ఆరడిపెట్టుట, బొమ్మ కట్టుట.

**گڈامی** గోడ్డామి (ఇం. పు) కిరస్తాను, పాషండుడు, దొర, ఇంగ్లీషు.

**گڑبڑ** గడ్‌బడ్ (హి) కలిసిన, క్రిందుమీదైన, తారుమారైన; గందరగోళమైన, గజిబిజియైన; గజిబిజి, కలవరము, గొల్లు, అల్లరి.

**گڈریا** గడరియా (హి. పు) పసుల కాపరి, గోపాలుఁడు, గొల్లవాఁడు.

**گڑمڑ** గడ్‌మడ్ (హి) చూడు **گڑبڑ**

**گڑھ** గఢ్ (హి. పు) కోట, గడి, దుర్గము, బండి (సమాసములలో), ఆలయము, శాల, స్థానము. **گڑھ والا** -వాలా- బండివాఁడు.

**گڑھی** గఢీ (హి. స్త్రీ) చిన్న కోట లేక దుర్గము, గడి.

**گٹی** గట్టీ (హి. స్త్రీ) కట్ట, దొంతి, పదిఒస్తాల కాకితములకట్ట, బండి, కచ్చేరము.

**گڈی** గుడ్డీ (హి. స్త్రీ) మోకాటి ఎముక, ఎముకల కీలు లేక బంధము. ఎముక; తోఁక లేని గాలిపటము, చిన్న గుడ్డుడి, చొంగ.

**گذار** గుజార్ (పా. పు) త్రోవ, రేవు, ఘట్టము; ఇచ్చు, చెల్లించు, చేయు, నెరవేర్చు, తీర్చు; పచ్చికబయలు, శలాకము.

**گذارا** గుజారా (పా. పు) రేవు, ఘట్టము, సుంకపుఘట్టము, నివాసము.

**گذارش** గుజారిష్ (పా. స్త్రీ) విజ్ఞాపనము, వినంతి, ప్రార్థన, మనవి; చెల్లించుట, ఇచ్చుట, వదలుట, విడుచుట.

**گذارنا** గుజార్నా (ఉ) జేరపుట, గడపుట, పుచ్చుట, చేయుట, నెరవేర్చుట, ఇచ్చుట, చెల్లించుట, నివేదించుట, తీర్చుట.

**گذاشتنی** గుజాష్తనీ (పా) త్యాగయోగ్యమైన, విడువదగిన, వదలుకొనదగిన.

**گذر** గుజర్ (పా. పు) గతి, పోక, పోవుట, ప్రాంతము, ప్రదేశము, త్రోవ, ఘట్టము, రేవు. **گذرگاہ** -గాహ్ (స్త్రీ) త్రోవ, ఘట్టము, రేవు, తిరుగు చోటు, పోవు మార్గము. **گذرنامہ** -నామ (పు) సెలవు చీటి, ఆజ్ఞాపత్రము.

**گذران** గుజరాన్ (పా) జరుగుబడి,పోవు నడి, కాలది, జరుగుట, పోవుట; జరుగుబాటు, జీవనము, బ్రతుకుతెరువు.

**گذراننا** గుజరాన్నా (ఉ) అర్పించుకొనుట, ఇచ్చుట, సమర్పించుట, నివేదించుట, ముందుబెట్టుట.

**گذرنا** గుజర్నా (ఉ) పోవుట, జరుగుట, దాటుట కడచుట, సంభవించుట, గతించుట, వచ్చుట.

**گذری** గుజ్రీ (ఉ) సాయంకాలమప్పుడు బాటప్రక్కనతీరు అంగళ్లు, అంగళ్లవరుస.

**گذشته** గుజిష్త (పా) గడచిన, జరిగిన, పోయిన, గతించిన.

**گذلک** గజ్లక్ (పా.పు) పేనాకత్తి, కలము చివ్వుకత్తి, చిన్నకత్తి.

**گذه** గజె (పా.పు) కొండనాలుక; తాళపు గడియలు.

**گر** గర్ (పా) ఈప్రత్యయము **گار** యొక్క సంక్షేపరూపమైనప్పుడు కర్తృబోధక ప్రత్యయముగా నుండి కారి, కాడు, చేయువాడు, పనివాడు అను అర్థముల నిచ్చును. మరియు **اگر** అను పదమునకు సంక్షిప్తరూపముగానుండి అయితే,అయిన, అయినయెడల అను అర్థములనిచ్చును.

**گر** గుర్ (హి.పు) గురువు, గురుడు; కీలకము, సూత్రము, కిటుకు, ఉపాయము, నాక్కము, మూలము. **گرمکهی** గురుముఖీ-(గురుముఖి), సిక్కుమతస్థుల భాష.

**گرا** గట్టా (హి) ఎట్టిరి; పుల్ల (గుట్టము లేక పావురము), పుల్ల గుట్టము.

**گراب** గిరాబ్ (ఇం.పు) బాంబాసుగుండు, చిన్నగుండ్లు నింపి చేసిన పిరంగిగుండు.

**گراس** గ్రాస్ (హి.పు) గ్రాసము, కబళము, బొక్క, బుక్క.

**گرام** గ్రామ్ (హి.పు) గ్రామము, స్వరసప్తకము.

**گرامی** గిరామీ (పా) ఘనమైన, గొప్ప, గౌరవనీయమైన, పూజ్యమైన, ప్రియమైన, మనోజ్ఞమైన, మనోహరమైన.

**گران** గిరాన్ (పా) భారమైన, బరువైన, ప్రియమైన, వెలహెచ్చైన, మూల్యమైన, అసహ్యమైన, దుర్భరమైన, అనిష్టమైన, కష్టమైన, కఠినమైన, కష్టతరమైన, సోమరియైన, బద్ధకమైన, మందమైన. **گرانبار** -బార్ (పా) భారవంతమైన, ఫలవంతమైన, ధనవంతమైన, మిక్కిలిభారముగల. **گرانبها** -బహా (పా) అమూల్యమైన, వెలహెచ్చైన, మిక్కిలి విలువగల, గర్భవతియైన. **گرانجان** -జాన్ (పా) కష్టజీవి. **گرانخاطر** ఖాతిర్ (పా) అసహ్యకరమైన, దుఃఖకరమైన, అనిష్టమైన, కష్టమైన, మనసు నొచ్చిన, ఖిన్నమైన, మనసునకు కష్టముదోచుట, అసహ్యమగుట.

**گرانا-گرادینا** గిరానా - దేనా (హి) పడవేయుట, పడదోయుట, పడగొట్టుట, కూలగొట్టుట, తగ్గించుట, చెల్లుట, కార్చుట.

**گرانی** గిరానీ (పా, స్త్రీ) ప్రియము, వెలహెచ్చుట; క్షామము, కఱవు; అజీర్ణము, మందము; భారము, కష్టము, అనిష్టము.

**گراه** గ్రాహ్ (హి.పు) మొసలి, గ్రాహము.

**گرائی** గిరాయీ (పా. స్త్రీ) పట్టు, పట్టుకొనుట.

ఆవర్తనము, క్రియారూప నివృత్తి; తిరిగెను, మారెను.

**گردانا** గర్దానా (అ) క్రియారూప నివృత్తి చేయుట, చుట్టిపెట్టుట, మడచుట, మడతపెట్టుట, చుట్టుట, ఆవర్తించుట, ఆవృత్తిచేయుట, మరలమరలచేయుట లేక అనుట, వల్లించుట, అనుకొనుట, తలంచుట, ఎంచుట, ఎన్నుట, గౌరవించుట, మన్నించుట, ఒప్పుకొనుట, కట్టుట, బిగించుట, కలుపుట, చిక్కువేయుట, చేర్చుట, ఇరికించుట.

**گرداور** గిర్దావర్ (పా.పు) చుట్టుతిరుగువాడు, పరిచరుడు, ప్రహరివాడు, తలారి, కావలివాడు, మణియగాడు, కరణముల పైయధికారి, పైవిచారకుడు.

**گرداوری** గిర్దావరీ (పా. స్త్రీ) మణియగాని కొలువు, మణియము, పరివర్తము, చుట్టుతిరుగుట, సంచారము, పైవిచారణ, కావలి, ప్రహరము, ప్రదేశము, ప్రాంతము.

**گردباد** గిర్ద్‌బాద్ (పా.పు) సుడిగాలి.

**گردبالش** గిర్ద్‌బాలిష్ (పా.పు) బొల్లదిండు, లోడి, లోడీ, పెద్దదిండు.

**گردش** గర్దిష్ (పా. స్త్రీ) భ్రమణము, పరివర్తనము, తిరుగుడు, పరిభ్రమణము, చారము, తిప్పుట, గ్రహచారము, మార్పు, దురదృష్టము, కష్టము, ఆపత్తు, కష్టకాలము, సంకటము, వస్తువులాది పథమందు తిరుగుట. **گردش کرنا** -కర్నా (పా) తిరుగుట, భ్రమించుట, పరివర్తించుట, కష్టములలో చిక్కువడుట, ఆపన్నుడగుట.

**گردگان** గిర్ద్‌గాన్ (పా.పు) అక్షోటఫలము, అక్షోటము; పెంప, గుండు, మట్టి ఉండ లేక గుంకు.

**گردن** గర్దన్ (పా. స్త్రీ) గ్రీవము, మెడ. **گردن اڑانا - مارنا - کاٹنا** -ఉడానా -మార్నా -కాట్నా (ఉ) తల నరుకుట. **گردن حلال کرنا** -హలాల్ కర్నా- వధించుట, నరుకుట. **گردن زمین** -జమీన్ (ఉ) భూసంధి. **گردن کا زورا** -కాడోరా (ఉ) మెడలో కట్టుకొను నల్లని రక్త దారము, మెడయొక్క కులుకు. **گردن کا منکا** -కా మన్కా (ఉ) మేరువుపూసయను మెడ యెముక. **گردن توڑنا - مروڑنا** -తోడ్నా -మరోడ్నా (ఉ) గొంతు పిసుకుట. **گردن ہلانا** -హిలానా (ఉ) తల యూచుట లేక ఆడించుట, లేవనుట. **گردن ناپنا** -నాప్నా (ఉ) గొంతుకోయుట, తల నరుకుట. **گردن میں ہاتھ دیکر نکالنا** -మేఁ హాథ్ దేకర్ నికాల్నా (ఉ) మెడ పట్టి త్రోయుట లేక గెంటించుట, అర్ధచంద్రము ప్రయోగించుట.

**گردنا** గర్దనా (అ.పు) మెడపైకొట్టు దెబ్బ, గెంటింపు, గెంటుడు; బలిసిన మెడ, మెడ కండ; మెడపై చరుపు.

**گردنی** గర్దనీ (పా. స్త్రీ) అశ్వ కంబళము, గుఱ్ఱము పైకప్పెడు ఆస్తరణము; మెడలో వేసికొను వెండికంటె లేక సరము; మెడపై కొట్టుదెబ్బ; గోడయొక్క బొద్దు లేక యంచు; ఒక జెట్టిపట్టు; గెంటింపు, మెడ బట్టినెట్టుట.

**گردون** గర్దూన్ (పా.పు) ఆకాశము; రథము, బండి; చక్రము, బండి గాలు; గ్రహచారము, అదృష్టము.

**گردہ** గిర్ద (పా.పు) వృత్తము, వలయము,

సద్యస్, తక్షణము, విస్తారమైన, విశేషమైన, అమితమైన, ఆసక్తిగల, అక్కఱగల, ఉత్సాహముగల, శ్రద్ధగల, ఆతురమైన, పరాయణతగల, తీక్ష్ణమైన, ఉగ్రమైన, తీవ్రమైన, సిద్ధమైన, ఆయత్తమైన, సన్నిద్ధమైన, పరమమైన, కఠినమైన, అనిష్టమైన, పైత్యము, పిత్తసం॥ నిప్పువలెనున్న, ఎఱ్ఱగా కాలిన, కాలెడు, తేజస్సుగల, కళగల, శోభాయమానమైన, ఆగ్రహపడిన, కోపముగల, రసవంతమైన, పటుత్వముగల, బాగయిన, నికరముగా, పోకిరియైన, ధూర్తైన, చుఱుకైన, ఉల్లాసముగల. **گرم اخلاطی** -ఇఖ్‌తిలాతీ (పా) అత్యంత స్నేహము, మిక్కిలి అన్యోన్యము, ప్రాణ స్నేహము. **گرم بازاری** -బాజారీ (పా) అంగడి బాగుగా సాగుట, జనసమ్మర్దము. **گرم پانی** -పానీ (ఉ) వేడినీళ్లు, రేతస్సు. **گرم جوشی** -జోషీ (పా) అత్యంత స్నేహము, ఔత్సుక్యము, ఉత్సాహము, ఆసక్తి, ఆతురము, పట్టుదల, ప్రియత్నము. **گرم خبر** -ఖబర్ (పా) పలువురు చెప్పుకొను వార్త, అనేకులు అనుకొను వార్త, పలువురాడుమాట. **گرم سرد** -సర్ద్ (పా) వెచ్చని చల్లని, నులివెచ్చని, గోరువెచ్చని; మంచిచెడ్డ, కష్టము సుఖము, మేలుకీడు. **گرم کپڑے** -కప్డే (ఉ) వెచ్చని బట్టలు, ఉష్ణ వస్త్రములు. **گرم گرم** -గర్మ్ (పా) దబదబ, శీఘ్రము. **گرم کرنا** -కర్నా (ఉ) వేడిచేయుట, తప్తము చేయుట, కాల్చుట, వెచ్చచేయుట, కాచుట; ప్రోత్సాహపెట్టుట, పురికొల్పుట; రేపుట, కోపము పుట్టించుట. **گرم ہونا** -హోనా (ఉ) వేడియగుట, వెచ్చపడుట, కాగుట, కాలుట, తప్తమగుట, ఆగ్రహపడుట, కోపపడుట, జనసమ్మర్దము కలిగియుండుట. **گرم مزاج** -మిజాజ్ (పా) ఉష్ణప్రకృతిగల, తీక్ష్ణ స్వభావముగల, కోపిష్ఠియైన. **گرم مزاجی** -మిజాజీ (పా) తీక్ష్ణ స్వభావము, ఆగ్రహము. **گرم مصالح** -మసాలెహ్ (పా) వంటలో వేయు పరిమళ ద్రవ్యములు, సంబారము, వంట సంబారములు.

**گرما** గర్మా (పా. పు) వేసవి, ఎండకాలము.
**گرما گرم** -గర్మ్ (పా) వేడి చల్లగని, వేడివేడిగానున్న; ఉత్సాహములోనున్న. (వేడినీళ్లగది, స్నానవాటిక.

**گرمابہ** గర్మాబా (పా. పు) స్నానశాల,

**گرماگرم** గర్మాగరమ్ (పా) వేడివేడియైన, కాకయైన, ఉష్ణమైన; తాత్కాలికము, క్రొత్త. ప్రస్తుతము, చుఱుకుగల, సరసమైన, తీక్ష్ణమైన, ఉడుకునెత్తురుగల, ఉగ్రమైన, దుడుకైన. తీవ్రమైన, ఉడుకుమీన, వెంటనే, తోడ్తోడ, ఆలోచించకుండ.

**گرماگرمی** గర్మాగర్మీ (ఉ) ఔత్సుక్యము, ఆసక్తి, ఉత్సాహము, పట్టుదల, శ్రద్ధ, సంభ్రమము, సంబ్రము,

**گرمالا** గిర్మాలా (హి) రేలచెట్టు.

**گرمانا** గర్మానా (ఉ) కాగుట, వేడిగాయగుట, తప్తమగుట, తపించుట, ఉష్ణమెక్కుట, ఉడుకెక్కుట, ఆగ్రహపడుట, ట, కోపపడుట, రేగుట, ఉద్రేకించుట,

చెలరేగుట, మదించుట, గాడెక్కుట, వయసు వచ్చుట, తీక్ష్ణమగుట, వడి గలుగుట.

**گرماہٹ** గర్మాహట్ (ఉ. స్త్రీ) ఉష్ణము, వేడిమి; ఉద్రేకము, పోకిరితనము.

**گرمائی** గర్మాయీ (ఉ. స్త్రీ) ఉష్ణము, తాపము; ఉష్ణౌషధము.

**گرمی** గర్మీ (ఉ. స్త్రీ) వేడిమి, వేండ్రము, తాపము, వేసవి, అన్యోన్యము, ప్రేమాతిశయము; మనః పూర్వకత. తీవ్రము, తీక్ష్ణము, ఉగ్రత, వడి, ఉద్రేకము, చురుకుదనము, చంచలత, మదము, మదమువదనము, ఆధిక్యము, సంఘర్షణము, సెగ, సెగరోగము, సీమస్ఫోటకము, ఉత్సాహము. ఔత్సుక్యము, ఆగ్రహము, క్రోధము, సంభోగేచ్ఛ, కామము, తారుణ్యము, చెమట, చెమటకాయలు. **گرمی پڑنا** -పడ్నా (ఉ) ఉష్ణముగానుండుట, ఎండలుకాయుట. **گرمی دانے** -దానె (పా) చెమటకాయలు. **گرمی کرنا** -కర్నా (ఉ) ఉష్ణముచేయుట, ప్రేమించుట, వలపు చూపుట. పోకిరితనముచేయుట. **گرمی ہونا** -హోనా (ఉ) ఉష్ణము గల, ఉష్ణము సేయుట, కొంకపుట్టుట, సెగ లేక సెగరోగము.

**گرمیاں** గర్మియాఁ (ఉ. స్త్రీ) వేసవి కాలము, ఎండలు.

**گرنا** గిర్నా (హి) పడుట, రాలుట, పైబడుట, జారిపడుట, దిగుట, తగ్గుట, క్షీణమగుట, తప్పిపోయి మరల నొకచోట వ్రాలుట, వలచుట, ఆశించుట, అవమానపడుట, చచ్చుట, లోబడుట, ఓడిపోవుట.

**گرنتھ (گرنڈھہ)** గ్రంథ్-థ్ (సం. స్త్రీ) గ్రంథము, పుస్తకము, ముడి, సిక్కులమత గ్రంథము.

**گرنڈ** గరండ్ (హి. పు) మట్టితో తయారైటి రాతిమెట్టు పిండిపడుటకై చేసిన పాము, పిండిపాము.

**گرو** గురూ (సం. పు) గురువు, గు రు వు, ప్రవీణుడు. **گرو مکھ ہونا** - ముఖ్ హోనా (ఉ) శిష్యుడగుట. **گرو گھنٹال** -ఘంటాల్ (ఉ) పరమగురు; ఘంటాగ్రేసరుడు. తలకొట్టుమారి, తాకొట్టమారి.

**گرو** గిరవ్ (పా. పు) బంధనము, తాకట్టు, కుదువ, పూచి. **گرو ہونا - رکھنا - کرنا** -హోనా-రఖ్నా-కర్నా -కుదువపెట్టుట, తాకట్టుపెట్టుట. **گرونامہ** -నామ- కుదువపత్రము, బంధనపత్రము.

**گروانا** గిర్వానా (హి) పడగొట్టించుట, ఇది **گرنا** యొక్క ప్రేరణార్థకము.

**گروہ** గురోహ్ (పా. పు) సమాజము, జట్టు, వర్గము, సమూహము, జాతి, కులము, సేన, బలగము, దండు.

**گروی** గిర్వీ (ఉ. స్త్రీ) బంధనము, కుదువ, తాకట్టు, పూట, తాకట్టుపెట్టినది, చీడపురుగు (పైరులకు పట్టునది).

**گرویدگی** గిర్వీదగీ (పా. స్త్రీ) ప్రేమించుట, మెచ్చుట, మోహము, ఆవేశము, వలపు, భక్తి, అవలంబము, అనుసరణము, విశ్వాసము.

**گرویدہ** గిర్వీద (పా) ప్రే మి ంచు ట, మెచ్చిన, మోహితమైన, వలపుగొన్న, అవలంబితమైన, అనుసరించిన, అనువర్తించు, భక్తిగల, విశ్వాసముగల.

گرہ గృహా (సం. పు. స్త్రీ) గ్రహము, ఆచారము.

گرہ గృహ్ (సం. పు) గృహము, ఇల్లు.

گرہ గిరహ్ (పా. స్త్రీ) గ్రంథి, ముడి, గంటు, కీసర, తిత్తి, సంచి, గుత్తి, గుచ్ఛము, గజములో (౧౬) వ పాలుతేకగిత, 3 అంగుళములకొలత, కీలు, బంధము, కల్మషము, స్పర్ధ, కలత, సంకటము, కష్టము; కంతి, మాంసగ్రంధి, చెఱుకు మొ॥ వానికణుపు, అల్లము మొ॥ వాని కొమ్ము, ముల్లె. ద్రవ్యము, బద్ధమైన, కట్టబడిన, మూయబడిన, కుండలి, పాముచుట్ట, కదపటి చక్షణము లేక పాదము. گرہ باز -బాజ్ (పా) పల్లటీల్గొనెడు, పిల్లిగంతులు వేయు. گرہ دار -దార్ (పా) గ్రంధిలమైన, ముల్లుగల (ముడులు=ముళ్లుగల). گرہ باندھنا - دینا -బాంధ్నా -దేనా (ఉ) ముడివేయుట, జ్ఞాపకముంచుకొనుట گرہ گیر -గీర్ (పా) ముడి పడిన, చిక్కు పడిన, ముడివేసిన. گرہ لگانا گరہ -లగానా (ఉ) ముడివేయుట, అనుబంధముచేయుట, జీతచేయుట, కూర్చుట.

گرہچہ గిరహ్చ్ (పా. పు) చిన్న ముడి.

گرہست గృహస్థ్ (సం. స్త్రీ) గృహస్థుడు, సంసారి, కాపు.

گرہستی గృహస్తీ (సం. స్త్రీ) గృహస్థత, గృహస్థాశ్రమము, సంసారము, కాపుదనము.

گرہستن గృహస్తన్ (హి. స్త్రీ) గృహస్థురాలు, మగనాలు, ముత్తైదువ, ఇల్లాలు, పోడిమిగల యాడుది.

گرہن గ్రహన్ (సం. పు) గ్రహణము, అంగీకారము.

گری గరీ (హి. స్త్రీ) టెంకాయ కురుడు, బాదాము మొ॥ వాని పప్పు, పండ్ల గిజిరు.

گری గుర్రీ (హి. స్త్రీ) గోధుమలు, యవపేలాలు. వేయించిన యవలు,

گری గర్రీ (హి. స్త్రీ) దారపుగిలక, గిఱక; చక్రము; గడ్డివామి, గడ్డికుప్ప.

گریان గిరియాన్ (పా) ఏడ్చెడు, ఏడ్చుచున్న.

گریبان గిరీబాన్ (పా. పు) మెడ కప్పు, అంగీ మొ॥ వాని మెడ, అంగీ మొ॥ వాని మెడముందుండుతెరపి, కీసము. گریبان میں سر ہونا -మేం సర్ హోనా (ఉ) సిగ్గుపడుట, తలవంపులగుట. گریبان میں منہ چھپانا -మేం ముహ్ ఛుపానా (ఉ) సిగ్గుపడుట, తల వంచుకొనుట, చింతనచేయుట, తనతప్పుచూచుకొనుట. گریبان پکڑنا - گریبان میں ہاتھ ڈالنا - گریبان گیر ہونا - పకడ్నా - మేంహాథ్ డాల్నా - గీర్ హోనా (ఉ) మెడపట్టుకొనుట, పోరుపట్టుకొనుట, మెడలోచేయివేసి లాగుట. گریباں پھاڑنا - چاک کرنا - ماد کرنا -ఫాడ్నా-చాక్ కర్నా-మాద్ కర్నా (ఉ) పిచ్చి పట్టుట, చిత్తవైకల్యము కలుగుట.

گریز గురేజ్ (పా. స్త్రీ) పారిపోవు, పరుగెత్తుట, పలాయనము, పరుగు, పాఱుడు, త్యాగము, వర్జనము, తప్పించుకొనుట, తిరుగుదల, తొలగు, ఉడుగుట, అతిక్రమము, అప్రస్తుత ప్రసంగము. گریز کرنا -కర్నా పాఱుట, పరుగుట, తప్పించుకొనుట.

گڑگڑاہٹ గడగడాహట్ (హి. స్త్రీ) ఉరుము, చప్పుడు, గర్జనము, గుడగుడ, హుక్కా-చప్పుడు.

گڑگڑی గుడ్‌గుడీ (హి. స్త్రీ) చొంగ, గుడ్గుడి, చిన్నహుక్కా, టెంకాయబుఱ్ఱ గుడ్గుడి.

گڑگودڑ గడ్‌గోదడ్ (హి. పు) పాతపేలికలు, చింకులు, చిఱిగిన గుడ్డలు, చింకి గుడ్డలు.

گڑگی గుడ్‌గీ (హి. స్త్రీ) లాగు, చల్లడము.

گڑنا గడ్‌నా (హి) పాతుకొనుట, పాతబడుట, అణగుట, దిగబడుట, పూడ్పబడుట.

گڑوانا గడ్వానా (హి) పూడ్పించుట, పాతించుట, పూడ్చిపెట్టించుట.

گڑونا గడోనా (హి) దూర్చుట, గ్రుచ్చుట, పొడుచుట.

گڑھ గఢ్ (హి. పు) కోట, దుర్గము.

گڑھا గఢా (హి. పు) గుంట, పల్లము, బొంద; లోయ, కనుగుంటలు.

گڑھت గఢత్ (హి. స్త్రీ) ఆకారము, నిర్మాణము; పోత. చేత, చేతబడి.

گڑھل గుఢల్ (హి. పు) జపాకుసుమము, దాసన పువ్వు.

گڑھنا గఢ్‌నా (హి) లోహాదులతో నిర్మించుట, పోతబోయుట, చేయుట, ఆకారమేర్పరచుట, అచ్చున బోయుట.

گڑھی గఢీ (హి. స్త్రీ) చిన్నకోట, దుర్గము.

گڑھیا గఢయ్యా (హి. స్త్రీ) చిన్నచెరువు, కుంట, గుంట; పూడ్చువాడు, పాతువాడు, బొందపెట్టువాడు.

گڑیا గడ్యా (హి. స్త్రీ) బొమ్మ, ప్రతిమ.

گڑیوں کا کھیل గుడియోంకాఖేల్ (హి) బొమ్మలాట, సులభమైనపని.

گز గజ్ (పా. పు) మూడడుగులకొలత, గజము, మూడడుగుల కొలకోల, ఇనుపకడ్డీ; కొలత, పరిమాణము; శిరిసుమ్రాను, ఏరుసమ్రాను.

گزانجبین గజంజబీన్ (పా. పు) ఏరుసమ్రాను మేనా; శిరిసుమ్రాను మేనా.

گزار గుజార్ (పా) నివేదించు, ఇచ్చు, చెల్లించు, చేయు; సేవజేయు (ప్రత్యయము).

گزارش గుజారిష్ (పా. స్త్రీ) విన్నతి, ప్రార్థన, నివేదన, నివేదిక, చెప్పుకొనుట.

گزارنا గుజార్నా (ఉ) గడపుట, జరుపుట, ముందరబెట్టుట, ఇచ్చుట, సముఖమున బెట్టుట, నివేదించుట.

گزاره గుజార (పా. పు) రేవు; ఏరుదిగుచోటు ఘట్టము, సుంకపు ఘట్టము, దాటుట, పోవుట, జరుగుబాటు, జీవనము, బ్రతుకుదెరువు, జీవనాధారము; మార్గము, త్రోవ; వాసము. گزاره کرنا -కరనా (ఉ) జీవితముగడపుట (కష్టముగానుట).

گزاف గిజాఫ్ (పా. పు) పరిగల్భము, ఎచ్చులు, పర్రాలు, డంబములు.

گزر گజర్ (పా) చోడు گاجر

گزر గుజర్ (పా. పు) త్రోవ, బాట, మార్గము; ప్రవేశము; ప్రాంతము, ప్రదేశము. گزرگاه -గాహ్ (పా) బాట, మార్గము, పోవుచోటు. گزرعام -ఎ, ఆమ్ (పా) అందరికొరకైన బాట, రాజమార్గము.

گزران గుజీరాన్ (పా. స్త్రీ) జరుగునది, పోవునది, కాగలది, కానున్నది, అశాశ్వ

**گشت** గష్త్ (పా.పు.) ప్రదక్షిణము, సంచారము, పచారము, తిరుగుట, కావలి. ప్రహరము, (పహరా) చేయుట, ఊరేగింపు.

**گشتی** గష్తీ (పా.పు) పరిహారము, ప్రహరా వాడు, కావలి, కావలివాడు; శాసనము, ప్రకటన, ప్రచురించినది, త్రిప్పినది.

**گشته** గష్త (పా) తిరిగిన, మారిన, చెడిన, అయిన.

**گف** గఫ్ (పా) దట్టముగా నేసిన, లావాటి, దిట్టమైన.

**گفتار** గఫ్తార్ (పా. స్త్రీ) సంభాషణము, ప్రసంగము, మాట(లాడుట).

**گفتگو** గఫ్తగూ (పా. స్త్రీ) సంభాషణ, ముచ్చట. **گفت وشنید** -ఒ,షనీద్- అనడము, వినడము, సంవాదము, చర్చ, సంభాషణము.

**گگر - گگری** గగర్ -రీ (హి. స్త్రీ) నీళ్ల కడవ, నీటికుండ.

**گل** గుల్ (హి.పు) పుష్పము, పూవు; దీపపు కొడి, దీపశిఖ; కాలుకచ్చు, కాలివి; గుడ్గుడీ తాగగా మిగిలిన పొగాకు బొగ్గు, గుడ్గుడీకి వేయు బొగ్గుబిళ్లలు, కంటిగుడ్డు మీద గలిగాడు పువ్వు, కనుగుడ్డు పూత. **گلاب** గులాబ్ (పా) పన్నీరు పువ్వు. **گل آفتاب** -ఎ,ఆఫ్తాబ్ (పా) సూర్యకాంత పుష్పము, పొద్దుతిరుగుడుపూవు. **گل انار** -ఎ, అనార్ (పా) దాడిమ పువ్వు. **گل اندام** -అందామ్ (పా) పూబోడి, పుష్పతన్వి. **گل بدن** -బదన్ (పా) పుష్పతన్వి, కోమలి. (పు) పట్టువలిపెము, సన్న పట్టుబట్ట. **گل بابونہ** -ఎ,బాబూనా (పా) సీమచేమంతిపువ్వు. **گل برگ** -బర్గ్ (పు) పన్నీరు పూరేకు. **گل افشاں** -అఫ్షాం (పా) పూలు చల్లెడు, పూలు చల్లిన. **گل اناناس** -అనానాస్ (పా) అనాసపువ్వు, మొగిలి పనస పువ్వు. **گل اناس کی جڑ** -అనాస్ కీ జడ్ (స్త్రీ) సాలామిసిరియను మందు దినుసు. **گل بنانا - کھودنا** -బనానా-ఖోద్నా (ఉ) పూలుచెక్కుట, మలచుట, తొలుచుట. **گل پھولنا** -ఫూల్నా (ఉ) పుష్పించుట, వెలువడుట, బయల్పడుట, (వింత). **گل پیادہ** -పియాద (పా.పు) ఒక జాతి వాసనలేని పన్నీరు పుష్పము. **گل تراش** -తరాష్ (పా) దీపపువత్తిని కత్తిరించు కత్తెర, కొడి కత్తెర. **گل تراشنا** -తరాష్నా (ఉ) దీపపుకొడి రాల్చుట, దీపపువత్తి కొననున్న బొగ్గును తీసివేయుట, కొడి కత్తిరించుట.

**گل جعفری** -జఫరీ (పా) బంతి పూవు(భేదము). **گل چاندنی** -చాందినీ (పా) చంద్రకాంతమల్లె. **گل چشم** -ఎ,చష్మ (పా) కంటిపువ్వు, కంటిగ్రుడ్డుపైపడిన పూవు, (తెల్లచుక్క). **گل چشم** -చష్మ (పా) కాయ కంటివాడు, పూవు బడిన కంటివాడు. **گل چھرے اڑانا** -ఛర్రే ఉడానా (ఉ) అమిత వ్యయము జేయుట, ధనము కొల్లలాడుట, భోగభాగ్యము లనుభవించుట. **گل چیں** -చీం (పా) పుష్పములు కోయువాడు, తోటవాడు, మాలాకారుడు. **گل چینی** -చీనీ (పా. స్త్రీ) పూలేరుట, పూలు కోయుట. **گل چینی** -ఎ.చీనీ (పా) చేమంతిపువ్వు. **گل دان** -దాన్(పా) పుష్ప పాత్రి. **گل داودی** -ఎ,

گلکرند -ఎ,సుర్ఖ్ (పా) పన్నీరుపువ్వు. -కర్నా (ఉ) చెల్లాచెదురు, చెప్పమునకు.

گل గిల్ (పా. స్త్రీ) మన్ను. మట్టి.మృత్తిక. گل اندازی -అంటాజీ (పా) కట్టు, అడ్డకట్టు.ఆనకట్ట. گل حکمت -ఎ,హిక్మత్ (పా) చీలమన్ను, పాత్రల మూతికి వాసనపట్టి పూయు మన్ను. گل سپید -ఎ,సఫేద్ (పా) నామము,తెల్లమన్ను. گل ارمنی -ఎ,అర్మనీ (పా) సీమ కావిరాయి.పుష్పకావి, సీమజాజికున్ను. گل سرخ -ఎ, సుర్ఖ్ (పా) జాజు, ఎఱ్ఱమన్ను. گل ملتانی -ఎ,ముల్తానీ (పా) గోపిచందనము(మన్ను).

گل గల్ (హి.పు) గళము, గొంతు, మెడ; గాలము. گل بہیاں ڈالنا -బహీయాం డాల్నా (హి) మెడచుట్టుచేతులు వేయుట, మెడను కౌగలించుకొనుట, ప్రేమ జూపుట, ఆలింగనము జేయుట. گل پھٹاکی -ఫటాకీ (హి) ఎచ్చిలు, పొగల్చములు, జంభాలు. گل پھولا -ఫూలా (హి) ఉబ్బు చెంపల వాడు. گلاجند ڈا - گل گندا -జంద్ డా - గందా (హి) మెడలో ముడివేసి జార విడచిన అంగవస్త్రము లేక ఉత్తరీయము, گل پھڑا -ఫడా (హి.పు) చేపయొక్క యూపిరితిత్తి. گل مچھیں -ముచ్ఛేం (పు) గొర మీసాలు, ఒఱ్ఱమీసాలు, చెంపలవరకు నుండు మీసాలు.

گلا గలా (హి.పు) గళము, మెడ, గొంతు, కుత్తుక, ధ్వని, గాళ, గార,[Funnel]. گلا آنا -ఆనా (హి) గొంతు నొప్పి వచ్చుట. گلا اُٹھانا یا کرنا -ఉఠానా -కర్నా (హి) కొండ నాలుక ఎత్తుట, కొండ నాలుకకు మిరియాలపొడిఅద్ది లేవనెత్తుట, گلا بند ہونا -బంద్ హోనా (హి) గొంతు మూసుకొనిపోవుట. گلا بیٹھنایا بڑنا -బైఠ్నా -పడ్నా (హి) గొంతు రాయుట. [to become hoarse]. گلا پھاڑنا -ఫాడ్నా (హి) గొంతు చించుకొనుట,అఱచుట. گلے باندھنا یا منڈھنا -బాంధ్నా-మంఢ్నా (హి) మెడకు వేయుట, అంటగట్టుట, ఒకరిపైన ఒట్టుపెట్టుట లేక వేయుట. گلے پڑنا గలే పడ్నా (హి) మెడకు పడుట, విధి లేక చేయవలసి వచ్చుట. گلے کا ہار ہونا గలే కా హార్ హోనా (హి)పీడించుట, బాధించుట, వెంటపడుట. گلے لگانا గలేలగానా (హి) కౌగలించుట. گلے لگنا గలే లగ్నా (హి) మెడకు పడుట.

گلا గుల్లా (హి.పు) ఉండ, వింటిలో పెట్టి కొట్టు మంటి వుండ.

گلاب గులాబ్ (పా.పు) సీమ పన్నీరు, పన్నీరుపువ్వు. گلاب پاش -పాష్ (పా) పన్నీరు బుడ్డి. گلاب جامن -జామున్ (పా) జంబునేరేడు, ఒక తిను బండము.

گلابی గులాబీ(పా.పు) పన్నీరుపువ్వువన్నె, పన్నీరు బుడ్డి, పన్నీరుపువ్వు వన్నెగలది, ఒక తినుబండము.

گلاس గిలాస్ (ఇం.పు) Glass,Tumbler, కోర, గిన్నె, పానపాత్ర.

گلال గులాల్ (హి.పు) బుక్కాడి, నీల కుంకుమ, ఊదా కుంకుమ, నీల పిష్టాతకము. گلال بازی -బాడీ- స్త్రీ క్రీడా హర్మ్యము, వేశ్యగృహము.

گلیارا గలియారా (హి.పు) పెద్దసందు, త్రోవ. (బాట.

گلیاری గలియారీ (హి) చిన్నసందు, కాలిబాట.

گلیا గలియా (హి.పు) నడచుటలో మధ్య మధ్య పండుకొను యెద్దు, పనిదొంగ.

گلیانا గలియానా (హి) తిట్టుట; బలవంతముగా ఆక్రమించుట.

گلیر గులేర్ (హి) అత్తిచెట్టు, మేడిచెట్టు.

گلیر کا نیرا -కా నీరా (హి) అత్తికల్లు.

گلیل గులేల్ (హి.స్త్రీ) ఒడిసెల, ఒడిసెల చిక్కము; అత్తిచెట్టు.

گلیم గలీమ్ (పా.పు) కంబళి, నాంకవము.

گم గుమ్ (పా) పోయిన, తప్పిపోయిన, నష్టమైన, దొరకని, అగపడకుండపోయిన, అగపడని, కలతజెందిన, కలవరపడిన. گمراه -రాహ్ (పా) త్రోవతప్పిన, మార్గభ్రంశము నొందిన. گم سم -సుమ్ (ఉ) మౌనముగా, చప్పుడు లేకుండ. گم کرنا -కర్నా (ఉ) పోగొట్టుట, దాచుట. گم شده -షుద (పా) పోయిన, నష్టమైన. گم هونا -హోనా (ఉ) పోవుట. నష్టమగుట.

گماشته గుమాష్తా (పా.పు) నియుక్తుడు, నియమింపబడినవాడు, మంత్రి, ఉద్యోగి, ప్రతినిధి, లేఖరి, వ్రాతగాడు, కార్యదర్శి. گماشته گری -గరీ (పా) ప్రాతినిధ్యము, కొలువు, కార్యదర్శిత్వము, ఉద్యోగము.

گمان గుమాన్ (పా.పు) తలంపు, భావము, అనుమానము, ఊహ; శంక; గర్వము. گمان غالب -గాలిబ్ (పు) అనుమాన బాహుళ్యము, (బహుళః కాగలదనుట).

گمان کرنا -కర్నా (ఉ) ఊహించుట, అనుమానించుట, తలచుట, శంకించుట, అనుకొనుట, గర్వించుట. گمان لیجانا -లేజానా (ఉ) ఊహించుకొనుట, తనలో తాను అనుకొనుట, అనుమానపడుట, శంకించుట.

گمانی గుమానీ (హి.పు) గర్వపోతు.

گمبهیر గంభీర్ (హి) గంభీరము, గంభీర స్వభావము.

گمت గమ్మత్ (హి. స్త్రీ) వినోదము, ప్రొద్దుపోక, ఉబుసుపోక, వినోదకాలక్షేపము; సమాజము, సంఘము, లాభము, బేరము.

گمٹ గుమ్మట్ (హి.పు) గుమ్మటము, గోళము, కలశము, గోపురము, కాగితపు గూడు.

گمٹی గుమ్టీ (ఇం.స్త్రీ) గింటెము, ఒకదినుసుదళసరిబట్ట.

گمچها గుమ్ఛా (హి.పు) చిన్నపంచె, తుండుగుడ్డ, అంగవస్త్రము.

گمچی గుంచీ (హి) గురిగింజ, గురివింద.

گمک గమక్ (హి. స్త్రీ) గమకము, గమము, నడక; స్వరవిన్యాసము; మద్దెల పలుకు, తాళము, వృత్తభేదము; వాసన, గంధము.

گمکیلا గమ్కీలా (హి) సుగంధముగల, సువాసనగల, ఘుమఘుమలాడు.

گن గున్ (హి.పు) గుణము, స్వభావము, సద్గుణము, యోగ్యత, విశేషము, ఆధిక్యత, నేర్పు, నైపుణ్యము; సౌకర్యము, గుణకారము, దారము, ఫలము, కారణము, రెట్టింపు, గుణితము. گن ندهان -నిధాన్- నేర్పరి, నిపుణుడు, పండితుడు.

گندان గంధాన్ (హి) గాడిదగడపగాకు, కడపరాకు.

گند فیروزه-گند بروجا గండ్ఫీరోజ్ - బిరోజా (హి) దేవదారుబంక.

گندک గంధక్ (హి.స్త్రీ) గంధకము, گندک کا تیزاب -కా తేజాబ్ (పా) గంధకధృతి.

گندکی لکڑی గంద్‌కీ లక్డీ (హి.స్త్రీ) ఉగ్రగంధ,వసకొమ్ము.

گندگی గందగీ (పా.స్త్రీ) దుర్గంధము, కంపు, మలము.

گندم గందుమ్ (పా.పు) గోధుమలు, گندم مکا -ఎ, మక్కా-(పా)మక్కజొన్నలు, گندم کرمانی గందుమెకిర్మాని (పా) సేవెలు.

گندمی గందుమీ (పా) గోధుమవన్నెగల.

گندورا గందోరా (హి.పు) శర్కరాపూపము. (పెండ్లివారికి పంచిపెట్టునవి), చక్కెరబిళ్లలు.

گندھ గంధ్(హి.పు) గంధము, వాసన, చందనము.

گنده-گندی గందా-గందీ (పా) దుర్గంధముగల, కంపుగొట్టు,నీచమైన, మలినము, మురికి, తుచ్ఛము, చెడినది, క్లిష్టమైన, మురిగిన.

گنده بیروزه గందబీరోజా(పా.పు) ముసాంబ్రము, దేవదారుపిసును. گنده بیروزه کا تیل - కా తేల్ (హి) కర్పూరతైలము, మట్టితైలము. (ము.

گندھار గంధార్ (హి.పు) గాంధారరాగ

گندھاوٹ గుంధావట్ (హి.స్త్రీ)అల్లిక, జడవేయుట, తలముడుచుట.

گندھک గంధక్ (హి.పు) చూడు.گندک گندھک کا تیزاب-కా తేజాబ్(పా) గంధకద్రావకము.

گندھنا గుంధ్నా (హి) పిండి పిసుకబడుట, మర్దితమగుట, మెదగుట, కూర్చబడుట, అల్లబడుట, జెడవేయబడుట, తలముడువబడుట.

گندھی గంధీ (హి.పు) పిష్టాతకుడు, కుంకుమవాడు.సుగంధద్రవ్యములమ్మువాడు, గందవొడికాడు.

گنڈا గండా (హి.పు) కుచ్చము, కుంచము; నాలుగింటిసమూహము. నాలుగు(డబ్బులు గవ్వలు మొ॥); కక్షురేఖ, తాయేతు, రక్షణమునకైకట్టుదారము, మాలిక, మండ్లత్రాడు, వెండి బంగారు పతకము మొ॥; చెరకుగడ;گنڈا تعویز کرنا-తావిజ్ కర్నా (ఉ) విభూతి గక్షురేఖలుపెట్టుట. (కూళి.

گنڈا గుండా (హి.పు) దుష్టుడు, పగగాకి,

گنڈاسا గండాసా (హి.పు) గండ్రగొడ్డలి.

گنڈ بھارنگی గండ్‌భారంగీ (హి) గంటుభారంగి.

گنڈری గిండరీ (హి. స్త్రీ) కుండ మొ॥ మోయువారు తలపైపెట్టుకొను బట్టచుట్ట.

گنڈمالا గండ్‌మాలా (హి.పు) గండమాల.

گنڈیری గండేరీ (హి.స్త్రీ) చెరకుముంట.

گنگ-گنگا గంగ్-గంగా(హి.స్త్రీ)గంగానది, గంగాదేవి. گنگا جمنی గంగా జమ్నా (హి.స్త్రీ) వెండిబంగారులు కలిసిన సరిగ, రాగియిత్తడిచేయు కలిసినది, ఒకకణ్ఠభూషణము, పోగులు; సమ్మిళితము, కలిసినది, రెండు రంగులుగలది. گنگادو

ھائی -దోహాయీ (హి) గంగతోడు, గంగతో ప్రమాణముచేయుట. گنگا جلی اٹھانا -ఉఠానా-గంగాజలముతో ప్రమాణముచేయుట. گنگا جلی - జలీ (హి) గంగకుప్పె, గంగనుంచు పాత్ర, گنگا ساگر -సాగర్ (పు) పెద్దచెంబు, పెద్దజలపాత్ర, కమండలువు. گنگا پتر -పుత్ర్ (హి.పు) గంగాపుత్రుడు అనగా గంగవద్దస్నానముచేయించుపురోహితుడు, స్నానమునకై సంకల్పము చెప్పుబ్రాహ్మణుడు.

گنگنا గున్గునా(హి) నులివెచ్చని, కొంచము వేడిగానున్న; మందోష్ణము, ముక్కుతో మాట్లాడు.

گنگناہٹ గున్గునా హట్ (హి.స్త్రీ) ముక్కునమాటాడుట, తనలోతాను మెల్లగాపాడుకొనుట, గుణుగుణులాడుట.

گنوار గఁవార్ (హి పు) జానపదుడు, పల్లెటూరివాడు, అసభ్యుడు, మోటువాడు, మూఢుడు, శుంఠుడు. گنوارپن -పన్ (హి) పల్లెటూరితనము, మోటుతనము, అసభ్యత, తెలివిమాలినతనము.మూఢత్వము. گنوار کاتھ -కాఠ్(హి)శుద్ధమూఢుడు, శుద్ధశుంఠ, మోటుమొద్దు.

گنوارو గఁవారూ (హి) పల్లెటూరి, అనాగరికమైన, మోటు, అసభ్యమైన.

گنوانا గఁవానా (హి) పోగొట్టుకొనుట, నష్టముజేయుట, పాడుజేయుట.

گنیا గునియా (హి.పు) మూలమట్టము, మట్టపలక, (ఉప్పరివాడు లేకవడ్లవాడు మూలలు సరిచూచుపనిముట్టు.) (కుడు.

گنیش గణేష్ (హి.పు) గణపతి, వినాయ

گو గో(పా)అయినను,అయినప్పటికిని; పలుకు, చెప్పు, అను; వాది, భాషి, పలుకువాడు, అనువాడు(వృత్తియందు). کم گو కమ్గో-మితభాషి. بد گو బద్గో-(పా) అశుభవాది, కీడుపలుకువాడు.

گو గూ (పా.స్త్రీ) మలము, పురీషము. گو کیکر کے ببول -కీకర్ కెబబూల్ (హి) నాగతుమ్మ, మురికితుమ్మ, కంపుతుమ్మ.

گو గా (హి.స్త్రీ) గోవు, సాధువు.

گوارا గువారా (పా) హితము, ఇష్టము, సమ్మతము, సహ్యము, ప్రియము, రుచ్యము, అనుకూలము, రోచకము, సంతోషదాయకము. گوارا کرنا -కర్నా(ఉ)సహించుట, సమ్మతించుట.

گوال - گوالا గుఆల్ - లా (హి.పు) గొల్లడు, గోపాలుడు, పాలవాడు.

گوالن గుఆలిన్ (హి.స్త్రీ) గొల్లది, గోపిక, పాలది.

گوانا గవానా (హి) పాడించుట.

گواہ గువాహ్ (పా.పు) సాక్షి, సాక్ష్యము.

گواہ تعلیمی -తఅలీమ (పా) కూటసాక్ష్యము, నేర్పినసాక్ష్యము.

گواہی గువాహీ (పా.స్త్రీ) సాక్ష్యము, ప్రమాణము, گواہی دینا -దేనా(ఉ) సాక్ష్యమిచ్చుట. گراہی کرنا -కర్నా (ఉ) సాక్షి (చేవ్రాలు) పెట్టుట.

گوبر గోబర్ (హి.పు) గోమయము, పేడ: పెండ.

گوبری గోబ్రీ (హి.స్త్రీ) పేడపూత, అలుకుపూత; گوبری کرنا కర్నా - పేడతో అలుకుట, అలుకు పూయుట, అలుకుపూతజేయుట.

گوبھی గోభీ (హి.స్త్రీ) గోబిగడ్డ, పూగోబి, కోసుగడ్డ.

گوپ గోప్ (హి.పు) గోపుడు, గొల్లవాడు; గోపు (కంఠాభరణము.)

گوپال గోపాల్ (హి.పు) గోపాలుడు, గొల్లడు, కృష్ణుడు.

گوپھن గోఫన్ (హి.స్త్రీ) వడిసెల, క్షేపణి.

گوتاگنبا గోతాగంబా (హి) పీతమూలిక పాలు, పసుపుచీనిపాలు, పీతగంధిపాలు, రేవలచీనిపాలు.

گوتھ గోథ్ (హి.పు) కాడి, యుగము.

گوتھنا గోథ్నా (హి) కూర్పించుట, కట్టించుట, గుంఫించుట, కూర్చుట, జెడవేయుట, అల్లుట.

گوٹ గోట్ (హి.స్త్రీ) గోటు, అంచు, పచ్చీసు ఆటలోని కాయ,

گوٹا గోటా (హి.పు) వెండి లేక బంగారు సరిగఅంచు, సరిగగోటు; ధనియాలు మిరియాలు మొ॥ వేసి కాచిన కషాయము.

گوجر గూజర్ (హి.పు) జెఱ్ఱి, ఆధారిక (పురుగు).

گوجر గోజర్ (హి.పు) గోపాలుడు, గొల్లడు, ఒకజాతి రాజపుత్రుడు.

گوچنی గోచనీ (హి.స్త్రీ) గోధుమలు శెనగలు కలిపిచల్లినపైరు, గోధుమలు శెనగలు కలిపి విసరినది.

گوچھی గాఛీ (హి.స్త్రీ) గడ్డిదుబ్బు; మొలక, మొక్క; మొగ్గ,చిగురు,

گود గోద్ (హి.స్త్రీ) ఒడి, ఉత్సంగము; దత్తు, స్వీకారము. گود بھرنا గోద్‌భర్నా (హి) ఒడినింపుట. گود بھری -భరీ (హి) బిడ్డల, బాలింతయైన, సంతానవతియైన. گود پسارنا గోద్‌పసార్నా (హి) ఒడిపట్టుట, యాచించుట. گود لینا గోద్-లేనా (హి) దత్తుతీసుకొనుట, బిడ్డను ఎంచుకొనుట. گود کھلانا గోద్-ఖిలానా (హి) ఎత్తుకొనుట, చంకనెత్తుకొని ఆడించుట, ఎత్తుకొనిలాలించుట, పాలిచ్చుట, పెంచుట, పోషించుట.

گودا గూదా (హి.పు) మేధస్సు, మెదడు; చెట్టు మొ॥ వాని కోవ, లోపలిభాగము, లోని చేవ, [illegible] యూరా; గుజ్జు,గిజరు, కండ; (ఎముకలోని) మజ్జ, సారము, సారాంశము,

گودام గోడౌన్ (ఇంగ్లీ) [Godown] కొటారు, కొటారము, కొట్టు, గిడ్డంగి, ధాన్యాదివస్తువులు మొ॥ నిలువచేయుటకు కట్టి యుంచినచోటు లేక ఇల్లు.

گودڑ గూదడ్ (హి.పు) పాతగుడ్డలు, పాత చీలికలు, చింపిగుడ్డలు, చింపిబట్టలు. گودڑ گانٹھنا గోదడ్-గాంఠ్నా-[illegible] కుట్టుట. బొంతకుట్టుట. گودڑ لال -లాల్ (హి) పసిపాపలకు [illegible].

گودنا గోద్నా (హి) [illegible], [illegible], పచ్చపొడుచుట, [illegible], పచ్చ; గ్రుచ్చుట, [illegible], కుళ్లగించుట.

گور గోర్ (పా.స్త్రీ) సమాధి,(ఏ) శవము పూడ్చుచోటు, గోరీ. گورستان గోరిస్తాన్ (పా) శ్మశానము, శవములను పూడ్చుచోటు, పితృవనము. گورکفن -కఫన్ - శవసంస్కారము, శవమునుపూడ్చుట మొదలగు పనులు.

**گورا** గోరా (హి) గౌరము, లావణ్యముగల, అందమైన, గౌరవర్ణముగల, ఎఱ్ఱని, తెల్లని; జాతివాడు, ఫిరంగివాడు, గౌరవర్ణముగలది.

**گورا** గౌరా (హి.పు) మగపిచ్చుక, పార్వతిదేవి.

**گورکھ دھندا** గోరక్‌ధందా (హి.పు) అంతరాంతము గలది, అయోమయము, చిక్కు, చిక్కుతాళము, సంకటము, చిక్కువిషయము, విషయము.

**گورکھ املی** గోరక్‌అమ్లీ (హి) సర్ప దండి, పంచపరటిక.

**گورو** గోరూ (హి.పు) గోవులు, పశువులు, గోదలు, కొమ్ములుగలపశువులు.

**گوروچن** గోరోచన్ (హి) గోరోజనము,

**گولی نیم** گوی نیم గోయీనీమ్(హి)చూడుము

**گوری** గౌరి (హి.స్త్రీ) పార్వతి, రాగ విశేషము.

**گوریا** గౌరియా (హి.స్త్రీ) ఆడపిచ్చుక, మట్టిచొంగ, చిన్నగుడ్డీ.

**گوڑ-گوڑا** గోడ్-డా (హి.పు) కాలు, అడుగు, చీలమండ, మోకాలు, మోకాటి చిప్ప. **گوڑ ٹوٹنا** - టూట్నా (హి) కాళ్లువిరుగుట, కాళ్లుపడిపోవుట, (నడవ లేకుండుట) కూలబడుట, మిక్కిలి అలసి పోవుట, ఆశ్చర్యపడుట. **- گوڑ پڑنا** పడ్నా (హి) కాళ్లపడుట, కాళ్లమీద పడుట, మ్రొక్కుట. **گوڑ پسارنا**-పసా ర్నా (హి) కాళ్లుబాగచాచుట, చచ్చుట.

**گوڑنا** గోడ్నా (హి)త్రవ్వుట, కుళ్లగించుట, (త్రవ్వి) తోడుట, తోడితీయుట.

**گوڑ ہیت** గోడైత్ (హి.పు) పల్లెటూరి కావలికాడు, గూఢచారుడు,

**گوز** గౌజ్ (పా.పు) అక్షోటము, (ఫలము); గూనుగలవాడు (వీపువంపుగల), అపాన వాయువు. **گوز مارنا**-మార్నా (ఉ)అపా నవాయువు విడుచుట.

**گوزن** గౌజేన్ (పా.పు) దుప్పి; గవయము.

**گوسالہ** గోసాల(పా.పు)ఆవుదూడ, ఏడాది దూడ.

**گوسالا** గోసాలా (హి.పు) గోశాల, ఆవుల కొట్టము.

**گوسائیں** గోసాయీం (హి.పు) స్వామి, బైరాగి, భర్తగు, ఒకజాతి.

**گوسپند-گوسفند** గోస్‌పంద్-గోస్‌ఫంద్ (పా.పు) గొఱ్ఱె, మేక.

**گوش** గోష్ (పా.పు) చెవి, కర్ణము, శ్రవణము, **گوش ہونا** -హోనా (ఉ) వినబడుట. **گوش گزارکرنا** -గుజార్‌కర్నా (ఉ) శ్రుతపరచుట, చెప్పుట. **-گوشمال** మాల్ (పా) చెవులు పిండుట, శిక్ష, చీవాట్లు.

**گوشت** గోష్త్(పా.పు) మాంసము. **گوشت خوار** -ఖార్-మాంసభక్షకము, మాంస ము తినెడు.

**گوشوارہ** గోష్వారా (పా.పు) చెవిపోగు, కర్ణభూషణము; తలగుడ్డపై చుట్టుకొను పట్టము; మొత్తముల లెక్క, కడపటిలెక్క, అప్పనలెక్క, లెక్కసారాంశము, మొత్త ము, లెక్కమొత్తము.

**گوشہ** గోష (పా.పు) కోణము, మూల, రహస్యస్థలము, మరుగుస్థలము, విశ్రాం తిస్థలము; వింటికొప్పు; అంతఃపురము.

**گوکھرو** గోఖ్రూ (హి.పు) పల్లేరు, పల్లేరు

**گونہ** గూన (పా.పు) వర్ణము, జాతి, రీగ; వైఖరి, ఆకారము, విధము; గుణము, రెట్టింపు, అంత. **یک گونہ** యక్ గూన (పా) ఒకింత, కొంచెము. **دوگونہ** దో గూన (పా) ద్విగుణము, రెండంతలు, రెట్టింపు.

**گونہار** గౌన్‌హార్ (హి.పు) శోభనపెండ్లి కూతురిని ఇంటికి పిలుచుకొని వచ్చుటకు శావు శోభనపు పెండ్లికొడుకుతో గూడ పోవువారు.

**گوہ** గూహ్ (హి.పు) మలము.

**گوہ** గోహ్ (హి.స్త్రీ) ఉడుము.

**گوہار** గోహార్ (హి.పు) మొగ, పిలుపు, కేక, ప్రార్థన; పోట్లాట, అల్లరి, బూతులు, తిట్లు, తిట్లాట, కొట్టుకొనుట, బూతులాట.

**گوہر** గౌహర్ (పా.పు) ముత్యము; వంశము; మూలము, సారము, వస్తువు, తత్వము, స్వభావము, ముత్యములోనగు వానినీరు, కళ, కాంతి, కత్తిమెరుగు లేక పదును. **گوہرسنج** -సంజ్ (పా) ముత్యముల పరీక్షకుడు, రత్నపరీక్షకుడు.

**گوہری** గౌహరీ (పా) ముత్యాలశెట్టి, రత్నాలశెట్టి, నగలవర్తకుడు, సోనారి.

**گوہرانا** గోహ్రానా (హి) కేకవేయుట, పిలుచుట.

**گوئی** గోయీ (పా) గణనము, కథనము, చెప్పుట (వృత్తియందు). **عیب گوئی** అయిబ్ గోయీ – దోషగణనము, దోషకథనము. (కుడు.

**گوئیا** గవైయా (హి.పు) పాటగాడు, గాయ

**گوئیاں** గూయియాఁ (హి.స్త్రీ) చెలికత్తె, సఖి, తోడికత్తె.

**گویا** గోయా (పా) పోలె, వలె, అన్నట్టు, నాదగు, అనదగు (అవ్యయము).

**گویائی** గోయాయీ (పా.స్త్రీ) వక్తృత్వము, వచోధోరణి, వాగ్ధాటి.

**گوئندہ** గోయిందా (పా.పు) కథకుడు, చెప్పువాడు, మాటలాడువాడు; సమాచారము చెప్పువాడు, వేగులవాడు, చాడుడు, నేరముయొక్క రహస్యము బయలుపరచువాడు.

**گھات** ఘాత్ (హి.స్త్రీ) పొంచియుండుట, పొంచు, పొంచిక, నాటు; ఎర; ఘాత, చంపుట, హింస, మోసము; ఉరులు.

**گھاٹ** ఘాట్ (హి.పు) ఘట్టము, రేవు, దిగుచోటు, నీళ్లరేవు, స్నానఘట్టము; ఏటిలోనికి దిగుచోటు, ఏటియొడ్డు; సుంకము గొనుచోటు; కత్తిలోనివంపు, నష్టము; లోపము; కంచుకము యొక్క మెడక్రిందిభాగము. **گھاٹ گھاٹ کا پانی پینا** -ఘాట్ కా పానీపీనా (హి) దేశములు తిరిగిన, ప్రపంచానుభవముగల. **سوکھے گھاٹ اُتارنا** సూఖేఘాట్ ఉతార్నా (హి) ఆశాభంగముజేయుట, మోసగించుట. **گھاٹ مارنا** -ఘాట్-మార్నా (హి) సుంకమీయక దొంగతనముగా పోవుట. **گھاٹ مانجھی** ఘాట్-మాంఝీ(హి) ఏఱు దాటించువాడు.

**گھاٹی** ఘాటీ (హి.స్త్రీ) కనుమ, కొండలసందు, త్రోవ, వాయ, లోయ; గొంతు, కుత్తుక; సుంకపుచీటి, సెలవుచీటి;

**گھاس** ఘాస్ (హి.స్త్రీ) ఘాసము, గడ్డి,

కసవు. گھاس پات -ఘాస్‌పాత్ (హి) ఆకులలము, చెత్తచెదారము, గడ్డిగాదము, కసవు. گھاس کھودنا -ఘాస్ ఖోద్నా(హి) గడ్డిచెక్కుట,గడ్డిదోకుట. گھاس پھوس -ఘాస్ ఫూస్ (హి)గడ్డిగాదము, అలము,కలుపు.

گھاگ ఘాగ్(పా.పు) వృద్ధు, అనుభవశాలి, కాలముచూచినవాడు, వృద్ధ జంబుకము, జిత్తులమారి, పలుగాకి.

گھاگھرا ఘాఘ్రా (హి.పు) పావడ, లంగా, గాగరా, పరికిణి; ఒకగువ్వ, పావురము; گھاگھرا پلٹن -ఘాఘ్రా పల్‌టన్ (ఉ) స్కాట్లండు సిపాయిల పటాలము.

گھام ఘామ్ (హి.స్త్రీ) ఎండ, సూర్యరశ్మి, వేడిమి, ఉక్క,ఉడుకపోత. گھام کھانا -ఘామ్ ఖానా- ఎండ కాచుకొనుట.

گھامڑ ఘామడ్ (హి) జేల, తెలివిమాలిన వాడు, సాధువు, అంబేద.

گھان ఘాన్ (హి.పు) వాయి, ఒకసారి గానుగలోగానిమూకుడులోగాని రోటిలోగాని వేయునంత.

گھانٹی ఘాంటీ (హి.స్త్రీ) కొండనాలుక, గొంతు, కుత్తుక; గొంతుముడి, గొంతుకపోక.

گھانی ఘానీ (హి.స్త్రీ) గానుగ, చెఱుకు గానుగ, నూనెగానుగ; గానుగలో ఒకసారివేయువాయి.

گھاو ఘావ్ (హి.పు) లోతైనగాయము, కత్తివ్రేటు, పెద్దపుండు, లాడి; నష్టము. گھاو کھانا -ఘావ్ ఖానా(హి) గాయపడుట.

گھائی ఘాయీ (హి.స్త్రీ) చెట్టునకు కొమ్మకునుమధ్యనుండుమూల, చెట్టుపంగ, పంగ; అయిదింటిసమూహము,పంచకము; సామునేర్చుకొనుటలో చేయుపోట్లాట; మోసము, టక్కు; కత్తివ్రేటు, వాటు, వ్రేళ్లసందు; సోయిసందు.

گھائل ఘాయల్ (హి) గాయముపడిన, దెబ్బతగిలిన; వలపులోచిక్కుకొన్న, మోహితుడైన.

گھبرانا ఘబ్రానా (హి) ఆతురపడుట, కలవరపడుట,సంభ్రమము నొందుట, చీకాకునొందుట, కలతనొందుట, భ్రమచెందుట, దిగ్భ్రమనొందుట, దిగులొందుట, నిశ్చేష్టితుడగుట, ఏమియుతోచకుండుట.

گھبراہٹ ఘబ్రాహట్ (హి.స్త్రీ) వెఱగుపాటు, సంభ్రమము, కలవరము,కలవరపాటు, తొట్రుపాటు, కలత, చీకాకు, దిగ్భ్రమ, ఏమియుతోచనిస్థితి, నిశ్చేష్టత, భయము, భ్రాంతి, దిగులు.

گھپلا ఘప్లా (హి.పు) తప్పుడు లెక్క, దొంగలెక్క, లెక్క సరిపోకుండుట, తప్పు; మోసము, చిక్కు, కలవరము, అయోమయము (గానుండుట), కలగాపులగము, సంకరము.

گھات ఘాత్ (హి.పు) ఘాటము, కుండ, కడవ; దేహము,మనసు;క్షయము, తగ్గుదల,

گھٹا ఘటా (హి.స్త్రీ) కారు మొగులు, దట్టమైనమొగులు, నల్లమొగులు, మేఘసమూహము, మబ్బుతెప్పలు. گھٹا اٹھنا -ఘటా ఉఠ్నా (హి) మొగులుకమ్ముట, మబ్బు వేయుట, మబ్బుక్రమ్ముట. گھٹا چھانا -ఘటా ఛానా (హి) మేఘముక్రమ్ముట, మొగులు కప్పుకొనివచ్చుట.

گھٹانا ఘటానా (హి) తగ్గించుట, తీసివేయుట, లోపింపజేయుట, త్రోసివేయుట,

త్రోపుడు పెట్టు, గట్టించుట, అణచుట, దించుట, దిగదీయుట.

**گھٹاو** ఘటావ్ (హి. పు) తగ్గింపు, తీసివేత, త్రోసివేత, త్రోపుడు, క్షయము, లోపము, దిగుడు, దిగుదల, తగ్గుదల. తీసిపోవుట, గట్టన, దిగిపోవుట, తగ్గు, తగ్గుట, ఉపశాంతి. **گھٹاو بڑھاو** - ఘటావ్ బఢావ్ (హి) ఎచ్చుతగ్గులు, వృద్ధిక్షయము, తగ్గుమొగ్గలు, న్యూనాధిక్యము.

**گھٹتی** ఘట్తీ (హి. స్త్రీ) క్షయము, తగ్గుదల, దిగుదల.

**گھٹنا** ఘుట్నా (హి) పొడియగుట, మెదుగుట, మర్దనసుగుట, నలుగుట, చూర్ణమగుట, లెస్స ఉడుకుట, చిముడుట; ఊపిరితిరుగక పోవుట, ఊపిరాడక పోవుట; వెండ్రుకలు తీయుట, కేశఖండనము, బోడిగా గొరగబడుట; మెరుగు పెట్టబడుట; నిండుకొనుట, పాగ మొ॥ కప్పుకొనుట; సంభాషణము చేయుచుండు, మాటలలో నుండు, మిక్కిలి స్నేహితులుగానుండుట, కలిసిమెలసియుండుట, (పు) మోకాలు.

**گھٹنوں چلنا - گھٹنو کے بل چلنا** ఘుట్నోఁ చల్నా - ఘుట్నోఁ కె బల్ చల్నా (హి) మోకాళ్లమీద ప్రాకుట, దోగాడుట.

**گھٹنا** ఘటనా (హి) తగ్గుట, లోపించుట, క్షయించుట, ఉపశమించుట. దిగుట, దిగిపోవుట, కృశించుట, అడగిపోవుట, అణగుట, ఘట్టితమగుట, గట్టనయగుట.

**گھٹی** ఘుట్టీ (హి. స్త్రీ) పిల్లలకుపోయుమందు, పొంగుగసము. **گھٹی کی جڑ** - కీజడ్ (హి) దింటన, దింటనవేరు.

**گھٹیا** ఘటియా (హి) మట్టమైన, తగ్గువెలగల, చౌకైన, నీచమైన.

**گھچ پچ** ఘిచ్ పిచ్ (హి) గిజిబిజి, సందడి చికాకు, కలత, ఒత్తిడి, జనసమ్మర్దము, దట్టముగా (నుండుట), నిబిడత; చిక్కు, చిక్కుగా వ్రాసినది.

**گھر** ఘర్ (హి. పు) గృహము, ఇల్లు, నివాసము, ఉనికిపట్టు; ఉండుచోటు, మూలము, ఉత్పత్తిస్థానము, చోటు, కొట్టు, గూడు, కత్తి మొ॥ వాని ఒఱ, తొడుపు; వంశము, కుటుంబము, సంసారము, స్వదేశము, గది, కొట్టు; కోళ్లు మొ॥ వానికై కట్టిన గూడు, సొరగు. **گھر آباد کرنا** - ఘర్ ఆబాద్ కర్నా (హి) ఇల్లునిలుపుట, పెండ్లాడుట, బిడ్డలగనుట. **گھر بار** - ఘర్ - బార్ (హి) కుటుంబము, ఇంటిసామగ్రి, చరాస్తి, కాపరము. **گھر بار بسنا** - ఘర్ బార్ బస్నా (హి) ఒకఇంటివాడగుట, భార్యనుఇంటికి తెచ్చుకొనుట, కాపురముచేయుచుండుట, కాపురముండుట, కాపురస్థుడగుట. **گھر بسنا** ఘర్ - బస్నా (హి) ఇల్లునిలుచుట, పెండ్లియగుట. **گھر بنانا** ఘర్ - బనానా (హి) ఇల్లుకట్టుట, ఇంటిలోవలె సుఖముగానుండుట. **گھر بھر** ఘర్ - భర్ (హి) ఇంటిల్లిపాది, ఇంటివారందరు, కుటుంబమంతయు. **گھر یگھر** ఘరేఘర్ (హి) ఇంటింట, ఇంటింటికి. **گھر بیٹھنا** ఘర్ - బైఠ్నా (హి) ఇంట్లో కూర్చుండుట, కొలువు లేకుండుట. **گھر بگڑنا** ఘర్ - బిగడ్నా (హి) కాపురముచెడుట, ఇల్లుచెడుట, ఆలుగాని మగడుగాని చచ్చుట. **گھر بیٹھے** ఘర్ - బైఠే (హి) ఇంట్లో కూర్చుండి, శ్రమలేకనే పనిచేయకుండ. **گھر چلانا** ఘర్ - చలానా - సంసారము గడించుట, సంసారమునునడ

పుట, సంసారము (ఇల్లు) నిర్వహించు చుండుట, ఇంటికగు వ్రయముభరించుట. گھر سر پر اُٹھانا -ఘర్ సర్ పర్ ఉఠానా (హి) సంసారభారము వహించుట, కేకలు వేయుట, ఇల్లెత్తిపోవునట్లరచుట, ఇల్లు నెత్తికెత్తుకొనుట. گھر کرنا - ఘర్ కర్నా (హి) కాపురముండుట, నివాసముచేయుట. گھسڑنا - گھسڑو - گھر سینا -ఘర్ సేనా -ఘుస్‌డూ -ఘుసడ్నా (హి) ఎల్లప్పుడు ఇంటిలో ఆడంగులతో కూర్చుండువాడు, ఇల్లు విడిచి బయలు వెడలనివాడు, ఎల్లప్పుడు ఇంట నుండువాడు. گھر والا -ఘర్‌వాలా (హి) ఇంటియాయన, మగవాడు, భర్త, ఇంటి యజమాని. گھر والی -ఘర్‌వాలీ (హి) ఇంటియాబిడ, ఇంటిది, భార్య, ఇల్లాలు. اونچا گھر ఊంచా- (హి) గొప్ప వంశము. بھرا گھر భరా- (హి) సంపదగలసంసారము, నిండు సంసారము.

گھرا ఘర్రా (హి.పు) గుఱ్ఱు, గుఱ్ఱుగుఱ్ఱు, గొంతులో గుటక (చచ్చునప్పుడు), చావు దల గుటక. گھرا چلنا -చల్నా (హి) చావుదల గుటక పుట్టుట, చావు గుటక పుట్టుట.

گہرا గహిరా (హి) గంభీరమైన, లోతైన, గాఢమైన, దట్టమైన, సాంద్రమైన, గాటమైన; గాటుగల, భారమైన. گہری چھننا -ఛన్నా- మిక్కిలి స్నేహముగలిగి యుండుట, గొప్ప పోట్లాట యగుట. گہری بات -బాత్ (హి) ఆలోచింపదగిన మాట, దూరాలోచనగల మాట. گہرے ہونا గహ్రే హోనా (హి) వృద్ధిపొందుట, బాగుపడుట, బలియుట, లావెక్కుట.

گھراتا ఘబ్రాతా (హి.పు) వదరి గుటక, గుటక వేట్టుట. (వాదము.

گھراہی ఘబ్రాహిట్ (హి.పు) తొందర కలవ్రా

گھرانا ఘరానా (హి) వంశము, సంతానము.

گھرانا ఘబ్రానా (హి) కలవరపడుట (తొందర- పడుట).

گھرکنا ఘుడక్నా (హి) గుఱ్ఱుమనుట, కోపపడుట, గద్దించుట, బెదరించుట, వెళ్లగొట్టుట.

گھرکی-گھڑکی ఘుడ్కీ-ఘిడ్కీ (హి.స్త్రీ) బెదిరింపు, గద్దింపు, నిష్ఠురము, అగ్రహము, కోపవాక్యము, గుఱ్ఱుమనుట.

گھرنا ఘిర్నా (హి) చుట్టుకొనబడుట, ముట్టబడుట, ముట్టడివేయబడుట, క్రమ్ముకొనుట, సమకూడుట.

گھرنی ఘిర్నీ (హి.స్త్రీ) గిరగిర తిరుగునది, గిరక, కప్పి, అడ్డగడ, గిలక, చక్రము; తల దిమ్ముపట్టుట, తల తిరుగుట, కండ్లు తిరుగుట, దిమ్ము.

گھروندا ఘరోందా (హి.పు) బొమ్మరిల్లు (పిల్లలాడుకొనునది).

گھریا ఘరియా (హి.పు) మూస; లోహ పెట్టెలు, కందిలీగొట్టు.

گھریلو ఘరేలూ (హి) గృహ్యము, ఇంటిలోని సొంతమునది, పెంచినది, పెంపుడుది.

گھڑ ఘుడ్ (హి.పు) గుఱ్ఱము (گھوڑا యొక్క సంక్షిప్తరూపము). گھڑچڑھا - ఘుడ్‌చఢా (హి) గుఱ్ఱపు రౌతు. گھڑچڑھی - ఘుడ్‌చఢీ (హి) గుఱ్ఱ మెక్కిన ఆడుది. گھڑدوڑ -ఘుడ్‌దౌడ్ (హి) గుఱ్ఱపు పందెము, గుఱ్ఱపు పరుగు పందెము. گھڑسال - ఘుడ్‌సాల్ (హి) అశ్వశాల, గుఱ్ఱపు సాల (కొట్టము).

**گھڑا** ఘడా (హి.పు) కడవ, కుండ.

**گھڑائی** ఘడాయీ (హి. స్త్రీ) పనితనము, చేత, పోత; చేసిన కూలి, చేతకూలి, పోత కూలి; కల్పన.

**گھڑت** ఘఢత్ (హి. స్త్రీ) పోత, చేత, పనితనము; కల్పన, కల్ల, నూతన కల్పన; కల్పితము, కల్పించిన మాట, పుట్టించిన మాట,

**گھڑونچی - گھڑونچا** ఘడోంచా-చీ (హి. స్త్రీ) గడమంచ, బరువులు పెట్టుకొనుటకైన నాలుగు కాళ్ళ మంచము, మంచె.

**گھڑی** ఘడీ (హి. స్త్రీ) గడియ, ఘటిక, అర నిమిషముల కాలపరిమాణము; కాలము, స్వల్పకాలము, సమయము; గడియారము, ఘటీకాగము; గంట, జేగంట. **گھڑی کوکنا** -కూక్నా (హి) గడియారమునకు కీగమిచ్చుట. **گھڑی میں ماسا گھڑی میں تولہ** -మేఁ మాసా ఘడీ మేఁ తోలా (హి) చపలచిత్తుడు, మాట నిలుకడ లేనివాడు.

**گھڑیا** ఘడియా (హి.పు) చూడు **گھریا**

**گھڑیال** ఘడియాల్ (హి.పు) మొసలి, నక్రము; గడియారము, ఘటికాయంత్రము; గంట, జేగంట.

**گھسا** ఘిస్సా (హి.పు) ఘర్షణము, రాపిడి, రాపు, ఒరయిక, ఒరపిడి; గుద్దుము నల వాగ్చు రాపిడి మొద్దు, రాపిడి దుంగ.

**گھساو - گھساوٹ - گھسائی** ఘిసావ్ - ఘిసావట్ - ఘిసాయీ (హి.పు. స్త్రీ) అరుగుట్లు, అరుగుట, రాయిడి, రాపిడి, ఒరపిడి.

**گھسانا** ఘుసానా (హి) దూరుట, చొన్పుట, దూర్చుట, చొప్పించుట, చొరగొట్టుట, బలవంతముగా దూర్చుట.

**گھسٹنا** ఘిసట్నా (హి) దేకిసలాగు, ఈడ్చుకొనుచు పోవుట, లాగబడుట, ఈడ్వబడుట.

**گھسنا** ఘుస్నా (హి) చొరబడుట, దూరుట, బొరుట, తొలిసికొనిపోవుట; బలవంతముగా దూరుట, దూకిపడుట. **گھس آنا** ఆనా (హి) చొరబడివచ్చుట, బలవంతముగా దూరుట. **گھس پڑنا** -పడ్నా (హి) బలవంతము చొరబడుట.

**گھسڑ پھسڑ** ఘుసడ్-ఫుసడ్ (హి) దూరుట, త్రోబ్బుట, గుసగుసలాట.

**گھسنا** ఘిస్నా (హి) చాదుట, రాయుట, సాన మొ॥ వాని మీదరుద్దుట, రుద్దుట; అరిగిపోవుట, జీర్ణమగుట.

**گھسیا** ఘుసియా (హి) గడ్డితిని బ్రతికెడు.

**گھسیارا** ఘసియారా (హి.పు) గడ్డికోయు వాడు.

**گھسیٹنا** ఘసీట్నా (హి) ఈడ్చుట లాగుట, పడవేసి ఈడ్చుట, అక్షరము గీకుట, తెలియకుండ వ్రాయుట, జిలుగుగా వ్రాయుట.

**گھسیڑنا** ఘుసేడ్నా (హి) దూరుట, బలవంతము దూర్చుట, గ్రుచ్చుట, లోనికి త్రోయుట, చొనుపుట.

**گھسیلا** ఘసీలా (హి) గడ్డిగల నేల.

**گھگھیانا** ఘిఘియానా (హి) భయలజ్జాదుల చేత మాటలాకుండుట లేక నోరాడకపోవుట, తడబడుచుమాట్లాడుట, దేబిరించుట, దీనముగా మాటలాడుట.

**گھنڈی** ఘుండీ(హి. స్త్రీ) గుండి, గ్రంథి, గుండుబొందె, బొత్తాసు-ముడి, వనస్పతి విశేషము.

**گھنگچی** ఘుంగ్చీ(హి. స్త్రీ) గురివిందగింజ, గుంజ.

**گھنگرالا** ఘుంగ్రాలా (హి) ఉంగరములు తిరిగిన, ఉంగరములుగా నుండు, చుట్టు కొను (వెండ్రుకలు).

**گھنگرو** ఘుంగ్రూ (హి.పు) గజ్జెలు, చిరు గంటలు; శెనగకాయ.

**گھنگولنا** ఘుంగోల్నా (హి) నీళ్లు మురికి చేయుట, బురదచేయుట.

**گھنگھور** ఘన్ ఘోర్ (హి) కారుమొగులు, దట్టమైన, ఘనాఘనము, మబ్బు క్రమ్మిన, మొగులుపట్టిన.

**گھوا** ఘుఆ (హి.పు) గాలపు పురుగు, చేపలుపట్టు గాలమునకు పెట్టు ఒకవిధమైన పురుగు; పేను.

**گھوٹا** ఘోటా (హి.పు) రోకలి, రోకటి బండ; మెఱుగుతాయి, మెఱుగు పెట్టుటకై రుద్దుతాయి.

**گھوارہ** ఘహ్వారా (పా.పు) ఉయ్యల, తొట్లి.

**گھوٹنا** ఘోట్నా (హి) పొడి చేయుట, చూర్ణముచేయుట; మర్దించుట, ఊపిరాడ కుండ జేయుట; గొంతు పిసుకుట; గొరుగుట; రుద్ది మెరుగుబెట్టుట; వల్లెపెట్టుట, మరలమరల చదువుట.

**گھور** ఘోర్ (హి) ఘోరము, భయంకరము; గాఢమైన, దట్టమైన; ఉఱుము, గర్జనము; మురికి, మైల; చెత్తచెదారము.

**گھورا** ఘూరా (హి.పు) చెత్త, కసవు, పెంటకుప్ప, ఎఱువు; పేడకుప్ప.

**گھورنا** ఘూర్నా (హి) ఉరిమి చూచుట, గుర్లురుముట, కోపముగాజూచుట, దృష్టి నిలిపి జూచుట.

**گھوڑا** ఘోడా (హి.పు) గుఱ్ఱము, ఘోటకము, అశ్వము; తుపాకిగుఱ్ఱము. **گھوڑا چھوڑنا** -ఛోడ్నా (హి) తుపాకిగుఱ్ఱమును పడవేయుట. **گھوڑا ڈالنا** -డాల్నా (హి) గుఱ్ఱమునువిడుచుట,గుఱ్ఱమును నాలుగుకాళ్ళ పరుగున పరుగెత్తించుట. **گھوڑا سرپٹ پھینکنا** -సర్పట్ ఫేంక్నా (హి) గుఱ్ఱము మిక్కిలి వెర మెత్తించుట, మిక్కిలి పరుగెత్తించుట. **گھوڑا چڑھانا** -చఢానా(హి) తుపాకిగుఱ్ఱము యెక్కుపెట్టుట, తుపాకి ఎక్కుపెట్టుట.

**گھوڑی** ఘోడీ (హి, స్త్రీ) ఆడుగుఱ్ఱము పెండ్లిపాట; సేవెల మఱ, సేవెలుజేయు మరలేక యంత్రము.

**گھوسی** ఘోసీ (హి.పు) గొల్లవాడు; పాలు అమ్ము తురక.

**گھوکنا** ఘోక్నా (హి) కంఠపాఠము జేయుట, వల్లెపెట్టుట.

**گھولنا** ఘోల్నా (హి) కరగించుట, కరగ జేయుట; కలుపుట.

**گھومنا** ఘూమ్నా (హి) భ్రమించుట, పరిభ్రమించుట, తిరుగుట; సంచారముచేయుట; తలదిరుగుట, దిమ్మపట్టుట.

**گھونٹ** ఘూంట్ (హి.పు) గుటక .(గుక్క. **گھونٹ کا گھونٹ** ...లహూ కా-,హి) నెత్తురు గుటక,సహనము, ఓర్పు. **گھونٹ لینا**

వలయము, చుట్టుగోడ, కంచె, ఆలవు; బింబము, మండలము; అంచు; ముట్టడింత, ముట్టడి; వృత్తము. **گھیرا ڈالنا** -డాల్నా (హి) ముట్టడించుట, చుట్టుకొనుట.

**گھیرا** ఘుహేరాం (హి.పు) విషపు తొండ, పిసువుబల్లి; నల్లికండ్లతాము.

**گھیرنا** ఘేర్నా (హి) చుట్టుకొనుట, ముట్టడించుట, ఆవరించుట, ఆక్రమించుట. కలుపుకొనుట, కౌగ్చుకొనుట, చుట్టు నిలుచుట.

**گھیکنوار-گھیگوار** ఘీకువార్-ఘీగవార్ (హి) కలబందచెట్టు, చిన్న కలబంద.

**گھینٹا** ఘైంటా (హి.పు) సూకరము, పందిపిల్ల.

**گیا** గయా (హి) గతము, పోయినది. **گیا گذرا** -గుజ్రా (ఉ) జరిగి పోయినది, త్రిప్పిపోయినది, పనికిమాలినది, నీచము, గతంగోత్రి. **گیے درجے** గయె దర్జే (ఉ) కనీసపక్షము, అధమపక్షము.

**گیارہ** గ్యారహ్ (హి) పదునొకండు.

**گیارھواں** గ్యార్‌హ్వా (హి) పదునొకండవ.

**گیان** గ్యాన్ (హి.పు) జ్ఞానము, తెలివి. **گیان گدڑی** -గుడ్‌డీ (హి) సన్యాసి బొంత. **گیان میں آنا** -మేఁ ఆనా (హి) మనసునకుపట్టుట, తెలియవచ్చుట.

**گیاہ** గియాహ్ (పా) పచ్చిగడ్డి, గడ్డి, పచ్చిక.

**گیت** గీత్ (హి.స్త్రీ) గీతము, పాట. **گیت گانا** -గానా (హి) పాటపాడుట, స్తోత్రపాఠము చదువుట; తెగనిముచ్చట పెట్టుట, దీర్ఘసూత్రముగా చెప్పుట.

**گیتی** గీతీ (పా.పు) ప్రపంచము, సృష్టి.

**گیدا** గేదా (పా.పు) రెక్కలురాని పక్షిపిల్ల; పసిబిడ్డ, శిశువు.

**گیدڑ** గీదడ్ (హి.పు) నక్క, జంబుకము; పిరికిపంద. **گیدڑ بھبکی** -భభ్‌కీ (హి) వట్టిబెదరింపులు.

**گیدی** గీదీ (పా) పిరికి, భయశీలుడు, చేతగానివాడు, తెలివిమాలినవాడు. **گیدی خر** -ఖర్ (పా) పిరికిపంద, అంబేదవాడు, రండ, బుద్ధిహీనుడు. చేతగాని గండవాడు.

**گیر** గిర్ (పా) గ్రాహి, తీసుకొనువాడు; జేత, జయించువాడు(వృత్తియందు). **عالم گیر** ఆలమ్- (పా) జగజ్జేత, ప్రపంచము జయించువాడు. **گل گیر** గుల్- (పా) కొడికత్తెర, దీపపు వత్తి కత్తిరించు చిన్న కత్తెర.

**گیرنا** గేర్నా (హి) పడవేయుట, జారవిడుచుట; వేయుట, పెట్టుట; పారజిమ్ముట, పారవేయుట; ఊరగాయ మొ॥ పెట్టుట, కాటుక దిద్దుట, సిద్ధపరచుట.

**گیرو** గేరూ (హి.పు) జాజు, జాజుమన్ను, కాషాయి.

**گیروا** గేరుఆ-గేర్వా (హి) జాజుపూసిన, జాజువన్నెగల; కాషాయవస్త్రము.

**گیسو** గేసూ (పా.పు) ఉంగరములుతిరిగిన వెండ్రుకలు, ముంగురులు, స్త్రీల ముంగురులు, కాకపక్షములు.

**گیل** గైల్ (హి.స్త్రీ) వీధి, బాట, త్రోవ, సందు, గొంది; తోడు, కూడ, తోడు, సావాసము.

**گیلا** గీలా (హి) తడిసిన, నెమ్మన, తడిగానున్న, నెమ్మగల, చెమ్మగల. **گیلا پن** -పన్ (హి.పు) తడి, నెమ్మ, చెమ్మగింత.

**گیلڑ** గేలడ్ (హి.పు) మొదటి మగని వలన బుట్టిన కొడుకు.

**گین** గీన్ (పా) ఇదియొక ప్రత్యయము. వృత్తియందు నిండిన, భరితము, గ్రస్తము, సహితము, యుక్తము, కల అను అర్థము లిచ్చును. **غمگین** గమ్- శోకగ్రస్తుడు, దుఃఖభరితుడు.

**گینجنا** గీంజ్నా (హి) పిసుకుట, నలుపుట, రుద్దుట, కలుపుట, కలియ గలుపు, కలియ పిసుకుట, నలిపివేయుట.

**گیند** గైంద్ (హి.పు) గజము, ఏనుగు.

**گیند** గేంద్ (హి.స్త్రీ) చెండు, కందుకము. **گیند بلا** -బల్లా(హి) బంతిపలకయాట, కందుక ఫలకము (క్రికెటు ఆట). **گیند تڑی** -తడీ (హి) చెండాట, ఒకరిపై నొకరు చెండు విసరివేసికొను ఆట, బంతు లాట.

**گیندا** గేందా(హి.పు) పెద్ద చెండు; బంతిపువ్వు.

**گینڈا** గేండా (హి.పు) ఖడ్గమృగము.

**گینڈلی** గేండ్లీ (హి.స్త్రీ) కుండలి, చుట్టు, చుట్ట. **گینڈلی مارنا** -మార్నా(హి) చుట్టచుట్టుకొనుట (పాము).

**گیہان** గెహాన్ (పా.పు) ప్రపంచము; కాలము; వృత్తి; ప్రకృతి [illegible].

**گیہوان** గెహువాన్ (హి) గోధుమవన్నెగల, చామనచాయగల.

**گیہوں** గెహూం (హి.పు) గోధుమలు.

---

# ل

**ل** లామ్ (హి.పు) లకారము. ఇది ఉరుదూ వర్ణమాలలో ముప్పదియవయక్షరము. అరబీలోను ముప్పదియవది. పారసీక భాషలో నిరువదియేడవది. అబ్జదు వర్ణసాంఖ్యమున దీనిసంఖ్య ముప్పది.

**لا** లా (అ) లేదు, కాదు; లేని, కాని, వినా, రహితము అనునర్థములనిచ్చువ్యతిరేకార్థక వ్యయము. **لاابالی** -ఉబాలీ (అ) నిర్లక్ష్యము, అలక్ష్యము, నిర్భయము, సాహసము, పోకిరితనము. **لابد** -బుద్ (అ) నిశ్చయముగా, తప్పకుండ. అవశ్యము, విధిలేక, విధిగా, తప్పని సరిగా. **لابدی** -బుదీ (అ) నిశ్చయమైన, తప్పని, విధ్యమైన, అవశ్యకము. **لاثانی** -సానీ (అ) అద్వితీయము, సాటిలేనిది. **لاجرم** -జరమ్ (అ) నిరుపాయముగా, నిస్సంశయముగా, విధిగా, తప్పకుండ, అవశ్యము. **لاجواب** -జవాబ్ (అ) నిరుత్తరము, ప్రత్యుత్తరము లేని, అద్వితీయము, సాటిలేని. **لاچار** -చార్ (పా) నిరుపాయము, గత్యంతరములేని, దిక్కుమాలిన, నిస్సహాయము, బీద, దీనము. **لاچاری** -చారీ (పా) నిరుపాయత, గతిలేమి, దైన్యము, దారిద్ర్యము, దీనదశ. **لاحل** -హల్ (అ) దుస్సాధ్యము, చేయరాని, కష్టతరమైన, అశక్యము, క్లిష్టము. **لاحول ولا قوة الا بالله** లాహౌలవలాకువ్వత ఇల్లా బిల్లాహి (అ) ఈశ్వరుడే సమర్థుడును శక్తిమంతుడును, ఈశ్వరుని వినా సమర్థుడును శక్తిమంతుడును లేడు, ఈశ్వరుడు సర్వ

సమర్థము. ఇది పాపపరిహారార్థక వాక్యము. భూతప్రేత పిశాచాదుల పారద్రోలుటకై దీని నుపయోగింతురు; పరిహతు పాపమ్;

لاحول پڑھنا - لاحول بھیجنا లాహౌల్ పఢ్నా-భేజ్నా (ఉ) భూత ప్రేతాదుల పరిహారార్థముగాని అనిష్ట పరిహారార్థముగాని "లాహౌల్" ఇత్యాది చేదువుట, పరిహారతు పాపమనుట, శపించుట, నిదించుట, దూషించుట, గర్హించుట. لاریب లా-రైబ్ (అ) నిస్సంశయముగా, నిశ్చయముగా. لازوال లా-జవాల్ (అ) అవినాశము, శాశ్వతము, నాశములేని, నాశ రహితము. لاعلاج లా ఇలాజ్ (అ) చికిత్సలేని, చికిత్సా రహితము, నిరుపాయము, కుదురని, అశక్యము. لاکلام లా-కలామ్ (అ) మారుమాటలేక, నిరాక్షేపముగా, నిశ్శంకముగా. لاعلم లా-ఇల్మ్ (అ) తెలియని. అజ్ఞుడైన, అజ్ఞాని. لامذهب లా-మజ్హబ్ (అ) పాషండుడు, మతబాహ్యుడు, మత శూన్యుడు, మతములేనివాడు. لامحاله - لامحال లా-మహాల్-మహాల (అ) నిస్సంశయముగా, నిశ్శంకముగా, అవశ్యము, నిశ్చయముగా. لاوارث లా-వారిస్ (అ) ఉత్తరాధికారిలేని, సంతానములేని, సంతాన రహితము, సంతులేని, దిక్కుమాలిన. لاولد లా-వలద్ (అ) సంతానములేని, బిడ్డపాపలు లేని, సంతానరహితము. لاونعم లావన అమ్ (అ) లేదు, అవును; అవుగాములు, అవును కాదు అనుట; ఉండు లేముల.

لایزال లాయజాల్ (అ) చూడు لازوال. لایعلم లాయఅలమ్ (అ) ఏమియును తెలియని, అజ్ఞాని. لایعنی లా యఅనీ (అ) తుచ్ఛము, నీచము, అనర్థము.

لایموت లాయమూత్ (అ) చావులేని, మృత్యురహితము.

لابه లాబ (పా.పు) ప్రార్థన, వినంతి, విజ్ఞాపనము, శ్లాఘన, ఇచ్ఛకము, ముఖస్తోత్రము,

لابھ లాభ్ (సం.పు) లాభము, ఆదాయము.

لات లాత్ (హి.స్త్రీ) చరణఘాత, తన్ను, పాదతాడనము. لات مارنا -మార్నా- తన్నుట. لات کھانا ఖానా- తన్నులు తినుట. لات مکی کرنا -ముక్కీ-కర్నా (హి)తన్నులాడుకొనుట, తన్నులు గుద్దులాడుట, తన్నులతో గుద్దులతో పోట్లాడుట.

لاٹ లాట్ (హి.పు) దొర, ప్రభువు, యజమాని.

لاٹھ లాఠ్ (హి.స్త్రీ) కఱ్ఱ, బడియ, దుడ్డు కఱ్ఱ; స్తంభము, నూనె గానుగ రోటిలో తిరుగు రోకలి (నిలువు మొద్దు), గానుగ రోకలి.

لاٹھی లాఠీ (హి.స్త్రీ) కఱ్ఱ, దుడ్డుకఱ్ఱ, బడియ. لاٹھی پونگا کرنا -పొంగా కర్నా- బడితలతో పోట్లాడుట. لاٹھی ٹیک کے چلنا -టేక్కే- చల్నా-కఱ్ఱ పొడుచుకొనుచు నడుచుట. لاٹھی چلانا -చలానా- బడిత త్రిప్పుట, బడిత ప్రయోగించుట.

لاج లాజ్ (హి.స్త్రీ) లజ్జ, సిగ్గు, బిడియము, మర్యాద. لاج گنوانا -గఁవానా-సిగ్గు విడుచుట, లజ్జాత్యాగము చేయుట, సిగ్గుమాలుట.

لاجورد లాజ్వర్ద్ (పా.పు) వైడూర్యము, పిల్లికన్నిరతనము; నీలవర్ణము.

**لاجوردی** లాజ్వర్దీ (పా) ఆకాశవర్ణము గల, నీలవర్ణమైన, వైదూర్య ఖచితమైన; వైదూర్యమణులు చెక్కిన(తాపిన).

**لاجونتی - لاجونت** లాజ్వంత్-తీ (హి) లజ్జావంతుడు, లజ్జావతి; సిగ్గు పడియెడు, బిడియముగల, బిడియపడుస్వభావముగల; అత్తపత్తిచెట్టు, సిగ్గాకు.

**لاجھا** లా ఝా (హి.పు) జిగురుదనము, జిగటుదనము, అంటుకొను స్వభావము, లసలసలాడుట.

**لاحق** లాహిక్ (అ) సన్నిహితమైన, అంటియున్న, కలిసియున్న, తగులుకొనియున్న, తాకియున్న, తగులాటము, సంబంధించిన, అనుబంధమైయున్న. (పు) అనుబంధము, సంబద్ధము, ఆశ్రితుడు, ఆశ్రయించియున్నది; శేషము, పూరణము. (వ్యాక) ప్రత్యయము, వర్ణకము.

**لاد** లాద్ (హి.పు) భారము, బరువు. **لاد پھاند** -ఫాంద్ (స్త్రీ) బండ్లు మొ॥ వానిపై బరువులెక్కించుట కట్టుట మొ॥ పని.

**لادنا** లాద్నా (హి) బరువెక్కించుట, భారమువేయుట, బరువు మోపుట, బరువు వేయుట.

**لادو** లాదూ (హి) భారవాహకము, బరువు మోయదగిన, బరువు మోసెడు జంతువు, మోత పశువు. **لادو کرنا** లాదూ కర్నా (హి) గుఱ్ఱముపై మొదటిసారి యెక్కుట లేక పల్లము వేయుట, బరువు వేయుట లేక యెక్కుట కలవార్చుట.

**لاڑ - لاڈ** లాడ్ (హి.పు) ముద్దు, లాలనము, ఉపలాలనము, బుజ్జగము.

**لاڑلا - لاڈلا** లాడ్లా (హి) ముద్దుచేయబడిన, ఉపలాలితుడు, లాలితుడు, ముద్దున పెరిగినవాడు.

**لاڈو-لاڑو** లాడూ-ముద్దుగాడి, ప్రియురాలు, పెండ్లికూతురు.

**لار** లార్ (హి.పు) లాల, చొల్లు, జొల్లు, చొంగ, స్యందిని; ఉమ్మి.

**لازب** లాజిబ్ (అ) అతికియుండు, వదలని, గట్టి, స్థిరమైన, దృఢమైన.

**لازم** లాజిమ్ (అ) విధ్యమైన, అవశ్యమైన, అనుబంధమైన, తప్పని, వదలని, విధియుక్తము, ఆవశ్యకము. (వ్యాక) అకర్మకము. **لازم آنا** -ఆనా (హి) విధ్యయగుట, అనుబంధమగుట, అనుసరించియుండుట, ఆవశ్యకమగుట, తప్పనిసరియగుట. **لازم ملزوم** -మల్జూమ్ (అ) అన్యోన్యాశ్రయములు, ఒకటొకదాననుసరించియుండునవి, అవినాసంబంధముగలవి, తప్పనివి, వేరుకానివి, మిక్కిలి స్నేహము.

**لازمی** లాజిమీ (అ) విధ్యమైన, తప్పని, అవశ్యకమైన.

**لاسا** లాసా (హి.పు) జిగురైనది, జిగటుగలది, జిగురు, జిగట (పక్షులనుపట్టుటకు), దాగమునకు పూయు జిగురు (మట్టిపాలు మొ॥నవి). బందన. **لاسا لگانا** లగానా (హి) జిగురు(గండె)తో పక్షులను పట్టుట; జగడము పెట్టుట. **لاسا پر لگانا** -పర్ లగానా (హి) లోపరచుకొనుట, అనుసరింపజేయుట, వశముజేసికొనుట.

**لاش** లాష్(తు. స్త్రీ) మృతకళేబరము, శవము.

**لاغر** లాగర్ (పా) కృశము, బక్కని, చిక్కిన, సన్నని,

لاغری లాగరీ (పా.స్త్రీ) కార్శ్యము, బక్కదనము, పలచదనము.

لاف లాఫ్ (పా.స్త్రీ) ప్రగల్భములు, ఆత్మస్తుతి, ఎచ్చులు, డంబములు, జంబములు. لاف زن లాఫ్-జన్ (పు) డంబములు కొట్టువాడు, ఎచ్చులమారి. لاف گزاف లాఫ్-గజాఫ్ (పా) వట్టి జంభాలు, వట్టి ఎచ్చులమాటలు.

لاک లాక్ (పా.పు) పిండిపిసుకుతట్ట లేక కొట్టు; తాబేలు; కొయ్యతట్ట; లక్క.

لاکھ లాఖ్ (హి.స్త్రీ) లక్క, లాక్షము, జతువు.

لاکھ లాఖ్ (హి) లక్ష, శతసహస్రము, నూరువేలు. لاکھ جی سے లాఖ్ జీసే (హి) మనస్ఫూర్తిగా, నిండుమనసుతో, ఎంతో ఇష్టముతో.

لاکھا లాఖా (హి.పు) లక్క, లత్తుక, ఎఱ్ఱరంగు.

لاگ లాగ్ (హి.స్త్రీ) అంటు, తగులు, సంబంధము, అంటిసి, ఆకర్షణ, ప్రేమ, మోహము, తగులాటము, వలపు; విరోధము, స్పర్థ; వ్యయము, క్రయము, వెల; గహాస్యము, గుట్టు, గ్రహసంబంధము, సోకు; పోటి; అసూయ, అనిష్టము. لاگ رکھنا లాగ్-రఖ్నా - పగగొనుట, వైరముగలిగియుండుట, స్పర్థించుట. لاگ لپیٹ లాగ్-లపేట్ (స్త్రీ) ద్రోహము, స్పర్ధ. لاگ لگنا లాగ్-లగ్నా - మోహించుట, వలపుగొనుట, వలపులో తగులుకొనుట, వలచుట.

لاگت లాగత్ (హి.స్త్రీ) వ్యయము, ప్రయము, క్రయము.

لاگو లాగూ (హి.పు) ఆశ్రితుడు, అనుచరుడు, వెంట నుండువాడు, వెంట తగిలినవాడు, వెన్నాడువాడు, వెంటబడినవాడు.

لال లాల్ (హి) ఎఱ్ఱబడిన, ఎఱ్ఱని, ఎఱ్ఱగా కాలిన; ఆగ్రహపడిన; జేవురించిన; ఎఱ్ఱరత్నము, కెంపు; పుత్రుడు, శిశువు, చొల్లు, చొంగ, లాలు; గుంజ. لال پیلی آنکھیں نکالنا లాల్ పీలీ ఆఖెఁ నికాల్నా (హి) గుడ్లెఱ్ఱ జేయుట, ఆగ్రహపడుట. لال اندراین లాల్-ఇంద్రాయన్ (హి.పు) అవ్వగోరపండు, ఆబువ్వ. لال انباڑا-ڑی లాల్-అంబాడా-డీ (హి) ఎఱ్ఱగోగూర, సీమగోగ్గూర. لال انگارا లాల్-అంగారా (హి) అగ్నికణములు, ఎఱ్ఱగాకాలియున్న బొగ్గులు. لال بیگ లాల్-బేగ్ (హి) పాకీవాండ్రగురువుపేరు. لال بیگی-بیگیا లాల్ బేగీ--బేగియా (హి) లాల్‌బేగుశిష్యులు, పాకివారు. لال بھئیں انولہ లాల్-భుయిఆఁవ్లా (హి) ఎఱ్ఱనేలఉసిరిక, నేలఉసిరిక. لال پوست లాల్-పోస్త్ (హి) ఎఱ్ఱగసాలచెట్టు. لال بھڑک లాల్ - భడక్ (హి) మిక్కిలిఎఱ్ఱగానున్న, రక్తవర్ణముగల. لال بھبوکا లాల్-భభోకా (హి) మిక్కిలి ఎఱ్ఱనైన, మిక్కిలిజేవురించిన (ముఖము.) لال بھجکڑ లాల్-భుజక్కడ్ (హి) పగమానందయ్య శిష్యుడు; తననుతాను మిక్కిలి తెలివిగలవాడ ననుకొను బుద్ధిహీనుడు. لال پیلا ہونا లాల్-పీలాహోనా (హి) ముఖము జేవురించుట, మిక్కిలి ఆగ్రహపడుట. لال جھاو లాల్-ఝావ్ (హి.పు) ఎఱ్ఱఏరుసరుమాను, ఎఱ్ఱశిరుసరుమాను. لال چیتا - چیترا - چترک లాల్ -చీతా-చిత్రా-చిత్రక్ (హి.పు) ఎఱ్ఱచిత్రమూలము, لال جام లాల్-జామ్ (హి) ఎఱ్ఱ జామిపండు, ఎఱ్ఱ గొయ్యాపండు.

لال خاں کا لکڑا -ఖాఁకాలక్డా (ఉ) బొండకొయ్య. لال کتاب -కితాబ్ (ఉ) ప్రశ్నజూచు పుస్తకము, ప్రశ్నపుస్తకము. لال دانہ -దాన (హి) రక్తబీజములు, ఎఱ్ఱవిత్తులు. لال کبریت -కిబ్రీత్ (ఉ) రక్తగంధకము. لال سفری آم -సఫ్రీఅమ్ (ఉ) ఎఱ్ఱగొయ్యాపండు. لال گندھک -గంధక్ (హి) రక్తగంధకము. لال مکو -మకో (హి) ఎఱ్ఱకామంచిచెట్టు. لال مرچ -మిర్చ్ (హి) మిరపకాయలు. لال ہڑتال -హడ్తాల్ (హి) మణిశిల, మన్నెలము, మనూసల. لال لنگوٹ والا -లంగోట్ వాలా (హి.పు) కోతి, వానరము, హనుమంతుడు. لال سوداگر -సౌదాగర్ (ఉ) చిన్నవర్తకుడు, చిల్లరవర్తకుడు, కొద్దిసొమ్ముతో అప్పటికప్పుడుకొనిఅమ్మికొనుచుండు చిన్నవర్తకుడు. لال ہونا -హోనా (హి) జేవురించుట, ఆగ్రహపడుట.

لالچ లాలచ్ (హి.పు) అత్యాశ, లోభము, పేరాస. لالچ دینا -దేనా- ఆశపెట్టుట, జూపుట; గొలుపుట, ప్రలోభనము. لالچ کرنا -కర్నా (హి) ఆసగొనుట: ఆసపడుట,

لالچی లాల్చీ (హి) ప్రలోభి, ప్రలోభముగలవాడు, అత్యాశగలవాడు, పేరాసగాడు.

لالڑی లాల్డీ (హి.స్త్రీ) ఒకజాతి కెంపు, కెంపునుపోలిన రాయి.

لالسا లాలాసా (సం.స్త్రీ) లాలస, అధికేచ్ఛ, అధిక ఆశ, లోభము; వేవిళ్ళు, గర్భిణీస్త్రీ కోరిక.

لالہ లాల (పా.పు) గసాలపువ్వు (ఎఱ్ఱనిది).

لالہ లాల (హి.పు) కోఠీదారుడు, వర్తకుడు, గౌరవనామము. لالہ جی -జీ (హి) తండ్రి, నాయన, అయ్య; పిల్లనిచ్చిన మామ, భర్తతండ్రియైనమామగారు; కోఠీదారుడు, వర్తకుడు; ఇంటిపెద్ద, యజమాని. لالہ بھیا کرنا -భయ్యా కర్నా (హి) లాలనజేయుట, బ్రతిమాలుకొనుట; మర్యాదగా మాటలాడుట, [illegible]గౌరవించుట.

لالی లాలీ (హి.స్త్రీ) ఎఱుపు, రక్తిమ, రక్తము; మర్యాద, గౌరవము; ముగ్ధబిడ్డము; తోబుట్టువు.

لالے లాలె (హి.పు) అభిలాష, ఆశ; ఆపేక్ష, కోరిక; నిరాశ, ఆశాభంగము. لالے پڑنا -పడ్నా (హి) అభిలాష పడుట, ఆశపడుట; నిరాశనగుట, ఆశలేకపోవుట; అభావమగుట, దొరకకుండుట, ఆపదలోపడుట, కష్టములోపడుట, దుర్భరమగుట. అపాయములో పడుట.

لام లామ్ (అ.పు) మరాఠముప్పేస, వక్రము, వంకరమైనది; పంక్తి, వరుస, సేనాసమూహము, సేన, పటాలము. لام کاف بکنا -కాఫ్ బక్నా (హి) దూషించుట, వంకటింకరగ మాటలాడుట, ఉపన్యాసము లాడుట.

لامسہ లామిస (అ.పు) స్పర్శము, తాకి తెలుసుకొనుట, స్పర్శజ్ఞానము. قوت لامسہ కువ్వత్-స్పర్శేంద్రియము, స్పర్శశక్తి.

لامع లామిఉ (అ) ప్రకాశమానము, దీప్యమానము. కాంతిగలది.

لانا లావా (హి) తెచ్చుట, తీసుకొని వచ్చుట, చేర్చుట; కలుగుట, ఫలించుట; ఇచ్చుట, సంపాదించుట, కొనుట, లాగుట, పురికొలుపుట, చూపుట, కనుపరచుట.

لانک లాఁక్ (హి.పు) కుచ్చిళ్లు, కుచ్చుపోసిన గోచిభాగము, వెనుకకు దోపిన కుచ్చిళ్లు, కాసెకట్టు. (స్త్రీ) కోసినపైరు, పైరు కోసివేసిన కుప్ప; కళ్లము; పొట్టు, ఊక; నూరు అను సంకేతపదము; జిగురు, బంక, పిసును.

لانگهنا లాంఘ్నా (హి) లంఘించుట, దూకుట, దాటుట.

لا أبالی లాఉబాలీ (అ) నాకు లక్ష్యము లేదు (అనుట), నిర్లక్ష్యము, అలక్ష్యము, అధికప్రసంగము, సాహసము, పోకిరితనము.

لاولشکر లాఒలష్కర్ (పా.పు) సపరివార సేనా సమూహము, మంది మాఱు బలము, సేనాపరివారము, సామగ్రియుక్తమైన సిబ్బంది.

لاونی లావ్నీ (హి.స్త్రీ) పైరుకోయుట, కోతకాలము; పన్ను; ఒకపాట.

لاه లాహ్ (హి.పు) వలువు, వలిపము, సన్నని బట్ట; లక్క, జతువు.

لاهوت లాహూత్ (అ.పు) కైవల్యము, పరతత్త్వము, సాయుజ్యము.

لائی లాయీ (హి.స్త్రీ) పైరుకోయుట, పైరుకోత, కోత.

لائح లాయిహ్ (అ) ప్రకాశమానము; స్పష్టము, విశదము, స్వచ్ఛము.

لائق లాయిక్ (అ) యోగ్యము, యోగ్యతగల, అర్హము, సమర్థము, తగినది, ఉచితము; సమర్థుడు, యోగ్యుడు, పండితుడు.

لائم లాయిమ్ (అ.పు) దూషకుడు, నిందించువాడు, దోషైకదృష్టిగలవాడు, తప్పులు పట్టువాడు.

لب లబ్ (పా.పు) పెదవి, ఓష్ఠము; అంచు, గట్టు, తీరము; మీసములు, చొల్లు, చొంగ, లాల. لبالب లబాలబ్ (పా) పరిపూర్ణము, సంపూర్ణముగా నిండినది, పొరలిపోవుచున్న. لب ولهجه -ఒలహ్జ (పా) ఉచ్చారణము, సంభాషణము, ధోరణి. لبین لینا లబేఁలేనా (హి) మీసములు గొరుగుట లేక కత్తిరించుట. لبوں پے جان هونا లబూఁపే జాన్ హోనా (ఉ) కొనయూపిరితోనుండుట.

لب లుబ్ (అ.పు) మూలము, సేవ, సారము, వస్తువుయొక్క ముఖ్యాంశము, హృదయము, బుద్ధి, మేధ, మూలవస్తువు; ఆత్మ; గింజపప్పు, గిజరు; సత్తు. لب لباب -ఎ, లుబాబ్ (అ) సారాంశము, శ్రేష్ఠాంశము, ముఖ్యాంశము, ఉత్తమభాగము; సారము సంక్షిప్తము, సంక్షేపము, తత్వము, మూలవస్తువు.

لباد లబ్బాద్ (అ.పు) కంబళ్లవాడు, గంతలవాడు, బొంతలవాడు, (చేయువాడు లేక అమ్మువాడు)

لبادہ లుబాద (పా.పు) బొచ్చులేకదూదివేసి కుట్టినఅంగీ, గలిచొక్కాయి, గలియంగీ.

**لباڑ - ڑ** లబాడ్-ఁడ్ (హి.పు) కల్లరి, అబద్ధికుడు, వదరుబోతు.

**لباس** లిబాస్ (అ.పు)దుస్తులు, ఉడుపులు; వేషము, కట్టుబట్టలు.

**لباسی** లిబాసీ (అ) మారువేషముగల, అసత్యమైన, వేష. సం॥.

**لبان** లుబాన్ (హి.పు) చూడు. لوبان

**لبرا - لبڑا** లబ్రా - డా (అ.పు) చూడు لباڑ ;ఎడమచేతపనిచేయువాడు, వామహస్తుడు.

**لبریز** లబ్‌రేజ్ (పా) అంచువరకునిండియున్న, పరిపూర్ణము, సంపూర్ణము,పారలిపోవుచున్న.

**لبریزی** లబ్‌రేజీ (పా) సంపూర్ణత, పూర్ణత; సమృద్ధి, పుష్కలము, నిండారు.

**لبلبہ** లబ్‌లబ (అ.పు) పిత్తకోశము.

**لبنی** లబ్‌నీ (హి.స్త్రీ) కల్లుదిగుటకుకట్టిన లొట్టి, ముంత.

**لبوب** లబూబ్(అ.పు) సారములు, మూలములు, విత్తనములు (ఏ.వ لب).

**لبھانا** లుభానా (హి) లోభింపజేయుట, ఆశపుట్టించుట, ఆసగొలుపుట, ప్రలోభనము.

**لبی** లబీ (పా) చిక్కగాకాగిన చెఱుకు పానకము, పాకము, రొట్టెయొక్కగాని పండుయొక్కగాని పెద్దతునక.

**لبیک** లబ్బైక్ (అ) ఉన్నాను, వస్తిని, ఇదిగోవస్తిని, ఏమి ఆజ్ఞ, వచ్చె.

**لپ** లప్(హి.స్త్రీ)దోసెడు, ముష్టి, పట్టెడు.

**لپائی** లిపాయి (హి.స్త్రీ) అలుకుట, అలుకు, పూత. **لپائی - پتائی** పుతాయి (హి)అలుకు పూతలు, చక్కజేయుట.

**لپٹ** లిపట్ (హి.స్త్రీ) మంట దెబ్బ, సెగ, కాక; సుగంధము, వాసనగల,గాలి దెబ్బ, గాలివిసరుకు,గుప్పునుట;వడగాలి.

**لپٹ لگنا** -లగ్నా (హి) ఎండదెబ్బ తగులుట, సెగతాకుట, వడతాకుట.

**لپٹانا** లిప్టానా (హి) అంటించుట, అతికించుట, అంటించుకొనుట; కౌగలించుకొనుట, కౌగిటజేర్చుట, అక్కునజేర్చుట; కలుపుట, ప్రేమించుట, ప్రేమతో దగ్గరకు తీసికొనుట, పూయుట, తగిలించుట, చిక్కువేయుట, వెంటతగిలించుట.

**لپٹاو** లిప్టావ్ (హి.పు) అంటు, జిగురుదనము, బందన, చుట్టువేయుట, తగులాటము పెట్టుట.

**لپٹنا** లిపట్‌నా(హి) తగులుకొనుట, చుట్టుకొనుట, కౌగలించుట, అంటుకొనుట, అతుకుకొనుట, వలపుగొనుట, మోసకుబడుట, చుట్టబడుట;బాధించుట, కలియబడుట, పెనగులాడుట, పోట్లాడుట.

**لپ جھپ** లప్‌ఝప్ (హి) లాఘవముగల; చురుకుదనముగల, వేగముగల, శీఘ్రముగా, దబదబ, గబగబ; హస్తలాఘవము, చురుకుదనము, మోసము.

**لپڑ** లప్పడ్ (హి.పు)చెంపదెబ్బ. చపేటము.

**لپڑ شپڑ** లపడ్‌షపడ్ (హి) అర్థములేని మాట, వ్యర్థపుమాట, చిక్కుమాట, గజిబిజిమాట, తెలియరానిమాట, గంద్రగోళపుమాట. (గాని ముసలివాడు.

**لپسی** లప్సీ (హి.స్త్రీ) గోధుమజావ, చేత

لپک లపక్ (హి. స్త్రీ) కవియుట, పైబడుట, దాటు, గంతు, దూకు, దెబ్బ, తాకుడు, మంట, పోటు, విసురుడు, అందుకొనుట, మెరపు, సెగ, జ్వాల; వేగము, వడి; చురుకుదనము, ఒడుపు.

لپکانا లప్కానా (హి) కవియించుట, ఉసి కొలుపుట, త్వరపెట్టుట, పురికొల్పుట, ఉరికించుట.

لپکنا లప్క్నా (హి) కవియుట, పైబడుట, పైకురుకుట, దూకుట; ఉరుకుట, త్వరపడుట, కొట్టుట, తట్టుట, తాకుట, పట్టుకొనుట, పట్టబోవుట; ఒడియుట; మంట లేచుట, మెరయుట; పోటుపుట్టుట.

لپنا లిప్నా (హి) అలుకబడుట, పూయబడుట, లిప్తమగుట.

لپوانا లిప్వానా (హి) అలికించుట, పూయించుట.

لپیٹ లపేట్ (హి. స్త్రీ) చుట్టు, చుట్ట, మడత, మడత; నెత్తి,వళి; పెన, కప్పు, మెలిక, చిక్కు; ద్వంద్వార్థము; ఇబ్బంది, కష్టము,నష్టము, రోగముతగులుట; గ్రహ బాధ, సోకు. لپیٹ جھپیٹ -ఝపేట్(హి. స్త్రీ) చికాకు, చిక్కులు, గంద్రగోళము.

لپیٹن లపేటన్ (హి. పు)సాలెవాడు నేసిన బట్టనుచుట్టు కొయ్యతుండు.

لپیٹنا లపేట్నా (హి) చుట్టుట, మడత పెట్టుట, కట్టుట, మద్దజేయుట, చుట్టి పెట్టుట, ముల్లెగట్టుట.

لپیٹواں లపేట్వాన్ (హి) మెలికలుగల, చుట్టుగల,చిక్కులుగల;అంతరాంతరములుగల, సందిగ్ధమైన, ద్వంద్వార్థముగల, దూరాన్వయముగల; టక్కులమారి, చిక్కులమారి, మోసముగల.

لت లత్ (హి, స్త్రీ) అభ్యాసము, దురభ్యాసము, చెడువాడుక, సంకరము, చెడుఅలవాటు.

لت లత్ (హి. స్త్రీ) ఇది لات యొక్క సంక్షిప్తరూపము. لت خورا - ఖోర్ (ఉ) తన్నులమారి, నీచుడు. لتخورا -ఖోరా(ఉ) కడప,దేవాళి, వానిసవాడు. لت کوب -కోబ్(ఉ) కట్టెదెబ్బలు, తన్నులు కొట్లు.

لتا లత్తా (హి. పు) చీలిక, పీలిక, పాత. کپڑا لتا కప్డా- (హి) బట్టపాత. لتاڑ -లతాడ్(హి. స్త్రీ) చివాట్లు, అవమానము, తిరస్కారము; ఉపద్రవము, ఆపద, కష్టము.

لتاڑنا లతాడ్నా (హి) కష్టము చేయించుట, ఎక్కువపనిజేయించుట, రాపిడిపెట్టుట; చివాట్లుపెట్టుట, తిరస్కరించుట, తలవంపులుజేయుట, అవమానించుట; దూషించుట.

لترا లత్రా(హి. పు)ముఖస్తోత్రముచేయువాడు, ఇచ్చకాలమారి. తిరస్కృతుడు, బహిష్కృతుడు; కొండెకాడు, చాడిగొట్టు, తంటాలమారి, పోకిరి, తుంటరి.

لتھاڑنا లిథాడ్నా (హి) మెత్తుట,పూయుట, పట్టించుట, తగిలించుట, పట్టువేయుట, మురికిజేయుట,కలుపుట, అంటించుట, తెప్పదోగించుట.

لتھڑ پتھڑ లథడ్ పథడ్ (హి) నిండిన, తడిసిన, తెప్ప దోగిన, మెత్తుకొనిన,

పూయబడిన; అంతటనుఅంటిన, తొరలుచున్న, ఓలలాడుచున్న.

**لتھڑنا - لتھیڑنا** లిథడ్నా-లిథేడ్నా (హి) మెత్తుట, పూయుట, అంటించుట, పట్టించుట, పట్టువేయుట, తొంగించుట, కలుపుట; చెలిచుట.

**لتھڑنا** లిథడ్నా (హి) మెత్తబడుట, పూయబడుట, మిక్కిలితడియుట, ఓలలాడుట.

**لتیانا** లతియానా (హి) తన్నులు తన్నుట.

**لٹ** లట్ (హి. స్త్రీ) అడలుకట్టినవెంట్రుకలు, జడ, జటు, అడ.

**لٹنا** లుటానా (హి) కొల్లబుచ్చుట, కొల్లలాడుట. వృథావ్యయముజేయుట, కొల్లబెట్టుట; పారలించుట, పార్లాడించుట.

**لٹائی** లటాయీ (హి. స్త్రీ) గాలిపడగదారముచుట్టు గిరిక, దారపుగిలుక.

**لٹ پٹ** లట్‌పట్ (హి) తడబాటు, సోలుట, చిక్కు, జగడము, తగులాటము.

**لٹپٹانا** లట్‌పటానా (హి) తడబడుట, వణకుట, ఊగులాడుట, సోలుట, సొక్కుట.

**لٹس** లుట్టస్ (హి. స్త్రీ) కొల్లలాట, దోపిడి, కొల్లగొట్టుట, నాశము, పాడుజేయుట.

**لٹک** లటక్ (హి. స్త్రీ) వ్రేలాట, వ్రేలాడుట, వ్రేలుడు; పలుకు, ఒయారము, శృంగారచేష్ట; గ్రహబాధ, సోకు; మోహము, వలపు, కిటుకు, గుట్టు, హస్తలాఘవము, టక్కుటమారము, మోసము, ఉపాయము.

**لٹکانا** లట్కానా (హి) వ్రేలాడజేయుట, వ్రేలాడ్చు, వ్రేలజేయు, వ్రేలుచు, వ్రేలకట్టు; తగిలించు; ఆపుట, నిలుపుట, కనిపెట్టుకొనియుండునట్లు చేయుట; ఉరితీయుట.

**لٹکاو** లట్కావ్ (హి. పు) వ్రేలుడు, వ్రేలాడబడియుండుట, వ్రేలాట.

**لٹکن** లట్కన్ (హి. పు) వ్రేలాట, లంబితము, వ్రేలాడునది, లోలం, లోలితము; లోలకము, చెవిభూషణము; గంటలోలం; వ్రేలుడు, వ్రేలాడబడియుండు వస్తువు.

**لٹکنا** లటక్నా (హి) వ్రేలాడుట, వ్రేలుట; ఆగియుండుట, నిలిచియుండుట.

**لٹنا** లుట్నా (హి) కొల్లగొట్టబడుట, దొడ్డబోవుట, కొల్లబోవుట, దోచుకొనబడుట, దోపుడుపడుట, పాడగుట, నాశనమగుట, నష్టపడుట.

**لٹنا** లట్నా (హి) కృశించుట, బక్కపడుట, సన్నగిలుట, చిక్కిపోవుట, బీదగిలుట, పేదయగుట, బీదపడుట.

**لٹو** లట్టూ (హి. పు) బొంగరము.

**لٹوانا** లుటవానా (హి) కొల్లగొట్టించుట, కొల్లపెట్టుట, దోపించుట, దోపుడుపెట్టుట, నాశముచేయించుట.

**لٹوری** లటూరీ (హి. స్త్రీ) వెంట్రుకలు, అడలుగట్టినచిన్న వెంట్రుకలు, జడలు, అడలు, **لٹوری اُتروانا**-ఉతర్వానా - పుట్టువెంట్రుకలుతీయించుట.

**لٹھ** లఠ్ (హి. పు) బడిత, బడియ, దుడ్డుకఱ్ఱ, కఱ్ఱ, కోలకఱ్ఱ, బుద్ధిహీనుడు, చదువుకానివాడు (మొద్దు). **لٹھ بازی** - బాజీ (ఉ) బడితసాము, బడితలతో కొట్టుకొనుట. **لٹھ چلانا** - చలానా (హి) బడితలతో పోట్లాడుట, బడితలు ప్రయోగించుట, కొట్లాట.

**لتها** లత్థా (హి.పు) దూలము, మొద్దు దుంగ (ముత కొట్టు, కొలకోల). **لتها پتها** లత్థం - బడితెలపోట్లాట.

**لتھیت** లథైత్ (హి.పు) బడిత (సాము) కాడు, మూర్ఖుడు, మొద్దువాడు.

**لتیا** లుటియా (హి.స్త్రీ) చిన్న చెంబు (విత్తడి లేక ంగిడి), **لتیا ڈبونا** లుటియా-డుబోనా (హి) తప్పెలమునుగుట, అవమానము తెచ్చుకొనుట, నాశము తెచ్చుకొనుట. **لتیا ڈوبنا** లుటియా డూబ్నా (హి) తప్పెలమునుగుట, అవమానమువచ్చుట, నాశమగుట.

**لتیرا** లుటేరా (హి.పు) దోపుడుదొంగ, త్రోవలుకొట్టువాడు, మోసగాడు.

**لث** లిస్స (అ.స్త్రీ) పంటిచిగురు, పళ్లుపై నుండుమాంసభాగము.

**لجاجت** లజాజత్ (అ.స్త్రీ) అతిశయోక్తి ముఖస్తోత్రము, జగడము, పోట్లాట.

**لجلجا** లుజ్లుజా (హి) జిగటగానున్న, మెత్తని, లసలసగానున్న, లసలస.

**لجّہ** లుజ్జ (అ.పు) లోతైననీరు, నట్టేరు, మధ్యసముద్రము, నడిసముద్రము, సుడి, సుడిగుండము. (మావి.

**لگھڑی** లిఘాడీ (హి.స్త్రీ) జరాయువు,

**لچا** లుచ్చా (హి.పు) కల్పితుడు, కూళ, పోకిరి, పలుగాకి, తుంటరి, నీచుడు, సిగ్గిడి, తుచ్ఛుడు. **لچا غنڈا** గుండా (హి) పరమదుష్టుడు.

**لچاپن** లుచ్చాపన్ (హి.పు) కుత్సితము, పోకిరితనము, పలుగాకితనము, తుంటరితనము, నైచ్యము, సిగ్గుమాలినతనము.

**لچانا** లచానా (హి) వంచుట, వంగదీయుట, లొంగదీయుట, వశపరచుకొనుట, వంకరజేయుట.

**لچر** లచర్ (హి.పు) మూఢుడు, జేల, తెలివిమాలినవాడు, గోల; దుర్బలము, పటుత్వములేని, సారములేనిది, నిస్సారము (శైలి మొ॥).

**لچک** లచక్ (హి.స్త్రీ) బెదరు, బెణకు, వణకు, మృదుత్వము, బెత్తము వలె వంగి మరల చక్కగానగు స్వభావము, స్థితిస్థాపకత్వము; నమ్రత; కులుకు. **لچکدار** -దార్ (హి) బెణకుగల, స్థితిస్థాపకత్వముగల, మృదువైన, నమ్రతగల.

**لچکا** లచ్కా (హి.పు) అదురు, చలనము; పదవు; సరిగ (బంగారుది లేక వెండిది).

**لچکنا - لچکانا** లచ్కానా-లచక్నా (హి) బెదరుట, బెడియుట, అదరుట, వంగుట, బెణకుట, మెలివడుట.

**لچلچانا** లచ్‌లచానా (హి) లసలసలాడుట, జిగటగానుండుట, మెత్తగానుండుట, కదలుట, సడలుట.

**لچنا** లచ్నా (హి) వంగుట, వంకబోవుట, కదలుట, సడలుట.

**لچھا** లచ్ఛా (హి.పు) దారపువిచ్చె, నూలు చుట్ట, దారపుండ, కుచ్చు, గుచ్ఛము, గుత్తి, దండలగుత్తి, సరములగుత్తి, పోగుల గుత్తి, పోగుల సమూహము, తులుము, అల్లపుతులుము, చిక్కు. **لچھےدار** లచ్ఛేదార్ (హి) చుట్టుకొనిన, చుట్లుగల, చిక్కుగానున్న, కలవరముగానున్న, చిక్కగానున్న; దూరాన్వయముగల, సులభముగా తెలియని; వరుసగానున్న, క్రమముగానున్న, అంతరాంతములుగల.

**لچھن** లచ్ఛన్ (హి.పు) లక్షణము, లక్కనము, గుణము. **لچھن جھڑنا** -ఝడ్నా (హి) అందము చెడుట, వాలకము చెడుట, దుర్గతిపట్టుట, లక్షణముచెడుట, వికార

మగుట, దశచెడుట. **لچھن سیکھنا** -సీఖ్నా - మర్యాదలు నేర్చుకొనుట, మంచిలక్షణములు లేక గుణములు అభ్యసించుట.

**لچئی** లుచై (హి. స్త్రీ) పలచనిఅప్పము, మెత్తనిపూరిక.

**لحاظ** లిహాజ్ (అ.పు) కటాక్షము, కడకంటిచూపు, లక్ష్యము, మర్యాద, గౌరవము, మన్నన, బిడియము, మొగమోటము, దాక్షిణ్యము, సంకోచము. **لحاظ اٹھا دینا** -ఉఠాదేనా (ఉ) సిగ్గువిడుచుట, లజ్జాత్యాగము, మర్యాదమీరుట, **لحاظ کرنا** -కర్నా (ఉ) లక్ష్యముంచుట, లక్ష్యపెట్టుట, మొగమోడుట, దాక్షిణ్యముజూపుట.

**لحاف** లిహాఫ్ (అ.పు) గవుసెన, తొడుగు సంచి, తొడుగు; దూది బొంత, బొంతదుప్పటి, దూదివేసికుట్టిన దుప్పటి, దూదిబొంతఅంగీ, బొంతకూసము దూదికూసము.

**لحد** లహద్ (అ. స్త్రీ) శవముపెట్టుగుంట, బొంద, సమాధిపల్లము.

**لحظ** లహజ్ (అ. స్త్రీ) కటాక్షము, కడగంటిచూపు.

**لحظہ** లహజే(అ.పు) రెప్పపాటు (కాలము), క్షణము.

**لحم** లహ్మ్ (అ.పు) మాంసము.

**لحم** లహిమ్ (అ) మాంసభక్షకము. మాంసముతినెడు.

**لحن** లహ్న్ (అ. స్త్రీ) శారీరము, ధ్వని, స్వరము, సుస్వరము.

**لحیت** లిహ్యత్ (అ. స్త్రీ) గడ్డము, మీసములు, గడ్డముమీసము.

**لحیم** లహీమ్ (అ) బలిసిన, లావైన.

**لخت** లఖ్త్ (పా.పు) భాగము, శకలము, తునక, కొంచము, లేశము. **لخت جگر** -ఎ,జిగర్ (పా) పుత్రుడు, పుత్రిక, సంతానము. **یک لخت** యక్‌లఖ్త్ (పా) ఒక్కపెట్టున, ఒక్కసారిగ, అకస్మాత్తుగా.

**لخلخانا** లఖ్‌లఖానా (హి) ఆకలిదప్పులచే బాధపడుచుండుట, ఆకలిచేగానిదప్పిచేగాని రోజుచుండుట, మిక్కిలిఆకలిగొనియుండుట, నకనకలుగుడుచు.

**لخلخہ** లఖ్‌లఖ (పా.పు) గాటమైనసువాసన. పరిమళము, అనేక పరిమళద్రవ్యములు కలిసిన సువాసనవస్తువు, ధూపపాత్రవంటి పరిమళపాత్ర.

**لداو** లదావ్ (హి.పు) మోపు, బరువు, భారము, మోతసామగ్రి; మిద్దె, మిద్దియు; డాబ, మిద్దెకప్పు;

**لدنا** లద్నా (హి) బరువుపడుట; బరువువేయబడుట, ఎక్కుట, స్వారిజేయుట.

**لدو** లద్దూ (హి.పు) భారవాహకము, బరువుమోయుపశువు, మోతపశువు, మోటబరి.

**لڈو** లడ్డూ (హి.పు) లడ్వము, మోదకము. **من کے لڈو کھانا** మన్‌కెలడ్డూఖానా - గొంతెమ్మ కోరికల సంతోషించుట, ఆకాశహర్మ్యములు నిర్మించుట, అడియాసలు పడుట, మనోరథములదోలుట.

**لذت** లజ్జత్ (అ. స్త్రీ) రుచి, రసము, చవి, అభీష్టము, అభిరుచి, సంతోషము, సారస్యము, స్వాదు.

لذیذ లజీజ్ (అ) రసవంతమైన, స్వాదు గల, రుచిరము, రుచిగల, రుచ్యము, చవిగల, మనోజ్ఞమైన, ఆహ్లాదకరమైన, సారస్యముగల.

لر లర్ (హి.పు) సుమారు ౪౫ నుండి ౬౫ మూరలవరకు పొడుగుగల కొలకోల.

لرزان లర్జాన్ (పా) కంపించు, చలించు, వణకు; పిరికి.

لرزش లర్జిష్ (పా.స్త్రీ) కంపనము, వణకు, చలనము.

لرزنا లరజ్నా (ఉ) కంపించుట, వణకుట, చలించుట, తడపడుట, దడ పుట్టుట, కొట్టుకొనుట,

لرزہ లర్జే (పా.పు) కంపము, వణకు, చలనము, దడ, వడకు. تپ ولرزہ -తపె లర్జా (ఉ) చలిజ్వరము.

لڑ లడ్ (హి.స్త్రీ) సరము, పేట, పేరు; తాడు పురి, పిరి; సమాజము, జట్టు; గొలుసు, మాల; వరుస, పంక్తి, సంబంధము. لڑملانا -మిలానా (హి) స్నేహము కలుపుట, సంబంధము కలుపుట.

لڑاکا - کو లడాకా-కూ (హి) జగడాలమారి, పోట్లాడు స్వభావముగల, తిరుగబడు, జగడగొండి.

لڑانا లడానా (హి) జగడ మాడించుట, పోట్లాట పెట్టుట.

لڑائی లడాయీ (హి.స్త్రీ) జగడము, యుద్ధము, పోట్లాట, కలహము. لڑائی باندھنا -బాంధ్నా- జగడముజేయుట, జగడము దెచ్చుకొనుట.

لڑبڑانا లడ్బడానా (హి) తడవాడు, తడబడుట; సొలుగుట, నత్తుట, తడబడుచు మాటాడు.

لڑکا లడ్కా (హి.పు) పిల్లవాడు, బాలుడు. لڑکا بالا -బాలా (హి) సంతానము, బిడ్డపాపలు. لڑکا جننا -జన్నా (హి) కొడుకును కనుట. لڑکا گود لینا -గోద్ లేనా (హి) పిల్లవానిని దత్తుగాతీసుకొనుట.

لڑکائی - لڑکپن లడ్కాయీ-లడక్పన్ (హి) పిల్లతనము, బాల్యము, పసితనము, చిన్నతనము.

لڑکوری లడ్కోడీ (హి. స్త్రీ) పిల్లతల్లి.

لڑکھڑانا లడ్ ఖడానా (హి) తడబడుట, సోలుట, నత్తుట, తడబడుచు మాటాడుట.

لڑکی లడ్కీ (హి.స్త్రీ) బాలిక, పిల్ల, కూతురు.

لڑنا లడ్నా (హి) పోట్లాడుట, జగడమాడుట, కలహించుట, యుద్ధము చేయుట, స్పర్ధించుట, పోటీకెక్కుట, ఎదుర్కొనుట, తాకుట. لڑمرنا -మర్నా (హి) పోరుచు చచ్చుట, పోరిచచ్చుట.

لڑنت లడంత్ (హి.స్త్రీ) పోట్లాట, జగడము, కలహము.

لڑویا లడ్వయ్యా (హి.పు) పోటరి, యోధుడు, జెట్టి, మల్లుడు.

لڑھانا - لڑھکانا లుఢానా-లుఢ్కానా (హి) దొరలజేయుట; పడవేయుట, చెంపుట; దొరలించుట, పొరలించు, పొరలబోయు, ఒలుకించు, ఒలుకపోయు.

لڑھکنا - لڑھنا లుఢక్నా-లుఢ్నా - దొరలుట, దొరలిపడుట; క్రిందపడుట, ఒలుకుట; చచ్చుట, పడుట.

لڑھیا లఢియా (హి.పు) చిన్న బండి.

**لڑھیانا** లుఢ్యానా (హి) పడిచి కుట్టుట, అంచు కుట్టుట.

**لڑی** లడీ (హి. స్త్రీ) సరము, పేరు.

**لزج** లజ్జ్ (అ) జిగురు, బందన, అంటుకొను.

**لزوم** లుజూమ్ (అ.పు) ఆవశ్యకత, అవసరము, అక్కఱ, విధి, తప్పని సరి, నిర్బంధము; జిగటు, అంటుకొను స్వభావము.

**لس** లస్ (హి.పు) జిగటు, బందన, అంటుకొనుస్వభావము, జిగురుతనము. **لس دار** -దార్ - జిగటుగల, అంటుకొనుచున్న, లసలసగానున్న.

**لسان** లిసాన్ (అ.స్త్రీ) రసనము, నాలుక; భాష. **لسان الثور** -ఉస్సౌర్ (అ) కార్మండము, గోజిహ్వా పత్రి. **لسان الغیب** లిసానుల్ గైబ్ (అ.స్త్రీ) అశరీరవాణి, ఆకాశవాణి.

**لسلسا** లస్‌లసా (హి) జిగటుగానున్న, లసలసగానున్న, జిగురుగానున్న, బందనగల, అంటుకొను.

**لسلسانا** లస్‌లసానా (హి) లసలసగా నుండుట, జిగురుగా నుండుట, బందనగా నుండుట, అంటుకొనునట్లుండుట.

**لسوڑا۔لسلسا** లస్‌లసా-లసోఁడా(హి.పు) జిగురు కండగల కాయ; బోటుకు చెట్టు, నక్కెరచెట్టు, ఇరికిచెట్టు.

**لسی** లస్సీ (హి. స్త్రీ) నీళ్లు చాల గలిపిన పాలు, నీళ్లపాలు.

**لشتم پشتم - لشم پشم** లష్టమ్ పష్టమ్ - లషమ్ పషమ్(హి)ఎంతో కష్టపడి, ఎంతో కష్టమువిూద, ఏదో ఒకవిధముగా.

**لشکر** లష్కర్ (పా.పు) సైన్యము, సేన; శిబిరము, సేనానివేశము; సమూహము. **لشکر کشی** -కషీ (పా) సైన్యము నడిపించుట, దండయాత్ర, దాడి(వెడలుట). **لشکری بولی** లష్కరీ బోలీ (ఉ) ముసల్మానుభాష, ఉర్దూభాష, హిందూభాష. **لشکرگاه** -గాహ్ (పా) సేనానివేశము, శిబిరము.

**لطافت** లతాఫత్ (అ. స్త్రీ) సౌకుమార్యము, నిర్మలము, సూక్ష్మము, స్వచ్ఛత, వైచిత్ర్యము, సున్నితము, పలుచన, సూక్ష్మత, సన్నదనము, నాగరికత, కోమలత, చలువదనము, మనోజ్ఞత, సౌందర్యము రసము, సొగసు, ఆస్వాదనీయము, రమ్యము, ఆనందము.

**لطف** లుత్ఫ్ (అ.పు) సౌగంధ్యము, రసము, సొగసు, సౌందర్యము, సూక్ష్మము, వినోదము, మనోజ్ఞత, మాధుర్యము, స్వచ్ఛత, రమ్యత్వము, ఆనందము, ఔన్నత్యము, నాగరికత, రుచిరత్వము; కటాక్షము, ఆదరము, సుగుణము, వినోదము.

**لطفی** లుత్ఫీ (అ) జారిణీపుత్రుడు, దాసీపుత్రుడు, కుటుంబముతో చేరిగిన బిడ్డ.

**لطم** లత్మ (అ.పు) చెంపదెబ్బ, గట్టిదెబ్బ దెబ్బ; దెబ్బ, పెట్టు.

**لطیف** లతీఫ్ (అ) రమణీయము, మనోజ్ఞము, కోమలము, సూక్ష్మమైన, నిర్మలమైన, రసవంతము, రుచికరము, సౌగంధ్యముగల, సరసము, ఆహ్లాదకరమైన, సూక్ష్మమైన, నాగరికము, సభ్యము. **لطیف طبع** -తబఅ (అ) కోమల స్వభావముగల, రసజ్ఞతగల, సరసస్వభావముగల, సరసుడు.

**لطیف غذا** -గిజా (అ) తేలికైనఆహారము, సులభముగా జీర్ణమగునది.

**لطیفہ** లతీఫ (అ) పరిహాసనము, హాస్య వచనము, రసాత్మకవాక్యము, వినోద ప్రస్తావనము, నవ్వులమాట, వినోదకథ, వినోద వచనము.

**لعاب** లుఆబ్ (అ.పు) ఉమ్మి, చొంగ, చొల్లు, స్యందిని, జిగురు, బందన, అంటుకొను పదార్థము, జిగటపదార్థము.

**لعبت** లుఽబత్ (అ. స్త్రీ) బొమ్మ, బట్టబొమ్మ, ప్రతిమ, ఆటవస్తువు.

**لعل** లఽల్ (పా.పు) కెంపు, ఎఱ్ఱరత్నము.

**لعن** లఽన్ (అ.పు) శాపము, దూషణ,నింద. గర్హణము.

**لعنت** లఽనత్ (అ. స్త్రీ) దూషణము,గర్హణము; శాపము, సొపెన, నింద, బహిష్కారము. **لعنت بھیجنا ـ کرنا** -భేజ్నా -కర్నా (ఉ) శపించుట, గర్హించుట, బహిష్కరించుట. **لعنت ملامت** -మలామత్ (అ) చివాట్లు, చీకొట్లు, దూషణ, తిట్లుసొపెనలు.

**لعنتی** లఽనతీ (అ) గర్హితుడు, శపితుడు, శాపింపబడినవాడు, నిందితుడు, బహిష్కృతుడు, తిరస్కృతుడు.

**لعوق** లఊక్ (అ.పు) లేహ్యము, నాకవలసిన పదను.

**لعین** లఈన్ (అ) తిరస్కరింపబడినది, గర్హితము, శపితము, శపింపబడినది,దూషితము.

**لغایت** లగాయత్ (అ) తుదవరకు, పర్యంతము, దనుక, కడవరకు.

**لغت - لغات** లుగత్-లుగాత్ (అ. స్త్రీ) నిఘంటువు, కోశము. **لغت ترا شنا** -తరాష్నా -ఝాడ్నా (ఉ) **لغت جھاڑنا** పాండిత్యముజూపుట, నైఘంటికపదములు వాడుట, కష్టమైన పదములతో మాట్లాడుట.

**لغز** లుగ్జ్ (అ.పు) చిక్కుమాట, విడుపుకథ, సమస్య.

**لغزش** లగ్ జిష్ (పా. స్త్రీ) స్ఖలనము, జారుట, కంపనము, తడబడుట, తప్పుట, పొరపడుట; సందిగ్ధ వాక్యము, శ్లేష వాక్యము.

**لغو** లగో-లగ్వ్ (అ) వ్యర్థపుమాట, నిరర్థపుమాట, పనికిమాలిన మాట.

**لغوی** లుగవీ (అ) వాచ్యార్థము,వాచ్యము, యౌగికము, మాటనుబట్టి వచ్చిన యర్థము, శబ్దార్థము.

**لف** లఫ్ (అ.పు) కప్పుట, చుట్టుట, మడచుట, ముడుచుట, చేర్చుట, పొదుపుట; పెన, మెలిక.

**لفاظ** లఫ్ఫాజ్ (అ) వాచాలుడు, వాచాటుడు, ధోరణిగలవాడు, వదరుబోతు; మాటకారి.

**لفاظی** లఫ్ఫాజీ (అ. స్త్రీ) వాగ్ధోరణి, వాగ్ధాటి; వాచాలత, వాచాటము వదరుబోతుతనము, మాటకారితనము.

**لفافہ** లిఫాఫ (అ.పు) ఒఱ, కప్పు,గవుసెన, తొడుగు, కూసము, పొట్లము, మడత, పత్రికూసము, కాగితపుసంచి, నిబోళము, పైకప్పు, పైపూత, పైమెఱుపులు, దుర్బలమైన వస్తువు, బూటకపువస్తువు, పైమె

పుల వస్తువు, రహస్యము, గుట్టు, మోసము. **لفافہ بنانا** -బనానా (ఉ) చుట్టి పెట్టుట, పొట్లముగట్టుట, పైకిబాగుండునట్లు జేయుట. **لفافہ کھلنا** -ఖుల్నా (ఉ) గుట్టు బయటబడుట, రహస్యము వెల్లడియగుట.

**لفافیا** లఫాఫియా (అ) పైమోపులకుబాగుండు (వస్తువు), బూటకము.

**لفظ** లఫ్జ్ (అ. స్త్రీ) విసరుట, వేయుట, అర్థవంతమైనమాట, మాట, శబ్దము, పదము, **لفظ بہ لفظ** -బలఫ్జ్ (అ) మాట మాట, ప్రతిమాట, పొల్లుపోకుండ, అక్షరశః, ఉన్నదున్నట్లు.

**لفظاً** లఫ్జన్ (అ) వాగ్రూపమున, స్పష్టముగా, వాఙ్మూలముగా, శబ్దరూపమున, నోటిమాటలతో.

**لفظی** లఫ్జీ (అ) శబ్ద సం॥, మాటల సం॥, శబ్దపూర్వకమైన, మాటమాటకైన. **لفظی بحث** -బహ్స్ (అ) మాటలనుగూర్చిన వివాదము. **لفظی ترجمہ** -తర్జుమ(అ) శబ్దశః చేసిన భాషాంతరము, శబ్దానువాదము.

**لفنگیا - لفنگا** లఫంగా -లఫంగియా (ఉ) ఎచ్చులమారి, డంబములు కొట్టువాడు, పోకిరి, తుంటరి, దుష్టుడు, దుర్మార్గుడు.

**لفیف** లఫీఫ్ (అ) ఆచ్ఛాదితమైన, కప్పియున్న, చుట్టబడియున్న, మడచిన,ముడిచిన, మడతలోనున్న, సమూహము, సంకరము, చిక్కు-గానున్న, చిక్కైనది; స్నేహితుడు, మిత్రము, పరిచయస్థుడు.

**لقّا-لقا** లకా (పా.పు) గరుడుడు, పెద్దజాతి గృధ్రము, రాబందు; ఒకజాతిపావురము.

**لقا** లికా (అ) సందర్శనము, కలియుట;దర్శనము; జీవనము. (పా)ముఖము, రూపము. **لقا ماہ** మాహ్-చంద్రవదన, చంద్రముఖి.

**لقا** లుకా (ఉ) పోకిరి, తుంటరి, దుర్మార్గుడు.

**لقب** లకబ్ (అ.పు)బిరుదము, గౌరవనామము.

**لقلق** లక్‌లక్ (అ.పు) కొంగ, పెద్ద కొంగ, సారసము.

**لقلقہ** లక్‌లక (అ.పు) కొంగ ఘోష, పరుష ధ్వని, సామర్థ్యము, ఉత్సాహము, వాగ్ధాటి.

**لقمان** లుక్మాన్ (అ.పు) ఒక ప్రసిద్ధ వైద్యుడు, తత్త్వజ్ఞాని, పంచాంగకర్త, సర్వమును గురించి శబ్దము ను బోధించువాడు, జ్ఞానసంపన్నుడు, పండితుడు.

**لقمہ** లుక్మ (అ.పు) కబళము, ముద్ద, గ్రాసము (కొంకు-). **لقمہ کرنا** -కర్నా- కబళించుట, మ్రింగుట.

**لقندرا** లుకంద్రా (పా.పు) మోసగాడు, వ్యభిచారి, తుంటరి.

**لق ودق** లక్ వ దక్ (పా.పు) చెట్టు చేమ లేనటువంటి సపాటుభూమి, కఠినమైన నేల, ఎడారి, బీడు.

**لقوہ** లక్వా (అ.పు) పక్షవాతము, ముఖ పక్షవాతము. **لقوہ مارجانا** -మార్ జానా (ఉ) పక్షవాతముగొట్టుట.

**لکانا** లుకానా (హిం) దాచుట, మరుగు పెట్టుట.

**لکانجن** లుకాంజన్ (హిం.పు) అదృశ్యకరణి.

**لکد** లకద్ (పా. స్త్రీ) తన్ను, దెబ్బ, రెండు కాళ్ల తన్ను.

**لکّڑ - لکڑ** లక్కడ్ (హిం.పు) మొద్దు, దుంగ,

దూలము, కఱ్ఱ. لکڑپھوڑ -ఫోడ్ (హి) వడ్రంగిపిట్ట. لکڑہارا -హారా(హి)కట్టెలవాడు, కట్టెలుకొట్టు లేక అమ్మువాడు.

لکڑا లక్డా (హి.పు) మొద్దు, దుంగ; గుర పాతు.

لکڑی లక్డీ (హి. స్త్రీ) కఱ్ఱ, కలప, కట్టె, కొయ్య. لکڑی پھینکنا -ఫేఁక్నా (హి) బడితసాముచేయుట.

لکشمی లక్ష్మి(సం. స్త్రీ)లక్ష్మి,మంగళదేవత.

لکنا లుక్నా (హి) దాగుట, మరుగుపడుట.

لکنت లుక్నత్ (అ.స్త్రీ) నత్తి,తడబడుచు మాట్లాడుట.

لکھا లిఖా(హి)వ్రాసిన, లిఖితము. لکھاپورا کرنا -పూరా కర్నా (హి) ప్రారబ్ధ మనుభవించుట, కష్టముగా కాలము గడపుట. لکھا پڑھا -పఢా (హి) విద్యావంతుడు, చేదువువచ్చినవాడు, వ్రాతమూలకము قسمت کا لکھا కిస్మత్ కా- (ఉ) నొసట వ్రాసినది, లలాట లిఖితము, ప్రారబ్ధము; అదృష్టము, భాగ్యము.

لکھانا లిఖానా (హి) వ్రాయించుట, వ్రాత నేర్పుట.

لکھاوٹ లిఖావట్ (హి.స్త్రీ) శాసనము, వ్రాసినది, వ్రాత.

لکھائی లిఖాయీ (హి.స్త్రీ) వ్రాత, లేఖకవృత్తి, వ్రాయుపని, వ్రాసినకూలి.

لکھپتی లఖ్ పతి (హి.పు) లక్షాధికారి,ధనవంతుడు.

لکھت లిఖత్ (హి. స్త్రీ) వ్రాత, వ్రాసినది; శాసనము, పత్రము, లేఖ.

لکھنا లిఖ్నా (హి) వ్రాయుట, లేఖనము, లిఖించుట. لکھنا پڑھنا -పఢ్నా- విద్య, చేదువు.

لکھنا లఖ్నా (హి) చూచుట, తెలియుట, లక్షించుట.

لکھنی లిఖ్నీ (హి.స్త్రీ) లేఖిని, గంటము.

لکھوانا లిఖ్వానా (హి) వ్రాయించుట.

لکھوٹا లఖోటా(హి) లక్కపూత, మెరుగుబెట్టిన.

لکھیرا లఖేరా (హి.పు) లక్కవస్తువులమ్మువాడు లేక చేయువాడు, లక్క పూయువాడు.

لکیر లకీర్ (హి. స్త్రీ) గీటు,గీత, రేఖ, చార. لکیر پر فقیر ہونا - لکیر پر پیٹنا -పర్ ఫకీర్ హోనా - పర్ పిట్నా(ఉ) గొఱ్ఱెదాటుగా బోవుచుండుట, గుడ్డిగానవలంభించినడచుట, పూర్వాచారపరాయణత, మూఢభక్తితో నడచుకొనుట, గీతిదాటకుండుట.

لگ లగ్ (హి) వఱకు, దనుక, దాక,(ప్రత్యయము). لگ بھگ -భగ్ - దాదాపుగా, ఇంచుమించుగా.

لگا లగ్గా (హి.పు) వెదురుగడ, పడవ నడపుగడ; పోలిక, సాటి. لگا کھانا -ఖానా (హి) పోటికినిలుచుట, సరియగుట. لگانا -లగానా(హి) ఆరంభముచేయుట, మొదలుపెట్టుట. لگا لگنا -లగ్నా(హి) ఆరంభమగుట, కలియుట, సరిపడుట, స్నేహమగుట, సరిపోలియుంట.

لگا లగా (హి)తగిలిన,కలిసిన, అతికిన,కూడిన, చేరిన, సంబంధముగల, తగులుకొనిన, ప్రేమించిన, వలచిన; ప్రాప్తమైన, తగులబడిన.

**لگاتار** -తార్ (హి) ఒక్కరీతిగ, ఎడ తెగకుండ, విడువకుండ, వరుసగా. **لگا چلنا** -చల్నా (హి) వెంటనడచుట,కలిసి నడచుట. **لگے ہاتھ** లగే హాత్ (హి) పనిచేయుచుండగా.

**لگام** లగామ్ (పా. స్త్రీ) కళ్లెము, నిరోధము. **لگام دینا - چڑھانا** -దేనా--చఢ్హానా - కళ్లెముపెట్టుట, లోబరచుకొనుట. **خوش لگام** ఖుష్-(పా) సాధు, (చెప్పినట్టువిను)గుఱ్ఱము. **بے لگام** బే -(పా) అడ్డముఅదుపులేని, నిరంకుశ వర్తనముగల. **بد لگام** బద్ - (పా) పెడసరపుగుఱ్ఱము, పలువగుఱ్ఱము.

**لگانا** లగానా (హి) తగిలించుట,తాకించుట, కలుపుట, అతికించుట, పట్టువేయుట, సంబంధముకలుపుట, మోహింపజేయుట, సరిపుచ్చుట, పాతుట, మొలవేయుట మూయుట, కొట్టుట, పూయుట, పనిలో నుంచుట, పనియిచ్చుట, జగడముపెట్టుట. **لگانا بجھانا** -బుఝానా(హి) ముట్టించి చల్లార్చుచుండుట, జగడముపెట్టుచు సమాధానము చేయుచుండుట, అంటీగాల మారితనముజేయుట.

**لگان** లగాన్ (హి. పు) పన్ను, పొలముల పన్ను, ఆదాయము, అపనింద.

**لگاو - لگاوٹ** లగావ్-వట్ (హి. పు. స్త్రీ) సంబంధము, తగులు, వలపు, ప్రేమ, పోలిక, సామ్యము,సందర్భము, అభిరుచి, అనురాగము, తగులాటము, వ్యభిచారసం॥ పక్షపాతము. **لگا لینا** -లేనా-తనదిగా జేసుకొనుట, గెలుచుట. **بے لگاو** బేలగావ్ (ఉ) నిష్పక్షపాతము.

**لگائی** లుగాయీ (హి. స్త్రీ) స్త్రీ, అలుసు; నింద, అపవాదము.

**لگدی** లుగ్దీ (హి. స్త్రీ) నూరిన ముద్ద; భంగుముద్ద.

**لگڑ** లగడ్ (హి. స్త్రీ) డేగ (పక్షి), గోరల డేగ.

**لگڑا** లగ్డా (హి. పు) గుంటపోతు (పక్షి విశేషము).

**لگن** లగన్ (హి. పు) చేతులు కడుగు కొనుటకు లేక పిండి పిసుకుటకును పళ్లెము, ఇత్తడిపళ్లెము, రాగిపళ్లెము.

**لگن** లగన్ (హి. పు) ప్రేమ, మోహము, తగులు, సంబంధము; లగ్నము, ముహూర్తము; లగ్నపత్రిక.

**لگنا** లగ్నా (హి) తగులుట, తాకుట, అంటుట, స్పృశించుట, ఆరంభించుట; మొలచుట, కాటుకొనుట, మొలవేయబడుట, నగపడుట, తగిలియుండుట, కలియుట, సరిగా చేయబడుట, చేరుట,తగులుకొనుట, చిక్కుట, ప్రయత్నపడుట, వెలయగుట, పాతుకొనుట, సరియైనముగా నుండుట, లగ్నముండుట, పనిని తగులుట, మోహించుట, పండుట, తగులుకొనుట, ఆరంభించుట, తోచుట, అంటుట, కలుగుట, సంపాదించుట, గాయపడుట, పడుట, గుఱిమిచ్చుట, సంభోగించుట, పనిలో చేరుట, తగులుట, తాకుట, అంటుకొనుట, వెంటబడుట, పూనుకొనుట, పెట్టుట, ప్రవర్తించుట, ధరయగుట, మూయబడుట, మొదలిడుట, అక్కరగపడుట, ఉపయోగపడుట, చిక్కుబడుట, పనిజేయుట, చెల్లుట, నడచుట, ఖేదమగుట, గాయపడుట,పండుట, ఫలించుట, కాయుట, చిక్కగాతీర్చియుండుట.

لگی లగ్గీ (హి.స్త్రీ) గాలిపడగకు కట్టుబట్ట పీలిక; ( చూడు لگّی ).

للا లలా—లల్లా (హి.పు) కొడుకు,కుమారుడు, ముద్దుబిడ్డడు, అబ్బాయి, పిల్లవాడు; చిన్ని కృష్ణుడు; తెలివిమాలినవాడు.

للت లలిత్ (హి.స్త్రీ) లలితము, మనోజ్ఞము, లీల, విలాసము, క్రీడ, ఆటపాటలు, వేడుకలు.

للچانا లల్చానా (హి) ప్రలోభించుట, అడియాస పడుట, మిక్కిలి కోరుట, మిక్కిలి అభిలషించుట.

للکار లల్కార్ (హి.స్త్రీ) కేక, అఱపు, కేకవేయుట,పిలుపు;జగడమునకురమ్మనుట.

للکارنا లల్కార్నా (హి) కేక వేయుట, అరచి పిలుచుట, కలహమునకు కాలుత్రివ్వుట, కలహమునకు పిలుచుట.

للو లల్లో (హి.స్త్రీ) నాలుక; అభిలాష, మాట,భాషణము. للوپتّو -పట్టూ(హి) బుజగరింపు, లాలన, ఉపలాలించుట, స్తోత్రముజేయుట.

للّٰہ లిల్లాహి - లిల్లాహ్ (అ) ఈశ్వరార్పణముగా, దైవసాక్షిగా. الحمد للّٰہ అల్ హమ్ద్ లిల్లాహ్ (అ) ఈశ్వరుడె స్తుతి పాత్రుడు, స్తుతి ఈశ్వరునకేను.

للی లలీ (హి.స్త్రీ) అమ్మాయి,పిల్ల, చిన్నది (ముద్దుమాట), కూతురు.

لم లిమ్ (అ.స్త్రీ) అపనింద, అపదూరు, దూషణము.

لمب లంబ్ (సం.పు) లంబము; పొడుగైనది, వ్రేలాడునది; లంబము.

لمبا లంబా (హి) దీర్ఘము, పొడుగైన, నిడుపుగల, విశాలమైన. لمبا چوڑا -చౌడా (హి) నిడుపు వెడల్పుగల,విశాలమైన, విస్తీర్ణమైన; కాయపుష్టిగల, దీర్ఘకాయముగల, గంభీరాకారముగల. لمبا سفر - సఫర్ (ఉ) మహాప్రస్థానము, దీర్ఘయాత్ర, పరలోకయాత్ర, చావు. لمبا کرنا -కర్నా (హి) పొడిగించుట, మోదుట, కొట్టుట, వెడలగొట్టుట. لمبا ہونا -హోనా (హి) వెళ్లిపోవుట.

لمبی سانس بھرنا లంబీ సాంస్ భర్నా- నిట్టూర్పు విడుచుట, పశ్చాత్తాపపడుట. لمبی تاننا లంబీ తాన్నా (హి) ఎచ్చులుకొట్టుట, కాళ్లుబారచాచి పండుకొనుట, చచ్చుట. لمبی چوڑی ہانکنا లంబీ చౌడీ హాంక్నా (హి) ప్రగల్భములు చెప్పుట, ఎచ్చులు కొట్టుట.

لمبائی లంబాయీ (హి.స్త్రీ) నిడుపు, పొడుగు.

لمبر లంబర్ (ఇం.పు) నంబరు, సంఖ్య,గుణములు (మార్కులు), క్రమము, వరుస.

لمبو లంబూ (హి.పు) అతిదీర్ఘకాయుడు, మిక్కిలి పొడుగరి.

لمبوترا లంబోత్రా (హి) అండాకారముగల, నిడుపాటి.

لمتڈنگا లంతడంగా (హి) పొడుగును పుష్టియునుగల దేహమువాడు.

**لمچھڑ** లంఛడ్ (హి.పు) పొడుగాటి కఱ్ఱ, గడ, పొడుగుతు పొక్కి, పొడుగాటి.

**لمحہ** లంహా (అ.పు) దృష్టి, చూపు, మెఱుపు, క్షణము, స్వల్పకాలము, నిమేషము, రెప్పపాటు.

**لمس** లంస్ (అ.పు) స్పర్శము, తాకుట, స్పర్శేంద్రియము, స్పర్శజ్ఞానము.

**لمعہ** లంఅ (పా.పు) ప్రకాశము, కాంతి, వెలుగు, కిరణము.

**لمکنا** లమక్నా (హి) పెద్ద పెద్ద అంగలు వేయుచునడచుట, వడిగానడచుట, బారంగలు వేయుట, త్వరగాపోవుట.

**لنترانی** లంతరానీ (అ.స్త్రీ) నీవు నన్ను చూడలేవు, ప్రగల్భములు, డంబములు గొట్టుట.

**لنجا** లంజా (హి) అంగవైకల్యముగల, వికలాంగుడు, చేతులులేని, కాళ్లులేని, తొంట, కుంటి మొ॥.

**لند پھند** లంద్ ఫంద్ (హి.పు) అటుమటలు, మోసము, టక్కుటమారములు.

**لنڈ منڈ** లుండ్ ముండ్ (హి) బోడి, తలబోడి, గడ్డము మీసము తల నున్నగా గొరుగుకొన్నవాడు; ఆకులు కొమ్మలు లేని చెట్టు మొద్దు; మొండి; ఏకాకి.

**لنک** లంక్ (హి.పు) ప్రోవు, కుప్ప; కాలము.

**لنگ** లంగ్ (హి.పు) ప్రక్క, దిక్కు; వరుస, పంక్తి; ధోవతి కుచ్చెలు.

**لنگ** లుంగ్ (పా.పు) కట్టువస్త్రము, తుండుగుడ్డ; ధోవతి.

**لنگ** లంగ్ (పా.హి) కుంటి, కాలుచేతులు సరిగాలేని.

**لنگارا - لنگاڑا** లంగారా -డా (హి) సిగ్గిడి, పోకిరి, గుంటరి; వ్యభిచారి.

**لنگر** లంగర్ (పా.పు) లంగరు, ఓడ నిలుపు లోహ ఖండము; పెద్ద బరువు; లావాటి మోకు; పిల్లలు ఆడుకొనెడు గాయికట్టిన దారము; అన్నదానము, బిచ్చము, ధర్మముగా అన్నము పెట్టుచోటు; సత్రము, ధర్మసత్రము, సదావృత్తి, స్థానము, నిలుచు చోటు. **لنگرخانہ** -ఖానా (పా) ధర్మసత్రము, సదావృత్తి. **لنگرگاه** -గాహ్ (పా) ఓడ రేవు, పడవలు నిలుచు చోటు. **لنگر اٹھانا** -ఉఠానా (హి) ఓడకదలుట, బయలుదేరుట. **لنگر ڈالنا** -డాల్నా (హి) ఓడనిలుపుట, నిలుచుట.

**لنگری** లంగరీ (పా.పు) భిక్షము, ధర్మము, బీదలకిచ్చు సామగ్రి, సదావృత్తి.

**لنگڑا** లంగ్డా (హి) కుంటి.

**لنگڑانا** లంగ్డానా (హి) కుంటుట.

**لنگوٹ - ٹا - ٹی** లంగోట్ -టా -టీ (హి.పు.స్త్రీ) గోచి, కౌపీనము, కచ్చ. **لنگوٹ باندھنا** -బాంధ్నా (హి) గోచిబిగదీయుట, జగడమునకుసిద్ధమగుట. **لنگوٹ بند** -బంద్ (హి) బ్రహ్మచర్యము నడపువాడు. **لنگوٹ کا سچا** -కా సచ్చా (హి) అస్ఖలిత బ్రహ్మచారి, సన్యాసి.

**لنگوٹیا - یار** లంగోటియా -యార్ (హి) చిన్ననాటిచెలికాడు, బాల్యస్నేహితుడు.

**لنگور** లంగూర్ (హి.పు) కొండెంగ, కొణంగి, నల్లమూతి కోతి.

**لنگھن** లంఘన్ (హి.పు) లంఘనము, ఉపవాసము; దూకుట, దాటుట, మీరుట,

**لنگی** లుంగీ (పా.స్త్రీ) కట్టువస్త్రము, పిల్ల చుట్టు బట్ట, సాయబులు నడుముకుచుట్టుకొను రంగు బట్ట, తుండు గుడ్డ; పన్నె తుండు; సరిగ తలగుడ్డ,ధోవతి,చిన్నపంచె, చిన్నధోవతి.

**لو** లూ (హి.పు) వడగాలి, ఎండవడ, నిప్పుగాలి. **لو لگنا۔ مارنا** -లగ్నా -మార్నా (హి) వడ(గాలి)దెబ్బ తగులుట, ఎండదెబ్బ తగులుట.

**لَو** లౌ (హి.స్త్రీ) ధ్యానము, నిష్ఠ; సెగ, జ్వాల, మంట; భక్తి, ప్రేమ; భజన, జపము; అభిలాష, అభీష్టము; అభిరుచి, ధోరణి; తదేకధ్యానము. **لولین** -లీన్ (హి) ధ్యానమగ్నుడు, తన్మయుడు. **لَو لگنا** -లగ్నా (హి) అభిరుచి తగులుట, ధోరణికుదురుట, నిష్ఠకలుగుట.

**لوا** లవా (హి.పు) భరద్వాజపక్షి, ఏటిత్రింత పిట్ట.

**لواحق** లవాహిక్ (అ.పు) సంబంధులు, బంధువులు, చుట్టుపక్కములు, పరివారము, కావలసినవారు, పరిచారకులు; కావలసిన, అనుబంధమైయున్న, సంబంధించియున్న; (ఏ. వ لاحق).

**لوارا** లవారా (హి.పు) దూడ, లేగ.

**لوازم - لوازمہ** లవాజిమ్ - లవాజిమ (అ.పు) కావలసిన వస్తువులు, ఆవశ్యకములు, పరికరములు, కావలసినవి, అనుబంధములు, సంబంధించినవి; సామగ్రి; ఫలితములు; (ఏ. వ لازم).

**لوانا** లివానా (హి) తీసికొనునట్లుజేయు, మోయించుట, తెచ్చునట్లుజేయుట.

**لوا** లివా (హి) పట్టించుకొని, మోయించుకొని. **لوا لانا** -లానా- పట్టించుకొని వచ్చుట, తెప్పించుట, మోయించి తెచ్చుట. **لوا لیجانا** -లేజానా- పట్టించుకపోవుట, మోయించుకొనిపోవుట.

**لوبان** లోబాన్ (అ.పు) ఊదు,సాంబ్రాణి, పరంగి సాంబ్రాణి, అందుగు పిసును. **لوبان کا پھول -ست** -కా ఫూల్ -సత్ (హి) సాంబ్రాణిపువ్వు. **لوبان کوڑیا** కౌడియా- (హి) స్వచ్ఛమైన తెల్లని సాంబ్రాణి. **لوبان دانی** -దానీ (ఉ.స్త్రీ) సాంబ్రాణి పాత్రి, ధూపపాత్రి.

**لوبھ** లోభ్ (హి.పు) లోభము, లుబ్ధత్వము, అత్యాశ.

**لوبھی** లోభీ (హి.పు) లుబ్ధుడు, లోభి, అత్యాశగలవాడు.

**لوبیا** లోబియా (పా.పు) సీమ చిక్కుడు, పరాసు చిక్కుడుకాయ.

**لوپ** లోప్ (హి) లోపము, మరుగు పడుట, అదృశ్యము.

**لوتھ** లోథ్ (హి.స్త్రీ) మృత కళేబరము, శవము.

**لوتھڑا** లోథ్ డా (హి.పు) మాంస ఖండము.

**لوٹ** లౌట్ (హి.పు) మరలుట, తిరుగుట; మళ్లుదల, తిరుగుదల. **لوٹ جانا** -జానా (హి) మరలిపోవుట. **لوٹ آنا** -ఆనా (హి) మరలి వచ్చుట. **لوٹ پوٹ** -పోట్ (హి.స్త్రీ) కాకితము రెండు ప్రక్కలు, ఇరుప్రక్కలు.

**لوٹ** లూట్ (హి.స్త్రీ) దోపిడి, కొల్ల, నాశము. అన్యాయము, దోపిడి సొత్తు, దోచినది. **لوٹ پڑنا** -పడ్నా (హి) పరిబోవుట, కొల్లబోవుట, ఉచితముగా పంచుకొనుట. **لوٹ مچانا - کرنا** -మచానా- కర్నా (హి) దొడ్డగొనుట, కొల్లగొట్టుట. **لوٹ کھسوٹ** -ఖసోట్ (హి, స్త్రీ) దొడ్డదోపిడులు, కొల్లగొట్టుట.

**لوٹ** లోట్ (హి.స్త్రీ) పొరలుట, పొరలిక, లుంఠనము. **لوٹ پوٹ ہونا** -పోట్ హోనా (హి) తల క్రిందగుట, పొర్లాడుట, క్రిందుమీదగుట; గిజే గిజే తన్నుకొనుట; చచ్చుట. **لوٹ لگانا** -లగానా (హి) పండుకొనుట, దొరలుట; వలచుట, మోహించుట; పడిపోవుట; చచ్చుట.

**لوٹ** లోట్ (ఇం.పు) నోటు, ధనపత్రము, రూకలచీటి.

**لوٹا** లోటా (హి.పు) చెంబు, చిన్న పాత్ర, పానపాత్ర. **لوٹے میں نمک ڈالنا** లోటే మేఁ నమక్ డాల్నా (హి) ప్రమాణము జేయుట.

**لوٹانا** లౌటానా (హి) మరల్చుట, త్రిప్పివేయుట, మరలపంపుట, తిరుగగొట్టుట.

**لوٹن** లోటన్ (హి,పు) పల్లటీల పావురము,

**لوٹنا** లౌట్నా (హి) మరలుట, తిరుగుట.

**لوٹنا** లూట్నా (హి) కొల్ల గొట్టుట, దోచుకొనుట.

**لوٹنا** లోట్నా (హి) పొరలాడుట, పొరలుట; గిజగిజతన్నుకొనుట, పొరలబడుట, విరహ వేదన పడుట; మించి మాట్లాడుట, యుద్ధము సడచుట; చచ్చుట.

**لوث** లౌస్ (అ.పు) అపవిత్రత, మాలిన్యము, మైల, కళంకము.

**لوچ - ج** లూచ్ -జ్ (హి) నగ్నము, బిత్తల; మొల్లకంటివాడు.

**لوچ** లోచ్ (హి.పు) పండి, గంజి; జిగట, జిగురుదనము; మెత్తదనము; సౌందర్యము, మాధుర్యము. **لوچ دینا** -దేనా (హి) మర్దించుట, పిండిపిసికి మెత్తగా జేయుట.

**لوچن** లోచన్ (సం.పు) లోచనము, కన్ను.

**لوح** లౌహ్ (అ.స్త్రీ) పలక, వ్రాత పలక, ఫలకము; పీఠము, తక్తా, రేకు, గ్రంథము యొక్క ముఖపత్రము, మొదటి పుట.

**لوح محفوظ** -ఎ, మహ్‌ఫూజ్ (అ) చిత్రగుప్త గ్రంథము.

**لوری** లోరీ (హి.స్త్రీ) జోల పాట, ఉయ్యాల పాట. **لوری دینا** -దేనా (హి) జోల పాడి నిద్రపుచ్చుట.

**لوڑھا** లోఢా (హి) సన్నికంటె రాయి, పొత్రము, నూరెడు గుండ్రాయి.

**لوز** లౌజ్ (అ.పు) బాదము కాయ, సుఫలము. **لوز المر** -ఉల్,ముర్ (అ) చేదు బాదాము. **لوز الحلو** -ఉల్,హలూ (అ) తియ్య బాదాము.

**لوک** లోక్ (సం.పు) లోకము.

**لوکا** లూకా (హి.పు) మంట, జ్వాల; సెగ, అగ్నికణము, కొలెమ కొలివి.

**لوکاٹ** లోకాట్ (హి.పు) ఫలవిశేషము. చీనాపండు.

**لوکٹ** లూగట్ (హి) కొరవి, సగముకాలిన (కట్టె), కొఱకచ్చు.

**لوکنا** లౌక్నా (హి) పరికాశించుట, మెఱయుట; పట్టుకొనుట (చెండు).

**لوکی** లౌకీ (హి. స్త్రీ) ఆనపకాయ, సొరకాయ.

**لوگ** లోగ్ (హి.పు) లోకులు, జనులు; కులమువారు; భర్త, పెనిమిటి.

**لولا** లూలా (హి) తొంటి, చేయిలేని, అంగవైకల్యముగల.

**لولا** లోలా (హి.పు) నాలుక, కొండనాలుక; లంబము, లోలకము, వ్రేలుడు; ఒక కర్ణభూషణము; గంట కోల, గంట నాలుక.

**لوءلوء** లూ లూ (అ.పు) ఆణి ముత్యము, ఆణి పూస, ముత్యము, మౌక్తికము. **لولوے لالا** -ఎ, లాలా (పు) కాంతిగల ముత్యము.

**لوءم** లూమ్ (అ.పు) లోభము, అడియాస, దౌష్ట్యము, నైచ్యము.

**لوم** లౌమ్ (అ.పు) దూషణ, చివాట్లు, నిందించుట.

**لومڑی** లోమ్డీ (హి. స్త్రీ) గుంట నక్క, జిత్తులమారి.

**لون** లోన్ (హి.పు) లవణము, ఉప్పు.

**لونا** లోనా (హి) ఉప్పని, ఉప్పగానున్న.

**لونار** లోనార్ (హి.పు) ఉప్పుమడి, ఉప్పుమడులు.

**لونجی** లౌంజీ (హి. స్త్రీ) మామిడికాయ ఊరుగాయ, మామిడికాయ పచ్చడి.

**لوند** లౌంద్ (హి.పు) అధికమాసము, మలమాసము.

**لوندا** లౌందా (హి.పు) ముద్ద, ఉండ, పెల్ల.

**لونڈا** లౌండా (హి.పు) పిల్లగాడు, పోరగాడు; బానిస, సేవకుడు.

**لونڈی - لونڈیا** లౌండీ - లౌండియా (హి. స్త్రీ) పిల్ల, బానిసగత్తె, పనికత్తె, ఆడ పాప. (పుడక.

**لونگ** లౌంగ్ (హి. స్త్రీ) లవంగము; ముక్కు

**لونی** లోనీ (హి. స్త్రీ) గోడలనుండి ఊరలు ఉప్పుమన్ను, ఉప్పని; వెన్న, నవనీతము.

**لونیا** లోనియా (హి.పు) ఉప్పుదీయువారు (ఒక జాతి); ఉప్పని, ఉప్పగానున్న.

**لوہ - لوہا** లోహ్-హా (హి.పు) లోహము, ఇనుము. **لوہے کا گو** లోహే కా గూ (హి) ఇనుపచిట్టెము, మండూరము, అయస్సింధూరము. **لوہا بجانا** -బజానా (హి) కత్తులతో పోట్లాడుట.

**لوہار** లోహార్ (హి.పు) కమ్మరివాడు, లోహకారుడు. **لوہار کی بھٹی** -కీ భట్టీ (హి) కొలిమి. కమ్మరిపొయ్యి.

**لوھڑا** లౌహ్డా (హి) పిన్నవాడు, చిన్నవాడు. పిల్లకాయ.

**لوئی** లోయీ (హి. స్త్రీ) గొంగడి, కంబళము.

**لہاب** లుహాబ్ (అ.పు) జ్వాల, మంట, మంటలెగయుట, ఉష్ణము, సెగ, వేడిమి.

**لہارن** లుహారన్ (హి. స్త్రీ) కమ్మరిది, కమ్మరివలపు స్త్రీ.

**لہاڑا** లిహాడా (హి) నీచుడు, అల్పుడు, తీసికొన్న డబ్బు సరిగా నివ్వనివాడు.

لہاس లహాస్ (హి. స్త్రీ) గంప, పెద్దతట్ట; మోకు, లావాటితాళ్ళు.

لہجہ లహ్జా (అ.పు) ధ్వని, స్వరము, ఉచ్చారణ, పలుకుబడి.

لہذا లిహాజా (అ) కనుక, కాన, కాబట్టి, ఇందుచేత, ఇందుకొరకు.

لہر లహర్ (హి. స్త్రీ) అల, లహరి, తరంగము; నిమ్నోన్నతము; ఆవేశము, ఉద్రేకము; ఉత్సాహము, పారవశ్యము, మైమరపు; ఆనందము, మనోరథము; పాము విషము వలని మైకము, సొమ్మ. మూర్ఛ; ధోరణి, ధ్యానము, لہر آنا -ఆనా (హి) దశ పట్టుట, సంపద వచ్చుట; ఉత్సాహము పుట్టుట, నిమ్నోన్నతములగుట, క్రాలు చుండుట, అల్లలాడుట; వృద్ధిగానుండుట.

لہرانا లహ్రానా (హి) తరంగములవలెతూగాడుట, ఎచ్చుతగ్గులగుచుండుట, ఆనందముగ నుండుట, మారుచుండుట, జరపు చేయుట, ఆశాపీడితుని జేయుట, వలచుట, మోహించుట.

لہر بہر లహ్రబహ్ర్ (హి. స్త్రీ) సిరిసంపదలు, భోగభాగ్యములు, అభివృద్ధి, ఆనందము.

لہرنا లహర్నా (హి) అలలవలె క్రాలుచుండుట, అల్లలాడుట, ఊగాడు, ఎగుడుదిగుడగు, అలలవలె తూగాడు, నిమ్నోన్నతమగు, ఎచ్చుతగ్గులగు, అలలు పారునట్లుండు, లేచుచు పడుచున్నట్లుండు, వర్ధిల్లుచుండుట.

لہریا లహరియా (హి) క్రాలుచున్నట్లు వంకరలుగా నున్న చారలుగల బట్ట, మడ్లుగల నీర్కావివన్నె పట్టుబట్ట.

لہسن లహ్సన్ (హి.పు) వెల్లిగడ్డ, వెల్లుల్లిగడ్డ; పులిపిరి, మచ్చ.

لہک లహక్ (హి. స్త్రీ) మెఱుపు, కాంతి; సుగంధము; ఆటపాటలు; ఆనందము, అభివృద్ధి; వయసు; కల్యాణము.

لہکارنا లహ్కార్నా (హి) గుఱ్ఱమును చేతితో తట్టుచు ముద్దుచేయుట.

لہکنا లహ్కానా (హి) మంటపెట్టుట, ప్రకాశింపచేయుట; పురికొల్పుట; మెరుగు పెట్టుట; వర్ధిల్లచేయుట.

لہکنا లహకనా (హి) సంతోషపడుట, మండుట, మంటలేచుట; అభివృద్ధిగానుండుట, వర్ధిల్లుచుండుట; పచ్చగానలరుట.

لہلوٹ లహ్లోట్ (హి) ఉస్సూరుమనొన్నది మరల ఇవ్వనిగాడు,

لہلہا లహ్లహా (హి) పంటలు పైరులు వర్ధిల్లుచుండు; తాండవమాడుచున్న, అభివృద్ధిగానున్న, పచ్చపచ్చగానున్న, సంతోషముగానున్న.

لہلہانا లహ్లహానా (హి) పంటలు పైరులు వర్ధిల్లుచుండుట, ఆనందముగానుండుట, తాండవమాడుట, తాండవమాడుచుండుట, ఊగాడుచుండుట, భోగభాగ్యములుగలుగుట, అభివృద్ధిగానుండుట, పచ్చపచ్చగానుండుట, అల్లలాడుట.

لہلہاہٹ లహ్లహాహట్ (హి. స్త్రీ) అభివృద్ధి, పైరు పంటలు పుష్కలముగా నుండుట, తాండవము, తరంగము లాడుచుండుట, కల్యాణము, భోగభాగ్యములు.

لہنا లహ్నా (హి.పు) అదృష్టము, భాగ్యము, అభివృద్ధి, లాభము, ఆదాయము.

لہنگا లహంగా (హి.పు) పరికిణి, పావడ, గాగర.

لہو లహూ (హి.పు) రక్తము, నెత్తురు. لہو آنا یا کٹنا -ఆనా యా కట్నా (హి) కడుపున రక్తముపడుట, రక్తవిరేచనములగుట. لہو پانی ایک کرنا -పానీ ఏక్ కర్నా (హి) మిక్కిలిశ్రమపడుట, నెత్తురు వడియుట. لہولہان -లహూన్ (హి) నెత్తురు దోగాడుచున్న, రక్తసిక్తము, రక్తమయము.

لہو లహ్వ్ (అ.పు) విలాసము, భోగము, వినోదము, క్రీడ, ప్రొద్దుపోక. لہو ولعب లహ్వొలఇబ్ (అ) ఆటపాటలు, క్రీడావినోదములు, పనికిమాలిన పనులు, వృథాప్రొద్దుపోకలు.

لے లయ్ (హి. స్త్రీ) లయ, తాళముయొక్క కాలము; అభిరుచి, అభిలాష.

لیاقت లియాకత్ (అ. స్త్రీ) యోగ్యత, సామర్థ్యము, అర్హత, తగినట్లుండుట. سند لیاقت సనదెలియాకత్ (అ. స్త్రీ) యోగ్యతాపత్రము. حسب لیاقت హస్బెలియాకత్ (అ) యథాయోగ్యముగా, యోగ్యతానుసారము.

لے آنا (హి) కొనివచ్చుట, తీసికొనివచ్చుట, తెచ్చుట.

لے بھاگنا లేభాగ్నా (హి) ఎత్తుకొనిపోవుట, వెంటపెట్టుకొనిపోవుట.

لیپ లేప్ (హి.పు) లేపనము, పూయవలసినమందు, పూతమందు.

لے پالک లేపాలక్ (హి.పు) పెంపుడు కొడుకు, దత్తుకొడుకు.

لے پالنا లేపాల్నా (హి) పెంచుకొనుట, దత్తుకొనుట.

لیپن లేపన్ (హి. స్త్రీ) లేపనము, పూత, పట్టు, పట్టువేయుట, పూయుట.

لیپنا లీప్నా (హి) లేపనముజేయుట, పూయుట, అలుకుట. لیپا پوتا -పూతా (హి) అలికిపూసినది, అలికిసున్నము వేసినది.

لیت ولعل లైతొలఅల్ (అ. స్త్రీ) కాలయాపనము, నేడురేపని గడపుట, కాలము గడపుచుండుట, తప్పించుకొనుచుండుట.

لیٹنا లేట్నా (హి) పండుకొనుట, శయనించుట; కాళ్ళపైబడుట, అడ్డముపడుట, లోపడుట. లొంగిపోవుట; కరుగుట, పలచబడుట.

لے جانا లేజానా (హి) తీసుకొనిపోవుట, కొనిపోవుట.

لیجھی లీఝీ (హి. స్త్రీ) అలుకుమడ్డి, అడుగుమడ్డి, మిగిలినఅలుకు, అడుగుబొడుగు (అలికిన తరువాత అడుగున మిగిలియున్నది).

لیچڑ లీచడ్ (హి) జారెడు, లోభి, పుచ్చుకొన్నడబ్బు సరిగా నివ్వనివాడు.

لیچی లీచీ (హి. స్త్రీ) ఫలవిశేషము.

لید లీద్ (హి. స్త్రీ) గజాశ్వాదుల పురీషము, లద్ది.

**لیرو-لیروآ** లేరు—ఆ(హి.స్త్రీ) చూడ, లేగ.

**لیزم** లేజేమ్ (పా.స్త్రీ) ఇనుప గొలుసు గొనయముగాగల విల్లు, ఇనుప నారి విల్లు (ఇదిజట్టీలు వాడుదురు).

**لیس** లైస్ (ఇం) సిద్ధము, ఆయిత్తము, కట్టాయితము, సజ్జితము.

**لیس** లైస్ (ఇం.స్త్రీ) సరిగ అంచు, గోటు, అంచు.

**لیسنا** లేస్నా (హి) అలుకుట, పూయుట, మెత్తుట. (పు) జిగట, బంక.

**لیک** లీక (హి.స్త్రీ) బండిగిల్లుగోలు, బండి బాట; చాకలి మంగలివాండ్రకు వాడుకగానిచ్చు బిచ్చము లేక వార్షికము; సాంప్రదాయము, రీతి, ఆచారము, వాడుక, మర్యాద. **لیک لیک چلنا - لیک پیٹنا** —లీక్ చల్నా-లీక్ పీట్నా (హి) పూర్వాచారమును వదలకుండుట, మూఢవిశ్వాసముతోనడచుట, గతానుగతికముగ బోవుచుండుట.

**لیکن - لیک** లేక్ — లేకిన్ (పా) కాని, అయినను.

**لیکھ - لیک** లీక్ - ఖ్ (హి.స్త్రీ) ఈపి. లిఖు, ఈరు (చెమ్మటచే తలయందు పుట్టునది). (రము, జాబు.

**لیکھ** లేఖ్ (హి.పు) లేఖ, వ్రాత; ఉత్త

**لیکھا** లేఖా(హి.స్త్రీ) లెక్క, ఇచ్చిపుచ్చుకొనులెక్క, లెక్కపుస్తకము; వర్తనము, వ్యవహారము.

**لیل** లీల్ (హి.పు) నీలిమందు, నీలి.

**لیل ونهار** లైలో నహార్ (అ) రేయుంబవళ్లు, దివారాత్రిము.

**لیلا** లీలా (హి) నీలమైన, నీలవర్ణముగల.

**لیلا** లీలా (హి.స్త్రీ) లీల, క్రీడ, వినోదములు, ఆటపాటలు, వేషములు మొ॥, కృష్ణాదుల లీలలప్రదర్శనములు.

**لیل کنٹھ** లీల్‌కంఠ్ (హి పు) పాలపిట్ట.

**لیلنا** లీల్నా (హి) మ్రింగుట, గుటుక వేయుట.

**لیلۃ القدر** లైలతుల్ కద్ర్ (అ) మహమ్మదీయ మతానుసారము ఖురాను షరీఫు అవతరించినరాత్రి, దేవతలు భూమి కవతరించినరాత్రి.

**لے لینا** లేలేనా (హి) తీసుకొనుట, మగల తీసికొనుట, బలవంతముగా తీసికొనుట.

**لیم** లీమ్ (అ.పు) సమాధానము, అనుకూల్యము, శాంతి.

**لئیم** లయీమ్ (అ) లోభి (తాను తినక ఒకరికి పెట్టకుండువాడు).

**لے مرنا** లేమర్నా (హి) తనతోగూడ రెండవవానికి నష్టముగలిగించుట, తనతో యింకొకరినిచిక్కులలో వేయుట, తనతో మోపుట, చిక్కులలో పెట్టుట, అపహరించుట.

**لیمو - لیمبو** లీమూ-లీంబూ (హి.పు) నిమ్మకాయ, నిమ్మపండు. **لیموے حامض** -ఎ హామిజ్ (అ) పుల్లనిమ్మపండు. **لیمو نچوڑ** -నిచోడ్ (హి) పిలువకుండవచ్చి పోయితిని, ఉప్పువేసిపోయుకతినువాడు.

**لین** లీన్ (సం) లీనము.

LIBRARY

م మీమ్ [అ-పు] మకారము; ఇది ఉరుదూ వర్ణమాలలో ముప్పదియొకటవయక్షరము, అరబీలో నిరువదినాలుగవది, పారసీకములో నిరువదియెనిమిదవది, అబ్జదు (ابجد) వర్ణసాంఖ్యమున దీనిసంఖ్య నలువది.

ماء మా [అ-పు] నీరు; రసము-ద్రవము; కాంతి ماءالابقر మాఉల్ అబ్కర్ [అ-పు] పెట్లుప్పుద్రావకం ماءالجبن మాఉల్ జుబన్ [అ] మజ్జిగ-మేకమజ్జిగ ماءالحیات మాఉల్ హయాత్ [అ] అమృతము ماءالکبریت మాఉల్ కిబ్రీత్ [అ] గంధకద్రావకము ماءاللحم మాఉల్ లహ్మ (అ) మాంసరసము ماءالورد మాఉల్ వర్ద్ [అ] పన్నీరు.

ما మా(అ)ఏది, ఏమి, ఎంత, ఎవరు مابعد-మాబఅద్(అ)తరువాత-అనంతరము. ماباقی مابقی — బాకీ, బకీ (అ) మిగులు-శేషము-మిగిలినది مابہ الاحتیاج — బిహిల్ ఇహ్తియాజ్ (అ) అవశ్యకమైనది అక్కఅపడినది مابین — బైన్ (అ) మధ్యస్థము-మధ్యమము-మధ్యకాలము, మధ్య-నడుమ, వ్యవధి. ماتحت-తహాత్ (అ) అధమస్థము, క్రిందనున్నది. తక్కువైనది-అధమము-క్రింది ماحصل-హాసల్ [అ] ఆదాయము, రాబడి-లాభము-ఫలము, పంట, ఫలితార్థము ماحضر-హాజర్ (అ) ఉన్నది-సిద్ధముగానున్నది-ప్రస్తుతమున్నది - త్వరలోసిద్ధపరచినది ماسبق-సబక్ (అ) పూర్వపు-వెనుకటి, పూర్వోక్తము ماسلف-సలఫ్ (అ) గతము-గతించిన-పోయిన, ماسوا-సివా (అ) ఇదిగాక-ఇతరము-అధికము, ఉపరి, ماشاءاللہ — షా అల్లాహ్ (అ) ఈశ్వరేచ్ఛ-దైవముకోరినది-దైవముతలచినది مافوق-ఫౌక్ (అ) పైనున్నది-పైయధికారముగల-మేలైన-శ్రేష్ఠము ఉత్తమము, مافی الضمیر-ఫిజ్జమీర్ (అ) మనసులోనున్నది-ఉద్దేశించినది-ఉద్దిష్టము ماقبل — కబల్ (అ) పూర్వపు, మునుపటి-ముందరి, పూర్వము, మునుపు, ముందు, ماصدق — సదక్ (అ) యథార్థము, నిజమైనది, నిశ్చితము,

ما మా (హి-స్త్రీ) తల్లి, మాత, అమ్మ.

ماب మఆబ్ (అ) నివాసము, ఉండుచోటు, ఆకరము, స్థానము. عزت ماب ఇజ్జత్ మఆబ్ (అ) గౌరవస్థానము, మిక్కిలిగౌరవనీయము, గౌరవాకరము.

ما باپ మాబాప్ (హి) తల్లి దండ్రులు.

مابین మాబైన్ (అ) చూడు ما అనుపదముక్రింద.

ماپ మాప్ (హి-పు) మానము, కొలత.

ماپنا మాప్నా (హి) కొలుచుట.

ماپک మాపక్ [హి-పు] మాపకుడు, కొలుచువాడు.

ماپھل మాఫల్ (హి-పు) మాచికాయ.

مات మాత్ (అ-స్త్రీ) మృతము, చచ్చెను, చదరంగములో త్రోసిరాజనుట, రాజునుకట్టివేయుట مات کرنا-కర్నా (ఉ) త్రోసిరాజనుట - ఓడించుట, మీరుట مات کھانا — ఖానా (ఉ) ఓడిపోవుట, వెనుకబడుట, తీసిపోవుట, చదరంగములో రాజుకట్టుబడి ఆటఓడుట.

ماتا మాతా (హి-స్త్రీ) మాత, తల్లి: అమ్మవారు, స్ఫోటకము ماتا نکلنا — నికల్నా [హి] అమ్మవారుపోయుట. ماتا ڈھلنا-ఢల్నా [హి] అమ్మవారు దిగబారుట.

ماترا మాత్రా [హి-స్త్రీ] మాత్ర, అచ్చు. ఔషధపరిమాణము-ధనము. హ్రస్వోచ్చారణమాత్రకాలము.

مارلانا —లానా (హి) దొంగిలించితెచ్చికొనుట مارلینا —లేనా (హి) కొట్టుకొనుట, అపహరించుట, గెలుచుకొనుట, గెలుచుట.

مار మార్ (పా-పు) సర్పము, పాము.

مارا మారా (హి) హతము, కొట్టబడినది, ఆర్తము, గ్రస్తము, مارا مار —మార్ (హి) పోట్లాట, కొట్లాట, దొమ్మి, వేగిరపాటు దొమ్ములాట, مارا مارا پهرنا —మారాఫిర్నా (హి) దేశద్రిమ్మరిగతిరుగుట, వృథగాతిరుగుట, నిలుకడలేకుండతిరుగుట مارا مارکرنا —మార్ కర్నా (హి) చాలకష్టపడిచేయుట-త్వరగాగమించుట, వేగిరముతోగమించుట.

مارتول మార్ తౌల్ (హి-పు) మరచీలలు బిగించుపనిముట్టు, బిగింపుటులి.

مارگ మార్గ్ (హి-పు) మార్గము, బాట,

مارنا మార్నా (హి) కొట్టుట; శిక్షించుట, సంహరించుట, చంపుట-వెళలగొట్టుట, లోపరచుకొనుట, గెలుచుకొనుట, సట్టుకొనుట; ప్రయోగించుట; నిరోధించుట, రువ్వుట, విసరుట;తన్నుట. పరిహారముచేయుట, విఘవుచేయుట, తెలు మొ॥కుట్టుట;కొట్టవేయుట, పోగొట్టుట.

مارنهارا మారన్ హారా (హి) చంపువాడు, కొట్టువాడు.

مارے మారే (హి) వలన, మూలమున, చేత, కారణమున (వృత్తియందు).

مارهی మాఢీ (హి-పు) మాడిచెట్టు.

ماڑی మాడీ (హి-స్త్రీ) గంజి; అన్నరసముకోచొడ, అట్టము, మిద్దె, మిగొటిల్లు, మిస్త్రపెగది ماڑی مانڈنا —మాండ్నా (హి) గంజిపెట్టుట (బట్టలకు).

مازریون هندی మాజరియూనెహిందీ(పా-పు) గసగసాలపాలు, నల్లమంగు.

مازو-پهل మాజూ-ఫల్ (ఉ) మాచికాయ.

ماس మాస్ (హి-పు) మాసము, నెల; మాంసము.

ماسوا మాసివా (అ) ఇదిగాక, ఇంతెకాక, ఉపరి, అధికము, కాక, ఇంకను.

ماشه-ماشا మాష (హి-పు) మాసము (తూనిక) తులములోపన్నెండవభాగము ماشه بهر —భర్ (హి) మాసమెత్తు, కొంచము ماشا تولا هونا —తోలా హోనా (హి) చపలచిత్తముఁజూపుట, మనసుమారుచుండుట, బుద్ధిస్థిరములేకపోవుట.

ماضی మాజీ (అ) గతము, భూతము, జరిగినది, గడచినది, భూతకాలము ماضی مطلق —ముత్లక్ (అ) కేవలభూతకాలము ماضی قریب —కరీబ్ (అ)అద్యతనభూతము ماضی بعید —బఈద్ (అ) అనద్యతనభూతము ماضی استمراری —ఇస్త్రిమ్రారీ (అ) అపూర్ణభూతము, శత్రర్థకభూతము.

ماضیه మాజియ (అ) గడచిన, పూర్వపు.

مافرین మాఫర్ ఫీన్ (పా) నిర్విషము-విషహారి.

ماقبل మాకబల్ (అ) ముందటి, మునుపటి, గడచిన, ముందున్న - పూర్వపు, మునుపు, పూర్వము.

ماکیان మాకియాన్ (పా-స్త్రీ) పెట్ట, కోడిపెట్ట, పెంపుడుపెట్ట.

ماگه మాఘ్ (హి-పు) మాఘమాసము.

مال మాల్ (అ-పు) అర్థము, సొత్తు,ధనము, సొమ్ము, ఆస్తి, పదార్థము, ద్రవ్యము; ఆదాయము, రాబడి; వర్తకపుసామాగ్రి, అంగడివస్తువులు; ఉచ్ఛ్యములు, తినుబండము; నేలమంగుతొట్టిలో అడుగున పేరినది

مال خانہ — ఖానా (పా) సామగ్రికొట్టు, కొటారము, مال دار — దార్ (పా) ద్రవ్యవంతుడు, ఆస్తిగలవాడు, సంపన్నుడు مال سایر — సాయిర్ (అ) సుంకములు, సుంకములవలనిరాబడి లేక ఆదాయము مال منقولہ — ఎ, మన్కూల (అ) చరాస్తి, مال ضامن — జామిన్ (అ) తాకట్టుసొమ్ము-కుదువసొత్తు مال غیر منقولہ — ఎ, గైర్ మన్కూల (అ) స్థిరాస్తి مال لاوارث — ఎ, లావారిస్ (అ) దిక్కుమాలినసొత్తు, అనాయకపుసొత్తు, مالمست — మస్త్ (పా) ధనమదముగల, ధనగర్వితుడు, డబ్బుగలదనిగర్వపడువాడు مال مستی — మస్తీ (పా) ధనమదము ధనగర్వము مال مقروقہ — ఎ, మక్రూక (అ) నిగ్రహితమైనఆస్తి, గ్రస్తాస్తి, పట్టుబడినఆస్తి,

مال మాల్ (హి-స్త్రీ) రాట్నపుదారము. మొలపట్టము, మొలనూలు, మాల, దండ.

مآل మఆల్ (అ-పు) అంతము, పర్యవసానము, ఫలితము, సారాంశము, ఉద్దేశము مال اندیشی — అందేషీ (పా) దూరదృష్టి, దూరాలోచనము مال اندیش — అందేష్ (పా) దూరదృష్టిగల, దూరాలోచనజేయు, దూరమాలోచించు,

مال خیر — ఎ, ఖైర్ (పా) సత్పర్యవసానము, మంచిఫలితము.

مالا మాలా (హి-పు) మాల, దండ, హారము, పేరు, సరము, مالا پھیرنا-جپنا — ఫేర్నా, జప్నా. (హి) జపించుట జపమాలికత్రిప్పుట

مالا مال మాలామాల్ (పా) పరిపూర్ణము, సంపూర్ణము, నిండియున్న, సంపన్నము, సమృద్ధి, పుష్కలము, సంపద, ధనవంతము, ద్రవ్యవంతము

مال پوآ-پوری మాల్పు ఆ-పూరి (హి. పు) భక్ష్యవిశేషము, తియ్యపూరిక

مالتی మాల్తీ (హి. స్త్రీ) మాలతీలత, వసంతవిశేషము, مالتی بسنت — బసంత్, (హి) క్షయరోగచూర్ణము,

مالش మాలిష్ (పా. స్త్రీ) రుద్దుట, తోముట, రాయుట, మెరుగు పెట్టుట, కొట్టుట, ఒడలుపట్టుట مالش کرنا — కర్నా (ఉ) తోముట, మెరుగుపెట్టుట, ఒడలుపట్టుట, అసహ్యపడుట.

مالک మాలిక్ (అ. పు) స్వామి, యజమాని, అధికారి, భర్త, మగడు, దొర, ప్రభువు, దేవుడు, ఈశ్వరుడు

مالکانہ మాలికాన (అ) సొంతగానిపలె, స్వామి సం॥, సొంతగానికి రావలసినది, స్వామ్యము, స్వామిభాగము, అధికారము, స్వామివేతనము.

مالکنگنی మాల్కంగ్నీ (హి) గుంటుమెడవిత్తులు, మాలకంగుని విత్తులు,

مالکیت మాలికియత్ (అ) స్వామ్యము అధికారము, యాజమాన్యము.

مالگزار మాల్గుజార్ (పా) పన్నిచ్చువాడు - పంటకాపు - భూస్వామి - సేద్యగాడు - కాపు.

مالگزاری మాల్గుజారీ (పా. స్త్రీ) పన్నులవలనిఆదాయము, భూమిపన్నులు, పన్నులు, ఆదాయము, రాబడి, కాపుదనపుపన్ను రాజ్యాదాయము.

مالن మాలన్ (హి. స్త్రీ) వనపాలిక, మాలాకారునిభార్య.

**مالور** మాల్వర్ (పా) ధనవంతుడు. ద్రవ్యముగలవాడు.

**مالوف** మాలూఫ్ (అ) పరిచితమైన, అలవాటుపడిన, చనవుగల; ప్రియమైన.

**مالوی افیون** మాల్వీ అఫ్యూన్ (ఉ) మాలవ నల్లమందు, మాళవమందు,

**مالی** మాలీ (పా) ద్రవ్య సం॥, ఆర్థికము ఆదాయశాఖా సం॥.

**مالی** మాలీ (హి పు) మాలాకారుడు, వనపాలకుడు, తోటవాడు.

**مالیت** మాలియత్, (అ. స్త్రీ) మూల్యము, వెల, వెలపరిమాణము, ద్రవ్యము, సొత్తు,

**مالیدہ** మాలీద (పా. పు) రొట్టెతునకలు జల్లముకలియ దంచిచేసినముద్దలు.

**مام** మామ్ (పా. స్త్రీ) తల్లి, అమ్మ, **مام ناف** — నాఫ్ [పా] మంత్రసాని.

**ماما** మామా (పా. స్త్రీ) తల్లి, అమ్మ, వయస్సుమీరిన పనికత్తె, సేవకురాలు.

**مامتا** మామ్తా [హి. స్త్రీ] మమత, ప్రేమ, వాత్సల్యము.

**مامن** మామన్ (అ.పు) అభయస్థానము నిర్భయస్థలము, స్వేచ్ఛాస్థలము.

**مامور** మామూర్ [అ] నియుక్తము, ఆజ్ఞాపితము, నియమింపబడిన, ఉద్యోగమిచ్చిన, కొలువుపెట్టబడిన; పూర్ణము, నిండిన, **مامور کرنا** — కర్నా (ఉ) ఉద్యోగమునకునియమించుట, ఉద్యోగమిచ్చుట, కొలువు పెట్టుట, కొలువిచ్చుట, నియుక్తునిజేయుట, నియోగించుట, **مامور ہونا** — హోనా (ఉ) నియుక్తుడగుట నియోగింపబడుట.

**مامی** మామీ [హి. స్త్రీ] అత్త, మామభార్య, మేనత్త, పక్షపాతము.

**ماں** మాం (హి. స్త్రీ) తల్లి, అమ్మ.

**مان** మాన్ (హి. స్త్రీ) మానము, గౌరవము మర్యాద; గర్వము, అభిమానము: కొలత. అల్లుడు. **مان رکھنا** — రఖ్నా, (హి) మానముకాపాడుట, మర్యాదనిలుపుట.

**مانا** మానా (హి) ఇముడుట, ఒకదానిలోనొకటిపట్టుట, లోనికి సరిపోవుట, లోనపట్టుట, చాలుట, సరిపడుట.

**مانج** మాంజ్ (హి. స్త్రీ) నీటిపల్లము, పండు నేల, వండలి; చీము, రసిక, పుంటిచీరు.

**مانجنا** మాంజ్నా (హి) తోముట, శుభ్రముజేయుట.

**مانجھا** మాంఝా (హి-పు) వరియన్నము గాజుపొడి మొ॥ కలిపి నూరి గాలిపడగ దారమునకు కలుకుగలిగించుటకై పూయబడునది, దారముపూత, పూతదారము; పెండ్లిస్నాతకపువిందు, పెండ్లివిందు.

**مانجھنا** మాంఝ్నా [హి] చూడు **مانجنا**

**مانجھی** మాంఝీ (హి-పు) పడవనడుపువాడు, పడవవాడు.

**ماند** మాంద్ (హి) మందమైన, మందముగానున్న, మాసిన. మందగిల్లిన, మలినమైన, కందుపారిన, మరుగుపడిన, పేడకుప్ప.

**ماندگی** మాందగీ (పా. స్త్రీ) మాంద్యము, మందగింపు, అలసట, ప్రాలుమాలిక, అస్వస్థత; ఆలస్యము, తగ్గుదల.

**ماندہ** మాంద (పా) మందగించిన, మాంద్యముగల, ప్రాలుమాలిన, అస్వస్థముగానున్న.

**ماندل** మాండల్ [హి. స్త్రీ] మూతికడియము, తోలుబొక్కెన మూతికిసుండుఇనుపకడియము.

**ماندنا** మాండ్నా (హి) మర్దించుట, పిసుకుట, రుద్దుట, త్రొక్కుట, ఉపక్రమించుట, ప్రచరించుట, రచియించుట. పరచుట, చేయుట, జరుపుట, తంత్రమునడుపుట, కలాపమునుజరుపుట, ఏర్పాటుచేయుట. వ్రాయుట, గీయుట; పరిష్కారముచేయుట, తీర్మానించుట.

**ماندها** మాంఢా [హి-పు] పెండ్లిమంటపము, పందిరి, చవికె, పాక.

**ماندی** మాండీ (హి-స్త్రీ) గంజి.

**مانس** మానస్ (హి-పు) మానిసి, మనుష్యుడు.

**مانع** మానె ఉ (అ-పు) నిరోధకము, అడ్డగించెడు, కాదనెడు, వలదనెడు; అడ్డు, ఆటంకము, ఆక్షేపణము, నిషేధము, **مانع هونا** — హోనా [ఉ] నిరోధించుట, అడ్డగించుట, నిషేధించుట,

**مانک** మానిక్ (హి-పు) మాణిక్యము, కెంపు, రతనము.

**مانگ** మాంగ్ (హి. స్త్రీ) తలపాపట, సీమంతము, విభాగము, యాచన, ఆవశ్యకము, కావలసియుండుట, అక్కఱ. పెండ్లిమనువునిశ్చయించుట. **مانگ بهرنا** — భర్నా [హి] పెండ్లాడుట, **مانگ بهری** — భరీ (హి) ప్రియురాలైనభార్య, ముత్తయిదువ. **مانگ پٹی** — పట్టీ [హి] తలముడుచుకొనుట, తలదువ్వుకొనుట, పాపటదీసికొనుట, బొట్టుపెట్టుకొనుట మొ॥పనులు, తీర్చుకొనుట, దిద్దుకొనుట. **مانگ جلی** — జలీ [హి] ముండమోపి, వితంతువు, **مانگ نکالنا** — నికాల్నా (హి) పాపటతీయుట, **مانگ ٹیکا** — టీకా [హి] పాపటబొట్టు, (ఒక భూషణము) **مانگ لینا** — లేనా [హి] అడుక్కొనుట, అప్పుతీసికొనుట, అప్పుపుచ్చుకొనుట.

**مانگنا** మాంగ్నా (హి) యాచించుట, అడుగుట, అడుగుకొనుట, అప్పుపొందుట, ప్రార్థించుట, వేడుకొనుట, అప్పగొనుట, పెండ్లిమనవడుగుట.

**ماننا** మాన్నా (హి) మన్నించుట, గౌరవించుట, మర్యాదచేయుట, అమోదించుట, సమ్మతించుట, ఒప్పుకొనుట, లక్ష్యపెట్టుట, [illegible], లోబడుట. పూజించుట, సేవించుట, కొలుచుట, అవలంబించుట, నిర్ధారించుట, విశ్వసించుట.

**مانند** మానింద్ (హి) వలె, పోలిక, సదృశము, సమానము, పోలిన.

**مانو** మానో (హి) ఉన్నదనుకొనుము, పోనీ అనుకొనుము, ఉండనిమ్ము, కానిమ్ము, అనుకొందము, పోనీ, అన్నవనుకొందము.

**مانوس** మానూస్ (అ) ప్రియమైన, ఇంపైన, మనవుగల, పరిచితము, సహవాసముగల, సహవాసి, స్నేహితుడు.

**ماوا** మావా [హి-పు] పదార్థము, వస్తువు; గ్రుడ్డులోని [illegible]; [illegible]; [illegible], దధి, పులిసినది.

**ماوی** మావా (అ-పు) స్వగృహము, నివాసము, స్వస్థానము, హార్మ్యము. ఇల్లు.

**ماوس** మావస్ (హి-స్త్రీ) అమావాస్య, అమవస తిథి.

**ماوسا** మావ్సా (హి-పు) తల్లితోబుట్టిన దానిమగడు, పినతల్లిమగడు.

**ماوسی** మావ్‌సీ (హి-స్త్రీ) తల్లితోడబుట్టినది, పినతల్లి, పెత్తల్లి.

**ماہ** మాహ్ (పా-పు) మాసము, నెల, చాంద్రమాసము; ప్రియురాలు. **ماہ جبین - رو - لقا** — జబీన్, రూ. లిక్వా [పా] చంద్రముఖి, అందకత్తె ప్రియురాలు **ماہ بماہ** — బమాహ్ (పా) నెలనెలకు, ప్రతిమాసము, **ماہ شمسی** — షంసీ (పా) సౌరమాసము **ماہ - قمری** — క్వమ్రీ (పా) చాంద్రమాసము.

**ماہانہ - ماہواری** మాహానా, మాహ్వారీ (పా) నెలఒక్కింటికి, ప్రతినెలకు, నెలకు.

**ماہوار** మాహ్వార్ (పా-పు) నెలజీతము, నెలగాసము, నెలబత్తెము.

**ماہتاب** మాహ్‌తాబ్ [పా-పు] చంద్రుడు, నెల; వెన్నెల.

**ماہتابی** మాహ్‌తాబీ (పా-స్త్రీ) వెన్నెల ప్రమిద (ఒకబాణసంచు,) ఏటిపుచ్చకాయ; దబ్బకాయ, ఆకాశగోళములు సరిగతో కుట్టిన వస్త్రము.

**ماہر** మాహుర్ (హి-పు) విషము, గరళము

**ماہر** మాహిర్ (అ) ప్రవీణుడు, పండితుడు, అనుభవజ్ఞుడు, నేర్పరి, ఒకవిషయమందు సంపూర్ణ పాండిత్యముగలవాడు.

**ماہی** మాహీ (పా-స్త్రీ) మత్స్యము, చేప భూమి నిధరించియున్న చేప, సాంతాళమత్స్యము **ماہی پشت** — పుష్త్ (పా) నడుమఉబికియున్న, నడుమఉబ్బియున్న, నడుమపల్లముగానున్న: **ماہی توا** — తవా (ఉ) నడుమలోతుగానున్న పెన్నము **ماہی خوار** — ఖ్వార్ (పా) కొంగ (పక్షి) **ماہی گیر** — గీర్ (పా.పు) చేపలుపట్టువాడు. జెస్తవాడు.

**ماہی مراتب** మాహీమరాతిబ్ (పా-పు) రాజబిరుదములు. రాజచిహ్నములు.

**ماہیانہ** మాహియానా (పా-పు) మాసికము, నెలకొకసారి వచ్చునది, నెలజీతము నెలబత్తెము.

**ماہیت** మాహియత్ (అ-స్త్రీ) మూలము ప్రకృతి, పదార్థము, వస్తువు, ద్రవ్యము; స్వభావము, గుణము, తత్వము, యాథార్థ్యము, సారాంశము.

**مائی** మాయీ (హి-స్త్రీ) తల్లి, అమ్మ.

**مایا** మాయా (హి-స్త్రీ) మాయ, మిథ్య, స్వప్నప్రాయము; మమత, దయ; భ్రాంతి, భ్రమ.

**مائل** మాయిల్ (అ) అభిముఖము, ఉన్ముఖము; ప్రేమగల, అపేక్షగల, ఒకవైపు నకు మొగ్గియున్న, వాలియున్న, పక్షపాతము గనున్న: కటాక్షముగల **مائل کرنا** — కర్నా (ఉ) అభిముఖముగా జేయుట, ప్రోత్సహించుట, **مائل ہونا** — హోనా (ఉ) అభిముఖమగుట, పక్షపాతముజూపుట.

**مایوس** మాయూస్ (అ) నిరాశజెందిన. ఆశవదలుకొనిన. భగ్నాశుడైన **مایوس ہونا** — హోనా (ఉ) నిరాశజెందుట, ఆశవదలుకొనుట. **مایوس کرنا** — కర్నా [ఉ] ఆశాభంగము జేయుట.

**مایوسی** మాయూసీ (అ-స్త్రీ) నైరాశ్యము. నిరాశ, ఆశాభంగము.

**مایہ** మాయ (పా-స్త్రీ) ద్రవ్యము, వస్తువు; ధనము, మూలధనము, పంచికట్టు, మూలము, సారము, సంచయము; ఆము;

సంచితము; పులియబెట్టినది **مایہ جوڑنا** —జోడ్నా (ఉ) ద్రవ్యముగూడబెట్టుట

**مائی پھل** మాయీఫల్ (హిం-పు) మాచికాయ.

**مباح** ముబాహ్ (అ.పు) శాస్త్రీయము, అష్టము, విధ్యుక్తము, ఉచితసౌఖ్యము, ఉచితభోగము, **مباح کرنا** —కర్నా (ఉ) శాస్త్రసమ్మతము జేయుట **مباح رکھنا** — రఖ్నా (ఉ) శాస్త్రసమ్మతముగా నెంచుట.

**مباحثہ** ముబాహస (అ.పు) వాదము, తర్కము, వివాదము.

**مبادا** మబాదా (పా) దైవము తప్పించుగాత, దైవమట్లు చేయరాదుగాని, కాగూడదుగాని, కారాదుగాని, ఒకవేళ.

**مبادرت** ముబాదరత్ (అ-స్త్రీ) త్వర, ఆతురము, సంభ్రమము, సాహసము.

**مبادلہ** ముబాదల (అ-పు) మారకము, మాఱుపు; అరువు, అప్పు; పరివర్తనము, పరివర్తము, వస్తువులుమార్చుకొనుట; ప్రతిఫలము, ప్రతీకారము, వైరశుద్ధి.

**مبادی** ముబాదీ (అ-స్త్రీ) ఆరంభములు, మూలములు, ప్రాథమికములు, ప్రాథమికవిషయములు. (ఏ-వ **مبدو**)

**مبارز** ముబారిజ్ (అ-పు) యోధుడు, శూరుడు.

**مبارک** ముబారక్ (అ) మంగళప్రదము, శుభకరము, సంతోషదాయకము, స్వాగతము.

**مبارک باد** ముబారక్ బాద్ [పా] శుభమస్తు, శోభనమస్తు. (స్త్రీ) స్వస్తి, అభినందనము, ఆశీర్వాదము, **مبارک باد دینا** — దేనా (ఉ) మంగళాశీర్వాదముజేయుట, ఆశీర్వదించుట. అభినందించుట, స్వస్తి జెప్పుట.

**مبارکی** ముబారకీ (అ-స్త్రీ) శుభము, మంగళము, స్వస్తి, అభినందనము, ఆశీర్వాదము.

**مباشرت** ముబాషరత్ (అ-స్త్రీ) సంభోగము, సంగమము, స్త్రీసంభోగము.

**مبالغہ** ముబాలగ [అ-పు] అత్యంతప్రయత్నముజేయుట-అతిశయోక్తి, అత్యుక్తి, ఉన్నదానికంటె ఎక్కువజెప్పుట.

**مباہات** ముబాహాత్ [అ-స్త్రీ] ఘనత, గౌరవము, గర్వము, అభిమానము, అధిక్యత, గొప్పజెప్పికొనుట, నేనేఎక్కువనుట.

**مباہی** ముబాహీ [అ] ఘనతగల, గౌరవనీయమైన, గర్వముగల.

**مبتدا** ముబ్తదా (అ-స్త్రీ) ఆరంభము; అకర్మకక్రియయొక్క కర్త, **مبتدا وخبر** — వఖబర్ (అ) అకర్మకక్రియయొక కర్తయును.

**مبتدی** ముబ్తదీ (అ-పు) ఆరంభకుడు, విద్యార్థి విద్యనారంభించినవాడు

**مبتذل** ముబ్తజిల్ (అ) నీచము, తుచ్ఛము, అల్పము.

**مبتسم** ముబ్తసిమ్ [అ] మందహాసముజేయువాడు, మందస్మితుడు.

**مبتلا** ముబ్తిలా (అ) శోధింపబడిన, సంకటములో చిక్కికొనిన, కష్టములోపడిన, చిక్కులోపడిన, ఆర్తుడు, దుఃఖితుడు, గ్రస్తుడు.

**مبخر** ముబఖ్ఖిర్ (అ) సువాసితము,

వాసనబట్టించినది.

مبدع ముబ్దఉ (అ-పు) నూతనసృష్టి, నవీనకల్పన; ప్రబంధము, కావ్యము, కల్పితకథ, ఆరంభము, మూలము, ప్రకృతి, ఉత్పత్తి.

مبدع ముబ్దిఉ [అ-పు] స్రష్ట, నూతనముగ సృజించినవాడు, నిర్మించినవాడు; చేసినవాడు, ఉత్పత్తికారణము; పాషండుడు.

مبدل ముబద్దల్ (అ) పరివర్తితము, మార్పబడినది, మార్చినది, మారు, ప్రతి, ప్రత్యామ్నాయము.

مبذر ముబజ్జిర్ (అ.పు) అమితవ్యయ చేయువాడు, అర్థదూషకుడు, వ్యర్థము గాప్రయపెట్టువాడు.

مبذول ముబ్జూల్ (అ) వ్రయపెట్టబడిన -వ్యయముచేయబడిన, దత్తము, అనుగ్రహింపబడిన; కానుక, కట్నము.

مبرا-مبری ముబర్రా (అ) విముక్తము, విరహితము, తొలగింపబడిది, వేరుచేయబడిన, దూరితము, వియుక్తము; పరిశుద్ధముచేయబడిన, నిర్దోషము, నిర్మలము; నిరపరాధము, పరిశుద్ధము.

مبرات ముబర్రాత్ (అ.స్త్రీ) సత్కార్మపుణ్యకార్యములు, సత్కార్యములు.

مبرم ముబ్రమ్ (అ) దృఢమైన, స్థిరమైన, సుస్థిరము, గట్టిది.

مبرهن ముబర్హన్ (అ) స్పష్టము, నిశ్చయింపబడినది, సిద్ధాంతము, రాద్ధాంతము, ప్రకటితము, విశదము, యథార్థము.

مبشر ముబష్షిర్ (అ) సువార్త దెచ్చువాడు, సంతోషవార్త జెప్పువాడు, బోధకుడు.

مبصر ముబస్సిర్ (అ) దృష్టిగలవాడు, వివేకదృష్టిగలవాడు, వివేకవంతుడు, జ్ఞానముగలవాడు; విశదపరచువాడు, తెలియజేయువాడు.

مبطل ముబ్తిల్ (అ) అబద్ధముజేయుట, పూర్వపక్షముజేయుట, కొట్టివేయుట, నిరసించుట, నాశముజేయుట.

مبغوض మబ్గూజ్ (అ) గర్హితము, అహితము, అసహ్యకరము.

مبلغ ముబ్లగ్ (ఉ.పు) రొక్కము, డబ్బు, రూకలు;

مبلغ మబ్లగ్ (అ.పు) పరమావధి, సంపూర్ణము, అంతయు; గమ్యస్థానము; మేర; కొంచము, రొక్కము.

مبنی ముబ్నీ (అ) కారకుడు, కారణము మూలము,

مبنی మబ్నీ (అ) ఆధారపడియున్న, మూలముగాగల, కారణముగగల; కట్టడము, హస్తిభారము.

مبهم ముబ్హమ్ (అ) గుప్తము, గూఢము, అస్పష్టము; ద్వంద్వార్థము, సందిగ్ధము, సందేహాస్పదము.

مبهوت మబ్హూత్ (అ) అద్భుతపడిన, వెఱగుపడిన, ఆశ్చర్యపడిన, నిశ్చేష్టితుడైన, దిగ్భ్రమపడిన, కలవరపడిన.

مبیت మబీత్ (అ) రాత్రినివసించుట, రాత్రిగడుపుట, నిశానివాసము, రాత్రిగడుపుచోటు; పడకటిల్లు.

مبیع మబీఉ (అ) అమ్మిన, కొనిన, [విక్రీతము.

مبین ముబయ్యాన్ (అ) చెప్పబడిన, స్పష్టముచేయబడిన, విశదపరుపబడిన; విశదము, స్పష్టము.

**مپوانا** మప్వానా (హి) కొలిపించు, కొలుచునట్లుజేయు.

**مت** మత్ (హి,స్త్రీ) మతము, తెలివి, అభిప్రాయము.

**مت** మత్ (హి) వద్దు, కూడదు, వలదు,
**مت جا** –జా (హి) పోవద్దు, పోవలదు.

**متابعت** ముతాబఅత్ (అ.స్త్రీ) అనుసరణము, అనువర్తనము, విధేయత, అనువర్తించుట, అవలంబనము, ఆచరణము; సేవించుట, లోబడియుండుట.

**متاثر** ముతఅస్సిర్ (అ) ఫలముజూపెడు. ఫలముగలుగజేసెడు, గుణమిచ్చెడు, ఫలవంతము, ఫలదాయకము, మనసుకరగించెడు,

**متاخرین** ముతఅఖ్ఖిరీన్ (అ.పు) ఆధునికులు, ఇప్పటివారు,

**متادب** ముతఅద్దబ్ (అ) సభ్యుడు, సుశిక్షితుడు, మర్యాదస్థుడు; పండితుడు.

**متادی** ముతఅద్దీ (అ) ముట్టజెప్పువాడు, చేర్చువాడు, అందజేయు, సిద్ధపడియున్న, పందేశవాహుడు.

**متاذی** ముతఅజ్జీ (అ) విసుకుజెందిన, దుఃఖితమైన, రోసిన, మనసునొచ్చిన, విసికిన, చింతనొందిన.

**متاسف** ముతఅస్సిఫ్ (అ) పశ్చాత్తాపపడు, వగచు; పశ్చాత్తాపముగలుగు, పశ్చాత్తప్తుడు, పశ్చాత్తాపకరము.

**متاع** మతాఉ (అ.స్త్రీ) సామాగ్రి-సొత్తు, ఆస్తి; వర్తకసామాగ్రి, ఇంటిసామాగ్రి, ద్రవ్యాదులు, లాభము.

**متامل** ముతఅమ్మిల్ (అ) గంభీరస్వభావముగల, మిక్కిలియాలోచించెడు, ఆలోచనపరుడు, పరిశోధకుడు; దుర్భాలోచనజేయువాడు.

**متانت** మతానత్ (అ. స్త్రీ) గాంభీర్యము, స్థైర్యము, నిబ్బరము, దార్ఢ్యము. శక్తి.

**متبرک** ముతబర్రిక్ (అ) పవిత్రమైన, పరిశుద్ధమైన; పూజ్యమైన, పుణ్యానంతమైన; భాగ్యవంతమైన; శుభకరమైన, మంగళకరమైన, దివ్యమైన.

**متبسم** ముతబస్సిమ్ (అ) మందస్మితమైన, చిరునవ్వునవ్వుడు.

**متبنی** ముతబన్న (అ) దత్తుదీసికొనిన, పెంచుకొనిన, దత్తుగొన్న.

**متجلی** ముతజల్లీ (అ) ప్రకాశముగల, దివ్యము, కాంతిమంతము.

**متحد** ముత్తహిద్ (అ) కలిసియున్న, కలిసిన, సంఘీభూతము, మిళితము. ఏకమైన, ఐకమత్యముగల.

**متحرک** ముతహర్రిక్ (అ) చలించెడు, చలింపజేసెడు, చాలకము, కదలించునట్టి అచ్చులుగల, అచ్చులతోగూడియున్న.

**محترم** ముతహర్రమ్ (అ) పూజ్యమైన, గౌరవనీయమైన, గౌరవింపదగిన; అక్రమము, నిషిద్ధము, కూడనిది.

**متحقق** ముతహక్కిక్ (అ) నిజముతెలిసికొనబడిన, విచారించిదృఢపరచుకొనబడిన, సరిజూచుకొనబడిన, యథార్థము, నిశ్చయము: (ముతహక్కిక్) సరిజూచువాడు, పరీక్షకుడు, విచారించువాడు.

**متحمد** ముతహమ్మిద్ [అ] పొగడబడినది, శ్లాఘితము, శ్లాఘనీయము, శ్లాఘ్యము,

**متحمل** ముతహమ్మిల్ [అ] సహించెడు, సహిష్ణువు, ఓర్పుగల సమానముగల.

متحیر ముతహయ్యిర్ [అ] అద్భుతపడిన, ఆశ్చర్యపడిన, వెఱగొందిన, దిగ్భ్రమజెందిన, నిశ్చేష్టితుడైన, అచ్చెరువొందిన.

متخاصمین ముతఖాసిమైన్ [అ] వాది ప్రతివాదులు, వ్యాజ్యపడువారు.

متخلص ముతఖల్లిస్ (అ) స్వచ్ఛమైన, పరిశుద్ధమైన; బిరుదునామముగల; అంకితముగల, నామాంకితమైన; మారుపేరుగల.

متخیلہ ముతఖయ్యిల (అ) ప్రతిభ, ఊహాశక్తి, భావనాశక్తి, ఆలోచనశక్తి, నూతనకల్పనాశక్తి.

متدین ముతదయ్యిన్ (అ) మతనిష్ఠగల, ఆచారపరుడైన, నీతిమంతుడైన, న్యాయసుడు, ప్రామాణికుడు, ప్రమాణస్థుడు; అప్పగొన్నవాడు.

متذکرہ ముతజక్కర (అ) చెప్పబడినది, ప్రస్తావించినది, ఉక్తము, ఉదితము, సూచితము, సూచింపబడినది, متذکرہ بالا — ఎ,బాలా (అ) పైనజెప్పినది, పూర్వోదాహృతము, పూర్వోక్తము,

متذکرہ ذیل ఎ.జైల్ (అ) క్రిందచెప్పబడిన, క్రిందసూచింపబడిన, ఉత్తరోక్తము.

مترادف ముతరాదిఫ్ (అ) పర్యాయపదము, ఏకార్థము, ఒకేయర్థము నిచ్చు; తరువాతి, పలుసలోనున్న, అనుసరించియున్న.

مترجم ముతరజ్జిమ్ (అ) అనువాదకుడు, భాషాంతరము జేయువాడు.

مترحم ముతరహ్హిమ్ (అ) దయగల, దయాళువైన, కృపావంతుడు,

متردد ముతరద్దిద్ (అ) చింతనజేయు, విచారించు, ఆలోచించు, చింతించు, అచ్చెరువొందిన, ఆశ్చర్యపడిన, దిగ్భ్రమజెందిన; భ్రమపడిన, చలించుచున్న, కొట్టివేయబడిన, నిషేధింపబడిన, తిరస్కరింపబడిన, నిరసింపబడిన.

مترضی ముతరజ్జీ (అ) తృప్తిపరచువాడు, సంతోషపెట్టువాడు.

مترقب-بہ ముతరక్కిబ్-బ(అ)ఎదురుచూచిన, ఆశపడిన, అనుకొనిన.

متروک మత్రూక్ (అ) పరిత్యక్తము, విడువబడినది; నిషిద్ధము, దూషితము.

متروک الاستعمال — ఉల్ ఇస్తేమాల్ (అ) వాడుకనుండితొలగినది వాడుకలోలేనిది, ప్రయోగచ్యుతము.

متزائد ముతజాయిద్ (అ) వర్ధమానము, వర్ధితము, వృద్ధిపొందినది, ఎక్కువైనది, వృద్ధియగు, అధికమగు, ఎక్కువగు.

متزلزل ముతజల్జిల్ (అ) కంపితము, చలితము, కదలునది, చంచలము, తొట్రుపడుచున్న, తడబడుచున్న, ఊగులాడుచున్న, వణకుచున్న.

متساوی ముతసావీ (అ) సమానము, సమము, సదృశము, సరియైనది.

متسع ముత్తసఉ (అ) విశాలమైన, వెడల్పుగల, వ్యాపించియున్న, వ్యాపితము విపులము, విశాలము.

متسلط ముతసల్లిత్ (అ) ఆక్రమించెడు, పరిగ్రహించెడు: నిరంకుశమైన, అడ్డులేని

متسلم ముతసల్లిమ్ (అ) ఆమోదకుడు, అనుమోదించువాడు, తీసికొన్నవాడు, అధీనములోనుంచుకొన్నవాడు.

متسلم ముతసల్లమ్ (అ) ఆమోదింపబడిన,

తీసికొనబడిన.

متسلی ముతసల్లీ (అ) ఆశ్వాసింపబడిన, ఆదరింపబడిన, బుజగరింపబడిన, సహానుభూతిజూపబడిన.

متشابہ ముతషాబెహ్ (అ) పోలియున్న, సదృశమైన, అనురూపమైన.

متشرع ముతషర్రెఉ (అ) మతానుసారమైన, శాస్త్రోక్తమైన, విధియుక్తమైన, ఆచారయుక్తమైన, క్రమమైన, నిష్ఠపరుడు

متشکل ముతషక్కిల్ (అ) ఏకాకారమైన, రూపసాదృశ్యముగల, సదృశమైన; ఆకారమేర్పడిన, నిర్మితమైన,

متصدع ముతసద్దిఉ (అ) పీడించెడు, బాధించెడు, పీడాకరము, బాధాకరము.

متصدی ముతసద్దీ (అ) లేఖరి, వ్రాతగాడు, రాయసగాడు; కార్యదర్శి, లెక్కవాడు; సాహసుడు, లొంగనివాడు, తిరుగబడువాడు.

متصرف ముతసర్రిఫ్ (అ) అమితవ్యయము చేయువాడు, అనుభవించువాడు, స్వాధీనములోగలవాడు; అపహరించువాడు

متصل ముత్తసిల్ (అ) సమీపస్థము, దగ్గరనున్నది, జారుగుననున్నది, ఆనుకొనియున్నది, కలిసియున్నది, చేరియున్నది, తగిలియున్నది, అంటుకొనియున్నది, సరసనున్నది.

متصور ముతసవ్వర్ (అ) భావింపబడిన, ఊహింపబడిన, మనోకల్పితమైన, తలంపబడిన, అనుకొనిన, ఆలోచింపబడిన.

متضاد ముతజాద్ (అ) విరుద్ధము, అన్యోన్యవిరుద్ధము.

متضرب ముతజర్రిబ్ (అ) కొట్టబడిన, కలతజెందిన: అస్వాస్థ్యమైన, తాడితము.

متضمن ముతజమ్మిన్ (అ) అనుబద్ధము, తనలోచేర్చుకొనియున్న, ఇముడ్చుకొనియున్న, కలుపుకొనియున్న, చేరుకొనియున్న.

متظلم ముతజల్లిమ్ (అ) చీకటిగాచేయబడిన; పీడింపబడిన; బాధితము, పీడితము, మొరబెట్టుకొనువాడు, పీడుతుడు, బాధితుడు.

متعارف ముతఆరిఫ్ (అ) పరిచితము, పరిచయముగల, ఒకరికొకరు తెలిసియున్నవారు, ఎరిగినవారు.

متعاقب ముతఆకిబ్ (అ) తరువాతవచ్చెడు, తరువాత, వెనుకగే, వెంట, అనంతరము, ఆనంతర్యము.

متعال - متعالی ముతఆల్-లీ (అ) ఘనమైన, ఉన్నతమైన, ఎత్తయిన, గొప్ప, పెద్ద.

متعبد ముతఅబ్బిద్ (అ) భక్తిగల, మతనిష్ఠగల; హితముగల, మార్గస్థమైన.

متعجب ముతఅజ్జిబ్ (అ) ఆశ్చర్యకరమైన, అద్భుతపడిన, ఆశ్చర్యమొందిన.

متعدد ముతఅద్దిద్ (అ) గణితము, లెక్కపెట్టినది; అనేకము, పెక్కులు; కొలదికొన్ని.

متعدی ముతఅద్దీ (అ) సకర్మకము (క్రియ), ఎగిరితాకునది, అంటుకొనునది (వ్యాధి) امراض متعدی — అమ్రాజెముతఅద్దీ (అ) అంటువ్యాధులు.

متعذر ముతఅజ్జిర్ (అ) క్షమాపణము గోరు, క్షమార్హమైన; కష్టసాధ్యము, అసాధ్యము, అసంభవము, క్షమార్థి.

متعسر ముతఅస్సిర్ (అ) క్లిష్టము, చిక్కునది; కఠినము, కష్టమైనది.

**متعصب** ముతఅస్సిబ్ (అ) మతపక్షపాతముగలవాడు, స్వమతాభిమాని, పరమతాసహిష్ణువు.

**متعفن** ముతఅఫ్ఫిన్ (అ) దుర్గంధమైన కంపుగొట్టెడు, అసహ్యకరము.

**متعلق** ముతఅల్లిక్ (అ) సంబంధముగల, సంబంధించిన, అంటగట్టిన, అనుబద్ధము, సంబద్ధము, తగిలిన, కలిసియున్న, చేరిన చేర్చిన, **متعلق ذات خاص** —ఎ, జాతెఖాస్ (అ) కేవలమాత్మసంబంధమైన, స్వసంబంధమైన, ఆత్మార్థమైన, స్వార్థపరమైన, స్వార్థమైన, సొంతము.

**متعلقین** ముతఅల్లికీన్ (అ-పు) కుటుంబమువారు, సంబంధులు, కావలసినవారు, పరివారము, అనుచరులు; సంతానము.

**متعلقات** ముతఅల్లిక్కాత్ (అ. స్త్రీ) అనుబంధములు, సంబంధించినవి, ఆస్తి-సొత్తు సంబంధించినవస్తువులు.

**متعہد** ముతఅహ్హిద్ (అ) ఒడంబడినవాడు జేటీదారుడు; పొలముదున్నుకొనిపన్ను కట్టుటకుఒప్పుకొన్నవాడు, కాపు, సేద్యగాడు.

**متعین** ముతఅయ్యన్ (అ) నిర్ణయమైన, నిర్ధారితమైన, నిశ్చితమైన, నియోజితమైన, ఏర్పాటుచేయబడిన; స్పష్టము. విశదము, **متعین کرنا** —కర్నా (ఉ) నియోగించుట, నిర్ణయించుట, నిశ్చయించుట. **متعین ہونا** —హోనా (ఉ) నియోగింపబడుట, నిశ్చయింపబడుట, నిర్ణయింపబడుట.

**متعینہ** ముతఅయ్యన (అ) నియోగము, అనుజ్ఞ, శాసనము, ఏర్పాటు, పని, కొలువు.

**متغلب** ముతగ్గల్లిబ్ (అ) జయించిన, గెలిచిన, ఆక్రమించెడు, లోపరచెడు, జయశీలమైన, జయించెడు, మీరెడు.

**متغیر** ముతగయ్యిర్ (అ) మారెడు, పరివర్తమొందెడు, భేదించెడు, స్థిరముగాని-చంచలమైన.

**متفحص** ముతఫహ్హిస్ (అ) జిజ్ఞాసి, జిజ్ఞాసగల, తెలియగోరు.

**متفرق** ముతఫర్రిక్ (అ) వేరువేరు, ప్రత్యేకమైన, నానార్థములు, సంకీర్ణము, ప్రకీర్ణము, వివిధములు, చెల్లాచెదరైన, వెదజల్లబడిన, చిల్లర (విషయములు.)

**متفرقات** ముతఫర్రిక్కాత్ (అ) వివిధవస్తువులు,వివిధములు,చిల్లరవస్తువులు, చెదరియున్నవస్తువులు, వివిధవిషయములు, వేరువేరువస్తువులు లేక విషయములు.

**متفرقہ** ముతఫర్రిక (అ) అంగరక్షకబలము, రాజుగారిఅంగరక్షకులు.

**متفق** ముత్తఫిక్ (అ) ఏకాభిప్రాయముగల, ఐకమత్యముగల, ఏకీభవించిన, సమాధానపడిన, ఒకటిగాచేరిన, సమ్మొగూడిన, సమ్మొగట్టిన. **متفق الرائے** — ఉర్రాయె (అ) ఏకాభిప్రాయులు, ఐకమత్యముగల.

**متفکر** ముతఫక్కిర్ (అ) ఆలోచనజేయు చింతనజేయు, ధ్యానించు, చింతించు; చింతజేయు, విచారముగల, మనసుకలతజెందిన, వికలమనస్కుడైన- అస్వస్థమనస్కుడైన, కలవరపడియున్న.

**متفنی** ముతఫన్ని (అ) జిత్తులమారి, మాయలమారి, టెంటాలమారి, తాకట్లమారి, కుయుక్తులమారి.

**منقاضی** ముతక్కాజ్జీ (అ-పు) నిర్బంధపెట్టువాడు, తరువుచేయువాడు, తరువుకాడు, రావలసినసొమ్ముకై ఒత్తిడిచేయువాడు,

**منقدمین** ముతక్కద్దిమీన్ (అ-పు) పూర్వులు, వెనుకటివారు.

**منقرب** ముతక్కర్రిబ్ (అ) సమీపస్థము, దగ్గరనున్నది, సమీపస్థమైన, సంబంధముగల; బాంధవ్యముగల; రాజబంధువు, రాజానుగ్రహముగలవాడు; దైవభక్తిగలవాడు.

**منقی** ముత్తక్కీ (అ) ధర్మనిష్ఠగల, భక్తిగల, ఇంద్రియనిగ్రహముగల, ఆత్మనిగ్రహముగల.

**منکا** ముత్తకా (అ-పు) ఆనుకొనుచోటు, ఆను, దిండు.

**منکا** ముతకా (హి-పు) ఊత, పోటి, పోటుకంబము.

**منکبر** ముతకబ్బిర్ (అ) అభిమాని, గర్వి, అహంకారముగలవాడు.

**منکبرانہ** ముతకబ్బిరాన (పా) సగర్వము, సాహంకారము.

**منکفل** ముతకఫ్ఫిల్ (అ-పు) పూటకాపు, ఉత్తరవాది, ప్రతిభువు, పూటపడు, ప్రతిభువుఅగు, ఉత్తరవాదియగు.

**منکلم** ముతకల్లిమ్ (అ-పు) మాట్లాడువాడు, ఉత్తమపురుషము.

**منکی** ముత్తకీ (అ)ఆధారపడిన, ఆనుకొనిన, ఒరగిన, వ్రాలిన, చేరగిలబడిన.

**منلاشی** ముతలాషీ (అ-పు) వెదకువాడు విచారించువాడు, జిజ్ఞాసువు.

**منلاطم** ముతలాతిమ్ (అ) ఒకటికొకటి కొట్టుకొనుచున్న, అలలుకొట్టుకొనుచున్న, కల్లోలమైన, అల్లకల్లోలముగానున్న.

**منلانا** మత్లానా (హి) వికారపెట్టుట, కడుపులో తెమలుచుండుట, వాంతిపడునట్లగుట, సంకటముగానుండుట.

**منلذذ** ముతలజ్జిజ్ (అ) రుచిచేసంతసించిన, రుచిగొనుచున్న, రుచిచేతృప్తినొందిన, సంతుష్టుడైన.

**منلف** ముతల్లిఫ్ (అ) నాశకుడు, పాడుజేయువాడు, దూబరబంట.

**منلون** ముతలవ్విన్ (అ) చపలము, చంచలము, అస్థిరము, నిలకడలేని పూరెడు.

**منلون الطبع** — ఉల్ తబఅ [అ] చపలస్వభావముగల, చంచలమనస్కుడు, బుద్ధినిలకడలేనివాడు.

**منمرد** ముతమర్రిద్ [అ] తిరుగబడు, అవిధేయుడు, లొంగనివాడు, మూర్ఖుడు, మొండి, పాపముగలవాడు.

**منمکن** ముతమక్కిన్ (అ) నివాసి, వాసి, నివసించువాడు, కాపురమున్నవాడు; స్థిరమైన, బలిష్ఠమైన, అహంకారముగల.

**منمم** ముతమ్మిమ్ [అ] పూరకము, పూరించునది, పూర్తిచేయునది, ముగించునది; అనుబంధము, పూర్తి, పూరణము, పరిపూర్తి.

**منمنی** ముతమన్నీ [అ] అభిలాషి, కోరువాడు, అపేక్షించువాడు, ఆశించువాడు, ప్రార్థకుడు, అర్థి.

**منمول** ముతమవ్విల్ (అ) ద్రవ్యవంతుడు సంపన్నుడు, కలవాడు.

متن మతన్ (అ-పు) మూలము, మూలగ్రంథము, ఆధారము, మధ్యము.

متنازع ముతనాజేఅ [అ] వివాదపడినది, వివాదాంశము, వివాదమూలము, వివాదకారణములు.

متناسب ముతనాసిబ్ [అ] అనురూపమైన, సరిపడియున్న, పొంకముగానున్న, పొంకమైన, అనుగుణమైన; అనుకూలమైన, తగిన.

متناقص ముతనాఖ్ఖిస్ [అ] న్యూనము, లోపముగలది, తక్కువైనది, కొరవడినది, అసంపూర్ణము.

متناقض ముతనాఖ్ఖిజ్ [అ] అన్యోన్యవిరుద్ధము, ప్రత్యక్షవిరుద్ధము.

متناهی ముతనాహి (అ) తుదముట్టిన, పారముముట్టిన, మేరముట్టిన, ముగిసిన, పరాకాష్ఠము, పరమావధి.

متنبه ముతనబ్బెహ్ (అ) జాగరూకుడైన, మేలుకొనిన, ఎఱుకపడిన, మెలకువగల, జాగ్రత్తపడిన, తెలిసిన.

متنجم ముతనజ్జిమ్ (అ) జ్యోతిషము తెలిసినవాడు, సిద్ధాంతి, దైవజ్ఞుడు, జ్యోతిష్కుడు.

متنفر ముతనఫ్ఫిర్ [అ] జుగుప్సావంతుడు, రోతపడువాడు, అసహ్యకరము, హేయము.

متنفس ముతనఫ్ఫిస్ (అ-పు) శ్వాసించునది, ప్రాణి, సజీవము, చేతనము, జీవజంతువు; భూతము, వ్యక్తి, మానవుడు.

متواتر ముతవాతిర్ [అ] విడువక, ఎడతెగక, వెంటవెంట, వరుసగా, ఒకదాని వెనుకొకటి. వెనువెంట.

متوالا మత్వాలా (హి) మత్తుగొనిన, మైమరచిన, మైకముక్రమ్మిన, మంపుగొన్న. ఒడలు తెలియని.

متوالی ముతవాలీ (అ) ఎడతెగని, వెంటవెంటవచ్చెడు, విడువని, వరుసగానున్న

متوجه ముతవజ్జెహ్ (అ) ఒకదిక్కుమొగము గల, అభిముఖమైన, మరలిన, శ్రద్ధవహించిన, లక్ష్యముంచిన; అనుగ్రహము గల, కటాక్షముగల, متوجه هونا (ఉ) అభిముఖమగుట, మరలుట, మరలిచూచుట, లక్ష్యముంచుట, అనుగ్రహించుట, శ్రద్ధజేయుట, శ్రద్ధపూనుట.

متوحش ముతవహ్హిష్ (అ) భయంకరమైన, క్రూరమైన; భీతిల్లిన, భయపడిన, ఆకొన్న, పాడుపడిన, శూన్యమైన; భయభ్రాంతము.

متوسط ముతవస్సిత్ (అ) నడుమంతరము మధ్యస్థము, సామాన్యము, సగటుగానున్న; మధ్యస్థుడు, మాధ్యస్థముజేయువాడు, తగవరి, మధ్యవర్తి, న్యాయముజెప్పువాడు.

متوطن ముతవత్తిన్ (అ) కాపురమున్న, నివాసముజేసిన, వాసముజేయుచున్న, నివాసియైన; కాపురస్థుడు, నివాసి,

متوفر ముతవఫ్ఫిర్ (అ-పు) పుష్కలమైన, సమృద్ధియైన, అనేకము.

متوفی ముతవఫ్ఫీ (అ) చచ్చినవాడు, స్వర్గస్థుడు.

متوقع ముతవఖ్ఖిఅ (అ) అభిలాషియగు, ఆశగల, ఆశించు, متوقع كرنا — కర్నా (ఉ) ఆశగొలుపుట, ఆశపెట్టుట.

متوكل ముతవక్కిల్ (అ) ఈశ్వరునిన

నమ్మియుండువాడు, దేవునినమ్ముకొనియున్నవాడు, ఈశ్వరాయత్తుడు, దైవాధీనుడు.

**متولد** ముతవల్లిద్ (అ) జాతము, జనితము; పుట్టెడు, జనించెడు; కనిన.

**متولی** ముతవల్లీ (అ) కార్యనిర్వాహకుడు, ధర్మకర్త, హితుడు, మసీద్‌విచారణకర్త.

**متھانی** మథానీ (హి-స్త్రీ) మంథరము, కవ్వము, (చల్లచిలుకునది.)

**متھرا** ముత్రా (హి) పదనుచెడిన, మొండిపడిన; తెలివిమాలిన, అంబేద.

**متہم** ముత్తహిమ్ (అ) నిందితుడు, దూషితుడు, అనుమానింపబడినవాడు, నేరము మోపబడినవాడు.

**متھنی** మథ్నీ (హి-స్త్రీ) తరికఁడప, పెరుగుచిలుకుకుండ, మంథని.

**متھنا** మథ్నా (హి) మథించుట, చిలుకుట; మర్దించుట, పిసుకుట, ఆలోచించుట, అవలోడనజేయుట.

**متھورا** మథౌరా (హి-పు)

**متھیا** మిథ్యా (హి) మిథ్య, అసత్యము, కల్ల, మాయ.

**متی** మితి (హి-స్త్రీ) తిథి, తేది; వడ్డి, వృద్ధి; వట్టము, తరుగు; కాలపరిమితి, మితి, **متی کاٹا** — కాటా (హి) వట్టపు లెక్కలు **متی چڑھانا** — చఢానా (హి) తిథివ్రాయుట, ముగించుట.

**متیرا** మతీరా (హి-పు) ఒకచిన్నజాతిపుచ్చకాయ, తియ్యపుచ్చకాయ.

**متین** మతీన్ (అ) దిట్టమైన, పటుత్వముగల; దృఢమైన; ఉగ్రమైన, తీవ్రమైన, గంభీరమైన, బలవత్తరమైన, గాంభీర్యముగల, శుద్ధమైన.

**مٹاپا** ముటాపా (హి-పు) స్థౌల్యము, లావు, బలుపు.

**مٹانا** ముటానా (హి) బలియుట, లావెక్కుట; గర్వముజూపుట.

**مٹانا** మిటానా (హి) మాపుట, చెరుపుట; తుడిచివేయుట, కొట్టివేయుట, నాశముజేయుట, పాడుజేయుట;

**مٹائی** ముటాయీ (హి-స్త్రీ) ముతకదనము; స్థౌల్యము, లావుబలుపు.

**مٹر** మటర్ (హి-స్త్రీ) బటానిగింజలు, బటానీలు, (ధాన్యము) **مٹرگشت** — గష్త్ (ఫా) పచారము, గాలికితిరుగాడుట, ద్రిమ్మరుగుట.

**مٹری – ڑی** ముట్‌రీ — డీ (హి-స్త్రీ) చిన్నమూట, ముల్లె, ముల్లియ.

**مٹک** మటక్ (హి-స్త్రీ) కటాక్షములు, హొయలు, ఒయారము, కులుకు, శృంగారచేష్టలు, విలాసములు, కుదిలిక,

**مٹکا** మట్కా (హి-పు) కడవ, పెద్దకుండ.

**مٹکانا** మట్కానా (హి) కులుకుట, ఒయారముగాజూచుట, హొయలుజూపుట; కటాక్షించుట, క్రేగంటజూచుట.

**مٹکینا** మట్‌కైనా (హి-పు) పిడత, మట్టికోర.

**مٹکی** మట్‌కీ (హి-స్త్రీ) చిన్నకుండ, చిన్నకడవ.

**مٹنا** మిట్నా (హి) మాయుట, తుడుచుకొనిపోవుట, నశించుట, చెడుట, తుడువబడుట, చెఱగుట, మాసిపోవుట, సంతుష్టియగుట, తీరుట, (ఆకలి, దప్పులు

మొ॥ ), తుదముట్టుట, ముగియుట; తీసి వేయబడుట, కొట్టివేయబడుట; మోహించుట, మిక్కిలి కష్టించుట, శ్రమపడుట. [ గుడి.

**مٹھ** మఠ్ (హి.పు) మఠము, ఆశ్రమము,

**مٹھ** ముఠ్ (హి.పు) ముష్టి-పిడికిలి; పట్టు-అధీనము, **مٹھ بھیڑ** —భేడ్ (ఉ) సమావేశము - సందర్శనము; ఒకరికొకరు కలియుట లేక ఎదురగుట - ఎదుర్కొలు, సంఘటనము; ముఖాముఖి, పోట్లాట, కొట్లాట, **مٹھ مرد** — మర్ద్ (హి) దొంగ-కూళ, కర్కశుడు.

**مٹھا** ముట్ఠా (హి.పు) ముష్టి - పిడికిలి; పెద్దముల్లె, మూట.

**مٹھا** మట్ఠా (హి.పు) మజ్జిగ, చల్ల; సోమరి -మందబుద్ధి, మొద్దు, జడుడు, మూర్ఖుడు

**مٹھاپن** మట్ఠాపన్ (హి పు) బుద్ధిమాంద్యము, జాడ్యము; సోమరితనము, మౌర్ఖ్యము, తెలివిమాలినతనము.

**مٹھارنا** మఠార్నా (హి) గుండ్రముగా జేయుట, గోళముగా జేయుట; మోహింపజేయుట, వలపించుట, వగలుజూపుట, కులుకుట, హొయలుజూపుట.

**مٹھاس** మిఠాస్ (హి-స్త్రీ) మాధుర్యము, తియ్యదనము, తీపు; ఒప్పిదము.

**مٹھائی** మిఠాయీ (హి-స్త్రీ) మాధుర్యము, తియ్యదనము, తీపు; తియ్యనితినుబండము, తీపిపస్తువులు; శర్కర, చక్కెర.

**مٹھر** మఠ్ఠర్ (హి.పు) మందబుద్ధి, మొద్దు, తెలివిమాలిన వాడు.

**مٹھو** మిట్ఠూ (హి-పు) చిలుకలకును చిన్నపిల్లలకును ముద్దుపేరు, చిలుక, శుకము.

**مٹھی** ముట్ఠీ (హి-స్త్రీ) ముష్టి, పిడికిలి; పిడికెడు; పట్టు, అధీనము, **مٹھی گرم کرنا** — గరమ్‌కర్నా (హి) లంచమిచ్చుట.

**مٹھی** మిట్ఠీ (హి-స్త్రీ) చుంబనము, ముద్దు, తీపుగలది, తియ్యనిది.

**مٹھیا** ముఠియా (హి-పు) పిడి. కత్తిలోనగువానిపరుజు, త్సరువు, చక్కెర మొదలగువానిగడ్డ లేక పెల్ల; చేతికఱ్ఱలోనగువానిబుడుపు లేక పట్టుకొనుచోటు, బుడిపి.

**مٹھیانا** ముఠ్యానా (హి) పట్టుకొనుట, పట్టుట.

**مٹی** మిట్టీ (హి-స్త్రీ) మృత్తిక, మన్ను, మట్టి; భూమి, పృథివి; దేహము-తనువు, కాయము, కండ; కళేబరము, శవము; ప్రపంచము, **مٹی پلید ہونا-خوار ہونا** — పలీద్‌హోనా - ఖ్వార్‌హోనా (ఉ) శవసంస్కారముచెడుట, దుర్గతియగుట, దురవస్థకువచ్చుట, పాడైపోవుట. **مٹی ٹھکانے لگنا** — ఠికానేలగ్నా (హి) శవసంస్కారమగుట, (పూడ్చుట లేక కాల్చుట) **مٹی دینا** — దేనా (హి) సమాధిలోపెట్టుట, పూడ్చుట. **مٹی ڈالنا** — డాల్నా (హి) మరుగుపరచుట, దాచుట, మాటుపెట్టుట. **مٹی کا پنجرا** — కాపింజరా (హి) దేహము, కళేబరము. **مٹی کا تیل** — కాతేల్ (హి) మట్టితైలము, మట్టినూనె **مٹی کرنا** — కర్నా (హి) మట్టిజేయుట, మురికిజేయుట; మంటగలుపుట, పాడుజేయుట **مٹی کے مول** — కే మోల్ (హి) మిక్కిలిచౌకగా, చాలఅగ్గువగా **مٹی میں ملنا** — మేమిల్నా

వృక్షము, ఫలవంతము, కొత్తగల్లది.

مثمن ముషమ్మన్ (అ) అష్టకోణము, అష్టభుజము, అష్టగుణము, ఎనిమిదంతలు.

مثنوی మస్నవీ (అ-స్త్రీ) రెండేసి చరణములకు అంత్యప్రాసముగలపద్యము లేక పద్యమాలిక, ద్విపద, (మాలిక.)

مثنیٰ ముసన్నా (అ) ప్రతి – రెండవప్రతి; మాఱు, సమానమైన, ఎత్తివ్రాసిన, చూచివ్రాసిన, రెండుమక్కాలయక్షరము.

مجادلہ ముజాదల (అ-పు) పోట్లాట, కొట్లాట, జగడము, యుద్ధము.

مجاریہ ముజారియ (అ) ఆచరణలోనున్నది, నడచుచున్నది, వాడుకలోనున్నది, చెల్లుబడిలోనున్న, చెల్లుచున్న; ప్రస్తుతపు, ఇప్పటి.

مجاز మజాజ్ (అ) ఔపచారికము, అలంకారికము; రూపకము (పు) అధికారము, యోగ్యత, అర్హత, శాస్త్రసమ్మతము, నియమానుసారము

مجازاً మజాజన్ (అ) ఔపచారికముగా, అలంకారికముగా, పోలికనుబట్టి – సామ్యమునుబట్టి; క్రమానుసారము, సక్రమముగా.

مجازی మజాజీ (అ) కృత్రిమము, ఔపచారికము, సాటువగునది కానిది. యథార్థము కానిది, మాయికము, అలంకారికము, వ్యవహారము, ప్రాకృతము, ప్రపంచము||, సామ్యసూచకము, పోలికనుబట్టి వచ్చినది, సామ్యమూలకము.

مجال మజాల్ (అ-స్త్రీ) అధికారము, సామర్థ్యము, అర్హత, యోగ్యత.

مجالس మజాలిస్ (అ-స్త్రీ) చూడుము, (ఏ. వ مجلس) సభలు.

مجامعت ముజామఅత్ (అ-స్త్రీ) సంభోగము, సంగమము.

مجاور ముజావిర్ (అ-పు) సమీపస్థము, పొరుగుననున్న, సన్నిధానమందున్నవాడు, మసీదుకనిపెట్టుకొనియుండువాడు, మసీదుసేవకుడు, మతసేవకుడు.

مجاوری ముజావిరీ (అ-స్త్రీ) సామీప్యము, సాన్నిధ్యము, పొరుగు, మసీదుకొలువు, మతసేవ.

مجاوز ముజావిజ్ (అ) మితిమీరినది, ఎక్కువగునది. దాటిపోవునది, ఉల్లంఘించునది, దాటినది.

مجاہد ముజాహిద్ (అ) యత్నించువాడు, కష్టపడువాడు, మతయుద్ధముజేయువాడు.

مجاہدہ ముజాహద (అ-పు) ప్రయత్నము, శ్రమ, మతయుద్ధము.

مجاہدین ముజాహిదీన్ (అ,పు) మతయోధులు, మతయుద్ధముజేయువారు.

مجبور మజ్బూర్ (అ) బలవంతపెట్టబడిన, నిరుపాయమైన, గతిమాలిన—అగత్యికమైన, దిక్కుమాలిన, విధిలేకయున్న.

مجبوراً మజ్బూరన్ (అ) బలవంతపెట్టబడి, విధిలేక, గతిమాలి, నిరుపాయమై, దిక్కుమాలి, బలాత్కారముగా.

مجبوری మజ్బూరీ (అ-స్త్రీ) బలవంతము, ఒత్తిడి, విధిలేమి, నిస్సహాయత, నిరుపాయత, గతిలేమి, దిక్కులేమి. బలాత్కారము.

مجتمع ముజ్తమఅ (అ) సముకూడిన, చేరిన, ఏకీభవించిన, సమావేశమైన, సమా

వేశితము.

**مجتہد** ముజ్తహిద్ (అ-పు) ధర్మశాస్త్ర పారంగతుడు, ధర్మవేది, పరిశ్రమజేయువాడు, ప్రయత్నశీలుడు.

**مجدا** మజ్దా (హి-పు) ఇసుకయు రేగటిమట్టియు కలిసియున్న భూమి.

**مجذوب** మజ్జూబ్ (అ) ఆకర్షితుడు, లాగబడినవాడు, నిమగ్నుడు, తదేకనిష్ఠ గలవాడు, ధ్యాననిమగ్నుడు, పరాయణుడు, ధ్యానపరవశుడు, తల్లీనమైయున్నవాడు, సమాధినిష్ఠుడు.

**مجذور** మజ్జూర్ (అ) వర్గ, ఒకసంఖ్యను అదే సంఖ్యతో గుణింపగా వచ్చినలబ్ధము.

**مجذوم** మజ్జూమ్ (అ) కుష్ఠరోగి, పెద్దరోగముగలవాడు.

**مجرا** ముజ్రా (అ-పు) తీసివేత, త్రోపుడు తగ్గింపు; వట్టము, తరుగు; కోత, కోసుకొనుట; తిరుగు, మాఱు, అచ్చుకోలు; జోహారు, దండము, నతి, వందనము; సందర్శనము, సమావేశము; గాయకసభ, గాయకసమావేశము; పాటకులపరీక్ష **مجرا کرنا** — కర్నా (ఉ) త్రోసివేయుట, చెల్లుపెట్టుకొనుట, తీసివేయుట, తిరిగియిచ్చుట; పాడుట, పాడించుట, వందనముజేయుట, జోహారుజేయుట.

**مجرائی** ముజ్రాయీ (అ-పు) త్రోసివేయుట, తగ్గింపు, త్రోపుడు: పన్నులు త్రోసివేయుట; పెచ్చు, వట్టము; వందనముజేయువాడు, వంది, పాటకుడు, మాగధుడు, జోహారుజేయువాడు.

**مجرب** ముజర్రబ్ (అ) అనుభవసిద్ధమైన, అమోఘమైన, తప్పని, పరీక్షితము, పరీక్షజేసిచూచినది, రూఢము.

**مجرد** ముజర్రద్ (అ) ఒంటరి, ఏకాకి; అవివాహితుడు, బ్రహ్మచారి, కేవలము—మాత్రము.

**مجرداً** ముజర్రదన్ (అ) ఒకటిగా, ఒంటరిగా, ఏకాకిగా, కేవలముగా,

**مجردی** ముజర్రదీ (అ-స్త్రీ) ఏకాకిత్వము, బ్రహ్మచర్యము, ఒంటరితనము.

**مجرم** ముజ్రిమ్ (అ-పు) అపరాధి, దోషి, నేరస్థుడు, **مجرم ٹھیرانا** — ఠైరానా (ఉ) దోషారోపణజేయుట, దోషియనినిర్ధారణజేయుట.

**مجروح** మజ్రూహ్ (అ) గాయపడిన, క్షతమైన, దెబ్బతగిలిన, **مجروح کرنا** — కర్నా (ఉ) గాయపరచుట.

**مجسم** ముజస్సమ్ (అ) శరీరముధరించిన, మూర్తీభవించిన, స్థూలరూపముదాల్చిన, ఆకృతిదాల్చిన, రూపమొందిన, జన్మమెత్తిన, స్థూలపదార్థము, స్థూలము, భూతము, వస్తువు.

**مجعد** ముజఉఅద్ (అ) ఉంగరములుతిరిగిన, (వెంట్రుకలు.)

**مجلا** ముజల్లా (అ) మెరుగుపెట్టిన, సానబట్టిన, శుభ్రపరచిన, మెరయుచున్న, ప్రకాశించు, కాంతిగల,

**مجلد** ముజల్లిద్ (అ-పు) పుస్తకములకు అట్టగట్టువాడు కవిలెకారుడు, కవిలెలుకట్టువాడు, అట్టరి (ముజల్లద్) అట్టగట్టిన, కవిలెకట్టిన, అట్టలువేసిన

**مجلس** మజ్లిస్ (అ) సభ, సమావేశము, సదస్సు, కూటము, సమితి. **مجلس خانہ** — ఖానా, (పా) సభామంటపము, సభాసద

నము, **مجلس کرنا** — కర్నా (ఉ) సభ జేయుట, షియామతస్థుల ఇమామ్ హుసేనును గ్గుర్తించునట్టి సమావేశము **مجلس**.

**مجلس رقص و سرود** — ఎ, రక్స్ఒసరోద్ (పా) ఆటపాటలసభ, గాయకసభ **میر مجلس** మీర్ మజ్లిస్ (పా) సభాధ్యక్షు డు, సభాపతి, **مجلس علمی** — ఎ ఇల్మీ (అ) పండితసభ.

**مجلسی** మజ్లిసీ (అ) సభాసదుడు, సభా సం॥, నాగరకమైన, సభ్యము.

**مجمد** ముజమ్మద్ (అ) పేరిన, గడ్డగట్టిన, ఘనీభూతము.

**مجمر** మజ్మర్ (అ-పు) ధూపపాత్ర, ధూ పపుకుంపటి.

**مجمع** మజ్మఉ (అ-పు) సమూహము, మొత్తము, కూడిక; గుంపు, జనసమావేశ ము, జనసమ్మర్దము; సమావేశస్థలము, స మావేశస్థానము, సభాస్థలి, **مجمع عام** —అమ్ (అ) సార్వజనికసమావేశము, ఉత్సవము, ఉత్సవస్థానము.

**مجمل** ముజ్మల్ (అ) సంక్షిప్తము, సంగ్ర హముగాజేయబడిన, క్లుప్తము, సమాహార ము; సమాహృతము, సారాంశము.

**مجملاً** ముజ్మలన్ (అ) సంగ్రహముగా, సంక్షేపముగా.

**مجموعہ** మజ్మూఆ (అ-పు) గుంపు, స మావేశము, సమూహము; కూడిక, మొ త్తము; గ్రంథము చేర్చిన, కూర్చిన, చేరి న, కూడిన **مجموعہ قوانین** —యెక్వా నీన్ (అ) శాసనావళి, శాసనసర్వస్వ ము, శాసనసంగ్రహము.

**مجموعی** మజ్మూఈ (అ) క్రోడీకరించి న, ఒకటిగా చేర్చియున్న, సగటు, మొత్త ము, అన్నియుచేరియున్న.

**مجنس** ముజన్నస్ (అ-పు) అశ్వతరము, కంచరగాడిద, సంకరజాతిజంతువు.

**مجنون** మజ్నూన్ (అ-పు) పిచ్చెత్తినవా డు, ఉన్మత్తుడు, పిశాచగ్రస్తుడు; మోహా రుడు, మోహాతిశయముచేపిచ్చెత్తినవాడు.

**مجنونیت** మజ్నూనియ్యత్ (అ-స్త్రీ) మోహోన్మాదము, పిచ్చితనము ఉన్మా దము.

**مجوزه** ముజవ్వజె (అ) ఉపపాదితమైన, ప్రతిపాదితమైన, నిర్ణయించిన, విధించిన, నియోజించిన, ఏర్పరచిన; సక్రమమైన, విధ్యుక్తమైన, శాసనబద్ధమైన.

**مجوس** మజూస్ (అ.పు) అగ్న్యుపాసకు లు, పారసీకులు.

**مجوسی** మజూసీ (అ.పు) అగ్న్యుపాసకు డు, జొరాస్ట్రియనుజాతివాడు.

**مجوف** ముజవ్వఫ్ (అ) బోలు, లోనశూ న్యముగానున్న, గుల్ల, బుఱ్ఱ, డొల్ల, బొం గుగానున్న, లొట్టగానున్న, పల్లముగల, వట్టి, ఉత్త.

**مجوب** ముజవ్వబ్ (అ) తుందిలుడు, పెద్ద పొట్టగలవాడు, బొజ్జవాడు, స్థూలకా యుడు.

**مجھ** ముఝ్ (హి) నా, నన్ను **مجھ میں** —మేఁ (హి) నాలో, నాయందు, **مجھکو** —కూ (హి) నన్ను, నాకు **مجھ سے** — సే (హి) నాతో, నానుండి, నాకంటె, నావలన, నాకు.

**مجھلا** మఝ్లా (హి) మధ్యమము, నడిమి; రెండవవాడు, నడిమివాడు.

**مجهود** మజ్హూద్ (అ) శ్రమపడిన, కష్ట పడిన, (పు) శ్రమ, కష్టము, ఆయాసము,

యత్నము, ప్రయత్నము.

**مجہول** మజ్హూల్ (అ) అజ్ఞాతము, తెలియనిది, ఎఱుగని; అజ్ఞాని, సోమరి, అలసుడు; కర్మార్థకము (వ్యా) **مجہول النسب** — ఉన్నసబ్ (అ) అజ్ఞాతపితరుడు, తల్లిదండ్రులు ఎవరో తెలియరాని వాడు, అజ్ఞాతవంశీయుడు, **مجہول مطلق** — ఎ, ముత్లక్ (అ) పట్టిసోమరి, బొత్తిగా పనికిమాలినవాడు, పట్టిసోమరిపోతు.

**مجہولی** మజ్హూలీ (అ-స్త్రీ) అజ్ఞానము, సోమరితనము, ఆలస్యము, జాడ్యము, తెలివిమాలినతనము.

**مجھے** ముఝే (హి) నన్ను, నాకు.

**مجیب** ముజీబ్ (అ) ఉత్తరమిచ్చినవాడు, ఒప్పుకొన్నవాడు, అనుమోదకుడు, విన్నవాడు, సరియనువాడు; ఈశ్వరుడు: పరేచనకారి, భేదిమందు.

**مجیت** మజీత్ (హి) ప్రాతది, పురాతనము వాడుకొనినది; తగ్గువెలది, చౌకది, వెలతక్కువది.

**مجیٹھ** మజీఠ్ (హి) తామ్రవల్లి, (వేరు), మంజిష్ఠము.

**مجید** మజీద్ (అ) పూజ్యము, పూజనీయము, గౌరవనీయము,

**مچا** ముచ్చా (హి-పు) మాంసఖండము (పెద్దది).

**مچان** మచాన్ (హి-పు) మంచియ, మంచె, ఉన్నతాసనము, అరుగు, ఎత్తైనచోటు; అటుక, అట్టుక.

**مچانا** మచానా (హి) కలిగించుట, వ్యాపింపజేయుట, రేపుట, కొల్పుట.

**مچکا** మచ్కా (హి-పు) వ్యాపారమాంద్యము, వేరముసన్నగిలుట.

**مچکانا** మిచ్కానా (హి) కండ్లార్చుట, వెంటవెంటరెప్పలార్చుట.

**مچکنا** మచక్నా (హి) త్రొక్కబడలుట లేక నొచ్చుట, కుక్కుమంచముత్రొక్కబడి కిఱ్ఱుకిఱ్ఱుమనుట.

**مچلا** మచ్లా [హి] చెప్పినమాటవినని, అవిధేయుడు. మారాముజేయు, హఠముజేయు, మొఱకు, లొంగనివాడు, సాహసుడు, ప్రమ్మరీడు.

**مچلانا** మిచ్లానా [హి] కడుపులోవికారపెట్టుట, తిప్పలుట, వాంతివచ్చినట్లుండుట, తెలియనట్లుసటించుట.

**مچلاپن - مچلائی** మచ్లాపన్ — మచ్లాయీ [హి-స్త్రీ] సాహసము, మొండితనము, మారాటము, మారాము.

**مچلکا** ముచల్కా [తు-పు] ఉత్తరవాదపత్రము, ఒడంబడిక.

**مچلنا** మచల్నా [హి] సాహసముజేయుట, మొండితనముజేయుట, మారాముజేయుట, క్రిందపడిపొర్లాడచేయుచుండుట.

**مچنا** మచ్నా [హి] వ్యాపించుట, రేగుట, పురకొలుపబడుట, కలుగుట, ప్రకటమగుట, ఘట్టించుట, మ్రోగుట, ప్రసిద్ధమగుట,

**مچنا** మిచ్నా (హి) మూయబడుట, మూసుకొనుట, మూతబడుట.

**مچنگ** ముచంగ్ [హి-స్త్రీ] యూనానుల సారంగి, వాద్యవిశేషము.

**مچھر** మచ్ఛర్ [హి-పు] మశకము, దోమ.

**مچھرنگا** మఛ్రంగా [హి-పు] లకుముకిపిట్ట, బుచ్చిగాడు [పక్షివిశేషము].

مچھلی - مچھلی - مچھری మచ్ఛీ- మఛ్లీ - మచ్ఛీ (హి-స్త్రీ) మత్స్యము, చేప, మీనము, مچھلی کا کانٹا — కాంటా [హి] చేపల గాలము, చేపలు పట్టుటకై ఎరను తగిలించి యుండు గాలము, مچھلی کا سریش — కా సిరేష్ [హి] చేపవజ్రము مچھلی کا تیل — కా తేల్ [హి] చేపనూనె.

مچھندر ముఛందర్ (హి-పు) విదూషకుడు, హాస్యగాడు, వికారస్వరూపముగలవాడు, మూఢుడు, మూర్ఖుడు, నవ్వులబండి.

مچھوا మఛ్వా [హి-పు] చేపలవాడు; చేపలమ్మువాడు.

مچھی మచ్ఛీ (హి-స్త్రీ) మత్స్యము, చేప ముద్దు-చుంబనము.

مچیا మచియా [హి-పు] మంచియ, మంచము, పీట.

مچیاو మచియావ్ (హి-పు) మకరందము, తేనె, మధువు.

محابا ముహాబా [అ-పు] మొగమోటము, దాక్షిణ్యము, అనుగ్రహము, పక్షపాతము, ఆదరము, భయము, గౌరవము.

محاذی ముహాజీ (అ) ఎదుట, ముఖాముఖి, ఎదురుగా, సరసన, సరిగా-అభిముఖముగా, సంకేలో, ఎదురులో.

محارب ముహారిబ్ (అ) యోధుడు, పోటరి, పోటుబంటు.

محاربہ ముహారిబ (అ) యుద్ధము, కొట్లాట, జగడము.

محاسب ముహాసిబ్ (అ-పు) గణకుడు, లెక్కలనాశు, కరణము, లెక్కలువ్రాయువాడు.

محاسبہ ముహాసిబ [అ-పు] లెక్కలపరీక్ష, లెక్కలుసరిజూచుట, లెక్కలతీర్మానము, లెక్కలపరిష్కారము, లెక్కపత్రములు.

محاسن ముహాసిన్ (అ.పు) అలంకారములు; గడ్డముమీసములు; సద్గుణములు; సత్కార్యములు.

محاش ముహాష్ (అ-పు) ద్రవ్యము, ఆస్తి, సొత్తు, సంపద, సామగ్రి.

محاصرہ ముహాసర (అ-పు) ముట్టడి, ముట్టడించుట, చుట్టుకొనుట, చుట్టవేసికొనియుండుట, పరివేష్టనము محاصرہ کرنا — కర్నా (ఉ) ముట్టడివేయుట, ముట్టడించుట, محاصرہ اٹھانا — ఉఠానా [ఉ] ముట్టడివదలుకొనుట, ముట్టడివిడుచుట.

محاصرین ముహాసిరీన్ (అ) ముట్టడించువారు,

محاصل ముహాసిల్ (అ-పు) ఆదాయము, రాబడి, పన్నులు, అయము, పంట, ఫలితము, లాభము, [ఏ.వ محصول].

محافظ ముహాఫిజ్ (అ-పు) రక్షకుడు, పాలకుడు, కాపరి, కావలికాడు, محافظ حقیقی — హఖీఖీ [అ] ఈశ్వరుడు.

محافظت ముహాఫిజత్ [అ-స్త్రీ] రక్షణ; సంరక్షణ, కాపుదల, కావలి; ఆధీనము, పాలన.

محافہ ముహాఫ (అ-పు) పల్లకి, పాలకి, డోలిక, అందలము.

محال మహాల్ (అ-పు) ప్రాంతము, మండలము; స్థిరాస్తి, భూములు; తేనెతెట్టె; తేనెపెర.

**محال** ముహాల్ (అ) అసాధ్యము, అసంభవము,

**محاورہ** ముహావర (అ.పు) దేశీయము, జాతీయము, సాంప్రదాయము, వాడుక, అభ్యాసము, అలవాటు **محاورہ پڑنا** — పడ్నా (ఉ) అలవాటుపడుట, వాడుకయగుట, భాషాసాంప్రదాయమగుట **بامحاورہ** — బా ముహావర (పా) భాషాసాంప్రదాయము, సాంప్రదాయసిద్ధము, సాంప్రదాయానుసారము, రూఢ్యనుసారము. **بے محاورہ** బే — (పా) సాంప్రదాయవిరుద్ధము, రూఢివిరుద్ధము.

**محب** ముహిబ్బ (అ.పు) మిత్రుడు, ప్రియుడు, ప్రేమించు వాడు, **محب الوطن** — ఉల్‌వతన్ (అ) దేశభక్తుడు.

**محبت** ముహబ్బత్ (అ.స్త్రీ) ప్రేమనలపు, మోహము, అపేక్ష, స్నేహము, మైత్రి, **محبت آمیز** — ఆమేజ్ (పా) ప్రేమాస్పదము, ప్రేమయుక్తము, **محبت کرنا** — కర్నా (ఉ) ప్రేమించుట.

**محبس** మహ్బస్ (అ.పు) చెఱసాల, కారాగృహము, బంధనాలయము, చెఱ.

**محبوب** మహ్బూబ్ (అ-పు) ప్రియుడు, మనోనాయకుడు, మిత్రము, **محبوب الٰہی** — ఇలాహీ (అ) ఈశ్వరప్రియుడు.

**محبوبہ** మహ్బూబ (అ-స్త్రీ) ప్రియురాలు, మనోనాయిక, వల్లభ, చెలి, సఖి, మిత్రము.

**محبوبی** మహ్బూబీ (అ-స్త్రీ) వల్లభత్వము, మనోహరత్వము; మనోజ్ఞత, రామణీయకము, ఒప్పిదము, సౌందర్యము.

**محبوس** మహ్బూస్ (అ-పు) కారాగృహవాసి, బందీ, చెఱలోనున్నవాడు, బద్ధుడు, **محبوس خانہ** — ఖానా (పా) కారాగృహము, చెఱసాల,

**محتاج** ముహ్తాజ్ (అ) బీద, పేద; బీదసాదలు, దరిద్రులు, అక్కరగలవారు, దీనులు, భిక్షుకుడు, బిచ్చగాడు, వికలాంగులు, **محتاج خانہ** — ఖానా (పా) దీనశరణాలయము, చైత్యకాలయము, భిక్షాలయము.

**محتاجی — محتاجگی** ముహ్తాజీ - ముహ్తాజగీ (అ-పా-స్త్రీ) దారిద్ర్యము దైన్యము, పేదరికము, బీదరికము.

**محتال** ముహ్తాల్ (అ-పు) మోసగాడు, వంచకుడు, జిత్తులమారి.

**محترم** ముహ్తరమ్ (అ) పూజ్యము, గౌరవనీయము, పూజనీయము.

**محتسب** ముహ్తసిబ్ (అ-పు) తూనికలు, ఎత్తులు, కొలతపాత్రలు సరిగనున్నవా లేవా అనిపరీక్షించువాడు, వ్యాపారపరీక్షకుడు, వాణిజ్యాధికారి, లెక్కచూచువాడు.

**محتشم** ముహ్తషమ్ (అ) పరివారబాహుళ్యముగల, సేవకసంపత్తిగలవాడు, సంపన్నుడు, సిరిసంపదలుగలవాడు, బలవంతుడు, గొప్పవాడు.

**محجوب** మహ్జూబ్ (అ) అచ్ఛాదితము, కప్పబడినది, మరుగుపడిన; లజ్జితుడైన, సిగ్గుపడిన, బిడియపడిన; బహిష్కృతమైన, తిరస్కృతమైన; ముసుగిడిన.

**محجوبی** మహ్జూబీ (అ-స్త్రీ) మరుగుపడియుండుట, చాటునఉండుట; సిగ్గరితనము, సంకోచము, బిడియము, అభిమానము.

**محظور** మహ్జూర్ (అ) నిషిద్ధము, నిరస్తము, కూడనిది.

**محدب** ముహద్దబ్ (అ) ఉబ్బుగల, వంపుగల, గోళాకారముగల, ఉబికియున్న, ఉబ్బియున్న, విలువంపుగానున్న.

**محدث** ముహద్దిస్ (అ-పు) ఐతిహాసికుడు, కథకుడు, ఇతిహాసమెరింగినవాడు.

**محدث** ముహ్దిస్ (అ-పు) నూతనకల్పనజేయువాడు, నూతనసృష్టిజేయువాడు, కల్పనాశక్తిగలవాడు: అపవిత్రుడు.

**محدود** మహ్దూద్ (అ) పరిమితము, మేరగలది, మితిగలది, ఎల్లలుగలది, ఇంత యనినిర్ణయించినది, నిర్ధారణచేయబడినది.

**محذوف** మహ్జూఫ్ (అ) లోపించిన, తీసివేయబడిన; లుప్తము, అధ్యాహారము; త్రోసివేయబడిన, కొట్టివేయబడిన;

**محراب** మిహ్రాబ్ (అ-స్త్రీ) విలువంపు, వంపు, ధనురాకారము, వంక, వంపు కట్టడము, గూడు, మసిదులోని పెద్దగూడు, నమాజేగూడు, **محرابِ تیغ**— ఎ-తేగ్ (పా) కత్తివంపు, ఖడ్గమువంపు, **محراب دار**—దార్ (పా) విలువంపులుగల, గూళ్లుగల, వంపుగల, ధనురాకారముగల.

**محراق** మిహ్రాఖ్ (అ-పు) దాహకము, తగులబెట్టునది, కాల్చునది.

**محرر** ముహర్రిర్ (అ-పు) లేఖకుడు, వ్రాయువాడు, రాయసగాడు.

**محرر** ముహర్రర్ (అ) లిఖితము, వ్రాయబడినది.

**محرری** ముహర్రిరీ (అ) లేఖరిపని, లేఖరి ఉద్యోగము; లేఖనము, వ్రాతపని, వ్రాతపనితనము.

**محرف** ముహర్రఫ్ (అ) క్రిందుమీదుచేయబడిన, మారిన, భ్రంశమొందిన, తిరిగిన, భ్రష్టము; కుటిలమైన, వంకరయైన; గ్రామ్యము.

**محرق** ముహ్రిక్ (అ) తగులబెట్టువాడు, కాల్చునది; కాలుచున్న, మండుచున్న, (జ్వరము.)

**محرک** ముహర్రిక్ (అ-పు) చలనముపుట్టించు, కదలించు, ఉపపాదించువాడు ప్రతిపాదించువాడు, ప్రేరకుడు, పురికొలుపువాడు, మొదలుపెట్టువాడు; నాయకుడు, మార్గదర్శి; సంచాలకము, ప్రేరకము; చురుకుపుట్టించునది; అచ్చు; అచ్చు గుర్తుతగిలించునది.

**محرم** ముహర్రమ్ (అ-పు) నిషిద్ధము, కూడనిది; మహమ్మదీయులచాంద్రమానవత్సరము యొక్క మొదటినెలపేరు, ఈ నెలలో అలీగారికొమారుడగు హాసనుగారు చచ్చుటవలన పవిత్రమాసమును, దుఃఖము, శోకము; పవిత్రము, పూజ్యము, గౌరవనీయము.

**محرم** మహ్రమ్ (అ) నిషిద్ధము, పనికిరానిది, కూడనిది; గుట్టుతెలిసినవాడు, రహస్యజ్ఞుడు, ఆప్తుడు, పరిచయముగలవాడు, నమ్మికస్థుడు; అంతఃపురములోచొరవగాతిరుగదగినవాడు, సమీపబంధువు; కంచుకము, రవిక.

**محروث** మహ్రూస్ (అ) దున్నబడిన, సేద్యము, చేయబడిన.

**محروس** మహ్రూస్ (అ) సురక్షితము.

**محروسہ** మహ్రూస (అ-పు) సురక్షితము, కాపాడబడినది; పరిపాలితము, పాలితము, పాలనలోనున్న, ఏలికలోనున్న, **محروسہ سرکار عالی** —యె

సర్కారె ఆలీ (అ) నిజాము ప్రభువుపాలనములోనున్న, మహాప్రభుపాలితము.

**محروق** మహరూక్ (అ) కాలిన, దగ్ధమైన.

**محروقہ** మహరూక్ (అ-పు) కాలిన; కట్టెలు, వంటచెఱకు, ఇంధనము.

**محروم** మహ్రూమ్ (అ) భ్రష్టుడు, బహిష్కృతుడు, తొలగింపబడినవాడు, త్రోసివేయబడిన, విరహితుడు, రహితుడు, చెడినవాడు. నిషిద్ధుడు, అర్హతతొలగింపబడినవాడు, వియోగుడు, దూరదృష్టుడు, నిర్భాగ్యుడు, **محروم کرنا** — కర్నా (ఉ) భ్రష్టునిజేయుట, అపహరించుట, తొలగించుట, **محروم ہونا** — హోనా (ఉ) భ్రష్టుడగుట, పాసిపోవుట, తొలగింపబడుట.

**محرومی** మహ్రూమీ (అ-స్త్రీ) భ్రష్టత, విరహితత్వము, బహిష్కారము, తొలగింపబడుట, నష్టము, త్రోసివేత, పాసిపోవుట, కోలుపాటు.

**محزون** మహ్జూన్ (అ) దుఃఖితుడు, ఆర్తుడు, చింతలోనున్న వాడు.

**محسن** ముహ్సిన్ (అ) ఉపకారముజేసినవాడు, ఉపకారి, మేలుచేసినవాడు, రక్షకుడు, సహాయుడు; మేలుచేయువాడు, ఉపకారముజేయువాడు, ఉదారుడు, ఉపకారబుద్ధిగలవాడు, **محسن کش** — కుష్ (పా) కృతఘ్నుడు, మేలుమరచువాడు. ఉపకారికిఅపకారము చేయువాడు **محسن کشی** — కుషీ (పా) కృతఘ్నత.

**محسوب** మహ్సూబ్ (అ) గణితము, లెక్కజేయబడినది, గణింపబడినది, లెక్కలోజేర్చబడినది, లెక్కవేయబడినది, గణనకువచ్చినది.

**محسوس** మహ్సూస్ (అ) ఇంద్రియగోచరమైన, గోచరించిన, గోచరమైన, అనిపించిన, తోచిన, అగపడినది, కనిపించిన, అనుభవమునకువచ్చినది, **محسوس کرنا** — కర్నా (ఉ) అనుభవమునకువచ్చుట, అనుభవమగుట, గోచరమగుట, మనస్కరించుట.

**محسوسات** మహ్సూసాత్ (అ-స్త్రీ) విషయములు, ఇంద్రియగోచరములగు వస్తువులు, పదార్థములు, భోగవిషయములు.

**محشر** మహ్షర్ (అ-పు) సభాస్థానము; అంత్యదినము; క్రైస్తవమహమ్మదీయమతముల ప్రకారముగ చచ్చినవారందరులేచి దేవునివద్దవిచారణకైనిలుచుండు దినము, పునరుత్థానదినము.

**محشور** మహ్షూర్ (అ) పునరుత్థితుడు, అంత్యదినమున విచారణకై మృత్యువు నుండి లేచినవాడు; గుంపుగూడిన.

**محشی** ముహష్ష (అ) వ్యాఖ్యాతము, అంచునటీకలువ్రాసియున్నది.

**محصل** ముహస్సిల్ (అ) పన్నులురాబట్టువాడు, తరవుకాడు, తరవుబంట్రౌతు.

**محصن** ముహ్సన్ (అ) సురక్షితము, రక్షితుడు, పత్నీకుడు, భార్యగలవాడు, పవిత్రుడు, బ్రహ్మచర్యము నడపువాడు.

**محصور** మహసూర్ (అ) ముట్టడింపబడిన, పరివేష్టింపబడిన, చుట్టుకొనబడిన; నిర్బంధింపబడిన, **محصور کرنا** — కర్నా (అ) ముట్టడించుట-నిర్బంధించుట, చుట్టుకొనుట.

محصول మహ్సూల్ (అ-పు) రాబడి, ఆదాయము, లాభము; పన్ను, కరము, కప్పము, సుంకము, అంచెకూలి محصول لگانا — లగానా (ఉ) పన్నుగట్టుట, పన్ను వేయుట.

محصولی మహ్సూలీ (అ) పన్నిచ్చేడు, పన్నువచ్చేడు, పన్నుకట్టేడు, పన్ను వేసిన, పన్నియ్యవలసిన, పన్ను చెల్లింపని

محض మహ్జ్ (అ) స్వచ్ఛము, కేవలము, తన్మాత్రము; బొత్తుగా, కేవలముగా, స్వచ్ఛముగా, శుద్ధముగా.

محضر మహ్జర్ (అ-స్త్రీ) సమక్షము, రాజసమక్షము, రాజసాన్నిధ్యము, సమావేశస్థలము; ప్రత్యక్షవిజ్ఞాపనము, ప్రజానంతి, పలువురుకలిసి చెప్పుకొనునది, అవసరప్రార్థన, సమిష్టివిజ్ఞాపనము.

محظور మహ్జూర్ (అ) నిషిద్ధము, కూడనిది, అక్రమము.

محظوظ మహ్జూజ్ (అ) సంతుష్టము, సంతసించిన, ఆనందమొందిన.

محفل మహ్ఫిల్ (అ-స్త్రీ) సమావేశము, సమాజము, సంఘము, సభ, వినోదసభ, ఆటపాటలసభ.

محفوظ మహ్ఫూజ్ (అ) సురక్షితము, పరిపాలితము, కాపాడబడినది, కంఠపాఠముచేసినది.

محقر ముహక్కిర్ (అ) తిరస్కృతము, నికృష్టము, అల్పము, తుచ్ఛము, గర్హితము, నీచము.

محقق ముహక్కక్ (అ) రూఢిపరుపబడిన, నిర్ధారణచేయబడిన, సిద్ధాంతముజేయబడిన, నిజముస్థాపింపబడిన, నిజము తెలిసిన, తత్త్వము తెలిసిన, రూఢీకృతము, దృఢీకృతము, సిద్ధాంతము, రాద్ధాంతము, యథార్థము.

محقق ముహక్కిక్ (అ-పు) తత్త్వజ్ఞుడు, తత్త్వము తెలిసినవాడు, తత్త్వము తెలిసికొనువాడు, సత్యము నెరిగినవాడు లేక యెరుగువాడు, యథార్థము తెలిసినవాడు.

محک మహక్ (అ-పు) ఒరగల్లు-నికషము, బంగారులోనగువాని వన్నెజూచెడు రాయి.

محکم ముహ్కమ్ (అ) దృఢము, బలిష్ఠము, దిట్టమైన, గట్టి.

محکمہ మహ్కమ (అ-పు) అధికారస్థానము, అధికారసభ, పరిపాలనస్థలము; పాలనశాఖ, దివాణశాఖ, రాజ్యాంగము, రాజ్యాంగశాఖ; సభ, కూటము, కొలువుకూటము, దివాణము.

محکوم మహ్కూమ్ (అ) అధికారముజేయబడిన, శాసింపబడిన, అధికారములోనున్న, లోపడియున్న, చేతిక్రిందనున్న; పరిపాలితము, పాలితము, పాలితుడు, తక్కువవాడు, సేవకుడు; ప్రజ.

محل మహల్ల్ (అ-పు) స్థానము, చోటు, సమయము, స్థితి; సందర్భము; రాజహర్మ్యము, రాజభవనము; రాణిఅంతఃపురము محل-خاص محل — ఎ, మహ్లె-ఖాస్ (అ) పట్టపురాణి محلسرا — సరా (అ-పు) అంతఃపురము. بے محل — బేమహల్ (పా) అప్రస్తుతము, అసంబద్ధము, بمحل బమహల్ (పా) సమయోచితము.

محلہ మహల్ల (అ-పు) వీధి, శ్రేణి, పేట, (ఊరిలోనిభాగము) محلدار — దార్ (పా) వీధిపెద్ద, వీధిశాలి, పేటపెద్ద, శ్రేణిశాలి.

محمل మహ్మిల్ (అ.పు) ఊత, ఆధారము;

ఒంటెమీద వేయుపల్లము, కొయ్యపల్లము, తొట్లె,

**محمود** మహ్మూద్ (అ) పొగడబడిన, పొగడదగిన, శ్లాఘ్యము.

**محمد** ముహమ్మద్ (అ) మిక్కిలిపొగడబడిన, పరమశ్లాఘ్యము, శ్లాఘితము; హజ్రతుమహమ్మదు.

**محمودہ** మహ్మూద (అ.పు) శకమూని యాపిసును.

**محمودی** మహ్మూదీ (అ. స్త్రీ) వలిపెము, సన్నబట్ట.

**محمولہ** మహ్మూల (అ) భారము, బరువు; బరువువేయుబడినది; అర్థవంతము, ప్రయోగార్హ్యము, ప్రయోగింపదగినది.

**محنت** మిహ్నత్ (అ. స్త్రీ) ప్రయత్నము, పరిశ్రమ, పాటు, కష్టము, అభ్యాసము, శ్రమ, **محنت سرا** — సరా (అ) కర్మభూమి, కష్టముచేయవలసినచోటు, **محنت اٹھانا** — ఉఠానా (ఉ) కష్టపడుట, శ్రమజేయుట, శ్రమపడుట, **محنت کرنا** — కర్నా (ఉ) కష్టముజేయుట, కష్టించుట **محنت مزدوری** — మజ్దూరీ (స్త్రీ) కూలినాలి, పాటు, **محنت کش** — కష్ (పా) కష్టజీవి, కష్టపడువాడు.

**محنتانہ** మెహ్నతాన (పా.పు) వేతనము, కూలి, జీతము, ప్రతిఫలము.

**محنتی** మెహ్నతీ (అ) కష్టపడు, శ్రమజేయు, పాటుపడు, కష్టించువాడు.

**محو** మహ్వ్ (అ) నశించిన, లేకుండజేసిన, రూపుమాసిన, మాపిన, కొట్టివేయబడిన, తీసివేయబడిన, తుడుపుబడిన, నాశమైన; మోహపడిన, మోహితమైన, మోహవశమైన; పరవశమైన, నిమగ్నమైన, మునిగియున్న; తదేకధ్యానములోనున్న; తన్మయము, తల్లీనము, అదృశ్యము, మాయము, **محو ہونا** — హోనా (ఉ) తల్లీనమగుట, నశించుట, తన్మయుమగుట, మాయమగుట, మోహపరవశమగుట; నిమగ్నమగుట, తదేకనిష్ఠలోనుండుట.

**محور** మిహ్వర్ (అ.పు) ఇరుసు, అక్షము, అక్షరేఖ.

**محوط** ముహవ్వత (పు) ఆవరణము, ఆవృతము, చుట్టుకొనబడినది, ఆవరింపబడినచోటు, చుట్టునుకంచెగాని గోడగాని పెట్టినది.

**محیط** ముహీత్ (అ.పు) ఆవరణము, ఆవరించునది, చుట్టుకొనునది, వలయము, చుట్టు, చుట్టుకొలత; పరిధి, వృత్తము, **محیط ہونا** — హోనా (ఉ) ఆవరించుట, చుట్టుకొనుట.

**محیل** ముహీల్ (అ.పు) వంచకుడు, మోసగాడు, నెపగాండ్రి.

**مخادم** మఖాదిమ్ (అ.పు) సేవకులు, పరిచారకులు.

**مخادیم** మఖాదీమ్ (అ.పు) సేవితులు, ప్రభువులు, యజమానులు. (ఏ.వ. مخدوم)

**مخارج** మఖారిజ్ (అ.పు) వెలుపలికిపోవుమార్గము లేక కాలువ; ప్రయములు, వ్యయములు, పంపకములు (ఏ.వ. مخرج)

**مخاصمت** ముఖాసమత్ (అ. స్త్రీ) పరస్పరవిరోధము, పరస్పరద్వేషము, ఒకరికొకరికిగలపగ—, వివాదము, జగడము.

**مخاطب** ముఖాతిబ్ (అ.పు) అభిముఖుడై పలుకువాడు, అభిముఖుడు, ఎదురుగమాట్లాడువాడు; పిలుచువాడు **مخاطب ہونا** — హోనా (ఉ) అభిముఖమగుట, అభిముఖమై మాట్లాడుట, పిలిచిమాట్లాడు

**مخاطب** ముఖాతబ్ (అ.పు) మధ్యమపురుషము, ఎదుటనున్నవాడు, ఎదిరిగా ట్లాడింపబడినవాడు.

**مخاطبات** ముఖాతబాత్ (అ. స్త్రీ) సంభాషణములు, మాటముచ్చటలు, పత్ర వ్యవహారములు.

**مخاطره** ముఖాతర (అ.పు) భయము; అపాయము.

**مخافات** ముఖాఫాత్ (అ స్త్రీ) భయములు, అపాయములు (ఏ. వ مخافت)

**مخالطت** ముఖాలతత్ (అ. స్త్రీ) కలిసి మెలిసియుండుట, కలిపిగోలుతినను.

**مخالف** ముఖాలిఫ్ (అ.పు) పగవాడు, శత్రువు, విరోధి; ప్రతికక్షి, విరుద్ధము; ప్రతికూలము.

**مخالفت** ముఖాలఫత్ (అ. స్త్రీ) విరోధము, పగ, శత్రుత్వము, ద్వేషము, స్పర్ధ, వైరుధ్యము-ప్రాతికూల్యము

**مخبر** ముఖ్బిర్ (అ పు) వార్తాహరుడు: వార్తావహుడు, వృత్తాంతము, చెప్పువాడు, దూత, ప్రకటించువాడు; చారుడు, గూఢచారుడు, వేగులవాడు, **مخبر صادق** —ఏ- సాదిఖ్ (అ) సత్యదూత, ఇది మహమ్మదుగారి బిరుదనామము.

**مخبری** ముఖ్బరీ (అ. స్త్రీ) వార్తావహనము, గూఢచారము, వేగులు, గుట్టుచెలుపుట, రహస్యనివేదము, **مخبری کرنا** —కర్నా (ఉ) వార్త దెలుపుట, రహస్యనివేదనము, వేగుజెప్పుట. గుట్టు దెలుపుట.

**مخبط** ముఖబ్బత్ (అ) ఉన్మత్తుడు, వెఱ్ఱివాడు **مخبط الحواس** —ఉల్ హవాస్ (అ) మనోవైకల్యముగలవాడు-మతిచెడినవాడు, పిచ్చివాడు.

**مخبوط** మఖ్బూత్ (అ) మతిచెడిన, పిచ్చి, వెఱ్ఱిగల **مخبوط الحواس** — ఉల్ హవాస్ (అ) మనోవైకల్యముగలవాడు, వికలమనస్కుడు, పిచ్చివాడు, వెఱ్ఱిబాగులవాడు.

**مختار** ముఖ్తార్ (అ) ఏర్పరించిన, నిర్దిష్టమైన, ఏర్పరచిన: స్వేచ్ఛగల, స్వాతంత్ర్యముగల; అధికారముగల, యోగ్యతగల, (పు) నిర్దిష్టుడు, కార్యదర్శి, ప్రతినిధి, సర్వాధికారి, స్వతంత్రాధికారి, **مختار نامه** — నామ (పా) అధికారపత్రము **مختار عام** — ఎ ఆమ్ (అ) సర్వాధికారి, సర్వస్వతంత్రుడు.

**مختاری** ముఖ్తారీ (అ.స్త్రీ) స్వాతంత్ర్యము, సర్వాధికారము, సర్వస్వాతంత్ర్యము; ప్రాతినిధ్యము, కార్యదర్శిత్వము

**مخترع** ముఖ్తరిఉ (అ) నూతనసృష్టిచేయువాడు, క్రొత్తగా కల్పించువాడు; కారకుడు, స్రష్ట, సృష్టికర్త, ఆరంభకుడు, మొదలుపెట్టినవాడు.

**مختص** ముఖ్తస్స్ (అ) ప్రత్యేకింపబడినది, నిర్దిష్టము, విశిష్టము, ప్రత్యేకము, అసాధారణము; స్వాయత్తము, సొంతము.

**مختصر** ముఖ్తసర్ (అ) సంక్షిప్తము, సమాహృతము, క్లుప్తము, చిన్నది, స్వల్పము.

**مختصراً** ముఖ్తసరన్ (అ) సంక్షేపముగా, సంగ్రహముగా, క్లుప్తముగా.

**مختفی** ముఖ్తఫీ (అ) గూఢము, గుప్తము, దాచబడినది.

**مختل** ముఖ్తల్ (అ) కలవరపడిన, భంగపడిన, భ్రమపడిన, బక్కపడిన, సన్నగిలిన, భ్రష్టము, చెడిన.

**مختلط** ముఖ్తలిత్ (అ) సమ్మిళితమైన

కలిసిపోయిన, గజిబిజియైన, గంద్రగోళ మైన, కలవరమైన.

**مختلف** ముఖ్‌తలిఫ్ (అ) విరుద్ధమైన, భిన్నమైన, వేరైన; వేర్వేరు, పలువిధము లైన, నానావిధములైన, వివిధములు.

**مختم** ముఖ్‌తమ్ (అ) సమాప్తము, ముగింపబడిన; ముద్రితము, ముద్ర వేయబడిన, మూసివేయబడిన, కట్టివేయబడిన.

**مختومی شکر** మఖ్‌తూమీ షకర్ (పా.పు) ఎఱ్ఱచక్కెర, దేశపుచక్కెఱ, ఎఱ్ఱపంచదార.

**مخجل** ముఖ్జిల్ (అ) సిగ్గుపడిన, కలవరపడిన.

**مخدر** ముఖద్దర్ (అ) గుప్తము, ముసుగుపరుపబడినది; మత్తుగొనిన-మందగించిన.

**مخدرات** ముఖద్దిరాత్ (అ. స్త్రీ) సుషుప్తికారకము, మత్తుగలుగజేయునవి, గుప్తవిషయములు.

**مخدوش** మఖ్దోష్ (అ) అపాయకరమైన, భయప్రదముగానున్న, శిథిలమైయున్న.

**مخدوم** మఖ్దూమ్ (అ.పు) సేవితుడు, సేవింపబడినవాడు, యజమాని ప్రభువు, పూజ్యుడు.

**مخدومہ** మఖ్దూమ (అ.స్త్రీ) సేవితురాలు, యజమానురాలు.

**مخرج** మఖ్‌రజ్ [అ] ఉత్పత్తి స్థానము, మూలము, ఆరంభము, వెడలుచోటు; ద్వారము; వ్యయము, వ్రయము, ఉచ్చారస్థానము, ఉచ్చారణ, ఉచ్చారము; మరుగుదొడ్డి.

**مخروط** మఖ్‌రూత్ [అ] మొదటలావుగా నుండి క్రమముగా సన్నగిల్లినయాకారముగల, అధోకగానున్న-కూచియాకారముగల; చెక్కిన, తరిమెనబట్టిన.

**مخزن** మఖ్‌జన్ [అ.పు] భాండాగారము. భండారము, కొటారము, ఉగ్రాణము; కొట్టుఱము; బొక్కసము, నిధి, కోశము, కోశాగారము **مخزن العلوم** — ఉలూమ్ [అ] విద్యాసర్వస్వము.

**مخصوص** మఖ్‌సూస్ [అ] ప్రత్యేకింపబడిన, ఎర్పరింపబడిన, ప్రత్యేకమైన: నిర్దిష్టమైన, విశేషమైన, విశిష్టము, అసాధారణము, స్వంతము, సొంతము, **مخصوص کرنا** — కర్నా [ఉ] ప్రత్యేకించుట, నిర్దిష్టముజేయుట, ఎర్పరించుట, వేరుపరచుట.

**مخطط** ముఖత్తత్ [అ] గీతలుగల, గీతలుగీయబడిన, రేఖలుగల; నూనూగుమీసాలుగల, నూనూగుగడ్డముగల, క్రొత్తగ మొలచినగడ్డము మీసముగల.

**مخطوب** మఖ్‌తూబ్ [అ] వివాహానిశ్చయమైన, మనువుకుదిరిన, వివాహనిశ్చితార్థమైన.

**مخفف** ముఖఫ్ఫఫ్ [అ] సంగ్రహముచేయబడిన, సంక్షిప్తము. తగ్గించిన, చిన్నగా చేయబడిన, క్లుప్తము, సంకుచితము; చిన్నబుచ్చిన, తేలికపరచిన; లఘురూపము, లఘ్వీకరణము, సంగ్రహరూపము.

**مخفی** మఖ్ఫీ [అ] అజ్ఞాతము, తెలియనిది, గుప్తము, రహస్యము, అంతరంగికము, గోప్యముగానున్నది.

**مخل** ముఖిల్ [అ] భంగముజేయునది, కలతపెట్టునది; భంగకరము, నిరోధకము, ఆటంకముగలుగజేయునది.

**مخلا-مخلی** ముఖల్లా [అ] విముక్తము, విడుదలజేయబడిన, రిక్తము, వట్టిది, ఉత్తదిగాజేయబడినది, విడిచినది.

مخلد ముఖ్లద్ [అ] శాశ్వతము, స్థిరము

مخلص ముఖ్లిస్ [అ] నిర్మలము, స్వచ్ఛము, నిష్కపటము, విశ్వాసముగాని, ఒంటరి, విడి; నిజమైన, యథార్థమైన, సన్నిహితము.

مخلص ముఖ్లస్ [అ] శరణాలయము, శరణము.

مخلصانہ ముఖ్లిసాన [అ] స్నేహపూర్వకముగా, నిష్కపటముగా, యథార్థముగా.

مخلصی ముఖ్లిసీ [అ స్త్రీ] విముక్తి, విడుదల, విమోచనము.

مخلع ముఖ్లఅ [అ] కౌనుకనుసులుధరించిన, కట్నములుకట్టుకొనిన; పక్షవాతముగొట్టిన.

مخلوط ముఖ్లూత్ [అ] కలిసిన, మిళితమైన, మిశ్రితము, సమ్మిళితము.

مخلوق ముఖ్లూఖ్ [అ] సృజింపబడిన, పుట్టింపబడిన. సృష్టము, భూతములు, ప్రాణులు; ప్రజ, జనము; సృష్టి, ప్రపంచము

مخلوقات ముఖ్లూఖాత్ [అ. స్త్రీ] సృజింపబడినవస్తువులు, సృష్టి, సృష్టిభూతములు.

مخمر ముఖ్మ్మర్ [అ. పు] పులియబెట్టినది, పులిసినది.

مخمس ముఖ్మ్మస్ (అ. పు) పంచకోణము; పంచపాదము, (అయిదుచరణముల పద్యము;) ఒకతాళభేదము, పంచకము, అయిదింటినికూడిక.

مخمصہ ముఖ్మసా-మఖ్మసా (అ. పు) ఆకలిగొనుట; అతిదుఃఖము, సంకటము, తంటాలు, చిక్కు-బాధ.

مخمل ముఖ్మల్ (అ. పు) ఒకవిధమైన పట్టుబట్ట, నూగుపట్టుబట్ట.

مخمور మఖ్మూర్ (అ) మత్తుగొనిన, మైమరచిన, ఒడలుతెలియని.

مخنث ముఖన్నస్ (అ. పు) ఆడపోబిల్లవాడు, నపుంసకుడు, ఊబివాడు; పుంసత్వముపోగొట్టబడినవాడు, ఎగ్గడి.

مخنوق మఖ్నూఖ్ (అ) గొంతుపిసికిన; ఉరివేసిన, ఊపిరాడకుండజేసిన,

مخوف ముఖవ్వఫ్ (అ) భయపడిన, భీతిల్లిన.

مخیر ముఖయ్యర్ (అ) ఉదారగుణముగల, త్యాగశీలముగల, దానశీలుడైన, ఉపకారస్వభావముగల, మేలుజేసెడు.

مخیلہ ముఖయ్యల (అ. పు) ఆలోచనశక్తి; ఊహాశక్తి, భావనాశక్తి, కల్పనాశక్తి, అనుమానము.

مد మద్ (అ. స్త్రీ) విశాలముజేయుట, పొడిగించుట; అడ్డగీత, రేఖ; దీర్ఘసంజ్ఞ. ఆకారసంజ్ఞ (అలీఫ్‌మీదనుండు (~) ఇట్టిసంజ్ఞ; లెక్కలోనిఅడ్డగీత, కర్తము; శీర్షిక; అంశము, విషయము; అధ్యాయము; సముద్రజలోత్పన్నము, సముద్రముపోటు, సముద్రపునీరుఎక్కుట, مد و جزر మద్ వ జజర్ — ఒజజేర్ (అ) ఆటుపోటు (సముద్రమందు) مد ظلہ العالی మద్దజిల్లహుల్ ఆలీ(అ) مد نظر-نگاہ మద్ నజర్-నిగాహ్ (పా) దృష్టిప్రసారము, దృష్టిపాటు, దృష్టికెదురు, దృష్టిలోనున్న, అగపడుచున్న; ఉద్దేశము, అభీష్టము, ప్రియము.

مد మద్ (హి. పు) సారాయి, మద్యము: మదము; గర్వము.

مداح మద్దాహ్ (అ. పు) స్తోత్రముజేయువాడు, స్తుతిపాఠకుడు, భట్రాజు.

مداحی మద్దాహీ (అ. స్త్రీ) స్తోత్రము స్తుతి.

مداخل మదాఖిల్ (అ. పు) ఆదాయము. రాబడి, పన్నులు,

**مداخلت** మదాఖలత్ (అ.స్త్రీ) ప్రవేశనము, ప్రవేశము, అక్రమణము; జోక్యము; చొరవ, బలవంతముగా ప్రవేశించుట, చొరబడుట, చొచ్చుట, అటంకపెట్టుట **بیجا مداخلت** — బేజా (పా) అక్రమప్రవేశము.

**مدار** మదార్ (అ.పు) ప్రదక్షిణము, చుట్టుదిరుగుచోటు, సంచారమార్గము, గ్రహాదులుతిరుగుమార్గము; పరిధి వలయము, వృత్తము; అధారము; స్థానము; స్థాయి; శేంద్రము (హి.పు) జిల్లేడుచెట్టు.

**مدارات — مدارا** మదారా (పు) ముదారాత్ (అ.స్త్రీ) ఆదరము, సత్కారము, మన్ననా, ఆదరసత్కారము, మర్యాదలు.

**مدارج** మదారిజ్ (అ.పు) అంతస్థులు, మెట్లు, స్థానములు, తారతమ్యములు.

**مدارس** మదారిస్ (అ.పు) పాఠశాలలు, బడులు, విద్యాలయములు.

**مداری** మదారీ (హి.పు) గారడీడు, గారడివాడు, విప్రవినోది; కోతులాడించువాడు **مداری حقا** — హుక్కా (ఉ) పొడుగాటిపాళిముగల, గుడుగుడీ.

**مدافعت** ముదాఫఅత్ (అ.స్త్రీ) నివారణము, పరిహారము, తొలగించుట. నివారించుట, స్వసంరక్షణము.

**مدام** ముదామ్ (అ) శాశ్వతము, స్థిరము, ఎడతెగకుండ, శాశ్వతముగా.

**مدامی** ముదామీ (అ) శాశ్వతమైన, స్థిరమైన.

**مداومت** ముదావమత్ (అ.స్త్రీ) శాశ్వతత్వము, స్థిరత్వము, ఎడతెగమి, స్థిరత, అవినాశిత్వము.

**مدائح** మదాయిహ్ (అ.పు) స్తోత్రములు. స్తోత్రపాత్రములు, సత్కార్యములు.

**مدبر** ముదబ్బిర్ (అ.పు) మంత్రి, రాజ్యతంత్రజ్ఞుడు, ఉపాయశాలి, నేర్పరి, తంత్రజ్ఞుడు, ఆలోచనపరుడు.

**مدت** ముద్దత్ (అ.స్త్రీ) దీర్ఘకాలము, వ్యవధి, మధ్యకాలము, కాలము, అవకాశము, కాలవ్యవధి **مدت العمر** — ఉల్ఉమ్ర్ (అ) యావజ్జీవము **کا مدت** — కా (ఉ) చిరకాలమునాటిది **مدت مدید** — మదీద్ (అ) చిరకాలము-దీర్ఘకాలము **مدت ہوئی** — హుయీ (ఉ) చిరకాలముక్రింద, చాలకాలమైనది, **ایک مدت** ఏక్ (ఉ) చిరకాలము.

**مدح** మద్హ్ (అ.స్త్రీ) స్తోత్రము, స్తుతి, వర్ణనము **مدح خوان** — ఖ్వాఁ (పా) స్తోత్రపాఠకుడు, బట్టువాడు, స్తోత్రపాఠకుడు.

**مدخل** ముద్ఖల (అ) ప్రవేశపెట్టబడిన, చేర్పబడిన; కవిలలోచేర్పబడిన, సంచికలోచేర్చబడిన; ఇచ్చిన, వ్రాసిన, వేసిన, ఉంచిన, సమర్పించిన; చొనిపిన, చొప్పించిన; అదాయమురాబడి.

**مدخول** మద్ఖూల్ (అ) ప్రవేశపెట్టబడిన, చొనిపిన, చొప్పించిన, చేర్చిన.

**مدخولہ** మద్ఖూల (అ.స్త్రీ) ఉంపుడుగత్తె, ఉపపత్ని.

**مدد** మదద్ (అ.స్త్రీ) సహాయము, ఉపబలము, ఉపకారము, సహాయసంపత్తి, **مددگار** — గార్ (పా) సహాయుడు, సహాయపడువాడు, సహాయకారి **مددگاری** — గారీ (పా) సహాయపడుట, సహాయముగానుండుట, సహాయకత్వము, సహాయకారిత్వము.

**مدرا** ముద్రా (హి.స్త్రీ) ముద్ర, ముద్రణము, అచ్చు; జోగివాండ్రచెవిపోగులు,

కుండలములు:

**مدرات** ముదిర్రాత్ (అ.పు) మూత్రము ధారాళముగావచ్చునట్లుజేయు ఔషధము.

**مدرس** ముదర్రిస్ (అ.పు) ఉపాధ్యాయుడు ఒజ్జ, పాఠముజెప్పువాడు, పంతులు, ఉపన్యాసకుడు, వక్త, ప్రవక్త.

**مدرس** ముదర్రస్ (అ పు) విద్యార్థి, శిష్యుడు.

**مدرسه** మద్రస (అ.పు) పాఠశాల, బడి, సోపాల, పల్లెకూటము, విద్యాలయము.

**مدرسه ابتدائی** — యే ఇబ్తిదాయీ (అ.) ప్రాథమిక పాఠశాల **مدرسه فوقانیه** — యే ఫౌక్వానియ (అ) ఉన్నత పాఠశాల **مدرسه تحتانیه** — యె తహ్తానియ (అ) ప్రాథమిక పాఠశాల **مدرسه وسطانیه** — యె వసతానియ (అ) మాధ్యమిక పాఠశాల **مدرسة العلوم** — తుల్ ఉలూమ్ (అ) కళాశాల.

**مدرسی** ముదర్రిసీ (అ. స్త్రీ) ఉపాధ్యాయత్వము, ఒజ్జతనము, పంతులుపని

**مدرک** ము్రిక్ (అ) గ్రహణశక్తిగల, తెలివిగల, ఆలోచనపరుడు, మేధావి, జ్ఞానశక్తిగల.

**مدرکه** ము్రిక (అ పు) గ్రహణశక్తి, తెలివి జ్ఞానము, మేధ, బుద్ధిసూక్ష్మత.

**مدعا** ముద్దఆ (అ.పు) ఉద్దేశము, అభిప్రాయము; కోరిక, అభిలాష **مدعا علیه** — అలైహి (అ.పు) ప్రతివాది.

**مدعی** ముద్దఈ (అ పు) వాది, వ్యాజ్యము వేసినవాడు, అభియోగము తెచ్చినవాడు

**مدعیه** ముద్దఇయ (అ. స్త్రీ) వ్యాజ్యకర్త్రి. అభియోగము తెచ్చినయాడుది.

**مدغم** ముద్గిమ (అ) ద్విత్వము, సంశ్లేషము.

**مدفن** మద్ఫన్ (అ.పు) సమాధిస్థలము శవమునుపూడ్చినచోటు, పాతిపెట్టినచోటు, పాతఱ, బొంద.

**مدفون** మద్ఫూన్ (అ) పూడ్చిన, పాతిపెట్టిన, పాతఱపెట్టిన.

**مدقق** ముదక్కిక్ (అ) సూక్ష్మదృష్టిగల, సూక్ష్మదర్శి, కుశాగ్రబుద్ధిగలవాడు, సూక్ష్మపరీక్షకుడు, విమర్శకుడు.

**مدقوق** మద్కూక్ (అ) సున్నితము, కృశింపచేయబడిన; క్షయరోగి.

**مدک** మదక్ (హి. స్త్రీ) తమలపాకులును నల్లమందునుకలిపి దంచి చేసినమాత్రలు, (దీ పాగ్రాగుసురు).

**مدلل** ముదల్లల్ (అ) సిద్ధాంతీకరింపబడిన, రాద్ధాంతతము, కారణములుచూపిస్థాపింపబడిన.

**مدماتی** మద్మాంతీ (హి. స్త్రీ) చూడు **مدن مست**

**مدمغ** ముదమ్మగ్ (అ) గర్వి, గర్వపోతు; అహంకారముగలవాడు.

**مدن مست** మదన్‌మస్త్ (హి) మదనకామాక్షిపువ్వు, ఫలసంపెంగచెట్టు, సకలఫలసంపెంగ, మనోరంజితము,

**مدور** ముదవ్వర్ (అ) వలయితము, వృత్తాకారము, వలయాకారముగల, గుండ్రని, గోళాకారమైన, తిరిగెడు, మరలమరల కలిగెడు.

**مده** మధ్ (హి.పు) మధువు, తేనె; మద్యము, సారాయి; మదము; మత్తు.

**مدهم** మద్ధమ్ (హి) మధ్యమము, నడిమి; సామాన్యమైన, మందమైన, తక్కువైన, తగ్గిన, దుర్బలమైన **مدهم لچها** — బేచ్ఛా (హి) తక్కువవెలకమ్మకట.

**مدهوش** మద్‌హోష్ (అ) మత్తుగొనిన,

యముపొందుట, లాభముగడించుట, ఎ క్కువధరకుఅమ్ముట.

**مرات** మిరాత్ (అ.స్త్రీ) అద్దము దర్పణ ము.

**مراتب-مراتبات** మరాతిబ్ — అత్ (అ.స్త్రీ) అంతస్థులు, సంగతులు, మెట్లు, పదవులు; సంగతులు, విషయము, పర్యాయములు, దశలు; తడవలు, తేప లు; అంగములు, తదంగములు, కార్య ములు, పనులు **مراتب ابتدائی** — ఇబ్‌తిదాయీ (అ) ఆరంభచర్య, ఉపక్ర మచర్య, ప్రారంభచర్య, ప్రారంభప ర్యాయములు, ఆరంభక్రమము.

**مراجعت** మురాజఅత్ (అ.స్త్రీ) మళ్లుడ ల, మరలుపాటు, తిరుగుడల, క్రమ్మఱి పాటు, మళ్లుట, వెనుకకుతిరుగుట, మర లమరలచేయుట **مراجعت ہونا-کرنا** — హోనా, కర్నా (క్రి) క్రమ్మరుట, మరలుట, వెనుకకువచ్చుట,మరలివచ్చుట.

**مراحل** మరాహిల్ (అ.పు) అంతస్థులు, బసలు, దిగుచోటులు, దశలు, పర్యాయ ములు,ప్రక్రియలు, మెట్లు (ఏ.వ **مرحلہ**)

**مراحم** మరాహిమ్ (అ.పు) అనుగ్రహము లు, కటాక్షములు, ఉపకారములు, (ఏ వ **مرحمت**).

**مراد** మురాద్ (అ.స్త్రీ) ఉద్దేశము, అభి ప్రాయము, భావము, ఆధారము, తా త్పర్యము; అభిలాష, కోరిక; వరము, మొక్కు **مراد بر آنا-پانا** — బరానా పానా (క్రి) కోరికఈడేరుట, ఉద్దేశ ము నెరవేరుట, వరముదొరకుట **مراد مانگنا** — మాంగ్నా (క్రి) మొక్కు కొనుట, వరముకోరుకొనుట **مرادوں کے** మురాదూంకేదిన్ (క్రి) యౌ

వనప్రాయము.

**مرادف** ముతరాదిఫ్ (అ) ఏకార్థము, ప ర్యాయపదము.

**مرادی** మురాదీ (అ) ఇష్టానుసారము, అభిప్రేతము, అనుకూలము, భావితము, అభిప్రాయముగల, భావముగల; ఔప చారికము, గౌణము, అలంకారికము. (స్త్రీ) చిల్లర, అణాలుపైసాలు.

**مراسل** ముతాసిల్ (అ.స్త్రీ) పిక్కటయం దురోమములు మిక్కిలిగాగల(స్త్రీ), కం డవముగనివివాహమాడుటకై పత్రవ్యవహా రముచేయుచున్నయాడుది.

**مراسلات** ముతాసలాత్ (అ.పు) పత్రము లు, లేఖలు, పత్రవ్యవహారములు, ఉత్తర పత్రములు.

**مراسلت** మురాసలత్ (అ.స్త్రీ) పత్రవ్య వహారము, ఉత్తరప్రత్యుత్తరములు.

**مراسلہ** ముతాసల (అ.పు) పత్రము, లేఖ.

**مراسم** మరాసిమ్ (అ.పు) ఆచారములు, వాడుకలు, నడవడులు, నడతలు, విధులు, నియమములు, చట్టములు, ఒడంబడికలు, పద్ధతులు, నడవడికలు.

**مراعات** మురాఆత్ (అ.స్త్రీ) లక్ష్యము అనుగ్రహము, అనుగ్రహదృష్టి, కటాక్ష ములు; ఆదరము; పాలనము, పోషణము.

**مرافعہ** మురాఫఅ (అ.పు) పునర్విచారణ కోరుట, పునర్విచారణకుపెట్టుట.

**مراقبہ** మురాకబ (అ.పు) భగవధ్ధ్యాన ము, ధ్యానము, నిష్ఠ, తదేకనిష్ఠ, యోగ ము, సమాధి, అనుసంధానము **مراقبہ میں جانا** — మేజానా (క్రి) సమాధి లోనుండుట,భగవధ్ధ్యానములోనుండుట.

**مرائی** ముతాయీ (హి.పు) కూరగాయల

మరల్చిన, మరలివచ్చిన, వెనుకకు తెచ్చిన.

**مرجوعہ** మర్జూఅ (అ) త్రేబడినవాడు; మరల్పబడినవాడు, తిరిగివచ్చినవారు, వచ్చినవారు

**مرجھانا** ముర్ఝానా (హి) వాడిపోవుట, కృశించుట, శుష్కించుట, చిన్నబోవుట, శోషిల్లుట, మూర్ఛిల్లుట.

**مرچ** మిర్చ్ (హి. స్త్రీ) మిరపకాయలు, మరీచము, మిరియాలు, తీక్ష్ణమైన, చురుకైన, గాటుగల, కారముగల **کالی مرچ** కాలీమిర్చ్ (హి) మిరియాలు, **لال مرچ** లాల్ మిర్చ్ (హి) మిరపకాయలు. **مرچیں لگنا** మిర్చేఁలగ్నా (హి) ఆగ్రహము, వచ్చుట, ఒడలుమండుట, మిక్కిలితప్పుగాదోచుట.

**مرچنگ** ముర్చంగ్ (హి. స్త్రీ) నోటిసారంగి, ఒకచిన్న వాద్యము.

**مرحبا** మర్హబా (అ) స్వాగతము, సుస్వాగతము; మేలు, భళీ, బాగుబాగు.

**مرحلہ** మర్హల (అ.పు) ఒకప్రయాణము, ఒకఅంతస్తు, ఒకమెట్టు, ఒకఘట్టము, ఒకనాటిప్రయాణము; ఘట్టము, బస, దిగుచోటు. సత్రము; కోటపైపిరంగిపెట్టికాల్చుచోటు, పిరంగిదిబ్బ, గిడి, బురుజు.

**مرحمت** మర్హమత్ (అ. స్త్రీ) అనుగ్రహము, కరుణ, దయ, కటాక్షము, ప్రసాదము, బహుమానము.

**مرحوم** మర్హూమ్ (అ) స్వర్గస్థుడు, స్వర్గవాసి, పరలోకవాసి, మృతుడు, చచ్చినవాడు,

**مرخص** మురఖ్ఖస్ (అ) సెలవుపొందిన, సెలవుపుచ్చుకొనిన, వీడ్కొనిన **مرخص ہونا** — హోనా (ఉ) శెలవుపుచ్చుకొనుట, వీడ్కొనుట, పోవుట.

**مرد** మర్ద్ (పా.పు) మగవాడు, పురుషుడు, వీరుడు; భర్త, మగడు.

**مردار** ముర్దార్ (పా) చచ్చిన, మృతము; శవము, మృతకళేబరము, అపవిత్రము, దూషితము, పనికిరానిది.

**مردار سنگ** ముర్దార్‌సంగ్ (పా.పు) వెండిలోనిమురికి, వెండిమష్టు; ముదారుసింగము అనుమందు.

**مردانگی** మర్దానగీ (పా. స్త్రీ) పౌరుషము, శౌర్యము, మగటిమి, మగతనము.

**مردانہ — نی** మర్దాన (పా) పురుషయోగ్యమైన, మగవానికితగిన, పౌరుషయుక్తము, వీరయోగ్యము, మగటిమికితగిన,

**مردانہ بھیس** మర్దానా — భేస్ (పా) పురుషవేషము, మగవేషము.

**مردود** మర్దూద్ (అ) త్రోసివేయబడిన, మరల్పబడిన, తిరిగిన, మారిన, కలవరపడిన, భ్రాంతిపడిన, వెనకముందాడు, చపలచిత్తముగల, నష్టమైన, భ్రష్టమైన.

**مردک** మర్దక్ (పా.పు) కొంచపాటివాడు, అల్పుడు, నీచుడు.

**مردم** మర్దుమ్ (పా.పు) పురుషుడు, మనుష్యుడు; కంటిపాప, నల్లగుడ్డు **مردم آزار** — ఆజార్ (పా) ప్రజాహింసకుడు, జనులనుపీడించువాడు, నరపీడకుడు,

**مردم خوار** మర్దుమ్ — ఖార్ (పా) మానవాదనుడు, మానిసితిండి, నరభక్షకుడు,

**مردم شماری** మర్దుమ్ — షుమారీ (పా) జనసంఖ్య, ప్రజాగణనము. జనులనులెక్కించుట.

**مردمک** మర్దుమక్ (పా.పు) కనుపాప, కంటిపాప, చిన్నమనుష్యుడు.

**مردمی** మర్దుమీ (పా. స్త్రీ) మగతనము,

మగటిమి, పురుషత్వము, పౌరుషము.

**مردنگ** మిర్దంగ్ (హి. స్త్రీ) మృదంగము, మద్దెల.

**مردنگیا - مردنگی** మిర్దంగీ-మిర్దంగి యా (హి. పు) మార్దంగికుడు, మద్దెలవాయించువాడు.

**مردنیا** మర్దనియా (హి పు) నలుగుబెట్టువాడు, నలుగుపూయువాడు.

**مردنی** ముర్దనీ (పా స్త్రీ) ప్రేతకళ, పాడుపడినట్లుండుట; మరణము; దుఃఖము, విషాదము; శూన్యము, పాడు.

**مردوا** మర్దువా (పా పు) నీచుడు, అల్పుడు, మనిషివాడు.

**مردود** మర్దూద్ (అ) మరలగొట్టబడిన, త్రిప్పివేయబడిన, నిషిద్ధమైన, బహిష్కృతము, తిరస్కృతము, అపవిత్రుడు, పనికిమాలినవాడు, భ్రష్టుడు.

**مردہ** ముర్దా (పా) మృతుడు, చచ్చిన: ప్రేతము, శవము, దుఃఖితము, భగ్నము.

**مردہ دل** — దిల్. (పా). విరుత్సాహుడు.

**مردہا** మిర్దహా (పా. పు) ఊరిపెద్ద, పెద్ద, తలమానిసి, పైవిచారణజేయువాడు, కూలికాడు, గొలుసుపట్టువాడు, కాలిబంటు.

**مردی** మర్దీ (పా స్త్రీ) మగతనము, పౌరుషము, శౌర్యము, మగటిమి.

**مرز** మర్జ్ (పా. పు) సేద్యపుభూమి, క్షేత్రము చేనిగట్టు, పొలిమేర, సీమ, ఎల్ల; మండలము, ప్రాంతము, దేశము **مرز بان** — బాన్ (పా) క్షేత్రపాలుడు, ప్రాంతాధికారి **مرز و کشور** — ఒ, కిష్వర్ (పా) రాజ్యము.

**مرزا** మిర్జా (పా. పు) ప్రభువు, దొర; రాజకుమారుడు; మొగలులగౌరవనామము, పారసీకులగౌరవనామము, కోమలస్వభావముగల, సుకుమారమైన, పనికిమాలిన, **مرزا پھویا - یا** — ఫోయా, యా (పు) సుకుమారుడు, దుర్బలుడు, **مرزا مزاج** — మిజాజ్ (పా) కోమలస్వభావముగల, నీలుగుబోతు.

**مرزائی** మిర్జాయీ (పా. స్త్రీ) గొప్పతనము, ప్రభుత్వము, అధికారము; అహంకారము, గర్వము, పెద్దతనము, పొట్టిచొక్కాయి.

**مرزئی** మిర్జియీ (పా. స్త్రీ) పొడుగు చేతులపొట్టిచొక్కాయ, బొంతచొక్కాయ, బొంతకూసము.

**مرسل** ముర్సల్ (అ. పు) పంపబడినవాడు, దూత; రాయబారి, సమాచారము తెచ్చువాడు, లేక గొనిపోవువాడు, దేవదూత, మతాచార్యుడు, ప్రేషితుడు.

**مرسل** ముర్సిల్ (అ పు) పం ) డు షకుడు.

**مرسلہ** ముర్సల (అ. పు) ప్రేషితము, పంపబడినది; పత్రము, లేఖ, ఉత్తరము, లంబితము, హారము, దండ

**مرسوم** మర్సూమ్ (అ) ముద్రితము, చిహ్నితము, గుర్తింపబడినది: విధింపబడిన నియమింపబడిన, శాస్త్రోక్తము, విధ్యుక్తము, అనుష్ఠితము, ఆచారమైనది, ...డుకొనది; జీతము, వేతనము, ... వేతనము, మాసికవేతనము,

**مرشد** ముర్షద్-ముర్షిద్ (అ. పు) మార్గదర్శకుడు, బోధకుడు, మతాచార్యుడు, గురువు, పెద్ద; సమర్థుడు, జితేంద్రియమారి.

**مرشدی** ముర్షిదీ (అ. స్త్రీ) మార్గదర్శిత్వము బోధకత్వము, ఉపదేశము.

గురచోటు, సమాప్తి, గోరి.

**مرقع** ముర క్క (అ) పీలికలబొంత, కుట్లబొంత, కంథ; పటము. చిత్రము; చిత్రసంపుటము, బొమ్మలపుస్తకము; అద్వితీయము, శ్రేష్ఠము; సంపుటము, గ్రంథము.

**مرقوم - مہ** మర్ఖూమ్-మ (అ) లిఖితము, వ్రాసినది **مرقوم الحاشیہ** — ఉల్ హాషియ (అ) పార్శ్వలిఖితము, ప్రక్కన వ్రాసినది.

**مرکانا** ముర్కానా (హి) విరుమట, త్రుంచుట, మెలిబెట్టుట, నలుముట.

**مرکب** మురక్కబ్ (అ.పు) మిశ్రితము, మిళితము, కలిపియున్నది, మిశ్రము, మిశ్రముఖు, సమ్మిశ్రితము; మిశ్రవస్తువు.

**مرکب** మర్కబ్ (అ.పు) వాహనము, మోసుకొనిపోవునది, ఎక్కునది; పడవ, పల్లము, ఒంటె మొ॥

**مرکز** మర్కజ్ (అ.పు) కేంద్రము నాభి, నడిమిచోటు; నిలుచుచోటు, కూడలి; అక్షరములతలకట్టుగీత ( ک، گ మొ॥ వానికి, పైనదుండుగీత.)

**مرکنا** మురక్నా (హి) మెలిబడుట, నలుముడుబడుట, విరుగుట, తునుగుట; సిగ్గుపడుట.

**مرکھنڈا** మర్ఖండా (హి.పు) గోడ్డ, గోడబొడ్డు, ఆడ్డుకీటు, బావి మొ॥ వానిపిల్ల గోడ.

**مرکی** ముర్కీ (హి.స్త్రీ) చెవిపోగు.

**مرگ** మిర్గ్ (హి.పు) మృగము, లేడి; మృగశిరనక్షత్రము, మృగశిరకార్తె (ప్రవేశము) **مرگ لگنا** — లగ్నా (హి) మృగశిరాప్రవేశమగుట; వానకాలమారంభమగుట.

**مرگ** మర్గ్ (పా.స్త్రీ) మరణము, చావు **مرگ مفاجات - ناگہانی** — ఎ, ముఫాజాత్-నాగహానీ (పా) ఆకస్మికమరణము, అకాలమరణము, ఆరాత్తుగాచచ్చుట. **مرگ موش** — ఎ, మూష్ (పా) ఉల్లిపాషాణము, ఎలుకపాషాణము, **مرگ طبعی** — ఎ, తబయీ (పా) సహజమరణము, స్వాభావికమరణము, కాలమరణము.

**مرگھٹ** మర్ఘట్ (హి.పు) శ్మశానము, కాడు.

**مرگی** మిర్గీ (హి.స్త్రీ) మూర్ఛ. కాకిసామ్మ, సొమ్మ.

**مرلی** ముర్లీ (హి.స్త్రీ) మురళి, పిల్లనగ్రోవి, **مرلی دھر** — ధర్ (హి.పు) మురళీధరుడు, కృష్ణుడు.

**مرم** మరమ్ (హి.పు) మర్మము, రహస్యము; అర్థము, ఆశాంశము, (ముగమ) గుళికరాయి, గులకరాళ్లు.

**مرمت** మరమ్మత్ (అ.స్త్రీ) సవరణ, చక్కజేయుట, సవరించుట, దిద్దుట, సవరణ, దిద్దుబాటు, సవరింపు, సవరణము, **مرمت طلب** — తలబ్ (అ) సవరణార్థము, సవరణయోగ్యము, చక్కజేయవలసినది.

**مرمر** మర్మర్ (యు.పు) చాపరాయి.

**مرمرا** ముర్మురా (హి.పు) వేపుడుబియ్యము, బొంగుపేలాలు, బొరుగులు.

**مرمرانا** ముర్మురానా (హి) బొరుగుబొరుగులాడుట, కలకలలాడుట.

**مرن** మరన్ (హి.పు) మరణము, చచ్చుట, నాశము

**مرنا** మర్నా (హి) మరణించుట, చచ్చుట, **بن آئے مرنا** బిన్ ఆయేమర్నా

(హి) బలవంతముగాచచ్చుట, అకాలమరణమునొందుట.

**مرواريد** మర్వారీద్ (పా.పు) మౌక్తికము, ముత్యము, **مرواريد ناسفتہ** — నాసుఫ్త (పా) బెజ్జమువేయనిముత్యము. తొలవనిముత్యము.

**مروت** మురవ్వత్ (అ.స్త్రీ) పౌరుషము, సాహసము; మర్యాద, ఆదరము, దాక్షిణ్యము, మొగమోటము, అనుగ్రహము, కటాక్షము, పక్షపాతము, ఉపకారము, ఉదారభావము, సభ్యత, సత్ప్రవృత్తి.

**مروج - ج** మురవ్వజ్-జ (అ) ఆచరణలోనున్న, వాడుకలోనున్న, చెల్లుబడిలోనున్న, చెల్లుచున్న, సాంప్రదాయసిద్ధము, వ్యాప్తిలోనున్న. జరుగుచున్న, వర్తమానము, సాధారణము.

**مرور** మరూర్ (అ) జరిగిపోవుట, గతించుట, దాటుట, నడచుట, క్రమణము.

**مرور - ڑ** మరోర్-డ్ (హి.స్త్రీ) మెలి, మెలిక, మెలిబెట్టుట, మెలికబడుట, నులిబెట్టుట, వడిబెట్టుట, వడి. పెన, పిరి; గర్వము; నీటు, **مروڑ باز** — బాజ్ (ఉ) నీలుగుబోతు, గర్వబోతు.

**مروڑا** మరోడా (హి.పు) కడుపులోనులిపెట్టుట, నులినొప్పి, కడుపులోమెలిపెట్టుట.

**مروڑی** మరోడీ (హి.స్త్రీ) పిండినలిచిన తాలిక, నలుగుబెట్టి నలిచినతాలిక, మట్టతాలిక.

**مروڑنا** మరోడ్నా (హి) మెలిపెట్టుట, వడిబెట్టుట, నులిపెట్టుట.

**مرها** ముర్హా (హి.పు) తల్లిదండ్రులులేనివాడు, దిక్కుమాలినవాడు, పోకిరి.

**مرهٹی** మర్హాటీ (హి.స్త్రీ) మహారాష్ట్రభాష, ఆరెభాష; దోపిడి, దాడి, సాహసము.

**مرهم** మర్హమ్ (పా.స్త్రీ) లేపనము, పూతమందు, మందు, **مرهم پٹی کرنا** — పట్టీకర్నా (ఉ) చికిత్సజేయుట.

**مرهون** మర్హూన్ (అ) తాకట్టుపెట్టిన, కుదువబెట్టిన **مرهون منت** — ఏ. మిన్నత్ (అ) కృతజ్ఞతాబద్ధుడు, ఉపకారబద్ధుడు.

**مریخ** మిర్రీఖ్ (అ.పు) మంగళగ్రహము, అంగారకుడు.

**مری** మరీ (హి. స్త్రీ) మారి, రోగవిశేషము.

**مریٹها** మరైఠా (హి.పు) చుట్టినది, తలగుడ్డ, పాగ, శిరోవేష్టము.

**مرید** మురీద్ (అ.పు) సంకల్పముగలవాడు, ఇచ్ఛగలవాడు, ముముక్షువు, జిజ్ఞాసువు, శిష్యుడు, భక్తుడు.

**مرید** మరీద్ (అ) అవిధేయుడు, మొుండు, మూర్ఖుడు, తెగినవాడు, తిరుగబడువాడు, అవినీతుడు, దుర్మార్గుడు.

**مریدی** మురీదీ (అ.స్త్రీ) శిష్యత్వము.

**مریض** మరీజ్ (అ.పు) రోగి, వ్యాధిగ్రస్తుడు.

**مریل** మర్యల్ (హి) చావసిద్ధముగానున్న బలహీనము, బక్కని, కృశించుచున్న. బక్కచిక్కిన.

**مریلا** మురేలా, మరేలా (హి.పు) నెమలి, మయూరము, నెమలిపిల్ల.

**مریم** మర్యమ్ (అ.స్త్రీ) మేరికన్య, మేరిదేవి (ఏసుక్రీస్తుగారితల్లిగారు)

**مڑک** ముడక్ (హి.స్త్రీ) మెలి, మెలిక; వంక, భంగము, విరుగుట: కిటుకు; యుక్తి, ఉపాయము, తంత్రము, కుయుక్తి.

**مڑنا** ముడ్నా (హి) మరలుట, తిరుగుట,

క్రమ్మరుట, వెనుకకుతిరుగుట, మెలికపడుట, మెలితిరుగుట, వంగుట తిరిగిపోవుట; వడిబడుట, ముడుతబడుట, మడతపడుట.

**مڑھنا** మఢ్నా (హి) తోలుతొడుగుట, తోలుకప్పుగావేసికుట్టుట, పొదువుట. పొదుగుట, కప్పుగావేయుట.

**مڑھی** మఢీ (హి. స్త్రీ) గుడిసె, మందిరము, కుటీరము.

**مزا** మజా (పా. పు) రుచి, స్వాదు, రసము, సారస్యము, ఆనందము, భోగము, అనుభవము, సుఖము. వినోదము, వేడుక. **بدمزا** బద్‌మజా (పా) రుచిహీనము, అరోచకము, **مزا لوٹنا** — లూట్నా (ఉ) భోగముచూరగొనుట, అనుభవము చూరగొనుట, **مزادار** — దార్ (పా) రుచిరము, రుచ్యము, సారస్యముగలది, రుచికరము.

**مزاج** మిజాజ్ (అ. పు) స్వభావము, ప్రకృతి, గుణము, నైజము, గర్వము. అహంకారము, అగ్రహము. **مزاجدان** — దాఁ (పా) స్వభావజ్ఞుడు, మానవస్వభావము గ్రహించినవాడు **مزاج بگڑنا** — బిగడ్నా (ఉ) ప్రకృతిచెడుట, అగ్రహముపచ్చుట, **مزاج پانا** — పానా ప్రకృతినితెలిసికొనుట, సమయముజూచుట, ప్రకృతి అనుకూలముగానున్నదని తెలియుట, **مزاج پوچھنا** — పూఛ్నా (ఉ) కుశలమడుగుట, క్షేమమువిచారించుట, ఆరోగ్యస్థితివిచారించుట, **مزاجدار** — దార్ (పా) గర్వపోతు, కులుకుపోతు **مزاجداری کرنا** — దారీ కర్నా (ఉ) స్వభావస్థితిననుసరించివర్తించుట, అనుసరించుట, ముఖప్రీతిమాటలాడుచుండుట **مزاج شریف** — ఎషరీఫ్ (అ) దేవరప్రకృతి (కుశలమా), దేవరవారిప్రకృతి (ఆరోగ్యమా) **مزاج کرنا** — కర్నా (ఉ) గర్వముజూపుట, పెద్దరికముజూపుట, అధికారముజూపుట, అగ్రహపడుట, **مزاج میں آنا** — మేఁ ఆనా (ఉ) అనుకూలస్వభావముజూపుట గర్వముజూపుట, పెద్దరికముజూపుట. **خوش مزاج** ఖుష్ — (పా) సంతోషస్వభావముగలవాడు, వేడుకస్వభావముగలవాడు, **تیزمزاج** తేజ్‌మిజాజ్ (పా) తీక్ష్ణస్వభావముగలవాడు, **تیز مزاجی** తేజ్‌మిజాజీ (పా) తీక్ష్ణస్వభావము, పరుషస్వభావము, దుడుకుదనము, **بد مزاج** బద్‌మిజాజ్ (పా) దుష్టస్వభావముగలవాడు కోపిష్ఠి **نیک مزاج** నేక్‌మిజాజ్ (పా) సత్స్వభావముగలవాడు, సాధుస్వభావముగలవాడు,

**مزاجی** మిజాజీ (అ) స్వాభావికము, నైజము, సహజము; గర్వపోతు.

**مزاح** ముజాహ్ (అ. పు) పరిహాసము, హాస్యము, వినోదము, వేడుక, సరసము,

**مزاحم** ముజాహిమ్ (అ. పు) అటంకపరచునది, ఇబ్బందిపెట్టునది, నిరోధకము, నిరోధము, అడ్డు, అటంకము.

**مزاخ** మజాఖ్ (అ పు) పరిహాసము, ఎకసక్కెము, ఎగతాళి, హాస్యము, వినోదము, వేడుక.

**مزار** మజార్ (అ. పు) యాత్రస్థానము, సమాధి, గోరీ.

**مزارع** ముజారిఅ (అ. పు) కాపుదనము జేయువాడు, కాపు, కృషీవలుడు, సేద్యగాడు.

**مزامیر** మజామీర్ (అ. పు) వాద్యములు,

పాటలు, భజన, ప్రార్థన.

**مزاولت** ముజావలత్ (అ.స్త్రీ) చిత్త, కోరిక, యత్నము, పరిశ్రమ, పట్టుదల, నిష్ఠ, చొరవ, ప్రవేశము, అభ్యాసము.

**مزبل — لہ** మజ్బల్-ల (అ. పు) మలకూపము, చెత్తగుంట, పెంటప్రోగు.

**مزبور** మజ్బూర్ (అ) లిఖితము, పైన వ్రాసినది, పూర్వలిఖితము.

**مزخرف** ముజ్ఖ్రఫ్ (అ) అలంకృతము, పైపూతగలది, సత్యమునుబోలిన యబద్ధము, కపటపుమాట, కల్ల, అబద్ధము.

**مزخرفات** ముజ్ఖ్రఫాత్ (అ.స్త్రీ) అసత్యములు, కల్లలు, అవివేకపుమాటలు, కల్లవెల్లిమాటలు, పనికిమాలినమాటలు.

**مزد** ముజ్ద్ (పా.స్త్రీ) బహుమానము, వేతనము, ప్రతిఫలము, కూలి, నష్టపరిహారము.

**مزدور** మజ్దూర్ (పా.పు) వైతనికుడు, వేతనమువాడు, వేతనదారుడు, కూలివాడు, పనివాడు, ఊడిగముజేయువాడు.

**مزدوری** మజ్దూరీ (పా.స్త్రీ) వేతనము, కూలి; కూలిపని, కొలువు.

**مزرع** మజ్రఅ (అ.పు) సేద్యపుభూమి, పొలము, పంటభూమి, విత్తనభూమి.

**مزرعہ** మజ్రఅ (అ.పు) క్షేత్రము, పొలము; పల్లె, పల్లెటూరు.

**مزروع — ع** మజ్రూఅ, మజ్రూఅ (అ.పు) విత్తినభూమి, సేద్యముజేసినభూమి, సాగుబడినేల, పంటభూమి, పైరుభూమి, పైరుగలభూమి.

**مزمار** మిజ్మార్ (అ.స్త్రీ) వేణువు, పిల్లనగ్రోవి, వాద్యము.

**مزمن** ముజ్మిన్ (అ) పురాతనము, చిరకాలపు, పురాణము, (వ్యాధి).

**مزمور** మజ్మూర్ (అ.స్త్రీ) భజన, స్తోత్రము, గీతము.

**مزود** మిజ్వద్ (అ.పు) ప్రయాణికునిబత్తెపుసంచి, బుత్తిసంచి, సామగ్రిసంచి.

**مزور** మజూర్ (ఉ.పు) చూడు **مزدور**

**مزور** ముజవ్విర్ (అ) కల్లరి, వంచకుడు, మోసగాడు.

**مزہ** మజా (పా.పు) రుచి, స్వాదు, స్వారస్యము.

**مزید** మజీద్ (అ) ఆధిక్యము, వృద్ధి, అధికము, ఎక్కువ.

**مزیر** మజీర్ (అ) దృఢమనస్కుడు, గుండె నిబ్బరముగలవాడు; ధీరుడు, సాహసుడు, నిర్భయుడు; గట్టి, దృఢము.

**مزین** ముజయ్యన్ (అ) అలంకరింపబడిన, అలంకృతము, శృంగారింపబడిన, మండితము.

**مژدہ** ముష్దా (పా.పు) శుభవార్త, సంతోషవార్త.

**مژگان** మిష్గాన్ (పా.స్త్రీ) కనురెప్ప, కనురెప్ప వెంట్రుకలు.

**مس** మిస్ (పా.పు) రాగి, తామ్రము.

**مس** మస్స (అ.పు) స్పర్శము, స్పర్శశక్తి, తాకుట **مس کرنا** — కర్నా (క్రి) స్పృశించుట, తాకుట.

**مس** మిస్ (హి.పు) నెపము, మిష, టక్కు, కృత్రిమము.

**مس** మిస్ (ఇం.స్త్రీ) కన్య, అవివాహిత.

**مسا** మసా (అ.స్త్రీ) సాయంకాలము, సంధ్యాకాలము.

**مسا** మస్సా (హి.పు) పులిపిరి, పులిపిరికాయ.

**مسا** మిస్సా (హి) కదాన్నము, చిల్లరధాన్యము, బీదవారితిండి.

**مساجد** మసాజిద్ (అ) చూడు, (ఏ. వ మస్జిదు)

**مساح** మస్సాహ్ (అ. పు) భూమికొలుచువాడు, క్షేత్రగణితజ్ఞుడు.

**مساحت** మసాహత్ (అ. స్త్రీ) భూమి కొలత, క్షేత్రగణితము.

**مساس** మసాస్ (అ పు) స్పర్శనము, తాకుట; నిమురుట, పిసుకుట, ఒత్తుట, రుద్దుట, రాచుట; సంభోగము. సంగమము.

**مساعد** ముసాయిద్ (అ) సహాయకారి, తోడ్పడునది, సహాయకరము.

**مساعدت** ముసాఅదత్ (అ. స్త్రీ) సహాయము, తోడ్పాటు, సహకారము.

**مسافت** మసాఫత్ (అ. స్త్రీ) దూరము, ప్రయాణము, శ్రమ, అలసట.

**مسافر** ముసాఫిర్ (అ. పు) ప్రయాణికుడు, యాత్రికుడు, పరదేశస్థుడు, పరదేశి, పరిచయములేనివాడు; ఆగంతుకుడు, అభ్యాగతుడు, **مسافر نوازی** — నవాజీ (పా. స్త్రీ) ప్రయాణికులసత్కారము; ఆగంతుకసత్కారము, అతిథిసత్కారము, **مسافر خانہ** — ఖానా (పా. పు) సత్రము, ధర్మశాల, ప్రయాణికులు దిగుచోటు.

**مسافرانہ** ముసాఫిరానా (పా) ప్రయాణికులవలె, ప్రయాణికులకుతగిన, ప్రయాణయోగ్యము, ప్రయాణికయోగ్యము.

**مسافرت - مسافری** ముసాఫిరత్ - ముసాఫిరీ. (అ. పా. స్త్రీ) ప్రయాణము, యాత్ర, సంచారము.

**مساکت** మసాకత్ (అ. స్త్రీ) లోభము, పిసినిగొట్టుతనము, పిసినారితనము, లుబ్ధత్వము.

**مسالا** మసాలా (అ. పు) తోయములు, సామగ్రి, సంభారము, కావలిసినవస్తువులు, పరికరము, వస్తుసంభారము, వస్తుసామగ్రి; సంభారపుపొడి; సరిగపని, కుట్టుపని, పనితనము.

**مسام** మసామ్మ్ (అ. పు) రోమకూపములు; దేహమునుండి చెమ్మట కారుసూక్ష్మరంధ్రములు.

**مسامحہ** ముసామహా (అ. పు) ఉదారభావముజూపు, అనుగ్రహము, అసడ్డ, నిర్లక్ష్యము, చూచిచూడనట్లుండుట; ఆదరముజూపుట, క్షమించుట, క్షమాపణము, కఠినముగావర్తింపకుండుట.

**مسان** మసాన్ (హి. పు) శ్మశానము, వలకులమిట్ట; బాలగ్రహము, దయ్యము, భూతము.

**مسانیا** మసానియా (హి. పు) శ్మశానవాసి, జోగి; భూతవైద్యుడు, కాటికాపరివాడు.

**مساوات** ముసావాత్ (అ. స్త్రీ) సామ్యము, సమానభావము, సమముగానుండుట, సమానత, సమానత్వము; సమానాంతరము, జోడు, సమభావము, నిర్లక్ష్యము.

**مساودت** ముసావదత్ (అ. స్త్రీ) పోటీ, పోటి, స్పర్ధ, పోటీకిదిగుట, స్పర్ధించుట, ఎవరికన్నవఅనిపోరాడుట; పోరాటము.

**مساوی** ముసావీ (అ) సమానము, సమము, సరిదైనది, తగినది, సమానాంతరము, అభేదము, తటస్థము, తటస్థభావముగల, సమభావముగల, పక్షపాతములేని.

**مساہل** ముసాహిల (అ. పు) ఆలస్యము, సోమరితనము, నిర్లక్ష్యము, అలక్ష్యము, అసడ్డ, అజాగ్రత.

**مسائل** మసాయిల్ (అ. పు) ప్రశ్నలు, పృచ్ఛలు, ప్రకరణములు, సిద్ధాంతములు,

(ఏ.వ مسئلہ)

مسبب ముసబ్బిబ్ (అ.పు) మూలకారణము, కారకుడు, مسبب الاسباب — ఉల్ అస్బాబ్ (అ) కారణకారణము, ఈశ్వరుడు مسبب الحقیقی — ఉల్ హఖీఖీ (అ) యథార్థకారణము, ఈశ్వరుడు.

مسبع ముసబ్బఅ (అ) ఏడుగలది, సప్తకము; సప్తకోణము; సప్తపాదము (పద్యము.)

مست మస్త్ (పా) మదించిన, మత్తిల్లిన, మత్తుగొనిన ఒడలుమరచిన, మత్తెక్కిన; గాడుపట్టిన; మదముపట్టిన; కామపరవశమైన; ఆనందపరవశమైన; పొగరెక్కిన, గర్వించిన, అహంకారముగల. بد مست బద్‌మస్త్ (పా) తప్పత్రాగిన, ప్రమత్తుడు, దుర్మార్గుడు, مال مست మాల్‌మస్త్ (పా) ధనమదముగల, ధనమదాంధుడు, مگر مست మగర్‌మస్త్ (పా) మదపరవశుడు, మదాంధుడు,

مستأجر ముస్తాజర్ (అ.పు) జెట్టికాడు గుత్తకాడు, జెట్టిగొనువాడు; తరుగరి; భూస్వామి, కమ్మతగాడు; బాడుగదారుడు.

مستأصل ముస్తాసిల్ (అ) నిర్మూలముజేయునది, ఉన్మూలకము, నాశకము, నాశముచేయునది.

مستانہ మస్తాన (పా) త్రాగిమత్తుగొనినట్లు, మదించినట్లు; ఆనందపరవశమైన, గాడుపట్టిన, తాండవమాడుచున్న.

مستبد ముస్తబిద్ (అ) అసహాయశూరుడు, ఏదైనపనినితానొంటరిగజేయపూనుకొనువాడు: సర్వాధికారముగోరువాడు,

مستتر ముస్తతర్ (అ) గూఢము, గుప్తము; ముసుగుగలది, దాచబడినది.

مستثنیٰ ముస్తస్నా (అ) బహిష్కృతము, వెలువరించినది, వేరుచేసినది, ప్రత్యేకింపబడినది, త్రోసిపుచ్చినది, విముక్తము, మిగతపెట్టినది, విడిచివేసినది, తొలగించినది; అసాధారణము; నిపాతము; అపవాదము, مستثنیٰ کرنا — కర్నా (ఉ) బహిష్కరించుట, తొలగించుట, తప్పించుట, వేరుజేయుట.

مستجاب ముస్తజాబ్ (అ) ప్రత్యుత్తరమిచ్చిన, వినిన, ఆమోదించిన, సమ్మతించిన, సెలవిచ్చిన.

مستحسن ముస్తహ్సన్ (అ) శ్లాఘనీయము, ప్రశంసనీయము, ప్రశస్తము, మేలైనది. మనోజ్ఞము

مستحضر ముస్తహ్జర్ (అ) ఉండవలయునని కోరబడినది ఉన్నది, ప్రత్యక్షము, సిద్ధముగానున్నది.

مستحق ముస్తహక్ (అ) అధికారముగల, అర్హతగల, యోగ్యతగల, యోగ్యుడు, న్యాయముగలవాడు.

مستحکم ముస్తహ్‌కమ్ (అ) దృఢము, స్థిరము స్థాపితము, రూఢము, నిశ్చలము, గట్టిది, బలిష్ఠము.

مستخرج ముస్తఖ్‌రజ్ (అ) బయటదీసిన, వెలువరించిన; సిద్ధించిన, నిష్పన్నమయిన, నిష్పాదితము; బహిష్కృతము.

مستدام ముస్తదామ్ (అ) శాశ్వతము, అవినాశము, పురాతనము; కష్టపడెడు.

مستدیر ముస్తదీర్ (అ) చుట్టివచ్చునది, తిరిగివచ్చునది, వలయితము, వలయము, గోళము, మండలము, గుండ్రనినది; పరిధి, వృత్తము; చుట్టుకొలత, వర్తులము, خط مستدیر ఖత్తెముస్తదీర్ (అ) వర్తులరే

ఖ, వలయరేఖ, గుండుగీత.

**مسترد** ముస్తరద్ (అ) త్రిప్పివేసినది, మరల్చినది, కొట్టివేసినది, తీసివేసినది, నిషేధించినది, నిషిద్ధము, తిరస్కృతము, నిరస్తము.

**مستری** మిస్త్రీ (ఇం.పు) మేస్త్రీ, మేస్త్రి; పెద్దకారువు, కట్టడపుపనివాండ్రలో పెద్ద; పెద్దశిల్పి, పనిపెద్ద, నాయకుడు,

**مستزاد** ముస్తజాద్ (అ పు) అధికమైనది, ఎక్కువజేసినది, అధికపదము, ప్రతిచరణమునందును, నియమితగణములకంటె ఎక్కువచేర్చినపద్యము.

**مستسقی** ముస్తస్క్ (అ) నీరుత్రాగనిచ్ఛ గలవాడు, పిపాసితుడు, ఉబ్బురోగము గలవాడు.

**مستطاب** ముస్తతాబ్ (అ) పవిత్రమైన, మేలైన, శుభకరమైన, శ్రేష్ఠము; ఉత్తమము; రుచ్యము, రమ్యము, రుచికరము, రమణీయము, స్వచ్ఛము.

**مستظهر** ముస్తజ్హర్ (అ) సహాయము జేయబడిన, ఉత్తేజితసంగబడిన, (పు) సహాయముకోరువాడు, సహాయాన్వేషి

**مستطیل** ముస్తతీల్ (అ.పు) దీర్ఘము, పొడుగైనది, దీర్ఘచతురస్రము, ఆయతము.

**مستعار** ముస్తఆర్ (అ) అరువుగొన్న, అప్పుగాతీసికొన్న, కొలదికాలమునకుగాతీసికొన్న.

**مستعجل** ముస్తఅజిల్ (అ) త్వరపెట్టు స్వభావముగల, పరుగెత్తిపోయెడు, శీఘ్రగమనముగల, వేగవంతము, వడిగలది, శీఘ్రమైనది.

**مستعد** ముస్తఇద్ (అ) సిద్ధముగానున్న, సంసిద్ధము, ఉద్యుక్తము, సన్నద్ధుడు; సమర్థము, యోగ్యము, అర్హము, చురుకదనముగల.

**مستعدی** ముస్తఇది (అ.స్త్రీ) సంసిద్ధత, ఉద్యుక్తత, సన్నద్ధత, చురుకుదనము.

**مستعفی** ముస్తఅఫీ (అ) విడుదలకోరు, విమోచనముకోరు, కొలువునుండివిముక్తికోరు; విమోచనార్థి.

**مستعمل** ముస్తఅమల్ (అ) ఆచరణలోనున్న, వాడుకలోనున్న, వాడుకపడిన, అలవాటుపడిన; వాడబడిన, ప్రాంత; ప్రయుక్తము; అనుభూతము; అనుభవములోనున్నది; వాడిన, భోగించిన, అనుభవించినది, భుక్తము.

**مستغاث** ముస్తగాస్ (అ) న్యాయముజేయుమని ప్రార్థింపబడినవాడు, సహాయముకోరబడినవాడు, న్యాయదాత, న్యాయాధికారి, న్యాయకర్త.

**مستغرق** ముస్తగ్రక్ (అ) మునిగిన, మగ్నమైన, ఒకవిషయమునపనిగానియున్న, ఒకవిషయమునందునిమగ్నుడైయున్న, నిమజ్జితము, నిమగ్నుడు.

**مستغفر** ముస్తగ్ఫిర్ (అ) క్షమాపణగోరువాడు, క్షమార్థి పశ్చాత్తాపముగలిగినవాడు, పశ్చాత్తప్తుడు.

**مستغنی** ముస్తగ్నీ (అ) స్వతంత్రుడు, నిర్లక్ష్యముగలవాడు, స్వేచ్ఛావిహారి, లక్ష్యములేనివాడు; సంతృప్తుడు, సంతుష్టుడు; ద్రవ్యవంతుడు, సంపన్నుడు.

**مستغیث** ముస్తగీస్ (అ) న్యాయముగోరువాడు, న్యాయార్థి; వాది, వ్యాజ్యము వేసినవాడు.

**مستفاد** ముస్తఫాద్ (అ) లాభముపొందినది, లాభముగాపొందబడినది, లాభము, సంపాదించినది, నిష్పన్నము, నిష్పత్తి.

**مستفسر** ముస్తఫ్సిర్ (అ) పృచ్ఛకుడు, ప్రశ్నించువాడు, అడుగువాడు; జిజ్ఞాసువు, తెలియగోరువాడు.

**مستفید** ముస్తఫీద్ (అ) లాభముపొందిన వాడు, లాభముఅనుభవించినవాడు, అనుభవించువాడు, **مستفید ہونا** — హోనా (ఉ) లాభముపొందుట, అనుభవించుట.

**مستفیض** ముస్తఫీజ్ (అ) అనుగ్రహము పొందగోరెడువాడు, అనుగ్రహముపొందినవాడు, అనుగృహీతుడు, అనుగ్రహాకాంక్షి, కటాక్షము లేక అనుగ్రహము పొందినవాడు.

**مستقبل** ముస్తక్బిల్ (అ) ముందురాబోవునది, భవిష్యత్కాలము.

**مستقبل** ముస్తక్బల్ (అ) అభిముఖచిత్రము, ఎదురుముఖముగానున్నపటము (రెండుకన్నులును గానవచ్చునది)

**مستقر** ముస్తకర్ (అ.పు) స్థావరము, స్థిరము: నివాసస్థానము.

**مستقل** ముస్తకిల్ (అ) స్థిరము, నిశ్చలము; శాశ్వతము; పట్టుదలగల; దృఢము, చిరకాలముండునది; అగ్నిసాక్షిగా పెండ్లాడినభార్య **ارادۂ مستقل** — ఇరాద (అ) స్థిరసంకల్పము.

**مستقیم** ముస్తకీమ్ (అ) చక్కనిది, సరళము, బుజువైనది, **خط مستقیم** ఖతె ముస్తకీమ్ (అ) చక్కనిగీత, సరళరేఖ, సమరేఖ, **مستقیم الاضلاع** — ఉల్ అజ్లా (అ) సరళరేఖాకృతి, సరళరేఖావిశిష్టము, సమరేఖాకృతి, చక్కనిగీతలతోనేర్పడినయాకారము:

**مستک** మస్తక్ (హి పు) మస్తకము, తల; నొసలు, నుదురు; పర్వతశిఖరము.

**مستلزم** ముస్తల్జిమ్ (అ) విధియైన, తగిన, అర్హము, పాత్రుడు.

**مستمد** ముస్తమిద్ (అ) సహాయముగోరువాడు, సహాయార్థి.

**مستمید** ముస్తమీద్ (అ) ఆధారపడియున్న, పరాయత్తము, పరతంత్రము.

**مستنبط** ముస్తంబత్ (అ) ఒకదానినుండితీసినది, అనువాదము, సమాహృతము.

**مستند** ముస్తనద్ (అ) సిద్ధాంతీకృతము, ప్రమాణసిద్ధము, ఆధారయుక్తము, ప్రమాణయుక్తము, దృఢీకృతము, బలపరుపబడినది, ప్రమాణసమ్మతము, సప్రమాణము, బుజువుపరుపబడినది, దృఢపరుపబడినది, సత్యమైనది, యథార్థమైనది, యోగ్యతాపత్రముగలది.

**مستوجب** ముస్తౌజిబ్ (అ) ఉచితము, యోగ్యము, అర్హము, తగినది, విధియైనది.

**مستور** మస్తూర్ (అ) ముసుగువేసిన కప్పిపెట్టిన, దాచియున్న, దాచిపెట్టబడిన, గుప్తము, రహస్యము.

**مستورات** మస్తూరాత్ (అ) మరుగుగానుండువారు, అవగుంఠితులు, ఆడంగులు, అంతఃపురవాసులు, అంతఃపురస్త్రీలు, ఇల్లాండ్రు.

**مستورہ** మస్తూర (అ) ముసుగువేసిన, మరుగుననున్న, అవగుంఠితము, గుప్తము, గుప్తవస్తువు; ఇల్లాలు.

**مستوری** మస్తూరీ (అ.స్త్రీ) గోపనము, మరుగు, దాపరికము; సంకోచము, జంకు, సిగ్గు, బిడియము, లజ్జ; మానము, పాతివ్రత్యము.

**مستوفی** ముస్తౌఫీ (అ) సంపూర్ణముగనిచ్చువాడు, లేక తీసికొనువాడు, ప్రధాన

**مسدود** మస్దూద్ (అ) అడ్డగింపబడిన, మూసివేయబడిన, అపివేయబడిన, కట్టివేయబడిన, ఆటంకపరుపబడిన, నిరుద్ధము, నిరోధింపబడినది, బద్ధము.

**مسرت** ముసర్రత్ (అ స్త్రీ) సంతోషము, ఆనందము.

**مسرف** ముస్రిఫ్ (అ) అతివ్యయముజేయువాడు. దు బరదిండి.

**مسرور** మస్రూర్ (అ) ఆనందితుడు, ఆనంద మొందినవాడు, సంతోషించినవాడు.

**مسروق - مسروقہ** మస్రూక్ - క్ (అ) దొంగిలింపబడినది, తస్కరితము,

**مال مسروقہ** మాల్‌మస్రూక్ (అ) దొంగసొమ్ము, తస్కరితార్థము.

**مسطح** ముసత్తహ్ (అ) చదరమైన, చదునైన, సమమైన: విశాలమైన, విస్తీర్ణమైన; సమభూమి, బయలు, ఎడారి. చదును,

**زاویہ مسطحہ** జావియముసత్తహ(అ) క్షేత్రగతకోణము.

**مسطر** మిస్తర్ (అ.పు) రేఖాదండము, గీతలకోల; గీతలుగీయుసాధనము, గీతలయట్ట, దారపుట్ట.

**مسعود** మస్ఊద్ (అ) అదృష్టవంతుడు, శుభకరము, శోభనవంతము, మంగళవంతము, మంగళకరము, శుభము.

**مسک** మసక్ (హి. స్త్రీ) చినుగు, చీలిక; నిలువుదారములు. పికులుట, నిలువుచినుగు; చలనము, కులుకు, ఎదురాడుట, ఒత్తుట.

**مسکا** ముసకా (అ.పు) పశువులమూతికి కట్టుచిన్నబుట్ట, మూతిచిక్కము.

**مسکانا** మస్కానా (హి) కదలించుట, ఆడించుట, కులికించుట, కులుకుట; చినుగుట, నిలువుగాచించుట, చించుట.

**مسکرات** ముస్కిరాత్ (అ. స్త్రీ) మత్తుపదార్థములు, ఒడలుమరచునట్లు జేయునది, మద్యములు మధుపానములు.

**مسکرانا** ముస్కురానా (హి) మందహాసముజేయుట, చిఱునవ్వునవ్వుట,

**مسکراہٹ** ముస్కురాహట్ (హి. స్త్రీ) మందహాసము, చిఱునవ్వు.

**مسکن** మస్కన్ (అ పు) నివాసస్థానము, నివాసము, వాసము, ఉనికిపట్టు.

**مسکنا** మసక్నా (హి) పగులుట, పికులుట, చినుగుట, ఒత్తుట, పిసుకుట, గట్టిగాపట్టుట, జరుగుట, కదలుట.

**مسکنت** మస్కనత్ (అ. స్త్రీ) బీదరికము, దారిద్ర్యము, దీనత్వము, దైన్యము, పేదరికము, నైచ్యము.

**مسکون** మస్కూన్ (అ) వాసయోగ్యము, నివసయోగ్యము, జనావాసము, నివాసము, నివాసమైన, నివసించునది.

**مسکہ** మస్క (పా.పు) వెన్న, నవనీతము.

**مسکین** మిస్కీన్ (అ) రిక్తుడు, దీనుడు, పచ్చిదరిద్రుడు, హీనుడు.

**مسکینی** మిస్కీనీ (అ. స్త్రీ) రిక్తత, దారిద్ర్యము, పచ్చిదరిద్రము, దైన్యము, నైచ్యము, నిష్పచ్చరము.

**مسلح** ముసల్లహ్ (అ) ఆయుధములధరించిన, ఆయుధసుడు, కవచధారి, కవచుడు; కట్టాయితుడు; సంసిద్ధుడు.

**مسلخ** మస్లఖ్ (అ.పు) జంతువధశాల, కటికసాల; వధస్థానము, జంతువులనువధించుచోటు.

**مسلسل** ముసల్సల్ (అ) గొలుసుకట్టుగానున్న, లంకెవేసినట్లున్న, అనుబద్ధమైన, క్రమానుసారముగనున్న, సక్రమము, వ్య

వధిరహితము, వరుసగానున్న, క్రమము గానున్న, బారుగానున్న, ఎడతెగని, వీడని; బారుగా, వరుసగా, పంక్తిగా, ఒకదానితరువాతనొకటి, తరువాయిగా, ఎడతెగక, వీడక, (స్త్రీ) కుట్టుడంచు.

مسلط ముసల్లిత్ (అ) పరాక్రమించినవాడు, అక్రమించినవాడు, స్వాధీనపరచుకొనువాడు, జయించినవాడు, లోపరచుకొనువాడు; జేత, పరాక్రమశాలి, గెలుచువాడు; మించినవాడు; పైయధికారిగానున్నవాడు; బలిష్ఠుడు.

مسلک మస్లక్ (అ.పు) మార్గము, త్రోవ, పంథము, పథము, రీతి, ఆచారము, నడవడి, నియమము.

مسلم ముస్లిమ్ (అ.పు) మహమ్మదీయమతస్థుడు, మహమ్మదీయుడు, తురక, మలక.

مسلم ముసల్లిమ్ (అ) సురక్షితముగనుంచువాడు, సమగ్రముగనుంచువాడు, రక్షకుడు; ప్రమాణించువాడు, ఆమోదకుడు.

مسلم ముసల్లమ్ [అ] సురక్షితముగానున్న, సమగ్రము, చెడనిది; ఆమోదితము, ఒప్పుకొనబడినది, సమ్మతము, మానితము.

مسلمان ముసల్మాన్ [అ.పు] మహమ్మదీయమతస్థుడు, మహమ్మదీయుడు, తురక, మలక.

مسلمانی ముసల్మానీ [అ.స్త్రీ] మహమ్మదీయమతః పం॥, మహమ్మదీయమతము; మహమ్మదీయురాలు, తురకస్త్రీ; చర్మసంస్కారము, చర్మఖండనసంస్కారము.

مسلنا మసల్నా [హి] చితుకగొట్టుట, నలిచేయుట, మర్దించుట, నులుముట, నలుపుట; ఒత్తుట, పిసుకుట, రుద్దుట, చిదుముట.

مسلوب మస్లూబ్ [అ] అపహరింపబడిన, హరింపబడిన, చెడిన; వితహితము, రహితమైనది, مسلوب العقل - ఉల్ అఖ్ల్ [అ] చిత్తవైకల్యముగలిగిన, వికలమనస్కుడు, మతిచెడినవాడు, పిచ్చివాడు, مسلوب الحواس - ఉల్ హవాస్ [అ] బుద్ధివైకల్యముగలిగినవాడు, మతిచెడినవాడు, చాదస్తుడు, పిచ్చివాడు.

مسلوک మస్లూక్ [అ] రాకపోకలుగల, నడచిన, త్రొక్కుడు పడిన; ఉపకారముచేయబడిన.

مسلول మస్లూల్ [అ] వెలుపరించిన, లాగిన, బయట సిన; ఒఱనుండి దూసిన; [క్ష్మి] క్షయరోగి.

مسلہ మిసల్ల [ఫా.పు] దబ్బనము, పెద్దసూది.

مسلہ మస్ల [అ.పు] చూడుడు, مسئلہ అనుపదము.

مسلی ముస్లీ [హి] తాటిగడ్డలు.

مسم ముసమ్మ [అ.పు] రోమకూపము, దేహమునుండిచెమ్మట వెడలు సూక్ష్మరంధ్రము,

مسماۃ ముసమ్మాత్ [అ.స్త్రీ] పేరుగలస్త్రీ. పేరుగలగామె, నామితురాలు, (చూడు مسمی).

مسمار మిస్మార్ (అ.పు) ఇనుపమొలలు, ఇనుపచీల, మేకు; నాశముజేయబడిన, పాడుజేయబడిన, పాడు, ధ్వంసము.

مسمسانا ముసుమ్సానా-ముస్మాసానా (హి) కుములుట, లోలోపలనేదుఃఖించుట, మనసులోనుంచుకొనిబాధపడుట.

مسموع మస్మూఅ్ (అ) వినినది, వినబడినది శ్రుతము, వినబడునది.

مسموم మస్మూమ్ (అ) విషమయము, విషయుక్తము; విషముతినిన, విషముతినిపించినది, విషముగలది.

**مسمی** ముసమ్మ (అ) పేరుగలపురుషుడు, పేరుగలవాడు, నామికుడు.

**مسن** ముసిన్ (అ) వయసుమీరిన, వయసుచెల్లిన, ఈడుమీరిన, వృద్ధ, పెద్దవాడు.

**مسند** మస్నద్ (అ. స్త్రీ) పెద్దదిండు, పెద్దపరుపు; గద్దె, పీఠము; ఆసనము, సింహాసనము (వా॥) క్రియ **مسند نشین** — నిషీన్ (పా) సింహాసనాసీనుడు, సింహాసనస్థుడు **مسند نشینی** — నిషీని (పా) సింహాసనారోహము, పట్టాభిషేకము.

**مسنون** మస్నూన్ (అ) దుర్గంధముగలది, మురిగినది; పదును పెట్టిన; మెరుగుపెట్టిన; శాస్త్రోక్తము, యథావిధిగాజేయబడిన, సంస్కరింపబడిన.

**مسواک** మిస్వాక్ (అ. స్త్రీ) పండ్లుతోముకొనుపుడక, పండ్లపుల్ల, దంతకాష్ఠము.

**مسوده** ముసవ్వద, ముస్వద, మసవ్వద, మస్వద (అ. పు) నలుపుజేసినది, వ్రాసినది, మొదటవ్రాసినది, చిత్తు, చిత్తుప్రతి, చిత్తువ్రాసినది.

**مسور** మసూర్ (హి. పు) మసూరము, కందులు.

**مسوڑھا - مسوڑا** మసోడా - ఢా (హి. పు) పంటిచిగురు, పంటిపైచిగురు.

**مسوسنا** మసోస్నా (హి) పిండుట, పిసుకుట, మెలిపెట్టుట, మెలుచుట, ఒత్తుట, అణచుట, మనసులోనేయుంచుకొనుట, చింతజేయుట, విచారపడుట, పశ్చాత్తాపపడుట.

**مسہری** మసహ్రీ (హి. స్త్రీ) మశహారి, దోమతెరమంచము; దోమతెర.

**مسہل** ముస్హిల్ (అ) బేదిగలుగజేయునది, విరేచనకారి, బేదిమందు, విరేచనౌషధము.

**مسئلہ** మస్అల (అ పు) పృచ్ఛ, ప్రశ్న, చర్చనీయము, చర్చనీయాంశము, విమర్శనీయము, విచారింపదగినవిషయము, విషయము, మతసిద్ధాంతము

**مسی** మిసి (పా) తామ్రవికారమైన, రాగితోజేసిన.

**مسی** మిస్-స్సీ (హి. స్త్రీ) దాచెన, అడంగులు పండ్లుకలుపెక్కుటకును గట్టిపడుటకును వేసికొనుపొడి, దాచెనపొడి, పండ్లపొడి, **مسی کاجل کرنا** — కాజల్ కర్నా (హి) అలంకారముచేసికొనుట, **مسی کرنا** — కర్నా (హి) కన్నెటికముపెట్టుట, భోగముదానికిపున్నెగట్టుట.

**مسیحا - مسیح** మసీహ్-మసీహా (అ పు) యేసుక్రీస్తు; నిష్కపటమైన, విశదమైన.

**مسیحی — مسیحائی** మసీహాయీ మసీహీ (అ. స్త్రీ) యేసుక్రీస్తు చూపిన మహాత్మ్యము (చచ్చినవారిని బ్రతికించుట మొ॥); క్రైస్తవుడు, క్రీస్తు మతమునకు చేరినవాడు, **مسیحا دم نفس** - దమ్ నఫస్ (పా) చచ్చినవారికిప్రాణముపోయువాడు, **مسیحائی** — కర్నా (హి) క్రైస్తవమహాత్మ్యముజూపుట, చచ్చినవారికిప్రాణమురప్పించుటయు, రోగముకుదుర్చుటయు మొ॥ పనులుజేయుట.

**مشابہ** ముషాబెహ్ (అ) అనురూపము, పోలినది, పోలియున్న, సమానముగానున్న, సామ్యముగల, ఒకవిధముగానున్న, (పు) పోలిక, సామ్యము; పటము, ప్రతిరూపము; సాటి, సాటువ, సాటిక,

**مشابہت** ముషాబహత్ (అ. స్త్రీ) ఒకటినొకటిపోలియుండుట; పోలిక, సామ్య

ము, సాటువ, సాటు అనురూప్యము.

**مشاتمت** ముషాతమత్ (అ. స్త్రీ) ఒకరి నొకరు తిట్టుకొనుట.

**مشار** ముషార్ (అ) చూపిన, సూచించిన, చెప్పిన, ఉదాహృతము, ఉదహరించిన

**مشارٌ الیہ** ముషారున్ ఇలైహ్ (అ) ముందుచెప్పిన, పూర్వోదాహృతమైన, పూర్వోక్తమైన, ఉదాహృతుడు, పేరు చెప్పియున్నవాడు.

**مشارکت** ముషారకత్ (అ. స్త్రీ) చేరిక, కూడిక, సాంగత్యము, సహకారము, సహకారిత్వము, సహవాసము, సంఘీభావము, సమాజము, సంఘము, పొత్తు, ఉమ్మడి, పాలుగలిగియుండుట.

**مشاطہ** మష్షాత (అ. స్త్రీ) సైరంధ్రి, అవంగులకుతలదుడుచుట, బొట్టుకాటుకలు పెట్టుట, మొ॥ పనులుచేయు, పనికత్తె, పెండ్లికూతుంద్రును అలంకరించు స్త్రీ, వివాహసంధానములగూర్చువాడుది, సంధానకత్తె.

**مشاعرہ** ముషాఅర (అ. పు) కవిత్వప్రదర్శనము, కవులసభ, కవిజనసమావేశము; కవితాసభ, కవిత్వసమాజము.

**مشاق** మష్షాక్ (అ) కృతహస్తుడు, ఖిక్కిలిఅభ్యాసముగలవాడు, చేయితిరిగినవాడు, అలవాటుపడినవాడు, ఆరితేరినవాడు, తీరినవాడు, పరిశ్రమగలవాడు, పండితుడు, చురుకుదనముగలవాడు.

**مشاقی** మష్షాకి (అ. స్త్రీ) అభ్యాసము, పరిశ్రమ, అలవాటుకలిమి, అలవాటు, పాండిత్యము, చాకచక్యము చురుకుదనము.

**مشام** మషామ్ (అ. పు) ఘ్రాణేంద్రియము, ఘ్రాణశక్తి, ఘ్రాణము.

**مشاورت** ముషావరత్ (అ. స్త్రీ) ఒకరితోనొకరుఆలోచించుట, సమాలోచనము, కూడనుండుట.

**مشاہدہ** ముషాహదా (అ. పు) చూచుకొనుట, చూచుట, ఆలోకనము, ప్రత్యక్షము, దర్శనము, సమక్షము; సాక్ష్యము, సాక్షిత్వము.

**مشاہرہ** ముషాహర (అ. పు) నెలజీతము, సంబళము, వేతనము, మాసికవేతనము.

**مشایخ** మషాయిఖ్ (అ. పు) వృద్ధులు, పెద్దలు, పూజ్యులు, ఆచార్యులు, భక్తులు.

**مشایخی** మషాయిఖీ (అ. స్త్రీ) పూజ్యత, పవిత్రత, భక్తి, దైవభక్తి, ఆచార్యత్వము, పాండిత్యము.

**مشبک** ముషబ్బక్ (అ) కంతలుగలది, తూట్లుగలది, రంధ్రములుగల, వలగానున్నది, జాలము.

**مشبہ** ముషబ్బ (అ) పోల్చబడినది, ఉపమితము, ఉపమింపబడినది, ఉపమేయము; పోల్చినది; ఉపమానము, ఉపమ (అలంకారము), సందిగ్ధము, అనుమానాస్పదము, పోలికగలది **مشبہ بہ** —బహి (అ) ఉపమానము.

**مشت** ముష్ట్ (పా. పు) ముష్టి-పిడికిలి; ముష్టిఘాతము, పిడికిటిపోటు, పిడికెడు,

**ایک مشت** ఏక్ ముష్ట్ (పా) ఒకేసారి, ఒక్క-సారిగా, ఒక్కుమ్మడిని, అంతయునొకటిగా.

**مشتاق** ముష్తాక్ (అ) అభిలాషి-అపేక్షగలవాడు, ఆతురతగలవాడు, కాంక్షగలవాడు, కోరికగలవాడు, ప్రేమగలవాడు, ఆతురుడు.

**مشتبہ** ముష్తబ (అ) సంశయాస్పదము, అనుమానాస్పదము, శంకితము, సందిగ్ధము.

సందేహాస్పదము, ద్వంద్వార్థము.

**مشارک** ముష్తారిక్ (అ) భాగస్వామి, పాత్తుగలవాడు, కలిసియున్నవాడు, పాలివాడు, సహాయుడు, సహకారి, పొత్తుగలవాడు, పాల్గొన్నవాడు తోటివాడు, కలిసియున్నది; నానార్థములుగలశబ్దము, శ్లేషార్థము, ద్వంద్వార్థము.

**مشترک - مشترکہ** ముష్తరక్-క (అ) ఉమ్మడిగానున్నది పొత్తుగనున్నది, సామాన్యము, (గానున్నది); నానార్థపదము-అనేకార్థములుగలది, **مشترک خاندان** — ఖాందాన్ (పా) అవిభక్తకుటుంబము, ఉమ్మడిసంసారము.

**مشتری** ముష్తరీ (అ.పు) క్రయికుడు, కొనువాడు, విలువకాడు; బృహస్పతి, (గ్రహము.)

**مشتعل** ముష్తఇల్ (అ) దీప్తము, మండెడు, కాలెడు, రగులొత్తెడు, మండింపబడిన, కాలునట్లుచేయబడిన, తగుల్పబడిన, పురికొల్పిన, పురికొల్పబడిన.

**مشتق** ముష్తక్ (అ) మరియొకశబ్దమునుండికలిగినరూపము, వికృతశబ్దము, నిష్పన్నము, నిష్పన్నరూపము, వికృతి, వికారము.

**مشتمل** ముష్తమిల్ (అ) చుట్టుకొనునది, ఆవరించునది, క్రమ్ముకొనునది, ఆక్రమించునది, చేర్చుకొనునది, కలుపుకొనునది, ...గొనునది, కప్పునది, వ్యాపకము, వ్యాపించునది, వ్యాపించినది **مشتمل ہونا** — హోనా (ఉ) లోగొనుట. చేర్చుకొనుట, వ్యాపించుట, ఆవరించుట, గ్రహించుట.

**مشتہر** ముష్తహర్ (అ) ప్రకటింపబడినది, ప్రకటితము, ప్రసిద్ధము, వెల్లడిచేయబడినది, అందరికిని తెలిపినది, చాటించినది.

**مشتہی** ముష్తహీ (అ) కోరువాడు, అభిలాషి; ఆకలిపుట్టించుఔషధము, పౌష్టికము, (మం).

**مشق** ముష్క్ (హి. స్త్రీ) వ్యాసము, ఊరకుండుట, మాటాడమి.

**مشٹان** మిష్టాన్ (హి.పు) మృష్టాన్నము, మధురభోజనము, మంచియాహారము.

**مشٹنڈا** ముష్టండా (హి.పు) చూడు, **مشٹنڈا**

**مشجر** ముషజ్జర్ (అ.పు) వనము, తోట; చెట్లుపూలు మొ॥ కుట్టియున్న బట్ట, పూలపట్టుబట్ట, పూలబట్ట.

**مشخص** ముషఖ్ఖస్ (అ) పరీక్షించికనుగొనినది, లెక్కజేసిచూచినది, నిర్ణయింపబడినది, పరీక్షితము, నిరీతము, నిర్దిష్టము, ఉజ్జాయింపుచేసినది, మతింపువేసినది, లెక్కకట్టినది.

**مشدد** ముషద్దద్ (అ) బలపరుపబడినది, కలిపికట్టినది, ద్విగుణించినది, ద్విత్వము పొందినది - ద్విత్వాక్షరము.

**مشر** మిశ్ర (హి) మిశ్రితము, మిళితము, సమ్మిళితము (పు) మిశ్రుడు, మిథిలదేశపు బ్రాహ్మణులగౌరవనామము.

**مشرب** మష్రబ్ (అ) నీళ్లుత్రాగుచోటు, జలాశయము; తెగ, కులము, జాతి; రీతి, పద్ధతి, స్వభావము.

**مشرح** ముషర్రహ్ (అ) టీకాతాత్పర్యములు, విస్తరించివ్రాయబడినది, వ్యాఖ్యాతము.

**مشرف** ముష్రిఫ్ (అ) ఉన్నతము, గొప్పవాడు, కానున్న; పైనుండిచూచువాడు జాగరూకుడు; పైవిచారణచేయువాడు, పరీక్షకుడు, పైముధకారి.

**مشک** మష్క్ (పా. స్త్రీ) తోలుతిత్తి, తడగము, తణగాము, నీటితిత్తి.

**مشک** ముష్క్ (పా.పు) కస్తూరి, మృగనాభి, మృగమదము **مشک نافہ** — నాఫ (పా) మృగనాభి **مشک دانہ** — దాన (పా) కస్తూరిబెండవిత్తులు, **مشک بهینڈی** — భేండీ (ఉ) కస్తూరిబెండ.

**مشکل** ముష్కిల్ (అ) కష్టమైన, దుర్లభమైన, దుస్తరము, కఠినము, అసాధ్యము, క్లిష్టము; (స్త్రీ) కష్టము, శ్రమ, క్లేశము, సంకటము, ఇబ్బంది, **مشکل پڑنا** — పడ్నా (ఉ) కష్టమువచ్చుట, ఇబ్బందివచ్చుట, **مشکل کشا** — కుషా (పా) సంకటహారణుడు, కష్టములతొలగించువాడు, ఈశ్వరుడు.

**مشکور** మష్కూర్ (అ) కృతజ్ఞుడు, మేలుమరువనివాడు.

**مشکوری** మష్కూరీ (అ. స్త్రీ) కృతజ్ఞత, మేలుమరువమి, మేలుతలచుట.

**مشکوک** మష్కూక్ (అ) సందేహాస్పదము, సందిగ్ధము, శంకితము. అనుమానాస్పదము

**مشکیزه** మష్కీజా (పా.పు) తోలుతిత్తి, తోలుసంచి (చిన్నది)

**مشکین - مشکی** ముష్కీన్ — ముష్కీ (పా) కస్తూరివన్నెగల, నల్లని, శ్యామము, (గుఱ్ఱము).

**مشکیں باندھنا** ముష్కేఁబాంధ్నా (ఉ) పెడరెక్కలువిరిచికట్టుట; చేతులుకట్టివేయుట.

**مشلول** మష్లూల్ (అ) కదలలేని, కుష్ఠించిన, పక్షవాతముతగిలినరోగి, కాలుసేతులుపడిపోయినవాడు, నొప్పికుంటి.

**مشمول** మష్మూల (అ) కలుపబడిన, కలిపిన, చేర్చిన, చేర్చబడిన, చేరియున్న, కూర్పబడిన, కూర్చిన, సమ్మిళితమైన, మిళితము, మిశ్రితము, సంకలితము.

**مشموم** మష్మూమ్ (అ) వాసనచూసిన, వాసనపట్టించిన, సువాసితము, పరిమళయుక్తము, సుగంధముగలది.

**مشورت - مشوره** మష్వర-మష్వరత్ (అ.పు) (అ స్త్రీ) కలిసియాలోచించుట, సమాలోచనము, ఆలోచన, సమకూడియాలోచించుట, సమావేశము, ఆలోచనపద్ధతి; సమ్మెకుర్రు, సమ్మెకట్టు.

**مشوش** ముషవ్వష్ (అ) కలతజెందిన, కలవరమొందిన, సంభ్రమపడిన, వ్యాకులమొందిన, తత్తఱపడిన, వ్యాకులితము, వ్యాకులితుడు.

**مشہد** మష్హద్ (అ. స్త్రీ) ధర్మవీరులసమాధిస్థలము, శ్మశానము.

**مشہود** మష్హూద్ (అ) సాక్షియుక్తము, ప్రమాణయుక్తము, సిద్ధాంతమైనది, నిశ్చయింపబడినది; సమక్షమందున్నది, చూచినది, ప్రత్యక్షము, నిశ్చితము; సాక్షిదైన, ప్రమాణమైన.

**مشہور** మష్హూర్ (అ) ప్రకటితము, ప్రసిద్ధము, వెల్లడియైన, ప్రఖ్యాతిజెందిన, ప్రఖ్యాతము, కీర్తి[illegible] **مشہور کرنا** కర్నా (ఉ) ప్రకటించుట, వెల్లడించుట, వెల్లడిజేయుట **مشہور ہونا** — హోనా (ఉ) ప్రసిద్ధమగుట, ప్రసిద్ధిజెందుట, ప్రఖ్యాతిజెందుట, వెల్లడియగుట.

**مشیت** మషియ్యత్ (అ. స్త్రీ) ఇచ్ఛ, ఇష్టము, (ఇదిఈశ్వరేచ్ఛకేవాడుదురు) అదృష్టము, భాగ్యము.

**مشیر** ముషీర్ (అ) ఆలోచనజెప్పువాడు, యోచనజెప్పువాడు, బోధకుడు, మార్గద

**مصرع** మస్రఅ (అ.పు) క్రిందపడుచోటు, జెట్టిరంగము, గరడీశాల.

**مصرف** మస్రఫ్ (అ పు) వ్యయము, వ్రయము, వెచ్చము; వెల, క్రయము, మూల్యము; ఉపయోగము, ప్రయోజనము.

**مصروف** మస్రూఫ్ (అ) వ్రయపడినది, వ్యయమైనది, వెచ్చించినది; పనిలో తగులుకొన్న, పనిగొనియున్న, పనిలోనున్న, నిమగ్నుడు, వ్యగ్రుడు, తీరికలేని, పనిగల **مصروف ہونا** — హోనా (ఉ) పనిగొనియుండుట, పనిలోనుండుట, తీరికలేకయుండుట, నిమగ్నుడగుట.

**مصروفیت** మస్రూఫియ్యత్ (అ స్త్రీ) కార్యనిమగ్నత, తీరికలేమి, పనికలిమి, కార్యవ్యగ్రత, పనిపాటలు, వ్యవహారము, పరిశ్రమ.

**مصری** మిస్రీ (అ. స్త్రీ) మిసరుదేశసం॥, కలకండ, పటికబెల్లము.

**مصطبہ** మస్తబ (అ.పు) కల్లంగడి, సారాయికొట్టు, మదిరాగృహము; సత్రము, ధర్మశాల.

**مصطفیٰ** ముస్తఫా (అ) అభీష్టుడు, కోరబడినవాడు; అభీష్టము, శ్రేష్ఠము. హజరతు మహమ్మదుగారిబిరుదకీనామము

**مصطکی رومی** ముస్తకిరూమీ (అ. స్త్రీ) రూమమంథకము, పిల్లికంల్లగుగిలము.

**مصطلح** ముస్తలహ్ (అ) శాస్త్రీయము, పరిభాష, సాంకేతికము; సాంప్రదాయపదము.

**مصفا** ముసఫ్ఫా (అ) స్వచ్ఛము, శుద్ధము, పరిశుద్ధము.

**مصفی** ముసఫ్ఫి (అ) శుభ్రపరచునది, శోధకము, పరిశోధకము, శోధకౌషధము, శుభ్రపరచుమందు.

**مصقلہ** మిస్కల, (అ.పు) మెరుగుబెట్టునది, మెఱుగుసానమొ॥.

**مصلا** ముసల్లా (అ) నమాజుచేయుచోటు, ప్రార్థనస్థానము, ప్రార్థనాలయము, మసీదు; మహమ్మదీయులు నమాజుచేయుచోటుపరచుకొనువస్త్రము. ఆసనము, చిత్రాసనము, ఆస్తరణము.

**مصلح** ముస్లిహ్ (అ) బాగుజేయువాడు, సంస్కర్త, చక్కజేయువాడు, పరిష్కారము చేయువాడు; పరిహారకము.

**مصلحت** మస్లహత్ (అ. స్త్రీ) ఔచిత్యము, యోగ్యత, సదుపాయము, బాగుజేయునది, అనుకూలవిషయము, ఆనుకూల్యము, యుక్తము, యోగ్యము, సౌకర్యము, సంస్కారము, ఆలోచనము, సదాలోచనము, **مصلحت کرنا** — కర్నా (ఉ) సమకూడియాలోచించుట, సమావేశమగుట, కుట్రజేయుట, సమ్మెకట్టుట, **مصلحت وقت** — ఎ, వక్త్ (అ) సమయోచితము, వేళకనుకూలమైనది, కాలానుగుణ్యము, సందర్భోచితము.

**مصلحتاً** మస్లహతన్ (అ) సమాలోచనపూర్వకముగా, యోచనపూర్వకముగా, మేలనుకొని, బాగనుకొని, మంచికొరకు, బాగుకొరకుమేలుకొరకు.

**مصلوب** మస్లూబ్ (అ) చిలువనెక్కించిన, కొఱతవేసిన.

**مصلی** ముసల్లా (అ) నిష్ఠగానమాజుచేయువాడు, చచ్చినవారిసపిండిపోడశము మొ॥ భుజించువాడు.

**مصمم** ముసమ్మమ్ (అ) దృఢనిశ్చయమైన, కృతనిశ్చయమైన, దృఢనిశ్చితము **مصمم ارادہ** — ఇరాద (అ) దృఢసంకల్పము.

**مصنع** ముసన్నఅ (అ) కృతకము, కల్పించినది, చేసినది.

**مصنف** ముసన్నిఫ్ (అ) రచియించినవాడు, రచయిత, గ్రంథకర్త, లేఖరి, కర్త. లేఖకుడు.

**مصنف** ముసన్నఫ్ (అ) రచితము, గ్రథితము, సంకలితము; గ్రంథము, పుస్తకము, కృతి.

**مصنفات** ముసన్నిఫాత్ (అ. స్త్రీ) రచియించినగ్రంథములు, రచనలు కృతులు.

**مصنوع** మస్నూఅ (అ) కృతము, చేయబడినది, కృతకము, కల్పితము. సృష్టము, సృజింపబడినది: నూతనసృష్టి,నవీనకల్పన.

**مصنوعات** మస్నూఆత్ (అ. స్త్రీ) కృతకసులు(?), కల్పితములు; పరిశ్రమలు, పంచాణములు(?), చేతిపనులు, విన్యాసములు(?), చేతిపనివస్తువులు, నూతనసృష్టులు.

**مصنوعی** మస్నూయీ (అ) కృత్రిమము; కల్పితము, కల్పించినది, మోసపువస్తువు, బూటకపువస్తువు.

**مصور** ముసవ్విర్ (అ. పు) చిత్రకారుడు, చిత్రలేఖకుడు, పటములుదించువాడు, ప్రతిమలువ్రాయువాడు; శిల్పి, విగ్రహములుచేయువాడు.

**مصور** ముసవ్వర్ (అ) చిత్రితము, దించినది లేక చిత్రించినది; పటము, చిత్తరువు.

**مصوری** ముసవ్విరీ (అ. స్త్రీ) చిత్రలేఖనము, పటములుదించుట, చిత్రములువ్రాయుట, పటములువ్రాయుట; శిల్పము, శిల్పవిద్య.

**مصیبت** ముసీబత్ (అ. స్త్రీ) క్షయము, ఆపద, విపత్తు, సంకటము, కష్టము, దుఃఖము, దురదృష్టము **زدہ مصیبت** —జద (పా) దైవోపహతుడు, ఆపన్నుడు, విపన్నుడు, ఆర్తుడు, సంకటములోతగులుకొన్నవాడు, **مصیبت اٹھانا** —ఉఠానా (ఉ) కష్టమనుభవించుట.

**مضارب** ముజారిబ్ (అ. పు) సామువేయువాడు, పోటరి, జెట్టి; కార్యదర్శి, కార్యనిర్వాహకుడు; పట్టుబడి పట్టువాడు; పనిచేయించువాడు; పాలివాడు, పొత్తుగలవాడు, ఉపస్వామికాడు(?).

**مضارع** ముజారిఅ (అ. పు) పొత్తుగల, చేరియున్న —కూడియున్న, (వ్యా) తద్ధర్మార్థకము, తద్ధర్మకాలము.

**مضاعف** ముజాఅఫ్ (అ) ద్విగుణము, రెండంతలు, రెట్టింపు, గుణితము; ద్విత్వము, ద్విత్వాంతపదము, అంతమందుద్విత్వాక్షరముగలపదము.

**مضاف** ముజాఫ్ (అ. పు) వృద్ధిచేయబడినది, వరితము(?), కలిపినది, సంబంధించినది, చేర్చినది, అంటగట్టినది, అనుబంధము; పరిసరప్రదేశములు, సమీపమందలిపల్లెలు, (వ్యా) షష్ఠీవిభక్తి, సంబంధార్థకము.

**مضافات** ముజాఫాత్ (అ. స్త్రీ) పరిసరప్రదేశములు, చుట్టుప్రక్కలనుండుపల్లెలు, పట్టణముక్రింది పల్లెలుపాలెములు, సమీపప్రదేశములు, పాయికట్టువిషయము.

**مضامین** మజామీన్ (అ. పు) రచనలు, వ్యాసములు, లేఖలు, అంశములు, విషయములు, గ్రంథస్థవిషయములు.

**مضائقہ** ముజాయకా (అ. పు) సంకటము, ఇబ్బంది, బాధ.

**مضبوط** మజ్బూత్ (అ) పట్టుకొనబడినది, పట్టుబడినది, నిగృహీతము. గ్రస్తము; దృఢము, బలిష్ఠము, గట్టిది, స్థిరమైనది, నిలుచునది, నిశ్చలము.

**مضبوطی** ముజ్బూతీ (అ.స్త్రీ) పట్టుదల, దృఢత్వము, దార్ఢ్యము, పాటవము, పటుత్వము, బలిష్ఠత, స్థిరత్వము, నిలుకడ, గట్టితనము, నైశ్చల్యము.

**مضحک** ముజ్హిక్ (అ) నవ్వుపుట్టించేదు, హాస్యాస్పదము, పరిహాసకము, నవ్వించువాడు, పరిహాసకుడు. హాస్యగాడు, విదూషకుడు, నవ్వులబండి.

**مضحکہ** ముజ్హక (అ పు) నవ్వుపుట్టించునది, పరిహాసము, హాస్యము, ఎకసక్కెము, ఎగతాళి, నవ్వులాట.

**مضحکہ اُڑانا** —ఉడానా (ఉ) పరిహాసముజేయుట, పరిహసించుట; ఎకసక్కెములాడుట.

**مضر** ముజ్జిర్ (అ) అపకారముజేయునది, హానికరము, అపకారకము, అపకారి, బాధకము, ప్రతికూలము, అహితము, కీడు జేయునది.

**مضراب** మిజ్రాబ్ (అ.స్త్రీ) వీణవాయించుటకు ప్రేలికిపెట్టు కొనుతీగయుంగరము, నఖి.

**مضرت** మజర్రత్ (అ.స్త్రీ) హాని, కీడు, అపకారము, అహితము.

**مضروب** ముజ్రూబ్ (అ.పు) గుణితము. ఎచ్చువేయబడినది, (సంఖ్య) **مضروب فیہ** —ఫీహ్ (అ) గుణకము, ఎచ్చువేయుసంఖ్య.

**مضطر** ముజ్తర్ (అ) నష్టపడిన, దెబ్బతగిలిన, భంగపడిన, నిరుపాయమైన, వ్యాకులితమైన, కలతజెందిన, తత్తఱపడిన, తొట్రుపడిన.

**مضطرب** ముజ్తరిబ్ (అ) వ్యాకులితుడు, కలతజెందినవాడు, బుగులుపడిన, దిగులుపడినవాడు, మనసునిలకడలేనివాడు, భంగపడిన, కలవరపడిన, తత్తరపడిన, వ్యాకులపడిన.

**مضطرب الحال** —ఉల్ హాల్ (అ) దురవస్థలోనున్నవాడు, వ్యాకులితమనస్కుడు సంకటస్థితిలోనున్నవాడు

**مضغہ** ముజ్గ్ (అ.పు) మాంసఖండము, కండ, మాంసపుముక్క; తిండిపోతు.

**مضمار** మిజ్మార్ (అ.స్త్రీ) గుఱ్ఱమునుగుడిద్రిప్పుచోటు, గుఱ్ఱముగుడి, గుఱ్ఱపుమైదానము, తురగరంగము, రణరంగము యుద్ధరంగము.

**مضمحل** ముజ్మహిల్ (అ) భంగురము, నశ్వరము; భగ్నము, నష్టము; అలసము, మందము, చురుకులేని, పరిశ్రాంతము, అలసిన, శ్రమపడిన, బలహీనమైన, సడలిన, బడలిన.

**مضمر** ముజ్మిర్ (అ) భావనలోనున్న మనసులోనున్న, ఊహలోనున్న, ఊహితము, భావితము, అభిప్రేతము, భావముగలది, ఇమిడియున్నది, అంతర్భావితము, సంకల్పితము, సూచితము.

**مضمر** ముజ్మర్ (అ) మరుగుపడియున్నది, పిహితము, దాపరికము, రహస్యము, అంతరంగము, మనసులోనున్నది; ఊహితము, భావితము, ఊహింపబడినది, భావింపబడినది.

**مضمن** ముజ్మిన్ (అ) చేర్చికొనునది, కలిపికొనునది, చేరియున్నది, కలిసియున్నది, చేరినది, అనుబద్ధము, అనుబంధముగానున్నది.

**مضموم** ముజ్మూమ్ (అ) కలిపినది, చేర్చినది; ఉకారసంజ్ఞగలది, ఉకారయుక్తము.

**مضمون** మజ్మూన్ (అ.పు) విషయము,

ఆంశము, అభిప్రాయము; వ్యాసము, రచన, లేఖ.

مضی మజ్జీ (అ) గతము, జరిగినది مضی

ما مضی — మామజ్జీ (అ) జరిగినదే మోజరిగినది, పోయినమాటపోనిమ్ము, గతంగతము.

مطا మతా (అ.పు) వెన్ను, వీపు, బలము, సహాయము, అండ.

مطابق ముతాబిక్ (అ) అనుసారము, ప్రకారము, అనుకూలము, యోగ్య, ఉచితము; సమానము, సదృశము; పోలినది,

مطابق کرنا — కర్నా (ఉ) సరిపోల్చి చూచుట, సరిజూచుట, సరిజేయుట, సమముజేయుట

مطابق ہونا — హోనా (ఉ) సరిపడుట, సరిపోవుట, సమమగుట.

مطابقت ముతాబిఖత్ (అ.స్త్రీ) సామ్యము, సమానత; పోలిక, సాదృశ్యము, అనుకూల్యము; ఔచిత్యము, యోగ్యత, తగవు, సరిపడుట, పొంతనము, సంఘటనము, కలయిక, పొందిక; సాంగత్యము, సంగతము, సంగతి, కూడిక.

مطاع ముతాఉ (అ) విధేయము, విధేయత గల, విధేయుడు, యజమాని, సేవితుడు.

مطالب మతాలిబ్ (అ.పు) అభిప్రాయములు, భావములు, ప్రయోజనములు, ఉపయోగములు, అవశ్యకతలు, అక్కఱలు, అవసరములు, అగత్యములు; అభిలాషలు. కోరికలు; పృష్టములు; అడుగబడినవి, ఇవ్వవలసినవి (ఏ. వ. مطلب).

مطالبہ ముతాలబ (అ.పు) అడుగుట, ఇమ్మనుట, గ్రాహ్యము, తీసికొనదగినది, అచ్చుదల, అప్పు, ఋణము, ఇవ్వవలసినది. గ్రహణము, అధికారము, పట్టు,

مطالبہ جات — జాత్ (అ) అప్పులు, ఇవ్వవలసినవి, ఋణభారములు.

مطالعہ ముతాలఅ (అ) సమాలోకనము, అవలోకనము, అవలోడనము, శ్రద్ధతో జూచుట: గ్రంథావలోకనము, పఠనము, చదువుట, ఆలోచనము, యోచన.

مطایبہ ముతాయబ (అ.పు) సరసము, పరిహాసము.

مطبخ మత్బఖ్ (అ.పు) మహానసము, వంటయిల్లు, పాకగృహము.

مطبخ మిత్బఖ్ (అ.పు) వంటపాత్ర, కాసన, పెఱవ, పచనపాత్ర.

مطبخی ముత్బిఖీ (అ.పు) వంటలవాడు పాచకుడు.

مطبع మత్బఅ (అ.పు) ముద్రణాలయము. ముద్రాక్షరశాల, అచ్చుకూటము.

مطبوخ మత్బూఖ్ (అ) వండబడినది, పచితము.

مطبوع మత్బూఅ (అ) స్వాభావయోగ్యము, సహజము, స్వాభావికము; అనుకూలము, అనుగుణము; ముద్రితము, అచ్చొత్తిన, అచ్చువేయబడినది.

مطبوعہ మత్బూఅ (అ) ముద్రితము. అచ్చొత్తబడినది, అచ్చువేసినది.

مطرب ముత్రిబ్ (అ) పాటకుడు, గాయకుడు, సంగీతము పాడువాడు

مطرد ముత్తరిద్ (అ) సదా అనుసరింపవలసినది, క్రమాభివృద్ధిగలది, ప్రవహించునది. వర్ధమానము, వృద్ధిబొందునది.

مطروح మత్రూహ్ (అ) బహిష్కృతము, పరిత్యక్తము, పతితము, పతితుడు, త్యక్తుడు; భ్రష్టుడు, నీచుడు; విమతస్థుడు.

مطعومات మత్ఊమాత్ (అ) భోజనపదార్థములు, భోజనసామగ్రి.

مطعون మత్ఊన్ (అ) నిందితము, దూ

షితము, నిందింపబడినది; మారి,జాడ్యము తగిలిన, మారిజాడ్యగ్రస్తము; వ్యాధిగ్రస్తము, రోగముతగిలినది; పాడవబడినది.

**مطلا** ముతల్లా (అ) బంగారుపూతపూసిన, బంగారుపూతగలది, సువర్ణితము.

**مطلب** మత్లబ్ (అ.పు) అర్థము, భావము, తాత్పర్యము, అభిప్రాయము, సారాంశము; ఉద్దేశము; ఉపాయము, కావలసినది, విషయము, అడిగినది, అభిలషితము, **مطلب برآری** —బరారీ(పా) స్వార్థసాధనము, స్వార్థనిర్వహణము, ఉద్దేశమునెరవేర్చుకొనుట, **مطلب کا یار** — కాయార్ (ఉ) స్వార్థపరుడు, స్వప్రయోజనపరుడు, అక్కఱనుబట్టినచెలికాడు.సవ్యాజమిత్రము, **مطلب نکالنا** — నికాల్నా (ఉ) ఉద్దేశమునెరవేర్చుకొనుట, **مطلب یہ ہے** (ఉ) సారాంశమేమన, సారాంశమిది.

**مطلع** మత్లా (అ.పు) ఉదయించుచోటు, తూర్పు; ఆకాశము; కావ్యోదయము, కృత్యాది, కృత్యారంభపద్యము లేక పాదము, లేక చరణము, **مطلع صاف ہونا** — సాఫ్హోనా (అ) ఆకసము నిర్మలముగా నుండుట; వ్యవహారమునిరామయముగానుండుట, ఆటంకములులేకుండుట, నిరాఘాటముగనుండుట.

**مطلع** ముత్తలఉ (అ) తెలియజేయబడిన, తెలిసిన, తెలిసినవాడు, ఎఱిగినవాడు, తెలిసికొనినవాడు, గ్రహించినవాడు.

**مطلق** ముత్లక్ (అ) అపరిచ్ఛిన్నము, విముక్తము, ముక్తము, స్వతంత్రము, అడ్డులేనిది, స్వేచ్ఛగల, సంబంధములేని, తగులాటములేని, నిర్బంధములేని, కట్టులేని, నిరంకుశము, సమగ్రము, సాంతము, బొత్తుగా, సుతరాము **مطلق العنان** — ఉల్ఇనాన్ (అ) నిరంకుశాధికారముగల, సర్వస్వాతంత్ర్యముగల, నిరంకుశాధికారప్రభుత్వముగల.

**مطلقاً** ముత్లకన్ (అ) సంపూర్ణముగా, సాంతముగా, బొత్తుగా, నిరంకుశముగా.

**مطلوب** మత్లూబ్ (అ) అభిలషితము, కోరినది, కాంక్షితము, కావలసినది, అడిగినది; ఆవశ్యకము, అగత్యమైనది, అర్థము ఉద్దిష్టము, అభిప్రేతము, ప్రయోజకము.

**مطمئن** ముత్మయ్యన్ (అ) సంతృప్తిగల,సంతృప్తము,సంతుష్టిగల, సంతుష్టము, సురక్షితము, నిశ్చింతగల, మనశ్శాంతిగల, నిమ్మళముగల, నిర్వ్యాకులుడు, నిశ్చింతుడు, **مطمئن کرنا** — కర్నా (ఉ) సంతుష్టిపరచుట, మనస్సమాధానముగలుగజేయుట, సమాధానపెట్టుట, సంతోషపెట్టుట, మనస్సునకునెమ్మదిగలుగజేయుట.

**مطنجن** ముతంజన్ (అ.పు) మాంసమును పరిమళద్రవ్యములను చక్కెరయు కలిపి వండినచిత్రాన్నము, మాంసపుచిత్రాన్నము.

**مطوق** ముతవ్వక్ (అ) మెడలోకడియము వేసిన, కంటెవేసిన, మెడపట్టావేసిన, మెడసంకెలవేసిన, మెడలోగొలుసువేసిన, మెడపైగీత లేక చాలుగల, మెడ చుట్టు కంటెవలె చాలుగల సావురము.

**مطول** ముతవ్వల్ (అ) పొడిగించినది, పొడుగైనది, పెద్దైనది, దీర్ఘము.

**مطهره** మిత్హర (అ.పు) నీళ్లచెంబు, మాజా చేయుటకు ముందుకాలు చేతులు కడుగుకొనుటకైనచెంబు; కమండలువు, కొమ్ముచెంబు.

న, ఉచితము గానిచ్చిన.

**معافی** ముఆఫీ (అ. స్త్రీ) మన్నింపు, క్షమాపణము, క్షమించుట; విడదల, విడిపించుట, విమోచనము; ఉచితముగా విడుచుట. మన్నించుట; పన్ను లేకుండజేయుట; మాన్యము, **معافی دار** — దార్ (పా) మాన్యము గలవాడు, మాన్యదారుడు, అగ్రహారికుడు **معافی مانگنا** — మాంగ్నా (ఉ) క్షమాపణముగోరుట, మన్నింపవేడుట **معافی استمراری** — ఇస్తిమ్‌రారీ (అ) శాశ్వతాగ్రహారము, సర్వమాన్యము **معافی حین حیات** — హీనెహయాత్ (అ) యావజ్జీవాగ్రహారము లేక మాన్యము, **معافی روسیہ** — ఎ, కవీయ, (పా) సెలవుచీటి, సుంకము లేకుండ సామగ్రులు, కొనిపోవుటకు విడుదలచీటి **معافی نامہ** — నామ (పా) విడుదలచీటి, విమోచనపత్రము, విడుదలకాకితము.

**معاقبت** ముఆక్బత్ (అ. స్త్రీ) కట్టికొట్టడము, శిక్ష, దండనము.

**معالج** ముఆలిజ్ (అ.పు) వైద్యుడు, వెజ్జు, చికిత్సకుడు, భిషక్కు.

**معالجہ** ముఆలజ (అ.పు) చికిత్స, వైద్యము.

**معالی** మఆలీ (అ) ఔన్నత్యములు, గొప్పతనములు, ఘనతలు.

**معاملہ** ముఆమల (అ.పు) వ్యవహారము, ఇచ్చిపుచ్చుకోలు, వర్తకసంబంధము, వ్యాపారము, మాటముచ్చటలు; రాయబారము, వివాదము, వ్యాజ్యము; విషయము, హంశము, సంగతి, **معاملہ بنا** — బన్నా (ఉ) వ్యవహారముచక్కబడుట. కార్యముకలిసివచ్చుట, కార్యముతీరుమానమగుట, **معاملہ پڑنا** — పడ్నా (ఉ) సంబంధముకలుగుట, పనిబడుట, **معاملہ نقدی** — నక్దీ (పా) రొక్కపువ్యాపారము, చేవెంబేరము.

**معاند** ముఆనిద్ (అ) ఎదురుగబడువాడు, పగవాడు, వైరి; మూర్ఖుడు, హఠవాది, మొండి.

**معانقہ** ముఆనక (అ.పు) అన్యోన్యపరిష్వంగము, ఒకరినొకరుకౌగలించుకొనుట, అన్యోన్యాలింగనము.

**معانی** మఆనీ (అ) అర్థములు, అభిప్రాయములు, భావములు, అంతరార్థములు, (ఏ.వ **معنی**).

**معاوضت-معاوضہ** ముఆవజత్ (అ. స్త్రీ) ముఆవజ (అ.పు) ప్రతిఫలము, ప్రతీకారము, ప్రతికృతి; ప్రత్యపకారము, ప్రత్యామ్నాయము, ఒకదానికిమాఱుఇంకొకటి; ప్రతి, మాఱు, తిరుగుదల, అచ్చుదల, అచ్చుకొనుట, మార్చుకొనుట, పరివర్తనము, మాఱకము, మార్పు, మారుదల, **معاوضہ نقدی** — యేనక్దీ (పా) రొక్కముచ్చుకొనుట, ద్రవ్యరూపప్రతిఫలము.

**معاون** ముఆవిన్ (అ.పు) సహాయుడు, సహాయకారి, తోడ్పడువాడు.

**معاونت** ముఆనత్ (అ. స్త్రీ) సహాయపడుట, సహకారము, సహాయముతోడు.

**معاہدہ** ముఆహద (అ.పు) ఒడంబడిక, సమాధానము, కట్టుబాటు, సంధి, సమాధానము, సమ్మతి, ఒడబాటు.

**معائنہ** ముఆయన (అ.పు) సమాలోకనము, అలోకనము, దర్శనము, చూచుట; పైవిచారణ, పరీక్ష, విమర్శనము, పరిశోధనగాజూచుట, విమర్శనగాజూచుట, పరిశీలనము, సరిజూచుట, ఉంహజూచుట.

معبر మిఽబర్ (అ.పు) ఏఱు మొ॥ దాటు సాధనము, పడవ పుట్టి, అఱుగోల, ఓడః వంతెన, వారధి.

معبر ముఅబ్బిర్ (అ.పు) స్వప్న ఫలవేది, స్వప్నఫలము జెప్పువాడు.

معبود మఽబూద్ (అ.పు) పూజితుడు, ఈశ్వరుడు.

معتاد మఽతాద్ (అ.స్త్రీ) ప్రమాణము, నియమించినపరిమాణము, ఔషధపరిమాణము, కొలత, పరిమితి.

معتبر ముఽతబర్ (అ) (అ) విశ్వాసపాత్రుడు, నమ్మతగినవాడు, నమ్మకస్థుడు. పరుపతిగలవాడు, పలుకుబడిగలవాడు.

معتبری ముఽతబరీ (అ.స్త్రీ) విశ్వాసపాత్రత, నమ్మదగియుండుట, పరుపతి, పలుకుబడి, నమ్మకము; గౌరవము, మన్నన, మర్యాద, గొప్పతనము, విశ్వాసము.

معتدل ముఽతదిల్ (అ) మధ్యస్థము, మధ్యమము, పరిమితము, ఎచ్చుతగ్గులు లేని, తగినట్లుగ; సమశీతోష్ణము గల, మధ్యస్థముగానున్న, తగినంతగా నున్న; నెమ్మతిగల, మృదుస్వభావముగల, నిమ్మళముగల, సాధు స్వభావముగల

معترض ముఅతరిజ్ (అ.పు) ఆక్షేపకుడు, పూర్వపక్షముజేయువాడు, కూడదనువాడు, కాదనువాడు, అడ్డముచెప్పువాడు, ఆటంకపరచువాడు, నిరోధించువాడు, معترض ہونا — హోనా (ఉ) ఆక్షేపించుట, ఆటంకపరచుట, నిరోధించుట.

معترف ముఅతరిఫ్ (అ) ఒప్పుకొనువాడు, సమ్మతించువాడు.

معتقد ముఅతకిద్ (అ) విశ్వాసముగలవాడు నమ్మువాడు; భక్తుడు. నమ్మకము గలవాడు, మతస్థుడు, అనుసరించువాడు.

معتمد ముఅతమద్ (అ.పు) నమ్మకస్థుడు, విశ్వసనీయుడు, విశ్వాసపాత్రుడు, విశ్వసింపబడినవాడు, అంతరంగికుడు, కార్యదర్శి معتمد علیہ — అలైహ్ (అ) విశ్వసింపబడిన వాడు, విశ్వాసముంచ బడినవాడు, విశ్వాసపాత్రుడు.

معجزہ ముఅజిజ్ (అ.పు) మహాత్మ్యము, అసాధారణకృత్యము.

معجون మఅజూన్ (అ.స్త్రీ) గంజాయి యుచక్కెరయు కలిపిచేసినమత్తుపదార్థము, లేహ్యము (పుంస)

معدلت మఅదలత్ (అ.స్త్రీ) న్యాయము, సమానభావము, ధర్మము.

معدن మఽదన్ (అ.పు) ఖని, గని, లోహాదులుత్రవ్వితీయుచోటు.

معدنی మఽదనీ (అ) ఖనిసం॥; ఖనిజము, గనినుండిత్రవ్వితీసినది.

معدنیات మఽదనియాత్ (అ.స్త్రీ) ఖనిజములు.

معدود మఽదూద్ (అ) లెక్కించినది, సంఖ్యాతము, లెక్కపెట్టబడిన, లెక్కింపదగిన; కొలదిసంఖ్యగల.

معدولہ మఽదూల (అ) దాటిపోబడినది, అనుదితము, వ్రాసియుపలుకబడని యక్షరము, అనుచ్చారితము.

معدوم మఅదూమ్ (అ) నిర్మూలితము, అభావముజేయబడినది, నాశముజేయబడినది, నష్టము, లేకుండజేయబడినది, معدوم کرنا — కర్నా (ఉ) లేకుండజేయుట, నాశముజేయుట.

معدہ మిఅద (అ.పు) ఉదరము, కడుపు, పొట్ట

معذب (అ) ముఅజ్జబ్ శిక్షితుడు, దండిం

పబడినవాడు; బాధితుడు, పీడింపబడినవాడు, నిరుద్ధుడు, ఆటంకపరుపబడినవాడు.

**معذرت** మఅ్జిరత్ (అ. స్త్రీ) క్షమాపణము, క్షమార్పణము; శెపము, మిష.

**معذور** మఅ్జూర్ (అ) క్షమింపబడినవాడు, క్షమింపదగినవాడు; క్షమార్హుడు, లోపముగలవాడు, ముక్తుడు, విడిచిపెట్టిన, తీసివేసిన, వదలివేసిన; సమర్థతలేని, పనికిమాలిన.

**معرا** ముఅర్రా (అ) దిగంబరము, బిత్తల, దిసమొల, నగ్నము; వ్రాయని, తెల్లని, శుద్ధము, శుభ్రము, స్వచ్ఛము.

**معراج** మెఅ్రాజ్ (అ. స్త్రీ) నిచ్చెన, ఆరోహణము, మహమ్మదుగారి స్వర్గారోహణము.

**معرض** మఅ్రజ్ (అ. పు) కలియుచోటు, కలిసినచోటు, ఘటనస్థానము, సంఘటనస్థానము, కలిగినచోటు, జరిగినచోటు, సంగతి, సందర్భము, స్థానము, ప్రదేశము, స్థలము.

**معرف** ముఅర్రిఫ్ (అ) తెలుపువాడు, ఎఱుకచేయువాడు, పరిచయముజేయువాడు, తెలియజేయువాడు; నివేదకుడు; వర్ణించువాడు.

**معرفت** మఅ్రిఫత్ (అ) పరిజ్ఞానము, తెలివి; ఎఱుక పరిచయము, విద్య, పాండిత్యము, సాధకము, సాధనము, (అవ్యయము) ద్వారా, మూలమున, చే, చేత, తో, తోడ.

**معرکہ** మఅ్రక (అ. పు) యుద్ధరంగము, యుద్ధము, జగడము. **معرکہ گیر** — గీర్ (పా) వీధిజట్టీలు, వీధిలో జట్టిపట్టుపట్టిగాని ఇతరవినోదములు చేసిగాని జనులగుంపును చేర్చువాడు, వీధివినోదులు, దొమ్మరివాడు, **معرکہ آرای** — ఆరాఈ (పా) ప్రముఖుడు, బలవంతుడు.

**معروض — ضہ** మఅ్రూజ్ — జె (అ. పు) విజ్ఞాపనము, ప్రార్థన, విన్నపము, వినంతి, మనవి, మొఱ.

**معروف** మఅ్రూఫ్ (అ) విదితము, ప్రఖ్యాతము, అందరికిని తెలిసియున్న, ప్రసిద్ధుడు, తెలిసినవాడు, పరిచితుడు, (వ్యా) కర్తరిక్రియ, ఊకారముగా బలుకు, (و అనుఅక్షరము), ఈకారముగాబలుకు (ی అనుఅక్షరము).

**معزز** ముఅజ్జజ్ (అ) గౌరవనీయుడు, మహనీయుడు, మర్యాదస్థుడు, పెద్దమనుష్యుడు.

**معزول** మఅ్జూల్ (అ) పదభ్రష్టుడు; పనికిమాలినవాడు, పనిపోయిన, పనినుండి తొలగింపబడినవాడు, త్రోసివేయబడిన, తీసివేసిన.

**معزولی** మఅ్జూలీ (అ. స్త్రీ) పదభ్రష్టత, పదచ్యుతి, పనితొలగిపోయినస్థితి, పనికిమాలినతనము, పనినుండితొలగింపబడినస్థితి; తొలగింపు.

**معسور** మఅ్సూర్ (అ) క్లిష్టము, కఠినము, కష్టమైనది.

**معشر** మఅ్షర్ (అ. పు) చుట్టపక్కములసమూహము, బంధువర్గము, సంఘము, సమాజము.

**معشوق** మఅ్షూక్ (అ. పు) ప్రియుడు, మోహనుడు, వల్లభుడు, మనోహరుడు.

**معشوقانہ** మఅ్షూకాన (అ) మోహనాకారముగల, మోహనము, మనోహరము, కామపూరితము, కాముకము.

**معشوقہ** మఅ్షూక (అ. స్త్రీ) ప్రియురాలు, వల్లభ, మనోహారి.

معلوم మ౭లూమ్ (అ) తెలిసిన, విదితము, ప్రత్యక్షము, వ్యక్తము, ఎఱిగినది, పరిచితము معلوم کرنا — కర్నా (క్రి) తెలిసికొనుట, కనుగొనుట, معلوم هونا — హోనా (క్రి) తెలియవచ్చుట, విదితమగుట అనిపించుట, స్ఫురించుట, తోచుట.

معلومات మ౭లూమాత్ (అ. స్త్రీ) తెలిసినవిషయములు, విదితము, విద్యలు, శాస్త్రము, ప్రాకృతవిషయములు. معلومات عامه — ఎ ఆమ్మ (అ) ప్రపంచజ్ఞానము, చారిత్రిక విషయములు, ప్రాపంచికవిషయము.

معلیٰ ముఅల్లా (అ) ఉన్నతము, మహనీయము, సంభావనీయము, ఉత్తమము, ఘనము, పూజ్యము, గౌరవనీయము معلی القاب — అల్ అల్కాబ్ (అ) మహాబిరుదాంకితులు.

معمار మి౭మార్ (అ) గృహములనిర్మించువాడు, విశ్వకర్మ, కౌరివు, ఉప్పరవాడు, నిర్మాత, కట్టువాడు, పంచాణుడు, శిల్పి, కాసెవాడు, కాసీడు, కమ్మటుడు.

معماری మి౭మారీ (అ. స్త్రీ) శిల్పము, నిర్మాణకర్మ, కట్టేపుపని, పంచాణము, ఉప్పరపని, ఇండ్లు మొ॥ కట్టుపని.

معمر ముఅమ్మర్ (అ) వయసుమీరినవాడు, వృద్ధు, దీర్ఘాయుష్మంతుడు, చిరకాలజీవి.

معمور మ౭మూర్ (అ) నింపబడిన, నిండియున్న, పరిపూర్ణము; జనావాసము, జనులనివసించియున్న, పొలములుగల, సేద్యములోనున్న; పంటపైరులుగల. సాగుబడిగల; శోభావంతము, సమృద్ధిగల, సంతుష్టిగల, కల్యాణవంతము, ఆనందమయము.

معموره మ౭మూర (అ. పు) జనపదము, జనావాసము, పంటభూమి; పరిపూర్ణము, సమృద్ధము.

معموری మ౭మూరీ (అ స్త్రీ) జనబాహుళ్యము, జనవాసము, పంటపైరులు, సేద్యము, సాగుబడి; పరిపూర్ణము, సమృద్ధి.

معمول మ౭మూల్ (అ) అనుష్ఠితము, ఆచరితము, ఆచరించబడినది; (పు) సాంప్రదాయము, ఆచారము, వాడుక, అలవాటు.

معمولی మ౭మూలీ (అ) ఆచారమైన, వాడుకయైన, అలవాటుపడిన, ప్రహితము, వాడుకలోనున్న, సాధారణము, సామాన్యము.

معما — معمه ముఅమ్మా-మ్మ (అ. పు) గూఢము, గుప్తము, గోప్యము; చిక్కు, విడికథ. معمه حل کرنا — హల్ కర్నా (క్రి) పొడికథవిప్పుట.

معنبر ముఅంబర్ (అ) అంబరమను పరిమళద్రవ్యముతో వాసనకట్టించినది, వాసితము, అంబరవాసితము.

معنق ముఅన్నక్ (అ. పు) మెడకు వేసికొనునది, పట్టెడ, గ్రైవేయము.

معنوی మ౭నవీ (అ) అర్థసంబం॥, యథార్థమైన, ముఖ్యమైన, అంతరము, అభిప్రేతము, భావితము, ఊహింపదగినది, ఉద్దేశింపబడినది, ఊహ్యము.

معنی — معانی మ౭నా-మ౭నీ (అ స్త్రీ) అర్థము, అభిప్రాయము, భావము, ఉద్దేశము.

معود ముఅవ్వద్ (అ) మరలవచ్చునది, అలవాటుపడినది, వాడుకైన, నేర్పబడిన, శిక్షితము, అభ్యస్తము.

معون ముఊన (అ. పు) సహాయములు, (ఏ.వ معونت).

**معہود** ము ఽ హూద్ (అ) ఒడంబడికయైన, ఒప్పుకోనబడిన ఒడంబడిన, ఒడంబాటైన, ఏర్పాటైన, నిర్ణీతమైన, నిశ్చితమైన, వాగ్దత్తమైన.

**معیار** మి ఽ యార్ (అ.పు) బంగారువెండి మొ॥ వానిసాణెముచూచుఱాయి, ఒఱగల్లు; తూనికరాయి, ఎతు

**معیشت** మఈషత్ (అ. స్త్రీ) జీవనము, జీవిక, బత్తెము, భోజనపదార్థములు.

**معین** ముఅయ్యన్ (అ) నిర్ణీతము, నిశ్చితము, ఏర్పాటైనది, నిర్ణయింపబడినది, నియమితము. **وقت معین** వక్తె ముఅయ్యన (అ) నియమితకాలము.

**معین** ముఈన్ (అ) సహాయకుడు, సహాయుడు, సహకారి, తోడ్పడువాడు.

**معیوب** మ ఽ యూబ్ (అ) దోషముగలది, దూషితము. కళంకితము, దుష్టము.

**مغ** ముగ్ (పా.పు) అగ్న్యుపాసకుడు, అగ్నిపూజచేయువాడు.

**مغاث هندی** ముగ్గాసెహిందీ (అ) నెర మామిడిచెక్క, మేదచెక్క.

**مغاک** మగ్గాక్ (పా.పు) గుంట, బొంద, పల్లము.

**مغالطہ** ముగ్గాలత (అ.పు) మోసగింపు, పొరపాటులో పడవేయుట, మోసము, పొరపాటు, ప్రమాదము, భ్రమ, తప్పు. **مغالطہ دینا** — దేనా (ఉ) పొరపడజేయుట, మోసగించుట, వంచించుట

**مغائر** ముగ్గాయిర్ (అ) విరుద్ధము, ప్రతికూలము, విరువము.

**مغایرت** ముగ్గాయరత్ (అ.స్త్రీ) ప్రాతికూల్యము. విరోధము, వైరుధ్యము, అననుకూలత, స్పర్థ, అసమాధానము.

**مغتنم** ముగ్తనిమ్ (అ) సమృద్ధిగాగలవాడు, సంపన్నుడు; సంతుష్టుడు.

**مغرب** మగ్రిబ్ (అ.పు) అస్తము, అస్తమయము; పశ్చిమము. పడమరదిక్కు.

**مغربی** మగ్రబీ (అ) పశ్చిమము, పాశ్చాత్యము. పడమటి.

**مغرق** ముగ్రక్ (అ) మునిచబడినది, మజ్జితము, మగ్నము; బంగారు లేక వెండిపూతపూసినది.

**مغرور** మగ్రూర్ (అ) గర్వముగలవాడు, గర్వి, అహంకారముగలవాడు, అహంకారి, తలబిరుసుగాడు.

**مغروری** మగ్రూరీ (అ. స్త్రీ) గర్వము, అహంకారము. తలబిరుసుతనము.

**مغز** మగ్జ్ (పా.పు) మెదడు, మజ్జ, మేదస్సు; చేవ, సారము, గుజ్జులోని భాగము; ఊచ, బెండు; మేధ, తెలివి; గర్వము, అహంకారము; మేలుజాతి ముత్యము. **مغز املتاس** — ఏ అమల్తాస్ (పా) రేలగుజ్జు. **مغز خیارشنبر** — ఏ ఖియార్‌షంబర్ (పా) రేలకాయగుజ్జు. **مغز پچانا** — పచానా (ఉ) తలబీకనకాయుచేయుట, విసికించుట.

**مغزی** మగ్జీ (పా స్త్రీ) అంచుమడిచి కుట్టినది, ముడిచికుట్టినఅంచు, అంచుమడిచినకుట్టు.

**مغفر** మిగ్ఫర్ (అ.పు) శిరస్త్రాణము, ఇనుపగొలుసుటోపి, తలకవచము.

**مغفرت** మగ్ఫిరత్ (అ.స్త్రీ) క్షమాపణము, మన్నింపు. పాపములక్షమించుట, మన్నించుట, విడుదల, విమోచనము.

**مغفور** మగ్ఫూర్ (అ) పాపములక్షమింపబడిన, ముక్తుడు; పరలోకగతుడు, స్వర్గస్థుడు (చచ్చినవాడు).

**مغل** ముగ్గల్ (అ.పు) మొగలాయితురక.

**مغلانی** ముగలానీ (అ.స్త్రీ) మొగలాయితురకయాడుది; కుట్టుపనిజేయు స్త్రీ, మేరిపనియాడుది; అంతఃపురద్వారపాలకురాలు.

**مغلظ** ముగ్లజ్ (అ) లావైన, మోటు; కఠినము, పరుషము, ముతక; మురికిమాటలు, దుర్భాషలు, తిట్లు, బూతులు.

**مغلظات** ముగ్లజాత్ (అ.స్త్రీ) మురికిమాటలు, దుర్భాషలు, తిట్లు బూతులు.

**مغلق** ముగ్లక్ (అ) క్లిష్టార్థము, దుర్బోధము, అర్థము తెలియరానిది.

**مغلوب** మగ్లూబ్ (అ) జయింపబడిన, విజితము, లోపరచుకొనబడిన, ఓడింపబడిన, వశమైన. లొంగిన, స్వాధీనమైన

**مغموم** మగ్మూమ్ (అ) దుఃఖితము, ఖిన్నుడు, దుఃఖముగల, ఖిన్నము.

**مغنی** ముగన్నీ (అ.పు) గాయకుడు. పాటకాడు, సంగీతపరుడు.

**مغیب** ముగీబ్ (అ) గుప్తము, గూఢము, అదృశ్యము, పరోక్షము, అగపడనిది, దాచినది.

**مغیر** ముగయ్యిర్ (అ) మారినది, వ్యతిరిక్తము. భిన్నము, వ్యత్యయము, అన్యము, ఇతరము.

**مغیلان** ముగీలాన్ (పా.పు) తుమ్మచెట్టు, ముండ్లచెట్టు.

**مفاجات** ముఫాజాత్ (అ) ఆకస్మికము. అతర్కితముగా కలిగినది, **مرگ مفاجات** మర్గెముఫాజాత్ (పా) ఆకస్మికమరణము, అకాలమరణము.

**مفاخرت** ముఫాఖరత్ (అ స్త్రీ) గర్వము, డంబము; అధిక్యత, గొప్పతనము.

**مفارقت** ముఫారకత్ (అ. స్త్రీ) వేరగుట; విడుచుట, విడ్పాటు, ఎడబాటు.

**مفاصل** మఫాసిల్ (అ) సంధులు, కీళ్లు, అతుకులు, కాలుచేతులకీళ్లు (ఏ.వ **مفصل**)

**مفاصل** ముఫాసల (అ) అంతరము, దూరము, దవ్వు; భేదము.

**مفت** ముఫ్త్ (అ) ఉచితము, ఊరక, మాలులేక, ప్రతిఫలములేక, వెలలేక, ఏమియులేకుండ, వ్యర్థము, నిరర్థకము; **مفت میں** — మేఁ (ఉ) ఉచితముగా, నిరర్థకముగా, **مفت راچہ گفت** — రాచగుఫ్త్ (పా) ఊరకయిచ్చినదానికిఊకులాటయేల, **مفت خور** — ఖోర్ (పా) వెడకూడుతినువాడు, వెడకూటివాడు, పున్నెపుతిండితినువాడు, **مفت کا کام** — కాకామ్ (ఉ) వెట్టిపని, కూలిలేనిపని.

**مفتاح** మిఫ్తాహ్ (అ.పు) తాళపుచెవి, బీగపుచెవి, చెవి.

**مفتر** ముఫ్తర్ (అ) అలసిన, సొలసిన, దుర్బలమైన.

**مفتری** ముఫ్తరీ (అ.స్త్రీ) ఆరోపించువాడు, ఆరోపకుడు, నిందమోపువాడు, అరడిపెట్టువాడు, దూషకుడు, కల్లరి, మోసగాడు, పోకిరి.

**مفتقر** ముఫ్తకర్ (అ) దరిద్రుడు, రికుడు, బీద.

**مفتوح** మఫ్తూహ్ (అ) జయింపబడిన, విజితము, గెలువబడిన; అకారసంజ్ఞగల, జేబరు(**زبر**) గుర్తుగలయక్షరము.

**مفتون** మఫ్తూన్ (అ) మోహితుడు, మోహపరవశుడు, వలపులోతగులుకొనినవాడు, కామచింతగలవాడు.

**مفتی** ముఫ్తీ (అ) మహమ్మదీయధర్మశాస్త్రజ్ఞుడు.

ఉల్ వాల్ (అ) దరిద్రదశలోనున్నవాడు, గుర్దశలోనున్నవాఁడు, దౌర్భాగ్యుడు.

**مفوض** ముఫ్విజే (అ) [illegible]ంచిన, స్వాధీనపరచిన, అప్పగి[illegible] వశపరచిన, ఇచ్చిన, దత్తము, అర్పితము, ఆరోపితము.

**مفهوم** మఫ్హూమ్ (అ) తెలియబడినది, జ్ఞాతము, అభిప్రాయము, భావము, భావితము, [illegible]ము.

**مفید** [illegible] (అ) ఉపకారకము, మేలుచేయునది, శ్లాఘకారి. అనుకూలము, అనుగుణము, ప్రయోజనకారి, ఉపయోగకరము, పనికివచ్చునది,

**مقابر** మఖాబిర్ (అ.పు) సమాధులు, శవములుపూడ్చినచోట్లు (ఏ.వ **مقبره**)

**مقابل** ముఖాబిల్ (అ) ముంగల, ముంగు, పురోభాగము, ఎదరు, అభిముఖము, సమక్షము; విరుద్ధము, ఎదిరి, ప్రతిపక్షము, పోటీ, ఎదుటి, ప్రతి; ముంగలి, ముందరి, ముఖాముఖిగానున్న; పోల్చిచూచిన.

**مقابله** ముఖాబల (అ.పు) ఎదురుపాటు, అభిముఖ్యము, ఎదురుబడుట, ప్రఘటించు, ప్రఘటించుట, మార్కొనుట; సమక్షము, ఎదురుకట్టు; పోటీ, వైరము, విరోధము, వైమనస్యము, **مقابله کرنا** — కర్నా (క్రి) ప్రఘటించుట, మార్కొనుట, ఎదురుబడుట, ఎదురుగుగుట; తులదూగుట, పోటీకెక్కుట, **مقابله هونا** — హోనా (క్రి) ముఖాముఖి యగుట, ఎదురుపాటగుట, ఎదురుపడుట, పోటీపడుట, పోటీజరుగుట, వివాదము జరుగుట, కలహముపడుట, వైరము గలుగుట.

**مقابه** ము[illegible] (అ.పు) కోటకము, బట్టలుపెట్టె, వస్త్రపేటిక.

**مقاتله** ముఖాతల (అ.పు) అన్యోన్యసంహారము, ఒకరినొకరుచంపుకొనుట; సంహారము, యుద్ధము, కలహము, పోట్లాట.

**مقاربت** ముఖారబత్ (అ.స్త్రీ) ఉపసర్పణము, దగ్గరుట, సమీపించుట, సంగమము, సంగమనము, స్త్రీనిసమీపించుట.

**مقارنت** ముఖారనత్ (అ.స్త్రీ) సంయోగము, సహవాసము, కూడిక, పరిచయము, కలిసియుండుట; రెండుగ్రహముల కూటము.

**مقاسمت** ముఖాసమత్ (అ.స్త్రీ) కలిసి పంచుకొనుట, విభాగము, పంపకము, భాగములు పంచుకొనుట; ప్రమాణము చేయుట, ఒట్టుదినుట.

**مقاصد** ముఖాసిద్ (అ.పు) చూడు (ఏ.వ **مقصد**) ఉద్దేశములు, సంకల్పములు.

**مقاله** ముఖాల (అ.పు) పదము, భాషణము, వచనము; సామెత; భాగము, అధ్యాయము, సంపుటము, గ్రంథము, పుస్తకము.

**مقام** ముఖామ్—మఖామ్ (అ.పు) నిలుచుచోటు, స్థానము, నివాసము, స్థలము, స్థావరము, బస, దిగుచోటు, **مقام کرنا** — కర్నా (క్రి) బసజేయుట, నిలుచుట, **مقام بولنا** — బోల్నా (క్రి) బసజేయ నాజ్ఞాపించుట, నిలువమనుట.

**مقامر** ముఖామిర్ (అ.పు) జూదరి, జూదమాడువాడు.

**مقامی** ముఖామీ (అ) స్థానికము, స్థానసంబంధి, నిలుకడగల, స్థావరముగల, నివాసముగనుండు.

**مقاومت** ముఖావమత్ (అ.స్త్రీ) ప్రతిఘటించుట, మార్కొనుట, పోటీకెక్కుట, ఎదిరించుట, అడ్డపడుట, ప్రతిఘటనము.

**مقبره** మఖ్బర (అ.స్త్రీ) సమాధి, శవము

**مقر** ముక్కిర్ (అ) ఒప్పుకొనువాడు, సమ్మతించువాడు.

**مقراض** మిక్రాజ్ (అ. స్త్రీ) కత్తెర, కత్తెరకోల, కత్తిరించుసాధనము, **مقراض الهند** — ఉల్ హింద్ (అ) అడకొత్తు పోకొత్తు.

**مقرب** ముకర్రబ్ (అ. పు) సమీపస్థుడు, అంతరంగికుడు, రహస్యవేది; బంధువు, ప్రియుడు, మిత్రము, విశ్వాసుడు, **مقرب الخدمت** — ఉల్ ఖిద్మత్ (అ) అంతరంగికసేవకుడు, అంతరంగికుడు.

**مقرر** ముకర్రర్ (అ) నియోగింపబడినది, నిర్ణయింపబడినది, నిశ్చయింపబడినది, నియమితము, నిర్ణీతము, నిశ్చితము, దృఢీకృతము, స్థాపితము, నియుక్తము, **مقرر کرنا** — కర్నా (ఉ) నియోగించుట, ఏర్పాటుచేయుట.

**مقررہ** ముకర్రర (అ) నిర్ణీతము, నియమితము, (చూడు **مقرر**).

**مقرری** ముకర్రరీ (అ. స్త్రీ) ఉపవేతనము, ప్రత్యేకముగానిచ్చువేతనము, మాన్యము, శాశ్వతమాన్యము, ఉద్యోగము, కొలువు.

**مقروض** మక్రూజ్ (అ) ఋణస్థుడు, అప్పుపడినవాడు, అప్పులకొప్పు.

**مقروق - ق** మక్రూక్-క్ (అ) ఆజ్ఞాబద్ధము, నిషిద్ధము, కట్టులోనుంచినది, వశపరచుకొనబడినది, వశగతము, కావలిలోనున్నది, విచారణలోనున్నది, అజ్ఞలోనుంచినది, ఆటంకపరచినది.

**مقرون** మక్రూన్ (అ) కలిసియున్నది, సమీపస్థము, చేరువది, పొరుగునున్నది, దగ్గరగానున్నది, దాపైనది, చేరియున్నది.

**مقسوم** మక్సూమ్ (అ) భాగింపబడినది, విభక్తము, విభాజితము, పంచబడినది; భాగ్యము, అదృష్టము, విధి, దైవము; విభాజ్యము, **مقسوم علیہ** — అలైహ్ (అ) విభాజకము, భాగించుసంఖ్య, **مقسوم علیہ اعظم** — ఎఅజమ్(అ) గరిష్ఠసామాన్యము.

**مقشر** ముకష్షర్ (అ) పొట్టుతీసిన, చెక్కతీసిన, తొలకఒలిచిన, తోలూడ్చిన, తోలుదోగిన, తోలుతీసిన.

**مقصد** మక్సద్ (అ. పు) ఉద్దేశము, అభిప్రాయము, అభిలాష, అభిలషితము, కోరిక, **مقصد برانا** — బరానా (ఉ) ఉద్దేశముసెరవేరుట, కోరికఈడేరుట.

**مقصر** ముకస్సర్ (అ) న్యూనము, తక్కువైనది, కొరతగలది, లోపముగలది, కొఱవడినది.

**مقصود** మక్సూద్ (అ. పు) ఉద్దేశము, అభిప్రేతము, అభిలషితము, అభిప్రాయము, అభీష్టము, కోరిక, తలంపు.

**مقصور** మక్సూర్ (అ. పు) సంగ్రహము, సంక్షేపము, సమాహృతము, సంక్షిప్తము, తగ్గించినది, క్లుప్తము...

**مقصورہ** మక్సూర (అ. పు) గర్భగుడి, అంతర్భాగము.

**مقط** మిక్త్ (అ. పు) రెల్లుకలమునకుపల్లు కొట్టునపుడు అడుగునఉంతగాబెట్టుకొయ్యముక్క.

**مقطر** ముకత్తర్ (అ) బొట్లుగాపడినది, స్రుతము, గళితము, స్రావము, కారినది.

**مقطع** మక్తఅ (అ. పు) కవితయొక్కకడపటిచరణము, కృతికర్తయొక్కనామాంకితముగలచరణము; సమాప్తి, అంతము, విరామస్థానము, ఎపైశాటుచోటు; నిలుకడ, విరామము, విరమణము.

**مقطع** ముక్తఅ (అ) కోయబడినది, ఛే

ఛేదితము, కత్తిరించినది, పరిష్కృతము, శాస్త్రానుసారము కత్తిరించిన గడ్డము మొ॥, గంభీరమైన.

**مقعر** ముకఉర్ (అ) లోతుగల, లోతు గాత్రవ్వినగుంట మొ॥, గంభీరమైన.

**مقفی - مقفا** ముకఫ్ఫా (అ) అంత్య ప్రాసముగల, ప్రాసయుక్తము.

**مقفل** ముకఫ్ఫల్ (అ) తాళము వేసిన, బీగము వేసిన, గడియ వేసిన, కీలితము.

**مقلب** ముకల్లిబ్ (అ) మార్చువాడు, పరిణామ కారకుడు, మార్చు, తలక్రిందుచేయు, తారుమారుచేయు, నూతనసృష్టిచేయువాడు, క్రొత్త వాటిని కల్పించువాడు.

**مقلد** ముకల్లిద్ (అ) అనుకరించువాడు, చేసినట్లు చేయువాడు, శిష్యుడు, భక్తుడు, అనుసరించువాడు.

**مقلوب** మక్లూబ్ (అ) పరివర్తితము, మార్చబడినది, పరిణతము, మారినది, తలక్రిందైన, వ్యత్యస్తము, తారుమారైనది, వ్యత్యయము, క్రిందులయినది. **مقلوب مستری** — మిస్త్రీ (అ) కుడియెడమలలో వెటునుండిచదివినను ఒకటిగానుండుపదము, వాక్యము మొ॥.

**مقناطیس** మక్నాతీస్ (అ.పు) అయస్కాంతము, సూదంటురాయి.

**مقنعه** మిక్నఅ (అ.పు) పెండ్లికూతురిముసుగువస్త్రము, మధుపర్కము, ఉత్తరీయము.

**مقوله** మక్వాల (అ.పు) సామెత, లోకోక్తి,

**مقوی** ముకవ్వీ (అ) పౌష్టికము, బలము నిచ్చునది.

**مقوا** ముకవ్వా (అ పు) అట్ట, కాకితపు అట్ట.

**مقهور** మక్‌హూర్ (అ) గెలువబడినవాడు, విజితుడు, లోబరచుకొనబడినవాడు; ఆగ్రహపాత్రుడు, శిక్షితుడు, పీడితుడు.

**مقیی** ముకయ్యీ (అ.పు) వాంతి తెచ్చునది, వమనకారి (మందు).

**مقیاس** మిక్యాస్ (అ.పు) కొలకోల, కొలిచెడుకఱ్ఱ; గడియారపుముల్లు; మానము, కొలుచునది, ప్రమాణము, **مقیاس الحرارت** — ఉల్‌హరారత్ (అ) ఉష్ణమాపకము, ఉష్ణమానము, **مقیاس الموسم** — ఉల్‌మౌసమ్ (అ) వాతావరణమాపకము, ఋతుమాపకము, ఋతుదర్శకము

**مقید** ముకయ్యద్ (అ) చెఱపెట్టబడినవాడు, నిబద్ధుడు, నిషిద్ధుడు, బద్ధుడు, బంది, కారాగారసుడు, చెరసాలవాసి.

**مقیش** ముకయ్యష్ (అ.పు) బంగారు లేక వెండితీగ, లేకసరిగ, బంగారు లేక వెండిగోటు.

**مقیشی** ముకయ్యషీ (అ. స్త్రీ) బంగారు లేక వెండిజలతారుపనిచేసిన, సరిగపని చేసియున్న, సరిగపనిగల.

**مقیم** ముకీమ్ (అ) నివాసకమైన, బసచేసిన; స్థావరమైన, నివాసముగల, స్థావరముగల; నివాసి, స్థానికుడు, నివాసుడు.

**مکا جواری مکا - مکا** మక్కా—జవారీ (హి) మక్కజొన్న.

**مکا** ముక్కా (హి.పు) ముష్టిఘాతము, పిడికిటిపోటు.

**مکاتب** మకాతిబ్ (అ.పు) బడులు, పాఠశాలలు, (ఏ.వ **مکتب**).

**مکاتبت** ముకాతబత్ (అ. స్త్రీ) పత్రవ్యవహారము. ఉత్తరపత్రములు వ్రాసికొనుట.

**مکار** మక్కార్ (అ.పు) వంచకుడు, మోసగాడు, టక్కరి, ధూర్తుడు, మాయలు

మారి.

**مکارہ** మక్కార (అ.స్త్రీ) వంచకురాలు, మోసగత్తె, మాయలాడి, ధూర్తురాలు, టక్కులాడి.

**مکاری** మక్కారీ (అ.స్త్రీ) మోసము, ధూర్తతనము, వంచన, జిత్తులు.

**مکاشفہ** ముకాషఫ (అ.పు) దివ్యబోధ, దివ్యసంకల్పము, దైవికముగాదోచినవిషయము, ఈశ్వరప్రేరణవలనదెలియవచ్చినవిషయము, దైవప్రేరణచేతెలియవచ్చుట; ప్రత్యక్షద్వేషము.

**مکافات** మకాఫాత్ (అ.స్త్రీ) ప్రతీకారము, వైరశుద్ధి, నష్టపరిహారము, ప్రతిఫలము, ప్రత్యపకారము

**مکال** ముకాల్ (హి) చక్కరగానుగిద్ద, "బాబుముకాల్" అనుదేవతకునైవేద్యముపెట్టుచోటు, సుకాలనివేదనస్థానము,

**مکان** మకాన్ (అ.పు) నివాసము, ఉనికిపట్టు; ఇల్లు, గృహము, **مکاندار** —దార్ (పా) గృహపతి, గృహస్థుడు, **مکان کرایہ دینا** — కిరాయదేనా (ఉ) ఇల్లుఅద్దెకుయిచ్చుట, **مکان کرایہ لینا** —కిరాయలేనా (ఉ) ఇల్లుఅద్దెకుతీసికొనుట.

**مکائد** మకాయిద్ (అ) మోసములు, జిత్తులు, టక్కులు. మాయలు. (ఏ.వ مکیدہ)

**مکبر** ముకబ్బిర్ (అ) గౌరవించు, పెద్దజేయు; "اللہ اکبر" అనువాక్యమును ఉద్ఘోషించువాడు లేక జపించువాడు.

**مکت** ముక్త్ (హి.స్త్రీ) ముక్తి, విమోచనము, విడుదల.

**مکتا** ముక్తా (హి.పు) మౌక్తికము, ముత్తెము.

**مکتب** మక్తబ్ (అ.పు) పాఠశాల, బడి, విద్యాలయము.

**مکتوب** మక్తూబ్ (అ.పు) లిఖితము, వ్రాసినది, ఉత్తరము, లేఖ, చీటి **مکتوب الیہ** —ఇలైహి (అ) పత్రగ్రహీత, పైవిలాసదారుడు, ఉత్తరముగొనువాడు.

**مکتفی** ముక్తఫీ (అ) సంతుష్టికరము, సంతృప్తికరము, చాలినంత, చాలిన, కావలసినంత, ఆటునట్టి, సరిపోయెడు, సరిపడిన.

**مکٹ** ముకుట్ (హి.పు) మకుటము, ముకుటము, బొమిడికము.

**مکحل** మిక్హల్ (అ.పు) కాటుకపుడక, కండ్లకుకాటుకపట్టించుకొను సీసపుపుడక (కడ్డీ)

**مکدر** ముకద్దర్ (అ) కలుషితము, కలతబారిన, మురికిదైన, బురదగానైన, మలినమైన (నీరు మొ॥); వ్యాకులితము, ఖిన్నము, దుఃఖితము; శ్రాంతము, వేసారిన, విసికిన (మనసు).

**مکر** మకర్ (హి.పు) మకరము, మకరరాశి.

**مکر** మక్ర్ (అ.పు) మోసము, వంచన, మాయలు, కుయుక్తి.

**مکرانا** ముక్రానా (హి) పూర్వపక్షము జేయుట, ఒకరుచెప్పినది కాదనుట, అబద్ధమనిచూపుట, లేదనుట, లేదనిచూపుట.

**مکرر** ముకర్రర్ (అ) రెండవసారి, మరియొకమారు, మరల; పునరుక్తము, పలుమారు **مکرر سکرر** —సెకర్రర్ (పా) రెండుమూడుసారులు, పలుమారు, మాటిమాటికి, తేపతేపకు.

**مکرم** ముకర్రమ్ (అ) సంభావితుడు, గౌరవింపబడినవాడు, గౌరవనీయుడు, వందితుడు. పూజ్యుడు, సేవితుడు, ఘనుడు, గొప్పవాడు.

**مکرمت** ముక్రమత్ (అ. స్త్రీ) ఘనత, గౌరవము, గొప్పతనము; అనుగ్రహము, కటాక్షము, ప్రసాదము.

**مکرنا** ముకర్నా (హి) అడితప్పుట, లేదనుట, కాదనుట

**مکروه** ముక్రూహ్ (అ) అనిష్టము, అనుచితము, అసహ్యకరము, రోతపుట్టించునది, జుగుప్సాంతము, ఏవగింపుపుట్టించునది.

**مکڑا - مکڑ** మక్కడ్-మక్డా (హి పు) పెద్దజాతిసాలెపురుగు.

**مکڑی** మక్డీ (హి. స్త్రీ) సాలెపురుగు, సాలీడు, **مکڑی کا جالا** — కాజాలా (హి) సాలెగూడు, బూజు, సాలెపట్టు, అతిసున్నితము.

**مکسر** ముకస్సర్ (అ) ముక్కలైన తునకలైన, భిన్నమైన, శిథిలమైన, విభాజితము, భాగములుచేయబడినది.

**مکسوبہ** మక్సూబ (అ) ఆర్జితము, సంపాదింపబడినది, గడించినది, **مکسوبہ ذاتی** — యేజాతీ (పా) స్వార్జితము, తానుగాసంపాదించినది

**مکسور** మక్సూర్ (అ) ఇకారసంజ్ఞగల, జేరు (**زیر**) అనుగుర్తుగల (గణిత) భిన్నాంకము.

**مکشوف** మక్షూఫ్ (అ) ప్రకటితము, వెల్లడిచేయుబడినది, ప్రత్యక్షము, దైవికముగా తెలిపిన, ఈశ్వరప్రేరితము.

**مکعب** ముకఅబ్ (అ) ఘనము, ఘనపరిమాణముగల, పొడుగును వెడల్పును లోతును సమానముగాగలయాకారము.

**مکفول** మక్ఫూల్ (అ) కుదువపెట్టిన, తాకట్టుపెట్టిన.

**مکلف** ముకల్లఫ్ (అ) కష్టపడిచేసినది, శ్రమపడిచేసినది, పరిశ్రమతోజేసినది; పరిష్కృతము, చక్కగాఅలంకరింపబడినది, తీర్చినది, దిద్దినది, సజ్జితము, అలంకృతము, సింగారించినది, మిక్కిలిచక్కగానమర్చినది.

**مکلل** ముకల్లల్ (అ) రత్నఖచితము, మణిమయము, మణులుచెక్కినది, రత్నములుదాపినది, ప్రకాశమానము, అలంకృతము; కిరీటముగల.

**مکمل** ముకమ్మల్ (అ) పరిపూర్ణము, సంపూర్ణము, పరిపూర్తియైన, సమాప్తము, పరిసమాప్తము, పారంగతము, పాండిత్యముగల.

**مکنت** ముక్నత్ (అ. స్త్రీ) సామర్థ్యము, అధికారము, బలము.

**مکنون** మక్నూన్ (అ) గుప్తము, దాచినది; శ్రేష్ఠము **در مکنون** దుర్రెమక్నూన్ (పా) ఆణిముత్యము.

**مکوه** మకోహ్ (హి) కామంచిచెట్టు, **کالا مکو - اودا مکو** కాలామకో— ఊదామకో (హి) నల్లకామంచి, **لال مکو** లాల్‌మకో (హి) ఎఱ్ఱకామంచిచెట్టు.

**مکہ** మక్కా (అ. పు) అరేబియాదేశమందలి ఒకపట్టణముపేరు (ఇదిహజరతుమహమ్మదుగారి జన్మస్థానము).

**مکهن** మక్ఖన్ (హి. పు) నవనీతము, వెన్న.

**مکهنا** మఖ్నా (హి. పు) దంతములులేని ఏనుగు; కాలికిత్రొక్కుబోటులేనికోడిపుంజు.

**مکهی** మక్ఖీ (హి. స్త్రీ) మక్షికము, ఈగ, **مکهی چوس** — చూస్ (హి) లుబ్ధుడు, పిసినారి.

**مکهی** ముక్కీ (హి స్త్రీ) ముష్టిఘాతము, పిడికిటిపోటు.

**مکئی** మకయీ (హి స్త్రీ) మొక్కజొన్న,

مکیدت మకీదత్ (అ. స్త్రీ) మోసము, వంచన, టక్కు, అపకారము.

مکین మకీన్ (అ.పు) ఇంటియజమాని, గృహపతి, గృహస్థుడు; నివసించువాడు, నివాసి, ఉండువాడు; నిబ్బరముగలవాడు, గాంభీర్యముగలవాడు, గంభీరస్వభావముగలవాడు.

مگدر ముగ్దర్ (హి.పు) లోడి, మల్లులు అభ్యాసము చేయుటకు ఉపయోగించు కొయ్య, గద, కొయ్యగద.

مگر మగర్ (పా) కాని, అయినను, اگر مگر کرنا — అగర్ మగర్ కర్నా (ఉ) సంకోచించుట, వెనుకముందాడుట, వెనుకాడుట.

مگر మగర్ (హి.పు) మకరము, మొసలి.

مگرا మగ్రా (హి పు) గర్వపోతు, అహంకారముగలవాడు, ధూర్తు, పోకిరి, మూఢుడు, తలబిరుసు గాడు.

مگرائی - مگراپن మగ్రాపన్-మగ్రాయీ (హి.పు) తలబిరుసుతనము, అహంకారము, ధూర్తత్వము, పోకిరితనము, గర్వపోతుతనము.

مگرمچھ మగర్మఛ్ (హి పు) మకరము, మొసలి.

مگری మగ్రీ (హి. స్త్రీ) నడికొప్పుదూలము.

مگریلا మగ్రేలా (హి.పు) ఒకఘాటువిత్తులు, ఘాటువిత్తులు.

مگس మగస్ (పా.పు) మక్షికము, ఈగ, مگس شہد — ఎషహద్ (పా) తేనెటీగ, మధుమక్షికము.

مگسر మగ్సిర్ (హి.పు) మార్గశీర్ష మాసము.

مگن మగన్ (హి) మగ్నము, మగ్నుడు, మునిగినవాడు; ఆనందమగ్నుడు, ఆనంద పరవశుడు, ఆనందభరితుడు, సంతోషపరవశుడు.

مگھا మఘా (హి.పు) మఖానక్షత్రము.

مل మల్ (పా. స్త్రీ) ద్రాక్షసారాయము, సారాయి.

ملا ముల్లా (అ.పు) పండితుడు, శాస్త్రజ్ఞుడు; ఉపాధ్యాయుడు, వైద్యుడు, తీర్పరి, పురోహితుడు (ఉ) ఇతరపక్షులను పిలుచుకొనివచ్చునట్లు నేర్పియుంచినపక్షి, ملا قرانی — ఖురానీ (పా) ఖురానుషరీఫు పట్టించి ప్రమాణము చేయించువాడు, ملا گری — గరీ (పా) ఉపాధ్యాయత్వము.

ملاپ మిలాప్ (హి. స్త్రీ) మేళనము, కలయిక, ఐకమత్యము, పొందిక, అనుకూల్యము, అనుగుణ్యము, అన్యోన్యము, సంధి, ఒడంబడిక, సమాధానము, పొందు, కూడిక, చేరిక, సమ్మేళనము

ملاپی మిలాపీ (హి.పు) కలిసిమెలిసియుండువాడు.

ملاح మల్లాహ్ (అ.పు) నావికుడు, పడవవాడు, పడవనడపువాడు, తండేలు; ఉప్పుతీయువాడు, ఉప్పుచేయువాడు.

ملاحت మలాహత్ (అ. స్త్రీ) లావణ్యము; రుచి; సౌందర్యము, దేహకాంతి, అందము, చక్కదనము.

ملاحد మలాహిద్ (అ పు) నాస్తికుడు, చార్వాకులు, పాషండులు (ఏ.వ ملحد)

ملاحظہ ములాహజే (అ.పు) వీక్షణము, చూపు, దృష్టి; కటాక్షము, కటాక్షవీక్షణము, క్రేగంటిచూపు, చూచుట, సరిచూచుట, ఆలోకనము, పర్యావలోకనము: అనుగ్రహము, ప్రసాదము, దాక్షిణ్యము, మొగమోటము; లక్ష్యము, ملاحظہ کرنا — కర్నా (ఉ) విలో

కించుట, పరిశీలించిచూచుట, పరీక్షించి చూచుట, ملاحظہ کا آدمی — ములాహిజా కా ఆద్మీ (ఉ) మొగమోటస్థుడు, మొగమోటముగలవాడు.

ملاحی మల్లాహీ (అ. స్త్రీ) పడవవానిపని, నావికత్వము, పడవనడుపుట.

ملاذ — ملاذ మలాజ్ (అ. పు) శరణాలయము, ఆశ్రయస్థానము, సురక్షితమగుచోటు, (కోట మొ||).

ملار మలార్ (హి. స్త్రీ) రాగవిశేషము, (ఇదివానకాలమున పాడుదురు).

ملازم ములాజిమ్ (అ. పు) సదాచేరియుండునట్టి, సేవకుడు, నియుక్తుడు, ఉద్యోగి, ఉద్యోగస్థుడు, పరిచరుడు ملازم خاص — ఎ ఖాస్ (అ) సొంతసేవకుడు ملازم خانگی — ఎ ఖానగీ (పా) ఇంటిసేవకుడు, ఒకరిసేవకుడు.

ملازمت ములాజిమత్ (అ. స్త్రీ) పరిచర్య. కొలువు, ఉద్యోగము, సేవ, నియోగము.

ملازمی ములాజిమీ (అ. స్త్రీ) పరిచర్య, సేవ, ఉద్యోగము.

ملاطفت ములాతఫత్ (అ. పు) ఆదరము. అనుగ్రహము, కటాక్షము, మర్యాద, మన్నన; ప్రసాదము, అనుగ్రహపత్రము.

ملاقات ములాఖాత్ (అ. స్త్రీ) ఒకరికొకరుకలియుట, సమావేశము, సందర్శనము, కలియుట, చూచుట, సంధానము, దర్శనము, పరిచయము, ملاقات باز دید — ఎ బాజ్దీద్ (పా) ప్రతిసందర్శనము, తిరుగుసందర్శనము, ملاقات پیدا کرنا — పైదాకర్నా (ఉ) పరిచయము, సంపాదించుట ملاقات رکھنا — రఖ్నా (ఉ) పరిచయముగలిగియుండుట, రాకపోకలగలిగియుండుట,

ملاقات کرنا — కర్నా (ఉ) సందర్శించుట, చూచిమాట్లాడు, దర్శనముజేయుట, పోయిచూచుట.

ملاقاتی ములాఖాతీ (అ. పు) పరిచయముగలవాడు, పరిచయస్థుడు; అతిథి, విందు.

ملال మలాల్ (అ. పు) విచారము, చింత, వ్యసనము, వ్యాకులము.

ملالت మలాలత్ (అ. స్త్రీ) విచారము, చింత, ఖేదము, దౌర్మనస్యము, వ్యాకులత, వ్యసనము.

ملامت మలామత్ (అ. స్త్రీ) చీవాట్లు, చీకొట్టుట, చీవాట్లుపెట్టుట, దూషణము, తిరస్కారము.

ملان మిలాన్ (హి. స్త్రీ) సరిపోల్చిచూచుట, సరిచూచుట, సరిపెట్టుట, సవరించుట, చక్కబెట్టుట; సంఘ, కూడిక, మేళనము, సమాధానము, కలయిక, ملان نظر — ఎ నజర్ (ఉ) ప్రత్యక్షప్రమాణము, కంటికగుపడుప్రమాణము.

ملانا మిలానా (హి) కలుపుట, మేళవించుట, చేర్చుట, కూర్చుట, సంధించుట, సమూహముగాజేయుట, సరిపుచ్చుట, సరిపెట్టుట, సరిజేయుట, సంఘజేయుట, సమాధానపెట్టుట, కలుపుకొనుట; తనపక్షమునకుజేర్చుకొనుట; సరిపోల్చిచూచుట; పరిచయముజేయించుట, ంతసరచుట, జోడించుట, జతజేయుట.

ملاو మిలావ్ (హి. పు) మిశ్రము, సమ్మిశ్రితము; సమ్మేళనము, కలపటము, కలిపినది, కలిసినది; సమాధానము, సంఘ, ملاو کرنا — కర్నా (హి) కలపటముజేయుట, కలుపుట.

ملائی మలాయీ (హి. స్త్రీ) మీగడ, మస్తువు, కాగినపాలమీదతెట్టె; గుజ్జు

మొII తోముట.

**ملائک** మలాయిాక్ (అ.పు) దేవతలు, భూతములు (ఏ.వ **ملک**)

**ملائم** ములాయిమ్ (అ) మృదువైన, మెదువైన; కోమలము, నమ్రము, మెత్తని; సాధువైన, నెమ్మతిగల, శాంతమైన, సౌమ్యమైన, ఓన్నని, అనుకూలమైన.

**ملائمت** ములాయమత్ (అ.స్త్రీ) మృదుత్వము, మార్దవము, కోమలత, సౌమ్యత్వము, మెత్తదనము, తిన్నదనము, అనుకూల్యము, నమ్రత, మెగవుదనము, సాధుత్వము!

**ملبا** మల్బా (హి.పు) చెత్తచెదారము, ప్రాతఇంటికట్టడపుసామాను.

**ملبب** ములబ్బబ్ (అ) పొరలిపోవుచున్న, దిగపారుచున్న పరిపూర్ణము, సంపూర్ణము.

**ملبس** ములబ్బస్ (అ) వాసితము, ఆచ్ఛాదితము, కప్పబడియున్నది. వస్త్రముకప్పినది, వస్త్రాలంకృతము, వస్త్రభూషితుడు, సచేలుడు, దుస్తులువేసికొనినవాడు, బట్టలుతొడుగుకొనియున్న; మారువేషముతోనున్న; మిళితము, సంకరము

**ملت** మిల్లత్ (అ.స్త్రీ) మతము, కులము, జాతి.

**ملتانی** ముల్తానీ (హి స్త్రీ) కావిమన్ను, గోపిచందనము, గోపిసుద్ద, ముల్తానుదేశసుడు.

**ملتبس** ముల్తబస్ (అ) అచ్ఛాదితము, కప్పబడినది, దాచబడినది.

**ملتجا** ముల్తజా (అ.పు) శరణము, శరణాలయము, అభయస్థానము; రక్షకుడు.

**ملتجی** ముల్తజీ (అ) శరణార్థి, శరణము వెదకువాడు, రక్షణముకోరువాడు, (పు) ప్రార్థకుడు, అర్థి, యాచకుడు, విజ్ఞాపకుడు, విన్నపముచేసికొనువాడు, వేడుకొనువాడు.

**ملتزم** ముల్తజిమ్ (అ) విధిలేనివాడు, నిర్బంధపడినవాడు, బలాత్కారింపబడినవాడు, కట్టుబడినవాడు, (అపరాధియైనవాడు), బద్ధుడు

**ملتفت** ముల్తఫిత్ (అ.స్త్రీ) అభిముఖమైన, కటాక్షముగల, అనుగ్రహముగల, లక్ష్యముజేయు, దాక్షిణ్యముగల, మొగమోటపడు, శ్రద్ధజేయు.

**ملتمس** ముల్తమిస్ (అ) ప్రార్థకుడు, విజ్ఞాపకుడు, వేడుకొనువాడు, విజ్ఞాపనజేయువాడు, ప్రార్థించువాడు, విన్నవించువాడు, **ملتمس هونا** — హోనా (ఉ) ప్రార్థించుట, విజ్ఞాపనజేసికొనుట, విన్నవించుట, వేడుకొనుట.

**ملتوی** ముల్తవీ (అ) చుట్టిన, చుట్టుకొనిన; ఆపబడిన, ఆగిన, నిలుపబడినది, నిలిచినది, ఆపిన, ఆలస్యముచేసిన, ఆపుదలచేయబడిన, ఆపుదలైనది, పొడిగించినది, విరమితము, విలంబితము, **ملتوی کرنا** — కర్నా (ఉ) ఆపుదలజేయుట, నిలిపివేయుట, విలంబించుట.

**ملٹھی** ములట్ఠీ (హి) అతిమధురము, యష్టిమధుకము.

**ملجا** మల్జా (అ.పు) శరణాలయము, శరణము, అభయస్థానము, సురక్షితస్థానము.

**ملچھ** మలిచ్ఛ్ (హి.పు) మ్లెచ్ఛుడు, అపవిత్రుడు, పరదేశస్థుడు.

**ملح** మిల్హ్ (అ.పు) లవణము, ఉప్పు, **ملح العجین** — ఉల్ ఆజీన్ (అ) సాధారణలవణము, వంటలోవాడుకొను

ఉప్పు. ملح نفطی اسود — ఎనిఫ్తీ, అస్వద్ (అ) నల్లఉప్పు, గంధకఉప్పు, ملح الحجر - طبرزد — ఉల్ హాజర్ - తబర్‌జద్ (అ) ఇంగుప్పు, సైంధవలవణము. చంద్రుప్పు.

ملصق ముల్సక్ (అ.పు) తగిలియున్నది, అంటియున్నది, అంకియున్నది, అనుబంధము అనుబద్ధము.

ملحوظ మల్‌హూజ్ (అ) దయతో జూచినది, అనుగ్రహీతము. కటాక్షింపబడినది, లక్ష్యముంచినది, లక్ష్యమందుంచబడినది, దృష్టినుంచబడినది, మనస్సునందుంచబడినది, భావమందుంచినది, భావితము, భావింపబడిన ملحوظ رکھنا — రఖ్నా (ఉ) లక్ష్యముంచుట, లక్ష్యమందుంచుట, తలపునందుంచుట, దృష్టినిపెట్టుకొనుట, మనసునందుంచుకొనుట, సరకుజేయుట, లక్ష్యపెట్టుట.

ملخ మలఖ్ (పా.పు) మిడత, శలభము.

ملذذ ముల్జజ్జ్ (అ) రుచ్యము, రుచిరము. రుచిగల, రుచియైన, స్వాదుమైన.

ملزم ముల్జిమ్ (అ) నేరస్థుడు, అపరాధి, దోషి, నేరము మోపబడినవాడు; తగిలించిన, వేరుగాని, వీడని.

ملعون మల్‌ఊన్ (అ) దూషితుడు, శపితుడు, శపింపబడినవాడు, బహిష్కృతుడు, నిందితుడు.

ملفوظ మల్‌ఫూజ్ (అ.పు) సుభాషితము, పెద్దలవాక్యము, వాక్యము.

ملفوف మల్‌ఫూఫ్ (అ) చుట్టినది, ముడిచినది, మడచినది, మరియొక దానియందునుంచినది, పొదిగినది; ఉత్తరము, జాబు.

ملقب ముల్కబ్ (అ) బిరుదముగలవాడు, అంకితుడు, ఉపనామముగలవాడు.

ملک మలిక్ (అ.పు) రాజు, ప్రభువు, ملک زادہ — జాద (పా) రాజపుత్రుడు, రాచబిడ్డ, రాజకొడుకు ملک الشعرا — ఉష్షుఅరా (అ) కవిరాజు, కవీశ్వరుడు, ఆస్థానకవి,

ملک మలక్ (అ.పు) దేవత, దేవదేవత, ملک الموت — ఉల్‌మౌత్ (అ) మృత్యుదేవత, యమధర్మరాజు.

ملک మిల్క్ (అ.పు) ఆస్తి, సొత్తు, స్వామ్యము.

ملک ముల్క్ (అ.పు) దేశము, రాజ్యము, రాష్ట్రము. ప్రాంతము, ملک رانی — రానీ (పా) రాజ్యపరిపాలనము, దేశపరిపాలనము, పరిపాలనము; ప్రభుత్వము, ملک گیری — గీరీ (పా) దేశసంపాదనము, రాజ్యములు గెలుచుకొనుట, ملک ستانی — సితానీ (పా) రాజ్యములజయించుట, దేశములనాక్రమించుట,

ملکت మిల్కియత్ (అ.స్త్రీ) ఆస్తి, సొత్తు ధనద్రవ్యాదులు.

ملکوت మలకూత్ (అ.స్త్రీ) రాజ్యము, ప్రభుత్వము; దేవతలు, పితరులు, దేవలోకము, పిత్రులోకము.

ملکہ మలిక (అ.స్త్రీ) రాణి, రాణి, పట్టమహిషి ملکہ معظمہ — యెముఅజ్జమ (అ) మహారాజ్ఞి, మహారాణి.

ملکہ మలక (అ.పు) సామర్థ్యము, ప్రావీణ్యము, పాండిత్యము, నైపుణ్యము, విజ్ఞానము.

ملکی మలకీ (అ) దేవతాసం॥, దివ్యము.

ملکی ముల్కీ (అ) దేశసం॥, దేశీయము, స్వదేశీయము; రాష్ట్రీయము; రాజకీయము; పరిపాలనాసంబంధము, రాజ్యసం॥

దేశస్థుడు, ملکی لاٹھ — లాట్ (ఉ) రాజప్రతినిధి.

ملکیت మిల్కియత్ (అ.స్త్రీ) స్వామ్యము, అధికారము; యాజమాన్యము; భూస్వామ్యము, స్థిరాస్థి.

ملماس మల్మాస్ (హి.పు) మలమాసము, అధికమాసము.

ملمع ములమ్మఅ (అ) బంగారు వెండిలోహ నగువాని రేకులో పొదిగిన లేక పూతపూసిన, లోహపుపూతగల; పూత,పొదుగుట,

ملمع ساز — సాజ్ (పా) లోహపుపూత పూయువాడు, తగరపుపూతపూయువాడు, తగరపుపనివాడు; మోసగాడు.

ململ మల్మల్ (హి.స్త్రీ) పలిపము, సన్నబట్ట, మల్లుబట్ట.

ملن మిలన్ (హి.పు) మేళనము, సమ్మేళనము, కలయిక, కూడిక, కలియుట, చేరిక పొందిక. అనుకూల్యము, అనుగుణ్యము, సమాధానము.

ملنا మిల్నా (హి) కలియుట, చేరుట, కూడుట; సందర్శించుట: సరిపడుట, సరిపోవుట; సమాధానపడుట దొరకుట, లభించుట, ملنا جھلنا — ఝుల్నా(హి) కలిసి మెలిసియుండుట, కలిపిగోలుతనము,

ملے جھلے رہنا మిలేఝులేరహ్నా(హి) కలిసి మెలిసియుండుట, అనుకూలముగా నుండుట.

ملنا మల్నా (హి) మర్దించుట, మెరుగుపుట; రుద్దుట, రాయుట; పొదుట; అంటుట. (తలకునూనె మొll); తోముట.

ملنسار మిలన్సార్ (హి) కలిపిగోలు, కలిపిగోలుతనముగల, కలిపిగోట్టు, కలిసి మెలిసియుండెడు, చనవుగానుండు, అనుకూలముగానుండు.

ملنساری మిలన్సారీ (హి.స్త్రీ) కలిపిగోలుతనము, అనుకూల్యము, స్నేహభావము, కలిసిమెలిసియుండుట, చనవు.

ملوائی మల్వాయీ (హి.స్త్రీ) రుద్దినకూలి, తోమినకూలి, తలకునూనె మొll అంటినకూలి.

ملوث ములవ్వస్ (అ) కలుషితము, అపవిత్రము, కళంకితము, మైలపడిన, మలినము.

ملوک ములూక్ (అ.పు) రాజులు, ప్రభువులు (ఏ.వ ملک). [మైన.

ملوک మలూక్ (హి) సుందరమైన, అంద

ملول మలూల్ (అ) ఖిన్నము, దుఃఖితము, వ్యాకులితము, వ్యసనముగల, విచారముగల, చింతగల; శ్రమపడిన, కష్టపడిన; వేసారిన, విసిగిన, అలసిన: ఉదాసీనమైన; రోసిన.

ملولا మలోలా (అ పు) వ్యసనము, దుఃఖము, చింత, విచారము, వ్యాకులము, వేసారిక, విసుగు, అలసట,ఉదాసీనత,

ملولا آنا — اٹھنا — ఆనా, ఉఠ్నా (ఉ) దుఃఖమువచ్చుట, వ్యసనమువచ్చుట, ملولے مٹنا మలోలేమిట్నా (ఉ) దుఃఖముఉపశమిల్లుట, దుఃఖముశమించుట, ఊరటగలుగుట.

ملوم మలూమ్ (అ) దూషితుడు, నిందితుడు, చీవాట్లుతినినవాడు.

ملون ములవ్వన్ (అ) వన్నెబూసిన, నానావర్ణములుగల.

ملونی మిలౌని (హి.స్త్రీ) కలపటముగలది, అస్వచ్ఛము, అపరిశుద్ధము, కలిసినది, సంకరము, మిశ్రితము, మిశ్రము. [ము.

ملہٹی ములహ్టీ (హి.స్త్రీ) యష్టిమధుక

ملہم మల్హమ్ (పా.పు) రంగరింపుమం

దు, పూతమందు, పట్టువేయుమందు.

**ملہم** ముల్‌హిమ్ (అ) దివ్యప్రేరకుడు, మన సునందు దివ్యసంకల్పము గలిగించువాడు, దేవుడు, ఈశ్వరుడు

**ملی** ములీ (హి.స్త్రీ) చూడు, **مولی**

**ملے پنج** మలేపంజ్ (హి.పు) అయిదేం డ్లుదాటినగుఱ్ఱము, ముసలిగుఱ్ఱము.

**ملیچھ** మలేఛ్ (హి) మ్లేచ్ఛుడు, పరదే శసుడు, అపవిత్రుడు.

**ملیح** మలీహ్ (అ) లావణ్యముగల, దేహ కాంతిగల, చామనఛాయగల. అందమైన; ఉప్పుగలసిన, ఉప్పని.

**ملیدا** మలీదా (పా.పు) చూడు **مالیدہ**

**ملین** ములయ్యిన్ (అ) మలబద్ధకమును తొలగించునది, విరేచకము, విరేచనకారి, బేదిమందు, మెత్త బరచునది.

**ملین** మలీన్ (హి) మలినము, మురికైనది మాలిన్యముగలది: దుఃఖితము. మాసిన.

**مماست** ముమాసత్ (అ.స్త్రీ) స్పర్శము, అంటు, తాకుట; స్త్రీసంభోగము.

**ممالک** మమాలిక్ (అ.పు) రాజ్యములు, (చూడు, ఏ.వ **مملکت**) **ممالک**.

**محروسہ** — ఎముత్రహిద (అ) సంయు క్తరాష్ట్రములు, **ممالک متوسط** — ఎముతవస్సిత్ (అ) మధ్యపరగణాలు, మధ్యరాష్ట్రములు, **ممالک محروسہ** — ఎ మహరూస (అ) ఆక్రాంతదేశము లు, ఆక్రమింపబడినదేశములు, పరిపాల నలోనున్నదేశము, పరిపాలితదేశములు,

**ممالک محروسہ سرکار عالی** — యెసర్కార్–ఆలీ (అ) మహాప్రభువుపాల నలోనున్నరాష్ట్రములు, నిజాము రాష్ట్రములు.

**ممانعت** ముమానఅత్ (అ.స్త్రీ) ఆక్షేప ము, నిషేధము, నిరోధము, అడ్డగింపు, కూడదనుట.

**ممانی** ముమానీ (హి.స్త్రీ) మేనమామ భార్య.

**ممتا** మమ్తా (హి.స్త్రీ) మమత, ప్రేమ; ఆశ, లోభము; అహంకారము: అహం భావము.

**ممتاز** ముమ్తాజ్ (అ) విశిష్టుడు, శ్రేష్ఠుడు, మహితుడు, గొప్పవాడు, ఘనుడు, ప్రసి ద్ధుడు, ఉత్తముడు; అంకితుడు, ఎన్నబడి నవాడు.

**ممتحن** ముమ్తహిన్ (అ పు) పరీక్షకుడు, పరీక్ష జేయువాడు.

**ممتحن** ముమ్తహన్ (అ పు) పరీక్షితుడు, పరీక్షజేయబడినవాడు, పరీక్షింపబడినవా డు; అనుభవశాలి.

**ممتنع** ముమ్తనఅ (అ) నిషిద్ధము, నిరుద్ధ ము, ఆక్షేపితము, అసాధ్యము.

**ممد** ముమిద్ (అ) సహాయుడు, సహాయకు డు, రక్షకుడు, తోడ్పడువాడు.

**ممدوح** మమ్‌దూహ్ (అ) స్తోత్రముజేయబ డిన, స్తుతము, వర్ణితము; కృతినాయకు డు; పూర్వోక్తము, పుంభోద్దాహృత ము, ముందుజెప్పినది, పైనజెప్పినది.

**ممدودہ** మమ్‌దూద (అ) లాగబడినది, కర్షితము, పొడిగింపబడినది, విస్తరితము, దీర్ఘము, **ممدودہ الف** అలిఫ్— (అ) దీర్ఘఅకారము, ఆకారము.

**ممر** మమర్ (అ.పు) మార్గము, త్రోవ, బాట, దారి; రేవు; సుట్టము; హేతువు, మూలము, కారణము.

**ممسک** ముమ్‌సిక్ (అ.పు) లోభి, పిసినా రి, లుబ్ధుడు; దిగమ్రింగువాడు, అపహ రించువాడు, అత్యాశగలవాడు.

**ممسوس** మమ్సూస్ (అ) తాకినది, ముట్టినది, అంటినది, స్పృష్టము, స్పృశింపబడినది.

**ممکن** ముమ్కిన్ (అ) సంభవింపదగినది, సంభవము, కాగలది, సాధ్యము. భవితవ్యము, **ممکن الوقوع** —ఉల్ వకూఉ (అ) సంభవయోగ్యము, కాగలది, సంఘటనయోగ్యము, సంభవసాధ్యము, సంభవార్హము, సంభవింపదగినది.

**ممکنات** ముమ్కినాత్ (అ. స్త్రీ) సాధ్యములు, భవితవ్యములు, కాగలవి, భవ్యములు, చూడు, **ممکن**

**مملکت** మమ్లకత్, మమ్లుకత్ (అ. స్త్రీ) రాజ్యము, రాష్ట్రము.

**مملوک - کہ** మమ్లూక్-క (అ) స్వామ్యముగలది, అధికారములోనున్న. స్వీయము, సొంతము, **مملوک و مقبوضہ** — వమక్బూజే (అ) స్వామ్యస్వాధీనములుగలది, స్వంతమైస్వాధీనములోగూడనున్నది.

**ممنوع - عہ** మమ్నూఉ.మమ్నూఅ (అ) నిషిద్ధము, నిరుద్ధము, వర్జ్యము, త్యాజ్యము. కూడనిది.

**ممنون** మమ్నూన్ (అ) అనుగ్రహింపబడినది, అనుగృహీతుడు, ఉపకృతుడు, మేలుపొందినవాడు, **ممنون ہونا** — హోనా (ఉ) అనగ్రహించబడినవాడగుట, కృతజ్ఞుడగుట, ఉపకృతుడగుట **ممنون کرنا** —కర్నా (ఉ) ఉపకృతునిగజేయుట, మేలుపొందినవానిగ జేయుట, కృతజ్ఞునిగజేయుట.

**ممولا** మమోలా (హి. పు) కొటుకపిట్ట, (అడవి దాసరిపిట్ట అనబడును).

**ممیا ساس** మమియాసాస్ (హి. స్త్రీ) భర్తయొక్క—గాని భార్యయొక్క—గాని పినతల్లి లేక పెద్దతల్లి, పిన్నత్త, పెదత్త.

**ممیا سسر** మమియాసుస్ర్ (హి. పు) భార్యయొక్క—గాని భర్తయొక్క—గాని పినతల్లి లేక పెదతల్లిమగడు, పిన్నత్తమగడు, పెద్దత్త మగడు

**ممیانا** మిమ్యానా (హి) మేకలేకగొఱ్ఱె అరచుట, బ్యాబ్యాఅనుట.

**ممیرا** మమేరా (హి) మేనమామసం॥; **ممیرا بھائی** — భాయి మేనమామ కొడుకు, మేనబావ.

**ممیز** ముమయ్యిజ్- (అ) తారతమ్యజ్ఞానముగలవాడు, వివేకి, వివేచనగల, విశేషజ్ఞుడు, గుణాగుణములనెఱుంగువాడు, మంచిచెడుగులెరుంగువాడు. భేదజ్ఞానముగలవాడు, **قوت ممیزہ** కువ్వతె — (అ) తారతమ్యజ్ఞానము, వివేచనాశక్తి, మంచిచెడుగులెఱుగుసామర్థ్యము.

**من** మన్న (అ) మేనా, మందుజున్ను.

**من** మన్ (హి. పు) మనము, మనస్సు, చిత్తము హృదయము, ఇష్టము, అభిలాష; అంతరాత్మ; శ్రద్ధ; మణుగు, (ఎత్తు) **من لگنا** — లగ్నా (హి) మనసుతగులుకొనుట. వలచుట, వలపుగొనుట, మోహించుట, **من اکتانا** — ఉక్తానా (హి) మనసురోయుట, వెగటుపుట్టుట, విసుగువచ్చుట, **من بھانا** — భానా (హి) మనసునకు వచ్చుట మనసునకింపగుట, ఇష్టవగుట, మనోహరముగానుండుట, **من چلا** —చలా (హి) సాహసుడు, ఉదారుడు, ధైర్యశాలి, పట్టుదలగల, కోరికగల, అభిలాషి; **من بھاون**—భావన్ (హి. స్త్రీ) మనోహరి. మనోనాయిక, ప్రియురాలు, **من بھر** - భర్ (హి) మనసార, మనసుకు

వచ్చినంత, من بھرنا — భర్నా (హి) మనస్సంతుష్టియగుట, من چلنا — చల్నా (హి) అభిలాషకలుగుట, మనసుపుట్టుట, من بہلنا — బహ్లానా (హి) వినోదకాలక్షేపముచేయుట, ఉబుసుపుచ్చుట, من سمجھانا — సంఝానా (హి) మనసుకు సంతోషపెట్టుకొనుట, మనసును తృప్తిపెట్టుకొనుట, మనసును ఊరడించుకొనుట. من کا منا — కామనా (హి) మనోభిలషితము, మనసునందలికోరిక, మనసుకువచ్చినది, من کی من میں رہنا — కీమన్మేంరహ్నా (హి) మనసులోనిది మనసులోనేయుండిపోవుట, మనసులోకోరిక వెలివేరకపోవుట, من کے لڈو — కేలడ్డూ (హి) గొంతెమ్మకోరికలు, అడియాసలు, ఆకాశహార్మ్యము, من لینا — లేనా (హి) మనసు తెలియుట, మనసులోనిమాటరాబట్టుట; మనసుఅపహరించుట, వలపుపుట్టించుట, من مارنا — మార్నా (హి) మనసునుచంపుకొనుట, మనసునునిగ్రహించుట, ఓపికతోననుభవించుట, అభిమానముచంపుకొనుట, من مانے — మానె (హి) మనసుకువచ్చినట్లు, యథేచ్ఛముగా, من ملنا — మిల్నా (హి) మనసుకలియుట, ఏకాభిప్రాయులగుట, من موجی — మౌజీ (హి) దురభిమాని, యథేచ్ఛావర్తనుడు, మనసునకు వచ్చినట్లుసంచరించువాడు, من میں آنا — మేఆనా (హి) మనసుకుతట్టుట, సంకల్పముకలుగుట, మనసుకువచ్చుట, من موہن — మోహన్ (హి) మనసును మోహింపజేయువాడు, మనోమ్మోహనుడు.

من మిన్ (అ) నుండి, నుంచి, కంటె, మీద, من بعد — బఅద్ (అ) తదుపరి, అప్పటినుండి, తరువాత, అంతటపైన, అటుమీద, من جانب — జానిబ్ (అ) ఒకరిపక్షమున, పక్షమునుండి, వంకనుండి, వైపునుండి, దిక్కునుండి, మారుగా, من جملہ — జుమ్లా (అ) మొత్తముమీద, మొత్తమునుండి, అందులో, మొత్తములో, మీద, నుండి, منہا — హా (అ) అందునుండి, దానినుండి, (తీసివేత, తగ్గింపు) منہا کرنا — కర్నా (హి) తగ్గించుట, తీసివేయుట, త్రోసివేయుట. منہائی — యీ (అ) తగ్గింపు, తీసివేత, త్రోసివేత, త్రోపుడు. [చేరు].

منا మున్నా (హి. పు) ముగ్గినది, (ముగ్గు

مناجات మునాజాత్ (అ. స్త్రీ) ప్రార్థనలు, ఈశ్వరప్రార్థనలు.

منادی మునాది, మునాదీ (అ. స్త్రీ) చాటింపు, ప్రకటనము.

منار మినార్ (అ. పు) గోపురము, స్తంభము; దీపగృహము; కావలిగిడి; అట్టము, అట్టాలకము.

منازعت మునాజఅత్ (అ. స్త్రీ) వివాదము, జగడము

مناسب మునాసిబ్ (అ) యోగ్యము, ఉచితము, అర్హము, తగినది; అనురూపము, అనుగుణము, అనుకూలము; అనుసారము; పొంతనైన, పొందికైన; సంబంధముగల.

مناسبت మునాసబత్ (అ. స్త్రీ) యోగ్యత, ఔచిత్యము, అర్హత, తగవు; అనురూప్యము, అనుగుణ్యము, అనుకూల్యము, అనుసరణము; పొంతకము, పొందిక; సంబంధము.

**مناظره** మునాజేర (అ. స్త్రీ) వివాదము, తర్కము. చర్చ.

**منافع** మనాఫె(అ. పు) లాభములు, ఆదాయములు, రాబడులు, (ఏ.వ **منفعت**) **منافع خام** — యెఖామ్ (అ) మొత్తమాదాయము, మొత్తములాభము, **منافع خالص** - యెఖాలిస్ (అ) కేవలాదాయము, కేవలలాభము.

**منافق** మునాఫిక్ (అ.పు) మిథ్యాచారుడు, కపటవర్తనుడు, పాషండుడు, నాస్తికుడు.

**مناقبت** మునాకిబత్ (అ. స్త్రీ) సాద్గుణ్యము, సద్గుణసంపత్తి, సామర్థ్యము, స్తోత్రపాత్రము, స్తోత్రము.

**مناقشه** మునాకిష (అ.పు) వివాదము, జగడము.

**منال** మనాల్ (అ.పు) లాభస్థానము, లాభసాధనము, ద్రవ్యదాయకము, లాభదాయకము. పద్ధతులు, మార్గము; ఆస్తులు, సంపదలు.

**منانا** మనానా (హి) ఒప్పించుట, మెప్పించుట, సమాధానపెట్టుట తృప్తిపరచుట, సమ్మతింపజేయుట, ప్రసన్నునిజేసికొనుట, ఆమోదింపజేయుట, సమరసపెట్టుట అనుకూలపరచుకొనుట; అడుగుకొనుట, ఆరాధించుట, ప్రార్థించుట; బుజ్జగించుట, సంతుష్టిపరచుట.

**مناهی** మనాహీ (అ. స్త్రీ) నిషిద్ధములు, అశాస్త్రీయములు, వర్జ్యములు, త్యాజ్యములు, కూడనివి, (ఏ.వ **منهی**)

**منبت** మునబ్బత్ (అ. స్త్రీ) ఉబికియున్నది, ఉబ్బుగానుండునట్లుచిత్రించినది, (అక్షరములు, బొమ్మలు మొ॥, ఉబ్బుచిత్తరువు

**منبر** మిన్బర్ (అ.పు) ఉచ్చస్థానము, అరుగు, తిన్నె, బల్లపీట, గద్దె, ఎత్తుపీఠము.

**منبسط** మున్బసిత్ (అ) హాసన్ముఖుడు, సంతోషస్వభావముగలవాడు, నగుమోమువాడు.

**منبع** మంబఉ (అ.పు) ఉత్పత్తిస్థానము, మూలము; నీరూరుచోటు, ఊట, చెలిమ.

**منت** మిన్నత్ (అ. స్త్రీ) వేడికోలు, ప్రార్థన, విన్నపము, విజ్ఞాపనము, యాచన; అనుగ్రహము, ఉపకారము, ఉపకృతి, **منت دار** — దార్ (పా) అనుగృహీతుడు, ఉపకృతుడు, మేలుపొందినవాడు, **ممنون منت** మమ్నూనెమిన్నత్ (అ) ఉపకారముపొందినవాడు, ఉపకారబద్ధుడు.

**منت** మన్నత్ (అ) మ్రొక్కు, మ్రొక్కుబడి, **منت ماننا** — మాన్నా (ఉ) మ్రొక్కుకొనుట, మ్రొక్కుచెల్లించుట.

**منتج** ముంతజ్ (అ) ఫలితము, సారాంశము; ఊహితము, అనుమితము; పర్యవసానము, ఫలితార్థము.

**منتخب** ముంతఖిబ్ (అ) ప్రియముగా గ్రహించినది, పరిగృహీతము; ఏర్పరించుకొనబడినది, ఎన్నుకొనబడినది, ఏర్చినది; అభిమతము, ఇష్టమైనది; శ్రేష్ఠము, విశిష్టము, ఉత్తమము; సంగ్రహము, సంక్షిప్తము. తగ్గించినది. సమాహృతము. **منتخب کرنا** — కర్నా (ఉ) ఏరుకొనుట, కోరుకొనుట, ఎన్నుకొనుట, పరిగ్రహించుట, **منتخب هونا** — హోనా (ఉ) ఏరుకొనబడుట, కోరుకొనబడుట, ఎన్నుకొనబడుట, పరిగృహీతుడగుట.

**منتر** మంతర్ (హి.పు) మంత్రము; ఆలోచన, **منتر پهونکنا** — ఫూంక్నా

**منجنيق** మంజనీక్ (అ.పు) శిలాయంత్రము, కోటపైరాళ్లువిసరెడుముఱ, మఱవడిసెల.

**منجهه** మంఝ్ (హి.పు) మధ్యమము, మధ్యము,నడుము, **منجهدهار** — మంఝధార్ (హి) మధ్యప్రవాహము, ప్రవాహమధ్యభాగము; నట్టేఱు.

**منجها** మంఝా (హి.పు) చూడు, **منجلا**

**منجهلا** మంఝ్లా (హి) మధ్యముడు, నడిమివాడు, అందరికంటెపెద్దవానికిని అందరికంటెచిన్నవానికిని మధ్యనుండుసోదరుడు.

**منجهولا** మంఝోలా (హి) మధ్యమము, నడిమిది, నడిమి.

**منجيٹهه — منجيٹ** మంజీట్ - ఠ్ (హి.పు) తామ్రవల్లి (వేరు), మంజిష్ఠము,

**منجيرا** మంజీరా (హి.పు) తాళము, (వాయించుకంచుగిన్నెలు),

**منچ** మంచ్ (హి.పు) మంచియ; మంచము, [పీఠము.

**منحرف** మున్హరిఫ్ (అ) తిరిగినది, మఱలిన, మారిన; వంగిన, వంకరైన; విరుద్ధము, ప్రతికూలము; తిరుగబడిన; ఎదురుతిరిగిన; విరోధి; మతమును విసర్జించినవాడు, మతత్యాగి; విషమచతుర్భుజము,

**منحصر** మున్హసిర్ (అ) ఆధారపడియున్న, ఆధీనమైయున్న, అనుసరించియున్న, ముట్టడింపబడిన, చుట్టవేయబడిన, ఆవరింపబడిన; పరిమితమైన; నిరుద్ధమైన.

**منحنی** మున్హనీ (అ) బక్కపలచని, బక్కని, సన్నని; దుర్బలము; వక్రము, వంకఱ, వంగిన. గూనుగల.

**منحوس** మన్హూస్ (అ) అమంగళము, అశుభము, అపశకునము, అనిష్టము, (పు) దౌర్భాగ్యుడు, నిర్భాగ్యుడు, దురదృష్టుడు.

**منخر** మిన్ఖర్, మిన్ఖిర్. మన్ఖర్, మన్ఖిర్ (అ.స్త్రీ) నాసాపుటము, ముక్కురంధ్రము, ముక్కుతూటు.

**مند** మంద్ (పా) వంతుడు, మంతుడు, కలవాడు,అనుఅర్థములనిచ్చుప్రత్యయము.

**مندا — مند** మంద్-దా (హి) మందము, మెల్లని, తిన్నని; మందగించిన,తగ్గియున్న: నిమ్మళమైన, శాంతమైన, మృదువైన, మెత్తనైన, సాధువైన; దుర్బలము; శనిగ్రహము, **مندا پڑنا** — పడ్నా(హి) మందగిలుట, మందగించుట, తగ్గుట.

**مندر** మందిర్, మందర్ (హి.పు) మందిరము, గృహము, గుడి, దేవాలయము.

**مندرا** ముంద్రా (హి.పు) జోగులునుబైరాగులునువేసికొనుగాజుకుండలములు, గాజుపోగులు.

**مندرج — جه** ముందరజ్-జ (అ) ప్రవేశపెట్టబడిన, చేరియున్న చేర్పబడిన, చేర్చిన, కూర్చిన, చొనిపిన, దూర్చిన. ప్రవిష్టము,సంకలితము, **مندرجه ذيل** — యెజైల్ (అ) క్రిందచెప్పినది, లేక ఉదహరించినది, ఉత్తరోక్తము, ఉత్తరోదాహృతము.

**مندری** ముంద్రీ (హి.స్త్రీ) ఉంగరము, ముద్రుటుంగరము.

**مندنا** ముంద్నా (హి) మూయబడుట, మూతబడుట, ముడుచుకొనుట.

**منديل** మిందీల్ (అ.స్త్రీ) తలగుడ్డ, సరిగతలగుడ్డ, శిరోవేష్టము, ఉత్తరీయము, ఉపవస్త్రము.

**منڈ** ముండ్ (హి.పు) ముండము, తల; ముఖ్యము, ప్రధానము, **منڈمالا** —

మాలా (హి) రుద్రునికపాలమాల, పుర్రెల పేరు, **منڈچرا** ముండ్చిరా (హి) మొండి బంటవాడు, మొండిపకీరు.

**منڈا** మండా (హి.పు) తియ్యపుండెగ, (భక్ష్యవిశేషము).

**منڈا** ముండా (హి) ముండితము, గొఱుగ బడినది, బోడిగానున్న, కోసుగానుండ నిది.

**منڈانا** ముండానా (హి) క్షౌరముచేయు ట, గొఱుగుట.

**منڈپ** మండప్ (హి.పు) మండపము, మంటపము,

**منڈل** మండల్ (హి.పు) మండలము, గోళము; వలయము, వృత్తము; ఆకాశము; గుండ్రనిఇల్లు లేక గుడారము.

**منڈلانا** మండ్లానా (హి) మండలాకారముగతిరుగుచుండుట, చుట్టుగాతిరుగుచుండుట. గుండ్రముగాదిరుగుట, గుడిదిరుగుట, (పక్షులుఆకాశమున చుట్టుతిరుగుచుండుట).

**منڈلی** మండ్లీ (హి) మండలి, సమాజము, సంఘము, సమూహము, గుంపు.

**منڈن** ముండన్ (హి.పు) ముండనము, క్షౌరము, గొఱుగుట; పుట్టువెండ్రుకలు తీయుట, చౌలము.

**منڈنا** ముండ్నా (హి) గొఱుగబడుట; క్షౌరముచేయబడుట, మోసగింపబడుట.

**منڈوا** ముండ్వా (హి.పు) మండువ, చప్పరము, పాక, మంటపము, పందిరి.

**منڈور** మండూర్ (హి పు) మండూరము, అయస్సింధూరము, ఇనుపచిట్టెము.

**منڈھا** మండ్ఢా (హి.పు) పెండ్లిమంటపము, పెండ్లిపందిరి.

**منڈھنا** మండ్ఢ్నా (హి) తోలుగప్పుట, తోలుపూగుపుట, తోలువేసికుట్టుట; కప్పివేయుట, మూయుట; ఒకనికిఅంటగట్టుట, ఒకరిపైవేయుట, (నేరము మొ॥).

**منڈھوائی** మండ్ఢ్వాయీ (హి.స్త్రీ) తోలు మొ॥ పొదివినకూలి, తోలుగాని కాగితముగాని వేసికుట్టిన లేక అతికినకూలి, పొదువుకూలి.

**منڈھی** మండ్ఢీ (హి.స్త్రీ) జోగులగుడిసె, జోగులమఠము.

**منڈی** మండీ (హి.స్త్రీ) కొటారము, కొట్టరము, ధాన్యాదులు విశేషముగనుండుకొటారు, రాసులుగనుండుఅంగడి, రాశియంగడి, రాశిబజారు.

**منڈی** ముండీ (హి.స్త్రీ) బోడితరము.

**منڈیری - منڈیر** ముండేర్ — రీ (హి.స్త్రీ) గోడయంచు, బొద్దు, పైకిట్టు.

**منزل** మంజ్హిల్ (అ.స్త్రీ) దిగుచోటు, బస; ఒకనాటిప్రయాణము; ఒక మెట్టు, స్థానము; అంతస్తు; నిలువు; ఇంటియొక్క ఒకఅంతస్తు, **منزل کاٹنا** — కాట్నా (హి) ప్రయాణముముగించుట, బసజేయుట, **منزل مقصود** — ఎమక్సూద్ (అ) గమ్యస్థానము, చేరవలసినచోటు.

**منزلت** మంజ్హిలత్ (అ.స్త్రీ) అంతస్తు, మెట్టు, స్థానము; పదవి, దశ, ప్రతిష్ఠ, పరువు, అధికారము, అధికారపదవి, గౌరవము, గొప్పతనము.

**منزلہ** మంజ్హిల (అ.పు) పరువు, ప్రతిష్ఠ, పదవి, ఇంటిఅంతస్తు; నిలువు; **ہم منزلہ** హమంజ్హిల (పా) సమానము, సదృశము, సాటిది, మెట్టు, సమానము, సరిమెట్టుగలది, సరిసమానము.

**منزول** మంజ్హూల్ (అ) క్షయించునది, క్షీణించునది, నశించునది, నశ్వరము, చెడు

నది, దిగినది, దిగునది, తగునది.

**منزوی** ముంజివీ (అ) జన సంపర్కము వదలిన వాడు, ఏకాంత వాసి. యతి, సన్న్యాసి, వానప్రస్థుడు.

**منزه** మునజ్జ (అ) స్వచ్ఛము, నిర్మలము.

**منسا** మన్సా (హి.స్త్రీ) అభిలాష, ఉద్దేశము, ఆశ, ఆస.

**منسج** మున్సిజ్ (అ.పు) నేతగాడు, సాలె [వాడు.

**منسل** మన్సల్ (హి) మణిశిల, మన్సలము.

**منسلک—منسلکہ** మున్సలిక్-మున్సలిక (అ) దారముతో గ్రుచ్చిన, చేర్చిన, కలిపి కట్టిన, అంటకట్టిన, అంటుకట్టిన, అనుస్యూతము, స్యూతము, కుట్టియున్నది. అనుబద్ధము.

**منسوب** మన్సూబ్ (అ) సంబంధింపజేయబడిన, సంబంధముగల, సంబద్ధము, అనుబద్ధము; వివాహము చేయబడిన, వివాహితము, పేరుగల, మారు పేరుగల; ఆరోపింపబడిన (గుణదోషాదులు), మోపబడిన, తగిలించిన, అంటగట్టిన.

**منسوخ** మన్సూఖ్ (అ) కొట్టివేయబడినది, ఖండింపబడినది, నిరస్తము, ఖండితము.

**منسوخی** మన్సూఖీ (అ.స్త్రీ) కొట్టివేయుట, త్రోసివేయుట, నిరసించుట, ఖండించుట, నిరసనము, ఖండనము.

**منش** మనుష్ (హి.పు) మనుష్యుడు, మానవుడు.

**منش** మనిష్ (పా.స్త్రీ) స్వభావము, గుణము ప్రకృతి; ప్రతిష్ఠ, అధికారము, పరువు; గర్వము, అభిమానము; అభిలాష, కోరిక; ఆత్మ, మనసు, హృదయము.

**منشا** మన్‌షా (అ.పు) అభిప్రాయము; అభిప్రేతము, భావము, ఉద్దేశము, మూలము, అర్థము, సారాంశము.

**منشار** మిన్షార్ (అ.పు) అంపము, క్రకచము; వీవన, విసనకఱ్ఱ; గవాక్షము.

**منشور** మన్షూర్ (అ.పు) రాజశాసనము, శాసనము, ప్రకటితము; పలకలుదీరిన ఆకారము.

**منشی** మున్షీ (అ.పు) కల్పనచేయువాడు, రచియించువాడు; లేఖరి, వ్రాతగాడు, రాయసగాడు, ఉపాధ్యాయుడు, గౌరవనామము. **منشی فلک** – యెఫ్లక్ (అ) బుధగ్రహము, **منشی میر** మీర్ – (పా) ప్రధానలేఖరి, ముఖ్యలేఖరి, పెద్దరాయసగాడు, **منشی گری** – గరీ (పా.స్త్రీ) వ్రాతపని, లేఖనవ్యాపారము, లేఖనోద్యోగము, వ్రాతకొలువు.

**منصب** మన్సబ్ (అ.పు) ఉచ్చస్థానము, ఉచ్చస్థితి, ఉన్నతపదవి, అధికారము; అంతస్థు, పదవి, ఉద్యోగము, గొప్పస్థితి, గొప్పతనము, ఘనత, **منصب دار** – దార్ (పా) అధికారస్థుడు, ఉద్యోగస్థుడు, అధికారి, అధికారపదవిగలవాడు, ఉద్యోగపదవిగలవాడు; వర్షాశనముగల వాడు, గౌరవవేతనదారుడు.

**منصرف** మున్సరిఫ్ (అ) త్రిప్పిన, తిరిగిన, మారిన, తిరుగబడిన, మరల్చిన, (వ్యా) రూపనిష్పత్తి జేసిన.

**منصرم** మున్సరిమ్ (అ.పు) కార్యనిర్వాహకుడు, పని నెరవేర్చువాడు.

**منصف** మున్సిఫ్ (అ పు) న్యాయాధికారి, న్యాయముచేయువాడు, న్యాయమువిచారించువాడు, మధ్యవర్తి, న్యాయమైనది, **منصف مزاج** – మిజాజ్ (అ) న్యాయస్థుడు, న్యాయస్వభావముగలవాడు,

**منصفی** మున్సిఫీ (అ. స్త్రీ) న్యాయాధికారము. న్యాయస్థానము, న్యాయము.

**منصفانہ** మున్సిఫానా (పా) న్యాయపూర్వకము, న్యాయమైన, సక్రమము, సరిగా, న్యాయముగా, సక్రమముగా, న్యాయానుసారము.

**منصوب** మన్సూబ్ (అ) స్థాపింపబడినది, నిలువబెట్టబడినది, పాతినది, నిశ్చయింపబడినది, అకారసాంజ్ఞికలయాక్షరము.

**منصوبہ** మన్సూబ (అ. పు) నిలువబెట్టినది, దృఢనిశ్చయము, ఉద్దేశము, మనోరథము; పన్నుగడ, పన్నాగము. **منصوبہ باندھنا** — బాంధ్నా (ఉ) ఉద్దేశించుకొనుట, దృఢనిశ్చయము జేసికొనుట.

**منصور** మన్సూర్ (అ) విజయుడు, జయశీలుడు, జయముగలవాడు; సహాయముజేయబడినవాడు, సహాయవంతుడు.

**منصوم** మన్సూమ్ (అ. పు) కార్యనిర్వాహకుడు; కార్యదర్శి; ప్రధానలేఖరి, పంతులు.

**منضج** మున్జిజ్ (అ) పక్వముజేయు, పచనముజేయు, చీముగలిగించిపుండును పక్వముజేయునది.

**منطبع** ముంతబె (అ) లోబడెడు, అధీనముగు, విధేయుడగు; లోబడిన; సుశిక్షితుడు; ముద్రితము, అచ్చువేయబడినది.

**منطبق** ముంతబిక్ (అ) ఒకదానిపైనొకటియుంచినసరిగానుండెడు, సరిపడియుండిన, సరిపోయిన, దొంతరముగానుండెడు. **منطبق ہونا** — హోనా (ఉ) ఒకదానిపైనొకటిసరిపడియుండుట.

**منطفی** ముంతఫీ (అ) చల్లారిన, చల్లారదు, ఉపశమిల్లినది, ఉపశాంతము, శాంత

**منطق** మంతిక్ (అ. స్త్రీ) సంభాషణము, తర్కము, తర్కశాస్త్రము.

**منطقہ** మింతక (అ. పు) మొలకట్టు, మొలపట్టె, నడికట్టు, ఒడ్డాణము; చుట్టు, వలయము **منطقۃ البروج** — మింతకతుల్ బురూజ్ (అ) రాశిచక్రం. **منطقہ بارده** — బారిద (అ) శీతలమండలము, **منطقہ حارہ** — హార్ర (అ) ఉష్ణమండలము **منطقہ معتدلہ** — ముఅతదిల (అ) సమశీతోష్ణమండలము.

**منطقی** మంతకీ (అ. పు) తర్కసం, వివాదశీలము; తర్కశాస్త్రజ్ఞుడు,

**منظر** మన్జర్ (అ. పు) దర్శనస్థానము, దృశ్యము, దర్శనీయము, చూడతగినది; ప్రకృతిభావము, ప్రకృతిదృశ్యము; గోపురము, ఎత్తైనకట్టడము; గవాక్షము, కంటి; ముఖము, ఆకారము; **منظر عام** — ఎ, అమ్ (అ) సార్వజనిక దర్శనస్థానము, అందరును చూచుచోటు, సర్వాలోకనస్థానము.

**منظور** మంజూర్ (అ) చూచినది, చూచి సరిచూసినది; ఆమోదితము అంగీకృతము, సమ్మతించినది, అనుమతింపబడినది, ఆమోదమందినది **منظور کرنا** — కర్నా (ఉ) అంగీకరించుట, అనుమతిఇచ్చుట, అంగీకారము పొందుట **منظور نظر** — ఎ, నజర్ (అ) నేత్రపర్వము, ప్రియురాలు, దర్శనీయము.

**منظوری** మంజూరీ (అ. స్త్రీ) అంగీకారము, ఆమోదము, సమ్మతము, అనుమతి, ఒప్పుదల, సమ్మతి.

**منظوم** మంజూమ్ (అ) ఛందోబద్ధము, పద్యములుగవ్రాసినది. [ము.

**منظومہ** మంజూమ (అ పు) పద్యకావ్య

**منع** మనఒ (అ.పు) నిషేధము, ప్రతిషేధము, నిరాకరణము, కూడదనుట, కాదనుట, వద్దనుట; ఆటంకము, అడ్డగింపు.

**منعطف** మున్అతిఫ్ (అ) వలితము, తిరుగునది, మరలిన, వంగిన, కలిసిన,

**منعقد** మున్అకిద్ (అ) కూర్చుండబెట్టబడిన, సమావేశముజేయబడిన, సమావేశితము, సమావిష్టము, కూర్పబడిన, చేర్పబడిన, చేరిన, కూడిన, జరుపబడిన, జరిగిన; స్థాపింపబడిన, స్థాపితము; కట్టబడినది, బద్ధము, **منعقد اللسان** మున్అకిదు-ఉల్‌లిసాన్ (అ) వాగ్బంధనమైన, నోరెత్తగూడని.

**منعکس** మున్అకిస్ (అ) తలక్రిందైన, క్రిందుమీదైన, వ్యత్యస్తము, వ్యతిరిక్తము, వ్యత్యయము, విపరీతము, క్రిందలదైనది; ప్రతిబింబితము, ప్రతిఫలము.

**منعم** మున్ఇమ్ (అ పు) సంపన్నుడు, కలవాడు; ఉదారి, దాత, పరోపకారి, ఉపకారశీలుడు, దయాళువు. **منعم حقیقی** -ఎహకీకీ (అ) నిజముగా ఉపకారముజేయువాడు, ఈశ్వరుడు.

**منغض** మునగ్గజ్ (అ) వ్యాకులితము, కలతజెందినది, దుఃఖితము, ఖిన్నము, చింతాక్రాంతము, వ్యసనముగల.

**منفرج** మున్ఫరిజ (అ) విస్తారము, విశాలము **زاویہ منفرجہ** జావియాయె-(అ) గురుకోణము, సమకోణముకన్న పెద్దది.

**منفصل** మున్ఫసిల (అ) విభాగింపబడినది, పంచబడినది, విభాజితము, విభక్తము; తీర్మానింపబడినది, తీర్పుజేయబడినది, పరిష్కృతము. [ఆదాయము, లాబడి.

**منفعت** మన్ఫఅత్ (అ. స్త్రీ) లాభము,

**منفعل** మున్ఫఇల్ (అ) అవమానింపబడినవాడు, అవమానితుడు, లజ్జితుడు, అభిభూతుడు, సిగ్గుపడినవాడు.

**منفی** మన్ఫీ (అ) వ్యతిరేకము, తీసివేయబడినది, తీసివేయదగినది, ఉప్తము; వ్యవకలితము, తీసివేసినది, (గణితము) వ్యవకలనసంజ్ఞ, ఋణసంజ్ఞ, తీసివేత.

**منقار** మిన్కార్ (అ. స్త్రీ) పక్షిముక్కు-చంచువు.

**منقاش** మిన్కాష్ (అ. స్త్రీ) మంగలవాడు వెంట్రుకలూడదెరచు సాధనము, చిమ్మట; తండసము, కటిలిక; గోళ్లుతీయుసాధనము, గోరుగల్లు.

**منقبض** మున్కబిజ్ (అ) ముడుచుకొనునది, సంకుచితము, మలబద్ధముగలిగించునది, విరేచనబద్ధకము.

**منقسم** మున్కసిమ్ (అ) విభాగించిన, విభాజితము, విభాజ్యము, విభక్తము, పంచినది, పంచిపెట్టినది.

**منقش** మునక్కష్ (అ) చిత్రములువ్రాసిన, చిత్రములుకుట్టిన, చిత్రితము, గీచినది, చెక్కినది, తొలచినది(రాయిమొ॥)

**منقضی** మున్కజీ (అ) దాటిపోయినది, అతీతము, మీరినది, ముగిసినది, అయిపోయినది, జరిగిపోయినది.

**منقطع** మున్కతి (అ) తెగగొట్టబడినది, ఛేదితము, భంగమైనది, భగ్నము, విచ్ఛిన్నము, ముగిసినది, సమాప్తము, పరిష్కృతము.

**منقل** మిన్కల్ (అ.పు) ధూపపాత్ర, కుంపటి.

**منقوط** మన్కూత (అ) చుక్కలుగలది, బిందుకము, సంబిందుకము, బొట్లుగలది, ఉచ్చారణ చిహ్నములుగలది.

منقول మన్ఖూల్ (అ) ఎత్తివ్రాసినది; అనువాదము, అనువదించినది, చూచివ్రాసినది, ప్రతివ్రాసినది; చెప్పినది-వినిపించినది, కథితము.

منقولات మన్ఖూలాత్ (అ.పు) అనుశ్రుతముగావచ్చినమాటలు, కథితములు, ఇతిహాసములు, సాంప్రదాయములు, సాంప్రదాయవచనములు. గతానుగతికములు; చరాస్తి, చరములు.

منقولہ మన్ఖూల- (అ) కదలింపబడినది, కదలింపదగినది, చరము. చరాస్తి.

منقی మునక్కా (అ.స్త్రీ) దీపద్రాక్ష, ద్రాక్షవరుగు, సన్నద్రాక్ష, ఎండినద్రాక్ష, దాకవరుగు; పరిశుద్ధము. స్వచ్ఛము, ఎండినది.

منکا మన్కా (హి పు) మణి, పూస; మెడపూస (వెన్నెముకలోని భాగము

منکا ڈھلکنا మన్కా - ఢలక్నా (హి) మాఱు మెడబడుట, చావసిద్ధముగానుండుట.

منکر మున్కిర్ (అ) లేదనువాడు, నాస్తికుడు, పాషండుడు, ప్రత్యాఖ్యాత, కాదనువాడు منکر ونکیر — మున్కర్ ఒనకీర్ (అ) వీరుఇద్దరుదేవతలు. ఈదేవతలువచ్చినవారిని వారివారిజీవితములనుగూర్చి ప్రశ్నించుచుందురు.

منکشف మున్కషిఫ్ (అ) ప్రచురమైనది, ప్రసిద్ధమైనది, వెల్లడియైనది, ప్రకాశితము, ప్రకటితము. ప్రచురము; తెరచినది, బయలైనది, వెల్లడియైనది, ప్రసిద్ధము, ప్రఖ్యాతము, విదితము, తెలిసినది, లోకవిదితము.

منکوحہ మన్కూహా (అ.స్త్రీ) పెండ్లియైనస్త్రీ, వివాహితురాలు, ధర్మపత్ని, అగ్నిసాక్షిగాపెండ్లియాడినది, ఇల్లాలు.

منکھ మనుఖ్ (హి.పు) మనుష్యుడు, మానవుడు.

منگا بھیجنا మంగాభేజ్నా (హి) తెప్పించుట, తేబనుచుట, తేబంపుట, తెమ్మనిపంపుట.

منگانا మంగానా (హి) తెప్పించుట తేబంపుట, తెమ్మనుట.

منگتا మంగ్తా (హి.పు) యాచకుడు, అడుగువాడు, అర్థి, బిచ్చగాడు.

منگڑا మంగ్డా (హి) తలబిరుసుగాడు, మొక్కలీడు, బలవంతుడు, మూర్ఖుడు.

منگسر మంగ్సిర్ (హి.పు) మార్గశీర్షము, హిందువుల తొమ్మిదవనెలపేరు

منگل మంగల్ (హి.పు) మంగళము, శుభము; జయము, కల్యాణము, సుఖము, సంతోషము; మంగళుడు, అంగారకగ్రహము; మంగళవారము.

منگلا مکھی మంగ్లాముఖి (హి.స్త్రీ) మంగళముఖి, వేశ్యకాంత, పాటగత్తె, భోగముది.

منگلی మంగ్లీ (హి) మంగళవంతము, శుభకరము, కల్యాణదాయకము, మంగళకరము, అంగారకదశలో పుట్టినవాడు.

منگنی మంగ్నీ (హి.స్త్రీ) అప్పు, ఋణము; నిశ్చితార్థము, (పెండ్లికి)

منگنی دینا మంగ్నీ - దేనా (హి) అప్పిచ్చుట منگنی کرنا — మంగ్నీ - కర్నా (హి) పెండ్లికి నిశ్చితార్థముజేయుట, నిశ్చయతాంబూలము.

من موہن మన్ మోహన్ (హి పు) కృష్ణుడు, మనోహరుడు, ప్రియుడు.

منو మనో (హి) అన్నట్లు, పోలె, వలె, అట్లు, అనుకొనునట్లు.

منوتی మనౌతీ (హి.స్త్రీ) మనస్సంతుష్టి,

మనశ్శాంతి, మనస్సమాధానము, సమ్మతి, అంగీకారము; పూచిపడినవాడు, ఉత్తరవాది.

**منور** మునవ్వర్ (అ) ప్రకాశమానము, ప్రకాశవంతము, కాంతిమంతము, ప్రభావంతము. కాంతిగలది.

**منورتھ** మనోరథ్ (హి.పు) మనోరథము, కోరిక, ఉద్దేశము.

**منہ** ముంహ్ (హి.పు) ముఖము, మొగము; నోరు, వాయి, ద్వారము, రంధ్రము, బిలము; తెరిపి; సమక్షము, ఎదురు; మొగమోటము, దాక్షిణ్యము; గౌరవము, లక్ష్యము; పక్షపాతము, సామర్థ్యము, శక్తి; ఆశ, ఆత్రము **منہ نکل آنا - اُترنا** నికల్ ఆనా, ఉతర్నా (హి) ముఖము వాడుట, బక్కబడుట, **منہ اُجلا ہونا** — ఉజ్లాహోనా (హి) ముఖము వికాసమొందుట, ముఖమున కాంతివచ్చుట, జయముగలుగుట, **منہ آنا** — ఆనా (హి) నోరుపూయుట, నోరువచ్చుట, **منہ آمنہ** — ఆముంహ్ (హి) దిగపాలు, నిండుగ, సంపూర్ణము, **منہ اندھیرا** — అంధేరా (హి) కనుచీకటితో, తెల్లవారుగట్ల, వేకువన, చీకటిముసుకున, చీకటితో, **منہ بانا** — బానా (హి) నోరు తెరచుట, బలవంతముగ నవ్వుట, వెట్టిబాగులుగ చూచుట, **منہ بگاڑنا** — బిగాడ్నా (హి) మొగము వికారము చేసికొనుట, దుర్ముఖుడగుట, ముఖము చిట్లించుకొనుట, ముఖము వికారము జేసికొనుట. నోరు రుచిచెఱుచుట, చెఱుచుట, **منہ بگڑنا** — బిగడ్నా (హి) మొగము వికారమొందుట, మొగము మారుట. ముఖవైఖరిచెడుట, దుర్ముఖుడగుట; నోరుచెడుట రుచిచెడుట, అరుచికలుగుట, **منہ بنانا - چڑانا** — బనానా - చిడానా (హి) వెక్కిరించుట, ముఖవికారాదులచేహేళనజేయుట, **منہ بولا** — బోలా (హి) వరుసచేసికొనిన, వరుసపెట్టుకొనిన, వరుసకల్పించుకొనిన, నోటిమాటల, మాటమాత్రమునకైన, **منہ بولا بھائی** — బోలాభాయీ (హి) అన్నవరుసపెట్టికొనినవాడు, ప్రియమిత్రుడు, **منہ پر دانا نہ رکھنا** — పర్ దానా న రఖ్నా (హి) నోట మెతుకుపట్టకుండుట, బొతుగాతినకుండుట, మెతుకుఎంగిలిచేయకుండుట, **منہ پانا** — పానా (హి) సుముఖముగానున్నట్టు తెలియుట, ప్రసన్నుడుగానున్నట్లు తెలియుట, **منہ پر** — పర్ (హి) ఎదుట, సమక్షమున, ఎదురుగా, ముందర, **منہ پر جانا** — పర్ జానా (హి) మొగముజూచి ఊరకుండుట, **منہ پر لانا** — పర్ లానా (హి) అనుట, ఆడుట, చెప్పుట, వచించుట, **منہ پر ہوائیاں اڑنا - فاختہ اڑنا** — పర్ హవాయియాఁ ఉడ్నా — ఫాఖ్తా ఉడ్నా (హి) ముఖము వెలవెలబారుట, ముఖము కళచెడుట, దిగ్భ్రమనొందుట, కలవరపడుట, నివ్వెఱబోవుట, బమ్మెరబోవుట, **منہ پھاڑنا - پھسارنا** — ఫాడ్నా ఫసార్నా (హి) నోరు తెరచుకొనియుండు, నోరుతెరచి చూచుచుండుట, నివ్వెరబోవుట తోచకపోవుట, **منہ پھٹ** — ఫట్ (హి) నోటిదుడుకువాడు, తిట్టుబోతు, దుడుకుమాటలవాడు, **منہ پھرنا** — ఫిర్నా (హి) పెడమొగమగుట, వేసారుట, విసుగుట, **منہ پھیرنا** — ఫేర్నా (హి) పెడమొగము బెట్టుట,

(హి) పెడమొగము బెట్టుట, వదలుకొను
ట, తిరుగబడుట, **منہ میں پانی بھرنا** — మేంపానీభర్నా (హి) నోట్లో
నీరూరుట, ఆశపుట్టుట, **منہ ہی منہ میں** — హీముంహ్‌మేం (హి) నోటిలో
నిదినోటిలోనే, తనలోతాను, **منہ پٹورنا** — పటోర్నా (హి) వెట్టిమొ
గముగజూచు చుండుట, వెట్టిబాగులుగ
నవ్వుట.

**منہا** మిన్‌హా (అ) దానినుండి(తీసివేసినది)
త్రోసిపుచ్చినది; ఆదుండి (తగ్గించినది),
విలుప్తము, త్రోపుడు, తీసివేత, వినా
యింపు, **منہا کرنا** — కర్నా, (ఉ)
వినాయించుట, త్రోపుడు పెట్టుట-తీసివే
యుట, తగ్గించుట.

**منہاج** మిన్‌హాజ్ (అ) ఋజుమార్గము,
చక్కనిబాట, రాజమార్గము,

**منہار** మనిహార్ (హి.పు) గాజులబత్తుడు.
గాజులు మొ॥అమ్మువిల్లగవర్తకుడు, పూస
పేర్గవాడు.

**منہائی** మిన్‌హాయియా (అస్త్రీ) తీసివేత,
తగ్గింపు, వినాయింపు, త్రోపుడు, వార
ణము.

**منہدم** మున్‌హదిమ్ (అ) శిథిలీభూతము,
నేలమట్టమయిన, నాశమైన, పాడైన,
పడిపోయిన, పాడుపడిన.

**منہی** మన్‌హీ (అ.పు) నిషిద్ధము, నిషే
ధింపబడినది, కూడదనినది,

**منی** మనీ (పాస్త్రీ) గర్వము, అహంకా
రము, (అ) శుక్లము, ఇంద్రియము.

**منیب** మునీబ్ (అ.పు) సన్మార్గుడు,
యజమాని, కార్యదర్శి, సర్వాధికారి.

**منیہ—منیت** మున్‌య - త్ (అ) ఉ
ద్దేశము, అభిలాష కోరిక, ఆశ.

**منیر** మునీర్ (అ) కాంతిగల, మెఱయు
నట్టి, కాంతిమంతము, ప్రకాశమానము,
కాంతినిచ్చునది, ప్రకాశకము.

**منیع** మునీఉ (అ) చొరరానిది, అయో
ధ్యము.

**منیف** మునీఫ్ (అ) ఉత్తముడు, శ్రేష్ఠ
డు, ఘనుడు, గొప్పవాడు.

**منیم** మునీమ్ (హి.పు) కార్యదర్శి, సర్వా
ధికారి; గణికుడు, లెక్కపనిజూచువాడు,
లేఖరి.

**مو** మూ (హి.పు) ముఖము, మొగము; నో
రు, వాయి; చూడు **منہ** అను పదమును
దానిసమాసములును.

**مو** మూ (పా.పు) వెంట్రుక, కేశము; బీట,
పగులు, చీరిక. **موباف** — బాఫ్
(పా) వెంట్రుకలలో నల్లిన, (జెడదారము
మొ॥), **موشگافی** — షిగాఫీ (పా)
వెంట్రుకనుచీల్చుట, సూక్ష్మపరీక్ష, స్తన
శల్యపరీక్ష.

**موا** మువా (హి) మృతుడు, చచ్చినది; తు
చ్ఛము, **موا بادل** — బాదల్ (హి)
సముద్రపుపాచి (Sponge).

**مواج** మవ్వాజ్ (అ) అలలుకొట్టుకొను
చున్న, తరంగములులేచుచున్న, సంక్షు
భితము, కల్లోలముగనున్న, అల్లకల్లోలము.

**مواجب** మువాజిబ్ (అ) నియోగములు,
నిరీతములు; జీతములు. సంబళములు, వే
తనములు; తగినవి, కావలసినవి, (ఏ. వ.
**موجب**).

**مواجہ** మువాజ్హ (అ) సమక్షము, ఎదు
ట, ముందఱ, ఎదురు, అభిముఖము.

**مواخذہ** మువాఖజ్‌హ (అ.పు) పట్టుకొనుట,
నిరోధము, నిగ్రహము, అభియోగము,
నిర్బంధము, నేరారోపణము, దోషారో

పణము, బాధ్యత, ఉత్తర వాదము. పూఛీ; అడిగినదానికి ప్రత్యుత్తరము చెప్పవలసి వచ్చు, శిక్ష, **مواخذه دار** — దార్ (పా) ఉత్తరవాది, బాధ్యతగలవాడు, నిర్బంధముగలవాడు, **مواخذه کرنا** — కర్నా (ఉ) నిర్బంధపెట్టుట, నేరారోపణముజేయుట, అభియోగము తెచ్చుట, తప్పు మోపుట; పట్టుకొనుట.

**مواد** మవాద్ (అ పు) సామగ్రి, వస్తువులు, పదార్థములు; ధాతువులు; పరికరములు; చీము, పూయము, (ఏ. వ. **ماده**)

**مواد فاسد** — ఎ ఫాసిద్ (అ) దుష్టధాతువులు.

**موازی** మువాజీ (అ.పు) సమానాంతరము, తూచినది, తులితము, అంచనజేసినది, తుల్యము, సమానము, సమము; దాదాపు, ఉరమర; వెరసి, మొత్తము.

**موازنه** మువాజన (అ.పు) తూచిచూచుట, తులనము, తులితము, పరిమితము, సరియైనది, సరిచూచినది, సరిపుచ్చినది; ఉజ్జాయింపు, ఉజ్జ, ఉరమర, దాదాపుగ లెక్కగట్టినది, రమారమి, ఉరమరిక మొత్తము, పరిమితము, అంచన, అంచన మొత్తము, సరిజేసిన మొత్తము.

**مواشی** మవాషీ (అ.స్త్రీ) బరువుమోయు జంతువు, మోతపశువు, భారవాహకము; పశువులు, గొడ్లు, గోదలు, (ఏ.వ **ماشیه**)

**مواصلت** మువాసలత్ (అ. స్త్రీ) సంయోగము, చేరిక, కూడిక, సమాగమము, కూటమి.

**موافق** మువాఫిక్ (అ) అనుకూలము, అనుగుణము. అనురూపము; ఉచితము, అర్హము, హితము, యోగ్యము, సరి, సమము, తగినది; అనుసరించి, ప్రకారము, అనుసారము, సరిగా, **موافق ہونا** — హోనా (ఉ) అనుకూలమగుట, అనుకూలించుట, సరిపడుట, అంగీకరించుట.

**موافقت** మువాఫకత్ (అ. స్త్రీ) అనుకూల్యము, అనుగుణ్యము, అనురూప్యము, ఔచిత్యము; అర్హత, యోగ్యత; సామ్యము, పోలిక; అంగీకారము, సమ్మతి, సామరస్యము, స్నేహము.

**موالی** మవాలీ (అ) పాలకులు, యజమానులు, సహాయులు, మిత్రులు, (ఏ. వ. **مولی**).

**موانست** మవానసత్ (అ. స్త్రీ) సాంగత్యము, సాహచర్యము, సహవాసము, పరిచయము; చనవు, మైత్రి, అన్యోన్యము, ఐకమత్యము.

**موانع** మవానె (అ. పు) అంతరాయము, ఆటంకములు. నిరోధములు, నిషేధములు, అభ్యంతరములు, అడ్డంకులు, (ఏ.వ **منع**).

**موبد** మూబిద్ (పా. పు) శాస్త్రజ్ఞాని, జ్ఞాని, సిద్ధాంతి, పండితుడు. వేదాంతి; అగ్ని ఉపాసకులపురోహితుడు, ఆచార్యుడు.

**موت** మౌత్ (అ. స్త్రీ) మరణము, మృత్యువు, చావు, **موت مونا** — ఎమానా (అ) సహజమరణము. (నొందుట) **موت اضطرار** — ఎ ఇజ్తిరార్ (అ) బలవన్మరణము, కష్టపుచావు.

**موتاد** మౌతాద్ (అ. స్త్రీ) పరిమాణము, ప్రమాణము, కొలత, ఔషధాదులు.

**موتها** మోథా (హి. పు) ముస్తకము, ముస్తె తుంగముస్తె, భద్రతుంగము, భద్రముస్తె.

**موتی** మోతీ (హి స్త్రీ) మౌక్తికము, ముత్తెము, **موتی پرونا** — పురోనా (హి) ముత్యములకూర్చుట, సక్రమము

గమాట్లాడుట, పాంకముగ మాట్లాడు లేక వ్రాయుట, సరసముగ మాట్లాడుట; కన్నీరు కార్చుట, ఏడ్చుట. موتیابندهنا — چھیدنا — బింధ్నా, ఛేద్నా (హి) కన్యాత్వము చెఱచుట, موتی چور — చూర్ (హి) ఒకతియ్యనితినుబండము, తేజోవంతములైనకన్నులు.

**موتیا** మోతియా (హి.పు) మల్లెచెట్టు లేక పువ్వు, మల్లిక: ముత్తెపు, ముత్యముసం॥ موتیا بند — బంద్ (హి) కంటిపూవు, గ్రుడ్డితనము.

**موت** మోట్ (హి. స్త్రీ) మూట, ముల్లె, తోలుబొక్కెన.

**موٹا** మోటా (హి) లావైన, స్థూలము, లావాటి, దొడ్డు; ముతకైన, దళసరి, దట్టమైన: దొడ్డ, పెద్ద; దండి, ద్రవ్యముగల, సంపన్నుడు, موٹا تازہ — తాజె (ఉ) కాయ పుష్టిగల, దిట్టముగా నున్న, బలిసియున్న.

**موٹاپن — موٹائی** మోటాపన్, (హి.పు) మోటాయీ (హి.స్త్రీ) స్థౌల్యము, బలుపు, లావు; దళసరిగానుండుట, మోటుగానుండుట, దట్టదనము.

**موٹھ** మూఠ్ (హి.స్త్రీ) ముష్టి, పిడి; పిడికిలి; చేతబడి, మంత్రప్రయోగము, موٹھ چلانا — చలానా (హి) చేతబడిచేయుట, మంత్రప్రయోగము చేయుట, చెడుగు చేయుట.

**موثر** ముఅస్సిర్ (అ) దూరునది, గురుతేర్పరచునది, ఫలకారి, గుణకారి, ఫలితముజూపునది, గుణమిచ్చునది, గుణముజూపు; తాకు, పట్టు.

**موج** మౌజ్ (అ. స్త్రీ) అల, తరంగము కల్లోలము; ఉద్రేకము, ఆవేశము, పారవశ్యము, ధోరణి, ధ్యానము, తలంపు, లహరి, లాహిరి; దండి; పుష్కలము, విస్తారము. موج زن — జెన్ (పా) అలలుగొట్టుకొనుచున్న, అలలతో ఉప్పొంగుచున్న, తరంగ ఘూర్ణితము, సంక్షుభితము, కల్లోలముగా నున్న, موج مارنا — మార్నా (హి) అలలుకొట్టుకొనుచుండుట, అలలులేచుచుండుట, భోగించుచుండుట, భోగమనుభవించుట, موج کرنا — కర్నా (హి) భోగమనుభవించుట.

**موجب** మూజిబ్ (అ.పు) కారణము, హేతువు, ఉద్దేశము, మూలము.

**موجبہ** మూజిబ (అ.పు) మహత్కార్యము; ఘనకార్యము; శాశ్వతస్వర్గము లేక నరకము; భావవాక్యము, భావప్రతిజ్ఞ.

**موجد** మూజిద్ (అ.పు) సృష్టించినవాడు, కనిపెట్టినవాడు, కల్పించినవాడు, క్రొత్తగ చేసినవాడు, నిర్మాత, రచయిత, నిర్మించినవాడు, కారకుడు, కారణ భూతుడు, موجدان قانون మూజిదానెక్వానూన్ (అ) శాసన సమితి, శాసన కారులు, శాసనసభ.

**موجز** మూజజ్ (అ.పు) సంగ్రహము, సంక్షేపము, తక్కువచేసినది, క్లుప్తము; సారము, సారాంశము.

**موجود** మౌజూద్ (అ) సృజింపబడినది, సృష్టము; వర్తమానము, ఉన్నది, ప్రస్తుతము, సమక్షమందున్నది, ఆయత్తము, సిద్ధము, చేతనున్నది, موجود کرنا — కర్నా (ఉ) సృష్టించుట, కలిగించుట, కొనివచ్చుట, తీసికొనివచ్చుట, తెచ్చిపెట్టుట, సిద్ధపరచుట, తెచ్చుట, موجود ہونا — హోనా (హి) కలుగుట,

మైనపడవ, **مورچھل** – ఛల్ (హి) నెమలిఈకెలకట్ట. కేకిపింఛము,

**مورمکٹ** – మకుట్ (హి) మయూరమకుటము, నెమలిజుట్టుమకుటము.

**مور** మౌర్ (హి.పు) చెట్టుపూత. మామిడిపూత,

**مورتی - مورت** మూరత్ – రీ (హి.స్త్రీ) విగ్రహము, ఆకారము, బొమ్మ, చిత్రము, రూపము.

**مورث** మూరిస్ (అ.పు) పూర్వాధికారి, మూలపురుషుడు, ఉత్తరాధికారమిచ్చువాడు. ఆస్తియిచ్చువాడు, ఆస్తియుంచి చచ్చినవాడు; కారకుడు, కర్త, శాస్త్రకారుడు, స్మృతికారుడు.

**مورچہ** మోర్చ (పా.పు) ఇనుముమీదిమష్టు. త్రుప్పు; అగ్నిశస్త్రవిద్యానమంటివిలో పోసిన కట్ట లేక దిబ్బ–మాటుదిబ్బ.

**مورچھا** మూర్ఛ (హి.స్త్రీ) మూర్ఛ, సొమ్మ, అపస్మారము, తెలివితప్పుట.

**مورخ** ముఅర్రిఖ్ (అ.పు) ఐతిహాసికుడు, చరిత్రకారుడు, చరిత్రవ్రాసినవాడు.

**مورخہ** ముఅర్రఖ (అ) వ్రాసినది. లిఖితము, వ్రాసినతిథివేసిన, తేదీవేసిన; లిఖితవాసరము.

**مورکھ** మూరఖ్ (హి) మూర్ఖుడు, మూఢుడు.

**مورنگ الائچی** (ఉ) మోరంగ్ ఇలాయిచీ (హి) మూరంగిఏలకులు.

**مورنی** మోర్నీ (హి.స్త్రీ) ఆడనెమలి.

**موروثی** మౌరూసీ (అ) పరంపరాగతము, పిత్రార్జితము, పైతృకము, పితృసం॥ వంశపారంపర్యముగావచ్చినది.

**موری** మోరీ (హి.స్త్రీ) తూము, జలదారి; తూటు, రంధ్రము.

**موڑ** మోడ్ (హి.స్త్రీ) మూలమలుపు, మూలతిరుగుడు, తిరుగుడు, మలపు; వంపు, వంక; మెలి, మెలిక, మూల.

**موڑنا** మోడ్నా (హి) మలపుట, త్రిప్పుట, మరల్చుట, మలచుట, మరలజేయుట, మెలుచుట, పేనచుట, మెలిబెట్టుట, మెలివేయుట, మెలిత్రిప్పుట; తిరుగగొట్టుట, మరలగొట్టుట. వెనుకకుమరల్చుట, ముడుచుట–మడచుట.

**موڑھ** మూఢ్ (హి) మూఢుడు, తెలివిమాలినవాడు. [పీఠము, పీట.

**موڑھا** మోఢా (హి.పు) భుజము, బుజేము;

**موز** మౌజ్ (అ.పు) కదళీవృక్షము, అరటిపండు.

**موزون** మౌజూం (అ) తూచినది, తులితము, సరిపెట్టినది, సమానము; అర్హము, తగినది, యోగ్యము, ఉచితము, సరియైనది; ఛందోబద్ధము, కవిత.

**موزہ** మోజే (పా.పు) పాదరక్ష, చేతితొడుగు, చేతికివేసికొనుబట్టతొడుగు, చేతిమేజోడు, కాలుజోడు; విడికత్తెము,

**موزہ گیر** – గీర్ (పా) ఎక్కినతాని కాలుగఱచుస్వభావముగలగుఱ్ఱము, కాలుకఱచుగుఱ్ఱము.

**موس** మోస్ (హి) సముద్రసాచి.

**موسل** మూసల్ (హి.పు) ముసలము, రోకలి.

**موسلا** మూస్లా (హి) దండము, బడిత, దుడ్డు. గదెమ్రాను; రోకటిబండ, **موسلا دھار** – ధార్ (హి) ముసలధారావృష్టి ఏనుగుతొండము లావువర్షము, దండివర్షము, జడివాన.

**موسلی** మూస్లీ (హి.స్త్రీ) చెట్టుయొక్క ముఖ్యమైనవేరు, మూకటివేరు, కుంకటి

వేరు, ప్రధానమూలము; బహుబీజములగు పండ్లలోనుండుబొడ్డు, పిల్లపీచరవేరు.

موسم మౌసిమ్ (అ.పు) ఋతువు, కాలము, కారు, موسم باران — ఎ బారాం (పా) వర్ష కాలము, موسم بہار — ఎ బహార్ (పా) వసంతఋతువు; موسم خزان — ఎ ఖిజాం (పా) ఆకురాలుకాలము, శరదృతువు.

موسمی మౌసిమీ (అ) ఋతుసం॥, ఋతుకాలపు, కాలుకుతగిన.

موسوم మౌసూమ్ (అ) పేరుగలవాడు, అభిధానుడు, నామకుడు, పేరుచెప్పిన, పేరుగల, అనువాడు, موسوم کرنا — కర్నా (ఉ) పేరుపెట్టుట, పేర బిలుచుట.

موسی మౌసీ (హి.స్త్రీ) తల్లితోడబుట్టినది, అమ్మ, పిన్ని, موسیرا بھائی మౌసేరాభాయీ (హి) పినతల్లికొడుకు పెద్దతల్లికుమారుడు.

موسیقار మూసీక్కార్ (అ.పు) పిల్లనగ్రోవి, వేణువు; పక్షివిశేషము.

موسیقی మూసీఖీ (అ.స్త్రీ) గానవిద్య, సంగీతవిద్య.

موش మూష్ (పా.పు) మూషికము, ఎలుక, موش کور — ఎ కోర్ (పా) మంచెలుక. గబ్బిలము.

موشک మూషక్ (పా.పు) చుంచెలుక, గబ్బిలము.

موصوف మౌసూఫ్ (అ) గుణముగల, గుణోపేతము, గుణయుక్తము, విశేషయుక్తము, విశిష్టము, వర్ణితము, వర్ణింపబడినది, గుణములు చెప్ప బడినది; పూర్వోక్తము, ముందుచెప్పినది, చెప్పబడినది.

موصول మౌసూల్ (అ) కలిపినది, కలుపబడిన, చేరిన, కలిసిన, చేర్పబడిన, సంయుక్తము, సంబద్ధము; వచ్చిన, వచ్చి చేరిన, ముట్టిన, అందిన; పూర్వసంబంధముగలది.

موصی మూసీ (అ.పు) మరణశాసనము వ్రాసినవాడు, ఆస్తియిచ్చిచచ్చువాడు.

موصیہ మూసియ (అ.స్త్రీ) మరణశాసనము వ్రాయుఆడది, ఆస్తియిచ్చిచచ్చుఆడది.

موضع మౌజిఅ (అ.పు) గ్రామము, పల్లె, పొలములు.

موضوع మౌజూఅ (అ) స్థాపితము, కృతము, చేయబడినది, ఉంచబడినది, ఉన్నది, స్థితము, పెట్టబడినది; వస్తువు, వక్తవ్యాంశము, చెప్పనలసినది, విషయము, శబ్దము, మాట, ఒప్పుకొనబడినవిషయము, ఆమోదింపబడినవిషయము.

موطن మువత్తిన్ (అ.పు) జన్మభూమి, పుట్టినచోటు.

موعظت మౌఇజత్ (అ స్త్రీ) ఉపదేశము, సద్బోధ, నీతిబోధ.

موعود మౌఊద్ (అ) చెప్పబడిన, నిర్ణయింపబడిన, నిశ్చయింపబడిన, వాగ్దానముచేయబడిన, వాగ్దత్తము. మాటయిచ్చిన; విధనిర్ణయము.

موفور మౌఫూర్ (అ) అపారి, పుష్కలము, విస్తారము, అధికము, బాహుళ్యము, సమృద్ధి, అనేకము.

موقر ముఅక్కర్ (అ) గౌరవింపబడినవాడు, పూజితుడు, ఘనుడు, గొప్పవాడు, మర్యాదస్థుడు, గంభీరుడు, ప్రతిష్ఠితుడు.

موقع మౌఖె (అ.పు) జరిగినచోటు, స్థానము, స్థలము, చోటు; సమయము, సందర్భము, అవకాశము, موقع پر — పర్ (ఉ) సమయమువచ్చినప్పుడు, موقع سے — సే (ఉ) సమయముచూచి

సమయానుసారము.

**موقوف** మౌకూఫ్ (అ) నిలిపివేసిన, విరమితము, ఆపివేసినది, చాలించిన, మాన్పిన, తొలగించిన, ఉద్యోగముతొలగించిన, కొలువుతీసివేసిన; ఆధారపడియున్న, భారపడియున్న, నిలిచియున్న, అయత్తమై యున్న, అధీనమైయున్న, **موقوف رکھنا** — మౌకూఫ్ రఖ్నా (ఉ) ఆపియుంచుట, నిలిపియుంచుట, **موقوف کرنا** — మౌకూఫ్ కర్నా (ఉ) నిలిపివేయుట, తొలగించుట, **موقوف ہونا** — మౌకూఫ్ హోనా (ఉ) నిలిపివేయబడుట, తొలగింపబడుట.

**موقوفی** మౌకూఫీ (అ: స్త్రీ) నిలిపి వేయుట, ఆపుదల, తొలగింపు, చాలింపు, విరమించుట, విరమణము, నిలుకడ, విరామము; త్రోసివేత, తీసివేత, త్రోపుడు.

**موکب** మౌకిబ్ (అ.పు) అశ్వికదళము, గుఱ్ఱపుదండు, అంగరక్షకులు.

**موکل** మువక్కిల్ (అ) తనయధికారము నిచ్చువాడు, ప్రతిభువునునిర్ణయించువాడు, వ్యాజ్యదారుడు, పరార్థవాదిని(వకీలును) నియమించినవాడు.

**موکل** మువక్కల్ (అ) పరార్థవాది, ప్రతిభువు; ఒకరివలనఅధికారముపొందిపనిచేయువాడు; రక్షకుడు, పాలకుడు, నిర్వాహకుడు, విచారించువాడు.

**موگرا** మోగ్రా (హి.పు) మల్లెపువ్వు.

**موگری** మోగ్రీ (హి.స్త్రీ) చాకిబడియ, చాకలివాడు బట్టలను నలగగొట్టుదుడ్డు, చాకిబడిగ.

**مول** మూల్ (హి.పు) మూలము, ఆరంభము, ఉత్పత్తి; మూలధనము; మూలగ్రంథము; మూలానక్షత్రము; ముఖ్యము...

**مول** మోల్ (హి.పు) వెల, మూల్యము, క్రయము, **مول لینا** — మోల్ లేనా (హి) వెలకుతీసికొనుట, కొనుగోలుజేయుట, కొనుట.

**مولی** — **مولا** మౌలా (అ.పు) పూజితుడు, నాయకుడు, యజమాని, పెద్ద, ఈశ్వరుడు, పాలకుడు.

**مولانا** మౌలానా (అ.పు) విద్వాంసుడు, విద్వాంసుడు, పండితుడు.

**مولد** మౌలిద్ (అ.పు) జన్మస్థానము, పుట్టినచోటు; జననకాలము, పుట్టినసమయము లేక ముహూర్తము.

**مولسرا** మౌల్సరా (హి.పు) చూడు, **مولسری**

**مولسری** మౌల్సరీ (హి.స్త్రీ) పొగడచెట్టు.

**مولف** ముఅల్లిఫ్ (అ) సంకలితముచేసినవాడు, రచియించినవాడు; రచయిత, కూర్చినవాడు, గ్రంథకర్త, కృతికర్త.

**مولفات** ముఅల్లఫాత్ (అ.స్త్రీ) రచనలు, కృతులు, రచియించినవి, రచియించినగ్రంథములు.

**مولف** ముఅల్లఫ్ (అ.పు) రచితము, సంకలితము; కృతము, చేసినది, కూర్చినది, రచియించిన

**مولود** మౌలూద్ (అ.పు) జననకాలము, జననమొందినశిశువు, మహమ్మదు గారి జన్మదినోత్సవము.

**مولوی** మౌలవీ (అ) విద్వాంసుడు, విద్వాంసుడు, పండితుడు, ధర్మశాస్త్రజ్ఞుడు.

**مولہ** ముహల్ల (అ) మోహితుడు, మోహపరవశుడు; విరహవేదనగలవాడు, విరహదుఃఖముగలవాడు, దుఃఖితుడు.

**مولی** మూలీ (హి.స్త్రీ) ముల్లంగి, ముల్లంగిగడ్డ.

**موم** మోమ్ (పా.పు) మైనము, సిక్థకము, **موم بتی** మోమ్ — బత్తీ (హి) మైనపువత్తి, **موم جامہ** మోమ్ — జామా (పా) మైనపుబట్ట, **موم دل** మోమ్ — దిల్ (పా) మెత్తనిమనసువాడు, ఆర్ద్రహృదయుడు, **موم روغن** మోమ్ — రోగన్ (పా) మైనపుపూత, మైనపు మెఱుగుపూత, మైనమును చమురును కలిపిచేసిన మెఱుగుపూత, మైనపునూనె, **موم کی ناک** మోమ్ — కీనాక్ (హి) మైనపుముక్కు, లక్కముక్కు, సులభముగా మారుస్వభావముగలవాడు, అస్థిరస్వభావుడు, చపలచిత్తుడు.

**مومن** మోమిన్ (అ.పు) విశ్వాసముగలవాడు, భక్తుడు; నేతగాడు, తురకనేతగాడు, తురకసాలీడు, బట్టలునేయుసాయిబు.

**مومی** మోమీ (పా) మైనపు, మెత్తని, మైనపువన్నెగల, మైనముతోచేసిన.

**مومیائی** మోమియాయీ (పా.స్త్రీ) మైనముగావండినది, ఐంటమైనము, ఔషధవిశేషము.

**مون** మౌన్ (హి.పు) మౌనము, మాట్లాడకుండుట.

**مونا** మౌనా (హి.పు) గోలెము. గరిసె; గుమ్మి, గంప.

**مونت** మౌనత్ (అ.స్త్రీ) భారము, బరువు; శ్రమ, కష్టము, దుఃఖము; సంభారము, వంటబత్తెము; దినవెచ్చము, దినసామగ్రి, భోజనసామగ్రి.

**مونث** ముఅన్నస్ (అ.స్త్రీ) స్త్రీ, ఆడుది, ఆడంగి. స్త్రీలింగము.

**مونج** మూంజ్ (హి.స్త్రీ) ముంజము, ముంజగడ్డి, మౌంజదర్భ.

**موندری** మూంద్రీ (హి.స్త్రీ) ఉంగరము, అంగుళీయకము, ముద్రుటుంగరము.

**موندنا - موندھنا** మూంద్నా - ధ్నా (హి) మూసివేయుట, మూయుట, బంధించుట, చెరపెట్టుట, బందిగజేయుట, కొట్టులోబెట్టుట.

**مونڈ** మూండ్ (హి.పు) ముండము, తల.

**مونڈن** మూండన్ (హి.పు) పుట్టువెంట్రుకలుదీయుట, చౌలము, ముండనము, కేశఖండనము (సంస్కారము).

**مونڈنا** మూండ్నా (హి) ముండనముజేయుట, తలగొరుగుట; మోసగించుట, వంచించుట; శిష్యునిగాజేసికొనుట.

**مونڈھا** మోంఢా (హి.పు) భుజము, బుజెము; తడికయల్లికపీఠము, బుజెముపీలిక, (దుస్తులలో).

**مونڈی** మూండీ (హి. స్త్రీ) బోడతరము.

**مونس** మూనిస్ (అ.పు) ప్రియమిత్రము, ప్రాణస్నేహితుడు, సహవాసి, స్నేహితుడు, మైత్రిసెఱపువాడు; ఉపశాంతిజేయువాడు, ఊరటపెట్టువాడు, ఊరడించువాడు; విహారదివసము, విశ్రాంతదినము; గురువారము, పనివిహారదినము, వనభోజనాదులదినము.

**مونگ** మూంగ్ (హి.పు) ముద్గము, పెసలు, **مونگ پھلی** మూంగ్ — ఫల్లీ (హి) ఒకదినుసువేరుశెనగ.

**مونگا** మూంగా (హి.పు) పవడము, ప్రవాళము, పగడము.

**مونی** మౌనీ (హి.పు) మౌని, మునీశ్వరుడు, యతి, సన్యాసి.

**موه** మోహ్ (హి.పు) మోహము, వలపు, ప్రేమ, వాత్సల్యము, అనురాగము; కరుణ, దయ, సహానుభూతి, అనుగ్రహము, **موه جانا** మోహ — జానా (హి) మోహించుట;

వలచుట, موہ لینا — మోహ్ లేనా (హి) వలపించుట, మోహింపజేయుట.

موہا మోహా (హి.పు) ఇప్పవ్రూను, ఇప్పచెట్టు. موہے کا شراب మోహేకాశరాబ్ (డ) ఇప్పసారాయి.

موہب మాహిబ్ (అ.పు) కానుక, కట్నము, నూడిద, బహుమానము.

موہت మోహిత్ (హి) మోహితుడు, వలచినది.

موہن మోహన్ (హి.పు) మోహనుడు, ప్రియుడు, కృష్ణుడు, موہن بھوگ భోగ్ (హి) ఒకతియ్యనితినుబండము, మధురభక్ష్యవిశేషము, موہن مالا — మాలా (హి) బంగారుపూసలనుపగడాలను కలిపికూర్చినకంఠహారము.

موہنا మోహ్నా (హి) మోహించుట, వలచుట.

موہنی మోహ్నీ (హి స్త్రీ) మోహిని పిశాచస్త్రీవిశేషము, స్త్రీదేవతావిశేషము; మోహినీవిద్య; మోహింపజేయునది, సుందరస్త్రీ, దుర్గాదేవి; మోహినీదేవత, భవాని.

موہوم మాహూమ్ (అ) ఊరకఅనుమానపడెడు, మనసునకేమి శంకించెడు; వట్టియనుమానముగల నిర్హేతుకశంకగల, వట్టితలంపైన; మనసునబుట్టినది, మనోజాతము, సాంకల్పికము, నిరాధారము, వెట్టితలంపు, పనికిమాలిన అనుమానము, భావరూపము, సంకల్పమాత్రము.

موئیا మోఇయా (హి.పు) నాలుకండె. బుడుత.

مویّد ముఅయ్యిద్ (అ) సహాయకము, తోడ్పడువాడు, బలపరచువాడు, దృఢపరచువాడు, అనుమోదకుడు.

مؤید ముఅయ్యద్ (అ) సహాయముచేయబడినది, బలపరుపబడినది, దృఢపరుపబడినది, సహాయముచేయబడినది, అనుమోదితము, అనుమోదితము.

مویز మవీజ్ (అ.పు) ఎండుద్రాక్ష, డాకవరుగు, ద్వీపద్రాక్ష.

مویشی మవేషీ (అ.స్త్రీ) పశువులు, గోదలు, గేదెలు, مویشی خانہ — ఖానా (పా) పశుశాల, పసులకొట్టము, పసులదొడ్డి.

مہ మెహ్ (పా) మహత్తు, గొప్పది; ముఖ్యము, ప్రధానము.

مہ మహ్ (పా.పు) చంద్రుడు, (వృత్తియందు) مہ پارہ — పార (పా) చంద్రఖండము, చంద్రకళ, చంద్రరేఖ, చంద్రబింబము వంటిముఖముగలది, ప్రియురాలు.

مہا మహా (హి) మహత్తైన, గొప్పది, ఘనమైనది, అధికము, మిక్కిలి; మహా, (వృత్తియందు) مہا پرش — పురుష్ (హి) మహాపురుషుడు, مہا راج — రాజ్ (హి) మహారాజు مہا رانی — రానీ (హి) మహారాణి, مہاتما-مہاتم — తమ్, త్మా (హి) మహాత్ముడు, మహాశయుడు, مہا مائی — మాయీ (హి) సప్తమాతృకలలోనొకటి, మహామాయీదేవత, مہا نیب-مہا نیم — నీమ్, నీంబ్ (హి) కొండవేము, తురకవేపచెట్టు, مہا تیتا — తీతా (హి).

مہابت మహాబత్ (పా.స్త్రీ) భయము, భీతి; మహత్త్వము, గొప్పతనము; అధికారము; అనుగ్రహము; ఆగ్రహము, కోపము.

مہاجرت మహాజరత్ (అ. స్త్రీ) దేశత్యాగము, పరదేశగమనము, తనచోటు,

ను విడిచిమరొకచోటునకుబోవుట, వలసబోవుట, పారిపోవుట, పలాయనము.

**مہاد** మిహాద్ (అ.పు) శయ్య, సానుపు పరుపు, సెజ్జ; సింహాసనము. గద్దియ. పీఠము, మంచము, ఆసనము.

**مہار** మహార్ (పా. స్త్రీ) ఒంటెముగుద్రాడు, **بے مہار** బే మహార్ (పా) ముగుద్రాడులేని, అడ్డముఅదుపులేని, నిరంకుశమైన, **شتر بے مہار** షుతుర్ బేమహార్ (పా) ముగుద్రాడులేనిఒంటె, అడ్డముఅదుపులేనివాడు, నిరంకుశుడు, అవిధేయుడు, స్వేచ్ఛాపరుడు.

**مہارت** మహారత్ (అ. స్త్రీ) అభ్యాసము, పాండిత్యము, పరిశ్రమ, అలవాటు, ప్రావీణ్యము, నేర్పు, నైపుణ్యము, నిపుణత.

**مہاسا** ముహాసా (హి.పు) వయసువానిముఖముపై మొలచు మొటిమ, తారుణ్యపుపిటికో, వయసుమొటిమ.

**مہال** మహాల్ (అ) భయంకరము, ఘోరము.

**مہام** ముహామ్ (అ.పు) మహాత్కార్యము, కష్టకార్యము, ఘనకార్యము, ముఖ్యవిషయము, ప్రధానాంశము, గొప్పకార్యము.

**مہانا** ముహానా (హి.పు) నదీముఖము, ఏఱుసముద్రములోపడుచోటు, సాగరసంగము.

**مہانل** మహానల్ (పా.పు) గసగసాలపాలు; నల్లమందు.

**مہاوت** మహావత్ (హి.పు) మావటీడు, అధోరణుడు, మావటివాడు, ఏనుగనుతోలువాడు.

**مہاوٹ** మహావట్ (హి.పు) మాఘమాసపువర్షములు.

**مہتاب** మహ్తాబ్ (పా.పు) చంద్రుడు, వెన్నెల; వెన్నెలప్రమిద అను బాణసంచు.

**مہتابی** మహ్తాబీ (పా. స్త్రీ) గుండ్రనిమిద్దెటిల్లు; గుండుమేడ; సరిగపని; జలతారుకుట్టుపని, వెన్నెలప్రమిద అను బాణసంచు, తెల్లనైనవన్నె, తెల్లనైన నీలవర్ణము.

**مہتر** మెహ్తర్ (పా.పు) నాయకుడు, పెద్ద; పాకీవాడు.

**مہترانی** మెహ్తరాని (పా. స్త్రీ) పాకివానిభార్య, పాకిది.

**مہتمم** ముహ్తమిమ్ (అ.పు) ఆలోచనపరుడు, కార్యనిర్వాహకుడు, పైవిచారణజేయువాడు, కార్యదర్శి ఏర్పాటులుజేయువాడు, నిర్ధారణచేయువాడు, పెత్తనదారుడు.

**مہتممی** ముహ్తమిమీ (అ. స్త్రీ) కార్యనిర్వాహకత్వము, కార్యనిర్వాహము, పైవిచారణ, ఏర్పాటులు, పెత్తనము, కార్యదర్శిత్వము.

**مہتول** మహ్తూల్ (అ) భయకంపితుడు, భయపడినవాడు, వణకువాడు, భీతుడు, కంపితుడు;

**مہجور** మహ్జూర్ (అ) త్యజింపబడినది, విడువబడినది, నిరసింపబడినది; వేరుచేయబడినది, విసర్జితము, ఖండితము, దూరీకృతము, తిరస్కృతము, ఛేదితము, నిరస్తము, తెగవేయబడినది.

**مہد** మహ్ద్ (అ.పు) ఉయ్యాల, తొట్ల, తొట్లమంచము.

**مہدوم** మహ్దూమ్ (అ) నాశముజేయబడినది, పడగొట్టబడినది, పాడుజేయబడినది, నేలమట్టముజేయబడినది, శిథిలీకృతము.

**مہذب** ముహజ్జిబ్ (అ) సంస్కర్త, లోపములుసవరించువాడు, నిర్దోషముగజేయువాడు, చక్కజేయువాడు దిద్దువాడు, సభ్యతనేర్పువాడు, నాగరికతనేర్పువాడు, పరిశుద్ధముజేయువాడు.

**مہذب** ముహజ్జేబ్ (అ) సంస్కృతము, చక్కజేయబడినది; సంస్కృతుడు, సుశిక్షితుడు, లోపములులేకుండజేయబడినవాడు, దిద్దబడినవాడు, సభ్యుడు, నాగరకుడు; పరిశుద్ధము.

**مہر** మహ్ర్ (అ.పు) ఓలి, స్త్రీధనము, వివాహకాలమందు భర్త ఇవ్వవలసినద్రవ్యము, **مہر باندھنا** — బాంధ్నా (ఉ) స్త్రీధనమునిర్ణయించుట, ఓలిఏర్పాటుజేయుట, **مہر بخشنا** — బఖ్ష్నా (ఉ) స్త్రీధనమువదలుకొనుట, ఓలివిడిచిపెట్టుట.

**مہر** మిహ్ర్ (పా.పు) సూర్యుడు.

**مہر** మెహ్ర్—మెహర్ (పా.స్త్రీ) అనుగ్రహము, దయ, ప్రేమ, వాత్సల్యము; ఒకనెలపేరు: కల్యాణము, అభివృద్ధి **مہربان** — బాన్ (పా) దయాళువు, కరుణాళుడు, అనుగ్రహవంతుడు, దయగలవాడు. **مہر انگیز** — అంగేజ్ (పా) ప్రేమజనకము, దయపుట్టించునది, ప్రేమగొలుపునది.

**مہر** ముహ్ర్—ముహుర్ (పా.స్త్రీ) ముద్ర, ముద్రిక, ముద్దుటుంగరము, అచ్చు, ఒక బంగారునాణెము, (మొహరి) **مہر بردار** — బర్దార్ (పా) ముద్రరక్షకుడు, ముద్రనుతనవద్దనుంచుకొనికాపాడుచుండువాడు, **مہر دستی** — దస్తీ (పా) ముద్దుటుంగరము, వ్రేలిముద్ర, అంగుష్ఠముద్ర, బొటనవ్రేలిముద్రణము, **مہر شاہی** — షాహీ (పా) రాజముద్ర, **مہر کرنا - لگانا** — కర్నా, లగానా (ఉ) ముద్రవేయుట, **مہر کن** — కన్ (పా) ముద్రలుచెక్కువాడు, ముద్రలుచేయువాడు, ముద్రకారుడు, **مہر کنی** — కనీ (పా) ముద్రలుచెక్కు... ముద్రశిల్పము, ముద్రనిర్మాణము.

[library stamp]

**مہرا** మెహ్రా (పా.పు) పైకిఉబికియున్న ఎముక, ఎముకపూస, చీలమండ, గుల్ఫము; మెడపూస, మెడవెనుకఉబ్బుగా గానవచ్చుఎముక, వెన్నుపూస, (వెన్నెముకలోనిభాగము); చదరంగపుకాయ; కాగితములకుమెరుగుపెట్టుగవ్వ.

**مہربانی - مہربانگی** మెహర్బానగీ- మెహర్బానీ (పా.స్త్రీ) అనుగ్రహము, కటాక్షము, దయ.

**مہرو** మహ్రూ (పా) చంద్రునివలెఅందమైన ముఖముగలది, చంద్రవదన.

**مہرہ** ముహ్రా (పా.పు) గవ్వ, వరాటకము; మణి, పూస: చదరంగములోనికాయ; కమ్మరవానిసుత్తె.

**مہری** మొహ్రీ (హి.స్త్రీ) జలధారి; తూము; నీరుపోవుటకైనతూము; సంచియొక్కగాని నాళముయొక్కగాని ముఖభాగము.

**مہک** మహక్ (హి.స్త్రీ) పరిమళము, సుగంధము, సువాసన.

**مہکنا** మహక్నా (హి) మంచివాసనగొట్టుట, పరిమళించుట, సువాసనవచ్చుట.

**مہلت** ముహ్లత్ (అ.స్త్రీ) ఆలస్యము, అవకాశము, వ్యవధి, నిమ్మళము, నెమ్మది, విశ్రాంతి, విరామము, నిలుకడ.

**مہلک** ముహ్లిక్ (అ) చంపునది, ఘాతుకము, మారకము, ప్రాణాపాయకరము.

**مہم** ముహిమ్మ్ (అ.స్త్రీ) సంకటకార్యము, కష్టకార్యము, ఘనకార్యము, మహత్కార్యము, సాహసకార్యము, సాహసకృత్యము.

**مہما** మహిమా (హి.స్త్రీ) మహిమ, గొప్ప

తనము, ఘనత. మహాత్మ్యము.

مهمان మెహ్మాన్ (పా.పు) విందు, (విందుకు పిలువబడినవాడు), అతిథి, ఇంటికివచ్చినవాడు, పిలువబడినవాడు; అపరిచితుడు, పరిచయములేనివాడు, వింతవాడు, పరదేశి, అభ్యాగతుడు, అభ్యాగతి,

مهمان خانه — ఖానా (పా) అతిథ్యగృహము, అతిథిగృహము, సత్రము,

مهماندار — దార్ (పా) ఆతిథ్యము చేయువాడు, పరామర్శచేయువాడు, గృహస్థుడు, గృహమేధి, مهمانداری —

مهمان نوازی — దారీ, నవాజీ (పా) అతిథ్యము, అతిథిసత్కారము, వచ్చినవానిపరామర్శజేయుట, مهمان نواز - دوست — దోస్త్, నవాజ్ (పా) అతిథిప్రియుడు, ఆతిథ్యప్రియుడు.

مهمانی మెహ్మానీ (పా.స్త్రీ) అతిథిసత్కారము, ఆతిథ్యము, వచ్చినవాని పరామర్శ, విందు.

مهمل ముహ్మల్ (అ) అర్థములేనిది, నిరర్థకము, పరిత్యక్తము, విడువబడినది, వ్యర్థము, పనికిమాలినది, తెలివిమాలినది; చుక్కలేని యక్షరము, నిర్బంధకము, బిందురహితము.

مهميز మహ్మేజ్ (పా.స్త్రీ) గుఱ్ఱమునదలించుటకై రౌతుయొక్క మెడిమకుతగిలించియుండు ఇనుపముల్లు, (చోదకము, మెడిమముల్లు, అశ్వాంకుశము, బరిముల్లు).

مهنت మహంత్ (హి.పు) మహంతు, దేవస్థానముల ధర్మాధికారిగా నుండు బైరాగి, మఠాధిపతి, ఆచార్యుడు.

مهندس ముహందిస్ (అ.పు) గణితశాస్త్రజ్ఞుడు, క్షేత్రగణితజ్ఞుడు, క్షేత్రగణితము తెలిసినవాడు, గణితపండితుడు.

مهنگا మహంగా (హి) వెల యధికమైన, ప్రియమైన, మహార్ఘ్యము.

مهنگائی - مهنگی మహంగీ - మహంగాయీ (హి.స్త్రీ) హెచ్చువెలగలిగియుండు, ధరలు పెరిగియుండుట, ప్రియపుధరలు, కరవుకాలము, కరవు, కోటకము.

مهوا మహువా (హి.పు) ఇప్పచెట్టు, మధుకవృక్షము.

مهورت ముహూరత్ (హి.స్త్రీ) ముహూర్తము; శుభఘడియలకాలము.

مهوكها ముహోఖా (హి.పు) కోయిలజాతిపిట్ట, చెంబరకాకి.

مهی మహీ (హి.స్త్రీ) మహి, భూమి; పులిచల్ల, పులిమజ్జిగ.

مهيا ముహయ్యా (అ) సిద్ధపరచినది, ఏర్పాటుచేసినది, సిద్ధము, సంసిద్ధము, ఆయత్తము, مهيا كرنا — కర్నా (క్రి) సిద్ధపరచుట.

مهيب ముహీబ్ (అ) భయానకము, భయంకరము, భీకరాకారము.

مهين మహీన్ (హి) సూక్ష్మము, సన్నితము, సన్నము, పలుచని, సుకుమారము, నాగరికము.

مهينه - مهينا మహీనా-నా (హి.పు) మాసము, నెల; నెలజీతము, మాసికవేతనము مهينادار — దార్ (హి) నెలజీతగాడు, నెలజీతపుసేవకుడు. مهينا چڑهنا — చఢ్నా (హి) నెలయెక్కుట, నెలదాటుట, (జీతమునకు), నెలతప్పుట. (స్త్రీలకుగర్భమునిలుచుట).

مے మయ్, మయి (పా.స్త్రీ) సారాయి, మద్యము. మదిర, مے پرست — పరస్త్ (పా) మద్యప్రియుడు, మద్యలోలుడు, ميكده - مے خانه —

ఖానా, కద (పా) మదిరాగృహము, గంజ. ے خوار — ఖోర్ (పా) త్రాగుబోతు.

میان మియాన్ (పా. పు) నడుము, నడిమిది, మధ్య, మధ్యమము, నడిమిభాగము, మధ్యభాగము; కటిరేఖ, ఖడ్గకోశము. రెంటినడుమ, అందరినడుమ, మధ్యస్థము, అంతగాఎక్కువగాని, తక్కువగానికాని ది, میان دار — దార్ (పా) ఒఱలోనున్న, (కత్తి మొ॥) میان بستہ — బస్త (పా) నడుముకట్టిన, సిద్ధముగానున్న, అయత్తము, میان سے باہر ہونا — సె బాహర్ హోనా (ఉ) ఒఱనుండి బయలువెడలుట, (కత్తి); పట్టరానికోపమువచ్చుట.

میاں మియాఁ (పా. పు) యజమాని, స్వామి, దొర; భర్త, మగడు; అయ్య, తండ్రి, میاں آدمی — ఆద్మీ (ఉ) సజ్జనుడు, పెద్దమనుష్యుడు, మర్యాదస్థుడు, میاں جی — జీ (ఉ) అయ్యగారు, అయ్యవారు, మధ్యవర్తి, పంతులుగారు.

میانہ మియాన (పా) మధ్యమము, నడిమిది, మధ్యస్థము, పరిమితము, మితము, میانہ قد — ఖద్ (పా) నడియెత్తుగలవాడు, (మిక్కిలిపొడుగుగానిపొట్టిగాని గాకయున్నది), సామాన్యపరిమాణముగలది, (పు) మధ్యభాగము; మాధ్యస్థము; పెళ్లిపల్లకి; గుడుగుడీలోని నిలువుగొట్టము, (దీనిమీద చిలుము పెట్టుదురు).

میانی మియానీ (పా. స్త్రీ) లాగుకుట్టుట లోరెండు కాళ్లనడుమవేయబడు వాలుగుమూలలపీలిక, నడిమిపీలిక, నడిచౌకము.

میت మయ్యత్ (అ. స్త్రీ) మృతకళేబరము, శవము, పీనుగు.

میتھی మేథీ (హి. స్త్రీ) మెంతికూర, మెంతులు.

میٹنا మేట్నా (హి) తుడిచివేయుట, మలుపుట, చెఱుపుట, చెరిపివేయుట; మాపుట, నాశముజేయుట, పోగొట్టుట, లేకుండజేయు, నిర్మూలముజేయుట.

میٹھا మీఠా (హి) మధురము, తియ్యనిది, తీపి; తీపు; నిమ్మళమైన, తేలికయైన, మందమైన, తిన్నని, మెల్లని, కొద్దిపాటి, కొంచముగా; అలసము, సోమరియైన, (పు) తీపివస్తువులు, میٹھا بولنا — బోల్నా (హి) తియ్యనిమాటలాడుట, మెల్లగామాటలాడుట, ఇంపుగామాటలాడుట.

میچنا మీచ్నా (హి) రెప్పవాల్చుట. మీలనము జేయుట, మీలితము జేయు, కన్నుమూయుట, మూయుట.

میخ మేఖ్ (పా. స్త్రీ) చీల, మేకు, మొల, కొయ్యమేకు, గూటము, میخ چو — చూ (పా. స్త్రీ) గూటములుదిగగొట్టు కొయ్యసమ్మెట.

میخک మేఖ్క్ (పా) లవంగము.

میدا لکڑی మైదాలకడీ (హి. స్త్రీ) నరమామిడిచెక్క, మేదచెక్క.

میدان మైదాన్ (పా. పు) బయలు, ఎడారి, ఆరుబయలు, విడిచోటు, బహిఃప్రదేశము, ప్రదేశము; యుద్ధరంగము, రంగము, میدان چھوڑنا — ఛోడ్నా (ఉ) యుద్ధమునుండి పారిపోవుట, పలాయనమగుట, میدان دینا — దేనా (ఉ) తొలగిపోవుట, తావిచ్చుట, میدان قلم — ఎ ఖలమ్ (పా) లేఖినియొక్కపాళియందలి విశాలభాగము,

میدان جنگ — ఎ జంగ్ (పా)యుద్ధరంగము, రణరంగము, میدان مارنا — మార్నా (ఉ) యుద్ధములోజయమందుట,గెలుపుగొట్టుట, میدان میں آنا — మేఁ ఆనా (ఉ) బయలెక్కుట, పోట్లాటకు బయలుదేరుట.

**میدہ** మయిద (పా.పు) మిగుల సన్నగా విసరిన పిండి, నున్న పిండి, పిష్టము, సన్న పిండి.

**میدھ** మేఢ్ (హి.స్త్రీ) కళ్లెపుగుంజె, కళ్లము నడుపుటలో దిరిగెడు పశువుల కట్టివేయుటకై నడుమపాతినగుంజె, కళ్లపు కంబము.

**میڈ** మేడ్ (హి) మందకాయలు, మంగకాయలు.

**میر** మీర్ (పా.పు) ముఖ్యుడు, నాయకుడు, ప్రభువు, పెద్ద; సయ్యదులగౌరవనామము; ఆటచీట్లలోరాజు میر آتش — ఆతిష్ (పా) శతఘ్నిదళనాయకుడు, తోపుదండు దళవాయి, میر آخور — ఆఖోర్ (పా) అశ్వికదళనాయకుడు, గుఱ్ఱపుదండుదళవాయి, میر بحر — బహ్ర్ (పా) నౌకాధ్యక్షుడు, నౌకానాయకుడు, میر بخشی — బఖ్షీ (పా) వేతనాధికారి,జీతాలపెద్ద, میر سامان — సామాన్ (పా) కోష్ఠాగారికుడు, ఉగ్రాణాధికారి, میر شکاری — శికారీ (పా) మృగయానాయకుడు, మృగయాధికారి, میر عدل — అద్ల్ (పా), ప్రధానప్రాడ్వివాకుడు, పెద్దన్యాయాధికారి, میر مجلس — మజ్లిస్ (పా) సభాపతి సభాధ్యక్షుడు, میر منزل — మంజిల్ (పా) యాత్రాధ్యక్షుడు, యానాధ్యక్షుడు, میر توزک — తూజక్ (పా) మహాసేనాని,సేనాధ్యక్షుడు, میر منشی — మున్షీ (పా) ప్రధానలేఖరి.

**میرا** మేరా (హి) నా, నాది.

**میراث** మీరాస్ (అ.స్త్రీ) పిత్రార్జితము, వంశపరంపరాగతమైనఆస్తి, పూర్వులనుండివచ్చినఆస్తి, మృతునిఆస్తి.

**میراثن** మీరాసన్ (ఉ.స్త్రీ) గాయకవంశపు పాటకురాలు, గానవిద్యవంశవృత్తిగావచ్చినగాయకురాలు, పాటకత్తె.

**میراثی** మీరాసీ (అ) గాయకవంశపుపాటకుడు, పాటగాడు, గాయకుడు, (చూడు میراثن); పారంపర్యము, వంశపరంపరగావచ్చినది, పరంపరాగతము.

**میڑھا** మేఢా (హి.పు) పొట్టేలు, మగగొఱ్ఱె.

**میز** మేజ్ (పా.స్త్రీ) బల్ల, బల్లపీట; ప్రాతబల్ల, సాపాటుబల్ల; అతిథి, విందు, భోజనమునకువచ్చినవాడు.

**میزان** మీజాన్ (అ.స్త్రీ) త్రాసు, తరాజు; తులారాశి; మొత్తము, వెరసి; ప్రమాణము, కొల, కొలత, میزان لگانا دینا — లగానా, దేనా (ఉ) కూడుట, మొత్తముజేయుట, మొత్తముద్రీయుట, మొత్తంవేయుట, వెరసిజూచుట, వెరసివేయుట, میزان کل కుల్ మీజాన్ (అ) వెరసిమొత్తము.

**میزبان** మేజ్బాన్ (పా.పు) గృహస్థుడు, గృహపతి, అతిథ్యముజేయువాడు- విందుజేయువాడు.

**میزبانی** మేజ్బానీ (పా.స్త్రీ) అతిథ్యము, అతిథిసత్కారము,విందుపరామర్శ.

**میسر** ముయస్సర్ (అ)దొరకెడు, లభించెడు, లభ్యము, సులభము, సుసాధ్యము,

సాధ్యము, సులభసాధ్యము; సులభీకృత ము, సులభముజేయబడినది; దొరకినది, లబ్ధము, లభించినది, میسر ہونا — హోనా (ఉ) దొరకుట, లభ్యమగుట, లభించుట, میسر آنا — ఆనా (ఉ) లభ్యమగుట, సమకూరుట.

میسرہ మయిసర (అ.పు) సంపద, కలిమి; ఎడమభాగము, ఎడమదిక్కు, యుద్ధకాలమున రాజునకుఎడమదిక్కుననుండుసైన్యము, వామపార్శ్వసైన్యము.

میش మేష్ (పా.పు) గొఱ్ఱెపొట్టేలు, మేషము; మేషరాశి.

میشوم మైషూమ్ (అ) అనిష్టము, అశుభము, అమంగళము, దౌర్భాగ్యము, దురదృష్టదాయకము.

میشی మేషీ (హి. స్త్రీ) మేషిచర్మము, పదనుచేసినచర్మము, మెత్తనితోలు.

میعاد మీఆద్ (అ.పు) గడవు, కాలపరిమితి; అవధి, కొలతి; వాగ్దానసలము, వాగ్దానకాలము, నిర్ణీతకాలము, నియమితకాలము పరిమితకాలము, గడవుకాలము; అవకాశము, వ్యవధి, కాలప్రమాణము, میعاد بولنا — బోల్నా (ఉ) కారాగృహశిక్షవిధించుట, చెఱవిధించుట, శిక్షవేయుట, ఇంతకాలము చెఱసాల వాసమనిచెప్పుట.

میعادی మీఆదీ (అ) గడువుగలది, పరిమితము, నిర్ణీతము, నియమితము, మితిగల, మేరగల. కాలపరిమితిగల, కాలనియమముగల, میعادی ہنڈی —

హుండీ (ఉ) పరిమితిహుండీ, వ్యవధిహుండీ, వ్యవధిబరాతపత్రము, కొంతకాలమైనతరువాతచెల్లవలసినహుండీ లేక బరాతపత్రము.

میعہ سائلہ మేఅయెసాయిల (ఉ) శిలారసము.

میغ మేఘ్ (పా.పు) మేఘము, మబ్బు; మంచు, హిమము.

میقات మీకాత్ (అ.పు) కాలము, అదను, సమయము. కాలభాగము, సంవత్సరభాగము, తగినకాలము, మక్కాయాత్రికులు, "త్యాగవ్రతము" పట్టుస్థానము లేక ఘట్టము.

میکا మైకా (హి.పు) పెండ్లికూతురిపుట్టిల్లు, పుట్టిల్లు.

میکھ మేఖ్ (హి.పు) మేషము, మేషరాశి.

میگھ మేఘ్ (హి.పు) మేఘము, మొగులు, మబ్బు; వర్షము; రాగభేదము, వర్షకాలమునను వేకువజామునను పాడవలసిన రాగము.

میگھراج మేఘ్‌రాజ్ (హి) మేఘములరాజు, ఇంద్రుడు.

میل మైల్ (అ.పు) వంగుట, మొగ్గుట, చలించుట, లక్ష్యము. కోరిక; ఆభిముఖ్యము, అభిలాష, అభిరుచి; ప్రేమ; మోహము, వలపు.

میل మేల్ (హి పు) మేళనము, కలయిక, కూడిక, చేరిక, సమ్మేళనము, సమాగమము, మిశ్రణము, సంబంధము, సంయోగము, సంధి, పరిచయము; బాంధవ్యము,

میم మేమ్ (ఇం.స్త్రీ) మదాము, దొరసాని, జాతియామె; అమ్మగారు.

میمانسا మీమాంసా (హి.పు) మీమాంస, తర్కము, విమర్శనము, వినాదము, విచారము, మీమాంసశాస్త్రము.

میمنا మేమ్నా (హి.పు) మేకపిల్ల.

میمنت మైమనత్ (అ.స్త్రీ) దక్షిణభాగము, కుడివైపు, కుడివైపుసేన, దక్షిణభాగసైన్యము; కల్యాణము, మంగళము, శుభము, శోభనము, ఆనందము, సౌఖ్యము, సౌభాగ్యము, సంపద, అభివృద్ధి.

میمنہ మైమన (అ పు) దక్షిణభాగము, యుద్ధమునందు రాజునకు కుడిదిక్కునందుండు సేన, దక్షిణపార్శ్వసైన్యము (చూడు, میسرہ)

میمون మైమూన్ (పా.పు) మర్కటము, కోతి, వానరము.

میں మేం (హి) లో, లోపల, మధ్య, నడుమ, అందు, న, میں سے — సే (హి) లోనుండి, లోపలినుంచి, లోనుంచి, లోపలినుండి

میں మైం (హి) నేను, میں میں — మైం (హి) నేను నేనను, అహంభావము, అహంకారము.

مین మీన్ (హి.పు) మీనము, మీనరాశి; చేప, మత్స్యము. مین میکھ نکالنا — మేఖ్ నికాల్నా (హి) మీనము మేషము ఎంచుట, విమర్శించుట, తప్పులుపట్టుట.

مینں మేన్ (హి) మంగ, వెట్టిపుచ్చకాయ, మందకాయలు.

مینا మీనా (పా.పు) గాజుచషకము, సారాయిత్రాగు గాజుపాత్ర; గాజు, పింగాణి, మణులు, గాజుమణులు, నానావర్ణముల గాజులు, నానావన్నెల పింగాణులు, నానావర్ణముల మణులు, (దీనితో వెండిబంగారు పాత్రలమీద చిత్రవిచిత్రమైనరూపములు చేయుదురు); నీలాంబరము, నీలాకాశము, میناکار — కార్ (పా) గాజుపనివాడు, పింగాణిపని చేయువాడు, చెక్కడపుపనిచేయువాడు, మణులుదాపువాడు, గాజుపూతపనిచేయువాడు, పింగాణిపూతపనిజేయువాడు, میناکاری — కారీ (పా) పింగాణిపని, గాజుపని, పింగాణిపూతపని, గాజుపూతపని, మణికారుపని, మణులచెక్కుపని, చెక్కడపుపని, مینا بازار — బాజార్ (ఉ.పు) రాజులవిహారార్థము పలువిధముల నలంకరించిన వీధి, శృంగారవీధి, శృంగారపథము; స్త్రీలే వ్యాపారముజేయువీధి, స్త్రీలయంగళ్ల వీధి, అడంగులవీధి, స్త్రీవీధి, میناکاری چھانٹنا — కారీఛాంట్నా (ఉ) మీనమేషము లెంచుట, విమర్శించుట, తప్పులుపట్టుట, లోపము లెన్నుట; నాగరికము జేయుట, సూక్ష్మముగా పరికించుట.

مینا మైనా (హి.స్త్రీ) గోరువంకపక్షి, గోరి కపిట్ట; "చిలుక" వలెఇదియును ఒకముద్దుపేరు. [భము.

مینار మీనార్ (అ.పు) గోపురము, స్తం

مین پھل మైన్ ఫల్ (హి.పు) మంగ కాయ, వెఱ్ఱిపుచ్చకాయ.

مینجنا మాంజ్నా (హి) తోముట, రుద్దుట, రాయుట.

مینڈ మేండ్ (హి.స్త్రీ) కట్ట, బందము, గట్టు, మేర, ఎల్ల, పొలములనడుమ మేరగా వేయు అడ్డకట్ట, కాడిగట్టు. పొలముగట్టు, అడ్డకట్ట; పెద్దఅలలు, తరంగములు, తరగలు, مینڈ بندی — బందీ (హి) పొలములఎల్లలువ్రాసియుండుపుస్తకము; గట్లకవిలె, పొలములకవిలె, ఎల్లల పాత్రము.

مینڈ మేండ్ (హి) మంగకాయలు, మందకాయలు.

مینڈکی - مینڈک మేండక్ - కీ (హి.పు.స్త్రీ) మండూకము, కప్ప; గుఱ్ఱముయొక్క వెనుకభాగము.

مینڈھا మేంఢా (హి.పు) పొట్టేలు, మగగొఱ్ఱె.

مینڈھی - مینڈی మేంఢీ, మేండీ (హి.స్త్రీ) జెడ, జేట, مینڈیاں گوندھنا మేండియాఁగోంధ్నా (హి) జెడలల్లుట, జేడలువేయుట, తలముడుచుట, తలకట్టుట.

مینسل మైన్సిల్ (హి.పు) మణిశిల, మణిశిలగంధకము.

مینگنی మేంగ్నీ (హి.స్త్రీ) మేకపెంటికలు, గొఱ్ఱెపెంటికలు: ఒంటెమొ॥ వాని లద్ది.

مینو మీనూ (పా.పు) స్వర్గము; పచ్చ; గాజుమణి, గాజుపూస.

مینہ మేఁహ్ (హి.పు) వర్షము, వాన مینہ برسنا — బరస్నా (హి) వర్షముగురియుట, వానగురియుట.

مینہدی మేఁహ్దీ (హి.స్త్రీ) గోరింట, గోరిట, కురంటకము, మైదాకుచెట్టు; మహమ్మదీయుల వివాహములలో ఒకకలాపము, مینہدی لگانا — లగానా (హి) అరచేతులు మొ॥ చోట్లగోరింటాకు నూరిపట్టించుకొనుట, మైదాకుపట్టించుకొనుట, (ఇదిపట్టించినచోట్ల ఎల్లఎఱ్ఱనిపన్నె పట్టును).

میور మయూర్ (స.పు) మయూరము; నెమిలి, ఒకపుష్పము, శృంగారపురుషుడు, అలంకారపురుషుడు.

میوراری మయూరారి (హి.పు) బల్లి, ఊసరవెల్లి.

میوری మయూరీ (హి.స్త్రీ) ఆడనెమిలి.

میوکھ మయూఖ్ (హి.పు) మయూఖము, బాణము, నిజగడియారమందలి నిలుపుసలాక,

میا - میا మైయా (హి.స్త్రీ) తల్లి, అమ్మ.

میوہ మేవ (పా.పు) పండు, ఫలము, میوہ جات — జాత్ (పా) పండ్లు ఫలములు, ఫలాదులు, میوہ دار — దార్ (పా) ఫలవంతము, పండ్లుపండునది, పండ్లుగలది, కాయగలది, ఫలవృక్షము, میوہ فروش — ఫరోష్ (పా) పండ్లమ్మువాడు, పండ్లవాడు, కాయగూరలమ్మువాడు.

# ن

ن నూన్ (అ. స్త్రీ) నకారము ఈయక్షరము ఉరదూవర్ణమాలలో ముప్పదిరెండవది. అరబీలోనిరువదియైదవది. పారసీకభాషలో నిరువది తొమ్మిదవది. అబ్జదు (ابجد)వర్ణ సాంఖ్యమందిది ఏబదికి సంజ్ఞగానుండును.

نا నా (పా) లేదు, కాదు, నఞ్ ఉపసర్గము,

نااتفاقی -ఇత్తిఫాకీ (పా) అనైక్యత, అనైకమత్యము, అననుకూలత, వైరము, అసమాధానము,స్పర్ధ, అననుగుణ్యత.

ناآزموده -ఆజ్మూద (పా) అనుభవరహితము, అనుభవములేని, పరిక్షచేసి చూడని. ناآشنا- ఆష్నా (పా) ఈతతాని, అపరిచితమైన, తెలియని, నిర్మొగమోటపు, ఎరుగని, కృతఘ్నమైన, కలిపిగోలుకాని. ناآشنائی -ఆష్నాయీ (పా)అపరిచయము, తెలియమి ,ఎరుగమి, కృతఘ్నత, నిర్మొగమోటము, బెరుకుతనము,కలిపిగోలుతనములేని, అవిశ్వాసము.

نااعتماد -ఇఽతిమాద్ (పా)విశ్వాసయోగ్యముకాని, నమ్మతగని نااعتمادی -ఇఽతిమాదీ (పా) విశ్వాస యోగ్యము కాని, నమ్మతగమి. ناالتفاتی -ఇల్తిఫాతీ (పా)నిర్లక్ష్యము, అలక్ష్యము,అప్రసన్నత, అననుగ్రహము. ناامید -ఉమ్మేద్ (పా) ఆశ లే ని, నిరాశగల. ناامیدی -ఉమ్మేదీ (పా) నిరాశ, ఆశలేమి. نااندیش -అందేష్(పా) స్పష్టమైన. ناانصاف -ఇన్సాఫ్ (పా) అన్యాయమైన,అక్రమము. نااهل -అహ్లె (పా) అయోగ్యుడు, అసమర్ధమైన,తగని.

యోగ్యత లేని. نابالغ -బాలిగ్ (పా) ప్రాయమురాని, అప్రాప్త ప్రాయుడు, చిన్నవాడు, పక్వముగాని, అపరిపక్వ వయస్కుడు. نابکار -బకార్ (పా) పనికిమాలిన, పోకిరి, దుర్మార్గమైన. نابلد -బలద్ (పా) అనాగరికుడు,జానపదుడు, మోటు, పరదేశి. نابود -బూద్ (పా) నష్టము, నాశము, లేకుండ. نابینا -బీనా (పా) గ్రుడ్డి, చూపులేని. ناپاک -పాక్ (పా) అపవిత్రమైన, అశుచియైన, మైలపడిన. ناپاکی -పాకీ (పా) అపవిత్రత,అశుచి,మైల. ناپائدار -పాయెదార్ (పా) అస్థిరము, చంచలము,అశాశ్వతము, నశ్వరము. ناپائداری -పాయెదారీ (పా) అస్థిరత, నశ్వరత, చంచలత. ناپدید -పదీద్ (పా) అదృష్టమైన,గుప్తమైన,కనుపడని. ناپرهیزگار -పర్హేజ్‌గార్ (పా) వ్యభిచారి, దుర్మార్గుడు. ناپسند - ناپسندید -పసంద్ -పసందీద్ (పా) అనిష్టమైన, అయోగ్యమైన,ఇష్టముగాని. ناپسندکرنا -పసంద్ కర్నా(ఉ) అయిష్టపడుట. ناپید - ناپیدا -పైద్ -పైదా(పా) అభూతము, పుట్టని, అలభ్యము,లేనిది,అపూర్వము, దొరకని, నష్టము, నాశమైన. ناپیداکنار -పైదా కినార్ (పా) అపారము, పారములేని,అంతులేని, దరిలేని. ناتجربکار -తజ్రిబకార్(పా) అననుభవజ్ఞుడు, అనుభవములేని. ناتراش- ناتراشیده -తరాష్ -తరాషీద (పా) అసంస్కృత

మైన, చేక్కబెట్టని, అనాగరికమైన, మో టైన, నీచమైన. ناتربیت-تربیت نایافتہ -తర్బియత్ -తర్బియత్ యాఫ్త (పా) అశిక్షితమైన, అనాగరికమైన, మోటైన. ناترس నా -తర్స్ (పా) నిర్భయమైన, నిర్దయమైన, నిష్కారణమైన,దయమాలిన. ناتمام నా -తమామ్ (పా) అసమాప్తము, ముగియని. ناتوان నా -తవాన్ (పా) దుర్బలము, బలము లేని. ناتوابین నా -తవాంబీన్ (పా) ఒకరిబలమునకుఓర్వలేని, పరబలాసహిష్ణువు. ناتوانی నా -తవానీ (పా) దౌర్బల్యము. ناجائز నా -జాయెజ్ (పా) అశాస్త్రీయము, కూడనిది, నిషిద్ధము. ناجنس నా -జిన్స్ (పా) విజాతీయము, కలవని, అనాగరికమైన,నీచమైన. ناچاقی నా -చాకీ(పా)అనారోగ్యము, జబ్బు; అసమాధానము,స్పర్థ,అయిష్టమైన. ناچار నా -చార్ (పా) నిరుపాయమైన, దిక్కుమాలిన, విధిలేక, గతిమాలిన, అగతికమైన, విధిలేని, తప్పని. ناچیز నా -చీజ్ (పా) పనికిమాలినది, తుచ్ఛము, అల్పము. ناحق నా -హక్ (పా) అన్యాయము, అక్రమము, అసత్యము. ناحق شناس నా -హక్ షినాస్ (పా) యథార్థము తెలియనివాడు, అన్యాయుడు, వాదవాది(కృతఘ్నుడు). ناخدا నా -ఖుదా (పా) నాస్తికుడు; నావికుడు, పడవనాయకుడు,పడవ తోలువాడు, సరంగు. ناخداترس నా -ఖుదా తర్స్ (పా) దైవభీతి లేనివాడు. ناخلف నా -ఖలఫ్ (పా) కుపుత్రుడు, అవిధేయుడు, దుర్మార్గుడు. ناخوانده నా -ఖాంద (పా) విద్యావిహీనుడు, చదువురాని, అనాహూతుడు, పిలువబడని. ناخوش నా -ఖుష్ (పా) అసంతుష్టమైన, అనిష్ట పడిన, ఇష్టపడని, అసమాధానము గల, విసికిన. ناخوشی నా -ఖుషీ (పా) అసంతృప్తి, అయిష్టము, అసంతుష్టి, అసమాధానము, విసుకు. نادار నా -దార్ (పా) నిర్ధనుడు, రిక్తుడు, పేద, బీద. ناداری నా -దారీ (పా) రిక్తత, పేదరికము, బీదరికము. نادان నా -దాన్ (పా) అజ్ఞాని, తెలియని, ఎరుగని, చిన్న. نادانستگی నా -దానిస్తగీ (పా) అజ్ఞానము, ఎరుగమి, తెలియమి. نادانستہ నా -దానిస్త (పా) అజ్ఞానముచేత, ఎరుగక, తెలియక. نادرست నా -దురుస్త్ (పా) సరిగాని, తప్పైన, అసత్యము, తప్పు. نادہند నా -దిహింద్ (పా) ఇవ్వనివాడు, లోభి, తీసికొని మగల యివ్వనివాడు. نادیدنی నా -దీదనీ(పా)అదర్శనీయము, చూడతగని. نادیده నా -దీద (పా)ఏమియుచూడని,పేరాశగల. ناراست నా -రాస్త్ (పా) నీతిమాలిన, ఋజుత్వములేని, అన్యాయమైన, అబద్ధికమైన. ناراض నా -రాజ్ (పా) అసమాధానముగల, అనిష్టముగల, ఇష్టపడని, అసంతృప్తుడైన. ناراضگی-ناراضی నా -రాజగీ-రాజీ (పా) అసమాధానము, అనిష్టము, అసంతృప్తి. نارسائی నా -రసాయీ (పా) అసమర్థత, అందమి, చేరమి, ముట్టమి, అకృతార్థత. نارسیده నా -రసీద (పా) అపరిపక్వమైన. نارو నా -రవా (పా)

అశాస్త్రీయమైన, అక్రమమైన, అయోగ్యమైన, ఆచారవిరుద్ధము, సాంప్రదాయ విరుద్ధమైన, వాడుకలోలేని, విఫలమైన, అకృతార్థమైన, నిష్ఫలమైన. **نا زیب - زیبا** -జేబ్-జేబా (పా) శోభరహితమైన, వికారమైన, అయోగ్యమైన, అనర్హమైన, తగని, అందముగా లేని. **ناساز** -సాజ్ (పా) అస్వస్థమైన, కొంచము జబ్బుగానున్న, అనారోగ్యమైన, సొంపకున్న, అననుకూలమైన. **ناسازی** -సాజీ (పా) అస్వస్థత, జబ్బు, అనారోగ్యము, ఒడలు సొంపమి. **ناسپاس** -సిపాస్ (పా) కృతఘ్నమైన, అకృతజ్ఞమైన, మేలుమరచెడు, నిర్మొగమోటపు. **ناسپاسی** -సిపాసీ (పా) కృతఘ్నత. **ناسره** -సర (పా) అస్వచ్ఛమయిన, కందుగల, కేసైన, కలిసిన, కృత్రిమమైన. **ناسزا - سزاوار** -సజా-సజావార్ (పా) అయోగ్యమైన, తగని, అక్రమమైన, అవివేకమైన, బుద్ధి మాలిన. **ناسمجھ** -సమఝ (పా) బుద్ధిహీనమైన, బుద్ధిమాలిన, తెలివిలేని, అజ్ఞానియైన, చిన్న. **ناشاد** -షాద్ (పా) సంతోష రహితమయిన, దుఃఖితమైన, చింతగల, దౌర్భాగ్యమయిన. **ناشائستگی** -షాయిస్తగీ (పా) అసభ్యత, అయోగ్యత, అనాగరికత, అనుచితజ్ఞత, అనర్హత, బండతనము, మోటుతనము. **ناشائسته** -షాయిస్త (పా) అయోగ్యమైన, అసభ్యమయిన, అనాగరికమయిన, అనర్హమయిన, అనుచితమయిన, మర్యాద రహితమయిన, మోటైన, అసమర్థమయిన, అశిక్షితమయిన, తగని, కూడని. **ناشدنی** -షుదనీ (పా) అసంభవమయిన, అసాధ్యమయిన, అయోగ్యమయిన, పనికిమాలిన, కూడని. **ناشکر - ناشکرا - ناشکری** -షుక్ర్-షుక్రా-షుక్రీ (పా) చేయు **ناسپاس**. **ناشکیب - ناشکیبا - ناصبور** -షకేబ్-షకేబా-సబూర్ (పా) ఓపికలేని, తత్తరపడు, సంభ్రమపడు, వేగిరపడు. **ناصواب** -సవాబ్ (పా) పాపకరమైన, పుణ్యవిరుద్ధము. **ناطاقت** -తాకత్ (పా) దుర్బలమైన, శక్తిలేని. **ناطاقتی** -తాకతీ (పా) దౌర్బల్యము బలహీనత. **ناعاقبت اندیش** -ఆకిబత్ అందేష్ (పా) దూరాలోచనలేని, దూరదృష్టిలేని. **نافرمان** ఫర్మాన్ (పా) అవిధేయమైన. **نافرمانی** -ఫర్మానీ (పా) అవిధేయత. **نافهم** -ఫహ్మ్ (పా) బుద్ధిహీనమైన, తెలివిమాలిన, అజ్ఞాని. **ناقابل** -కాబిల్ (పా) అయోగ్యమైన, అనర్హమైన, అసమర్థమైన, తగని, చేతకాని. **ناقابلیت** -కాబిలియత్ (పా) అయోగ్యత, అనర్హత, అసమర్థత, తగమి, చేతకామి. **ناقدر - قدرا** -కద్ర్-కద్రా (పా) అగుణగ్రాహి, గుణముగ్రహింపలేని. **ناقدری** -కద్రీ (పా) అగుణగ్రహణము, గుణగ్రహణలోపము, గుణము తెలియమి. **ناکاره** -కార (పా) పనికిమాలిన, నిష్ప్రయోజనమైన. **ناکس** -కస్ (పా) నిష్ప్రయోజకుడు, పనికిమాలినవాడు, అనామధేయుడు. **ناکرده** -కర్ద (పా) అకృతమైన, చేయని.

ناکردہ کار -కర్దకార్ (పా) అననుభవజ్ఞుడు, అనుభవములేని. ناکند -కంద్ (పా) పాలపండ్లు ఊడనిదూడ, అనుభవములేనివాడు, అజ్ఞాని. ناگزیر -గుజీర్ (పా) నిరుపాయమైన, విధిలేని, తప్పని. ناگاہ-ناگاہی-ناگہاں-ناگہانی -గాహ్ -గాహీ -గహాం - గహానీ (పా) అవిదితముగా, దైవయోగముగా, తెలియకుండ. తటాలున, అకస్మాత్తుగా. نالائق -లాయిక్ (పా) అయోగ్యమయిన, అనర్హమయిన, తగని, అసమర్థమయిన, చేతకాని. نالائقپن-لائقی -లాయిక్పన్ -లాయిక్ (పా) అయోగ్యత, అనర్హత, అసమర్థత, చేతకామి, తగమి. نامبارک -ముబారక్ (పా) అశుభకరమయిన, అపశకునమయిన. نامتناہی -ముతనాహీ (పా) అంతముగాని, ముగియని, అపారమయిన, అమితమయిన, అంతులేని, మేరలేని. نامحرم -మహ్రమ్ (పా) అపరిచితమయిన, తెలియని. పరాయి, ఎరుగనివాడు. نامراد -మురాద్ (పా) భగ్నాశుడు, ఆశాభంగమయిన, విఫలమనోరథుడు, నిర్భాగ్య మయిన, అకృతార్థుడు. نامرادی -మురాదీ (పా) ఆశాభంగము, నిరాశ, దౌర్భాగ్యము, మనోరథవైఫల్యము, అకృతార్థత. نامرد -మర్ద్ (పా) నపుంసకుడు, పౌరుష రహితుడు, మొగతనములేనివాడు, పిరికివాడు, పంద. نامردی -మర్దీ (పా) నపుంసకత్వము, అపౌరుషము, పిరికితనము, మగటిమిలేమి. نامعقول -మఽకూల్ (పా) బుద్ధిహీనమయిన, తెలివిమాలిన, అయుక్తమయిన, అవివేకమయిన. نامعلوم -మఽలూమ్ (పా) అవిదితము, అజ్ఞాతము, తెలియని, ఎరుగని, అనామధేయమయిన. ناملائم -ములాయిమ్ (పా) అనమ్రమయిన, మృదుత్వములేని, కఠినమయిన. ناممکن -ముమ్కిన్ (పా) అసంభవము, అసాధ్యము, కానిది. نامناسب -మునాసిబ్ (పా) అయోగ్యమయిన, అకార్యమయిన, అనర్హమయిన, అనుచితమయిన, అయుక్తమయిన, తగని, అసంబద్ధమయిన, పొసగని. نامنظور -మంజూర్ (పా) అనంగీకృతము, అంగీకారముకాని, అనామోదితము, ఆమోదింపబడని. نامنظورکرنا -మంజూర్ కర్నా (హి) అనంగీకారము చేయుట, అంగీకరింపకపోవుట. نامنظورہونا -మంజూర్ హోనా (హి) అనంగీకారమగుట, అంగీకారము కాకపోవుట. نامنظوری -మంజూరీ (పా) అనంగీకారము, అనామోదము. ناموافق -మువాఫిక్ (పా) అననుకూలమయిన, విరుద్ధమయిన, అసమ్మతమయిన, ఒంటని. ناموافقت -మువాఫకత్ (పా) అననుగుణ్యత, అననుకూలత, అసమ్మతి, విరుద్ధత, స్పర్థ, ఒంటమి, అసమాధానము. ناواقف -వాకిఫ్ (పా) అజ్ఞాని, తెలియని, ఎరుగని, అనుభవము లేని. ناواقفیت -వాకిఫియత్ (పా) అజ్ఞానము, అననుభవజ్ఞత, అనుభవము లేమి, తెలియమి, ఎరుగమి. ناوقت -వక్త్ (పా) సమయముకాని, అసమయమైన. ناہموار -హమ్వార్ (పా) చదరము కాని, మెరక పల్లములుగల, మిట్టపల్లము

లుగానున్న, ఎచ్చుతగ్గైన. ناہموارى -హమ్‌వారీ(పా) ఎత్తువంతలు, మిఱ్ఱుపల్లములు, ఎచ్చుతగ్గులు. ناہنجار -హింజార్ (పా) దుర్మార్గుడు, పోకిరి, గుండగొయ్య. نایاب -యాబ్ (పా) అపరూపమైన, దొరకని, అలభ్యము.

ناب నాబ్ (పా) శుద్ధమైన, స్వచ్ఛమైన.

ناب నాబ్ (పా.పు) కోరపన్ను, పక్కపన్ను, కోర, దంతము, దవడపన్ను.

ناب నాబ్(పా.పు) కాలువ,చోలు,బొద్దు. نابدان -దాన్ (పా) జలదారి.

ناپ నాప్ (హి.స్త్రీ) మాపనము, కొలత, ناپ کا پورا -కా పూరా (హి) సంపూర్ణపరమాణముగల, నిండుకొలతగల.

ناپنا నాప్నా (హి) కొలుచుట,తూచుట; కోయుట.

ناتا నాతా (హి.పు) బాంధవ్యము, చుట్టరికము, సంబంధము, కూడిక.

ناتن నాతిన్(హి.స్త్రీ) దౌహిత్రి, కూతురిబిడ్డ. మనుమరాలు.

ناتھنا నాథ్నా (హి) రంధ్రముపొడుచుట, చిల్లిపొడుచుట, ముగుద్రాడు వేయుట, బొత్తుగా లోబరచుకొనుట.

ناتی నాతీ (హి.పు) దౌహిత్రుడు,కూతురికొడుకు, మనుమడు.

ناٹا నాటా (హి) పొట్టి, చిన్న, (కొంటె పిల్లవాడు).

ناٹک నాటక్ (హి.పు) నాటకము.

ناثر నాసిర్ (అ) వచనకర్త, గద్య లేఖరి, సాహిత్యవంతుడు, వచన రచన చేయువాడు, ఉపన్యాసకుడు, వక్త.

ناج నాజ్ (అ.పు) పుడకమాను, చీకటిప్రాను; ధాన్యము, గింజలు. ناج کاٹنا -కాట్నా (ఉ) పైరుకోయుట.

ناجی నాజీ (అ) విముక్తుడు, పాప విముక్తుడు, విడుదల పొందిన, విడుదల జేయువాడు, విమోచకుడు.

ناچ నాచ్ (హి.పు) నృత్యము, ఆట. ناچ رنگ -రంగ్ (ఉ) ఆటపాటలు. ناچ گھر -ఘర్ (హి) నర్తనశాల, నృత్యశాల. ناچ نچانا -నచానా (హి) ఆటఆడించుట; చిక్కులపెట్టుట,

ناچنا నాచ్నా (హి) నృత్యము చేయుట, ఆడుట.

ناحیہ నాహియ(అ.పు) దేశము, ప్రాంతము, తీరము, రాజ్యము.

ناخدا నాఖుదా(పా.పు) ఓడనాయకుడు, నావికుడు.

ناخن నాఖున్ (పా.పు) నఖము, గోరు; గిట్ట. ناخن شمشیر -ఎ, షంషీర్ (పా)ఖడ్గధార, కత్తియంచు. ناخن گیر -గీర్ (పా) గోరుగల్లు.

ناخنہ నాఖున (పా.పు) వీణ మొ॥వాని వాయించు నఖి; కంటికొలుకులలో పెరిగిన దుర్మాంసము; నూలుకలిసిన పట్టు బట్ట; విరోధము,

نادان నాదాన్ (పా) అజ్ఞాని, తెలియనివాడు, ఎరుగని, సాధువైన, బేల, పసి, చిన్న.

نادر నాదిర్ (అ) అపూర్వమయిన, దొరకని, వెలగల,అసాధారణమయిన,ఆశ్చర్యకరమయిన, نادر شاہ -షాహ్ (హి) ఒక రాజుపేరు. نادر شاہی - گردی

—షాహీ —గర్దీ(పా)అరాజకము, కల్లోలము.

**نادرپات** నాదర్‌పాట్ (ఉ) (పూర్వ కాలమున)ఒకవిధమయిన పట్టుబట్ట,(ప్రస్తుతము) ఒకవిధమయిన నూలుబట్ట.

**نادره** నాదిర (పా) అపూర్వము, వింత.

**نادری** నాద్రీ (పా) అపూర్వము, వింతయైనది; ఆటచీటీలలోని ఒంటి చుక్క—(చీటి); నాదిరుషా సం॥.

**نادعلی** నాదెఅలీ (అ.పు) ఒక రక్షరేకు, యంత్రము.

**نادم** నాదిమ్ (అ) లజ్జితుడైన, సిగ్గుపడిన, చిన్నబోయిన.

**نار** నార్ (అ.స్త్రీ) అగ్ని, నిప్పు, నరకము.

**نار** నార్(పా.పు) దాడిమము,దానిమ్మపండు.

**نار** నార్ (హి.స్త్రీ) నారి, స్త్రీ; తుపాకి నాళము; త్రాళ్లువేయునార; బండినొగకు కాడిగట్టు మోకు, నొగ త్రాడు; కమల నాళము లేక కాడ.

**نارا** నారా (హి) చూడు **ناڑا**.

**نارجیل** నార్‌జీల్(పా.పు) నారికేళము, టెంకాయ.

**نارنج** నారంజ్ (పా.పు) కిచ్చిలి పండు (నారింజపండు).

**نارنجی** నారంజీ(పా)కిచ్చిలిపండువన్నెగల.

**نارنگی** నారంగీ(పా.స్త్రీ)చూడు **نارنج**

**نارو** నారూ (పా.పు) నారిపుండు, నారు గలుగుపుండు.

**ناروا** నార్వా (హి.పు)చూడు **نارو**.

**ناری** నారీ (అ) అగ్ని సం॥, నరక సం॥. (హి) నారి, స్త్రీ.

**ناریل** నారియల్(హి.పు) ఒకబాణసంచు (పూలబాణము); చూడు **نارجیل**

**ناڑ** నాడ్ (హి) మెడ, గొంతు.

**ناڑا** నాడా (హి.పు) నూలుపట్టె, పట్టె, చల్లాడము, నూలు; ఎర్రదారము.

**ناڑی** నాడీ (హి.స్త్రీ) తుపాకినాళము; నాడి, ధాతువు. **ناڑی دیکھنا** —దేఖ్నా (హి) చేయిచూచుట, నాడి చూచుట; శోధించుట, కట్టుపెట్టుట.

**ناڑیا** నాడియా (హి.పు) నాడీపరీక్షకుడు.

**ناز** నాజ్ (పా) ఒయ్యారము, హావభావములు, కులుకు, మురిపెము, ప్రేమ; సహాయము, వెనుకబలము; గర్వము, అహంకారము; పెద్దరికము. **نازبالش** —బాలిష్ (పా) మెత్తనిదిండు. **نازاٹھانا** —ఉఠానా (ఉ) ఇచ్ఛానుసారము చేయుట,పరేచ్ఛా సహాగము చేయుట, (ఒకరి)పోకడలు సహించుట,(ఒకరి) ఇష్టమువచ్చినట్లుచేయనిచ్చుట. (ఒకరి) చేష్టలు సహించుట. **نازبردار** —బర్దార్ (పా) ఇచ్ఛానుసారము చేయువాడు. **نازبرداری** —బర్దారీ (పా) ఇచ్ఛానుసరణము, పరేచ్ఛానుసరణము. **نازپرور-پروردہ** —పర్వర్—పర్వర్దా (పా) ముద్దుగ పెరిగినవాడు, లాలితుడు, లాలనతో పెరిగిన వాడు.

**نازونخره-نازونیاز** —నాజ్ వ నఖ్ర —వ నియాజ్ (పా) విలాసము, వలపులు, కులుకులు.

**نازاں** నాజాఁ (పా) హావభావములుచేయు, ఒయ్యారముచూపు, కులుకుగల, గర్వపడు, నీల్గు, విఱ్ఱవీగు, పెద్దరికము చూపు.

**نازبو** నాజ్‌బూ(పా.పు)ఓషధివిశేషము.

**نازک** నాజుక్ (పా) కోమలమైన, సూక్ష్మ

మైన, సన్నితమైన, మృదువైన, పలుచేని, సన్నని, తేలికైన, దుర్బలమైన, సొంపైన, అందమైన, పొంకమైన, ముద్దుగానున్న, ముద్దుగా పెరిగిన, మోటుగాని. نازک ادا -అదా(పా) సుస్వరముగలపక్షివిశేషము.

نازک بدن -బదన్ (పా) కోమలి, కోమల స్వభావముగలది, కోమల గాత్రి; ఒకవిధమైన రేగుపండు. نازک خیال -ఖియాల్ (పా) సూక్ష్మ బుద్ధి, సూక్ష్మ గ్రాహి, సూక్ష్మదర్శి. نازک دماغ - مزاج -దిమాగ్ -మిజాజ్ (పా) కోమల స్వభావముగల, సున్నితమయిన మనసుగల, గర్వపోతు, ముంగోపి, చిట్టు బుట్టులాడు. نازک معاملہ -ముఆమల (పా) సూక్ష్మవిషయము, సంకటవిషయము, సందిగ్ధవిషయము. نازک وقت -వక్త్ (పా) గండము, సంకటసమయము, సందిగ్ధసమయము, అపాయ సమయము, ఇక్కట్టువేళ.

نازکی నాజుకీ (పా) కోమలత, సూక్ష్మత, మృదుత్వము, అబలత్వము, దుర్బలత.

نازل నాజిల్ (అ) అవతరించు, దిగు, వచ్చు, కలుగు. نازل ہونا -హోనా (ఉ) అవతరించుట, దిగుట, వచ్చుట, కలుగుట.

نازلہ నాజిల (అ.పు)విపత్తు, కీడు, దైవయోగమువలన కలిగిన ఆపద.

نازنین నాజ్నీన్ (పా. స్త్రీ) కోమలి, విలాసవతి, మిటారి, ప్రియురాలు,

ناس నాస్(అ.పు)మానవులు,మనుష్యజాతి, మానవజాతి.

ناس నాస్ (హి.పు) నాశము. (పొడి.

ناس నాస్-(హి.స్త్రీ) నశ్యము, ముక్కు

ناسا (హి.పు) పొడుగుముక్కు.

ناسپال నాస్పాల్ (హి.పు) దాడిమకాయచెక్కు; ఒకబాణసంచు.

ناسخ నాసిఖ్ (అ) లేఖరి, వ్రాయువాడు, రచయిత, రచించువాడు; నిషేధకమైన, నిరాకరించునది;కొట్టివేసెడు, వినాకరించు త్రోసివేయు, నాకారించు.

ناسرہ నాసర (పా) అస్వచ్ఛమైన, కలిసిన, కృత్రిమమైన, కందుగల.

ناسک నాసిక్(అ) భగవద్భక్తిగల.

ناسوت నాసూత్ (అ) మానవజాతి, మానవస్వభావము, ప్రపంచము.

ناسور నాసూర్ (అ.పు) వ్రణము, ఎల్లప్పుడు చీముకారుచుండు పుండు.

ناشپاتی నాష్పాతీ (పా.స్త్రీ) సీమ రేగుపండు (ఒకదినుసు).

ناشتہ - ناشتا నాష్తా - నాష్త(పా.పు) అభుక్తము, పరగడుపు, ప్రాతఃకాలభోజనము, లఘుభోజనము.

ناصب నాసిబ్ (అ) స్థాపకుడు, పాతువాడు, నిలుపువాడు. స్థాపకమైన, నాటించెడు, పాతు, నిలిపెడు, స్థాపించెడు.

ناصح నాసిహ్ (అ.పు) హితబోధ చేయువాడు, హితుడు, మంత్రి.

ناصر నాసిర్ (అ) సహాయకుడు, సహాయకము, సహాయముచేయు.

ناصیہ నాసియ(అ.పు) నొసలు,ముంగురులు.

ناطق నాతిక్ (అ.పు) భాషకుడు, మాట్లాడువాడు, మాట్లాడగలవాడు, జ్ఞానవిశిష్టుడు(మానవుడు); ఖండితమైన, నిశ్చితమైన.

**ناطق** నాతిక్ (అ.పు) భాషకుడు, జ్ఞాన విశిష్టుడు. మాట్లాడగలప్రాణి(నరుడు), సంభాషణశక్తిగల, మాట్లాడగల, ఖండితమైన, నిశ్చితమైన, **ناطق بند کرنا** -బంద్ కర్నా (ఉ) నోరుమూయించుట, మాట్లాడ వీలులేకుండజేయుట. **قوت ناطق** కువ్వతె- (అ) భాషణశక్తి.

**ناظر** నాజిర్ (అ.పు) ద్రష్ట, దర్శకుడు, పైవిచారణకర్త, పరీక్షకుడు, రక్షకుడు.

**ناظره** నాజిర (అ.పు) చూచు, చూచెడు; దృష్టి, చూపు. **ناظره پڑھنا** -పఢ్నా (ఉ) చూచిచదువుట. **ناظره خوان** -ఖాన్ (పా) చూచి చదువువాడు.

**ناظرین** - నాజిరీన్ (అ.పు) ద్రష్టలు, దర్శకులు, చూచువారు. (ఏ.వ. **ناظر**)

**ناظم** నాజిమ్ (అ.పు) కూర్చువాడు, రచయిత, కవీశ్వరుడు; నాయకుడు, అధికారి, నిర్వాహకుడు.

**ناغه** నాగ (తు.పు) భంగము, తెంపు, రాకుండుట, లేకుండుట, నిలుకడ, విశ్రాంతి, అవకాశము, విరామము, విడుదల, (విరగడ).

**ناف** నాఫ్ (పా. స్త్రీ) నాభి, బొడ్డు, కేంద్రము, మధ్యభాగము, మధ్యస్థానము. **ناف ٹلنا - جانا - ڈگنا** - టల్నా - జానా- డగ్నా (ఉ) నాభితొలగుట, జారుట, పేగుతొలగుట, పేగుజారుట.

**نافذ** నాఫిజ్ (అ) వెడలెడు, ప్రసరించెడు, దూరెడు, వ్యాపించెడు, వాడుకకు, పెట్టిన, ఆచరణలోనున్న. **نافذ کرنا** - కర్నా (ఉ) శాసించుట, ప్రకటించుట, ఆచరణకుపెట్టుట, వ్యాపింపజేయుట, ప్రసరింపజేయుట, దూర్చుట, వెడలించుట. **نافذ ہونا** -హోనా (ఉ) శాసనమగుట, ప్రకటితమగుట, ఆచరణకువచ్చుట, ప్రసరించుట, వ్యాపించుట, వెడలుట, దూరుట.

**نافر** నాఫిర్ (అ) అసహ్యపడువాడు, గర్హించువాడు, పిరికి, నాయకుడు.

**نافرجام** నాఫర్జామ్ (పా) దురంతమైన, చెడుపరిణామముగల, పనికిమాలిన, అల్పము.

**نافرمان** నాఫర్మాన్ (పా.పు) ఒకనీల వర్ణముగల పుష్పము; అవిధేయుడు.

**نافع** నాఫె (అ) లాభకారియైన, ఉపయోగకరమైన, ప్రయోజనకార, పనికివచ్చెడు.

**نافه** నాఫ (పా.పు) మృగనాభి, కస్తూరితిత్తి.

**نافی - نافیه** నాఫీ-నాఫీయ (అ) వినాయించు, నాకారించు, కాదను, లేదను.

**ناقد** నాకిద్ (అ.పు) పరీక్షకుడు, వన్నెచేయువాడు.

**ناقص** నాకిస్ (అ) న్యూనమైన, లోపముగల, అసమగ్రమైన, తక్కువైన, అసంపూర్ణమైన, కొరవపడిన, చాలని, పనికిమాలిన, తుచ్ఛమైన, **ناقص العقل** -ఉల్ అక్ల్ (అ) బుద్ధిలోపముగల, బుద్ధిమాలిన, తెలివిమాలిన.

**ناقل** నాకిల్ (అ.పు) కథకుడు, చెప్పువాడు, అనుకరించువాడు, ప్రతి వ్రాయువాడు, ఎత్తివ్రాయువాడు; చిత్రకారుడు, ప్రతి విలేఖరి.

**ناقوس** నాకూస్ (అ.పు) శంఖము, శంఖు, గంట, ఘంట. **ناقوس پهونکنا** - నాకూస్ ఫూఁక్నా (హి) శంఖమూదుట.

**ناقہ** నాక (అ.స్త్రీ) ఆడ ఒంటె, ఒంటె. **ناقہ سوار** -సవార్ (పా) ఒంటెరౌతు.

**ناک** నాక్ (హి.స్త్రీ) నాశికము, ముక్కు, ముఖ్యభాగము, ముఖ్యావయవము, మర్యాద, గౌరవము, పరువు, అందము. **ناک آنا-بہنا** - నాక్-ఆనా-బహ్నా (హి) జలుబుచేయుట, ముక్కునకారుట. **ناک بھوں چڑھانا-سکیڑنا** -భౌఁ చఢానా-సుకేడ్నా (హి) ముఖము చిట్లించుకొనుట, కోపగించుకొనుట. **ناک بیندھنا** -బీంధ్నా (హి) ముక్కు కుట్టుట. **ناک پر ٹکا رکھ دینا** -పర్ టకా రఖ్ దేనా (హి) (వస్తువునకు) వెల వెంటది వెంటనే యిచ్చివేయుట. **ناک چنے چبوانا** -చనే చబ్వానా (హి) ముక్కున నీరుత్రాగించుట, మిక్కిలి బాధించుట. **ناک رکھنا** -రఖ్నా (హి) మర్యాదకాపాడుకొనుట. **ناک کا بال** -కాబాల్ (హి) ముఖ్యుడు, ముక్కుకుముంగరవంటివాడు, ఇష్టుడు, ప్రాణప్రియుడు, చెప్పినట్లువిన్పించగలవాడు. **ناک کٹنا** -కటానా (హి) ముక్కుకోయించుట, అవమానపరచుట. **ناک توڑنا** -తోడ్నా (హి) విరూపినిజేయుట. **ناک کی سیدھ میں** -కీసీధ్ మేఁ (హి) ముక్కుసూటిగా. **ناک کا تنکا** -కాతినక్ కా (హి) ముక్కుపుడక (పుల్ల). **ناک کا بانسا** -కా బాఁసా (హి) ముక్కుదూలము. **ناک مارنا** -మార్నా (హి) ముక్కుచిట్లించుట, అయిష్టపడుట. **ناک میں دم یا جان آنا - ناک میں دم ہونا** -మేఁ దమ్ యా జాన్ ఆనా-దమ్ హోనా (హి) తల ప్రాణము తోకకు వచ్చుట, మిక్కిలి బాధపడుట. **ناک والا** -వాలా (హి) పరువుగలవాడు.

**ناک** నాక్ (పా) కరము, దాయకము (ప్రత్యయము).

**ناکا** నాకా (హి.పు) ప్రవేశము, నిర్గమము, బాట తుద లేక మొదలు, ద్వారము, తుద, కొన, అంతము, సూది బెజ్జము, (బాట) సుంకపు చావిడి, ఠాణము, (రక్షకభటుల చావిడి), సందు, గొంది.

**ناگ** నాగ్ (హి) నాగము, నాగసర్పము, నాగకన్య, ఏనుగు, గుఱ్ఱపు మెడపై సుడి, క్రూరుడు. **ناگ بیل** - నాగ్ -బేల్ (హి) తమలపాకు తీగె. **ناگ پنچمی** -పంచ్మీ (హి) శ్రావణశుద్ధపంచమి, నాగపంచమి, ఒకహిందువులపండుగ. **ناگ پھانس** -ఫాఁస్ (హి) నాగపాశము, వరుణపాశము. **ناگ کیسر** -కేసర్ (హి) నాగకేసరములు.

**ناگا** నాగా (హి) ఒకజాతి జోగివాడు (హిందువులలో), దిగంబరుడు, ఆసాముదేశపు ఉత్తరభాగమందుండు కొండజాతివారు.

**ناگاہ** నాగాహ్ (పా) అవిదితముగ, తెలియకుండ, అకస్మాత్తుగ, తటాలున, దైవయోగముగ.

**ناگاہی** నాగాహీ (పా) ఆకస్మికము, అజ్ఞాతము, తెలియని.

**ناگر** నాగర్ (హి.పు) నాగరుడు, పట్టణవాసి, గుజరాతీ బ్రాహ్మణులు, ఒకతెగ, జాణ, నేర్పరి, నాగలి, పెద్దది, దొడ్డది. **ناگر بیل** -బేల్ (హి) తమలపాకుతీగె.

ప్రఖ్యాతి, మర్యాద. **ناموس اکبر** -ఎ,అక్బర్ (పా) హజరతు జిబ్రాయీలు.

**ناموسی** నామూసీ(పా.స్త్రీ) అపఖ్యాతి, అవమానము.

**نامه** నామ (పా.పు) లేఖ, చీటి, పత్రము, పత్రిక, ఉత్తరము, పొత్తము, చరిత్రము, ఇతిహాసము, కృతి, గ్రంథము. **نامه بر** -బర్ (పా) పత్రవాహకుడు, సందేశహరుడు. **نامه نگار** -నిగార్(పా) లేఖకుడు, పత్రలేఖరి, లేఖరి. **نامه وپیام** **پیغام** -ఒ,పయామ్ -పైఆమ్ (పా) ఉత్తరపత్రములు, పత్రవ్యవహారము.

**نامی** నామీ (పా) పేరుపడిన, ప్రసిద్ధమైన. **نامی نامزد-نامی گرامی** -నామ్‌జద్-గిరామీ(పా) మహాప్రఖ్యాతివంతులైన, మిక్కిలిప్రసిద్ధమైన.

**نامیه** నామియ (అ స్త్రీ) పెరుగు, శక్తి, ప్రాణము, ప్రాణి, జంతువు. **قوت نامیه** కువ్వతె - (అ) ప్రాణశక్తి, జీవశక్తి, వర్ధమానశక్తి.

**نان** నాన్ (పా. స్త్రీ) రొట్టె, పెద్దరొట్టె, సీమరొట్టె. **نان آبی** -ఎ,ఆబీ(పా) ఇడ్డెన, నేయికలియనిరొట్టె. **نان بائی** **-با-وا-یا-پز** -బాయీ-బా-వా-యా-పుజ్ (పా) రొట్టెలవాడు, రొట్టెలమ్మువాడు,రొట్టెలుచేయువాడు. **نان پاو** -పావ్ (ఉ) సీమరొట్టె, సీమఇడ్డెన. **نان جوین** -ఎ, జవీన్(పా) దొడ్డన్నము, బీదలయన్నము, యవపిండితోచేసినరొట్టె. **نان خطائی** -ఎ, ఖతాయీ (పా) భక్ష్యవిశేషము. **نان ربا** -ఎ,రబాత్ (పా) సదావర్తి. **نان**

**نهاری** -ఎ,నహారీ (పా) ప్రాతఃకాలభోజనము, చల్ది. **نان وقف** -ఎ, వక్ఫ్ (పా) ధర్మాన్నము, ధర్మముగాపెట్టుభోజనము. **نان ونفقه** -ఒ,నఫ్క (పా)అన్నవస్త్రములు,జీవనము,భరణము.

**نانا** నానా (హి.పు) మాతామహుడు, తల్లితండ్రి, తాత.

**نانته** నాంథ్(హి.పు) దిక్కుమాలినసొత్తు.

**ناند** నాంద్(హి.స్త్రీ) తొట్టి, మట్టితొట్టి, మ్రానుతొట్టి.

**ناندهنا** నాంధ్నా (హి) ఆరంభించుట, మొదలుపెట్టుట, నాందీజరుపుట.

**نانکار** నాన్‌కార్(పా.పు) అగ్రహారము, జీవనాధారముగాయిచ్చినభూమి, భరణము, భృతి.

**نانهیال** నాన్‌హియాల్ (హి.ఉ)మాతామహిగృహములేకవంశము, అవ్వగారియిల్లు. (అమ్మమ్మ.

**نانی** నానీ (హి.స్త్రీ) మాతామహి,అవ్వ.

**ناو** నావ్ (హి. స్త్రీ) నావ, పడవ.

**ناو** నావ్ (హి.పు) మంగలివాడు.

**ناورد** నావర్ద్ (పా. స్త్రీ) జగడము, యుద్ధము, దొమ్మియుద్ధము.

**ناوک** నావక్(పా.పు) బాణము,నాళము, ఈగకాటు. **ناوک انداز** -అందాజ్ (పా) విలుకాడు, ధానుష్కుడు.

**ناوکی** నావికీ (హి.పు) నావికుడు, పడవవాడు.

**ناونا** నావ్‌నా(హి)వంచుట.వంగదీయుట.

**ناونوش** నాఒనోష్ (పా.స్త్రీ) విందు, త్రాగుడు, తినుడు త్రాగుడు.

ناہ నాహ్ (హి) కాదు, లేదు.

ناہار నాహార్ (పా.పు) అభుక్తము, చద్ది, ప్రాతఃకాలభోజనము.

ناہر నాహఁర్ (హి.పు) పెద్దపులి. ناہر سانس -సాఁస్ (ఉ) గుఱ్ఱముల మొసరోగము.

ناہید నాహీద్ (పా.పు) శుక్రుడు (గ్రహము).

نائی నాయీ (హి.పు) మంగలివాడు.

نائے నాయే (పా.స్త్రీ) నాళము, గొట్టము, రెల్లు(గొట్టము).

نائب నాయిబ్ (అ.పు) ప్రతినిధి, ఎన్నుకొనినవాడు, సహాయుడు. نائب مناب -మనాబ్ (పా) ప్రతినిధి, తరువాతివాడు. نائب وزیر -వజీర్ (పా) సహాయమంత్రి.

نائرہ నాయిర (పా.పు) మంట, జ్వాల, ఉష్ణము.

نائزہ నాయిజే (పా.పు) లింగము, మూత్రనాళము, మూత్రరంధ్రము.

نائک నాయక్ (హి.పు) నాయకుడు, అధికారి; భరతశాస్త్రజ్ఞుడు.

نائن నాయన్ (హి.స్త్రీ) మంగలిది.

نائے نوش నాయెనోష్ (హి.పు) చూడు ناونوش.

نبات నబాత్ (అ.స్త్రీ) ఓషధివర్గము, ఓషధి, చెట్టుచేమలు, పచ్చిక, గడ్డిగాదము, కూరగాయలు.

نبات నబాత్ (పా.స్త్రీ) చక్కెర ఉండలు(తినుబండము); కలకండ, కండచక్కెర.

نباتات నబాతాత్ (అ) ఓషధి వర్గము, వృక్షవర్గము. علم نباتات -ఇల్మె (అ) వృక్షశాస్త్రము.

نباتی నబాతీ (అ) ఓషధిసం॥.

نباڑنا నిబాఁడ్నా (హి) నిర్వహించుట, సమర్థించుట, నెరవేర్చుట, చేయుట, కొనసాగించుట, తుదముట్టించుట; వేరుచేయుట, ఏర్పరచుట.

نباش నబ్బాష్ (అ.పు) సమాధుల త్రవ్వువాడు, పూడ్చిన శవముల త్రవ్వి తీయువాడు, శవముల దోచుకొనువాడు.

نباض నబ్బాజ్ (అ.పు) ధాతుశాస్త్రజ్ఞుడు, నాడిపరీక్షకుడు, వైద్యుడు.

نباہ నిబాహ్ (హి.పు) నిర్వాహము, సమర్థము, నిర్వర్తింపు, నెరవేర్పు, కడతేర్పు, సంరక్షణము.

نباہنا నిబాహ్నా (హి) నిర్వహించుట, సమర్థించుట, నెరవేర్చుట, కొనసాగించుట, కడతేర్చుట, నిర్వర్తించుట, సంరక్షించుట, నడపుట, సాగించుట, సహించుట.

نباہو నబాహూ (హి) నిర్వాహకుడు, సమర్థించుకొనువాడు, నెరవేర్చువాడు.

نبرد నబర్ద్ (పా.పు) జగడము, యుద్ధము, పోరు. نبرد آزما -ఆజ్మా (పా) యుద్ధవీరుడు, [illegible], పోటరి. نبرد گاہ -గాహ్ (పా) యుద్ధభూమి.

نبڑنا నిబఁడ్నా (హి) నిర్వహింపబడుట, నిర్వాహమగుట, సమర్థింపబడుట, కొనసాగుట, నెరవేరుట, తీర్మానమగుట, కడతేరుట.

نبٹانا నిబ్టానా (హి) తీర్మానముచేయుట, చెల్లుపెట్టుట, నిశ్చయముచేయుట.

نبتاو నిబ్టావ్ (హి.పు) తీర్మానము, చెల్లుబడి, నిశ్చేపము.

نبٹنا నిబట్నా (హి) చూడు نبڑنا.

نبڑا నిబ్డా (హి.పు) చూడు نبتاو.

نبض నబ్జ్ (అ.స్త్రీ) నాడి. نبض دیکھنا -దేఖ్నా (ఉ) నాడిపరీక్షచేయుట, చేయి జూచుట.

نبل నిబల్ (హి) నిర్బలము, బలములేని.

نبوت నబువత్ (అ.స్త్రీ) దేవదూతత్వము, దైవదూత్యము.

نبوی నబవీ (అ) దేవదూత సం॥.

نبھاگا నిభాగా (హి) నిర్భాగ్యుడు.

نبھانا నిభానా (హి) నిర్వహించుట, సమర్థించుట, కడతేర్చుట, కొనసాగించుట, తుదముట్టించుట.

نبھاو నిభావ్ (హి.పు) నిర్వహణము, నెరవేర్పు, కడతేర్పు, కొనసాగింపు.

نبھنا నిభ్నా (హి) నిర్వాహమగుట, సమర్థింపబడుట, కొనసాగుట, నెరవేరుట, కడతేరుట.

نبی నబీ (అ.పు) దేవదూత.

نبیرہ నబీర (తు.పు) పౌత్రుడు, మనుమడు.

نبیڑنا నిబేడ్నా (హి) నిర్వహించుట, సమర్థించుట, కడతేర్చుట, నెరవేర్చుట, తీర్మానముచేయుట, కొనసాగించుట.

نپٹ నిపట్ (హి) విశేషము, మిక్కిలి, చాల, బొత్తుగ, సాంతము.

نپٹانا నిప్టానా (హి) చూడు نبتانا.

نپٹنا నిపట్నా (హి) చూడు نبٹنا.

نپنا నప్నా (హి) కొలవబడుట, కొలబడుట.

نت నిత్ (హి) నిత్యము, ప్రతిదినము, ఎల్లప్పుడు, సదా. نت نیا -నయా (హి) ఎప్పటికప్పుడు, క్రొత్తది. نت نیم -నియమ్ (హి) నిత్య నియమము, నిత్యకృత్యము.

نتارنا నితార్నా (హి) వడగట్టుట, వడబోయుట, స్వచ్ఛముచేయుట, కలకము దీయుట, కషాయము దీయుట, ధృతి దీయుట.

نتائج నతాయిజ్ (అ.పు) ఫలితార్థములు; (ఏ. వ نتیجہ). (బిడ్డ.

نتنی నత్నీ (హి.స్త్రీ) మనుమరాలు, బిడ్డ

نتھ నథ్ (హి.స్త్రీ) నత్తు, ముక్కుపోగు, ముంగర.

نتھارنا నిథార్నా (హి) చూడు نتارنا.

نتھرا నిథ్రా (హి) వడగట్టిన, వడపోసిన, నిర్మలముజేసిన, సంధానముజేసిన, ధృతిగాతీసిన, కలకముగాతీసిన, నిర్మలమైన, స్వచ్ఛమైన.

نتھنا నథ్నా (హి.పు) ముక్కుపుటము, ముక్కురంధ్రము; ముక్కుపోగు.

نتھنی నథ్నీ (హి.స్త్రీ) చిన్నముక్కుపోగు.

نتھی నథీ (హి.స్త్రీ) కాకితములకుగుచ్చు దారము, కూర్పునూలు. نتھی شدہ -షుద (ఉ) గుచ్చికట్టిన, కూర్చికట్టిన.

نتیجہ నతీజ (అ.పు) ఫలము, సారాంశము, ఫలితము.

نٹ నట్ (హి) దొమ్మరివాడు, టక్కరి, టాటోటు. نٹ کھٹ -ఖట్ (హి) టక్కులమారి, పోకిరి, మోసగాడు. نٹ کھٹی -ఖటీ (హి) టకడంబులు, టాటోటు, మోసము, పోకిరితనము.

**نٹنی** నట్నీ (హి. స్త్రీ) దొమ్మరిది.

**نٹنا** నట్నా (హి) కాదనుట, లేదనుట, నాకరించుట.

**نٹیا** నట్యా (హి) కురుచ పొట్టియెద్దు, పొట్టి కురుచ యెద్దు.

**نثار** నిసార్ (అ.పు) పారజల్లుట, చెదరగొట్టుట, చెల్లాచెదరు, బీదవారికై పారజల్లి నరూకలు, దిగదుడుపు, బలిహరణము, వినియోగము. **نثار ہونا** -హోనా (ఉ) బలియగుట, దిగదుడుపగుట, వినియోగపడుట.

**نثر** నస్ర్ (అ.పు) విక్షేపము, పారజల్లుట; వచనము, గద్యము.

**نج** నిజ్ (హి) తన, స్వంత, ప్రత్యేకము. సొంత. **نج کا** -కా(హి) స్వంత, సొంత. తన, ప్రత్యేకము. **نج کا حساب** -కా హిసాబ్ (ఉ) సొంతలెక్క.

**نجابت** నజాబత్ (అ స్త్రీ) కులీనత, పెద్దతనము, సభ్యత, సజ్జనత, ఘనత, ఔదార్యము, గొప్పతనము.

**نجات** నజాత్ (అ. స్త్రీ) ముక్తి, విడుదల, మోక్షము, విమోచనము, క్షమాపణము.

**نجار** (అ.పు) వడ్రంగి, వడ్లవాడు.

**نجاری** నజ్జారీ (అ. స్త్రీ) వడ్రంగము, వడ్లపని.

**نجاست** నజాసత్ (అ. స్త్రీ) అపవిత్రత, మైల, మురికి, అశుద్ధము,

**نجانے** నజానే (హి) తెలియదు, ఎవరికి తెలియును, దేవుని కెరుక.

**نجبا** నుజబా (అ.పు) కులీనులు, పెద్దమనుష్యులు సజ్జనులు, సభ్యులు, పెద్దలు, (ఏ.వ **نجیب**).

**نجد** నజ్ద్ (అ.పు) మిట్టభూమి, ఉన్నత ప్రదేశము, అరబ్బుదేశములోని ఒక పట్టణము పేరు.

**نجس** నజిస్ (అ) అపవిత్రము, అశుద్ధము, మురికి, అపరిశుద్ధము. **نجس العین** -ఉల్ ఐన్ (అ) స్వాభావిక అపవిత్రతగల, స్వభావాశుద్ధమైన.

**نجف** నజఫ్ (అ.పు) ఉన్నతభూమి, మిట్ట భూమి, అరబ్బుదేశములోని ఒక పట్టణము పేరు, (ఇక్కడ అలీ గారి సమాధి గలదు).

**نجم** నజ్మ్ (అ.పు) నక్షత్రము, గ్రహము, జాతకము. గ్రహనక్షత్రము. **نجم الثاقب** -ఉస్ సాఖిబ్ (అ) ప్రకాశించునక్షత్రము, మిక్కిలి మెరయు నక్షత్రము.

**نجوم** నుజూమ్ (అ.పు) జ్యోతిష్యము, నక్షత్రములు, గ్రహములు. (ఏ. వ. **نجم**) **علم نجوم** ఇల్మె- (అ) జ్యోతిష శాస్త్రము.

**نجومی** నుజూమీ (అ.పు) జ్యోతిష్కుడు, సిద్ధాంతి.

**نجیب** నజీబ్ (అ.పు) కులీనుడు, పెద్దమనిషి, సజ్జనుడు, సభ్యుడు, గొప్పవాడు, ఐచ్ఛికుడు (యుద్ధసైనికుడు). **نجیب الطرفین** -ఉత్, తరఫైన్ (అ) ఉభయవంశకులీనుడు, తల్లివంకను తండ్రివంకను మంచివంశమువాడు, ఇరువంకలను మంచివంశమువాడు.

**نچان** నిచాన్ (హి) దిగుడు, వంపు, వాలు, వంత.

**نچڑنا** నిచడ్నా (హి) పిండబడుట, వడి

యుట, బొట్లుగాపడుట, కారుట, బక్క-బడుట.

**نچلا** నిచ్‌లా (హి) నిశ్చలముగా, కదలక మెదలక, ఊరక; క్రింది, అధమము.

**نچنا** నుచ్నా (హి) గిల్లబడుట, త్రుంచబడుట.

**نچنت** నిచింత్ (హి. స్త్రీ) నిశ్చింతగా.

**نچنتائی** నిచింతాయీ (హి. స్త్రీ) నిశ్చింత, నిశ్చింతత.

**نچوڑ** నిచోడ్ (హి.పు) పిండుట, పిండితీసినది, సారము, రసము.

**نچوڑنا** నిచోడ్నా-పిండుట,పిండితీయుట.

**نچھاور** నిఛావర్ (హి.పు) దిగదుడుపు, బలిహరణము, దిగడుడిచినరూకలు.

**نچھتر** నచ్ఛత్తర్ (హి.పు) నక్షత్రము, చుక్క, రిక్క.

**نچھتری** నచ్ఛత్రీ (హి) మంచినక్షత్రమునబుట్టినవాడు.

**نحافت** నహాఫత్ (అ. స్త్రీ) బక్కదనము, దుర్బలత, అశక్తత.

**نحاس** నుహాస్ (అ. పు) తామ్రము,రాగి.

**نحر** నహ్ర్ (అ.పు) వధ, గొంతుకోత, జంతువధ, బలి. **یوم النحر** యౌమున్నహ్ర్ (అ) బలిదినము, జుల్హైజియొక్క పదియవతిథి.

**نحس** నహ్స్ (అ) అశుభకరమైన,దౌర్భాగ్యమైన.

**نحل** నహ్ల్ (అ. స్త్రీ) తేనెటీగ.

**نحو** నహ్వ్ (అ.స్త్రీ) మార్గము, విధము,రీతి, పద్ధతి, అన్వయము, వాక్యపరిచ్ఛేదము.

**نحوست** నహూసత్ (అ. స్త్రీ) అశుభము, అవలక్షణము, దుశ్శకునము.

**نحوی** నహ్వీ (అ.పు) వైయాకరణి, అన్వయక్రమముచక్కగా తెలిసినవాడు, అన్వయశాస్త్రపండితుడు, అన్వయసం॥.

**نحیف** నహీఫ్ (అ) బక్కని, దుర్బలమైన, అశక్తమైన.

**نخ** నఖ్ (పా. స్త్రీ) పట్టుపోగు, సన్నపిపోగు లేకదారము.

**نخاس** నఖ్ఖాస్ (అ.పు) మనుష్యులను లేకపశువులనుఅమ్మేఅంగడి, పశువులసంత, బానిసలసంత, సంత, అంగడి.

**نخالص** నిఖాలస్ (అ) స్వచ్ఛమైన, నిర్మలమైన, కపటములేని.

**نخچیر** నఖ్చీర్ (పా. స్త్రీ) అడవిమృగము, వేటమృగము, వేట, వేటాడుట. **نخچیرگاہ** -గాహ్- మృగయాటవి, వేటపట్టు.

**نخرہ - نخرا** నఖ్రా-ర (పా.పు) సయ్యాటు, పరిహాసము, హొయలు, విలాసములు, టక్కులు. **نخرے باز** నఖ్రేబాజ్ (పా) సయ్యాటలమారి, టక్కులమారి, బూటకాలమారి. **نخرے بازی** నఖ్రేబాజీ (పా) సయ్యాటలు, బూటకములు, టక్కులు.

**نخست** న(ను)ఖ్స్త్ (పా.పు) మూలము, ముఖ్యము, ఆది, మొదలు. **نخست زاد** -జాద్ (పా) ప్రథమపుత్రుడు, జ్యేష్ఠుడు.

**نخل** నఖ్ల్ (అ.పు) ఖర్జూరపుచెట్టు,

نری నరీ (హి.స్త్రీ) వన్నె వేసిన మేకతోలు.

نریٹ۔نریٹی నిరేట్ - నిరేటీ (హి.స్త్రీ) గొంతు, శ్వాసనాళము.

نرینہ నరీన (పా) పురుష సం॥, మొగ.

نزار నిజార్ (పా) దుర్బలమైన, శుష్కమైన, బక్కని.

نزاع నిజాఉ (అ.స్త్రీ) వివాదము, భేదము, జగడము, వాదము, విరోధము. نزاع لفظی -ఎ,లఫ్జీ- వాగ్వివాదము.

نزاکت నజాకత్ (పా.స్త్రీ) కోమలత, నాగరికత, సున్నితము, సూక్ష్మత, దుర్బలత, అబలత్వము, అందము, పొంకము, మృదుత్వము, సొంపు, విలాసము, ఒయారము, ముద్దు.

نزاهت నజాహత్ (అ.స్త్రీ) నిర్దోషత్వము, నిష్కల్మషత. స్వచ్ఛత, సంతుష్టి, సంతోషము, వేడుక,

نزد۔نزدیک నజ్ద్ - నజ్దీక్ (పా) దగ్గర, సమీపమున, చెంగట, కలిసి, వద్ద.

نزادت నిజాదత్- అప్పులు, అరువులు, ఒకరికిచ్చినవి.

نزدیکی నజ్దీకీ (పా.స్త్రీ) సామీప్యము, చెంగటి.

نزع నజీఉ (అ.పు) మరణవేదన, ప్రాణోత్క్రమణము, మరణదశ.

نزلہ నజ్ల (అ.పు) పడిసెము, జలుబు. نزلہ بند -బంద్ (పా) జలుబుహరించుటకు కనుపట్టెలకు వేయుదూది పట్టీలు.

نزول నుజూల్ (అ.పు) అవతరణము, దిగుట, బసచేయుట, ఆగింపు, పడిసెము, కంఠరోగము, రాజుగారిభూమి, సేనాశిబిరము.

نزهت నుజ్హత్ (అ.స్త్రీ) పవిత్రత, ప్రమోదనము, పచ్చదనము, నవనవలాడుట, సంతోషము, ఆనందము, సౌఖ్యము, (మనోహరత్వము) نزهت گاه -గాహ్ (పా) విహారస్థలము.

نژاد నిజాద్ (పా.స్త్రీ) మూలము, వంశము, కులము, బీజము.

نژند నిజంద్ (పా) భయంకరమైన, పాపిష్ఠుడు, గౌరవనీయుడు, అనుభవముగల, దుఃఖితమైన, ఆగ్రహపడిన, తత్తరపడిన, కలతజెందిన, మూర్ఛిల్లిన, వికారమైన.

نس నస్ (అ.స్త్రీ) నరము, నాళము, రక్తనాళము, తంతువు.

نس నస్ (పా.పు) ముక్కు, పెదవి, ముఖపరిధి, నోటినిపట్టు, గడ్డము, గవాని, పగ్గము, ఇల్లు.

نساج నస్సాజ్ (అ.పు) సాలెవాడు, నేతగాడు.

نسانا నసానా (హి) నాశనముచేయుట.

نساورا నసావ్రా (హి.పు) అతిసన్నపువన్నెగలిగి రెండు తెల్లరెక్కలుగల పావురము.

نسائم నసాయిమ్ (అ.స్త్రీ) మంద మారుతములు, గంధమారుతము, మలయ మారుతములు, చేల్లగానుండి సువాసనగల గాడ్పులు. (ఏ.వ نسیم).

نسب నసబ్ (అ.పు) వంశపరంపర, వంశము, కులము. نسب نامہ -నామ (పా) వంశవృక్షము. نسب نما -నుమా (పా) హారము (భిన్నాంకము). نسب و

حسب -వ హసబ్ (అ) తల్లిదండ్రుల వంశావళి, వంశపరంపర.

نسبت నిస్బత్ (అ) సంబంధము, తగులు, అనుగుణ్యత, అనుకూలము, పోలిక, సామ్యము, వివాహసంబంధము, వివాహనిశ్చయము, వివాహసందేశము, లగ్నపత్రిక; (తరస్థితి) కంటె, మీరి, కన్న, అనురూపమైన, తగిన, అనుసరించి; దైవజ్ఞానము, దైవసంబంధము. نسبت دینا -దేనా (ఉ) సామ్యముజూపుట.

نسبتی నిస్బతీ (అ.పు) బంధువు, చుట్టము. نسبتی بهائی -భాయీ (ఉ) భార్యసోదరుడు, బావమరది.

نسترن- رون నస్తరన్-రూన్ (పా.పు) తెల్లపన్నీరుపువ్వు, (ఒకవిధమైన) చేమంతి, ఒకవిధమైన నేతబట్ట.

نستعلیق నస్తఅలీక్ (అ.పు) ఫారసీ అక్షరములు, పొంకమైనవ్రాత; నాగరికుడు, సభ్యుడు, మృదుభాషి,

نسج నస్జ్ (అ.పు) నేయుట, నేత, రచన, పేనుట.

نسخ నస్ఖ్ (అ.పు) ప్రతి, ఎత్తివ్రాసినది, రెండవ ప్రతి, నిషేధము, కొట్టివేయుట, వినాయింపు, నాకరణము, ఒక విధమైన అరబ్బీవ్రాతకట్టు,

نسخه నుస్ఖ (అ.పు) ప్రతి, పత్రము, చీటి, వ్రాసినది, మాదిరి, వ్రాత, చిన్న పొత్తకము, పొత్తము, సంపుటము, (ఔషధ) తోయము, పాఠాంతరము. రీతి, వైఖరి, పద్ధతి.

نسر నస్ర్ (అ.పు) రాబందు, గద్ద.

نسرین నస్రీన్ (పా.పు) చేమంతి, తెల్లని అడవి పన్నీరుపువ్వు.

نسق నసక్ (అ.పు) మార్గము, పద్ధతి, రీతి, కట్టుదిట్టము, ఏర్పాటు, క్రమము, వ్రాత పద్ధతి, కూర్పు.

نسل నస్ల్ (అ.స్త్రీ) వంశము, కులము, బీజము, సంతానము. نسل دار -దార్ (పా) కులీనమైన, మంచి కులపు. نسلاً بعد نسلاً నస్లన్ బఅదనస్లిన్ (అ) వంశపరంపరగా, వంశపారంపర్యముగా.

نسناس న(ని)స్నాస్ (అ.పు) అడవి మనిషి, వానరవిశేషము, మనుష్య వానరము.

نسوان నిస్వాన్ (అ.స్త్రీ) స్త్రీలు, ఆడవారు, ఆడంగులు.

نسیان నిస్యాన్ (అ.పు) విస్మరణము, మరపు; విరుద్ధము.

منسیاً - نسیاً నిస్యన్ -మనిస్యన్ (అ) విస్మృతము, బొత్తిగామరచిన.

نسیم నసీమ్ (అ.పు) మందమారుతము, గంధమారుతము, మలయ మారుతము. نسیم السحر -ఉస్సహర్ (అ) ఉదయ వాయువు, ఉదయమారుతము. (నిచ్చెన.

نسینی నసీనీ (హి.స్త్రీ) నిచ్చెన, కొయ్య

نسیم నిస్య (అ.పు) విస్మృతము, మరచిన వస్తువు. తుచ్ఛము, పనికిరానిది.

نشا ని(న)షా (అ.పు) మత్తు, మైమరపు, ఒడలు తెలియమి; ఉత్సాహము, ఉద్రేకము, ఉప్పొంగు, సువాసన, వాసన. نشاخور -ఖోర్ (పా) త్రాగుబోతు. نشاکرنا -కర్నా (ఉ) వాడుకగాత్రాగుట, మద్య

పానము చేయుటు. نشا میں چور ہونا -మేం చూర్ హోనా (ఉ) తప్ప తాగి మొదలు మరచుట.

**نشات** నషాత్ (అ. స్త్రీ) సృష్టి, భూతము, ప్రాణి, ప్రాణము.

**نشاتین** నషాతేం (అ) ఉభయలోకములు.

**نشاستہ** నిషాస్త (పా) అంటు, కలయిక, గోధుమపాలఅంటు (వండి చేసినది), గోధుమగంజిఅంటు, చిక్కనిగోధుమగంజి.

**نشاط** ని (న) షాత్ (పా. స్త్రీ) ఆనందము, సంతోషము, ఉత్సాహము, భోగము, సుఖానుభవము, సౌఖ్యము.

**نشان** నిషాన్ (పా. స్త్రీ) చిహ్నము, అంకము, గురుతు, ముద్రణము, పత్రకము, నిదర్శనము, అచ్చు, తార్కాణము, మచ్చ, లక్షణము, జాడ, ధ్వజము, టెక్కెము, లాంఛనము, ఆనవాలు, జ్ఞాపకము, ఉండుచోటు, స్థావరము, పెండ్లియుంగరము, ప్రధానపుటుంగరము, పైవిలాసము, రాజాజ్ఞ, లక్ష్యము, గురి, గురిపెట్టుట, నొసటివ్రాత; వరుస సంఖ్య, సంఖ్య, అంకె. نسان بردار - نشانچی -బర్దార్ -నిషాన్చి (పా) ధ్వజవాహకుడు, టెక్కెముగొనిపోవువాడు. نشان دہی -దేహీ (పా) నిర్దేశము, ఆనవాలుపట్టుట, గుర్తించిచూపుట.

**نشانہ** నిషాన (పా.పు) లక్ష్యము, గురిగుర్తు, గురి, నివాసము, ఉనికిపట్టు, దిగుచోటు, స్థావరము. نشانہ انداز -అందాజ్ (పా) అమోఘబాణుడు, గురి తప్పని వాడు. نشانہ مارنا -మార్నా (ఉ) లక్ష్యమునుకొట్టుట, గురికొట్టుట.

**نشانی** నిషానీ (పా. స్త్రీ) గురుతు, చిహ్నము, అంకము, జ్ఞాపకార్థము, జ్ఞాపకము, ఆనవాలు, మాదిరి, సంతానము, వంశలాంఛనము, చోకలిగుర్తు, జీడముద్ర.

**نشتر** నష్తర్ (పా.పు) శస్త్రము, శలాకము నెత్తురుతీయుట. نشتر لگانا -లగానా (ఉ) నెత్తురుతీయుట (శస్త్రముతో పొడిచి).

**نشر** నష్ర్ (అ.పు) ప్రసరణము, పరచుట, వైశాల్యము, వెడల్పు, సుగంధము, ప్రచారితనము, చల్లాచెదరు, వ్యాపనము, ప్రకటనము, ప్రచురణ, జీవనము, పునరుత్థానము (చచ్చినవారిని లేపుట).

**نشست** నిషస్త్ (పా. స్త్రీ) ఆసీనము, కూర్చుండుట, సభ (చేసి కూర్చుండుట). نشست و برخاست -ఒబర్ఖాస్త్ (పా) మర్యాదలు, సభ్యతలు, నడతలు. نشست گاه -గాహ్ (పా) సావడి, సందర్శనశాల, ముఖశాల, కూర్చుండు మంట్లాడుచోటు లేక గది, మండపము.

**نشو** నష్వా (అ.పు) వృద్ధి, పుట్టుట, పెరుగుట, వర్ధనము. نشو و نما -ఒ, నుమా (పా) (అభి)వృద్ధి.

**نشور** నషూర్ (అ.పు) పునరుత్థానము, చచ్చినవారు లేచివచ్చుట.

**نشوه** నష్వ (పా.పు) పరవశత్వము, ఆనందము, మస్తు, ఒడలుమరచుట, లాహిరి.

**نشہ** నష (పా.పు) మస్తు; చూ-ను نشا

**نشیب** న(ని)షీబ్ (పా.పు) పల్లము, దిగుడు, వంపు. نشیب و فراز -ఒ, ఫరాజ్ (పా) మెరకపల్లములు, మిట్టపల్లములు, ఎగుడుదిగుడు, ఎచ్చుతగ్గులు, టక్కులు, మంచిచెడుగులు, కష్టసుఖములు, లాభనష్టములు.

**نشید** న(ని)షీద్ (పా.పు) గాయనము, ధ్వని, పాట, స్వరము, కవిత.

**نشیلا** ని(న)షీలా(పా) మత్తుగల, మైకముగల, మైమరచిన, మత్తెక్కిన.

**نشیمن** ని(న)షేమన్ (పా.పు) విశ్రాంతి స్థానము, స్థావరము, స్థానము, ఉనికిపట్టు, ఆసనము, పీఠము, పక్షులగూడు.

**نشین** ని(న)షీన్ (పా) కూర్చుండువాడు, ఉండువాడు (సమాసములలో).

**نشینی** నిషీనీ (పా. స్త్రీ) కూర్చుండుట, ఉండువాడు (సమాసములలో).

**نص** నస్స (అ. స్త్రీ) మిక్కిలి పరీక్షించుట, పరీక్షణము, ప్రకటము, విశదము, స్పష్టము, ఖండితమైన, ఆజ్ఞ, విధి, కురానువాక్యము.

**نصاب** నిసాబ్ (అ.పు) మూలము, సంచికట్టు, చేతిసొమ్ము, ఆస్తి, గౌరవము, అదృష్టము, భాగ్యము, ఆదాయములో ధర్మమునకు తీయుభాగము, త్రాసుదండె, కత్తిమొనవాని పిడి, అభ్యాసక్రమము. **نصاب تعلیم** -ఎ, తఽలీమ్ (అ) విద్యాభ్యాసక్రమము.

**نصارا - ری** నసారా (అ.పు) క్రైస్తవుడు.

**نصائح** నసాయిహ్ (అ. స్త్రీ) ఉపదేశములు, నీతులు, బుద్ధులు. (ఏ.వ **نصیحت**)

**نصب** నస్బ (అ.పు) స్థాపనము, పాతుట, నిలువబెట్టుట; విరోధము, పగ. **نصب العین** -ఉల్, ఐన్ (అ) ఆదర్శము.

**نصر** నస్ర్ (అ.పు) సహాయము, తోడు, చేయూత, జయము, గెలుపు.

**نصرانی** నస్రానీ (అ.పు) క్రైస్తవుడు.

**نصرت** ను(న)స్రత్ (అ. స్త్రీ) జయము, సహాయము. **نصرت آیات** -ఆయాత్ - జయప్రదము.

**نصف** నిస్ఫ్ (అ) అర్ధము, సగము. **نصف النہار** -ఉల్, నహార్ (అ) మధ్యాహ్న రేఖ. **نصف قطر** -కుత్ర్ (అ) వర్తుల మధ్యమునుండి కైవారమువరకు నుండు రేఖ. **نصف نصف** -ఆనిస్ఫ్ (అ) చెరిసగము.

**نصفت** నస్ఫత్ (అ. స్త్రీ) న్యాయము.

**نصوح** నసూహ్ (అ) శాశ్వతమైన లేక దృఢమైన (పశ్చాత్తాపము).

**نصیب** నసీబ్ (అ) భాగము, భాగ్యము, అదృష్టము, కర్మము, దైవము, ప్రారబ్ధము, ప్రాప్తి. **نصیب جگنا ۔ چمکنا ۔ کھلنا** -జగ్నా-చమక్నా-ఖుల్నా (ఉ) భాగ్యోదయ మగుట. అదృష్టము పండుట. **نصیب ہونا** -హోనా (ఉ) పాలబడుట, దొరకుట, అదృష్టవశమునలభించుట.

**نصیبا - نصیبہ** నసీబా -నసీబ (అ.పు) అదృష్టము, భాగ్యము. చూడు **نصیب** అనుపదము. **نصیبا ور** - వర్ (పా) అదృష్టవంతుడు **نصیبوں جلا** -నసీబూఁ జలా (ఉ) దౌర్భాగ్యురాలు, నిర్భాగ్యుడు,

**نصیحت** నసీహత్ (అ. స్త్రీ) ఉపదేశము, నీతి, బుద్ధి **نصیحت دینا ۔ کرنا** - దేనా-కర్నా (ఉ) బుద్ధులుచెప్పుట, నీతి చెప్పుట, ఉపదేశించుట. **نصیحت گر گو** -గర్ - గో(పా) ఉపదేష్టి, నీత్యుపదేశించువాడు, నీత్యుపదేశకుడు, బుద్ధికరపువాడు. **نصیحت ہونا** - హోనా (ఉ) బుద్ధివచ్చుట, నీతి తెలియుట.

**نصیر** నసీర్ (అ.పు) సహాయకుడు, తోడుపడువాడు, సహకారి.

**نضارت** నిజారత్ (అ.స్త్రీ.) క్రొత్తదనము, నవీనత, పచ్చదనము, అందము,కళ,కాంతి.

**نضج** నజ్జ్ (అ.పు) పక్వత, పండుట, పుండు-చీము పట్టి పక్వమగుట.

**نطفہ** నుత్ఫ (అ.పు) బీజము, శుక్లము, గర్భము. **نطفہ بے تحقیق - حرام** -బేతహకీక్-హరామ్(వి) అజ్ఞాతపితృకుడు, లంజెకొడుకు.

**نطق** నుత్క్ (అ.పు) భాషణశక్తి, భాషణము, భాష, జ్ఞానము.

**نطول** నతూల్ (అ.పు) ఔషధోదకస్నానము,మందునీళ్లుతలపైధారగకట్టుట, ఔషధోదకము.

**نظارت** నజారత్ (అ.స్త్రీ) ఈక్షణము, చూచుట, కనిపెట్టియుండుట,పైవిచారణ.

**نظارگی** నజ్జారగీ (అ.స్త్రీ)దర్శనము, ఈక్షణము, చూపు; ద్రష్ట, చూచువాడు.

**نظارہ** నజ్జార (అ.పు) దృష్టి, చూపు, కటాక్షవీక్షణము,వలపుచూపు,ఓరచూపు. **نظارہ بازی** -బాజీ - క్రీగంటిచూపులు, గడగంటిచూపులు, ఓరచూపులు.

**نظافت** నజాఫత్ (అ.స్త్రీ) స్వచ్ఛత, పరిశుద్ధత, నిర్మలత.

**نظام** నిజామ్ (అ.పు) కూర్పు, ముత్యాలకూర్పు, మాలము, వరుస, క్రమము, కట్టుదిట్టము, పరిపాలనము, ఏర్పాటు, పద్ధతి, రీతి, నడవడి, చట్టము, ప్రభువు, రచయిత, కూర్పరి, కూర్చువాడు, అధికారి, గోలకొండనబాబులగారి బిరుదము.

**نظام شمسی** -ఎ,షంసీ (వి) సూర్యమండలము, సూర్యగ్రామము. **نظام الملک** -ఉల్,ముల్క్- (వి) గోలకొండనవాబులుగారి బిరుదనామము,

**نظامت** నిజామత్ (అ.స్త్రీ) ఏర్పాటు, పరిపాలనము, ప్రభుత్వము, అధికారము, ఉన్నతాధికారము.

**نظائر** నజాయిర్ (అ. స్త్రీ) సామ్యములు, సాటువులు, దృష్టాంతములు (ఏ.వ.نظیر).

**نظر** నజర్ (అ.స్త్రీ) సంరక్షణము, దృష్టి, దృష్టిదోషము, చూపు, కన్ను, కనిపెట్టియుండుట, అనుగ్రహము, కటాక్షము, పరీక్షణము. **نظر اتارنا - جھاڑنا** -ఉతార్నా-ఝాడ్నా (క్రి) దృష్టితీయుట, దిగదుడుచుట. **نظر آنا** ఆనా (క్రి) కానవచ్చుట, అగపడుట. **نظر انداز کرنا** -అందాజ్ కర్నా (క్రి) తిరస్కరించుట, అలక్ష్యముచేయుట, చూడకవిడుచుట, చూచినా చూడనట్లుండుట. **نظر باز** -బాజ్ (పా) ఓరచూపులవాడు, చూచినంతనే తెలిసికొనువాడు. **نظر بند** -బంద్ (పా) చెరలోనున్న, బందిలోనున్న, కట్టిలోనున్న, కనిపెట్టబడియున్న, దృష్టిలోనుంచబడిన, దిగ్బంధములోనున్న, కాపుదలలోనున్న. **نظر بندی** - బందీ (పా) దిగ్బంధము, బంది, చెర, కట్టు, కట్టుదల, కాపుదల. **نظر بد** -ఎ.బద్ (పా) దృష్టి, దృష్టిదోషము. **نظر بچانا - چرانا** -బచానా -చురానా (క్రి) అగపడకతప్పించుకొనుట, చూపుతప్పించుకొనుట. **نظر ٹوٹکا** -టూట్కా (క్రి) దృష్టిపరి

హారకము, దృష్టిదోషము పోగొట్టుపద్ధతి, దిగదుడుపు. نظرثانی -సానీ (అ) పునర్విచారణ. نظرسے گرادینا -సేగిరాదేనా (ఉ) అవమానపరచుట, భంగపరచుట. نظرگاہ -గాహ్ (పా) నాటకశాల, దర్శనశాల, ప్రదర్శన స్థానము. نظرگاہ عام -గాహెఆమ్ (పా) సార్వజనిక నాటకశాల. نظرگزر -గుజేర్ (పా) దృష్టి, త్రొక్కిడి, సోకు, నీడ. نظرگزرکا -గుజేర్‌కా (ఉ) దృష్టిపరిహారము, దృష్టిదోషము పోవుటకై దిగదుడచినది. نظرمارنا -మార్నా (ఉ) కన్నుకొట్టుట, కన్నుసన్న చేయుట, కనుగీటుట. نظرلگنا -లగ్నా (ఉ) దృష్టి తగులుట, దృష్టిదోషము తగులుట. نظرملانا -మిలానా (ఉ) కన్నులుకలుపుట, చూపుకలుపుట; సరిపోల్చుట, పోల్చిచూచుట. نظرمیں سمانا -మేఁసమానా (ఉ) దృష్టికిచాలియుండుట, దృష్టికిఆటియుండుట, చూపునకు ఆటియుండుట. نظرمیں کھٹکنا -మేఁఖటక్నా (ఉ) దృష్టిలోకంటకగించుచుండుట, కంటకముగా నుండుట.

نظران నజ్రాన్ (అ. స్త్రీ) ఈక్షణము, దృష్టి, చూపు.

نظم నజ్మ్ (అ. స్త్రీ) పూసలు మొ॥ నవికూర్చుట, కూర్పు, దండ, హారము; కట్టుదిట్టము, క్రమము, వరుస, ఏర్పాటు, పరిపాలనము, ప్రభుత్వము, పాలనము, ఏలుట, పరిపాలనాపద్ధతి; పద్యము, కవనము.

نظم ونسق -ఒ,నస్క్ (అ) పరిపాలనము, గట్టుములు.

نظمی నజ్మీ (అ.పు) కవీశ్వరుడు, కవి, రచయిత, రచియించువాడు.

نظیر నజీర్ (అ. స్త్రీ) సామ్యము, పూర్వసామ్యము, ఉదాహరణము; దృష్టాంతము, మాదిరి, సాటిది, ప్రతి, సాటువ.

نظیف నజీఫ్ (అ) పవిత్రమైన, నిషిద్ధముకాని, శాస్త్రీయమైన, యోగ్యమైన, అర్హమైన.

نعال నిఆల్ (అ. స్త్రీ) లాడెములు, గుఱ్ఱముగిట్టలకువేయుఇనుపవంకలు, నాలములు, ఇనుపవంకలు (ఏ.వ نعل).

نعت నఅత్ (అ. స్త్రీ) స్తోత్రము, శ్లాఘనం, పొగడుట, మహమ్మదుగారియొక్క స్తోత్రము.

نعرہ నఅర (అ.పు) ధ్వానము, అరపు, ధ్వని, కేక, బొబ్బ, జయధ్వానము, అల్లరి, కల్లోలము, (బాధచే) బొబ్బలు. نعرہ زن کش -జిన్-కష్ - కేకలువేయువాడు.

نعش నఅష్ (అ. స్త్రీ) శవవాహనము. పాడె, بنات النعش బినాతున్నఅష్ (అ) సప్తఋషులు (చుక్కలు).

نعل నఅల్ (అ. స్త్రీ) పాదరక్షలు, కొయ్యచెప్పులు, పాదరక్షలకుగాని గుఱ్ఱముగిట్టలకుగాని కొట్టుఇనుపవంకి, ఇనుపవంకు, ఇనుపవంక; (సామంతరాజులుఇచ్చెడు) కప్పము, కత్తిఒరయొక్క కొనపొన్ను, (జూదరులు జూదపుఇంటివానికిచ్చు) బాడుగ. نعل بندی -బందీ (పా) కప్పము, సామంతరాజులిచ్చుపన్ను, లాడెములుకొట్టుట లేక కట్టుట. نعل بہا -బహా (పా) కప్పము. نعل درآتش -దర్ ఆతిష్ (పా) తల్లడిల్లుచుండు, అడలు

**نفاست** నఫాసత్ (అ.స్త్రీ) స్వచ్ఛత,నిర్మలత, శ్రేష్ఠత.

**نفاط** నఫాత్ (అ.పు) మట్టితైలము.

**نفاق** నిఫాక్ (అ.పు) కపటము, మోసము, పగ, విరోధము, స్పర్థ, అసమాధానము.

**نفایس** నఫాయిస్ (అ.స్త్రీ) స్వచ్ఛమైన వస్తువులు, పరిశుభ్రవస్తువులు, ఉత్తమ పదార్థములు, అమూల్య పదార్థములు; (ఏ. వ نفیس).

**نفت** నఫ్త్ (పా.పు) మట్టి తైలము.

**نفاذ** నఫ్‌జ్ (అ.పు) దూరుట,వెడలుట, ప్రచారము, వ్యాపనము.

**نفته** నఫ్త (ఉ.పు) నల్లపాడల తెల్ల పావురము, పాడల పావురము.

**نفحه** నఫ్‌హా (అ.స్త్రీ) సుగంధము, మంచి వాసన.

**نفحات** నఫ్‌హాత్ (అ.స్త్రీ) సుగంధము, సుగంధవాయువులు; (ఏ.వ نفحه)

**نفخ** నఫఖ్ (అ.పు) కడుపుబ్బరించుట, కడుపుబ్బరింత(వాయువుచేత).

**نفر** నఫర్ (అ.పు) మనుష్యుల చిన్నగుంపు, గుత్తపువాడు, పనివాడు, కూలివాడు, బంటు, ఒక్కమనిషి, ఒక్కడు.

**نفرت** ని(న)ఫ్‌రత్ (అ. స్త్రీ) అసహ్యాత, అసహ్యము, రోత, వెగటు, అయిష్టము, భయము. **نفرت انگیز** -అంగేజ్ (పా) అసహ్యకరము. **نفرت کھانا** -ఖానా (ఉ) అసహ్యపడుట,

**نفری** నఫరీ (ఉ.స్త్రీ) కూలి, దినబత్తెము, దినకూలి, దినముపని, ఒకమనిషి ఒకనాటి పని, ఒకమనిషిపని.

**نفرین** నఫ్‌రీన్(పా.స్త్రీ) శపించుట,తిట్టుట, ధిక్కారము, అసహ్యము.

**نفس** నఫ్‌స్ (అ.పు) ఊపిరి, ప్రాణము, శ్వాసము, క్షణము,జీవము,ఆత్మ, ప్రకృతి, దేహము, స్వభావము, నైజము, సత్తు, మూలము, అస్తిత్వము, వస్తువు, సారము, సారాంశము, యాదార్థ్యము, సత్యము, అసూయ, పగ, స్వప్రయోజనము, అహంకారము, గర్వము, సుఖము,భోగము, కామము, ఇంద్రియలోలత, కామాదులు, భోగేచ్ఛ. సంసారము. **نفس الامر** నఫ్‌స్-ఉల్-అమర్ (అ) వస్తుతత్వము, మూలతత్వము, మూలవస్తువు, సారాంశము,యాదార్థ్యము. **نفس اماره** -అమ్మార(అ) సంసారమోహము, కామము. **نفس بہیمی** -బహీమీ (అ) కామోద్రేకము, పశుధర్మము. **نفس پرست - پرور** -పరస్త్-పర్వర్ (పా) ఇంద్రియలోలుడు. **نفس پرستی - پروری** -పరస్తీ-పర్వరీ (పా) ఇంద్రియలోలత్వము. **نفس کش** -కుష్ (పా) ఇంద్రియనిగ్రహము చేయువాడు. **نفس کشی** -కుషీ (పా) ఇంద్రియ నిగ్రహము. **نفس مطلب** -మత్లబ్ (అ)మూలము, సారాంశము. కావలసిన విషయము. **نفس مطمینه** -ముత్‌మయిన (అ) ధర్మగుణము, ఉదారగుణము. **نفس ملہمه** -ముల్‌హిమ (అ) అంతరాత్మ. **نفس**

ناطقہ -ఎ,నాతిక (అ) మానవాత్మ, సర్వాధికార ప్రతినిధి, సర్వస్వాతంత్ర్యము గలవాడు. **نفس نبا تی** -ఎ,నబాతీ- వృక్షాంతరాత్మ. **نفس نفیس** -నఫీస్ (అ) అమూల్యాత్మ. కేవలాత్మ, కేవలుడు, శుద్ధాత్మ, స్వతంత్రుడు, ముక్తుడు, మహాత్ముడు, మహా పురుషుడు, దేవరవారు.

**نفسا نفسی** నఫ్సానఫ్సీ (అ) ఎవరిపని వారు చేసుకొనుట, స్వప్రయోజనపరత్వము. **نفس وا نپس** -పవాసీస్ (పా) ప్రాణోత్క్రమణము, ఎగఊశ్వాసము.

**نفسا نیت** నఫ్సానియత్ (అ.స్త్రీ) స్వప్రయోజనపరత్వము, అహంకారము, ఇంద్రియలౌల్యము, గర్వము.

**نفط** నఫ్త్ (అ.పు) మట్టి తైలము, తుపాకి మందు.

**نفع** నఫ (అ.పు) లాభము, వడ్డి, ప్రాప్తి, ఆదాయము, ఫలము, ప్రయోజనము. **نفع اُٹھا نا** -ఉఠానా (ఉ) లాభము పొందుట. **نفع رساں** -రసాం (పా) లాభదాయకము, లాభకరము. **نفع کرنا** -కర్నా (ఉ) లాభముపొందుట, లాభము చేయుట. **نفع نقصان** -నుక్సాన్ (అ) లాభ నష్టములు.

**نفقہ** నఫ్(ఫ)క (అ.పు) జీవనపు వ్యయము, భృతి, భరణము, జీవనార్థము.

**نفل** నఫల్ (అ.పు) దోపిడి, కొల్ల గొట్టుట, దోచుట.

**نفل** నఫ్ల్ (అ.పు) మతము విధించని సత్కార్యము, కామ్యకర్మము.

**نفوخ** నుఫూక్ (అ.పు) సున్నితమైన మందును ముక్కు గుండ చొనుపుట లేక ఎక్కించుట, పీల్పించుట.

**نفوذ** నుఫూజ్ (అ.పు) దూరుట, వెడలుట, ప్రచారమగుట, వ్యాపించుట, చొరుట, ప్రకటమగుట, (ఆజ్ఞ)అగుట.

**نفو** నుఫూ (అ.పు) అసహ్యత, గర్హ్యత, పరుగుట, పోగుట, పలాయనము, మీరుదల, ఉబ్బు.

**نفوس** నుఫూస్ (అ.పు) ఆత్మలు, జీవులు, **نفوس ثلاثہ** -సలాస(అ) వర్గత్రయము (జీవవర్గము, పృథు వర్గము, ధాతువర్గము). **نفوس قدسیہ** -కుద్సియ (అ) మహాత్ములు, మహాపురుషులు. **نفس لوامہ** -లవ్వామ (అ.పు)పశ్చాత్తాపపడు ఆత్మలు. **نفس امارہ** -అమ్మార- చెడు పనులు చేయించుఆత్మ. **نفس مطمینہ** -ముత్మయిన- కనికరము దయగల ఆత్మ.

**نفی** నఫీ (అ) నిషేధము, నిరాయింపు,నిరాకరణము,వ్యతిరేకము. **نفی میں جواب دینا** -మేం జవాబ్ దేనా(ఉ) వ్యతిరేక ప్రత్యుత్తరమిచ్చుట, లేదనుట, కాదనుట, నాకరించుట.

**نفیر** నఫీర్ (అ.స్త్రీ) సొన్నాయి, తుత్తూర (వాద్యము); అసహ్యపడువాడు, దుఃఖము, గోడు, రోదనము.

**نفیس** నఫీస్ (అ) విలువగల,అమూల్యమైన,

శ్రేష్ఠమైన, సున్నితమైన, పరిశుభ్రమైన, స్వచ్ఛమైన, నిర్మలమైన.

نقا నకా (అ.పు) పవిత్రత, పరిశుభ్రత, నిర్మలత, సద్గుణముగల, మంచి.

نقاب ని(న)కాబ్ (అ.పు) ముఖ వస్త్రము, ముసుకు.

نقاد నక్కాద్ (అ.పు) నాణెములు పరీక్షించువాడు, పరీక్షకుడు.

نقارچی నక్కార్చీ (అ) మార్దంగికుడు, భేరివాయించువాడు, నగారావాయించువాడు.

نقارخانہ నక్కార్ఖాన (అ.పు) వాద్యశాల, నగారావాయించుచోటు.

نقارہ నక్కార (అ.పు) భేరి, మృదంగము, نقارہ بجاکے کی چوٹ -బజాకె -కీ చోట్ (ఉ) డంకగొట్టి, రాద్ధాంతముగా, బహిరంగముగా. نقارہ بجاتے پھرنا -బజాతే ఫిర్నా(ఉ)చాటించుచు తిరుగుట, చాటించుట.

نقاری నక్కారీ (అ.పు) మార్దంగికుడు, భేరీ వాయించువాడు.

نقاش నక్కాష్ (అ) శిల్పి, చిత్రపటములు వ్రాయుట మొదలుగాగలపనులు చేయువాడు, చెక్కడపుపనివాడు, రంగరి, చిత్రకారుడు, చిత్రలేఖరి, అద్దకపు పనివాడు.

نقاشی నక్కాషీ (అ. స్త్రీ) శిల్పపని, శిల్పము, చిత్రలేఖనము, రంగరిపని, అద్దకము, చిత్రకారము, పటములువ్రాయుట.

نقاط నికాత్ (అ.పు) బిందువులు, చుక్కలు; (ఏ.వ نقطہ).

نقال నక్కాల్ (అ.పు) నటుడు, హాస్యకారుడు, బహురూపులవాడు; భటరాజు, భట్టువాడు.

نقالن నక్కాలన్ (అ.స్త్రీ) నటి, ఆటకత్తె, హాస్యకత్తె; బట్టుది, భట్టుది.

نقالی నక్కాలీ (అ. స్త్రీ) హాస్యము, బట్టుతనము, భటరాజుతనము.

نقاوت నకావత్ (అ.స్త్రీ) పవిత్రత, పరిశుభ్రత, పావనత, ఉత్తమభాగము.

نقاہت నకాహత్ (అ. స్త్రీ) దౌర్బల్యము, అశక్తత, నిశ్శక్తత, నిస్త్రాణ.

نقب నక్బ్ (అ.స్త్రీ) కన్నము, గోడలో త్రవ్వి చేసిన సందు, సొరంగము, కన్నపు కోల(త్రవ్వునది). نقب زنی -జనీ(పా) కన్నము వేయుట.

نقد నక్ద్ (అ) దృష్టినిలిపి దేనినైనచూచుట, ఏరితీయుట, ఏర్పరించుట; సన్నిద్ధత, సాన్నిధ్యము, ఉన్నది; నాణెములపరీక్ష, నాణెములు, రొక్కము; ప్రస్తుతము, సద్యస్కాలము; అల్లుకు; మూలము, సంచి కట్టు, చేతిడబ్బు; శ్రేష్ఠమైన, ఖండితమైన, కలపటములేని. نقد ا نقد -ఆనక్ద్- రొక్కము, చేజేత, అప్పటికప్పుడె, తత్క్షణము. نقد جان -జాన్(పా)జీవాత్మ. نقد دم رہنا -దమ్ రహ్నా (ఉ)బ్రహ్మచారిగానుండుట, అస్ఖలితుడుగా నుండుట. نقد روان -ఎ, రవాఁ (పా)

వాడుకనాణెము, చెల్లుబడినాణెము. **نقد مال** -మాల్ (అ) మంచిసొమ్ము,కలసటు లేనిది. **نقد و جنس** -వజిన్స్ (అ) ధన ధాన్యములు, ధనద్రవ్యాదులు,ఆస్తి,సొత్తు.

**نقدی** నక్దీ (అ.స్త్రీ) రూకలు, రొక్కములు, డబ్బు, నాణెములు,రూపాయలు.

**نقرس** నిక్రిస్ (అ.పు) వాతరోగము,కాలి బొటనవేళ్లులు మొదలుగా చిన్న కీళ్లవాతపు నొప్పులు.

**نقرہ** నుక్రహ (అ.పు) వెండి, రజితము,రౌప్యము, రజితవర్ణము, గుఱ్ఱముల తెల్లవన్నె.

**نقری** నుక్రై (అ) వెండి (సంబంధమైన), రజిత సం॥, రౌప్యము, రజిత వర్ణముగల (గుఱ్ఱము).

**نقش** నక్ష్ (అ.పు) శిల్పము, చిత్తరువు, చిత్రము, పటము, రూపము, బొమ్మ, ఆకారము, అచ్చు, ముద్రణము, అద్దకము, చెక్కడము, జాడ, గురుతు, వ్రాత, గుణము, మంత్రము, చేతబడి, రూప్యము, నాణెము, ఒకరాగము, ఒకచిల్లాట. **نقش آب . بر آب** -ఆబ్-బర్ఆబ్(పా) నీళ్లమీదివ్రాత, అస్థిరము, క్షణభంగురము. **نقش بر دیوار**-బర్‌దీవార్(పా)గోడ చిత్తరువు, గోడమీదవ్రాసిన బొమ్మవలె నున్నది, కాపడినవాడు, నిశ్చేష్టితుడు, భ్రమపడినవాడు. **نقش بند** -బంద్ (పా) చిత్రకారుడు, చిత్రలేఖరి. **نقش بندی** -బందీ (పా) చిత్రకారము, చిత్రలేఖనము. **نقش پا۔قدم** -పా-కదమ్ (పా) అడుగులజాడ, అడుగులు, కాలిగురుతులు. **نقش تسخیر** -తస్‌ఖీర్ (అ) వశీకరణమంత్రము, ఒకరినితనవశము చేయునది. **نقش حب** -హుబ్(అ)మోహనమంత్రము, ఒకరిని మోహింపజేయునది. **نقش کرنا** -కర్నా (ఉ) (పటములుబొమ్మలుమొ॥నవి) చెక్కుట,వ్రాయుట, లిఖించుట, గీయుట, నిర్మించుట. **نقش کالنجر** -కల్‌హజర్ (అ) శిలాక్షరము, శిలాలేఖ, శాశ్వతము. **نقش و نگار** -ఒనిగార్ (పా) చిత్రలేఖనము, అలంకరణము, బొమ్మలు, పటములు,చిత్రములు. **نقش ہونا** -హోనా (ఉ) చిత్రింపబడుట, (వ్రాయు చెక్కు నిర్మింప)బడుట.

**نقشہ** నక్షహ (అ.పు) శిల్పము, పటము,చిత్రము, రూపము,ఆకారము,బొమ్మ, అచ్చు, ముద్ర, ముద్రణము, వ్రాత, అద్దకము, మచ్చు, మాదిరి, చెక్కడము, గురుతు, పద్ధతి, రీతి, వైఖరి, సామ్యము, పోలిక. **نقشہ نویس** -నవీస్ (పా)చిత్రలేఖరి.

**نقشی** నక్షీ (అ.పు) పనితనముగలది, చెక్కడముగలది.

**نقشین** నక్షీన్ (పా) చెక్కడముచేసినది, చిత్రించినది, పనితనముగలది.

**نقص** న(ను)క్స్ (అ.పు)లోపము, న్యూనత, పొద్దు, దోషము, నష్టము, కొరత. **نقص جسمانی** -జిస్మానీ - అంగవైకల్యము.

**نقصان** నుక్సాన్ (అ) నష్టము, నాశము, న్యూనత, లోపము, అపకారము. **نقصان بھرنا** -భర్నా - నష్టపూర్తిచేయుట.

**نقط** నుకత్ (అ.పు) బిందువులు, చుక్కలు, బొట్లు (ఏ.వ نقطہ).

**نقطہ** నుక్త (అ.పు) బిందువు,చుక్క,బొట్టు, పొడ్డు,దోషము. **نقطہ اعتدال ربیعی** -యెఇ౽తిదాల్ రబీఈ (అ) ఉత్తరాయణ సంక్రమణము. **نقطہ اعتدال خریفی** -యెఇ౽తిదాల్ ఖరీఫీ (అ) దక్షిణాయనసంక్రమనము.

**نقل** నుకల్ (అ.పు) తినుబండము, పెండ్లి కుమరితకుబంపుసారెలు. **نقل مجلس نقل محفل** -మజ్లిస్- మహాఫిల్- సభావినోది, నవ్వులమూట, రసికుడు, చమత్కారి.

**نقل** నకల్ (అ.స్త్రీ) చాలనము, ఎత్తుకపోవుట, ఒకచోటినుండి ఇంకొకచోటికి గొనిపోవుట, చలనము,కదలిక, ప్రయాణము, యాత్ర, సమయస్ఫూర్తి, సమయోచితబుద్ధి, ప్రతి, ఎత్తివ్రాసినది, చూచివ్రాసినది, ప్రతిలేఖ. చిత్రకథ, కట్టుకథ, కథ, ఇతిహాసము, బహురూపులయాట, వేషము, అనుకరణము, ఒకరుచేసినట్లు చేయుట, త్యాగము, విడుచుట. **نقل کرنا** -కర్నా (ఉ) అనుకరించుట. ఒకరు చేసినట్లు చేయుట, వేషమువేయుట, ఆడుట, కథచెప్పుట, చోటువిడిచిపోవుట, స్థానమువదలుట, ప్రతివ్రాయుట, చూచివ్రాయుట, ఎత్తివ్రాయుట. **نقل النقل** - ఉల్ నకల్(అ) ప్రతికిప్రతి. రెండవప్రతి. **نقل مذہب** -ఎ,మజ్హబ్ (అ) మతాంతరప్రవేశము, తనమతమునువిడచి అన్యమతమునుస్వీకరించుట. **نقل مقام** -ఎ, మకామ్ (అ) స్థానచలనము, ప్రయాణము. **نقل مکان** -ఎ, మకాన్ (అ) పరస్థానము, నిర్గమము, ఇల్లువిడుచుట, దేహత్యాగము, దేహాంతరప్రాప్తి. **نقل نویس** - నవీస్ (పా) ప్రతిలేఖరి. **نقل نویسی** -నవీసీ (పా) ప్రతిలేఖనము.

**نقلی** నక్లీ(అ) ప్రతిరూపమైన,కల్పితమైన, ఇతిహాసికమైన, కథికుడు, ఇతిహాసికుడు.

**نقلیات** నక్లియాత్(అ.స్త్రీ)కథలు,చిత్రకథలు, హాస్యములు, వేషములు, ఆటలు.

**نقمت** నిక్మత్-నకిమత్ (అ స్త్రీ) ప్రతీకారము, శిక్ష,పాపఫలము,పగ,విరోధము.

**نقود** నుకూద్ (అ. స్త్రీ) రొక్కములు చూడు (ఏ.వ **نقد**).

**نقوش** నుకూష్ (అ.పు) పటములు, చూడు (ఏ.వ **نقش**).

**نقوع** నకూ౽ (అ.పు) నీళ్లలోవేసినపండ్లు, నీళ్లలోవేసినమందు, మందునానిననీళ్లు.

**نقول** నుకూల్(అ.స్త్రీ) ప్రతులు, చూడు (ఏ.వ **نقل**).

**نقی** నకీ(అ) స్వచ్ఛమైన, నిర్మలమైన, కలపటములేని, శ్వేతమైన.

**نقیب** నకీబ్ (అ.పు) నాయకుడు, పెద్ద; వైతాళికుడు, భట్రాజు, బట్టువాడు, సుద్దులవాడు; ప్రకాశకుడు,ప్రకటించువాడు, చాటించువాడు,పొగుడువాడు; వేత్రధారుడు, ద్వారపాలకుడు; త్రాసుముల్లు.

**نقیر** నకీర్ (అ) అల్పము. తుచ్ఛము. **نقیر و قطمیر** -కత్మీర్- చిన్నపెద్దలు, నీచులుఘనులు.

**نقیض** నకీజ్ (అ) విరుద్ధము, విపరీతము, వ్యతిరేకము, పూర్వపక్షము,ప్రతికూలము,

کے پر نکلنا -పరింద్ కే బచ్చోఁకేపర్- (హి) పక్షిపిల్లలకు రెక్కలు వచ్చుట. حساب نکالنا హిసాబ్-(ఉ) లెక్కలుచేయుట, తీయుట. جانور کے بچے نکالنا-జాన్వర్ కేబచ్చే- (హి) పశువులుపిల్లలఈనుట, కుక్కలు మొ॥నవి పిల్లలపెట్టుట, ఈనుట. عداوت نکالنا అదావత్ - (ఉ) పగతీర్చుకొనుట.

نکانا నికానా (హి) కలుపుతీయించుట, గడ్డిగాదము తీయించుట.

نکبت నక్బత్ (హి. స్త్రీ) దురదృష్టము, దౌర్భాగ్యము, పేదరికము, నైచ్యము, నీచము.

نکته నుక్త (అ.పు) సూక్ష్మాంశము, విశేషాంశము. గూఢార్థము, గుట్టు, స్వారస్యము, విశేషము, సూక్ష్మవిషయము, అభిప్రాయవిశేషము, సూక్ష్మార్థము, వ్యంగ్యము, సుభాషితము, లోపము, సొడ్డు, న్యూనత. نکته بین - چیں - گیر -బీన్-చీఁ-గీర్ (పా) రంధ్రాన్వేషి, తప్పులువెదకువాడు, లోపములెంకనిపెట్టువాడు, విమర్శకుడు. نکته خفی -ఖఫీ (అ) గూఢార్థము. نکته دان - رس - سنج - شناس -దాన్-రస్-సంజ్-షినాస్- విశేషజ్ఞుడు, రసజ్ఞుడు, శ్లేషజ్ఞుడు, సూక్ష్మజ్ఞుడు, వ్యంగ్యగ్రాహి. نکته سنجی -సంజీ- మాటనేర్పు, వాక్చాతుర్యము.

نکتی నుక్తీ (ఉ.స్త్రీ) ఒకతినుబండము.

نکٹ నికట్ (హి) నికటము, దగ్గర.

نکٹا నక్టా (హి) ముక్కిడి, ముక్కుతెగిన, సిగ్గుమాలిన; ఒకపాట; ఒకఆటగవ్వ; ఒకపక్షి.

نک چڑھا నక్చఢా (హి) ముక్కు(ముఖము) చిట్లించుకొనియుండుట, ముంగోపి, చిఱ్ఱుబుఱ్ఱులాడు.

نکر నక్ర్ (అ) తెలివిగల, చతురతగల, నేర్పుగల.

نکره నకిర (అ.పు) అనిర్దిష్టము, జాతివాచకము (వ్యాకరణము).

نکڑ నకడ్ (హి.పు) మొన, కొన, మూల, కోణము.

نکس నుక్స్ (అ.పు) వ్యాధితిరుగబడుట, రోగముమరలవచ్చుట.

نکسیر నక్సీర్ (హి.పు) ముక్కున నెత్తురుపడుట (వ్యాధి), ముక్కునరములు. نکسیر پھوٹنا-ఫూట్నా (ఉ) ముక్కున నెత్తురుపడుట.

نکل چلنا నికల్‌చల్నా (హి) మీరుట, దాటుట, మించుట, జింకములుకొట్టు, తప్పించుకొనిపోవుట.

نکلنا నికల్నా (హి) వెడలుట, బయలుదేరుట, వెడలిపోవుట, బయలుపడుట, తేలుట, కలుగుట, ప్రచురమగుట, బయటవచ్చుట, వచ్చుట, చేయబడుట, ముగియుట, చక్కబడుట, అగుట, నెరవేరుట; తీరుమానమగుట, రావలసి యుండుట, మీరియుండుట, జరుగుట, సవరణపడుట.

نکلوانا నికల్వానా (హి) వెడలదీయించుట, తీయించుట; ప్రచురముచేయించుట, బయటదీయించుట, వెడలగొట్టించుట, చేయించుట.

نکما నికమ్మా (హి) తుచ్ఛము, పనికిమాలిన, నిష్ప్రయోజకమైన, పనిలేని, ఊరకయున్న, కొలువులేని, పనిలోలేని, వ్యర్థముగానున్న.

**نکو** నికూ-కో (పా) మంచి, మేలైన, ఉపకారమైన, సాత్వికమైన. **نکوکام** -కామ్ (పా) సత్కార్యము. **نکونام** -నామ్ (పా) మంచిపేరు, ప్రఖ్యాతి.

**نکوا** నకుఆ (హి) ముక్కు మొన, నాశికాగ్రము, బెజ్జము, రంధ్రము.

**نکوہش** నికూహిష్ (పా. స్త్రీ) దూషణము, చీవాట్లు, బెదరింపు, తిరస్కారము, నిరసనము.

**نکوئی** నికూయీ (పా. స్త్రీ) మేలు, ఉపకారము, మంచి, అనుగ్రహము.

**نکھ** నఖ్ (హి. పు) నఖము, గోరు; ఒక మందువస్తువు; పట్టులో ఒకవిధము,

**نکھاد** నిఖాద్ (హి. పు) నిషాదస్వరము, రెండవస్వరము.

**نکھارنا** నిఖార్నా (హి) శుభ్రపరచుట, నిర్మలముచేయుట, వడపోయుట, కడుగుట.

**نکہت** ని(న)క్హత్ (అ. స్త్రీ) సుగంధము, సువాసన.

**نکھرنا** నిఖర్నా (హి) శుభ్రపరచుట, నిర్మలమగుట, స్వచ్ఛమగుట. శోభిల్లుట, శృంగారముగానుండుట.

**نکی** నక్కీ (హి. స్త్రీ) ముక్కుమాటాడువాడు, ఆటగవ్వ, ఒంటిచుక్క (ఆటచీటి లేక పాచిక), ఒక జూదము. **نکی دوا** -దువ్వా - ఒకజూదము, గవ్వలాట. **نکی موتھ** -మూఠ్- ఒకజూదపుఆట.

**نکیر** నకీర్ (అ. పు) మృతులైనవారితో ప్రశ్నోత్తరములుచేసి పరీక్షచేయు దేవతలిద్దరిలో (మున్కిరు-నకీరు) ఒకరిపేరు.

**نکیل** నకీల్ (హి. స్త్రీ) త్రాడుకట్టుటకై ఒంటెముక్కుకు వేసియుండు ఇనుపకడియము లేక కొయ్యఉంగరము, ముక్కుఉంగరము, ముగుత్రాటియుంగరము.

**نکیلا** నుకీలా (హి) మొనగల, కూచిగానున్న, అందమైన, నీటైన, ఒయారమైన.

**نکیلاپن** నుకీలాపన్ (హి. పు) నీటు, ఒయారము, అందము.

**نگ** నగ్ (హి. పు) ఉంగరపురాయి, పర్వతము, రత్నము, చెక్కడపుపనిగల. **نگ کی چڑیاں** -కీ చుడియాఁ- రాళ్లుచెక్కిన గాజులు.

**نگار** నిగార్ (పా) చిత్రలేఖనము, చిత్రకారము, పటము, చిత్తరువు, చిత్రము, రూపము, ఆకారము, అలంకారము, అందగాడు, అందగత్తె, ప్రియురాలు, శృంగారము, వ్రాత, లేఖనము. **نگار آلودہ** -ఆలూద (పా) చిత్రింపబడిన, చిత్తరువుబొమ్మవలెనున్న, అందమైన, సుందరమైన. **نگارخانہ - نگارستان** -ఖాన-స్తాన్ (పా) చిత్రశాల.

**نگارش** నిగారిష్ (పా. స్త్రీ) వ్రాత, లేఖనము, వ్రాయుట, చిత్రలేఖనము.

**نگاری** నిగారీ (పా. స్త్రీ) చిత్రలేఖనము చిత్తరువు.

**نگارین** నిగారీన్ (పా. స్త్రీ) మైదాకు చిత్తరువులుగల, శృంగారితమైనది, అందగత్తె, ప్రియురాలు.

**نگالی** నిగాలీ (హి. స్త్రీ) చిన్న హుక్కానాళము, వెదురునాళము.

**نگاہ** నిగాహ్ (పా. స్త్రీ) దృష్టి, చూపు, ముఖవైఖరి, అనుగ్రహము, జ్ఞాపకము, కన్ను, జాగ్రతి, కాపుదల, ఆశ, అభిలాష, బంది, కట్టు. **نگاہ بان** -బాన్ (పా)

కాపరి, రక్షకుడు. نگاہ بانی - دار
ی - బానీ-దార్-దాష్త్ (పా) కాపుదల, రక్షణము, చూచుచుండుట, పైవిచారణ, సంరక్షణ. نگاہ بد -బద్ (పా) దృష్టిదోషము. نگاہ لڑانا - లడానా (ఉ) వలపుచూపులు చూచుట, ఒయారముగా చూచుట, కడగంటచూచుట. نگاہ ملانا -మిలానా(ఉ) ఎదురు బడిచూచుట, తేరిచూచుట.

نگر నగర్ (హి.పు) నగరము, పట్టణము. نگر نایک -నాయక్ (హి) భట్రాజులనాయకుడు.

نگر నిగర్ (హి) భారమైన, గట్టి, నిండిన.

نگران నిగ్రాన్ (పా) చూచుచున్న, కనిపెట్టియున్న, కాపుదలచేయుచున్న. نگران کار -ఎ కార్ (పా) పని చూచుచుండువాడు.

نگرانی నిగ్రానీ (పా. స్త్రీ) పైవిచారణ చూచుచుండుట, కాపుదల, రక్షణము, కనిపెట్టియుండుట, నిర్వాహము.

نگفتہ నుగుఫ్త (పా) అనుక్తము, చెప్పని, చెప్పబడని.

نگلنا నిగల్నా (హి) మ్రింగుట, దిగమ్రింగుట.

نگند నిగండ్ (హి.పు) ఓషధిభేదము.

نگندہ నిగంద (పా.పు) దూరకుట్టు, కుట్లు, దూరదూరముగా వేసినకుట్లు, దూరపుకుట్టు.

نگوڑا నిగోడా (హి.పు) కాళ్లులేనివాడు, వికలాంగుడు, దౌర్భాగ్యుడు, దిక్కుమాలినవాడు, نگوڑا ناتھا -నాతా - పెండ్లిపేరంటము లేనివాడు, వెనుకముందు లేనివాడు, దిక్కుమాలినవాడు.

نگوں నిగూం (పా) విపరీతమైన, తలక్రిందైన, బోరగిలియున్న, విరుద్ధమైన, రహితమైన. نگوں بخت -బఖ్త్ (పా) అదృష్టహీనుడు, దౌర్భాగ్యుడు. نگوں ہمت -హిమ్మత్ - ధైర్యరహితుడు, ధైర్యముచెడినవాడు.

نگہ నిగహ్ (పా) చూడు نگاہ అనుపదము. نگہبانی نگاہ بانی -బానీ-చూడు

نگین - نگینہ నగీన్ - నగీన (పా.పు) ముద్దుటుంగరము, ఉంగరములోని రాయి, ఉంగరపురాయి కుదురు, వెలగలరాయి, రత్నము; ఉచితమైన, యోగ్యమైన, అనుగుణ్యమైన, ఒప్పిదమైన, సరిపడియున్న, అతికినట్టున్న, అద్దినట్లున్న, చక్కగాచెక్కబడిన, చక్కగాదాపిన. نگینہ جڑنا -జుడ్నా (ఉ) రత్నములుదాపుట, రాళ్లు కట్టుట, రాయికట్టుట లేక తాపుట. نگینہ سا -సా (పా) రత్నమువలెనున్న, చక్కవలెనున్న, ముద్దుగానున్న. نگینہ ساز - گر -సాజ్-గర్ (పా) రత్నములుచెక్కువాడు.

نل నల్ (హి.పు) నాళము, గొట్టము, తూము, గూన, బొద్దునాళము, నరము. نل چلانا -చలానా (ఉ) దొంగనుపట్టుటకు యంత్రమువేయుట. نل کا پانی పానీ కా- (ఉ) కొళాయి.

نلا నలా (హి.పు) గర్భనాళము, మూత్రనాళము, కాలియెముక, పిక్కయెముక, నరము.

نلانا నలానా (హి) కలుపుతీయించుట, గడ్డిగాదముతీయించుట.

نلائی నలాయీ (హి. స్త్రీ) కలుపుకూలి, కలుపు (తీయుపని).

**نلوا** నల్వా (హి.పు) చిన్న నాళము, చిన్న గొట్టము.

**نلوانا** నల్వానా (హి) వాడు **نلانا**

**نلوائی** నల్వాయీ (హి) చేయడు **نلائی**

**نلوہ** నల్వ (హి) శుభ్రమైన, నిర్మలమైన, శుభ్రముగా, స్వచ్ఛముగా, బొత్తిగా, సాంతము.

**نلی** నలీ (హి.స్త్రీ) నాళము, గొట్టము, గర్భనాళము, మూత్రనాళము, శ్వాసనాళము, తుపాకినాళము, నాడె, పిక్కయెముక, కాలియెముక.

**نلیا** నల్యా (హి.పు) పిట్టలగొట్టువాడు, చిన్న నాళము, చిన్న గొట్టము.

**نم** నమ్ (పా.పు) తడి, పదను, చెమ్మ, తడియైన, పదను(తడి)గల, తడిగానున్న, పదనుగానున్న, చెమ్మగల; మంచు, తడి, కన్నీరు, కంటితడి. **نم خوردہ-نم رسیدہ** -ఖుర్ద-దీద-రసీద(పా) చివికిన, తడిసి చెడిన, తడిగొన్న, చెమ్మగిలిన. **نم دیدہ** -దీద (పా) కంటతడిపెట్టికొన్న, కంటతడిగల లేక నీరుగల, ఏడ్చుచున్న. **نمناک** -నాక్ (పా) తడిగల, చెమ్మగల, తడిసిన, తడిగానున్న. **نمناکی** -నాకీ (పా) చెమ్మదనము, తడి, పదను.

**نما** న(ను)మా (పా) చూపునది, దర్శకము, (సమాసములలో).

**نماز** నమాజ్ (పా.స్త్రీ) ప్రార్థన, నమనము, విధేయత, వందనము, ఈశ్వరప్రార్థన, మహమ్మదీయుల ఈశ్వరప్రార్థన, భక్తి. **نماز استسقا** -ఇస్తిసకా (పా.అ.స్త్రీ) వర్షమునకై ప్రార్థన, వర్షము పడుటకై చేయు ఈశ్వరప్రార్థన. **نماز پڑھنا-کرنا** -పఢ్నా-కర్నా (హి) ప్రార్థన చేయుట. **نماز خسوف** -ఖుసూఫ్ (పా.అ.స్త్రీ) చంద్రగ్రహణ కాలపు నమాజు. **نماز خفتن - عشا** -ఎ,ఖుఫ్తన్ -ఎ,ఇషా (పా) రాత్రిపరుండబోవునప్పటి నమాజు. **نماز دیگر - عصر** -ఎ,దీగర్ -అస్ర్ (పా) నాలుగుగడియల ప్రొద్దుండగా చేయు నమాజు. **نماز قصر** ఎ,కస్ర్ (అ. స్త్రీ) ప్రయాణసమయమున స్వల్పము చేయుచున్నట్టిదైన నమాజు, సంక్షిప్తము. **نماز کسوف** -కుసూఫ్ - సూర్యగ్రహణ కాలపు నమాజు. **نماز گزار** -గుజార్ (పా) ప్రార్థన చేయువాడు, భక్తుడు.

**نمازی** నమాజీ (పా) ఈశ్వరప్రార్థనాపరుడు, భక్తుడు.

**نمام** నమ్మామ్ (అ.పు) కొండెములు చెప్పువాడు, చాడీలు చెప్పువాడు, నిందకుడు, కొండీడు.

**نمائی** నమాయీ (పా. స్త్రీ) ప్రదర్శనము, చూపులు, చూపులు, డంబము, చూపుదల, ఆడంబరము.

**نمایاں** నమాయాన్ (పా) ప్రత్యక్షమైన, ప్రకటమైన, విశదమైన, స్పష్టము, అగపడుచున్నది, డంబిసమైన, బాగా కనుపడుచున్న, పెద్దగానున్న, ప్రకాశమైన.

**نمایش** నుమాయిష్ (పా. స్త్రీ) ప్రదర్శనము, చూపుట, చూపు, చూపుదల, ఆకారము, వైఖరి, ముఖము, కపటము, నటింపు, కల్పితము, డంబము, ఆడంబరము. **نمایشی**

**گاہ** -గాహ్ (పా) ప్రదర్శనశాల, వస్తు ప్రదర్శనశాల.

**نمایشی** సుమాయిషీ (పా) డాంబికమైన, ప్రదర్శకమైన, చూపులకైన.

**نمایندہ** సుమాయింద (పా.పు) ప్రదర్శనము, చూపువాడు.

**نمٹانا** నిమ్‌టానా (హి) తీర్మానముచేయుట, చెల్లించుట,నిక్షేపముచేయుట, ముగించుట, చక్కపెట్టుట, సరిచేయుట.

**نمٹنا** నిమట్నా (హి) ముగియుట, తీరుమానమగుట, విముక్తి కలుగుట, సరిపడుట, చక్కపడుట.

**نمچھا** నిమ్ఛా (హి.పు) మీసములు లేని వాడు, యువకుడు.

**نمدہ - نمدا - نمد** నమ్‌ద్ -నమ్‌దా- నమ్‌ద(పా.పు) ముతకబట్ట,గొంగడిబొంత, బొచ్చుబొంత, బొచ్చుఅడ, ఉన్నిపట్టు, బొచ్చునువడకి నేయకయే అంటుమొ॥ వాని చే అట్టగానొక్కి చేసిన ముతకబట్ట. **نمد زین** -ఎ,జీన్- పల్లము క్రింది ఉన్నిపట్ట లేక బొంత లేక అడ. **نمد مو** -మూ- అడగానున్న వెంట్రుకలుగల, అట్టగట్టిన వెంట్రుకలుగల.

**نمر** నమర్ (అ.పు) చిరుత, చిరుతపులి, సివంగి.

**نمستے** నమస్తే (సం.పు) నమస్కారము (ఆర్యసమాజమువారి వందనము).

**نمسکار** నమస్కార్ (సం.పు) నమస్కారము (ఆర్యులవందనము).

**نمش** నమ్‌ష్ (పా.పు) పాలతోచేసిన ఒక ఉపహారము (తినుబండము).

**نمط** నమత్ (అ.పు) పరుపుచీర, పరుపురేకు, దుప్పటి, బాసుంది, వన్నెపరుపు; రీతి, పద్ధతి, వైఖరి, నడవడిక; చదరంగపు పలక లేక చాకము.

**نمک** నమక్ (పా.పు) లవణము, ఉప్పు, చామనచాయ; అన్నము, రుచి. **نمک بند** -బంద్ (పా) ఉప్పుపోసికట్టిన గాయము. **نمک پاشی کرنا - چھڑکنا** -పాషీ కర్నా -ఛిడక్నా (ఉ) ఉప్పు చల్లుట, బాధించుట, రేపుట. **نمک چشی** -చషీ (పా) అన్నప్రాశనము, శిశువులకు మొదటిసారి అన్నముపెట్టుట; సాచె; వివాహపూర్వము పెండ్లివారు పంపుకొను పిండివంటలు. **نمک چکھنا** -చఖ్నా (ఉ) ఉప్పుచూచుట, శాకపాకాదులలో ఉప్పుసరిగానున్నదిలేనిది చూచుట. **نمک حرام** -హరామ్ (పా) కృతఘ్నుడు, విశ్వాసఘాతకుడు, మేలు మరచువాడు. **نمک حلال** -హలాల్ (పా) కృతజ్ఞుడు, మేలుమరువనివాడు, విశ్వాసపాత్రుడు. **نمکدان** -దాన్ (పా) ఉప్పుకొట్టు, ఉప్పు పాత్ర.

**نمکین** నమ్‌కీన్ (పా) ఉప్పువంటిరుచిగల, ఉప్పు, ఉప్పని; సరసమైన, సారస్యము గల; హాస్యరసముగల,హాస్యాస్పదమైన, పరిహాసకము; తీవ్రమైన, చురుకైన; లావణ్యముగల, అందమైన, మనోజ్ఞమైన.

**نمکینی** నమ్‌కీనీ (పా) ఉప్పదనము, ఉప్పన; లావణ్యము, సౌందర్యము.

**نمل** నమిల్ (అ) చురుకైన, చులకనైన; సిద్ధమైన, అనుకూలమైన;పిపీలికము, చీమ.

**نمو** ను(న)మూ (అ.పు) వృద్ధి, పెరుగుట.

**نمود** నమూద్ (పా. స్త్రీ) దర్శనము, అగపడు, ప్రత్యక్షమగుట, వెలువడుట, ప్రసిద్ధమగుట, ప్రకటమగుట; సూచిక, దర్శకము; ఆకారము, స్వరూపము; గౌరవము, మర్యాద, ప్రఖ్యాతి, ప్రసిద్ధి; ప్రకటితము, ప్రత్యక్షము, ప్రసిద్ధము, ప్రఖ్యాతము. **نمود ہونا** -హోనా (క్రి) ప్రత్యక్షమగుట, ప్రకాశమగుట, అగపడుట, కాన్పించుట. **نمود کرنا** -కర్నా (క్రి) ప్రదర్శించుట, చూపుట. ప్రత్యక్షము జేయుట, వెలిబుచ్చుట.

**نموداری** నమూదారీ (పా. స్త్రీ) ప్రత్యక్షము, ప్రకటన, ప్రకాశము, ప్రత్యక్షమగుట, వెలువడుట, వెలువరింపు.

**نمونہ** నమూన (పా. పు) మాదిరి, మోస్తరు, మాసర, ప్రతి, ఉదాహరణము, జాతి.

**نمی** నమీ (పా. స్త్రీ) నెమ్ము, తడి, చిత్తడి, చల్లదనము, శీతలము.

**ننانوے** నిన్నాన్వే (హి.) తొంబదితొమ్మిది; **ننانوے کے پھیر میں پڑنا** -కే ఫేర్ మేం పడ్నా (హి) ద్రవ్యసంపాదనాసక్తుడవలయునను ఆశలో చిక్కుకొనుట, చిక్కులలో బడుట.

**نند** నంద్-ననద్ (హి. స్త్రీ) ఆడబిడ్డ, మగని తోబుట్టు

**نندا** నిందా (హి. స్త్రీ) నింద, దూషణము, అపకీర్తి.

**نندآس** నిందాస్ (హి. స్త్రీ) నిద్రకూరుకు, కునుకుపాటు, నిద్రవచ్చుచుండుట.

**نندوئی - نندوسی** నందోసీ -యీ (హి. పు) ఆడబిడ్డమగడు.

**ننگ** నంగ్ (పా. పు) మర్యాద, అభిమానము, గౌరవము, ప్రఖ్యాతి; అవమానము, తలవంపులు. **ننگ و ناموس** - వ, నామూస్ (పా) మానాభిమానములు, గౌరవము. అవమానము, అపఖ్యాతి.

**ننگا-ننگ** నంగ్-గా (హి) నగ్నము, దిగంబరముగానున్న, దిగంబరము, దిసమొల; సిగ్గుమాలిన, మానహీనము; మానహీనుడు. **ننگا سر** -సర్ (హి) బోడితల, తలగుడ్డలేని. **ننگے پاؤں** నంగే పాఁవ్ (హి) వట్టి కాళ్లు, చెప్పులు లేకుండ. **ننگی تلوار** నంగీ తల్వార్ (హి) ఒరలేని కత్తి, దూసిన కత్తి, ఒరదీసినకత్తి. **ننگ دھڑنگ** -ధడంగ్ (హి) వట్టి దిగంబరి.

**ننھا - ننھان** ననేహా-హాఁ (హి) చిఱు, చిన్న, పిన్న, బుడ్డి, బుజ్జి, కోమలము.

**نو** నౌ (పా) నవము, క్రొత్త, నవీనము, నూతనము; అపూర్వము, తొమ్మిది, ఇటీవలి కాలపు. **نو آبادی** - ఆబాదీ (పా) నవనివేశము, క్రొత్తగా కట్టినది (ఊరు పల్లె మొ॥). **نو آموز** -ఆమోజ్ (పా) ఆరంభకుడు, క్రొత్తగా నేర్చుకొనువాడు, నూతన విద్యార్థి, అనుభవము లేనివాడు. **نو بالا** -బాలా (పా) క్రొత్తగా పెద్దమనిషి యైనపిల్ల, ప్రథమ రజస్వల; నవయౌవ్వనగాలు. **نو بہار** -బాహ్ర్ (పా) చిన్న చెట్టు, మొక్క, మొలక. **نوبائی** -బాయీ (పా) క్రొత్త సాంప్రదాయము. **نوجوان** -జవాన్ (పా) నవయౌవనుడు, నవయువకుడు. **نو جوانی** -జవానీ- నవయౌవనము, పూర్వ వయసు. **نوچندی** -చందీ (స్త్రీ) పూర్ణచంద్రునిసం॥, బాలచంద్రునిసం॥. **نو خاستہ - خیز** -ఖాస్త-ఖేజ్ (పా) యువకుడు,

యౌవనుడు; అభినవము, క్రొత్తగా కలిగిన. **نو خط** -ఖత్ (పా) నూనూగుమీసాల వాడు, యువకుడు. **نو دولت** -దౌలత్ (పా) నడుమంత్రపుసిరివాడు. **نو سکھیا** -సిఖియా(ఉ) నూతనవిద్యార్థి. **نو مشق** -మష్క్ (పా) నూతనాభ్యాసకుడు. **نو ملازم** -ములాజిమ్ (పా) నూతనోద్యోగి, క్రొత్తకొలువుకాడు, నూతనసేవకుడు.

**نو** నౌ (హి) తొమ్మిది, ఒకటితక్కువ పది. **نو رتن** -రతన్ (హి) నవరత్నములు, నవరత్నఖచిత కంకణము, తొమ్మిదిశ్రేష్ఠమైనవస్తువులు. **نو کھنڈ** -ఖండ్ (హి) భూగోళము, నవఖండపృథివి, తొమ్మిది ఖండములు, తొమ్మిదియంతస్తులు.

**نوا** నవా (పా.స్త్రీ) ధ్వని, శృతి, శారీరము, గొంతు, పాట, రాగము; సంపద, సిరి; జీవనము, జీవనాధారము; భోగము, భాగ్యము. **نوا پرداز** -పర్దాజ్ (పా) గాయకుడు, పాటకుడు, వాద్యకాడు.

**نواب** నవ్వాబ్ (అ.పు) ప్రభువు, పాలకుడు, మండలాధిపతి.

**نواح** నవ్వాహ్ (అ.పు) పరిసరములు, చుట్టుప్రక్కలు; ప్రాంతము, ప్రదేశము, దేశము. **گرد نواح** గిర్ద్-(పా) చుట్టుప్రక్కలప్రదేశము, సమీపదేశము, ప్రాంతము, పరిసరములు, చుట్టుప్రక్కలు.

**نواح** నవాహ్ (అ.పు) శోకము, దుఃఖము, పరిదేవనము.

**نواحی** నవాహీ (అ.స్త్రీ) దేశములు, ప్రాంతములు, చుట్టుప్రక్కలు, భాగము.

**نواختہ** నవాఖ్త (పా) రక్షితము, పోషితము, పరిపోషితము.

**نوادر** నవాదిర్ (అ.పు) అపూర్వములు, మహాత్మ్యములు, అద్భుతములు, (ఏ.వ نادر).

**نوار** నివార్ (హి.స్త్రీ) నవారుపట్టె, నూలుపట్టె.

**نوارا** నవారా (పా.పు) పడవ, నౌక.

**نواری** నివారీ (హి.స్త్రీ) ఒకవిధమైన మల్లెపువ్వు.

**نواڑا** నివాడా (హి.పు) ఒకవిధమైనపడవ, నౌక.

**نواز** నవాజ్ (పా) భజించువాడు, భక్తుడు, ప్రియుడు; వాద్యమును వాయించు వాడు, వాద్యగాడు, సంగీతకాడు, సంగీతపరుడు, (వృత్తియందు).

**نوازش** నవాజిష్ (పా.స్త్రీ) ప్రేమ, అనుగ్రహము. కటాక్షము; ప్రసాదము, వాత్సల్యము, ఆదరము. **نوازش نامہ** -నామ (పా) అనుగ్రహపత్రము. **نوازش کرنا** -కర్నా (ఉ) అనుగ్రహించుట; కటాక్షించుట, ఆదరించుట.

**نوازنا** నవాజ్నా (ఉ) అనుగ్రహించుట, కటాక్షించుట, పోషించుట, ఆదరించుట.

**نوازی** నవాజీ (పా.స్త్రీ) వాత్సల్యము, అనుగ్రహము, ఆదరణము; వాయించుట (వాద్యమును).

**نواسا - سہ** నవాసా-స (పా.పు) దౌహిత్రుడు, కూతురికొడుకు, మనుమడు.

**نواسی** నవాసీ (పా.స్త్రీ) మనుమరాలు, బిడ్డబిడ్డ, దౌహిత్రి.

**نواسی** నవాసీ (హి) ఎనుబదితొమ్మిది.

**نوافل** నవాకిల్ (అ.పు) చరిత్రలు, కథలు, పురాణములు, (ఏ.వ **نفل**),

**نوال** నవ్వాల్ (అ.పు) బహుమానము, కానుక; లాభము, బహుమతి, పరిమితి, కొలత; పద్ధతి.

**نوالہ** నివాల (పా.పు) కబళము, బుక్క, వాయి; తుపాకివాయి.

**نواں** నవాం (హి) తొమ్మిదవ, నవము.

**نوانا** న(ని)వానా (హి) వంచుట, వంగునట్లుజేయుట, వంగదీయుట; లొంగదీయుట, లోపరచుట, మడుచుట.

**نوائب** నవాయిబ్ (అ.పు) ప్రమాదములు, కష్టములు, సంకటములు, విపత్తులు, అపాయములు.

**نوبت** నౌబత్ (అ.స్త్రీ) కాలము, సమయము; వేళ, అదను; వంతు, పరిమితి, పర్యాయము, తడవ, తేప; ప్రమాదము, సంఘటనము, ఘటికి, ఘటన; కాలపరిమితి, మార్పు, పరిణామము, పరిస్థితి; స్థితి, దశ, అంతస్తు, మెట్టు, భాగము; ఒకవాద్యము; వాద్యము, మేళము; ఘటికావాద్యము, వాద్యవందనము, మాగధము, (గొప్పవారిఇండ్లముందుకొన్నిపర్యాయములు వాయించు జోహారు వాద్యము).

**نوبت خانہ** -ఖాన (పా) వాద్యశాల. **نوبت بہ نوبت** - బనౌబత్ (పా) క్రమేణ, క్రమక్రమముగా, అంతరాంతరములుగ, క్రమక్రమేణ.

**نوبتی** నౌబతీ (పా) నవుబతువాద్యమును వాయించువాడు.

**نوپور** నూపర్ (హి.స్త్రీ) నూపురము, పాదభూషణము.

**نوچ** నోచ్ [హి.పు] గిచ్చుట, గిల్లుట గీరుట, గీరుట.

**نوچنا** నోచ్నా (హి) గిచ్చుట, గిల్లుట కోరుట, గీరుట.

**نوچھاور** న్యోఛావర్ (హి.పు) చూ. **نچھاور**

**نوحہ** నౌహా (అ.పు) శోకము, దుఃఖము పరిదేవనము. **نوحہ گر** -గర్ (పా) దుఃఖించువాడు, శోకించువాడు, పరిదేవకుడు,

**نود** నవద్ (హి) తొంబది.

**نور** నూర్ (అ.పు) కాంతి, ప్రకాశము వెలుగు. [illegible] - **نور چشم** -ఎ,చశ్మ్ -దీద (పా) నేత్రకాంతి, పుత్రుడు, కొడుకు. **نور کے تڑکے** -కే తడ్కే (ఉ) ప్రొద్దుపొడుపు, ఉదయకాలము, తెల్లవారుగట్ల. **نور عین** -ఏఐన్ (పా) నేత్రకాంతి, పుత్రుడు, కొడుకు.

**نورا** నూరా (అ.పు) వెంట్రుకలు రాలిపోవునట్లుచేయుమందు; వెంట్రుకలు రాలజేయునట్టి.

**نورانی** నూరానీ(అ) కాంతి సం॥, ప్రకాశమానము, కాంతివంతము, శుభ్రము, స్పష్టము; ప్రభ, కాంతి, వెలుగు, ప్రకాశము.

**نورباف** నూర్బాఫ్ (పా) నేత, నేతపని.

**نورد** నవర్ద్ (పా.స్త్రీ) ఆట, ముడత, మడత; సంక్రమణము.

**نورس** నౌరస్ (పా) పన్న, చిన్న, కోమలము, ఆధునికము.

**نورستہ** నౌరస్త (పా) నవాంకురము, క్రొత్తగాపెరిగినది, క్రొత్తగామొలచినది, నవోద్భవము.

**نوروز** నౌరోజ్ (పా.పు) పారసీకుల సంవత్సరాదిపండుగ.

**نوروزی** నౌరోజీ(పా)సంవత్సరాదిసం॥.

**نوری** నూరీ (హి.స్త్రీ) ఒకజాతిచిలుక.

**نوڑهنا** నౌఢ్నా (హి)వంగుట,లొంగుట; లోబడుట.

**نوسادر** నౌసాదర్ (హి.పు) నవాసాగరము.

**نوش** నోష్ (పా) పాయి, త్రాగువాడు, (వృత్తియందు). **بادہ نوش** బాద- (పా) సారాయి త్రాగువాడు, మద్యపానము జేయువాడు, మద్యపానము, పానము; బహుమానము, కట్నము, పరిహారము. **نوش جان فرمانا** -నోష్-ఎ జాన్ ఫర్మానా (ఉ) త్రాగుట, పానము జేయుట, క్రోలుట. **نوش کرنا** -నోష్-కర్నా (ఉ) త్రాగుట, తినుట, హరించుట, మింగుట.

**نوشاں** నోషాం (హి) త్రాగెడు, పానము జేయుచు, త్రాగుచు.

**نوشانوش** నోషానోష్ (పా.పు) పైపైన త్రాగుట, త్రాగిందేత్రాగుడు, పానలోలత్వము, తప్పత్రాగుట, తెగత్రాగుడు.

**نوشت خواند** నవిష్త్‌ఖాంద్ (పా.స్త్రీ) చదువుట, వ్రాయుట, పత్రవ్యవహారము, వ్రాతకోతలు.

**نوشتہ** నవిష్త (పా) లిఖితము, వ్రాసినది; వ్రాతమూలకము, పత్రము, లేఖ, చీటి.

**نوش دارو** నోష్‌దారూ (పా.ఉ) పరిహారకౌషధము, మద్యము, సారాయి, పానీయము.

**نوشو** నౌషూ (పా) నవము, నూతనము, నవీనము, క్రొత్తది; ఆధునికము; చిన్న పిన్న, చిరు.

**نوشہ** నౌష (పా పు) పెండ్లికొడుకు; అదృష్టవంతుడు, సంతోషవంతుడు, సంతోషస్వభావముగలవాడు, ఉత్సాహవంతుడు.

**نوشی** నౌషీ (పా.స్త్రీ) పెండ్లికూతురు.

**نوشاہی** నౌషాహీ (పా) నూతనరాజయోగ్యము, నూతనవరయోగ్యము, పెండ్లికొడుకువంటి, క్రొ_పెండ్లికొడుకు సం॥, నవరాజసం॥.

**نوشین** నోషీం (పా) మనోజ్ఞము, మనోహరము, ప్రియము.

**نوع** నౌఉ (అ.పు) జాతి, తరగతి, కులము, విధము, వైఖరి.రీతి,పద్ధతి. **نوع انسان** -ఎ.ఇన్సాన్ (పా) మానవజాతి.

**نوعیت** నౌఇయత్ (అ.స్త్రీ)జాతిలక్షణము, జాతిగుణము, విశిష్టత, జాతీయత, ప్రత్యేకత, జాతిత్వము, జాతి, విధము, వైలక్షణ్యము, విలక్షణత, విశేషము.

**نوک** నోక్ (పా.స్త్రీ)చుంచువు, పక్షిముక్కు; కొన, అగ్రము, మొన; మూలకోణము; పాళి. **نوک جھوک** -ఝోక్(పా) పరిహాసము,వేళాకోళము. **نوک زبان** -ఎ.జబాన్(పా) కంఠపాఠముగా. **نوک قلم** -కలమ్(పా) అప్పటికప్పుడు, అనాలోచితముగా, చింతనలేకయే, తలవనితలపుగా.

**نوکا** నౌకా (హి.స్త్రీ) పడవ, నౌక,నావ.

**نوکر** నౌకర్ (హి.పు) సేవకుడు, భృత్యుడు, ఉద్యోగస్థుడు.

**نوکری** నౌకరీ (హి.స్త్రీ) కొలువు, సేవ; ఉద్యోగము. **نوکری پیشہ** -పేష(పా)

సేవకావృత్తి, కొలువుజేసిబ్రతుకుట.

نوکیلا నోకీలా (పా) మొనగల, కొనగల, కూచియైనాకారముగల.

نول నోల్ (పా.స్త్రీ) చంచువు, పక్షిముక్కు, బాడిమొ॥ వానియొక్క సన్ననిమెడ, గొంతు.

نول నాల్ (అ.పు) బాడుగ, అద్దె (పడవ మొ॥ వానికిచ్చునది).

نول నవల్ (హి) నవము, నవీనము, క్రొత్తది, నూతనము; చిన్న, పిన్న, అపూర్వము, వింతయైనది, అందమైన, మనోజ్ఞము; మొక్క, మొలక.

نولکھا నౌలఖా (హి) తొమ్మిదిలక్షలుగల, తొమ్మిదిలక్షల వెలజేయు; నవలక్షసంపన్నుడు.

نوم నౌమ్ (అ.స్త్రీ) నిద్ర, స్వాపము.

نومی నౌమీ (హి.స్త్రీ) నవమితిథి.

نومیدانہ నౌమ్మెదాన(పా) నిరాశగా, ఆశవదలుకొని.

نومیدی నౌమ్మెదీ (పా.స్త్రీ) నిరాశ, నైరాశ్యము, ఆశలేమి.

نون నోన్ (హి.పు) లవణము, ఉప్పు.

نون تیل -తేల్ (హి) భోజనసామగ్రి, అవసరమగువస్తువులు.

نونا నౌనా (హి) వంగుట, మ్రొగ్గుట; లొంగుట, లోపడుట.

نونی నోనీ (హి.స్త్రీ) ఉప్పరియుట (గోడమొ॥).

نونیا నోనియా (హి.పు) లవణవర్తకుడు, ఉప్పమ్మువాడు.

نوے నవ్వే (హి) తొంబది.

نوید నవేద్ (పా.స్త్రీ) శుభవార్త, సంతో
షవార్త, పెండ్లిపిలుపు.

نویس నవీస్ (పా) వ్రాయువాడు, లేఖ
వ్రాత, (వృత్తియందు).

نویسندہ నవీసంద(పా.పు) లేఖరి, రా
సగాడు, వ్రాయువాడు.

نویسی నవీసీ (పా.స్త్రీ) వ్రాత, లేఖనవ

نوین నోయిన్ (పా.పు) రాకొమరుడ
రాచకుమారుడు, యువరాజు, ప్రభు
కొడుకు.

نہ న (పా) కాదు, లేదు.

نہاد నిహాద్ (పా.పు) స్వభావము, ప్రకృ
అలవాటు; గుణము, మనసు, హృదయము
ఆకారము, ఆకృతి; ఎత్తు.

نہار నహార్ (అ.పు) దినము, పగలు, దివము
نصف النہار నిస్ఫున్నహార్ (అ
మధ్యాహ్నము. خطوط نصف النہار
ఖుతూతే— (అ) మధ్యాహ్నరేఖలు.
لیل ونہار లైలో— దివారాత్రములు
రాత్రింబవళ్లు, రేయుంబవళ్లు.

نہار منہ నహార్ ముంహ్ (హి) ఏమియుతి
నక, పరగడుపున, పట్టికడుపున. منہ نہار
ముంహ్ నహార్ (హి) నిరాహారముగ, ఉప
వాసముగ.

نہارنا నిహార్నా (హి) చూచుట, లక్షి
చుట, కనిపెట్టియుండుట, జాడగనుగొనుట.

نہاروا నహార్వా (హి.పు) నారిపుండు, నారు, నారి.

نہاری నహారీ (పా.స్త్రీ) ప్రాతఃకాల భోజనము; చద్ది, కల్లెము (ఒకవిధము).

نہال నిహాల్ (పా.పు) చిన్నచెట్టు, మొలక, మొక్క.

**نہال** నిహాల్ (హి) ఉత్సాహవంతము, సంతుష్టము, సంతోషముగల, సుఖముగానున్న.

**نہالچہ** నిహాల్చ (పా.పు) పరుపు, దిండు, గద్దియ; గవిసెన, దుప్పటి.

**نہالی** నిహాలీ (పా.స్త్రీ) చిన్న చెట్టు, మొలక, మొక్క; చిన్న పరుపు. గద్దియ, చిన్నరత్నకంబళము, చిత్రాసనము (చాకము).

**نہان** నహాన్ (హి.పు) స్నానము, జలకము.

**نہاں** నిహాఁ (పా.పు) గుప్తము. గోప్యము, రహస్యము, గూఢము, ప్రచ్ఛన్నము, మరుగుగానున్నది. దాపరికముగా నున్న, గుప్తమైనది, గూఢమైన.

**نہانا** నహానా (హి) స్నానముజేయుట, జలకమాడుట.

**نہانی** నహానీ (పా.స్త్రీ) గోపనము, గోప్యము; దాపరికము, గుప్తము, గూఢము, మరుగైన, రహస్యము.

**نہائی** నిహాఈ (హి.స్త్రీ) దాగలి,కమ్మరివాడు కాల్చిన ఇనుముపెట్టి కొట్టెడు పట్టెడ.

**نہایا** నహాయా (హి) స్నానముచేసిన, కడిగిన, స్నాతము, ధూతము.

**نہایت** నిహాయత్ (హి.స్త్రీ) అంతము, చివర, తుద, కడ, కొన, మితి, మేర, మర్యాద; ఆధిక్యము; ఎక్కువ,మిక్కిలి, చాల, అధికము, ఎక్కువగా; పరమావధి, తుట్టతుద, కట్టకడ.

**نہب** నహ్బ (అ.పు) దోపిడి, కొల్ల, కొల్లగొట్టుట.

**نہتا** నిహత్తా (హి) వట్టిచేతులతో నున్న, నిరాయుధుడైన,ఆయుధములులేని, సన్నాహ రహితము.

**نہج** నహ్జ (అ పు) బాట, మార్గము. పద్ధతి; త్రోవ, రీతి. వైఖరి.

**نہچہ** నిహ్చ్చ (హి.పు) నిశ్చయము.

**نہر** నహ్ర్ (పా.స్త్రీ) నది, ఏఱు, వాగు, చిన్న ఏఱు.

**نہرنا** నిహర్నా (హి) వంగుట, మొగ్గుట, తగ్గుట, ఒప్పుకొనుట, వ్రాలుట, లొంగుట, నమ్రమగుట, నమితమగుట.

**نہضت** నహ్జత్ (పా.స్త్రీ) దాడివెడలుట, ప్రయాణము, పయనము, బయలుదేరుట, వెడలుట, ఎగబడుట.

**نہفتہ** నహుఫ్త (పా) గుప్తము, ప్రచ్ఛన్నము, రహస్యము, గూఢము.

**نہنگ** నహంగ్ (పా.పు) మొసలి, నక్రము; సొరచేప; లేఖిని.

**نہنگ** నిహంగ్ (హి) నగ్నము, బిత్తల, దిగంబరము; నిర్విచారమైన, నిశ్చింతగల, చీకుచింతలేని.

**نہنی** నహన్నీ (హి.స్త్రీ) గోరుగల్లు.

**نہورا** నిహోరా (హి.పు) అనుగ్రహము, దయ, కటాక్షము; ప్రార్థన, వేడికోలు, అడుగుకొనుట, యాచన, బుజగరించుట.

**نہورنا** నహూర్నా (హి) వంగుట, మొగ్గుట,లొంగుట,వ్రాలుట, క్రిందికివ్రాలుట.

**نہی** నహీ (అ.స్త్రీ) నిషేధము,కూడదనుట.

**نہیالی** నహియాలీ (హి.స్త్రీ) గద్దియ, పరుపు, దిండు. గద్దె.

**نہیب** నహీబ్ (పా.పు) భయము,బుగులు,

భీతి; దిగులు, దుఃఖము, విచారము, చింత; త్వర, సంభ్రమము, వేగము.

**نہیر** నహియర్ (హి. స్త్రీ) భార్యపుట్టింటి వారు, పెండ్లికూతురి తల్లిగారింటివారు, పెండ్లికూతురివారు.

**نہیں** నహీం (హి) లేదు, కాదు, కూడదు. **نہیں تو** -తో (హి) లేనిచో; లేనియెడల, కానిచో, కానియెడల, పక్షాంతరముగా, లేకపోయినచో, లేకపోయినయెడల.

**نے** నై (పా. స్త్రీ) క్రోవి, వెదురుగొట్టము, రెల్లునాళము, పేము, నాళము, కోశాయి, గొట్టము; రెల్లు; వేణువు, బొంగు; నాగస్వరము, పిల్లనగ్రోవి. **نے نواز** -నవాజ్- నాగస్వరము పాడువాడు; పిల్లనగ్రోవి వాయించువాడు.

**نیا** నయా (హి) నూతనము, నవీనము, క్రొత్త, ఆధునికము, అభినవము. **نئے سرے** నయే సర్ సే (హి) నూతనముగా, మరల మొదలిడి, నూతనారంభముగా.

**نیا** నైయా (హి. స్త్రీ) నావ, పడవ; నావికుడు, పడవవాడు, ఏఱుదాటించువాడు; మంగలి, నాపకుడు.

**نیابت** నియాబత్ (అ. స్త్రీ) ప్రాతినిధ్యము, ప్రతినిధిగానుండుట, పరార్థవాదము, పరార్థవాదిగానుండుట.

**نیارا** నియారా (హి. పు) బంగారు లేక వెండితీయగా మిగిలినమష్టు, వేరు, ప్రత్యేకము, విశిష్టము; అపూర్వమైన, అసాధారణము, నవలము, వింతయైన.

**نیاریا** నియారియా (హి. పు) బంగారుగాని వెండియొక్కగాని మష్టునుండి ఆయాలోహములను దీయువాడు, జెలగడుగువాడు.

**نیاز** నియాజ్ (పా. స్త్రీ) విజ్ఞాపనము, విజ్ఞప్తి, ప్రార్థన, యాచన, దారిద్ర్యము, పేదతికము; నైవేద్యము, నివేదనము, మ్రొక్కు, మ్రొక్కుబడి. **نیازطبینت** -తీనత్ (పా) వినయశీలుడు, విధేయస్వభావముగల, నమ్రస్వభావముగల. **نیاز حاصل کرنا** -హాసిల్ కర్నా (ఉ) దర్శనము జేసికొనుట. **نیازمند** -మంద్ (పా) విధేయుడు, యాచకుడు, విజ్ఞాపకుడు, వినతుడు, కృతజ్ఞుడు, దీనుడు, రిక్తుడు. **نیاز کیش** -కేష్ (పా) విధేయుడు, వినమ్రుడు, వినయశీలుడు, లొంగియుండువాడు. **نیاز چڑھانا** -చఢానా (ఉ) నైవేద్యము పెట్టుట, మ్రొక్కు చెల్లించుట, భోనాలు పెట్టుట.

**نیازی** నియాజీ (పా) విధేయుడు, భర్త; ప్రియుడు, మిత్రుడు.

**نیام** నియామ్ (పా. పు) కత్తి మొ॥ వానిఒఱ, కత్తిమొ॥; కొరిగిన కాలు మొ॥ వాని కట్టు; బిగదీసికట్టినకట్టు, నాగటిపిడి.

**نیاے** నియాయు (హి. పు) న్యాయము, న్యాయశాస్త్రము, తర్కము.

**نیایش** నియాయిష్ (పా. స్త్రీ) ఆశీర్వాదము, దీవన; దీవించుట, ప్రశంస.

**نیبو** నీబూ (హి. పు) నిమ్మకాయ, నిమ్మపండు.

**نیبدن** నివేదన్ (హి. పు) నివేదనము; నివేదించుట; విజ్ఞాపనము, వినంతి, ప్రార్థన.

**نئے پنج** నయే పంజ్ (పా. పు) అదేయిండ్ల కంటె ఎక్కువ వయసుగల గుఱ్ఱము, అయి

దేండ్లలో పలిగుజ్జము, లేత గుజ్జము.

**نیت** నియత్ (అ. స్త్రీ) నీతి, ఉద్దేశము, అభిప్రాయము, నిశ్చితము, హృదయము, తలంపు, మనసు, కోరిక, ఈప్సితము, అభీష్టము.

**نیتی - نیت** నీత్-నీతి (అ. స్త్రీ) వర్తనము, నడవడిక, సభ్యత, మర్యాద.

**نیچ** నీచ్ (హి) నీచము, తుచ్ఛము, అల్పము, **اونچ نیچ** -ఊంచ్ (హి) ఉచ్చనీచములు, ఉచ్చావచములు, ఎచ్చుతగ్గులు, మంచిచెడ్డలు, కష్టసుఖములు.

**نیچا** నీచా (హి) క్రిందు, అడుగు; వంపు, వాలు, దిగుడు. **اونچا نیچا** - ఊంచా (హి) ఒడ్డుమిట్టలు, ఎత్తువంతలు, ఒడుదుడుక, విషమము, ఎత్తువంతలుగా నున్న, మిట్టపల్లములుగల, సమముగాలేని, తగ్గుమొగ్గులు, లోపాలోపములు. మంచి చెడ్డలు, బాగోగులు, వెనుకముందులు, సాధకబాధకములు. **نیچا دکھانا** - దిఖానా (హి) అవమానపరచుట, తలవంపులుజేయుట. **نیچا سر** -సుర్ (హి) మంద్రస్వరము, తగ్గుస్వరము.

**نیچہ** నైచ (హి. పు) గుడ్గుడీనాళము, హుక్కానాళము.

**نیچے** నీచే (హి) క్రింద, అడుగున. **نیچے اوپر** -ఊపర్ (హి) క్రిందుమీదు, తలక్రిందు, క్రిందల, తాఱుమాఱు; ఒకదానిపైనొకటి.

**نیر** నైయర్ (అ. పు) సూర్యుడు, చంద్రుడు. **نیر اعظم** -ఆజెమ్ (అ) సూరు్యడు. **نیرین** నైయరైన్ (అ) సూర్యచంద్రులు.

**نیرت** నైరిత్ (హి) నైరృతిదిక్కు, నిరుతిమూల, దక్షిణమునకును పశ్చిమమునకును మధ్యనుండుమూల.

**نیرس** నీరస్ (హి) నీరసము, రసహీనము, రుచిహీనము, నిస్సారము.

**نیرنگ** నైరంగ్ (పా. పు) ఛలము, మోసము, టక్కు; ఇంద్రజాలము, మంత్రము, తంత్రము; నవలము, అపూర్వము, నూతనము, క్రొత్తవిద్దె, వింతకార్యము.

**نیرنگی** నైరంగీ (పా. స్త్రీ) ఛలము, మోసము, టక్కుటమారము, ఇంద్రజాలము.

**نیرو** నేరూ (పా. పు) బలము, శక్తి.

**نیز** నీజ్ (పా) మరియును, కూడ, సహా; అట్లే, ఇంతేకాక.

**نیزہ** నేజె (పా. పు) బల్లెము, ఈటె, బాణము; రెల్లు, రెల్లుకలపు పుడక. **نیزہ باز** -బాజ్ (పా) ఈటెకాడు, బల్లెపుబంటు, ఈటెపోటరి.

**نیسان** నైసాఁ (పా. పు) వైశాఖమాసకాలము, వసంతకాలము. **ابر نیسان** -అబ్రె నీసాఁ (పా) తొలికారుమబ్బులు, వసంతకాలపు వర్షములేకమబ్బులు, తొలకరి వానలు.

**نیست** నేస్త్ (పా. పు) నాస్తి, లేమి, నాశము, శూన్యము. **نیست و نابود کرنا** -ఒ నాబూద్ కర్నా (ఉ) నిర్మూలము జేయుట, ధ్వంసముజేయుట. సర్వనాశముజేయుట.

**نیستان** నైస్తాన్ (పా. పు) చెఱుకుతోట; రెల్లువాక, వేపకంచ, చెఱుకు రెల్లు లేక బెత్తము పెరుగుచోటు.

**نیستی** నేస్తీ (పా. స్త్రీ) అభావము, నాశము, ధ్వంసము, నిర్మూలము.

**نیش** నేష్ (పా) కాటు, కుట్టుట, కఱచుట, గాయము. **نیش زن** -నీష్-జన్ (పా) కొండెలమారి, జగడములు పెట్టువాడు.

**نیشتر** నేష్తర్ (పా. పు) శస్త్రము (వైద్యునిది).

**نیشکر** నైషకర్ (పా. స్త్రీ) చెఱుకు, ఇక్షుదండము, చెఱుకుగడ.

**نیفا** నేఫా (పా. స్త్రీ) నాడాసందు, చెల్లడము నకు నాడా తొడుగుటకైన చుట్టు నాళము.

**نیک** నేక్ (పా) మంచి, శుభకరము, సుమంగళకరము, శుభము, పుణ్యవంతము. **نیک اختر** -అఖ్తర్ (పా) భాగ్యవంతుడు, అదృష్టవంతుడు. **نیک اندیش** -అందేష్ (పా) మేలుగోరువాడు, సదుద్దేశము గలవాడు. **نیک باز** -బాజ్ (పా) పుణ్యాత్ముడు, సత్కార్యములు జేయువాడు, సజ్జనుడు. **نیک بخت** -నేక్-బఖ్త్ (పా) అదృష్టవంతుడు, సత్స్వభావముగలవాడు, సజ్జనుడు. **نیک خواہ** -నేక్-ఖాహ్ (పా) మేలుగోరువాడు, కృతజ్ఞుడు, విశ్వాసపాత్రుడు. **نیک عہد** -అహ్‌ద్ (పా) ఆడితప్పనివాడు, మాటనిలుకడ గలవాడు, సత్యవంతుడు. **نیک فرجام** -నేక్-ఫర్‌జామ్ (పా) కల్యాణాంతము, సదంతము. **نیک نہاد** -నిహాద్ (పా) సత్ స్వభావము గలవాడు. **نیک نیت** -నియత్ (పా) సదుద్దేశము గలవాడు.

**نیکی** నేకీ (పా. స్త్రీ) మేలు, ఉపకారము, మంచి, సాధుత్వము, పుణ్యము. **نیکی و بدی** -ఒ-బదీ (పా) మంచిచెడులు, మేలుకీడులు, బాగోగులు, కష్టసుఖము.

**نیگ** నేగ్ (హి. ఉ) కట్నములు, కానుకలు, బహుమానములు, బహుమతులు; పండుగ పబ్బముల కట్నములు కానుకలు (బంధువులకును పని బాటులవారికిని యిచ్చునవి). **نیگی جوگی** నేగీ జోగీ- పని బాటలవారు, పెట్టుబడులవారు, బహుమతులు అడుగుకొనువారు, యాచకులు, వాడుకగా కట్నము (ఈనామము)లడుగుకొను వాడు.

**نیل** నీల్ (హి. పు) నీలి, నీలిమందు, నీలివర్ణము. **نیل کا ماتھے بگڑنا** -కా మాతే బిగ్డ్నా (ఉ) నీలితొట్టి చెడిపోవుట, దౌర్భాగ్యముపట్టుట, పని చెడుట, వింత వార్త వినుట. **نیلگوں** -గూఁ (ఉ) నీలవర్ణముగల, నీలివన్నెగల. **نیل کا ٹیکا** -కా టీకా (ఉ) అపవాదము, నింద, అపకీర్తి. **نیل گاو** -గావ్ (పా) గవయము. **نیل من** -మన్ (హి) నీలము (గన్నము).

**نیل** నీల్ (అ. పు) నైలునది (ఇది మిసరు దేశమున గలదు).

**نیل** నైల్ (అ. పు) సరిగ్రహణము, సంపాదించుట, సంపాదనము.

**نیلا** (హి) నీలవర్ణముగల, నీలివన్నెగల. **نیلا تھوتھا** -థోథా (ఉ) మైలతుత్తము. **نیلا پیلا ہونا** -పీలా హోనా (ఉ) వెలవెలపోవుట, ముఖము వెలవెలబోవుట. **نیلا پیلا کرنا** -పీలా కర్నా (ఉ) చావ చితకగొట్టుట, మెత్తగా కొట్టుట.

**نیلام** నీలామ్ (బు. పు) ఏలాము, ఏలాముపాట, వెలపాట (వెలను బిగ్గరగా పాడి అమ్ముట).

**نیلائی** నీలాయీ (హి. స్త్రీ) నీలివన్నె, నీలవర్ణము, నీలిరంగము నైల్యము.

**نیلک** నీలక్ (పా) నీలవన్నెగల; నీలము (రత్నము).

**نیلکنٹھ** నీల్ కంఠ్ (హి.పు) నెమలి, శివుడు, పాలపిట్ట.

**نیلم** నీలమ్ (హి.పు) నీలము (రత్నము).

**نیلمبر** నీలంబర్ (హి.పు) నీలాంబరము, నీల వస్త్రము.

**نیلوفر** నీలోఫర్ (పా.పు) కమలము, తామర, అల్లితామర.

**نیلی** నీలీ (పా.స్త్రీ) నీలిమ; నైల్యము, నీలవర్ణము.

**نیم** నీమ్ (పా) సగము, అర్థము, మధ్యము, నడుము. **نیم پخت** -పుఖ్త్ (పా) సగముఉడికిన, బాగాఉడకని, ఎచ్చిపచ్చిగానున్న. **نیم جان** -జాన్ (పా) సగముప్రాణముతోనున్న, సగము చచ్చిన. **نیم خوردہ** -ఖుర్ద (పా) సగముతినిన, తినగామిగిలిన, భుక్తశేషము. **نیم شب** -షబ్ (పా) నడికిరేయి, అర్థరాత్రము. **نیم گفتہ** -గుఫ్త (పా) సగముచెప్పిన, చెప్పిచెప్పకయున్న. **نیم گرم** -గర్మ (పా) నులివెచ్చని, గోరువెచ్చని. **نیم ملا** -ముల్లా (పా) సగముపండితుడు, అపండితుడు, తెలిసియుతెలుపనివాడు, బాగా తెలియనివాడు.

**نیم** నీమ్ (హి. స్త్రీ) వేము, వేపచెట్టు.

**نیم** నేమ్ (హి.పు) నీమము, నియమము, వ్రతము; కట్టడి, ఒడంబడిక, ఆచారము. **نیم دھرم** -ధర్మ్ (హి) నియతినిష్ఠ, సద్వర్తనము, ఆచారధర్మము.

**نیماوت** నీమావత్ (హి.పు) ఒకతెగజోగులు.

**نیمچہ** నీమ్చ (పా.పు) చిన్నకత్తి, సురకత్తి, పిడికత్తి.

**نیمہ** నీమ (పా.పు) చొక్కాయి, అంగి, అంగకము. **نیمہ آستین** -ఆస్తీన్ (పా) అరచట్టము, సగముచేతులచొక్కాయి, పొట్టిచేతులకూసము, చిన్నచేతుల అంగి.

**نیمی** నీమీ (హి) నియమవంతుడు, నైష్ఠికుడు, పవిత్రుడు, ఇంద్రియనిగ్రహముగలవాడు.

**نین** నయన్-నైన్ (హి.పు) నయనము, కన్ను. **نین سکھ** -సుఖ్ (హి) ఒక జాతిపువ్వు, ఒకరకముతెల్లబట్ట, కోరాబట్ట.

**نیند** నీంద్ (హి.పు) నిద్ర, స్వాపము. **نیند اچاٹ ہونا** -ఉచాట్ హోనా (హి) నిద్రతేలిపోవుట, నిద్రాభంగమగుట. **نیند بھر سونا** -భర్ సోనా (హి) చాలినంత నిద్రబోవుట, హాయిగానిద్రించుట, మైమరచినిద్రించుట.

**نیو** నియో (హి. స్త్రీ) పునాది, హస్తిభారము.

**نوانا** నివానా (హి) వంచుట, వంగజేయుట.

**نیوتا** నియోతా [హి.పు] విందుకుపిలుచుట, ఆమంత్రణము, నిమంత్రణము, పిలుపు, ఆహ్వానము.

**نیوتنا - نیوتانا** నియోతానా-నియోత్నా (హి) ఆహ్వానించుట, విందుకుపిలుచుట.

**نیور - نیول** నేవర్-ల్ (హి. స్త్రీ) గుఱ్ఱపు కాలిపుండు, పిల్లలకాలిభూషణము.

**نیوش** నియోష్ (పా) వినెడు, వినువాడు, శ్రోత (వృత్తియందు).

**نیو شندہ** నిశోషింద (పా) శ్రోత, వినువాడు.

**نیول - نیولا** నేవల్ — నేవ్లా — నిమోలా (హి. పు) బభ్రువు. ముంగి, ముంగిస.

**نیہا** నేహా (హి. స్త్రీ) స్నేహము, ప్రేమ, మైత్రి, దయ.

**نیہر** నైహర్ (హి. పు) భార్యపుట్టిల్లు, భార్య తల్లిగారిల్లు.

**نیہی** నేహీ (హి. పు) స్నేహితుడు, మిత్రుడు, చెలికాడు.

---

# و

**و** వావ్ (అ. పు) ఈయక్షరము ఉరుదూవర్ణమాలలో ముప్పది మూడవది, అరబీలో ఇరువదిసాగవది. పారసీకమున ముప్పది యవది. అబ్జదువర్ణసాంఖ్యమున దీనిసంఖ్య ఆరు. ఇది ఉభయమాత్రగను. హల్లుగుచో వకారముగను అచ్చుగుచో ఉ-ఒ. లగను పలుకును. ఇది శుక్రవారమునకును తులారాశికిని సంజ్ఞ.

**وا** వా (పా) తెరచిన, తెరవబడిన; మరల, రెండవ సారి, తిరిగి, వెనుక; . అబ్బా!, అయ్యో! (బాధ). **وا کرنا** -కర్నా (ఉ) తెరచుట. **وا ہونا** -హోనా (ఉ) తెరవబడుట.

**واماندگی** వామాందగీ (పా. స్త్రీ) అలసట, వెనుకబడుట.

**وامانده** వామాంద (పా) అలసిన, వెనుకబడిన; శేషము, మిగిలినది.

**وابستگان** వాబస్తగాన్ (పా. పు) బంధువులు, సంబంధులు, చుట్టములు, కావలసిన వారు, ఆశ్రితులు, కుటుంబమువారు.

**وابسته** వాబస్త (పా) బాంధవ్యముగల, సంబంధముగల, చుట్టరికముగల, కావలసిన, కలిసిన, కట్టుబడి, ఆధారపడియున్న, ఆశ్రితము, ఆశ్రితుడు, అనుబద్ధము.

**واپس** వాపస్ (పా) మరలిన, తిరిగిన, మరల, తిరిగి, వెనుకకు. **واپس رکھنا** -రఖ్నా (ఉ) ఉంచుకొనుట, నిలుపుకొనుట. **واپس کرنا** -కర్నా (ఉ) తిరిగియిచ్చుట, మరలయిచ్చుట. **واپس ہونا** -హోనా (ఉ) మరలుట, తిరిగివచ్చుట.

**واپسین** వాపసీన్ (పా) కడపటి, వెనుకటి, తుది.

**واثق** వాసిక్ (అ) దృఢమైన, బలిష్ఠమైన, పుష్టిగల, గట్టి, స్థిరమైన.

**واجب** వాజిబ్ (అ) శాశ్వతము, నిత్యము, స్థిరము, యోగ్యము, ఉచితము, సరి, కూడిన, సరియైన, అర్హము, తగిన, కాగల, ఆవశ్యకమైన, కావలసిన, స్వతంత్రమైన, అగత్యమైన, న్యాయమైన, సక్రమమైన, రావలసిన, జీతము, ఇవ్వవలసిన. **واجب الادا** -ఉల్అదా (అ) కరణీయము, చేయదగిన, అర్హకృత్యమైన, దేయము, ఇవ్వవలసిన, ముట్టవలసిన.

**واجب الرعایت** -ఉర్,రిఆయత్ (అ) క్షమాయోగ్యము, మన్నింపదగినది.

**واجب الزیارت** -ఉజ్,జియారత్ (అ)సందర్శనీయమైన, పోయిచూడదగిన.

**واجب العرض** -ఉల్,అర్జ్ (అ) విజ్ఞాపనార్హము, చెప్పుకొన తగినది.

**واجب التعظیم** -ఉత్,తఅజీమ్ (అ) గౌరవనీయము. **واجب الوجود** -ఉల్,వజూద్ (అ) ఉండవలసినది,స్వతంత్రసత్వము, మూలసత్వము, ఈశ్వరుడు.

**واجب الوصول** -ఉల్,వసూల్ (అ) రావలసినది, ముట్టవలసినది.

**واجبات** వాజిబాత్ (అ.స్త్రీ) ఉండి తీరవలసినవి, కావలసినవి, అగ్రకృత్యము, కావలసిన పనులు, ముట్టవలసిన సొమ్ములు, ఆవశ్యకమైన విషయములు,

**واجبی** వాజిబీ (అ) యోగ్యమైన, అర్హమైన, ఆవశ్యకమైన, అగత్యమైన, ఒప్పుకొనదగిన, కూడిన, తగిన, ఉచితము,కావలసిన, సరియైన.

**واحد** వాహిద్ (అ) ఏకము, ఒక, ఒంటరి, ఒంటి, ఏకవచనము, అద్వితీయము. **واحد و شاهد** -వ షాహిద్(అ)ఈశ్వరసాక్షి, ఈశ్వరార్పణము,ఉపకారముజేసిన,యదార్థము తెలిసిన. **واحد و شاهد هونا** -వ షాహిద్ హోనా (ఉ) యదార్థము తెలిసియుండుట, ఉపకారముచేసి యుండుట. **واحد العین** -ఉల్,ఐన్ (అ) ఏకాక్షి, ఒకకన్నుగ్రుడ్డి.

**وادی** వాదీ (అ.స్త్రీ) కొండలనడిమిప్రదేశము, లోయ, లోవ, కొండకనుమ, కందరము, కనుమ, పల్లపుభూమి, అరణ్యము, ఎడారి, కాలువ, వాగు, నది.

**وار** వార్ (హి.పు) దెబ్బ, పెట్టు. పైబడుట, కొట్టబోవుట, గాయము, అవకాశము.

**وارا** వారా (హి.పు) చౌకదనము, లాభము, మితవ్యయము.

**وار پار-وارا پار** వార్పార్-వారాపార్ (హి) ఈవలఆవల, ఈగట్టుఆగట్టు, రెండుప్రక్కల, ఈవైపునుండి ఆవైపునకు, దాటి.

**واری** వారీ (హి.స్త్రీ) దిగదుడుపు, బలి, ప్రేమయు విధేయతయును దెలుపు పదము.

**واری پهیری** -ఫేరీ - దిగదుడుపు, దిగదుడిచినది.

**وارث** వారిస్ (అ)ఉత్తరాధికారి, అధికారి, యజమాని,

**وارثی** వారిసీ (పా.స్త్రీ) పిత్రార్జితము.

**وارد** వారిద్ (అ) ఆగతము, ఆసన్నము, వచ్చు, వచ్చెడు, వచ్చిన, వచ్చియున్న. **وارد و صادر** -ఒ,సాదిర్-అతిథి, అభ్యాగతి, పాంథుడు, బాటసారి. **وارد هونا** - హోనా- వచ్చుట.

**واردات** వారిదాత్(అ.స్త్రీ)నైమిత్తికములు, జరిగినది, జరిగినసంగతులు.

**وارستگی** వారిస్తగీ (పా.స్త్రీ) మోక్షము, విడుదల,సురక్షితము, విధేయత.

**وارسته** వారిస్త(పా)ముక్తము, విడుదలపొందిన, తప్పించుకొనిన,విధేయము,రక్షితము.

**وارفته** వారఫ్త (పా) భ్రష్టము, నష్టము, తప్పిపోయిన.

**وارنا** వార్నా (హి) దిగదుడుచుట, చుట్టుత్రిప్పితీయుట, చుట్టుత్రిప్పుట.

**واڑی - واڑا** వాడా -వాడీ (హి) వాడ, వాటిక (సమాసములలో).

**واژوں - واژگوں** వాఁగూఁ -వాషూఁ (పా) అశుభకరము; తలక్రిందు, క్రిందల, అపసవ్యము, అశుభము;తలక్రిందైన, క్రిందలయైన. **واژوں بخت** -బఖ్త్ (పా) దురదృష్టుడు, నిర్భాగ్యుడు.

**واسط** వాసిత్ (అ) మధ్యము, మధ్యవర్తి, ఆసియాఖండపు పశ్చిమభాగమందలి ఒక పట్టణముపేరు. **واسطی قلم** -కలమ్ (పా) వాసితునుండి తెచ్చినలేఖిని.

**واسطات** వాసితాత్ (అ.పు) ఆరుపండ్లు వచ్చినగుఱ్ఱము, అయిదునెలల గుఱ్ఱపుపిల్ల.

**واسطہ** వాసిత (అ.పు) మధ్యస్థుడు, మధ్యవర్తి, రాయబారి, మాధ్యస్థము, సంబంధము, తగులము, సంగతి, ఐక్యము, మూలము, నిమిత్తము, హేతువు, కారణము, సహాయము. **واسطہ رکھنا** -రఖ్నా-సంబంధముగలిగియుండుట.

**واسطے** వాస్తే (పా) కొరకు, మారుగ.

**واسطی** వాస్తీ (పా.స్త్రీ) కట్టెకలము,రెల్లుకలము, లేఖిని, చూడు **واسط**

**واسع** వాసె (అ) విశాలమైన, ధారాళమైన.

**واسوخت** వాసోఖ్త్ (పా.స్త్రీ) జ్వలనము, కాలుట, ఉద్రేకయుక్తమైనశైలి,ఉత్సాహపూరితము.

**واسوز** వాసోజ్ (పా.పు) ప్రజ్వలనము, ఉద్రేకము, ఉత్సాహము.

**واشدہ** వాషుద (పా) తెరచిన; వెడలిపోయిన.

**واصل** వాసిల్ (అ) యోజకము, యుక్తము కలిపెడు ,కలియు, కలిసిన, సంయుక్తము, చేతికివచ్చిన,ముట్టిన, దొరికిన,లబ్ధము. **واصل باقی** -బాకీ (అ) లెక్కవివరము, లబ్ధాలబ్ధములు, వచ్చినవి,రావలసినవి.

**واصلات** వాసిలాత్ (అ.స్త్రీ)ఆదాయములు. (ఏ.వ **واصل**)

**واضح** వాజెహ్ (అ) విస్పష్టము, తెల్లము, తేటతెల్లము, విశదము, విదితము. **واضح رہے - ہو کہ** -రహే-హోకె -విశదమగుగాక, విదితమగుగాక, తెలియుడి.

**واضع** వాజె (అ) కర్త, చేయువాడు, నిర్మాత, కారకుడు, స్థాపకుడు, కల్పకుడు, కనిపెట్టినవాడు. **واضع قوانین** -కవానీన్ (అ) శాసనకర్తలు.

**واعظ** వాఇజ్ (అ.పు) బోధకుడు, మతమును లేక నీతినిబోధించువాడు,

**وافر** వాఫిర్ (అ) పుష్కలము, విస్తారము, కావలసినంత, అవారిగా, విశేషము.

**وافی** వాఫీ(అ) పుష్కలము,కావలసినంత, యథేష్టము, విశేషము.

**واق** వాక్ (అ.పు) పక్షివిశేషము.

**واقع** వాక్కె (అ) సంభవించెడు,తటస్థించెడు, కాగల, కలిగిన, జరిగిన, తటస్థించిన, వర్తిల్లిన. **واقع ہونا** -హోనా (ఉ) సంభవించుట, కలుగుట, అగుట.

**واقعات** వాక్కెఅత్ (అ)అయిన, ఉన్న, సంభవించిన, సంభవము, ఆవశ్యకము. (ఏ.వ చూడు **واقعہ**)

**واقعہ** వాకెఅ (అ.పు) నైమిత్తికము, జరిగినది, సంగతి, సమాచారము; వార్త; మరణము, విపత్తు, సంకటము, కష్టము, సందర్భము. సంఘటనము, వర్తమానము.

**واقعی** వాకెఈ (అ) నిశ్చయము, యదార్థము; నిజముగా, నిశ్చయముగా.

**واقف** వాకిఫ్ (అ) తెలిసిన, ఎరిగిన, అనుభవముగల, పరిచయముగల, వివేకముగల. **واقف حال - کار** -హాల్-కార్ (పా) అనుభవజ్ఞుడు, అనుభవశాలి, బాగా తెలిసిన, బాగాఎరిగిన. **واقف ہونا** - హోనా (ఉ) తెలియుట, తెలియబడుట.

**واقفیت** వాక్ఫియత్ (అ. స్త్రీ) అనుభవము, పరిచయము. జ్ఞానము, పాండిత్యము, పరిచితి, తెలిసినవిషయము.

**واگذاشت** వాగుజాష్త్ (పా. స్త్రీ) విడుదల, వదలుట, విడిచివేయుట, వదలిపెట్టుట.

**والا** వాలా (పా) ఉన్నతము, ఉచ్చము, ఎత్తైన, గౌరవనీయమైన, ఘనమైన, గొప్ప.దొడ్డ, అధికమైన. **والا جاہ-قدر** -జాహ్ = కద్ర్ (పా) మహాపదవిగల. **والا شان** -షాన్ (పా) మహావైభవముగల. **والا حضور** హుజూర్-(పా) మహాప్రభువులైన, దేవరవారు.

**والد** వాలిద్ (అ.పు) తండ్రి, పిత.

**والدہ** వాలిద (అ. స్త్రీ) తల్లి, మాత.

**والدین** వాలిదైన్ (అ.పు) తలిదండ్రులు (పితరులు).

**واللہ** వల్లాహ్ (అ) ఈశ్వరసాక్షి, దేవునితోడు. **واللہ علم** -అలమ్ (అ) దైవముకేఎరుక, (నాకుతెలియదను మాట). **واللہ علم بالصواب** -అఉలమ్ బిస్సవాబ్ (అ) యదార్థముదేవునికేయెరుక, **واللہ باللہ** -బిల్లాహ్ (అ) శివశివ, రామరామ, దైవముసాక్షిగా, దేవునితోడు.

**والہ** వాలా (అ) విరహపీడితుడైన, విమోహితుడైన, దిగ్భ్రమపడిన, భ్రాంతుడైన, భీతిల్లిన, అదలుపడిన, బమ్మెరపడిన, కలవరపడిన.

**والی** వాలీ (అ.పు) ప్రభువు, రాజు, యజమాని; అధికారి, ఉత్తరాధికారి; సహాయుడు, హితుడు, సంరక్షకుడు.

**واماندگی** వామాందగీ (పా. స్త్రీ) చూడు وا

**وامق** వామిక్ (అ.పు) మోహితుడు, ప్రేమించువాడు, మోహించువాడు.

**واویلا** వావైలా (అ.పు) రోదనము, గోడు, ఆలగోడు బాలగోడు.

**واہ** వాహ్ (పా) భళీ, బాగు, మేలు. **واہ واہ** -వాహ్ (పా) భళిభళీ, బాగుబాగు, మేలుమేలు.

**واہب** వాహిబ్ (అ.పు) దాత, ఉదారి, ఇచ్చువాడు. **واہب العطایا** -ఉల్, అతాయా- సర్వదాత, ఈశ్వరుడు.

**واہم** వాహిమ్ (అ) అభిప్రాయముగల, అనుకొన్న, తలంచిన, భ్రమపడిన, భ్రాంతిగల.

**واہمہ** వాహిమ (అ.పు) భ్రాంతి, భ్రమ, పిచ్చితలంపు.

**واہی** వాహీ (అ) సోమరి, బలహీనము, తుచ్ఛము, అల్పము, దుర్బలము, పనికిమాలిన, ద్రిమ్మరి, పోకిరి, చపలచిత్తము,

దుర్మార్గుడు, భ్రష్టుడు. واهی تباهی -తబాహీ- అవ్యక్తము. నిరర్థకము, తుచ్ఛము; తుచ్ఛపుకబురులు, అవివేకప్రసంగము, ద్రిమ్మరితనము, పనికిమాలినతనము.

**واهیات** వాహియాత్ (అ) అవ్యక్తప్రసంగము, అసందర్భప్రలాపము, పనికిమాలిన మాటలు.

**وبا** వబా (అ. స్త్రీ) మారి (జాడ్యము), అంటువ్యాధి.

**وبال** వబాల్ (అ.పు) భారము, కష్టము, క్లేశము, ఆపద, సంకటము. [illegible], విపత్తు, పాపము, అనారోగ్యము, పాపఫలము, మారిజాడ్యము, దౌర్భాగ్యము. **وبال جان** -ఎ,జాన్ (పా) ప్రాణకంటకము, ప్రాణగొడ్డము. **وبال دوش** -దోష్ (పా) మోతబరువు, అనిష్టము, వృథాకష్టము. **وبال گردن** -గర్దన్ (పా) మెడభారము.

**وتد** వతద్ (అ.పు) మేకు, చీల, భూమిలోకి దిగగొట్టిన గూటము. **وتد العرض** -ఉల్,అర్జ్ (అ) పాతాళము, పాతాళలోకమునందున్నవారు, భూమికి రెండవవైపునున్నవారు.

**وتر** వతర్ (అ.పు) సమకోణ త్రిభుజములో కర్ణము. **وتر قوس** -ఎ, కౌస్- వింటినారి, చాపకర్ణము.

**وتیره** వతీర (అ.పు) మార్గము, త్రోవ, పద్ధతి, ఆచారము, అలవాటు, వాడుక, నడవడిక, వర్తనము. **نیک وتیره** నేక్- సన్మార్గుడు, మంచినడవడికగలవాడు.

**وثق** వసక్ (అ.పు) దార్ఢ్యము, శ్రద్ధ, నమ్మకము, విశ్వాసము.

**وثوق** వసూక్ -దార్ఢ్యము, స్థైర్యము, శ్రద్ధ, విశ్వాసము, నమ్మకము, స్థిరత, నిశ్చలత, నిశ్చయము.

**وثیق** వసీక్ (అ) దృఢమైన, గట్టి, స్థిరమైన, బలిష్ఠమైన.

**وثیقت** వసీకత్ (అ. స్త్రీ) దృఢత, స్థిరత, నిశ్చలత, విశ్వాసము, నమ్మకము, ఒడంబడిక, పత్రము, వ్రాతమూలకము.

**وثیقه** వసీక (అ.పు) దృఢత, స్థిరత, ఒడంబడిక, పత్రము, వ్రాతమూలకము.(ఆధానము, బంధము).

**وجاهت** వజాహత్ (అ. స్త్రీ) సురూపము, [illegible], ముఖవైభవ, ఆకారము, ముఖవర్చస్సు, గాంభీర్యము, గౌరవము, [illegible].

**وجب** వజబ్ (అ. స్త్రీ) జేన, జేనెడు.

**وجد** వజ్ద్ (అ.పు) ఆవేశము, ఆనందపారవశ్యము, యోగానందము, సమాధి, వైరాగ్యము, (దుఃఖము).

**وجدال** వజ్దాల్ (అ.పు) ఆవేశము, ఆనందపారవశ్యము, యోగానందము.

**وجع** వజా (అ.పు) రోగము, జబ్బు, దుఃఖము, బాధ, వ్యథ, పీడ, చింత. **وجع المفاصل** -ముఫాసిల్ (అ) కీళ్లనొప్పులు, వాతపుపట్లు. **وجع الاسنان** -ఉల్, అస్నాన్ (అ) పళ్లనొప్పి, పళ్లపోటు, చిగుళ్లనొప్పి. **وجع الظهر** -ఉల్, జహ్ర్ (అ) వెన్నునొప్పి, నడుమునొప్పి.

**وجوب** వుజూబ్ (హి.పు) ఆవశ్యకత, అగత్యము, కావలసియుండుట.

**وجود** వుజూద్ (అ) అస్తిత్వము, సత్వము, ఉనికి, జీవనము, (కృతార్థత), ప్రకృతి, సత్తు, వ్యక్తి, దేహము, శరీరము, కల్పన. **باوجود** బా-(పా)ఇది ఇట్లుండియు, మీదుమిక్కిలి, అయినను,అయినప్పటికిని.

**وجوہات - وجوہ** వుజూహ్ - వుజూహాత్ (అ. స్త్రీ) భరణము, జీతము, బత్తెము, పక్షము, మూలము, వాదము, ఆస్తి, ద్రవ్యము. (ఏ. వ **وجہ** )

**وجہ** వజ్హ్ (అ. స్త్రీ) ముఖము,ఆకారము, రూపము; హేతువు, కారణము; పద్ధతి, విధము, మార్గము. **وجہ تسمیہ** -తస్మియ (పా) నామకరణ హేతువు, నామవ్యుత్పత్తి కారణము, పేరువచ్చిన కారణము. **وجہ معاش** -మఆష్ (పా) బ్రతుకు తెరువు. ద్రవ్య సాధనము. **وجہ مخاصمت** -ముఖాసమత్ (పా) వ్యాజ్యమూలము, క్షేపకారణము, వివాద హేతువు. **وجہ موجہ** -మువజ్జహ్ (పా) ప్రబల కారణము. **وجہ حال** -హాల్- స్థితిగతులు, జీవనోపాయము.

**وجہا** వజ్హా (అ.పు) జీతము, బత్తెము, భరణము.

**وجیہہ** వజీహ్ (అ) అందమైన మోముగల, సురూపిమైన,అందమైన, గౌరవనీయమైన, నాజూకైన.

**وحدانیت** వహ్దానియత్ (అ.స్త్రీ) ఏకత్వము, ఏకేశ్వర సిద్ధాంతము, ఈశ్వరుడు ఒకడే యనుట.

**وحدت** వహ్దత్ (అ.స్త్రీ) ఏకత్వము, అద్వియత, ఒకటిగానుండుట.

**وحش** వహ్ష్ (అ.పు) అడవి మృగము, మచ్చికపడనిది, జాంగలము.

**وحشت** వహ్షత్(అ.స్త్రీ) బెదరు, భయము, భీతి, జాంగలత, కిరాతకము, అనాగరికత, క్రౌర్యము, అడలు, వ్యసనము, నిర్మానుష్యత, రౌద్రత, భయాసకత, ఏకాకిత్వము, భయమును పుట్టించునట్లుండుట. **وحشت اثر-انگیز-ناک** -అస్ర్ -అంగేజ్-నాక్ (పా) అమానుషమైన, భయానకము, భయంకరము, రౌద్రమైన.

**وحشی** వహ్షీ (అ) వన్యము, అడవి సం॥, జాంగలము, అమానుషము, క్రూరమైన, అనాగరికమైన, కిరాతకమైన, అడవి మృగము, కిరాతుడు, మృగము.

**وحل** వహల్ (అ.స్త్రీ) బురద, ఊబి.

**وحوش** వహూష్ (అ) అడవి జంతువులు (ఏ.వ **وحش** ).

**وحی** వహీ (అ.స్త్రీ) ఈశ్వరాదేశము, ఈశ్వర ప్రేరణ, దేవవాణి. ఆకాశవాణి.

**وحید** వహీద్ (అ) ఏకము, ఏకాకి. అద్వితీయము,ఒంటరి. **وحید العصر-وحید الدھر** -ఉల్,అస్ర్ -ఉద్,దహ్ర్ (అ) సమకాలికులలో అద్వితీయుడు.

**ود** వద్ (అ.పు) ప్రేమ, మైత్రి, చెలిమి; తెలివిగల మిత్రుడు, చెలికాడు.

**ودود** వదూద్ (అ.పు) ప్రేమగల, మైత్రిగల, చెలిమిగల, ఈశ్వరుడు.

**وداع** విదా (అ.స్త్రీ) వీడుకోలుపు, అంపకాలు, సెలవు పుచ్చుకొనుట. **الوداع** అల్- (అ) వీడుకోలుపు, రంజానులో కడపటిశుక్రవారము. **وداع کرنا** -కర్నా(ఉ) సెలవుపుచ్చుకొనుట, వీడ్కోలుపుట.

**وداعی** విదాయీ (అ) వీడ్కోలు సం॥, వీడ్కోలుచేయుట, వీడ్కోలు పు.

**ودیعت** వదీఅత్ (అ) పూచీధనము,పూటసొమ్ము, నమ్మికకొరకుగాను పెట్టిన ద్రవ్యము, ఒకరి వద్ద నుంచిన సొత్తు. **ودیعت حیات** -ఎ,హయాత్ (అ) మరణము.

**ور** వర్ (పా) అయితే, ఒకవేళ; పిల్లలు వారిపేరోను కోయ్యపలక; కలవాడు, వంతుడు, మంతుడు అను అర్థముల నిచ్చు ప్రత్యయము; వరము, మేలుతరము, పైచేయిగానున్న, మీరిన, పైగానున్న.

**وراء - ورے** వరా-వరే (అ) వెనుక, వెనుకభాగము, తరువాత, ఆవల, ఆవలి భాగము, పిదప, ఇదికాక, ఇంకను, ఇంతే కాక.

**وراثت** విరాసత్ (అ.స్త్రీ) ఉత్తరాధికారము, పిత్రార్జితము. **وراثت نامہ** -నామ- ఉత్తరాధికారపత్రము.

**وراد** వర్రాద్ (అ.పు) తోటవాడు, మాలి.

**ورثہ** వరస (అ.పు) ఉత్తరాధికారులు, (ఏ.వ **وارث**)

**ورثہ** వర్స (అ.పు)పిత్రార్జితము,(ఉత్తరాధికారమువలన వచ్చిన)ఆస్తి.

**ورد** వర్ద్ (అ.పు) పన్నీరు పువ్వు, పువ్వు, పూరేకు, పుష్పదళము.

**ورد** విర్ద్ (అ.పు) ఎడతెగని పరిశ్రమ,నిత్యకృత్యము, ప్రతిదినపుపని, నిత్యపారాయణము; కురాను షరీపునందలి భాగము, జపము, మతగ్రంథపారాయణము; అందుబాటు, దిగుచోటు. **ورد کرنا** -కర్నా (ఉ) జపించుట, పారాయణముచేయుట.

**وردی** వర్దీ (హి. స్త్రీ) రాజభటులదుస్తులు, రాజమందిరములు మొ॥వానిలో నియమిత కాలములలో వాయించు వాద్యము, దైనందినవాద్యము, దిన వృత్తాంతము, దిన వార్త.

**ورزش** వర్జిష్ (పా. స్త్రీ) దేహ పరిశ్రమ, పరిశ్రమము,ఆచారము,అలవాటు, కాయక్లేశము.

**ورزشی** వర్జిషీ (పా) దేహ పరిశ్రమ చేసిన, పరిశ్రమచేసిన, దృఢకాయమైన.

**ورطہ** వర్త (అ.పు) ప్రాణాంతకస్థలము, అనారోగ్యము, అజ్ఞానము, పద్మవ్యూహము(చిక్కు), ప్రాణగండము, దిగ్భ్రమ, సంకటము, అపాయస్థితి; నీటిసుడి, సుడిగుండము.

**ورع** వరఉ (అ. స్త్రీ) దైవభీతి, పాపభీతి, నిష్ఠ, నియమము, ఇంద్రియ నిగ్రహము, త్యాగము, సహనము, బ్రహ్మచర్యము.

**ورغلانا** వర్‌గలానా (హి) భ్రమపెట్టుట, పురికొల్పుట, ఎక్కుపెట్టుట, లేని పోని ఆశపెట్టుట,బుజగరించుట,మోసపుచ్చుట.

**ورق** వరక్ (అ.పు) పత్రము, ఆకు, కాకితపు పొరట, పొర, పలుచని రేకు, ఆట చీటి. **ورق الخیال** -ఉల్,ఖియాల్- గంజాయిభంగు.

**ورم** వరమ్ (అ.పు) వాపు, ఉబ్బు.

**ورنہ** వర్న (పా) కానియెడల,అట్లుకానిచో, లేనియెడల, మరి,

**ورود** ఉరూద్ (అ.పు) ఆగమనము, రాక, అవతరణము, దిగుట, దర్శనము.

**وزارت** వ(వి)జారత్ (అ. స్త్రీ) మంత్రి

త్వము, మంత్రిపదము, మంత్రి సభ.

**وزان** వజ్జాన్ (అ.పు)(మహాతోలకుడు), దండికవీశ్వరుడు.

**وزر** వి(వ)జ్ర్ (అ.పు) అపరాధము, పాపము, తప్పు, భారము, ఆయుధములు, శిక్ష.

**وزرا** ఉజేరా [అ.పు] మంత్రులు (ఏ.వ وزیر).

**وزن** వజేన్ (అ.పు) భారము, బరువు; తూనిక, తోల, మానము; పరీక్ష, ఛందస్సు, గణములు, మాత్రసంఖ్య, వృత్తము; గౌరవము, పరువు.

**وزیده** వజీద (పా) వీచిన, విసరిన(గాలి); పెరిగిన.

**وزیر** వజీర్ (అ.పు) మంత్రి, రాజ్యాంగమంత్రి, ప్రధాని. **وزیر اعظم وزیرالوزرا** -ఎ,ఆజీమ్ -ఉల్, వుజేరా- ప్రధానమంత్రి.

**وزیری** వజీరీ (అ.స్త్రీ) మంత్రి పదము, మంత్రిసభ.

**وساده** విసాద (అ.పు) గద్దె, సింహాసనము; దిండు, పరుపు.

**وساطت** వసాతత్ (అ.స్త్రీ)మాధ్యస్థము, నడుమనుండుట, మాధ్యవర్తిత్వము, సంబంధము, మూలము, మధ్యస్థము, సాధనము, సహాయము.

**وسائد** వసాయిద్ (అ) పరుపులు, దిండ్లు, గద్దియలు, (ఏ.వ وساده).

**وسالت** వసాలత్ (అ.స్త్రీ) మాధ్యస్థము, మధ్యవర్తిత్వము, నడుమనుండుట,కూడిక, సంధి, స్నేహము.

**وساوس** వసావిస్ (అ.పు) పురికొల్పుట దురోృధలు,దుష్టప్రేరణలు (ఏ.వ وسوسه).

**وسائل** వసాయిల్ (అ.పు) సాధనములు, కారణములు (ఏ.వ وسیله).

**وسط** వసత్ (అ.స్త్రీ) మధ్యము, నడుము; మధ్యమము, నడిమి; ఉచితము, రౌాగ్యము, మితమైన, న్యాయమైన, సరాసరియైన.

**وسطانیه** వస్తానియ (అ) మాధ్యమికము, నడిమి. **مدرسہ وسطانیه** మదర్సె-(అ) మాధ్యమిక పాఠశాల

**وسطی** వసతీ (అ) మధ్యస్థమైన. నడిమి. మితమైన.స. సరియైన. **وسطی ممالک** -ముమాలిక్-మధ్యపరగణాలు.

**وسع** వస్ఎ (అ. స్త్రీ) వైశాల్యము,ఎడము.

**وسعت** వస్అత్ (అ.స్త్రీ) వైశాల్యము; విస్తారము, పరిమాణము, విపులత, చేదరము, ఎడము, చోటు, అవకాశము, విరామము.

**وسمه** వస్మ (అ.పు) నీలియాకులు, నీలి,ఒకవిధమైన అద్దకపు బట్ట.

**وسواس** వస్వాస్ (అ.పు) భ్రమ, భ్రాంతి, సంకోచము, అనుమానము, శంక, సంశయము, సందేహము, భయము, మూఢ విశ్వాసము.

**وسواسی** వస్వాసీ (అ) భ్రాంతుడు, సందేహించు, సంకోచించు,భ్రమపడు,భయపడు.

**وسوسه** వస్వస (అ.పు) భ్రమ,సంకోచము, అనుమానము, భయము,మూఢవిశ్వాసము, సందేహము, దురోృధ, దుష్టప్రేరణ.

**وسیع** వసీఎ (అ) విశాలమైన.విసాగమైన

ఘటమునుగల.

**وسیلہ** వసీల (అ.పు) మాధ్యస్థము; సాధనము, మూలము, సంబంధము, సహాయము, ఆశ్రయము, బలము, కారణము, నిమిత్తము. **وسیلہ دار** -దార్ (పా) ఆశ్రితుడు, ఆశ్రయము గలవాడు. **وسیلۂ فاسد** ఎ ఫాసిద్ (అ) అక్రమసాధనము.

**وسیم** వసీమ్ (అ) ముద్దుమోముగల, అందమైన, సలక్షణమైన.

**وش** వష్ (పా) పోలిక, పోలికగల (ప్రత్యయంగు).

**وشاق** వుషాక్ (పా.పు) బానిస, కింకరుడు.

**وصاف** వస్సాఫ్ (పా) మహాస్తోత్రి పొగడుడు, చాలపొగడువాడు, శ్లాఘించువాడు.

**وصال** విసాల్ (అ.పు) సందర్శనము, కలియుట, సంయోగము, సంభోగము, కూడిక, సిద్ధి పొందుట (మత గురువులు మొ॥ వారు స్వర్గస్థులగుట), మరణము.

**وصایا** వసాయా (అ. స్త్రీ) మరణశాసనము, చూడు (ఏ.వ **وصیت** ).

**وصف** వస్ఫ్ (అ.పు) సుగుణము, గుణము, లక్షణము. విశేషము, యోగ్యత, వర్ణన, శ్లాఘన, స్తోత్రము.

**وصل** వసల్ (అ.పు) సందర్శనము, కలయుక, కూడుట, సంగమము, సహవాసము, సంభోగము; అతుకు, జోడింపు.

**وصلت** వస్లత్ (అ. స్త్రీ) సంయోగము, కూడిక, కలయిక; అతుకు, జోడింపు.

**وصلہ - وصلہ** వస్లహ్ - వస్ల (పా.పు) చీరిక, పీలిక, తునక.

**وصلی** వస్(స)లీ (అ. స్త్రీ) కలిసిన, చేరిన, రెండు కాగితములు అతికించి వ్రాయ వ్యాసించుటకు చేసిన అట్ట, సన్నని అట్ట, అటువంటి కాగితము.

**وصمت** వస్మత్ (అ. స్త్రీ) నింద, దూషణము, అవమానము, అపకారము, తప్పు.

**وصول** వసూల్ (అ.పు) ఆగమనము, వచ్చుట, చేరుట, చెందుట, ముట్టుట, ప్రాప్తి, ముట్టినది, ఆదాయము, వచ్చినట్టి, ముట్టినది, చెల్లు, సంగ్రహము. **وصول باقی** బాకీ — (అ) వచ్చినది రానున్నది, వచ్చినది రానిది, ప్రాప్య ప్రాప్తి, ప్రాప్తి లెక్కలు. **وصول کرنا** -కర్నా (ఉ) రాబట్టుట, రాబట్టుకొనుట.

**وصی** వసీ (అ.పు) మరణ శాసన పరిపాలకుడు, మరణశాసన నిర్వాహకుడు.

**وصیت** వసీయత్ (అ. స్త్రీ) మరణశాసనము, మరణ ఆదేశము. **وصیت نامہ** -నామహ (పా) మరణశాసనము(పత్రము).

**وصید** వసీద్ (అ. స్త్రీ) వాకిటిముందరిపంచ, ముఖమంటపము, వాకిలి, ముఖద్వారము.

**وضاعت** వజాఅత్ (అ. స్త్రీ) నీచత, చిన్నతనము; అవమానము, తలవంపు.

**وضع** వజా (అ. స్త్రీ) పోలిక, రచన, పొత, కల్పన, చేత, చేయుట, ఉనికి, అందము, రూపురేఖలు, ఆకారము, రూపము, పద్ధతి, వైఖరి, స్థితి, గతి, వర్తనము, రీతి, శైలి; తీసివేత, తగ్గింపు, వ్యవకలనము. **وضع دار** -దార్ - వైఖరిగల, పొంకముగల, శృంగారముగల, సొగసైన. **وضع حمل** -హమల్ (అ) గర్భస్రావము, కడుపుదిగిపోవుట, కానుపు.

**وضو** వజూ (అ.పు) మార్జనము, నమాజునకు ముందు ముఖము మొ॥నవి కడిగికొనుట, ప్రక్షాళనము. **وضو ٹوٹنا** -టూట్నా (ఉ) అశుచియగుట, మైలపడుట.

**وضوح** వజూహ్ (అ.పు) నిదర్శనము, సాక్ష్యము, ప్రత్యక్షము.

**وضیع** వజీఅ (అ) నీచము, తుచ్ఛము; పూచీసొమ్ము, పూటసొత్తు.

**وطد** వతిద్ (అ) దృఢము, గట్టి, నిశ్చితము, దృఢీకృతము.

**وطر** వతర్ (అ.పు) ఆవశ్యకత, కావలసియున్నది, ఉపయోగము.

**وطن** వత్(త)న్ (అ.పు) జన్మభూమి, స్వదేశము, నివాసము, ఉనికిపట్టు.

**وطنی** వత్నీ (అ) స్వదేశీయము, దేశీయము.

**وظائف** వజాయిఫ్ (అ.పు) జీతములు, బత్తెములు; జపములు. (ఏ.వ وظیفہ )

**وظیفچی** వజీఫ్‌చీ (అ) నైష్ఠికుడు (నిందా గర్భముగా).

**وظیفہ** వజీఫ (అ) నిత్య కృత్యము, నిష్ఠ, నిత్యము, నియమము, ఉపకార వేతనము, దినబత్తెము, జీతము, బత్తెము, భరణము, భృతి; దినపారాయణము, జపము. **وظیفہ خور - دار** - ఖార్-దార్- భృతిదారుడు, ఉపకారవేతనము గొనువాడు, భృతిమంతుడు, భృతిగొనువాడు.

**وعدہ** వఅద (అ.పు) వాగ్దానము. ప్రతిజ్ఞ, ఒడంబడిక, నియమితము, నిర్ణయము, నిర్ణీతము, శపథము, నియమితకాలము, మేర, మరణకాలము. **وعدہ خلاف**- ఖిలాఫ్- ఆడితప్పువాడు, కల్లరి. **وعدہ خلافی شکن** ఖిలాఫీ - షికన్ - ఆడితప్పుట, అసత్యవాదము. **وعدہ فراموش** -ఫరామూష్ (పా) ఆడిమరచువాడు, మాట గట్టిలేనివాడు. **وعدہ وعید** -వఈద్ (అ) రిక్త వాగ్దానము, వాగ్దానములతో కాలముగడుపుట, రేపురేపనుట, వట్టి మాటలు. **وعدہ وفا** -వఫా(అ) ఆడితప్పనివాడు, సత్యవాది.

**وعظ** వఅజ్ (అ.పు) ఉపదేశము, జ్ఞానోపదేశము, బోధ, మతోపన్యాసము, నీతిబోధ, మతబోధ. **وعظ کرنا** - కర్నా (ఉ) మతోపన్యాసముచేయుట, నీతిబోధచేయుట, నైతికోపన్యాసము, మతముపన్యసించుట.

**وعید** వఈద్ (అ. స్త్రీ) దుశ్శపథము, అపకార శపథము, కీడు చేసెదనను ప్రతిజ్ఞ, బెదరింపు.

**وغا** వగా (అ. స్త్రీ) యుద్ధము, జగడము, అల్లరి, దొమ్మి, కల్లోలము.

**وغیرہ** వ్గైరా (అ) మొదలైనవి, మొదలుగాగలవి, అటువంటివి, ఆదులు, ఆదిగాగలవి.

**وفا** వఫా (అ) చెల్లింపు, పలికిబొంకమి, ఆడితప్పమి, యదార్థత, నెరవేర్పు, నిర్వాహము, చెల్లింపు, విశ్వాసము, విశ్వాసపాత్రత, నమ్మకము, మాటనిలుపుకొనుట వాగ్దానము నెరవేర్చుట. **وفا بیگانہ** - బేగాన (పా) కృతఘ్నుడు, విశ్వాసరహితుడు, విశ్వాసములేని. **وفا پرست** - పరస్త్ (పా) కృతజ్ఞుడు, విశ్వాసవంతుడు.

పరువు, పెత్తనము, శాంతమైన, నిదానమైన, నెమ్మతిగల, గంభీరమైన,

**وقعت** వక్ అత్ (అ. స్త్రీ) భారము, ప్రాబల్యము, బలము, ఔన్నత్యము, గౌరవము, పరుపతి, మర్యాద, నమ్మకము, పరువు.

**وقف** వక్ఫ్ (అ.పు) నిలుకడ, నిలుచుట, స్థిరత, నిదానము, ఆపుదల, విరామము, విశ్రాంతి, ధర్మసొత్తు, ధర్మార్థము, తెలివి, జ్ఞానము. **وقف نامہ** - నామ (పా) దానపత్రము.

**وقفہ** వక్ఫ (అ.పు) నిలుకడ, వ్యవధి, విరామము, విశ్రాంతి, ఆపుదల.

**وقفیت** - వక్ఫియత్ (అ. స్త్రీ) దానపత్రములపట్టిక, చూడు **واقفیت**

**وقوع** వకూఅ (అ.పు) సంఘటనము, సందర్భము, పతనము, అవతరణము, అగుట, జరుగుట, వర్తనము, నైమిత్తికము.సంగతి, తటస్థించుట. **وقوع میں آنا** -మేం ఆనా (ఉ) సంభవించుట,సంఘటించుట, జరుగుట.

**وقوعہ** వకూఅః (అ.పు) జగడము, దొమ్మి, అల్లరి, ఆపత్తు, నైమిత్తికము,అపాయము; చూడు **واقعہ**.

**وقوف** వకూఫ్ (అ.పు) జ్ఞానము, అనుభవము, తెలివి, వివేకము, యోగ్యత. **وقوف دار** -దార్ (పా) అనుభవజ్ఞుడు.

**وکالت** వ(వి)కాలత్ (అ.స్త్రీ) ఒకరిపనిని మరియొకరుచేయుట, దూత్యము, రాయబారము, ప్రతినిధిత్వము, పరార్థవాదము, పక్షవాదము, పుంచి, పూట. **وکالت کرنا** -కర్నా (ఉ) పక్షవాదముచేయు, పరార్థవాదముచేయు, ఒకరికైపనిచేయు. **وکالت نامہ** -నామ (పా) ప్రతినిధిత్వము, ప్రాతినిధ్య పత్రము, పక్షవాద పత్రము.

**وکیل** వకీల్ (అ.పు) పక్షవాది, పరార్థవాది, ప్రతినిధి, రాయబారి, ఒకరికైపని చేయువాడు. **وکیل عام - مطلق** - ఆమ్-ముత్లక్ (అ) సర్వస్వతంత్రప్రతినిధి, సర్వస్వతంత్ర పక్షవాది, సర్వాధికారి.

**وگر** వగర్ (పా) అయినను, అయితే, అయినప్పటికిని, ఒకవేళ, అయిన పక్షమున, గుడల. **وگرنہ** -న(పా) కానట్టయిన, కానియెడల, కాకున్న.

**ولا** వలా (పా. స్త్రీ) కాలము.ఋతువు; విషయము.వ్యవహారము. **دریں ولا** దరీ- (పా) ఇప్పటి కాలములో, ఈదినములలో, ఇటీవల, ఇప్పుడిప్పుడు.

**ولاد** విలాద్(అ. స్త్రీ) ప్రజననము,పుట్టించుట,

**ولادت** విలాదత్ (అ. స్త్రీ) జననము, పుట్టుక.

**ولایت** విలాయత్ (అ. స్త్రీ) దేశము, ప్రాంతము, ఖండము, సీమ, పరదేశము, రాజ్యము, రాష్ట్రము, ఒకరిపనికైపూచి, పూట, ఆచార్యత్వము, మహాపురుషత్వము, సిద్ధి, ఈశ్వరసాన్నిధ్యము, సిద్ధపురుషత్వము. **ولایت پانا** - పానా (ఉ) సిద్ధుడగుట, ఈశ్వర సాన్నిధ్యము నొందుట.

**ولایتی** - విలాయితీ (అ) పరదేశస్థుడు, పరదేశి, ఫిరంగిదేశస్థుడు, యవనుడు, సీమ

పాడు, అజ్ఞానము. అరణ్యము, ఎడారి, నిర్మానుష్యము, జనరహితమైన.

**ویرانہ** వీ(వై)రాన (పా.పు) పాడు, అజ్ఞానము, అరణ్యము. అడవి, ఎడారి, నిర్మానుష్యము.

**ویرانی** వైరానీ(పా. స్త్రీ) పాడుపడుట, బీడుగానున్నది, పాడుగానుండుట, అధ్వానం, నాశము, ధ్వంసము, పాడు.

**ویسا - ویس** వైస్ - వైసా (హి. స్త్రీ) వైశ్యుడు, కోమటి; వయస్యుడు.

**ویسا** వైసా (హి) అట్లు, ఆరీతి, అటుల, అటు. **ویسا کا ویسا** - కా వైసా(హి) ఉన్నది ఉన్నట్లు, యథా పూర్వముగా.

**ویسے** -సే (హి) అట్లే, అలాగే, ఆరీతినే.

**ویش** వేష్ (హి) వేషము, దుస్తులు, ఆభరణములు; వైశ్యులు.

**ویل** వైల్ (అ.పు) దుర్దశ, విపత్తు, పాపఫలము, నీకు కీడగుగాక యను తిట్టు.

**ویل کش** -కష్ (పా) వైర బుద్ధిగల, వైరబుద్ధిగోరు, పగదీర్చుకొనగోరు,

**ویل** వేల్ (పా.పు) జయము, ఆధిక్యము, బాగు, మేలు; కనుమ, ఖాతము.



**ہ** హే (అ.పు) హకారము. ఇది ఉరుదూ వర్ణమాలలో ముప్పది నాలుగవ యక్షరము. అరబీలో నిరువదియేడవది. పారసీకములో ముప్పది యొకటవది. అరబీ అబ్జదు వర్ణసాంఖ్యమందు యిది అయిదునకు సంజ్ఞగా వాడబడును.

**ہا** హా (హి) హా, అయ్యో, అక్కటా, కటకటా; కాదు, కూడదు.

**ہابوا** హాబూడా(హి.పు) దోపిడిగాడు, తోవలు కొట్టువాడు, తెరవాటుగాడు, బూచివాడు(పిల్లలను భయపెట్టుటకు),

**ہاپو** హాపూ (ఈ.పు) పిల్లలకుతినిపించు నల్లమందు.

**ہاتف** హాతిఫ్ (అ.పు) దేవత, దేవవాణి, ఆకాశవాణి, అధిదేవత.

**ہاتھ** హాథ్ (హి.పు) హస్తము, చేయి, కరము, అరచేయి; అధీనము, స్వాధీనము; హేతువు, మూలము, దెబ్బ, మూర, సంరక్షణ, శక్తి. సామర్థ్యము. **ہاتھ اُترنا** -ఉతర్నా (హి) చేతి యెముక జారుట, యెముకతొలగుట. **ہاتھ اوٹ لینا** -ఓట్ లేనా (హి) చేతులు అడ్డముపెట్టుటచే తనను కాపాడు కొనుట లేక దెబ్బ మొ॥వానినుండి తప్పించుకొనుట. **ہاتھ اُٹھا لینا** =ఉఠా లేనా (హి) చేయి వదలించుకొనుట, సంబంధము వదలుకొనుట, వేరగుట. **ہاتھ اُٹھانا** -ఉఠానా (హి) చేయియెత్తుట, సలాముచేయుట, దండముపెట్టుట, (దీవించుట, శపించుట), సంబంధము వదలుకొనుట, కొట్టబోవుట, చెయిమీరుట, చెయిజేసికొనుట, నిరాశజెందుట(దానముజేయుటకు). **ہاتھ آنا**

విడుపు. ہاتھ چلانا -చలానా (హి) చేయిచేసికొనుట, కొట్టుట.చెయిమీరుట, దొంగతనముచేయుట, ہاتھ چلنا - చల్నా (హి) చేయిసాగుట, కలిగి యుండుట, ద్రవ్యవంతుడైయుండుట, పని సాగుట,కొట్టుకొనుట,కొట్టుట, దొంగతనము చేయు అలవాటుపడుట, పనిచేయు చుండుట, ہاتھ دھو کر (کے) پیچھے پڑ جانا -ధోకర్ (కె)పీఛే పడ్ జానా(హి) వెంటదగిలి బాధించుట, పగగొనుట,అన్ని పనులు వదలి యేదో ఒక పనినే పూను కొనియుండుట, పగ సాధించుట. ہاتھ دھونا -ధోనా (హి) చేతులు కడుగు కొనుట, సంబంధము వదలుకొనుట,నిరాశ జెందుట. ہاتھ دینا -దేనా (హి) చేతిలో చేయివేయుట, వాగ్దానముచేయుట, ప్రశంసించుట, మెచ్చుకొనుట, సహాయముచేయుట. ہاتھ ڈالنا -డాల్నా (హి) చేయివేయుట, సంబంధము కలుగ జేసికొనుట, పూనుకొనుట, జోక్యము పుచ్చుకొనుట, అడ్డు తగులుట. ہاتھ روکنا -రోక్నా (హి) చేయి చాలించుట, చేతి నాపుదల జేసికొనుట, చాలించుట, ఆపుట, నిలుపుట, వదలు కొనుట, వ్యయము తగ్గించుట. ہاتھ سمیٹنا -సమేట్నా (హి) చేయి ముడిచికొనుట, చేతిని వెనుకకు తీసికొనుట, చాలించుట, వదలుకొనుట, ఇవ్వకుండుట. ہاتھ سوجانا -సో జానా (హి) చేయి తిమ్మిరి పట్టుట. ہاتھ صاف کرنا -సాఫ్ కర్నా (ఉ) చేయి మెదుపుకొనుట, అభ్యాసము జేసికొనుట, దెబ్బకొట్టుట, అపకారముజేయుట, చంపుట, పాడు జేయుట.

ہاتھ کانوں پر رکھنا -కానూఁ పర్ రఖ్నా (హి) చెవులుమూసికొనుట. కాదు అనుట, లేదుఅనుట, ఎరుగననుట,సలాము జేయుట (ఢిల్లీ బాదుషాలకు దర్బారులో సలాముజేయుపద్ధతి). ہاتھ کھینچنا -ఖీంచ్నా (హి) చేయిముడిచికొనుట,వదలుకొనుట, చాలించుట. ہاتھ لگانا -లగానా (హి) చేయివేయుట, తాకుట, పనిపూనుట, మొదలుపెట్టుట, చేపట్టుట, సహాయముజేయుట,కదలించుట. చేయి జేసికొనుట, కొట్టుట, పందెముకట్టుట. ہاتھ لگنا -లగ్నా (హి) చేతికిచిక్కుట,దొరకుట, లభించుట. ہاتھ مارنا -మార్నా (హి) చేతిలోచేయివేయుట, వాగ్దానముజేయుట, పందెముకట్టుట, సంపాదించుట, కత్తి విసరుట,కొట్టుట,దబ్బుదబ్బున తినుట, స్వాధీన పరచుకొనుట, దొంగిలించుట, అపహరించుట. ہاتھ ملانا -మిలానా (హి) చేతులు కలుపుకొనుట, జట్టిపట్టుకుసిద్ధమగుట, దానము జేయుట. ہاتھ ملنا -మల్నా (హి) చేతులు పిసికికొనుట, పశ్చాత్తాప పడుట, దుఃఖించుట,చింతిలుట, దిగులుపడుట. ہاتھ میں دل لینا -మేఁదిల్ లేనా(హి)మెప్పించుట,సంతోషపెట్టుట. ہاتھا پائی హాథా పాయీ (హి) పెనగులాట,తన్నులాట, పోట్లాట, కాలజేత తన్నుకొనుట, ముష్టియుద్ధము. ہاتھوں ہاتھ హాథూఁ హాథ్ (హి) చేతులమీద, వెంటది వెంటనే, అప్పటికప్పుడే, తక్షణమే.

ہاتھی హాథీ (హి.పు) హస్తి, ఏనుగ. ہاتھی پاؤں -పావూఁ (హి) ఏనుగ కాలు, బోదకాలు. ہاتھی دانت హా

ఊగులాట, చలనము, కంపము, అదరుట, భూకంపము.

ہالک హాలిక్ (అ) మారకమైన, చంపెడు, చంపునది, మృత్యుదాయకము, మృతుడు, చచ్చినవాడు.

ہالہ హాల (అ.పు) పరివేషము, చంద్రపరివేషము, గుడి(చంద్రునిచుట్టు), వృత్తము, కుండలి, చుట్టు, గిర, వలయము.

ہالی హాలీ (హి.పు) హాలికుడు, దున్నువాడు.

ہامون హామూన్ (అ.పు) ఎడారి, బయలు, ہامون نورد -నవర్ద్ (పా) ఎడారులుతిరుగువాడు, తెరువరి, సంచారుడు.

ہامی హామీ (హి.స్త్రీ) ఆమోదము, సరియనుట, దృఢపరచుట, ప్రోద్బలము, బలపరచుట, ఒప్పుకొనుట, భారము, భారము వహించుట. ہامی بھرنا - భర్నా (ఉ) భారము వహించుట, ఒప్పుకొనుట, అవుననుట, బలపరచుట, వాగ్దానము చేయుట, ఆమోదించుట.

ہاں హాఁ (హి-ఉ) అవును, అగును, సరే, మంచిది, నిశ్చయము, నిజము, అవ్లే, ఈడ, ఇక్కడ.

ہانپنا - ہانپنا హాంప్నా -ఫ్నా (హి) ఎగరోజుట, రొజుట, ఊపిరి ఎగబోయుట.

ہانڈی హాండీ (హి.స్త్రీ) వంటపాత్ర, కుండ, భాండము, తపిలె. ہانڈی پھوڑنا -ఫోడ్నా (హి) గుట్టు బయటపెట్టుట, రహస్యము వెల్లడిపరచుట.

ہانسی హాంసీ (హి.స్త్రీ) నవ్వు, పరిహాసము, వేళాకోళము.

ہانک హాంక్ (హి.స్త్రీ) కేక, అరుపు, తోలుట. ہانک پکار -పుకార్ (హి.పు) అల్లరి, గందరగోళము, కోలాహలము, కేకలు బొబ్బలు. ہانک مارنا -మార్నా (హి) కేక వేయుట, పిలుచుట.

ہانکا ہانک హాంకా- (హి) వైవైన తోలుట, ఎడతెగకతోలుట, పరుగెత్తించుట, వడిగాతోలుట.

ہانکنا హాంక్నా (హి) పశువులను తోలుట, ముందుకు నడుపుట, కేక వేయుట, పిలుచుట. ہانکنا دام -దామ్- (హి) ఎక్కువవెల అడుగుట. ہانکنا دونکی దూంకీ- (హి) జంబాలుగొట్టుట.

ہانکی హాంకీ (హి.స్త్రీ) సన్నజల్లెడ (మయిదాపిండి జల్లెడ), పేవెలజల్లెడ.

ہاون హావ(వు)న్ (పా.స్త్రీ) ఖల్వము, ఇనుపరోలు. ہاون دستہ -దస్త (పా.పు) ఖల్వమురాయి.

ہاہا హాహా (హి.స్త్రీ) ముఖస్తోత్రము, దేబిరింత, ప్రార్థన, వేడికోలు, హాహా, ఆహా, అయ్యో, అక్కటా. ہاہا کھانا -ఖానా (హి) దేబిరించుట, మిక్కిలి వేడుకొనుట, హీనముగా అడుగుకొనుట.

ہاہاکار హాహాకార్ (హి.పు) హాహారవము, శోకము, దుఃఖము; జయజయ రవము.

ہائے హాయె (ఉ.స్త్రీ) హా, అయ్యో, అక్కటా, ఉసురు, శాపము. ہائے رے -రే (ఉ) అయ్యో, భళిరే.

ہائل హాయిల్ (అ) భయానకము, భయంకరము; దొడ్డ, పెద్ద.

ہبڑا హిబ్డా (హి.పు) మిట్టపండ్లవాడు.

ہبوط హబూత్ (హి.పు) అవతరణము, దిగుట.

ہبہ హిబ (అ.పు) దానము, బహుమానము. ہبہ نامہ -నామా (అ) దానపత్రము.

ہپ హాప్ (హి.స్త్రీ) గుటుక్కు (మ్రింగు చప్పుడు). ہپ کرنا -కర్నా (హి) గుటుక్కున మ్రింగివేయుట, దిగమ్రింగుట, అపహరించుట.

ہپا హప్పా (హి.పు) మెత్తని ఆహారము, మెత్తగావండినది, గుజ్జుగా నున్నది, కబళము, లంచము.

ہپو హప్పూ (హి.స్త్రీ) బోసినోటిది, చాల ముసలిది.

ہتا హత్తా (హి.పు) పిడి, తిరుగలిమొ॥వాని పిడి, పట్టు, చెంగలి, సానిపాప్యము, గొల, గెల (అరటికాయ మొ॥నవి). ہتا مارنا -మార్నా (హి) దొంగిలుట.

ہتک హత్క్-హతక్ (అ.స్త్రీ) అవమానము, పరాభవము.

ہتوڑا హతోడా (హి.పు) (కమ్మరివాని) సుత్తె, సమ్మెట.

ہتوڑی హతోడీ (హి.స్త్రీ) సుత్తె(చిన్నది).

ہتھ హాథ్ (హి.పు) హస్తము, చేయి; చూడు ہاتھ అను పదము. ہتھ پھول -ఫూల్ (హి) ఒకబాణవిద్దె, పూలబాణము. ہتھ پھیر -ఫేర్ (హి) చేతితో నిమురుట, హస్తలాఘవము, అపహరించుట, చేబదులు, బాగాతినుట. ہتھ کٹی -కటీ (హి) ఒకకత్తివాటు, ఎదుటివాని చేతిపై కొట్టుదెబ్బ. ہتھ کڑی -కడీ (హి) చేతిసంకెలలు. ہتھ کنڈا -ఖండా (హి) హస్తలాఘవము. ہتھ کل -కల్ (హి) తలుపుగడియ. ہتھ لیوا -లేవా (హి) పెండ్లిలో వధూవరులు ఒకరిచేతులొకరు పట్టుకొని యుండు ఒకకలాపము. ہتھ نال -నాల్ (హి) చిన్నతోపు,(ఏనుగుమీద పెట్టుకొని పోవునది); చేతిపని, మోసము, టక్కు.

ہتھا హాథా (హి.పు) చూడుము ہتا

ہتھنی హథ్నీ (హి.స్త్రీ) ఆడు ఏనుగు, హస్తిని.

ہتھی హథీ (హి.స్త్రీ) గుఱ్ఱపు గొరపము, మట్టు(గుఱ్ఱపుచేతులతో)సలుపుపని(పోసినకంతల ఉండును.)

ہتھیا (హి.పు) హస్తానక్షత్రము, హస్తకార్తి, వర్షము. ہتھیا کی راہ -రాహ్- ఆకాశగంగ.

ہتھیار హథియార్ (హి.పు) ఆయుధము, పనిముట్టు, గొగముట్టు. ہتھیار باندھنا -బాంధ్నా (హి) ఆయుధములుధరించుట. ہتھیار بند -బంద్ (హి) శస్త్రధారి (స్త్రీయున), ఆయుధములుధరించిన. ہتھیار بندی -బందీ (హి) శస్త్రధారణము, ఆయుధము ధరించుట. ہتھیار کرنا -కర్నా (హి) ఆయుధములతో పోరాడుట. ہتھیار گھر -ఘర్ (హి) శస్త్రాగారము. ہتھیار ہونا -హోనా (హి) యుద్ధముజరుగుట, పోట్లాటలుకలుగుట, పోరాటము జరుగుట.

ہتھیلی హథేలీ (హి.స్త్రీ) అరచేయి, చప్పట. ہتھیلی بجانا -బజానా (హి) చప్పట్లు కొట్టుట, పరిభవించుట. ہتھیلی پر سر رکھنا -పర్ సర్ రఖ్నా (హి) ప్రాణమునకు తెగించుట. ہتھیلی پر سرسوں جمانا -పర్ సర్ సోం జమానా (హి) అవలీలగాచేయుట, మాయ

జే యు ట, అళ్ళ్ప్రెట్టుట. ہتھیلی کھجانا -ఖుజానా (హి) అరచేయిదురదపెట్టుట, డబ్బువచ్చునని దనకనుపించుట.

ہٹ హట్ (హి. స్త్రీ) హఠము, మూర్ఖము; మొండితనము. ہٹ دھرمی -ధర్మి (హి) (హఠధర్మము), అన్యాయము, అక్రమము.

ہٹا کھٹا హట్టా ఖట్టా (హి) పుష్టిగల, కండగల, బలిసిన, బలిష్ఠమైన, ఆరోగ్యముగల, నిరోగమైన.

ہٹانا హటానా (హి) నెట్టుట, తొలగించుట, పారదోలుట, ఓడించుట, జరుపుట, మరలించుట, ఆపుట.

ہٹاو హటావ్ (హి. పు) వెనుదీయుట, మరలుట, వెనుకకుమరలుట, వెనుకకుపోవుట.

ہٹتال హట్‌తాల్ (హి. స్త్రీ) హఠతాళము, సమ్మె, సమ్మెకట్టు, పని చాలించుట.

ہٹنا హట్నా (హి) జరగుట, తొలగుట, వెనుదీయుట, ఓడిపోవుట, నిలిచిపోవుట, ఆపుదలయగుట.

ہٹوا హటూవా (హి. పు) అంగడివాడు.

ہٹھ హఠ్ (హి. స్త్రీ) హఠము.

ہٹیلا హటీలా (హి) హఠము చేయు, హఠశీలముగల, మొండి.

ہٹیا హటియా (హి. స్త్రీ) అంగడి, సంత.

ہجر హిజ్ర్ (అ. పు) వియోగము, త్యాగము, వీడుట, వదలుట, దేశత్యాగము.

ہجرت హిజ్రత్ (అ. స్త్రీ) త్యాగము, వియోగము, దేశత్యాగము,

ہجری హిజ్రీ (అ. స్త్రీ) మహమ్మదీయ శకము.

ہجم హజ్మ్ (అ. స్త్రీ) పైబడుట, పారదోలుట. ధ్వంసము జేయుట, లావు, ఘనము.

ہجو హజ్వ్—హజో (అ. స్త్రీ) నింద, దూషణము. ہجو ملیح -మలీహ్ (అ) నిందాగర్భితము.

ہجوم హుజూమ్ (అ. పు) గుంపు, సమూహము, మూక, జనసమూహము. ہجوم کر -కర్ (ఉ) గుంపు కూడుట, జనము చేరుట, జనముమూగుట.

ہجے హిజ్జె (అ. పు) గుణతము.

ہچر مچر హచర్ మచర్ (హి. స్త్రీ) వెనుకముందాడుట, సంకోచము. ہچر مچر کرنا -కర్నా (హి) సంకోచించుట, వెనుకముందాడుట.

ہچکا హచ్‌కా (హి) దెబ్బ, తాకుడు, కదలిక, అదరుట, అదరు.

ہچکچانا హిచ్‌కిచానా (హి) సంకోచించుట, వెనుకముందాడుట, అనుమానించుట.

ہچکچی హిచ్‌కిచీ (హి. స్త్రీ) సంకోచము, అనుమానము, వెనుకాట.

ہچکنا హిచక్నా (హి) సంకోచించుట, వెనుదీయుట, శంకించుట. జంకుట, వెనుకాడుట.

ہچکولا హచ్‌కోలా (హి. పు) కదలిక, అదురు, తాకుడు.

ہچکی హిచ్కీ (హి. స్త్రీ) వెక్కు, వెక్కిలి. ہچکی بندھ جانا -బంధ్ జానా (హి) వెక్కుపుట్టుట. ہچکیاں لگنا హిచ్కియాం లగ్నా (హి) వెక్కిళ్లు పుట్టుట, ప్రాణోత్క్రమణావస్థలో నం

సదా. ہر چند -చంద్ (పా) అన్ని విధములను, ప్రతివిధమునను, ఎంతయు, ఎట్లైనను. ہر جائی -జాయీ (పా) అన్నిచోట్లనుండువాడు, ఒకచోట నిలుకడలేనివాడు. ہر چہ باد آباد -చె బాద్ ఆబాద్ (పా) అయ్యేది అగుగాక, ఏమైనను సరేను, ఎట్లైనను సరియేను, ఎమైనగాని, ఏమైనను. ہر حال میں -హాల్ మేం (ఉ) అన్ని విధములను, ఎట్టి స్థితియందైనను, ఏవిధమునసైనను, ఎట్లైనను, ఏమైనను. ہر دم -దమ్ (పా) ప్రతిక్షణము. అనుక్షణము. ہر دم خیالی -దమ్ ఖయాలీ (పా) చపలచిత్తుడు, మనసు నిలకడలేనివాడు. ہر کاری -కారీ (పా) అన్ని పనులను జేయువాడు, ఏపనినైనను జేయువాడు, కింకరుడు. ہر کہیں -కహీం (ఉ) అన్నిచోట్లను, ఎక్కడజూచినను. ہر کارہ -కారహ్ (పా) అన్ని పనులును జేయువాడు, ఏపనినైనను జేయువాడు, సందేశహరుడు, కాలిబంటు, వాగుడు, కింకరుడు. ہر کوئی -కోయీ (ఉ) ప్రతివాడును, ఎవరైనను. ہر گاہ -గాహ్ (పా) ప్రతి క్షణమును, ఎప్పుడైనను, అన్ని సమయములందును, ఏకాలమందైనను, ఎల్లప్పుడు, అన్ని విధములను, ఎల్లెడలను, సర్వదా. ہر وقت -వఖ్త్ (పా) ప్రతి కాలమును, ఎల్లప్పుడు, సదా. ہر کس و ناکس -కస్ ఒ నాకస్ (పా) అయినవాడును కానివాడును, గొప్పవాడును, కొద్దివాడు, పెద్దచిన్నలందరును. అందరును. ہر گز -గిజ్ -(పా) సర్వదా, ఎప్పటికిని, ఎప్పుడును, ఎల్లప్పటికిని, బొత్తుగా. సుతరాము. ہر ہر -హర్ (పా) ప్రతియొక్క, ఒక్కొక్క.

ہر హర్ (హి. పు) నాగలి, లాంగలము. హాలము.

ہر హుర్ (హి. స్త్రీ) బుఱ్ఱు బుర్ (పిట్టలెగురుచప్పుడు) ہر ہر جانا -హుర్జానా (హి) బుఱ్ఱుమనుట, ఎగిరిపోవుట, పలాయనమగుట, మాయమైపోవుట.

ہر హిర్ (అ. పు) గండుపిల్లి, మగపిల్లి.

ہرا హరా (హి) ఆకుపచ్చని, పచ్చి, పండని, పచ్చగానున్న, నవీనమైన, క్రొత్తగానున్న, నవము, నవనవలాడెడు; పచ్చిక. ہرا بھرا -భరా (హి) అభివృద్ధిగానున్న, ఫలవంతముగానున్న, సంతోషముగానున్న, నవనవలాడుచున్న, పచ్చపచ్చగానున్న.

ہرا హర్రా (హి. పు) కరకకాయ.

ہراج హర్రాజ్ (అ) వడిగా పరునెత్తు (గుఱ్ఱము), ఏలముపాట, ఏలము, వెలపాటు, క్రియఘోషము. ہراج کرنا -కర్నా (ఉ) ఏలము వేయుట, ఏలముపాడుట.

ہراس హిరాస్ (పా. పు) భయము, భీతి, బుగులు, తత్తరము, నిరాశ, కలవరము.

ہراسان హిరాసాం (పా) భయభ్రాంతుడు, భీతిల్లిన, తత్తరపడిన, నిరాశజెందిన, దుఃఖితుడైన, కలవరపడిన.

ہرانا హరానా (హి) ఓడించుట, అలయించుట.

ہرانی جتانی హరానీజితానీ (హి) ఒకప్పుడు గెలిపించుట ఒకప్పుడు ఓడించుట, ఆయాసపెట్టుట, చిక్కులుపెట్టుట.

ہراول హి(హ)రావల్ (తు.పు) పురోగామిసైన్యము, అగ్రగామిసైన్యము, లేక అగ్రగామి సైన్యనాయకుడు, సేనాముఖుడు, సేనాముఖ సైన్యనాయకుడు, ముందుమార్గము సరిజూచుటకును శత్రుసేనస్థితిని కనుగొనుటకును పోవుసైన్యములేక అట్టిసేనలయొక్క నాయకుడు, ముందుబోవు కాలిబంటు.

ہرائی హరాయీ (హి.స్త్రీ) పచ్చదనము, నవీనత, క్రొత్తదనము, పచ్చి, పసరికదనము.

ہربھونگ - ہربنگ హర్భంగ్-హర్బొంగ్ (హి.పు) అరాజకము, రాజ్య కల్లోలము, అల్లరి, గంద్రగోళము; ఝూంసీపట్టణము యొక్క పూర్వపు పేరు (ఇక్కడ పూర్వము యీ పేరుగల రాజుకాలములో మిక్కిలి అరాజకము ప్రబలియుండి ఈ యర్థమువచ్చినది).

ہرتال హర్తాల్ (హి.పు) హరితాళము, అరదళము; హరతాళము, సమ్మె, అందరును ఒక్కపెట్టున పనిచాలించుట.

ہرپھا ریوڑی హర్ఫారేవడీ (హి.స్త్రీ) ఒకజాతి పుల్లనిపండు (చిరు ఉసరిక).

ہرتے پھرتے హిర్తే ఫిర్తే (హి) ఇటు నటు తిరుగుటలో, రాక పోకలలో, అప్పుడప్పుడు, ఎడపదడప.

ہرج హర్జ్ (అ.పు) దొమ్మి, అల్లరి, పోట్లాట, కల్లోలము, తంటాలు; అడ్డు, ఆటంకము, నష్టము, చిక్కు, సంకటము. ہرج مرج హర్జ్-మర్జ్ (అ) గజిబిజి, అల్లకల్లోలము, నష్టములు, చిక్కు, తంటాలు.

ہرجانا హర్జానా (హి) ఓడిపోవుట, పందెమునోడుట.

ہرجانہ హర్జాన (ఉ.పు) నష్టపరిహారము, నష్టముకట్టియిచ్చినది.

ہرجہ హర్జ (ఉ.పు) నష్టము, నష్ట పరిహారము.

ہرزہ హర్జ (పా) పనికిమాలిన, బుద్ధిమాలిన, అసంబద్ధము, అవివేకమైన, అవ్యక్తమైన. -ہرزہ درائی - گردی - سرائی - گوئی -దరాయీ-గర్దీ-సరాయీ-గోయీ (పా) అవ్యక్తప్రసంగము, పనికిమాలినమాటలు, వదరు,

ہرزگی హర్జగీ (పా.స్త్రీ) అసంబద్ధప్రలాపము, పనికిమాలినమాటలు, అవ్యక్తాలాపములు.

ہرسنگار హర్సింగార్ (హి.పు) చూడు ہارسنگار

ہرس హరస్ (హి.స్త్రీ) కఱ్ఱు, నాగటి కఱ్ఱు.

ہرسا హర్సా (హి.స్త్రీ) శాణము, సాన రాయి.

ہرکارہ హర్కార (పా.పు) అన్నిపనులకు పరుగెత్తువాడు, కింకరుడు, వార్తాహరుడు, సందేశహరుడు, కాలిబంటు.

ہرگاہ - ہرگز హర్‌గాహ్-హర్‌గిజ్ (పా) చూడు. ہر ఈను క్రింద సమాసపదములు.

ہرم హరిమ్ (అ.స్త్రీ) మనస్సు, బుద్ధి, అంతఃకరణము; వృద్ధు, దుర్బలుడు, చాదస్తుడు.

ہرمز హుర్ముజ్ (పా.పు) పారసీకదేశపు ఒకరాజుపేరు, హురుముంజి జలసంధి (ఇందు మంచి ముత్యములు దొరుకుచుండెడివి).

ہرمزی హిర్మిజీ(అ.స్త్రీ)ఎఱ్ఱజాజు, (మన్ను).

ہرمشتا హార్మష్ట (హి. స్త్రీ)బలిసిన, బలిష్ఠము, పుష్టిగల, పొగరుబట్టిన.

ہرن హారన్ - హిరన్ (హి.పు) హరిణము, లేడి.

ہرنا హార్నా (హి.పు) హరిణము, దుప్పి; అపహరణము, అపహరించుట, లాగుకొనుట, బలవంతముగా తీసికొనుట,హరించుట.

ہرنوٹا హర్నౌటా (హి.పు) జింక పిల్ల, హరిణశాబకము.

ہرنی హార్నీ (హి.స్త్రీ) హరిణి, ఆడు జింక, సారంగి.

ہرونی హరౌనీ (హి. స్త్రీ) ఒకజాతిగట్టి వెదురు, చిట్టివెదురు.

ہرہر హుల్ గ్ హార్ (హి.పు) ఓషధి విశేషము.

ہرہفت హర్‌హఫ్త్ (పా) స్త్రీల సప్తాలంకారములు; ముత్తైదువు పోబడులు, సింగారింపబడిన, అలంకృతము.

ہریا హరియా (హి) పచ్చి, పచ్చని; అడవి సం॥; అడవికాపరి; ఒకపక్షి.

ہریالا హర్యాలా (హి) పచ్చగానున్న, పచ్చని, పచ్చికగల, పచ్చిక.

ہریالی హర్యాలీ (హి.స్త్రీ) పచ్చదనము, నవీనత; చెట్టుచేమ; పచ్చిక, పచ్చిగడ్డి.

ہریانا హర్యానా (హి) పచ్చబడుట, నవనవలాడుట. పచ్చిగానుండుట, పచ్చగానుండుట; ఆపుదల, నిలుపు, తొలగించుట; మిట్టభూమి, మిఱ్ఱుపఱ్ఱ నేలము.

ہریاول - ہریایی హార్యావల్ హార్యాయీ (హి.పు) పచ్చదనము నవీనత, నవనవలాడుట; పచ్చికనేల.

ہریرہ హారీర (హి) జావ. ఫలాదులు వేసి వండినది, గట్టి జావ.

ہریسہ హారీస (హి.పు) గోదుమపిండి పాలును మాంసమును వేసి వండినజావ; మిగుల మెత్తగా ఉడికినది.

ہریل హారియల్ (హి.పు) పచ్చపావురము.

ہریوا హారేవా (హి.పు) పచ్చచిలుక, ఒకజాతిచిలుక.

ہڑ హడ్ (హి.పు)కరకకాయ, చూడు ہڑ

ہڑبڑانا హడ్‌బడానా (హి) కలవరపడుట, తత్తరపడుటస ంభ్రమపడుట,వేగిరపడుట.

ہڑبڑی హడ్‌బడీ (హి. స్త్రీ) తత్తరపాటు, సంభ్రమము, కలవరము, వేగిరపాటు; అల్లరి, గందరగోళము,అల్లకల్లోలము.

ہڑبڑیا హడ్బడియా (హి.పు) వేగిరపడు, చిఱ్ఱుబుఱ్ఱులాడు, ఓపికలేని; ముంగోపి; తొందరపాకి.

ہڑپ హడప్ (హి) గుటుక్కు (నమలక మ్రింగునప్పుడు).

ہڑپنا హడప్నా (హి) హరించుట, అపహరించుట, ఒడిసిపట్టుకొనుట, లాగుకొనుట, లాగితీసుకొనుట.

ہڑتال హడ్తాల్ (హి.పు) చూడు ہتال

ہڑجوڑا హడ్‌జోడా (హి.పు) వృక్షవిశేషము, కందురికిచెట్టు.

ہڑدنگا హడ్‌దంగా (హి) పోకిరి, ధూర్తు, జగడిగొండి, మోటు.

هسکا హిస్కా (హి.పు) అనుకరణము, ఒకరుచేసినట్లు జేయజూచుట, పోటి, స్పర్థ, మించుకోర్కి, జిగీష, ఈర్ష్య. هسکا هسکی -హిస్కీ (హి) పోటాపోటి, మత్సరింపు, స్పర్థ.

هسلی హస్లీ (హి. స్త్రీ) జత్రువు, మెడముందర రెండువైపులను ఎత్తుగానుండు ఎముకలలోనొకటి; కంటె, కంఠాభరణము.

هسیا హాస్యా (హి) కొడవలి, లవిత్రము.

هشاش హష్షాష్ (అ) మిక్కిలినవ్వుచున్న, సంతోషముగానున్న, ఆనందముగానున్న, నవ్వుముఖముగానున్న; సరసుడు, రసికుడు. هشاش بشاش -బష్షాష్ (అ) పరమానందముగానున్న.

هشت హుష్త్ (ఉ) ధిక్కారము, ధుత్, వెడలగొట్టుట.

هشت హిష్త్ (ఉ) ఛీ, ధిక్కారము, (నీచమును తెలుపును.)

هشت హష్త్ (పా) ఎనిమిది, అష్టము. هشت پہلو - منظری -పహ్లూ-మంజరీ (పా) అష్టభుజము, ఎనిమిది ప్రక్కలుగల యాకారము. هشت گوشہ -గోష (పా) అష్టకోణము, ఎనిమిదిమూలలుగల యాకారము. هشت صفات -సిఫాత్ (పా) శమాదిఅష్టగుణ సంపత్తిగల.

هشتاد హష్తాద్ (పా) ఎనుబది, అశీతి.

هشت مشت హుష్త్ముష్త్ (పా. స్త్రీ) ముష్టాముష్టి, ముష్టియుద్ధము.

هشتم హష్తుమ్ (పా) అష్టమము, ఎనిమిదవది.

هشکارنا - هشکالنا హుష్కార్నా-హుష్కాల్నా (హి) కుక్కమొదలగువానిని ఉసికొలుపుట, ఛూకొట్టుట. ఎగ్గొలుపుట.

هشیار హుష్యార్ (పా) తెలివిగల, బుద్ధిగల, చురుకైన, జాగరూకతగల, చతురతగల, జాణయైన, నేర్పరియైన, జ్ఞానముగల, పాండిత్యముగల, మెలకువగల, నేర్పైన.

هشیاری హుష్యారీ (పా. స్త్రీ) జ్ఞానము, తెలివి, బుద్ధి, జాగరూకత, మెలకువ, నేర్పు, చతురత, చాతుర్యము, చురుకుదనము.

هضم హజ్మ్ (అ.పు) జీర్ణము, పచనము; అపహరణము, జీర్ణముజేసికొనుట, ఎగవేయుట. هضم آور -ఆవర్ (పా) జీర్ణకారి, జీర్ణింపజేయునది.

هفت హఫ్త్ (పా) సప్త, ఏడు, ఆరున్నొకటి. هفت اقلیم -అక్లీమ్ (పా) ప్రపంచము, సప్తద్వీపములు. هفت اندام -అందామ్ (పా) చేతియొక్క పెద్దనరము; సప్తావయవములు (తల, వీపు, రొమ్ము, కాళ్లు మరియు చేతులను) هفت رنگی -రంగీ (పా) సప్తవర్ణములుగల, సర్వతోముఖ ప్రజ్ఞగల, మాయలమారి, టక్కులమారి, చపలుడు. هفت قلم -కలమ్ (పా) సప్తలేఖి, ఏడువిధముల వ్రాత వ్రాయువాడు. هفت کشور -కిష్వర్ (పా) సప్తద్వీపములు, సప్తఖండములు, ప్రపంచము. هفت هزاری -హజారీ (పా) ఏడువేల సైన్యమునకు అధిపతి, هفت هشت -హష్త్ (పా)

**ہلچل** హల్ చల్ (హి. స్త్రీ) సంచలనము, కల్లోలము, గందరగోళము, అల్లరి, కలవరము, తత్తరపాటు, వేగిరపాటు.

**ہلدی** హల్దీ (హి. స్త్రీ) హరిద్రము, పసుపు. **ہلدی لگی نہ پھٹکڑی** -లగీ న ఫటక్‌డీ (హి) వ్యయములేకుండ, ఉచితముగా, అనాయాసముగా. **انبا ہلدی** అంబా- (హి. స్త్రీ) మ్రానిపసుపు, అటవిహరిద్రము, అడవి పసుపు. **ہلدی لگاکر بیٹھنا** -లగాకర్ బైఠ్నా (హి) పసుపుపూసుకొని కూర్చుండుట, ఏదో ఒక నెపము బెట్టుకొని ఊరక కూర్చుండుట, ఏదో ఘనకార్యము తలపెట్టుకొని యుండుట.

**ہلدیا** హల్దియా (హి. పు) పసుపు పచ్చని వన్నెగలది; విష భేదము; పాండురోగము, ఒకజాతి వర్తకులు.

**ہلڑ** హల్లడ్ (హి. పు) దొమ్మి, జనసమ్మర్దము, అల్లరిమూక, గందరగోళము, అల్లకల్లోలము.

**ہلسا** హిల్సా (హి. స్త్రీ) వంగదేశపు చేపదినుసు.

**ہلسانا** హులస్నా (హి) సంతోషపెట్టుట, ప్రసన్నుని జేసికొనుట; పురికొలుపుట, ఎక్కుపెట్టుట, ఆశకొలుపుట.

**ہلسنا** హులస్నా (హి) సంతోషపడుట, ఉల్లసించుట, ఆనందించుట.

**ہلکا** హల్కా (హి) అలకని, తేలికైన, చులకనైన; చౌకయైన, వెలతక్కువయైన, కొద్దిపాటి, నీచమైన, గౌరవములేని. **ہلکاپن** -పన్ (హి) లఘుత్వము, కొంచదనము, అల్పత్వము, నైచ్యము, దురభిమానము. **ہلکا کرنا** -కర్నా (హి) లాఘవముజేయుట, తిరస్కరించుట, అగౌరవించుట. **ہلکا جاننا** -జాన్నా (హి) తుచ్ఛముగా జూచుట, తిరస్కారముతో జూచుట. **ہلکا کھانا** -ఖానా (హి) లఘుభోజనము. **ہلکا پھلکا** - ఫుల్కా (హి) మిగుల తేలికైన, మిగుల సున్నితమైన, నాగరికమైన.

**ہلکارنا** హల్కార్నా (హి) కుక్క మొ॥ వానిని ఉసికొలుపుట, ప్రేరేపించుట.

**ہلکائی** హల్కాయీ (హి. స్త్రీ) చూడు. **ہلکاپن**.

**ہلکور** హిల్కోర్ (హి) అల, తరంగము, పొరలిక, కదలిక, అల్లాట, డోలాయమానము.

**ہلکورنا** హిల్కోర్నా (హి) అలలు లేచుట, కదలుట, చెదరుట, డోలాయమానమగుట, అల్లాడుట, పొరలుట, కల్లోలమగుట, కలవరమగుట.

**ہلکورہ** హిల్కోర (హి. పు) అల, తరంగము.

**ہلگانا** హిల్గానా (హి) వ్రేలగట్టుట, వ్రేలార్చుట, తగిలించుట.

**ہلگنا** హిలగ్నా (హి) వ్రేలాడబడుట, వ్రేలుట, తగిలియుండుట.

**ہل مل جانا** హిల్ మిల్ జానా (హి) కలిసిపోవుట, లీనమైపోవుట, కలసి మెలసి యుండుట, మచ్చికపడుట, కూడుట, చేరుట, అనుకూలమగుట.

**ہلنا** హిల్నా (హి) కదలుట, చలించుట, ఊగులాడుట; మచ్చికపడుట, అలవాటుపడుట.

**ہلواہا** హల్వాహా (హి) చూడు. **ہل جوتا**.

**ہلورا** హిలోరా (హి. పు) అల, తరంగము.

**ہلوری مارنا** హిలోరీ మార్నా (హి) ఉప్పొంగుట (సముద్రము).

-దబిస్తాన్ (పా) ఒకే బడియందు చదివె
డు, సహాధ్యాయి. ہم درد -దర్ద్
(పా) కనికరపడువాడు, సహానుభూతివం
తుడు,సహానుభూతిగలవాడు. ہم دست
-దస్త్ (పా) సహకారి, సహవాసి, స
మానాంతరుడు. సమానస్కంధుడు. ہم
دست ہونا -దస్త్ హోనా (ఉ) చేతికి
వచ్చుట, దొరకుట, లభించుట, లభ్యమ
గుట. ہم دگر -దిగర్ (పా) అన్యోన్య
ము, ఒకరికొకరు. ہم دل -దిల్ (పా)
మనసు కలసిన, ఏకాభి ప్రాయముగల.
ہم دم -దమ్ (పా) ప్రియుడు, సహ
వాసి, చెలికాడు. ہم دوش - దోష్
(పా) సమానస్కంధుడు, సాటివాడు.
ہم دیوار - దీవార్ (పా) ఇంటి
పొరుగు. ہم ذات - జాత్ (పా)
కులమువాడు, కులస్థుడు. ہم راز -
రాజ్ (పా) మర్మజ్ఞుడు, రహస్యములో
నున్నవాడు, గుట్టుకలసినవాడు, మంత్రి
జ్ఞుడు. ہم راہ -రాహ్ (పా) సహ
పాంథుడు, తోటి బాటసారి, తోడ,
కూడ, బాటతోడు, కూడనున్నవాడు.
ہم راہی -రాహీ (పా) వెంటనుం
డుట, తోవకలసినడచుట, తోవతో
డు, తోడు, సాహచర్యము, కూడనుం
డుట. ہم رکاب -రికాబ్ (పా)
తోటికాతు, సహాశ్వికుడు, సహచరుడు,
అనుచరుడు, కూడనుండువాడు. ہم رنگ
-రంగ్ (పా) ఏకవర్ణముగల, ఏకస్వభా
వముగల, సదృశము, సమానము. ہم زاد
-జాద్ (పా) కూడపుట్టినవాడు, కవలు,
అనుడాలవారు, సహవాసుడు, చెలి
కాడు. ہم زبان -జబాన్ (పా)
ఏకకంఠులు, ఒకేమాటగలవాడు, మాట
కలసినవాడు. ہم زلف -జుల్ఫ్ (పా)
షడ్డకుడు, తోటియల్లుడు. ہم زبانی
-జబానీ (పా) ఐక కంఠ్యము, మాటకల
సియుండు. ہم زمزم - జమ్జమ
(పా) కూడపాడువాడు, సహగాయకు
డు. ہم ساز -సాజ్ (పా) అనుకూ
లుడు, మిత్రుడు. ہم سایہ - సాయ
(పా) పొరుగువాడు, ఇరుగుపొరుగువా
రు, ఇరుగువారు. ہم سایگی -సాయగీ
(పా) సామీప్యము, పొరుగు. ہم سائی
-సాయీ (పా) పొరుగుఇల్లాలు. ہم
سبق -సబక్ (పా) సహపాఠి, కూడ
చదువుకొనువాడు. ہم سخن -సఖున్
(పా) కలసిమాటాడువాడు, సంభాషకు
డు, సహభాషి. ہم سر -సర్ (పా)
సమానస్కంధుడు, సాటివాడు, సమా
నాంతరుడు, సహచారిణి, భార్య, ఇల్లా
లు, యజమాని, మగడు. ہم سفرہ
-సఫ్ర (పా) కలసిభోజనముచేయువాడు,
సహపంక్తిగలవాడు, సహభోక్త. ہم
سفر -సఫర్ (పా) సహపాంథుడు,
సహయాత్రికుడు, కలసి ప్రయాణము
చేయువాడు. ہم سن -సిన్ (పా) సహవ
యస్కుడు. ہم سنگ -సంగ్ (పా)
సమానార్ఘము, ఏకక్రియము, ఒకేవెలగ
లది, సమానభారము, సమానాంతరము.
ہم شکل -షక్ల్ (పా) సమాన
రూపుడు, సదృశరూపులు.
ہم شہری -షహ్రి (పా) ఏకనగర
వాసి, తనయూరివాడు. ہم شیر -షీర్
(పా) ఒకేతల్లిపాలుత్రాగినవారు, ఏకస్తన్య

ہمایون హుమాయూన్ (పా) మహాభాగి, అదృష్టవంతుడు, శుభదాయకము, శోభనవంతము.

ہمت హిమ్మత్ (అ. స్త్రీ) ధైర్యము, సాహసము, ఉత్సాహము, స్థైర్యము, సామర్థ్యము, దిట్టతనము; ఔదార్యము. ہمت باندھنا -బాంధ్నా (ఉ) సాహసించుట, ధైర్యముజేయుట. ہمت ہارنا -హార్నా (ఉ) ధైర్యము గోలుపోవుట.

ہمتا హమ్‌తా (పా) సమానము, సదృశము; సాదృశ్యము; సమానుడు, సదృశుడు, సాటివాడు.

ہمدہ హామ్‌ద (పా.పు) సన్నిపాతము, జన్ని.

ہمزہ హమ్‌జే (అ.పు) ఉభయాక్షరముల పొల్లసంజ్ఞ. ఇట్టి (ء) గుర్తు.

ہمکنا హమక్నా (హి) పైబడుట, ముందుకుతూగుట.

ہمگی హామగీ (పా. స్త్రీ) సాకల్యము, సకలము, సర్వము, సాకల్యత, సమగ్రత.

ہمم హామమ్ (అ) ధైర్యసాహసములు. (ఏ. వ ہمت)

ہموار హమ్‌వార్ (పా) చదరము, సమమైన, చదరమైన, ఎత్తువంతలులేని, చదునైన, మట్టమైన, బల్ల పరుపుగానున్న.

ہموارہ హమ్‌వార (పా) సర్వదా, సదా, ఎల్లప్పుడు.

ہمہ హామ(పా) సర్వము, సమగ్రము, సాంతము, ఆసాంతము. ہمہ دان -దాఁ (పా) సర్వజ్ఞుడు,అన్నియుతెలిసినవాడు.

ہمہ صفت موصوف -సిఫత్-మౌసూఫ్ (పా) సర్వ గుణోపేతుడు, సమస్త గుణసంపన్నుడు, అన్నిగుణములు గలవాడు. ہمہ تن -తన్(పా) సర్వశక్తియుక్తముగ, తదేకనిష్ఠగ. ہمہ شما -షుమా (పా) అస్మదాదులు, సామాన్యులు, ప్రతివాడు. ہمہ باین -బాయీఁ హామ (పా) ఇందు కుపరిగా, ఇందుపై గూడ, ఇంకను, ఇంతయ్యును, ఇంతతో గూడ.

ہمیانی హామ్యానీ (ఉ. స్త్రీ) నడికట్టుసంచి, నడుముసంచి, రూకలసంచి, పొడుగాటిసంచి.

ہمیشگی హామేషగీ (పా. స్త్రీ) శాశ్వతత్వము, ఎల్లప్పుడునుండుట, నిరంతరత.

ہمیشہ హామేష (పా) శాశ్వతముగా, నిరంతరము, ఎల్లప్పుడు, ఎడతెగక.

ہمیں హామేఁ (హి) మమ్ము, మమ్ములను; మనలను.

ہمین హామీఁ (పా) ఇది, ఇదే, ఇదిగో.

ہن హున్ (హి. స్త్రీ) వరహా, పూల వరాహాము, దక్షిణదేశపు ఒకనాణెము.

ہنجار హింజార్ (పా.పు) నూటిరైన త్రోవ, మార్గము, చక్కనిబాట; వర్తనము, సన్మార్గము; నూలుగుండు, మూలమట్టము. ناہنجار నా- (పా)దుర్మార్గుడు, పోకిరి.

ہند హింద్ (పా.పు) సింధుప్రాంతదేశము, భరతవర్షము, హిందూదేశము.

ہندبہ హిందబ (పా.పు) కాసినిచెట్టు(విత్తులును).

ہندسہ హిందస-హిందిస (అ.పు) అంకె, గణితశాస్త్రము, క్షేత్రగణితము. ہندسہ دان -దాఁ (పా) గణితశాస్త్రజ్ఞుడు;

**ہنستا پیشانی** హాఁస్తా పేషానీ (ఉ) హాసన్ముఖుడు, నగుమోము గాడు.

**ہنسلی** హాఁస్లీ (హి. స్త్రీ) చేఁడు ہسلی

**ہنس مکھ** హాఁస్ ముఖ్ (హి. పు) హాసన్ముఖుడు, నగుమోమువాడు.

**ہنسنا** హాఁస్నా (హి) నవ్వుట, నగుట.

**ہنسوا** హాఁస్వా (హి. పు) కొడవలి, లవిత్రము.

**ہنسوڑ** హాఁసోడ్ (హి) నవ్వులాఁడి, నవ్వులాటకాడు. సంతోష స్వభావముగల వాడు, ఆటకాయ, వినోదప్రియుడు.

**ہنسی** హాఁసీ (హి. స్త్రీ) నవ్వు, హాసము; పరిహాసము, నవ్వులాట. **ہنسی اڑانا** -ఉడానా (హి) పరిహాసముజేయుట, ఎగతాళి పట్టించుట, హేళనజేయుట. **ہنسی کھنسی ہوجانا** -ఖఁసీహో జానా (హి) నవ్వులెల్ల నువ్వులగుట, నవ్వులాట మూలమున విరోధముగలుగుట, నవ్వులాటలో కోపమువచ్చుట.

**ہنسیا** హాఁసియా (హి. పు) కొడవలి. లవిత్రము.

**ہنگ** హంగ్ (పా. పు) జ్ఞానము, తెలివి; గాంభీర్యము; సామర్థ్యము, జ్ఞాని; సేన.

**ہنکار** హుంకార్ (హి. స్త్రీ) హూఁ అనుట, హుంకారము; సమ్మతి.

**ہنکارا** హుంకారా (హి. పు) ఊఁ కొట్టుట (కథ మొ॥ వినుచు)

**ہنگ** హింగ్ (హి స్త్రీ) ఇంగువ.

**ہنگام** హంగామ్ (పా. పు) ఋతువు, కాలము, సమయము, అదను.

**ہنگامہ** హంగామ (పా. పు) జనసమ్మర్దము. గుంపు, మూక; దొమ్మి, అల్లరి, కల్లోలము, కోలాహలము, బాహుళ్యము, సమృద్ధి. **ہنگامہ آرا** -ఆరా (పా) కలహకారి, కలహకారణము, జగడములుగలుగజేయు, పోరుకొలుపు. **ہنگامہ آرائی** -ఆరాయీ (పా) కలహప్రచారము, యుద్ధప్రచారము, జగడము, కలహవ్యాపనము, యుద్ధము జరుపుట, యుద్ధ రచన, పోరుకొలుపుట.

**ہنود** హునూద్ (అ. పు) హైందవులు, హిందువులు, భారతీయులు.

**ہنوز** హనూజ్ (పా) ఇంతవరకు, ఇప్పటివరకు, ఇదనుక, ఇప్పటికిని, ఇంకను. **ہنوز دلی دور ہے** -దిల్లీ దూర్ హాయ్ (ఉ) ఇంకను చాలకాలముపట్టును, ఇంకను యెంతయో ప్రయాసపడవలసియున్నది.

**ہنہنانا** హిన్‌హినానా (హి) సకిలించుట (గుఱ్ఱము).

**ہنہناہٹ** హిన్‌హినాహట్ (హి. స్త్రీ) సకిలింత (గుఱ్ఱము), హేష.

**ہو** హూ (అ. పు) తత్త్వ, సత్త్వ, అతడు, ఈశ్వరుడు. **ہو حق** -హాక్ (అ) భగవద్ధ్యానము, భగవత్కీర్తనము, భగవద్భజన. **ہو کا عالم** -కా ఆలమ్ (ఉ) భయంకరమైనయడారి, నిర్మానుష్యము, పాడుయెడారి.

**ہوا** హవా (అ. స్త్రీ) కామము, మోహము; కోరిక, ప్రేమ, అభిలాష, అభిరుచి; వాయువు. వాయుమండలము, వాతావరణము, గాలి; ప్రాణవాయువు, ఉసురు; వదంతి, కింవదంతి; వైఖరి, పద్ధతి, రీతి; భయము, భీతి; ఋతువు, కాలము, కాల

**ہوٹ** హోంత్ (హి. స్త్రీ) సామర్థ్యము, శక్తి, పరపతి; ఓహోం ఋ (అనిపిలుపు).

**ہوتے** హోతే (హి) సమక్షమున,ఉండగా

**ہوتے ہوتے** హోతేహోతే(హి) రాను రాను, కాలక్రమమున, క్రమేణ, క్రమముగ.

**ہوجانا** హోజానా (హి) అయిపోవుట, కలుగుట, అగుట.

**ہوچکنا** హోచుక్నా(హి) అయిపోవుట, ముగిసిపోవుట.

**ہودج** హౌదజ్ (అ.పు) ఒంటెపై స్త్రీలు కూర్చుండిపోవుతొట్లు, ఒంటెతొట్లు, ఒంటెపల్లము.

**ہودہ** హౌద (అ.పు) ఏనుగపైకట్టుతొట్లు. చాడోలు.

**ہوری** హోరీ (హి. స్త్రీ) హోలీపాట.

**ہوڑ** హోడ్ (హి.స్త్రీ) పందెము, ఒడ్డు, ఒడ్డినది; ఒడంబడిక, వాదము, పోటి.

**ہوڑ باندنا - باندھنا** -హోడ్ బాంద్నా -బాంధ్నా (హి) పందెము పెట్టుట, ఒడ్డుట.

**ہوڑل** హోడల్ (హి.పు) అధికము.

**ہوس** హవస్ (అ.స్త్రీ) ఉన్మాదము, పిచ్చి, వెఱ్ఱి, మోహము, అత్యాశ, కోరిక, అభిలాష, అపేక్ష, ఆశ, ఆతురము; కామము, కామాతురము. **ہوس ناک** **ہوس کیش** -నాక్- కేష్ (పా) ఆశాపూరితము, ఆశాబద్ధము, మోహాతురముగల, కామాతురముగల, మోహగ్రస్తమైన, అభిలాషయుక్తము,ఆశాగ్రస్తము

**ہوسکنا** హోసక్నా (హి) సాధ్యమగుట, సాధ్యముగానుండుట, కాగలుగుట.

**ہوش** హోష్ (పా.పు) జ్ఞానము, తెలివి, బుద్ధి, స్మృతి, వివేకము, ఇంద్రియజ్ఞానము, మనసు, జ్ఞాపకము, జీవుడు, ఆత్మ.

**ہوش اُڑنا - باختہ ہونا - ہوا گندہ ہونا- دنگ ہونا - جاتے رہنا** -ఉడ్నా- బాఖ్తాహోనా- హవాగిందహోనా-దంగ్ హోనా- జాతేరహ్నా (ఉ) దిగ్భ్రమజెందుట, విభ్రమజెందుట, విస్మృతికలుగుట, కలవరపడుట, బమ్మెరపోవుట, ఎటునుతోచకపోవుట, తారుమారగుట, వివేకముచెడుట, ఇంద్రియభ్రమకలుగుట, ఇంద్రియజ్ఞానము చెడుట.

**ہوش سنبھالنا** -సంభాల్నా (ఉ) బుద్ధితెలియుట, తెలివివచ్చుట, పెద్దవాడగుట, వివేకము గలుగుట, జ్ఞానముగలుగుట, మంచి చెడులు తెలియవచ్చుట.

**ہوش کی دوا کرو-کی خبر لو-کی بناؤ-کی ناخن لو-کی لو** - కీదాదకరో -కీఖబర్ లో- కీబనావ్ - కీనాఖున్ లో- కీలో(ఉ)బుద్ధిదిద్దికొనుము,బుద్ధి తెచ్చికొనుము, తెలివితెచ్చుకొనుము, జ్ఞానముతెచ్చికొనుము, మంచి చెడుగులు ఆలోచించుకొనుము, ముందు వెనుక లాలోచించికొనుము, బాగా ఆలోచించుకొనుము, బాగా చూచుకొనుము. **ہوش پکڑو** -పకడో (ఉ) తెలివితెచ్చుకొనుము, బుద్ధితెచ్చుకొనుము, మంచిచెడుగులు తెలిసికొనుము, జాగరూకుడవుకమ్ము. **ہوش وحواس** - ఒహవాస్ (పా) ఇంద్రియజ్ఞానము, తెలివితేటలు, వివేకము, వివేకజ్ఞానము. **ہوش مند** -మంద్ (పా) బుద్ధిమంతుడు, వివేకవంతుడు, తెలివిగలవాడు.

هوشنگ హోషంగ్ (పా.పు) జ్ఞానము, తెలివి, బుద్ధి, వివేకము; పారశీక దేశపు ఒక రాజు పేరు.

هوشیار హోష్యార్ (పా) బుద్ధిమంతుడు, వివేకవంతుడు, జాగరూకుడు, మెలకువగలవాడు, జాగ్రతగలవాడు, తెలివిగలవాడు, నేర్పరి, చతురుడు, జాణ.

هوک హూక్ (హి.స్త్రీ) నొప్పి, పోటు, గుండెలో పోటు, లోమ్మునొప్పి, పక్కలోకుట్టు, ఊపిరికుట్టు; పెద్దపెట్టి కూత. هوک هوک کر رونا హూక్‌కర్ రోనా (హి) వెక్కి వెక్కి యేడ్చుట, వెక్కుపట్టియేడ్చుట.

هوکا - هوکها హూకా - ఖా (హి.పు) దురాశ, మోహము.

هوگا హోగా (హి) కాగలదు, కావచ్చును, కాబోలు, కానోపు.

هول హూల్ (హి.స్త్రీ) కత్తి మొ॥ వానితో పొడుచుట, లేక గుచ్చుట, కత్తిపోటు, పోటు.

هول హోల్ (అ.పు) భయము, భీతి, బుగులు, దిగులు, బెంగ, హడలు. هول بیٹھ جانا - బైఠ్ జానా (ఉ) బెంగపొడముట, దిగులుపడుట, బుగులుపట్టుట, భీతిపొడముట, బెంగపొడుకొనుట, హడలుపుట్టిపోవుట. هولناک - నాక్ (పా) భయంకరము, భయానకము. هول زده - జేద (పా) భయభ్రాంతము, భీతిగ్రస్తము, భయపడిన, భీతిల్లిన, బుగులుపడిన. هول دل - ఎ,దిల్ (పా) గుండెదడ, అదరు గుండె, హడలు. هول جول - జౌల్ (అ) భయభ్రాంతి, కలవరము. هول دلا - దిలా (ఉ) పిరికి పంద, భీరువు.

هولا హూలా (హి.పు) చూడుము. هول (హూల్)

هولا హులాలా (హి.పు) కాల్చిన శెనగకాయ.

هولا హోలా (హి) భ్రాంతుడు, చలచిత్తుడు, వెఱ్ఱిభావులవాడు, తెలివిమాలినవాడు.

هولر - هولڑ హోలర్ - డ్ (హి.పు) అప్పుడు పుట్టిన శిశువు, పుట్టిన శిశువు.

هولڑ హోలడ్ (హి.పు) అల్లరి, కల్లోలము, దొమ్మి.

هولنا హూల్నా (హి) అంకుశము మొ॥ వానితో పొడుచుట, పొడిచినదుపుట, నెట్టుట, దొబ్బుట, ఏనుగనుతోలుట.

هولو హోలూ (హి.పు) చూడు هوا (హోలా).

هولی హోలీ (హి.స్త్రీ) హోలీపండుగ, కాముడిపున్నమ పండుగ, హోళీమావళి పండుగ, హోలీ పాట. هولی جلانا - జలానా (హి) కాముడినికాల్చుట.

هولے హోలే (హి) మెల్లగా, నిమ్మళముగా, క్రమముగా.

هونا హోనా (హి) ఉండుట, అగుట, కలుగుట, జరుగుట, సృష్టించుట, కలిగియుండుట, ముగియుట, పుట్టుట, తగులుట, నిలుచుట, చచ్చుట, దొరకుట.

هونٹھ - هونٹ హోంట్ - ఠ్ (హి.పు) పెదవి, ఓష్ఠము. هونٹھ نکالنا - నికాల్నా (హి) పెదవి విరుచుట, తిరస్కరించుట, చింతపడుట, కోపపడుట.

کانتنا - هونتهچابنا - హొంఠ్ - చాబ్నా - కాట్నా (హి) పెదవి కరచుట, క్రొధమున కరచుట, ఆగ్రహపడుట, భయపడుట, పశ్చాత్తాప పడుట.

هونتهل హోంఠల్ (హి) పెద్ద పెదవుల వాడు, లావు పెదవులుగల.

هونس హౌస్ (హి. స్త్రీ) ఆశ, అభిలాష, అపేక్ష, ఆతురము, లోభము, పేరాశ, ఈర్ష్య, ఓర్వలేమి, అసూయ, ఉత్సాహము.

هونسنا హౌస్నా (హి) అసూయపడుట, ఓర్వలేకుండుట.

هونکنا హోంక్నా (హి) రొప్పుట.

هونق హావన్నక్ (హి) బుద్ధిహీనుడు, శుంఠ.

هونهار హోన్‌హార్ (హి) కాగలది, కానున్నది, సాధ్యము, సంభవము; అభివృద్ధి కాగల, అదృష్టరేఖ ల.

هونی హోనీ (హి) కాగలది, కానున్నది, సాధ్యము, సంభవము, అదృష్టము, భాగ్యము.

هوها హోహా (హి. స్త్రీ) కలకలము, గొల్లు, గోల, దొమ్మి, అల్లరి, కోలాహలము; అట్టహాసము, నవ్వులాట.

هوهو హూహూ (పా. పు) గూబ, పెద్ద పిట్ట; పావురము.

هویدا హువైదా (పా) ప్రత్యక్షము, స్పష్టము, విశదము, తెల్లము, తేటతెల్లము, ప్రకటము, ప్రకాశము.

هی హీ (హి) హృదయము, గుండె, మనసు.

هی హీ (హి) ఏవార్థక ప్రత్యయము, ఏ, ఏను, మాత్రము.

هیا హియా (హి. పు) హృదయము, గుండె, మనసు.

هیأت హైఅత్ (అ. స్త్రీ) జ్యోతిషసిద్ధాంతము; ఆకారము, రూపము, వైఖరి, స్థితి, డౌల్; వస్తువుల వెలుపలి రూపము, బాహ్యరూపము.

هیاو హియావ్ (హి. పు) ధైర్యము, సాహసము.

هیبت హైబత్ (అ. స్త్రీ) భీతి, భయము, దిగులు, బుగులు, హడలు.

هیئت హైఅత్ (అ. స్త్రీ) చూడు هیأت

هیٹا - هیٹها హేటా-ఠా (హి) చిన్న, తగ్గైన, తక్కువ, నీచము, సోమరియైన, పిరికిపంద, వెనుకాడెడు, చేతగాని, ప్రాలుమాలెడు. هیٹاپن -పన్ (హి) సోమరితనము, పిరికితనము, వెనుకాడుట, అధైర్యము, పిరికితనము. నైచ్యము.

هیٹی హేటీ (హి. స్త్రీ) నైచ్యము, అవమానము. (జగడము.

هیجا హైజా (అ. పు) యుద్ధము, పోరు,

هیجان హైజాన్ (అ. పు) పొంగు, ఉబ్బు, ఉప్పొంగుట; ఉద్రేకము, ఆధిక్యము, ఉరవడి, వేగము, పైకిలేచుట, పోరు, తిరుగబాటు, అల్లరి, దొమ్మి, జగడము, లొల్లి, గందరగోళము.

هیجڑا హీజ్‌డా (ఉ. పు) నపుంసకుడు, మందుడు; ఎగ్గలి (కొజ్జవాడు).

هیچ హేచ్ (పా) తుచ్ఛము, అల్పము, స్వల్పము, శూన్యము, పనికిమాలినది, వట్టి, వ్యర్థము; ఏదైన, ఏమైన, ఏదోఒకటి. هیچکاره -కార (పా) పనికిమాలిన, ఎందుకును పనికిరాని. هیچمدان -మదాం (పా) ఏమియును తెలియని, అజ్ఞాని, మూఢుడు, పామరుడు.

ہیر హీర్ (హి.పు) లక్ష్మి, సంపద; మూలము, సత్వము, సత్తు, సారము, బలము; స్వచ్ఛము, అచ్ఛము, నిర్మలము.

ہیرا హీరా (హి.పు) వజ్రము; సజ్జనుడు, ఉత్తముడు. ہیرا من హీరా-మన్ (హి) ఒక మంచిజాతి చిలుక. ہیرا ہینگ హీరా-హీంగ్ (హి) మేలుజాతి ఇంగువ.

ہیراول హేరావల్ (హి.పు) నానా వన్నెలబొంత, రంగు రంగుల బొంత, (బైరాగులది).

ہیرا پھیری హేరాఫేరీ (హి.స్త్రీ) పరివర్తనము, ఇచ్చి పుచ్చుకొనుట, రాకడపోకడ, తారుమారు, మార్పు పరిభ్రమణము.

ہیر پھیر హేర్-ఫేర్ (హి.స్త్రీ) తిరుగుడు, తిప్పుట, చిక్కు, తారుమారు, పరిభ్రమణము, మెలిక, లోసము.

ہیزم హేజమ్ (ఫా.స్త్రీ) ఇంధనము, వంటచెఱకు, ఎండుకట్టెలు.

ہیضہ హైజా (అ.పు) వాంతిభేదులరోగము, కత్తెర.

ہیکڑ హేకడ్ (హి) బలిష్ఠము, పుష్టిగల, దిట్టమైన, బలిసిన, బలముగల.

ہیکل హైకల్ (అ.స్త్రీ) నక్షత్రములకు లేక గ్రహములకు గాని యేర్పరచిన ఆకారము, విగ్రహము; రాజమందిరము; దేవాలయము, ప్రతిమ, రూపము, ఆకారము, దొడ్డయాకృతి, మహాకాయము, భీకరాకారముగలది; భైరవము; యంత్రము; కంఠాభరణము, హారము, శరీరము, డోలు; రక్షము, రక్ష, సంఖ్య; సృష్టి, గుమ్మటు, సంకేతము.

ہیل హేల్ (ఫా. స్త్రీ) తెల్ల ఏలకులు, చిన్న ఏలకులు.

ہیلا హేలా (హి.పు) జనసమ్మర్దము, ఒత్తిడి, పని బాధలు, పనితొందర; తడవ, తేప, తట్టు, జట్టు, సారి, గుంపు, ధ్వని; నెట్టుట, త్రోసుకొనుట నీటిలోనికి త్రోయుట.

ہیلاج హైలాజ్ (ఫా.పు) జననకాలము, జన్మ లగ్నము.

ہیمہ హేమ (ఫా.పు) వంటచెఱకు, ఇంధనము కట్టెలు.

ہینگ హీంగ్ (హి. స్త్రీ) ఇంగువ.

ہیولا హయూలా (అ.పు) ప్రకృతి, మూల ప్రకృతి, మూలము; అవ్యక్తరూపము, ఆదిరూపము, నిగ్గురూపము, ఆకారము, రూపము, ఛాయారూపము, ఆకృతి, పెను నీడగా కారము.

ہیہات హైహాత్ (అ) గొప్పయెడారి, నిర్మనుష్యము.

ہے ہے హైహై (హి) అక్కటా, కటకటా, అయ్యో, అయ్యయ్యో, ఛీ ఛీపో, ఛీఛీ; హేయము, తుచ్ఛము; హాహా, సంతాపకరము; ఆహా, ఆహాహా, ఆశ్చర్యము.

# ی

ے ی యా-యే-యా (అ. స్త్రీ) ఇదిఉభయాక్షరము, య కారమునకును ఈ కార ఏకారములకును వాడబడును. ఇది ఉరదూ వర్ణమాలలో ముప్పది నాలుగవ యక్షరము, అరబీలో నిరువదియెనిమిదవది, పారసీకములో ముప్పది రెండవది. అరబీ అక్షర సాంఖ్యము (అబ్జద్)న దీని సంఖ్య పది.

یا యా (అ) సంబోధనార్థకమై హే, ఓ, ఓయి, ఓరి, ఓసి అను అర్థములిచ్చును; వార్థకమై అథవా, కాక, లేక అను అర్థము నిచ్చును. یا اُستاد యా-ఉస్తాద్ (పా) శ్రీగురుభ్యోనమః (గురునమస్కారము) یا قسمت యా-కిస్మత్ (అ) హేదైవమా! హా దైవమా! నా భాగ్యమా! یا الٰہی యా-ఇలాహీ (అ) హే ఈశ్వరా!

یاب యాబ్ (పా) పొందువాడు, చెందువాడు, కొనువాడు, కనువాడు, కనుగొనువాడు (వృత్తియందు).

یابندہ యాబింద (పా) పొందువాడు, చెందువాడు, కొనువాడు, కనువాడు, కనుగొనువాడు, జాడ తెలియువాడు.

یابس యాబిస్ (అ) శుష్కము, ఎండిన, శుష్కించిన, శుష్కింపజేయు.

یابو యాబూ (పా. పు) తట్టువము, చిన్నగుఱ్ఱము.

یاجوج యాజూజ్ (సు. పు) జగడగొండి, జగడాలమారి, రాకాసి, రక్కసి.

یاد యాద్ (పా. స్త్రీ) స్మృతి, జ్ఞాపకము, జ్ఞప్తి, జ్ఞాపకశక్తి, మనసు. یاد الله -అల్లాహ్ (పా) ఈశ్వరధ్యానము (పకీరులు ఒకరికొకరు వందనము జేసికొను పదము) یاد آنا యాద్-ఆనా (ఉ) జ్ఞప్తికి వచ్చుట. یاد آوری యాద్-ఆవరీ (పా) జ్ఞాపకము, జ్ఞప్తికి తెచ్చుట, స్మరణము, జ్ఞప్తి, జ్ఞాపకము జేయుట. یاد بود యాద్-బూద్ (పా) జ్ఞాపకార్థము, స్మారకము, స్మారకచిహ్నము. یاد پڑنا యాద్-పడ్నా (ఉ) జ్ఞప్తికి వచ్చుట. స్మరణకు వచ్చుట. یادداشت యాద్-దాష్త్ (పా) జ్ఞాపకశక్తి, జ్ఞాపకార్థము (వ్రాసికొనినది), స్మారకము (గా వ్రాసికొనిన పుస్తకము, పట్టిక, చీటి మొ॥), దినచర్య. یاد دلانا యాద్-దిలానా (ఉ) జ్ఞప్తికి తెచ్చుట, జ్ఞాపకము జేయుట. یاد دہی యాద్-దెహీ (పా) జ్ఞాపనము, జ్ఞప్తికి తెచ్చుట, తెలియజేయుట. یاد کرنا యాద్-కర్నా (ఉ) జ్ఞాపకము జేయుట, వల్లించుట, నేర్చుకొనుట, జ్ఞప్తికి తెచ్చుకొనుట. یادگار - یادگاری యాద్-గార్-గారీ (పా) జ్ఞాపకార్థము, ఆనవాలు, స్మారకచిహ్నము. یادش بخیر యాదష్‌బఖైర్ (పా) ఆప్తుల ప్రస్తావముజేయ బోవునప్పుడు ఇట్లందురు, స్వస్తిరస్తు, శుభమస్తు (వారికి మేలగుగాక, క్షేమమగుగాక అని భావము) یاد فراموش యాద్-ఫరామోష్ (పా) ఒక పిల్లలయాట, పిల్లలపందెము.

یار యార్ (పా. పు) మిత్రము, స్నేహితుడు ప్రియుడు, వల్లభుడు; విటుడు; చెలికాడు

రత్నము, (నీలము, పుష్యరాగము, కెంపు, పచ్చ మొ॥ వానిలోనొకటి) یاقوت لب - లబ్ (పా) కెమ్మోవిగల, ఎఱ్ఱని పెదవిగల, ప్రియురాలు.

یاقوتی యాకూతీ (అ. స్త్రీ) ఒకపౌష్టిక లేహ్యము; ఒకవిధమైనచోద్యము; రత్న సం॥, మాణిక్ సం॥.

یال యాల్ (తు. స్త్రీ) మెడ, గొంతు; కంఠము; గుఱ్ఱము మెడమీది వెండ్రుకలు, జంతువుల మెడమీది వెండ్రుకలు, జూలు.

یامنی యామినీ (హి. పు) యవనుడు; రాత్రి.

یان యాఁ (హి) ఈడ, ఇక్కడ.

یاور యావర్ (పా. పు) సహకారి, స్నేహితుడు, సహాయకుడు, సహాయుడు, సహాయము, తోడు, అనుకూలము, సహాయభూతము.

یاوری యావరీ (పా. స్త్రీ) సహకారము, సహాయము, తోడ్పాటు, అనుకూల్యము, స్నేహభావము.

یاوه యావ (పా) నిరర్థకము, అసంబద్ధము, అవ్యక్తము, తుచ్ఛము, పనికిమాలిన, అవివేకమైన, పాడు, పాడైన, తెలివిమాలిన, వ్యర్థము. یاوه گو యావ-గో (పా) అవ్యక్తప్రసంగముజేయువాడు, పనికిమాలినమాటలాడువాడు, వదరుబోతు, అవ్యక్తప్రసంగి. یاوه گوئی యావ-గోయీ (పా) అవ్యక్తప్రసంగము, అవ్యక్తాలాపములు, పనికిమాలిన ప్రసంగము, తెలివిమాలిన మాటలు, అసంబద్ధాలాపములు.

یاهو యాహూ (అ. పు) తత్వదార్థము; తత్వదము, ఈశ్వరుడు, పీడ్డోర్కులవచనము, (పా) యాహూ అని అరచు ఒకవిధమైన పావురము లేక దానిధ్వని.

یاے معکوس యాయెమఉకూస్ (అ. స్త్రీ) అడ్డముగా వ్రాసిన ఇకారసంజ్ఞ, (ے) అక్షరము.

یباب యబాబ్ (అ) అధ్వానము, ఎడారి, అరణ్యము. పాడుబయలు, నిర్మానుష్యము.

یبس యుబ్స్ (అ. స్త్రీ) శోషణము, ఎండుట, ఎండుదల.

یبوست యుబూసత్ (అ. స్త్రీ) శుష్కత, శోషణము, ఎండినస్థితి. ఎండుదల, ఎండుట.

یتشخانه యత్ష్‌ఖాన (పా. పు) ఆస్థాన మంటపము, కొలువుకూటము, కచేరిచావడి, ముఖశాల.

یتیم యతీమ్ (అ. పు) తల్లిలేనిపిల్ల, తండ్రిలేనిబిడ్డ, అనాథశిశువు; వెలగలమానికము.

یتیم الطرفین -ఉత్ తరఫైన్ (అ) తలి దండ్రి లిద్దరును లేనివాడు.

یتیمی యతీమీ (అ. స్త్రీ) తలి దండ్రులు లేనిస్థితి. అనాథస్థితి, దిక్కుమాలినస్థితి, అనదతనము.

یخ యఖ్ (పా. స్త్రీ) మంచుగడ్డ, మిక్కిలి చల్లనిది, హిమము.

یخنی యఖ్‌నీ (పా. స్త్రీ) మాంసరసము, మాంసపుచారు.

ید యద్ (అ. పు) చేయి, హస్తము; పిడి,

- లానా (ఉ) నమ్ముట, విశ్వసించుట. **یقین ہونا** - హోనా (ఉ) నమ్మకము గలుగుట, నమ్మకపుట్టుట, నిశ్చయమనితోచుట.

**یقیناً** యకీనన్ (అ) నిశ్చయముగా, నమ్మకముగా, నిస్సందేహముగా, నిస్సంశయముగా, నిశ్చితముగా.

**یقینی** యకీనీ (అ. స్త్రీ) నిశ్చయము, నిశ్చితము; చూడుము **یقیں**.

**یک** యక్ (పా) ఏకము, ఒక, ఒంటరి, ఒంటి (స్త్రీ‌గ్తి యుండదు). **یک اسپہ** - అస్ప (పా) ఒంటి గుఱ్ఱమువాడు, ఒంటరిశాసు, సూర్యుడు. **یک آدھ** - యక్‌-ఆధ్ (ఉ) ఒకటి అర, ఒకడు అర, ఒకరిద్దరు, ఒకటి రెండు, కొందరు, కొన్ని, అల్పసంఖ్యాకము. **یکا یک** యకాయక్ (పా) అకస్మాత్తుగా, అకస్మాత్తుగా. **یکبار** - **یکبارگی** బార్ - బారగీ (పా) అకస్మాత్తుగా, అకస్మాత్తుగా, ఒకేసారిగా, ఒకేసారి, ఒక్కసారిగా. **یک باگ** - బాగ్ (పా) గుఱ్ఱము జూలుక్రింద ఒక వైపునపూర్తియుండు సుడి. (ఇది ఒక అవలక్షణము) **یک بیک** - బయక్ (పా) అకస్మాత్తుగా, అకస్మాత్తుగా, ఒక్కపెట్టున, ఒక్కసారిగా. **یک پشتہ** - పుష్త (పా) ఒక వైపుమాత్రము వ్రాసిన కాగితము, ఏక ముఖము, ఒక తట్టు వ్రాసినది. **یک بگہا** - బఘా (ఉ) ఎల్లప్పుడును ఒకే ప్రక్కను నడచుచుండు గుఱ్ఱము. ప్రక్కకు నడచుచుండు గుఱ్ఱము. ఎల్లప్పుడు ఒక ప్రక్కను పెట్టుచుండు గుఱ్ఱము. **یکتارا** -తారా (ఉ) ఏకతారము, ఒంటితంతి వాద్యము, ఒంటి తీగ తంబుర. **یکجا** -జా (పా) ఒక చోట, కలిసి, కూడి, చేరి, ప్రోగై, మిళితమైన, ఏకమై. **یکجا کرنا** -కర్నా (ఉ) ఒక చోటికి ప్రోగు జేయుట, కలుపుట, ప్రోగు జేయుట, చేర్చుట, కూర్చుట. **یکجان** -జాన్ (పా) ప్రాణమిత్రము, మిక్కిలి కలసి మెలసి యుండెడు, ఎడబాయని, మిక్కిలి అన్యోన్యముగల, ప్రియమిత్రుడు. **یک جدی** -జద్దీ (పా) ఒకే సంతతివారు, ఏకవంశీయులు, రక్తసంబంధులు. జ్ఞాతులు. **یک جہت** -జిహత్ (పా) ఏకాభిప్రాయముగల, ఐకమత్యముగల, అనుకూల్యముగల, మైత్రిగల. **یک جہتی** -జహతీ (పా) ఐకమత్యము, అభిప్రాయైక్యము, అనుకూల్యము. మైత్రి. **یک چند** -చంద్ (పా) కొలది, ఏవో కొంచము, ఏవిగూ కొన్ని, ఎవరో కొందరు, కొన్ని, స్వల్పము, కొందరు, అల్పసంఖ్యాకము **یک چوبہ** -చోబ (పా) ఒంటి కంబపు(గుడారము), ఒక గుంజపై నిలిచియున్న(గుడారము). **یک دست** -దస్త్ (పా) సమానముగానున్న, సరిగానున్న, ఒకే రీతిగానున్న; సంపూర్ణము, సర్వము, సాంతము, అంతయు, ఆసాంతము. మొత్తము, బొత్తుగా, మట్టముగా. చదరముగా, ఒకపెట్టున, ఏకవిధమైన, ఒకే విధముగానున్న. **یک دگر - دیگر** -దిగర్ -దీగర్ (పా) ఒకరికొకరు, కలసిచేరి. అన్యోన్యము. **یک دل** -దిల్ (ఫా), ఐకమత్యముగల, ఏకాభిప్రాయముగల, మనసు కలసిన. **یک دلی** (పా) ఐకమత్యము, అభిప్రాయైక్యము. **یک رخی**

**یکائی** యకాయీ (పా. స్త్రీ) చూడు اکائی

**یکت** యుకత్ (హి) యుక్తము, తగినది; యుక్తి, ఉపాయము.

**یکتا** యక్తా (పా) ఒంటి, ఒంటరి, ఒకటి, సాటిలేని, అసాధారణము, అపూర్వము, అద్వితీయము, ఏకము,

**یکتالیس** యక్తాలీస్ (హి) నలుబదియొకటి.

**یکتائی** యక్తాయీ (పా. స్త్రీ) ఏకత్వము, అపూర్వత, అద్వితీయత, అద్వితీయత్వము.

**یکتیس** యక్తీస్ (హి) ముప్పదియొకటి.

**یکسٹھ** యక్సఠ్ (హి) అరువదియొకటి.

**یکلائی** యక్లాయీ (పా. స్త్రీ) కుట్టు లేని దుప్పటి, అఖండము; ఒంటిరెక్క దుప్పటి, ఒంటిరేకు దుప్పటి,

**یکلو** యక్లూ (పా పు) ఒంటిచుక్కలఆటచీటి.

**یکنگ** యకంగ్ (ఉ) ఏకాంగిగా నుండు వాడు, ఏకాంతప్రియుడు, ఏకాంగి, ఒంటరి గాడు.

**یکہ** యక్కా (పా) ఒంటి, ఒంటరి, సాటి లేని, అద్వితీయము, ఒంటిగుఱ్ఱపుబండి.

**یکہتر** యక్హత్తర్ (హి) డెబ్బదియొకటి.

**یکیاسی** యక్యాసీ (హి) ఎనుబదియొకటి.

**یکیس** యక్కీస్ (హి) ఇరువదియొకటి.

**یگانگت - یگانگی** యగానగీ-నగత్ (పా. ఉ. స్త్రీ) ఏకత్వము, బంధుత్వము, బాంధవ్యము, చుట్టరికము, సంబంధము; అపూర్వత, సాటిలేమి, అద్వితీయత, ఏకత, ఏకత్వము, ఐకమత్యము. మైత్రి.

**یگانہ** యగానా (పా.పు) బంధువు, చుట్టము, కావలసినవాడు, జ్ఞాతి; ఒంటరి, సాటిలేని, అపూర్వము, అద్వితీయము; అనుకూలము, మైత్రి, ఐకమత్యము.

**یل** యల్ (పా.పు) శూరుడు, వీరుడు, జెట్టి, గొప్పవాడు, బలిసిన, పుష్టిగల, మహాకాయుడు.

**یلدا** యల్దా (పా.పు) దీర్ఘ రాత్రము, ఎక్కువకాలముగల రాత్రి.

**یلغار** యల్గార్ (తు. స్త్రీ) దాడి, పైబాటు, కవియుట, అకాత్తుగ పైబడుట, శత్రుసేన పైబడుట; సేనల శీఘ్రగమనము, ఆకస్మికమైన దాడి.

**یم** యమ్ (హి.పు) యముడు, జముడు.

**یم** యమ్ (పా.పు) నది, సముద్రము.

**یمان** యమాన్ (పా) కాంతి, ప్రభ, ప్రకాశము.

**یمن** యమన్ (అ.పు) తూర్పుదేశము, అరేబియాదేశమున కాబాపట్టణమునకు తూరుపుననున్న ఒకప్రాంతముపేరు.

**یمن** యమన్ (హి.పు) రాగవిశేషము.

**یمن** యమన్ (హి.పు) యవనుడు, మ్లేచ్ఛుడు.

**یمنی - یمانی** యమనీ - యమానీ (అ) యమనుదేశస్థుడు, యమనుదేశ సం॥.

**یمین** యమీన్ (అ) కుడి చేయి, దక్షిణహస్తము; కుడిప్రక్క, ఒట్టు, బలము.

**یمین و یسار** -వ యసార్ (అ) కుడి ఎడమలు, పార్శ్వ వర్తులగు సైన్యము, వామదక్షిణభాగ సేనలు.

**یورش** యూరిష్ (పా. స్త్రీ) దాడి, పైబడుట, పైబాటు, దొమ్మి, అకాత్తుగా సైన్యముపైబడుట, దండయాత్ర.

**یوراج** యువరాజ్ (హి.పు) యువరాజు, రాజ్యమునకు ఉత్తరాధికారి.